# విషయానుక్రమణిక







## చిత్రములు.

# సుజాత

హైదరాబాదు జనవరి ౧౯౨౭

సంపుటము ౧. అక్షయ సంవత్సర మార్గశీర్షము సంఖ్య ౧.

## స్వ వి ష య ము

చెప్పినంతచేయుట కష్టమని లోకోక్తి. ఐన చేయఁదలచినదంత చెప్పుటకూడ కష్టమే. ఆంధ్రభాషలో అనేకపత్రికలున్నవి. ప్రతిపత్రికయు నేదో విలక్షణమైన యొకయుద్దేశములోనే అవతరించెను. మార్గమధ్యమందు సాధనలో పరస్పరసంకలనము లేక పృథగ్వైలక్షణ్యములతో నడచుచున్నవనుట సామంజస్యమునకు దూరము. కాని అన్నిటికిని మాతృభాషాసేవయే పరమ లక్ష్యమనుట మఱువరాదు. రామాయణమును పలువురు గానము చేసిరి. భారతవీరులను మహా కవు లనేకులు చిత్రించిరి. ఇట్లేనన్నియు. ప్రతి బింబమునందును ఏదోయొక రేఖ స్థూలమో సూక్ష్మమో స్ఫుటమై వన్నెకెక్కినది.

ఈ 'సుజాత'యు ఆంధ్రుల యాఁడుబిడ్డగా 'తెలంగాణ' మందు పుట్టినది. 'సుజాత' అన్వర్థమై సోదరాంధ్రుల కీర్తిభాగ్యములకు పెంపు దెచ్చునని విశ్వసించుచున్నాము. 'తెలంగాణము' ఆంధ్రుల ప్రాచీనవైభవములకు పంటపొలమని మే మిపుడు మరలచెప్పనక్కరలేదు. మనమాయాంధ్రుల వారసులమని వాఙ్మయరూపమున నున్నవారికీర్తివైభవములఁ బంచుకొనుచున్నాము.

ఇదిఋణముకాదా? పూజ్యులైన ఆచార్యులు దేవఋణము, ఋషిఋణము, పితౄణము అవశ్యముతీర్పవలెనని విధించిరి. ఈజాతీయపితౄణ మీగుటెట్లు?

నేడు ‘తెలంగాణము’ నందున్న ఆంధ్రులు నిజముగా త్రైలింగులని చెప్పవచ్చును. ఏలయనవారికి ఆంగ్ల, మహారాష్ట్ర, హిందూస్థానీ భాషాత్రయలింగానుశాసనము కలదు. ఐననీయవస్థ కేవలము దురదృష్టమని భావించువారిలో మేము చేరము. భిన్నజాతీయ సంపర్కమువలెనే భిన్న భాషాసంపర్కముకూడ మానవజీవితముయొక్క దృష్టివైశాల్యములకును, భావసామరస్యమునకును సాయపడునని మా నమ్మకము. యుగాంతరములనుండి ప్రవహించుచున్న ఆంధ్రసభ్యత భిన్నభిన్న నాగరకతల తోడునీడలలో మెలగి నేటికందిన విలక్షణ జీవితము ప్రదర్శించుటయే “సుజాత” యొక్క ప్రధాన సుభాషితము.

అజంటా తేజోవాటికలయందు ఆంధ్రుల కళోపాసనాసిద్ధి యున్నది. నన్నయ శబ్దానుశాసనములో ఆంధ్రుల మాతృభాషారాధనకు నిదర్శనము కలదు. పండితరాయల రసగంగాధరమందు ఆంధ్రుల సాహిత్యరుచులు ప్రతిఫలించుచున్నవి. సూరనార్యుని కళాపూర్ణోదయము ఆంధ్రుల రసికజీవనమునకు శృంగారతరంగిణి నంటిది. త్యాగరాజుల ప్రసన్నకీర్తనలు ఆంధ్రుల భక్తిమార్గము నందలి అమృతపు చలివేంద్రలు. పోతన్న శ్రీమద్భాగవతపద్యములు ఆంధ్రుల ఆవేశధారాభారతికిఁ గంఠమాలలు. చళుక్య శౌర్యము చల్లారినది; కాని గోదావరి యెండిపోలేదు. విజయనగరగోపురము విఱిగినది; కాని తుంగభద్రాతీరమున స్వప్నమంటపముపైనది ప్రకాశించుచున్నది. ఓరుగల్లు పౌరుషప్రాభవములు పాషండపర్యంకములం దొరగినవి; కాని ప్రతాపరుద్రీయ పుటలపై ప్రతిబింబములు పుంజీభవించుచునే యున్నవి. తంజావూరు నాయకుల విద్యావినోదభవనము నిర్జననిబిడమై చెడినది; కాని కావ్యవిపంచికమాత్రము మేళవించు మంగళ హస్తము మఱుగైపోయినను పాడుచునేయున్నది ఇఁక మాకు స్మృతిలభింపదా? మా “సుజాత” కు ఆలేఖ్యములు దొరుకవా? ఆర్యుల ఆశీస్సులె మాకుఁగావలసినవి.



# ప్రేమార్చన

ప్రొఫెసరు రాయప్రోలు సుబ్బారావుగారు.

(మహాకవి ఎక్బాల్ గీతముల కనువాదము.)

అలుగకవిందువేని నిజమాడెద బ్రాహ్మణవర్య ! నీమదే
వళమున నున్న మూర్తులప్రభావమభావమునందె చాఁ బ్రా
వడినకతాన ద్వేషగుణపాఠము లబ్బెను నీకుగూడ నా
శిలలసమీప మందె, మొలిచెన్ గురుపీఠముమీదనే మత
ప్రళయవివాద వైరము, భరంపడి వేసటజెంది, నీమదే
వళమును నామసీమ ననివార్యము గాఁ ద్యజియించితిన్ నమా
జులపిలుపుల్ పురాణములచూపును గూడ బహిష్కరించితిన్

వలసినతోటమాలివి! ప్రభాతరుచుల్ గని క్రొత్తక్రొత్త మొ
క్కల ననుపారనాటుము వికారమయం బయినట్టి యీ విషా
నిలములు వచ్చి పాదులఁ దినెన్ తలపోయుము దైవబుద్ధితో
శిలలను నీవు, నేను దరిశింతును మీ భగవద్విలాస మీ
విలసగనంతమాతృపృథివిన్ బ్రతిరేణువునందు మిత్రమా.

రమ్మిటు రమ్ము బ్రాహ్మణ! పరస్పరమున్ గననీని యీ తెరల్
జిమ్ముము దూరదూరముగ, చీల్చిన సూత్రము ద్రెంచి వీరలన్
గ్రమ్మరగల్పివేయుదము రమ్ము, ప్రజాళిఁ గలంచు ద్వైతభా
వమ్మును పాఱద్రోలుద ముపాయముగా నిటు రమ్ము వేగమే.

హృదయపురంబు పాడుబడి యున్ బహుకాలమునుండి, రమ్ము శో
ధ్యుడ మొక నూత్న మందిరమిటుల్ జగతిం గల తీర్థయాత్రలం
దదిమహోన్నతంబయి సమస్తసుహృజ్జనపూజ కొక్కటే
పదముచెల్లు నుంచుము నభంబున తత్కలశాలి ప్రేమయన్.

అపల నన్మన్మనో హారిద్వారమందు అతిమనోజ్ఞ మాకరకమయినయొక్క దివ్యమూర్తిఁ బ్రతిష్టింత మవ్యయాప్తి నాజగన్మాతవరముల. నడుగవచ్చు.

హస్తమునందు మాలయు, నిజాంసమునందున జన్నిదంబు వి
న్యస్తమొనర్చి యింపుగ శివాలయమందు మసీదులోని ధ్యా
నస్తిమితప్రభావము గనంబడఁజేయుద మాత్మదర్శనో
పాస్తికి వచ్చువారికిఁ గవాటములన్ బెకలించి తీయుమీ.

అలవోకన్ బ్రతియాత్మయందును బ్రచండాగ్నిన్ వెలింగింత మ
త్తులఁ బోటెత్తుకవోష్ణగాంగజలరాసుల్ బట్టి యామూర్తిమం
గళపాదంబులఁ బాగ్యమిత్తుము జగత్కల్యాణబీజాతురం
బులతో భారతమాతయంచు వదనాంభోజంబునన్ వ్రాయుమీ.

మరచిన ప్రేమసూక్తమహిమంబును చీలిన యీ జగాన గ్ర
మ్మర వినిపింత మర్థిమెయి, మస్తకమెత్తి తదీయమంత్ర సు
స్వరముల వల్లెవేయుద మనస్సులలో, నమృతప్రసాదమున్
కొలవడకుండ నర్చకులకుం దినిపింతము, రమ్ము బ్రాహ్మణా.

అర్చకులెల్ల మందిరమునందు సమాహితమైన వేళ ప్రే
మార్చి రవిల్చి యీ మతమతాంతర వైరమునందుఁ గాల్చిచ
ల్లార్చితిమేని శంఖరవమందెయజాఁ "బిలుపున్ సమేళమై
పేర్చి వినంబడున్ పిపఁ బ్రేమనె నిర్గుణమందు అందఱున్.

దర్పణమంచు నెంచు మెడఁదన్ జగమంతయు నెట్లువృత్తముల్
నేర్పెదు యట్టులే ప్రతిఫలించును దాననిజంబుగాన స
ర్వార్పణవీరబుద్ధియు బ్రియవ్యసనాతురచిత్తమున్ దయా
తర్పణవృత్తియున్ తనువుదాల్చినలీల ధరింపుఁ బ్రేమకై.

# "ఫిర్దౌసీ" మహాకవి

శ్రీయుత మాడపాటి హనుమంతరావు గారు.

౧

అఖండ పాండితీగరిమ చేతను, నిరుపమానకవితా ప్రాగల్భ్యము చేతను ఫారసీ వాఙ్మయము యొక్క కీర్తిని, గజనీ మహమూదు యొక్క దుష్కీర్తిని అజరామరముగ నొనర్చిన "ఫిర్దౌసీ" క్రైస్తవశకము యొక్క పదవశతాబ్దాంతమునను, పదునొకండవ శతాబ్దాదియందును, జీవించియుండిన యొక ఫారసీమహాకవి.

ఈతని నివాసస్థలము 'తూస్' నగరము. ఇది ఆకాలపు పారసీక రాజ్యములోని యొక ప్రాంతమునకు రాజధాని. ఈపురరాజము పలువురు ఫారసీ కవులకు జన్మభూమియై ఖ్యాతిగాంచినది.

'ఫిర్దౌసీ' శబ్దము మన మహాకవి నామమని చదువరులు భ్రమింపవలదు. ఆతని పేరు "హసన్" అనునది. ఇక 'ఫిర్దౌసీ' యనునది కవియొక్క అంకితము. ఫారసీ కవులు తమ కావ్యములందు వాడుటకై తమకొక సంకేత నామమును నిర్ణయించుకొనెదరు. సాధారణముగా నీసంకేత నామము ఏకశబ్దముగానే యుండును. మనదేశపుఁ గవులును దమ పేళ్లను, ముఖ్యముగా పాటలందును, యక్షగానములలోని కీర్తనలయందును చివరనఁ జేర్చుకొనునట్లే, ఫారసీ కవులును దమ గీతములయంతమునఁదమ అంకితమును జేర్చుకొనుట సంప్రదాయ సిద్ధము. భేదమేమనఁగా, మనకవులు తమ సాధారణ నామమును ఉన్నదున్నట్టుగా గాని 'దాసు' శబ్దముతోఁ గూర్చికొని గాని వ్రాసికొందురు: ఫారసీ కవులు ప్రత్యేకముగా నొక శబ్దము నీకార్యమునకై నిర్ణయించుకొని దానిని వాడుకొనుచుందురు. ఇట్టిసంకేతపదమునకు ఫారసీ పరిభాషయందు 'తఖల్లుస్' అనిపేరు. మన కవులలో అంకితమును వాడు కొనుట చాల తక్కువ; కాని ఫారసీ కవులందు దీనికి వాడుక విస్తారము. ఫారసీ కవిత్వము యొక్క ఈ యాచారమే ఉర్దూకవులుగూడ అవలంబించినారు. ఈ భాషలలోఁ గవిత్వము చెప్ప నుత్సుకులగు వారు మొదటనే 'తఖల్లుస్' శబ్దమును నిర్ణయించుకొని తరువాత తక్కిన పనుల నారంభింతురు. మనము తరచు వినుచున్న "సాదీ" "జామీ" "నిజామీ" మున్నగు పేళ్లు కవులవిగావు; ఇవివారి సంకేత నామములు మాత్రమే.

గజనీ మహమూదు హిందువులకుఁ జిరపరిచితుఁడు, ఈతని పాలనము క్రీ. శ. ౧౦౩౦లో సమాప్తమైనది. మహమూదు యొక్క తుదికాలమున, మన "ఫిర్దౌసీ" కీర్తికాయుఁడయ్యెను. కనుక 'ఫిర్దౌసీ' జననము క్రీ. శ. ౯౩౦ ప్రాంతమునన యుండవచ్చును. ఈ తఁడు జన్మింపఁగనే తండ్రికిఁగల వచ్చెనఁట. స్వప్నశాస్త్రజ్ఞులు మన దేశములో వలెనే ఆ దేశమునందును ఉండిరి. వారు "నీ కొడుకు రాజపూజితుఁ" డగునని 'ఫిర్దౌసీ' తండ్రితో స్వప్నఫలము చెప్పిరట.

౨

సాధారణసుఖస్థితిగల కుటుంబమున జన్మించినవాఁడగుటచే, 'ఫిర్దౌసీ' కివిద్యార్జనావకాశము బాగుగ నేలంభించెను. ఎక్కువ కష్టపడవలసిన పని లేకయే దొరకిన సమయము నంతయు నీతఁడు గ్రంథావలోకనమునఁ గడపి, ఫారసీ భాషయందు గొప్ప పాండిత్యము సంపా

దించెను. కవితాకాంతయొక్క క్రీగంటిచూపులు మన 'ఫిర్దౌసీ' పైన క్రమక్రమముగాఁ బ్రసరింప సాఁగెను. కొన్ని వత్సరములలో నాతఁడు కవిశేఖరుడని ప్రఖ్యాతి గాంచి, ఆకాలపు విఖ్యాత కవిపుంగవులు ఏమహాకావ్య రచనాగౌరవమును గాంచ నువ్విళులూరు చుండిరో, అట్టి ,,షాహనామా'' ను (రాజచరితావళిని) తమప్రాంతాధీశుఁడగు నొక విద్యాప్రియుని యాశ్రయమున నారంభించి, కొంత భాగము పూర్తి చేసెను.

ఆకాలమున గజినీ నగరమును, హిందూదేశ చరిత్రమున ,,ప్రసిద్ధపురుషుఁడగు'' మహమూదు పాలించుచుండెను. అతని రాజ్యముకవిస్తారము, ఐశ్వర్య మద్భుతజనకము. సామాన్యముగా మనకు గజినీమహమూదు క్రూరుఁడుగను, దోపిడికాఁడుగను, విగ్రహ విచ్ఛేదకుఁడుగను, మాత్రమే పరిచితుఁడు. అయినను, ఫారసీ వాఙ్మయము నెరిగిన వారికతఁడు విద్యాప్రియుఁడుగను, కవిజనాశ్రయదాతగను కూడ కానవచ్చుచున్నాడు. ఎట్లైననేమి, ,,ఫిర్దౌసీ'' కవి వైభవమును మహమూదు విని, తానంతకు ముందు రచియింపింపఁదలఁచి యుండిన ,,షాహనామా'' కృతికి యోగ్యుఁడగు కర్త అతఁడేయని భావించి, అతని నీఁదన దర్బారుకంపుటకు, 'తూస్' ప్రాంతాధీశు నాజ్ఞాపించెను.

మహమూదు నాస్థానకవులగు 'అన్సరీ' మున్నగు కొందఱ కీవార్త అసూయాజనక మయ్యెను. ప్రాచ్యదేశములందిది సామాన్యమగు నలవాటేకదా. కాళిదాసుని భోజాస్థానమును ప్రవేశింపకుండఁజేయ యత్నించినట్టియు, అథర్వణాచార్యుల భారతమును అగ్నిహోత్రమున కర్పించినట్టియు కథలుగల మనదేశమునకు నిది క్రొత్త యంశముకాదు. ఎవరెన్ని ప్రయత్నములు చేసినను, తుదకు 'ఫిర్దౌసీ' మహమూదు హృదయమున ముఖ్యస్థానము నాక్రమింపక మానలేదు. మహమూదు అంతకుముందే ,,షాహనామా'' ను రచించుటకై ఏడ్గురు కవుల నేర్పరచియుంచెను. అందులో 'అన్సరీ' యనునతఁడు సొహరాబు రుస్తుముల కథాభాగమును వ్రాసియుండెను. ఆభాగమునే 'ఫిర్దౌసీ' కూడ రచించియుండెను. ఈ రెంటిలో మహమూదునకు 'ఫిర్దౌసీ' రచనయే శ్రేష్ఠతరముగా గానవచ్చెను. అందుపైన మహమూదు మహానందభరితుఁడై మన కవిని గౌరవించి, అమూల్య వస్త్రాదులచే నాతని సత్కరించి, తనకత్యంత ప్రియుఁడగు ,,అయాజు''* అను వాని సౌందర్యమును రెండుపద్యములలో వర్ణింప ఫిర్దౌసీనిఁ గోరెనఁట! మన మహాకవియు ఆశువుగా రసపరిప్లుతములగు పద్యముల నల్లివినుపించెనట!

తరువాత, మహమూదు సంతోషించి ,,షాహనామా''ను పూర్తిగా రచింప నాజ్ఞ యొసఁగెను. రాజనగరునకుఁ బ్రక్కన దివ్యముగా నొక భవనమును, వివిధాలంకారములతోను, పారసీక వీరుల ఆయుధములతోడను, యోధాగ్రేసరుల పటములతోను సుశోభితముగఁ జేయించి కవి నివాసమునకై యప్పగించెను. ఈ భవనమునుగూర్చిన వివరములు ఫారసీక గ్రంథములలో జదువునపుడు మన పెద్దనార్యుని ,,నిరుపహతి స్థలము...''యొక్క వర్ణనము జ్ఞప్తికి వచ్చుచుండును. రెండు చరణములు గల యొక పద్యమునకు (మన ద్విపద యంత పొడుగు దనుకొనుఁడు) ఒక బంగారపు 'అష్రఫీ' చొప్పున,§ వేయి పద్యముల రచనకాఁగానే వేయి 'అష్రఫీ'లు కవిశేఖరునకుఁ బారితోషకముగ నిర్ణయింపఁబడెను. కాని 'ఫిర్దౌసీ' చిల్లరగా

---

* ఇతఁడు తుర్కీ దేశస్థుఁడగు నొక సుందర పురుషుఁడు. ఇతఁడు మహమూదునకు మహాప్రియుఁడు. పురుషులను రాజులగువారు ముఖ్యప్రియులుగా నుంచుకొనుట ఆకాలమున ఆదేశపు రసికతగా నుండెను. ఇట్టి సుందర పురుషుల తుర్కీదేశముతోడి యుద్ధములలో బానిసలగా గొనివచ్చుటయు, వానిలో నుత్తములగు వారిని రసికులగువారు తమ భోగపరాయణత్వమునఁ దృప్తిపరచుకొనుటకై యుపయోగించుచుండుటయు ఆకాలపు విపరీతప్రకృతివిరుద్ధాచారమనియు, నీచమగు నీపద్ధతి ఫారసీ వాఙ్మయమున పురుషులను స్త్రీలనువలె వర్ణించు నూతన ఫక్కిని కొల్పెననియు, ఇదెంతయు దుఃఖకరమగు నంశమనియు 'మౌలానా షిబ్లీ'అను విఖ్యాతచరిత్రపరిశోధకుఁడు వ్రాసియున్నాఁడు.

(చూ—షిబ్లీకృతమగు ,,షఅరుల్ ఆజమ్'' సం॥ ౧.

§ 'అష్రఫీ' అనునది యొక బంగారు నాణెము. ఇట్టి నాణెము నిజాంరాష్ట్రములో వాడుకయందున్నది. దీని వెల ఇంచుమించుగా హాలీ ముప్పది రూపాయ లుండును.

బహూకరింపఁబడుట కొప్పుకొనక అంతయు నొక్క మారే తీసికొన నిశ్చయించి తన యుద్దేశమును అశ్రయ దాతకుఁ దెల్పెను. ఆ కోరిక నిరభ్యంతరముగ నంగీకరింపఁబడెను.

గజనీనగరమం దీవిధముగ నాల్గు వత్సరములు షాహనామా రచనయందు గడపి, యటు తరువాత 'ఫిర్దౌసీ' స్వగ్రామమునకుఁ బోయెను. అచ్చట ననేక వత్సరములీ కార్యముననే పుచ్చెను. గ్రంథ రచన మారంభించిన ౨౦ వత్సరములకు, సుమారు ౬౫ సంవత్సరముల యీడున మన కవి శిరోమణికిఁ బుత్రదుఃఖము సంభవించి అతని మనస్సు నెంతో కలచివైచెను. అయినను ధైర్యమువహించి మొత్తము మీఁద ౩౫ వత్సరములలో ౬౦ వేల పద్యములతో గ్రంథమును బూర్తిచేసి రాజు కడకుఁ గొనిపోయి చదివి వినిపించెను. రాజు కవిత్వ ప్రభావమున కచ్చెరువందెను. ఆనందవార్ధి నోలలాడెను. కాని ఈ కవివిషయమున మాత్రము హ్రస్వ దృష్టినే ప్రకటించెను. ఎన్ని బంగారు అష్రఫీలు కవికి వాగ్దానము ప్రకారము ఇయ్యవలసియుండెనో, అన్ని రూప్యములు కవి కడకు పంపెను! ఎనుబది సంవత్సరముల వయస్సునఁ గొండంత యాసతో ముప్పదియైదు సంవత్సరముల శ్రమకు ఫలితము నెదురు చూచుచుండిన 'ఫిర్దౌసీ' హృదయమును మహమూదు యొక్క కృపణత్వము బ్రద్దలుగఁ బగిల్చెను!!

3

"ఫిర్దౌసీ"విషయమున మహమూదు చూపిన ఈ వర్తనమునకుఁ జరిత్రకారులు పలు కారణములఁ జూపెదరు. కొందఱు, కవి రాఫ్జీ*శాఖకుఁ జెందిన వాఁడైనందున కొద్దిచూపుచూచె నందురు. కొందఱు ఆస్థానకవుల నూయాపరులు రాజుతోఁ గొండెములు చెప్పియట్లు చేయించి రందురు. కొందఱు "ఫిర్దౌసీ" తన మహాకావ్యమునందుఁ బలుతావుల, గొప్పపుట్టువునకుఁ బ్రాముఖ్యమిచ్చు చువచ్చి నందున, బానిసకు కొడుకై రాజ్యపదవికి వచ్చిన వాఁడగు మహమూదు అభిజాత్యమును గూర్చిన యుల్లేఖనములు తననునిందించుటకై వ్రాయఁబడినవిగా భావించి, ఈ విషయమున 'ఫిర్దౌసీ' నవమానించె నందరు. ఈ కారణములలో ప్రతిదానికిని అనుకూలముగను ప్రతికూలముగను వాదముచేయుట శక్యకాక మూకయేనికలదు. నిజమేదో దేవునకెరుక.

ఒకసంగతి మాత్రము నిశ్చయము. 'ఫిర్దౌసీ' యెడ మహమూదు చేసిన యీయకార్యము ఫారసీ వాఙ్మయచరిత్రముననేకాక ప్రపంచ వాఙ్మయచరిత్రమున దుఃఖకరముగునపరాధముగా జ్ఞప్తియందుండఁగలదు.

పైనచెప్పఁబడిన పారితోషిక ధనమును 'అయాజ్' వెంటగొని ఫిర్దౌసీ కడకుఁదెచ్చెను "ఈ తెల్లరూకలకొరకా నేనిన్ని సంవత్సరములు శ్రమపడినది?" అని 'ఫిర్దౌసీ' కోపముతో మందలించి, ధనమును తీసికొన నిరాకరించెను.

ఈ వార్తవిని మహమూదు చింతిల్లెను. ప్రధాన మంత్రిని బిలిపించి మంచి యాలోచ చెప్పవైతివని కోపపడెను. 'దేవర వారంపిన దొక మంటిపెడ్డయే యగుగాక, మహాప్రసాదమని యంగీకరించి, కన్నుల కద్దుకొనవలసి యుండెను' అని మంత్రిసత్తముఁడు పాదుషా కోపాగ్నిని బ్రజ్వరిల్లఁజేసెను. ఈ క్రొత్త యాగ్రహమును దప్పించుకొని క్షమింపఁబడుటకై మహాకవి యెంతో దైన్యమునకు లోబడవలసిన వాఁడయ్యెను.

గజనీ నగరమును వదలి పోవునపుడు "ఫిర్దౌసీ" రాజునుద్దేశించి, కవితారూపమగు నొక లేఖను రచించి, దానిని లకోటాచేసి 'అయాజ్' చేతి కప్పగించి, ౨౦ దినములు గడచిన పిదప రాజునకు అర్పింప నాతని వేడికొనెను. ఈ లేఖలోని పద్యములు కడు రసవంతముగ రచింపబడినవని విద్వాంసులు మెచ్చుకొని యున్నారు. ఈలేఖకుని వలన ఆంధ్ర భాషయం దనువదింపఁబడిన ఈ క్రింది పద్యములలో మూలములోని రసము నష్టమై యుండువనుట నిశ్చయము, చదువరులు మన్నింతురుగాక!

*ఇది మహమ్మదీయ మతములోని యొక సంప్రదాయము. 'సున్నీ' తెగకును ఈ తెగవారికిని వైరము చిరకాలాగతము.

దించెను. కవితాకాంతయొక్క శ్రీగంటిచూపులు మన 'ఫిర్దౌసీ' పైన క్రమక్రమముగాఁ బ్రసరింప సాఁగెను. కొన్ని వత్సరములలో నాతఁడు కవిశేఖరుఁడని ప్రఖ్యాతి గాంచి, ఆకాలపు విఖ్యాత కవిపుంగవులు ఏమహాకావ్య రచనాగౌరవమును గాంచ నువ్విళులూరు చుండిరో, అట్టి "షాహనామా" ను (రాజచరితావళిని) తమప్రాంతాధీశుఁడగు నొక విద్యాప్రియుని యాశ్రయమున నారంభించి, కొంత భాగము పూర్తి చేసెను.

ఆకాలమున గజినీ నగరమును, హిందూదేశ చరిత్రమున "ప్రసిద్ధపురుషుఁడగు" మహమూదు పాలించుచుండెను. అతని రాజ్యవిస్తారము, ఐశ్వర్య మద్భుతజనకము. సామాన్యముగా మనకు గజినీమహమూదు క్రూరుఁడుగను, దోపిడికాఁడుగను, విగ్రహ విచ్ఛేదకుఁడుగను, మాత్రమే పరిచితుఁడు. అయినను, ఫారసీ వాఙ్మయము నెరిగిన వారికతఁడు విద్యాప్రియుఁడుగను, కవిజనాశ్రయదాతగను కూడ కానవచ్చుచున్నాడు. ఎట్లైన నేమి, "ఫిర్దౌసీ" కవి వైభవమును మహమూదు విని, తానంతకు ముందు రచియింపింపఁదలఁచి యుండిన "షాహనామా" కృతికి యోగ్యుఁడగు కర్త అతఁడేయని భావించి, అతని నిఁదన దర్బారుకంపుటకు, 'తూస్' ప్రాంతాధీశు నాజ్ఞాపించెను.

మహమూదు నాస్థానకవులగు 'అన్సరీ' మున్నగు కొందఱ కీవార్త అసూయాజనక మయ్యెను. ప్రాచ్యదేశములందిది సామాన్యమగు నలవాటేకదా. కాళిదాసుని భోజునాస్థానమును ప్రవేశింపకుండఁజేయ యత్నించినట్టియు, అథర్వణాచార్యుల భారతమును అగ్నిహోత్రున కర్పించినట్టియు కథలుగల మనదేశమునకు నిది క్రొత్త యంశముకాదు. ఎవరెన్ని ప్రయత్నములు చేసినను, తుదకు 'ఫిర్దౌసీ' మహమూదు హృదయమున ముఖ్యస్థానము నాక్రమింపక మానలేదు. మహమూదు అంతకుముందే "షాహనామా" ను రచించుటకై ఏడ్గురు కవుల నేర్పరచి యుంచెను. అందులో 'అన్సరీ' యనునతఁడు సాహరాబు రుస్తుముల కథాభాగమును వ్రాసియుండెను. ఆభాగమునే 'ఫిర్దౌసీ' కూడ రచించియుండెను. ఈ రెంటిలో మహమూదునకు 'ఫిర్దౌసీ' రచనయే శ్రేష్ఠతరముగా గానవచ్చెను. అంతుపైన మహమూదు మహానందభరితుఁడై మన కవిని గౌరవించి, అమూల్య వస్త్రాదులచే నాతని సత్కరించి, తనకత్యంత ప్రియుఁడగు "అయాజు"* అను వాని సౌందర్యమును రెండుపద్యములలో వర్ణింప ఫిర్దౌసీనిఁ గోరెనఁట! మన మహాకవియు ఆశువుగా రసపరిప్లుతములగు పద్యముల నల్లివినుపించెనట!

తరువాత, మహమూదు సంతోషించి "షాహనామా"ను పూర్తిగా రచింప నాజ్ఞ యొసఁగెను. రాజనగరునకుఁ బ్రక్కన దివ్యముగా నొక భవనమును, వివిధాలంకారములతోను, పారసీక వీరుల ఆయుధములతోడను, యోధాగ్రేసరుల పటములతోను సుశోభితముగఁ జేయించి కవి నివాసమునకై యప్పగించెను. ఈ భవనమునుగూర్చిన వివరములు ఫారసీక గ్రంథములలో జదువునపుడు మన పెద్దనార్యుని "నిరుపహతి స్థలము..."యొక్క వర్ణనము జ్ఞప్తికి వచ్చుచుండును. రెండు చరణములు గల యొక పద్యమునకు (మన ద్విపద యంత పొడుగు దనుకొనుఁడు) ఒక బంగారపు 'అష్రఫీ' § చొప్పున, వేయి పద్యముల రచనకాఁగానే వేయి 'అష్రఫీ'లు కవిశేఖరునకుఁ బారితోషకముగ నిర్ణయింపఁబడెను. కాని 'ఫిర్దౌసీ' చిల్లరగా

---

* ఇతఁడు తుర్కీ దేశస్థుఁడగు నొక సుందర పురుషుఁడు. ఇతఁడు మహమూదునకు మహాప్రియుఁడు. పురుషులను రాజులగువారు ముఖ్యప్రియులుగా నుంచుకొనుట ఆ కాలమున ఆదేశపు రసికతగా నుండెను. ఇట్టి సుందర పురుషుల తుర్కీ దేశములోని యుద్ధములలో బానిసలగా గొనివచ్చుటయు, వారిలో నుత్తములగు వారిని రసికులగువారు తమ భోగపరాయణత్వమునుఁ దృప్తిపరచుకొనుటకై యుపయోగించుచుండుటయు ఆకాలపు విపరీతప్రకృతివిరుద్ధాచారమనియు, నీచమగు నీపద్ధతి ఫారసీ వాఙ్మయమున పురుషులను స్త్రీలనువలె వర్ణించు నూతన ఫక్కి నిగొల్పెననియు, ఇదెంతయు దుఃఖకరమగు నంశమనియు 'మౌలానా షిబ్లీ'అను విఖ్యాత చరిత్రపరిశోధకుఁడు వ్రాసియున్నాఁడు.

(చూ. —షిబ్లీకృతమగు "షఅరుల్ అజమ్" సం॥ ౫.

§ 'అష్రఫీ' అనునది యొక బంగారు నాణెము. ఇట్టి నాణెము నిజాంరాష్ట్రములో వాడుకయందున్నది. దీని వెల ఇంచుమించుగా షాలీ ముప్పది రూపాయ లుండును.

బహూకరింపఁబడుట కొప్పుకొనక అంతయు నొక్క మారే తీసికొన నిశ్చయించి తన యుద్దేశమును ఆశ్రయ దాతకుఁ దెల్పెను. ఆ కోరిక నిరభ్యంతరముగ నంగీకరింపఁబడెను.

గజనీనగరమం దీవిధముగ నాల్గు వత్సరములు షాహ నామా రచనయందు గడపి, యటు తరువాత 'ఫిర్దౌసీ' స్వగ్రామమునకుఁ బోయెను. అచ్చట ననేక వత్సరములీ కార్యముననే పుచ్చెను. గ్రంథ రచన మారంభించిన ౨౦ వత్సరములకు, సుమారు ౬౫ సంవత్సరముల యీడున మన కవి శిరోమణికిఁ బుత్రదుఃఖము సంభవించి అతని మనస్సు నెంతో కలచివైచెను. అయినను ధైర్యమువహించి మొత్తము మీఁద ౩౫ వత్సరములలో ౬౦ వేల పద్యములతో గ్రంథమును బూర్తిచేసి రాజు కడకుఁ గొనిపోయి చదివి వినిపించెను. రాజా కవిత్వ ప్రభావమున కచ్చెరువందెను. ఆనందవార్ధి నోలలాడెను. కాని ఈ కవివిషయమున మాత్రము హ్రస్వ దృష్టినే ప్రకటించెను. ఎన్ని బంగారు అష్రఫీలు కవికి వాగ్దానము ప్రకారము ఇయ్యవలసియుండెనో, అన్ని రూప్యములు కవి బసకు పంపెను! ఎనుబది సంవత్సరముల వయస్సునఁ గొండంత యాసతో ముప్పదియైదు సంవత్సరముల శ్రమకు ఫలితము నెదురు చూచుచుండిన 'ఫిర్దౌసీ' హృదయమును మహామూదు యొక్క కృపణత్వము బ్రద్దలుగఁ బగిల్చెను!!

3

"ఫిర్దౌసీ" విషయమున మహమూదు చూపిన ఈ వర్తనమునకుఁ జరిత్రకారులు పలు కారణములఁ జూపెదరు. కొందఱు, కవి రాఫ్జీ* శాఖకుఁ జెందిన వాఁడైనందున కొద్దిచూపుచూచె నందురు. కొందఱు ఆస్థానకవుల నూయాపరులు రాజుతోఁ గొండెములు చెప్పియట్లు చేయించి రందురు. కొందఱు "ఫిర్దౌసీ" తన మహాకావ్యమునందుఁ బలుతావుల, గొప్పపుట్టువునకుఁ బ్రాముఖ్యమిచ్చుచువచ్చి నందున, బానిసకు కొడుకై రాజ్యపదవికి వచ్చిన వాఁడగు మహమూదు అభిజాత్యమును గూర్చిన యుల్లేఖనములు తనను నిందించుటకై వ్రాయఁబడినవిగా భావించి, ఈ విషయమున 'ఫిర్దౌసీ' నవమానించె నందరు. ఈ కారణములలో ప్రతిదానికిని అనుకూలముగను ప్రతికూలముగను వాదము చేయుట కవకాశ మెంతయేనిఁ గలదు. నిజమేదో దేవున కెఱుక.

ఒకసంగతి మాత్రము నిశ్చయము. 'ఫిర్దౌసీ' యెడ మహమూదు చేసిన ఈయకార్యము ఫారసీ వాఙ్మయచరిత్రముననేకాక ప్రపంచ వాఙ్మయచరిత్రమున దుఃఖకరమగునపరాధముగా జ్ఞప్తియందుండఁగలదు.

పైనచెప్పఁబడిన పారితోషిక ధనమును 'అయాజ్' వెంటగొని ఫిర్దౌసీ కడకుఁదెచ్చెను "ఈ తెల్లరూకలకొఱకా నేనిన్ని సంవత్సరములు శ్రమపడినది?" అని 'ఫిర్దౌసీ' కోపముతో మందలించి, ధనమును తీసికొన నిరాకరించెను.

ఈ వార్త విని మహమూదు చింతిల్లెను. ప్రధాన మంత్రిని బిలిపించి మంచి యాలోచ చెప్పవైతివని కోపపడెను. 'దేవర వారంపిన దొక మంటిపెడ్డయే యగుగాక, మహా ప్రసాదమని యంగీకరించి, కన్నుల కద్దుకొనవలసియుండెను" అని మంత్రిసత్తముఁడు పాదుషా కోపాగ్నిని బ్రజ్వరిల్లఁజేసెను. ఈ క్రొత్త యాగ్రహమును దప్పించుకొని తప్పించుకొనుటకై మహాకవి యెంతో దైన్యమునకు లోబడవలసిన వాఁడయ్యెను.

గజనీ నగరమును వదలి పోవునపుడు "ఫిర్దౌసీ" రాజునుద్దేశించి, కవితారూపమగు నొక లేఖను రచించి, దానిని లకోటా చేసి 'అయాజ్' చేతి కప్పగించి, ౨౦ దినములు గడచిన పిదప రాజునకు అర్పింప నాతని వేడికొనెను. ఈ లేఖలోని పద్యములు కడు రసవంతముగ రచింపబడినవని విద్వాంసులు మెచ్చుకొని యున్నారు. ఈలేఖకుని వలన ఆంధ్ర భాషయం దనువదింపఁబడిన ఈ క్రింది పద్యములలో మూలములోని రసము నష్టమై యుండునని నిశ్చయము. పాఠకులు మన్నింతురుగాక!



---

*ఇది మహమ్మదీయ మతములోని యొక సంప్రదాయము. 'సున్నీ' తెగకును ఈ తెగవారికిని వైరము చిరకాలాగతము.

నీదుసత్కీర్తి జగమున నిలుపఁగలుగు
సేవయొకటి, భూనాథ, నేఁజేసియుంటి!
వర్షమున వాయువున నష్టపడనియట్టి
కట్టడపుఁబునాదిని కైతఁగట్టియుంటి!
పలుశ్రమలకోర్చి యెన్నియో వత్సరములు
'ఫారసీ' నిసఁజీవిగఁజేయఁ బాటుపడితి!!
నాధనపురాశి యక్కటా! నాశమయ్యె
ఫలములేనివై ముప్పదివత్సరములు!!!

———

నృపతితండ్రియు నృపతి*యై వెలిగెడి నేని
బంగరుకిరీట మీతలఁ బడయకున్నె?
నృపతితల్లియు రాణి*యై వెలిగెడి నేని
కనకరజితముల్ నామేనుగప్పకున్నె?
నేలఁగొంతకాలము తండ్రియేలుగాక
దాసుని సుతుండు తామహోదారుఁడగునె?

———

హీనుల మహోన్నతపదవి కెత్తుటయును
ఎత్తి వారి యుపకృతి నాశించుటయును
స్వీయమానధనము బుగ్గిచేయుటగును;
సర్పమును దనజేబులో సాకుటగును!

———

చేదుసహజగుణంబగు చెట్టు దెచ్చి
నందనవనంబులో నీవునాటి దాని,
స్వర్ణదీజలముల పెంపెసఁగ బెంచి
స్వచ్ఛమధుపూరమునను బోషణము చేసి
నను తుదకు దాని సహజగుణమ్ముపోను
చేదగు ఫలంబులే లభించెను నిజంబు!

చెడుగునుండి హితంబు కాంక్షించుటెల్ల,
కంటిలో దుమ్ము చల్లించుకొంటయెయగు
దుఃఖపడెనేని కవివ్రాయు దూషణమ్ము,
దూషణమునిల్చునీజగత్తున చిరముగ
ననెను నీతి నృపుడు నేర్చుకొనునటంచు
కొన్ని పద్య రత్నముల నేఁగూర్చినాఁడ!

ఎంతటిప్రతాపశాలియైననేమి? ఎన్నిరాష్ట్రముల జయించిననేమి? ఎందరుకవులను పోషించిననేమి; ఫిర్దౌసీ పెదవులనుండి వెడలిన పైనిందావాక్యములు ప్రళయ కాలమువరకు స్థిరముగానుండునుకదా!

నిందాగర్భితములగు కవిశేఖరుని గీతములకు మహమూదు ఆగ్రహవశుడయ్యెను. అతనిబట్టి పంపుఁడని సామంత ప్రభువులకాజ్ఞయొసఁగెను. కానిఎవరును అట్టిపాప కార్యమునకు లోఁబడలేదు. కాని ఏయేస్థానములకు మన మహాకవి ఆశ్రయము వెదకుచువెళ్లెనో ఆయాయాస్థానముల వారాతనికి బహూకరించి, ఇచ్చట నుంచుకొన వీలు లేదని సగౌరవముగా బంపివేయుచుండిరి. 'బగ్దాదులోని 'ఖలీఫా' వద్దనుండఁగా వెంటనే యాతనిఁ బట్టిపంపుము, 'లేనిచో యుద్ధమునకువచ్చెదను' అని మహమూదు బెదరించి వ్రాసెనఁట! కాని ఖలీఫాజంకక చీవాట్లు పెట్టి సందేశ మంపెనఁట!!

మహమూదును గూర్చి మన 'ఫిర్దౌసీ' మరియొక మారు 'నింద'* రచించెను. 'నాసిర్ లక్' అను ప్రభువది చూచి జాలిచెంది "లక్షరూపాయ లిచ్చెదను, ఈపద్యముల నుప్రకటింపకుము. నిందను రచించుట నీవంటి మహాకవికిఁ దగినపనికాదు' అని మహాకవినిఁ బ్రార్థించి, 'ఫిర్దౌసీ' విషయమున గొప్పయన్యాయము జరిగినది' అని మాత్రము మహమూదునకు విన్నపము వ్రాసెను.

---

* ఈ శబ్దములలో కవి, మహమూదు బానిస యొక్క పుత్రుఁడుకాని భావౌన్నత్యముకల రాజవంశజుఁడు కాఁడని సూచించి యున్నాఁడు. మహమూదు తండ్రి "అలప్తగీను" అనువాఁడు మొదట బానిసగా నుండి అదృష్టవశమున గజిని పాదుషాయైన వార్తయు, ఒక లేడిపిల్లవిషయమున అతఁడు కనికరము చూపిన కథయు అందరికి తెలిసినదే,

* ఫారసీ వాఙ్మయమున నిందాగర్భముగా వ్రాయబడిన కవిత్వమునకు "హజూ" యనిపేరు. మనము దానిని "బూతుకవిత్వము" లేక "తిట్టుకవిత్వము" అని తెనుగు కావ్యములలో జూచియున్నాము. అయినను మూలము ననుసరించి 'నింద' యనుశబ్దమును వాడితిని. (మా. హ).



హిసు ఎక్జాల్టెడు హైనెను, లెఫ్టినెంటు జనరల్ ఆసిఫుజా:
ముజఫ్ఫరుల్ ముల్కు నిజాముల్ ముల్కు-నిజామద్దౌలా,

## నవాబు మీరు ఉస్మాన్ అలీఖాన్ బహాదురు,

ఫతేజంగ్, సుల్తానుల్ ఉలూం జి. సి. ఎస్. ఐ., జి. సి. బి. ఇ.

ఈదినము (౬ వ జనవరి ౧౯౨౭) శ్రీ నిజాముగారి జన్మదినోత్సవము.
పరమేశ్వరుడు వారికాయురారోగ్యముల బ్రసాదించు గాత.

గజినీవదలి పోవునప్పుడు, 'ఫిర్దౌసీ' నగరములోని జుమామసీదు గోడపైన నొకపద్యము వ్రాసెను. మహామూదొకనాడామసీదునకు ప్రార్థనకై వెళ్లియుండెను. ఆపద్యము నుజూచుటసంభవించినది. అచ్చటనుండి నగరునకువచ్చు వరకుపైనచెప్పఁబడిన తేఖకూడఅందెను. మహమూదు చింతిల్లెను. పరిజనులపై కోపపడెను! అంతే. మసీదులోని పద్యమునకిది తెనుఁగు:

గీ. సాగరము మహమూదు నాస్థానవాటి;
ఎట్టిసాగర? మద్దానికెల్ల లేదు.
మునక లెన్నొ వేసితినందు; ముత్తెమబ్బ
దయ్యె! నా యభాగ్యప్రదోస; మంతెకాని,
సంద్రమా! యది నీను దోసంబుగాదు.

ఈవిధముగా మహమూదు 'ఫిర్దౌసీ'రచితములగు నిందాగర్భితములగు కైతలనెన్నొవినెను. విని ఖిన్నుఁడగును, పరిజనులపైఁ గోపపడును; కోపపడి యూరకొనును. 'వంగచెట్లవద్ద బావాయనవద్దు' అనుసామెతచొప్పున ద్రవ్యము మాత్రము పంపగోరడు. తుదకొకమారు హిందూదేశపుదాడియొకటి పూర్తి చేసుకొని వచ్చుచుండెనఁట. మార్గమధ్యమున శత్రుప్రభువొకఁడు, 'ఫిర్దౌసీ' పద్యమొకటి ఎత్తిపాడుపుతో మహమూదునకంపెనట. ఇది మన స్నేహితుకెంతయు దుఃఖంప జేసెనఁట! గజిని చేరగనే ౬౦ వేల అష్రఫీలు సంచులలో నింపించి, ఒంటెలపైన నెత్తించి ఫిర్దౌసీ యూరికంపెను. అపురముయొక్క తూర్పుద్వారమున ఒంటెలాలోన ప్రవేశించెను. పడమటిద్వారమున నీమహాకవి శవము పురము బయటికేగెను. మహమూదు దుష్కీర్తి వాఙ్మయమున 'ఫిర్దౌసీ' వచనానుసారము జగత్తుండునంతకాలము స్థిరముగా నిలిచెను! విధిని తప్పింప నెవ్వరితరము?

'ఫిర్దౌసీ' కి పురుషసంతతి నిలువలేదు. ఆతని గృహమునుగాంతివంతముగా నుంచిన దొక పుత్రికారత్నము మాత్రమే. మహమూదు సేవకులు ధనము నామె కప్పగింపఁదలఁచిరి. కానిఆయువతిఆత్మగౌరవము ఆందుకంగీకరింపదయ్యె. ఏద్రవ్యము నాతండ్రి మానసమును జీవితాంతము వరకు దుఃఖపరచెనో ఆద్రవ్యమును నేను ముట్టనొల్లను అని నిర్భయముగా బలికి తిరుగఁగొట్టెను!

మహామూదు అందునకు మరింత చింతిల్లి, "ఫిర్దౌసీ" యొక్క యూరునకు బయట అతనిపేరనే ప్రచండమగు ధర్మశాల యొకటి కట్టించెను. దాని శిథిలము లిప్పటికిని కలవఁట! యాత్రికులు వానిని జూచి మన మహాకవినిస్మరించి అశ్రుబిందువుల వదలెదరట!

"ఫిర్దౌసీ" రచితమగు నొకటేయగు మహాకావ్యమునకు ఫారసీ భాషయందు అత్యున్నత స్థానముకలదు. తరువాతికావ్యములవలె అరబీ భాషాశబ్దభూయిష్ఠము గాక, "షాహనామా" ఎంతయు ప్రశంసింపఁబడుచున్నది. దీనియందు వివరించి చెప్పఁదగినవి అనేకము లెన్నియోగలవు. అవి మరియొక వ్యాసమునకు సాధనముల వ్రాయఁదగినంత విస్తారములు; మహత్త్వ భరితములు. గ్రంథవిస్తరభీతిచే వదలవలసి వచ్చినది.

మన మహాకవి మరణవత్సరము హిజ్రీశకము ౪౧౧. ఇది క్రీ. శ. ౧౦౨౫ ప్రాంతమై యుండనోపును. మహోత్కృష్టమును, మహావిస్తార యుతమునునగు మహాకావ్యమును రచించి, ఫారసీ వాఙ్మయము నలంకరించిన మహాకవి, ఎనుబది వత్సరముల వార్ధకదశయందు, రాజుయొక్క దుర్గుణముచేత గాసినొందిన మానసముతో బరలోకమునకేగెను. దేశదేశముల కొల్లగొట్టి జనుల చీకాకు పరచి, పరమతవిద్వేషియైన మహమూదు కూడ తరువాత కొలఁది కాలమునకే అదృశ్యుఁడయ్యెను. ఇద్దరును కాలగర్భమున మాయమైరి. ఒకటి వానికిఁ గీర్తిదక్కెను; రెండవవాఁడపకీర్తి పాలయ్యెను. తారతమ్యము అంతయే!

# హంసాన్యోక్తి

శ్రీ శేషాద్రిరమణకవులు.

(పండిత రాయలశ్లోకమునకుఁ దెలుఁగుసేత)

తమ్మిపుప్పొళ్ళచేతఁ గ్రొందావులొలయు
లలితమానసకాసారజలములందు
రాజసంబున విహరించు రాజహంస
కలిత భేకాకులంబు పల్వలముఁజేరె.

గీ. కనకపంకజసంచయాక్రాంతమైన
కమ్రమందాకినీతరంగముల మధ్య
అనుదినంబును విహరించు నంచ తేఁడు
హేయశైవాలజలమాశ్రయింప నుండె.

గీ. తమ్మికొలఁకులలోన సంతతము మెలఁగు
సుఖము హంసకుఁ బాపవచ్చును విధాత
నీరమును బాలు నొండొంటి వేఱుపఱచు
సహజపాండితి తొలిగింప శక్తుఁడెవఁడు.

గీ. దారిబడలికచే దినాంతమున నంచ
కాకకంకబకాదులకడ వసింప
చూఁగ దిదియంచు నవ్వెను బులుఁగులెల్ల
నీచులనుజేర గఱువలు నిందఁగనరె.

గీ. అంచయును కొంగ తెల్లగా నలరుచుండు
రెంటభేదంబు నెటులేర్పరింప నగునో
నీరమును పాలు విడదీయునేర్పుకతన
నగుపడక యున్న తారతమ్యాతిశయము.

# సంఘ సేవ

ప్రొఫెసరు శిరుగూర హనుమంతరావుగారు
ఎమ్. ఏ. ఎల్. టి.

ప్రతి మానవునకును నలుగురిలో పేరు కెక్కి, యితరులకంటె హెచ్చు ప్రాముఖ్యత జెందవలెనను కౌతూహలము కలదు; ఈ ప్రాముఖ్యత రాజకీయ విషయములలో జేయి చేసికొన్నచో సులువుగా రాగలదు. ఈ కారణము వలననే మన యువకులందరును రాజకీయ వ్యాసంగములలోను రాజకీయ సభల యందును విశేష ముత్సాహము చూపించుచుందురు. కాని, మానవ చరిత్రను విమర్శించినచో ప్రజల కన్యోన్యబాంధవ్యమును గూర్చునది కేవలము రాజకీయ బంధమే కాదనియు, దీనితో సరియైనవి కూడ పెక్కులున్నవనియు గ్రహింపవచ్చును. మన దైనందిన కృత్యములలో, ప్రతి క్షణమును మన మొనరించు నల్ప విషయములలో, మనకు హేతుభూతమైనది రాజకీయ విషయము కాదు; వీనికి హేతువులు పెక్కులున్నవి; మనల నావరించుకొన్న తత్త్వద్విధమైన సాంఘిక బంధము ప్రకారము ఆయా హేతువులు మారుచుండును. మానవుడు సంఘము నడుమ బుట్టుచున్నాడు గాని యేకాకిగా బుట్టుటలేదు. ఒక్క కుటుంబములోని జనముల యన్యోన్య సంబంధము సాంఘిక బాంధవ్యములలోనికెల్ల ప్రాచీనమైనది. సంఘ సేవకై యవకాశములు సులువుగా జనించుటకు కుటుంబమే ప్రథమస్థానము. సంఘ సేవ యనునది కేవలము చాటింపులకై వినియోగించుటకును, ఆత్మ లోభమునకై వినియోగించుటకును ఉపయోగించునది గాక, నిజమైన సేవ యగునో ప్రతిమానవునకును దనకుటుంబములోను, తన యిరుగుపొరుగులోను, చేయుటకుం గావలసినంత సెవకలవు. హైందవ కుటుంబములలో నొకవృద్ధలు కష్టపడి గణించుచుండుటయుం బలువురు వ్యర్థులై యింట గూర్చొని మెసగుచుండుటయు నందఱకుం దెలిసినదే. ఈ స్వార్థ పరులు "సంఘపు ఋణదాతలు" ఈ "సంఘపు ఋణదాతలు" వృద్ధియగుచున్నకొలది సంఘము మతింత దారిద్ర్యమును పొందుచున్నది. కుటుంబములోని ప్రతి మానవునికిని, తక్కిన వారికి నాదర్శ ప్రాయకముగా నుండుటకై ప్రయత్నించుట, విధాయకము. తాను నిండుగ జీవించుటయే కాక తక్కిన వారి 'సంఘపు ఋణము'ను తగ్గించుటకై వారవలంబించుటకుం దన్నాదర్శముగాం గొనునట్లు నడచుకొనవలెను. ప్రపంచ నీమలెట్లు మారుచున్నవో నేనిప్పుడు విమర్శింపదలంచుటలేదు కాని, ప్రపంచములో నింతటి యాశ్చర్యకరములైన యార్థిక సంపదలు వృద్ధియగుచున్న నేటి కాలమున మానవుని నడతలో మాత్ర మెంత మాత్రమును అభివృద్ధి కలుగలేదనుట శోచనీయము. దీనికి చికిత్స యొక్కటే—అదేమనంగా, జీవితాదర్శములను గ్రహించి, ఉన్నతాశయములను అవలంబింపం జేయుటే. సంఘసేవ యనంగా మన మితరులకిచ్చు దానము; మనకు లేనిదానినెట్లు దానము చేయంగలము? ఇతరులయందు ఉన్నతాశయములను జనింపం జేయవలెనన్న, మన యాశయములున్నతములై యుండవలెను. కనుక సంఘసేవ చేయవలెనను ఉత్సాహమున్నచో, మన యాశయముల నున్నతములుగ మార్చి, కాయ కష్టములను లెక్కసేయక, యాధునిక విచికిత్సలలోనికిం బరిపూర్ణోత్సాహముతో విజృంభించుట విధాయకము. మన కళాశాలల నుండియు విశ్వవిద్యాలయముల నుండియు వెడలివచ్చు సాధారణ యువకులను జూడుడు; వారిని గాని, వారి తల్లిదండ్రులను గాని, కళాశాలలో నెందులకుం బఠించుచున్నారని ప్రశ్నింపగా, వారందఱు నొక్కటే ప్రత్యుత్తరమిచ్చెదరు. "ధనార్జన కొఱకు" బుద్ధి వికాసమును పొందుట, విజ్ఞాన విషయములయందు జ్ఞానమును చెందుట, జీవిత విమర్శ

నమును వికసిత మేధస్సుతోఁ జేయుట, ఇట్టి శక్తి మన కళాశాలలనుండి వచ్చు యువకులకు సున్న. మన కళాశాలలలో నేర్పఁబడు విద్య యిందులకుఁ జాలదు. ఈ యువకులు కళాశాల విడచినప్పటినుండి యుద్గ్రంథములను చదువుట నాపి వేయుటయే దీనికి నిదర్శనము. ఉన్నత జ్ఞానమును కలిగి, నూతనాభిప్రాయములను గ్రహించి, వానిని వ్యాపింపఁ జేయఁగలిగినవాఁడే సంఘసేవ చేయఁగలడు. ఇచ్చటచ్చట మేధావులుకలరు—కాని వారి విజ్ఞానమంతయు నేకదేశ్యమగుటచే, ప్రాపంచిక విషయములయందు వారు జోక్యమును కలుగఁజేసికొనరు. అందుచేత వారి విజ్ఞానము సంఘమున కుపయోగకరము కాదు. సాంఘిక బాంధవ్యములను వృద్ధిగావించుటయందు ప్రాచీన సభ్యతకును, ఆధునిక సభ్యతకును గల భేదము కనుపించుచున్నది. ప్రాచీన కాలమున మానవుడు తన కుటుంబ విషయములలో మాత్రము అనురక్తిఁ జూపుచుండెను. కొంత కాలమైన తర్వాత మతము మూలకముగా సాంఘిక బాంధవ్యము హెచ్చెను; కాని ప్రస్తుత కాలమున మన బాంధవ్యము నపేక్షించుచు వందల కొలఁది సంఘములు కలవు. కుటుంబము, మతము, ప్రభుత్వము, పక్షపాత్య సభ, వ్యాయామసంఘము, దారిద్ర్య విమోచన నిధి, విశ్వ పండిత సంఘము—ఇదియది యననేల—ఇన్ని సంఘములున్నప్పుడు వీనిని సరిగ సాగించుటకు మన మేధస్సు విశాలముగ వృద్ధి చెందుచుండవలెను.

సంఘసేవ విధ్యుక్తముగఁ జేయఁదలంచు యువకునకుఁ గావలసిన వానిలో మొదటిది మేధాసంపద. ఇట్లున్నచో మేధాసంపదఁ గలిగి, బహు విషయములందు నాసక్తి చూపుచున్న వారందఱును సంఘసేవ యందనురక్తి చూపి, తమ విజ్ఞానము నందులకై యుపయోగింతురనుట కాదు, ఇటువంటిది సిద్ధించుటకు మన విద్యకు మున్ముందుగా నైతిక బలముండవలెను. విద్యా విషయమున నిచిని పేర్కొనుటలో నేను ఛాందసముగా బల్కుటలేదు. మన బడి పిల్లవాండ్రకుఁ గఱపు నైతిక పాఠముల వ్యర్థత్వము నేనెఱిగినదే. చెప్పు విషయములోను, విధములోను తప్పుంతయునున్నది. కాని విద్య కేవల ధనార్జన కొఱకే యను మత్తేశమున్నంత వఱకు సంఘమునకు గొప్ప హానికలుగుచున్నది. మానవుని జీవితములోఁ బశుప్రాయత్వమింకను ప్రత్యక్షముగానున్నదని 'హాబ్స్' చెప్పిన మాటలో సత్యమున్నది. ధనము కొఱకై తగవులాడుటను జూచినచో మానవుని జీవితము యుద్ధరంగమనియు, మానవుఁడు పశువనియుఁ గన్పించుచున్నది. అన్యోన్యసౌభ్రాతృత్వమును గ్రహించి, తగవులాడుట కన్నఁ గలసిమెలయుట నేర్చుకొనుటకై మానవునికి నూతన బోధమింకను గలుగవలసియున్నది, అట్టి నూతన బోధము కలుగుటకై జీవితాదర్శములను చాటింపవలెను. ఆర్థికతత్వము నున్మూలముచేసి యాత్మతత్వమును స్థిరీకరింపవలెను; మానవ జీవితము యొక్క నైతిక పునాదులను గ్రహింపవలెను. మన గుణసంపదలను వృద్ధిచేసి, తోడివారల శీలతను వృద్ధిచేయుటకై మన సంఘములను మన ముపయోగింపవలెను. నైతిక శీలత లేనిచో మేధా సంపద నిరుపయోగము; విషయకాంక్షల నణఁగఁద్రొక్కుటకుఁ బ్రతిమానవుఁడును యత్నింపవలెను. శారీర పారిశుద్ధ్య విషయములను గుఱించి సవిమర్శముగ నాలోచించి; బాలురకును బాలికలకును పారిశుద్ధ్య విషయములను లెస్సగా సకాలమునకు బోధపఱిచి, వారి జీవితమునకును వారి సంఘమునకును నిష్కారణముగ నష్టము రాకుండఁ జూచుట మన దేశములోని స్త్రీ పురుషులకు విధాయకమనుట నిప్పటి వఱకు మనము గ్రహింపలేము. స్త్రీ పురుషుల యన్యోన్యసంబంధమును గుఱించిన విషయము సంఘమునకు ముఖ్యమైన ప్రశ్న. స్త్రీపురుషుల నైతిక శీలత యున్నతముగా లేని యే దేశమును వృద్ధిపొందలేదు. ఎవరో రక్షకరు రక్షించుచు వెంటరానిదే వీధులలోగాని, తోటలలోఁగాని స్త్రీలునడువలేని! దశమన నాగరకత యొక్క నైచ్యమును చాటించుచున్నది. ఎంత యార్థిక సంపదలున్నను, ఎన్ని విశ్వ విద్యాలయపు పట్టాలున్నను, స్త్రీలను జూచినచో నున్నత భక్తిగదుఱని మానవుఁడు పశుప్రాయుడు. సంఘములోని నాయకులందఱును సాంఘిక దోషములకు నుత్పత్తిస్థానములైన దురుద్యమముల నన్నిటిని నశింపఁజేయుటకు యత్నింపవలెను. ముప్పది సంవత్సరముల క్రిందట మా చిన్న పట్టణములో, నొక భోగము దాని నుంచుకొనుట, ప్రతి దినము రైల్వే రిఫ్రెష్‌మెంట్ రూమునకు త్రాగుటకై పోవుట

యీ రెండును లేనిచో తాహతునకుఁ దక్కువగా పరిగణింపఁబడుచుండెడిది. ఇట్టి సిలిబాహ్యత నానాటికి వృద్ధి చెందుచుండుటచే దానిమీద జుగుప్స కలిగి సాంఘిక పరిశుభ్రత కొఱకై దక్షిణ హిందూదేశములోఁ గొన్ని సంఘములు స్థాపింపబడెను. దివాన్ బహదూర్ రఘునాథరావ్ గారు, శ్రీయుత కందుకూరి వీరేశలింగము పంతులుగారు, సర్, సి. శంకర్ నాయర్ గారు, ప్రస్తుతము మదరాసు విశ్వ విద్యాలయము వైస్ చాంసలర్ గానున్న సర్. ఆర్. వెంకట రత్నం నాయుడుగారు ఆయుద్యమమునకు నాయకులుగా నుండిరి. కడచిన యిరువది సంవత్సరములనుండి రాజకీయోద్యమముల ప్రవేశముచేత దక్కిన యుద్యమములన్నియు బ్రిటిష్ ఇండియాలో దలసూపకుండెనుగాని—యీ నాయకుల పరిశ్రమ వలన యువకుల మనస్సరణి యీ కాలములో మిక్కిలి బాగుపడెను. ఈ కారణముచేత నేటికి భోగము మేళములు నామమాత్రావశేషములుగ మాఱుచున్నవి. రైల్వే .రిఫ్రెష్ మెంటురూమునకుఁ బోవుటకెక్కువయుత్సాహమును లేను. ఈవిషయముల యందుఘనమైన మాఱ్పులు కలుగవలెను కనుక నేనిట్టునొక్కి వక్కాణించుచున్నాను. ప్రస్తుతము దురుద్యమములలో నొక్కటి సినిమా దర్శనము. సినిమా వలన విజ్ఞాన విషయములు నేర్వకొన వచ్చునని వాదింప వచ్చును. పాతిక సంవత్సరముల క్రిందట మొదటి ఫారములో నున్నప్పుడు మ్యాజిక్ లాంటర్న్ చూచినపుడు కలిగిన యుత్సాహము నాకింకను జ్ఞాపకమున్నది. గాని యీ వాదన బాగులేదు. భోగము మేళములను పోషించినచో హైందవ నాట్యకళ యభిరక్షింపఁబడునని కూడ వాదింపవచ్చును. ఆనందకుమారస్వామి గారి గ్రంథములను జదివిన వారికి నాట్యకళ యొక్క రసికత తెల్లమగుచున్నది. కాని హైందవ బాలకుల భావోద్రేకము నెఱింగిన వారెవ్వరును సినిమా ప్రదర్శనములను గుఱించి పట్టింపు చూపింపక పోరు.

# కుసుమకరుణము

కోదాటి రామకృష్ణరావుగారు బి.ఏ.

గీ. త్రుంచివేసెడవు కఠిన! నాదోషమేమి?
విడువలేవె జీవంబుల వీడువరకు
శాఖలో! దుఃఖపర్యవసాన మిట్టి
మరిపె మని నేనెఱింగిన మరువ కుందు
స్వాంతహారుడగు పవనుగిల్గింతలకును!

సాకె నన్నెంత పేరిమి శాఖ యొడిని!
అందమతి మలయు నన్ను పల్యంకమందుఁ
బడయద్రోచితి వీవు, నాపరిమళంబు
శయ్యనింపుదు రాత్రి, నిశావియుక్తిఁ
బారవేయుమ నను మంటి బడిఁ నశింప.

ఎగిరిపోయెడి చెదరి నాయింపులొలుకు
రేకులు, క్రమానుగతిని విస్మృతినిఁ గనెడి
మన్నులో మన్నయి; నిమేషమాన్య శోభకై యచిరసౌఖ్యలాలసతాపహతుఁడవై హరించితివోయి నాయసువులకట!

చెదరనున్నది వర్ణము; జీర్ణదళను
గనెడిదుగా రేకురేకులై తనువు! కాంతి
మాయనున్నది! యకట యామ్రాని నలరు,
పచ్చపచ్చని యాకులపరువుమధ్య
నెట్టిగా గప్పబడి యేను ముసుఁగు
లోని పుష్పాంగి గండవిధాన నుంటి.

చారుతచిహీనమయ్యెడు శాఖ మద్వియోగమున నక్కటా! తల్లి యొడిని బిడ్డఁ
బాసి కన్నీరునించు! నకట బడయలేక
తేనెటీగలు చింతించు, దీర్ఘదుఃఖ
వార్ధిలో మును కోకిలల్ బంభరములు.

మంటిలోఁ గలిసితిని నేను మంచుపాలఁ
బెరిగి, పుష్పంబుకుత్తుకకట బెఱుకు కటిక
వాని గతులెవ్వఁడెఱుఁగును! భానుఁడదియె
వ్యర్థమయ్యెను తనకిరణాళికష్ట
మనుచు చింతించు! చంద్రుని మనము దుఃఖ
తప్తమగుఁ జెడెఁ దనవర్ణదానమనుచు!

పొందె సంక్షోభ మక్కటా పూవుమొలక!
మాలిహృదయంబు శోకానదూలిపోయె!
కాంతిదీపిక చల్లారెగా యటంచు
శాఖ యేడ్చెడు; నాకును చావుగలదు!
చచ్చెదవు నీవు! నందఱుఁ జావగలరు!
తరుణమరణంబు జగతికంతమగదోయి!



# జయాపజయములు

మా. రామచంద్రరావు గారు

౧

ప్రేమ్ థియేటర్‌లో ప్రసిద్ధి. జెందిన 'మృచ్ఛకటిక' మను సంస్కృత నాటకము జరుగుచుండెను. ఆరూపకము నందొక పతివ్రతా తిలకము చరిత్ర ప్రదర్శింపబడుచుండెను. శ్యామలామనోహరు లిద్దరు ప్రత్యేక తరగతియందు సోఫాపై కూర్చొని యుండిరి. నాల్గవ అంకము ముగిసిన పిదప మనోహరుడు శ్యామలను సంబోధించి:

"శ్యామలా, ఇంత ఓపిక, యిన్ని సద్గుణములు కల స్త్రీలుండగలరా? నిజముగా వారియందింత ప్రేమ ఉండుట సంభవమా? ఏమో నేను మాత్రము నమ్మను. కవి నిర్మిత భావ ప్రతిమలు కాని నైసర్గిక యువతులావిధముగ నుండరు. స్త్రీలు సహజముగా మాయామిళిత విగ్రహములు. నమ్ముట కెప్పుడును అవకాశము లేదు. నేనెన్నో ఉదాహరణముల జూపెదను."

శ్యామల:—(కొంత తీక్ష్ణముగా) "ఇక ప్రపంచములో మీరే న్యాయ మూర్తులు! స్త్రీలను గురించి పల్కిన నిందా వాక్యములు మీరు పురుషుల కొఱకుపయోగించిన నెంతో న్యాయముగా నుండెడివి! స్త్రీ పవిత్రప్రేమామయదేవత! ఎల్లప్పుడును స్త్రీ హృదయము ప్రేమాసముద్రముతో నిండి యుండును. శకుంతలనెవరు మోసగించెను? సీతయొక్క పాతివ్రత్యము పిల్లలకు గూడ తెలియును. మీబోటి విద్యాధికు లీవిధముగా విచిత్రభావపూరితులైయుండుట చాలా విచారకరమైనసంగతి."

మనోహరుడు: "ఆకాలము వేరు. ఈకాలము వేరు. ... ... ..." అని ఏమోఅనబోవు చుండగా నాటకము తిరిగి సాగ మొదలయ్యెను. ప్రదర్శనముపూర్తియైన తర్వాత శ్యామలామనోహరులిద్దరింటికి వెళ్లిరి. మనోహరుడు తన పట్టునువదలక "శ్యామలా, నేను స్త్రీలు చంచలహృదయులును, నమ్మదగినవారు కారని ఘంటాపదముగ జాటగలను" అనియనియెను.

శ్యామల: "మంచిది. నేను పరలోకగతురాలనైన మీరింకొక వివాహము చేసుకొనక ఒంటరిగానుందురా? నాప్రేమనే స్మరించుకొనుచు ఓపికతో కాలముగడుపగలరా"?

మనోహరుడు: "అవును. నేనావిధముగనేచేయుదును. తప్పక అవిధముగనే కాలముగడుపుదును. ఒక వేళ నేనావిధముగ చేయని యెడల ... ... ..." ఇంకేమో ముందు చెప్పబోవుచుండెను. శ్యామల ఆవాక్యమువిన దలచు కొనక తొందరగా నభర్త నోరుమూసి "నన్ను చంపుకొనినట్లు, మీరికముందేమనకండి" అని యాతనివాక్యంధనము గావించెను.

౨

మనోహరరావు ఒక ప్రసిద్ధికెక్కిన వార్తాపత్రికకు సంపాదకుడు. ఎమ్. ఏ.వరకభ్యసించినవాడు. దేశసేవ యన్న అతనికి చాలాప్రీతి. దిట్టమైన వాని సంపాదకత్వమున పత్రిక వెలువడుచుండెను కనుక పత్రికకు చాలాప్రచారముండెను. పత్రికా మూలముననే అతనిజీవనోపాధి జరుగవలెనని లేకుండెను. తోటలు, ఇండ్లు పట్టణమునందును, పట్టణసమీప గ్రామములయందునుండెను. సుమారు ప్రతిసంవత్సరము ఏబదివేల ఆదాయమువచ్చుచుండెను.

శ్యామలామనోహరులిద్దరు చిన్నప్పుడొక స్థలముననే విద్యనభ్యసించి యుండిరి. బాల్యస్నేహితుల బరమేశ్వరుడు వారిద్దరు యౌవనులైన తర్వాత భార్యాభర్తలుగా జేసెను. మనోహరుడు శ్యామలను చాల ప్రేమించుచుం

డెను. శ్యామలమితభాషిణి. మనోహరుడు పరిహాసములా డుటయందు నేర్పరి. ఇద్దరిలో ఏచిన్న భేదమున్నను ఒకరికొరకు మరొకరు పుట్టినట్లు ఉండిరి. ఆతనికెప్పుడు శ్యామలతో పరిహాసములాడి ఆమెను బాధపెట్టుచులోలోన సంతసించుట యలవాటు.

శ్యామల చెల్లెలగు విమల కొన్నిదినములు అక్కదగ్గర కాలము గడుపవలెనని వచ్చెను. మనోహరుడెప్పుడును మరదలితో హాస్యము జేయుచుండెను. విమల శ్యామలవలె ముగ్ధకాదు. ఆమెకూడ మాటలమూట. ఒకొకసారి తన వాక్చతురతచే మనోహరునే ఆశ్చర్యచకితని చేయుచుండెను. ఒకనాడందఱు భోజనముచేయుచుండగా విమల మనోహరునితో ,,బావా, అక్కనుపదునేను దినములకొరకు మాయింటికి దీసుకబోదలచినాను,, ని అనెను.

మనో: ,,ఇదెన్నటికి కానేరదు. శ్యామలకుమారుని యెక్కడనున్నదో శ్యామలకు పంపుదును.''

శ్యామల మనస్సునకావాక్యము రుచింపలేదు. కాని మౌనమువహించి కూర్చొని యుండెను.

విమల: ,, నీవిప్పుడు మాయక్కను పంపకున్న ఇకముందెప్పుడు కూడ నేనుమీయింటికిరాను. నీతో మాటలాడను.''

మనో: ,, నీకొఱకిష్టపడుదును. కోపము రానివ్వకుము. కాని పదునేను దినములకంటె ఒకదినమైన ఎక్కువ ఉంచుకోగూడదు సుమీ.''

విమల: ,, ఇది రాజామాట. దానికి నేనొప్పు కొందును.''

రెండవరోజు విమల శ్యామలను వెంటబెట్టుకొని తనయిల్లుచేరెను.

3

విమల భర్తయగు ఆనందరావు వరంగల్లులో చాలాప్రసిద్ధికెక్కిన న్యాయవాది. శ్యామలనుచూడగనే,, ఏవిధముగనో మాఅన్నగారు మిమ్ముల పంపించినారు! నూరు సార్లుత్తరములు వ్రాసినను ఎల్లప్పుడు నేనే స్వయముగా వెంటబెట్టుకొని వచ్చెదనని వ్రాయుటయే కాని మిమ్ముల పంపించుట లేనేలేదు.'' అని యనెను.

శ్యామ: ,,ఇంట్లొ ఎవరున్నారు? వారువ్రాసినది నిజమే. నాశరీరము నెమ్మదిగాలేకున్నను విమలబలవంతముచే పంపించినారు.''

ఆనందుడీజవాబును విని నవ్వెను.

ఆదివారము సాయంత్రము శ్యామల మరియు విమల మాట్లాడుచు కూర్చొనియుండిరి. గడియారమేడుగంటలు కొట్టెను. మేజాపై ల్యాంపు వెలుగుచుండెను. శ్యామల భర్తసంపాదకత్వమున వెడలు పత్రికటేబిల్ పైన బెట్టియుండెను. శ్యామల పత్రికను చదువ దలచి దానిని తీసుకొనెను. కానియేదో సంగతి జ్ఞాపకమువచ్చి తిరిగిదానిని క్రిందవేసి విమలతో ,,విమలా, మీబావ నాతో నేను గతించిన తిరిగి వివాహమాడనని పంతముకట్టినాడు. నీవు తప్పకానందునితో చెప్పి శ్యామల అకస్మాత్తుగా హృదయస్థంబన వలన అకాలమృత్యువు నోటబడినదని టెలిగ్రామిప్పించుము. చూతమని'' శ్యామలానాడు థియేటరులో జరిగిన వృత్తాంతము వినిపించెను. విమలసంగతివిని నవ్వి ,,మంచిదని'' ఒప్పుకొనెను.

ఆనందుడు రాత్రిపదిగంటల కిల్లుచేరెను. విమల తనఅక్కచెప్పిన సంగతి వినిపించి టెలిగ్రామ్ పంపుమని బలవంతముపెట్టెను. ఆనందుడీవిధముగ చేయుట ప్రమాదమని ఎన్నోసారులు బోధించెను. కానివినువారెవరు? తుదకు భార్యయాజ్ఞకుబద్ధుడై టెలిగ్రామీరీతిని వ్రాసిపంపించెను.

శ్యామలహటాత్తుగా హృదయసంచలనము స్తంభించినందున పరలోకగతురాలైనది.

శ్యామలా విమలలానందుని బలవంతపెట్టిరికాని టెలిగ్రామెట్టిభయంకర పర్యవసానము దెల్పునో యని చింతించసాగిరి. బుధవారము పగలు తపాలావాడు మనోహరుని పత్రిక తెచ్చియిచ్చెను. పత్రికకు దుఃఖసూచకముగా నల్లని బార్డరు అచ్చువేయబడియుండెను. పత్రికను చూడగనే శ్యామలహృదయమతితీవ్రముగా కొట్టుకొనసాగెను. త్వరగా విమల పత్రికను తెరచెను. శ్యామలనూతనముగా దీయించుకొనిన పటము ముద్రింప బడియుండెను,

౪

ఫోటోక్రింద ,,దురదృష్టవంతుడగు సంపాదకుని పరలోకగతురాలైనభార్య. శ్రీమతి శ్యామలాదేవి'' అని వ్రాసియుండెను. ఫోటోచుట్టు,,శ్యామలాస్మరణ'' ,,శ్యామలాప్రేమ'' ,,శ్యామలానేనెటుపోతిని'' ,,శ్యామలపవిత్రాత్మ'' శ్యామల కొఱకశ్రుబిందువులు'' అనుశీర్షికలు గల యెన్నోదుఃఖభరితమగు వ్యాసములు, పద్యములు కనబడెను. వానిని చదివి అక్కచెల్లెండ్రిద్దరు ఏడ్వసాగిరి. శ్యామలస్మారకము దప్పిక్రిందబడి పోయినది. ముఖమునందలి కాంతి అదృశ్యమైపోయినది. విమలకూడ పిచ్చిమొగమువేసినది. సాయంత్రమానందుడువచ్చెను. పత్రికావలోకనచేనాతడుకూడ నశ్రుపూరితనయనుడయ్యెను. ఆదుఃఖమందరినారాత్రి ఉపవాసము చేయించినది.

రెండవదినము విమలానందుల మనస్సు కొంతచల్లబడెను కాని శ్యామలస్థితి చాలాచెడిపోయెను. దేహము కృశించ మొదలయ్యెను. రెండవ వారము పత్రికయందు

మొదటిదానికంటెనెక్కువ శ్యామలకుసంబంధించిన దుఃఖపూరితవ్యాసములు పటములు ముద్రింపబడియుండెను. అవి చూచిశ్యామల దురవస్థింకింత పెరిగెను. పత్రికమూడవసంచికవచ్చెను. దానిలో నొక స్త్రీపటముకనబడెను. క్రింద „సంపాదకుని కాబోవుభార్య ఈవారములోనే వివాహమగును” యని వ్రాసియుండెను.

ఇంతవరకేవిధముగనైన తనభర్త తనవిషయమై వ్రాసినవిలాపవ్యాసముల చదివి కాలముగడుపుచుండెను. తన జీవితకాలముననే భర్తయింకొక భార్యను చేసుకొనెనని చదువుట ఆమెకుచాలాబాధకరమయ్యెను. ఇంతకుపూర్వము దుఃఖమొకటేయుండెను కాని ఈవిధముగ నాశాభంగముకలుగునని యనుకొనలేదు. ఈపత్రికను చూడగనే ప్రాణములు పైకే ఉరికినవి. మంచముపైమూర్ఛితురాలై పడిపోయినది. విమలానందులెన్నో విధములనోదార్చ బ్రయత్నించిరి. కాని యెంతప్రయత్నించినను నిష్ఫలమై పోయెను. మఱునాడు మనోహరుని దగ్గరనుండి యొక టెలిగ్రామొచ్చెను. దానియందీసంగతుండెను:—

„నేను, నాప్రేయసి రేపు ౯. గంటలకు వచ్చెదము”

ఈ టెలిగ్రామును చూచినతర్వాత శ్యామలస్థితేమైనది వర్ణించుట దుస్సాధ్యము. ఊహించుభారము చదువరులపైననే వేసెదము.

౫

సరిగా ౯ గంటలకానందుని సౌధముముందొక మోటారుకారువచ్చినిలుచబడెను. దానినుండిమనోహరుడు దిగి చక్కగా మేడపైన శ్యామలున్నగదికడకు వచ్చెను.

ఈదృశ్యము చూడదగినదై యుండెను. మనోహరుడుశ్యామలదుస్థితిని వీక్షించి నివ్వెరపడి మనస్సు యొక్క ఆందోళనమునుమర్చుకొని „శ్యామలా! శ్యామలా!! ఏమిటే నా? ఏమి! ఆశ్చర్యము! త్వరగామాట్లాడు! నీవెవరవు”!! అనియెను. శ్యామల మాటాడలేకపోయినది. ఆమెతనభర్తనుచూచెను.

„శ్యామలా! పడుకొనినావేమి. మేడక్రింద మోటారులోనీచెల్లెలుకూర్చొనియున్నది. వెళ్లి ఆమెను తీసుకరా, పో, లేవవేమి?” అని తిరిగితన ప్రియునివాక్యముల వినెను.

దుఃఖమును, భయమును మాచించుచున్న శ్యామలనయనయుగళి మూతబడెను. స్మారకముతప్పిపోయెను. మనోహరుడిక ఓపికపట్టలేక పోయెను. త్వరగాపోయి శ్యామలశిరమును తనయొడిలో నుంచుకొని శైత్యోపచారములు గావించెను. కొంతసేపటికిశ్యామలకండ్లుతెఱచినది. ప్రియుని బాహుడోలికయందు శయనించు భాగ్యము లభించినందున ఆమెహృదయ పరితాపము కొంత ఉపశమించెను. కానిదుఃఖముపొంగిపొర్లివచ్చినది. ప్రియునిగాగలించుకొని బిగ్గరగా నేడ్వసాగెను. విమలానందులు సమీపముననేయుండిరి. వారికికూడ దుఃఖమాగలేదు. అందఱు కలసి కొంతసేపుఏడ్చిరి. రోదనమాగినపిదప మనోహరుడు తిరిగి „శ్యామలా, పోయినీచెల్లెలిని పైకితీసుకొనిరావా? నీవేపోయిన అందముగానుండును. పాపమెంతవరకా యబల యెదురుచూడగలదు.” అనిబతిమాలెను. ఇదివినగానే శ్యామల వెనుకకుజరిగెను.

„చెల్లెలు! చెల్లెలు!! ఎవరిచెల్లెలు?” శ్యామలకోపోద్రేకముతో నిటునటు చూడసాగెను. అక్కడుండుట సహ్యముగా నున్నందున నింకొక గదిలో వెళ్లెను. మనోహరుడోదార్చుటకై వెంబడించెను. కాని అన్నియు నిష్ఫలములయ్యెను. శ్యామలస్థితిజూచి మనోహరుడు భయపడిపోయెను. ఒకనెలవరకు శ్యామల బాగుపడలేదు. శరీరము స్వస్థతజెందిన తదుపరి ఒకనాడు శ్యామలతో మనోహరుడు „ఈవిధముగనేల చేసితివి?” యని విచారించెను.

శ్యా: „చమత్కారముకొఱకు మిమ్ముల పరీక్షించుటకు”

మనో: „పరీక్షాఫలితమెవరనుభవించిరి? నీఓర్పెటు పరుగెత్తినది? జయాపజయములమాయాప్రదర్శనమిది. తెలిసినదా.”

శ్యా: (సిగ్గుపడి) „నేను మృతినొందితినని మీరు ప్రచురించితిరి. ఫోటోలను ప్రకటించి నేను పరలోకగతురాలనైతినని పూర్తిగా లోకులు నమ్మునటుల చేసితిరి. నేను తిరిగివారికగుపడినయెడల వారేమనుకొనెదరు”?

మనో: (నవ్వి) నీకుబంపిన రెండుమూడు సంచికలు నీకొఱకే ముద్రింపబడినవి. నీవుగతించిన సంగతి దెలిపిన టెలిగ్రాము వెంట నింకొక టెలిగ్రాము నీక్షేమముదెలుపుచు ఆనందుడంపియుండెను.

విమలానందులుకూడనక్కడనే యుండిరి. విమల తనభర్తతో (కోపము నభినయించుచు) „మీరీమోసమునకు తప్పక శిక్షింపబడుదురు.”

ఆనం: „మంచిదే. శ్యామల నీతినవలోకించితివికదా! చేసినదానికనుభవించెదవు.”

# రాచకొండ

డాక్టరు, ఒ. సీతారామచంద్రరావు గారు.

రాచకొండ యనునది నిజాము రాజ్య మందలి నల్లగొండ జిల్లా నారాయణపుర సంస్థానమునఁ గలయొక ప్రాచీన దుర్గము. నారాయణపురమున కేఁడు మైళ్ల దూరమునను హైద్రాబాదు నుండి నల్లగొండ వరకుఁగల రోడునందు హైద్రాబాదు నుండి ౨౩ మైళ్ల దూరమునఁ గల మలకపేటకు నైఋతి దిక్కున ౧౦ లేక ౧౨ మైళ్లదూరమున నీదుర్గము గలదు.

అవిచ్ఛిన్నమైనట్టియు, చక్రవాళ పర్వతమువలెనున్నట్టియు, తూర్పునుండి పశ్చిమమునకు వ్యాపించియున్నట్టియు, ఇంచుమించుగా సమానాంతర కోణము లొకదానితో నొకటి మేళవించియున్నట్టియు పర్వత పంక్తియందలి రెండేటవాలు ప్రదేశములు పర్వతములుగా భాగింపఁ దగినప్రదేశమందీ దుర్గము నిర్మింపఁబడినది.

వ్యవహార సంగ్రహార్థముగ నుత్తరమునగల పర్వతమును „గుఱ్ఱములకోనేరు (Horse pond) కొండ" యనియు, దక్షిణమునఁగల పర్వతమును „రాచకొండ" లేక „కచేరీ కొండ" యనియు పిలచెదరు. „గుఱ్ఱముల కోనే" రను పర్వతమునకు „నాగానాయని కొండ" యనియు బర్యాయ పదముగలదు. గుఱ్ఱములకు నీరుపెట్టుటకుఁదగినకోనేరులుండుటచేత „గుఱ్ఱముల కోనేరుకొండ" యనియు, రాజులకచేరికి దగినది కావున „రాచకొండ" లేక „కచేరీకొండ" యని నామములు గలిగియుండును.

ఈపర్వతశ్రేణి తత్ప్రాంతపులోయకంటె దాదాపుగా నైదారు వందల యడుగుల యెత్తుఁ గలిగియున్నది. క్రిందినుండి పైవరకును సోపానపంక్తి పూర్వమొకప్పుడుండినటుల నిష్పటికందందు నిలిచియున్న భిన్నసోపానములు దెలుపుచున్నవి. పూర్వ మొకప్పుడు పెద్ద తటాకమై యుండియు కాలక్రమమునఁ బూడిపోయి, యెత్తువిల్వైగాగుంటకు మాత్రమే శేషించియున్న ప్రదేశము వఱకు నీసోపానపంక్తి కానవచ్చుచున్నది.

రాచకొండ దుర్గమునఁ బ్రవేశించుటకు పశ్చిమమున నొక సింహద్వారముగలదు. ఈద్వారము సుదృఢములగు గోడలచే నిర్మింపఁబడియున్నది. ఈభిత్తికలు చెక్కనపురాలచే దనరారుచున్నవి. కాని ఈరాలను గోడగా బొందించుట కెంతమాత్రము సున్నముగాని, మన్నుగాని వాడఁబడలేదు. వెనుక తట్టుకల్పింపఁబడిన మట్టిగోడచే యీరాతిగోడ బలపరుపఁబడియున్నది. మట్టిగోడపూర్వమొక తటాకముగా వాడుకొన బడియుండిన నుండవచ్చును; కాని ఇప్పుడు పోలిక మాత్రమే మిగిలియున్నది.

ఈప్రాకారదక్షిణభాగాంతమందు కొద్దిపాటి సోపానముల తోడను, ఎత్తగు స్తంభములతోడను నిర్మితమైన నొకద్వారముగలదు. ఈద్వారమునకుత్తరమున నొక పాణిద్వారముగలదు. ఈ పాణిద్వారముపైఁ గలకప్పిప్పటికి శిథిలముగాలేదు. ఈ ద్వారమునకు వాడఁబడిన రాళ్లు స్నిగ్ధములై ౧౨౧/౨ అడుగులపొడవు, ౧ అడుగు ౧౦ ఇంచుల వెడలుపు ఒకటిన్నర అడుగు మందమును గలవిగా నున్నవి.

ఉత్తరభాగాంతమందు నుత్తరముఖముగ నతిపొడవైన ద్వారముగలదు. మూడు ద్వారముల తోడను, ఒకపాణి ద్వారముతోడను విలసిల్లు నీప్రాకారము దాదాపు ౧౨౩/౪ అడుగుల పొడవును, నేలమట్టమునుండి ౧౫ అడుగుల యెత్తును గలిగియున్నది. ఈప్రాకారభిత్తికకు చతుశ్రమస్వరూపములగు నైదు బురుజులుగలవు. అందుమూడు బురుజులు మధ్యప్రదేశమందును, పడమటి ద్వారమునకుత్తరదిశయందొక్క బురుజును, ఉత్తరద్వారమునకు పడమటి దిక్కున నొక్కబురుజును గలవు.



(వాడుకలో లేని మహమ్మదీయ ప్రార్థనామందిరము.)

ఈపడమటిద్వార మొకపర్వతమునకు దక్షిణభాగాంతమునఁగలదు. ఈ పర్వతము ,,రాచకొండ'' (Kachari Hill) యొక్క పశ్చిమోపత్యక (Western Slope) నుండియు, ,,నాగానాయనికొండ'' (Horse Pond Hill) యొక్క పశ్చిమభాగాంతమునుండియు విజృంభించినది.

ఈమూడు పర్వతములయొక్క బహిఃపార్శ్వము నైసర్గికప్రాకారస్వరూపము దాల్చియున్న భాగములు దప్ప తక్కిన ప్రదేశమంతయును స్నిగ్ధశిలలచే సుదృఢములుగాఁ జేయబడినవి.

,,రాచకొండ, నాగానాయని కొండలు వరసలు దీనిప్రాకారముచే'' సురక్షితములై యున్నవి. కొన్నిప్రదేశములందీవరసలు షట్సంఖ్యాకములై యున్నవి. ఇట్టివరసలంతర్భాగమునం దునను గలవు.

పడమటి ద్వారమునుండి ,,రాచకొండ'' దుర్గములోనకు బ్రవేశించుట తోడనే ఎడమవైపుకొన్ని సోపానము లగపడును. ఆసోపానముల ననుసరించితిమేని రాతికోటవెనుక గట్టబడిన ప్రాచీనతటాకపు కట్టక్రింద గల త్రోవకుఁ జేర్పును. ఆత్రోవ ననుసరించినవారొక చిన్నదేవాలయముఁ గాంచెదరు. ఆదేవాలయము నందలి మూర్తి శ్రీరామచంద్ర మూర్తి. కొంతకాలము క్రింద నొకానొక వృద్ధుడును, భక్తుఁడునగు నర్చకుడు పర్వతమునధిరోహింపఁజాలక ప్రార్థింపగా నిచ్చట కవతరించెనని యచ్చటి స్థలజ్ఞులు చెప్పెదరు.

ఈదేవాలయమునకు దూర్పున గొలఁది దూరములో ,,నాగానాయనికొండ'' యొక్క దక్షిణోపత్యక యందొక గండశిలపై పెద్దయక్షరములతోఁ జెక్కఁబడిన తెనుగు శాసనమును, ఆశాసనమునకు వామభాగమున హనూమానువిగ్రహశిల్పమును గలవు.

ఈపడమటిద్వారమునుండి తూర్పుదిక్కున కేఁగుమెట్లననుసరించితిమేని కుడిపార్శ్వమందొక శిలపైఁ జెక్కఁబడిన చిన్నశాసన మొకటికాన్పించును.

ఈమార్గమునే యనుసరించి నడచినవో కుడిపార్శ్వమునఁ గొన్ని గృహచిహ్నములిప్పటికిని గానుపించును. గోడలయందు తోరణములు (Arches) దీర్చిన గూళ్లింతయు రమణీయములై యున్నవి. ఆగోడలపై, అగూళ్లపై చేసిన గచ్చు పని యిప్పటికిని పూర్వపు శోభను ప్రకటించుచున్నది.

మఱియు గొంచెము దూరమేగగా వాడుక యందు లేని మహమ్మదీయ ప్రార్థనామందిరము (Mosque) కానుపించును. దీనికి నాలుగున్నతములగు నల్లని రాతి స్తంభములు గలవు. పూర్వమిది యొక దేవాలయముగానుండెను. ఇప్పటికి దేవాలయ స్వరూపము పూర్తిగామారలేదు. ౧౫౫౫ వ హిజ్రీయందు తురకలీ దేవాలయమును కొంచెము మార్చి మసీదుగా జేసుకొనిరి. దీనికిగల నాలుగు స్తంభముల బోదెలుప్రత్యేకశిలానిర్మితములు, స్తంభములు మాత్రము సాధారణశిలామయములు. చతుష్కోణయుతములగు నీస్తంభముల అడుగు భాగములు మానవాకారశిల్ప విరాజితములు. ఈస్తంభముల కీశిల్పము లవలంబనములుగానున్నవి. కాని దేవాలయమును మసీదుగా మార్చునపుడీ విగ్రహములుండ గూడదని అతినిపుణముగానుళ్లచే ఆకారముల జెరపిరి, ఏలయనగా పూర్తిగా జెక్కివైచినచో నిరాలంబనములై స్తంభములు గూలిపోవును.

దక్షిణస్తంభము యొక్క తూర్పు భాగమున, చతుశ్రమముగా నుండిన పరిమితప్రదేశమున, ఆరబ్బీ భాషలోఁ జెక్కఁబడిన శాసన మొకటిగలదు. ఆశాసనమందీవాక్యములు గలవు:—

,,ఓభగవానుఁడా! నీయాయువునందొకభాగమాతనికిమ్ము! నీవీక్షణముచే నాతని నాశీర్వదింపుము! ఈజన్మ మందును, రాఁబోవు జన్మమందును ఆతని నిలుబ్ధత్వమునుండి గాపాడుము! ఆతనియందు విచారణాశక్తి, వివేకము, (ఉపాయములయందు) అనురూపత నీ దివ్యజ్ఞానముచె నాతనకిమ్ము, పరములయందు జేర్చిపెట్టుము! నీయనుగ్రహముచే నాతని శభ్యుదయమును, మహోన్నత స్థితిని, మఱియు నాతనికి సార్వభౌమప్రతాపమును నీయౌదార్యముచే గూర్పుము! నీయభిమతానుసారముగా వర్తించుట కాతనిని ప్రేరేపింపుము! ఈమసీదును నిర్మించినట్టియు, ముబారిక్ పుత్రుఁడైనట్టియు మలిక్ నిమాన్

అను పేరు గలిగినట్టియు నాతని కొఱకు స్వర్గద్వారము తెఱచి యుంచుము! దేవుఁడాతని, అతని తలిదండ్రుల యపరాధములను క్షమింపుఁగాత!"

"౨౨ వ సఫర్ ౧౦౫౯ హిజిరి"

ఈశాసనమును బట్టి ౧౬౪౯ వ సంవత్సరమున సీమసీదు నిర్మింపఁ బడినట్లు తెలియుచున్నది. ఈమసీదుయును, మఱియొక శిథిల హైందవ దేవాలయమును "నాగానాయనికొండ" పశ్చిమాభిముఖముగను, పశ్చిమ సింహద్వారమునకు దక్షిణపు చివరగా నిలచియున్న పర్వతమునకు మధ్యచప్పరము (మిద్దె) వలె నిలిచియున్నవి. ఈచప్పరము యొక్క దక్షిణపు భాగము అసంస్కృత మైనట్టిదియు దీర్ఘ మైనట్టిదియునగు రాతిగోడచే రక్షింపఁ బడుచున్నది. ఈగోడకు రెండు చిన్న వాకిళ్లుగలవు. ఆవాకిళ్లు దక్షిణ దిశయందలి యొకయిఱుకగు పల్లపు భూమికి (కనుమకు) త్రోవనిచ్చును.

## కచేరి కొండ (Kachari Hill)

మహమ్మదీయ ప్రార్థనా మందిరము ముందు నుండి కొన్ని నిమిషములు పర్వతోపత్యకనధిష్ఠించినచో "రాచకొండ దుర్గప్రకారమునకు ప్రథమ ద్వారమగుపడును.

అచట కుడివైపు గూడువంటి ప్రదేశమున చతుర్బాహుయుతుండును, దిగంబరుండును నైన భైరవుని విగ్రహము నిలిచి యున్నట్లుచిత్రింపఁబడిన శిల్పమగుపడును. దక్షిణ హస్తములలో నొకదానియందు డమరుకము, రెండవదానియందు కత్తివంటి సాధనమును, సవ్య (ఎడమ) హస్తములలో నొకదానియందు త్రిశూలమును, మఱియొక దానియందు మానవ మస్తకమును గలవు. కటిప్రదేశమున మానవమస్తకమాలయును, వామ పార్శ్వంమునందు పవిష్టయైన నొక స్త్రీ విగ్రహమును కానుపించును.

అచటినుండితత్తర్పిదేశో చితవక్రమార్గములను, సిరుగుడులను దాటిన పిమ్మట రెండవ ద్వారమగపడును. ద్వారముపైన పెద్దగండశిల కప్పుగా నుండుటచే ప్రదేశము మహాభయావహమైగన్పట్టును. ఈద్వారమునకు కొంచెము వెనుక రాతిస్తంభములును, రాతికప్పునుగల మఱియొక ద్వారముండుటచే దీనిని "జంటవాకిళ్లు (Double gateways)" అని వాడెదరు. ఈద్వారమున కెదురుగ చూచువారికి కుడిప్రక్కనగల చిన్నకొండ యందొక శాసనము పెద్దతెనుఁగులిపిలోఁ జెక్కఁబడినది గలదు. దాని వామపార్శ్వమునందొక భైరవ విగ్రహము గలదు.

కొంచెము దూరము మీదికినడచి, మఱికొన్ని వక్రమార్గముల గడచితిమేని, మూడవ ద్వారము దృగ్గోచరమగును. ఈద్వారమున కెదుట పెద్దరాతి గోడలును, అవరణమును గలవు. మార్గమున కిరుప్రక్కల నెత్తగుస్తంభములును, చదనగు తిన్నెలు (Platforms) ను గలవు. ఈమార్గము తిన్నగ తూర్పు దిక్కునకు బోవును.

ఎడమ భాగమునందు కొంచెము దూరమునఁగల పెద్దరాతికి దక్షిణమున గరుడుని విగ్రహ మొకటి చిత్రింపబడియున్నది. దక్షిణభాగమున చక్రము, వామభాగమున శంఖము నావిగ్రహము ధరించియున్నట్లు చిత్రింపఁబడియున్నది. భక్తిచే చేతులను మోడ్చి యున్నటులను, ఎగిరిపోవుటకు సంసిద్ధమై యున్నదను! వైఖరి గలిగిన దానినిగా చిత్రించిన శిల్పకుఁడెంతయు సమర్థుఁడు.

ఈగండశిలకు కొంచెము క్రిందుగా, వాయవ్యదిశనొక ద్వార మీశాన్యదిక్కునకు బోవుమార్గము గలిగి గలదు. ఈమార్గము ననుసరించితి మేని కొలది దూరమున మఱియొకద్వార మీ మార్గమునకు సంబంధించినది గాన్పించును. ఇది నాల్గవ ద్వారము. ఈద్వారసామీప్యమందు గల చతురశ్రప్రదేశమున నొకమండపము గలదు. దానికే కచేరియని వ్యావహరించెదరు. ఈమండపమును బట్టియే యీకొండకు "కచేరీకొండ" యను నాఖ్య గలిగినది.

ఈమండపమునకు దక్షిణభాగమున నొకజీర్ణమందిరము యొక్క పునాది మాత్రము గలదు. దీనికి సామీప్యమున తూర్పుదిశయందొక ద్వారముగలదు. ఇదియే చివరి ద్వారము. ఈద్వారము పర్వతాధిత్యక యందలి కర్కశపాషాణతలమున గలదు. దీని కిరుపార్శ్వముల యందును శిలాకుడ్యములు గలవు. దీనికి తూర్పుదిక్కున నిరువది గజముల దూరమున నొక కొండబీట (cleft) గలదు. ఇది రమారమి 3½ అడుగుల పొడవును, ౨ అడుగుల వెడల్పును గలదు. ఇందలి నీరు తిమధురమును, శీతలముగను నుండును. వేసవియందయిన నీరింకబోరదు. ఇట్టి నీటిపసరులు కొండపైనను, క్రిందను చాలదిక్కుల గలవు.

పర్వతోపరిప్రదేశమున గొన్ని బావులు, శిథిలగృహముల గోడలు కానుపించును. పర్వతముయొక్క దక్షిణ

పుకేటవాలునందు మఱిమూడు ద్వారములు గలవు. ఇవి కొండలోయలలోనకు బోవు మార్గములను సంబంధించి యున్నది.

నాగానాయని కొండ. (Horse Pond Hill)
దీనిని "గుఱ్ఱముల కోనే" రని, "నాగానాయని కొండ" యని జనులు వ్యవహరించెదరని వ్రాసియుంటిమి. "గాడి బావికొండ" యనికూడ పిలిచెదరు.

"కచేరి కొండ" నెక్కినంత సులభముగా నీకొండ నెక్కుటకువీలుగలుగదు. ఈకొండకు దక్షిణభాగమునందు పూర్వము సోపానము లుండెనను జాడలను మాత్రమే చూడగలము. కాని పర్వతాధిరోహణ కా జాడలెంత మాత్రము సాయపడజాలవు. పశువులొనర్చిన బాటలవెంట దప్ప పర్వతాధిరోహణమునకు గత్యంతరము లేదు.

శ్రీరామచంద్రస్వామి దేవాలయము నుండి కొంచెము దూరము కొండనెక్కితిమేని పర్వత పశ్చిమభాగమందలి పాషాణవేదికఁ జేరెదము. అచట నొక దేవాలయము గలదు. ఇదియొక సామాన్య దేవాలయము. ఈదేవాలయము విగ్రహశూన్యమై యున్నది. పూర్వమైననిది యంతప్రాముఖ్యతగాంచినట్లు కాన్పింపదు. పర్వత మధ్యభాగమున కచేరి కొండ యందున్న గరుడవిగ్రహమువంటి గరుడ విగ్రహము గలయొక గండశిలగలదు. ఈశిలాప్రాంతమందొక దేవాలయముగలదు. ఇదియునంత ప్రాముఖ్యత గల దేవాలయమైనట్లు పొడగట్టదు.

ఇందుగల దేవాలయము లన్నింటిలో శ్రీరామచంద్రస్వామి యాలయమే ముఖ్యమైనయాలయము. ఈపవిత్రమగునాలయమును గుఱించి మేమిదివఱకే కొంచెము సూచించియున్నారము. ఈదేవాలయమునకు మండపము, అంతరాళము, గర్భ గృహములు గలవు. మండపము చుట్టు తెఱ గోడగలదు. మండపమున బ్రవేశించుటకు తూర్పున నొక పెద్దద్వారము, ఉత్తరమున నొక చిన్న ద్వారముగలవు. మండప మధ్యయందు ౧౦ అడుగుల ౪ అంగుళముల చదరముగల చాపరాతిపై నాలుగు స్తంభములు గలవు. వీని ప్రక్కయందు గరుడుని యొక్కయు, హనుమానుని యొక్కయు విగ్రహములు గలవు. గర్భాలయపు గోడలేమి, ఇతరభాగములేమి చూచుటకు మిక్కిలియందము నున్నవి. గర్భాలయముపై సువృథమైన శిఖరముగలదు. ఇదిరాతితో సోపానములవలె వరసలు దీర్చికట్టబడియున్నది. శిఖరమునకు చతుఃపార్శ్వములయందు సన్నని బుడే దారిపని చిత్రించిన అంచులుగలవు. శృంగములు మొదలగుపైమిక్కిలి పని కాలగర్భమును శరణ్యముగాఁ గొనుట చేశిఖరమిప్పుడు బోడిగా గాన్పించుచున్నది. చాళుక్యదేవాలయములవలె ప్రత్యేక స్వరూపముతో నుండక యీదేవాలయము చీన దేవాలయముల స్వరూపమునే జాటుచున్నది. పూర్వపు స్వరూపము శిఖరముయొక్క రెండు భాగములు మాత్రమే తెలియఁ జేయుచున్నవి; క్రిందిభాగమున సోపానములు మాత్రము గలవు.

రాచకొండ యందలి యితర దేవాలయముల వలె ఇతర సౌధములవలె నీదేవాలయ నిర్మాణమునందు సున్నమువాడఁబడలేదు; కేవల శిలలచే నిర్మింపఁ బడినది. అయినను అమర్పఁబడిన రెండుశిలలకు మధ్యనెంతమాత్రము సంధిలేదు. అంతరాళములో దక్షిణ భాగమందమర్పఁబడిన (7′ × I′)B.E. రెండు చాపరాళ్లు పనివాని సామర్థ్యమును చాటుచున్నవి. చూచు వారికీశిలలు మొన్న మొన్ననే యమర్చియుంచిరను ననుమానము గలుగును. ఈదేవాలయము ౧౨ వ లేక ౧౩ వ శతాబ్దమునందు నిర్మించియుండురు. అంతకు పూర్వము నిర్మించిరనుటకు తగినంత విశ్వాసముగలుగదు.

దేవాలయ పురోభాగమున—పాషాణ ప్రదేశమున రెండుగీటలు—౯ అంగుళముల వెడల్పు ౧ అంగుళములోతుగలవి—సమానాంతరములచే పూర్వము దేవుడీమార్గము వచ్చుటచే గలిగిన రథ చిహ్నములని యచ్చటివారు జెప్పుచుందురు.

దేవాలయమునకు తూర్పునఁ గొంచము దూరములో నిడుపువాటుగానున్న యొక బావిగలదు. ఈ బావికి పశ్చిమమున నొక ద్వారముగలదు. ఈబావిని "గాడిబావి" (Horse pond) అని పిలిచెదరు. దీనినే "గుఱ్ఱముల కోనే" రనియు వాడెదరు. ఈబావి యొక్కయునికి చేతనే ఈగుట్టకు "గుఱ్ఱముల కోనేరు కొండ" (Horse Pond Hill) అని పేరువచ్చినది. దుర్గమునందు సేనయున్నదినములలో నీబావియందే గుఱ్ఱముల, కేనుఁగులకు నీరు బెట్టుచుండిరి. కచేరికొండ పయినున్నటులనే యీకొండ

పైనను వఱ్ఱు మొదలగు వానిని దంచుటకు, నూరుకొనుటకు ననువగురోళ్లు గలవు.

పర్వతముపై ప్రవేశింపరాని స్థలము గలదనియు, నక్కడ రెండుగండశిలల మధ్యనొక బిలముగలదనియు, నాబిలములోనకు దృష్టిబరపినచో శిలావిగ్రహములు గానవచ్చునని యచటి జనులు వాడుకొని యెదరుగాని సాధారణముగా నాప్రదేశమే కానుపింపనందున దానినిజమెంతవరకో తెలిసికొనుట కొంతప్రయాసజనకమే యగును.

కచ్చేరి కొండపైనను, ఈనాగానాయని కొండపైనను దుర్గములు నిర్మింపఁబడియున్నవి. ఈకొండల పశ్చిమదిశలయందంతరము సుమారు ౪౩౦ మైళ్లుగలదు. కాని పశ్చిమ ముఖమునకు వెనుక వెనుక నేటవాలుగానున్న మట్టిదిబ్బక్రింద తూర్పు భాగమునుండి ౧౨౯౦ మఱియు ౧౫౩౦ అడుగుల దూరమున, మఱియు తూర్పు భాగమున నొకటి రెండు ప్రదేశములయందీ రెండుకొండలు మిక్కిలి సమీపించియుండును. ఇటుల సమీపించినచోటుల యందు కొన్నిదిక్కుల నడ్డముగా గట్టులు వేయఁబడియున్నవి. దీని చేవరుసలుదీరి యనేక తటాకములున్నటుల గాన్పించుచున్నవి. పూర్వమీరెండు కొండలకు మధ్యనీరు నిలిచియుండెడిది. పశ్చిమభాగమునఁగల తటాకోదక మిప్పటికిని కృషికుల సస్యాదులకుపయోగపడుచునే యున్నది. దీనికి తూర్పుభాగమిప్పటికిని తటాకముగనే యున్నది. దీనికింక నుతూర్పున నొకకట్టమాత్రము మిగిలియున్నది; కానిఅచ్చటచ్చట గండ్లుపడియున్నది. తూర్పుదిశనుండి రాచకొండకు చక్కగా వెళ్లుటకీగండ్లుపయుక్తమార్గముల నిచ్చుచున్నవి. ఈతటాకముల బోలిన ప్రదేశములందు నీరుపూర్ణము నిలిచియుండెననుట కిప్పటికినందుగల గండశిలలకు ౭ అడుగుల, ౧౦అడుగుల యెత్తున గట్టియున్న నీటిచారికలగుఱుతులే సాక్ష్యమునిచ్చుచున్నవి.

పిల్లత్రోవ సగము దాటిరాగా పెద్దగండశిలయొకటిగలదు. ఈశిలకు తూర్పుభాగమున పెద్దతెనుఁగు అక్షరములతో నొకశాసనముగలదు. ఈశిలకు వామపార్శ్వమున పెద్దభైరవ విగ్రహమొకటిగలదు. ఈవిగ్రహము మోకాలువరకు భూమిలో పాతుకొని పోయియున్నది. ఈప్రదేశమున 3 అడుగుల మందమడుసు గలదు.

## లోయయందలి పరిశిష్టములు

పైనుదహరించిన గండశిలకు కొంచము దూరమున నొకచిన్న ద్వారమొకటి గలదు. ఆద్వారమున ననుసరించి సోపానపంక్తి గలదు. ఆసోపానముల ననుసరించిన్చో తూర్పుకొండ క్రిందికి జేరెదము. అందుగల చిన్నవాగును దాటి నడచినచో ప్రాగ్భాగమునఁగలలోయఁ బ్రవేశింతుము. ఆ లోయయందనేకములగు జీర్ణదేవాలయములు, శిథిలములై పోయిన గృహములుగానవచ్చును.

ఇచటి జీర్ణదేవాలయములన్నింటిలో నొకవిష్ణ్వాలయము ప్రాముఖ్యతగాంచినది. అన్నిటికంటె నిది విశాలమైనది. దీని పొడవు ౪౯ అడుగుల ౪ అంగుళములు; వెడలుపు ౩౪ అడుగులు. లోపలిభాగమునందొక మండపము, వెలుపల ౧౨-స్థంభములును గలవు. చదరముగా నమర్పబడిన నాలుగు స్థంభములతో మండపము విరాజిల్లుచున్నది. ఈదేవాలయమునకు గర్భాలయమును, పురోభాగమందొక గదియును గలదు. వెలుపలి స్థంభములు తెఱగోడపైన నమర్పఁబడి, పెద్దపెద్ద చాపరాలతో పోటీలు (Supports) పెట్టఁబడియున్నవి. ఈయాలయమునకుత్తర, దక్షిణద్వారములు రెండుగలవు ఈద్వారములయొద్ద తెఱగోడకు సమపు ఎత్తుగల యడ్డగోడలమర్పఁబడి వాని యంతరాళమున సోపానములమర్పఁబడియున్నవి. ఇటులనే యడ్డగోడలమధ్య నమర్పఁబడిన సోపానపంక్తి పశ్చిమదిక్కునను గలదు కాని, వెలుపలి మండపద్వార మాప్రక్క నుండుటచే ఆద్వారమునకు సంబంధించిన తెఱగోడ యుత్తర దక్షిణములకు వ్యాపించుటచే మూయబడిపోయెను.

ఈతెఱగోడ వెలుపలననేక శిల్పచిత్రములు చిత్రింపఁబడియున్నవి. మానవాకృతులు, పుష్పములు, గజములు మున్నగునవి చిత్రపటములను కట్టుచట్టములలో నిఱికించినట్లు చిత్రింపఁబడియున్నవి. శృంగారింపఁబడిన గజములు; గజము, మనుజుఁడు పోరాడుచుండుట; వాద్యములవాదించుచున్న మనుజులు, నటులు; గంధర్వులు మొదలగు ననేక చిత్రములు మనకమితానందముఁగొల్పును. అన్నియు మిక్కిలి దక్షతతో చిత్రించిరి. అన్నిటికంటె గజములతిలోచనలోభనీయములుగా నున్నవి.

అంతరాళమండప ద్వారము మిక్కిలి విశాలముగా లేకున్నను రామణీయకముగా నున్నది. ద్వారస్తంభములు చతుర్ముఖములు గలవిగను, క్రింది భాగమున స్త్రీపురుష విగ్రహచిత్రితములుగను నున్నవి. ఈ ద్వారముపై వితానశిల మిగుల నందమగు చెక్కడపు పనిచేతను, దక్షిణ, వామభాగములయందు చక్రశంఖచిత్రవిచిత్రితముగను నున్నది.

ఈ యాలయము పిమ్మట లెక్కింపఁదగిన దొకశివాలయము గలదు. ఈ శివాలయ మెత్తగు రాతిపునాదిపై నిర్మింపబడినది. ఈదేవాలయపురోభాగమున నల్లని శిలతో జేయబడిన చతుర్బాహు దేవతామూర్తి యొండు గలదు. ఈ విగ్రహము వామహస్తములలో నొకదానిచే మనుజుని వెండ్రుకలను, వేరొకదానిచే డాలును, దక్షిణహస్తములలో నొకదాని యందు భల్లమును, రెండవదానిచే కృపాణమును ధరించియున్నది. ఎదుట సాష్టాంగపడిన మనుష్యునివిగ్రహము భల్లముతో బొడుచుచున్నటుల చిత్రింపఁ బడియున్నది. ఈయాలయ మొక గర్భాలయమును, అంతరాళమును మాత్రమే గలిగియున్నది. లింగము, భిన్నమైన సాలంకము (దీనినే పానవట్టమందురు) లోకమూలఁబడి యున్నవి. ద్రవ్యాపేక్షచే దుర్మార్గు లెవరేని యీకార్య మొనరించి యుందురని తోచుచున్నది. ఈ యాలయపురోభాగమున నొక మహమ్మదీయుని సమాధియు, తూర్పుభాగమున గొంచెము దూరములో నొక శిథిలమైన మసీదును గలవు.

„ కచేరికొండ ” ప్రాగుపత్యక (Eastern Slope) సమీపమున జీర్ణమందిరములు, రాతి కంబములతో గల ద్వారములు, రాతిపునాదులు, కొన్ని జీర్ణసౌధములు గలవు. జీర్ణసౌధముల దక్షిణోత్తరకుడ్యము లింకను కొంతవరకు మంచిస్థితియందే గలవు. ఈదృశ్యములకు వాయవ్యదిశయందొక శిలాద్వారము గలదు. ఈ ద్వారమున నుండి చూచినచో „కచేరికొండ” కుత్తరమున బ్రతిష్ఠితమైన భైరవవిగ్రహసమీపద్వారముపఱకుగల సోపానములు కాన్పించును.

భిన్నమైన చాపరాతిపై శివ, పార్వతుల విగ్రహములు చెక్కబడి యున్నవి. ఆ శిల యచట నేలఁబడి యున్నది. శివుడు తన వామహస్తమును పార్వతి కంఠముపై వైచియున్నాడు. పార్వతీ వామభుజముపై శివుని భారము నిలిచియున్నది. పార్వతి తన దక్షిణహస్తమును శివుని కటిప్రదేశమున నుంచియున్నది. శివ విగ్రహమునకు వెనుక నంది యొకటిగలదు. ఆవిగ్రహము లమితరమణీయములుగా నున్నవి. నంది యొక్క యునికియు, దానిస్థానవైలక్షణ్యము దిదృక్షువులకు నేత్రపర్వ మొనరించును. వేరొక చోట సగపాలు పుడిపోయిన చాపరాతిపై సప్తమాతృకలు చిత్రింపఁ బడియున్నవి. సప్తమాతృకల వాహనములు మిగుల సామర్థ్యముతో చిత్రింపబడియున్నవి.

ఈ దేవాలయములే గాక ౧౨ దేవాలయములింకను చిహ్నమాత్ర శేషములైనవి గలవు. నాలుగేసి స్తంభములు గల రెండు వరుసలు (ఎనిమిది స్తంభములు) ఒకచోట పాతఁబడి యున్నవి. పూర్వము వానికేనుఁగులఁ గట్టనుచుండిరని యచ్చటి వారు తెలిపెదరు. ఈస్తంభములు అయిదున్నర అడుగులయెత్తు గలవు.

## జరుగుచున్న విషయము

ప్రస్తుతము శ్రీరామచంద్రస్వామి వారి దేవాలయమున మాత్రమే పూజ జరుగు చున్నది. ప్రతిసంవత్సరము అరువందల రూపాయల వార్షికము (నారాయణపురము) సంస్థానము వారిచే యొసగఁబడు చున్నది. శ్రీరామనవమి సందర్భమున నుత్సవము (జాతర) జరుగును. ఈ యుత్సవ మొక వారము దినములు జరుగును.

లోయకు తూర్పున, పర్వత పశ్చిమోపత్యక (Western Slope) న వీరభద్రుని (వీరన్న) దేవాలయము గలదు. శివరాత్రి సందర్భమున నుత్సవము జరుగును.

దేవాలయమునకు సంబంధించి సోపానమార్గమునకు సంబాధించి యొకకోనేరు గలదు. ఈకోనేరొకదేవాలయమునకు సంబంధించినదని చెప్పెదరు, కాని ఆదేవాలయము స్మరణమాత్రావశిష్టమై పోయినది.

„కచేరికొండ” కు దక్షిణమున ౪౦౦ గజముల దూరములో „గాలిబుసాహెబు దర్గా” యొకటి గలదు.



శ్రీ రామచంద్రస్వామివారి దేవాలయము. ౨౩ పు. చూడుడు.

ఈదర్గాకు చుట్టుగోడలుగలవు. గుమ్మటమునందు మూడు గోరీలును, ఆవరణమునందు మూడుగోరీలును గలవు. ఇచ్చట ప్రతిసంవత్సర మురుసు జరుగును. ఉరుసు సందర్భమున ౧౦ వేలమంది యాత్రికు లరుదెంచెదరు.

పూర్వపు రాచకొండ ఈశాన్య భాగము నందర మైలు వరకును, ఆగ్నేయమున మఱికొంత దూరమును, దక్షిణమున రెండు మైళ్ల దూరమునఁగల „అక్కపోలకమ్మ'' వఱకును పట్టణముగా వ్యాపించి యుండెననుజాడలిప్పటికిని గాన్పించుచున్నవి.

„అక్కపోలకమ్మ''కడకేగు మార్గమున కిరుప్రక్కలరాతిపునాదులు గలవు. దానిచే వీధు లతివిశాలములై యుండెననియు, ఇఱుప్రక్కల నున్నతసౌధరాజములుండెననియు సులభముగా బోడగట్ట గలదు.

పట్టణము పూర్వము కోటగోడలచే సురక్షితమై యుండినటులను, తటాకములయందలి, వాగుల యందలి జలము శాంతిసమయములయందు కర్షకులకు సస్యోపకారమైనదిగను, సమర సమయముల యందు కేవలపానీయములుగను నుండునటులను పొడగట్టుచున్నది.

## "సుజాత" ప్రబోధము

బాలకవి చిదిరెమఠము వీరభద్రశర్మగారు (కాశీక్షేత్రము)

శ్లో. భూయాదపూర్వ సుకరం సుజనాంధ్రచిత్తే
ధ్యాయే త్కవిత్వ రసికో నితరాం సుకావ్యం ।
పాయాద్గిరీంద్ర తనుజాపతి రచ్యులో వా
జీయా చ్చిరం సులలితా కలితా „సుజాతా'' ॥

శ్లో. విజానీయా దాంధ్రః ప్రవిమలమనా వాఙ్మయధనో
భజ స్త్వేవం నిత్యం పరమమనసా యాచతి హియాం ।
నిజాంరాష్ట్రాంధ్రాణాం నిఖిలసుఖదా గంజతసుధీః
„సుజాతా'' జాతాఽసౌ జనసుఖతరే. భాగ్యనగరే ॥

శ్లో. వాసస్తు భాగ్యనగరే రుచిరే ప్రచారే
నామ్నాపి సుందరతమాఽఽకృత్యా సచిత్రా ।
సంపాదకోఽపి విబుధ స్సవైర్ణ ర్విశేషైః
కిం వర్ణనై ర్బహువిధై ర్ధన్యా „సుజాతా'' ॥

శ్లో. శ్రద్ధాయుతేన మనసా చిరపాఠకోఽసి
చేదాంధ్ర! సత్వరితమేవ భవిష్యతీహ ।
ప్రౌఢా నరంజయతీ ఖలు బాలికేయ
మక్షీణవత్సరశుభే జనితా „సుజాతా'' ॥

శ్లో. „సుజాత'' పత్రికాపుత్రీ
జాతా దాతా నృణాం ప్రియం ।
వ్యాసపీయూష పానార్థం
నిజామాంధ్రో భజేదిమాం ॥

# నిజాంరాష్ట్రనాణెములచరిత్ర

బొంగులూరు నరసింహశర్మగారు బి. ఏ.

మొగలుల రాజ్యవినాశము పిదప ౧౭౫౮ * వ క్రీస్తుశతాబ్దము వరకు హైద్రాబాదురాష్ట్రమునందు ప్రచారములోనున్న నాణెములను 'చల్నీల'నియందురు. 'రషీదుద్దీనుఖానీచరిత్ర' యందు 'చల్నీల'ను గురించి యీక్రిందివిధముగ వ్రాయబడియున్నది. "ఇక్కడ ప్రతిచోట వ్యాపారవ్యవహారములందు 'చల్నీ'లే, ఉపయోగింపబడును. కాని 'చల్నీల'ను ప్రత్యేకనాణెమొకటి అగుపడదు. సుగూరు[1] నాణెము, గద్వాల, గురిమిటకాల, మద్దూరు మొదలగు నామములుగల నాణెములు 'చలన్' అనగా వాడుకయందుండెను కనుక వానినే 'చల్నీల'ని లోకులనుచుండిరి." పైపేర్కొనిన నాణెముల ధరఒకటేయుండెను. ఉపకారవేతనములు, మన్సబులు, ఉద్యోగుల జీతములు, పన్నులు మొదలగునవి యీనాణెములలోనే యిచ్చుపుచ్చుకో బడుచుండెడివి. ఈనాణెములను 'చల్నీల'నియు, 'హాలీచల్నీ'లనియు గూడ అనుచుండిరి.

ఈనాణెములను మూడు విధములుగా విభజింపవచ్చును. కొన్నినాణెములపై ఆయానాణెముల ప్రచారము చేసినవారినామములుండెను. కొన్నిటిపైనాణెములు సిద్ధమైనస్థలముల పేర్లుండెను. మూడవవిధపునాణెములపై కొన్ని సంజ్ఞలుండెడివి. ఈమూడువిధముల నాణెములు క్రిందపేర్కొనబడినవి:

* మొగలులు రాజ్యముచేసిన కాలమునందు, అంతకుపూర్వకాలమునందు ఏదేశమున వాడబడిన నాణెముల చరిత్ర త్వరగానే చదువరుల పఠనకై అర్పింపబడును.

1. ప్రస్తుతము సుగూరును వనపర్తి యందురు.

౧. సిద్ధము చేయించిన వారిపేర్లతో ప్రచార[ము] జెందిన నాణెములు:

౧. పిస్తుకషాహి. ౨. గోవిందబక్షి. ౩. బహద్దు[ర]షాహి. ౪. అక్బరి. ౫. ఆలంగీరి. ౬. షా[హ]జహాని. ౭. సికందరుచల్నీ. ౮. నాసర్‌చల్నీ

౨. సిద్ధమైన స్థలముల పేర్లు పైనచెక్కబడి[న] నాణెములు:

౧. ఆర్కాటీ. ౨. గద్వాలీ. ౩. మద్దూ[రీ]. ౪. ఎల్లారెడ్డి. ౫. గొరిమిటకాలీ. ౬. [..]పురీ. ౭. మాడాకీ. ౮. దౌల్తాబాదీ. ౯. గో[..]పాల్‌పేటీ. ౧౦. ఇందూరీ. ౧౧. చాందూ[రీ]. ౧౨. నారాయణపేటీ. ౧౩. నాగపురీ. ౧౪. [..]గూరీ. ౧౫. దాఫెగాంవ్. ౧౬. అమ రావ[తీ]. ౧౭. బాఘ్‌చల్నీ. ౧౮. షహరుచల్నీ.

౩. సంజ్ఞలుకల నాణెములు:

౧. శ్రీ ౨. తుర్రా ౩. తూఘా ౪. జరీపట్క ౫. తిరునామల్ ౬. సూరతీబాచహారాషాహి (శా[హ]ముఖి) ౭. కల్మాలేక అక్బరి ౮. నధన ౯. త్రిశూలి ౧౦. దోదండి (ద్విశాఖి) ౧౧. పీపల్‌నారీ† ౧౨. జాల్ఫిశా[హీ]

మూడవవిధము నాణెముల నెవరు చేయించిరో, ఎక్కడ సిద్ధమయ్యెనో తెలుసుకొనుట కష్టమైన పని. ఆ నాణెములపై కొన్ని సంజ్ఞలు తప్ప మరేమియు లేవు. పైన పేర్కొన బడిన నాణెముల గురించి అవురంగాబాదు సుబేదారు ౧౩౦౧ వ ఫసలి అనగా ౧౮౯౨ క్రీస్తు శ[కము]

† అవరంగాబాదు గజెటీయరు పు. 727.

# قبل تبدل

ایک جانب — دوسری جانب







# بعد تبدل

ایک جانب — دوسری جانب







# سکہ چرخی نمبر ۱






వత్సరమునందు ప్రభుత్వమువారి క్రింద క్లుప్తముగా గొంత యివ్వబడిన తమ యభిప్రాయముల ‡ దెలిపెను:

౧. గోవింద బక్షీనాణెము: ఈ నాణెము పై నున్న వ్రాత స్పష్టముగా తెలియదు. కాని నాణెము రెండు పక్షములందున్న ,షాహ' అను శబ్దమును,౧౨౩౫' వసంఖ్య, ఒక పుష్పము, ఒక కరవాలము గోచరమగును. పందొమ్మిదవ శతాబ్దమున రాజాగోవిందబక్షీ మంత్రిత్వ కాలమునం దీనాణెము హైద్రాబాదపట్టణ''మునందు తయారు చేయబడుచుండెను. ౧౨౨౮ హిజరీ మొదలుకొని ౧౨౩౫ హి. (౧౮౦౮—౧౮౧౬ క్రీ.శ.) వరకీ నాణెము సిద్ధమగుచుండెడిది. బరువునందు 'హాలీ' కంటె నొక గుంజ తక్కువయుండును. అనగా హాలీ నూరు రూపాయలకు గోవింద బక్షీ రూపాయలు ౧౦౫ అగును. ౧౩౦౧ వ ఫసలీ యందు (౧౮౯౨ క్రీ శ) ఈ నాణెము బిస్మతునగరము భైంసా తాలూకాలయందు వాడబడుచుండెను.

౨. తూకా: దీనిపైనున్న వ్రాత కూడ సరిగా చదువుటకు వీలులేదు. ఒక పక్షమున నున్న ,షాహ' శబ్దము స్పష్టముగా నున్నది. రెండవ దిక్కున నొక కరవాలము ,సన్' అను శబ్దమును కలవు. ఈ నాణెము సిద్ధమైన కాలము ౧౨౩౬ వ హి. నుండి ౧౨౪౩ హి. (౧౮౧౭—౧౮౨౫ క్రీ.శ.) వరకుండ వచ్చును. ఔరంగాబాదు గుజరాథీ వర్తకులు కొందరు ప్రభుత్వము వారి యాజ్ఞ బొంది దీనిని తయారుచేయుచుండిరి. ఔరంగాబాదు అవ్వల్ (మొదటి) తాలూకుదారు దీనిని ,ఖాంగాంవ్' నాణెమనియెను. అక్కడి సువ్వం (మూడవ) తాలూకుదారుగానున్న మౌల్వీ గులామ్ రసూల్‌గారీ నాణెమును మొదలు పెట్టినది తుకారామ్ అనువాడనియు అయన కొన్ని దినముల వరకు ఔరంగాబాదులో నొక గొప్ప పదవిపై నుండెననియు వ్రాసినారు. నాందేడు చుట్టుముట్టీ నాణెము ౧౩౦౧ వ ఫసలీ (౧౮౯౨ క్రీ. శ.) యందు వాడుకలో నుండెను. ఇది ,,గోవిందబక్షీ'' యంతే ఉండును.

‡ రిపోర్టు సూబేదారు సాహెబు ఔరంగాబాదు నం. 1049 తేది 6 వ ఖర్వార్థి ౧౩౦౧ ఫ (1892 క్రీ.శ.) హోమ్ సెక్రటరీ.

౩. పిస్తస్‌షాహి నాణెము. ఈనాణెముపై ,షాహ, ఘాజీ, యను శబ్దము, ఒకగులాబీ పూవు కనబడును. రెండవదిక్కున ,సన్,శబ్దము కరవాలమును † కలవు. రాజాచందూలాలు (౧౮౨౯—౧౮౪౦ క్రీ శ) మరియు నవాబు సిరాజుల్ముల్కు (౧౮౪౩—౧౮౪౫ క్రీ శ) మంత్రిత్వకాలమున పిస్తంజీయను బిరాదతాహుద్దారుడొకడు (గుత్తేదారు) ఈనాణెమును సిద్ధముచేయుచుండెను. ఈనాణెము హైద్రాబాదయందు తయారగుచుండెడిది. ౧౨౫౩—౧౨౫౬ హి (౧౮౩౮—౧౮౩౮ క్రీ శ) ల మధ్యనీనాణెము వాడబడుచుండెను. తూకా గోవిందబక్షీలయంతయే దీని వెల. మొన్నటివరకు హదుగాంవ్ తాలూకాయందు దీనికి ప్రచారముండెను.

౪. సికందరు చల్నీ: ఒక పక్షమున ,మదరషాబాద షాహెఘాజీ' మరియు ,సన్', శబ్దములు కలవు. బహుశః మదరషాహ అను శబ్దము మహమ్మదుషాహవికృతాకృతి యేమో! రెండవతట్టు ,పఖుంచెబుని యాదుమేమనతు, అని యుండును. ౧౨౧౭ హి నుండి ౧౨౮౧హి (౧౮౯౯—౧౮౪౬ క్రీ శ) వరకీ నాణెముతయారయ్యెను. నవాబునికందరుజాహయొక్క పాలనకాలము (౧౮౯౯—౧౮౧౫ క్రీ శ) నందీ నాణెము సిద్ధమగుచుండెడిది. ఇదిహాలీతో సమానమైనది. పర్భని జిల్లాయందుకొన్ని వత్సరముల క్రింద వాడబడుచుండెను.

౫. నథనీ నాణెము: ఒక పక్షమున ,సన్ జాలూసుమేమనతు, (రాజ్యాభిషేక సంవత్సరము) అనియు; కరవాలమును, ఒకముక్కుపోగును కలవు. దీనిని రాజాచందూలాలు బంధువులలో నొకరు సిద్ధముచేయుచుండిరి. ఇది ౧౨౩౬—౧౨౩౭ హి (౧౮౧౮—౧౮౧౯ క్రీ శ) వరకు వాడుకయందుండెను.

౬. అమరావతీ: ౧౨౩౯—౧౨౪౧ హి (౧౮౨౦—౧౮౨౨ క్రీ శ) వరకీ నాణెము ప్రచారమునందుండెను. నాణెముపై నున్న శబ్దముల జదువవీలులేదు. దానిపై నున్న నొక ,కటారు, మాత్రముకనబడును. హాలీకంటె నీనాణెము ధరతక్కువయే.

† ఔరంగాబాదు గజెటియరు 772

౭. సుగూరు నాణెము: దీనిపై 'జా' యను నాగరీ అక్షరము కలదు. దీనిని తయారుచేయించినది సుగూరు సంస్థానపు రాజులే. వాలీకంటె రెండు మాషాలు తక్కువయుండును.

౮. గోపాలపేట నాణెము. 'గో' యను నాగరీ అక్షరము చదువ వీలగును. తక్కిన అక్షరములు తెలియవు. గోపాలపేట యందే సిద్ధమగుచుండెడిది. గోవింద బక్షిఅంత ఉండును.

౯. గద్వాల నాణెము. గోపాలపేట నాణెము వలెనే యుండును. దీనిపై నొక యాళె చెట్టుకలదు, గోపాలపేట నాణెము కాలము దీని కాలము ఒకటే. గద్వాలయందే తయారగుచుండెడిది.

౧౦. నారాయణపేట నాణెము. 'న' అను నాగరీఅక్షరము, 'షాహాఆలం' అను శబ్దములు కలవు. ఈ నాణెపు వెండి ఉత్కృష్టమైనది. ౧౨౧౭ హి॥ (౧౮౦౨ క్రీ. శ) నాణెముగుపడినది. కాల నిర్ణయము దుస్సాధ్యము.

౧౧. తిరునామలీ నాణెము. ఈ నాణెమును నవాబు రకునుద్దౌలా తయారు చేసెను. నిర్మలునంను సిద్ధమగుచుండెడిది. ఇదివాలీకంటె సత్తమ రజతము కలదియు, ఎక్కువ బరువైనదియు నుండెను.

౧౨. గొరిమిటుకాలు నాణెము. ఈ నాణెములు రెండు విధములు. ఒకటి వాలీకంటె నెక్కువ ధరకలది. రెండవది వాలీకంటె మూడుణాలు తక్కువ విలువకలది. గొరిమిటుకాలు జమీందారులచే నా గ్రామమునందే సిద్ధమగుచుండెడిది.

౧౩. బేలాపురీ నాణెము: † ఒకదిక్కు సూర్యుని ముఖముగుపడును. ఎక్కడ తయారు చేయబడు చుండెడిదో తెలియదు.

† ఔరంగాబాద గజెటియర్ P 727.

౧౪. చాందూరీ నాణెము. † పేష్వాలలో నొకనిచే ప్రచారము చేయబడెను. 'శ్రీ' ‡ నాణెముకూడను చాందూరునందే సిద్ధమగుచుండెను. స్వచ్ఛమైన వెండి, బరువునందు వాలీకంటె తక్కువ.

౧౫. మండాక నాణెము. మండాకీ కర్ణాటక ప్రాంతము నందలి ఒక గ్రామముపేరు. ఆగ్రామమునందే యీ నాణెము తయారైయుండును. చాందూరు నాణెముతో సమానముగా నుండును.

౧౬. దౌల్తాబాదీ. ఒక దిక్కు 'బాదుషాఘాజీ' మరియు 'సన్' అక్షరములు కలవు. ఇంకకొన్ని గీతలు కూడ కలవు. లోకులు వానిని దుర్గము సంజ్ఞలని యనెదరు.

౧౭. త్రిశూలీ. సుగూరు నాణెమును బోలియుండును. 'బాదషాఘాజీ' 'సన్' మరియు 'ఏనిమిది చుక్కలు దానిపై యుండెను. పుష్పమువలె కనబడును. నాగరీ అక్షరము 'జీ' మరియొక వైపుకలదు.జీని జీయాజీరావు మహారాజా గ్వాలియారుగా గొందరు తలంతురు. త్రిశూలా కృతికూడ దానిపై గలదు.

౧౮. దోదండీ నాణెము. *దీనిపై చంద్రబింబము, నక్షత్రము గలవు. ఎక్కడిదో ఎవరు సిద్ధము చేయించిరో తెలియదు.

౧౯. ఆర్కాటీ నాణెము. దీని విషయమై కూడ ఏమియు తెలియదు. 'ఔరంగజేబు' నామము మాత్రము కలదు.

† ఈ నాణెము బాజీరావు ఆఖరు పేష్వా కాములలో పూనా, సాతారా యందు తయారగుచుండెడిది. పేష్వాల రాజ్యమునందు, మధ్యరాష్ట్రము లందును రత్నగిరి యందును ఎక్కువ వాడబడుచుండెను. Royal Asiatic Journal of Bengal Vol 22 No 55 P P 198-99

‡ R A J B Vol 22 No. 55-Page 198 ఈనాణెము ౧౮౩౪ క్రీ. శ. లో ఆపివేయబడెను. ఈ నాణెము మధ్య 'శ్రీ' యనునాగరి అక్షరము కలదు.

* బహుళకయిది శివారీపైస (రెండు దమ్మిడీలు) వియుండును.

౨౦. నాగపురపు నాణెము. దీని విషయమై కూడ ఏమియు తెలియదు.

౨౧. జరీపట్కా నాణెము.† పేష్వాల కాలములో నొక సేనానిగానున్న వారీపంతుఫడేయను నాతడు సిద్ధము చేయించెను. మహారాష్ట్రుల శిరోవేష్టము దీనిపై నుండెను. అవరంగా బాదయందు పేష్వాలకాలములో వాడబడు చుండెను.

౨౨. పీపల్‌నారీ. దీనిపై అశ్వత్థ పత్రముకలదు. ఔరంగా బాదయందు వాడబడు చుండెను.

౨౩. జుల్ఫిఖారీ నాణెము. దానిపై నొక విధమగు ఆయుధము కలదు. ఇంతకంటె నెక్కువ దీని విషయమై తెలియదు.

౨౪. వాఫెగాంవ్ నాణెము. దీనికి కూడ ఔరంగాబాదలోనే ప్రచారముండెను.

## రాగినాణెము

వాలీ వెండి నాణెములు, వాలీ రాగి నాణెములు ప్రచారమునకు రాక పూర్వము వివిధ ప్రదేశములందు తయారైన వివిధ నామములు కల రాగిపైసాని వాడబడు చుండెను. వానిని గురించిన వివరములు కలవు కాని వ్యాస విస్తరభీతిచే వివరములు విసర్జింప బడినవి. ఆయాతామ్రనాణెముల పేర్లు మాత్రము క్రింద నీయబడినవి.

౧. పూర్వకాలపు అలంగీరుపైస, అకృతి గుండగ నుండెను. నిజాం అలీఖాన్ కాలములో సిద్ధము చేయబడుచుండెను. (౧౭౬౨—౧౮౦౩ క్రీ. శ)

౨. త్రిశూలి పైస. దీనిపై త్రిశూలము కలదు.

౩. ద్విశాఖపైస. రెండు గీతలు దీనిపై కనబడును ఇది అజంటాయందు సిద్ధమై యుండవచ్చును.

౪. మొద్దుపైస. అలంగీరీపైసకంటె రెండింతలుండును. దానిని 'జామాదీపైస' యని కూడ నందురు.

౫. షాహీపైస. దీనిపై ఏక్షరమును ఉండదు నునుపుగా నుండును.

౬. ఖాల్సాపైస. చందూలాలు కాలమున సిద్ధమైనది.

†R A S J B Vol. 22 No. 55 P 199

౭. కత్తిపైస. అలంగీరుపైస వలెనుండును. సిరాజుల్‌ముల్కు కాలములో వాడుక యందుండెను. ౪ మాషముల బరవు కలది.

౮. పరెల్‌పైస. దీనిని గురించి ఏమియు తెలియదు.

౯. మహాద్వారపుపైస. చంద్ర నక్షత్రములుపై నుండెను.

౧౦ శివారీపైస † ఈపైసాని ఛత్రపతి శివాజీచే సిద్ధము చేయించ బడెను.

అరువది సంవత్సరములకు పూర్వము ఇక్కడి నాణెముల వలన రాజ్యమునకు గొంత యాదాయము వచ్చుచుండెడిది. ‡ ఆ కాలములో ప్రతి భూస్వామియు (జమీందారు) తనపేరు గల నాణెమును సిద్ధముచేయనువ్విష్టాపరచుచుండెడివాడు. నాణెముచేయు హక్కు అమ్మబడు చుండెను. జమీందారులు, నవాబులు ఈ హక్కులను కొని తమ పేరుబెట్టి నాణెముల సిద్ధముచేయించి తమతమ ప్రదేశములందు వానిని వాడ నాజ్ఞాపించుచుండిరి. ఇతర ప్రాంతముల నాణెములా చోట్లయందు చెల్ల శక్యము కాకుండెను.

ఎవరు నాణెముల సిద్ధము చేసినను మొత్తము మీద అవన్నియు డిల్లీరాజ్యపు నాణెములని యనవలసి యుండును. ప్రతినాణెము పైనున్న 'షా' మరియు 'సన్' (సంవత్సరము) శబ్దముల వలన డిల్లీరాజుల యితర నాణెములకును వీనికిని భేదమును కనబడును. నాణెముల సిద్ధముచేసిన జమీందారులు, నవాబులు జాగ్రతకల వారని మాత్రము చెప్పవచ్చును. డిల్లీరాజుల పూర్తి పేరు ఏదాని మీద కూడ నీయలేదు. సంపూర్ణ నామమును చేర్చినచో సిద్ధము చేయించిన వారి గౌరవమేమి కూడ నుండదని వారికి తెలిసియుండెను. ఇటునటుకాకుండనుండిన, నొకవేళ డిల్లీరాజ్యము తిరిగి ప్రబలిన తమగౌరవమునకు లోపమురాదని

† A S J B Vol 20 P P 120 113 223

‡ Descriptive Sketch of H H the Nizam's Dom's by Syed Hussain Bilgrami & Willmott Vol 2 P 56

వారీతీయనాణెముల సిద్ధముచేసిరి. ఇదేకాక మరియొక కారణము కూడ కలదు. ఎన్నోదినముల నుండి లోకులు మొగలునాణెముల కలవాటుపడి యుండిరి. ఒకేసారి మొగలు నాణెపు ప్రత్యేక చిహ్నముల తీసివేసి క్రొత్త నాణెముల ప్రచారమునకు దెచ్చిన, వారియందసంతుకలవరము సంభవించునని దినములు గడచిన కొలది కొంత కొంత మార్పు చేయుచుండిరి.

క్రీ. శ. ౧౮౫౭ సం॥ భారత విప్లవము తర్వాత నేడు వాడబడు హాలీనాణెపు చలామణీ ప్రారంభమయ్యెను. ఈ నాణెమువడువ మొదలైననప్పటినుండి ప్రభుత్వము వారు పూర్వపు నాణెముల నడకను నిషేధించ మొదలు పెట్టిరి. వాని నిచ్చుట పుచ్చుకొనుట శాసన విరుద్ధముగా ప్రకటింప బడెను. † గాని ప్రభుత్వమువారి యాజ్ఞ సక్రమముగా నమలునందు రాలేక పోయెను. తుదకు ప్రభుత్వమువారే పూర్వపు నాణెముల గొనమొదలిడిరి. ‡ గోపాలపేట, గద్వాల, నారాయణపేట నాణెములు హాలీ ౧౦౦ రూపాయలకు ౧౧౦ గను, తూకా, గోవిందబక్షీ పిస్తన్‌షాహి నాణెములు హాలీ ౧౦౦ కి ౧౨౬ గను, సుగూరు నాణెము ౧౩౪ గను, యితర నాణెములు ౧౫౦ గను, మరియు ౧౨౭౨ హి(౧౮౫౬ క్రీ శ) కు పూర్వము తయారైన నాణెముల నన్నిటిని ౧వ ఖుర్దాదు ౧౩౧౪ ఫ (౧౯౦౫ క్రీ. శ) వరకు ప్రభుత్వము వారి కమ్మబడవలెనని చాటబడెను. ఆతేది గడచిన తరువాత పూర్వపు నాణెముల వాడిన వారు శిక్షింప బడుదురని తెలుపబడెను. ౧౩౧౪ ఫ (౧౯౦౫ క్రీ శ) పిదప పూర్తిగా హాలీ నాణెముల వాడుక మొదలయ్యెను*.

## హాలీ నాణెముయొక్క చరిత్ర

హాలీ సిక్కాలు రెండు విధములు: ఒకటిపూర్వపు హాలీ సిక్కా; రెండవది ప్రస్తుతపు హాలీ. పూర్వపు హాలీ సిక్కాలనగా ౧౨౭౨ హి॥ (౧౮౫౬ క్రీ శ) కి పూర్వము హైద్రాబాదునందు సిద్ధమైనవి. వానిపైనున్న ,సీన్' లేక ,నూన్' ,రాజూపేరు' సంవత్సరము స్పష్టముగా కనబడును. హాలీసిక్కా, ఖుర్షీద్జా వ్రాతనుబట్టి నవాబు నాసిరద్దౌలా కాలము(౧౮౨౯—౧౮౫౭ క్రీ శ) నుండిచలామణిలోనున్నటుల గోచరమగుచున్నది. కొన్ని నాణెములపై ,సీన్' అక్షరమును ,౧౨౨౫ హి' (౧౮౧౦ క్రీ. శ.) యునున్నందున మూడవ నవాబు సికందర్జా కాలములో (౧౮౦౩—౧౮౨౯ క్రీ. శ.) ఏ నాణెము జన్మమొందినటుల నూహపరుగిడుచున్నది. ప్రస్తుతపు హాలీ సిక్కా మూడు జన్మముల నెత్తినది. ప్రథమ జన్మమున దానిపై ,నిజాముల్ ముల్కు ఆసఫజా బహద్దురు' అని ఒక వైపునను, ఇంకొక వైపున ,సంవత్సరము' ,హైద్రాబాదు' అనియు నుండెను. దీని విషయమై ఖుర్షీద్జా మంత్రి (౧౮౫౩—౧౮౮౩ క్రీ. శ.) గారీ విధముగ వ్రాసిరి.

,,భారత విప్లవానంతరము డిల్లీ రాజులకు రాజ్యభ్రష్టత కలిగినందున చలామణిలో నున్న నాణెములయందుమార్పుకలిగించుట అవసరమయ్యెను. శ్రీనిజాంగారి కోరికపై అప్పుడున్నగవర్నరుజనరల్ క్రొత్త నాణెమును ౧౨౭౫ హి (౧౮౫౮) నుండి ప్రచారము చేయుటకు సమ్మతించెను. అప్పటినుండి బహద్దురుషాహా పేరట నున్న నాణెములాపి వేయబడెను. పైనచెప్పబడిన విధమున, ప్రథమదశయందున్న ప్రస్తుతపుహాలీవాడబడ మొదలయ్యెను. దీనికి సంబంధించిన అర్ధరూపాయి, పావుల, బేడ, అణా, ఏగాని, (పైస, హైద్రాబాదుది) తయారు చేయబడెను. వెండినాణెములవలెనే బంగారు నాణెములు కూడ సిద్ధము చేయబడెను. ఈబంగారు నాణెముల వెల స్థిరముగా నుండక బంగారుధరతో బాటు, లోకులయవసరములను బట్టి హెచ్చుచు తగ్గుచు నుండెడిది. ౧౨౭౪ ఫసలీ(౧౮౬౫ క్రీ శ) నుండి హాలీ నాణెమునందే రాజ్యపులెక్కలు వ్రాయ మొదలు పెట్టబడెను.

---

† Vide Circular No 12, 1291 H (౧౮౭౪ క్రీ. శ) See 31, 81 Revenue and Finance Regulations Compiled by Nawab Azeez Jung Bahadur.

‡ Vide Finance Circular No 94 Dated 21 Aban 1313 F (1904 A D)

* Vide Finance Circular No 2 Dated 6th Dai 1315 F (1906 A D)



రాజరాయాన్ సర్ కిషన్‌ప్రషాదు మహారాజా బహాదుర్,
యమినుస్సల్తనత్, జి. సి. ఐ. ఇ.
ప్రభుత్వసభాధ్యక్షులు (సదరు ఆజం)

ఔరంగాబాదునూ బేధాను ౧౨౯౬ హి (౧౮౭౯ క్రీ. శ) కి పూర్వపుహాలీలను పురాతన హాలీలనియు, ౧౨౯౭ మొదలు ౧౨౯౬ హిజరీ (౧౮౮౦—౧౮౭౯ క్రీ. శ) వరకున్న నాణెములను ,మెరుపు నాణె, మనియు ౧౨౯౬ నుండి ౧౩౦౧ హి (౧౮౭౯—౧౮౮౪ క్రీ. శ.) వరకు వాడుకలో నున్నవానిని 'బోటా, అనియు, ఆకాలములోనే వాడుకయందుండి అక్షరములు అరగిపోయినవానిని ,కల్ షట్, అనియు, పగిలిపోయినవానిని ,కల్ జహారా, అనియు, గుంటలుపడిన వానిని ,చక్నా, అనియు, ఎక్కువ బరువుగల వానిని ,నఖలీ, అనియుతెనరిపోర్టులో వ్రాసెను.

ప్రథమ జన్మమందున్న హాలీలను కోటివారెల్లరును వెండి బంగారముల గౌసంగికూలీపై టంకసాలయందు తయారు చేయించుకొను చుండిరి. దీనివలన దేశమునందు ,నఖలీ, రూపాయలు సిద్ధమగుటకవకాశముకలిగెను. మంచిచెడ్డ నాణెముల వివక్షణకష్టమయ్యెను. ప్రజలసంశయనివృత్తికై నాణెముల తయారుచేయుటకొఅకు సర్కారువారొకయంత్రమును దెప్పించిరి. దీనిపై చేయునాణెములు ,చర్ఖి, నాణెములని ప్రసిద్ధికెక్కెను.

౧౩౧౩ వ ఫసలీ (౧౯౦౪ క్రీ శ)లో ప్రస్తుతపుహాలీ రెండవజన్మముదాల్చెను. అప్పటినుండి హాలీ ,సిక్కామహబూబియా, అనబడసాగెను. ఆసంవత్సరమునందే హాలీరూపముకూడమారినది. ,చర్ఖి, రూపాయికి సంబంధించిన చిన్న నాణెముల వలెనే సిక్కా మహబూబియా పావులా, బేడ, అర్ధణా, ఎగాని, సిద్ధమయ్యెను. ౧౩౨౫ హి (౧౯౦౭ క్రీ శ) నుండి ,చారుమినారీ అషరఫీ, (బంగారునాణెము) కూడ తయారయ్యెను. ప్రజలకోరికపై సర్కారువారు యితరములగు చిన్నబంగారు నాణెముల కూడ సిద్ధపరచిరి. ౧౩౧౮ ఫసలీ (౧౯౦౯ క్రీ శ) ,చరఖీ,యు, ప్రథమ జన్మమునందున్న హాలీయు నిషేధింపబడెను. ౧౩౨౨హి (౧౯౦౩ క్రీ శ)యందు సుల్తాన్‌షాహివీధి యందదివరకున్న టంకసాలఇప్పుడున్న స్థలమునకుఅనగా సైఫాబాదకు మార్చబడెను. మహబూబియా సిక్కా ఇప్పుడున్న హాలీనాణెమువలెనే ఉండును, కాని రూపాయికొక వైపునందుండు చారమినారు మధ్యఅరబీ ,మీమ్, అక్షరముండును. రెండవవైపు ఫర్బుండెబునియాదు హైద్రాబాదు జులూసెమేమనత్ మానూసు, అనియుండును.

౧౩౨౧ ఫసలీలో (౧౯౧౨ క్రీ. శ) హాలీమూడవ రూపముగైకొనినది. మహాఘనతవహించిన ప్రస్తుతపు నిజాముగారు 'మీమ్, కుబదలు ,ఐన్, చేర్పనాజ్ఞాపించిరి. ౧౩౧౮ వ ఫసలీ (౧౯౦౯ క్రీ. శ)లో రాగిలో పాయి నాణెము సిద్ధము చేయించబడెను. ౧౩౨౧ ఫసలీలో (౧౯౧౧ క్రీ. శ) వెండి అర్ధరూపాయి తిరిగి తయారుచేయబడ మొదలయ్యెను. ౧౩౨౯ ఫసలీ (౧౯౨౦ క్రీ. శ) నుండి నికల్‌తో చేయబడిన అణా † నాణెమువాడుకలోనికితేబడెను. ౧౩౩౦ ఫసలీ (౧౯౨౧ క్రీ. శ) లో ప్రతినాణెముపైనిదివరకున్న :మీమ్,ను తీసివేసి ,ఐన్ పెట్టవలెనని ఫర్మానయ్యెను. ‡

## నిజాం రాష్ట్రపు కరన్సీనోట్లు

౧౦ వ ఇస్ఫెందారు ౧౩౨౭ వ ఫసలీ (౧౯౧౮ క్రీ. శ.) నాడు ,హైద్రాబాదు శాసనసభయందు కరన్సీనోట్లు సిద్ధము చేయుటకై ఒక శాసనము అంగీకరింపబడెను * అప్పుడే కరన్సీనోట్లకు సంబంధించిన నియమములన్నియు సిద్ధము చేయబడెను. శాసనము అంగీకృతము కాగానే పది రూపాయలనియు నూరు రూపాయలనియు నోట్లు ప్రచారమునకు తేబడెను. ¶ ఈ నోట్ల ,నమూనా యిక్కడనే సిద్ధమై లండన్ వాటర్లూ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను. ౧౩౨౮ ఫసలీలో ఒక రూపాయి నోటు జారీ చేయబడెను. ఇంతవరకు ప్రభుత్వమువారు ఏబది లక్షల రూపాయల ఖర్చుపెట్టి యుండిరి. $

---

† Revised regulations of Hyd Coins No. 3 1329 F (1920 A C)

‡ Hyderabad Gazette 3rd Bahman 1330 F (1921 A C) Vol 52 No. 9 P. 86, Part I

* Hyderabad Gazette Dated 10th Farwardi 1327 F. (1918) the Gazette Dated 16th Sherewar 1327 F. (1918 A. C.)

¶ H.G. Dated 6th Tir 1328F. (1919) Vol 50 No 42, P 1773,

$ Hyderabad Gazette Dated 16th, khurdad 1328 F (1919) Vol 50 No 44,

౧౯౨౦ లో ఒక రూపాయి 'నఖలీ' నోట్లు తయారైనందున దానిని వాడకూడదని శాసింపబడెను. ౧౯౨౦ వరకు రెండు కోట్ల నోట్లు సిద్ధమైనవి. ౧౩౩౪వ ఫసలీ (౧౯౨౫ క్రీ. శ) వరకు ౪ కోట్ల రూప్యముల విలువగల నోట్లు వాడబడుచున్నట్లు తెలియుచున్నది.

## ప్రామిసరీ నోట్లు

ప్రభుత్వము వారికి ౪౫ లక్షలు అవసరమున్నందున శ్రీ నిజాం గారి ౧౦ షవ్వాల్ ౧౩౩౫ హి. (౧౯౧౭ క్రీ. శ.) 'ఫర్మాన్' ప్రకారము ప్రామిసరీ నోట్లు అమలులో పెట్టబడెను. ప్రానమిరీ నోట్లు రెండు విధములు. స్వల్ప కాలవు ప్రామిసరీ నోట్లు, దీర్ఘ కాలపు ప్రామిసరీ నోట్లు. స్వల్పకాలపు ప్రామిసరీ నోట్ల సొమ్ము 30 వ అజారు ౧౩౩౦ ఫసలీ (౧౯౨౧ క్రీ. శ.) నాడు సర్కారువారు యిచ్చెదరని తెల్పబడెను. ౧౩౩౦ ఫసలీలో నోట్లన్నియు చెల్లింపబడెను. దీర్ఘ కాలపు ప్రామిసరీ నోట్ల రకము 30 వ అజారు ౧౩౪౧ (౧౯౩౨ క్రీ. శ.) లోపల సర్కారు వారినుండి పొందదగినదిగా నుండునని చాటబడెను. ప్రామిసరీ నోట్లపై మిత్తి నూటికి ఒక సంవత్సరమునకు ఆరు రూపాయలు నిర్ణయింపబడెను. ప్రతి ఆరు నెలలకు మిత్తి (వడ్డి) నిత్తురు. ౩౦ వ ఫసలీ నుండి ౧౫ బహమన్ ౧౩౬౧ ఫసలీ (౧౯౫౨ క్రీ. శ.) వరకు ప్రతి సంవత్సరము నూటికి ఆరు రూపాయల చొప్పున ఏబది లక్షల రూపాయలు అప్పుగా ప్రభుత్వమువారు ప్రజలనుండి ప్రామిసరీ నోట్ల నిచ్చి తీసుకొనిరి.+

---

+ శ్రీయుత మాణిక్యరావు జాగీరుదారు గారి ఉర్దూవ్యాసమున కనుకరణము.

## చిత్తమా!......

కో. వెంకటేశ్వరరావు గారు బి.ఏ.

సరస సంగీతసాహిత్య సఫలమందు
ప్రవిమలానందయుతమగు కవితయందు
చిగురుబోడులముసిముసి నగవులందు
డెందమా! ఇంతయానంద మొందెదేల?
కారుమేఘంబు నింగిని గవయుచుండ
గాఢతిమిరంబు దిక్కుల గ్రమ్ముచుండ
పవను డచలస్వరూపుడై బరిఢవిల్ల
చిత్తమా! నిండుజ్యోత్స్న కాశించెదేల?
దేశదారిద్ర్యమెంతయు తేటపడగ
స్వజనులెందరో ప్రాణము ల్వాయుచుండ
కదనరంగంబు ఘోరమై గానుపింప
హృదయమా! జయకాంక్షనీకింకరమేల?
వకుళమాలల ధరియించి భక్తిభరిత
హృదయుడై తన్మయత్వాన కృష్ణకృష్ణ
దీనరక్షకయని తన వీణమీటు
భిక్షుకుని గాంచ హృదయము వింతయేల?
విమల మధుసౌరభం బెంతొ విస్తరిల్లు
చెంతగల పూలపొదరిండ్ల పొంతజేరి
విరులగోయంగ నెంచితే భీతిలేక
హస్తమా! కంటకావృతిమని యెఱుగవేల!

# ఆత్మవేదనము

శ్రీయుత సముద్రాల రాఘవాచారిగారు.

కేసరీగర్జాప్రకీర్ణశైలగుహాంతరంబుల నొంటిఁ దారాడఁగలను,
రంగదుత్తుంగభైరవ వీచికోల్లోల కల్లోలజలధిఁ జొక్కాడగలను,
విపులతరారణ్య వీథిహోత్రజ్వాల తమితీఱఁదోసిళ్లఁ ద్రావగలను,
విషవహ్నికీలానిభృత నాగరాజఫూత్కృతులలో నమృతమారింపఁగలను,

కానిమామకీనాంఘ్రినికటనివేది
తాతిదీనయాచక పరాభూత ప్రస్త
తరళప్రణయాగ్నికీలికాగహ్యమాన
మానసముగాంచి సహియించలేను నాధ!

సీ. కాలమాహిమగళాలోల భీకరఘంటికానాదమున శ్రుతిగల్పిపాడఁ
కామదాహక కాలగళఫాలనయనాగ్నికణముల నచ్చనగండ్ల నాడఁ
ఘనఘనాఘనగర్భగళితనిర్ఘాతాగ్నికీలిక సికపూవుహోలె తాల్ప
క్రూరపాపక్షుధాక్షుభితజీవోద్విగ్ననిరయంబు దివ్యమందిరమునల్ప

గలను, కానిమన్మానసాగారగుప్త
నైజవిశ్వాసప్రేరణోన్మత్తమనస
సాయకకరాళవేసనాదూయమాన
మానసముగాంచి భరియించలేను నాధ!!

సీ. విలయకాలక్షుధావిలమృత్యుదేవతాపరిరంభమున ముద్దుగుడియగలను,
తతజగత్రయభారధారేయమేరుమహేంద్రంబు కొనవ్రేలనెత్తగలను,
ప్రళయకాలపయోదభయదశిలావర్షయోగమ్మునకు దలయొగ్గఁగలను,
మసలుక్రొన్నెత్తుటంబునగొట్టు వైతరణీనదింబుడిసిటనిల్పగలను,

కాని తనయంత వలచిన కలికిమిన్న
వలపు నంగీకరించి విశ్వాసవరచి
నగ్నగీతమ్ముపాడిననాకృతఘ్న
మానసముతోడ జీవించలేను నాధ!!! (ప్రణయకళలనుండి)

# వడ్డమాను శాసనము

(ఆంధ్రపరిశోధక సంఘము — హైద్రాబాదు)

మహబూబునగరము జిల్లా, నాగరు కంద నూలు తాలూకా, వడ్డమాను పురమందు మూడు శిలాశాసనములు గలవు. అందొక్క దానికి నకలువ్రాసి శ్రీయుత కోవూరుభరతయ్య గారు మాకు బంపియున్నారు. సంఘమువారు సంపాదించిన శాసనములలో నిది నాల్గవ సంఖ్య గలది. ఇది వడ్డమాను పురమందు "తూర్పు గవణి అంచుకు యడమ భాగమునకు అంగడి వీరణం యదట"నున్నది.

ఇది మల్యాల వంశస్థుడగు గుండయ దండ నాథుని దాన శాసనము. శాసనమునందు బీఠికగా తెలుగునందును, తరువాత సంస్కృతము నందు ౪౭ శ్లోకములలోను లిఖింపబడియున్నది. శాసన ప్రారంభమున సూర్యచంద్రుల యొక్కయు, లింగాకారము యొక్కయు, గోవృషభ ముల యొక్కయు లేఖనములు కలవు.

శాసనమునందలి పీఠిక

స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహా మణ్డలేశ్వర అనుమకొండ పుర వీరాధీశ్వర మూరురాయర జగదాధరిత విక్రమ ఉదధిక్రమ శీల పరమ మాహేశ్వర వరలక్ష్మి నిజేశ్వర చలమర్తి గండకడ కదనప్రచండ శ్రీ స్వయంభు దేవ శ్రీపాద పద్మారాధక పరబల సాధక నామాది సమస్త ప్రశస్తి సహితం శ్రీమన్మహా మణ్డలేశ్వర కాకతి గణపతిదేవ మహారాజులు ఓరు గల్లు మొదలి పట్టణంబుగా సుఖసంపదా వినో దంబునన్ పృథివి రాజ్యంబు సేయుచుండంగా తత్పద ప్రసాదాసాదిత రాజ్య లక్ష్మి నివాసు డును వినుత విభాసుండును సకళ పురాధినా తిమిర మార్తాండుండునుం భేడమట్టు గండ డును వీర వితరణ గుణగణాలంకారుండును సు రిత వ్రతాచారుండును బోచాంబాకాదర క్షీ పారావార సంజాత హరిచందనుండును బోడ ధూటి నిశి వరనందనుండును నసిముసల కణ కంపణ ముద్గరతోమరము డిండిభిండివాల చ క్రకచనారాచ కార్ముకాద్యనేకాయుధ ప్ర ణుండును ననవరత పరమ కళ్యాణుండును దు తురగ రేఖాదంతుండును వారనారి యోధవ తుండును వీణవేణుతాన ధక్కా కాహళ తుణ పణవ పటహ మృదంగాద్యనేక వాద్య కుశలు డును వివిధ కీర్తి విశాలుండును గుప్పాం మానస సరోవర విహరమాణ రాజహంసు డును సముత్పాదిత దీనానాథ చిత్త వికాసు డును నిర్మల నిఖల ధర్మావాసుండును శ్రీ వి నాథ దేవదివ్య శ్రీపాద పద్మారాధకుండు నైన శ్రీ మల్యాల గుండ దండాధీశ్వరుండు మంత్రి పురోహిత సేనాపతి దౌవారిక మహా ప్రధానాసంతసామంతసుభటవిట విదూష పాఠక పీఠమర్దననట నర్తక రసికరంజక

గమకిదాది వాగ్మి వందిపై తానిక పావకభావక గాయకాద్యనేక విద్వజ్జనంబులు గొలువ సుఖోపవిష్టుండై యిష్టకథా వినోదంబులనుండి పద వాక్య ప్రమాణ ప్రమేయ విచిత్ర కవిత్వ తత్వజ్ఞుండును నాత్రేయ గోత్ర పవిత్రుండునునైన అభినవ మయూరసూరిం గారుణ్యదృష్టింజూచి వర్ధమాను పురంబునందు శ్రీ నాగేశ్వర దేవర కున్ ప్రాకార గోపురోపేతంబైన......విలసితాయతనంబు నిర్మించి శక వర్షంబులు ౧౧౬౭ వర్తింపంగా విశ్వావసుసంవత్సర పుష్య బహుళ పంచదశి శుక్రవారమునాడు సూర్య గ్రహణ కాలమున నంగరంగ భోగార్థంబై పిన్నలట్టి పల్లి......బుగా సమర్పించి తద్ధర్మ సంరక్షణార్థంబుగా శాసనంబు సెప్పన్ బనిచినన్ తత్ప్రారంభంబెట్టిదనినా”

## బంధ శ్లోకములు

౪౭ శ్లోకములలో వర్ణితమైన ఈ సంస్కృత శాసనపుఁ బ్రారంభమునందు కార్య కవి కథా నాయక లేఖక నామ గర్భమనెడి చక్రబంధము కలదు. చక్రబంధపు రెండవ వలయమునందు “నాగేశ శాసనం” అనియు, నాలవ వలయమునందు “మయూరరచితం” అనియు, ఏడవ వలయమునందు “గుండధీరనుతి” అనియు, తొమ్మిదవ వలయమునందు “నాగయ లిఖితం” అనియుఁ గలవు. మరియు హృదయానందకందమను ౩౧ శ్లోకము గోమూత్రికా బంధము. గోమూత్రికాబంధము విషయము మాకుఁ దెలియనందున ఆ శ్లోకమును క్రిందవ్రాయుచున్నాము. విజ్ఞులు తెలిపెదరు గాక.

హృదయానందకం ధోయస్సన్నుతం ప్రతతద్విషాం।
దద్యానం స్వకం ప్రాయ స్తను తె పదిత...సాం॥ ౩౧॥

## కాలము

శాకాబ్దే మునితర్క భూశశిమితే, విశ్వావసౌవత్సరే। పుష్యేమాఘరవీందు సంగమదినే సూర్యోపరాగేసతి (౪౨) అని వ్రాయబడి యున్నది కావున శా. శ. ౧౧౬౭, విశ్వావసు నామ సంవత్సర పుష్య బహుళ అమావాస్య నాడు సూర్య గ్రహణ సమయము.

## వంశావళి

కాకతి రాజవంశమనెడి పాల సముద్రమునందు “ప్రోలుఁడు” అను రాజు కలఁడు (౬). ఆతనికి “శ్రీ మహాదేవభూపతి శ్రేష్ఠుఁడు” జన్మించెను (౭). ఇతనికి “గణపతి” పుట్టెను (౮). కర్ణాట బర్బర తురుష్క కళింగ వంగ నేపాళ చోళ మగదాంధ్ర రాజుల సంబంధమగు నమస్కార స్తోత్రములను బొందుచుండెడు ఈ “గణపతి” భూమిని పాలించుచుండఁగా, జగదేకనాథుఁడును, కలియుగ కర్ణుఁడును మేల్యాలవంశతిలకుఁడును అగు......పేరు గలవాఁడు పుట్టెను. (౧౦, ౧౧, ౧౨). ఈతని కుమారుఁడు “బోచఁడు” (౧౩). ఈతనికి వేడముట్టి, గండచూడామణి అను బిరుదులు కలవు. ఈతని భార్యపేరు “బోచాంబిక” (౧౫). ఈ దంపతుల కుమారుఁడు “గుండయ” (౧౬). ఈతనిది “గరుడధ్వజము” (౨౦). గోనవంశసముద్రమందు జననమొందిన “కుప్పాంబ” ఈతని ధర్మపత్ని (౨౧).

## కాకతీయులు శూద్రులు

ఈ శాసనము చాల ముఖ్యమైనది. ఇందు కాకతీయులు చతుర్థ కులజులని స్పష్టముగా వ్రాయఁబడి యున్నది. ఆ శ్లోకములను ఈ క్రింద నుదహరించుచున్నాము:—

అసృజన్ముఖ వర్ణాన్ముఖబాహూరుపాదతః
...భూతానిస్థావరాణిచ॥౫॥

అథస్వీకృతవర్ణో క్త ధర్మనిర్మలచేతసః
జాతాద్విజాతయః పశ్చాచ్చతుర్థ కుల ముజ్వలం॥౫॥
తత్రానేకనృపాలబాలలిఖితాం వీరాంకవర్ణోదధిం।
దర్పందర్పమన గ్రథం సమచరత్తీవ్రః ప్రతాపానలః
యస్పాదంచిత కాకతీశ్వర కులశ్రీరాద్ధి సంవర్ధన।
ప్రాధాహాంకృతి చంద్రచూస మహీపత్ ప్రోలాభి
థానోనృపః॥౬॥

పొరపాటా?

వర్ధమాన పురశాసనమను పేరుతో నీ శాసనమును గూర్చి ఆంధ్రులచరిత్ర రెండవభాగము ౭౨ంవ పుటలో శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు సూచించి యున్నారు. అచ్చట నీ శాసనము «కుప్పాంబ" శాసనముగా లిఖించియున్నారు. ఈ శాసనమునందలి లిఖితమును బట్టి యిది «గుండయ" శాసనమని స్పష్టముగాఁ దెలుచున్నది. ఈ మార్పునకుఁ గారణమేమో పరిశోధకులు గమనించెదరు గాక!

# కవీ!

శ్రీమాన్ శేషభట్టరు రామానుజాచార్యగారు.

ఈ విశ్వంభరలోపలఁ గావలసిన యంతమంది కళ్యాణధనుల్
దేవానాంప్రియులుండఁగ నీ వేటికిఁ బుట్టితయ్యు, నిర్భాగ్య కవీ!

తే.గీ. ఆకలిదెబ్బల దినియు నిర్మలినబుద్ధి జనులసఫలులఁ జేయువృత్తంబుఖాతిఁ
గష్టములచేత నణగద్రొక్కంగఁ బడియు కడఁక వెదఁజల్లె దీవువిజ్ఞానరాశి!

క. ఇతరులమృతదేహములకు నతులితకీర్త్యసువులిచ్చి యలరారెదు న
ద్భుతగతిన్ లేఖని నిను బ్రతికించుటకేల పాటుపడ రాల్యానదో!

తే.గీ. కమలగర్భుండు కటికిచీకటిమెుగానఁ గాంతి నెడబాయుమని వ్రాయఁ గడగి నపుడె
కడకపెయిసిదు నంతరంగము మెుగాన కాంతి నెడబాయుమని వ్రాతసల్పె నేమెుం

ఉ. ఎంతటిపాతకంబు పర మేష్టికొనర్చెనొ, యాతఁడార ధీ
మంతుల పొంతఁ బండిత సమాజములో నిను నుంచలేక దు
శ్చింతుల మార్గసంతతుల చెంతవసింపఁగఁ జేయునాత్మ నే
[illegible]

తే.గీ. పుడమిఁ బ్రభవ మొందిననాఁడె పొక్కి పొక్కి యేడ్చితివి నీదు స్తోత్రకండ్లెల్ల వార
బ్రతికినన్నాళులిక దుఃఖ పడెదవనెడు సూచనగనప్పుడదిమాకుఁ దోఁచదయ్యె.

సీ. మత్తకోకిలగీత మహిమ లేటికి నీకు నింటిలోఁ బనిపాటలేడ్చుచుండ,
ఆటవెలంది సోయగము లేటికి నీకు కులకాంత యొకకంట మిడుకుచుండ,
మత్తేభగతమహోద్వ్యాప్తి యేటికి నీకు కసవేదిగుబ్బమాకటను జావ,
సీసాదినియతసంసిద్ధియేటికి నీకు తామ్రఖండము లేక తల్లడిల్ల,

తే.గీ. పరులసౌభాగ్యకథనమే పనికి నీకు, ఆత్మహితులాత్తదారిద్ర్యశైక్ష్యశింప
అకట! యిది స్వార్థరాహిత్యమగునొ యాత్మ హత్మయేమగునో తెల్పుమయ్య మాకు.

తే.గీ. ఆటకలందును, బ్రాఁచేపపుటికలందు గ్రాలుచున్నటి నీదువిజ్ఞానరాశి
అనుదినము గీటములకుఁ బ్రాశనమొసంగి సాంద్రలోకోపకారంబు సల్పుచుండె.

ఉ. ఘోరకపూరితోంపలఁ బరుండి యభాగ్యము జేసిజీవనా
ధారముగాగ నంబలిని త్రావెదునీవు, ధరాతలేంద్ర వి
స్తారమహానసాంతర విసంఖ్య సుభోజ్య పదార్థరాశినే.
తీరున లెక్క బెట్టెదవొ ధీవర మాకతి చోద్యమయ్యెడిన్.

సీ. కలమును ఖండించి కత్తెరయో, గునపమో, ములుగోలయో దాల్పఁ దలపవేల,
గాఁగిదంబును మాడ్చి కచ్చాకుభస్మమో కస్తూరిమాత్రలో కట్టవేల,
దవితినావలవైచి తక్రభాండమునో పొగాకంకెమునో పెట్టి యమ్మవేల,
కవిత చెప్పుటమాని కంసాలివయ్యొ బట్టలు నేయ నేర్చియో మెలఁగవేల,

తే.గీ. వికట సంసరణంబును వీడి సన్యసించియో చచ్చియో ముక్తిఁ గాంచవేల,
ఏమిలాభంబు కవితకై యేలధార వోయుచున్నావు నీదుస్వల్పాయు విట్లు.

# విశేషములు

## భూమివయసు

భూదేవి వయస్సు కనుగొనుటకు శాస్త్రజ్ఞులు పరిశోధించిరి. ఈ విషయము సరిదైనటుల రూఢిపడినది. కాని భౌతికశాస్త్రజ్ఞులొక విధముగా, మృద్విజ్ఞానులొక విధముగా రూపించిరి. మొదటివారు ౨,౦౦,౦౦,౦౦౦ యేండ్లకుపైన ౩౦,౦౦౦,౧౬౦ యేండ్లకు మించనటుల స్థిరపరచిరి. రెండవవారు ౩౦,౧౦౦,౧౦౦ సంవత్సరముల వయస్సు గడచినటుల దెలిపిరి. అమెరికా సర్వేపండితులు దాదాపు ౮౦,౦౦౦,౦౦౦ సంవత్సరములని నిశ్చయించిరి. ఈ సందర్భములో యితర వేత్తల నిర్ణయములు గమనించవలయును.

(౧) లార్డుకెల్విను గారు ౪,౦౦,౦౦,౦౦౦ సంవత్సరములుండునని యు, షుత్తమా యు ర్ధాయము ౯౭,౦౦౦,౦౦౦ యొండ్లని నిశ్చయించిరి.

(౨) డి. లిపార్‌రెంటు శాస్త్రిలు ౬౪,౦౦౦,౦౦౦ లకు ౯౦,౦౦౦,౦౦౦ లకు మధ్యనున్నట్లుల దెలిపిరి.

(౩) ఛార్లస్‌వాల్కాటు సిద్ధాంతి భూమి ఆయువ్యము ౭౦,౦౦౦,౦౦౦ యొండ్లని నొక్కి చెప్పిరి. వీరికెల్లి యిట్లుంధ మహాకవి కాళిదాసు భూదేవి నుద్దేశించి:

,,ఎలిమినఖిషిక్తుడగు రఘుతిలకునెదుట
గానఁబడె ఈడునచ్చిన కన్యబోలె''

అనియెను. రఘువంశము.

## అనాథాలయములు

ఒక్కలండను పట్టణములో మాత్రము సంవత్సరమునకు ౨౦,౦౦౦ దిక్కులేని మార్జాలములు పట్టకొనుచున్నటుల దెలియుచున్నది. ఈ అనాథులను, అగతికులను రక్షించుటకు ౪౦ సంఘములు, వానికి సంబంధించిన శరణాలయములు కలవు. ప్రైవేటు చందాలపై వీని పోషణ జరుగుచున్నది. ఇతరదేశములలో దిక్కులేని మనుష్యులున్నటుల దెలిసిన వీరెంత చందాధన మివ్వగలరో?

## వాన

ప్రకృతి శాస్త్రజ్ఞులు ఇటీవల వర్షమును గురించి ఆశ్చర్య జనకమగు సంగతి దెలిపిరి. భూమిపై ప్రతిరోజు మూడువందల చదరపుమైళ్లపై వర్షము గురియునట. వాన నీళ్లను తూచినయెడల సుమారు ప్రతిగంటకు ౩౬ మణుగులగునట. ప్రకృతి శాస్త్రజ్ఞులు తమ బుద్ధి నతివిచిత్రమగు విషయములం దుపయోగించుచున్నారు.

## శిక్షలు.

ప్రపంచములో నెల్లప్పుడును, ఎల్లస్థలముల యందును నేరము చేసిన వానిని శిక్షించుట యలవాటు. కాని కొన్ని దేశముల శిక్షలు ఘన కతిచిత్రముగా నగుపడును.

ఫ్రేన్స్ దేశములో నొకనిపై ౧౩౩ నేరముల ఆరోపణ చేయబడెను. నేరములు రుజువైన పిదప నాతనికి ౪౦౩ వత్సరముల శిక్ష వేయబడెనట! ఇంకొకనిపై క్రీ. శ. ౧౮౩౯ వ సంవత్సరమందు అదేశమునందే ౨౧౪ నేరముల ఆరోపణ చేయబడెను!! ఆ నేరములన్నియు ప్రభుత్వపుకాగితములలో మార్పులు (జాల్ సాక్షీ) చేసినందులకై యుండెను. ఆదేశపు చట్టముల ప్రకార మీనేరమునకు ౧౪ వత్సరముల కఠినశిక్ష నొసంగబడును. ఈ లెక్క ప్రకారము నాతనికి ౩౦౫౩ వత్సరముల శిక్ష విధింపబడెను!! అప్పుడాతని యీడు ౩౫ వత్సరములు. ఇన్ని సంవత్సరముల శిక్షను విధించుట మనమిదివరకు విని కని యుండలేము.

ఈ చిత్ర శిక్షకు సాటియైన మరొక శిక్ష వినబడినది. క్రీ. శ. ౧౯౨౩ సం॥ అనగా మూడు సంవత్సరములకు పూర్వమే అమెరికాసంయుక్త రాష్ట్రములందలి చికాగో నగరమునందొకనిపై తనభార్యపేరట వచ్చిన యుత్తరముల తెరచినందులకై అక్కడి న్యాయస్థానమున నేరమని రూపింపబడెను! అక్కడి న్యాయమూర్తి ఆ నేరస్థుని నుద్దేశించి ,,నీవు నీ భార్య పేరట వచ్చిన ఉత్తరముల నామె యాజ్ఞ లేకయే తెరచుటచే అమెరికా సంయుక్త రాష్ట్రములలో ,,నమలు'' నందున్న చట్టమును ధిక్కరించిన వాడవైతివి. కావున నీ నేరమునకు ౨౫ క్షణముల (సెకండ్లు) శిక్ష విధించుచున్నాను'', అనుచు నతిశాంతముగ జేబునుండి గడియారము దీసి ౨౫ క్షణములు లెక్కపెట్టి ,,ఇక నీ శిక్షా కాలము సమాప్తమైనది. నీవు వదలబడితివి''ని నాతని విడుదల గావించెను!!!

## నైసర్గిక వర్ణముల మార్చుట

రసాయనశాస్త్రజ్ఞులు యూరపు సంగ్రామానంతరము క్రొత్త క్రొత్త విషయములను కనిపెట్టియున్నారు. హానికలిగించని రంగులనుపయోగించి వృక్షముల, జంతువుల, పక్షులవర్ణముల మార్చుచున్నారు. వృక్షముల మొదళ్ళకు రంధ్రముల జేసి వానియందు వివిధములగు రంగుల నింపిన వివిధశాఖలయందు వివిధవర్ణముల ఆకులు పుట్టునట! అట్టిరంగులనే ముఖ్యముగా తెల్లనిరెక్కలుగల కోళ్లకు వాని యాహారములలో కలిపి పెట్టిన వాని రెక్కల యందును, వాని గ్రుడ్లయందును మార్పు గలుగునట!! తెల్లని ఛందేళ్లకును, యెలుకలకును, రంగులు కల్పిన వస్తువుల దినిపించిన వాని శరీర వర్ణము మారునట!

ఈ కృత్రిమ విధముతో తెల్లని మనుష్యుల నల్లని వారుగను, నల్లని వారిని తెల్లని వారుగను జేయుట సంభవమేమో!!

# సాభిప్రాయ విశేషములు

## మహారాజా బహద్దురుగారు

రాజారాయాన్ సర్ కిషన్ ప్రసాదు మహారాజా బహద్దురు యమీనుస్సల్తనతు జి. సి. ఐ. ఇ; కె.సి. ఐ. ఇ. గారు నిజాంరాష్ట్రమునందలి అత్యున్నత పదవియందు నియుక్తులగుట ఎంతయు సంతోషకరమగు విషయము. మహారాజాగారు సుప్రసిద్ధ మొగలు రాజ్యాంగనిర్మాణమునకాచార్యులును రాజపుత్ర యోధులును అగు రాజాతోడరుమల్ వంశీయులు. వీరు అరబీ, ఫారసీ, హిందీ, ఉర్దూభాషలయందు ప్రవీణులు. సుప్రసిద్ధకవిసత్తములు. రసికులు. ధైర్యవంతులు. పరమతసహిష్ణుతగలవారు. ఇదివఱకు వీరు చాల సంవత్సరములు నిజాంరాష్ట్రప్రధానామాత్యపదవియందుండి అతిచతురతతో రాజ్యాంగరథమునునడిపించిరి. అనుభవజ్ఞులగు మహారాజాగారు తిరిగి ప్రభుత్వసభాధ్యక్షులుగా నియమింపఁబడినందులకు మేమెంతయు వారి నభినందించుచున్నాము.

## ఆంధ్రపట్టభద్రుల సన్మానము

ఉస్మానియా విశ్వవిద్యాలయపు కాన్వొకేషన్ జరిగిన మరునాడే నిజాంరాష్ట్రాంధ్రజనకేంద్ర సంఘమువారు పైవిశ్వవిద్యాలయాంధ్రస్నాతకుల కొకవిందొసంగిసన్మానించిరి. గతవత్సరముకూడ నిట్టి సన్మానము జరిగినది. శ్రీయుత ప్రొఫెసరు శిరిగూరి హనుమంత రావు ఎం. ఏ. ఎల్. టి. గారును, ఆనాడధ్యక్షులుగానున్న మ. రా. రా. శ్రీ వెంకటరామారెడ్డి కొత్వాలు బహద్దురుగారును, జీవితరంగములోదూకుచున్న యువకులకు సుబోధల గావించిరి. ఇట్టి సభల సమావేశపఱచి ఆంధ్రయువకులను ప్రోత్సహించుచున్న కేంద్రసంఘము వారెంతయో స్తవనీయులు. కాని యీసంఘమువారు మద్రాసు విశ్వవిద్యాలయమునకు సంబంధించిన నిజాం కాలేజులో నభ్యసించి పట్టభద్రులైన ఆంధ్రయువకులనుకూడ వీరితోపాటేల సన్మానింపఁదలంచలేదో గోచరించుటలేదు. ముందు సంవత్సరమైన నుభయ విద్యాపీఠముల స్నాతకుల కలిపి గౌరవింతురని విశ్వసించుచున్నాము.

## మైసూరు యూనివర్సిటీ కాన్వొకేషన్

నవంబరు మాసాంతమున జరిగిన పైవిద్యాలయ పట్టభద్ర సన్మాన సందర్భమున విద్యావిషయములం దపారానుభవముగలవారును వయోవృద్ధులును అగు సర్ ప్రఫుల్ల చంద్రరాయిగారు పన్యసించిరి. వారిఅమోఘమైన విద్యావిధాన సూచనలు ప్రతివిశ్వ విద్యాలయమునకును ఆదర్శయోగ్యములు. శ్రీరాయిగారు నుడివిన ప్రకారము ప్రాచీన విశ్వవిద్యాలయములకును ఆధునిక విశ్వవిద్యాలయములకును చాల భేదమున్నది. ప్రాచీనాసనము లాధునికాసనముల వంటివి కావు. వివిధప్రదేశములందలి విద్యాపీఠములు తమతమ వివిధ పరిస్థితుల దృష్టియందుంచుకొని విద్యాభ్యాసక్రమ మేర్పరుపవ

లేను. యోగ్యతా క్రమముల పంచిపెట్టుటయే ప్రస్తుత విద్యాలయములు పరమావధియని యెంచిన నిట్టి జాతీయహానికరములగు కార్యముల నక్షణమే త్యజించవలెను.

ఆంధ్రరాష్ట్ర గ్రంథాలయమహాసభ

ఏలూరునం దిటీవల జరిగిన యీసభలో శ్రీయుత నాళము కృష్ణారావుగారి యధ్యక్షోపన్యాసము గ్రంథాలయోద్యమాభిమానులందరును చదివితీరదగినదని మాయభిప్రాయము. ఈ యుద్యమమును సాంఘికమతరాజకీయాది ఇతరోద్యమములతో గలుపగూడదనియు, ఈనియమమును పాటింపక పోవుటచేతనే బ్రిటిషు ఆంధ్రదేశమున దీనికి దురవస్థ సంభవించినదని అధ్యక్షులు విస్పష్టముగ వక్కాణించిరి. ఇది చాలముఖ్యమైన యుపదేశము. అదృష్టవశమున నిజాంరాష్ట్రముననారంభమైన కొలదిపాటి గ్రంథాలయోద్యమము మతసాంఘికాదియుద్యమములతో సంబంధమే మాత్రములేకుండ జరుపబడుచున్నది. ఈపద్ధతివలన ఆంధ్రభాషను ప్రేమించువారందరును ఏమతము వారైనను సరే, ఏవృత్తి వారైనను సరే గ్రంథాలయోద్యమమున పాలుగొనగలిగియున్నారు. తుదకు ప్రభుత్వోద్యోగులుకూడ ఎంతో యుత్సాహముతో నీవిద్యావిషయక కార్యమున సహాయపడగలుగుచున్నారు. నిజాంరాష్ట్రములోని గ్రంథాలయముల నిర్వాహకులు శ్రీయుత నాళముకృష్ణారావుగారి అనుభవపూర్వకమగు పైయుపదేశమును దృష్టియందుంచుకొనెదరుగాక!

ఏలూరు ఆంధ్రమహాసభ.

ఈ మహాసభవారు అంగీకరించిన మొదటి తీర్మానములో నిట్లున్నది:

"నైజాము, తమిళనాడు, బొంబాయి, మధ్యరాష్ట్ర, బర్మా, వంగదేశము మొదలగు రాష్ట్రముల యందు వలసపోయియున్న ఆంధ్రులయందు ఆంధ్రవ్యక్తిత్వము స్థిరపడుటకు తగిన ప్రయత్నముల నన్నిం స్థాయి సంఘమువారు గావింప గో న్నాము".

పై తీర్మానము నంగీకరించుటలో సభవారు చూపిన యుదారభావము ప్రశం యము. రాజ్యాంగ విషయములకు సంబం చనిదగు నీమహాసభ ఆంధ్రజాతియంతటి యముపై శ్రద్ధవహించుట ఎంతయు సమం చితమని మేమభిప్రాయ పడుచున్నాము. ఇందు పొరపాటొకటి మాకు గానవచ్చున్నది. 'నైజాము'లో నీకాంధ్రులు వలసవ రను నూహ యదార్థముకాదు. నిజాంరాష్ట్ర లోని సగముకంటె నెక్కువ భాగము ఆం శమే. ఈభాగమే తెలంగాణమని పేర్కొ చున్నది. ఈ రాష్ట్రమున నేటికిని తెలుగు భాషగా వాడబడుచున్నది. నిజాము రాష్ట్ర లోని ఆంధ్ర భూభాగమే యాంధ్రుల నివాసస్థానమనియు, ఇచ్చటి నుండియే దేశములకు ఆంధ్రులు వలసపోయిరనియు త్రకారులు నుడువుచున్నారు. ఇచ్చటి ఓ నకు 'ఆంధ్రనగర' మను ప్రఖ్యాత నామ దు. ఇట్టిస్థితిలో తమిళనాడు.......... దేశము మున్నగు ఆంధ్రేతర ప్రాంతము నిజాంరాష్ట్రమును ముడిపెట్టుట భ్రమా సూచించుచున్నాము.

౪౧ వ అఖిల భారత దేశీయ మహాసభ

ఈ సంవత్సరము దేశీయ మహాసభ రిత్రక విఖ్యాతిగల గౌహతీ నగరమునందు నది. ఈ నగరము నలుప్రక్కల హిమా

ఖాసి, జయంతీ యాదినగరాజములచే ఆవరింపబడి యున్నది. బ్రహ్మపుత్రానదీ వినిర్మలసలిలము పాండవనగర సమీపమునసే ప్రవహించుచుండును. కామాక్షి, భువనేశ్వర, ఉమానందనవగ్లాంతాది పుణ్యక్షేత్రము లీనగర సామీప్యముననేగలవు. తొల్లి పాండురాజుసుతు లీచోట నివసించినందున నీ స్థలము పాండుక్షేత్రమని ప్రసిద్ధికెక్కినది. శ్రీకృష్ణ భగవాను డీచోట మార్గాయాస నివృత్తికై కొంతకాలము విశ్రమించెను. ఋషితిలకుడగు వసిష్టు డీతావుననే తన తపోధనము నార్జించెను. ఐతిహాసిక దృష్టితోనేమి, ప్రకృతిరామణీయక మూలముననేమి, గౌహతీనగరము వంటి పుణ్యస్థలము నందిదివరకెన్నడును దేశీయమహాసభ సమావేశము కాలేదు. క్రీ. శ. ౧౯౨౦, ౨౧, ౨౨ నందు గనబడిన భారతీయుల కార్యదీక్ష, పౌరుషము త్యాగము, ఐకమత్యత, మన దురదృష్టవశమున అదృశ్యమై పోయినవి. అఖిలభారత చిత్తమును హరించిన చిత్తరంజనుడు హటాత్తుగా కాలగర్భమున మాయమైపోయెను. శారీరక బలహీనతచే మహాత్ముడు కొంతకాలము విశ్రమార్థము గడపెను. లాలాజీ తానేరాజకీయ శాఖపక్షమున దేశ సేవ చేయవలెనో యింకను నిశ్చయింపనే లేదు. మిగిలిన యితరనాయకులు శాఖోపశాఖలుగా చీలిపోయి పరస్పర వాగ్యుద్ధములలో సమయము పోగొట్టిరి. హిందూ మహమ్మదీయ సఖ్యత ప్రస్తుతస్థితుల. గమనించిన నిత్యమనితో చకపోయినను, ఇంతత్వరగాచెడి ద్వేషరూపము దాల్చునని యనుకొన లేదు. జనసామాన్యపు ఉత్సాహ మింతలో చల్లపడెను. కతిపయదినములలో నార్జింపనున్న స్వాతంత్ర్యము మన లోపకారణముననే నతిశయదూరమై పోవుచున్నది. ఆశాప్లుత హృదయముల కాశాభంగము సంభవించుచున్నది. ఈ దురవస్థలకుతోడు శ్రీశ్రద్ధానందుని ఘోరమరణము దేశీయుల మరింత నిరుత్సాహ వంతుల జేయుచున్నది. దేశీయనాయకు లీవత్సరము గొప్ప పుణ్యనగరమునందు గుమిగూడి విజయసాధన చర్చించిరి. ఆస్థల విశేషమున వారందరిలో చాలమార్పు గలుగునను నమ్మకము తిరిగి మొలకెత్తు చున్నది. విధాత భారతీయుల సంకల్పమును నిర్విఘ్నముగా నచిరకాలములోనే ఫలవంతము జేయుగాక!

## కీ. శే. స్వామిశ్రద్ధానందులు

భారతజాతీయోన్నతికై పుట్టినప్పటినుండి తన ప్రాణముల ధారపోసినట్టి త్యాగియు, హిందూమహమ్మదీయ సఖ్యతకై అహోరాత్రములు యత్నించిన పరమస్నేహితుడును, పంజాబునందాంగ్లేయ క్రూరభటులు తనను ఫిరంగికి కట్టిమె గరగొట్టెదమని బెదరించినపుడు ప్రాణమును లక్ష్యపెట్టక ముందువచ్చి నిలువబడినట్టి యోధశ్రేష్ఠుడును, ఆర్యసమాజవృద్ధికై పలువిధములపాటుబడిన సజ్జనుడును, మహమ్మదీయులచేతనే గౌరవింపబడి మసీదులలో ధర్మోపదేశ మొసగ్చిన పరమత సహనా స్వభావుడును, సర్వసంగపరిత్యాగియు, కామరహితుడును, ఉత్కృష్టకర్మయోగియునగు శ్రీ స్వామిశ్రద్ధానందసన్యాసిగారు గడచిన ౨౩ వ డిసెంబరు ౧౯౨౬ వ నాడు సాయంతనము నాలుగు గంటలకు దిల్లీలో ఉబ్బసముబాధ చేలేవలేని స్థితియందుండ దుర్మార్గుడును, పరమత సహనావిహీనుడును, క్రూరుడును నగు అబ్దుల్ రషీదు అనునొక మహమ్మదీయునిచే పిస్తోలుతో ప్రేల్చబడి తత్క్షణమే మృతినొందెను. ఈ ఘోర కృత్యము హిందూ దేశమునంతను కలవరపెట్టినది ఈ కృత్యము భారతీయులకొక హీనమగు కళం

కము దెచ్చెను. శ్రీ స్వామి బ్రతికియున్నను చంపబడినను దేశమునకు, మతమునకు ఉపయోగిమైరి. వారి జీవితము సార్థకమైనది, వారియాత్మకు తప్పక శాంతిలభించును. ఒక దుర్మార్గుని కృత్యమును హిందువులు, తదితర మహమ్మదీయుల బాధ్యులుగాచేయక శమదమాదిగుణములతో కీర్తిశేషులగుస్వామి జీవితసందేశమును కార్యరూపమునకు తెచ్చుటకై కృషిసల్పుటయే వీరలక్షణము. వారికుమారునికి తదితరబంధువర్గమునకు కలిగిన హృదయ తాపములుపశమింపుగాక!

గోలకొండ ప్రెస్ హైద్రాబాదు.

Edited and Published by P. N. Sarma B.A. Troop Bazar Hyd. Dn.

# విషయసూచిక



# చిత్రములు

టెలిఫోన్ నెం.45

స్థాపితము 1288 హిజ్రీ.

తంతివిలాసము:-

# ANTIFEBRILE PILLS

సయ్యద్ అబ్దుల్ రజ్జాక్ అండు కో కెమిస్టు

చార్ కమాన్ హైద్రాబాద్ దక్కన్

వారిచే సిద్ధము చేయబడిన

## ఆంటి ఫేబ్రిల్ పిల్సు

క్వైనైన్, సింకొనిన్, క్వినిడీన్, సింకొనిడీన్, సాయిమిడీన్, ఆర్సనిక్, ఐరన్, సోడాఫలీన్, హమోస్రామన్. మొదలగు పదార్థముల కూడిక.

ఈ మాత్రలు చలిజ్వరమునకు గత యిరువదియైదు ముప్పది సంవత్సరములనుండి సాధారణముగ వాడబడుచున్న అన్నియౌషధములకన్న శ్రేష్ఠమైనవి. చలిజ్వరమును నిలిపి దాని విషమును శరీరమునుండి వెడల గొట్టుటయందు నిరుపమాన సామర్థ్యముగల ఉత్తమ పదార్థ విశేషముల కూడికచే నీ మాత్రలు సిద్ధముచేయబడినవి. ఈ మాత్రల ఉపయోగముచే నీక్రిందిగుణములు కలుగును.

1. అన్నివిధములగు చలిజ్వరలు (ప్రతిదినము వచ్చునదిగాని త్ర్యాహిక చాతుర్థిక జ్వరముగాని) నిలుచుటయేగాక తిరిగి రాకుండ పూర్తిగ వ్యాధి నిర్మూలనమగును.

2. చలిజ్వరమునవలన ప్లీహము, గుండెకాయ మొదలగువానిపై కలుగు పరిణామములు దూరమగును.

3. చలిజ్వరముచే రక్తమునందు ప్రవేశింపబడు విషపదార్థములను మలమూత్రముల ద్వారా శరీరమునుండి వెడలించును.

ఈ మాత్రలనుగురించిన అన్నిసంగతులు, వాని అత్యాశ్చర్యకరములగు గుణములు ఉపయోగించు విధానము మొదలగువానిని తెలిసికొనుటకై మా కంపెనీవారిచే ప్రచురింపబడి మాత్రల సీసాకు చుట్టబడియుండు "అంటిఫేబ్రిల్ పిల్స్" అను విపులమైన కరపత్రమును చూడ ప్రార్థితులు.

వెల యేబది మాత్రలుగల సీసా ఒకటింటికి హాలీ రెండురూప్యములు.



శిల్పి: మజుందార్ — స్మృతి — హెరాల్డ్ అనుజ్ఞతో

"ప్రేమరస ముప్పతిలు యొక ప్రకరణంబు
జదువునెడ శాంతహృదయ మశాంతి జెంద
చేతపుస్తక మరమోడ్చి స్మృతి పథాన
యువిద యేమేమొ తలపోసె . . . . . ."

# సుజాత

హైదరాబాదు ఫిబ్రవరి ౧౯౨౭

సంపుటము ౧ అక్షయ సంవత్సర మాఘము సంఖ్య ౨


## పింగళిసూరన

రాయప్రోలు సుబ్బారావు గారు

పింగళిసూరన క్రైస్తవశకము ౧౪ వ శతాబ్దచరమార్ధమందున్న విద్వత్కవి. ఈతని నివాసము కర్ణాటాంధ్రసీమల మధ్యభూమి యనవచ్చును. గరుడ పురాణము, రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నమునను నాలుగు కృతులు మాత్రమిపుడు లభించుచున్నవి. ఇంకను గొన్ని 'తెనుఁగుంగబ్బము'ల నీసుకవి రచియించె ననుటకు సూచనలున్నవి. ఇందు గరుడపురాణము భారత భాగవత రామాయణాదులవలె సంస్కృత మూలమునకు యథానువాదమని తోఁచును. దీని రచన నామాలాగ్రముగఁ జదివి యాస్వాదించు భాగ్య మింతవఱకును గలుగలేదు; కాని

'జనముల్ మెచ్చఁగమున్ రచించితి సుదంచద్వైఖరిన్ గారుడంబును'

అను పద్యపాదము నందలి విశేషము గొంతఁజాటింప దగియున్నది. ఏలయన నాంధ్రకవులు సామాన్యముగాఁగృతి ముఖమున తమ తమ పాండిత్యవైలక్షణ్యములు వ్యంగ్యముగానో వాచ్యముగానో సూచించు మర్యాద కలదు. నన్నయ్యభట్టారకుఁడు.

'ప్రసన్నకథా కవితార్థయుక్తి

లోనారసి మేలునా నితరులక్షర రమ్యతనాదరింప,

తెనుంగున మహాభారతము రచింతునని.

'ఆంధ్రావలిమోదముం బొరయగా' మహాభారతము బూరింతునని తిక్కనసోమయాజి పలికెను.

'శిరీష కుసుమపేశల సుధామయోక్తులతోఁ', గృతి రచింపుమని కృష్ణరాయ లడిగినట్లు పెద్దన సూచించెను.

కావున నిట్టిమర్యాద ఆంధ్రకవులలోఁ గలదని యొప్పికొందము. సూరనగూడ పై పద్యపాదమందు ఇట్టి

స్ఫురణ కవకాశ మిచ్చినాఁ డనుట అస్వభావము కాదు. దీనింబట్టి గారుడ పురాణము శబ్దపటిష్ఠరీతిని గాఢప్రధాన ముగా రచించియుండునని భావితము. కవిత, ప్రవాహ ములవలెనే, ప్రారంభపదమందు ఉద్రేక జృంభణములతో నుబ్బుట సహజమే కదా.

* * * * *

రెండవది రాఘవపాండవీయము. సూర్యనార్యుఁ డిందు 'చమత్కృతి మత్కృతి మత్కృతిత్వము' ను జూపిం తునని ప్రవచించెను. ఇది నిజానకుఁ బ్రగల్భోక్తి కాదు, మఱిదు రామభారతకథలు జోడించుటయె కష్టము. చూడుఁడు. రామాయణమునందుఁ బ్రధాన వీరుఁడయిన నాయ కుఁడొక్కఁడే. అతఁడును అవతారపురుషుఁడు. మానవస్వ భావములయిన ప్రతాపానుతాపములును, ఖేదమోదములు నుగల ప్రసన్న శీలుఁడు. అందుచేఁ గావ్యమందు 'రసనివే శయోగ్యత' ను బోషింపఁగల నాయకుఁడు. సీత అయో నిజ. ఏకపతివ్రత. అదియునుగాక శ్రీతావరణచ్ఛాయలం టిన చేతోవృత్తిగల సాధ్వి. ఇఁక భారతమందన్నఁ బహునాయకత్వము. క్షాత్రకుటుంబము. దానిరెండు పా యలు. భోగాధికారవాంఛ. మాత్సర్యదావము. ధర్మ సీమలుదాటి నీతివలయమందు త్రిప్పుట. ఇఁక ద్రౌపది యజ్ఞకుండము నుండి పుట్టిన కృష్ణ. వీరవనిత నను అంతఃకర ణరాజసము గల మనస్విని. బరాభవము కర్మప్రాప్తమని యనుభవించు తత్త్వదృష్టిలేదు. ఇంత విస్తరమెందులకనఁ గొందఱు విమర్శకులు దలచునట్లు రామాయణభారత కథ లకుఁ బోలికలంతగా లేవు. వైషమ్యములే యెక్కువ గలవు. కావ్యమునకు రసమాత్మ. స్థూలములయిన కథాంశములకు సామ్యములు కుదిరినంతన చాలదు. సూక్ష్మములగు పా త్రాంతఃకరణసంచారములకుఁ గూడ ఉభయసాధర్మ్యమ్ము పొందుపడవలెను. అందమైన ఆకారదీపము చాలదు. దానినుజ్జ్వలింపఁ జేయు రస స్నేహము కూడఁ గావలెను. ఈ రసిక దృష్టితోఁ జదివినప్పుడు రాఘవపాండవీయ మం దు సూరన సరసపు పోకడలు పొడకట్టఁగలవు. శ్లేషకై ఉభయ కథాంశముల నేరికొనుటలో నంతగా ప్రౌఢిమ కానరాదను వాదము అపుడు నిలువదు. సూరన నియ మము కేవల శ్లేషసంఘటనమే కాదు. 'రమ్యముగా నొక కావ్యభంగి' యందుఁ గృతినిర్వాహణ మతని యాభిమతము.

శ్లేష యందుఁ గూడ సూరన చేయి ఇంత వఱకు మీఁదుగనే యున్నది. శ్లేషకావ్యరచన యందు ఆంధ్రకవు లు సంస్కృతకవిమార్గముల ననుగమించిరనుట యథా ర్థము. కావ్యశైలియందు శ్లేషస్పర్శ అనుపూర్వికము గా నున్నదనక తప్పను. అయితే దానిని కావ్యశిరస్స్థా నను ప్రాణింపఁ జేసినది మహాకవి మాఘుఁడు. ఇతఁడు క్రీ. శ. ౯ వ శతాబ్దమందుండెను. మాఘుఁడు రమ్యమైన క కవితానౌకను శ్లేష తరంగిణిలోఁ దింపి యాడించిన తరువాత సంస్కృతకావ్యము మఱల కాళిదాసపథమునకు రాఁజాల దాయెను. శబ్దసంబద్ధములయిన రెండు దిక్కోణములతో కొ కపోసాగెను. తరువాతనే ద్వ్యాశ్రయకావ్యము తలసూపెను. హేమచంద్రుఁడను కవి ౨౦ ఆశ్వాసము ద్వ్యంద్వ్యకృతి రచించెను. మన నరసభూపాలీయమందలి అలం కారశాస్త్రమువలె నందు వ్యాకరణసూత్రములును కుమా రపాలప్రభు వైభవమును జోడింపఁ బడినవి. హేమచం ద్రుఁడు ౧౧ వ శతాబ్దము చిట్టచివర నుండెనని చరిత్ర.

రాఘవపాండవీయమును కృతిని కవిరాజను నొక ౧౧౯౦ ప్రాంతమందు రచించెనని మహారాష్ట్ర విద్వాంసు లుదాహరించిరి. ఆగ్రంథ మింకను బ్రచురణకెక్కినట్లు కానరాదు. సూరన కా గ్రంథ మెంతవఱకుపకరించెనో నిర్ణయింపఁజాలము. కాని యొక అంశమును నిర్ధరింప వచ్చును. 'తన చిన్ని రామచంద్రునిగని పాముఁజూలి' 'ఏసుంగని కరమరయక'; 'కన్యకలనఁ గెల్చి' మున్నగు ప్ర యోగములు సూచినపుడు ఈ మహాకవి తన కార్యమున ప్రతిభతోఁ జాలించెనని చెప్పవలెను కాని ముసుఁగు మార్పు వని మాత్రమూహింపఁజాలము.

* * * * *

కళా పూర్ణోదయము పంచదార బొమ్మలు పెట్టిన ఆనంద భవనము వంటిది. కళలు పదియాఱని మన సంప్ర దాయము. ఒక్కొక్క కళ ఒక్కొక్క నాఁడెసఁగును. పూర్ణి మ నాటికి చందమామ పదాఱుకళలతో కన్నులపండువుగా శోభించును. ఈ కృతియందు కూడ నట్టి కళామాన వికాస విలాసములకుఁ గళ్యాణము ప్రాప్తమగుచున్నది వ్యంజన. పూర్ణోదయమందు సౌందర్య కందళన మెంత గలదో చూతము. ఈకృతికి విలక్షణ రేఖలు మూఁడు.

(౧) అపూర్వకథాసంవిధానవైచిత్రి.
(౨) శృంగారరసప్రాయము.
(3) పుణ్యవస్తువర్ణన.

ఇందుఁ బ్రథమరేఖ సంప్రదాయములకు అపూర్వము. అంతవఱకును గవులు వస్తువు ప్రఖ్యాతముగా నుండవలెనను గీర్వాణనియమమునే యనుసరించిరి. నన్నయాదులు కథామూలమును యథాశ్రయముగాఁ గైకొని, వర్ణనాదులలో రసోచితములగు సంస్కారములకుఁ దావిచ్చిరి. సోమయాజి యీ సంస్కారపు హద్దులను మఱింత అవలకు జరిపెను. సందర్భములకు సౌష్ఠవమును పాత్రవ్యాలోచమునకుఁ బుష్టిని సంధించుటకు మూలమును విడచి అన్యకవుల పోషణప్రౌఢిమలు గూడ గ్రహించి కథలోఁ గలుపుచు వచ్చెను. విరాటపర్వమందు దిద్దిన ద్రౌపది సంస్కృత పుటలలో వెలుగు ద్రౌపది కాదు. భారవి పెంచి ప్రౌఢగా సంస్కరించిన ప్రజ్ఞావతి యని పలుమాఱు తోచును. శ్రీనాథుఁడు పురాణపరివర్తనతోడ్తో నైషధాది ప్రౌఢకావ్యశక్తిని యథావిధిగా నాంధ్రవాఙ్మయరంగమునకుఁ దెచ్చెను. హరవిలాసాది గ్రంథములలోఁ గుమారసంభవవర్ణనలు యథేచ్ఛగా వెదజల్లెను. ఈ మిశ్రపద్ధతి చాల రమ్యముగా నుండెను. రసికుల నధికముగా నాకర్షించెను. ఇతఁడే నిజముగా అల్లసాని వాని యల్లికల విన్నాణమునకు బీజావాపకుఁడు. శ్రీనాథమహాకవివాఁడే కవితకు 'హ్లాదకరమణీయత' చక్కగా ననుభోగ్యమైనది. నాచనసోముని హరివంశము మతోక పద్ధతికి తలకట్టు వంటిది. అతను 'ప్రఖ్యాతాఖ్యాత' మయిన వస్తువును బంగారము వంటి దానినిగా భావించెను. స్వరూప స్వభావములు మలిచి మార్చి సహృదయముగ్ధమైన ఆభరణముఁ గావించుట కవికర్మగాఁ దలఁచెను. ఈతని రచనయె ఈ యూహకుఁ గారణము. వెఱ్ఱి తలలు వేయని నగిషీపనికి నాచననాథుని పద్యాభరణములు మంచి యుదాహరణములు. పినవీరభద్రుని పొందికలు గూడ నీ యాచరణములోనివె. పెద్దనది ప్రియవాక్కు. ఆయన సూక్తి కోకిలము వయసువచ్చి తెనుఁగు కొమ్మ నెక్కసరికి ఆంధ్రదేశమునకు సామ్రాజ్య చైత్రోదయము వచ్చినది. కృష్ణరాయల విస్తారచ్ఛత్రము క్రింద శత్రువులు శిరసులు వంచిరి. తోడ్తో ప్రజల భోగభాగ్యములు శిరసు లెత్తెను. ఈ కాలపు ఆంధ్రదేశ సంపన్న జీవితవిన్యాసములు కళాపూర్ణోదయ ప్రారంభకథనమందుఁ బ్రతిఫలించుచున్నవి. వృద్ధిగల నయ్యాలలాగు ప్రాయపు గుబ్బెతలు నాకనాకీకాంతలతోఁ గయ్యాలకుఁ గాలుదువ్వుచుండిరని సూరన వర్ణించెను. ఈ శివి కృష్ణరాయలు సుస్థాపించిన సామ్రాజ్యపు ప్రథమ శుభఘుకువులలోనిదని చెప్ప వచ్చును.

కళాపూర్ణోదయములోని కథ యపూర్వము. సంవిధానవైచిత్రి దాని వర్చస్సు. ప్రఖ్యాతము కాని కథ నెన్నికొనుటలో సూరన అఖండమయిన స్వతంత్రముఁ జూపెను. ఈ స్వాతంత్ర్యమునకు మనము రెండు కారణము లూహింప వచ్చును. అదివఱకు సాగిన ఆంధ్ర సాహిత్యముతో అసంతృప్తి యొకటి. జయస్తంభ మెత్తిన జాతులకు నిసర్గముగా మొలకరించు స్వాతంత్ర్యస్ఫోటనము రెండవది. అదిగాక సూరన మహాకవియె యిట్టిజాతి చేతస్సునకుఁ బ్రాతినిధ్యము వహింపఁ దగిన ప్రజ్ఞాశాలి. రాఘవపాండవీయాదులచే విద్వత్పరిషత్పీఠము నధిరోహించెను. సమ్మానస్థానము సుప్రతిష్ఠితమైన తరువాత నిజమయిన కవివరేణ్యాత్మాభిరుచిజ్యోతి చూపిన త్రోవఁ బట్టెను.

చాంద్రమానమునందు ఏనాటికల ఆనాడు ఆహ్లాదకరముగానే యుండుట ప్రకృతి చూపిన ఆనందపథ రహస్యము. ఇది సూరన సాంతముగా నెఱుఁగును. పూర్ణోదయ మందు ఈపథమె యవలంబింపఁ బడినది. ఏపట్టు తీసి యనుభవించినను మధుకోశమువలె మనోమధురముగా నుండవలెనని కవియాశయము. అందువలననే పల్లవ ప్రసన్నమయిన చైత్రసహకారము వలె కళాపూర్ణోదయము ప్రతిరేఖయందును ఆనందము రేకులెత్తుచున్నది.

సూరనార్యుఁడును కావ్యానంద సాధనకు మిథునప్రణయము నందలి కవుల వలనే యాశ్రయించెను. కాని రూపకల్పనయందు ఎప్పటికప్పుడొక మేలిముసుఁగు గీలించి ప్రకృతి వికృతుల రెంటను రసాకర్షణమును, ఆస్వాదనాతురతను జతగాఁ బెంచ నేర్పితేఁడు త్రావిన యుగ్గుపాలు. సంగీతము కవనము నీ రెండును నాయికానాయక ప్రణయమునకు సాధనములును ప్రసాధనములుగా గూడ ఇందు పోషింపఁబడినవి. ఇచట నొక్కమాట మఱవరానిదికలదు. నాయికానాయకులకు వీణాది సంగీత సం

బంధము భాసుని నాటి నుండి వచ్చుచున్నది. స్వప్నవాసవదత్తలో వత్సరాజు నాయికకు వీణావాదనము నేర్పును. వియోగమోహక్షణావసరమున వత్సరాజు ప్రణయస్మృతిని మేల్కొల్పుటకు ఘోషవతియను వీణయే సాధనముగాఁ గల్పించెను. కాళిదాసుని మేఘదూత్యమునందు వీణయున్నది. అది విప్రలంభ గీతమునకు మేళవింపఁబడెను. ఆంధ్ర కవులలోఁ గవితాపితామహుఁడు విపంచికఁ గల్పించి వరూథిని యొడిలో నలంకరించెను; అది రతిపారవశ్యవిభ్రమమునకు సవరింపఁబడెను. కృష్ణదేవరాయలు వీణనెత్తుకొన కపోలేదు. గాని ఆయన మాలదాసరి యంస మంపించెను. సంగీతకైశికీవాదనమునకై శ్రుతి చేసెను. అచ్చట వైకుంఠమందును, ఇచ్చట నల్లరాతి దేవళము లోపలను ఉన్న విష్ణుమూర్తులు రెండును వెన్నవలెఁ గరిగి, ప్రవాహగీతాధారల నమృతప్రాయములు సేయుచుండెను. నంది తిమ్మన వాణి గూడ వీణవాయించెను. కాని అది నారదుని చేతులలోఁ బూతమైన మహతి. వివాదవినోదమునకై మ్రోయుచున్న ఆ మహతి ధ్వారాదత్తుఁడయిన వేణుగోపాలుని మూపులలో మోయించి కొని హాస్యవాదన కొదవెను. సూరనార్యుని వీణ మిథున సాహచర్యమునకు స్వాదు సాధనమై కథాంతరాళమున రసపాలనము సలుపుచున్నది. అదియునుంగాక మాణిక్య వీణ నుపలాలించు శారద సూరనార్యుని యుపాస్యదేవత. సంధి ముఖముల యందు బలుతావుల సరస్వతీబ్రహ్మలు రమ్యప్రసక్తితోఁ గథ నుజ్జీవింపఁ జేయుదురు. ఇది మహాకవి ఉపాసనావిడంబనము కాదుగదా!

కళాపూర్ణోదయమంత సర్వాంగసుందరముగా దిద్దఁ దలచిన కావ్యమని సూచించితిని. అయితే బలవదాకర్షకములగు సందర్భములు పెక్కులున్నను సహృదయ సంమోహనములగు రసవత్ప్రకరణములు రెండని నాయభిప్రాయము. ఒకటి సుగాత్రీశాలీనుల కథ. రెండవది రంభా ప్రతిరంభాసంవాదరూపకము. ఇందు అతి మనోహరమైన సహృదయ రుచి మాధుర్యము ముచ్చటగా ధ్వనించుచున్నది. శాలీనుఁడు సూరనార్యుఁడె. ఆతనియందుఁ బల్లవించిన యభిరుచితరుణిమ కవి సంస్కార విశేషమె. సుగాత్రి తెనుఁగు కన్నెయేకాని వేఱుకాదు. భూషణావలింపుగా లేదచట. అలంకార భారమయిన కవితాగాత్రము ఇంపుగా లేదిచట. ఇది యిటు లుండఁగా సూరనార్యుఁడే కల్పనా వైచిత్రిచే నాంధ్రవాఙ్మయమందు అరిదియయిన హాస్యరసమును చాలీ చాలనంత మృదువుగా రుచి చూపించెను. రంభా ప్రతిరంభలు సవతుల కొట్లాటలాడుచు గృహస్థమగు వేడుక నెఱపోయుదురు. అటన లకూబర ప్రతినలకూబరులు తీవ్రయుద్ధమున కొడిగట్టిం తురు; కాని యీ వీరరసము ఆభాసమాత్రము. విగ్రహనిసర్గములయిన భయకంపనాదులు ఆ రంభల కేమి గలిగెనో గాని పాఠకుల నలముట లేదు. ౧౫౯౦ సంవత్సరమునందు పింగళిసూరన మోసనాటకము నాంధ్రదేశ మందాడించెను. అచట ఆంగ్లదేశమందు షేక్స్పియరు ౧౫౯౪ సంవత్సరమందు కామెడీ ఆఫ్ ఎరర్స్ నాటకముఁ బ్రదర్శించెను. అహా! మహాకవుల దృగ్గోచరమునకు దూరసామీప్యములు లేవు కాఁబోలును.

* * * * *

ప్రభావతీ ప్రద్యుమ్నము ఆలంకారిక పరిభాషలోఁ బ్రౌఢకావ్యమని దృష్టాంతీకరింపఁదగిన. రసవత్కృతి దీనినిగూర్చి మఱొకతరి ప్రత్యేకముగాఁ బరిశీలింతము.

# కావ్యగానము

శ్రీ శేషాద్రిరమణ కవులు

కవికుమారక రావోయి కావ్యగీతి
వీరరస ముట్టిపడ వినిపింపు మోయి
దాస్య శృంఖలలంబడి తగులుకొన్న
నీదు జాతికి నిమ్ము సందేశమొకటి.

వేదములు నాఁడిటఁ బుట్టె నాదికావ్య
మిటనె పేరొందె నిట జనియించె నీవు
ఋషి మనోభావములనంతరింప నున్న
మాతృజాతికిఁ దెలుపరమ్మా! కవీంద్ర.

అడుగుఁ బట్టెను జాతీయ తాతిశయము
మఱుపునకు వచ్చె నాంధ్ర సామ్రాజ్యకథలు
అంతరింపక మున్నె మహాంధ్ర తేజ
మిపుడు గానంబు సేయుమోయీ కవీంద్ర.

ఖడ్గ తిక్కననాఁటి విక్రమ భరంబు
కృష్ణరాయలనాటి దోర్వీర్య పటిమ.
కాకతీయులనాఁటి విక్రాంతి, దేశ
కాలగతు లెంచి పాడుమా కవికుమార.

ఎందులకు జనియించితో మేదినిని
జీవిత ఫలంబొ తొలుదొల్త చిత్తగించి
తాత్త్వికుల సూక్తి కంతరార్థములఁ దెలిపి
సోదరుల మేలుకొలుపుమా! సుకవియువక.

విస్మృతి తరంగములపయి వింత వింత
గతుల విహరించు నాగరక ప్రవరుల
మేలుకొలుపుట కియ్యదే వేళ గాన
గాన సుధజిల్కరావోయి కవికుమార.

నీవు జాతీయ ధర్మంబు నియతితోడ
నిలువఁ బెట్టంగ నెపుడు యత్నింతువేని
భారతీయాభినంద్యమౌ భావగీతి
కవియువక! పాడఁగదవోయి కంఠమెత్తి.

ఆంధ్ర భాషా ప్రశస్త కావ్యామృతంబు
తనివిదీరంగ గ్రోలిన ఘనుఁడవేని
భారతము విప్పి ద్రౌపదీ పరిభవోక్తి
రాయబారము వినిపింప రమ్ము సుకవి.

మఱచి రీయాంధ్ర వాఙ్మయ మధురిమంబు
మఱచి రున్నత పూర్వ సంపత్ప్రశస్తి
మఱువరే దింక సేవకోన్మాద మిట్టి
సోదరాంధ్రులఁ జూడుమా సుకవియువక.

ఐహికమునకు నియ్యది యదను గాదు
పేర్మి యాముష్మికములకు వేళ గాదు
ఆత్మవిశ్వాసి వగు నీవ యఖిలమరసి
చూడుమా నీదు విధియేదో సుకవియువక.

పరవశాధీనమై యున్న భారతమున
కమృత వర్షంబు గురిపించి యారనున్న
రమ్యజాతీయ వహ్నిని రగులు కొలిపి
కవివి యుపదేష్టవును నీవు కమ్ము సుకవి.

కర్మయోగాంతరస్థమౌ కార్యనియతి
బుద్ధ భోగాంతరస్థమౌ భోగవిరతి
ప్రకృతి మాపలి మార్గమ్ముగ పాటపాడి
కై కొనఁగదయ్య విశ్రాంతి కవివతంస.

# శ్రీకృష్ణగీత

## రంగము కురుక్షేత్రము

(కౌరవ పాండవ సేనామధ్య రంగమున కృష్ణార్జునులు రథమెక్కి ప్రవేశింతురు)

కృష్ణ:—అర్జునా! నేడెంత శుభదివసము. ఈ పుణ్య క్షేత్రమగు కురుక్షేత్రమున మన సేనయు భీష్మాది ద్రోణాచార్య పరి రక్షితమైన కౌరవ సేనయు నెట్లు విరాజిల్లుచున్నదియో చూచితివా. నేడే దుర్యోధనాదులు తామొనరించిన దుర్ణయముల ఫలమనుభవించుటకు సంసిద్ధముగ నున్నారు. మఱియు,

ఉ. పాపకళంక సూకృతులపై మసిప్రాకిన రీతిఁదోపని,
కాపురుషున్ రణావనిని ఖడ్గములన్ గొనియున్నఁబో
రగా, నోపరు దుర్మదాంధుల సమున్నతి యాఱిపో
వుద, పాపచయంబునంటెడి భయావహమైనది చూడు
మర్జునా.

అర్జునా! నీకిచ్చట జయమును శత్రువులైన కౌరవేయులకు పరాజయమును విధి ప్రేరితమైనదని నీవు తెలిసి కొనుము.

అర్జు:—అగును గాక కాని,

ఉ. మిత్రులు నన్నదమ్ములు సమీపపు బంధులు మేనమా
మలున్, పుత్రులు బావమర్దులు ప్రబుద్ధులు తాతలు
గ్రాలు నీ కురుక్షేత్రము పెండ్లి పందిరనఁ జెల్లుచునున్నది
యిందు వీరి, శత్రుని కైవడిన్ నిలిచి చంపఁగ నేర్తు
నె రక్కసుండనే.

కృష్ణ:—(స్వ) ఓహో! ఈతఁడు సమరపరాఙ్ముఖుఁడై యిల్లఁగా పాఱిపోవ నుంకించుచున్నట్లున్నది. ఎట్టులో వీనిని దిద్ది యీ క్షేత్రయాత్ర సాగింపవలయును. లేనిచో యీ దుష్ట సంహారము కానేరదు. (ప్ర) అర్జునా! ఏమంటివి. (పై పద్యమును జదివి). అనియా, ఆహా! ఆ కౌరవులు మీ యెడ నొనరించిన [illegible]పరాధములప్పుడే మఱచితివా.

అర్జు:—లేదు కాని.

చం. గతజల సేతుబంధనముగాదె గతించిన మేలు [illegible]
సం, గతి తలపోయనాఁడు మన కాలము చెడ్డది గా[illegible]
శత్రులా, గతికి కురించినారు భవకర్మ ఫలంబులు [illegible]
వేరికిన్, క్షితి, గత కాలముఁ జరిగి చేకుఱనేరి [illegible]
గూర్చినన్.

కృష్ణ:—మీరజ్ఞాత వాసమున నిడుమలగుడుచుచున్న [illegible] మీ పెన్నాడుట మానక గోగ్రహణమను మిషచే [illegible]త క్రీడాచరింప సమకట్టినారో యొకసారి తలచి కొనుము.

అర్జు:—అగును.

ఉ. కాలము చెడ్డదైన రిపు కాండము లేమి స్వదేహరక్ష [illegible]
చాలు విరోధమై వెతలఁ జంపుఁ గిరాతుఁడు [illegible]
యనా, కోల పలాయనంబగుచు కొద్దిగ గాయము [illegible]
నేనియా, చాలకు రంగరక్తమెట పాఱిన [illegible]
దారి జూపదే,

అట్లే మేము మాదుర్దినములలో దుఃఖములనుభవించినాము.

కృష్ణ:—ఇప్పుడవి తీరినవా?

అర్జు:—తీరకపోయినను నేను బంధువధ మొనరింపనో[illegible]

సీ. ఈ బంధువులఁ జూచి నా బొందికంపించు [illegible]
ర్షము పుట్టె నేమి సేతు, గాండీవ మీ చేతినుండి [illegible]
నుచును వుడుకెత్తె నిచట నేనుండలేను, అపకీ[illegible]
తెన్నోయగు చున్న వీరక్రోతయ మీ బంధువులఁ [illegible]

యెటులఁ గాంతు, విజయంబు రాజ్యంబు విభవంబు
జీవంబు నాశింప నిపుడె మన్నఁగాని.

తే॥ కర్ణ దుర్యోధనాదులు బలుకొగాని, వారిఁ జంపినఁ
బాపంబె వచ్చుమనకుఁ, వారు మముఁజంపి ముల్లోక
వైభవములఁ, బొందఁగా నిమ్ము నాకు నిబ్బందిలేదు.

కృష్ణ:—ఇట్లని నీవు రణోపసంహారమునకు దారి తీసిన
నటుపై యెన్ని యాపదలుపుట్టునో యూహింప
కున్నావు.

ఉ॥ భీముఁడు నర్జునుండు రణవీధిఁ దొలంగియు జాతి
పోరు కాం, తార దురంతసీమలకు దారుణ కౌరవ
వహ్ని దాకఁగా, నూరక మాటకే యల సుయోధన
భీష్మక కర్ణదుస్ససే, నారమణీయమైన కదనంబని
లోకులు చెండనాడరే.

అర్జు:—ఆడిన నాడనిమ్ము కాని యీయుద్ధమే సాగించిన
నెన్నికుటుంబములో ఎన్ని కులములు నిర్మూలములై
పోవును.

మ॥ కులనాశంబొనరింపరాదు కుల సంక్షోభంబుగావిం
పనా, కులకాంతా నిచయంబు భ్రష్టయి శుచిర్
గోల్పోవు దుశ్శీలమై, కులముల్ సంకరమౌను; సంక
రులు మార్గుల్ కర్మముల్ సేయకే, ఖలులైపోదురు
వారిలో మనకు దుఃఖ ప్రాప్తి చేకూరదే.

కృష్ణ:—

ఉ. చాలును జాలు నీవగపు జాలు గ్రహింపఁగనయ్యె
నీకునే, లీలజనిం చెరుచ్చుము మలీమసమౌవిషయేచ్ఛ
మోహమా, భీల మనార్యసేవితము భీరువుబోలె
దురంబు మానెదే, చాలును లెమ్ము యుద్ధమును
సల్పుము భారతకీర్తి నిల్పుమా.

అర్జు:—కృష్ణా! నన్నేల యీయడి యాసలకు దింపెదవు.

ఉ. ఉత్తములైనభీష్మ గురుయోధుల యుద్ధములోన జంపి
యీ, నెత్తురుఁగూడు నేనుడుప నేరను భిక్షము నెత్తి కా
లముల్, బుత్తును వీడుగెల్పులెటుపోవునో తెల్పఁగ
రాదు, శాంతికిఁ గత్తఁ గదారిజూపుమది యింద్రపదం
బునకంటె మేలగుఁ,

కృష్ణ:—

తే॥ పండితునిభంగి నీతులు పలికెదీవు, వగవఁబనిలేనివారికై
వగచెదేల, బ్రతికియుండినఁజచ్చిన వారికొఱకు, వగవ
నొల్లరు పండిత వర్యులెపుడు.

ఉ. నేనవినాశనుండనటు లీవును నాశములేనివాడవే, యీ
నృపులెల్లనిత్యులు నశించినదేహము నాత్మనిత్యమే,
గానజనంజరామరణ కారణమైన యవస్థలన్నియు,
మేనికెగాని యాత్మను గమింపవుదానికి దుఃఖమేటికిన్

సీ॥ బాల్య కౌమార యౌవనములట్లుఁ బునర్జన్మ వచ్చును
జీవజాలములకు, శీతోష్ణసుఖదుఃఖ భీతుఁడవై శోక
మొగివానినన్నిటు నోర్చుకొనుచు, ఆత్మనిత్యంబు దేహం
బనిత్యంబను సదసత్పదార్థవిజ్ఞానమెఱిఁగి, పుట్టనిచావని
పొందఁబోవనియాత్మ చావదుచంపదే సమయమందు

తే. జీర్ణవసనంబువిడిచి మంచిదియునూత్నవస్త్రమునుగట్టు
నట్టులీయాత్మ, ప్రాఁతదేహమును వీడికొనుక్రొత్త దేహ
మునకు గానదీనికై వగచుట మానుమింక.

మఱియు నో కౌంతేయ,

ఉ. అచ్యుతధర్మదీక్షను దురాత్ములఁజంపఁగఁబోయినా
జిలో, జచ్చినవచ్చుస్వర్గము నిజంబుగ గెల్చిన రాజ్యభో
గముల్, వచ్చును గాన లెమ్ము మతిపాపముబొందవు
కర్మయోగనిం పచ్చియమెల్లఁ జెప్పెదను బంధవిముక్తికి
నాత్మశాంతికిన్.

సీ. మును నార్యునకు నేను వినిపించితిని దీని నిమడు రైవస్వత
మనవునకును, బోధించె నతఁడు సంబోధించియిక్ష్వాకు
నకునెఱిగించె తస్సకలమతఁడు, ఋషులందరికిఁ జెల్పి
యీ రేడులో కాల తరియింపఁజేసె నాతత్త్వమిపుడు,
నీకు వెండియుఁ జెప్ప నిశ్చయించితి పార్థ అనఘుండై
విను మా విధంబు,

తే. అగ్ని కట్టెలఁబడి కాల్చు నట్లుకర్మ|లన్ని జ్ఞానాగ్నిలోఁబడి
యంతరించు|నపుడు నగుపడుజగము నిండుయున్నట్టి నీవు
నాయందుననిన్ను వీక్షించఁగలవు.

అర్జు:—

తే. నీవు మొదవమొన్న దేవకీ దేవిగర్భ | శుక్తిముక్తాఫలంబయి
శోభగాంచ | గాంచఁబడితివితరణికిరణితత్వ | బోధకే
ళితివోనాకుబోధపడదు॥

కృష్ణు:—ధనంజయా! నేనప్పటి నుండియు నవినాశినుండనై వచ్చుచునే యున్నాను. నీవును నావలె వచ్చుచున్నావు. కానినీవు మఱచిపోతివి. నేనుమఱువలేదు. ఇదేనీకును నాకునుగల భేదము. అదిగో! చూడుము నావిశ్వరూపము (అనిచూపును).

అర్జు. (చేతులు మోడ్చి)

దండకము. నమోదేవదేవా నమోసర్వలోకేశ సర్వప్రకాశ. భవద్విశ్వరూపంబవాచ్యంబచింత్యంబ నంతంబవాఙ్మనసంబప్రమేయంబ సత్ చిత్ స్వరూపంబు నైలోకమై భూతకోటిన్ విడంబించి దీపింపఁ చనే నెంతవాఁడన్ భువర్లోకమ్ముల్ స్వర్గపాతాళ వజాలంబులున్ సర్వతేజః ప్రపంచంబు గాధాంధ్యబును చ్ఛంబు నీచంబు నీలోన నిండారి నీగర్భగర్భులోనుండి రూపించు ఈకారవ శ్రేణికా కంఠంబులో జిక్కి మాంపాహి పాహీ యటంచు నశించున్ మహాఘోర మీదారి యీపారి నన్నున్ ప్రసాదించి రక్షింపవే దేవదేవా నమస్తే నమః

: ఉమర్--అలీషా గారు

# "సాదీ" మహాకవి

మాడపాటి హనుమంతరావుగారు

పారసీక కవి శేఖరులలో ఆంగ్లేయులకు ఎక్కువ పరిచితుఁడగు నాతఁడు ''సాదీ'' అని చెప్పవచ్చును. ఈ మహాకవి రచించిన గ్రంథము లనేకములు. అయినను, అన్నిటిలో ''గులిస్తాన్'' ''బోస్తాన్'' అను గ్రంథ రాజములు ముఖ్యములు. వీని నామములు తెలుఁగు దేశమున నెఱుగని వారు అరుదు.

ఈతని జన్మస్థానము పారసీక దేశములోని 'షీరాజ్' నగరము. ఈ నగర మిప్పటికి ప్రఖ్యాతి కలదై యున్నది. అతఁడు పుట్టిన సంవత్సరము ఫలానిదని నిశ్చయింప వీలులేదు. కాని మరణ వత్సరము హిజ్రీ శకము ౬౯౧ సం॥ అను విషయమున మాత్రము అందరు నేకీభవించుచున్నారు. ఇది ప్రాయశః పదుమూఁడవ శతాబ్దము చివరనో, పదునాల్గవ శతాబ్దము మొదటనో జరిగియుండవలయును. క్రీ. శ. ౧౦౩౦ లో గజనీ మహమ్మదు చనిపోయినాడు కనుక 'సాదీ' యొక్క కవితా మహిమ అతని కాలమున నింకను ప్రకాశ్తికి వచ్చియుండ లేదని మన మూహించ వచ్చును.

'సాదీ' యనునది సంకేతనామము (తఖల్లుస్). అతని పేరు మస్లహుద్దీన్. మన కవి తండ్రి 'షీరాజ్' నగర పాలకుని వద్ద నుద్యోగమున నుండెను. ఈ యుద్యోగ మంత గొప్పదిగా గానవచ్చుటలేదు. అయినను బాల్యమున నితనికి ఆ కాలమున వాడుకయందుండు పద్ధతిని పారసీ విద్య నేర్పింపబడెను. మతభక్తి గలవాఁడగు తండ్రి సాహచర్యమున చిన్ననాటనే మన కవికి ఈశ్వర భక్తి, నీతితో గూడిన జీవనము అలవడెను. తండ్రి ఈతని చిన్నతనముననే పరలోకమున కేగిన పిదప యోగ్యురాలగు తల్లి ఈతని నడతను దిద్ది పెద్దవానిగఁజేసి యుండినట్లును, యౌవన చాపల్యముచేత తాను కొన్ని మారులు తల్లి కవిధేయత జూపి పశ్చాత్తప్తుఁడైనట్లును, కవి ''గులిస్తాను'' నందు చెప్పికొనినాఁడు.

ఆకాలమున మహమ్మదీయ ప్రపంచమున విఖ్యాత విద్యాకేంద్రమగు 'బగ్దాదు' నగరమున నితఁడు విద్య నభ్యసించి అరబీ ఫారసీ భాషలందు నిరుపమాన పాండిత్యము సంపాదించెను. తరువాత అనేక వత్సరముల వరకితఁడు 'పలస్తీను' మున్నగు ఏషియా ఖండాంతర్గత పశ్చిమ దేశములను ఆఫ్రికాలోనుగల పలుప్రాంతములు దర్శించి, వివిధ విషయ జ్ఞానమును సంపాదించెను. ఎన్నియో చోట్ల ననేక కష్టముల పాలయ్యెను. ఒకమారు క్రైస్తవుల వలన పట్టుకొనఁబడి, 'ట్రిపోలీ'లో, కందకములు త్రవ్వు పనియందు నియమింపఁబడెను. పూర్వ పరిచితుఁడొకఁడు అట్టి స్థితిలో కానవచ్చి, ద్రవ్యమిచ్చి విడిపించి, 'హాలబ్' నగరమునకు వెంటగొని వచ్చి అచ్చట తన కూఁతునిచ్చి పెండ్లిచేసెను! ఈ భార్య కడు గయ్యాళి. కొంత కాలమైన తరువాత, ఈమె యుండగనో, చనిపోయిన తరువాతనో కాని మరల నొక స్త్రీని పెండ్లియాడెను. ఆమె వలన కలిగిన కొడుకు శిశువుగనే మరణించెను. ఈ విధముగ నెంతో కాలము దేశాటనమున గడపెను. ఎన్నియో మారులు యాత్రికుల వెంట తీర్థయాత్రలకు జని, సజ్జనుల

దర్శించి, ఉత్తమ జ్ఞానమును, సాత్త్విక జీవనమును, అల వరచుకొని, చాలకాలమునకు ,,షీరాజ్'' నగరమునకు మరలివచ్చి, 'సాద్' అను పేరుగల నగరపాలకుని ఆశ్రయమును బొంది, 'గులిస్తాన్' 'బోస్తాన్' అను తన రెండు గ్రంథ రాజములను అతని కంకిత మొనర్చెను. తన సంకేత నామమగు 'సాదీ' యు 'షీరాజ్' నగర పాలకుని 'సాద్' అను పేరునుండియే ఏర్పరచుకొనెనని విద్వాంసులు, చరిత్రకారులు అభిప్రాయపడియున్నారు.

ఈ కవి వర్యుడు పై జెప్పిన విధమున కాలముగడపి జీవితము యొక్క తుదిభాగమున, 'షీరాజ్' నగరము బయట ఈశ్వరారాధనతత్పరుడై, సాత్త్విక జీవనము నొంటరిగా గడపి, పారసీక రాజ్యము తురుష్కస్థానము వారిచే జయింపబడిన పిదప కొంత కాలమునకు కాల ధర్మము నొందెను. సాదీ మరణానంతరము కవిసత్తముడొకడు రచించిన పద్దెమును బట్టి మరణ వత్సరము ౬౯౧ అని తేలుచున్నది.

ఏదేని మహాత్కార్యము జరిగిన వత్సర సంఖ్యను కవితా రూపమున ప్రకటించు చమత్కార పద్ధతి ఆంధ్రభాషయందు వాడుకలోనున్నది. అనగా, అంకెలు నిర్ణయింప బడియున్న కొన్ని శబ్దములను క్రమముగా కవిత్వమున గూర్చి వాని వలన నిర్దిష్టములగు నంకెలను క్రిందినుండి పైకి వరుసగా వేసికొని, ఉద్దిష్టమగు సంఖ్య వచ్చునట్లు చేసికొందుము.* ఫారసీ వర్ణ సమామ్నాయము (Alphabets) లోని ప్రతి యక్షరమున కొకయంకె నేర్పరచియున్నారు. ఏదేని మహద్విషయము జరిగినప్పుడు చిన్న పద్యమునల్లి, దానిలోని యొక చరణమునందలి గాని యొకశబ్దము నందలి గాని అక్షరములకు ఏర్పడియున్న అంకెలనన్నిటిని సంకలనము చేసి ఆ మొత్తము పై మహద్విషయ వత్సర సంఖ్యఅంత మగునట్లు చ... చెదరు! ఈ కార్యమునకై వారు కొన్ని మాసముల దినములు కష్టపడవలసి వచ్చును! మన భాషయందు ... తేల్చుట అంత కష్టమగు పని కాదు!

ఈ పద్ధతి ననుసరించియే, 'సాదీ' మరణ వత్సర నిర్ధారణ చేయబడినది, కనుకనే ఈ వత్సర సంఖ్య ... యందున నభిప్రాయ భేదము లేదు.

సాదీ రచించిన ౧౨ గ్రంథములలో రెండు ప్రకాశ్తి గాంచి, యందఱి వలన జదువబడునవి ,,గులిస్తాన్'' బోస్తాన్' అనునవి యని పైన జెప్పియుంటిమి. మహమ్మదీయ ప్రభుత్వము వెంట వచ్చిన ఫారసీ భాషతో గూడ నివి మన యాంధ్ర దేశము ప్రవేశించి, పారసీక దేశస్థులగు గోలకొండ కుతుబుషాహి రాజుల కాలమున పఠనీయగ్రంథములుగా మారి ఎల్లెడల వ్యాపించినవి. తరువాత మహమ్మదీయ ప్రభుత్వమును వీడిపోయిన ఆంధ్ర ప్రాంతములందు ఈ గ్రంథముల పేళ్లు మాత్రము స్మరింపబడుచున్నవి. నిజాం రాష్ట్రమున నిప్పటికి ప్రభుత్వ భాష ఫారసీ-నుండి ఉర్దూగా, మారనప్పటికిని ఈ గ్రంథముల ప్రకాశ్తి ... లేదు.

,, గులిస్తాన్ '' గద్యపద్యాత్మకము. దీనిలో ౮ అధ్యాయములు కలవు. ఇవి (౧) రాజుల గుణము...

---

* హైద్రాబాదు నందలి శ్రీకృష్ణదేవరాయల ఆంధ్ర భాషానిలయము క్రీ.శ. ౧౯౦౧ సం॥ నందు స్థాపింపబడెను. ఈ సంఖ్య నొకకవి ఈ క్రింది పద్యమున దెల్పెను.

,,ఆ మహానాధు కృష్ణరాయాధినాథు,
నామమున గ్రీస్తు శక వర్ష సోమ గగన
నిధి, సుధాకర నవమాస ప్రథమ దివస
మునను స్థాపించిరిట దీని ముదముతోడ''

సోముడు=౧ ; నగరము=౦ ; నిధి=౯ ; సుధాకర=౧. దీనిని క్రిందినుండి వరుసగా వేసినచో ౧౯౦౧ వచ్చును.

*'సాదీ' మరణ వత్సరము హిజ్రీ శకము ౬౯... ఈ సంఖ్య నొక కవిఫారసీ పద్యములో ఏ క్రిం... చరణమున వాడబడిన ,,ఖాస్'' అను శబ్దము ... దెల్పెను.

జెఖాసాంబూదజాంతారీఖ్ షుద్ఖాస్.

ఈ ,,ఖాస్'' శబ్దమున ఫారసీ భాషలో మూడక్షరములు కలవు.

ఖ్ = ౬౦౦ ; అ = ౧ ; స్ = ౯౦ ఈ అంకెల మొత్తము (౬౦౦+౧+౯౦) ౬౯౧ అగును.

ఫారసీభాష యొక్క ఈ సంప్రదాయము ఉర్దూలోను కూడ కలదు. బహుశః ఇది అరబీభాషలో నారంభమై మహమ్మదీయ మతము వెనువెంట ఫారసీ భాషకును, తరువాత హిందూదేశమునకును వచ్చినది.

(౨) సాధువుల వర్తనము (౩) తృప్తియొక్క ప్రభావము (౪) మౌనము యొక్క ఫలము (౫) శృంగార విలాసములు (౬) వార్ధక్యము (౭) శుశ్రూషా ఫలితము (౮) సహవాసము అనునవి. వీనిలో ప్రతి యధ్యాయమునను గొన్ని కథలుకలవు. కథలలోని సందర్భమును వివరించు భాగము వచనమునను, ముఖ్యమగు తత్త్వమును గాని నీతిని గాని ప్రకటించు భాగము పద్యరూపమునను నుండును. పై యెనిమిది అధ్యాయముల శీర్షికలను మనము నీతి, శృంగార వైరాగ్యములను మూడు భాగములలో నిముడ్ప వచ్చును. ఈ విషయమున నిది విఖ్యాత శతకత్రయమును బోలి యుండును.

ఈ గ్రంథరాజమును ఫ్రెంచి భాషయందు డ్యూరారంమను ౧౬౩౪ లోను, డాలిగరు ౧౭౦౪ లోను, గాండిను ౧౭౮౯ లోను, సెమెలెటు ౧౮౨౮ లోను అనువదించి ప్రకటించిరి. జెంటియసు వలన ౧౬౫౧ లో లాటిను భాషలోనికి మార్పబడెను. జర్మను భాషలోని కీపుస్తకము ఓల్యారియసు వలన ౧౬౫౪ లోను, డ్రాను వలన ౧౮౨౭ లోను, వుల్ఫు వలన ౧౮౪౧ లోను, గ్రాపు వలన ౧౮౪౬ లోను, పరివర్తనము బొందెను. ఇంగ్లీషునందు దీనికి ౫ భాషాంతరములుకలవు. రష్యను భాషలోను, పోలిషు భాషలోను, తుర్కీ భాషలోను ఒక్కొక యనువాదము కలదు. ఈ విధముగ పాశ్చాత్య భాషలలో దీని పరివర్తనము ౧౬౩౪ నుండి ఆరంభమైనది. ఇక ప్రాచ్య భాషలందు దీనికి గల ఖ్యాతి చెప్ప వలయునా?

"బోస్తాన్" కేవల పద్యాత్మకము. దీని పరిమితి పది యధ్యాయములది. ఇవి (౧) రాజనీతి (౨) ఉపకారము (౩) ప్రేమ (౪) సత్కారము (౫) శాంతత (౬) తృప్తి (౭) బోధనము (౮) కృతజ్ఞత (౯) పశ్చాత్తాపము (౧౦) పరివేదనము అనునవి. "గులిస్తాన్"లో వలెనే దీనియందును ప్రతి యధ్యాయమునం గొన్ని కథలు కలవు. కథాభాగము చాల తక్కువ; నీతి బోధన మెక్కువ. అంతేకాదు, విపులముగా నీతిని బోధించుటకు కథను లాంఛనముగాం దెచ్చిపెట్టినట్లు పలుదావుల గానవచ్చును.

"బోస్తాన్" జర్మను భాషలోనికి వెస్టర్డు వలన, ౧౮౫౨ లోను రూకర్టు వలన, ౧౮౮౨ లోను, అనువదింపబడినది. ఫ్రెంచి భాషయందు ౧౮౮౦ లోను ఇంగ్లీషులోనికి క్లార్కు వలన ౧౮౭౯ లోను, డేవీ వలన ౧౮౮౨ లోను, తుర్కీలోనికి ౧౮౭౦ ప్రాంతమునను పరివర్తితమైనది.

"గులిస్తాన్" "బోస్తాన్" లో నెన్నియో కథలు కవియొక్క స్వంత అనుభవములే. "నేనొకసారి యిట్లు చేసితిని అనియు నా విషయమున నొకడిట్లు చేసెను" అనియు కవి ధారాళముగ వక్కాణించును. ఈ గ్రంథములలోని కథలు, పంచతంత్ర కథలవలె జంతువులను, స్థావరాదులను గూర్చినవి కావు. మానవుల సాంసారిక జీవనమునకు సంబంధించినవే యుండును. మనోజ్ఞమగు సులభ శైలియందు, జీవితమును పవిత్రముగజేయు నీతి వాక్యములుకలిగి "గులిస్తాన్" "బోస్తాన్"లోని కథలు సర్వ దేశములందును సర్వకాలములందును బనికి వచ్చునవి గానున్నవి. "బోస్తాన్"కు "సాదీనామా"* యను నామాంతరము కలదు.

మొత్తము మీద పైన జెప్పబడిన రెండు పుస్తకములలోను "గులిస్తాన్" అను దానికిగల ప్రఖ్యాతి "బోస్తాన్" అను దానికి లేదనిచెప్పినచో తప్పుకాదు.

సాదీ రచితములగు నితర గ్రంథములలో ౨ అరబీ భాషలోను ౧౩ ఫారసీ భాష యందును (౧) భాషాత్రయము అనగా అరబీ, తుర్కీ, ఫారసీలందును కలదు.

---

* మహాకవి యొక్క సంపూర్ణ గ్రంథముల సంపుటము లండను నగరములోని "ఇండియా ఆఫీసు" గ్రంథాలయమున కలదు. ఇది లిఖిత ప్రతి. చాల ప్రాతది. దీని వ్రాత మహాకవి చనిపోయిన తరువాత దాదాపు ౩౫ సంవత్సరములదిగాం గానవచ్చుచున్నది. లేఖకుడు అబూబకర్ అనువాడు. సాదీయొక్క స్వహస్త లిఖిత గ్రంథమునుండి దీనిని వ్రాసికొన్నట్లు లేఖకుడు గ్రంథాంతమున అరబ్బీ భాషయందు వ్రాసినాడు. పై గ్రంథాలయము యొక్క పట్టికలో దీనిసంఖ్య (౧౧౧౭). దీనిలో కవి పేరు షర్ఫుద్దీను అనియు తండ్రిపేరు మస్లహుద్దీను అనియు నున్నది.

(షిబ్లీ కృతమగు "షహరుల్ అజం"అను గ్రంథము సం : ౨ పుట ౫౪) మా.మా.

బైతులు, కసీదాలు, గజల్లు, అను మూడు విధములగు కైతలలో, మొదటి వానియందు „ఫిర్దౌసీ'' ప్రవీణుడనియు, రెండవ వానియందు „అన్వరీ'' ప్రసిద్ధుడనియు, మూడవ వానియందు „సాదీ'' ప్రఖ్యాతుడనియు ఫారసీ వాఙ్మయమున ప్రసిద్ధము. పై విధములగు కవిత్వములను గూర్చిన వివరములు ఆంధ్ర పాఠకులకు జుగుప్సాకరములుగ నుండునను సంశయము వలన నా ప్రయత్నమును మాని, కవిశేఖరుని కావ్యములలోని కొన్ని సందర్భములను నాయల్పశక్తి కొలది తెనిగించుటతో దృప్తినందుచున్నాను. ఇందలి పద్యములలో బాఠకులకు గానవచ్చు సారము సాదీ కవితామహాత్మ్యము. సారహీనములగు భాగములు నా యయోగ్యత వలన నేర్పడినవిగా భావింప ప్రార్థన.

మన సాదీ కాలమున కవులకు రాజాశ్రయము తప్ప గత్యంతరము లేకుండెను. ఇది పారసీక దేశము స్థితియే కాదు. ఏషియాఖండము నందలి యన్ని దేశములును ఈ విషయమున తుల్యావస్థయందే యుండెనని చెప్పవచ్చును. అట్టి కాలముననున్న సితనికి రాజులను ప్రభువులను పొగడక తప్పినది కాదు. అయినను, అట్టి పొగడ్తల సందర్భమున గూడ వారికి హితబోధన మొనర్పక యూరకుండలేదు. 'అంకియాను' అను ప్రభువును గూర్చి సాదీ రచించిన స్తుతి పద్యములలో నొకచోట నిట్లున్నది:—

„ఎంత నీ వెలుంగుదువో, సాది, యంత పల్కు;
సత్యమును జాటవలయు విస్పష్టముగను!
ఆశయు, ప్రభుత్వ భయము లేనట్టి కవికి,
ఎంత పాటిది * 'తార్తార'? యెంత 'ఖుతను'!
న్యాయమూర్తి! సత్కీర్తి! మహామహిత!
మానితౌన్నత్య! 'అంకియాను' మానవేంద్ర''

మఱియొక సందర్భమున మహాకవి ఈ ప్రభువునే ఈ ప్రకారము సంబోధించెను.

„ఎదుటను పొగడ్త; చాటున నెవగింపు
నందు నృపతి రాజ్యము తప్పదని యెఱుగుము

* 'వేలము,' * 'నిరాఖు'ను * తురుష్క మేలునట్టి,
అసమవీర! న్యాయాధీశ! 'అంకియాను'!
జనకు నీతి వాక్యమ్ముల వినక పోక;
మానె; బుద్ధితో పినతండ్రి † మాటవినుము!
ప్రతి నరుడు నిజము ముఖాన పలుక లేడు,
సుమ్ము, 'సాది' యది సుసాధ్యమ్ము; నమ్ము.''

కవితా కాంత యొక్క పాతివ్రత్యమును అ[...]మగు స్తోత్ర పాతకము కళంకమునుండి కాపాడిన మహానుభావులలో సాదీ ముఖ్యుడుగా ఫారసీవాఙ్మయమున పేరొంది యున్నాడు. ఇతడు పేదవాడు. దరిద్రము యందుండి తన ప్రభువుల లోపములు బయటపెట్టి వారి హితము గలుగుట ఎంతో నిస్పృహుడగు వానికి గాని సాధ్యము కాదు! గొప్ప వారిని స్తుతించుచు పద్యములు వ్రాయుమని మిత్రులు సాదీని ప్రోత్సహించుటయు అతడందుకిచ్చిన ప్రత్యుత్తరమును శ్రీనాథుడు ప్రోత్సహించినను రాజాశ్రయమును గోరక, దరిద్రము నందు కాలము గడపిన మన పోతన కవీంద్రుని జ్ఞప్తి దెచ్చుచున్నది!

„కాలమీలీల వృథచేసెదేల, సాది!
వచ్చుబడి కొంచెమే; యైన నొచ్చుకొనకు;
స్తుతులు రచియింతువేని నీ వెతలు బాయు;
ధనము లేని విద్వాంసు జీవనము నమ్ము;
హితుల కోర్కెల ధన హీనుడెట్లు తీర్చు!

* „తార్తారము'' మధ్య ఏషియాలోని యొక దేశము ఇప్పటి రష్యను తుర్కిస్థానము (Russian Turkistan) „ఖుతను'' అనునది పారసీక దేశ సమీపమగు నొక ప్రాంతమని నా తలంపు. 'వేలసు' 'ఇరాఖు' అనునవియు చిన్న ఏషియా (Asia Minor) లోని దేశములు „తురుష్కము'' అనగా తుర్కీ (Turkey).

† పినతండ్రి అనగా 'సాదీ' యని ఇచట భావము. మిత్రుని ప్రేమ మనసుతో తానట్లు చెప్పుట మహాత్ముల యభిప్రాయముగా గానవచ్చుచున్నది. 'చిన్నాయనా' యని పలుకు మహమ్మదీయ [...]కులు కలరు. వారి తండ్రులు నా మిత్రులు కారణము. మా.పా.

తీర్పు లేని, "శత్రువు గెల్పు స్థిరము" టంచ్రు!
చచ్చు మాంసము గ్రద్ద మెసంగి బ్రతుకు!
పర్వతాగ్రాన సంతృప్తిం బడయు "నన్ఖ" *
అనముల సమీపమున కేగి యడ్గినగుట,
కాదు నా చేత; కాదు; చికారిపోల్చు—!!

సాదీ కథలలో విశేషము సాధు వర్తనమును గూర్చినవై యున్నవి. సాదీ యొక్క సాధు పురుషుఁడు భారత వర్ష కవుల సాధు పురుషునకు, సాత్త్వికమున నే మాత్రము తీసిపోఁడు! ఈ విషయమును 'బోస్తాఁ' లోని యొక చిన్న కథను పూర్తిగా ననువదించి పాఠకుల కుఁ జూపెదను. దీనివలన, పై గ్రంథములోని కథల పద్ధతియు బోధపడఁగలదు.

"సురనొకఁడు త్రాగి తన తంబురను సాధు
వరుని తలమీఁద నొకరాత్రి పగులఁగొట్టె,
మఱునాటి దినాన సాధు వానికత్తుకడకు,
నిడికెడు ధనంబు గొనిపోయి, పిలిచి చెప్పెను
"రాత్రి యొడలెఱుఁగక సగర్వముగ నుంటి,
నపుడు మన తల తంబురలట్టె పగిలె.
నాదు గాయము నయమయ్యె; లేదు భయము,
తంబురకు గాయమెటు మాను ధనము లేక?"
జనుల వలన నిరంతర శ్రమల గాంత్రు;
కనుక నే దైవ భక్తుల ఘనత హెచ్చు?"

ఇట్టి నీతి బోధకములును సాధువర్తనమును ప్రోత్సహించునట్టివియునగు కథలు పై గ్రంథమున నెన్నియేని కలవు. గ్రంథ విస్తర భీతిచే వదలవలసి వచ్చెను.

ఒక చిన్న యంశమును గమనింపుఁడు. ఇది సాదీ బాల్యపు సంగతి:—

"బాల్యకాలపుమాట జ్ఞాపకము కలదు;
పండుగు దినాన తండ్రితో బయటకేగి,
ఆటలాడుచు జనసమూహమునఁబడితి!
తండ్రి వేరయ్యె; నా దయ్యె దారి వేరు!
గుండె పగిలి యేడ్చితిని; లేకుండ తాల్మి,
ఎట్టులో తండ్రి నన్ గని పెట్టి, బుగ్గ,
నులిమె "తుంటరీ, పలుమారు తెలుపలేనే?
కొంగు వదలకురా, నాదు కొంగటంచు!"
కను, ముముక్షుఁడ; జ్ఞానమార్గమున నీవు;
బాలుఁడవె; ఉత్తములకొంగు వదలఁబోకు!"

ఇంత కొద్ది యంశమును జెప్పి దానిమూలమున నింత గొప్ప విషయమును బోధింప గల్గుట సాదీ వంటి సుజ్ఞాని యగు కవి సత్తమునకే తగియున్నది.

ఇఁక నొక సంగతి వ్రాసి పూర్తిచేసెదను. షమ్సుద్దీనను మహాశయుఁడు మన సాదీకి ఒక తల గుడ్డను ౫౦౦ ‡ అష్రఫీలను తన నౌకరుతో నంపెనట. వాడు అందులో ౧౫౦ అపహరించి మిగత ద్రవ్యమిచ్చెనట! సాదీ ఇట్లు రసీదు వ్రాసి యిచ్చెనఁట!

"పంపితివి బహుమానము; బహుళ ధనము;
నీ ధనము, శత్రుతతి, హెచ్చు, నిల్లుఁగాక;
† అష్రఫీ కేడు లెక్కన నాయువగుచు,
నిలమనెడు గాక, మున్నూటఁ యేబదేండ్లు!"

* "అన్ఖ" యనునది అరబీ వాఙ్మయమున నొక కల్పిత పక్షి. ఇది ఎచ్చటను కానఁబడదట! కాకసను పర్వత శిఖరమున నుండునఁట! మా. హ.

‡ అష్రఫీ యనునది యొక బంగారపు నాణెము. ఇది నేటికిని నిజాం రాష్ట్రమున వాడుక యందున్నది. మహా ఘనత వహించిన నిజాము ప్రభువు గారికి నజరానా యిచ్చువారు అష్రఫీల రూపముననే ఇత్తురు. దీని విలువ సుమారు రు. ౩౦ లు.

† నౌకరు దుర్మార్గమును గ్రహించి షమ్సుద్దీను, ౧౦ వేల అష్రఫీలంపెనఁట! పై పద్యములోని యుక్తి తెలియుచునే యున్నది కదా వివరింప వలసిన పని లేదు.
మా. హ.

# నేస్తమా!

సిరుగూరి జయరావుగారు. బి. యస్.సి.

శ్లో. ఆలోలోర్మీ పవన చలనాందోళనానందమందం
తీరస్స్వైరైః కిసలముదితైః కోకిలానాం సమూహైః
కూజద్భిర్యన్ముఖరితమనూ నార్తనం రాగమూర్తం
నాదం తద్వల్లసతి భవతాం స్నేహగానప్రతానం

శ్లో. వేళాతీత విలాసహావతరళ స్వానోర్మికా మాలికా
డోలాచాలనశీల కాంత కవితా బాలామణీ కేళికా
లీలాలోకన మత్త చిత్త కవిరాణ్మంగళ్యగాన స్వన
శ్రీలాలిత్యము పైతి, హే! సఖ! భవన్మైత్రీపిపాసామృతం

చ. తొలుతను జందమామ యను తోయిలమున్ గని, వానిలేత
వెన్నెలయను పాలు త్రావి, కడు నెయ్యులఁజుక్కలఁగూడి, స్వర్ణదీ
చలితతరంగమాలికల సౌహృదభావము మెచ్చుకొంచు, లీ
లల నెలయించుకైత నవలాచిఱుపాటల నాలకింపుమా.

చ. తొలుతను మైత్రి; దాని మును ద్రోయుచుఁ గావ్యకలాకలాపసం
చలసకలస్వనశ్రవణ సంగతరాగము; దాని వెన్కఁ బిచ్ఛిలమగు
దైవికంబయిన చిన్మయతాగుణలీన తైక్యమున్
గలుగఁగ, నీకు నాకుఁ గల కాలము కల్గు సుహృద్విలాసముల్.

చ. తరళతరంగ రాజముల తప్పనిబాస; మృణాళనాళికా
భరమనునాస; తద్రసపిపాస; విలాస విభాసురప్ఫులా
సరసుల రాజహంసలకు సంగతిగూర్చినయట్లు, కావ్యసం
భరమునఁ బారవశ్యవిభవంబునఁ బొల్చెదమోయి నేస్తమా.

మ॥ విమలానంత మయూరసప్రసరమా విజ్ఞానవారాశినిం
డిమరుద్రాజము జోరునన్ విసరుపొంగుల్, గావ్య బాంధవ్య
సంభ్రమమీనాటికి నీకునాకు సవినాభావంబుఁ గల్పింప, న
వ్యము దివ్యంబగు పారవశ్యమున నవ్యక్తుండ నైపోయెదన్.

మ॥ ఒకచోఁజూడ ననంత నీలరుచిరవ్యోమంబు; అశ్రాంత గా
నకళాలోలతరంగమాలికల సంతవ్యాప్తి నింకొక్కచోఁ
బ్రకటస్నేహ నిదాననంగతి సపారంబైన: యాదిక్కునన్
సుకమున్ గ్రోలెదుకై వడిన్, బ్రకృతి సంశుద్ధిస్ఫురన్మైత్రులన్
వికసిల్లున్, చెలి!, యస్మదవ్రణ మహార్వీజీవనోన్మేషముల్

# శ్రీకృష్ణరాయల జన్మోత్సవము

క్రీ. శ. ౧౯౩౮ వ సం. కీ. శే. వనపర్తి

సంస్థానాధీశులైన శ్రీకృష్ణ దేవరాయల అధ్యక్షకోపన్యాసము.

ఆర్యులారా, సోదరీమణులారా;

నేఁడు గొప్ప సుదినము; కవిసార్వభౌముఁడైన శ్రీకృష్ణదేవరాయల వారి జన్మోత్సవ దినము! ఇట్టి గొప్ప యుత్సవమురోజు మీరు నాబోటి భాషాపాండిత్యములేని వానికింత గొప్పపదవి నొసఁగుట యాశ్చర్యకరము. గొప్ప విద్వాంసులును, గొప్ప మహారాజులునుండ నాకు నీపదవి నిచ్చుట మీయాదరి యభిమానమువలన సాఘటించిన విషయము; ఇంతియకాని, నాశక్తికొలంది తెలియు విషయములు విన్నవించుకొనుచున్నాను; వించురనిమనవి.

శ్రీరాయులవారు విద్యానగర మహారాజులలోని గొప్పమహారాజు. విజయనగర సామ్రాజ్యము ౧౩౩౬ క్రీ॥ శ॥ సంవత్సరములో విద్యారణ్య స్వామివల్ల సంస్థాపింపఁ జేయఁ బడినది. వీరు మహాతపస్సంపన్నులనియు, జ్ఞానులనియు, వీరి నామధేయమును మహాప్రఖ్యాతియుఁ దెలుపుచున్నవి. రాయులవారి కాలములోనే యీరాజ్యము గొప్పయున్నత స్థితినిఁ జెందెను. నేటికిని, శిథిలమైన యీపట్టణము, నాటికాలపువైభవమును దెలుపుచున్నది.

శ్రీకృష్ణదేవరాయుల జన్మదివసమును నిర్ణయించుట చాలకష్టతరము. కొందరు క్రీ॥ శ॥ ౧౪౮౭ అనియు, కొందరు క్రీ॥ శ॥ ౧౪౭౧ అనియు, వ్రాసిరి, కాని, యేదియోస్పష్టముగాఁ జెప్పుటకుఁ దగిన యాధారములేదు. రాయులవారు క్రీ॥ శ॥ ౧౫౦౯ సం॥ లో, పట్టాభిషిక్తుఁడయ్యెనని కొన్ని శాసనముల వలన విశదమగుచున్నది. వీరి తండ్రి నామధేయము నరసరాయులనియు, తల్లినామధేయము నాగాంబయనియు, గొన్ని యాధారముల వలనఁ దెలియుచున్నది. ఇతఁడు ౨౧ సం॥లు గొప్ప దండయాత్రలుచేసి, ధర్మశీలుఁడై యఖండ రాజ్యవైభవము ననుభవించెను. గొప్పశూరుఁడే గాక, విద్వాంసుఁడనియు ఇతఁడు రచించిన „ఆముక్తమాల్యద" యేచెప్పుచున్నది.

ఈ వీరుఁడు తన మొదటిదండ యాత్రను క్రీ॥ శ॥ ౧౫౧౨ స॥ మొదలుకొని, ౧౫౧౫ వరకు సలుపుట తేఁటబడుచున్నది. ఇదియేకాక, మఱియు నెన్నియో దండయాత్రలను సలిపియున్నాఁడు. ఇతఁడు తనరాజ్యకాలములో, పూర్ణకర్ణాటక, ద్రవిడ, మలయాళ దేశములన్నియుఁ దనవశముకావించు కొనియెను. ఉదయగిరి, కొల్లముకొండ, కొండవీడు, రాచూరు, మొదలగు పర్వతదుర్గములను సాధించెను. వీరులైన ప్రతాపరుద్రకుమారులను, ఆదిల్ సాహ్ మొదలగు తురుష్క వీరులనుజయించి, పారఁదోలెను. ఇటువంటి దండయాత్రలు మహారాజులకు సాధారణమే. ఈ శూరాగ్రేసరుఁడు, బాహుబలమే ప్రధానము కాదనియు, కేవల ప్రాపంచికమాత్రదృష్టి రాజ్యములను నిలుపఁజాలదనియు నెఱింగి, దీనికంతయుం బ్రజానురాగమే ముఖ్యమను నమ్మికను, దనక్రియల వలనఁజూపియున్నాఁడు. వాఙ్మయమహిమ రాజ్యములకు నైక్యతను గలిగించు శక్తులలో గొప్పదని వెలిపుచ్చుటకై, రాయులవారు, అల్లసాని పెద్దన నంతగా గౌరవించిరి; ఈ విషయమే వీరియుదారదృష్టికి సాక్షియనవచ్చును. రాయులవారు నిర్మించిన శాసనములకు వ్యతిరేకముగా నడచుటయే, విజయనగర సామ్రాజ్యము చెడుటకుఁగారణము.

„ఋషిరాగ్యత కొంతవరకైన సాధింపనివాఁడు మహాకావ్యమును రచియింపఁజాలఁడు" అనియొడు లో

శోక్తి సంస్కృత శ్లోకరూపముగా వాడుకలోనున్నది. కాన, కృష్ణదేవరాయలు రచియించిన గ్రంథములవల్ల, రాయలవారికి సాధారణమహారాజచిహ్నము లేకాక, ఋషిచిహ్నములు కూడ నున్నవి యనియనవచ్చును. ఇతఁడు యుద్ధరంగములలోనేకాక, సావకాశముగా శాంతచిత్తుఁడై యున్న సమయములందు, ఈయన యొక్కసభ గొప్ప విద్వాంసులచే నలంకరింపఁబడు చుండెను. కవిసార్వభౌముఁడు తానుసభాసీనుఁడైయున్నయెడ, అస్థానకవులకుఁదన కవితాచమత్కృతిఁదెలుపు సమస్యలిచ్చి, వారిచే సమస్యాపూర్తి గావింపించి, ఆపద్యములువిని సంతోషించి, సన్మానించుచుండెను. ఇతనికి నాంధ్రభోజుఁడను బిరుదుకలదు. భోజునిసభ కాళిదాసు మొదలగు మహాకవుల లంకరించినట్లు, రాయుల వారిసభ, పెద్దన, తిమ్మన మొదలగు కవులచే నలంకృతంబై యుండెను. వీరికింబూర్వమున్న కవులు సంస్కృత గ్రంథములనే తెనిఁగించుచుండిరి. వీరు తమ కాలములో మనుచరిత్రము, పారిజాతాపహరణము మొదలగు స్వతంత్రకావ్యములఁగృతినంది ప్రసిద్ధిం గాంచిరి.

ఇమ్మహాత్ముండు, ఆంధ్రభాషాభివృద్ధికొఱకు యెంతో పాటుబడెను. వీరిజన్మదినము మన మాతృభాషయొక్క జన్మోత్సవదినమని భావింపవలయును. రాయలవారాంధ్రభాష నున్నతస్థితికిఁదెచ్చి విడిచిరి. అదియిప్పుడు మనయందరి యనాదరణచే జాలహీనస్థితికి వచ్చుచున్నది. దీనినిఁగాపాడుట మనవిధి. లక్ష్మియు సరస్వతియు నొకయింటనుండుటయరుదు. రాయలవారి విషయములో మాత్రము లక్ష్మిసరస్వతులనపాయినులు. ఉభయులుంగూడినంగాని మన మాతృభాష వృద్ధిఁజెందదు. కృష్ణదేవరాయల యాంధ్రభాషా నిలయము వెలుగనేర్పడినప్పుడు మన కార్యము సఫలమగును. నాకు తోఁచినకొన్ని విషయములను విన్నవించుకొన్నాను. తప్పులున్నయెడ క్షమింతురని నానమ్మకము.

## శైశవము

ఉదయరాజు శేషగిరిరావుగారు

తొట్టియలో సుశీలయను దొరవుఁబేరున గారవించుచున్ ;
ముట్టిన మాసిపోవుజిగి ముద్దులుగారెడు మేనునేతులం
దట్టుచు; నెన్నొసల్గదియఁ దద్దయు దిచ్చలుగొంచు వీపుజో
కొట్టుచుబాజ్జబుజ్జుమని, కోరికమాపితినో „మనోరమా”!

పులుకు పులుకునంగనుచు బుద్ధులెఱింగిన ప్రోడపోలకం
దెలియఁగరానిక్రొంబలుకు దేనెల సోనలఁ జల్లి, తప్పటడ్గులిడుచుఁ దల్లిఁజేరి నెలచందురుఁదెమ్మని మండివేడి పొంగులునను వెన్నముద్దలిడఁ గొంచియమూరడితో „మనోరమా”!

(„మనోరమ”)



వనపర్తి సంస్థానాధీశులు

శ్రీ రాజారామ దేవరాయలు మహాభూపాల్ బహద్దురు | కీ. శే. రాజా రామేశ్వర రావు బహద్దురు | కీ. శే. శ్రీకృష్ణదేవరాయలు బహద్దురు

# రాచకొండ

(చరిత్రాంశము)

డాక్టరు ఒద్దిరాజు సీతారామచంద్రరావు గారు

శాసన పరిశోధనము వలన ఏ క్రింది చరిత్ర తేలుచున్నది. ౧౪ వ శతాబ్దమందీ దుర్గ మనపోతనాయని యధీన మందుండెను. ఈ యనపోతనాయడు రేచెర్ల సింగమ నాయని పెద్ద కుమారుఁడు.

రేచెర్ల సింగమనాయనికి "ఎఱదాచనాయని సింగమ నాయ" డని నామాంతరము గలదు. ఇందును గురించి "ప్రాచీన శాసన పరిశోధక సంఘము" వారు తమ రిపోర్టు నందిట్లు తమ సంశయమును వెలిబుచ్చి యున్నారు.

"It is not certain whether this is a name of a man. It may be, that Yerra Dachis Nayani and Singama Nayani were brothers with only one son between them, and hence Anavothe Nayinin Garu might have been called the son of the two brothers; or it may be that Singama Nayani was the son of Yerra Dachi Nayaini and there fore called Yerra Dachi Nayani Singama Nayini, as is usual sometimes, whose son was our Anavotha Nayanin Garu"

"ఇదియొక్కని పేరనుట నిశ్చయము గాదు. ఎఱదాచనాయని, సింగమనాయని యను నిరువు రన్నదమ్ముల మధ్య నితఁడొకడే పుత్రుఁడై యుండును. కావున వారిరువురకీ యనపోత నాయుడు పుత్రుడని వ్యవహరించుచుందురు. అథవా సింగమనాయడు ఎఱదాచనాయనికి పుత్రుడు గావచ్చును. తండ్రి పేరు తమపేరు మొదట నుంచుకొనుట యొక అచారమగుటచే ఎఱదాచనాయని సింగమనాయఁడను పేరు గలిగియుండును. సింగమనాయని కుమారు డనపోతనాయనిం గారు". అని పరిశోధక సంఘము వారి యనుమానము.

కేవల శాసనముల యందలి భావము మీదనే యాధారపడియున్న చరిత్ర యా సంఘము వారికిట్టి యనుమానము గలిగించినను, వారి రెండవ సందేహమే నిజమైయున్నది. వెలుగోటి వారి వంశ చరిత్రయందు (౨౫ వ పుటలో) సింగమనాయఁ డెఱదాచ నాయని పెద్ద కుమారుఁడైనట్లును, ఎఱదాచ నాయఁడు ప్రతాప రుద్ర చక్రవర్తి ప్రసిద్ధ సేనానాయకులలో నొకఁడనియు స్పష్టముగా వ్రాసి యున్నది. "సింగ భూపాలీయ" మను సంస్కృత గ్రంథమందును స్పష్టపరుపఁబడి యున్నది.

ఈ సింగభూపాలున కిరువురు కుమారులు గలరు. పెద్ద కుమారుఁ డనపోతనాయఁడు, రెండవ కుమారుఁడు మాదానాయఁడు.

సింగ భూపాలుని పరాక్రమమునకు సహింప జాలక సిలని బావమఱదియగు చింతలపల్లి సింగమనాయనిని చెఱబట్టి జల్లిపల్లి (మహబూబాబాదు తాలూకా యందు గలదు) కోటలో చెఱపెట్టిరి. సింగమ నాయడు దండెత్తి జల్లిపల్లి కోటను ముట్టడించిరి. కోటలోని రాచవారు మాయోపాయముల నొనర్చి తమ్మశ్రీబ్రహ్మాజి యను నాతని ద్రోల నాతడు కపట స్నేహమొనర్చి రేమరుపాటునఁ బొడిచిచచ్చెను.

సింగమనాయఁడు కుమారులగు ననపోతనాయనిని, మాదానాయనిని బిలచి "గడచిన దానికి ఏగచిన లాభము లేదు; నన్ను జంపించిన శత్రువులకంత రక్తముచే నాకు రక్తాంజలినిమ్మ"ని చెప్పి ప్రాణములను విడచెను.

సింగమ నాయని కుమార ద్వయము తండ్రి యభిమతానుసారముగ జల్లిపల్లి, ఇనుగుర్తి (తెనుఁగు పత్రికా కార్య స్థానము గల గ్రామము) కోటలను ముట్టడించి శత్రువుల దునిమెను.

అనపోతనాయనికి పూర్వమే రాచకొండ దుర్గము నిర్మింపఁబడి యున్నటుల తోచుచున్నది. ఏలయనగా వాతని తండ్రియగు రేచర్ల సింగమ నాయనిఁగారు బ్రహ్మ స్థాపనములను దుర్గ నిర్మాణముల ననేకముల నొనరించి నట్లు తెలియుచున్నది. "సింగ భూపాలీయము" నందలి,

శ్లో॥ కృష్ణా శైలేశ్వర సన్నిధౌ కృతమహా సంభారమేతే శ్వరే। వీతాసాయమనేక శోవిదధతా బ్రహ్మ ప్రతిష్ఠాపనం। అన్పూర్వ్యం సమపాదిరేయేన విభునాత త్తద్దుర్గ రాత్మనో। నిర్మాణాతిశయప్రయాస గరిమ వ్యాసజ్జిని బ్రహ్మణి.

అను శ్లోకము బ్రహ్మప్రతిష్ఠాపనావిషయ ముద్ఘాటించుచున్నది. కాని అనపోతనాయని యధీనమందీ దుర్గము ౧౪ వ శతాబ్దమునందుండెను. అప్పుడీ రాచకొండ దుర్గము సుచితరీతిని దృఢపరచి యుండును. రాచకొండ యందలి శాసనములైదింటి యందీ దుర్గ నిర్మాణమును గురించియు, అచటి బావులను గురించియు బ్రశంసింపఁబడియున్నది.

"అనపోత సముద్ర" మనతన పేరిట ననపోతభూపాలుడు చెరువు నొక దానిని గట్టించెను. దానికిప్పటికి నదే పేరు వాడుకయందున్నది.

అనపోత నాయఁడు భైరవుని వంశమునకు జెందిన వాడనియు, "మహామండలేశ్వర, ఆంధ్ర దేశాధీశ్వర, కాకతీయ స్థాపనాచార్య, అష్టదిగ్రాజ భయంకర" అను మొదలగు బిరుదముల గలవాఁడనియు శాసనము లుద్ఘోషించుచున్నవి. కాని ఈ యనపోత నాయనికి "కాకతీయ స్థాపనాచార్య" యను బిరుదము పిత్ర్యమైనదని చె వచ్చును.

అనపోతనాయని శాసనములన్నియును విశ్వా సంవత్సర శ్రావణ బ॥ ౫ (శా.శ. ౧౨౭౧, క్రీ.శ. ౧౩౪ ‌–౧౩౬౦) నాటివని స్పష్టపడుచున్నవి.

ఈ రాచకొండ (రాజగిరియనియు శాసనము పేర్కొనఁబడినది) దుర్గము రేచర్ల వంశీయుల పా ము క్రింద నెంత కాలముండినది, తుదకెట్లు భగ్నమై తెలియుటకు చాలినంత చారిత్రికాధారములు లేవు. ని దేవాలయమును మహమ్మదీయ ప్రార్థనా మందిర గా మార్చఁబడిన అరబ్బీ భాషయందొక శాసనము ౭౫ హిజిరి (క్రీ.శ. ౧౪౫౪) లో మందిర స్తంభముపైఁ జె బడియుండుటచే అప్పుడే రాచకొండ దుర్గము మహ దీయుల స్వాధీనమై యుండునని నమ్మవలసి యున్న ఇంతకంటె ప్రబలాధార మేదియు నిప్పటికి గానరా ఈ కాలము నకే (క్రీ. శ. ౧౩౪౭ లో) బహమని రా ము స్థాపితమై యుండుటచేతను, హసన్ గంగా బ్ వుద్దీన్ షాహ కుమారుఁడగు మహమ్మదు షాహ మొ లగు బహమని రాజులప్పుడప్పుడు రేచర్ల వారి రాజ్య మీదికి దాడివెడలి జయాపజయములఁ బొందుచుం చేతను బహుశః యీ రాజ్య వినాశము బహమని రా వలననే జరిగియుండునని తోచుచున్నది ఒకవేళ బహ మని రాజులు గాక పోయినను మహమ్మదీయులే కా లని పైనఁ జెప్పబడిన అరబ్బీ శాసనమువలన దెలియుచు

దుర్గ నాశమునకు కారణములేవియో, ఎవరి ధ్వంసము చేయబడినదో తెలియకున్నను, ఈ క్రింద హరింపఁబడిన యొక గాథ స్థానిక చరిత్రవలన తెలియ చున్నది. అదేమనగా :—

"రాచకొండ రాజులలో చివర రాజు కడు ఈతని కొక పుత్రుఁడు గలిగెను. తల్లియొద్ద చాలి స్తన్యము పిల్లవానికి దొరకనందున 'పసి పిల్లలు గల లందఱు వచ్చి స్తన్యములనియ వలయు'నని ఆ రాజు నిచ్చెను. అక్కడ పోలకమ్మ యను చాకలస్త్రీ రాజాజ్ఞ ధిక్కరించెను; కాని రాజ భటులామెను బట్టితెచ్చి లునకు స్తన్యమిప్పించిరి. ఆ సమయమందామె

ప్రాయోపవేశ మొనరించెను. దుర్గమందొక చోట "అక్క- పోలకమ్మ" యను దేవతగలదు. ఈ కథ జరిగిన మూడవ నాడియుపురు మహమ్మదీయావధూతలు (ఫకీరులు) ప్రబల సైన్యముతో వచ్చి దుర్గమును ముట్టడించిరి. ఆ యవధూతలలో నొకని పేరు గాలిబు సాహెబు. మూడుదినములు యుద్ధము జరిగెను. రాజు, ఆతని తమ్ముడు హతులైరి. గాలిబు సాహెబు శిరము ఖండింపఁబడి కోటలోని వారి వశమయ్యెను. గాలిబు సాహెబు కబంధము (శిరములేని దేహము) కోటస్వాధీనమగు దాక యుద్ధమొనరించుచునే యుండెనట. తుదకు దుర్గము స్వాధీనమయ్యెను. కోటలోని వారు చంపఁబడిరో పారిపోయిరో తెలియదు. గాలిబు సాహెబు శిరము గోయునపుడు మూడు రక్తబిందువులు భూమిపై బడియెనట. అచ్చట మూడు గోరీలు కట్టబడియెను. శరీరము బెజవాడలో భూస్థాపిత మొనరింపఁబడియెను."

ఈ కథను గుఱించి కొంత నమ్మకము, కొంత యనుమానము గలుగుచున్నది. గాలిబు సాహెబు దర్గాయును, అక్క-పోలకమ్మ దేవతయును నుండుటచే యీ చరిత్రకీవిషయములతో గొంత సంబంధముండి తీరవలెనని తోచుచున్నది. అయినను ఎఱింగినంత వఱకు సుప్రసిద్ధ దుర్గ నిర్మూలము కొఱకిట్టి చాకితల నుపకరణముగా స్థానిక చరిత్రలు గొనుచుండుట సూర్యాపేట తాలూకాయందలి ఉండ్రుగొండ, ఓరుగల్లు తాలూకాయందలి చంద్రగిరి మొదలగు దుర్గముల వినాశన చరిత్ర తెలిసిగిన వారికి సుస్పష్టము.

మఱియొక సందేహమేమనఁగ: చాకిత శాపమొసంగినపుడు "తురుష్క-లీ దుర్గమును స్వాధీన మొనరించుకొనియెదరు గాక" యని యనకపోయినచో గాలిబు సాహెబు వచ్చి దుర్గము స్వాధీన మొనరించు కొనుటకు సంధిలేదు.

చాకిత శాపము ననుసరించి భగవానుడు తురుష్కావధూతలనే పంపునను నమ్మకము లేదు. గాలిబు సాహెబు భగవానునిచే రాచకొండ దుర్గ ధ్వంసమునకు బంపఁబడకున్నచో గాలిబు సాహెబు శిరః ఖండనమైన పిదప కబంధము యుద్ధము చేయఁజాలదు. దేవుడే గాలిబు సాహెబును బంపినచో ప్రబల సైన్యమును వెంటనేయ వలసిన పని దేవునకు లేకుండ యుండదు. చావులేనియేదొ క్క-రిద్దరినో తోలియుండును.

గాలిబు సాహేబు శిరః ఖండనమైనపుడు క్రింద రాలిన మూఁడు నెత్తుటి చుక్క-లపై మూఁడు గోరీలు కట్టిన మాట నిజమేయైనను గాలిబు సాహెబు దర్గాయందు ప్రాకారమునందు మూడు గోరీలును, గుమ్మటమునందు మూడు గోరీలుండుటకును, కబంధమును బెజవాడ వఱకు గొంపోవుటకు కారణమేమో తెలియదు.

ముఖ్యముగా విచారింప వలసిన కారణమొకటి గలదు. ఏమన ఒకానొక చాకితచే నిర్బంధ విధమున రాజ కుమారునంత వానికి చన్నుబాల నిప్పించుట దోషము గాఁజాలదు. మానభంగాది దుష్కా-ర్యములు జరిగననిన నొప్పుకొనవచ్చును. స్త్రీలకు బాలురను గనినపుడు స్తన్యమిచ్చుట యొక పూర్వపు టలవాటే. అదియే యొక వేళ బలాత్కా-రత మొనరింపఁబడినను యింతటి ఘోరశాపమా చాకిత యొసఁగకుండెడిదే.

మఱియొక కారణమేమనగా ఆరబ్బీ శాసనమందంతటి పరాక్రమ మొనరించిన గాలిబు సాహెబు పేరుగాని ఆతడు దేవుని సాన్నిధ్యమున కేగెనని యుపేక్షించినను ఆతఁడు శిరముఖండింపబడినను యుద్ధమొనరించెనను పరాక్రమమైనను చెప్పఁబడలేదు. ముబారిక్ పుత్రుఁడగు మలిక్ నిమాత్ పేరు వాడఁబడియున్నది.

దుర్గము మహమ్మదీయుల హస్తగతమైనదే. దాని స్మారకముగా దేవాలయము మసీదుగా మార్పఁబడియెనను టకును, అపుడే ఆ శాసనము చెక్క-ంపఁబడియెననుటకును, ఆ శాసనము చెక్కి-ంచినది మలిక్ నిమాత్ అనుటకును సంశయము లేనపుడు దుర్గమును స్వాధీనము చేసుకొనినది కూడా మలిక్ నిమాతే యని యనుమానింప వలసియున్నది.

సరియగు చరిత్రాధారములు దొరకు వఱకు మనమీ విషయమున విచారించి తృప్తినొంద వచ్చును. రాచకొండ దుర్గమున గాలిబు సాహేబను మహమ్మదీయావధూత పూర్వనివాసిగానున్నను వచ్చి చేరెను. ఆతఁడొక ప్రఖ్యా

వసంపన్నుఁడగు యోగి. ప్రజకాతనిపై భక్తి చాల గలిగి యుండెను. జనుల కష్ట సుఖముల నాతడు దైవదత్త విజ్ఞానముచే గనిపెట్టి పరమేశ్వర కల్పితమగు శక్తిచే వానిని నివారించుచుండెను. ఈశ్వరాజ్ఞచే నాతనికి దేహము చాలింపవలసి వచ్చెను. జనులాతని యందుగల ప్రేమాతిశయము చేతను, భక్తిచేతను సమాధి నిర్మించి ఆ మహాత్ముని స్మారకముగా నుత్సవమొనరించుచున్నారు. ఆయాచారమే యిప్పటికి ననుష్ఠానమందు గలదు.

అక్క పోలకమ్మ యనునది ప్రస్తుతము ఖ్యాతి గాంచియున్న "తిరుపతమ్మ, మరిడమ్మ, మామిడేల యెల్లమ్మ" మొదలగు ప్రభావ యుక్తమగు గణజాతిలో నొకర్తుక. ఆ కాలమందీ యక్కపోలకమ్మ కేవిషయమందు ఖ్యాతి గలిగెనో కాని గణదేవతగా స్థాపింపబడియెను. ఆ పేరిప్పటికిని వాడుకయందుండి పోయినది.

రాచకొండ దుర్గనాశనమున కేదేని కారణము లేకపోలేదు, ఉన్నను అదియంత ప్రశస్తమైనది కాకుండక పోవచ్చును. అదియుగాక పదునేనవ శతాబ్దాంతము వరకు గూడా రేచర్లవారి వంశచరిత్ర కానబడుచున్నది గాని చరిత్ర కారులెవరీ విషయమును గురించి యేమియు [...] యలేదు. అందుకు వారికీ స్థానిక చరిత్రయు విదితా[...]ను. అథవా అప్పటికి చరిత్ర సృష్టింపఁబడకుండును. [...]ట రానురానే కాలముననో యీ చరిత్రయుద్భ[...] యుండును

ఇట్లు కల్పింపఁబడుటకు గల కారణము మ[...] లోతుగా విచారింపఁగూడదు. ఒక ప్రభావ యుక్తు[...] మహమ్మదీయుని సమాధియుండుటయు, ఒక దేవ[...] క్కపోలకమ్మ) స్థాపింపఁబడి యుండుటయు గమ[...] రెంటిని సమన్వయమొనరించి యీ గాధ కల్పించబ[...] చి యుండవచ్చును. ఏలయనఁగా నిజమట్లున్న[...] కాశ్చర్య జనకముగా నున్నది.

ప్రస్తుతము మనకు దొరికిన విషయములఁబట్టి మ[...] తీరు భావింప వలసివచ్చినది గాని యిదియే నిశ్చ[...] బల్లఁగుద్ది చెప్పఁగూడదు, భావి పరిశోధనమున దీనిక[...] మగు నిశ్చయ చరిత్ర దొరికినప్పుడీ భావమును మా[...] వలసియే వచ్చును.

# ఆశీర్వాదము —

గవ్వా అమృతరెడ్డి గారు

తెలుఁగుతోఁట లోపలి చిన్న మొలకలకును,
బహుఁదనములనున్నట్టి వల్లికలకు,
ఎపుడో? పుష్పించి పర్ణవిహీనమైన
వృక్షములకును నీర్వోయ వెలసినావె?

లత్తుకరసంబు పదముల మెత్తిమెత్తి
హస్తముల మంచి గంధమునలఁది యలఁది
నుదుటఁగస్తూరి తిలకంబుఁబదిల పఱచి
చెదరకుండ కలంకారి చీరఁగట్టి
మాతృపూజను సల్పెడు మహితబుద్ధిఁ
బయనమగుమమ్మ! దర్శన ప్రాప్తికలుగు.

కాళ్లయందెలు ఘలు ఘల్లు ఘల్లుమనఁగ
హస్తకంకణనాదంబు విస్తరిల్ల
వివిధ విజ్ఞాన వాహినీవిమల జలము
నాంధ్రయువజన హృద్ఘటములందు నింపి
తెచ్చిపోయవె! ఏతోఁట తేజరిల్ల.

ఆరిపోయిన తెనుఁగు రాజ్యప్రదీప్తిఁ
మలఁగిపోయిన యాంధ్ర మండల యశమ్ము
గద్గదిక కంఠమునఁగూర్చి కడుప్రసాదను
దీర్చుకొనుమమ్మ తల్లి! ఈ దినమునుండి.

తల్లి స్తన్యక్షేమ దుగ్ధములు ద్రాగి
ఆంధ్రభువి బాలకులతో సయాటలాడి
పండితులచేత శాస్త్ర సంపదలవడసి
సద్యశోలక్ష్మి సామ్రాజ్యజయపతాక
నందికొనుము "సుజాత"! మాయాంధ్ర భూమి.

# నాకథ

## ,,నేను,,

పూవు పుట్టంగానే పరిమళిస్తుందని అన్నారు బుధులు. ఈ సామెత ప్రపంచంలో అందరి కంటె ఎక్కువ నాయందే సార్థక మౌతుంది. ఔరా నేను! ఔరా నాప్రజ్ఞ!! నేనెప్పుడాత్మస్తోత్రం చేసుకొంటానని లోకు లనుకొంటారేమో, కాని, ఏదీ, నాప్రశ్నకు జవాబీయండి! చూదాం! నాస్తోత్రంనేను చేసుకోకపోతే ఆకాశంనుండిదిగి వచ్చి ఆ శ్రీమన్నారాయణుడు చేస్తాడా? దానికేమి గాని నేనొక మాట నిర్భయంగా అనగలను. ప్రతిమనుష్యున్ని నిందల పాలుచేయటానికి బుద్ధిలేని కొందరెప్పుడూ ప్రయత్నంచేస్తూనే వుంటారు. నిజమాడితే నిష్ఠూరానికి హేతువు. కాని నిందల వలన నాకు జరుగున దేమిటి? ఎవరు చంచల హృదయులో, ఎవరు బలహీన మనస్కులో, ఎవరు పిరికి పందలో వారే ఆత్మస్తోత్రం చేసుకోటానికి వెఱతురు. ఎవరికి దేవుడు దృఢమైన మనస్సు నిచ్చినాడో వారు మాత్ర మాత్మస్తుతి చేసుకొన శంకింపరు, భయపడరు. ఆత్మస్తోత్రం, ఆత్మాడంబరం, ఆత్మప్రియత్వం, అహంభావం నేనుపుట్టినప్పుడు నాతో పుట్టినవి. అవినా 'జన్మహక్కులు'. నాయాత్మస్తుతి వినసెవడికైనా యిష్టంలేని యెడల వానికర్మం వానిదే! నాకు నష్టమయ్యే దేమిటి! నేను మాత్రం నాబాజా వాయింపక మానను! నాజన్మ హక్కునేల వ్యర్థపరచు కొనవలెను? ప్రపంచాన్నెల్లా రచించిన శ్రీమహావిష్ణువే స్తోత్రము నాశించిన ఆతని నాత్మలో ధరించిన నేనేల ఆవహాదంశ నుపయోగించుకో గూడదు? ఆత్మస్తోత్రం చేసుకొను వాడే నిజమైన భక్తుడు. స్వస్తోత్రం, యితరులచే స్తుతింపబడుట భక్తులముఖ్య లక్షణా[...] ఆకునకంద కుండా, పోకకు పొందకుండా రెండు మా[...] లని ఒకని నోరు మూయుట ఒక సంగతి; నిజానికి [...] తణ వేరొక సంగతి. కావలిస్తే ఏతార్కికునితో ఏవేదాంతితోనైనా నాతో యీవిషయమై శాస్త్ర[...] చేయడానికి దింపండి. ఇంకేమి పర్యవసానం కనబ[...] పోయిన, మాయింటిపై ప్రతిరోజూ హోరా హోరీ మార్జాలాలు పోట్లాడు తుంటాయి, వాటి మోస్తరు యుద్ధమైనా జరుగుతుంది. చూపరుల కొక పండుగైన లభిస్తుంది. ఈ మాటల సారాంశం వినదలచినా మీకాలం నవ్వులో వెళ్ళబోసుకోక సావధానంగా వినండి, చెప్పెదను.

ప్రపంచంలో ప్రతిమనుష్యునందు, ప్రతి జం[...] వందు, అది యిది యననేల, ప్రతి అణువునందూ, [...] సుగుణం వ్యక్తమగుచున్నది. ప్రతిజాతి రెండవ జాతి[...] తన యాధిపత్యాన్నే చలాయించుచున్నది. ప్రతి దే[...] యితర దేశాలపై తన వ్యక్తిత్వాన్నే కప్పుటకు యత్ని[...] చుచున్నది చిన్న పిల్లలకు కొత్త బట్టల వేసి చూడం[...] ఆపిల్లలెట్లు చిత్రవిచిత్రప్రదర్శనాల జూపసాగుతా[...] ఇట్లెందుకు? దీని రహస్యమేమిటి? జవాబునకేమి? వా[...] తమ తమ రూపరేఖల చూపరుల కగుపడుటకై ప్ర[...] త్నింతురు! కొన్ని దినాలకింద నేనొక తోట ప్ర[...] నుండి పోవుచుంటిని. అతోట్లో, నోట్లో పండ్లులేని [...] పులో పేగుల్లేని, వికృతాకృతికల యొక వృద్ధస్త్రీ [...] మొగాన్నద్దంలో చూచుకొంటూ తనే మెచ్చుకొను [...] ను. ఆట సార్లకా ప్రదర్శనం వెగటుగా తోచ[...] అందరేకగ్రీవంగా కిలకిల నవ్వసాగిరి. నేను వా[...] నవ్వును వినజాలక పోతిని. వారిని సంబోధించి, 'సోదర[...]

లారా మైపరువునకు ముందు వెనుకకొనుడు. ఇంత తెలివి తక్కువ వేషమా? మీరింత కడుపుబ్బ నవ్వుట కౌ వృద్ధురాలే యన్యాయ కార్య మొనరించెను? అద్దంలో తన మొగాన్ని తాను చూచుకొన్న మీకు కలుగుచున్న నష్టమేమి? తన్ను దా మెచ్చుకొనుట ప్రకృతి ధర్మం. మృగాలు కూడ వాటి నవే మెచ్చుకొనునే. ఐన ఏ ముసలిది చేయుచున్న నేరమేమిటి?" అని నేనంటిని. వెలవెల బోదిన మొగాల వ్రేలవేసుకొని చూపులు తమ లోనివల తాముపట్టిరి. సంగతి జరిగింది, పోయింది. మొత్తం మీద చెప్పబోయేదేమనగా, ఎవనికి తనను తాను మెచ్చుకొనే శక్తిలేదో వాడు శుద్ధ అధైర్య వంతుడు, సాహసం లేనివాడు, నీరసమైన మనస్సు కల వాడు. మీరెంత ఒకణ్ణి గడబిడ పెట్టకుండా జీవితం గడపమంటే ఏమిటి? మీ మాటల వినేవాళ్ళెవరు? మీరు చెప్పే ప్రకారం చేసే వాళ్ళెవరు?

ఈశ్వరుడు స్వయంగా ప్రతి వస్తువందూ, ప్రతి చర్యయందూ ప్రతిబింబిస్తున్నప్పుడు ఆతని ముఖ్యమైన విశేషణము మనుష్యులమగు మనయందేల ఉండకపోవును ఇన్ని విధాల సమాధానం చెప్పినా ఎవనికైనా సంశయం తీరకపోతే, ఇంకా నిందల పాలు చేయాలనుకొంటే, మొదలా మహాత్ముడు దేవుణ్ణే వాగ్యుద్ధానికి దించని. అక్కడినుండి జయించి వస్తే మనమొక చేయి చూచు కొందాం!

అస్మాకంగారు మాత్రం పై సూత్రాన్ననుసరించే నడుస్తారు! ఈ విధంగా నడుచుట నీతి విరుద్ధమని ఎన్నడూ తలంచరు!!

ముందు చెప్పబోయే సంగతికింత మాత్ర ముపోద్ఘాతంచాలును. నా జీవితంలో ఎన్నో నేర్చుకొనే విషయా లున్నాయి. ఎందరో నన్ను బలవంతం చేసినందున ఈ పత్రికా పాఠకులకు కొత్త జీవితాదర్శ మేరుకగునని తలంచి నేననుభవించిన కొన్ని సంగతుల తెలుపుచున్నాను. చదువ దలచిన ఏ పత్రికా సంపాదకులకాసంగతి ఉత్తరాలద్వారా తెలుపుడు. మీ యిష్టాలను బట్టి ముందు రాబొయ్యే కొన్ని సంచికలందీ విషయంగానే నేనగుపడు చుందును. 'నేను' లేని చోటెప్పుడూ శుష్కప్రదేశమే! అదినాకు తెలుసును!!

మంచిది, వినండి. చిన్నదనాన జరిగిన సంగతులు ఒక కవీశ్వరుడన్నట్టు 'విస్మృతి గహనం' పాలైపోయినవి. ఎంత ప్రయత్నించినా జ్ఞాపకాని కందుటలేదు. ఇంత మాత్రం జ్ఞాపకమున్నది. మొదలు నా జన్మస్థానములోనే ఒక సాతాని పంతులు వద్ద శ్రీకారం నేర్చుకొంటిని. కొద్ది గొప్ప మాతృభాష వచ్చిరాక పూర్వమే టప్పటికి నా కావూళ్ళో ఉండాలనను యిష్టం లేక పోయింది. వచ్చిన మాతృభాష చాలును, తెలుగు పండితుడనాతే నాకక్లెవరిస్తారని నాయబ్బతో వాదిస్తిని. అంత చిన్న వాణ్ణైనా నిశ్చయం చేసుకొని బ్రతికే నా తండ్రిని నావలలో వేసుకో గలిగితిని. మా సాతాని పంతులు కూడ నాతో చాలా వ్యాపృతులైయుండెను. చెప్పిన మాటను వినక పోవడంనాకు చాలా యిష్టం. సాతాని పంతులును చాలా బాధించుచున్నది చూచి వీడిక యిక్కడ చదువుకోడని తలంచి మా అయ్య నన్ను పది మైళ్లపైనున్న హైద్రాబాదకు పంపించెను. పెద్దల సమీపంలో ఉండను, లేనిపోని యిబ్బందులిక కలుగవని సంతసించితిని. ఈ పట్నంలో నాకు గుర్తున్న వారి సహాయంతో మదర్సెఫోఖానియాలో నింగ్లీషు వుర్దూ జమవుటకై చేరితిని. అక్కడ జరిగిన సంగతులన్నీ బాగా జ్ఞాపకమున్నాయి.

మదర్సాలో చేరిన కొన్ని దినాల వరకక్కడి సంగతి సందర్భాలు తెలుసుకొంటూ ఊరకుంటిని. నా సహజ ప్రజ్ఞల వెలువుట కవకాశములున్నవా లేవ యని విచారించితి. ఇంతలో నా బోటి సహపాఠకుల స్నేహం లభించింది. బంగారానికి మెరుగు పెట్టినట్లైనది. నా యాలోచన సఫలమయిందని నిశ్చయించి కొంటె పిల్లల కూట మొకటేర్పరిచితిని. ప్రతి వ్యక్తి వేర్వేరుగా నుండిన గొప్ప కార్యాలు కానేరవను సంగతి నేనా చిన్ననాడే తెలుసుకొని యుంటిని. మేమందరము సంఘంగా చేరిన తర్వాత, నేను నా గ్రామం పంతుల పేగుల నోట్లోకి దెచ్చినట్లు, యిక్కడ కూడ నా ప్రతాపాన్ని వర్షించ మొదలిడితిని. దీనివలన చదువరులు నన్ను బుద్ధిలేనివాడు, ఒట్టిశుంఠయని భావింతురేమో! కాద, కాదు. సూక్ష్మమైన బుద్ధి, సులభముగా గొప్ప సంగతులు గ్రహించే మేధాశక్తి, అవసరసమయాన చాలా జాగ్రతగా నన్ను

నేను రక్షించుకొను, యితరుల నిక్కట్టుల పెట్టే నేర్పు నాయందు వెన్నతోనే వెలసెను. అందటితో కలిసిమె లసియుండుట నా కలవాటు. అందుచే నేను చెప్పే దాన్ని విననివారు నా సావాసకాండ్రులలో వెదకిన కూడా లేకుండిరి. ఇవన్ని కనిపెట్టి మా తరగతి ఉపా ధ్యాయుడు నన్ను చూస్తే భయపడేవాడు. ముందు వెనుక విచారించి కాని నా జోలికి వచ్చేవాడు కాడు. మా వూళ్లో నేను చేసిన ప్రతాపాలవిని అతడిం కింత విచారపరుడయ్యెను. ఎప్పటలవాటు ప్రకారం ఒక నాడేదో కుచ్ఛితకార్యం చేస్తిని. ఉపాధ్యాయునికి స్వ యంగా శిక్షించ ధైర్యం చాలలేదు. నాపై యెన్నో నేరాలు వ్రాసి నన్ను చక్కన హెడుమాస్టరు కడ కంపెను.

హెడుమాస్టరు అలీఘరు విశ్వ విద్యాలయంలో బి. యే. ప్యాసైన వాడు. సుమారు తని యీడు యిరు వైయేడు సంవత్సరాలుండును. జాగ్రతవాడు. నా యుపాధ్యాయుని రిపోర్టు చూచి ఏడెనిమి బెత్తం దెబ్బలు నాకు దక్షిణ యిచ్చెను. నా కోపాన్ని నేనా పుకోలేకపోతిని. ముందు వెనుకలు విచారించక ,,మం చిది. మీ చేతిలో యిప్పుడు చిక్కి నాను. కావలసినంత శిక్షించుకోండి. నాపేరే,,......''ఐనట్టైన దీనిబదులు ఎ ప్పుడైనా దీసుకోకుండా వదలను. ఉగ్గుపాలు జ్ఞాపకం వచ్చేటట్టు చేస్తా. ఆ సమయం నాకు చిక్కకపోదు. నూరు అగసాలి వాని దెబ్బలొక కమ్మరివాని పోటు క్రింది కాగవు,'' అని అంటిని.

హెడుమాస్టరు:—వెల్, ఏమో గొణుగు తున్నావు!

నేను:—మీరేమి విన్నారో నేనదే గొణిగినా!

హె:—నీవు చాలా కొంటెవాడవుగు పడ్తావు.

నే:—దానిలో యింతైనా సందియంలేదు.

హె:—సందియంలేదని ఏమంటావు?

నే:—మీ రేదనుమంటే అదే అంటాను.

హె:—ఎందుకు?

నే:—ఎందుకంటే, ఉపాధ్యాయుడు నేర్పిందే శిష్యులనాలె.

హె:—ఏమీ, నీ విదివరకన్నమాన్ని ఎవరైన నేర్పినవేనా?

నే:—దానిలో నిసుమంతైనా సందేహంలేదు.

హె:— ఎవరు నేర్పిరి?

నే:—నా గురువు.

హె:—నీ వబద్ధీకుడవు.

నే:—ఔను, నేనబద్ధీకుణ్ణే.

హె:—నీవు చాలాపోకిరివి కూడాను.

నే:—ఔను అది నిజమే!

ఈ మాటలు నా నోటి నుండి వెళ్ళవేళ్ళ తడాల్ తడాల్ మని ఎనిమిది పది దెబ్బల మళ్ళా అం కొనెను. నా చిన్ని చిన్ని హస్తాలు ఎఱ్ఱనై పోయె దెబ్బల బాధకోర్వజాలక ,,ఇప్పుడు మీరు కావలసి చేసుకోండి. నా చేత చిక్కినప్పుడు మాత్రం వడ్డీతో బాకీ అంతా పుచ్చుకొంటా'' అని అనివేస్తిని. నా మాటలతని కోపాగ్నినింకింత రగిల్చి వేసినవి. నాపై ,జుర్మానా' కూడా వేసెను. అంతటితో యీ రగ ముగిసెను. అప్పటిలో ఏమీ చేయ వీలు లేనందున నా అంతట నేను మొగము కిందికివేసుకొని తిరిగివస్తిని. ఇం పరాభవమైన తర్వాత యిక మదర్సాను వదలి పెట్టా మనస్సు క్రిందు మీదాయెను. కాని మదర్సాను వద పట్టితే యీ క్రూరునిపై నున్న కసి నెట్లా తీర్చుకో అను సంశయం బాధించింది. తుదకా దుర్మార్గుని పట్టాలననే మనస్సు ధృడం చేసుకొంటిని. మదర్సా వదలిన యీ పని సులభంగా నెరవేరదని తోచెను. కేలకు ఆ మదర్సాలోనే చదువు కొనుచుంటిని. సంవత్స సంవత్సరార్ధం లోపల డబల్ ప్రమోషన్ పొందితి ఆ హెడుమాస్టరు చదువు చెప్పే తరగతిలో ప్రవేశిం తిని. ఇప్పుడు కసితీర్చుకోవటానికి సమయం చిక్కింద మనస్సులో అనుకొంటిని. ఈ సన్నాసిపై కసి దీర్చు కుండా యీ పాఠశాల వదలకూడదని ధృఢ సంకల్ప ఆనాటి కథ జరిగినప్పటినుండే కలిగెను. సమయాని యెదురుచూడ మొదలు పెట్టితిని. ఈ మధ్య నాలో క ష్టలు జరుగుతునే వుండేవి. దెబ్బలు యథావిధిగా దు చునే యుంటిని. ఒకసారి హెడుమాస్టరు నన్ను మదర్సా నుండి తొలగించాలెనని యత్నంచేశాడు. కానీ తన్ని చాలావేడు కొన్నందున తిరిగి మదర్సాలో నుంచెను. ముందుకథ ఆలకించండి:

హెడుమాస్టరుగారు చాలా న్యాయ విచార కలవారును సత్య్రభావులునుగా నుండిరి. సత్యం మా

నేనెల్లప్పుడు తలపంచేవాణ్ణి. కాని వారిలో నొకదుర్గుణం మాత్రం ఉండేది. కోపాన్నాపుకొనే అలవాటు లేదు. తరుచుగా తొందరపడే వారు. ఈ లోపం మూలాన వారి చేతికింద పని చేసే ఉపాధ్యాయులును, చదువుకొనే విద్యార్థులును చింతాక్రాంతులై యుండిరి. ఈ లోపాన్నే బాగా పట్టుకొని ఆ మహానుభావునిపై నున్న పగదీర్చుకోవాలెనని నేను నిశ్చయించితిని. మాట్లాడడం నాకు బాగా వచ్చును. ఇతరుల హృదయాల నాకర్షించేటట్టు వ్రాయడంకూడా వచ్చు. మదర్సా పిల్లలు మొదటినుండే నా చేతిలో వుండిరి. మెల్లమెల్లగా స్కూల్ ఉపాధ్యాయుల నెల్లా నావశం చేసుకొంటిని. మీరంత అనుభవించిన విషయమే కదా! సమయంమీద అన్ని కార్యాలూ సఫలమౌతాయి! మనుష్యుడు కొంత సూక్ష్మబుద్ధి కలవాడైన చాలును. సమయాన్ని కనిపెట్టి కార్యం చేతపూనే వానికెప్పుడూ లాభమే.

హైద్రాబాదులో నాకప్పుడప్పుడు మందిచ్చే డాక్టరు అక్కడ పేరుపొందిన సివిల్ సర్జన్. అతనికా స్కూలుతోకూడ సంబంధముండెను. బహుశః కొంత ఫీసు దొరుకుచుండెనేమో! బోర్డింగు పిల్లల కందరికీ అతడే మందిచ్చుచుండెను. నాప్రకృతి మొదటినుండీ పూరకుండేదికాదు. నడుమ నడుమ అతని దర్శనార్థం వెళ్ళుచుంటిని. అతడు చాలా వుత్తమమైన స్వభావం కలవాడు. పిల్లలంటే అతనికి చాలా ప్రీతి. హెడు మాస్టరుగారి కోపపు చేష్టల వృత్తాంతం అతని చెవిలో నిదివరకే పడియుండెను. ఒక రోజు ఇద్దరు ముగ్గురు వుపాధ్యాయుల ముందాయన 'మీ హెడుమాస్టర్ పిచ్చివాడు కాడు గదా'యని ఏమో అనబోవుచుండెను. నేను కర్మవశాత్తున అక్కడనే వుంటిని. ఆశబ్దాలాతని నోటినుండి వెళ్లేంతలో 'ఔను, డాక్టరు గారూ, ఔను, వారి వేషభాషలు మాత్రమూ మాదిరిగానే అగుపడుతున్నవి. ఎప్పుడుచూచినా బొమలు ముడివేసుకొనే వుంటారు. కన్నులెప్పుడూ ఎఱ్ఱగానే వుంటావి. సంబంధంలేని మాటలెప్పుడూ అంటుంటారు, అని ముందు వెనుక విచారించక అంటిని. సివిల్ సర్జన్ నవ్వి 'నీవు సత్యంపలుకుతున్నావు. స్కూలులో అతడుండుట చాలా ఉపద్రవకరము' అని అనెను. 'చిత్తం, మీరు నిజం సెలవిస్తున్నారు. అనుభవజ్ఞులు కనుక యీ సంగతి మీరు కనిపెట్టుచున్నారు. ఇనిస్పెక్టరు, మరియు డైరక్టర్ల బుద్ధి చెడిపోయింది. వారు వీరికి తగు చికిత్స చేయ నసమర్థులు' అని నేబల్కితిని. దీనిపై డాక్టరు చిఱునగవుతో వెళ్ళిపోయెను. తక్షణమే నేను బోర్డింగుకు వెళ్ళితిని. మిత్రులతో కలిస్తిని. ఉపాధ్యాయుల దర్శించితిని. అంతటి మెదళ్ళలో సమయాం వచ్చినది, సిద్ధము కండని సంగతి నింపితిని. గంగ పొంగి పొర్లుచున్నది. చేతులు కడుక్కొనే వారు కడుక్కోండి. కొంచెం నాకు మీరందరు సహాయం చేసినట్టయితే హెడుమాస్టరును పాతాళానికే సాగనంపుతానని అంటిని. మొదలు వారికెవ్వరికీ నా మాటలందు నమ్మకం కుదరలేదు. కాని నేను వారికి సంగతి సందర్భాలన్నీ విచ్చి చెప్పిన తర్వాత అందరూ ఒక్కపెట్టున నవ్వసాగిరి. ముందు జగ్గబోయే శుభకార్యాని కొక మంచి దిన మేర్పాటు చేయబడెను. ఆదినము నేను పురోహితునిగా పనిచేయ వలసియుండెను.

ఆ సుదినము రానే వచ్చెను! పది గంటలు కాగానే హెడుమాస్టరు గారు తమ దివ్యాసనంపై నాసీనులైరి. అదృష్టవశాత్తుననో, దురదృష్టవశాత్తుననో—చదువరులే నిర్ణయించాలె—మొట్టమొదట మాక్లాసుకే చదువుచెప్ప నారంభించిరి. వారికి వెబ్స్టరు డిక్షనరీ (ఒక యింగ్లీషు నిఘంటువు) అవసరమాయెను. నన్ను లైబ్రరీకి వెళ్లి వెబ్స్టరు తీసుకరావొమ్మ అని యాజ్ఞాపించిరి! నేనేమీ విచారించక, నా కాళ్ళకు క్రొత్త బనారస్ చడావుండెను, ఒక చడావును దీసి వారి టేబిల్ పై బెట్టితిని!!! ఇది చూచి వారు నివ్వెరపడిపోయిరి. 'అయ్యా! మీరు కోరిన వస్తువుయిదేకదా, మీకింక కోపమెందుకు?' అని నేనంటిని. వారు 'వెల్! మేము వెబ్స్టర్ దీసుకరమ్మంటే నీవు చడావు చూపిస్తావు?' అని గద్దించిరి. నేనింకొక చడావు కూడా తీసి టేబిల్ పైన పెట్టితి. దీనిపై వారు కోపాన్నాపుకోలేక నా వీపుపై రెండు మూడు దెబ్బలంటుకొనిరి. మారుపలుకక నేను నా చోటుకడకు వచ్చి కూర్చుంటిని. వారింకొక విద్యార్థితో డిక్షనరీ తీసుకరమ్మనియనిరి. అతడు కూడ చెప్పుల దర్శనమే చేయించెను! ఈ సంగతంతా చూచి హెడుమాస్టరు తలపైత్యాన పొంగింది. మదర్సా మున్షీని పిలిపించి తెమ్మనెను. వాడు డిక్షనరీకి మారు సిరాబుడ్డి యెత్తుక వచ్చెను! హెడుమాస్టరు గారి

కోపజ్వరం నూరు డిగ్రీలు దాటిపోయింది. ఒక ఉపాధ్యాయుణ్ణి పిలిపించి డిక్షనరీ పట్టుక రమ్మని కోరెను. ఇక్కడందరూ ఒకే పాఠం వల్లె వేసిన వారుండిరి. ఆ మహాత్ముడు నిఘంటువుకు బదలు క్రికెటు ఆటసామానంతా తీసుక వచ్చి ముందుపెట్టి 'అంగీకరించండి!' అని మనవిచేసుకొనెను!! ఈ ప్రదర్శనం చూసే సరికి హెడుమాస్టరు ఒళ్ళంతా మండి పోయింది. బెత్తం తీసుకొని ముందగుపడ్డ వాళ్ళనెల్లా అరుసుకో మొదలు పెట్టాడు. మొదట మున్షీకి; ఇంకొక ఉపాధ్యాయునికి కూడా రెండు దెబ్బలు తగిలినాయి! విద్యార్థులు పాపం తొందరగా చిక్కకుండిరి. స్కూలంతా కల్లోలం అయిపోయెను. లొల్లి గడబిడ ఆకాశం అంతా అల్లుకొన్నాయి. హెడుమాస్టరు గారో ఛడీ చేతబట్టుకొని ఇటూ అటూ సివం వచ్చిన వాని మోస్తరు ఆవేశంతో తిరుగుతూ అగుపడ్డ వాళ్ళనెల్లా వధపట్టుచున్నారు!!!

అసిస్టంటు హెడుమాస్టరు గారు చాలా సరళ హృదయులు. వారీ కుట్రయందు పాల్గొనలేను. అందరూ కలిసి వెళ్ళి వారితో హెడుమాస్టరు గారి స్థితిని తెల్పిరి. హెడుమాస్టరు గారు పిచ్చివారై పోయినారని నిరూపించిరి. అందతేని, మున్షీని, ఉపాధ్యాయుణ్ణీ కూడా వదలకుండా, కొట్టు కుంటూ తిరుగుతున్నారని, జరిగింది కొంత, జరగంది కొంత, అంతా కలిపి వారి చెవినూదిరి. ఇది వినగానే వారు భయపడి అప్పుడే సివిల్ సర్జన్ గారి కొక లేఖ వ్రాసి పంపిరి. అది చూచినతోడనే వారు స్కూలును దర్శించిరి. డాక్టరు గారు వచ్చి చూచినదేమిటి: హెడుమాస్టరుగారు ఉగ్రులై శరీరంపై స్మారకం లేకుండా తిరుగుతూ వాణ్ణీ వీణ్ణీ ఛడీతో నరసుకొంటూ వుండుట! మొదటినుండీ మేము వారి ముందు హెడుమాస్టరు గారి గుణ విశేషాలను పొగుడుతునే వుంటిమి. ఇట్టి యవస్థలో హెడుమాస్టరు గారిని చూచి డాక్టరు మా మాటల పూర్తిగా నమ్మిరి. ఒక నిముషమైనా ఆలోచించకుండా 'హెడుమాస్టరు చేతుల కట్టివేసి చంచల్ గూడెం పంపించండి. వెంట నేను కూడా వస్తా. మంచి గిందిచ్చి చూతాం' అని చపరాసీల కాజ్ఞాపించి సివిల్ సర్జను గారు వెళ్ళిపోయిరి. మొత్తం మీద హెడుమాస్టరు గారు పిచ్చి ఆసుపత్రికి పంపించబడిరి. ఔరా నేను! ఎట్లా నా కసి దీర్చుకొంటిని!! వహావా నేను!!! నాస్తోత్రం నేనింతో చేసుకోవా లనుకొంటా! కాని చిన్ననోరూ, పెద్ద ప్రజ్ఞ!! ఎంత స్తోత్రం చేసుకొన్నా తక్కువే అగుస్తుంది! ఎంత శ్లాఘించు కొన్నా నా ప్రతాపానికి తగిన శ్లాఘనకాదు! అందుకొఱకు నాస్తోత్రానికి బీజాక్షరమగు 'ఔరా నేను!!!' ను స్మరించి తృప్తి పొందెదను.

చంచల్ గూడెపు పిచ్చివాండ్ల ఆసుపత్రి చాలా ప్రసిద్ధి కెక్కింది. హెడుమాస్టరు గారి నొక టాంగాలో కూర్చుండబెట్టి చపరాసీ లా యాసుపత్రికి తీసుక వెళ్ళిరి. వారి నక్కడ వేరే నొక గది యందుంచిరి. ఆ గది కొక భాగంలో ఇనుపకడ్డీలుండెను. తక్కిన మూడు వైపులా గోడలే. అస్మాకం గారు అదోయిదో బొంకి లోన ప్రవేశించిరి. మెల్లగా నటూయిటూ పచారు చేస్తూ వారున్న గది ముందు కొచ్చి కొన్ని మొగలాయి సలాములు తీర్చి 'హెడుమాస్టరు గారూ, సెలవియ్యండి ఏవిధంగా వుందో శరీరం?, అని అంటిని.

వారు:—(పండ్లు పట పట కొరుకుతూ) నీవు చాలాకొంటె వాడవు.

నేను:—అందువలననే మీ స్థితి యింత కొచ్చింది!

వారు:—ఈ యాపత్తు కంతా బీజం నీవే.

నేను:—మాస్టరు గారూ, నేనుకాదు. మీరు క్రోధో దర్శించిన నా ముద్దులాలికే చడావులండీ!

వారు:—నీ వతి దుర్మార్గుడవోయి.

నేను:—అకారణాన్నే తాము పిచ్చి యాసుపత్రి చేరితిరి కదా! సెలవియ్యండి, యిప్పుడెవనిపై తమ ఛడీ లేస్తుందో?

వారు:—నీవిక్కడి నుండి వెళ్లుము. వెళ్లుమిప్పుడే వెళ్లుము నీవు వట్టి కోతివి.

నేను:—ఔనౌను! మాట మాత్రం చాలా అక్కరకు వచ్చేదే అంటిరి. మీపుట్టుక వృత్తాంతంకూడా బయటబెట్టుకొంటిరి!

వారు:— సైతాన్, నాముందర్నుంచి వెళ్లు. ఇంతమాయమారివని నాకు తెలియలేదు.

నేను:—ఇప్పుడైనా తెలిసిందా? ఇంకేమైనాతక్కువలుంకే అదికూడా తెలుపుతా. ఇప్పుడు మీకు తెలిసిందే ఏడు జన్మాలు మరచిపోనట్టున్నది!

ఈ మాటల విన్నతోడనే పండ్లు పటపట కొరుకుతూ, ఇప్పుడు నీవు నా చేతిలోనే ఉండిన నిన్ను నమిలివేస్తుంటిని' అని గర్జించిరి.

హెడుమాస్టరు గారి తుది పలుకులు నోటినుండి వెళ్ళుచుండగనే సివిల్ సర్జన్ గారక్కడికి దయచేసిరి. వారి అంత్య వాక్యం విని నవ్విరి. నన్ను సంబోధించి, నీ విక్కడేం చేస్తున్నావోయి' అని ప్రశ్నించిరి. 'డాక్టరు గారూ, హెడుమాస్టరు గారి దర్శనార్థం వచ్చినానండి. పాపం వారు పిచ్చివారై పోయినారు. గురువు శిశ్రూష చేయడం శిష్యునిపైనున్న బాధ్యతల్లో చాలా ముఖ్యమైనది. ఇందుకొఱకే నేను వచ్చినానండి'' అని మెల్లగా అంటిని.

హెడుమాస్టరు:—(ఇంగ్లీషులో) ఈతడొక గొప్ప సైతాన్. ఈ విషాన్నంతా యితడే పెట్టినాడు. వీణ్ణిక్కడి నుండి తోలించండి. నన్ను బాధిస్తున్నాడు.

సివిల్ సర్జన్:—(ఇంగ్లీషులో) మీరు స్వేచ్ఛగా ఉండండి. ఇక్కడన్ని విధాలా మీకు సౌఖ్యముండును. ఎవ్వరూ మిమ్మల బాధించడానికి వీలుండదు. నేను మందియ్యడానికి వచ్చినాను. మీరు తొందరగా బాగైపోదురు.

హెడుమాస్టరు:—నేను పిచ్చివాణ్ణి కాలేదు, నాబుద్ధి సరిగ్గానే వున్నది.

సివిల్ సర్జన్:— చిత్రం చిత్రం, యీ సంగతి నాకూ తెలుసును. కొంచెం ఓపిక పట్టండి. అంతా సక్రమంగా జరిగి పోతుంది.

ఇంకేమి చెప్పేది? హెడుమాస్టరు పిచ్చి వారు కాకపోయినను కోపం మూలాన నిజమైన పిచ్చివారై పోయిరి. సివిల్ సర్జన్ గారు వారు పిచ్చివారైనారని పూర్తిగా స్థిరపరిచిరి. స్కూలు టీచర్లందరూ వారు పిచ్చివారైనారని పల్కిరి పాపం చాలా దినాలవరకు వారిని పిచ్చి యాసుపత్రియందే వుంచిరి. డాక్టర్ల అభిప్రాయం వ్యతిరేకంగా వున్నందున యిక ముందెక్కడా విద్యాశాఖయందు పని చేయడానికి వీలులేకపోయింది. వారు స్కూలునుండి వెళ్ళిన్నాడు మేమొక గొప్ప విందుచేసుకొన్నాం! వారు ఆసుపత్రి నుండింటికి వచ్చిం తర్వాత వారిని దర్శిస్తిని. కాని వారు నాతో మాట్లాడ లేదు. పిల్లల్తో వైరం సంపాదించిన యింత ముప్పు వస్తుంది, ఇక ముందు జాగ్రతగా ఉండండని వారికి బోధచేసి వెళ్ళివచ్చినా.

మిత్రులారా, చెప్పండి, ఏవిథంగా వుందో యీ సంగతి? ఈ సంగతి విన్న తర్వాత మీకెన్ని మాటలో జ్ఞాపకం వస్తావుండ వచ్చు! హెడుమాస్టరు స్కూలు వదిలి పెట్టిం తర్వాత నేను కూడా విద్యార్థిత్వానికి రాజీనామా పెట్టితిని. ఇంతో అంతో యింగ్లీషు వచ్చియుండదు. ఈ కారణాన కూడా చదువుకు నమస్కారం చేసుకొంటిని. చదువు సంధ్యలతో ఏమి చేసేదుందని అనుకొంటిని.

# సీత—అశోకవనము

పంగనామముల రామచంద్రరావుగారు

అంభోధిప్లవనావతీర్ణుఁడయి దైత్యప్రాజ్య లంకాపురీ
కుంభత్తోరణ లంఘితదనుజ రజ్జుల్ మాపి యన్వేషణా
రంభుండై సురబంధనాలయ సరః ప్రాసాదముల్ చూచుచున్
సంభ్రాంతక్లముఁడై కపిప్రవరుఁ డాశాబంధముం ద్రెంపుచున్.

„చూచితి లంకలో గగనచుంబి మహోజ్జ్వల తుంగసౌధనై
శాచర కేళిధామముల సారసరస్తట సీమలందుఁ గ్రీ
డాచల శృంగకుట్టిమవిహారములన్ జెఱసాలలందు దీ
ర్ఘాచతురత్వరీతిఁ బొడగట్టదు జానకి యేమి హేతువో!

రావణానీత యువతి కారాగృహముల, బానసపుటిండ్ల మచ్చుల బయళులందు
సందుగొందులఁ గంటి మాజననికొఱకు. నిష్ఫలారంభ వేదనాన్వితుఁడ నయితి

కపిసంఘంబులతో బడాయిపలుకుంగచ్చుల్ మహేంద్రాచలం
బుపయింజేసితి „రామచంద్రుని సతిన్ భూదేవి గారాపుఁగా
నుపు నా రావణు పేరిబెబ్బులి యొడిన్ నూల్కొన్న గోమాతలో
కపవిత్రన్ గనివత్తు"నంచు—నకటా! కాన్పింప దెప్పట్టునన్.

పంక్తికంధర పట్టణాభ్యంతరమున, నరసితి విదేహరాజ వంశాభిజాతఁ
బొడమెకన్పట్ట దింకఁ జైపాలము సూతు, రాజబాహ్యోపవన వృక్షరాజినడుమ.

వ. అని సీతాన్వేషణ నిష్ఫలప్రయత్నంబుల విసివివేసారి దీర్ఘనిశ్వాసంబుచ్చుచు రిత్తమనమునం బోయిన శ్రీరాఘవేశ్వరుం డేమిగా దలంచునో యను పరితాపంబున భావోపభావంబుల్లడ తల్లడంబెట్ట నాత్మాధిగత పూర్వధైర్యంబు కుంటుపడి తడవ స్థాదోషంబుగ మనమాంద్యంబున నావిష్కరింపఁజేయుచు స్వామి కార్యనిర్వహణ దీక్షాభరిత హృదయభారుండైన రామదూతయగు హనుమంతుండు పోయి పోయి.

(సశేషము)

# జగద్గురువు

జి. అనంతరామ శర్మగారు

"తల్లీ, నాకాజ్ఞనొసంగుము, సన్యాసినై ప్రపంచ సేవకుఁ గడంగుదును."

"అబ్బాయీ, ఈ వితంతువునకు నీ వొక్కడవే కుమారుడవు. నీ కోరిక ప్రకారము జరిగిన మన వంశము నిర్మూలమై పోవును"

"జననీ, ఒక బీజము తనను నిర్మూలము చేసినగాని చేననేలు క్రొత్త బీజము లుద్భవించవు. జగదుద్ధారణార్థ మొక వంశమంతరించినఁ బ్రశంసనీయమే."

"కుమారా, ఐన మన యిల్లే గుల్లకావడ మెందులకు? ఇతర వంశములేల నీ పనినిఁ జేతఁబూన కూడదు?"

"మాతా, అజ్ఞానుడెల్లప్పుడును క్షమార్హుడే. అంధుడేగుచున్న మార్గమునందు కూపమున్నదని తెలిసియు మౌనము వహించి చూచు వ్యక్తి గొప్ప పాపి"

"పుత్రా, అవసాన కాలమున నీళ్లనిచ్చు వారు లేని యెడల వానికి నరక ప్రాప్తి సంభవించును. గృహస్థుడవై ముద్దుగొలుకు బిడ్డల కనిన పిదప సంతోషముగా సన్యాసము స్వీకరించుము."

"అమ్మా, "పరోపకారార్థ మిదంశరీరం". మానవ శ్రేయస్సు కొఱకు నరకము చూడవలసి వచ్చినచో నంతకంటె పవిత్ర కార్యమేది యుండును? ఈ దేహమశాశ్వతము. బుద్బుద ప్రాయము. అస్థిరమగు నీ కాయముచే లోకమున కుపకారము జరుగనున్న దానినేల లోకమున కర్పింప కూడదు?"

"నాయనా, నీ వెప్పుడు నీ విధముగనే తలంచుచుందువు. కాని నీ జీవితమునందేమి చూచితినని నేను నీ యభీష్టమున కియ్య కొందును?"

"జననీ, నన్నాపకుము, చూడుము! ఆర్యావర్తమంతయు నాస్తిక మతముచే నాశనమగుచున్నది! నాస్తికత్వము రాజుల కూడ వదలుట లేదు! పిన్న పెద్దలంతీశ్వరునినుండి విముఖులగుచున్నారు. తల్లీ, ఈ స్థితి నవలోకించుము. నా చక్షువులతో చూడుము! నన్ను పోనిమ్ము! ఈ సర్వనాశక పరిస్థితులు నన్నూపి వేయుచున్నవి! నాస్తిక భావములు దినదిన ప్రవర్ధమానములై యీ ఖండమునే కాక యితర ఖండములను కూడ అధః పతిత మొనరించుచున్నవి. అమ్మా, సంసార పంకమున నొకసారి చిక్కుకొనిన తిరిగి నా స్వతంత్రము నాకు లభించదు. గృహస్థావస్థ నన్ననర్థముగా కృశింపజేయును. ఉభయ భ్రష్టుడనై పోదును. మాతా, నా జీవితమును నాశనము కానివ్వకుము. సన్యసించుట కనుజ్ఞఁ బ్రసాదించుము."

"తండ్రీ, నీ వింక చిన్న వాడవు. నీ నోటి పాలవాస నింతవరకు పోలేదు. ప్రపంచమేమో నీకింక తెలియదు. యౌవనుడవైన తర్వాత నీ కంతయు స్పష్టమగును. సన్యసించుట సులభ కార్యము కాదు."

౨

నది తుపాను చేతజిక్కినది. వర్షాతిశయతచే నది పొంగి పొర్లుచున్నది. దాని సమీపమేగుటకు లోకులు భయపడుచుండిరి.

బాలుడగు శంకరుడు మరియు నాతని తల్లి ప్రతి దిన ముషఃకాలము స్రవంతికేగి స్నానాది నిత్యకర్మల తీర్చుకొనుచుండిరి. తుపాను తీవ్రత కూడ వారి నియమమున కాటంకము కల్పించలేక పోయెను. తెల్లవారక మునుపే తల్లి కొడుకు లిద్దరు నదీ తటమును చేరిరి. తల్లి స్నానము జేసి యొడ్డు మీదికి వచ్చినది. శంకరుడీదగల వాడు గనుక నొకసారి నీటియందు మునగెను. మునగ గనే పాపమాతని పాదము నొక మకరము పట్టుకొనెను!

తల్లి యీదృశ్యమును చూచెను! ఆమెముఖము వివర్ణమై పోయెను! ఆమె దుఃఖము గ్రామమునంతే మేల్కొల్పినది. లోకులందరు నదీతటమున క్రిక్కిరిసి పోయిరి.

కానెవరును ధైర్యము బూని మొసలి నెదొర్కొన ముందంజవేయలేక పోయిరి.

మృత్యుదేవత శంకరుని నోట వేసుకొననున్నది. ఆత్మరక్షణ కాతని కిక నేయుపాయమును లేదు.

కాని శంకరుని హృదయ మిసుమంతైనజలింపలేదు. మనసునందొక భావము జనించెను. ఆ భావము వాగ్రూప ముదాల్చెను. బిగ్గరగా తల్లిని బిలిచి:

,,మాతా, నేను చావ నున్నాను. మృత్యువుహస్తమునుండి వెడలుటకు మార్గమేదియు నగుపడుటలేదు. ఒక వేళ నేను బ్రతికిన నామనివి నంగీకరింపుము. చావు తప్పని యెడల నేనొక సన్యాసినై చచ్చుటకు ననుజ్ఞనిమ్ము'' అని పల్కెను.

తల్లి: ,,ఆర్తరక్షకుడు నిన్ను సమయమున గాపాడిన నీవుకోరినటుల జేయసంసిద్ధురాలను.

చుట్టువిట్టగుచున్న ధ్వని మకరి ఏకాగ్రతను చెఱచి వేసినది. దాని పట్టందుచే వదలయ్యెను. శంకరు డది కని పెట్టెను. రెండవ క్షణమే శంకరుడా క్రూరమృగపు నోటి నుండి తనపాదము వదలించుకొని వేగముగా నీద మొదలిడెను.

ఇప్పుడు శంకరుడు ముందు, మొసలి వెనుక నగు పడిరి. ఆ మకరము నోటి కబళము క్రిందికి జారెనని కోపావేశముతో వెంబడించుచుండెను. శంకరుడు శరీర రక్షణార్థము కాళ్లు చేతులాడించుచుండెను.

కాని సంశయావస్థచాల సమయము వరకుండ[illegible] నదీతటము సమీపమే వచ్చెను. శంకరుని ధైర్యము [illegible] డింతలయ్యెను.

శంకరు డొడ్డు చేరగనే యాతని శరీర మాత[illegible] ధీనము నుండి తప్పిపోయినది. మూర్ఛవచ్చుటచే [illegible] పడిపోయెను.

ప్రజ శంకరుని చుట్టు మూగినది. కొన్ని [illegible] ముల తర్వాత నాతని నిల్లు చేర్చిరి.

## 3

శంకరుడిప్పుడు సంసార బాధముల [illegible] భారత భూమినుండి నాస్తికమతమును దరిమివేయ సిద్ధుడైనాడు.

మిత్రవర్గ మాతని నూతన సందేశమును [illegible] మొదలిడినది. బంధువు లాతని ప్రాణ శత్రువులై[illegible] అతని ప్రతి చర్య నిందాస్పదమై పరిణమించినది. [illegible] కల్యాణార్థ మాతడు తన యుసురుల నర్పించెను. [illegible] లెంత తిరుగబడిన నేమగును?

శంకరుని తల్లి, శంకరుని గన్న తల్లి, ప్రపం[illegible] నివ్వెరపడి చూడబడువాని తల్లి, తన ప్రాణము[illegible] నెక్కువ ప్రేమతో నాతని జూచుచుండెడి తల్లి [illegible] లుడగు శంకరుని భూమిపై వదలి స్వర్గమున [illegible] మైనది.

కాని ఆ విషమ స్థితినవలోకించి కూడ [illegible] శంకరునిపై కనికర మూనలేదు. ఇట్టి సమయమ[illegible] వారు తమ మీసముల దువ్వుచునే యుండిరి.

మాత, జగద్గురువు మాత శరీరము ద్య[illegible] మాత్మయందు లీనమై పోయినది. శత్రువుల [illegible] కింత ప్రబలెను. అందరేకమై తల్లి కళేబరమును [illegible] మొనరించుటకై శంకరునికి సాయమొనరింప [illegible] కఠినమగు సమ్మె గట్టిరి.

లోకోపకారమున కిది పర్యవసానము! మా[illegible] ణమును కోరిన వానికిది ఫలితము! సర్వత్యాగ [illegible] వానికిది గతి!

బాలుడగు శంకరుడు, సన్యాసియగు శంకరుడు, కాషాయాంబరధారియగు శంకరుడు తన జనని మృతకళే బరమును చూచెను. పిదప తన యవస్థపై దృష్టిసారించెను.

ఇప్పుడాతనికి సర్వాంతర్యామి తప్ప వేరు శరణు లేదు. అంతము లేని ఆకాశమును తిలకించెను. అప్పుడే ఆతని చక్షువులు తల్లి మృతకాయముపై మరలెను.

శంకరుడాలోచించును. ఆలోచన సాగుటలేదు. ఇంతవఱకు కొకని శరణుగోరని శంకరుడిప్పు డొంటరివాడై పోయినాడు.

అంతలోనే ఆతనియందు మార్పుకలిగెను. స్తబ్ధుడైన వానియందు సంచలనము పుట్టెను. ధైర్యమాతనిని లేపెను. పోయి యింటివెనుకనున్న కాష్టములనెల్ల చితగా పేర్చెను!

పుట్టినప్పటినుం డిదివరకు తన యొడి యందాడించి పెంచినతల్లి నాతడొక్కడే భుజముపై వేసుకొనెను. ఇప్పుడాతని కెప్పుడు లేని సాహసములు లభించినవి. ఒక్కడే తల్లిని తీసుకపోయి చిత నలంకరించెను.

ముందు చేయబోవు కార్యము సులభమైనదే. చిత కగ్ని స్పర్శచేసెను. చూచుచుండగనే తల్లి అగ్నికాహుతియై పోయినది. బంధువులందఱీస్థితి వీక్షించిరి. పరమాత్ముని నమ్మినవా డితరుల ముందు తలవంచడను సంగతి వారికి స్పష్టమయ్యెను.

౪

నేడు తిరిగి నది యుప్పొంగినది. నదీతరంగములు మదపుటేనుగుల వలె నురుగులు గ్రుక్కుచు నిటునటు పరుగిడుచున్నవి.

ఉషఃకాంత సూర్యభగవానుని మధురగీతికలతో స్వాగత మిచ్చుటకు పూర్వమే శంకరుడు కాలకృత్యముల దీర్చుకొనుటకై నది కడకేగెను. ఆతని ముందొక మంటి గడ్డకనబడెను. పోయి చూచెను. అక్కడ వేనవేలు మణులుండెను! నదీ ప్రవాహముచే చుట్టు పట్టున్న మన్ను కొట్టుకపోయినందున నవి పైకొచ్చినవి.

నలుదిశల బురద నిండిపోయినది. కూర్చుండుటకు స్థలము లేదు. శంకరుడాగడ్డపైననే కాలకృత్యముల దీర్చుకొని తనపనిపై వెళ్లిపోయెను.

కమలా ప్రియుని మేల్కొలుపు మైనది. అతడు తన ప్రతిదినయాత్రకై సిద్ధమగుచున్నాడు. ఆబాల గోపాలమంత కండ్లు తెరచినది. నదీసమీపమున నెటుచూచిన నటంత మణిమయమే: లోకులాశ్చర్యచకితులై పోయిరి.

అందరు దెగ్గరికేగిచూచిరి. ఆ మెరయుచున్న దివ్యమణులపై నెవరో కాలకృత్యముల దీర్చుకొనియుండిరి.

ఈ యక్రమకార్య మొనరించిన దెవరిని ప్రపంచము నివ్వెరపడిపోయెను. ప్రయత్నించిన తదుపరి అది శంకరుని కృత్యమని వెల్లడి యయ్యెను. ఆ సర్వత్యాగికి మృత్తిక, మణులు సమానములే. అహంబ్రహ్మాస్మి యను వానికి మాయాకల్పితములగు మణులతో నేమియక్కఱ?

౫

కాలము పరుగెత్తుచున్నది. శంకరుని శిష్యుల సంఖ్య వృద్ధిపొందుచున్న కొలది వైరి జాలముకూడ హెచ్చైపోయినది.

శంకరుని తలదెచ్చిన వానికి బహుమతి యొసంగ నిశ్చయింప బడెను. బహుమతి యాశచే నెందఱో ధనపిపాసకు లాతని శిరమును ఛేదించ ప్రయత్నింప మొదలిడిరి.

సాయంతనమైనది. శంకర యోగి సంధ్యావందన మాచరించి కూర్చొని యున్నాడు. హఠాత్తుగా నొక ద్రోహిలోపల ప్రవేశించెను.

ద్రోహి: „శంకరా, నీవు పరోపకారార్థము నీజీవితము నర్పించినావని విన్నాను”

శంకరుడు: „అవును. చేతనైనంత వరకు మానవసేవఁజేయ నిశ్చయించినాను”.

ద్రోహి: „అయిన నాకొక యుపకారము చేసెదనని వాగ్దాన మిచ్చెదవా?”.

శంకరుడు: „చెప్పుము, ఏ విధమైన యుపకారము నభిలషించుచున్నావో?”

ద్రోహి: ,,నీ శిరస్సు కొలుసు వెల స్థిర పడినదని నీకు తెలియును కదా?''

శంకరుడు: ,,అవును?''

ద్రోహి: ,,అతలను పొందుటకై నాకు సహాయము చేయుము.''

శంకరుడు కించిత్తైన నాలోచించక తన తలవంచి ,,నా తల దీసిన నీకు లాభమైన యెడల యిదిగో నీ సేవజేయ సిద్ధముగా నున్నది'' అనియెను.

ఒక నిముషము వరకూ ద్రోహి నిశ్చేష్టుడైపోయెను. కాని యవస్థ త్రుటి కాలములోనే మాయమైనది. రెండవ త్రుటిలో నాతనిచేతనున్న పదనగు ఖడ్గము శంకర కంఠఖండనమునకై ఉరుకు చూడెను.

ఇంకొక క్షణము గడచిన లోకమునకు మహోపకారము చేయనున్న శంకరుని శిరః ఖండనము పూర్తియై పోవుచుండెడిదే. కాని అదేసమయమున నొక పెద్ద దెబ్బ ద్రోహితలపై బడినది. వాడా దెబ్బకు తాళజాలక క్రింద పడిపోయెను.

శంకరస్వామి మరలిచూచెను. అతని శిష్యుడొకడు ద్రోహి యురముపై కాలిడి కోపముతో మండిపోవుచున్న దృశ్య మగుపడెను.

శంకరుడు:,. ఈ పనేమిచేసితివి! పాప మాతనిని బహుమతిఁ బొందకుండ జేసితివి. కొన్ని నిమిషములలో నాతని యభీష్టత సిద్ధించుచుండెడిదే!''

శిష్యుడు:,, బాగున్నది! ఆ క్రూరునిచే నరకబడుటకు మీ జీవితమంత నిష్ప్రయోజకమైనదా?''

శంకరుడు!,. సోదరా, ఎంతవరకు మన మీ ప్ర
చమునందుండ వలయునో, ఎంతవరకు మన దేహముచే
పరమాత్ముడు పనిదీసుకొన దలచియున్నాడో అంతవ
పని దీసుకొనుచుండును. అటుపిదప నే శక్తికిని మన ప్రా
ముల నాప సామర్థ్యముండదు. అందువలన నీ దేహ
కవసాన కాల మాసన్నమైన యెడల దానిమూలమున
రులకు లాభ మగునప్పుడు, తద్వ్యతిరేకముగా ప్రవర్తి
దాని నేల వ్యర్థముగా పోనియ్యవలెను?''

౬

ఈ అద్భుత విశ్వాసము, యీ యాదర్శప్రా
మగు నొప్పు జగద్గురు వగు శంకర భగవత్పాదాచార్య
జీవితమునందు విచ్చలవిడగా నగుపడుచున్నవి. ఆ
యుపదేశములు దేశకాల పాత్రబంధముల కతీతము
అతడు నిజమైన జగద్గురువు. అతని సదుపదేశములతో
ము పొందని మతములేదు. అతని నామమువిని గౌ
సూచకముగా దలవంచనివారు లేరు.

విధాతా! జాతుల సజీవులుగా జేయు తంత్రీ!
పవిత్రవ్యక్తులు తిరిగీ ప్రపంచమున నవతరించరా?
యఖండ తేజస్సుగల యాత్మలు మరల తమ సందేశ
పాడరా?

పుట్టి కంఠశోష జేసుకొనుచున్న మహాపురుష
తగు రీతి సన్మానింప బడరా?



మాస్టరు మనోహర్ బర్వే

# ప్రణయహృదయము

యడ్లపాటి వేంకటసుబ్బారావు గారు

అది అగాధము! వచియింప నలవిగాదు
దృక్పథాతీతజలధి విక్రీడితంబు
భావరత్న ప్రదీప్త సంభావితంబు
శుభ్రమౌక్తిక కాంత తేజోమయంబు.

అది మహాఖని త్రవ్వగ నలవికాదు
అతులమణిమయ సౌభాగ్య వితతిబొల్చు
అరగదీసిన మెఱుగులు విరలమమ్మ
ప్రణయకలహము మెఱుగు సాధనము గాదె.

సలలితామోద కుసుమ పేశల సదృశము
భంభరారవరాగవిభ్రాంతిమయము
ప్రేమసౌరభమధురసధామ మహహ!
ప్రణయ హృదయంబు సరస సంభావితంబు.

కోకిలారవమధుర గానైక సరణి
శారికా రమ్యభాషణ సారమహిమ
హరిణ హరిణీ సమావేశ తరుణభూమి
ప్రణయహృదయంబు ఉద్యానవనము గాదె.

మావిచిగురుల మీఁదనె మలయుచుండు
పూవుపొదరిండ్లలోపల పొలుపు గనును
విహగరుతముల నానందవీచి దేలు
ప్రణయహృదయంబు ప్రకృతి సుభాషితంబు.

మర్మరారవ మోహనమందగమన
స్వచ్ఛజలపూర్ణవాహినీ సరణులందు
ప్రియముగాంచగ భావంబు వెదకబోవు
ప్రణయహృదయంబుఅచ్చోటప్రబలుగాదె.

చెలియక్రీగంటి చూపులో చెలగునేది
కలికి మందహాసరుచుల వెలయునేది
సఖియ ముఖచంద్రుసీమ విస్ఫారునేది
అదియెహృదయము, అదెప్రణయాత్మకంబు.

సఖుని ఆశ్లేషసుఖవీచి జలదరించు
ప్రియుని వాగమృతాంబుధి ప్రీతి మునుగు
కాంతు మహనీయ రూపంబు గాంచగోరు
ప్రణయ హృదయంబు స్నేహార్ద్రభాజనంబు.

ప్రథితరాగ ప్రభావ విస్ఫార మహిమ
ప్రణుతి నన్యోన్యసద్ప్రేమ ప్రాభవంబు
హావభావవిలాస విహారయుతము
ప్రణయహృదయంబుసకలసామ్రాజ్యపదము.

తరుణి లావణ్యరాశిలో తాండవించు
ఉవిదముగ్ధప్రవృత్తిలో నోలలాడు
కలికిరమ్యాంగకంబుల కులుకుచుండు
ప్రణయ హృదయంబు సుఖపదప్రాపకంబు.

విమలప్రేమార్ద్రవీక్షణ వితతియందు
దైన్యసందిగ్ధ వదన పద్మమ్మునందు
బాష్పమౌక్తికయుతగండభాగమందు
ప్రణయహృదయంబునిండార ప్రతిఫలించు.

పుష్పమాలలదాగిలిమూతలాడు
రమ్యవస్తువు గాంచిన రాగమిడును
అవుర గాదనచినబోయి అవల దిరుగు
ప్రణయహృదయము ముద్దుల బాలగాదె.

# సహకార సంఘోద్యమము

కే. రాములుగారు

అల్లని నోట శని దేవత తాండవించుచుండ, అంగడిలో నెన్నియున్న నేమి లాభము? హిందూస్థానము పారిశ్రామికముగ వృద్ధినొందుచున్నదని మనమెంత యనుకొన్నను, బీదరైతుల కష్ట నిష్ఠురము లెంతవరకు దగ్గినవో మనమెఱుంగని విషయము కాదు. స్వేచ్ఛావృత్తియగు వ్యవసాయము, ఇంకను వ్యసన కారణమగుచున్నది. ఇప్పట్ల ప్రభుత్వము వారెన్నియో రీతుల సాయపడుచున్నారు. చట్టముల నిర్మించుచున్నారు. తమ కష్ట సుఖముల ప్రభుత్వమునకు నివేదించుకొను అవకాశముల బీదరైతులకు గలిగించుచున్నారు. దీని వలన గ్రుడ్డిలో మెల్ల యనునంతటి మేలు కలిగి యుండవచ్చును, కాని, ప్రజా సామాన్యము ఈ లాభముల నుచితరీతి బడయజాలకున్నారు. ఋణప్రదాతల బాధలో నింకను అసంఖ్యాకులగు కృషీవలులు తగులుకొని యున్నారు. పండిన పంటలో నెక్కువ భాగము వడ్డీ క్రిందను, మిగిలినకొంత, ఋణము క్రిందను సాహుకారుల యొడి జేరుచున్నప్పుడింక కృషీవలుల పురోవృద్ధి కెద్ది మార్గము? విత్తనములకు, కలుపు గూళ్లకు పశువుల గొనుటకు చివరకు వాని మేతకొరకే కాక, బిడ్డల చదువు సంధ్యలు, పెండ్లి పేరంటములు మున్నగు నెన్నియో సాంఘికావసరములకై తిరిగి యాసాహుకారి యొద్దనే జేరవలసి యుండును. అతని యభయ హస్తముకన్న వేరు శరణ్యము లేదు, గత్యంతరము లేదు. ఈ దుర్భర సంకటములే మనల సహకార సంఘ నిర్మాణావశ్యకతకు లాగికొని పోయినవి.

విశాలమగు ఆంగ్ల సామ్రాజ్య మందును, జర్మని, అమెరికా సంయుక్త రాష్ట్రములవంటి తదితర నాగరిక దేశములందును, ఈ సహకార సంఘములు వేనవేలు నెలకొల్పబడి, జాత్యభివృద్ధికి, దేశాభివృద్ధికి, [illegible] తోడ్పడు చున్నట్లు గ్రహింప బడినవి. ప్రస్తుతము, [illegible] భరత ఖండమున గూడ, పలుతావులందీ సంఘములు [illegible] కొల్ప బడియున్నను, ఇతర దేశములకన్న మనదేశ[illegible] యుద్యమాభివృద్ధి కనేకములగు అవకాశము లున్న[illegible] విద్యాధికుల శ్రద్ధ తగినంత లేని కారణ ఇచ్చటి [illegible] ములంనుండియే యున్నది. ఇది దురదృష్టము. [illegible] సిరిపరులకు, ధనాధిక్యులకు దక్క, జనసామా[illegible] యొక్క అగుబాటులో నీసంఘము లింకను [illegible] నిర్వివాదాంశము.

సూక్ష్మదృష్టితో జూచిన, (All for each and each for all) "సంఘము వ్యక్తి కొరకు వ్యక్తి సంఘము కొరకు" అను సూత్రము నాచరణ[illegible] తెచ్చుటయే ఈ యుద్యమ ప్రధానోద్దేశము. [illegible] యము, స్వప్రయత్నము, పరస్పర సానుభూతి—ఇవి [illegible] బొడసూపినప్పుడే యీపవిత్రోద్దేశము నెరవేరును. [illegible] కార' సమస్యల యందు ప్రబల ప్రమాణముగ [illegible] బడుమిస్టరు వుల్ఫ్ అభిప్రాయము ప్రకారము, [illegible] సంఘములు, సోమరి బోతును కష్టమున కోడలాం[illegible] గను, అమితవ్యయుల మితవ్యయులుగను, త్రాగు[illegible] పరమ పవిత్రులుగను, నిరక్షరకుక్షుల విద్యావంతు[illegible] మార్చు నంతటి శక్తివంతములై యున్నవి. ప్రభుత్వ[illegible] రంకుశాధికారమునకు లోబడియున్న భారతీయులు [illegible] హక్కుల బడయగోరు చున్నారు. దానికై తగిన [illegible] మును, విశాలహృదయమును సంపాదింప [illegible] నిక్కువముగ, ప్రజలభావ వైశాల్యము, శక్తి [illegible] ములే, ప్రభుత్వమునకు ప్రబలాధారములు. కాని[illegible]

ప్రతివ్యక్తి తన్నుదానొక ప్రజాప్రతినిధిగ భావించుకొనిన నేకదా, తనకు, తనదేశమునకు, ప్రభుత్వమునకు ఉచిత రీతి సాయపడగలడు. అట్టియిన నీరహస్యముల దెలుపునవి, తెలుసుకొనుట కవకాశమిచ్చునవి సహకార సంఘములే యనుట నిశ్చయము. ఇవి ముమ్ముందు నిర్మింప బడనున్న ప్రజాప్రభుత్వ సౌధమునకు ప్రథమ సోపానములు. సోదర రైతుల యొక్కయు, వ్యవహారికుల యొక్కయు సుఖ దుఃఖముల దెలిసికొని, అందు బాల్గొనినవాడే రాజకీయ మహారంగమున ప్రవేశింప గలడు!

సహకార సంఘములు, లేక పరపతి సంఘముల నిన తోడనే కొందరికి వ్యతిరేక భావములు కలిగిన కలుగ వచ్చును. ఇవి పాటకచేరులని కాని, క్రీడామందిరములని కాని తలంచుట పొరపాటు. నిష్పక్షపాతముతో, ప్రజాహిత చింతతో, పవిత్రోద్దేశ్యముతో పరస్పర సహాయ సంపత్తి నొనగూర్చుటకై నిర్మింపబడిన సంస్థలీసంఘములు. అయితే, సహాయ సంపత్తి నొనగూర్చినంత మాత్రమున నివి ధర్మశాలలనియు, వాని యుద్దేశము అశక్తులకు అపాత్రులకు భిక్షనిడుట యనియు దలంప జనదు. భిక్షా పద్ధతి వలన అశక్తులు మరింత యశక్తులగుటకు సోమరిపోతులు మరింత సోమరులగుటకు జార, చోర, జూత్యాది-వృత్తుల వారికి మిక్కిలి నైపుణ్యము కలుగుటకు అవకాశము కలుగుచున్నది. కాని సహకార సంఘము లట్టివి కావు. భిక్షము దేశారిష్ట దాయకము. సహకార సంఘము దేశాభ్యుదయ కారకము. మొదటిది దైన్యమునకు, నైచ్యమునకు దావిచ్చుచున్నది: రెండవది ఉత్కృష్టతకు స్వశక్తి విజృంభణమునకు సాయపడుచున్నది. అది జాతిని నిర్వీర్యముగ జేయుచున్నది. ఇది జాతిని వీర్యవంతముగ జేయుచున్నది. దానము, అదియు పాత్రదానము, దారిద్ర్య రోగమున కౌషధముగ బనిచేయుచున్నది. సహకార సంఘములు, వ్యాధిగ్రస్థులుకాక పూర్వమే సేర్చికొనదగినవగు ఆరోగ్య శాస్త్రములుగ బరిణమించుచున్నవి. ఇవి యేకొలది ధనికులు కలిసి కొంత మూలధనముతో నితరులకు వడ్డీపై ధనమునిచ్చు (Joint stock companies) సంఘములు గూడ కానవుట మరువదగిన విషయము కాదు.

ఈ సందర్భమున, సహకార సంఘము లెట్టి యవకాశముల గలిగించుచున్నవను విషయము చర్చనీయము. ప్రస్తుతము „శికావీ" పద్ధతిన గూడ మనరాష్ట్రములోని రైతులకు పైరుపంటల వృద్ధిచేసికొనుటకు, పశుసంఖ్యను వృద్ధిజేసికొనుటకు, లేకతమ పంటను అందరి యామటాటులో నుంచుటకు దయామయులగు మన నిజాము ప్రభువుగారు కొన్ని యేర్పాటుల జేసియున్నారు. కాని ఈసహాయము కేవలము కృషీవలుల వరకే ఉద్దేశింప బడినదని తదితరులను కొన గూడదు. సాలె, దర్జీ, మోచీ మొదలగు పనివాండ్రుగూడ నీసహాయమును బొందవచ్చును. అట్లయిన, నిన్ననేడు మన దేశమందెందరో అర్థశాస్త్రజ్ఞుల తీవ్రాలోచనకు గురియగుచున్న నిరుద్యోగ సమస్య చాలవరకు విశదీయబడును. మన మొకింత సింహావలోకన మొనరించితిమేని, కొందరు మన పూర్వులు తమలో దామిట్టి యవకాశముల గల్పించుకొనుచుండి నట్లు తెలియగలదు. విదేశీయుల మర్మర దాములనుండి తమ్ము గాపాడు కొనుటకు, జలాశయముల నిర్మించు కొనుటకు, గ్రామ దేవతారాధనకు, నిధుల గల్పించు కొనెడివారు. చెన్న రాజధాని యందిప్పటికి చిట్ ఫండు (Chit fund) పద్ధతి అమలులో నుండుట, దీనికి తార్కాణము.

ఈ కారణముననే కాబోలు సహకారోద్యమతత్వమును గ్రహించుటలో అన్ని రాజధానుల యందు చెన్న రాజధాని మొదలు నిలిచినది. అచ్చటి ప్రభుత్వము వారు ప్రప్రథమమున సర్ ఫ్రెడిక్ నిక్కల్సన్ అను నాతని ఐరోపా ఖండమునకు బంప వారచట సహకార సంఘతత్వముల నామూలాగ్రముగ గ్రహియించి ౧౮౯౫—౧౮౯౭ సంవత్సరమున నొక విశాలమైన నివేదికను ప్రకటించిరి. ఈ నిక్కల్సన్ పద్ధతిపైననే డూపర్నె అను నాతడు సంయుక్త రాష్ట్రములందును. మేక్లాగన్ అను నాతడు పంజాబు దేశమందును సహకార సంఘముల స్థాపించిరి. ఈ యుద్యమమునకు అప్పటి రాజప్రతినిధియగు లార్డ్ కర్జను తోడ్పడెను. రాను రాను ౧౯౦౪ సంవత్సరమున (Co-operative Credit Societies Act) సహకార సంఘ చట్టము శాసింపబడియెను. స్థానిక పరిస్థితుల బట్టి, వివిధ రాజధానులలో నీ సంఘముల పద్ధతులు విభిన్నములుగ నుండినను, మైసూరు,

బరోడా రాష్ట్రములు నవీన పద్ధతుల గనిపెట్టినవి; ట్రావంకోరు, ఇందోరు, హైదరాబాదు, రాష్ట్రములు వీని ననుకరించినవి. ముఖ్యముగ, మైసూరునందు బడసినంతటి విజయమీ సంఘములు మరెచ్చట గాంచలేదు. ౧౯౦౫ సంవత్సరాంతము వరకు, అనగా శాసననిర్మాణము నుండి యొక సంవత్సర కాలమున నలుబదొక్క సంఘములు స్థాపింపబడినవి. వీనిలో ముప్పదైదు (Rural గ్రామీయ)మైనవి ఆరు (Urban నగర) సంబంధమైనవి. వీని మూలధనము ౫౮ వేలైయుండెను. ఈ సంఖ్య మరియొక్క సంవత్సరము వరకు ౭౭౬ వరకు పెరిగి, ౨౬ వేల మెంబర్ల (భాగస్థుల) తో, ౫ లక్షల మూల ధనముతో విరాజిల్లు చుండినవి. మరి పది సంవత్సరముల లోని వీని వృద్ధి ఈ క్రింది సంఖ్యల వలన తెలిసికొనదగును:—

| సంవత్సరము | సంఘములు. | భాగస్థులు | మూలధనము |
|---|---|---|---|
| 1906—07 | 843 | 90,844 | 23,71,683 |
| 1907—08 | 1,357 | 149,160 | 44,14,086 |
| 1908—09 | 2,003 | 184,889 | 80,63,111 |
| 1909—10 | 3,498 | 530,693 | 1,28,07,682 |
| 1910—11 | 5,432 | 314,101 | 2,03,66,584 |
| 1911—12 | 8,177 | 403 318 | 3,35,74,162 |
| 1912—13 | 12,324 | 573,536 | 5,34,34,261 |
| 1913—14 | 15,673 | 744.226 | 7,71,70,.. |
| 1914—15 | 17,327 | 824,469 | 8,96,81,.. |
| 1915—16 | 19,675 | 913,436 | 10,32,67,.. |
| 1916—17 | 23,036 | 1,045,425 | 12,22,92,.. |
| భారత దేశ ప్రస్తుత సంఖ్య | 71,000, | 2,500,000 | 48,00,00.. |

నిజాం రాష్ట్రమునందలి ప్రస్తుత సంఖ్య:

| 2000 | 50900 | 1230.. |
|---|---|---|

వీనిలో 1500 సంఘములు వ్యవసాయ దారులచే ఏర్పడు సంఘములై యున్నవి.

(ఈ సంఖ్యలు A manual for Co-operative Societies in the Bombay Presidency by R. B. Ewbank నుండి తీసు కొనబడినవి).

సహకార సంఘముల గురించి మనకర్తవ్యమేమి, ఇవి మనకింతవరకు జేసిన మేలు; నిజాం రాష్ట్రమున యీయుద్యమము యొక్క స్థితి, దాని వృద్ధికవకాశమున్నగు విషయములు విపులముగా రాబోవు సంచికలో జర్చించ బ్రయత్నించెదను.

—•• ••—

## ఆంధ్రుడా!

(శ్రీవత్సుడు)

సకలజాతులు నిద్రలేచి
స్వస్వక్షేమము చూచుచుండ
నీవు బద్ధకమ్ముతోడ
నుండుటేల • ఆంధ్రుడా
మేలుకొనుమో • ఆంధ్రుడా!

ఆంధ్రమాత కడు కుందియున్నది
ఆంధ్రమాత నిను పిల్చుచున్నది
అదిగో డంకా మ్రోగుచున్నది
అరుగుమయ్యా • ఆంధ్రుడా
ఘనసామ్రాజ్యము వీకుమో • ఆంధ్రుడా!

ఆంధ్రజాతి గౌరవమ్ము
ఆంధ్ర దేశ సౌభాగ్యమ్ము
ఆంధ్రులే రక్షించవలెను
అని తలపోయుము • ఆంధ్రుఁడా
నడుము కట్టుమో • ఆంధ్రుఁడా!

చాటుమయ్యా ఆంధ్ర శౌర్యము
చూపుమయ్యా ఆంధ్ర తేజము
సకలదేశ జాతులెల్ల
సంభ్రమింప • ఆంధ్రుఁడా
సంకోచింపకు • ఆంధ్రుఁడా.

ఆంధ్ర దేశపు మట్టికనకము
ఆంధ్ర దేశపు నీరె యమృతము
ఆంధ్ర దేశమె మనకు స్వర్గము
అనుభవింపుమో • ఆంధ్రుఁడా
ఆలకించుమో • ఆంధ్రుఁడా!

పోతనార్య సుకవిఁదలఁచి
భక్తరామదాసుఁ దలఁచి
త్యాగరాజవరునిఁ దలఁచి
సల్పుమయ్యా • ఆంధ్రుఁడా
సంఘసేవ • ఆంధ్రుఁడా!

కృష్ణరాయ విభునిఁ దలఁచి
రాజరాజవరునిఁ దలఁచి
ప్రతాపరుద్ర దేవుఁదలఁచి
పాటుపడుమో • ఆంధ్రుఁడా
పతాకమెత్తుమో • ఆంధ్రుఁడా!

మొల్ల మల్లమ ఖ్యాతులఁ దలఁచి
వీర రుద్రమదేవినిఁ దలఁచి
ఇప్పటి స్త్రీల దశను దలఁచి
వేదనపడుమో • ఆంధ్రుఁడా
నీ విధినిఁ దలచుమో • ఆంధ్రుఁడా!

తిమ్మరుసువంటి మంత్రులేరీ
తిక్కనవంటి శూరులేరీ
ఆంధ్రమాత ఋణము దీర్చ
అధిపులేరీ • ఆంధ్రుఁడా
ఏమికతము • ఆంధ్రుఁడా!

ఆంధ్రులనఁగా సత్యసంధులు
ఆంధ్రులనఁగా ధర్మవీరులు
అనెడురీతి నడువుమయ్యా
అమలతేజుఁడ • ఆంధ్రుఁడా
యశముదెమ్ము • ఆంధ్రుఁడా!

బ్రాహ్మణా బ్రాహ్మణులని
ద్విజులు శూద్రులు పంచములని
తగవులెల్ల విడువుమయ్యా
తల్లియొక్కతె • ఆంధ్రుఁడా
అందరొకటే • ఆంధ్రుఁడా!

ఆంధ్ర మరాటీ కర్ణాటకులును
వంగ తమిళ పంజాబీయులును
హిందూ క్రైస్తవ ముసల్మానులును
హైందవులయ్యా • ఆంధ్రుఁడా
సోదరులయ్యా • ఆంధ్రుఁడా!

పితృభక్తి మరి మాతృభక్తియును
దేశభక్తి జగదీశ్వరు భక్తియు
సర్వమానవ సోదర భావము
ఉర్వి నీకు తగు • ఆంధ్రుఁడా
గర్వము వలదు • ఆంధ్రుఁడా!

ఆంధ్రమాత నిను గౌరవించును
ఆంధ్రమాత కడు శుభములిచ్చును
ఆంధ్రమాత పాదసన్నిధి
అర్పణసేయుము • ఆంధ్రుఁడా
నీదు సకలము • ఆంధ్రుఁడా!

ఆంధ్రమాతకు జయమగుగాక
భరతమాతకు జయమగుగాక
సకల మనుజులకు జయమగుగాకని
సల్పుము ప్రార్థన • ఆంధ్రుఁడా
గానముచేయుము • ఆంధ్రుఁడా!



# ప్రేమ

కోదాటి రామకృష్ణారావు గారు

త్రప్పితేనటంచు ఓనాథ! తలఁచితోయి
కంటఁబడని మాత్రాన ప్రగాఢసక్తి
పరుషమైన యాలింగన బంధములను
దృష్టిఁబరపుము! నిశ్చయ మెదియొ
నాహృదయమందు మైత్రిచే నాటబడిన [తేలు!
తోరమౌ రజ్జుల బంధితుఁడవు గావె!
ఎదిరి చూచెదని లేఖ యెపుడు కనుల
బండు వొనరించునో యని! భావ గుప్త
మధురిమను గ్రోలుటయె గాక మనకు తెలియ
రానియొక చిత్రకారుని రచితమైన
నీ పటముఁగాంచఁగలను నిర్నిద్రరుచిని
లేఖలోని ప్రత్యక్షర రేఖయందు
భావ సంక్షోభ నిలయ విశ్వంబునెల్ల
శాంత చంద్రికలను గప్పి, స్వాంతహారి
చంద్రికాకాంతుల విశాల శాఖపత్ర
ములను ప్రతిబింబితముజేసి, లలిత తార
కాలసద్గగనంబుచే కలుకు విరహ
మునిరాశాంధకార ప్రమాద హృదయ
గతుల నాశాప్రకాశ యుక్తంబుఁజేసి,
సౌఖ్య సౌధాంతరమునకు సరసపార
వశ్యమున బిల్చుచున్నది ప్రకృతి నాథ!
ఆర్ద్ర హృది నీను సన్నిధి నడుగు దాన!

ప్రణయసంపదశేషవిభ్రాజితమ్ము
లైన గతదివసమ్ముల నారతంబు
హృదయ నీలాభ్రతారకా దృశములగుచు,
భవదమోఘ సందర్శన భాగ్యగరిమ
సుజ్వలంబగు భావి భావోత్సుకతయు
హృదయ తంత్రులలో రమణీయ గాన
లహరి నింపఁగ నాముకాలంబు గడచు
వివిత సౌఖ్యాననొప్పు స్నిగ్ధత వహించి
తలఁచిచూడ నాజీవిత ఫలక మెల్ల
భవ్యమగు నీ స్వభావ దర్పణము గాదె!
ప్రణయిని రమ్య చరితఁబు ప్రణయ రమ్య
నర్మ చేష్టితములచేత నిర్మితంబు
అతుల భావతరంగ సమావృతమయి
మధురమౌ నీదు భావనామంద మధువు
శాంత గంగా తరంగిణీ సదృశమగుచు
నాదు జీవితసీమ ననంతసార
లలిత మొనరించు; హృదయ విలాసకరము
లౌ కుసుమసంతతులగూడి యనవరతము
సంతసము గురిపించు శకుంతగీత
నాదమునుగూడి సంతతానంద నిలయ
మైన యొక నూత్నసుందరోద్యానవనము
గతిని వికసిల్లు నాదు జీవితము నాథ!

# పిల్లలమఱ్ఱి శాసనములు

(ఆంధ్రపరిశోధకసంఘము హైదరాబాదు)

ఈ గ్రామము నల్లగొండ జిల్లా, సూర్యాపేట తాలూకాలో నున్నది. ఈ గ్రామమునకు పశ్చిమమున నున్న సోమేశ్వరస్వామివారి యాలయ బహిర్భాగమున నున్న స్తంభముపై నాల్గు వైపుల నొక శాసనము చెక్కఁబడియున్నది. శా. శ. ౧౧౬౨ వికారి సంవత్సర జ్యేష్ఠ శుద్ధ తృతీయా సోమవారము నాఁడు, శ్రీ మతు రేచెర్ల పిల్లలమఱ్ఱి బేతిరెడ్డి భార్య ఎఱకసానమ్మగారు శ్రీ ఎఱకేశ్వర దేవరను ప్రతిష్ఠ చేసినట్లు తెలియుచున్నది. ఈ బేతిరెడ్డి గారికి "శ్రీ స్వస్తి సకలగుణగణాలంకార, పరనారీసహోదర, అమనకంటి పురవరేశ్వర, వీరలక్ష్మీనివేశ్వర, మార్వలభీమ, వితరణరామ, వితరణ కర్ణ, శౌర్య సౌపర్ణ, పవి వాత్కాంజనేయ, శౌచ గాంగేయ, సత్య రత్నాకర, దుష్టజన భీకర, స్వామి ద్రోహర, గండభేరుండ దండ, మనుమకులాదిత్య, సుభట సంస్తుత్య" అను బిరుదులు గలిగియున్నట్లు పేర్కొనబడియున్నది. ఈ బేతిరెడ్డి వంశమునకు మూల పురుషుఁడు బమ్మరెడ్డి, అతనికి గాటరాజును అతనికి రామరాజును, మరియు నాతనికి కాచాంబయు అను బేతిరెడ్డియు జన్మించిరి. ఎఱకసానమ్మకు బేతిరెడ్డి వలన మల్లారెడ్డి యను కుమారుఁడు జనించెను. ఇతని గుణ విశేషములీ ప్రకారముగా వర్ణింపబడియున్నవి "యమున్య: పుత్ర: పవిత్రోన్నత మతచరితోద్భూతి సుఖ్యాతకీర్తి ర్మల్లి: ప్రోల్లాసిత శ్రీర్వ్రతతో వితరణ శస్త్ర శాస్త్ర ప్రగల్భ: స్వైనోర్వీలూన యుద్ధోద్భట పటు చటు లాఖర్వగర్వారి వీర వ్రాతాశాప్త్యవమ్భోజ రాజి ప్రనిహిత విజయ శ్రీపదామ్భోజ పూజ:"

స్తంభమునకు దక్షిణమున శా॥ శ॥ ౧౨౭౫ నందు ఏఱకేశ్వరుని పున: ప్రతిష్ఠ చేసినట్లు తెలియుచున్నది. "స్వస్తి సకల గుణగణాలంకార ఆంధ్ర దేశాధీశ్వర పరనారీసహోదర, అమనగంటి పురవరాధీశ్వర, చోడ రాయ స్థాపనాచార్య, కాంచి రక్షపాలక, విషమదాడీ స్వాంచాల, ఇభ వేతంగంపేర గండ గోపాల, మూరు రాయజగదేక ఇత్యాది బిరుదాంకితులైన కాచయ్య నాయనింగారి యిష్ట భృత్యుండు ఎఱపోతు లెంకం గారు పిల్లలమఱ్ఱి రాజ్యము సేయుచుండి తత్కాలములోఁ విశ్వారాలను సురతాణి చేతను ఎఱకేశ్వర ఉపహతి అయితే అన్నవస్థను ఎఱపోతు లెంకంగారు తన ఏలిక కాచయనాయనింగారికిన్ని తల్లి రుద్రసానింగారికిన్ని పుణ్యముగాను శక వర్షములు ౧౨౭౫ అగునేటి హేవళంబి సంవత్సర జ్యేష్ట శు॥ ౧౫ గురువారమున పున: ప్రతిష్ఠ సేసిరి."

ఈ శాసనము క్రీ॥ శ॥ ౧౩౫౩ నాటి దగును. ఈ సురతాణి యెవరో తెలియకున్నది. ఢిల్లీ పాదుషా మహమ్మదు బిన్ తొగ్లాకు కాలములో జరిగియుండవలెను. క్రీ॥ శ॥ ౧౩౫౧ లో మహమ్మదు బిన్ చనిపోయెను. బహమని సుల్తానగు అల్లాఉద్దీను హసను కాలములో రెడ్డి రాజులు కొంత స్వాతంత్ర్యమును పొందియుండవచ్చును.

బేతిరెడ్డిగారి సోదరులైన నామిరెడ్డిగారి శాసనము కూడ నిట గలదు. అది ఊరి మధ్యమున్న శ్రీ నామేశ్వర స్వామి దేవాలయ మధ్య భాగమందలి రాతిపై నున్నది. ఇది శా॥ శ॥ ౧౧౧౮ వ సంవత్సరమున మొదటి ప్రతాపరుద్ర దేవ మహారాజు కాలమందు నామిరెడ్డిగారు దేవాలయములు గట్టించిన శాసనము. దీనిని గురించి విపులముగ చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రుల చరిత్రము, మధ్యయుగము ౧౭౫ వ పుటయందు చర్చించియున్నారు.

## నాగులపాడు శాసనములు

ఈ గ్రామమందు రెండాలయములున్నవి. ఇవి శిల్పకళా నైపుణ్యమును వెల్లడించు చిత్రములచే నలరారుచు గన్నుల పండువుగా వెలయుచున్నవి. మొదటి యాలయమున మంటపమంతయు రామాయణమునకు సంబంధించిన

కథలను తెల్లడించు చిత్ర ప్రతిమలచే నిండి అచ్చెరువు గొల్పుచున్నవి. మంటప స్తంభములపై చిత్రించిన లతలును ప్రతిమలు చూచి యానందింపని వాఁడుండఁడు; రెండాలయములును స్నిగ్ధము చేయబడిన నల్లని రాతితో కట్టఁబడినవని స్పష్టమగుచున్నది. ద్వారశాఖపై చిత్ర విచిత్రములైన లతలు నానావిధములైన విగ్రహములు చెక్కబడి యున్నవి; గజలక్ష్మి విగ్రహ మున్నది. ఈ యాలయముల ద్వారములు హనుమకొండ దేవాలయముల ద్వారముల ననుకరించు చున్నవి. ఆలయములందు కొన్ని శాసనములు గలవు. వానిని బట్టి శకవర్షము ౧౨వ శతాబ్దమున నీయాలయములకు గొన్ని వసతుల నిచ్చినట్లు తెలియుచున్నది. పిల్లలమఱ్ఱి దేవాలయములు గట్టించిన నామిరెడ్డిగారి కొమరుఁడు రేచెర్ల కాటిరెడ్డిగారు శా॥ శ॥ ౧౧౪౭ కాకతి గణపతి దేవ మహారాజుగారి కాలమందు నాగులపాడు నామేశ్వర దేవాలయము కట్టించినట్లు గోచరమగుచున్న[ది.] మరియొక స్తంభముపైన మూడు ప్రక్కల శా[సన]ములున్నవి. రెండు ప్రక్కల స్ఫుటముగా లే[వు.] వైపు (స్వస్తి శ్రీమన్మహామండలేశ్వర కా[కతి] ప్రతాప రుద్రదేవ మహారాజులు పృథివీ రాజ్యము సే[యు]చుండఁగాను శకవర్షం ౧౨౨౫" శ్రీమల్లినాథ దే[వ] దానములు చేసినట్లు తెలుపుచున్నది. మఱియొక శా[సన]మునుబట్టి యాప్రదేశమున నాకు తోఁటలును కె[రె] తోఁటలును వెలయుచున్నట్లు తెలియుచున్నది. ఈ ప్ర[దేశ] పంటయు ముచకుందనది కానకట్టగట్టి (మునిడి) కా[లు]వల ద్వారా పారించినట్లు తోఁచుచున్నది. ఈ యా[లయ]మునఁ జెక్కఁబడిన శాసనములలో బహుదాని యు[ం] "నామనగంటి పురవరేశ్వర" యని యుండుటచే [దీని]కి ౧౦ మైళ్ళలోనున్న యామనగల్లు రాజధానిగా [నుం]డినది యుండవచ్చునని యూహించుటకు కారణమగుచున్నది.

# సాభిప్రాయములు

## నవీనోద్యోగులు

కొన్ని దినములనుండి మన ప్రభువుగారు ఎక్కువ అనుభవముగల ఉద్యోగుల నియమించి ప్రజల యవసరములెక్కువ సులభముగా వెడల దీయవలెనని తలంచుచుండిరి. అందువలననే గత మాసమునందు కొన్ని పరివర్తనములు శ్రీవారి యాజ్ఞానుసారము జరిగినవి. అపారానుభవముగల గ్రెంచ్ గారు భూమ్యాదాయశాఖామంత్రులుగను, వారే రక్షకశాఖామంత్రులుగను, తెలుగు వారిసహవాసములో కొంత కాలము మెలిగిన టస్కరుగారు భూమ్యాదాయశాఖాకార్యదర్శిగను, హైద్రాబాదునందిదివరకు గొప్ప పదవులందుండి పేరుబడసిన ఫరీదుల్ముల్కు కుమారులగు రుస్తుంజీ ఫక్ దూంజీ చినాయిగారు కరోడిగిరీ (కస్టమ్సు) శాఖాధ్యక్షులుగను, పదిపదునేను వత్సరములనుండి కలకత్తాలో రక్షకభట శాఖయందుండి విప్లవకారుల నణచియుంచిన, ఆర్మస్ట్రాంగు గారీ రాష్ట్ర రక్షకభటాధ్యక్షులుగను నియమింపబడిరి. వారిసహాయమున 'ముల్కీ' లకు ప్రభుత్వ కార్యనిర్వహణానిపుణత గలిగింపజేసిఉన్నతస్థానములందు తిరిగి 'ముల్కీ'లనే నియమించుట రాష్ట్రమునకు శ్రేయోదాయకము. అనుభవజ్ఞులగు పైని పేర్కొనబడిన యుద్యోగస్థులు తమ ముందీయాదర్శమునే యిడికొని దేశసేవ జేసెదరని నమ్ముచున్నాము.

## శ్రీకృష్ణదేవరాయలు

గత పుష్యబహుళ ౧౨ దినము విఖ్యాత విద్యానగర సామ్రాట్టును, ఆంధ్రకవి పోషకుడును, మూరురాయరగండాది బిరుదాంకితుడును నగు శ్రీకృష్ణదేవరాయల జన్మదినమని సంప్రదాయ సిద్ధము. శ్రీరాయలవారి జన్మదినమును విద్వాంసులు నేటివరకును ఇదమిద్ధమని నిశ్చయింప జాలరైరి. అయినను పైన పేర్కొనబడిన దినమున హైద్రాబాదు నందలి ప్రసిద్ధ గ్రంథాలయమువారు ఉత్సవము జరుపు నాచారము ఏర్పడినందున, ఆదినమునే మేము కూడ శ్రీరాయలవారి జన్మదినముగ భావించుచున్నాము.

రెండు వత్సరములకు పూర్వమిట్టి పవిత్ర సందర్భముననే శ్రీకృష్ణదేవరాయల ఆంధ్ర భాషానిలయమున వనపర్తి సంస్థానాధీశులును, ఉత్సాహపూరిత యౌవనులును, నిజాంరాష్ట్రాంధ్రుల యభివృద్ధికై ముందంజతో హితమొనర్తురను నానవెల్లరకు గల్గించిన వారును నగు శ్రీ కృష్ణదేవరాయల వారు అధ్యక్షత వహించియుండిరి. తరువాత కొలది కాలముననే దేశదౌర్భాగ్యమున వారు కీర్తిశేషు లగుటకు

మారు కీర్తికాయులైరి. ఈ సంచికయందు విజయనగర సామ్రాట్టులగు శ్రీకృష్ణదేవరాయ్యలను గుఱించిన క్రొత్త వ్యాసమును వ్రాయక వనపర్తి సంస్థానాధీశులగు కీ. శే. శ్రీకృష్ణదేవరాయలు, త్రిషు ప్రజాహిత జీవనకాలము నందలి ముట్టముఱటిడియు తుట్టతుదదియునగు, అధ్యక్షకోపన్యాసముఁ బ్రకటించుటతోఁ దృప్తినందు చున్నాము. విద్యానగర సామ్రాట్టుని జన్మదినోత్సవము ఆంధ్రదేశ మందెల్లెడల జరుపఁబడు చుండుఁగాక!

మాస్టరు బర్వే

మాస్టరు మనోహర బర్వే యను పదునేను వత్సరముల బాలుడొకఁడు నగరమునందు తన గాన కళా కౌశల్యము నొకనెలనుండి ప్రదర్శించుచున్నాడు. వివిధములగు నలుబది యంత్రములను వాయించు నద్భుత శక్తి ఆతనికి కలదు. తొమ్మిది భాషలలో గానము చేయ నేర్పును ఆతడీ పిననాటనే గడించెను. ఈశ్వరుఁడాతని కాయురారోగ్యములును కీర్తిని ప్రసాదించుగాక!

పూనామహిళా సమ్మేళనము

జాతీయ గౌరవము కాపాడునట్టి సామర్థ్యమును, భారతీయుల నాదర్శ పురుషులుగ జేయు శక్తియు గలిగియున్న భారత రమణీమణులు పూనానగరమున గడచిన జనవరిలో సమావేశమైరి. ఆ సభ కధ్యక్షురాలుగా నున్న శ్రీబరోడామహారాణిగారు స్త్రీ లాదర్శ జీవితమెటుల గడుపవలెనో సాంఘిక దురాచారములు భారతగౌరవమున కెట్టి కళంకము దెచ్చిపెట్టు చున్నవో, స్త్రీవిద్య జాతీయాన్నత్యమున కెంత యవసరమైనదో యను విషయములబాల నిపుణతతో జర్చించిరి. ఇట్టి సమావేశములు ప్రతి దేశము నందును, ముఖ్యముగా హైదరాబాదున [illegible] యందున్న [illegible] లందు తఱచుగా జరుగుచుండిన గాని దేశము త్వరగా వృద్ధిఁబొందజాలదు. గత వత్సరము సూర్యాపేటలో నాంధ్ర మహిళా సభ [illegible] సమావేశము [illegible] దేశసేవకు [illegible] నిట్టి కార్యముల [illegible] ప్రభుత్వోద్యోగులు సాయపడుదురని [illegible] చు చున్నాము.

షాపూర్జీ సక్లతువాలా

ప్రపంచములోని యితర కర్షకుల [illegible] ధనమునకు కాయకష్టమునకు ఈ రోజుల [illegible] ప్రబల యుద్ధము జరుగుచున్నది. కూలీల కష్టములే ధనము ప్రోగుపడుటకు కారణమని రష్యా [illegible] విన వచ్చుచున్నది. కూలీ వారు లేనిది [illegible] తులు ధనము నార్జింప లేరను మాట [illegible] విననిది కాదు. పై సూత్రముల రష్యా [illegible] నములనకు దెచ్చి ధనికుల ధనహీనుల [illegible] ఆర్జించిన ధనమును నుభవించు హక్కు లేని [illegible] ధనార్జన పూర్తిగా నాగిపోవునని ధనిక [illegible] కూలీల వాదమును ఖండించుచున్నారు. [illegible] సమున మాతృ దేశమునకు వచ్చిన షా [illegible] సక్లతువాలా మొదటి తెగకు సంబంధించిన వారు. వీరు పారసీజాతివారు. పార్లమెంటు [illegible] వీరొకరే హైందవసభ్యులు. వీరాంగ్లేయ [illegible] కూలీల కొఱకై చాల కష్టపడుచున్నారు. [illegible] ప్రచారము హిందూ దేశమునకు లాభకరము [illegible] ను లాంకషైరు నగరపు కూలీల కపారనష్టము సంభవించుచున్నదని వీరు ఖద్దరు ఉద్యమము [illegible] నిరసింతురు! వీరు ప్రపంచమంతను [illegible] ముగా హెచ్చు తగ్గులు లేకుండ [illegible] నమ్మువారలలో ముఖ్యులు. ఈ భావము [illegible] ప్రాయమైనను ఆచరణయందు దెచ్చుట [illegible] ధ్యము. సక్లతువాలాగారు చాల ధైర్యము [illegible] అభిప్రాయము వెలిబుచ్చుటలో వారికెట్టి [illegible]

నులేదు. ఈ నిశ్చయత్వము హైందవులలో సామాన్యమే పోవుటత్యావశ్యకము.

### చీనా రాజ్యకల్లోలము

టర్కీ దేశమును మొన్న మొన్నటివరకు 'ప్రాక్దేశ దుర్బలుడ'ని యూరపు రాజ్యములు హేళన జేయుచు ప్రతి చిన్న పెద్ద కారణమును వెదకుచు దానితో సాముచేయుచుండెడివి. 'బలము గలవాడు విజయము పొందును'ను హర్బర్టు స్పెన్సరు సూత్రమును ననుసరించి నడుచుట తమ ప్రథమ కర్తవ్యమని యెంచ మొదలిడినవి. తమ అక్రమ కార్యములను, 'పాలిసీ'యనియు, 'బలమే సత్యమ'నియు, కప్పివేయ సాగినవి. తమ కోరికల ప్రకారము తమవలెనున్న యితర దేశములకు కూడ కోరికలుండునను యంశమును, అహంకారాంధత్వాదిత్వములై మనసునకు రానిచ్చుట లేదు. 'సర్వమానవ సౌభ్రాతృత్వము', 'సర్వమానవసమానత్వము', 'సర్వమానవ స్వాతంత్ర్యము' నకై 'సుస్థాపిత' మైనవని చాటుకొనిన రాజ్యములన్నియు చీనా దేశీయుల నిక్కట్టుల పాలుచేసి ఆ దేశమును దోచుకొనుచున్నవి. దేశీయులలో స్వాతంత్ర్య కాంతి వృద్ధి పొందినకొలది వీని రౌద్రము పెరిగి పోవచ్చినది. దేశీయులు స్వదేశ వ్యవస్థాపనము స్వయముగానే చేసికొనెదమనియు పరదేశస్థులతో నెట్టి సంబంధమును ఉంచదలచ లేదనియు చాటినంతనే యూరపు దేశములకు గొప్ప అవమానము వాటిల్లినది! ఎక్కువ వేదాంతము నుపదేశించు ఇంగ్లాండునకే ఎక్కువ అపకృతి సిద్ధించినది. స్వాతంత్ర్యము కొఱకు పోరాడుచున్న వీరులతో నెట్టి సంబంధము లేని కొందఱి అక్రమ కార్యములను పురస్కరించుకొని చీనా దేశముపైన నారోపించి, ఆంగ్లేయుల మాన ప్రాణములకు నష్టము వాటిల్లుచున్నదని గొప్ప హడావుడి చేయుచు, అసంఖ్యాక సైన్యములతో చీనాపై నిఙ్గ్లాండు దండెత్తుచున్నది. హిందూస్థానముతో చైనా కెట్టి వైరమును లేదనియు, పర రాజ్యముల హస్తముల నుండి విముక్తిగాంచ పాటుపడు చున్న చీనా సోదరలతో పోరుటకై హైందవ సైన్యమును పంపుట అమానుకృషత్యమని యు ఘోషించుచున్న బ్రిటిషు ఇండియా ప్రజాభిప్రాయము ద్రోసిపుచ్చి వైస్రాయిగారు భారత సైన్యమును చీనాకు పంపుచునే యున్నారు. ఇట్టి కృత్యములకై గడింగిన వీరు 'న్యాయము, శాంతి, సౌభ్రాతృత్వము' కొఱకై పాటుపడు వారమను అర్థములేని వాక్యముల వాడుకేల?

### కృతజ్ఞతా వందనములు

'సుజాత' మొదటి సంచికను దయతో స్వీకరించి, మా యుద్యమము త్వరగా వృద్ధి పొందుటకై, పలువురాంధ్ర ప్రముఖులు, పత్రికా సంపాదకులు, తమ తమ ఆశీర్వాదముల దెలియజేసిరి. వారి సౌగద్దలకు మేమర్హులము కామని సూచించుచు వారి యభినందనములకు మేమెంతయో కృతజ్ఞత జూపుచున్నారము. కొన్ని గ్రంథములు పత్రికలును విమర్శనార్థము మాకార్యాలయమునకు చేరినవి. కృతజ్ఞతతో నందికొంటిమి. రాబోవు సంచికలో వానిని గుఱించిన వివరములు తెలుపఁబడును.

Edited and Published by P. N. Sarma B.A. Troop Bazar Hyd. Dn.
Printed by S. Pratapa Reddy B. A. B. L. at the Golkonda Press, Hyderabad.

# గోలకొండ పత్రిక

సంపాదకులు: సురవరము ప్రతాపరెడ్డి గారు. బి. ఎ. బి. యల్.

వారమునకు రెండు పర్యాయములు ప్రతి బుధవారము, శనివారము ప్రకటింప బడును.

ఇందు సారస్వత, పరిశ్రామిక, వాణిజ్య, వ్యవసాయిక వ్యాసములును, సర్కారు జరీదాలు, నిజాం ప్రభువుగారి ఫర్మానులు, బజారుధరలు, ఆంధ్ర దేశ వార్తలు, హిందూ దేశ, ప్రపంచవృత్తాంతములును, ప్రకటింప బడును. ఆంధ్రదేశమున ప్రథమముగ వెలువడిన అర్ధ వార పత్రికయియ్యదియె. ప్రతి ఆంధ్రుడును పఠింపదగినది.

సంవత్సర చందా రు. ౭ ౦ ౦ అర్ధ సం॥ చందా రు. ౩ ౧౨ ౦

మా పత్రిక నిజాం రాష్ట్రము యందును, బ్రిటిషు ప్రాంతములయందును విశేషవ్యాప్తి నొందుచున్నది గాన, ఇందు ప్రకటనలు వేయించినచో చాల లాభముండును. వివరముల కొఱకు దిగున విలాసమునకు వ్రాయుడు.

గోలకొండ పత్రికా కార్యాలయము.
తూర్పుబజారు, హైదరాబాదు (దక్కన్).

# కృషి ప్రచారిణీ గ్రంథమాల

సూర్యాపేట (నైజాం)

సంపాదకులు: శ్రీ పువ్వాడ వేంకటప్పయ్య గారు

ఈ గ్రంథమాల వారు ౧౦౦ పుటలు గల వ్యవసాయ, పరిశ్రామిక, నైతిక, చారిత్రిక సంబంధ గ్రంథములు, నవలలు, నాటకములు, శాస్త్రములు సుప్రసిద్ధ రచయితులచే వ్రాయించి ప్రచురింప బడును. సం॥ చందా రు ౪ ప్రవేశపు రుసుము అ ౮ మాత్రమే. ఇది వరకు వెడలిన గ్రంథములు:—

- శ్రీధర విజయము. గ్రంథకర్త: శ్రీ చిల్లర శ్రీనివాసరావు గారు.
- శాతవాహనుల కాలపు హిందూ వ్యాపారులు: శ్రీ మాడపాటి హనుమంతరావు గారు.
- శశికళ; శ్రీ. ఊటుకూరి సత్యనారాయణరావు బహద్దురు గారు.
- పద్మినీబాయి; శ్రీ వనం వేంకటరావు గారు.
- జర్మనీ యుద్ధము (నాటకము): శ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు శతావధాని.

వివరములు కోరువారు పైవిలాసమునకు వ్రాయవచ్చును.

# విషయసూచిక.



## చిత్రములు

సంపుటము ౧ అక్షయ సంవత్సర ఫాల్గుణము సంఖ్య 3

# కృషీవలుఁడు

శివప్రభాకరులు

తూ్మతలంబున జ్యోత్స్నాప్రసారమయ్యె
బాలచంద్రుఁడు దరహాస వదనుఁడగుచు
నీరదంబుల వంచించి పారుచుండె
జలదసంఘంబు వెంటాడ సాగనతఁడు
తెరువుగానక యపుడప్డు దాఁకిపోవు
గాంచి దీనిని దారకా గణము లపుడు
శశిని బట్టిన మీ యాట సాగిరాను
రండు మావెంట నంచు దూరమ్మునందు
మిణుకుమిణుకంచు నెల్లెడ మెఱువ దొడగె
వాతపోతంబు లటునిటు పరువులిడగ
సాగె నా నిర్మలానంద సమయమందు
నవనితలముఁ గ్రిమికీట కాదులెల్ల
చల్లగాలికి విహారింపఁ జనుచునుండె
పుర బహిర్భాగమున క్షేత్రములు వినూత్న
మైన ప్రభలొల్క సౌందర్య మావరింప
గనుల పండువు గావింప గాదొడంగె
నచ్చటచ్చట నిర్మించి నట్టి మంచె
లందు కృషికులు సంతోషితాత్ములగుచు
దూరమున నున్న హితులను చేరబిలిచి
దరిని గలయట్టి వారి హెచ్చరిక జేసి
పలుకరంబుల పాటలఁ బాడిసిరపఁ
బురి విశేషంబు లాడుచుఁ బ్రొద్దుఁ బుచ్చి
నిర్మలానందడోలికా నిచయమందు
„నుయ్యాలో, జొంపలో" యంచు నూఁగులాడఁ
బ్రకృతికాంతామతల్లి సంబరముమీర
మలయ మారుత నిస్వనములను దనదు
మృదుల సంగీతరవముల మేళవించి
జోలపాటను బాడఁ జత్సుఖమునందు

నిదురవోయిరి నిశ్చింత మదిఘటింప
నహహా! వారెంత సుఖవంతు లనగవచ్చు
రమ్యమైనట్టి యంతఃపురంబుపైన
హంసతూలికాతల్పము నందుఁ జేరి

కులసతిని గూడి సల్లాపగోష్ఠిఁ దేలు
నృపునకీ సౌఖ్యమాగాఢ నిదురగలదె?
ఎంతపుణ్యాత్ములో మీరు కృషికులార!
దేశసేవారతిఁ దేలు ధీరులార!

# అస్పృశ్యతాదోషము

సురవరము ప్రతాపరెడ్డి

సీ. బాణమయూర సత్పండితప్రకరసం
 కాశులాటకు "దివాకరుఁడె" సాక్షి
రామదాస కబీర నామదేవులతోడ
 నుపమింపఁ "జోఖమేళా" కఁడె సాక్షి
గౌతమ యాజ్ఞవల్క్య వసిష్ట మునులకు
 నుద్దియన "నులోపి" యొకఁడె సాక్షి
సర్వసర్వంసహా శాసకులతోడ
 నుచ్చరింపఁగ "నందుఁడొ"కఁడె సాక్షి

తే. కవులు, భక్తులు, ఋషులు, చక్రాధిపతులు
మున్ను గాఁగల విజ్ఞులు పుట్టినట్టి
వంశముల నంటరాదని పలుకు జనులు
దేశవిద్రోహకులు గాక దేశహితులె?

# ధూర్జటి మహాకవి


అనుముల వేంకట సుబ్రహ్మణ్య శర్మ

కాళహస్తి మాహాత్మ్యము


మానవుని శుభాశుభ కర్మ లుత్తర జన్మ హేతువులని భారతీయ శాస్త్రముల ముఖ్యాభిప్రాయము. కొందఱు తాము పూర్వము చేసియున్న యుత్తమ కర్మానుష్ఠానముయొక్క శుభఫలము ననుభవింపం బుట్టి యీ లోకమున నసాధారణమైన శాశ్వత కీర్తిం బొంది యితరులకు నిత్యస్మరణీయులై వెడలిపోవుదురు. వారు దేవాంశసంభవులని పెద్దలు గౌరవింతురు. భరతవర్షమున నింతకు ముందిట్టి గౌరవము నందిన వార లనేకులు గలరు. వారి యుత్తమ కర్మలును వివిధములు. వానిలోఁ గావ్యరచన యొక్కటి యగుటం జేసి కవిపుంగవులు సకల దేశములయందుఁ బరమపూజ్యులుగ భావింపఁబడుచున్నారు. కాని భారతీయ కవి పుంగవులు కావ్యమని యెట్టి దానిని నిర్ణయించుకొని తదనుసారముగ దమరచనా వైదగ్ధ్యమును జూపుచుండిరో మన మిప్పట్టున నా నిర్ణయము నించుక స్పష్టపఱచుకొనుట యప్రకృతము గాజాలదు.

ఈ సందర్భమున ప్రాచీనలాక్షణికులుదాహరించెడు

"కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే
కాంతాసమ్మితతయోపదేశయుజే"

అను శ్లోకార్థము విమర్శింప దగియున్నది. ఇందు ముఖ్యమైన "కాంతా సమ్మితతయోప దేశయుజే" అను వాక్యమునకు సుశీలయు మనోహరాంగియునైన కులకాంతయుంబోలె ధర్మోపదేశము సేయుటకై కావ్యముపయుక్తమగుచున్నదని యర్థము. ధర్మము నుపదేశించుటలో వేదములు ప్రభు సమ్మితములనియుఁ, బురాణములు సుహృత్సమ్మితములనియుఁ, గావ్యములు కాంతా సమ్మితములనియు నభిజ్ఞులు నుడువుచున్నారు. ఇట్లు ధర్మోపదేశమయములైన కావ్యములను రచించుట యెల్లరకు సాధ్యము కానేరదు. సుకృత కృతజన్ములైన కవీంద్రుల సత్వజలమయసరోవరంబునం బుట్టిన ప్రతిభా సౌగంధికములు ధర్మవాసనాభూయిష్ఠములై వాఙ్మయ రూపమున బరిణమించి సాధు సమ్మానమునందుట స్వభావము. తదితరుల కావ్యము లట్టి ముఖ్యప్రయోజనమును నిర్వర్తింప జాలక రజస్తమోదూషిత హృదయములకు తాత్కాలిక సౌఖ్యమును గలిగింపఁ గలిగినను విద్వత్ప్రభావితములు గాక నశించును. కావుననే కాళిదాసునివంటి మహాకవిపుంగవుడును దన కావ్యములో

"తం సంతః శ్రోతుమర్హంతి
సదసద్వ్యక్తిహేతవః"

"హేమ్న స్సం లక్ష్యతే హ్యగ్నౌ
విశుద్ధిః శ్యామికాపివా,"

అని తనకావ్యపదసత్త్వ నిశ్చయము సత్పురుషా
ధీనమగుట స్పష్టముగా నుడివి యితరుల కీవిషయము నుద్బో
ధించుచున్నాఁడు. మఱియు దన శాకుంతలమునందలి
"అపరితోషాద్విదుషాం" అను శ్లోకమునను నదే యభిప్రా
యము నిచ్చియున్నాడు. ఇందుల కనురూపకముగ గవి
బ్రహ్మయనంజను సోమయాజియు

"ఎట్టికవి కైనఁ గృతియింపు బెంపు జాలుగావునఁ
గావ్యంబు సరసులైన కవులచెవులకు నెక్కినగాని
నమ్మ నెంచఁబరిణతి గలుగు కవీశ్వరుండు,"

అని నిర్వచనోత్తరరామాయణారంభమున వివరిం
చియుండె. ఇట్టితలంపు గాఢముగాగల యుత్తమకవులలో
శ్రీకాళహస్తి మహాత్మ్య కావ్యమును రచియించిన ధూర్జ
టికవియు నొక్కఁడని యతఁడు తన కావ్యారంభమున
వ్రాసికొనిన నిజగురుని యనుమతివాక్యములం బట్టియే
తెలిసికొననగు. మఱియు నిమ్మహాకవిపుంగవుడు రసిక
శిఖామణియగు శ్రీకృష్ణదేవరాయనియంతటి మహారాజ
రత్నముచే

చ॥ స్తుతిమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేల
కల్గెనో యతులిత మాధురీమహిమ। ... ...

అని శ్లాఘింపబడిన వాఁడయ్యుఁ దన కృతికన్యకు
వరనిశ్చయము సేయుటలో

క॥ ఈరీతి నిష్టదేవత। నారాధన మాచరించి
యస్మత్కృతి క। న్యారత్నమునకు విద్యా।
పారంగతుఁడైన వరునిఁ బరికించి తుదిన్.

శా॥ వాగర్థంబులు శ్రోతృవక్తలు జగద్వంద్యుండు నద్వైత
విద్యాగోష్ఠిన్ వినరింప నీశ్వరుఁడ కాఁడా మత్ప్రబంధా
ధిప। త్యాగణ్యాఢ్యుఁడు వేల్పోకఁడు గలఁడే యామాట
లేలంచుఁజే [చిత్తా
లోగమ్యుఁడగు కాళహస్తిపతి నాథుంగా సమర్థిం

అని నిర్ణయించుకొని తనవైరాగ్యమును వెల్లడించెను.
పిండియు, "ఉ॥ ఈశుభకావ్యరత్నమున శ్రీమునిశ్రీ
చేసినన్ మహా। దేశిక సార్వభౌముఁడు మదంబ...
ధూర్జటీ। నిశ్చలభక్తి కావ్యసరణిం గడుధన్యత...
భా। పాశతధానిగుంభన రసస్థితి నొప్పవలెన్ ...

అని చెప్పుటవలన నితఁడు దేశికముఖమున...
న్మతింబొంది తనసత్కావ్య రచనార్హత...
నియే గ్రంథరచన కారంభించెనని స్పష్టపడు...
పాకనాటినియోగియనియు భారద్వాజస...
యు నితనిసోదరపౌత్రుఁడగు కుమారధూర్జటి
రాయ విజయమునందలి

సీ॥ ననుభారద్వాజ గోత్రుని సదాపస్తంబ
సూత్రుని బాంధవ స్తోత్రపాత్రు
పాకనాటార్వేలవంశ ప్రసిద్ధుని
ధూర్జటిపౌత్రు బంధుర చరిత్రు

అను సీసపాదములవలన దెలియుచున్న...
హస్తి మహాత్మ్యములోని

"సింగమ రమానారాయణ జక్కయ...
తనూభవ భవపరాఙ్ముఖ ధూర్జటిప్రణీతంబైన"

అను గద్యవలన ఆతని తల్లి సింగమయనియు...
జక్కయపుత్రుఁడగు నారాయణుఁడనియు...
చున్నది.

శ్రీకృష్ణదేవరాయని కష్టదిగ్గజములలో...
క్కఁడని తెలిసికొనుటకితని గ్రంథముఁ బట్టి...
ములు కానరాకున్నను నితని పౌత్రుని...
యున్న,

చ॥ స్తుతమతియైన యాంధ్రకవి
ధూర్జటి పల్కులకేల కల్గెనో
యతులిత మాధురీమహిమ

నాముసు మీపెదతాతచాలస
న్నుతిఁగని కృష్ణరాయల మనోజ్ఞ...
అను వాక్యములవలనసుస్పష్టమైనది.

ఇతని కాళహస్తి మహాత్మ్యము సర్వ...
మైనది. అరగారనమునందును, శబ్దమందు...
మున్ముద్రిత ... యాచిత్యమునందును, పటిమ...

యాసును, గూడ నిది యత్యుత్తమ కృతియని చెప్పదగియు న్నది. భారతీయుల భక్తి జ్ఞాన వైరాగ్యములకెడు బ్రాణతుల్యములగు నుత్తమధర్మములే యిందు గథాంశ ములు. పూర్వోదాహృత పద్యములోనున్న „ అద్వైత విద్యాగోష్ఠిక విసరింప " అను వాక్యము వలన నితని ద్వైతమతి స్పష్టపడినను, భక్తిరసమునం దితని చిత్తవృత్తి యప్రమత్తమైనది. ఇందు కితని కావ్యములోని చెలదిపు రుగు వాక్యము గానున్న

శా॥ దేవానిన్ను నుతింపలే నధను
బుద్ధిక వేద శాస్త్రంబులుక
రావేపాటియు నచ్చినక శ్రుతులు
శాస్త్రంబుల్ మిముం జెప్పగా
లేవాక్యంబేములన్నఁ దద్విధులపక
లెక్కింపగా శక్యమే
సేవాధర్మము మేలుగాకనుమ
మీ శ్రీపాదముల్ గొల్చితిక

అను పద్యమే యుదాహరణీయముగ నున్నది. ఇతఁడు శివభక్తుఁడనని చెప్పుకొనుటయేకాక కావ్యమునం దును, దల్లక్షణము లనేకములు ప్రదర్శించి యున్నవాడు. అయినను విష్ణుద్వేషియైన వీరశైవునిలక్షణము లితనియం దెవ్వియు గావ్యముఖమునఁ గానరావు. శివవిష్ణువుల యభేదమునే యితఁడు సచతురముగ నొక్కచోనివర్ణిం చిన యాపద్యమును విలోకింపుడు.

మ॥ సకలాపూర్ణుఁడు నీలవర్ణుఁడనుటల్
సత్యంబుగాఁ జెల్లుపో
లిక జెంబికటి నిండఁ దారకలు
వాల్చేక నిర్జరాధీశ్వరా
దివులర్పించిన పువ్వులట్ల భవు
డద్దేవుండు భేదంబుగా
మిక్కిఁ జెల్లంబుగ నల్పుఁ దెల్పుగ ధరక
మించక శశాంకాకృతిక.

శ్రీకాళహస్తి దక్షిణకైలాసమను భావన కను రూపముగ నితఁడా శైవనగరమును వర్ణించునెడ జాటిం చిన యుత్తమనియమము లపూర్వములు. చాతుర్వర్ణ్య మును వర్ణించునెడ నీక్రింది సీసపద్యమునం జూపిన శ్లేషచా తుర్య మమ్మకమైనది.

సీ॥ నైజంబులగు నిల్వనైమిత్తికంబులు
నడుపుచో బ్రహ్మార్పణంబు సేసి
సంగరహిత బుద్ధి శాంతనవస్ఫూర్తి
వైరివర్గంబు సంహారమాడి.
ప్రబలహావర్ధ ప్రభాసమానస్థితి
కోశంబులొండెడు కొలఁది లరసి
యాతపశీతవాతామల సమముగా
నాత్మప్రయత్నంబు లంపు దలచి.
గీ॥ సంచరింతురు బ్రాహ్మణక్షత్ర వైశ్య
శూద్రులవ్వీట సంతత భద్రవృత్తయ
నిరుపమానంద విహరణో న్నిద్రులగుచు
రాజయోగైక సామ్రాజ్య రతులభంగి

ఈ పద్యమునఁ గేవల మలంకారచాతుర్యమే కాక వర్ణధర్మోపదేశములును మిగులఁ జతురముగా నెలకొల్ప బడినవి. శృంగారవర్ణనావసరములయందుసయితే మితఁడు వేదాంతయోగశాస్త్రప్రాండితిని సకలజనరంజకముగఁ బ్రదర్శించుట యేరికి శ్లాఘ్యమై యుండదు? భక్తిరసము నింత మనోరంజకముగ బరిస్ఫూర్తి చేయగల కవి మఱియొ కడు గానరాడు.

గ్రంథవిస్తరభీతిచే దిన్నని భక్తిరసైకముగ్ధనిష్ఠం దెలియుజేయు రెండు మూడు పద్యములు మాత్రమిందు దాహరించుచున్నాను.

శా॥ ఓ సామీ యిటువంటి కొండదరిలో
నొంటింబులుల్ సింగముల్
గాసింబెట్టెడు కుట్ర నట్టడవిలో
గల్గువ్వి క్రీడనే
యాసనయిట్టిలివేంగిపడ్డలుం
వాకొన్నవో గూడను
శ్లేసుట్టంబులు దెచ్చి పెట్టెదరుని
కింటేటికేలింగమా.

ఉ॥ కొండలగానలం దిరిగి క్రొవ్విన
పందుల లేళ్ల దుప్పులక

పండిన బెక్కు చందముల
చిన్నక పెద్దక గారుకమ్మగా
వండుమరట్ల పిట్టలను
బండుమ రిచ్చట నుండ నేలనా
కొండొకటానతీకయుడు
మారికి రాగదవమ్మ లింగమా.

ఈ మగువ చెంచుంగొమరుడు ముక్కంటికింటి కినుపచారము సేయుట విలోకింపుడు.

సీ॥ కోకపొట్లం బావి గొననూది యెత్తుచు
  కషణోష్ణ కరథ భాగమున గాచి
నెత్తిదంగేడాకు మెత్తి రేచకినిమ్మ
  పంటిపుల్పునమారి పట్టు వెట్టి
తెల్లదింటెనపూపుఁ దెచ్చి తద్రసమిఁడి
  కలివెపువ్వులు గోసి నిలిచి పిడిచి
పేరినెనెయివెట్టి పెసగుపత్తులువైచి
  చనుబాలతో రాచి సంకుచమిరి

గీ॥ విన్నమందులు దాసరిగన్నమందు
లడిగి తెచ్చినమందులు నడవిమందు
లెన్ని చేసినమానక యిందుమౌళి
కన్ను తొడిబడి నెత్తురు గాఱుటయును.

గీ॥ మాటి మాటికిఁ జేసిన మందులెల్ల
జెల్లెఁబోతెల్లిగలిపిన చింతపండు
నీటఁద్రావసిద్రావాలునై నెఱయవరడ
బోవుగాకేమి నెత్తురు పుట్టనేల.

అని విశిర్కించెను. ఇట్టిమ్మహాకవి సకల శాస్త్రజ్ఞత్వ గావ్యమున నుచితరీతి వెల్లివిరియుచున్నది. భాషాభిమా లందఱు నీయుత్తమ కావ్యమును బఠించి యానందింతు గాక. ఒకానొక ఘట్టమున నీకవి సరస్వతిని వర్ణించు దనకావ్యగుణములనే యథార్థముగఁ వక్కాణించె యన్నట్లున్న యీ చక్కని పద్యముఁవ్రాసి యీవ్యా మును విరమించెద.

సీ॥ బ్రహ్మకుఁబట్టంపు రాణివాసంబయ్యు
  రాజసక్రీడాభిరతులబోక
జగదేకసౌందర్య సౌభాగ్యవతియయ్యు
  నణుమాత్రముచుగర్వ గుణములేక
సంపూర్ణయౌవన సంపదగలిగియు
  మదవికారస్ఫూర్తి పొదలనీక
వ్యాహారసింహాస నారూఢయయ్యును
  బహువిధవ్యాపృత్తిఁ బ్రౌఢగాక

గీ॥ మగనిముందఱఁ దనమహామహిమలెల్ల
గానఁబడకుండ నడపవఁగలిగికించి
దవనతాననయై పాలు పారఁగన్ను
గండుమీలకునిలుకడఁ గలిపికదియ.

# కోయిల

మామునూరు నాగభూషణరావు

సారస్వత చంద్రికా ప్రకాశకుడు

పరభృతంబులు పాడెడి పాటలోన
అమలమంజులగీతరాగములు గలవు;
కలికి కోయిలకూనరాగములలోన
రామణీయకసృష్టి మర్మములు గలవు;
సమద పికరాగ శ్రావ్యసంస్మరణ మందు
విమల సుజ్ఞానసీతి మార్గములు గలవు;
ప్రవిమల నిశాప్రశాంత సంపదలలోన
లలితశారద చంద్రికావిలసనమున
మధురమధుసారముల గ్రోలి, మావినుండి
గాన కళజిమ్మి, హృదయ మాకర్షణంబు
జేయజాలెడు సద్వృత్తి కోయిలలదె!
కలికి! భవదీయ మంజుల గానసమితి
చిగురుటాకులు మేయుటచేతనేమొ
గలిగె కాకోలునంచు నాగళముకూడ
కినలయంబుల కఱకున గీసుకొంటి;
మృదులతర పల్లవంబుల కదిసిమేసి
తెచ్చుకొంటివొ యేమొ నీదివ్యరవ మ
టంచు నింపైన పాయసాన్నంబు వీడి
చిగురుటాకులు తిని కృశించితిని నేను.
రమణి! యేనాడు హీనస్వరంబు పోయి
తతమహానంద సారస్వతంబు వొడము
తీయని తెనుంగు రాగముల్ తీయగలనొ?

"కోకిలపూతి" నుండి

# "లోకమంతా ఒక్కటే రీతి"

శిరుగూరి జయరావు

'అన్నమైతే నేమిరా? మఱి, సున్నమైతే నేమిరా? అంచుచేతి పాడు పొట్టకు అన్నమే వేతామురా!'

పిచ్చిలోఁగూడ సబబు, సందర్భము, కలవని షేక్స్పియరు కవి యన్నాడు. అందుచేత నన్నిటక్కులు తెలిసిన యుగంధరుఁడు పిచ్చివాని వేషము వేసికొన్నప్పటికి, పిచ్చి పాటలు పాడినప్పటికి, సాంప్రదాయ ప్రకారము సబబుగానే నడచుకొన్నాడు.

మనలోఁ గూడ కొందఱకుఁ బిచ్చి పట్టినది; అనఁగా నున్మాద మతిశయించినది. ప్రపంచములోఁ బ్రతివాఁడును పిచ్చివాఁడే; సాధారణ మనుష్యులలో నున్న పిచ్చి సర్వసామాన్యమైనది కనుక, అలవాటై పోయినది కనుక, దానిని మనము గమనించుట లేదు. ఈ సామాన్యమైన పిచ్చి కొంత హెచ్చుస్థాయికి రాఁగానే, అప్పుడు దానిని సరకు సేసి, వింతగాఁ జెప్పుకొనుచున్నాము. ప్రతి హస్తమునైదువ్రేళ్ల క్రింద చీలుట మిక్కిలి యందవికారమైనదే; కాని యిది తరతరమ్ముల నుండి మన కలవాటైపోయినది కనుక నిదే యొక 'షోకు' క్రింద పరిణమించినది. కాని, యీ యైదు వ్రేళ్లతోఁ బాటు నింకొక్కటి యాఱవ వ్రేలు పొడసూపినదా, అమ్మ బాబో, ఇంకఁ జెప్పవలసిన దేమున్నది? పిచ్చిగూడ నిటువంటిదే. మన సాధారణ తత్వమునకంటె నొక మెట్టుపై నున్నదే. దీనిని మన స్తత్వశాస్త్రజ్ఞులు (Psychologists) నిరూపించిరి.

కాని, సబబు సందర్భము కూడ బహిష్కరింపఁబడిన పిచ్చి యప్పుడప్పుడు పొడసూపుట కలదు. ప్రస్తుతకాలమున వాఙ్మయములో వర్ణసాంకర్యము కలిగించుచున్నవారి పిచ్చి యీ రకములోనిదే. 'అన్నమైతే నేమిరా? మఱి, సున్నమైతే నేమిరా? అంచుచేతి పాడు పొట్టకు సున్నమే వేతామురా!' అనుచున్నారు. యతిభ[illegible]మైతే నైనది; వారికి లక్ష్యము లేదు కదా! ఇఁకఁ బ్ర[illegible]వసానమో? నోరు పొక్కినను సరే, పొట్ట కాలినను స[illegible], ఇదియు నొక నాగరికతా లక్షణమని యుప్పొంగి పో[illegible]చున్నారు.

'నిరంకుశాః కవయః' అను నార్యోక్తి స[illegible] కాని దీనిని పెడర్థము చేసికొని విఱ్ఱవీఁగు వారిచే మన [illegible]షకు మిక్కిలి యపచారము చేయఁబడుచున్నది. [illegible] నిర్మాణమునకై కడంగు వారికిఁ దొలుత కావలసినది [illegible]ధన. శరీర వ్యాయామములో వలెనే విద్యావ్యాయా[illegible]ములోఁగూడ ఛందోనిర్ణీతమైన బుజుసాధన య[illegible]మైనది. సాధనానంతరము, కళా నైపుణి యలవడుచున్న కొలఁది, ఆత్మ శక్తి యంతరంగమున ద్యోతత మగుచున్న కొలఁది, హేలా విలాసముగా విజృంభించి, అప్పుడప్పుడు నిరంకుశత్వముఁ జూపించి బయల్వెడలినచో నట్టి [illegible] మఱింత మెఱుఁగు కలుగుచున్నది. చక్కని గాయ[illegible] తంత్రీ వినోదములో నెన్నియేనియు నపస్వరములు [illegible]చ్చును; కాని యవికూడ యతని కళా విలసనములో [illegible]మగుచున్నవి. మహా కవి రచనలో నెన్నియేనియు [illegible] కలుగవచ్చును; కాని యివన్నియు నతని [illegible]

కళా చమత్కృతిలోఁ గలసిపోయి మెఱుఁగిచ్చుచున్నవి.
నిండు జవ్వనపు మిటారికత్తె సోయగములలో పెట్టి
రబ్బిబ్బులు తిటస్థించినను ,సవియు నందమున కందమునే
హత్తించుచున్నవి. అన్నాడు కదా సూరనార్యుఁడు:—

„నెరసిన నొక్కయొప్పు; అరవీడిన వేఱొక
యొప్పు; చిక్కుపా
టొలసిన నొక్కయొప్పు; అది యార్చిన వేఱొక
యొప్పు; వేణిభా
వ రచన నొక్కయొప్పు; ముడివైచిన వేఱొక
యొప్పు; కొప్పుగాఁ
బఱగిన నొక్కయొప్పు; కనుపట్టక మానదు నీక
చంబులకు”.

ఆ సొగసులాడిని జూడగనే పరవశమై పోయిన
తర్వాత నింక ఛాందసములకుఁ జోటులేకపోయినది; నిరం
కుశత్వము నృత్యము చేయుచున్నది. చక్కగా, భావ
రచనలో, జడయల్ల నవసరము లేదఁట! తల వెండ్రుకలు
వడి పోయినను సరే, సగము సగము చెవతి పోయినను
సరే, చిక్కు పడ్డను సరే, సరిగా దిద్దినను సరే, కొప్పుగా
నున్నను సరే, యేమి ఖంగాదు పెట్టినను ఆ తల వెండ్రు
కల వలన „ఒప్పులు” కుప్పలై వెల్లివిరియునఁట! ఆద్దిరా,
రసస్యందనము, భళిరా, కవితాచాతుర్యము! ఇంతేకాని,
„రమ్యాణాం వికృతిరపి శ్రియం తనోతి.” అన్నాడు
కాళిదాసుని విని, కావ్యకాంతకుఁ బాశ్చాత్య సెలూనులో
జుట్టు గొరిగించి, కాకితపు టోపీ పెట్టి—చూడండి మా
నిరంకుశత్వము, చూడండి మా క్రొత్త పోకడలు, చూ
డండి మా పాశ్చాత్య విద్యా ప్రాప్త సంస్కారము!—
అని యెగిరపడు వారి వెఱ్ఱి వేషములతో మన భాషకు
భ్యుదయ మెన్నటికిని కలుగఁ జాలదు.

నేను చర్చించు విషయము గ్రామ్యగ్రాంథిక భాషా
వాదము కాదు. పరిష్కరించి సలక్షణముగా వాడినచో
వ్యవహార భాష మనోహరముగనే యుండును. ఆట్టి యుద్య
మమున కిప్పుడు కొందఱు పూనుకొన్నట్టుల తోఁచు
చున్నది. కాని యభినవ పాశ్చాత్య సంపర్కము వలన
సంఘటించిన కొన్ని విషయములను గుఱించి చెప్పవలసి
యున్నది. ఇట్లు చెప్పుటలో నా స్వాభిప్రాయములను
ప్రకటించి, నా యూహలను నిరూపించుట నా యుద్దే
శము కాదు. కాని, శాస్త్రాభిలాషిని గనుక, ఆంధ్ర దేశ
మున నిప్పుడు ప్రాకుచున్న భావనావిధానము ప్రపంచ
ములో నెల్లెడలఁ గూడ వ్యాపించియే యున్నదా? అని
చర్చించెదము.

ఇప్పుడు తెలుఁగు దేశములో శివమెక్కినది
‚భావగీతా’ కాంత. విజయనగర రాజ్యము నాశము చెం
దిన నాఁటనుండియు నించుమించుగా నేఁటి వఱకుఁ
దెలుఁగు భాస క్షీణించి, యనుకరణైకరతుల హస్తము
లలో నవసి పోయి, యసహ్య రూపముఁ దాల్చినది.
ప్రస్తుతమున నాంగ్ల భాషా సంఘర్షణచే నేమి, వంగ
భాషాద్ధత్యదర్శనముచే నేమి, ఆత్మజాతీయతాభావాం
కురము చేత నేమి, తెలుగుభాస మఱల నారోగ్య దశలో
నికి వచ్చి, బూరిబుగ్గలు పెంచుచున్నది. కాని, నేఁటి
సాంఘికోత్ల్పవములతోఁ బాటు కవితా ప్రపంచమునఁ
గూడ నల్ల కల్లోలములు జఱుగుచున్నవి. ఈ కల్లోలము
లో నెగిరి వచ్చి, శివమెక్కి, తైతక్క లాడుచున్నది ‚భావ
గీతిక.’

ఈ ‚భావగీతిక’ ప్రప్రథమమున గీర్వాణ భాషలో
మిక్కిలి ప్రసిద్ధిఁ జెందినది. శ్రీ కాళిదాసుని ‚మేఘ
సందేశము,’ శ్రీ జయదేవుని ‚గీతా గోవిందము,’ మొద
లైనవి యున్నతభావగీతికలు. అపార సాంస్కృతిక
సముద్రములో లెక్కలేనన్ని కెరటములు; ఆ కెరటముల
లోని జలబిందువులలోఁ గొన్ని భావ గీతికలు!

ఇట్టి యుత్కృష్ట కళా భాగమును దెలుగులోఁ
నికిఁ బరివర్తనము చేయరైరి, మన పూర్వులు. దానికిఁ
గారణము తెలిసియున్నది. కవిత్రయాది మహాకవులు
తలపెట్టినది ప్రజాబాహుళ్య విద్యకికాని, కేవల మాంధ్ర
భాషావికాసము కాదు ఈ విషయములలో మన యాధు
నికులను మించిన తెలివైన పనిచేసిరి మన పూర్వులు. ఇప్పటి
Extension Lectures అని యాంధ్రవిశ్వ
విద్యాలయమునకై సూచింపఁ బడుచున్న ప్రజావిద్యను
నన్నయాదులు మొదలుపెట్టిరి. ఇందులకు భారత భాగవత
రామాయణము లప్పటికాలమున కత్యుత్కృష్టములనుట
నిస్సంశయము. ఇంతకును వారు స్వయముగా గీర్వాణ
కళామృతకుండిలు లగుటచే ఏపురాణములను రసవంత
ములుగాఁ జేసిరి.

భాషాభ్యుదయ సాంప్రదాయ రీతిగా నాంధ్రము
కూడ పరిణామములను జెందినది. అల్లసాని పెద్దన నాఁటి
కీపరిణామము నూతనరూపమును బొందినది. శ్రీ కృష్ణ
రాయలయాస్థానమునఁ బ్రబంధములు వన్నెకెక్కినవి.
ఇయ్యవి సంస్కృత పంచ కావ్యములనుభరణించు నను
టకన్నను సమకాలిక చంపూ సాంప్రదాయముల ననుకరిం
చిన వనుట యెక్కువ నిజము.

తరువాత విజయనగర రాజ్యనాశముతో నాంధ్ర
వాఙ్మయ ప్రపంచము కూడ నరాజకమై పోయినది; దానిని

బునః ప్రాధాన్యతలోనికిఁ దెచ్చుటకై శంకుస్థాపనము చేసిన వారిలో ముఖ్యులు కీ॥ శే॥ వీరేశలింగము పంతులు గారు. అప్పటి నుండియు నేఁటి వఱకు నాంధ్రలోకము లోఁ బ్రవహించినవి నాటకములు, నవలలు. వీని సంఖ్య యపారము; వీనిలోని నికృష్ట గ్రంథములను దీసివైచిన చో, మిగులునవి నూటికొక్కటియైన నుండునా యని సంశయింప వలసియున్నది.

నేఁటికిఁ దెలుఁగు దేశములోనికి నూతన వేషముతోఁ బ్రత్యక్షమైన కవిత్వమే 'భావగీతిక'. ఈ నూతన 'భావగీతిక'కు సంస్కృతమునకు బదులు 'ఆంగలమే' యుద్బోధక మైనది. ఇది మనకు శోచనీయాంశమే గాని కాలపరిణామము లను, అవస్థాసంఘటనలను, ఎవరేమి చేయఁగలరు? వేయేల? తెలుఁగు సంస్కృతమునం దాసక్తి కలుగుటకుఁ గూడ 'ఆంగలమే' యుద్బోధకమైనది కదా! ఉపనిషద్వైభవముఁ గ్రోలుటకై పురికొల్పినది 'ఆంగలమే' కదా! శ్రీ కాళి దాసుని ప్రతిభాప్రకాశము వంకకు నేత్రములను దెర చినది 'ఆంగల' మాలికముగా గెటేకవీంద్రుని పొగడ్త కదా! దేశభాషా గౌరవమునకు, దేశభాషా సంస్కా రమునకు, దేశభాషాత్తేజసంఘటనమునకు, దారితీసినది శ్రీ రవీంద్రుని యాంగ్లనిర్మితశ్లాఘాబహుమానమైన "నో బేలు ప్రైజు" కదా!

'ఆంగల'ముచేఁ బురికొల్పఁబడిన యీభావగీతిక యాంధ్ర దేశములోనికి వచ్చుట భాష కెంతయు శుభసూచకము. కాని సంస్కారములతోఁ బాటు సాంకర్యము కొట్టుకొని వచ్చుచున్న నేఁటి సాంఘికప్ర పంచము ననుసరించి భాషాప్రపంచములోఁ గూడ నీ భావగీతికల పేరుతో మిక్కిలి నికృష్టములైన పద్యరచనలు వెలువడుచున్నవి; ఈ సాంకర్యమును విమర్శించుట కొఱకై యీ వ్యాసమునకు 'లోకమంతా ఒక్కటే రీతి' అను శీర్షిక నిచ్చితిని; ఏలననఁగా నీ సాంకర్యము తెలుఁ గుదేశములోనిదే కాదు. అనేక పాశ్చాత్యదేశములలో గూడ నీజాడ్యము వ్యాపించుచున్నది.

ఈ నికృష్ణ గీతికలు పత్రికాముఖములలో వెల్వడు చుండు టచే వానిని విమర్శించి ఖండించుట యావశ్యకమైనది. తెలివితక్కువ తలంపులను దెచ్చి, నిర్మధుర పదములతో నల్లి, తేఁటగీతలలో జొప్పించి—లేదా యే విపరీత వృత్త ములోనో యిమిడ్చి—మన తెలుఁగులోఁ బ్రకటించుచు న్నారు కొన్ని భావగీతములను. ఈవిధముగనే "యాం గల" పత్రికలుగూడ పనికిమాలిన పద్యములను బ్రకటించు చున్నవి.

Royal Socitey of litrature (ఇం గ్లాండులో) సమక్షమున నాయిన్‌గారు 1922 లో యుపన్యాసము నిచ్చిరి. ఆధునిక వాఙ్మయమును గుఱించి మాట్లాడిరి. ప్రస్తుత కవితను గుఱించి చెప్పిరి:

"అభినవ కవిత" యను పేరుపెట్టి వానిని లను ప్రకటించుచున్న మన దిన-వార-పత్రికా సం కులకు, పెక్కుమందికి, వారణసూచనలను బంపవ వేళ వచ్చినది. ఒక యమెరికా దేశపు "కవి" వాఁడట; మచ్చునకై యీ పద్యముఁ జూడుడు:

"I
Am in the Grip
Of a strange
Urge.
Oh! Urge, what do you
Represent?
Why are you?
Why am I?
God knows!"

"నేను
ఒక వింతయైన
ప్రోద్బలము
పిడికిటి పట్టులో నున్నాను.
ఓ ప్రోద్బలమా, నీవు దేనిని
బ్రతి నిరూపించుచున్నావు?
నీ వెందుకున్నావు?
నే నెందుకున్నాను?
దేవుఁడెఱుఁగును!"

ఈ గీతలు గీసినవాఁడు, ఏమి చెప్పటకుఁ దలఁ చెప్పనదైనను ఎట్లు చెప్పటో తెలియక—సర్వ సాంకేతికమును దప్పుగా వ్రాయునంత తెలివిమాలిన నలుగురి నాకర్షించుటకై నేలపైఁ దలయుంచి నిల్చి జూచుచున్నాడు. దీనికేమి గాని, ఇట్టి ఛందము 'అభినవకవితా మహాయుగము' అని మెచ్చుకొను జ్ఞులను, విమర్శకులను, కళా వినోదులను ఏమన కదా?

పైనుదహరించినదుర్గతి యాంధ్రమునకుఁ బట్టుచున్నది. అవకతవకగాఁ బద్యములు వ్రాయు డుటేకాక వానికి బహు ప్రయాసములో, వాక్యములతో, శ్లాఘావిమర్శనలను వ్రాసి, ... సమర్థించు మహాశయులు మనలోఁ గూడ కలరు. ... ధను కనుక నుదాహరణముల నిచ్చుటకు ...

చున్నాను గాని «నాయిస్» గారిఖండన యిప్పటి పత్రికలలో వెడలు తెలుఁగుపద్యములకుఁ గొన్నింటికి నన్వయించుననుట పాఠకుల స్వతంత్రనిర్ణయమునకే విడచివేయుచున్నాను. ఇంగ్లాండులో నీ నూతన సంకరకవితకు Gorgeous poetry [1911-1920-Phillip Allan] అనిపేరు. దీనిని విమర్శించుచు నొకఁడు (J. B. M). ఇట్లువ్రాసెను:—

«వీరి సంగతి యేమిటి?.....మూఁడునంతుల ము ప్పాతిక వారు చెప్పునది శుద్ధశూన్యము, కాని దానినే మ ఱల మఱల చెప్పుచున్నారు. బజారులో వానొండొరులను నమస్కరించు కొనుచున్నారు. వారిలోఁగొందఱకు బుగ్గల లో నాలుకలుండు ననుకొనెదను. కాని వారిలోఁ జాలా మంది విషాదములో, దుఃఖములో, అసమంజసముగాఁ దెలిసికొనఁబడి యున్నారు. వారిలోని యదృష్టవంతులు కొందఱుశ్లాఘింపఁబడుచున్నారు. ఇట్లు చెప్పి, వారిపద్యములను వెక్కిరించుచు, ఇట్లొకపద్యము నతఁడువ్రాసెను:—

"Flocks of thoughts
Scramble over
The cornices
Of My mountainous mind.
"Flocks, flocks, flocks
At the foot of my bed I see.
But the undying ego
Knows nothing of all this."

దీనికిఁ దెనుఁగులో నిర్ణియముగాఁ బరివర్తనము చేయుచున్నాను. (ఏలననఁగా నాఁగలములోఁగూడ నతఁడు నియమము లేకుండనేవ్రాసినాఁడు):—

«నామనఃపర్వతము శిఖరములపఱకు। పాఱుచున్నవి తలపులమందలు । మందలూ, మందలూ, మందలూ । నా పఱుపుకొనవద్దఁ జూచుచున్నాను। కాని నాయనశ్వరమైన యహంవ్యక్తి, కి । ఇవేమియు తెలియకుండనున్నవి»

నాయిస్‌గారిచ్చిన యుపన్యాసము దీర్ఘమైనది; ఈనూతన సాంకర్యమును ("Literay bolshevism,,)గర్హించి సవిమర్శనముగాఁ బలుకుచు సబబునకును ఉన్మాదమునకును నేఁటికిఁ దగవు జఱుగు చున్నదనియు, నేఁటి యభినవ కవులు పద్ధతులను నియమములను నాశము చేసి వైచి; సనాతనమైన విలువలను ధ్వంసము చేసి, భాషలోను భావములోను సరసతనుబోఁదోసి, నీరసత్వమును ఉగ్గడించు చున్నారనియు నాయిస్ గారు చెప్పిరి.

వీరు నేఁటి యుచ్ఛృంఖల కవుల గుఱించి చెప్పిన దానికిఁ దెలుఁగు వ్రాయుచున్నాను:—

«ఈవిశ్వములో నీ తిఱుగుబాటు కవి క్రొత్త వృత్తములను గనిపెట్టుట లేదు;—అది కష్టమైన పని. అందుచేత వాఁడు సులభమైన రీతి నవలంబించు చున్నాడు. వృత్తనియమములే కూడనని త్రోసిపాఱవేయు చున్నాడు సముద్రపుఁ బోటుపాటులు, నక్షత్రముల రాకపోకలు, గుండెల దడదడలు, హోమరుకవి మొదలుకొని నేఁటి వఱకునున్న కవుల పద్యములు ఇన్నిఁటి యొక్క వృత్తనియమములు కూడ అప్పకవి నాఁటి(queen Victoria అని అతఁడన్నాడు) లాక్షణిక శృంఖలమే యని యతఁడనుకొను చున్నాడు. వాని స్వంత కల్పన లన్నియు «ధారాప్రవాహఁము»:లు! (FreeVerse) ఒక మహాను భావుఁడీ మఖ్యనన్నాడు కదా, «దొరువులోఁ గూర్చొని "Free Architecture" అన్నచో బాగుండును» అతఁడే యిట్లుచెప్పెను:—

«నిర్మాణములో (Technique) సౌలభ్యము తెచ్చుకొనుటకై తొందఱపడి, వీరు, సకలవిధములైననిరసత్వమును బొసగించినారు. భావములను, రసములను, చవుకరకముగా తక్కువపఁ జేసినారు; గూఢమైనముఖ్యసాంప్రదాయమెద్దియు లేక పోవుటచేతవిచక్షణ, విమర్శనవీలు కాకున్నది.» «ఈ నాయిస్ గారే యుపన్యాసము చివఱకిట్లు చెప్పిరి:—

అధునాతన ప్రాపంచిక వాఙ్మయమును జూచినచో నిది నేఁటి ప్రాపంచకకల్లోలమును బ్రతి బింబించు చున్నట్లు తెలియుచునే యున్నది. జీవితమును సార్థకముఁ జేయు ప్రతి దానికిని, నాగరికతను ఉపయోగకరముగాఁ జేయు ప్రతిదానికిని, భయంకర ప్రమాదములను సంఘటింగచుటలో నధునాతన కాలము వంటిది ప్రాపంచికచరిత్రలో మఱెన్నఁడును ఉండి యుండలేదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఐనప్పటికి గొప్పయవకాశములకు, గొప్ప యాశలకుఁ గూడ నిప్పటి వంటి కాలమే లేకుండెను. ఇప్పటి యాశలెంత గొప్పవో, యాపత్తులు కూడ నంత గొప్పవే; ఇంత గొప్ప యాశలు ఫలితములగు కాలమువచ్చినది కనుక, బహుశః దృష్టిపరిహారార్థము ఈ యాపత్తుల ననుభవింప వలెను గాబోలు».

,లోకమంతా ఒక్కటేరీతి,! ప్రపంచములో నెల్లెడలను, ప్రతిశాఖలోను, కల్లోలములు కలుగుచున్నవి. వాఙ్మయములలోఁ గూడ, నాంధ్రమునందేమి, ఆంగ్లమునందేమి, ఉత్పాతములు జఱుగుచున్నవి. వీనివిమర్శించి చక్కబెట్టుటకుఁ బాశ్చాత్యులు ప్రయత్నము చేయుచున్నట్లే మనముకూడ సద్యయత్నములు చేయవలెను.

స్వస్తిః ప్రజాభ్యఃపరి పాలయంతాం । న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః । గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకాస్సమస్తా సుఖినో భవన్తు.

# బ్రహ్మశ్రీ కావ్యకంఠ గణపతిశాస్త్రిగారు

చ. రమణమహర్షి సచ్చరణ • రాజసరోజ సహస్ర రేఖలన్
ద్యుమణికరాభిషేచనము • నోజఫలించు ననుగ్రహామృతం
బమలిన నిష్ఠఁ గ్రోలిన మ • హామతివీవు నుతించు టెట్టుల
స్తిమితవచస్సులన్ గణప • తీ ! నిగమాంబరనృత్యభారతీ !

ఉ. ఋష్యభిగీతమంత్ర పద • వృంతములన్ గుసుమంబువోలె ని
ర్దూష్యముగా హసించు మహి • తున్ భజియించి, తదంశుమాలికా
పోష్యములైనయీ భరత • భూముల తైజసిక ప్రధానవై
దుష్యము నగ్రమస్తకము • తోన్ స్మరియింతుఁ బునర్విభూతికై.

ఉ. అక్షయభాగ్యభోగముల • నంది జగత్తునకెల్ల సర్వతో
భిక్షనొసంగినట్టి ఋషి • వీరకుటుంబము నేను భేదవా
దక్షతగాత్రపక్షమయి • తల్లడమందెడి నార్యదీప సం
రక్షణ మాచరించుట ప • రాయణమౌగద లోకశాంతికై.

సీ. తనమనోద్వారమిం • తయు దాటలేఁడు జా
తికిఁ కవాటములెల్ల • తెఱవ నెంచు
పట్టపగ్గము లేదు • పవ్వళించిన కోడె
దూడల లేపు కు • తూహలమున
బిందుతలంబు న • న్వేషింపఁబోడు వ
లయము ఖండింప ద • లఁచు సమముఁగ
పాలుపిండగ లేదు • పరిమళించెడి నెయ్యి
నాహరింపగ భు • క్త నభిలషించు

గీ. ఇల్లుస్వర్గము చేయలేఁ • డించుకంత, స్వర్గమే యిల్లుగానేల • వాంఛఁజేయు
నే విశిష్టసూత్రములల్లి, యీకుమార, నాగరకులబంధింతో ! గణపతియమీంద్ర

—రాయప్రోలు సుబ్బారావు

# నాశియమా?

మాడపాటి హనుమంతరావు

౧

"నేనిట్టి చిలుకనై పుట్టి యుండిన నెంతో సంతోషించి యుండదునుకదా!" యని గృహోద్యానవనములోని "ప్రేమ పుష్కరిణీ" తీరమునందలి వేదికపై గూర్చుండి, యెట్టయెదుట దట్టముగాఁ బూచిన మావిసన్నపైన వ్రాలిన చిలుకను కొంతతడవు కన్నువాల్పక చూచుచుండిన లలిత పలికెను.

"ఎందుకనమ్మా, ఇట్టికోరిక?" యని చెలికత్తె పార్వతి చిరునవ్వుతోఁ బ్రశ్నించెను.

ఆ సమయమున బాలభానుని బంగరు కిరణములు ఉద్యానవనములోని వృక్షముల యాకుల నడిమినుండి ఎట్లెట్లో దారిచేసుకొని యా యిరువురు జవ్వనుల నిద్దపు చెక్కులపై పారలుచుండెను. 'ప్రేమ పుష్కరిణి' లోని కమలదళములు చల్లఁగా వీచుచున్న సన్నని ఆరోగ్య ప్రదములగు ప్రభాత వాయువుల వలనఁ గదలుచు, చూచువారి యుల్లములు పల్లవింపఁ జేయుచుండెను.

లలిత మానసము నచ్చటి మనోజ్ఞమగు దృశ్యము వశపరచుకొని యుండినందున, నామె పార్వతి ప్రశ్నను విననే లేదు!

"లలితా, చెప్పవేమి? ఇట్టి చిలుకవై పుట్టియుండిన నేమి చేసియుందువు?" అని పార్వతి మరల ప్రశ్న చేసెను.

"పచ్చని యాకులచే దట్టముగాఁ గప్పఁబడియున్న ఈ వృక్షశాఖపై యెగిరి కూర్చుండి, ముద్దులొలుకు పలుకులతో మన యుద్యాన వనమును ప్రతిధ్వనింపఁజేసి యుందును!" అని లలిత సమాధానము చెప్పెను.

"ఇచ్ఛాపురసంస్థానాధీశుని రాణి కాఁబోవుచున్న లలితాదేవి పక్షుల మధుర కూజితముల నెప్పుడు తలచిన నప్పుడు విని యానందింపఁగలదు!" అని పార్వతి యనెను.

"రాణినై సుఖముల ననుభవింప వలయునను కోరిక నాకంతగాలేదు. ప్రశాంతమగు నరణ్యమున, సలసలఁ బారు నదీజలమును జూచుచు, పక్షుల తియ్యని పాటలను వినుచు, జీవితము గడుపఁ గలిగినచో, అది నాకెంతయు ఇష్టముగా నుండగలదు" అని లలిత పలికెను.

అంతలో బయట నెవరో పాట పాడుచుండుట వినవచ్చెను.

౨

"పార్వతీ, ఆగానము యెంత మనోహరముగా నున్నదో వినుము" అనెను లలిత.

పార్వతియు కొంచెమాలకించి చెప్పెను: "అవెవరో బైరాగి పాడుచుండెనను కొందును. పిలుచుకొని వత్తునా? కొంచెముసేపు విందము" అని పరుగు పరుగున నవతలికిఁ బోయెను పార్వతి.

లలిత మరల ఆపాటనాలకించి వినెను. వినినకొలఁది యాగీతము ఎక్కువ ఆనందదాయకమై కరుణారస భరితమై యొప్పెను!

పదినిమిషములలో, పార్వతి యొక బైరాగిని వెంటఁగొని వచ్చెను.

ఆ బైరాగి యౌవనుఁడు, అందమైన ముఖ లక్షణములు, బంగరు నిగ్గులు దేరు శరీరకాంతి, మంచి యారోగ్యమును, మొక్కవోని సారమును దెలుపు అవయవ సౌష్టవము కలిగియుండెను. భుజములపైనుండి చీలమండల వరకు వ్రేలాడుచు శరీరమును గప్పియుండిన కాషాయవర్ణముగల పొడుగు పాటి యంగీ యాతని తనువున కలంకారముగ నుండెను. ఆతని చేతి చితారు ఇంపైన నాదమును, ఆతని ముఖము దివ్యమైన కాంతిని గురియుచుండెను!

బైరాగి వినయ భరితములును, మార్దవ సహితములు నగు చూపులతో ఆయువతులను వీక్షించి, వారికి కొంచెము సమీపమున వేదికపైఁ గూర్చుండెను.

లలితయు ఆగంతుకునిపై తన చల్లనిచూపుల ప్రసరింపఁజేసెను. ఆమెకన్నులు క్రింద వ్రాలెను!

పార్వతి: ,,యోగీంద్రా, దర్శనముచే కృతార్థురాండ్రఁ జేసితిరి. గీతమేదైన పాడి మమ్మ్ము ఆనంద పరచెదరా?''

బైరాగి: ,,మేము దేవీ నామస్మరణ చేయుచుండు విరాగులము. దొరసానుల మెప్పించు పాటలు మాకురావు. ఎట్లైనను, తమ కోరిక చెల్లించవలెనుకదా''

బైరాగి మధురమగు కంఠధ్వనిని శ్రావ్యమగు చితారునాదముతో గలిపి పాడెను:

,,నీయందేకాంచితి ప్రేమమయీ, నీయందే కాంచితిని

మానవజీవిత మరుదేశంబున, నరుదగుసుఖ సహితాశ్రయరాజము,

నీయందేకాంచితి ప్రేమమయీ, నీయందే కాంచితిని''

తరువాత బైరాగికి ఫలములు అర్పించి పంపివేసిరి. అతడును వెడలిపోయెను!

బైరాగిపాడిన గీతమును, అతని కంఠ మాధుర్యమును, హృదయాకర్షమగు నాతని ముఖ వికాసమును నా యువతులు మెచ్చుకొనిరి.

లలిత యింటిలోనికిఁ బోయిన తరువాత నానాఁడు పలుమారా యుదయదృశ్యమును తలపోసెను. బైరాగి యొక్క చితారు తీగెల మ్రోతలు వాతావరణమున విజృంభించినట్లే, లలితయొక్క మానసమున ఆనంద దాయకములగు భావములు వికసించెను! కనులుమూసికొనఁగానే, ప్రేమపుష్కరిణియందు వికసించి యుండిన కమలములలో నొక్కొక దానిపై నొక్కొక యప్సరస యొయ్యారమున నిలచి మృదుల స్వనమున నదే గీతము పాడుచుండుట కానవచ్చుచుండెను!!

,,నీయందే కాంచితి ప్రేమమయీ, నీయందే కాంచితిని''

పచ్చని ఆకులతో దట్టముగ నావరింపబడి, శిరఃకంపము చేయుచు ఊగులాడుచుండిన చెట్లకొమ్మలు, రంగురంగుల పక్షులరొదయుట నాట్యము సల్పుచు గానము చేయుచుండినట్లు లలితకు దోఁచెను.

,,నీయందే కాంచితి ప్రేమమయీ, నీయందేకాంచితిని.''

3

లలిత గోపాలపుర సంస్థానాధీశులగు నరేంద్ర వర్మగారి ఏక పుత్రి. రాజాగారు పూర్వకాలపు పద్ధతివారు. వీరికి కృష్ణోపాసన యందభిమానము మెండు. వీరి దర్బారునందు లలిత కళలకు—అందు ముఖ్యముగా గానమునకు—ఆశ్రయము హెచ్చు. దూరదూరములనుండి ఉత్తమ గాయకులు వచ్చి, వీరి యాస్థానమున నెన్నియో దినములుండి తమ కౌశల్యమును ప్రదర్శించి బహుమానములందుచుండిరి. రాజాగారు స్వయముగ నీకళయం విమర్శనా పూర్వకమగు ప్రజ్ఞగలవారు. లలిత బాల్యము నుండి నిరంతర సాహచర్యము వలననునేమి, స్వాభావిక మగు మనోవృత్తి వలననునేమి, గాన రసాస్వాదన పరాయణ. ఆకళయందామెకు ఎంతయో యభిమానము!

లలితకు యౌవనము ప్రాప్తించి నందున ఇచ్ఛాపుర సంస్థానమునకు ఏలికయగు దేవేంద్రవర్మతో నామె పరిణయము నిశ్చయింపఁబడెను. వివాహ ప్రయత్నము చురుకుగ జరుగుచుండెను. తన సహభాగిని కానున్న యువతిని స్వయముగ దర్శింప వలయునని విశ్వ విద్యాలయ పట్టభద్రుఁడును నవీనభావ ప్రేరితుఁడును నగు దేవేంద్రునకు గాఢమగు నుత్కంఠయుండియు, పూర్వాచార సంప్రదాయములకు లొంగి, తన భవిష్య ద్భాగ్యమును సమకూర్చు వ్యక్తితో ముందుగ కొ మాటయేని యాడు నవకాశమును పొందజాలడయ్యె. దేవేంద్రునితండ్రి కుమారుని యిట్టి కోరికనే మహాపరాధముగఁ దలఁచువాఁడు!

దేవేంద్రుని భావములను గూర్చిన ముచ్చటలు లలిత వీనుల సోకెను. కాని అవి యామె మానసమున నెట్టి వికారము కలిగింపలేను. వెనుకచెప్పిన ప్రకారము ఉద్యానవనమునఁ గానవచ్చిన బైరాగీ పాటకుఁడు లలిత స్మరణను బాయలేదు. అతని మనోహరమగు నాకారము, అతని హృద్యమగు కంఠధ్వని మాటిమాటికి జ్ఞప్తికి వచ్చు చునే యుండెను. తరచుగ నామె ,,ప్రేమ పుష్కరిణి'' తీరమున గూర్చుండి గంటలకొలఁది కాలము గడపుచుండును. అచ్చట గడపిన నిముషము లామె కాత్మానంద ప్రదములుగ నుండుట పార్వతి కనిపెట్టలేదనుట కల్ల. రాఁబోవువైభవమును లెక్కసేయని తనస్నేహితురాలి ఈ యుదాసనత పార్వతిని గూడ విచారసాగరమున ముంచుచుండెను. కాని కొలఁది దినములలో నాభావో ద్వేగము మందగిల్లునను నాస పార్వతిని సమాధాన పరచుచుండినది!

అయినను లలిత మానసికస్థితి బాగు పడుట కానరాదయ్యె. తన చిత్తవైకల్యమును, హృదయ దౌర్బల్యమును తానే నిందించుకొనును. ,,నాకెట్టి వెఱ్ఱి! నేను హిందూ యువతిని. తల్లిదండ్రు లెవనిచేతులలోఁ బెట్టుదురో, అతనికి హృదయ మర్పించుట గదా నావిధి! ప్రకరణశుద్ధిగ నాతని సేవయొనర్చుటగదా నాకు కర్తవ్యము మరియొకనిని మానస వీధిని సంచరింప నిచ్చుట ఘోర పాపముకాదా? అక్కటా! ఇట్టివెఱ్ఱి తలంపు హృదయమున నిలుపుకొని నేను నాభర్తయెద్దకే ముఖముతోఁ బోవుదును? ఈ చపలత్వమునే నెట్లు నాభర్తయొక్క ప్రేమకు

నముల వినఁగలను? ఈ చూడ్కులను నాభర్త చూడ్కులతో నెట్లుగలుపఁ గల్గుదును? ఈ మెడలో నాభర్తయొక్క అనురాగభరితములగు బాహులతలనెట్లు భరింప గల్గుదును? నామనమును హరించిన యో ప్రియతమా! నాహృదయము నీకు వాసయోగ్యము కాదు. వెడలిపొమ్ము. నాకధికారమే యుండిన నిన్ను హృదయపు సెజ్జపైఁ బవ్వళింపఁ జేసియుందును! కాని నేను ధర్మ పాశములచే కట్టఁబడియున్న దానను, క్షమింపుము!!"

ఎన్నియో మారులు, లలిత ఇట్టిభావ పరంపరచే చిందర వందరయైన మానసముతో, ప్రేమ పుష్కరిణి యొడిలో శాశ్వతనిద్రఁ జెందఁ దలచెను. కాని తండ్రి జీవితపుష్పమునకు తానే తొడిమెయగుటఁ దలచి, యట్టి సాహసమును మానుకొనుచుండెను!

(౪)

నెలదినముల తరువాత లలిత ఇచ్ఛాపురమునకు రాణియయ్యెను. అచ్చట ఆమెకు ఏమికొదువ? వందల కొలది పరిచారికలు. నందనోద్యానములోని మేడ. సర్వ సౌఖ్యములకు సాధనము లన్ని సిద్ధపరుపఁబడెను. గృహప్రవేశ దినము దేవేంద్రున కెంత సంతోషానహముగ నుండెనో అతనిహృదయమునకే యెరుక! చక్కనిచుక్కయగు లలితను అలంకరించుటయందు రాణి వాసములోని నిపుణలగు సైరంధ్రులు తమ యోగ్యత నంతయు ప్రకటించిరి. రాజ కుమారుఁడు విలాసముతోను, తత్తర పడుచున్న హృదయముతోను శయ్యాగృహము ప్రవేశించెను. ప్రేయసిని సమీపించెను. లలితయు నిలఁబడి, రెండు చేతులు మోడ్చి, తలవాల్చి భర్తకు స్వాగతమొసఁగెను. ఆమె నేత్రములనుండి యశ్రుబిందువులు గారుచుండెను! క్రొత్త పెండ్లికొడుకు లలిత మేలిముసుగును తొలఁగించెను! నిరుపమాన సౌందర్యరాశి!! కాని, కాంతిలేదు!!!

మరుసటి దినమునుండి దేవేంద్రుఁడు తుమ్మెదవలె ఆ కుసుమము చుట్టును దిరుగసాగెను. వ్యవహారము లాలోచింపఁ జాలకపోయెను. లలిత కటాక్షముల కంటె లలిత సహవాసమునకంటె, లలిత వాక్కుల కంటె నెక్కువ ఆనందసంధాయకమగు వస్తువులే యాతనికి స్ఫురింపవు!

భర్తయొక్క యీయనురాగము లలిత హృదయముపై నెట్టి ప్రభావమును కలిగించలేదని చెప్పఁగలమా? అతని చేష్టలయందు కృత్రిమత్వము ఏ మాత్రమును కానరాదు. తన్నింత గాఢముగ ప్రేమించు భర్తను తా నసహ్యించుకొనఁగలదా? అసంభవము. లలిత తనలోఁ దాను ఎంతయు సిగ్గుఁజెందును. అంతటివిశుద్ధమగునను రాగమునకు తాను అనర్హురాలని తలచుచుండును కలంకరహితమగు నా ప్రేమాతరంగమునకు ప్రతిగా కృత్రిమములగు తనభావములను బ్రకటింపవలసివచ్చుట ఆమెకెంతో బాధాకరముగ నుండుచు వచ్చెను. రాజకుమారుడు వెంటనుండు నంతసేపు లలిత యాతని ధనమనోజ్ఞములగు చేష్టలచే దనుపుచుండును. అతనికంఠమున దన బాహులతలఁ బెనవేసి గంటలకొలఁది మధుర వచనములతోఁ బ్రొద్దుపుచ్చును. అతనితోఁగూడి ఉద్యానవనములోని నికుంజములందు విహారము సల్పుచుండును. స్వయముగ. మంచిమంచి పుష్పములఁగోసి తెచ్చి, హారము లల్లి, రాజకుమారుని మెడలోవైచి "ఈ పుష్పముల వాడనీయకుము సుమా" అని వేడికొనును. వెన్నెల రాత్రులందు అతనితోఁగూడ పడవలో కొలనియందు విహారము చేయును. మధురమగు కంఠమున పాటలఁ బాడును! కొంచె మాలస్యముగా వచ్చినచో, అతని నిర్దయాళుత్వమును నిందించును. అతనియెదుట తాను నవ్వును! ఆమె కన్నులు నవ్వును!! కంటిలోని కాటుక నవ్వును!!! కాని, ఒంటరిగ నుండునప్పుడు, ఆమె హృదయవిహంగము ఎగిరిపోవును! ప్రేమపుష్కరిణి యందలినీలజలము, దానిపైన నీదులాడుచుండు కమలములు, వాని సమీపమునమండు మావిగున్నల వరుస ప్రత్యక్షమగును! చిరునవ్వు పెదవులపై తాండవింప, ఒయారముగా నడచుచు పార్వతి వచ్చును! బైరాగి యొక్క మనోహర విగ్రహము కన్నులయెదుట గాన్పించును! చితారుయొక్క ఉన్మాద జనకమగు నాదముతో ఎప్పటిపాట

"నీయందే కాంచితి ప్రేమమయీ, నీయందే కాంచితిని"

అని వినవచ్చును! అంత నామెనిట్టూర్పుపుచ్చి, యాస్వప్నదృశ్యమునుండి మేల్కొనును!!

(౫)

ఈ విధముగ నొక మాసముగడచిన తరువాత రాజకుమారుఁ డొకనాడు తన చిత్రకలాభవనమునకు ప్రేయసిని గొనిపోయి, అందలి హాలునలంకరించు చుండిన పటముల నామెకు చూపెను.

అగృహమందలి చిత్రపటముల సంగ్రహము రాజకుమారుని కళాభిమానమును బ్రకటించు చుండెను. రాజపుత్రస్థానముయొక్క చరిత్రమును అజరామరముగ నొనర్చిన వీరవతంసుఁడగు రాణాప్రతాపుని, అతని యెట్టయెదుట చిత్రింపఁబడిన హిందూసామ్రాజ్య స్థాపకుఁడగు శివాజీని జూచి లలిత వారి పాదాంబుజముల కన్నుల కద్దుకొనెను. శ్రీకృష్ణుని దివ్యమంగళవిగ్రహము నెదుట ఆనందాశ్రువుల రాల్చెను. ఒకప్రక్క అసమానత్యాగియగు బుద్ధుడును, కుశాగ్ర బుద్ధియగు దయానందుఁడును వేరొకప్రక్కన కబీరు రామదాసులను, ఇంకొకప్ర

క్కన వ్యాస వాల్మీకులును చిత్రింపబడియుండుటను లలిత గాంచి భారతవర్షమును పవిత్రీకరించిన యామహాకవు లకు హృదయమున పూజాపుష్పముల నర్పించెను. మరియొ కమూలన మహాకవి కాళిదాసుపటము కానవచ్చెను. కవి శేఖరునిపదములకు నమస్కరించుచుండినట్లు చిత్రింపబడి యున్న మరియొకచిత్రమును జూచి లలిత యులికిపడెను! ఏవిగ్రహ మామెహృదయఫలకమున గొన్నిమాసములనుం డి ముద్రితమైయుండెనో ఆవిగ్రహమే అది యని యామె కుదోఁచి, సూటిగా దానిని జూడసాహసింపక, వాల్చిన కనుదోయితో నా పటమును నవలోకించుచుండెను.

దేవేంద్రుడు చిరునవ్వుతో నసెను. „ఈతనిని నీవె చ్చటనైన చూచితివా?"

లలితహృదయము వడకఁ జొచ్చెను. వేటకాడు ఎదుర్కొనఁగా తప్పించుకొనిపోవు దారిగానక, బెదరి అటునిటుజూచు లేడివలె లలిత గోడవైపు జూడసా గెను. „ఇప్పుడేమి చెప్పవలెను? ఈతని నెచ్చటనేని చూచితివా? అని రాజకుమారుఁడు నన్నేలయడిగెను, చెప్పుమా? లేదని యెట్లందును? ఈశ్వరా, ఏదేభారము" అని చింతింపఁ జొచ్చెను. ఆమెమోము పచ్చఁబారెను. మఁగదగిల్లిన కంఠస్వరముతో నసెను.

„అవును ఎక్కడనో చూచినట్లేయున్నది"

దేవే: „ఎక్కడచూచి యుంటివి?

లలితకు తల దిమ్ముపట్టినట్లయ్యెను?

„ఒకసారి బహుశః ఈతిడు పాటపాడుచు మాయు ద్యానవనముఎదుటినుండిపోవుచుండెనుకాఁబోలును. పార్వ తి ఈతని బిలుచుకొనివచ్చి పాటపాడించినట్లుజ్ఞాపకము!

దేవే: „ఆ పాట ఎట్లుండెను?"

లలితకు ఏమియు తోచదయ్యె. „రాజకుమారు డిట్టి ప్రశ్నల వేయుటయందు అర్థములేకపోదు. నేఁడు మానము దక్కునా?" యని చింతించి, ధైర్యము తెచ్చు కొని నిర్లక్ష్యభావము నటించుచు నసెను. „అతేని పాట ఒక మోస్తరు బాగుగనేయుండెను" దేవేంద్రుఁడు దుడుకుత నముతో మరల ప్రశ్నించెను: „అతడు పాడినపాట యేది?"

ఈ ప్రశ్న వినినపిదప లలిత జాగ్రత్తపడెను. „ఈ ప్రశ్నకు సరియైనయుత్తరమే యిచ్చితినేని, ఇక మిగులునదేది? ఏ విధముగజూచినను నేఁడు క్షేమము లేదు." అనుకొని, ఇంటి కప్పువైపుఁజూచి యసెను.

„ఏదో విఖ్యాతనాయకుని పాట యనుకొనెదను.

దేవే: „ఇదికాదుగదా?"

„నీయందే కాంచితి ప్రేమమయీ, నీయందే కాంచితిని"

లలితకన్నుల చీకటులు గ్రమ్మెను. తల దిరుగసాగెను. నిలువజాలక చదికిలబడి ధైర్యము చిక్కఁబట్టి యడిగెను.

„ఆ సంగతి మీకెట్లు దెలిసెను?"

దేవే: అతడిచ్చటికి అప్పుడప్పుడు వచ్చుచుండును. నాకును అతనిగానము ఇష్టము. అతడే నాతోనిట్లు చెప్పెను. „రాజకుమారి నాపాటను జాలమెచ్చుకొని మరలనొకమారురమ్మని బలవంత పెట్టినది."

లలితకు తనకోపమును వెల్లడించు అవకాశము దొరకెను. ఆగ్రహముతో నసెను.

„ఇది శుద్ధఅబద్ధము! నేనువానితో ఒకమాట యైనను పలుకలేదు!"

దేవే: „నేనప్పుడే తెలిసికొంటిని, ఇది వీడిగప్పాకొంటత ని. గాయకులలో ప్రగల్భము లెక్కువలే. సరేకానివానిపా టఒకమోస్తరు బాగుగనుండెనని మాత్రమునీవొప్పుకొంటి వు కదా!"

లలి: „అబద్ధమేలపల్కుదును? నిజమే".

దేవే: „అట్లైనచో వానిపిలుచుకొని రమ్మంటి వా? ఒక్కపరుగున రాగలఁడు"

„అతనిదర్శించుభాగ్యము మరల కలుగునా!" అనునాస లలితమోముదమ్మిని వికసింపఁజేసెను. కొని నెలదినములనుండి ఏ భావమును మరచిపోవయత్నించు చుండెనో. అది మరల స్థిరపడుననుభయము ఆమెచిత్తమున త త్తరపరచెను. కనుక, ఆమెయసెను. „నాకిప్పుడు పాట మీద ఉత్సాహము లేదు"

దేవే: „నీవా పాట విన నిష్టములేనిముద్దరాలవు నేను నమ్మను."

ఈ మాటలతో రాజకుమారుఁడు ఒక్కపరుగున బయట కేగెను. లలితకేమియు దోఁచదయ్యె. ఆమె మానసమున సంతోషతరంగము దుఃఖతరంగము ఒకదానితరువాతనొ కటి వరుసగా ముంపఁ జొచ్చెను! పదినిముషములలోనే బైరాగియొక్క హృదయాకర్షకమగుపాట చెవినిబడెను!

„నీయందేకాంచితి ప్రేమమయీ నీయందేకాంచితిని".

అదే మనోహరమగు గీతము! అదేహృద్యమగుకం ఠధ్వని! ఏదిలలిత భావములను, ఆలోచనములను స్వప్నప్ర పంచముగ మార్చివైచెనో ఆగీతమే మరల వినవచ్చెను!

బైరాగియొక్కసుందరవిగ్రహము ప్రత్యక్షమ య్యెను. పెదవులపైన మందహాసము నాట్యము చేయు చుండెను. లలిత బైరాగిముఖమున తనచల్లనిచూపులు ఎంతో జాగరూకతతో, ఎంతో ధైర్యముతో బరపి చూచెను. ఆమె కన్నులఁగప్పియుండిన తెర జారిపో యెను. కన్నులలో ఆనందాశ్రువులు నిండెను. అతి ప్రేమాతిశయమును బట్టజాలక తత్పాదములపై ప్రాలి యసెను: ప్రియా! నన్నింత మోసము చేయుట న్యాయమా!



రామప్ప దేవాలయ ద్వారబంధము.



రామప్ప దేవాలయ ద్వారము.



రామదేవాల యాంతర్భాగము.

# తనరుగాత విఖ్యాత సదా సుజాత!

వఝ్ఝుల వేంకటేశ్వరకవి

తల్లి శ్రీభారతీదేవి యుల్లమందు
నధికమగు హర్షసంపద నందివెలయ
రుచిరరచనా విశేష చాతురయగుచుఁ
గావ్య సద్వర్ణనానల్ప కల్పనా వి
తతి విభాసుర నవరసాధార యగుచు
విమల మధురసుధావాక్య వినుతయగుచు
ఖ్యాతి నెంతేని సకలలోకముల గాంచి
తతవిచిత్ర చిత్రపట సంతతుల వెలసి
సరస గద్యపద్యముల ముచ్చటలఁ బ్రమద
దాయికయు సర్వపత్రికా నాయికయయి
సుకవులకుఁ జిత్రలేఖక ప్రకరములకుఁ
జూపకల్ప భూజంబన జానుమీరి
తనరుగాత విఖ్యాత సదా సుజాత!



# రుద్రమ్మ

ఆంధ్ర శేషగిరిరావు (సారస్వతసమాజము)

క్రీస్తుశకము ౧౨౬౦ వ సంవత్సరమున తెలంగాణము వారికి సర్వగ్రస్తసూర్య గ్రహణము కలిగి నట్లైనది, కాకతీయాంధ్రసామ్రాజ్యనియంతయై వెలుగొందిన గణపతి దేవచక్రవర్తి దివంగతుడగుట వలన.

రాజ్యభారము వహించుటకు గణపతిదేవ చక్రవర్తికి పుత్ర సంతానము లేదు. ధర్మపత్ని సోమాంబ యందు అతనికి రుద్రమ్మ, గణపమ్మ అను ఇరువురు కుమార్తెలు మాత్రము కల్గిరి. పురుష సంతానము లేనందులకు అతడు వగవలేదు. ఉచితజ్ఞుడగుటచే గణపతి దేవచక్రవర్తి కొమార్తెలకు రణవిద్య రాజనీతి నేర్పించెను. జేష్ఠతనయ రుద్రాంబికను కుమారునిగ భావించి రుద్రదేవుడని నామమిడెను. తనయనంతరము రుద్రదేవి ఆంధ్ర సామ్రాజ్యభారము వహింపవలయునని చక్రవర్తి అజ్ఞప్తి. అట్టి ఆదేశమునకు పూటకాపు మంత్రిమాణిక్యమైన శివదేవయ్య.

క్రీస్తుశకము ౧౨౬౦ వ సంవత్సరమున రుద్రదేవి ఓరుగంటి రత్నసింహాసన మధిష్టించెను. మంత్రిమణి శివదేవయ్య మంత్రరక్ష ధ్వజాయమానముగ సాగుచుండెను. రాజ్యభారము పూనుసరికే రుద్రమ్మకు ముమ్మడమ్మ రుయ్యమ్మ అను నిరువురు కుమార్తెలు గలిగిరి.

రుద్రమ్మదేవి భర్తనామము మనకు తెలియవచ్చుట లేదు. చక్రవర్తి యంతవాసికల్లుడైన యాతడు మండలేశ్వరుడైన గాకతీరదు. భావి పరిశోధన మీతని చరిత్రము వెల్లడించు వరకు నీతడు రాజ బంధువులలోని వాడై తిక ముండెననియు, యౌవనవయస్కుడైయున్న గ నే మృతినొంది యుండవచ్చుననియు, ఆంధ్రచక్రి నితో బాటు మనము కూడ నమ్మవచ్చును. రుద్రమ్మ తండ్రిఇడిన 'రుద్రదేవమహారాజు' అను పురుషో ము నే వ్యవహారమునందుచేకొనెను. ఆమెఎప్పుడును వేషముతో నే కొల్వుకూటమునకు నేతెంచి మం రాజ్యాంగవిషయములను సమాలోచించు తెలియు చున్నది.

ఓరుగంటి సామ్రాజ్య పీఠమునధిష్ఠించిన పాదములకు తలవంచి జోహారొసర్చి అంకితులై టకు సామంత మండలేశ్వరుల జాత్యహంకారము కొనినది కాదు. ఇంటి దొంగలగు మాండలిక దేవిని విద్వేషించి కాకతీయాంధ్ర సామ్రాజ్య నకు వేగిరపడుచుండిరి. దేవగిరినుండి మహాదేవరా దృష్టులను ఓరుగంటిపై నిగిడించు చుండెను. ఆమె య సింహాసనము నధిష్ఠించిన దనుట తోడనే మండి పల్లవులు, చాళుక్యులు, పాండ్యులు, రాజ్యతృష్ణలను ఓరుగంటి వైపు ప్రాకనిచ్చుచుండి పతిదేవ చక్రవర్తి కత్తి బలమున ప్రోదికొని కాకతీయ ప్రాజ్య సామ్రాజ్యము యథాయథము పొడగట్టెను.

ముంచుకొనివచ్చుచున్న రాజకీయవిషమపరిస్థితులలో నేడోయేనాడో తోడి రాజులతో పోరుపొసగక మాన దని దీర్ఘదర్శిని యగు రుద్రమ్మ గ్రహించెను. ముందు కాపుదలకై దుర్గరక్షకు దారకొనినదామె. శిథిలములైన దుర్గభాగములను బాగుచేయించెను. ఏకశిలానగరమునకు చుట్టును కంపకోటకట్టించెను. దీనికిలోతట్టున మట్టికోటయు, మట్టికోటచుట్టును కొత్త అగడ్తయు ఏర్పఱిచెను. భూమికోటకు గవనులు ఎనిమిది, దిడ్డు పదునెనిమిది. పుట్టకోటకు గవనులు నాలుగు, దిడ్డు ఎనిమిది. రాతికోటకు లోతట్టున రాతిమెట్లు పెట్టించి అలంగముమీద చుట్టాలలోని శూరవరులనుండ విధించి, తక్కినవారిని రాతికోటకు లోతట్టునున్న ఇటుకకోటలో నుండ నియమించెను. కొమ్మకు ఇనుపురుడు, బురుజునకు ఏబమంత్రుడు, దిడ్డికి నూర్వురును, గవనికి ఏనూర్వును, వీరభటులు కాపుండునట్లు రుద్రాంబ కట్టడిచేసెను. ఇట్లు దుర్గరక్షకావించి, నగరాధ్యక్షుడు ప్రసాదిత్యనాయుడు, సేనాని జన్నిగదేవ సాహిణి, అమాత్యశేఖరుడు శివదేవయ్య, వారి వారిపనులందు అప్రమత్తులై మెలగునట్లు ఆజ్ఞాపించెను.

దుర్గరక్షణ ప్రయత్నములిట్లు ఓరుగంటిలో కొనలు సాగుచుండ దక్షిణమున కాంచీపురరాజు విజయగండగోపాలుడు, చోళులగు మనుమలిదేవ మహారాజు, సిద్ధయదేవచోడ మహారాజు, పల్లవరాజగు కొప్పెరుంజింగ దేవ రెండవకాడవరాయలు, మొదలగువారు రుద్రమ అబలయని అలవోకగా నామెపై ఒక్కపెట్టున కత్తిదూసి ఎత్తివచ్చిరి. ఈ కల్లోలములో పాండ్యులు తాము కూడ ఉన్నామనిపించిరి. ఈసందడిలోనే సామంతమండలేశ్వరులు పేట్రేగిదిరుగుబాటు చేసిరి. అందు కర్నూలు మండల పరిపాలకుడు రాజేంద్రచోళుడు, అల్లాడపెమ్మయ దేవమహారాజు, పరిచ్ఛేదిపండ్రాజు, వల్లభరాజు, పెదకొమ్మరాజు అనువారలు చేతులు కలిపిరి.

ఈవిధమున దక్షిణాపథమంతయు కాకతీయ సామ్రాజ్యముపై ధ్వజమెత్తి జబరదస్తీ చేయవచ్చెను. వీరనారియగుటచే రుద్రమ్మ ఇంచుక కిసుమంతయు జడియక తనసేనానులగు నాగదేవ మహారాజు, జన్నిగదేవమహారాజు, త్రిపురారి మహాదేవరాజు, అంబయదేవ మహారాజు, మొదలగువారికి హుషారిచ్చెను. అంబయదేవమహారాజు ఈడులేని పగటిమిఁజూపి పెరుంజింగదేవరెండవ కాడవరాయలను నాశనము కావించి; విజయగండగోపాలునోటుబుచ్చి; మనుమలిదేవ మహారాజును, సిద్ధయదేవ చోడమహారాజును పరాజితులనుచేసి, వారాక్రమించిన భూభాగమును మరలజయించి, రాజేంద్రుని తఱిమికొట్టి సామ్రాజ్యమున శాంతి నెలకొల్పెను.

దక్షిణదేశమునందు అరాజకమల్లుకొనిన సమయముననే కటక వల్లభుడు స్వాతంత్ర్యమును ప్రకటించెను. గణపతి దేవచక్రవర్తి కాలమున సామంతుడై కప్పముకట్టుటమాని కాకతీయ సామ్రాజ్యమునుండి చీలిపోవజూచెను. అతనిని జయించి తిరిగి సామంతునిగ చేసి అతనినుండికప్పము రాబట్టుటకై రుద్రాంబికాదేవి పోతయనాయకుడు, మారయనాయకుడు అను నిరువురు వాహినీధవులను బంపెను వారు ప్రతాపించి కటకవల్లభుని పరాజితుని చేసి ప్రతిసంవత్సరము కాకతీయ సామ్రాజ్యమునకు కప్పము కట్టునట్లుకట్టడిచేసి అతనిని మరల కాకతీయ సామంతమండలేశ్వరునిగ నొనర్చిరి.

అంబయదేవమహారాజు, పోతయ నాయకుడు, మారయనాయకుడు మొదలగు కార్యోపజీవులు విశ్వాసపాత్రులై మాండలికుల నడుము పట్టి రుద్రమ్మకు జయలాభ మొనగూర్చుచుండిరి. రణరంగరౌద్రయైన రుద్రదేవిని ఎదిరి యుద్ధానింప జాలిన తెంపరితనములే కొఱవడుటచే పరాజితులైన మాండలికులు దేశద్రోహులై పరాయివాడైన దేవగిరిరాజుతో కుట్రలుపన్నం జొచ్చిరి.

ఇట నోరుగంటిలో కాకతి గణపతిదేవ చక్రవర్తి దివంగతుడైన సంవత్సరము నందే అట దేవగిరిలో యాదవ ప్రభువు కృష్ణ భూపతి మరణించెను. ఓరుగంటిలో గణపతి తనయ రుద్రదేవియు దేవగిరిలో కృష్ణభూపతి తమ్ముడు మహాదేవ రాజును రాజ్యపాలన మారంభించిరి. మహాదేవరాజెప్పుడును స్త్రీలను శిశువులను చంపినవాడు కాడు. ఆట్లగుట అతడు పట్టాభిషిక్తుడగుట విని ఆతని పరాక్రమమునకు వెఱచి ఆంధ్రులు అడుదానిని, మాకవులు

శిశువును సింహాసన మెక్కించిరని అతని ఆస్థాన కవులు ఆడంబరముగా శిలాశాసనములలో గానము చేసిరి. ఆసా ఖిలవాంధ్ర స్తోత్ర పాఠములకు ఉత్తర కుమారుని వలె నుబ్బి మహాదేవరాజు త్రిలింగ దేశముపై దండెత్తఁదలఁపు గొనెను. ఈ తలపులకు తెలంగాణములోని సామంత మండలేశ్వరుల కుట్రలు ప్రాణము పోసినవి.

అనేక కష్టములకోర్చి సంరక్షించి పెంపొందించు చున్న ఈ విశాల సామ్రాజ్యమునకు తన యనంతరము నియంతకాగలవాఁడు లేకుంటచే రుద్రమ్మకుఁదీరని దీర్ఘ చింతగా నుండెను. ఆమె కుమార్తెలగు ముమ్మడమ్మ రుయ్యమ్మ లిరువురు కూడ నింతవఱకు సంతాన వతులు కాలేదు. ముమ్మడమ్మ చళుక్యాన్వయులకుడైన వీరభద్ర రాజున కిల్లాలు. వీరభద్రరాజు జీవిత విశేషములు వివరించుటకు చారిత్రకాధారములు లేవు. రుద్రమ్మ రెండవ తనయయైన రుయ్యమ్మ ఇందులూరి అన్నదేవ భూపాలుని సతీమణి. ఈ అన్నదేవ భూపాలుడు తన అన్నయైన కోలని రుద్రమ నాయని సాహాయ్యమున రాజ మహేంద్రవరము మొదలు సింహాచల పర్యంతము గల తెలుగు మాగాణిని జయించి రుద్రిదేవికి కుడిభుజమై రాజ్యమేలెను. ప్రథమ తనయయగు ముమ్మడమ్మకు ఈశ్వరాంశాసంభూతుడైన కుమారుడుదయించు కొఱకు రుద్రమ్మ ఆమెచే నెన్నియో నోములు నోమించి, తమ యిలవేల్పును, కులదేవతయునగు కాకతమ్మకు జాతరలు సల్పి; వడ్డెపల్లి గణపతి దేవునకు, మొగిలిచెర్ల ఏకవీరా దేవికి, ఐనవోలు మైలారు దేవునకు పూజాపురస్కారములు నెరవేర్చి. మొక్కుబళ్లు చెల్లించుటకై ఓరుగంటి నుండి బయలుదేరి వెళ్ళెను. రుద్రమ దేవి నగర వినిర్గతయైయున్న దినములలో ఆమె సవతి కొడుకులైన హరిహరదేవ మురారిదేవులు తమ పరివారముతో బంధువర్గముతో రాజధాని నగర ప్రవేశము నొనర్చి ద్వారములు బిడాయించి ఆమెను మరల నగరము చొరనీయరైరి. జనానురాగము చూఱలాడి ప్రియవాది తనముతో ప్రజాపాలన మొనర్చినదగుటచే రుద్రమదేవికి ఇట్టి కష్టకాలమున ఆప్తజనులును మంత్రివరులును బాసటయై నిలిచి అమిత సాహాయ్య మొనర్చిరి. వారి తోడ్పాటువలన రుద్రమ్మ పురప్రవేశ మొనర్చి హరిహర మురారి దేవులను పుత్రమిత్ర సహితముగా తునిమించి, వారైశ్వర్యమంతయు కొల్లగొని దానితో పద్మాక్షీ దేవికి ఉత్సవములు చేయించెను.

కాళ్లు చేతులు కూడదీసి కొనుటకు తీరికలు సందడి సమయముననే రుద్రమ్మపై దండెత్తవచ్చు యజ్ఞతయని దేవగిరినుండి మహాదేవరాజు మహా సైన్యముతో ప్రయాణభేరి మ్రోయించెను. రుద్ర మహోత్సవముల సందడిలో పర్యాప్తయైయున్నది. కా ననే మహాదేవరాజు నేరుగావచ్చి ఓరుగల్లు ముట్టడించు వీలుచిక్కినది. అప్పుడు రుద్రమదేవి భద్రకాళికి పించి వెలమ సేనానియగు రుద్రమ నాయడును, సేనానియు నగరపాలకుడునునగు నాగన్నయు తో డైయుండ పదునైదు దినములు ఘోరయుద్ధ చేసెను. తెలుగు జోదుల తీవ్రధాటికి నిలువ యాదవులు వెనుకంజవైచి వెన్నిచ్చిరి. రుద్రమదేవి పులను అంతతో విడువక తానే నాయకత్వము వారిని వెన్నంటి పట్టి పోకార్చి దేవగిరివఱకు తఱిమి కొట్టెను. మహాదేవరాజునకు అప్పటికి తాను చేసి వేక కృత్యమునకు పాశ్చాత్తాపము కల్గినది. అంత వాతడు రుద్రదేవిని శరణువేడి కోటి ద్రవ్యము అ ముగ నిచ్చుకొని సంధి కావించుకొనెను. అప్పుడు చక్రవర్తిని తన రాజ్యమునకు మహాదేవరాజు రాష్ట్ర నకును సరిహద్దులు ఏర్పఱిచి యచ్చట జయస్తంభ ప్రతిష్ఠించి, వానిపై 'రుద్రదేవ మహారాజు' అను విజయ శాసనములు చెక్కించెను. కార్యనిర్వహణ సైనికులకు ఆమె ఏబది లక్షల హొన్నులను పెట్టెను.

ఇట్లు రాజ్య కల్లోలముల కలకదేర్చి రాజ విషమ పరస్థితులను చక్కఁబఱచి రుద్రమ్మ తన త్వకాల శేషమును ప్రజోపయోగ కార్యములకై యోగించెను. తన తండ్రి పద్ధతి ననుసరించి ఆమె మున సన్నబట్టల పరిశ్రమను రత్నముల వ్యాపారము విరివిగ జరుపచుండెనటకు మార్కోపోలో ప్రశంసల నిదర్శనములు. మరి వ్యాప్తికి రుద్రమ

నొసగెను. ఆ కాలమునందలి శివాచార్యులలో నగ్రగణ్యుడైన విశ్వేశ్వర శంభువునకు క్రీస్తు శకము ౧౨౬౧ వ సంవత్సరమున మందర గ్రామమును, తదనంతరము వెలగపూడి గ్రామమును, ధారాదత్తము చేసి రుద్రమ్మ తన శైవ మతాభినిరతిని వెల్లడిచేసెను. రుద్రమదేవి చక్రవర్తిని కాలమున వైద్యమును, తర్క సారస్వతాగమములును, సంగీతమును ప్రత్యేకముగ ప్రవృద్ధములగుచుండిన వనుటకు శాసనాధారములు కలవు. రుద్రమదేవి చేసిన సత్కార్యములను సోమదేవరాజీయ మిట్లు కీర్తించుచున్నది:

సీ. ప్రోల ననేక శివాలయంబులు తీవఁ
గట్టించి బయలి యంగణములందు
నానా మహీరుహోద్యానముల్ వేయించి
యైదువేల వసుంధరామరులకుఁ
బెండ్లిండ్లు సేయించి పృథివినాలుగుకోట్ల
ద్రవ్యంబుపాతించి తవిలి పెక్కు
చెఱువులు త్రవ్వించి, చెప్ప నబ్రంబుగ
నన్న సత్రంబు లెన్నైనఁబెట్టి

గీ. అఖిల జనులును తను నంబయనుచు సారె
వలుకుటయుఁ దనపేర 'నంబాల' యనెడు
నూరుగట్టించి నిజమైన పేరవేయి
రుద్ర వరములు గట్టించె రుద్రమాంబ.

రుద్రమ్మ రణవిద్య నేర్చిన వీరాంగన. రాజనీతి యెఱిగిన విదుషీమణి. అట్లగుట ఆమె ధైర్య సాహసములును రాజ్యతంత్ర నైపుణ్యమును నెఱపి సామ్రాజ్యమును సంరక్షించెను. కార్యోపజీవులైన వెలమవారును, కమ్మవారును తమ ప్రాణములను సామ్రాజ్య క్షేమమునకు బలివెట్ట సంసిద్ధులై యుండిరి. శివ దేవయ్య రుద్ర ప్రగడలు మహామంత్రులై మంత్రరక్ష కావించుచుండిరి. కావుననే రుద్రమ్మ కాకతీయాంధ్ర సామ్రాజ్యమునకు చక్రవర్తినియై ముప్పదియైదు సంవత్సరములు శత్రు భయంకరముగ జనరంజకముగ పాలనచేయ కల్గినది. ఆమె ప్రజ్ఞా వివేకములకు, న్యాయానురాగమునకు, ధర్మాభిరతికి, శాంతి ప్రియత్వమునకు, రాజ్యపాలనా కౌశల్యమునకు, ఖండాంతరవాసుడును, విజాతీయ యాత్రికుడు నైన మార్కోపోలో యోగ్యతాపత్రము సమర్పించి యున్నాడు.

ముమ్మడమ్మకు నొక శుభ ముహూర్తమున కుమారుడు కలిగెను. రుద్రమదేవి మనుమనికి ప్రతాపరుద్రుడని పేరిడెను. ఒకటి రెండేండ్లు గడచిన తరువాత ముమ్మడమ్మ అన్నమదేవుడు అను మఱియొక పుత్రుని కనియెను. రుయ్యమ్మకు సంతతి కలుగనేలేదు. అప్పుడు రుద్రమ్మ తన రెండవ యల్లుడైన అన్నమదేవ భూపాలుని యనుమతి వడసి, ప్రతాప రుద్రుని కొమారునిగ చేకొనెను. ప్రతాపరుద్రుడు చేతికంది వచ్చిన పిదప త్రిలింగ సామ్రాజ్యభార నిర్వహణము రుద్రమ్మ మనుమని భుజాస్కంధముల నుంచెను. రుద్రమదేవి ౧౨౯౫ వ సంవత్సరమున పరమపదించెను.

సుల్తానా రజియా చరిత్రకును రుద్రదేవి చరిత్రకును, కొంత సారూప్యము కనబడుచున్నది. రజియా రుద్రమదేవు లిరువురును క్రీస్తు శకము పదమూడవ శతాబ్దములో వివిధ ప్రాంతములందు రాజ్యమేలిన రాణులు. తండ్రియైన గణపతిదేవుని ఆదేశము ననుసరించి రుద్రమ్మ కాకతీయ సింహాసన మధిష్ఠించినట్లే తండ్రియైన అల్తమషు ఆజ్ఞప్తి ననుసరించి రజియా ఢిల్లీ సింహాసన మెక్కెను. ఢిల్లీ సింహాసనమెక్కిన స్త్రీ రజియా యొక్కతియే. ఓరుగంటి సింహాసన మధిష్ఠించిన స్త్రీ రుద్రమ్మ యొక్కతియే. రజియా రుద్రమ్మ లిరువురును పరాక్రమశీలలు. వారి కార్యకౌశల్యము శౌర్యము చూచిన యెడల వారు స్త్రీ రూపములు స్వీకరించిన పురుషులేమొ యనగునని సమకాలిక చరిత్రకారులు వ్రాసియున్నారు. రజియా రుద్రమదేవు లిరువురును పురుష వేషముల తోడనే రాజసభ నలంకరించి రాజ్యతంత్రము నడపినవారు. రాణి రుద్రమ్మ పాదములకు అంకితులై యుండుటకు కాకతీయ మండలేశ్వరులు పెక్కండ్రు పోటీపడుచుండిరి. ... ఖుత్రులు పన్నినట్లే రాణి రజియా పాదాంకితులైయుండు

టకు మహమ్మదీయ సరదారులు కంటగించుకొని కుట్రలు పన్నిరి. అయితే తండ్రి నియమించిన మంత్రులను మన్నించి వారి తోడ్పాటున రాజనీతి విశారద, వివేకమహిళ, రణ రాగయైన కాకతిరుద్రాంబ మండలేశ్వరుల కాకుచేసి మాఱులేక రాజ్యపాలనము చేయగా రజియా తన ప్రీతి పాత్రుడైన యొక యబిసీనియను బానిసవానికి అధికార మిచ్చి, విశ్వాసపాత్రులైన ఖానులను తోసి రాజని ఎసరేగిన ఖానుల ఔద్ధత్యము, విజృంభణము అరికట్టజాలక యుద్ధమున పట్టుపడి రాజ్యమెట్లయిన నిలబెట్టుకొన వైరితో మనువు చిత్తగించియు తుదకు కృతకృత్యురా కాలేకపోయెను. కావుననే రజియా పరిపాలనము క్రీ. శ. ౧౨౩౬ మొదలుకొని క్రీ. శ. ౧౨౪౦ వ మాత్రము సాగి నాలుగు సంవత్సరముల నవ్వులాటయై ఆంధ్రరాణి రుద్రమ్మ పరిపాలన మన్ననో క్రీ. ౧౨౬౦ నొట్టి క్రీ. శ. ౧౨౯౬ వఱకు ముప్పదియై సంవత్సరములు నిష్కంటకముగ కొనలుసాగినది.

,,ఆంధ్రరమణీమణులు'' నుండి.

# సుజాతాభ్యుదయము

అనుముల విశ్వనాథశాస్త్రి

శ్రీపతి నవ్యమూర్తులు రచించు
మహాత్ములు బుద్ధులయ్యహిం
సాపరులర్థ సిద్ధులును సర్వ
విదుల్ సుగతుల్ కవీశ్వరుల్
దాపసవృత్తి బోధితరు తల్ప
ములందు వసింపఁ బాయసం
బోపియొసంగి భాగ్యపుర యోష
సుజాత యశంబుగంటివా.

# సీత—అశోకవనము

పంగనామముల రామచంద్రరావు

(గత సంచిక తరువాయి)

మొగలి పూరేకు పుప్పొడి దుమారము గ్రమ్మి • పసిఁడికంచెలు చుట్టుఁ బరిఢవిల్ల
శుద్ధ చంద్రోపల సోపాన సుందర • క్రీడాసరస్సుల క్రేవలొప్ప
జలజబాంధవపాద సంచార శిఖలపైఁ • జలువ నీడలు శీత జలముఁ జల్ల
సహకారవకుళ వృక్షభుజంగులను గూడు • సుకుమార లతికలచొప్పులొప్పఁ

బనసపాటల నీపాది పాదపముల • లెక్క మిగులు నశోకముల్ చిక్కవెట్ట
నొప్పు పుష్పవనసీమ మొందుచూచి • తిరుగఁ జొచ్చెను హనుమ వైదేహికొఱకు.

రావణాసుర కేళికా రామరూఢ • వృక్షవల్లీ కుడుంగ మాధ్వీప్రవాహ
సారణులు దాఁటి వనమధ్య చారునిబిడ • సమధిగాశోక తరుల జొంపములలోన.

కుటిలాత్మల్ కపి సూకర ద్విపముఖుల్ గూర్వాసబాధానము
త్కటతాభావలు, మందుకోదరలు మాద్యన్నీలమేఘప్రభా
పటలాంగుల్ వికటాట్టహాసలు క్రుధాభావాభిసూచిస్ఫుర
న్నిటల భ్రూకుటులుంబు దస్త్రనిత వాణీఘోరణీభీకరల్.

సృక్వనిర్గతశాతదంష్ట్రికలవారు • ఘుర్ఘురన్నాసికా క్రోడ గుహలవారు
చికిలివెట్టిన పాఱనాలుకలవారు • రాక్షస స్త్రీలు పూవుటీరముల దరుల.

పది పదునైదుమంది దృఢబాహలు గల్గిన యాతుమూక, ష
ట్పదమధుపానఝుంకరణ పక్షిరుతంబులతోడ నీడ సం
పదలిడు నయ్యశోకముల మధ్యఁ బొడంగని — తాఁ • న దేమొచూ
చెద"నని వానరేంద్రుఁడవశిష్ట సముత్కలికా వినమ్రుఁడై.

• పూఁబొదలకోనలోన రాముని లతాంగి
పేశలశిరీషతన్వి నంత్యాశ పేర్మి
నలయఁ గావింతు మందభాగ్యులకు నెపుడు
శుద్ధకార్యఫలాప్తికిఁ జుక్క యెదురు.

# భాగ్యనగర ప్రాంత పూర్వ విభజనము

బి. యన్. శర్మ

దక్కన్ దేశము మొగలుల కాలమునందు రాచకార్య నిర్వహణా సౌలభ్యము కొఱకై క్రింద విపులముగా వ్రాయ బడిన విధముగ విభజింపబడి యుండెను. విభజనాక్రమము యొక్క ముఖ్యమైన నామములు (౧) ప్రాంతము లేక సూబా (౨) సర్కారు లేక సీమ [?] [౩] మహాల్ లేక పరగణా ఉండెను. పరగణాలు ఖస్బాలు లేక పెద్ద పెద్ద గ్రామములలో భాగింపబడు చుండెడివి. నిజాముల్ ముల్కు సంతతి రాజ్యము చేయ మొదలిడినప్పుడుకూడ ఈ విభజనలనే ఉన్నదున్నటుల నుంచబడెను. నిజామురాజ్యము స్థాపింపబడుటకు పూర్వము బహుశః సూబాలను ప్రాంతములనియు, మహాళ్ళను పరగణా లేక సీమత్ అనియు, వీనినే 'తరియాత్' 'తరఫ్' 'పట్టా' 'ఘేరా' అనియు వాడుచుండిరి.

మొత్తము మీద దక్కనునందు ఆరు సూబాలుండెను. (౧) సూబే దారుజ్జఫరు ఉర్ఫ (లేక) బీజాపురము [౨] మహమ్మదాబాదు ఉర్ఫ బీదర్ [౩] బరార్ ఏలిజ్‌పూర్ ఉర్ఫ గావేల్‌పురము ఉర్ఫ ఏలిచ్ పూర్ (౪) దౌలతాబాదు ఉర్ఫ ఖజిస్తాబునియాద్ ఉర్ఫ ఔరంగాబాదు (౫) ఖాందేశ్ ఉర్ఫ బుర్హాన్‌పూర్ [౬] ఫర్ఖుందెబునియాదు ఉర్ఫ హైద్రాబాద.

బీజాపురపు సూబాయందు [౧౭] సర్కారులుండెను. మహమ్మదాబాదు సూబాయందు [౭] సర్కారులుండెను. బరారుసూబాలో [౧౩] సర్కారులుండెను. ఔరంగాబాదులో [౧౨] సర్కారులుండెను. ఖాందేశ నందు [౬] సర్కారులుండెను. సూబే ఫర్ఖుందె బునియాదు ఉర్ఫ హైద్రాబాదు భాగానగర (భాగ్యనగర)మందు [౪౩] సర్కారులుండెను.

ఈ సూబా రెండు పెద్ద భాగములుగా విభజింపబడుచుండెడిది. మొదటిది కృష్ణానదికి దక్షిణమున నున్న భాగము. రెండవది కృష్ణకుత్తర దిశయందున్నది. మొదటి భాగములో [౨౨] సర్కారులుండెను. రెండవ దానిలో [౨౧].

## ౧. మొదటి భాగము

(౧) ఫర్ఖుందె బునియాదు హైదరాబాదు ఉర్ఫ భాగ్‌నగరము (౨) మహమ్మదు నగరము ఉర్ఫ గోల్కొండ (౩) కోకస్ (?) (౪) నల్లగొండ (౫) కొండ (౬) ఖమ్మంమెట్టు (౭) ఘనపురము (౮) గల్లు (౯) హయూర్ కొండ? (౧౦) భువనగిరి (౧౧) మెతుకు (౧౨) మల్గూరు (మలగర: మహబూబ్ జిల్లా (?) (౧౩) ముస్తఫా నగరు (?) (౧౪) ... గరు (?) (౧౫) యల్గందల్ పాడు (౧౬) ఓరుగల్లు ... వేలూరు (వేరోల్) (?) (౧౭) మఛిలీబందరు లేక ... పట్టణము (౧౮) రాజ్‌బందరు లేక రాజమహేంద్ర ... (౨౦) చికాకోలు (౨౧) నిజాంపట్టణము ... కాలేశ్వరన్ (?)

౨. రెండవ భాగము

ఈభాగములో ౨౧ సర్కారులున్నను ౨౦ సర్కారుల నామములే చిక్కుచున్నవి.

(౧) సంఘోట్ (?) (౨) గంజికోట (౩) గుత్తి (౪) గుట్టంకొండ (౫) ఖమ్మం (౬) ఉదగీర్ (రాయచూరులో) (౭) శరణపల్లి (౮) కంచి (౯) చంగల్ పట్టణము లేక చంగల్ పేట (౧౦) త్రిపాసూర్ (?) (౧౧) నసరత్ గీసు (?) (౧౨) బాలకొండపురము (?) (౧౩) చంద్రగిరి (౧౪) పాలెంకోట (౧౫) పాదూరు (౧౬) తిరితోమల్ లేక తిర్నామాలి (?) (౧౭) వేలూరు (౧౮) జగదేవ్ (?) (౧౯) త్రిచనాపల్లి (౨౦) చోళమండలము లేక చందావర్ లేక తంజావూరు లేక తంజావూరు.

మొదటిభాగము నందలి సర్కారులకు చేరిన మహాళ్ల నామములు క్రింద నీయబడినవి.

భాగానగరము మరియు గోలకొండ యందు మొత్తము ౧౨ మహాళ్లుండెను.

(౧) హవేలీ గోలకొండ (౨) బాలాపురము (౩) పొట్లచెరువు (౪) నల్వాడ (?) (౫) హుసేన్ సాగరము (౬) అల్వారు (౭) హైద్రాబాదు (౮) ఖైరతాబాదు (౯) మేడగల్లు (౧౦) హయాతాబాదు (౧౧) అబ్దుల్లానగరము [౧౨]నరఖోడా. ఈ [౧౨] మహాళ్ళలో మొదటి [౬] హైదాబాదుకు చెందినవి. తక్కినవి గోలకొండ క్రిందివి.

౩. కోకస్ సర్కారులో ౫ మహాళ్లుండెను.

[౧] హవేలీ కోకసు [౨] గాంధారి [౩] అవతురాయ [౪] నారాయణఖేడ్ [౫] సాతేగ్.

౪. నల్లగొండ సర్కారులో ౬ మహాళ్లుండెను.

౧. హవేలీనల్లగొండ ౨ పాన్ఘచర్ (?) ౩. నాగుల్ పాడు ౪ అవరల్ ఉరల్ కొండ ౫ ఊదర్ (అవదర్) కొంప (?) ౬. అరోఖరా (?)

4

౫. సర్కారు కోయిల్ కొండలో ౧౩ మహాళ్లుండెను.

౧. హవేలీ కోయిల్ కొండ ౨. కోహీర్ ౩. ముజాహదు పూర్ ౪. తాండూరువేకల్లు ౫. దౌల్తాబాద ౬. అడికి ౭. షాహపూరు ౮. పర్తి ౯. కొండల్ మూసి? ౧౦. బాదేపల్లి ౧౧. పారేవార్ యామర్గల్లు? ౧౩. లోతేపల్లి

౬. ఖమ్మంమెట్టుసర్కారులో ౧౧ మహాళ్లుండెను.

౧. హవేలీ ఖమ్మం ౨. అనంతసాగర్ ౩. శంకరగిడ్డి ౪. షహాబాద ౫. మఘోర లేక మధిర ౬. గంగతుతు ౭. కపికొండ ౮. సీపర్తి ౯. న్యాలకల్లుపల్లి ౧౦. మారస్వాయి ౧౧. జల్లపల్లి

౭. ఘనపురము సర్కారులో ౮ మహాళ్లుండెను.

౧. హవేలీ ఘనపురము ౨. యపన్ మన్ గండ్ల? ౩. సాకరాబాదు ౪. అమల్ కొడ్గి ౫. కానిముగ్గము ౬. బాదేపల్లి ౭. తాతూఖోండా? ౮. బరేందల్

౮. సర్కారు పానగల్లులో ౪ మహాళ్లుండెను.

౧. హవేలీ పానగల్లు ౨. తపముద్రారు ? ౩. నాగనోల్ పరోదల్ ౪. కోట్ కోట

౯. సర్కారు దేవరకొండలో ౧౧ ఉండెను.

౧. హవేలీ దేవర్ కొండ ౨. యద్రూతి ౩. ఇబ్రాహింపట్టనము ౪. పేరూరు ౫. జీటిమల్కారుపల్లి ౬. చెలకుకొండ (చర్ కొండ) ౭. దేసల్ పల్లి ౮. దోలగడ్డ ౯. వజీరాబాదు ౧౦. వెలజాల ౧౧ కానిసర్గము

౧౦ భువనగిరి సర్కారులో ౧౧ మహాళ్లుండెను.

౧. హవేలీ భువనగిరి ౨. అవత్ ఫాడ్ (?) ౩. బోదవాల్ ౪. తిరుగొండల ౫. తేగోలు ౬. చేరియాల ౭. రాజ (రాచకొండ ?) ౮. షాహానగరము ౯. కలురామ్ (?) ౧౦ నిడికొండ ౧౧ వంకనికొండ.

౧౧ మెతుకు సర్కారులో ౧౨ మహాల్లుండెను.

౧. హావేలీ మెతుకు ౨ ఇబ్రాహింపురము ౩. అడనూరు ౪. బేపలూరు ౫. పట్లూరు ౬. టేకుమాలు ౭. తిర్మనూరు ఉర్ఫ సుల్తాన్‌పూర్ ౮. గజవల్లి ౯. కోడూరు ౧౦. కల్యాపూరు ౧౧. దేజూరు ౧౨. బాతాకర్కు (?)

౧౨ ముల్గూరులో ౩ మహాల్లుండెను.

౧. హావేలీముల్గూరు ౨. రాజగోపాల్ (?) ౩. హుసేనాబాదు.

౧౩ సర్కారు ముస్తఫానగరములో ౨౪ ఉండెను.

౧. హావేలీ ముస్తఫానగరు ౨. కరియాల ఇబ్రాహింనగర్ ౩. అక్లిమానకల్లి (?) ౪. బీజాపార్ట (?) ౫. ఖీతర్‌పల్లి ౬. పీన్‌గచిజాలె (పీనిగజ్జిపాలెము,) ౭. జీలాల్‌వాలా ౮. దేవరకోట ౯. హాయత్‌దేల్ ౧౦. కల్వేలీ (కల్పవల్లి?) ౧౧. గోమేదర్ (?) ౧౨ గాలేపల్లి ౧౩. మాన్గాపూరు ౧౪. గడ్డిపాడు ౧౫. మోజూరు ౧౬. గంగాగిరి ౧౭. మోలగోలు ౧౮. కేదూరు ౧౯. కేదూఘుట్టము ౨౦. నందగాంవ్ ౨౧. జూన్‌థల్ ౨౨. కౌవాత్ ౨౩. వీణకొండ ౨౪. ఊపూరు.

౧౪ ముర్తజానగరములో ౫ మహాల్లుండెను.

౧. హావేలీ ముర్తజానగర్ ౨ కోలూరు ౩. వేలంకొండ ౪. వేచికోడాల్ (దేవికొండ) ౫. రాయపురము.

౧౫ ఎల్గొండల సర్కారులో ౨౧ మహాల్లుండెను.

౧. హావేలీ ఎల్గొండల ౨. అంకగిరి ౩. విజయగిరి ౪. అరసికోట ౫. కరంటల (కోరట్ల ?) ౬. జబాకొండ (?) ౭. నాకేపల్లి ౮. పట్టెకోడు. ౯. కోడక్‌పాల్ (?) ౧౦ దేవికొండ ౧౧. ఎలికొండ ౧౨. వేసిఘటపల్లి ౧౩. సీంధలి ౧౪. సందగిరి ౧౫. పోకస్ ?) ౧౬. మంథూరు లావల్‌కొండ ౧౭. రాచెఱువు ౧౮. ఏకపల్లి ౧౯. వేలజోలు ౨౦ దల్వాక్ ? ౨౧ కోక్ ?.

౧౬ సర్కారు ఓరంగల్లులో ౧౯ మహా డెను.

౧. హావేలీ ఒరంగల్లు ౨ వేమనకొండ ౩ ... నగరము ౪. గోటీబారు ౫. కోతఘట్టము ౬. ... ౭. కటాక్షపురము ? ౮. గోరికొండ ౯. ... ౧౦. దోలెకొండ ,౧౧. ముబారక్‌హాస్న ౧౨. ... ౧౩. యల్కారు ౧౪. చంద్రగిరి ౧౫. ... ౧౬. పోకాలు ?

౧౭ వేరవోలు (వేలూరు) లో ౧౧ మహా డెను.

౧. హావేలీ వేరవోలు (వేలూరు) ౨. గో ... ౩. పేదపాల్ (పేదపాలెం) ౪: అల్లీ అష్ట ? ౫ కా ... లోడా (మాలవాడు) ౬. ధోడపల్లా ? ౭ ... ౮. కోడూరు ౯ చీకల్‌పూడి ౧౦. భరీమభూ ? ౧౧ ... తెలియదు.

౧౮ సర్కారు మఛిలీబందరులో ౧౮ మహా డెను.

౧. హావేలీ మఛిలీబందరు ౨. ఓల ... ౩. అంగోదల్ ౪. అప్పన్నకోట ౫. ఖోడవాడ ౬. ... ౭. జల్నాపూర్ ౮. తేలు. తక్కినపేర్లు తెలియుట ...

౧౯ రాజమండ్రిలో ౨౪ మహాల్లుండెను.

౧. హావలీరాజమంద్రి ౨, అగర్ బార్ పేరు (అగ్రహారము) ౩. తోడిపాలు ౪. కాడికొండ ౫. ... ౬. కోనేరు ౭. కుడ్లబాత్‌కొండ ౮. చారుపల్లి ౯. ... పాలు ౧౦. యర్రోరడ? ౧౧ కోరుతారసుపల్లి ౧౨. ... పనూరు ౧౩. పడతూరు ౧౪. చేకలు గొల ... ౧౫. తేగల్ జటకోన్ ? ౧౬. మహావాపాల్ ... ౧౭–౧౮. వేన్గూరు ౧౯. వజ్రాకరమక ౨౦ ... ౨౧–౨౪ ఈ మహాల్లనామములు తెలియుట ...

౨౦ సర్కారు చికాకోలులో ఒకటే మహాలుండెను.

౨౧ నిజాం పట్టణములో ఒకటే ఉండెను.

౨౨ కానూల్‌మాస్ (?)లో కూడ నొకటే ఉండెను.

రెండవ భాగములో ౨౧ సర్కారులుండెనని పైన తెలిపియుంటిమి. వాని క్రిందనున్న మహాళ్లు క్రిందనీయ బడినవి.

౧ సీధాపట్ (సీధోట్) సర్కారులో ౮ మహాళ్లుండెను.

౨ గంజికోటలో ౧౫ మహాళ్లుండెను.

౩ గుత్తిలో ౧౩ ఉండెను.

౧. హవేలీగుత్తి ౨. చీడ్‌సబ్‌గలానా ? ౩. ఊకుకొండ ౪. కేరూరు ౫. ఉప్పర్పికొండ ౬. చయింకుపల్లి ౭. పగూనుతూక్‌గరు ? ౮. పల్లెకడ ౯. ఖలికి ౧౦. పాకుడు ౧౧. పల్లిరాయపట్టణము ౧౨. పీటపల్లి ౧౩. యర్నేకకాగ్రుచరు ?

౪ గుట్టంకొండలో ౧౨ మహాళ్లుండెను.

౧. హవేలీ గుట్టంకొండ ౨ ఓడుసూరు ౩. కోటి ప్యాలపతిపల్లి ౪. గోరిమాలేదసు ౫. పసిపాలు ౬. మదనపల్లి ౭. కోతపాలెం ౮. దోసపాలెం ౯. పోగన్నూరు ౧౦. కద్నూరు ౧౧. హస్నాబాను ౧౨. శిసగదకు.

సర్కారు ఖమ్మంలో ౮ మహాళ్లు, ఉదయగిరిలో ౬ మహాళ్లు, శరణఫల్లిలో ౧౨, కంచిలో ౧౫, చంగల్ పట్టనములో ౩, తిర్వాసూరులో ౮, బాలకొండా పురములో ౫, చంద్రగిరిలో ౧౦, వాలెంకోటలో ౧౨, పాచూరులో ౯, తిరుత్తోమల్‌లో ౧౧, వేలూరులో ౮, సర్కారు జగదేవల్‌లో ౨౭, మహాళ్లును ఉండెను. త్రిచనాపల్లిలోనున్న మహాళ్ల సంఖ్యయు, తంజావూరులోనున్న సంఖ్యయు తెలియుటలేదు.

---

# అశ్రువు

(మధుర కవి)

అశ్రువుల చేవ; త్రెగిన ముత్యాల కోవ;  
కనుల సౌందర్యధనము గన్పఱచు త్రోవ;  
విరహసూచక బిందువుల్; ప్రేమధార;  
లవిరళ స్నేహసారము; లతుల ప్రీతి  
వారివాహముల్; దుఃఖ దుర్భర సముద్ర  
భంగశీకరములు; జనస్వాంతరసము;  
లతులకరుణానుకూలములైన వీని  
కవులు నెమకిరి యుపమను; గాని వివిధ  
భావముల నుండు "నశ్రు" సంవర్ణనంబు  
నేయ నుపమలు కాన రేచాయనైన.

# రెడ్డికన్నె

రాయప్రోలు సుబ్బారావు

ఊరికావలి చెరువులో
నీరు దెత్తురు నిరతమ్ముఁ
పౌరభామలు కడవలఁ
జఘనమందెలు మెఱువఁగఁ
ఈవలావల పెరుఁగుచుఁ
తావులీనెడు పొలములుఁ
త్రోవకెండలు తగులనీ
కావరించెడు తరువులఁ
కొమ్మకొమ్మన కులుకుచూ
కమ్మకమ్మగ పలుకుచూ
దాపునంజను వనితలఁ
ఊపుచుండును పులుగులుఁ
పాడిపంటల పొదలునా
వీడువేడ్కల విడిదియై.

* * *

గ్రామవాసుల కనువుగా
గ్రామశోభన మరయుచూ
చంద్రశేఖరుఁ డెసగునూ
చంద్రుబోలిన యశముతో
పెద్దకాపయి నగరముఁ
దిద్దునాతఁడు. చదురుతో
సద్దు సేయరు జనములుఁ
రద్దురచ్చలు రగులుమీ.

* * *

కూతురొక్కతె యతనికీ
చూతపల్లవ మనదగుఁ
మంచిగందపు మొలకయో
మించుముద్దుల గిలకయో
పూచిపూయవు చెలియొడల్
లేచిలేవవు మనసులుఁ
బాలమోమున చిఱునవుల్
తేలవింకను స్ఫుటముగా
పూలతోడుత పొడివిరో
పాలవన్నెల గడిగిరో
బాలికామణి ముఖకళల్
చాలదుర్లభ మవనిలో
సిగ్గుచిన్నెలు చెదరవూ
మొగ్గలోని మధువవలెఁ
దోసపిందియ నునుపులఁ
భాసిలుఁ నఖప్రాయముల్

* * *

తెల్లచీరల మురియునూ
నల్లరైకల తొడుగునూ
కల్కిచెక్కులు పలచనై
తళ్కులెక్కుడు మిసమిసర్
నవ్వుదెక్కువ సఖులతో
రవ్వపల్వురు నగవడర్
మాటలాడును మితముగా
మీటభావము కనులలో
అందమంతయు నడలలో
చందమంతయు మడులలో
చింది చిందక మృదువుగా
పొందుమీాత్రెను చెలియకుర్.

* * *

ఏటికావలి పొలములో
తోటవేసిరి యనువుగా
కాసె చక్కగ మిరెపలూ
పూపెనోయనపవడములే.

* * *

ప్రొద్దు ప్రొద్దున నిరతముర్
ముద్దులారగ నడుచునూ
చిట్టికుచ్చుల బడిసెలర్
చుట్టికంతమునకుఁ దమిర్
బంతిచెట్లకు వలపటర్
కాంతులారెడి యొకమెడర్
మంచెయున్నది ఉవిదకూ
కొంచెమెత్తున నిలువగా
తోలుచుండును పులుగులర్
బాలకాలగ మధురిమల్
వింతవింతగు చెయిదముల్
కాంతతీర్చును పొలములో.

* * *

నింగిపోయెడు చిలుకలర్
పొంగిపొర్లెడు ప్రేమతో
పువ్వునిచ్చెద ననుచునూ
నవ్వుటాలకు పిలుచునూ
ఏమికావలె ననుచునూ
భామ తియ్యగ నడుగుచూ
గట్టులంజను జనులనూ
కట్టివేయును కనులతో
గువ్వజంటల దరియుచూ
బువ్వపెట్టెద తినుమనర్.

* * *

పూవుపై బడు తుహినమో
ఆవుపిండిన అమృతమో
నాగనాయమ చెయిదముల్
వీగుప్రాయపు విప్పులర్

(సశేషము)



# పెట్రోలియము పరిశ్రమ

పుల్లమరాజు వేంకటేశ్వరరావు

పెట్రోలియ మనగా మోటారు బండ్లను నడపించుట కుపయోగించు నూనెయని జన సామాన్యము నమ్మకము. అది పొఱపాటు. పెట్రోలియము వలన మోటారు పెట్రోల్, గ్యాసునూనె మొదలగు పదార్థములు లభించు చున్నవి.

పెట్రోలియమనగా [పెట్రా = శిల + ఓలియమ్= తైలము] శిలా తైలము. భూగర్భములోనుండు శిలల పొరల మధ్యనుండి ప్రవహించుటచే దీనికీ నామము వచ్చినది. క్రీ. శ.నకు ४౫౦ సంవత్సరములు పూర్వము పర్షియాలోనున్న ఖరాత్ ప్రాంతములలో నిట్టి తైలముల నుపయోగించినట్లు చరిత్ర తెలుపుచున్నది.

పెట్రోలియము భూమిలో నెటుల పుట్టుచున్నదో తెలిసికొనుటకు పెక్కుండు రసాయన శాస్త్రజ్ఞులు తమ జీవితముల ధారబోసి తుదకు సత్యమునుకనిపెట్టిరి. భూమి క్రింద వడవులు, జంతువులు నణగిపోయి యున్నటుల భూగర్భ శాస్త్రము తెలుపుచున్నది. భూమిని త్రివ్వినప్పుడు నశించిన ఆకులు, కట్టెల ముక్కలు, జంతువుల శల్యములు మొదలగునవి బయలు వెడలుట మనము తఱుచుగా చూచుచున్న విషయమే. నానావిధ వృక్షములు జంతువులు భూకంపము చేతనో, జల ప్రళయము చేతనో గుట్టలు కూలుట చేతనో భూమి క్రింద నణగి, నశించి, కాలము గడచిన కొలది నైసర్గికముగా భౌతిక, రసాయనిక వికారముల బొంది పలువిధముల నూతన పదార్థములుగా మారుచున్నవి. సేన్ద్రియ పదార్థము [Organic matter] [అనగా వృక్ష జంతు జాలములు] ... రసాయనిక వికారములను పొందుటచే పెట్రోలి... పరిణమించినదని రసాయన శాస్త్రజ్ఞులు సిద్ధాంతీ... నారు. ఈ సిద్ధాంతమే శాస్త్ర సమ్మతమని యొప్పబడుచున్నది.

కర్బనము [carbon] అనగా బొగ్గు [... ములు, ఆకులు, కట్టెలు, తైలములలో నుండును] ... ఉదజని [Hydrogen] యను వాయువు [gas] ... రెండు మూలద్రవ్యముల [Elements] రసా... సంయోగముచే వందల కొలది నూతన మిశ్రద్రవ్య... [Compounds] పరిణమించు చున్నవి. వీని సం... నము నందు మూలద్రవ్యముల పరిమాణ భేద... [Defference in their quantitat... Composition]లుండుటచేత, వివిధ మిశ్రద్రవ్య... జనించు చున్నవి. మీథేన్ [Methane C... యను వాయువు, కర్బనము యొక్క ఒక పరమా... [Atom] మరియు నుదజనియొక్క నాలుగు పరమా... వుల సంయోగముచే నుద్భవించినది. బెన్ జీన్ [Be... zene [C6 H6] యనబడు ద్రవపదార్థము కర్బ... మరియు నుదజని యొక్క ఆరారు పరమాణువుల సం... గముచే గలిగినది. వ్యాసిలీన్ [Vaseline-C... H40] యను ఘనపదార్థము కర్బనము యొక్క ... మ్మిది పరమాణవులు, ఉదజని యొక్క నలుబది ... ణువుల సంయోగ జనితము. చెప్పబోవున దేమన...

చేర్కొనిన మూడు మిశ్రద్రవ్యములలో కర్బనము, ఉదజని, యీ రెండు మూల ద్రవ్యములు మాత్రమే యున్నప్పటికిని, వాని పరిమాణములలో హెచ్చు తగ్గులుండుట వలన మొదటిది వాయువుగను, రెండవది ద్రవముగను, మూడవది ఘనపదార్థముగను పరిణమించినవి. ఈమూడును మూడు ప్రత్యేకశాఖలకు చెందిన రసాయనములు. కర్బన, ఉదజన సంయోగ ఫలితములగు వివిధ రసాయనములకు ,,ఉదజ కర్బనముల'' [Hydro carbons] ని సామాన్య నామము.

పెట్రోలియమును దీయు పద్ధతుల దెలిసికొనుటకు పూర్వము దాని సంఘటనమును తెలిసికొనుట అత్యవసరము. పెట్రోలియము వివిధములైన ఉదజకర్బనములన బడు మిశ్రద్రవ్యముల (వాయువు, ద్రవము, ఘనపదార్థము) మిశ్రమము. ఇది స్థల విశేషమును బట్టి ఎరిగడ్డివలె పసుపువర్ణము గలదిగను, ఆకుపచ్చగను, నల్లగను, ఆమువముకంటె నెక్కువ చిక్కగను, నీటికంటె తక్కువ గరిమ (Gravity) గలదిగ (అనగా అలకనిదిగ) నుండును.

| కర్బనము | ఉదజని |
|---|---|
| నూటికి ౮౫—౮౭ వంతులు | ౧౪ వంతులు |

తఱుచుగా గొంత గంధకము [0.3% నుండి 0.8% వరకు] దీనిలో విలీనమై యుండును.

అమెరికా దేశమునందలి పెన్సిల్‌వ్యానియా, ఓహియో ప్రదేశములు, క్యానెడా మరియు రష్యాలోనుండు బాకుయను పట్టణ ప్రాంతములు పెట్రోలియపు పరిశ్రమకు ముఖ్య స్థానములు. మన దేశములోనున్న బర్మాలోకూడ పెట్రోలియపు బావులు కలవు. మన మున్న ప్రపంచములో నొకసంవత్సరమున దీయబడు పెట్రోలియమునందు అమెరికా సంయుక్త రాష్ట్రములే నూటికి సుమారు అరువది వంతులు తీయుచున్నది.

## పెట్రోలీయమును తీయు విధానము

భూగర్భములో శిలల పొరల (Strata) మధ్య నుండి పెట్రోలియము ప్రవహించుచున్నదని పైన చెప్పబడినది. ఈ క్రింది పటమును చూచినచో బోధపడును. ,,క'' యను గుర్తుపెట్టిన చోట పెద్ద రంధ్రము చేసినచో శిలా తైలము పై కుబుక మొదలిడును. ఎల్లప్పుడును నీ తైలముతో గొంత ,,వాయు రూపకోదజ కర్బనము'' [gaseous Hydro Carbons] లుంటంజేసి భూగర్భములో నపరిమితమైన ఒత్తడి ఉండును. ఈ ప్రదేశములో నూష్ణము కూడ నధికముగ నుండుటచే నట్టి వాయువులు వ్యాకోచము [Expansion] నొందును. ఇందువలన నొత్తడి మరింత హెచ్చగును. ఇట్లు భూగర్భములో దాగియుండు యీ తైలసముద్రములు నణగియుండి రంధ్రములు చేసిన తోడనే వాయువులు, తైలములు అద్భుత వేగముతో పైకి ప్రవహింప నారంభించును. రష్యా దేశములో కొన్ని పెట్రోలియపు బావుల ద్రొవ్వినపుడు కొన్ని దినముల వరకు ప్రతి దినము ౮ కోట్ల ౨౦ లక్షల సేరుల తైలము ప్రవహించినట్లు లెక్క వేయబడినది. క్రీ. శ. ౧౯౦౧ సంవత్సరములో అమెరికా నందలి బీమాంట్‌నందు ,ల్యూకాస్ బావిని త్రవ్వినపుడు ఆరు అంగుళముల వెడల్పుగలధార నూట



యిరువది అడుగు లెత్తున కెగయుచు తొమ్మిది దినముల వరకు రాత్రింబవల్లు ప్రవహించినది. ప్రతి దినము ౧౫౪౫౦౦౦౦ సేర్ల తైలము ప్రవహించినది. వాయువు లన్ని వెడలిపోయి ఒత్తిడి తగ్గిన తోడనే తైల ప్రవాహ మాగిపోవును. అప్పుడు బావిని లోతుగా త్రవ్వి ఆ రంధ్రము ద్వారా నొక గొట్టమును లోపలికి దిగవేయుదురు. గొట్టమునకు పంపు నమర్చి దాని ద్వారా పెట్రోలియము పైటికి దీసి కర్మాలయములందలి నిలువయుంచు గదులకు పంపుదురు. వేలఅడుగుల లోతువరకు కూడ రంధ్రము వేసి పెట్రోలియమును దీయుదురు. భూగర్భము కఠినముగా నున్న డైనమైట్, నైట్రోగ్లిసరీన్ షెల్లుతో నడుగును పగలగొట్టెదరు.

పెట్రోలియమును భూమినుండి తీసినప్పుడు చెత్త, ఆకు మన్ను మున్నగు అన్య పదార్థములు దానిలో గలిసి యుండును. నీరుకూడ మిశ్రమై యుండును. వీనిని విడదీయుట అవసరమైనపని. ఉన్నతస్థలమున పెద్ద యినుప పాత్రలను నిర్మించి వానిలో పెట్రోలియమును నింపి యుంచెదరు. తైలము నీటికంటె నలకనిదగుటచే రెండు మూడు దినములలో నది పైకి తేలును. అడుగున నుండు నీటిలో మన్ను మరియు నితర ఖనిజపదార్థములు [illegible] పోవును. ఆయా పాత్రలకు క్రింది భాగమున నమర్చ యుండు నల్లాల ద్వారా నీరుమొదలగు వానిని దీసివేదురు. పాత్రలయందు పెట్రోలియము మాత్రమే యుండును. పెట్రోలియము వివిధములైన తైలములయు ద్రవ్యముల మిశ్రమమని జ్ఞాపక ముంచుకొనవలెను. మిశ్రిద్రవ్యముల నన్నిటి నెంతవరకు వేర్వేరుగా [illegible] శుభ్రమైన పదార్థము లభింపదని తెల్లముగును. పెట్రోలియములో నుండు నానా విధ తైలములు ద్రవ్య విధ పరిశ్రమలలో ప్రత్యేకోపయోగముల [illegible] వచ్చునవి యగుటచే వీనిని వేరు వేరుగా విడదీసి [illegible] పరచుట ముఖ్యము.

పెట్రోలియములో నుండు తైలములను స్రుతీ: [Distillation] మను విధానముచే విడదీయుదు ఆయుర్వేద వైద్యులుపయోగించు ఒక యంత్రవిధాన స్రుతీకరణ విధానమనెదరు. స్రుతీకరణ విధానము [illegible] పటముద్వారా బోధపడును. ఇట్టియంత్రములు ఇటుక కట్టిన అరుగులలో నమర్పబడి పై భాగము మాత్ర కనబడు చుండును.



శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ భవనము




రెసిడెన్సి బజారు, హైద్రాబాదు.

నిలయ
స్థాపకులు—పోషకులు—అధ్యక్షులు



శ్రీ శ్రీరాజనాయని వేంకటరంగారావు బహద్దరు,
మునగాల సంస్థానాధీశులు

నిలయస్థాపకులు



కీ. శే. రావిచెట్టు రంగారావు

'అ' గుర్తు ఘటము, 'క' అగ్ని ప్రదేశము, 'చ' బూడిద గుంట, 'చ' దగ్గర నుండు యినుప ఖడ్డీలపై నుండి బూడిద క్రిందికి రాలును. 'ట' యిటుక కట్టడము. 'త' రంధ్రము [Flue] ద్వారా చిమ్ని నుండి పొగలు వెడలి అవతలికి వెడలిపోవును. ఇట్టి రంధ్రముండుటవలన మంటకు సహాయము కలుగుచుండును. 'ప' నాళము ద్వారా పెట్రోలియమును లోపలికి చేర్చి గాచినప్పుడు తైలపుటావిరులు 'య' ద్వారా బయలుదేరి 'శ' యను గోటు [Safety volve] నుండి 'బ' గుర్తుగల గొట్టముల ద్వారా ప్రవహించును. ఈ గొట్టముల చుట్టు చల్లని నీరు ప్రవహించుచుండుట వలన తైలపు టావిరులిట్టి శీతల ప్రదేశమునకు వచ్చిన తోడనే ద్రవ రూపమును బొందును. తర్వాత 'భ' గుర్తుగల గదిలోనికిల్లు ద్రవకరించిన పరిస్కృత తైలములు [distilled oils] చేరును. కాచినప్పుడు స్రుతీకరణ ఘటము [destillation still] లో నుండి వెలువడు తైలపుటావిరులు మరియు పెట్రోలియములో విలీనమై యుండు వాయువులు [వాయు రూపకోదజ కర్బనములు] 'బ' గుర్తుగల చల్లని గొట్టముల ద్వారా ప్రవహించునుగదా. తైల వాయువులు సంపూర్ణముగ ద్రవీకరించక పోవుటచే వానిలో స్వల్ప భాగము మరియు వాని వెంట నంటివచ్చుచున్న వాయు రూపకోదజ కర్బనములు రెండును వాయువులు గానే ద్రవీకరించిన తైలముల వెంట 'భ' గుర్తుగల గదిలోనికి ప్రవహించును. 'మ' గుర్తుగలచోట నాళము వంకరగా నుండుట వలన ద్రవములన్ని క్రిందికి ప్రవహించుచుండ నిట్టివాయువులు మాత్రము 'ర' గుర్తుగల చోటి [Gas trap] నుండి బయటికి వెడలి పోవును. తైలములు 'ల' గుర్తుగలచోట నుండు నాళములద్వారా సంచయన పాత్రము [Storage tank] లోనికి ప్రవహించును.

ఇట్టి పరిస్కృత తైలములలో నుండు వివిధ ద్రవ్యములను వేర్వేరుగా విడదీయు విధానమును రాబోవు సంచికలో కనుగొందము.

---

## ప్రేమపాశము

ఆవంత్స వేంకట రంగారావు

తరుణి! నీయుంగరాల ముంగురులె నాకు  
కాళ్లసంకెళ్లుగామారి గట్టిగాను  
కట్టిపడివైవ పాదమ్ము కదపలేక  
నీస్వరూపమ్ము ధ్యానించి నిలిచిపోదు.  
అంతరములేని నీజుత్తు టడవులందు  
బెదరినప్పుడు పక్షినై యొదిగియుండి  
పాటుపాపట సెలయేటి పాటవించు  
వేయిసంవత్సరములైన వెడలనిత్తు  
వేడిదుఃఖాన నేవేగు వేళనీదు  
కన్నుగోనేటిలో నల్ల కల్వఁజూచి  
కుతియు నీచూపువెన్నెల శిరముఁదడిపి  
స్నానమొనరించి భ్రమియించి మేనుమరతు.

(భావగుచ్ఛమునుండి)

# ఎంతదనుక ?

ఒ. రాఘవరంగారావు

చేతఁ దీపంబు గల్గి వీ • క్షింపలేక
పుతుకులాఁడెడి నేనేమి • బొందగలను ?
అంధకారమయుండనీ • యనవరతము
దీన వెల్గింప గలనొక • దీపకళిక ;
బలువిషాదము రాజ్యంబు • సలుపుచుండె,
సుఖము చెఱలోనబడి చెడి • స్రుక్కుచుండె,
మూర్ఛితోత్కంఠ దారుణ • మోహతృష్ణ
దేన నార్పిన నారునో • తెలియబడదు,
అంతరాయ కుడ్యావళి • యలుము కొనియె
నెట్లుగూలునొ యీగోడ • లెఱుకపడదు,
కరుణచే దారుణాశ్రువుల్ • కనులనుండి
జాలువారుచునుండె, సూ • క్ష్మంపుటాస
జోతివైకల్యవాతాన • జోగుచుండె
పోవుచున్నట్టి ధైర్యంబు • పోల్కి వేఁడి
శ్వాస వెడలుచునుండె, దు • ర్భరనితాంత
యాతనావేదనాళి బి • ట్టావరించె,
"అయ్యయో!" యను ప్రతిశబ్ద • మగ్నిమయత
విస్ఫులింగము పోలిక • వెడలుచుండె,
ఎచట నివసింపవలయును ? • ఎచట నా ప్ర
పంచమున్నది ? ఆసచే • బాటఁ బట్టు
పోవనెక్కడనో పార • వైవఁబడుదు,
కనులఁ జింపి వీక్షించినఁ • గానఁబడదు
శూన్య సంసారసీమ ? యీ • శూన్యకాల
మెవఁడు లెక్కింపఁ గలఁడు ? ఈ • యెగ్గుపాట
లాతఁ డరుదేర శాంతించి • యలరుగాక.

# సంఘసేవ

శిరుగూరి హనుమంతరావు

కుటుంబము సంఘము యొక్క ప్రప్రథమ దశయని ఇది వరకు చెప్పియుంటిని, మరియును సంఘము యొక్క క్షుద్రప్రతిబింబము కుటుంబమని పాఠక మహాశయులు చదివి యుండిరి. నే నిదివరకు వ్రాసిన, వ్రాయబోవుచున్న విషయములంత నవీనములు కాకపోయినను మనుష్యునికి సహజమగు నిర్లక్ష్యము మనకడ్డు వచ్చుటచే మనము కుటుంబకర్తవ్యముల సక్రమముగా పాలించుటలేదు. మన సోమరితనము మనను సంపూర్ణముగా కుటుంబసౌఖ్యము ననుభవింప నిచ్చుటలేదు. భారతదేశములో స్త్రీలకు కుటుంబమునందు ఉన్నత స్థానము లేదు. స్త్రీలను ఉన్నత స్థితికి దేగలిగిన మనము గొప్ప సంఘసేవను చేసిన వారమగుదుము. ఈ దుర్దశకు తోడు వృద్ధులకు, యువకులకును పరస్పర సానుభూతిలేకపోవుట పరస్పర సంబంధములు తగ్గిపోవుటసంభవించి కుటుంబము నింకింతవిషమావస్థ పాలు చేయుచున్నవి. పాశ్చాత్యదేశములలో స్త్రీలెంత నిర్వైరపాటుతో చూడబడుచున్నారో ప్రాగ్దేశమగు భారతమందు యువకులు కూడ నంతే నాశయదృష్టికి గురియగు చున్నారు. ఈ కాలము యువకులకును వారి తలిదండ్రులకును అభిప్రాయ భేదము లెక్కువై పోవుచున్నందున ఒకరినొకరు పిచ్చివారుగా తలంచుకొనుట సంభవించు చున్నది. పదునెనిమిది మరియు పందొమ్మిదవ క్రైస్తవ శతాబ్దములలో యూరపునందు ప్రతి కుటుంబములో కూడ సాయంత్రము కాగానే తండ్రి ఏదోయొక ఉత్తమ గ్రంథము జదువుట ఆచారముండెను. కుటుంబమునందలి యితర సభ్యులు చుట్టుకూర్చొని వినుచుండిరి. ఈ ఆచారము మనకు క్రొత్తది కాదు. పూర్వాచారమని అది ఈ కాలమునందు తలంచబడుచున్నది కొన్ని హైందవ కుటుంబము లందిది వరకును అందరు సభ్యులు కూడ భారత భాగవత పఠనయందు కొంతకాలము గడపుచున్నారు. కాని నాటికి రాను కుటుంబములు కూడానిట్టి సదాచారమును పాలించుటలేదు. పెద్దలు పిన్నలను దూషించుటయు, పిన్నలు పెద్దల నిందించుటయు మన దేశమునందొక గొప్పపని యైపోయినది. బుద్ధి, చతురత, ఒక కాలము సొమ్ము కాదని తెలిసికొనిన ఏ వైషమ్యము నశించును. అభిప్రాయభేదములకు తావిచ్చి పరస్పరసంబంధములను వృద్ధిచేయుట చాల అవసరము జననీజనకుల సదుపయోగము చేసికొను వారికి దైవము సాయపడునని ప్లేటో ప్రవచించెను: ప్రాత పట్టణములు లేనిది పని సాగదని పై భావమునే ఇంకొక విధముగ సిసిరో సూచించెను. హిందువుల ఉద్గ్రంథములకిది పురాతనాంశమే. పూర్వుల ఉపదేశములను పాశ్చాత్యుల వలె ప్రచురించుటను మిక్కిలి లాభకరము.

కుటుంబము తర్వాత మతము వచ్చును. ప్రపంచమునందు మనుష్యునికి గల నిజమైనస్థానమును చూపునది మతము. ఏమతము ప్రేమ, గౌరవము, ఆత్మరాహిత్యమును బోధించునో అది అవలంబనీయ మైనది. ఈర్ష్య, అసహనమును నేర్పుమతము వర్జనీయము. ఈ రోజులలో మన మతము కర్మకు మితిలేని ప్రాధాన్యమిచ్చి తన ముఖ్యోద్దేశమును అంతరింప జేయుచున్నది. ఈకారణమున నిప్పటి యువకులందరిలో ప్రబలమగు అసంతృప్తి కలుగుచున్నది. మనుష్యుని ఆ ఉత్తమఆదర్శపురుషునిగ చేయుట, మరణానంతరము సంశయరహితమైన ధివి

వ్యత్తును చూపించుట మతము యొక్క ముఖ్యకర్తవ్యము. మతముతో నెట్టి సంబంధములేని ఆచారముల నుల్లంఘించి నంత మాత్రమున హిందువులు మతమునుండే బహిష్క రింప బడుట సామాన్యమగుచున్నది. ఈ ఆచారములను ఖండించి పకులను జంకక ఉన్నత ఆదర్శములలో మతము నేర్పు నిజమైన ఉపదేశమును ఆచరణలో పెచ్చుట సత్పు రుష లక్షణము.

కుటుంబము, మతము పిదప మనుష్యుని యితర అవ సరములను పూర్తి చేయుటకై స్థాపితమైన సంస్థలు గమ నించుట అవశ్యకము. అవి రాజకీయసంస్థలు కావచ్చును, రాజకీయేతర సంస్థలు కావచ్చును. రాజకీయ సంస్థలతో మనుష్యునికుండదగు సంబంధమును మకియవెలి, ట్రిట్సుకీ, ప్రచండ చాణుక్యుడు విపులముగా చర్చించియున్నారు. అన్ని ఆదర్శములకంటె రాజ్యముయొక్క ప్రతి శాసన మును గౌరవించుట, ఆచరణలో పెచ్చుట రాజ్యము కోరు మొదటి కర్తవ్యము. ఒకానొక కాలమందు దేశాభి మానము, స్థలాభిమానము మనుష్యునియందు బొత్తిగా లేకుండెను. రానురాను దేశభక్తి వృద్ధియైనది. వృద్ధియగు ట క్షేమకరమే. కాని దేశభక్తి పరదేశనిందకు తావి చ్చిన నట్టి దేశభక్తి స్తవనీయమైనది కాదు. దేశభక్తి స్థలాభిమానము పెంపొందించినది. ఈ స్థలాభిమానము పరస్థల నిరసనమును పుట్టించుచున్నది. ఇట్టి దురాభి మాన ములను దూరము చేయవలెను. లేని యెడల పరస్పర వైమనస్యములు పెరిగి కలహములు. యుద్ధములు సంభవ గును. వివిధ రాజ్యములు కూడి క్షేమమునకు భంగము కల్పించు యుద్ధముల నాప ప్రయత్నములు చేయవలెను. రాజ్యము యొక్క గొప్పతనము ఆరాజ్యముయొక్క శాస నములపైన నాధారపడియుండదు. ఉత్తమ పౌరుల సంఖ్య, ఆలోచనశక్తిగల మనుష్యుల సంఖ్యపై నాధారమై యు న్నది. శాసనమును పాలించు చున్నప్పుడు మనుష్యుడు శాసనమును గౌరవించుట లేదని మనము వినుచున్నాము శాసనమునకు వ్యతిరేకముగ నడుచునప్పుడు శాసనము గౌర వించు చున్నాడు. ఈ రీతిని జరిగిన రాజ్యములో నేదో లోపమున్నదనుట నిర్వివాదాంశము. శాసన నిర్మాణము మనుష్యుల భయపెట్టుటకు కాదనియు, వారి క్షేమము కొ అకే నిర్మితమైన దనియు బోధచేయుట మనవిధి. రాజ కీయ రంగము ఉద్రేక పూరితమైనది. ఈరోజులలో సుప్ర సిద్ధ ప్రజాపాలక రాజ్యములలోనే అధికారము యొక్క దుర్వినియోగము జరుగుచున్నది. మానవ కల్యాణ కోరునట్టి ప్రతిమనుజుడును ఇట్టి లోపములను పారద్రో ప్రయత్నించవలెను.

రాజకీయసంస్థలే యీ లోపములతో నిండియుం డుటలేదు. రాజకీయ సంబంధము లేని సంస్థలలో కూడ లోపములు కనబడుచున్నవి. ఉదాహరణార్థము గ్రం లయముల పేర్కొన వచ్చును. వ్యక్తి లాభము సం నిలయోద్దేశ్యముల సంఘర్షణ జరుగుచున్నది. వైష మ్యముల పారద్రోలి సామరస్యమునకు తావిచ్చుట కర్త వ్యము. అభిప్రాయ భేదములు మన వృద్ధికారకము తలంచవలెను. నిజమైన విద్యయొక్క ఉద్దేశమిదే.

మానవులందరు నొకటేయని భావించి కష్ట చున్న వారితో సానుభూతి జూపుచుండు మనుష్యు గొప్ప సంఘసేవ జేసినవాడగును. ఈ తత్వము గ్ర చిన వానికి ప్రపంచములోనున్న ప్రతివాడును సోదరు ప్రతి యువిదయు తల్లియే. వేర్వేరు కుటుంబములను, మ ములను, జాతులను, రాజ్యములను, మానవులను విడదీ దుర్భావములు నాశనము కావలెను. మనుష్యుని వ్యక్తి మందీ మార్పుకలుగుటకు అతని మేధలో గొప్ప విప్లవ జరుగుట అత్యావశ్యకము. విప్లవ మనగనే శాసన కర్త శాంతిచెదరురని భయము జనించుట సహజము. ప్రా కునకు ఆత్మసౌఖ్యము భంగమగునని వెరచుట సామాన్య ఎవరేమని తలచినను మానవ క్షేమము కొఱకిట్టి వి మత్యవసరము. ఇట్టి విప్లవములు ప్రపంచమున మాతనమ కావు. నేనిదివరకు నుడివిన ప్రకారము మనము మన ప్ర దిన చర్యను కొంత శ్రద్ధతో విచారించవలెను. అట్లు చేయుటచే మన యందున్న లోపములు దూరమగుచుం డును. యువకులందరు చేరి సంఘమందలి లోపములను దూరము చేయ ప్రయత్నించవలెను. రాత్రులయందు ని సాదలకు విద్యను గరుపవలెను, ప్రతి దినము కొంత స యమును అసుపత్రియందు బాధపడుచుండు రోగుల సేవ వినియోగపరుపవలెను. ఇవి అసాధ్యమైన పను లెన్నటికి నేరవు. మనస్సునకు నెచ్చుకొనిన చాలును గర్ వా స్టాటునుడివిన ప్రకారము మనుష్యుని సద్కార్యమునకు వినియోగించిన ఒక గంట వ్యర్థముగా ఆత్మోన్నత్యమునకు గడపిన సంపూర్ణ జీవితము కంటె నెంతో ఉత్తమమైన

# కవిత్వము

కోదాటి రామకృష్ణారావు

భావనాశక్తిచే కల్పింపబడిన రమణీయావరణమున సత్యమెప్పుడు సారస్వత రూపమునఁ బరిణమించునో అపుడు కవిత్వమనఁ బడును. ఒక మనుష్యునకుగాని యొక దేశమునకుగాని యొక యుగమునకుగాని ప్రత్యేకముగా సంబంధించిన సత్యమును కవిత్వము తన యసాధారణ శక్తిచే వివిధ రూపములతో లోక సమక్షమున ప్రత్యక్షము గావించును. మృత్యు ఘాతమునకు గుఱియగు ప్రత్యేక వ్యక్తులకు సంబంధించిన ప్రత్యేక రూపములను, తదంగములను కవిత్వమాశ్రయించు నపుడు పైన వర్ణింపబడిన కవిత్వ స్వభావ మసంగతమని యొక శంక బొడమ గలదు. కవిత్వ మాశ్రయించు మానవాకృతులు, తదంగములు ప్రత్యేక వ్యక్తుల యందు ప్రత్యేక రూపములతో స్ఫురితములై యనశ్వరమైన సత్య స్వభావమును వహించుచున్నవి. ఆ కర్మలను వర్ణించి యా యాకృతులకును తదంగములకును సారస్వతమున ప్రకాశవంతమగు స్థిరస్థానము నొసంగుటయందే కవిత్వముయొక్క రస ప్రదీపకమగు ధర్మము గలదు. కవిత్వము యొక్క విశ్వరమణీయమగు నీ ధర్మమును, సువేద్య మొనరించుటకొక యుదాహరణము గైకొందము. ఒక సుందర యువతీ మూర్తిగలదు. ఆ మూర్తి యొక్క ప్రసన్న ప్రేమావలోకనములు సమక్షమునందలి మానవ హృదయ కాఠిన్యమును ప్రేమపూర్ణముగా పరిణమింప జేయుచున్నవి. ఆ మూర్తియొక్క శరీర లావణ్య కిరణములు తమోవిలీనమగు సర్వ జగత్తున హృద్యమగు నొక యపూర్వ కాంతిని ప్రసరింపజేయుచున్నవి, ఆ మూర్తి ముఖమున వెడలు ప్రతి వాక్యమునందును సర్వ ప్రపంచమునున్న తాదర్శ సంకలిత మొనరించు విజ్ఞాన దీపిక గలదు. మనమిప్పుడు వర్ణించిన మూర్తియందలి ముఖమును శరీరమును ప్రత్యేకముగాఁ దీసికొనినచో వానిలో నేదియు కఠోరమగు కాల ప్రతాడనమునకు వశముగానిది లేదు. కాని యా ముఖమునుండి వెడలు ప్రేమావలోకనములు విజ్ఞాన భరితములగు వాక్యములు, ఆ శరీరమునందలి లావణ్య కిరణములు విశ్వ సమ్మతములగు ధర్మోద్భవములు గావున వానిని స్పృశించుటకు కాలమునకుగల సామర్థ్యము చాలదు. ఎప్పుడవి యశ్వరములో యప్పుడే యవి సత్యస్వభావ సంకలితములు. ఇట్టి కర్మలను వర్ణించి వాని నాశ్రయించియున్న వ్యక్తులను భగవత్సృష్టియందు మారణ కర్మకు వశములైనను తన సృష్టియందు కవిత్వము స్థిరస్థాపిత మొనరించుచున్నది. నశ్వరమూ ననశ్వరమును, అనశ్వరమును సర్వలోక రమణీయము నొనరించు కవితా శక్తి యద్భుతము!

* * * *

ఉన్నత కవిత్వమున కంతమెన్నఁడు లేదు. కవిత్వమునందంతర్భూతమైన సత్యము ప్రతియుగమున నొక నూతన శోభను వహించుచుండును. ఆచ్ఛాదనముల తరువాత ఆచ్ఛాదనముల విడఁదీయు చున్నను ఆ సత్యమునందంతర్గతమై నగ్న సౌందర్యము బహిర్గతము కానేరదు, ఉన్నత కావ్యము జ్ఞానానందముల స్రవింప జేయు నమృత సరస్సు స్వర్గీయమగు నాయమృత సరస్సు సర్వయుగములతో సంబంధము గలిగి విరాజిల్లును. ఒక యుగము తన ప్రత్యేక వాసనలతో దానియందలి మాధుర్యము ననుభ

వించును. వెంటనే యింకొక యుగము తననిసర్గచ్ఛాయ లతో దానియందలి రసమును గ్రోలును. ఇవ్విధముననభావితము ననపూర్వమునైన యానంద ఘనకది జన్మస్థానమగుచున్నది.

కవిత్వము మానవప్రకృతి నధిగమించుచు తావాకందని యొక దైవిక విధానము నవలంబించును. కారణ పర్యవసానముల నూహించు సంగతి భావిసంతతుల యధీనము గావింపఁబడును. సుందరమగు నొక పదార్థము గలదు. ఆపదార్థము చుట్టునొక రమణీయమగు నావరణము కలదు. రసపిపాసగల ప్రతిమానవ హృదయ మా యావరణమును. ఛేదించుకొని పోయి యాసుందర పదార్థమును స్వీకరింపఁ గోరుట సహజము. సత్యమునకు కవిత్వముఁ గల్పించు నావరణమునకు మాత్రమొక ప్రత్యేకమైన యాకర్షణశక్తి గలదు. కవిత్వ కల్పితమగు నీయావరణ సౌందర్యమునందే రసాన్వేషకుల హృదయములు లీనమై పోవును. ఇంతయే గాక భిన్నమానవుల యందలి భిన్నభావ నాశక్తులకు భిన్న స్వరూపములతో నీ యావరణము పొడఁగట్టు చుండును. కవిత్వము యొక్క నవనవానంద సౌభాగ్య మిచ్చుటనే కలదు.

కవిత్వము యొక్క యనశ్వర స్వభావము, ఔన్నత్య ము కవిచే పోషింపఁబడును. మానవ ప్రకృతి యందలి స్థిరస్థాయినిగల ధర్మములమల విషయములుగా గ్రహింప వలయును. నిర్మితమగు కావ్యము సర్వయుగములతోనే దేనొక సంబంధముఁ గలిగి యుండవలయును. ఇంతయేల, కవియొక్క యాదర్శము లౌన్నత్యమునుండి యెప్పుడు నధఃపతితములు కాఁగూడదు. అతని భావనాశక్తి యపూర్వ రామణీయకమును సృష్టించి యందు తన యున్నతాదర్శముల గుప్త మొనరించు నంతటిప్రతిష్ఠతఁ గలిగియుండ వలయును.

* * * *

కవిత్వాదర్శము లున్నతములై యుండవల మనము పైన నుడివి యుంటిమి. ఆ యున్నతాద లెట్టివై యుండవలయుననుసమస్య యొకటి కలదు. అనేకులనేక విధముల నీ సమస్యను విష్ణ యున్నారు. మన దృష్టికి సమంజసమైన యొక మును గ్రహించెదముగాక.

కవిత్వాదర్శములు సౌందర్యశోభితములై త్వము హృదయంగమ మగును. కాని కేవల సౌంద కవిత్వము యొక్క యవధియైనచో కవిత్వమున పావనత్వము ఉన్నత స్థానమదృశ్యమగును. ఇదిగా లము సౌందర్యమునే పరమార్థముగా గల కవిత్వ డు మానవ లోకమునందు గొప్ప సంక్షోభము గ గలదు. కావున యీ సౌందర్యముతో నింకొక ఉ ర్యగుణము సంకలితమై కవిత్వమున కొక సమ్య వధి నిర్ణయింపవలయును. మన భరత వర్షమున ధించిన యున్నత సాహిత్యాదర్శముల విమర్శించిన సహితమైన సౌందర్యము కవిత్వమునకు మాన సంధాయకమగు పరమావధి నేర్పరచునని తే మానవ కల్యాణమే యన్నికళల యొక్క యా యున్న యెడల వానియునికి ప్రయోజనవంతము పఁబడును. ఏతి యుక్తముగానిచో కేవల సౌంద మానవుల నధఃపతనము నుండి తప్పించి యా లంభిపఁజేయు సామర్థ్యములేదు. సౌందర్యము వాకర్షమగు నొక సుకుమార శక్తి. తన్మూలము ప్రకాశమును విశ్వమున ప్రసరింపఁజేసి సర్వ క నతి సులభముగా నిర్మూలింప వచ్చును. ఈ సౌలభ్యముతోనే శాస్త్రములు నింకయే వైజ్ఞానిక ములు నిర్వహింప లేవు కావున సమాజముగా యుక్తమగు కవిత్వమునకు నైతిక లక్ష్యము నిక కవిత్వము నిరుపమానమగు వైజ్ఞానిక సాధన

# పరిణయ విభ్రాంతి

## తాతా కృష్ణమూర్తి

ఏ మహోన్నత పర్వత భూమియందొ
జాలువారిన యీనదీ స్వచ్ఛశీత
జీవనకణమ్ము లొండొంటి జేరి, తుళ్లి,
అలలగుచుపొంగి, వెల్లువై స్రవింప
సఫలతంగన్న పావన సైకతముల
విరుల, మొగ్గల, నాకుల వెదకికొనుచు
వేకువను నాలుగోఝాము వేళలందు
ప్రతిదినముపోవు నాయలవాటునెరిగి
వచ్చెనాయేమి, యీమె యీవైపునేడు
రేయియొడిలోన హాయి నిద్రించుబాల
భాను డెత్తగలేదింక పసిడిమోము
ఆవిశాలనదీ హృదయానదాగు
కమ్మతెమ్మెర విహరింప కదలలేదు
ఎక్కడనొనింగిగల వేగుజుక్క వెలుగు
దారిజూపింప, సరి, తెల్లవారి, నంచు
అతివ లెవరుసురాని యేకాంతవేళ
ఏలయొక్కర్తె బిందెతో నీమెవచ్చు?
ఏల ననుగాంచునంత లజ్జించుజూపు?...
ఎపుడు తనబిందె నిండెనో మెరుకలేని
మైమరపుగమ్మ నెవ్వని మహిమజేసె?...

నాయెడల ప్రేమచేసనని నమ్మజాల
నదికి యేమారుమూలనో నాకుటీర
మేనుదిరిగెడిచోట్లీమె కెట్లుతెలియు?
ఊరిచెరువులలో మంచి నీరులేదో,
ఇంటిపని వేకువనె మొదలిడగవలెనో,
ఊరనెచ్చెలు లెవ్వరులేరో, యేమొ—
దినదినము వేకువను నదీతీరమునకు
నాకొరకెవచ్చునని యెట్లు నమ్మగలను?

* * * *

నేను నడిరేయి నాకుటీరాననొంటి
మినుకుదీపమ్ము వెలుగున మెల్లమెల్ల
నెందరో తొల్లివ్రాసిన గ్రంథమందు
రక్తవర్ణాక్షరముల పత్రముల నెల్ల
నొక్కటొక్కటిగా ద్రిప్పుచున్న వేళ,
సంతతమ్మును శోకంపు స్వరముతోడ
పారునదిలోని కెరటాల పాటగలసి,
పచ్చనాకుల శయనించు పవను లేపి,
గాఢతమనమ్ము మూసిన కాళరాత్రి
గర్భమును చీల్చివచ్చి, యేకాంతవేళ
స్పష్టమై, తీక్ష్ణమై, వినబడె విశాల
విశ్వమె చలింపజేసెడు విరహగీతి
ఎవరిదా గొంతు? ఆమెదా? ఏలపాడు?

నా యెడల ప్రేమచేసనని నమ్మజాల—
కాదు; ఆకంఠమామెది కాదు, నిజము.
అబల సుకుమారి యింతటి యర్థరాత్రి

ఒక్క తేయు మేలుకొనియుండ నోర్చునెట్లు?
ఆశ నెగయించు ప్రేమ సందేశమామె
నా కొరకె పంపెననియెట్లు నమ్మగలను?

* * * *

ఇది వినీలాంబరమ్మున నెగురుచున్న
మొయిలుతుదితునక బంగరుపూతమెరుగు,
గెంజిగిని, గోలుపోయిన సంజవేళ.
చీకటులు ముట్టడించిన నాకుటీర
మందు తృణశయ్యపై రోగినై పరుండి.
తాపమునకృశియించి, నిద్రయును లేక
పెదవులదహించుతృష్ణచే వేగుచున్న
సమయమున, నెవ్వరీమె నా శయ్యచెం
మృదులకరముల నాదు నెమ్మేను నిమిరి
అమృత హిమశీతలములైన యంబువుల
గొంతుతడియార వోసె తనంతవచ్చి
ఆమెయే!! ఏలయిచ్చటి కరుగుదెంచె!

నాయెడల ప్రేమచేసనని నమ్మజాల—
సలిలమింటికి గొంపోవు సమయమందు
చిమ్మచీకట్ల శూన్య గృహమ్మునుండి
యేదొనిట్టూర్పువినబడ, నెవరిదొయని
జాలిగొనివచ్చియుండు కాబోలు; కాని
నన్ను ప్రేమించియేయని నమ్మజాల.

## ప్రేమ ప్రభావము

ఒద్దిరాజు సీతారామచంద్రరావు

అతఁడు నిష్ఠురభావుఁడట్లైనగాని
కనుల కొకయింతయైనను గానఁబడదు,
అతని కటువాక్యములు మధురాతి మధుర
దివ్యఫలములకంటెను తీపిఁ గొల్పు,
అతని రోషకషాయ చండాక్షియుగము
ముగ్ధమా నామనంబును మోహపెట్టు.
అతని ముఖచంద్రదర్శనమయ్యొనేని
దుఃఖములు స్మృతినుండియు దొలఁగిపోవు,
అతని నిత్య తిరస్కారమగునునాత్మ
తృప్తికరణసుధారసప్రాప్తియట్లు
అతని బొమముడిపాటున కగును దివ్య
సౌఖ్యసామ్రాజ్యమెల్ల హస్తంగతంబు
లైనయట్లు, లనారతమతఁడు గొల్పు
భ్రాంతి ముదదాయకంబయి బఱగు నాకు
హృదయమాతని పైయుండి యేల యిట్లు
త్రిప్పినను తిరుగకున్నదో, తెలియఁబడదు!



# వితంతువు

గుడిపాటి వేంకటచలము

చలికాలం. యీవూళ్లో ఉదేమోగాని చలియెక్కువ. మంగమ్మ నాకాలువ కప్పుకుని హాయిగా నిద్రపోతోందనుకుంటా. పడుకుంటే చలి, నిద్ర రాదు. యీ వెచ్చని పొయ్యిదగ్గర కూచుంటే, చలిమరచి పోవొచ్చు. అయితే యింకా నేల ఆరలేదు. కింద తడి. యింకా యెక్కడో చలిదేశాలుంటాయట, అక్కడెట్లా వుంటుందో!.....చిన్నప్పుడు నాన్న సిండరిల్లాకథ చెప్పేవాడు. అట్లావున్నా నేను. అయితే సిండరిల్లా చిన్నపిల్ల. నాన్న బతికున్నప్పుడు యీఅర్ధ రాత్రి, యీపొయిదగ్గర వొంటరిగా నన్ను చూస్తే.....నాన్న యేమన్నడన్నా నేనిట్లా అనాధనై పోతా ననుకునివుంటాడా? వొళ్లో కూచోపెట్టుకుని నాతలమువ్వుతో, చంపలు తాకుతో, "మాఅమ్మ అంత అందమయింది లేదు. కిందకాలుపెట్టనని మొగణ్ణి తీసుకొస్తా" అనేవాడు. అప్పుడు యీ వెంకట్రాడు గారు వాళ్లూ నన్ను వొళ్లల్లో కూచోపెట్టుకుని, మిఠాయి పొట్లాలిచ్చి, నానోట్లోంచి చిన్నపాట వొస్తేచాలు, అహాహా అని ఒకటే అనందించేవాళ్లు. పదేండ్లుకాలేదు యింకా మొన్న-అన్నయ్యతో మాట్లాడుతూ, మొహంతిప్పేశాడు నన్నుచూచి...అదుగో పిల్లలేచి యేడుస్తోంది. మంగమ్మ లేదు!. నేనైతే అట్లా యేడవనిస్తానా? పొద్దస్తమానం యేడ్పిస్తుంది. పిల్లని ప్రేమలేక పోలేదు......అదుగో లేచింది మంగమ్మ...పిల్లని కొట్టింది...యేడుస్తోంది పిల్ల. పిల్లల్ని కొట్టడానికి వీళ్లకి చేతులెట్లావొస్తాయో, సాయంత్రము మేగా అట్లాయేడ్పిస్తుంది? అనోటితో నేనా యీకట్లన్న......నాకే బిడ్డవుంటేనా, తెల్లార్లూ, నాచేతుల్లో యెత్తుకుని వూయిస్తో, ఒక్కనిమిషం కెప్పవాల్చకపోలపాడతా. యిట్లా చేతుల్లోనున్నని మెత్తని వెచ్చని అబ్బాయిని పట్టుకుని రొమ్మునకద్దుకుంటే యెంత బాగుంటుంది...యిప్పుడే మనోవేదనతో నిద్రరానివ్వం లేదుగాని, అప్పుడా పరమానందంలో రాదూ?...అదుగో పోలీసువాళ్లు గావును. ఆయీాలలు! యీవీధికే వొస్తున్నారు... వీళ్లేట కన్నాలువేయించేది! యెందుకో వూరికే అట్లా వుంటారు? దొంగలు భయపడ్డానికేమో?...మంగమ్మకి పిల్లవుంది; కొట్టేమంగమ్మకి, చీదరించుకునే మంగమ్మకి! ఆపిల్ల యేడుస్తో నేవుంది. యేం పిల్లకి పాలివ్వాలని వుండదూ! ఆచిన్న తడుములాడువునే నోటికి?

పిల్లగావును! ఉష్షో...నాకు పిల్లలుండక్కూడదూ? ఆయన బతికి వుంటే నాకూ యీ పాటికి ముగ్గురు నలుగురు పిల్లలుండేవాళ్లే. నేను గొడ్రాల్నయ్యేదాన్ని కాను. బిడ్డల సంగతి తలుచుకుంటేనే, నా కడుపులో యెట్లా కలియబెట్టినట్టుంటుందే, నాకు పిల్లలుండక పొయ్యే వాళ్లా! చీదరించుకునే యిట్లాంటి వాళ్లకే వుండగా లేంది. మొన్న పాప జుట్టు పీకితే "యెందుకు పుట్టావురా, వెధవా!" అంది మంగమ్మ: యింకోసారి "చచ్చావన్నా కావు, పీడవొదిలిపోను" నంది. నా జుట్టు అట్లాంటి చిన్న చేతుల్తో ప్రతి వెంటికా నెత్తురు కారేట్టు పీకించుకుంటా. ఆ మంగలాడు గొరిగేసంకంటె నయంకదూ!......నా వెంటికల్లూ తీసేయిస్తారుట! తీసెయ్యనీ, చీదర వొదుల్తా

తుంది. వుండిరియేవరికని? గోరిగేప్పుడు మంట పుడతుంది గావున! మరి, మొగాళ్లు యూడవరే? మంటవుండను. కాని గోరిగీడం తలుచుకుంటే యిప్పుడే భయంపుడు తోంది. భయమే కాదు......గోరిగేప్పుడు మంగలాడు మెడమీద చెయ్యేస్తాడు గావును. మొన్న అన్నయ్య కేశాడు. వొళ్లు ఝల్లుమనదూ? పెళ్లిలో తాళికట్టేప్పుడు ఆయన చిటికినవేలు తగిలేప్పటికే వొళ్లు పులకరించింది, మీద చన్నీళ్లు పోసుకున్నట్టు... మొన్న లక్ష్మీకాంతం తాళంచవులిస్తో, అజాగ్రత్తగా, అతని వేళ్లు నా చేతికి తాకనిచ్చేప్పటికి, అన్నయ్య కళ్లెర్రచేశాడు. అది వరకు నేనేమీ అనుకోలా. కాని అన్నయ్య పడేఅనుమానాన్ని చూసి, నాకు లక్ష్మీకాంతమంటే సరదా పుట్టింది...... నన్ను తన యింటిలో పెట్టుకున్న కాలాగ్గి మళ్లే చూస్తా డనుకుంటా, అన్నయ్య లక్ష్మీకాంతాన్ని చూసి కళ్లెర్ర చేశాడుగాని, మంగలాడు నా మెడమీద చెయ్యేస్తేయా మంటాడో అన్నయ్య!............యీ పిల్లి బాగా మరిగింది పాలుతాగడం! యీ వాళ అందటంలేదు. గోలపడతోంది. ఆకలి దానికి పాపం. నాకు మళ్లేనే నిద్రపట్టదు...పోని, యెలికల్ని పట్టరాదూ?........

నాకాలువ కప్పుకొని మంగమ్మ నిద్రపోతున్న ట్లుంది మళ్లీ. ఆయనే బతికివుంటే, నన్నిట్లాపాయి దగ్గర కూచోనిచ్చేవాడా? చిన్నవాడే! యెట్లా ఆరోగం వొచ్చిందో, ఒకవేళ ఒక్కబిడ్డకూడా వుండేదేమో! ఆయన కళ్లు బావుండేవి. అవే వొచ్చేవి అబ్బాయికి నాచిన్న. యెర్రని నోరు వొచ్చేది. యెంత బావుండే వాడని! అప్పుడు యీ వొదిన యేమన్నా లెఖ చేసే దాన్నా! మానాన్నయిచ్చిన కాలువ లాక్కుని మంగమ్మ కియ్యనిచ్చేదాన్నా? అబ్బాయికి కావాలనేదాన్ని! యిప్పుడు తెల్లారకట్టే లేచి మంగమ్మ కొడుక్కి వేణ్ణీలు కాచా లంటే, యెంతో కష్టంగా వుంటుంది. అప్పుడు నాబాబుకోసం యెన్ని నీళ్లన్నా సంతోషంతో కాచేదాన్ని కాదూ?

నిద్ర వొస్తోంది కొంచెంగా. పడుకుంటే రాదు మళ్లీ. చలి. .........నాఖర్మంట! ఏదో పాపంచే శాను, పూర్వ జన్మంలో. ఎవరి పిల్లల్నో చంపానను కుంటా. వొచ్చే జన్మంలో నన్నా పిల్లలుం... వొచ్చేజన్మంలో పిల్లలుండడానికి యిప్పుడేం చెయ్య... శాస్త్రుల్లగారి నడగనా? వొదినకి తెలిస్తే యిం... వుందా? పిల్లలుండాలనుకోడం తప్పా? పోని స్వ... లో వుండాలనుకోడం తప్పే? ఆ ముసలి ముత్తైద... యేళ్లది, వున్న కొడుకుని అవుపత్యం చేయించి... చంపుకున్నది. ఆమె వొచ్చి పిల్లలు లేరని యేడ్... దరూ వోదారుస్తారు. పద్దెనిమిదేళ్ల లేవు, నేను ... కోడానికి, ముద్దు చెయ్యడానికి, అనుకోడా... కావాలంటే, యెందుకు తిట్టడం? ‹‹సిగ్గుమాలి... దీన్నింట్లో వుంచకూడదంది వొదిన. బయిటికేవ... యిట్లా రాత్రులాలోచించాలి......మళ్లీ గస్తీ... యీ పోలీసు వాళ్లేట దొంగతనాలు చేయిస్తే... ఒక్క పిల్ల వుంటేచాలు. అడపిల్ల ఐనాసరే. ... వొద్దు, ఆడపిల్ల వొద్దు. నాకు వెధవముండే ... నాకు మళ్లే యిట్లా యేడవాలి...నాకు నిద్రపో... కాని యీ చలిలో యెట్లా నిద్రపడుతుంది! కా... బావుండును, హాయిగా మంగమ్మ కప్పుకుని ... తోంది. నేను మాత్రమెందుకిట్లా బాధపడాలో... మరి చేసుకున్న కర్మం ప్రకారం యిందరు ఆడవా... ఐతే మొగళ్లూ, బిడ్డలూలేకండా యిట్లాంటి బా... చస్తోవుంటే, మొగాళ్ల కొక్కరికీ యిట్లాంటి ... పట్టదేం? పెళ్లాంపోతే పెళ్లాం తయారవుతుంది... దరూ పాపాలుచేసే వారేగా! ఏదో మేము ... చేసేపాపం వొకటుండాలి. వెధవలయ్యే పాపం... యింక పెళ్లిగాని పాపం. మళ్లీ తక్కిన ... చెయ్యరది. హిందూ విధవలే......మొన్న ... గారింటున్నారు, వ్రతాలూ, పూజలూ, ... చెయ్యడంవల్ల, స్వర్గం వొస్తుందట. మరి ఆ స్వర్గ... అందరూ వెధవముండలు కారాదూ? ..

కర్మమెట్లాగైతేనే:। నాకు పిల్లలు కావా... వేళ వెధవనైకూడా, బిడ్డని కనేరాత వుంటా... డను యీ జన్మలో కనిపించే, పుణ్యమో ... పూర్వ జన్మంలో చేశానేమో! అప్పుడు మరి స్వ... యేమంటారు? వొదిన చంపేస్తుంది. అన్నయ్య...

స్తాడు, నాకర్మం ప్రకారం అట్లా రాసివుంది, నేనేంచెయ్యనంటే, వొప్పుకుంటారా! నాకు ఆపెనిమిటికే వివాహం కావాలని, ఆయన చావాలని, నేనిట్లా కావాలని, అన్నీ రాసివున్నా యట! నేను పిల్లని కనాలని రాసివుండకూడదూ? వీళ్లు చూసి వొచ్చారా? యింక నామీద కోపమెందుకు? డబ్బుందని అరోగిష్టి మొగుణ్ణి కట్టడం నాకర్మం, బిడ్డలేకంటే, నన్ను వొద్దనడం వీళ్లకర్మం, యిట్టా ఆడవాళ్లందరూ యేడవడం యీ దేశంకర్మం ......పోనీ, జాలన్నా చూపించరు. యెవరన్నా, వాళ్ల పూర్వజన్మ దుష్కృతం కొద్దీ గుడ్డివాళ్లైతే, కుంటివాళ్లైతే, జాలి పడతారు. నాకు ఆ దుష్కృతం కొద్దీ బిడ్డ పుడితే చూపరు. అట్లారాసి వుండంది నాకుమాత్రం బిడ్డ పుడుతుందా యేం! వెనకనైతేనే జాలిలేదే వీళ్లకి! పోనీ, బిడ్డ మీదనన్నా వుండదుజాలి? మళ్లీ జాలికలవాళ్లే. నాకు మాత్రం చూపరు, యెందుకో......యీ యెలికలునన్నా కూడా కరవ్వగద! ఒకవేళ ఆ కిటికీలోంచి దొంగవొస్తాడేమో! ... ..............................
కర్మం ప్రకారం మొగుడు పోయినాడు. కర్మాన్ని జయించి, నేను ఆ సౌఖ్యం సంపాయిస్తానంటే, వీళ్లకెందుకాకోపం?...వొదిన పుట్టింటి కెళ్లినప్పుడు, అన్నయ్య సుబ్రమణ్యం గారితో అంటున్నాడు, సిగ్గు లేకండా, భార్య లేకండా వొంటరిగా వుండడం చాలా కష్టమని. నాకు కూడా అట్లానే వుందని పైకి అంటే, ఆకాశం ముక్కలై కిందపడ్డట్టు చూస్తారు...చలి యెక్కువౌతోంది. పొయ్యికూడా చల్లపడ్డది...అందరూ అన్నంతింటారు. కొందరికి అన్నం తినకండావుండే కర్మంకాలను. అట్లా కాలిన వాళ్లు, కర్మాని జయించి అన్నం దొరికించుకుని తింటే, యెవరూ యేమీ అనరు. కాని కొందరికి యిట్లా కర్మం కాలుతుంది. యీ బాధ వోర్చుకో వలసిందే గాని, తీర్చుకోకూడదు. ఆ కర్మాన్ని జయించ కూడదు. మృగాలకి యిట్లాంటి కర్మంపట్టదు! ఆవొత్యా, ఆ ఆవునో, కోడినో యెందుకు కాలేదో. మళ్లీ మనుష్య జన్మం గొప్పదిట.

౨

అయిందానికి విచారం లేదు కాని కొంచం భయంగా వుంది. భర్తవుంటే యీ పాటికి మూడోకల్లా వుళ్ళవాలు. యిప్పుడవేవీ! వొదిన చెవిలో అప్పుడు రహస్యంగా అంటే నవ్వి చంపమీద కొట్టింది. ఇప్పుడు చెవికాలినట్లు అదిరిపడుతుంది, యేం భేదం? అప్పుడు ఎప్పుడూ వారి గదే. ఇప్పుడు ఒకసారి జరిగింది. లోపల కదులుతోంది. అప్పుడే తెలుసును గావును నేను అమ్మనని. ఎప్పుడూ నన్ను లోపలలోపల తాకుతూ వుంటుంది. ఆ పెద్ద కళ్లూ, కాకి కాళ్లూ పెద్ద వవుతున్నాయి గావును. నాకు మంగమ్మ కూతురంటి చీకిరకళ్ల పిల్ల పుడుతుందా, ఎప్పుడు ముక్కు కారుకుంటో. మా నాయిన ఎర్రి పెదివెలతో నవ్వితే చాలు. యింక మళ్లీ మొగవాడి మొహం చూస్తానా......నిజంగా పుడతాడు కదూ? ఆ చిన్న లేత గులాబీ గుపెట్లు పట్టుకొని.

చిన్నచిన్న కళ్లు మూసుకుని, పగడంవంటి నోరుతో పాలకి తడుముకొంటో, యియీ అయీ...అమ్మోయ్!...

వీళ్లకెప్పుడో ఒకప్పుడు తెలుస్తుంది. యెన్నాళ్లు దాచగలను యిట్లా. పోయినసెల కూడా బయటకూచుని, నాటకమాడా. వొదిన కొడతుంది. యేమైనసరే, బైట తెలీకూడదంటాను అన్నయ్య. వొదినవెళ్లకొట్ట పంటుంది. అన్నయ్య వొద్దంటాడు. కాని కేకలువేసే వొదినే నయం, ఆ రహస్యంగా వుంచమనడం నాకోసమా! కులం వెలిపడి, నా అనేవాళ్లులేక, నా మొహంమీద వుమ్మివేయించుకొంటో, వొంటరినై, భ్రష్టురాలనయ్యే నాసంగతి ఆఖ్కరలేదు. యేపాపం యెరక్క, నిర్భాగ్యురాలికి నాకుపుట్టే దిక్కుమాలిన నాపిల్ల సంగతీ ఆలోచించడు. యిరుగు పొరుగునా, కచేరిలోనూ, తనచెల్లెలిట్లా చేసిందంటే తన పరువుపోతుందనే దిగులొక్కటే ఆతనికి......మళ్లీ చిన్నప్పుడు అన్నయ్య బళ్లోంచి వొస్తాడని, నాకాఫీ కూడా అతని గ్లాసులోనే పోసి, అంతా అతనికే వేడి చేసి యిచ్చేదాన్ని. లస్కరు చిమ్మి తన బంతితో అన్నయ్య బద్దలు కొడితే, నేనని ఆ నేరం నామీద పెట్టుకుని, దెబ్బలన్నీ నేనే తిన్నాను. ఆ వాళ రాత్రి నా బుజాల మీద చేతులేసి „చెల్లీ, యెప్పుడు మరిచిపోను. ఇంకెప్పుడూ నిన్ను కొట్ట నన్నా"డు. ఆవాళ నాకెంత సంతోషం వొచ్చిందని! యిప్పుడు అన్నయ్య దయగా ఒక్క మాట మాట్లాడడు........నాకు చచ్చిపోయింతరవాత నరకమంటకూడా. నా శరీరాన్నియింత అందంగా చేసి,

రగిలే యీ కోర్కెని నా హృదయంలో సహజంగా పుట్టించి, నాకు పెళ్లిచ్చిన మొగుణ్ణి చంపి, పైగా నన్ను నరకానికి పంపుతాడా దేవుడు? మంగమ్మకి కొడుకు పుట్టినందుకు స్వర్గమా? పిల్లన్ని కొట్టే మంగమ్మకి! లేక లేక కష్టబడి యీ బిడ్డని తెచ్చుకుని కన్నందుకు నరకమా? ఆ దేవుణ్ణి అడగనా? నాటకానికన్నా వెళ్లే సెకండ్రా ప్రతి రాత్రీ అన్నయ్యని తనకి కట్టేసుకునే వొదినకుండదూ నరకం? అంతా అబద్ధం: దేవుడికి లేదు నామీద కోపం. నన్ను భయపెట్టడాని కన్నారు. అట్లా అప్పుడే మా చిన్న నాన్న బొజ్జలోని పాలు యేర్పడుతున్నాయి. దేవుడికే కోపం వుంటే, అబ్బాయి పుడుతాడని ముందే యోచించి ఆ బంగారు బొజ్జ బువ్వతయారు చేస్తాడూ? అంతా అబద్ధం. వీళ్లకి తెలీకపోతే దేవుడికి తెలీదూ, నా బాధ, నా స్వభావం, నా ఆలోచన? నేనే కావలిసినవారు, తన్నే ప్రేమించే వారు, నన్ను బతిమాలి, గోము చేసి, „యెంత కోపం నామీద" అని గడ్డం పట్టి, తనవేపు తిప్పుకునే వారు వుండాలని యెంత మనసు లాగుతుంది? నా మీద ప్రేమలేని వీళ్లకి, జన్మమంతా కల్ల కష్టం పోసి, ముసలిదాన్నై చస్తే, యెవరు సంతోషించను? సో మరి మళ్లే పగలు తొమ్మిదింటి దాకా పట్టె మంచం మీద దొల్లే వొదినకి కాఫీ కాచడం పుణ్యమని యే శాస్త్రాల్లో రాశవుందో?

యిట్లాంటి కోర్కెలు, యింత మంది పిల్లతువులున్నారే, వాళ్లందరికీ వుంటాయా? వాళ్లెవరూ నీ మల్లె గోలపెట్టి వట్టి కనపడరే! వాళ్లు మంచి వాళ్లేమో! నాకొక్క దానికే నేమో యీ దుర్బుద్ధి? కాక, నేమా పైకి యే మెరగనట్టే కనపడతా నముకుంటా? బైటికంద రూ అంతే. లోపల.........యెవరి నన్నా రహస్యంగా అడగనా? అడిగితే, ఛీ, ఛీ, పొమ్మంటారు. నేననూ? అట్లానే తమాషా.

నేనుమాత్రం అందరంత మంచిదాన్ని కానా యేమిటి? రోజా జపంచేస్తాను. వాళ్లబుల్లెమ్మమల్లే తాంబూలాలు వేస్తానా? పసుపులమీద బడుకుంటానా? బ్రాహ్మడికి పం

తీనెల్లా పెట్టుకుంటున్నా. మున్న పొద్దుముత్తా క... కున్నా, నాకుమాత్రం భర్తవుంటే, నేను వం... కాదూ?

నాసంగతి తెలిస్తే వీళ్లూరుకోరు. కా... బైటికి పోసరు. నాబిడ్డని యెవరికో యిప్పించి... మళ్లీ చాకిరీకి తెచ్చుకుంటారు. నేనెక్కడన్నా... బాబుతో సుఖంగాబతుకుతున్నా, వీళ్లు వొ... సూర్యనారాయణ గారి చెల్లెలని నలుగురూ ... వుంటే అన్నయ్య సహించగలడా? కాని నేను... నాబాబుని, నాచిట్టి బంగారాన్ని ... యివ్వను. నాకుతప్ప వాడిమీద యెవ... దయ? మామయ్యాలు అత్తయ్యలు, వీళ్లకేలల... యింకోళ్ల కుంటుందా? నేనివ్వనంను, నేనే పెం... నన్ను వీళ్లేం చేసినాసరే. గోలచేస్తా, యేడ్స్తా... పోతా. కాని నా బాబుని, లేక లేక నా ... వొచ్చిన నాభాగ్యాన్ని పారేసుకోను. నా ... మాట చిరునవ్వొక్కటి చూడకుండా ... నేను స్వంతంగా పాలిచ్చుకుంటా. నాబాబు న... పడితే, యిన్ని కష్టాలూ, వెలీ, తిట్లూ, అన్ని ... అని తెలుసుకుంటే, నన్ను, నా మొహాన్ని ... చేతులు చాచి నావేపు „అమ్మా" అంటే, ... రత్నాలు నవ్వితే, నామీదేఅంత ప్రేమ చూపితే కింకేంకావాలి?...వీళ్లకి నా బిడ్డమీద కూడా ... దుకోస్తుందీ? నేనంటే పోనీఅపరాధం చేశాననుకో... నోరరగని ఆ పసి గుడ్డేంచేసింది? ఒకవేళ నన్ను ... వుణ్ణిచ్చినా, నేనుంటానా? వాడి ముందు న... వగా చూస్తే నేను భరించగలనా? వాణ్ణి తిట్టి, ... చాకిరి చేయించుకుంటే, నేను భరించ గలనా?... డి కన్నా వెళ్లిపోతా. యెక్కడికో... వాణ్ని... అంటేయేమనను? చచ్చిపోయినాడంటా...కా... „నేనేనినాన్న" అంటా.

# మామిళ్లపల్లి శాసనములు

(ఆంధ్ర పరిశోధక సంఘము-హైదరాబాదు)

మహబూబు నగరం జిల్లా, ఆంరాబాదు తాలూకా మామిళ్ల పల్లి గ్రామములో మూడు శిలా శాసనములు గలవు. ఈ మూడు శాసనములకును ప్రతులు వ్రాసి శ్రీయుత కొవ్వూరు భరతయ్యగారు దయతో మాకుఁ బంపియున్నారు. మొదటి శాసనమునకు శ్రీయుత గరికిపాటి లక్ష్మీకాంత శాస్త్రిగారు ఆంధ్రీకరణ మొనర్చి యున్నారు. వానిని క్రిందఁ బ్రకటించుచున్నాము.

### శాసనము ౧.

“శ్రియం పుష్ణాతువో భిక్షు ర్వ్యరాహో మందరోన్నతాం । భువనోత్థ్యంభన స్తంభ శుంభద్దంష్ట్రాంకు రో విభుః ॥౧॥ తీవ్రాంశు వంశ తిలకః కలికాల కర్ణో । గోకర్ణ ఇత్యుద భవద్భువ నైకవీరః । యోమిత్రమండల అపత్రప ఏవ యుద్ధే । ముక్తింగతో నఘునరావ మృధేక దాచిత్ ॥౨॥ ఉదభూదుద యాదిత్యస్తస్య సంధస్సుతః సతః । బోధఖ్యాతిమయీ యస్య మయూఖ వితతిః క్షితౌ ॥౩॥ తస్యధర్మసుతం దేవ ధార్మికత్వం కిముచ్యతే । ప్రాప్తాయుద్ధే మృతేర్యస్యా మిత్రైః పుణ్యాం కుశై రివ ॥౪॥ అధతత్క్రాంతి నక్షత్ర గణప్రగుణ తేజసః । భీమగోకర్ణ భూపాలౌ సూర్యాచంద్రా వివోదితౌ ॥౫॥ నిస్సీమ ప్రేమబంధేన సమాన స్సఖయార్యయోః । ఐకాత్మ్యం మన్యతే లోకా యథాపుర మురద్విషోః । నరేంద్రః సమరోత్ర పూర్ణ భావసమన్వితః ॥౬॥ విళంబి కార్తీకే మాసె విశుద్ధే ద్వాదశీతిథౌ । కుల్యామచల్యాం భీమస్తు తుమ్మటి గ్రామ గోచరాం । చాత ఘోషాగ్రహారస్థ నృహరి ప్రీతయే దదౌ ॥౭॥ మండిగంటి గ్రామభాగం గోకర్ణస్తు వితీర్ణ వాన్ । అనంగుళి ప్రదానియ్యం ద్వయమా చంద్ర తారకం ॥౮॥ స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వసుంధరాం । సంవత్సర సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః ॥౯॥ శ్రీ.శ్రీ.శ్రీ.

తాత్పర్యము. సూర్యవంశ దీపకుడయినట్టియు, కలియుగమందుఁ గర్ణునిఁ బోలినట్టియు “గోకర్ణుఁ”డను భువనైక వీరుఁడు గలఁడు. అతని కుమారుఁడు ఉదయాదిత్యుఁడు. ఉదయాదిత్యునకు బలరామకృష్ణులవలె భీముఁడు, గోకర్ణుఁడనియు నిద్దరుకుమారులుదయించిరి. భీమ నృపుఁడు విళంబిసంవత్సర కార్తికమాసమున శుక్ల పక్షమందు ద్వాదశి తిథినాఁడు తుమ్మటి గ్రామమందున్న స్థిరమగు కాల్వను [కోనేరు] మామిళ్లపల్లి యగ్రహారమందలి “నృహరి” యొక్క ప్రీతి కొఱకర్పించెను; గోకర్ణుఁడు మండిగంటి గ్రామభాగమును దానము చేసెను.

### శాసనము ౨.

స్వస్తిశ్రీః శ్రీమద్భూపార్య విక్రమ శకవర్షంబులు ౩౯ ప్లవంగ సంవత్సర మార్గశీర్ష బ॥ ౬ సోమవారం నాడు పిన్నగుండు పెద్ద సింగరి మహముఁడు. గుండదేవుని చేత శ్రీ నృసింహదేవుండు భూపాలభావివద్ద మామిళ్లపల్లి నల్లబై వృత్తులలోన గుండదేవుని వంశము నందు వర వృత్తిదళ బంధ సహితంబై క్రయముకొని ఆ వృత్తి శ్రీ నృసింహదాసుండు భూపాలభావివద్ద శ్రీ నృసింహ దేవర పూజా నైవేద్యములకు ధారబోసి యిచ్చిన దత్తి.

### శాసనము ౩.

స్వస్తి సమస్త దిగంత పంచమహాశబ్ద మన్దలేశ్వర వీర మాహేశ్వర దుర్వార వీరవీర సూర్యవంశోద్భవకుల తిలక కాశ్యప గోత్ర కరికాలాన్వయనామాది సమస్త ప్రశస్తి సహిత శ్రీమన్మహామండలేశ్వర కందూరి గోకర్ణ దేవ చోడ మహారాజులతో నడిగి తత్పాద పద్మోప జీవుండైన హరిహరదాసుండు బోయదేవ దండ నాయకుండు చంద్రకంటి చింతలకుంట స్థలమునందు మంగళ్లకోమ చేనులో వెరశి ఆహిపుట్ల బీజము బడే వరిపొలమును సమేతు సౌమ్యసంవత్సర పుష్య శు॥ ౯ సోమవారం నాడు ఉత్తరాయణ సంక్రాంతి నాడు ధారబోసి యిచ్చిన దత్తి.

# గ్రంథపరిచయము.

ఈ క్రింది గ్రంథములు కృతజ్ఞతతో నందికొంటిమి.

శ్రీకృష్ణుని దేశసేవ

శ్రీ కృష్ణజీవితమును జాతీయదృష్టితో విమర్శించిన గ్రంధరాజము. ఈగ్రంథరచయిత సుప్రసిద్ధ విదుషీమణి. ఈ గ్రంథమున అన్యమతస్థులు లోకోత్తరపురుషుడగు శ్రీ కృష్ణునిపై జేయు నిందారోపణల ప్రత్యుత్తరము తాత్త్వికదృష్టితో సహేతుకముగా వ్రాయబడినది. శ్రీ బాలగోపాలుని బాలలీలలు, వికారచేష్టలు, సహజముగా లోకోత్తరపురుషుల బాల్యమున కనబడు సహజవికారములే కాని కేవల నీతి రహితకార్యములు కావని యీనుమ అభిప్రాయము. భాషామృదుత్వము, శైలిసౌలభ్యత గ్రంథమునకు నూతనవికాసము గలిగించుచు, మానవస్వభావమును అతిచిత్రముగా విమర్శించుటకు సహాయపడినవి. మొత్తముపైన నిట్టి గ్రంథము వ్రాసి గ్రంథకర్త్రి పురుషులకే కాక స్త్రీలకుకూడ ఆదర్శప్రాయమైన జీవితమును బోధించినది. బ. ద.

ప్రకాశకులు: గ్రంథకర్త్రి గారు, బాలికా పాఠశాలప్రధానోపాధ్యాయిని, అనసపర్తి, వరంగల్ జిల్లా (నైజాం). వెల రు. ౧ ౦ ౦

౨. ఉత్కృష్టతజీవితలక్ష్యము:—అనువాదకులు శ్రీసరిపల్లెవిశ్వనాథ శాస్త్రిగారు బి. ఏ.

ఇది వేదార్థ ప్రకాశికయందలి ప్రథమకుసుమము. యూనివర్సిటి కాలేజి సంస్కృత పండితులగు శ్రీధారేశ్వరుగారి Supreme aim of Life యను నాంగ్ల గ్రంథమున కనువాదము.

3. సంగమేశ్వరతారావళి (౨౨ పద్యములుగలవు) రచయిత శ్రీ భాగవతము సీతారామశర్మగారు. ప్రభుత్వోన్నత పాఠశాల సహాయోపాధ్యాయులు. మెదకు. వెల రు. ౦ ౧ ౦

౪. బ్రహ్మోత్సవము.

ప్రకాశకులు: బ్రహ్మధర్మ ప్రచార[illegible] ధమాల, హైదాబాద.

ఇది పైగ్రంథమాలయొక్క మొదటి[illegible] ఇందుబ్రహ్మసమాజపు విషయములు వి[illegible] గా దెలుపబడినవి.

౫. గురులీల: అనువాదకులు శ్రీవిద్యా[illegible] షణ మల్లాది నాగభూషణముగారు. వెల ౦-[illegible] ప్రకాశకులు గ్రంథకర్తగారు, బ్రాహ్మణ[illegible] రు, గుంటూరుజిల్లా.

ఇది శ్రీశంకరాచార్యులగారి దక్షిణామూర్తి స్తోత్రమున కాంధ్రీకరణము. దీనిలో [illegible] కమునకు తాత్పర్యము, విశేషార్థము, వేదా[illegible] రహస్యము విపులముగా దెలుపబడినవి.

౬. శ్రీరామాచల పూర్ణబోధిని: శ్రీ[illegible] కాసిరామయ్యగారు. హైదాబాదు.

ఇది వేదాంత సంబంధమగు పద్యగద్య [illegible] ధము.

౭. గురునాథేశ్వరశతకము. వెల ౦ [illegible]

౮. అష్టావధానాశుకవిత్వప్రదర్శనము [illegible]

౯. క్షీరపుర శతావధానము ౦ [illegible]

౧౦. గుంటూరుఅవధానములు వెల ౦ [illegible]

౧౧. అష్టావధానాశుకవిత్వ ప్రదర్శనము [illegible]

పై ౫ గ్రంథముల గ్రంథకర్త క్రిస్[illegible] జీఆంధ్రపండితులగు శ్రీ దోమా వేంకటస్వా[illegible] గుప్తగారు.

ప్రకాశకులు: గ్రంధకర్త, మద్రాసు.

దీనికవిత్వము మనోహరముగా నుండు[illegible] వేరుగావ్రాయనక్కరలేదు. వీరాంధ్రదేశ[illegible] ప్రసిద్ధికెక్కిన శతావధానులు.

# సాభిప్రాయవిషయములు

## రజతోత్సవము

శ్రీ కృష్ణదేవరాయల ఆంధ్రభాషా నిలయ రజతోత్సవము ఫిబ్రవరి ౧౬, ౧౭, ౧౮, తేదీల యందు జయప్రదముగా జరిగెను. సుప్రసిద్ధపండితులు వివిధాంధ్ర ప్రాంతములనుండి దయచేసి తమతమ వ్యాసముల జదివి సభాసదుల విజ్ఞానార్జనాభిరక్తిని పెంపొందింప జేసిరి. ఇక్కడి యువకులలో కొందఱిని ప్రోత్సహించి వారితో నుత్తమ వ్యాసములను సిద్ధము జేయించి సభయందు జదువ నేర్పాటు గావించిన చాల ప్రశంసనీయముగ నుండెడిది. ముఖ్యముగా నుత్సవాధ్యక్షులగు బ్రహ్మశ్రీ కావ్యకంఠ గణపతి శాస్త్రులుగారి సంభాషణ సభ్యుల నెక్కువ రంజింపజేసినది. శ్రీ శాస్త్రిలుగారు గొప్ప విద్వాంసులు. తపస్సంపన్నులు. సుమారు నలుబది ఉద్గ్రంథముల సంస్కృత భాషలో వ్రాసినవారు. వారు అధ్యక్షపీఠము నధిష్ఠించి సభాకార్యక్రమమును నడుపుచున్నపుడు ప్రసిద్ధ ఆంగ్లేయ విద్యా విశారదుడగు సామ్యూయల్ జాన్సన్ సభయందున్న ప్రతి వానికి జ్ఞాపకము వచ్చును.

సభ మూడు దినములు జరుపబడెను. మూడవనాడు దురదృష్టవశమున కార్యక్రమము చాల యుండుటచే వందనీయులగు అధ్యక్షులతో నొక తొందరపాటు పని జరిగి సభికులలో కొంతకలవరము పుట్టించెను. సభకు దయచేసిన వక్తలలో నొకరు తమవ్యాసమును చదువుచుండ అధ్యక్షులుగారు వారి వ్యాసమును లాగికొనిరి. ఉపన్యాసకులకు దానివలన బాధకలిగెను. సభ కొంతకాలమునకు ముగిసినను, అధ్యక్షులుగారి తొందరపాటు వలన కలిగినకలవరము మాత్రమెల్లెడల ప్రాకుచున్నది. ప్రతి మనుష్యుని వలన తొందరపాటు జరుగు చుండునను యంశమును జ్ఞప్తియందుంచు కొనిన యెడల నీకలవరమప్పుడే తగ్గిపోవును. రాష్ట్రీయపత్రిక యొకటి శ్రీ శాస్త్రిలుగారి నతికఠినముగా విమర్శించినది. సభ నలంకరించిన సభికులందరు పెండ్లిం టికిదయచేయలేదనియు, వైజ్ఞానికపిపాసను తీర్చుకొన వచ్చినారనియు తలచిన నిట్టి విమర్శనలకవకాశమే చిక్కదు. శ్రీ శాస్త్రులుగారి తొందరపాటు గమనించక వారి యాత్మానుభవమును గౌరవించుటలో మనకెక్కువ గౌరవము కలదు.

## దక్షిణఆఫ్రికా ఒడంబడిక

భారతీయుల దురవస్థను విచారించుటకును మరియు వారికి తగు సౌకర్యముల నేర్పరుచుటకై దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వమువారితో చర్చించుటకును భారత ప్రభుత్వమువారు సర్ హబీబుల్లా నాయకత్వమున కొందఱు హైందవ ప్రభృతులను గడచిన డిసంబరునందు దక్షిణ ఆఫ్రికాకు పంపియుండిరి. గత వత్సరము హైందవుల గుఱించి తలయెత్తిన అసూయా భావము ఈ వత్సర మాదేశమున ఎత్తలేదు. హైందవ రాయబారులు దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారితో సామరస్యముగానే అక్కడి హైందవ సమస్యను విచక్షించి ప్రశంసార్హమగు ఒడంబడికను నెరవేర్చిరి. ఆ యొడంబడిక ప్రకారము హైందవ సమస్య పూర్తిగా పరిష్కరింపబడక పోయినను ఒడంబడిక యందుచేర్చిన యంశములుమాత్రము అక్కడి హైందవులకు చాల లాభకరములైనవే. వలసబోయిన హైందవులపై ఏరియాజ్ రిజర్వేషన్ మరియు ఇమిగ్రేషన్ రిస్ట్రిక్షన్ బిల్లుల

ద్వారా చాల అన్యాయము జరుగుచుత్నింపబడి యుండెను. హబీబుల్లా రాయబారము వలన నా. బిల్లులను శాసన రూపము దాల్పనీయక వర్జింపబడెను. క్రీ. శ. ౧౯౧౪లో జరిగిన గాంధి-స్మట్సు ఒడంబడిక షరతులనందు బెట్టుటకై దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారు ఒప్పుకొనిరి. ఇదివరకు హైందవులు పూర్తిగా పరదేశస్థులుగను, దక్షిణాఫ్రికాతో వీరికెట్టి సంబంధములేదనియును తలంచబడుచుండిరి. ఇప్పుడా స్థితి మారినది. ఇతర జనులతో నుండదగు ప్రభుత్వపు బాధ్యతలు హైందవులతో కూడ నుండవలెనని స్పష్టపఱుపబడినది. ఆయొడంబడిక యందు దక్షిణాఫ్రికా యందుండ నిష్టపడు హైందవులు తమ జీవితమును పాశ్చాత్యుల మాదిరి నడుపవలెననియు, ఆ విధముగ కాని యెడల తాము కోరిన దేశమునకు పంపబడుదురనియు, కొంత ధనము వారి సహాయార్థ మొసంగబడుననియు, మరలువారు ఆఫ్రికాకు రావలెనన్న సహాయముగా నిచ్చిన ధనమును తిరిగి ఇచ్చివేసినయెడల నటుల చేయవచ్చుననియు, కాని మూడు సంవత్సరములు దాటిన యెడల మాత్రము వారి పౌరత్వపు హక్కులంతరించుననియు, అప్పుడు పైన పేర్కొన్న శాసనము వారికి బాధకారి కాదనియు, తీర్మానింపబడినవి. మరియు దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారి[illegible]క విషయమును నవలంబించ నిష్టపడిరి. హైందవ ప్రభుత్వమువారొక ఏజెంటును భారతీయులహక్కుల కాపుదలకై దక్షిణాఫ్రికా యందుంచవలెనని తీర్మానించిరి.

మొత్తము మీద ఒడంబడికయందలి [illegible] విషయములును భారతీయులకు చాలా య[illegible]రముచేయునట్టివి. సామరస్యముగా వ[illegible]సిన హబీబుల్లా రాయబారము నందలి స[illegible]లును, భారతీయులపై కనికరమూన నిష్ట[illegible] దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారును, అను[illegible]లగు రాయబారులపంపినందులకు భారత ప్ర[illegible]త్వమువారును అభినందనీయులు.

## మహాత్మాగారి పర్యటనము

మహాత్మాగాంధిగారు ఒకవత్సరము వి[illegible] త్రిగికొని తిరిగి మొన్నటి కాంగ్రెసునుండి దే[illegible] నందెల్లడల పర్యటనము గావించుచు ఖ[illegible] ధారణము, అస్పృశ్యతా నివారణము గు[illegible] ప్రయాసపడుచున్నారు. గత మాసము [illegible] వ తేదీ నాడు మన రాష్ట్రమునందలి గు[illegible] నగరమునకు దయచేసి ఖద్దరును స్వయమ[illegible] నమ్మి స్వదేశపరిశ్రమను వృద్ధిజేయుటకై [illegible] లకుపదేశముగావించి వెళ్ళిరి. స్వరాజ్య[illegible] దగు నీ రాష్ట్రమునందు లోకులను స్వదే[illegible] నందు సిద్ధమగు ఖద్దరు ధరించుటకై ప్రో[illegible] హపరుచుటకు స్వదేశస్థులు పర్యటనములు గా[illegible] చుట చాలఅవసరము. దీని వలన నీపురా[illegible] పరిశ్రమ పునరుద్ధరింపబడును. ఉండవ లా[illegible] జాతీయ ధనము (National wealth) [illegible] పొందును. దేశక్షేమమును కోరువారు [illegible] శీయపరిశ్రమతో సానుభూతిచూపుచు [illegible] వృద్ధికై పాటుపడగలరని విశ్వసించుచున్నా[illegible]

# విషయసూచిక



## చిత్రములు.

# సంవత్సరాది

శ్రీ శేషాద్రి రమణ కవులు

తే. గీ. జాతియందు విలీనమై చాటుపడిన
భవ్యతరమైన జాతీయ భావములను
నెలమి పునరుద్ధరింపఁగా నేఁగుదెంచు
పరిభవసంవత్సరంబ, సుస్వాగతంబు.

సీ. లలితరసాలపల్లవపాళితో విచ్చెఁ
దనివారఁగా సుమవనచయంబు
పరిశుద్ధవేణికాపటలిలోఁ బాద్యంబు
పచరించె జీవస్రవంతిరాజి
కోకిలమ్ముగ్గుతోఁ, గొసరిగానము జేసె
నవసంబెటేఁగి వనాంతలక్ష్మి
తావిపూవులతోడ సేవలు గావించి
భూషించె నిఖిల శిఖిపటలి

తే. గీ. ప్రకృతి తనయంత నూతన పరిభవమైన
వసుసంతతితోడ సుస్వాగతంబు
నీకునర్పించుచుండెఁ; నీనిరుపమాన
భాగ్యమేమందుఁ బరిభవసంవత్సరంబ.

ఉ. గీతలలో మహామహుఁడు కృష్ణుఁడు దెల్పిన కర్మయోగ వి
ఖ్యాతియుఁ దేటగాఁ ద్రిపిటకంబుల బుద్ధుఁడు దెల్పు ధర్మసం
జాతము విస్మరించి యనిశంబు పరాభవదూయమానమా
జాతి, మహాభ్యుదయ పరిభవసంపద గాంచుతనీ శతంబునన్.

సీ. కుసుమపరిభవగంధగుంభనంబుల చేత
నానందమొసఁగు వృక్షాదికంబు
పల్లవపరిభవసద్వర్ణ రీచయముచేఁ
దనివిచేకూర్చు లతాకులంబు
మల్లికాప్రభవసన్మకరందరసముచేఁ
గైపెక్కిపాడు భృంగవ్రజంబు
కింశుకప్రభనై కకీలాలరుచులచే
నుజ్జ్వలత్తరములౌ నుపవనములు
తే. గీ. జనుల హృదయంబులందుఁ బ్రచ్ఛన్నమైన
నవనవోత్సాహశక్తుల నవఘళింపఁ
బ్రజలమనముల నానంద పఱుపవచ్చు
ప్రభవ వత్సరమా! నీకు స్వాగతంబు.

చం. అరిగెను బూర్వమెన్నో ప్రభవాబ్దము లాంధ్రులు భోగభాగ్యవి
స్ఫురితపరాక్రమార్జిత యశోధనులై చెలువొందువేళ, వి
స్తరితరిపూర్వవైభవకథాస్మరణోత్సుకమైనఁ గూర్చి నీ
విరుగుట ధర్మమమ్మ! ప్రభవాబ్దమ! వచ్చినదాని కి[illegible].

సీ. కంకాలశేషులై కనుపుకూటికి నేఁడు
మనుజుల మేనులు మాంసగింప
బంగిరుబయలులై పాడునాఁగ [illegible]
కముల్లెల్ల వారిపూర్ణముగ నలరఁ
జనకీయయాంధ్రుల చిత్తవృత్తుల మాత్ర
నోత్సాహశక్తి తలుకొత్తుచుండ
పునరభ్యుదయవాంఛ భువనమోహనముగా
బ్రజలభావములందుఁ బల్లవింప
తే. గీ. నాంధ్రజాతీయనిజ దోహదంబు లొసఁగి
యాంధ్రవీథుల యభ్యుదయంబు లరసి
చిరశుభముగూర్చి మమ్ముఁ గటాక్షింపు మమ్మ
వైభవాలంబ, ప్రభవసంవత్సరంబ!

# సుజాత

హైదరాబాదు ఏప్రిల్ ౧౯౨౭

సంపుటము ౧ | ప్రభవ సంవత్సర చైత్రము | సంఖ్య ౪

## వేమనయోగి

శేషాద్రి రమణ కవులు

ఉ. కత్తిని గేలఁ దాల్చి రిపుకాంతుల నందఱ వ్రక్కలించి రే
కెత్తిన బీరమొప్పఁగ జయింప సమర్థుఁడవైన రెడ్డి రా
వుత్తముఁడవయ్యు నేటి కయయో మతిమాలి విరాగమూర్తివై
సత్తునుజిత్తునెంచుటకుఁ జాలితొ వేమనయోగి సత్తమా.

చ. సడలిన క్షాత్రసంపదను శౌర్యముచేఁ బునరుద్ధరించి, వే
రడఁగిన యాంధ్రవిక్రమము నన్నివిధంబుల వన్నెబెట్టుటో,
మడియుటొ రాజధర్మ మిదిమాని విరాగము నీవుచెందుటన్
గడకొని యస్వతంత్రగతి కల్గెను జాతికి యోగిభూషణా.

ఉ. జారిన సామరస్యమున జాతి కృశించెడి వేళఁ బుట్టి, దు
ర్వారిచమూసమూహముల వ్రచ్చుటొ చచ్చుటొ మాని మాధురీ
ధారల చేతకొప్పు కవితావిభవంబు విరాగయోగభాం
ఢారమునందుఁ జేర్చఁ జనునా? మహిమోన్నత రెడ్డిరత్నమా.

ఉ. నీ నిరవద్యనవ్యరమణీయకవిత్వము నిక్కువంబుగాఁ
దేనియ సోనయేయగును దేశహితంబు తలంచి నీదు వి
జ్ఞానము క్షాత్రసంపదకు సాటిన నాంధ్రులఁ జెందునే పరా
ధీనదురంతపాతకవిధిప్రచయంబులు యోగిసత్తమా.

చ. సరసకవిత్వముల్ మహితసంపద క్షాత్రకులాభిజాత్య వి
స్ఫురణ మొసంగి నిన్ను రణశూరుని జేయకపోయె బ్రహ్మ; ని
ర్భరతర మాతృదేశవిభవంబును గోల్పడ నాంధ్రజాతికిఁ
దిరముగఁ దొల్లిటుల్ విధి విధింపఁగ దప్పునె యోగిచందిరా.

ఉ. వంచనజేసి యాంధ్రనరపాలురభాగ్యము లన్యభూపు లా
శించెడివేళఁ బుట్టితివి, జెట్టివి; దిట్టవు కాలకర్మముల్
సంచితపాపముల్ గలసి సన్యసనంబును గూర్చె నీకుఁ బ్రా
ప్తించెను జాతి కంతటికి దీనత పూర్తిగ యోగిభూషణా.

చ.॥ పరులమనస్సులోఁగొను నభంగమనోజ్ఞతరాంధ్రగీతముల్
విరచనజేసి పేర్మి వినిపించితి వెల్లెడ, గర్మయోగి శ్రీ
హరి యుపదేష్టయై విజయునందు బరాక్రమ మెట్లు గూర్చె న
త్తెఱఁగున సోదరాంధ్రులను దిద్దగనేరవె యోగిసింహకా.

ఉ. ఆర్తుల నాదరించెడి దయాళుఁడ వుద్ధతి జూపుచో జగ
త్కర్తనుగూడఁ గాదనెడి గండుమగండవు, పూర్వధర్మ సం
స్కర్తవు; నీకవిత్వమును గౌశలముల్ జిదచిద్వివేచన
స్ఫూర్తికి వీటిబుచ్చితివి శూరతయే యిది కెడ్డిసింహమా.

చ. అనితరమా స్వతంత్రవిభవాతిశయంబున జాతి తన్మయం
బున జెడనేని సన్యసనముల్ బరమార్థము దెల్పఁ గైకొనం
జనుఁ బరదాస్యసంకలితజాతికిఁ దత్త్వము దెల్పు నీదు భా
వనలంతుల్ గ్రహింపఁ గలవారె క్షమింపుమి యోగిసత్తమా.

# గాలిబ్ మహాకవి

గాలిబ్ ఫారసీభాషాకవిత్వము నెక్కువ ప్రేమతో చెప్పుచుండెను. ఫారసీ యందు కవన మల్లుట గౌరవమని అతని తలంపు. అతని మాతృభాష ఉర్దూ యగుటచే కొన్ని రచనలు ఉర్దూలో కూడనున్నవి. మాధుర్యమందును, క్రొత్త క్రొత్త గమనికల యందును అవి అతని ఫారసీ రచనల కేమియు తీసిపోవు. గాలిబ్ పేరు మిర్జా అసదుల్లా. మొదలు ,అసద్, అను సంకేత నామముండెను. ఈనామమునే జర్ఘుర్ యందింకొక కవి పెట్టుకొనియుండెను. ఈవార్తను వినగనే అతడు ,గాలిబ్, అను నామమును స్వీకరించెను. ,అసద్, నామముతో వ్రాసిన కవనముల నావిధముల నేయుండ నిచ్చెను.

మిర్జా తూరాన్ రాజవంశమునకు సంబంధించినవాడు. తూరానీయుల కీర్తిదీపము కయానీయుల ఔన్నత్యానిలముచే మలగి పోయినప్పుడు నాశనమై మిగిలిన వంశము అడవులపాలైపోయెను. క్షాత్రజీవమునందున్న వారి చేతికరవాలముమాత్రము మూలబడలేదు. శౌర్యసాహసములు వారియుదరపోషణ గావించుచుండెను. కొన్ని వత్సరముల పిదప యశస్సు తిరిగి మళ్ళెను. చేతు లందలి పవిత్రఖడ్గము రాజ్యము సంపాదించ గలిగెను. కాని యశస్సు వాయుదేవుని గమనము ననుసరించునది. కొన్ని దినములకు తిరిగది పరుల యింటి కేగెను. ఇతర సమర ఖండ రాజన్యుల వలె ఈవంశమునకు కూడ యింటదాగి యుండుట ప్రాప్తమయ్యె.

మిర్జా తాత యిల్లు వదలి వెళ్లెను. ఢిల్లీలో షాహాలం యేలుచుండెను. షాహాలం రాజ్యము పాలెం వరకే వ్యాపించియుండెను. (షాహాలం మొగలుల రాజ్యము నేలిన తుదిరాజు. ఇతని రాజ్యము పరిమితి పాలెం (ఆయూరు ఢిల్లీకి సుమారు పదిమైళ్ల దూరమునవున్నది.) వరకేయుండెనని ఈక్రింద నిచ్చిన ఫారసీ పద్యమువలన తెలుసు. ("బాదు షాహీయే షాహాలం—అజ్ దిల్లీ తా పాలెం") అందువలన ఎక్కువ గౌరవమున కవకాశము లేకపోయెను. తన పాండిత్యము, వంశ పవిత్రతకు మారు ఏబదిగుఱ్ఱములు, ఖాసాయను పరగణా షాహాలం దర్బారులో పొందెను. షాహాలం రాజ్యము కల్లోలమున కుగురియైనందున ఆయనకి పట్టుకూడ చేతినుండి వీడెను. మిర్జా జనకుడగు అబ్దుల్లాబేగు ఖాన్ లఖ్నో అసఫుద్దౌలా దర్బారులో శరణు జొచ్చెను. అక్కడనుండి నిజాంరాష్ట్రమునకేతెంచి నిజామలీ ఖాన్ బహద్దురు సైన్యమునందు చేరెను. ఇక్కడకూడ చాలదినము లుండలేక స్వగృహోన్ముఖుడయ్యెను. రాజా బఖ్తావరు సింహుని కొలువునందుండి యేదోయుద్ధములో కరవాలమునకు బలి యయ్యెను.

మిర్జా అప్పుడు ఐదు వత్సరముల వాడు. అతని పిన తండ్రి నసీరుల్లాబేగు మహారాష్ట్రుల కొలువునందుండి ఆక్బరాబాదు సూబేదారీ చేయుచుండెను. పాపమాతడే అనాథమౌక్తికమును దగ్గరతీసెను. లఖ్నో ఆంగ్లేయుల వశమైన తర్వాత నసీరుల్లాకు సోంగ్ సోన్ అను జాగీరు జీవితకాలమున కొసంగబడెను.

పినవాయన కూడ మిర్జా దురదృష్టవశమున చాల దినములు జీవించలేదు. అగ్రహారము దిగి ప్రభుత్వము వారు లాగికొనిరి. అదృష్టముతో నెవరు సాముచేయ గలరు? అగచాట్లమంతములో నోలలాడిన మన మిర్జా

తన జీవితమును దారిద్ర్యదశలో గడపవలసి వచ్చెను. వాణియే అతనిని మధ్యమధ్య నోదార్చుచుండెను. ఆర్థిక స్థితి వృద్ధికి వచ్చుట కెన్నియో అవకాశములు వచ్చెను. కాని అన్నియు నిష్ఫలములయ్యెను. ఒకమిత్రుడు హైద్రాబాదు నిజాముపై కొన్ని పద్యములనల్లి పంపుమని బలవంతము చేసెను. మిర్జా అతనికి ప్రత్యుత్తర మీక్రింది విధముగ వ్రాసెను:

„ఐదుసంవత్సరములు నిండనేలేదు, తండ్రిమృత్యువునోట బడెను. తొమ్మిది వర్షములలోనే పినతాయన పరలోకము త్రోవబట్టెను. పినతండ్రిజాగీరు.........కొరకు ఆంగ్లేయప్రభుత్వతో నివేదించుకొంటిని. ఢిల్లీరసిడెంటును, కలకత్తా ప్రభుత్వ కార్యదర్శియు నాతో నేకీభవించిరి, నాసొత్తును నాకుమట్టించుటకై. రెసిడెంటు తన పదవినుండి తొలగింపబడెను. కార్యదర్శి అకాలమృత్యువుకు గురియయ్యెను. కొంత కాలము గడచిన తర్వాత ఢిల్లీరాజు నెలకేబది రూపాయల ఉపకారవేతనము నియ్యసాగెను. ఈ ఉపకారము చేయుచు రెండు సంవత్సరములైన కాలేదు, అతని కుమారుడు చనిపోయెను. అవుధుసర్కారగు వాజిదలీషాహ సంవత్సరమునకై మూడుదల రూప్యముల నొసంగసాగెను. రెండు వత్సరములకంటె నెక్కువ అతడు జీవించలేకపోయెను. జీవించియున్న నేమి, అతని రాజ్యము పరహస్తగత మయ్యెను. ఢిల్లీరాజ్యము నన్నేడు వత్సరములు పోషించి నాశనమైపోయెను. ......తిరిగి నేనుదక్కను ఏలిక దిక్కుమరలినచో, జ్ఞాపకముంచుకొనుము, అతడు మృత్యువు నోటనైన బడును, లేక రాజ్య భ్రష్టుడైననగును. ఈరెండు కూడ సాధవించని యెడల నాప్రయత్నము విఫలమై పోవును. దక్కను రేడు నాకేమి నొసంగక నిర్లక్ష్యముగా నన్ను చూచినచో అతని రాజ్యము మంటిపాలై పోవును. ............"

(ఉర్దూయె మొ అల్లా, పుటగ౮౩.

వైచిత్ర్యము వలన నాతని దురదృష్టము తెల్లమగును.)

ముఖ్యముగా వార్థిక దశయందు నాతని, ఆర్థికస్థితి చాలచెడెను. తనడెబ్బది సంవత్సరమున (క్రీ. శ. ౧౮౬౯ లో) మిర్జా పరమపదించెను. మరణమునకు కొన్ని దినములు పూర్వము యీక్రింద నిచ్చిన పద్యమును రచించి యుండెను. మరణించు వరకును దాని స్మరణ మరువలేదు:

ప్రాణవాయువు మార్గము పట్టుచుండె
బంధువర్గమ! దేవుడే ప్రాపు సుమ్ము.

౨

మిర్జాతన జీవితము నందలి విశేష భాగము దారిద్ర్యమునందు గడపినను పూర్వికుల యుదార స్వభావమును [illegible]లేదు. పూర్వపు గౌరవమును, ఆచారమును అత్యవసర[illegible] కాపాడ యత్నించుచుండెను. గౌరవమునకు లోపము [illegible] భవింపనున్న దానినికాపాడుటకై ఆర్థికలాభమును [illegible] సంసిద్ధుడై యుండెను. క్రీ.శ.౧౮౪౨ లో ఢిల్లీ ప్రభుత్వ [illegible] గ్లేయ కళాశాలయందు పారసీక భాషాధ్యాపకుని [illegible] రమై యుండెను. పలువుర నామములను సూచింప [illegible] మిర్జా నామము కూడ నుండెను. పరీక్షార్థము ఒకరి తర్వాత మరొకరిని పిలువసాగిరి. మిర్జావంతు వచ్చెను. [illegible] పల్లకిపై నియమిత స్థలమున కేగెను! అయింతి [illegible] మునపల్లకి నాపి తన రాకను తత్సంబంధాధికారి [illegible] పెను. మిర్జా తన పూర్వ వైభవమును విచారించి [illegible] కారి స్వయముగా నవతలికి వచ్చి గౌర[illegible] నని తలంచి యుండెను. మిర్జా తనరాకట లోపలికేగ[illegible] అధికారి అవతలికి రాలేదు. కొంతకాలమైనపిదప [illegible] భృత్యునితో నింక వారు రాలేదాయని అధికారి [illegible] రించెను. భృత్యుడు తిరిగి వచ్చి మిర్జాను లోపలి ప్రవేశ[illegible] రమ్మనెనని ప్రశ్నించెను. అధికారి స్వయముగా [illegible] గౌరవించ దయచేయలేదు. ఇక లోపల ప్రవేశ[illegible] టకు నాకేమి కారణము అనినుడివెను. ఈసంగతి భృత్యు[illegible] డు లోపల తెలిపెను. అధికారి యవతలికి వచ్చి „తామ[illegible] దగ్గరికొక రాజన్యునివలె దయచేసిన మేము తప్పక [illegible] తము కొఱకు వచ్చెదము. ఇప్పుడు మీరుద్యోగార్థము [illegible] నారు. మీరుకోరినట్టి గౌరవమునకిట్టి స్థితియందు [illegible] లుకారాదని అనెను. మిర్జా „ప్రభుత్వోద్యోగము [illegible] గౌరవమూ చకమని తలంతును. ఈయుద్యోగము [illegible] నా పెద్దలగొప్ప దనమునకు లోటు తేనొల్లనని ప్రత్యు[illegible] మొసంగెను. అధికారి, మేము నియమబద్ధులము, [illegible] మిర్జా [illegible] లనొల్లక వెడలి పోయెను.

పై యుదాహరణము వలన మిర్జాకెట్టి పూర్వాచార పరాయణత్వముండెనో, 'నవాబీ' పోకడపై నెంతలక్ష్యముండెనో గోచరమగును.

అతడు తన వేషమునకు భాషకువలె ప్రత్యేకత్వ మొసంగి యుండెను. ఢిల్లీలో సహజముగాకనబడనట్టి శిరోవేష్టనము ధరించుచుండెను. విశేషించి కవులసభ వించుకుటుంబసౌఖ్య మాతని ప్రాప్తమునందు లేకుండెను. తనశిష్యులలో సుమారావ్ సింహుడను నొకనిభార్య పరలోకగతురాలయ్యెను. ఈసంగతి మిర్జాకాతడు తెలిపెను. ఈ వార్తను గురించి మిర్జా యీక్రిందివిధముగ వ్రాసెను:

"ఉమరావుసింహుని యవస్థపై జాలియు, నాదశపై నసహ్యమును పుట్టుచున్నవి. పరమాత్మా! రెండుసారులాతనికి తగిలిన శృంఖలములు తెగిపోయినవి, ఇక నాకో, యేబది సంవత్సరముల నుండి కంఠమునందు పాశముపడియున్నది. పాశమూ తెగిపోదు, ప్రాణమూ ఎగిరిపోదు. అతనికి నొక్కిచెప్పుము, పిల్లలను నేను పెంచుకొందునని, తిరిగా కూపమునందు పడకూడదని!"

మిర్జా తన దారిద్ర్యమును, అసహాయతను నవ్వులో చమత్కారములో మరచి పోవుచుండెను. ఆతనికి మధుపానమునందెక్కుడాసక్తి. తనను దర్శించ వచ్చెడివారితో హాస్యముచేయుచు కాలము గడుపుచుండెడి వాడు. ఒకనాడు మోతీలాల్ యను నొకరసికుడు మనకవీశ్వరుని దర్శనార్థము వచ్చెను. సంభాషణమధ్య మిర్జా లాలాతో నీవిధముగ పలికెను. "మధువు నొకనాడైన మరచిపోయినచో నేను కాఫిరుడను (నమ్మకములేనివాడను; మహమ్మదీయేతరుడను). నమాజు నొకసారైనపఠించిన మహమ్మదీయుడను కాను. ఇట్లైనను నాకు తెలియుటలేదు, ప్రభుత్వము నన్ను విప్లవకారులగు మహమ్మదీయులతో నేల కలుపుచున్నదో"

మిర్జా ఒకరాత్రి తనయింటి అంగణములో విశ్రమించుచుండెను. పిండిచల్లినటుల వెన్నెలకాయుచుండెను. చుక్కలు మినుకు మినుకు మనుచుండెను. అతడు ఆకాశమువంక తదేకదృష్టితో తిలకించుచు "ఏపని విచారించి చేయబడదో అది సలక్షణముగా నుండదు. ఈశ్వరుడాకాశముపై తారలను సృష్టించినపుడెవరినికూడ సలహానడుగలేదు. అందువలననే నక్షత్రము లటునిటు చెల్లాచెదరై యున్నవి. వానియందొక వరుసలేదు. అందములేదు," అని వ్యాఖ్యానముచేసెను.

అది రమ్జాన్ నెల. ఒక నవాబు మిర్జాముందు కూర్చొనియుండెను. మిర్జా తాంబూలమును దెమ్మని సేవకునికాజ్ఞాపించెను. అక్కడున్న యొక ఛాందసుడు చూడలేకపోయెను. "మహాత్మా, తాముపవాసమును పాటింపరా?" అని ప్రశ్నించెను. మన మిర్జా చిఱునవ్వుతో "గాలిబ్ సైతానునుమీ" యని ప్రత్యుత్తరమొసగెను.

ఇంకొకనాడొక యతిథిమిర్జాయింటికివచ్చెను. అతని ముందు మిర్జా మధుపాత్రము బెట్టెను. 'నేనిప్పుడు దీనిని వదలినానని, అతిథి సవినయముగా ననెను. "చలికాలములోనైన తమరు స్వీకరించరా?" యని మిర్జా అతనిని గేలి చేసెను.

పై యుదాహరణములన్నిటివలన మిర్జా యెపిక్యూరసు తెగకు సంబంధించినవాడని బోధపడగలదు. అతడీశ్వరారాధకుడైనప్పటికిని మతనియమముల పాటింపనట్టి స్వతంత్రుడు.

3

గాలిబ్ ఉర్దూభాషలో రచించినట్టి గీతములు సుమారు తొమ్మిదివందలపాదములు మాత్రమే. ఐనను ఆతనిపై నున్నంతగౌరవము ఉర్దూకవీశ్వరులలో మరొకనిపై లేదు.

ఆతడు పరమపదించినతర్వాత నెందఱో ఆతని కవిత్వమును విమర్శింప ప్రయత్నించిరి. కాని ఒకడైనను ఆధునికవిమర్శనావిధానము నుపయోగించలేదు. ఆయా విమర్శలు స్తోత్రప్రధాన్యములై యున్నవే కాని కవిహృదయమును, భావమును, ఉద్దేశమును చక్కగా తెలుపలేదు. డాక్టరు బిజనౌరీ 'మొహాసినెకలామె గాలిబ్' అను గ్రంథములో" హిందూస్థానమునందు రెండే ఉన్నతగ్రంథములు కలవు: వేదములు మరియు దీవానెగాలిబ్" అని వ్రాసి విమర్శనానియమములను పూర్తిగ నవమానపరచెను.

గాలిబును లోపరహితునిగాజేసి ఆకాశముపై కూర్చుండ బెట్టెను. గాలిబ్ భావప్రాధాన్యమును గమనించు మహా కవి (Lyrical Poet). ఇట్టివాని కవిత్వమును విమర్శించవలసినచో నాతనిసోదరకవులతో పోల్చవలెను. దాని వలన గాలిబ్ గుణదోషములు బయటపడును. అటులకాక డాక్టరుబిజనోరి తనకు జ్ఞాపకమున్న యోరోపుఖండ కవీశ్వరులను, వేదాంతులను, పండితులను పేర్కొని అందరికంటె నీతడే ఉత్తముడను పర్యవసానము దేల్చెను. గాలిబుయొక్క 'మొహిసిన్' (మిత్రుడని శబ్దార్థము) సహవాసముతో గాలిబుకవిత్వముయొక్క విలక్షణత్వము తేలదు.

హాలీ వ్రాసినవిమర్శనము కొంతవరకు నమ్మదగినది. అతనివిమర్శన మాదర్శప్రాయము కాకపోయినను అతడువ్రాసినది స్తోత్రప్రాధాన్యము కలది కాదు. హాలీ యభిప్రాయానుసారము గాలిబుకవిత్వము 'వినుట కానంద దాయకముగా నుండును', 'తన కవిత్వమునకాధారముత్తమ వస్తువును చేయును.' 'అతడు పోషించు పాత్రలు నవీనములు.' 'కఠిన సమస్యలను సాధారణభాషతో తెలుపు నఖండప్రజ్ఞ' గలదు. 'అతని కాలమునందున్న లోపము లాతని కవిత్వమం దక్కడక్కడ ప్రతిబింబించుచున్నవి'.

ఈరోజులలో ఉర్దూ భాష నభ్యసించిన వారందరును గాలిబ్ నాకర్షించుచున్నాడు. ఒక ఉత్తమ వ్యాఖ్యాన మాతనిహృదయమును విప్పిచూపునట్టిది చాల అవసరమున్నది.

గాలిబ్ కవిత్వమును తెలుపు కొన్ని గీతములీక్రింద ననువదింప బడినవి.

మందమారుత మందలి మార్దవంబు
బడయులేనట్టు లుద్యానవనము లేమి
సౌకుమార్యంబు రక్షింప జగతియందు
కలుషదనమెంతొ యావశ్యకంబుసుమ్ము
* * * *
ఆరయ జలబిందు వొందు సాగరమునందు
లీనమై స్వస్వరూపంబు మాను నటుల
హృదయగత తాప మణచుట కావధంబు
నియతబంధము దాటుటే నిజము సుమ్ము.
* * + *
కారుమబ్బులు వర్షింప గగనతలము
స్వచ్ఛతను జెంది తేలికపడయు నటుల
విరహతాపాగ్ని భరియించి వేదనంబు
ననుభవించి యదృశ్యుడగుదు సుమ్ము.
* * * *
వర్ణ సంయుక్తికీభాగము భాతి నింపబరగు నన్యోన్యరాగ సంబంధమైన
కర్మబద్ధము గాబోలు! గాక నియమ
మార్గమున నెడబాటు సంభవమగు నెట్లు
* * * *
స్వర్గ మన నేమొ తెలిసెను! స్వాంతమునకు
హర్షము దయింప నీభావమవసరంబు
* * * *
అన్ని బాధల దృశ్యంబులయ్యె గాని
యున్నదా కస్మికమరణమొకటి సుమ్ము
* * * *
ప్రణయ మెంతయు, గాలిబు! వ్యర్థపడిన
నట్లు గాకున్న పురుషార్థివౌట నిజము
* * * *
ఎన్ను పూర్వాశ్రుపుల భావమింత దనుక
హృదయ మాశించు దూలుట కొంత యిపుడు
* * * *
కలహమున కొడిగట్టుచే కార్యమెంత
పొందు లేకున్న వ్యసనము పొందకున్న
* * ఐ *
విలయమున కవకాశము గలుగనీక
తల్లుచుండు వియోగంపుతరుణ మెట్లు
* * * *
ఒరులు హృదయపు గాయము నరయు టేల
హస్తముకు దృష్టిదోషంబు నబ్బకున్న

# బాల్యస్వప్నము

కోదాటి రామకృష్ణారావు

జగతియంతయు చంద్రికాచ్ఛాదనమున
హృదయరమ్య రూపమ్ము ధరింప, తార
కలు వియత్తలమందు ప్రకాశమాన
మగుచుగన్పట్ట, సామీప్యమందువృక్ష
పత్రములువీవ మందమావాయువులను,
పడకనుండి గృహోపరిభాగమందు
సాధువిశ్వాసభరమున 'చందమామ
రావె' యనిపిల్చితి ననేకరాత్రులందు.

* * * *

పచ్చికబయళ్ళలోన నంబాయటంచు
తల్లిగోవులవెంటాడు తమినినెగురు
వింతగాల్పెడి గోవత్ససంతతులను,
జిల్లగోనెలనాడు నిశ్చింతహృదయ
గోపబాలకబృందమ్ముఁ గూర్మిఁజూచి
కాలమును సంతసమ్మునఁ గడపియుంటి.

* * * *

తిక్కనకవిత్వధారా ప్రదీప్తమైన
భరతవీరులయుద్ధంబు పారవశ్య
మధురధోరణిఁ జదువ బ్రాహ్మణునభావి
తాభిరుచిననుసరించితి, నాత్మబలము
బాహుదర్పంబుతోఁగూర్చి బహళవీర్య
దృశ్యముల యుద్ధభూమి ముద్రించినట్టి
భీష్మునిప్రతాపమూర్తిని వెడలుశౌర్య
కిరణములు హృదిలోకాంతి గరిమనింపె;
తమ్ములని తెలసియు భృత్యధర్మనియతి
చక్రవర్తిదుర్యోధను సరసనుండి
భువనవేద్యదోర్వీర్య పాండవులతోడ
భండనంబునతన ప్రతాపంబుఁజూప
సమయము లంభించెగాయని సంతసించు
కర్ణునెడ జాలివహియించెఁ గరము మనస్సు;
కదనభీషణధ్వానముల్ కర్ణపుటముఁ
జొరఁబడినయంత నుత్తరాస్తోకసౌఖ్య
దాయకాలింగనముల నిర్దయవిదల్చి
యుద్ధభూమినిఁజొచ్చి సముజ్జ్వలాత్మ
శౌర్యమున కసంఖ్యాకమా శత్రువీర
కాండములనెఱఁజేసి స్వర్గంబుదెసను
ప్రజ్జ్వలితనిస్సహాయ వీరధ్వజంబుఁ

గాని చనినయట్టి యభిమన్యుఁ గూర్మిఁదలచి
భరతభూమినిఁబుట్టిన భాగ్యగరిమ
కెంతయుముదంబుఁ జెందితి హృదయమందు.

* * * *

దేవళమ్ముల నుత్సాహదీపకమ్ము
లైనగంటలుమ్రోయ నయాచితముగ
సంతసము విశ్వాసము స్వాంతమందు
పులకరించెను; విగ్రహమూర్తులందు
తనివిఁదీరఁగ నానంద తరళదృష్టు
లునిచితిచిరంబు; ‘కోర్కుల నొసఁగు దేవ’!
యనుచు సాష్టాంగదండమ్ము లాలయమ్ము
ద్వారముఖమున నిడితి విశ్వాసహృదిని.

* * * *

ప్రాతరానందకర మందవాయువులను
ప్రకృతియంతయుమేల్కొన, పక్షులాత్మ
నిలయములనుండి యవ్యక్తలలితగాన
మధురిమజగమ్ము నింపగా మధురనాథు
బాల్యలీలల హృద్యభూపాళరాగ
మందుబాడెడు బ్రాహ్మణు నధికముదము
తోడ వినియుంటి; కృష్ణుఁడానాడెనాడు
హృదయడోలికలో విహరించియుండె

* * * *

తెల్లమబ్బుల నాకాశ మెల్లనూత్న
దృశ్యరమణీయతవహింప, పృథ్వియంత
సత్త్వదాయకవాయు ప్రచారములకు
వింతజిగిఁదాల్ప, వర్షంబు వెలసినంత
గ్రామసీమాంతమున తటాకములధవళ
రుచిఁగనుంగొని, పరిమళ్ళ నచిరకాల
మాత్మదృష్టి నిగుడ్చి మోదాస్పదంబు
లైన వస్తువులనుగంటి నవనియందు.

* * * *

తొట్టియఁబరుండి ముద్దులఁదూగునట్టిగ

సంచలనకేళిమగ్నుఁడై, చారునేత్ర
ములనుగీలించి యెచటనో తెలియరాని
యొకపదార్థమ్ముపై, తనయునికి యాప్ర
పంచవాసనలంటక పరిఢవిల్ల
కనులపండువొనర్చు బాలుని మొగాన
వెల్గు చిఱునవ్వులందున వెలయునర్థ
మేమియని పలుమాఱు యోచించియుంటి

* * * *

అన్ని సుందరవస్తువు లటుల మనుజ
జీవితాతిమనోజ్ఞ నిశ్చింతమైన
బాల్యము మునింగె కాలప్రవాహమందు!

* * * *

ఏహృదంతర మజ్ఞాత మృదుమనోజ్ఞ
భావములపాలితంబో, యపారవైర
భావసంఘర్షణమునకు తావలమయి
యాహృదంతరమిప్డు చింతావృతంబు!

* * * *

విమలగంగానదీతరంగములతోడ
నాటలాడె నేసీమ హేయంబులైన
మురికికాలువ లిప్పుడా భూమిఁబారు!
సహజసౌందర్యలలిత పుష్పములతోడ
మందమారుతమెచట నమందమైన
జీవితానంద మొసఁగు కేళీవిహార
గతులవిలసిల్లె నాస్థలం బతివిషాద
కర మలీమసవాయు సంకలితమయ్యె!

* * * *

చంద్రికయు నక్షత్రముల్ చంద్రుఁడెవ్వ
హాంగణంబున సంతతాహ్వానగరిమ
నైజసరళంబులును పావనంబులైన
భావములతోడఁబడసె నాభవనమిపుడు
గాఢతమసంబుచేత నాక్రాంతమయ్యె!

# ఇనుగుర్తి

ఒ. సీతారామచంద్రరావు

ఓరుగల్లు జిల్లా, మహబూబాబాదు (మానుకోట) తాలూకాలో చేరిన ఇనుగుర్తి శ్రీ నిజాం ప్రభుత్వమునకు రాజధానియగు హైదరాబాదునకు రమారమి ౧౩౦ మైళ్లు దూరములో తూర్పు దిశయందు గలదు.

ఈ గ్రామమొకప్పుడు పెద్ద యూరుగా నుండెనని కొన్ని దృశ్యములు చాటుచున్నవి. ఇప్పటికి నీయూరంత పెద్దదిగా లేకున్నను, ౭౦౦ గృహ సంఖ్యయు, ౨ వేలకు పైన జనసంఖ్యయు గలిగియున్నది. కావున సాధారణమగు పెద్ద యూరుల యందొక్కటిగా నెంచబడుచున్నది. రాజకీయ ప్రాథమిక పాఠశాలయు, అప్రాభృత (ఖానిగీ) ఆంగ్లేయ వైద్యశాలయు తపాల (టప్పా) కార్యస్థానము, విజ్ఞాన ప్రచారిణీ ముద్రణాలయము, తెనుగు పత్రికా కార్యస్థానము గలవు. దాదాపు (ప్రస్తుతము నిలిచియున్నవి) ముప్పదికి తక్కువ గాని అద్వైత బ్రాహ్మణుల గృహములును, ఎక్కువ సంఖ్య కర్షకుల గృహములును, అయిదారు వైశ్యుల గృహములును, ముప్పది గొల్లల యిండ్లును, తత్తదుచిత సంఖ్యకు తక్కువగాని ముతరాచ, సాలె, చాకల, మంగల, కుమ్మర, వీరముష్టి, వడ్ల, కమ్మర, అగుసల, బలిజె, గొండ్ల గృహములు గలవు. మాలమాదిగ నికేతనము లొకనూటికి తక్కువయుండవు. ప్రభుత్వమునకీ గ్రామమున చెల్లుబడి ౨ వేల వరకు గలదు. ౫ చెరువులు, ౧౦-౧౨ కుంటలు గలవు. పంటలలో వరిపంట ముఖ్యమైనది. తక్కిన పంటలును యథోచితముగ బండును.

ఈ గ్రామముయొక్క చారిత్రక ప్రదేశమని నిర్ధారణ మొనరించుటకు కొన్ని కారణములును, ఆధారములును గలవు. ఈ గ్రామమునందొక సహస్ర స్తంభ మండపముండెనని ప్రతీతి. అది శంభ్వాలయము. ఆ యాలయ గర్భగృహము మాత్ర మిప్పటికిని గలదు. అందు లింగము, సాలంకము గలదు. సాలంకము మాత్రము ప్రాచీనమైనదియే కాని, లింగము మాత్రము సాలంకమునకు దగినది గానుండకుండుటయే గాక కించిద్భిన్నమై కనుపట్టుచున్నది. దానికొక యైతిహ్య మిప్పటికి జెప్పుదురు. పూర్వమొక కర్షకుడు నేల దున్నుచుండగా, లింగము నాగేటి కఱ్ఱునకు దగిలెననియు, ఆ కఱ్ఱు స్వర్ణమై పోయెననియు, ఆ లింగమునే ప్రతిష్ఠించిరనియు నిప్పటికి జెప్పెదరు. ఇప్పటికిని శివార్చకుడు ప్రతి దినము నర్చించి నివేదనమిడుచుండును. కాని ఈ దేవాలయము కాకతీయుల కాలమునందు నిర్మింపబడినట్లు ఈ గ్రామమున గల శాసనమందలి

"శ్లో॥ శాకే వ్యర్కేందు సంఖ్యే౽క్షయశరదిముదా
ఫాల్గునేమాసి సోయం ...
సామ్నా మాతుః పితుశ్చత్రి భువరభవనే
స్వాత్మనశ్చాహ్వయేన
కృత్వా శంభోః ప్రతిష్ఠాం............"

అను శ్లోకము వలన దెలియుచున్నది గాని యవశిష్టమై

యుండి, గర్భాలయముగా వాడుకొనబడుచున్న శివాలయ ద్వార బంధములయందలి విగ్రహముల గాంచినపుడీ యాలయము జైన దేవాలయముగా నుండవచ్చునని తోచును. అయినను "కృత్వా శంభోః ప్రతిష్ఠాం" అనునపుడు శంభుని పతిష్ఠ నొనరించెనని సమర్థింప వచ్చును. పూర్వమిది జైన దేవాలయముగా నుండినను పిమ్మట శంభ్వాలయముగా మార్చి, ఆందు శంభు ప్రతిష్ఠ నొనరించియుండురు. ఆ సమయమందే యీ యాలయమును గర్భాలయముగా నొనర్చి దానికి సంబంధించిన సహస్ర స్తంభ మండపము నిర్మించిన నిర్మించియుండురు. అవశిష్టచిహ్నము లీ సహస్ర స్తంభ మంటపము గలదనుటకు అపరిమిత ప్రదేశము నాక్రమించి యున్న దేవాలయపు మత్తడులు మాత్రమే. గోడలు, స్తంభములు మొదలగు శిలల నన్నింటిని పగల్చి రేమహాత్ముడో ఇనుగుర్తి గ్రామమధ్య నేలకోట (భూమిపైగల కిలా) గట్టించి యున్నాడు. ఆ కోటకు గల రాయియంతయు చిత్రములు చెక్కబడినదే. కాని కాశవాంద్రు నిర్దాక్షిణ్యముతో పగులగొట్టి కోటగట్టియుందురు. అందుచే అనేక చిత్రములు ఖండఖండములుగానైనను పుష్కలములుగా గాన్పించుచున్నవి. అందుచే కోటకు గాన్పించు రాయియంతయు నొకనాటి దేవాలయము రాయియే యని తోచుచున్నది.

ఈ సమయము వరకు నిలిచియున్న గర్భాలయము గ్రామమునకు పశ్చిమ భాగమున నొకఫర్లాంగు దూరమున గలదు. అక్కడినుండి గ్రామమునందలి ముప్పాతిక భాగము వరకక్కడ ద్రవ్వినను గుడి మత్తడిబండలు కాన్పించుచుండును. ఎంతవరకిట్టి గుర్తులు గాన్పించుచున్నవో ఆ గుర్తులకు మధ్య ప్రదేశమని తోచబడు నొక చోట స్నిగ్ధమును అతి విశాలమైన యొక బొడ్డు బండ గలదు. దానిని బట్టి యీ మత్తడుల చాలును బట్టి పూర్వమీ గుడి యొకటియేయని స్పష్టమగుచున్నది.

కోట గోడల క్రింద వాడబడిన రాలలో ప్రాచీనాంధ్ర లిపియందలి కొన్ని శాసన శకలములు గలవు. వానిని జూచునపుడవి యొక శాసనమునకు సంబంధించినవియేయని చెప్ప వలసివచ్చును. ఆ కోటయందే యొక మూల బురుజునకొక శాసనము గోడ రాయిగా వాడబడియుండెను. ఆ బురుజు కాలవశమున కూలిపోవుటచే ఆ శాస

నము బైటబడినది. ఆ శాసనమే ఇప్పుడు మధ్యగల విష్ణ్వాలయము ముందట ప్రాతబడి

ఈ శాసనము ప్రాచీన నాగర చెక్కబడి యున్నది. శాసన శిల సుస్నిగ్ధ బడిన నీలశిలయే కాని ఆందందు కొన్ని పెచ్చు లెగిరిపోయియున్నవి. గజము యెత్తు లుపుగల చతుర్ముఖమగు నీ శిలా శాసనము యొక్క గీర్వాణ భాషా శ్లోకములుగలవు. తీయాన్వాయమును గురించి వర్ణింపబడినది. మున.

"శ్లో॥ ఇహజగతి నతీనామాస్పదం నాతా
క్షితి......................"

అని చెప్పబడియున్నది. "నతవాటి" సీమ మధిర యని వాడబడు ప్రదేశమునకు చరిత్రక మహాశయులు నిర్ణయించి యున్నారు. యందలి శాసనమున నతవాటి సీమా ప్రశంస పూర్వమినుగుర్తి నతవాటి సీమకు జెందియు యని యూహింప వలసి యున్నది. కాని మింతకంటె నేమియు జిక్కుటలేదు.

అరవ శ్లోకమున "ఖ్యాతో, బభూవ.........". అనియును, ఎనిమిదవ "......సుజనైకాశ్రయః శ్రీనివాసో బుద్ధ యనియు చెప్పబడి యున్నది. ప్రభు బేతరాజు నతవాటి విషయాధీశ్వరుడగు బుద్ధ చిన కథ. చరిత్రవలన తెలసిరేయున్నది. శ్లోకము మొదలు కాకతీయ ప్రభు వంశము ప్రథమ రుద్రదేవుని యొక్కయు వర్ణనలు కాకతీయ పరాక్రమాదులను వర్ణించిన పిమ్మట చక్రవర్తి వరకు వర్ణింపబడి పిమ్మట మొదట బడిన "కృత్వా శంభోః ప్రతిష్ఠాం సహా షణ్ణిశ్చింతపల్లీ । గ్రామం ప్రాదాద చితాంగాది భోగప్రవృత్త్యై" అను శ్లోకము యున్నది. దీనిచే ఈ శాసన స్థాపకుడు పతి సార్వభౌముడేయని తోచుచున్నది. బడిన శంభుని అంగరంగ వైభోగముల

యను గ్రామ మగ్రహారముగా నిచ్చియుండురు. ఆ చింత పల్లి పేరీ ప్రాంత గ్రామములలో దేనిపేరును గాదు. పేరుమారి, లేక యూరుమారిపోయిన పోయియుండును.

ఏది యెటుల నయినను యీ దు గణపతి చక్రవర్తి శాసనముండుటచే క్రీ. శ. పదమూడవ శతాబ్దారంభము వర కినుగుర్తి యుండెనని యొప్పుకొనక దప్పదు. ఇంక పై సూక్ష్మదృష్టితో గమనించి నపు డినుగుర్తి ఇంకను ప్రాచీనమైన నగరము, లేక గ్రామమని యొప్పుకొనక దప్పదు. ఏలయనగా గణపతి రాజు గాలముననే జైన మతము కొంత రూపూడబడినట్లు జనశ్రుతి. కొందఱు చరిత్రకారులట్లు వ్రాసియు నున్నారు. అనేక కవుల కాశ్రయమిచ్చి, అనేక ధర్మకార్యముల నాచరించిన గణపతిరాజు కొందఱు చరిత్రాకారులు వ్రాసిన రీతి జైనులను పంటలలో వైచి చంపింపకున్నను జైన మతము నెడలనై మనస్యమైన బూనియుండును. అథవా జైనాలయములయందు శివ ప్రతిష్ఠలనైన చేసియుండును.

ఇనుగుర్తి యందు గణపతి చక్రవర్తి శంభుప్రతిష్ఠ నొనరించినపుడు మాత్రము ప్రాచీన జైనాలయముననే యొనరించెను కాని పూర్వపు టాలయమునకు భంగము గలిగింపలేదు. అందుచే గణపతి చక్రవర్తి శంభు ప్రతిష్ఠ నొనరించుటకు పూర్వమే జైనాలయ ముండుటచే ఇనుగుర్తి అంతకు పూర్వమే కొంత కాలము క్రింద నుండెనని స్పష్టమగుచున్నది.

ఇనుగుర్తియందు సహస్రస్తంభ మండపమున్నంత కాలము కోటగట్టబడలేదని కోటగోడలే చెప్పుచున్నవి. తరువాత కొంత కాలము కాకతీయ సామ్రాజ్యము ధ్వంసమైన . పిమ్మట రేచర్లశింగమనాయనిని జల్లిపల్లి (ఇది మహబూబుఅబాదునకు దక్షిణమున రమారమి ౧౦ ౨ మైళ్ల దూరమున గలదు) యందు దమ్మళి బ్రహ్మజి వృషదే జంపిన పిమ్మట శింగమనాయని తనయులును, జగద్విఖ్యాత శూరులునగు, మాదానాయుడు, దామానాయుడు ఇరువురు. ఇనుగుర్తి కోటయందు ఏకోత్తర శత సంఖ్యగల రాచవారిని జంపి తండ్రికి రక్తాంజలి నొసగినట్లు చరిత్రవలన దెలియుచున్నది. (చిలుకూరు వీరభద్ర రావుగారి అంధ్రుల చరిత్ర, మూడవభాగము, పుట ౨౨, చూడుడు.) అందుచే కాకతీయ సామ్రాజ్యానంతరము రాచవారిచే గుడి గూల్పబడయెనని నిశ్చయముగా జెప్పవచ్చును.

కాకతీయ ప్రభువుల పాలనముక్రింద నున్నపుడినుగుర్తికి పశ్చిమదిక్కున నొకగొప్ప తటాకము ,,గుండి చెరు''వను దాని నెవరో కట్టించిరి. అదియొక వేశ్యాంగన కట్టించెననియు, ఇప్పటి చెరువులో నొక పరుపుబండపై నిలువ బెట్టబడియున్న నాలుగు స్తంభముల పైనగల కప్పురాల కుర్యేల గట్టికొని యుయ్యేల నా వారాంగన యూగుచుండెనని జనులు చెప్పుకొనియెదరు. నిశ్చయమెంత వరకైనను ఇనుగుర్తి యందలి గుండిచెరువునకు ఓరుగల్లు కోటలోని గుండిచెరువునుండి నీరువచ్చుటకును విశాలమగు కాలువ యొకటి కలదు. దాని పేరు ,,రాజుకాలువ'' యందురు. ఈకాలువ ఇప్పటికిని అందందు జాడ కాన్పింపకున్నను విశేష భాగము చక్కగా కాన్పించును.

గుండి చెరువు లోపలి తట్టునగల చిన్న చిన్న గుట్టలలో నొకదానియందు ఒక గుహయందొక విగ్రహము, ఆ విగ్రహమునకొక పార్శ్వముననొక మంగళీ మహాశ్రీ వృత్తమునందు వ్రాయబడిన ప్రాచీనాంధ్ర లిపి శాసనమును గలవు. అశాసన మొక్క శ్లోకము చేతనే ముగింపబడి యున్నది. శిల అసంస్కృతమైనది కావున శ్లోకమంతయు విస్పష్టమగుటలేదు. కాని ,,జలంద భైరవ'' యనియు, ,,ఇనుగుర్తి'' యనియు, మంగళీ మహాశ్రీ'' యనియు, ,,ప్రోలరాజు'' యనియు కొన్ని శబ్దములు మాత్రము గాన వచ్చినవి. దానిచే నీభైరవుడు కాకతీ ప్రోలరాజు కాలమున స్థాపింపబడియెనని తెలియుచున్నది. కావున నినుగుర్తి క్రీ. శ. ౧౨ వ శతాబ్దారంభమునాటికే నిర్మింపబడినటుల తెలియుచున్నది. ,,జలంద'' శబ్దప్రయోగము చేతను, ,,మంగళీమహాశ్రీవృత్త''మును వాడుటచేత నీభైరవుడు వర్షాధిదేవతగా సంకల్పింపబడి పూజింప బడియె నేమో యని యూహింపవచ్చును. దీనిచే ఏచెరువు గర్భమున నీగుట్టగలదో ఆచెరువు ప్రోలరాజు కాలమునాడో, అంతకు పూర్వమో నిర్మింప బడియుండవలయును. కాని స్థానిక చరిత్రలబట్టి తెలియుచున్న విషయము మఱియొకచోట వ్రాయబడి యున్నది. భావివిచారణల వలన నిశ్చయము తెలియగలదు. కాని ఈభైరవుడు స్థా

త్రము కాకతిప్రోలరాజు చేత స్థాపింపబడిరె ననుట మా త్రము యథార్థము.

ఇనుగుర్తి యందొక చిన్న పసుపుబండపై బుద్ధదేవుని విగ్రహము గలదు. దానినిపుడు „బొంగరకోమటి" యని వాడెదరు కాని నిజముగానది ధ్యానబుద్ధ విగ్రహమే. ఈ విగ్రహము గ్రామమునకు పశ్చిమ దిశయందు గర్భాల యమునకు తూర్పున కొలది దూరముననే ప్రాఙ్ముఖము గలదై గలదు. ఈ విగ్రహమునకు దక్షిణమున రమారమి ౧౫౦ గజముల దూరమున పశ్చిమ ముఖము గలదై నిలచి యున్న యొక విగ్రహము గలదు దానిని „కాకతమ్మ" యని వ్యవహరించు చున్నారు. ఇది కాకతీయులకు కుల దైవమగు „కాకతీశక్తి" యే యైయుండును. పైన పేర్కొన బడిన బుద్ధ విగ్రహము, కాకతీవిగ్రహములను బట్టి విచారించినచో బౌద్ధుల వశముననూ, కాకతీయుల వశముననూ ఇనుగుర్తి చేరి యుండెనని స్పష్టమగు చున్నది.

ఇట్టివిగ్రహములు, శిథిలములయినట్టి నందులు మొద లగునవి గ్రామమందేమి గ్రామమునకు వెలుపల యేమి లెక్కకు మీరియున్నవి.

ప్రస్తుతము స్థితినిబట్టి చూచినచో మహమ్మదీయుల గృహము లినుగుర్తియందు బహుస్వల్పముగా గలవు. అనగా నైదారిండ్లకంటె మించిలేవు. పూర్వము కొన్ని దినముల క్రితమీ గ్రామమున నాయబు పేష్కారులుండిరి. కాని అప్పుడిక్కడ నా (తెనుగు పత్రికా సంపాదకుని) పితామహుడగు ఒద్దిరాజు రామరావుగారు తానేనాయబు గను, తానే పేష్కారుగ (హంనాయబు, హంపేష్కారు) నుండి రాచకార్యముల నిర్వర్తించిరట. ఒక్క సమయ మందు మాత్రము దర్వేషు అలీయను నాయబు వచ్చినట్లు వినికరి గాని ఆ సమయమందైన మహమ్మ దీయు లుద్యోగులుగా యెక్కువ మందివచ్చి యున్నట్లు వినబడదు. అపుడైన గ్రామమందెక్కడు మహమ్మదీ యుల గృహములున్నటుల తెలియరాదు. కాని విచిత్ర మేమనగ గ్రామమునకు పశ్చిమమున రమారమి కొన్ని వేల మహమ్మదీయుల సమాధులు గలవు. ఇన్ని సమాధు లుండుటకు గల కారణము మాత్రము నిశ్చయముగా నూహింప వలసినదే యైయున్నది.

గ్రామము నందెక్కువ మహమ్మదీయుల గృహము లున్నపుడు కొన్ని నూర్ల సంవత్సరములలో నైన నిన్ని సమాధి చిహ్నములు గానుపించుట అరిది. అందు సంకు చితముగా మున్నచోట అనుటకైన అవకాశములేదు. కావున ఇక్కడ తప్పక యొక యుద్ధము, హి[ందువులకు] మహమ్మదీయులకు జరిగియుండును. ఇట్టి యుద్ధము ఇనుగుర్తి యందు జరిగినట్లు చరిత్ర [కారులు వ్రా]యకున్నను సూక్ష్మ దృష్టితో పరిశీలించిన యుద్ధము గోచర మగుచున్నది. కడపటి కాకతీయ దేవుని కాలమందు ఓరగల్లు రాజ్యము మహమ్మదీయ హస్తగతమైనపుడు ప్రతాపరుద్ర చక్రవర్తి కుమా[రుడు] కృష్ణ భూపాలుడు ఆనెగొందినుండియు, రాచ[కొండ] నుండి—ఇట్లే వివిధ ప్రాంతములనుండి సేన[లు సహా] యముగా బడసి క్రీ. శ. ౧౩౪౪ వ సంవత్సరమున [మహ]మ్మదీయులతో యుద్ధ మొనరించి యోరుగల్లు [కోట]ను పునః స్వీకార మొనరించినట్లు చరిత్ర[కారులు] వ్రాసియున్నారు. (శ్రీ చిలుకూరి వీరభద్రరా[వుగారి] ఆంధ్రులచరిత్రము, మూడవభాగము, పుట౧౪, ...) అందుచే ఆయుద్ధము—ఆ ప్రబలతర యుద్ధము, [ఇనుగుర్తి] యందు జరిగి యుండవచ్చును. అట్లుగాకున్న మహ[మ]మ్మదీయ సమాధులుండుటకు కారణము గాన్పిం[చదు.] యుద్ధముగాక మరియే యుద్ధముగాని కాకతీయ [సామ్రా]జ్యానంతరము ఓరుగల్లు రాజ్యమున జరిగియుండ[లేదు.]

పైగాథలవలన ఇనుగుర్తి యెట్టి చారిత్ర[కగ్రామ]మో? ఎంతప్రాచీనమైనదో కొంతవరకు తెలియ[గలదు.] అనగా కాకతీయ గణపతి దేవుని కాలము [నాటి] ఏడుదల సంవత్సరముల క్రిందట నుండెను. ఆ[కాలమున] మీ ఇనుగుర్తి రెండు మూడు నూరుల యేండ్ల[నుండి] యుండెనని చెప్పినను దాదాపుగ నొకవేయియేండ్ల[నుండి] ఇనుగుర్తి యుండెననుట స్పష్టము. అప్పు [డిది] యని వాడబడక „ఇనుగుర్తి" యని స్వల్పవ్యత్యాస[ముతో] వాడబడుచుండెనని తెలియుచున్నది.

కాని ఇంకను గూఢముగా విచారించిన [ఇను]గుర్తి ప్రాచీనాతి ప్రాచీనమైనదై యుండు[నని] తప్పక స్ఫురించు చున్నది. ఏలయనగా [కోట] యొక్క ప్రాకారమునందొకచోట నాగవి[గ్రహ] శిలలుగలవు ఈవిగ్రహములా యాలయమునం[దుంచ] బడినవి కావు. కాని తత్ప్రాంతములందో, మరి[యే] స్థానమునందో పడియుండగా నెవరో మహాత్ము[లు గ్ర]హించి తెచ్చి యందుంచియుందురు. ఈవిగ్రహ[ములను] విచారించినపుడు ఇనుగుర్తి నాగపూజలుకలు[గు] నార్యుల కాలములందు కూడ నుండెనేమో యను [సం]మానము గలుగుచున్నది.

# సతీ మండలము

రాయప్రోలు సుబ్బారావు

శా. క్లేశం బమ్మలఁ బోలె ధారణతపఃకృత్తుల్ దాల్చి, మంత్రోదయా
వేశజ్వాలల భేదవాద కుహనాబీజంబులన్ వ్రేల్చి, ధా
రాశోషంబడనీక యంతరములన్ ప్రాణవ్రతన్యాసులై
దేశోద్ధారక యోగమున్ నెఱపుఁ డర్థిన్ సోదరీ సోదరుల్.

ఉ. క్షేత్రము సత్క్రియోన్ముఖకృషిన్ విమలీభవదార్ద్రహృత్తపో
గాత్రముగాక యెం దమృతకల్పన కోపమి సత్యమేని యా
సూత్రము నేలపట్టరు యశోధర లెల్లరు వీరమాతలై
ధాత్రిభరంబుడింపరె యధర్మ నికర్తన ధారణారతిన్.

చ. పరమవ్యోమమున్ వెలుంగున వి కల్పజ్యోతికానంద సుం
దరలీలాగృహమైన యీ ప్రకృతి పూర్ణన్ లేదె నానాభయం
కర భద్రంకరరూపముల్ మును జగత్కల్యాణ యోగార్థమై
పురుషున్ జూడుడు వీరపుత్రు నిగ నంభోజాస్యలాత్మద్యుతిన్.

సీ. కేవలనిర్గుణభావమౌ పరమాత్మ నంశకాదిమనిష్ఠయయిన ప్రకృతి
కాలరూపమున నాకాశప్రవాహకల్లోలవీచికలఁ వెలుంగు కాళి
నిఖిలకల్యాణచిహ్నితమంగళాకారమున జగచ్ఛోభనఁ బెనుచు లక్ష్మి
శబ్దాకృతిని ప్రపంచము నావరించి యక్షరవితులతో నెసగువాణి,

సృష్టిచక్రము చక్కగా త్రిప్పుచున్న
ఆదిశక్తి అవస్థాంత రాకృతులుగ
ధ్యానవీధి నధ్యయనించు డాంధ్రసతులు
వీరపుత్రానుశాసనా భీష్టశక్తి.

సీ. తనరాజ్య సమానితంబముల్ దాటి నరుల పారద్రోలిన రుద్రమాంబ,
తన మనోదీప్రాగ్రమును గణితస్నేహాలహరి దేలిచిన లీలావతిసతి,
బిరుదులందినరాచ బిడ్డల బొమ్మల చాయనాడించిన నాయకమ్మ
తన సూత్రపాలు బాలునికి నవ్వుచు కరవాల మొసగిన మాంచాలదేవి,

తెలుగు దేవళముల వెలుఁగుచు నున్నారు
మల్లెఁగి పోక దీపికల విధాన
వీర వాసరముల నారాధనము సల్పఁ
దమృతయోగదీప్తు లలమినతులు.

సీ. వైదికావరణమర్యాద తేజరిలంగ నన్నయ దీర్చిన నలినముఖులు
క్షాత్రవర్చస్సు పిక్కటిలంగ తిక్కన మాంసగించిన యభిమానవతులు
వివిధకోమలరేఖ లవఘళింపంగ శ్రీనాథుఁడు దిద్దిన నాణెకత్తె
లాంధ్రకళాజీవ మందమ్ము లెగఁబోయు సూరన్న మలిచిన సూత్రవతులు,
పరుషసరళసంస్కార సంపదలు పొదల
కళలరూపంబులో, రూపకళలొ యనగ,
సాహితీదర్పణముల సాక్షాత్కరించు
ఆంధ్ర రమణీమతల్లుల కంజలింతు.

-oo-

## ఆహ్వానము

ఆవంత్స వేంకటరంగారావు

ఉ. ఆసమయమ్ము మర్త్య సలిలయానము సల్పగరమ్ము పూర్ణిమా
వాసర మంజుసంజవసి వాడిన దీనముఖమ్ము దేల నా
యాసము తీరు మందమలయానిలపోత నిషేవణాన నా
నాశుకశారికా విహగనాదము వీనులకింపొనర్చెడిన్.

ఉ. చారుతరమ్ములై పరగుశారద ధాత్రుల కొండదండ సం
చారముచేయరమ్ము విలసత్తరుణేందు మరీచి మాలికా
పూరము మేనసోక తరుపూగము నీడల విశ్రమించి శృం
గారగిరిప్రదేశములు గాంచి పరుందము మానినీమణీ.

-ooo-



# లీల

## వెంపటి నాగభూషణం

నిశీథము.

రాజమార్గము.

రథారూఢుడై వాహ్యాళికి వెడలిన యువరాజప్పుడే రాజమందిరమునకు మఱలివచ్చుచున్నాడు. మార్గమందొక పెద్దశిల యెడ్డ ముతెగుల అశ్వము బోర్లబడినది. సారథి రథము డిగ్గి అనినాడు:—"యువరాజా, యిప్పుడు చేయునదేమి? నా యొక్క అశ్రద్ధచే యీవిపత్తు వాటిల్లినది, మీకిట్టినిరోధకము కల్పించినందులకు నేమి శిక్ష విధింతురో విధింపుడు."

యువరాజు దయార్ద్రహృదయుడు. కరుణాసాంద్రుడు. ఇట్లు పల్కినాడు:—"సమస్తము నాజ్ఞాపించువాడు శ్రీపరమాత్ముడున్నాడు. ఈ నిశీథమును, యీ శిలను, యీ యాటంకమునకును కర్త, సృష్టినియామకుడు. భయమువలదు సారథీ. ఆకసమున మెరయుచున్న తారల వెలుగున నేను గృహమునకు నడచి పోయెదను. నాకు గాని, నీకు గాని యెట్టి ఆపత్తును కలుగదు."

* * * *

రాకొమారుడు పోవుచున్నది రహదారి. తన ప్రజలను చూచి సంతసించుచున్నాడు. ఈతడే తమయువరాజనియుత్తరుంగళ జనశ్రేణులతనిని నిర్లక్ష్యతతో జూచుచు తరలి పోవుచున్నవి.

ఇప్పుడాతడు ఊరసత్రముకడకు జేరినాడు.

"భిక్షాందేహి!" అని చేతులు చాచినాడొక పాంథుడు.

యువరాజతనిని చూచి, బాగుగ పరిశీలించి యిట్లడిగినాడు. "నీవు జాడ నావికుడవుగ గన్పట్టుచున్నావే!

పాంథుడు నవ్వినాడు. జవాబు చెప్పినాడు. "నేను నావికుడనే. ఒక నావను, రేవును యెరుగని నావికుడను నేను. ఈమహాంబుధిలో జీవయాత్రను సాగింపుచున్న నావికుడను నేను.

"అజ్ఞానమనెడి అంధకారములో బడి దూర్పుదిక్కున నున్న వెలుగురేకను జూడజాలక వెనుకాడుచున్న నావికుడను నేను. అవును, నేను నావికుడనే."

"ఓహో, నీవు బాహ్య విచిత్రపురుషుని లాగున్నావే!"

"అవును, నేను విచిత్ర వ్యక్తినే" అనికిలకిల నవ్వినాడు.

"అయిన, నీకు తిరిపెమెందులకు?"

"స్వామీ, నాలుక తడియారుచున్నది. నీవేమైనా యిచ్చిన, అరెమెుటనున్న అంగడిలో! అన్నియు మరపు వచ్చుటకై, సారాయి త్రాగెదను."

రాకొమారుడు ప్రేమపూరితమానసి. విశాలహృదయుడు. అతనుగూడ జీవయాత్రను సేయుచున్న యొక నావికుడే. సోదరనావికుని విషాదకథ వినిన యాతని మనస్సు కరిగినది. వెంటనే యిట్లు ప్రశ్నించినాడు.

"నీవాంఛ సిద్ధించవలెననిన నీకెంతధనము కావలయును?"

"చాల కావలయును!"

"ఎంతయో తెలుపుము!"

„ముప్పది మొహరీలు” అని భిక్షుకుడు పకపక నవ్వినాడు.

„ఏలనివట్లు నవ్వుచున్నావు?”

„నేనడిగిన మొత్తమును నీవీయగలవాయని సందేహము స్ఫురించినది”

„ఇవిగో, మొహరీలు.”

„శెలవు”

„నేస్తమా, కొర్కెనెరవేర్చుకొని వెంటనే యిల్లుజేరుము. లేనియెడల మార్గమధ్యమందు బడిపోదువు. అప్పుడు నిన్నెవ్వరును జూడరు!”

„అయిన మహాత్యాగీ, తప్పక్రాగి నాశరీరము గుల్లచేసి కొనుటకేగా నీవీ మొహరీల నర్పించినావు?” అని తిరిగి నవ్వినాడు.

రాకుమారుడు ఆశ్చర్య స్తంభీభూతుడై „అదియేగా నీవు కోరినది!” అనినాడు.

అంతయు నిశ్శబ్దము.

పాంథుడు పల్కినాడు. „నాకురెండు పాత్రలు మాత్రమే కావలయును. అందుకొరకై మూడు రూకల నిమ్ము”

„ఆద్రవ్యమునంతను గైకొని నీయిచ్చవచ్చినట్లు వినియోగింపుము.”

భిక్షుకుడొప్పుకొనలేదు.

మూడు రూప్యములు మాత్రమేయిచ్చి తక్కిన ధనమును యువరాజు తీసుకొనినాడు.

„ఓహో, యిదియా, నీత్యాగము, ధర్మము. ఇచ్చినదానిని తిరిగి లాగుకొంటివే!” అని పరిహసించినాడు.

„ఎట్లు జేసినను చిక్కు వచ్చుచున్నదే!”

„జీవితమే చిక్కుగదా!”

„ఈ వేదాంతమునకేమిగాని, ఆ మూడు రూకలతో నీకు గావలసిన పాత్రలను తెచ్చుకొనుము.”

„వద్దు. నాకీ మూడు రూపాయలుగూడ వద్దు!”

„మరియేమి గావలయును?”

„నీతో నేను మీ గృహమునకు వచ్చెదను.”

„రమ్ము”

„వచ్చిన రేమి యిచ్చెదవు?”

„ఏమి కావలెనన్న అదియే యిచ్చెదను”

„నేను నడువలేను”

„బండిలో పోవుదము”

„నేను బండి నెక్కను”

„అయిన నే మోసుకపోయెద, రమ్ము”

„రాను”

„ఎందుకనిరావు?”

„ఏమో, నాకే తెలియదు”

„పో, పిచ్చివాడవు. నీతో నెంతకాలము. పోవు న్నాను”

„పిరికిపందా, భిక్షాందేహి యన్నవానిని త్యజించె ధర్మమా?”

„కాదు?”

„నాకేమి యిచ్చెదవు”

„నీకేమి కావలయును?”

„నీ సర్వస్వమా!”

„తీసికొనుము”

„నా కక్కరలేదు. వానితో నాకు ప్రసక్తిలేదు”

„మరి యేమనెదవు”

„నీ ప్రాణములు నా కిచ్చెదవా?

„ఓ, గైకొనుము!”

„నిజముగా!”

„వాస్తవముగా!”

„వలదు”

„మరేమి?

„నీ ప్రేమ గావలయును”

„తీసికొనుము”

„ఏది?”

„ప్రేమ అపారము”

„అతీతము గూడ”

„తీసికొనుము?

„నిక్కముగా?



కైలాసగుహః ఎల్లోరా ఒకదృశ్యము.

చంద్రకాంత ప్రెస్.

"అవును........"

"అయిన, నీ వెవ్వరవు?"

"పరమాత్ముని తేజస్సుయొక్క— అణువును!"

"రాధికవే?"

"అవును."

"నీవు ధన్యుడవు!"

"మహాప్రసాదము!"

"శెలవు"

"అయిన, నీవెవ్వరవు, ఏమి కావలయును"

"నేనా,......ఏమి కావలయునా? అంతయు నేనే. అన్నియు నావియే."

"ఇదియా......లీల." యని అంతర్ధానమైనాడు పాంధుడు. యువరాజాశ్చర్య నిమగ్నుడైనాడు.

చీకటి అంతా ఆవరించి వున్నది.

## సమర్పణము

కృష్ణమాచార్యులు

దేవ! సుందర, దివ్యత్వదీయ కోమ
లాంఘ్రితలములే సకల భాగ్యములు నాకు
బంభరము రీతి నీపదాబ్జంబులందు
ధ్వనుల సల్పుటయే ముక్తిధనము నాకు.

* * * *

నిత్యసత్య స్వరూపివి, నిన్ను గాంచు
భాగ్య మందంగ నుంటినో ప్రణయమూర్తి.
విశ్వమృగతృష్ణలో నీకు వెదకి వెదకి
విషమజలధియందు మున్గిన తృషితు భంగి.

* * * *

అగ్ని శోధనపరీక్ష లందారి తేర
వీరుడనుగాను గృపఁ జూడు విశ్వనాథ!
కవితకుసుమవల్లరులు నీదు కంఠసీమ
రంజిలగఁ జూడ నాకు హర్షంబు దేవ!

# జపాను అభ్యుదయము

దక్షిణహైదరాబాదు ఉపాధ్యాయుల సంఘములో నవ్వాబు మసఊదుజంగు బహద్దురు ఒసగిన యుపన్యాసము నందలి ముఖ్య భాగముల సారాంశము

అనువాదకుడు:
పరాంకుశం నారాయణరావు



జపాను దేశము అక్కడి పరిస్థితుల ననుసరించి ఆశియా ఖండపు ముఖ్యమైన రెండు సనాతన సాంప్రదాయములను స్వీకరించినది. ఒకటిచైనాదేశపుకన్ఫ్యూసియస్ సాంప్రదాయము. రెండవది భారత దేశపు బౌద్ధ సాంప్రదాయము. జపాను దేశ జాతీయాత్మ పరిణామావస్థకు, కన్ఫ్యూసియన్ బోధనలయందలి ఉపయోగ్య పద్ధతియును, గౌతముని ఉచ్చాదర్శములును హేతువులు.

ఈ ద్వివిధ సాంప్రదాయ ప్రాబల్యము షింటో మతమునందలి నైసర్గికనిరాడంబరముతో గలసి ఒక నూతన పరిజ్ఞానమును సృష్టించెను. ఈ పరిజ్ఞానమే ప్రస్తుతము జపాను యొక్క కళా కౌశల్యమునకును, సుందర వస్తు నిర్మాణమునకును ముఖ్యమైన పునాది.

బుద్ధుని జన్మస్థానమగు హిందూ దేశమున బౌద్ధ మతమిప్పుడు కానరాదు. మంచూదాడి చైనా దేశపు కల్పనాశక్తులను మందగింపజేసి, జాతీయత యొక్క వ్రేళ్లను పెకలించివైచెను. ఇంక నా దేశమీ దుర్దశ నుండి తెప్పరిలుకొననేలేదు. ఒక జపానునందు మాత్రమే చైనా దేశ సనాతన నాగరకతా విశేషతయు, హిందూదేశ బౌద్ధ మత సజీవ రూపమును గానవచ్చును.

## ఐక్యత

హైందవప్రేక్షకుడు జపాను దేశ... గనే జపానీయుల భౌతిక, వైజ్ఞానికైక్యతను గ... రపడిపోవును. అక్కడి భాషనెరుగని విదేశీయు... సంఘము నందెవ డేస్థానమునకు జెందినవాడో... నుట కష్ట కార్యమగును.

ఇతర దేశములందు నుత్తమ తరగతి... కాననగు—నమ్రత, ప్రియ సంభాషణ, శుభ్రవస్త్ర... మన్నగు—నుత్తమ గుణములు జపానీయుల... సామాన్య విషయములు. నాకు జపానునందు ... మాసము లుండుట తటస్థించినది. నేనున్న ... ములోనొక మారైనను. జపానీయులు వీధుల... లాడుచున్నటుల గాని, చివరకు బిగ్గరగా మా... న్నటులగాని చూడలేను. ఇవి మనము... సామాన్య విషయములు!

జపానీయుల ప్రత్యేకవిశేషత ... వారు ప్రకృతి యందుండు సర్వసుందర... గుణగ్రహణమునం దద్వితీయులు. మనోహర... కబయళు, నయనానందకరములగు నగ... రలతా పుష్పములు, తదితర సౌందర్య ...

పెద్దల చేతను, బీదసాదల చేతను యీ దేశము నందువలె మరి యేదేశమునందును ప్రేమింపబడదు.

## పితృపూజ

ఆధునిక జపానీయుల జీవిత రహస్యమును విమర్శించిన యెడల మనకు కన్ఫ్యూసియసు సూత్రములా వారి సంఘసౌధమునకు పునాదులని గోచరమగును. బౌద్ధమత నియమములు దేశమునందు లలితకళావ్యాప్తికి ప్రాణము పోయుచున్నవని స్పష్టమగును. షింటో మతము మృతజీవుల యొక్కయు, బ్రతికి యున్నవారి యొక్కయు ప్రతి దినచర్యల విధానమును చాటుచున్నదని తెల్లమగును. 'మృతజీవుల' అను శబ్దము విస్మయము గలుగజేయకుండుగాక! దీనివలన కృతపఱుప దలచిన విషయమేమన: మరణించినవారి జీవములు శక్తి రూపమున తమతమ మధ్యనే యుండుననియు, వారి భౌతికాకారము అదృశ్యమైనను సజీవుల వలె వారిని గౌరవించి పూజించుటయు జపానీయుల విశ్వాసము.

ఈ విశ్వాసము వలననే జపానీయుల యందు అద్వితీయ రాజభక్తి, స్వదేశాభిమానము, మృత్యువునకైన భయమొందక పోవుట మొదలగు విలక్షణ గుణము లుత్పన్నమైనవి. వారు తమ రేలికను తమ పూర్వుల సాకారరూపముగ భావింతురు. వారి దేశ చరిత్ర పుట్టినదాది, ప్రస్తుత రాజకుటుంబ మొక్కటియే పరిపాలన చేయుచుండుటచే వారికి రాజుపైగల భక్తి విశ్వాసములు ప్రశంసార్హములగు చున్నవి.

## ప్రకృతియందలి ప్రేమ

జపాను దేశీయులకు ప్రకృతి రామణీయకము నందలి ప్రేమ సర్వసామాన్యమని యిదివరకే దెలిపియుంటిని. ప్రకృతి యొక్క చిత్ర విచిత్రములును, భిన్న భిన్నములగు స్వరూపముల యందలిగుణ విశేషతను గ్రహించి యానందించుటలో వారసమానులు. జపాను దేశమున కొన్ని వసతిగృహములు వర్షాకాలపు మనోహర దృశ్యముల కును, జలములందలి పూర్ణచంద్రప్రతిబింబావలోకనము నకును, విచిత్ర ప్రకృతి రామణీయకములను బరికించ నను వగు స్థలములయందు గట్టబడి మిక్కిలి ఖ్యాతిబడసినవి. ఆదేశమునందు దనదైన తన మిత్రులకు విందొసగి కాలానుగుణ్యమైన వసతిగృహమునకు వెంటబెట్టుక పోవని యెడల యతడు 'అరసికుడు' గా చూడబడును.

అక్కడి ప్రజలు తమలతాపుష్పములను సజీవములుగా నెంచి, వానిపై మిక్కిలి శ్రద్ధబూనెదరు. పూలనమర్చుటయందు వారికి చాలమోజిక. చ్చాటిపిల్లలనెటుల స్పృశింతురో పుష్పముల నటులనే తాకుదురు. వారి గదులయందు పుష్పగుచ్ఛములున్న వారి కేకాంత వాసమను భావమే పుట్టదు.

ప్రథమ హిమపాత దివసము నాడు దుకాణములన్నియు మూసివేయబడును. వేనవేలు జనులు పర్వము లెక్కి తత్సమీప దృశ్యముల జూచి యానందింతురు. ఈ యుత్సాహము కూలి నాలి చేసి బ్రతుకు కృషికుల యందును కాననగును.

జపానీయుల, యీప్రకృతి ప్రేమయే వారినిగొప్ప కలాభిమానుల జేసినది. ఆకారణముననే నచట సిద్ధమగు నన్ని సుందర వస్తువులు ప్రపంచము నందలి మరేదేశమునందును కావు సామాన్యముగా వాడుకొను వస్తువులను కూడ నతిశ్రద్ధతో చిత్రించెదరు. దీనివలన మానవ జీవితమును రమ్యముగా జేయవలెనను వారిదీక్ష వెల్లడి యగును.

## జపాను ఆధునికత్వము

జపాను పాశ్చాత్య దేశముల నెదుర్కొన వలసి వచ్చినంతనే చక్కని వస్తువులను సృష్టించుటలోను, హృదయంగమగు కవిత్వము వ్రాయుట యందును కాలము వ్యయపరచుట కంటె స్వాతంత్ర్యరక్షణమను మహాకర్తవ్యమును నిర్వహింపవలసి యున్నదని తెలిసికొన గలిగెను. చైనా మరియు దదితర పౌరాస్త్య దేశములకు పట్టిన దుర్గతి నవలోకించి, భయపడి, యిరోపా ఖండ దార్జన్య రహస్యములను గ్రహించుటలో తన యావద్ధ్యానమును వినియోగించెను.

జపాను విస్మయకరసంపూర్ణముగా మారిపోవుటకు (ఆధునికమైనందుకు) స్వీయరక్షణమే ప్రబలకారణము. ఏబది వత్సరములకు పూర్వము హాస్యాస్పదముగా జూడబడిన జపాను నేడు ప్రపంచమునందలి నాలుగు బలిష్ఠరాజ్యము

లలో నొకటిగా బరిగణింపబడుచున్నది. నానారా
జ్యాంగ తంత్రములయందు ప్రతివిషయమునను జపానుతో
సంప్రదించుటయేకాక జపానుయొక్క అభిప్రాయము
సగౌరవముగా స్వీకరింప బడుచున్నది.

జపాను పాశ్చాత్య నాగరకతల యందలి అను
కూల విషయములనుందు వెనుకలు విచారింపక స్వీకరించి
నది. తనమేధా సంపన్నులగు పుత్రుల పరదేశములకు పం
పి నవీనాంశములు తనలో సృష్టించినది.

## రెండు అపాయములు

జపాను నేటిని ద్వివిధముగా వృద్ధి పొందుచున్నది.
హృదయంగమును, సుందరమునునైన జపానొకటి. అపరి
మిత పరిశ్రమాలయములతో నిండి ద్రవ్య తృష్ణతో పరుగి
డుచున్న జపాను మరొకటి. భౌతికౌన్నత్యమునకై పాటు
బడు జపానే వైజ్ఞానార్జన కాధారమై యున్నది కనుక
రెండవ వృద్ధిని ప్రేక్షకులు క్షమింప వలసియుండును.
యూరపు అమెరికా కర్మాగారముల నాదర్శముగా దీసి
కొని వానిని జపానునందు స్థాపించినందున మూల ధనము
నకు కృషికిని కలుగు స్వాభావిక సంఘర్షణయే అక్కడ
కూడ సంభవించునని తోచుచున్నది. విశేష కర్మాగార
ములు గల ప్రదేశములందలి పనివాండ్రు చాల యసం
తృప్తితోనే యున్నారు. జపాను క్లిష్ట సమస్య నెట్టుల
పరిహారము పరచునో చూడవలసి యున్నది.

జపాను వర్తకుల నీతి విహీనత అక్కడి కార్మికుల
యసంతృప్తికన్న నెక్కువ ప్రమాదజనకమైనది. నీతియను
నది అక్కడి చిన్న వర్తకులయందు బొత్తిగా లేదు. ఇతర
దేశములన్నియు జర్మనీతో పోరాడుచుండగా నీ జపాను
వర్తకు లతిమోసముతో ద్రవ్యార్జన జేసిరి. వర్తకుల దుర్మా
ర్గమునకు నేను తరుచుగా గురియగుచుండుటచే వారి
ప్రవర్తనను మిక్కిలి యేవగించెదను. ఈ నీతి విహీనతయే
జపానీయుల జాతీయజీవితమున కొక గొప్ప కళంకము
తెచ్చిపెట్టుచున్నది. వారీ కళంకమును త్వరగా మాన్ప
కొనజాలకపోయిన భారిక పరిహార్యమగు నష్టము వాటి
ల్లుట నిక్కము.

## వ్యాపారనీతి

జపాను వర్తకుల యవినీతికొక కారణ[..]
చున్నది. ఇతర జాతులతో సంబంధము [..]
వరకు, వర్తకముతో నుదరపోషణ చేయుట [..]
జూడబడుచుండెడిది. సంఘమునందు వర్తక[..]
ముండెను. జీవితాదర్శములే మారిన నేడు [..]
లతో బోల్చి చూచిన యెడల, నక్కడి వర్త[..]
దుర్దశయందే యున్నారను సంగతి విశదమగు[..]

జపాను దేశపు సుకృతమో యన [..]
ప్రభువు అక్కడి వర్తకుల మాయోపాయము[..]
కొని యెగుమతి నంతయును తన యధీనమునకే [..]
చున్నాడు.

ఇదికాక జపానుకు భీతావహములగు[..]
సమస్యలు సంభవించినవి. చైనా యందలి [..]
యొకటి. అమెరికా ఖండమునకు ఆశియా [..]
స్యత యింకొకటి. పాశ్చాత్య దేశములతో జపా[..]
చారములు నడుపుచున్నది. టర్కీకి రాయబా[..]
ఈరానుకు పంపనున్నది. ఆర్థిక రాయబా[..]
ఆఫ్ఘానిస్తానును పరికించి ఇల్లు చేరినది.

దీనివలన పాఠకులు జపాను యుద్ధము[..]
జేయుచున్నదని తలంప జనదు. మొన్నటి [..]
గ్రామము వలననది దాని నిష్ఫలత్వము గ్రహించి[..]
యరతార్థ మీ ప్రయత్నముల సాగించుచున్నది.

## అభ్యుదయసూచికముగు భూమి

జపాను దేశపు త్వరాభివృద్ధి నాశ్చర్యము[..]
నక్కరలేదు. ఇతర దేశీయులు కూడ లవ[..]
ముల శ్రద్ధాళురై నిర్వర్తించిన జపాను[..]
వము త్వరలోనే పొందగలరు.

అది త్వాభ్యుదయ భూమి అశాభ్యుదయ[..]
నాకు దృఢ విశ్వాసము కలదు. అక్కడి [..]
మైదానములును మరియు పచ్చరాళ్ళవలె [..]
ద్వీపముల మధ్య భూతభవిష్యద్వర్తమాన[..]

పోవునంతవరకు నా యాత్మ వ్యాపించును. ప్రస్తుమాశ యూపై నావరించిన గాఢాంధకారమును ఛేదించి నా యందున్న జ్యోతి బహిర్భతుంవు కగుపడునట్టి ఒక గంభీర మైన దృశ్యమును తిలకించుచున్నది. అదృశ్యము శరదాత్రి యందు శోకగోలువు పవిత్రమైన ఫ్యూజీయామా కంటె నెక్కువ రమణీయముగా నున్నది.

జపాను నందలి ఒక యుడవియందు నా శోక నాడు, నా మనస్సరస్సునందు పూర్వపు జ్ఞాపకములు కెర టములవలె తేలిపోవుచుండ, మృతజీవుల ధ్వనులు నాచె విని సోకను: „ఓ యాగంతకుడా, ఏ మనస్సును ఓర్పద లతో నుంచుము. మేముకూడ కష్టము ననుభవించిన వారము కనుక ఏవు పడునట్టి కష్టమును గ్రహించగలము. ఓర్పు శౌరాస్త్యల గొప్ప యాస్తియని జ్ఞాపక ముంచుకొ నుము. ఓర్పు దలతోనే ఏ ప్రజలు సృష్టింపనున్న నూతా నాంశమును సృష్టింపగలరు. ఏ దేశముయొక్క శిరోభూ షణమనదగు బుద్ధ భగవానుడే అన్ని ఆపత్తుల కీపవిత్రా షధమును కల్పించెను. మరచిపోయిన సందేశమును మీకు మరల మేము జ్ఞాపకము చేయుచున్నాము.”

ధ్వనులు ఆగిపోయెను. అశ్రుపూరిత నయనములతో నాజన్మభూమి దిశ నవలోకించితిని. కమలా ప్రియుడు అరుణాకాశాంబుధియందు మునుగుచుండెను.

-ఃఃఃఃఃఃఃఃఃఃఃః-

# ప్రణయము

వర్ఘుల కాళిదాస కవి

రమ్ము ప్రేయసి! రమ్ము వనమ్మునందు
వెడలి విహరించి వత్తము వేడ్కమీఱ.

* * *

మందమారుతమును నది యందునదిగో
పూలవాసనయు నావ తేలిపోయె
వాసనానౌకయందు నుల్లాసమహహా!
చల్లచల్లగ విహరణ సలుపుచుండె.

* * *

వహ్వారే! యిటుచూడుమీ ప్రక్కనొక్క
విరిగులాబి లజ్జవల శిరమువాల్చె
అంతదనకీప టిలో నరసిప్రియుడు
నచ్చిదరి జేరెననుచును భ్రమసిపోయె.

* * *

అంతలో మారుతము వీచె నలలులేచె
మెల్లమెల్లన నీడయు మీఎకెగసి
పుష్పమును పెక్కుసారులు ముద్దుగొనియె
అంతసంతోష భరమున నదిగొపూవు
జలములందాకె ప్రియునితో గలసిపోయె.

# సాంత్వనము

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

గీ. గగన శృంగారతటిని నౌకపయి నెక్కి
రోహిణీ చంద్రమసులు పెక్కు రుచినిఁ గలసి
విశ్వమోహనగీతులు విసరుచుండ్రి
మనము గూడఁబోవుదమురమ్మా! లతాంగి!

గీ. ప్రాంతమున నున్న మావిపైఁ బ్రాఁకఁ బోక
కాంచు మాతీవ యెట్లు కంపించుచుండెఁ?
గుసుమపాత్రంబులోఁ దేనెఁ గ్రోలుచవిగొ!
పడఁతి! విహరించు భృంగ దంపతులఁ గనుము.

గీ. సన్నబంగారుదీవియ సాఁగదీయు
చున్న మెలికలు చుట్టుకొన్నవంపుమాత్ర
స్వర్ణకారుండు విసువఁ జాపనికి బాల!
తత్స్వభావంబకామదిం దలఁచి కడఁగు.

గీ. కలువ వాల్గంటి యలశీతకరునిఁ గనక
నీవలెనె మూతిబిగియించెనే? లతాంగి!
యనుచుఁ గేదంగిరేకుఁ బైనతఁడు విసర
మరుములుకు ననుబలె నాపె బఱచెదరికి.

# ఒంటరితనం

గుడిపాటి వేంకటచలం



ఎంత రాత్రైనా యింటికి వెళ్లడమంటే, దిగులుపుట్టించే, యెండాకాలపు సాయంత్రమది. దక్షిణపు గాలితో కంఠం కలిపి, సూర్యనారాయణ పాడుతో వుంటే యింటికి రావడం ఆలస్యమయిందని, రెండు గంటలసేపు మాట్లాడకండా, మొహం ముడుచుకునే భార్యా, రాక్షసుల వలె తగూలాడే నలుగురు పిల్లలూ, నాటకంలో హిరణ్యకశిపుడివలె కోర్టు నంతా తన రంగ స్థలం లాగు చూసుకుని నాట్యమాడేశిరద్దారూ, లోకంలో వున్నారనే సంగతి నే మరచిపోయి, గాన ప్రపంచ వీధుల్లో స్వేచ్ఛా వర్తనం సల్పుతున్నాను. కాని కడుపులో చురచుర, పెరుగు పచ్చడిని, పప్పులుసుని, దానితోటి, రాచ్చిప్పని, దీపం శిమ్మని, వంటింటిని, భార్యని, జ్ఞాపకానికి తెచ్చింది.

,,లేద్దాం'' అన్నాను, కష్టంమీద, దిగులుతో.

,,యేం అంతతొందర!'' అన్నాడు ఒకడు.

,,కడుపులో మండుతుంది'' అన్నాను.

,,వీడు యెప్పుడూ యిట్లానే తొందర పడతాడు. యేదో యింటి దగ్గిర అనుమానం యేడిపిస్తోంది''

,,అనుమానముంటే మాత్రం; యేం చేస్తాడేం?'',

,,కొమక్కుని రూఢిచేసుకుంటాడు, తొరగాపోయి.''

,,అట్లా అనుమానంగా వుంచితేనే మంచిది. రూఢిచేసుకుంటే అదో తంటా''

,,తంటా యేముంది? యిద్దర్నీ పక్క పిరగ తంతాడు''

,,తంతాడు? తన్నడమే! యిట్లాంటి వాళ్లని చాలామందిని చూశాం''

,,లేకపోతే, వూరుకుంటాడా?''

,,యెవరో చాతగాని అడమంత వూరుకోవాలి గాని, మనవాడు......''

,,మొగ రాక్షసుడైనా యేమి చెయ్యలేడు. భార్యని విట్టుణ్ణీ కనితీరా స్వేచ్ఛగా కండలు చెక్కే కాలం దాటిపోయింది. యెంత కాలమని తాళాలు వెయ్యగలడు? తింపులో పిల్లలతో సహా అడ్డపెట్టడం అసాధ్యం, బైటపెడితే పరువు నష్టం.............. అదంతా యెందుకు? యింటాళ నలుగురు చక్కని పిల్లన్ని వెంట బెట్టుకు యిట్లా వెళ్లలా, ముసలాయన. ఆయన సంగతేమయింది చెప్తమా? మళ్లీ యవ్వనంలో వున్నప్పుడు మనుషున్ని కాల్చుకుతినేవాడిలాగ కనపడేవాడు! పోలీసు డిప్టీ సూపరింటెంటు పని......మొదటినించి చెపుతాను వినండి. యీసారి ఆయన కనపడ్డప్పుడు ఆ పెద్దవాళ్ల ముగ్గిరి మొహాలూ చూడండి. ఆ చివరదాని మొహం చూడండి, నాకథ వాస్తవం మీకే తెలుతుంది.

ఆయన పేరు వెంకటబ్రహ్మం. ఆపేరు చెపితే చాలు, దొంగలకేకాదు, మంచివాళ్లకి, మేస్ట్రీటుకీ, తక్కిన యిన్స్పెక్టర్లకి హడలు. కాని యింటికి వెళ్లగానే అతని తీరేమారి పోయేది. చంటి పిల్లవాడై తనపిల్లలతో ఆటలు, గంతులు, వీటితో కాలం గడిపేవాడు. పిల్లలే

అతనికి ప్రాణం. వాళ్లకోసమే జీవించేవాడు. ఆస్తి, డబ్బు, ఉద్యోగం, అన్నీ వాళ్లకోసమే. ఆ పిల్లలకీ యితనంటే అంత ప్రేమా, సంతోషమూను. అతన్నెరిగిన వాళ్లందరూ అతను చాలా అదృష్టవంతుడనుకునేవాళ్లు.

చదువుకోసం పిల్లల్ని రాజాలులో నేవొదలి, ఆఫీసు బోటులో తనూ, భార్యా, కుర్రాడూ సర్క్యూటు వెళ్లారు. ఒకరోజు శాస్త్రి పద్దాకవొస్తా నన్నవాడు పనితొరగా ముగియడంచేత, వెంకటబ్రహ్మం మధ్యాహ్నం నాలిగింటికేవొచ్చి తనరైటరు, తనపడక గదిలోనించి, తొరతొరగా ఆఫీసుగదిలోకి పోవడం చూశాడు. తరవాత రెండు రోజులు జాగ్రత్తగా కనిపెట్టేప్పటికి, అతని అనుమానం నిశ్చయ మయింది. అతనివొళ్లు వెర్రెత్తింది. మొదటి నుంచీ తన భార్య సుభద్ర ప్రవర్తన తలుచుకుంటే, అన్నీ అనుమానంగానే కనపడ్డాయి. యిప్పుడు ఆరైటర్ని చూస్తే వెంకటబ్రహ్మానికి అసలే చాలా అసహ్యం. తన భార్య అట్లాంటివాణ్ణి యేమకోడం చాలా నీచంగా తోచి బాధపడ్డాడు. సుభద్రని తిట్టినా, కొట్టినా, చావతన్నినా యేమిలాభం లేదని అతనికి పూర్వానుభవం వల్ల తెలుసు. అదిగాక పెద్దదై, ముగ్గురు పిల్లల తల్లి అయి యిన్నాళ్లాతనితో కలిసి కష్ట సుఖాలు పంచుకున్న దాన్ని చెయ్యి చేసుకోడం అతనికి మనస్కరించలేదు. ఆలోచించి ఆలోచించి అట్లాంటివి సాగడానికి వీల్లేదని కఠినంగా భార్యతో చెప్పాడు.

యిప్పుడు వెంకట బ్రహ్మంగారికి గుండెల్ని పీక్కుతినే పెద్ద సందేహం వొకటి పట్టుకుంది—యీ ముగ్గురు పిల్లలూ తన పిల్లలవునా కాదాఅని. వాళ్లల్లో తన వాళ్లెందరో, కాని వాళ్లెందరో—పూర్వపు సందర్భాలన్నీ జ్ఞాపకం తెచ్చుకున్నాడు. వాళ్లు దగ్గిరికి వొచ్చినప్పుడల్లా తన మొహం వాళ్ల మొహాలూ పరకాయించి పోల్చుకుని, పరధ్యానంలో పడేవాడు. వాళ్ల మీది అపారమైన ప్రేమ, వాళ్లు తనవాళ్లు కారేమో, యిన్నాళ్లూ యెవళ్లనో, తను తన బిడ్డలని పిలుస్తో ప్రేమిస్తో, వాళ్లకోసం తన శక్తినంతా యిచ్చేసి, బాధలు పడడం—యివన్నీ అతన్ని నరకబాధ పెడుతున్నాయి. తన భార్యని నిజంచెప్పమని

అడిగితే చెపుతుందా? అందులో యింక పెళ్లా[illegible] వున్నప్పుడు?

వారం రోజుల్లో తన భార్య నడవడి యథా[illegible] రంగానే వుందని అతనికి బాగా తెలిసింది. [illegible] చాలా కఠినంగా మాట్లాడేటప్పటికి, "సరేలే నేన్[illegible] వెళ్లిపోతా"నంది సుభద్ర. ఆ మాటతో పులినంటి [illegible] బ్రహ్మంగారి దూకుడంతా అణిగింది. యీ అసహ్యా[illegible] లేక, పొమ్మనాలని నాలిక దాకా వొచ్చింది. కా[illegible] టనే, వేరే ఆలోచన వొచ్చింది. తన పరువు[illegible] చుకున్నాడు. యిన్స్పెక్టర్లూ, చివరికి పోలీసు [illegible] తన వ్యవహారం గుంపులు గుంపులుకూడి మాట్లాడు[illegible] తనముందు తాల్యూటు పెట్టి, వెనకాలే నవ్వు[illegible] బంధువులు తనని వోదార్చడం, పెళ్లాన్ని అ[illegible] పెట్టలేనివాడు, వూళ్లని అప్పులో పడతాట[illegible] డం, అన్నీ నేరకు తట్టాయి. తెలివిగా అప్పటికి [illegible] తరవాత చెయ్యవలసిన సంగతేమిటని ఆలోచించి[illegible] ఆ రైటరు మీద రిపోర్టు రాసి బదిలీ చెయిం[illegible] అతను వూరంతా గోలపెట్టి శెలవ తీసుకొని [illegible] వున్నాడు. ఆతన్ని తన్నించాలని చూశాడు కాని [illegible] చాలామందికి యిష్టుడు కావడం వాళ్ల, జాగ్ర[illegible] డడం చాతా అది చాతకాకపోయింది. తన యి[illegible] వాణ్ణి పట్టుకుని తన్నడానికి సిద్ధమైతే, భార్య [illegible] సహా రోడ్డుమీద పడియేడ్చి గోలచేసేటంతవరక[illegible] పడి వూరుకున్నాడు. యిల్లు నరకప్రాయం పోయింది. [illegible] మొహంచూసినప్పుడల్లా కొరికి చీల్చి, యేడిపించా[illegible] కోపమైపొయ్యేది. కాని ఒక్క మాటంటే [illegible] తుందని భయం. ఆ పిల్లల్ని చూడగానే వాళ్లు [illegible] అని యెప్పటి ప్రేమతో వొచ్చి మెడని కావలించు[illegible] నే వొళ్లంతా జెర్రులు పాకినట్లవుతుంది. కాని [illegible] కొదల్లేదు. వాళ్ల ప్రేమలేకండా వుండలేడు. [illegible] శెలవ యెప్పుడై పోతుందా అని ధ్యానం చేసుకుం[illegible] బాధనంతా భరిస్తున్నాడు. వూరంతా యితవార[illegible] లాటైపోయింది. వీపు వెనకాల, 'రైటర్' అని [illegible] వేస్తున్నారు. గోడలమీదా రైలు బళ్లలో, [illegible] వెలుగుల్లోంది. శెలవ అయిపోగానే రైటరు [illegible]

నామానిచ్చి, చీరల కొట్టు పెట్టాను. ఆ రైటర్ని చంపె య్యాన్నంత కోపమొచ్చేది ఒక్కొక్క రాత్రి నిజంగా యే కోపంలోనో యేదో చేస్తానని అతనికి భయం కలి గింది. చివరికి సైకిరాని విశాఖపట్నం తను బదిలీ తెప్పిం చుకున్నాడు. రైటరు విశాఖపట్నం వొస్తే సులభంగా సన్నించవొచ్చుననుకున్నాడు. కాని సుభద్ర ఆ వూరినించి కదలనంది. లాక్కెళ్లాలను మాకాను. అల్లరికింద దిగింది. రోడ్డుమీద రాగాలు పెట్టే విషయం కింద దిగింది. ఆఖరు నాటి నా రాత్రి భార్య కాళ్లమీదపడి బతిమాలాడని కూడా అంటారు. యెంతో నెమ్మదిగా జాలిగా బతిమా లుకున్నాడు. లాభంలేకపోయింది. కాశీకిపోయి సన్న్యా సం పుచ్చుకోడానికి నిశ్చయించుకుని సగందూరంబయలు దేరాక పిల్లలమీది ప్రేమ ఆ నిశ్చయాన్ని చెడకొట్టింది. ఆ పిల్లల్ని తీసుకుని విశాఖపట్నం వెళ్లిపోయినాడు. ఒక ఇంట ఆమెను, ఆయాను యేర్పరచికొని స్థిరపడ్డాడు. పది హేను రోజుల్లో బతుకు దుర్భరమై పోయింది. కచేరికి పిల్లలు కదలనిచ్చేవాళ్లుకారు. సైకిలెక్కి బయలుదేరితే అయా చేతుల్లో నిలవక యేడుస్తూ రోడ్డువెంట పడతారు. కచేరీనించి రాగానే, ఆ ముగ్గురూ యితన్ని కావిలించు కుని, "అమ్మ, అమ్మ," అని ఒకటేగుండె కరిగేట్టు యే డుపు. చంటిపిల్లవాడు దిగులుతో శల్యమౌతున్నాడు. ఆ నౌకర్లు యీ పిల్లల్ని సరిగా చూట్టంలేదని, నౌకర్లని మార్చి నౌకర్లనిపెట్టినా, లాభంలేదని తెలిసింది. తను యెన్నడో మరిచిపోయిన బంధువుల వంకకిని, ముఖ్యం ముసలి వితంతువులని, జ్ఞాపకం తెచ్చుకుని, రప్పించాలని చూస్తే, ఒక్కరూ దొరకలేదు. అసలు బంధువులు తక్కువ; వుద్యోగగర్వంలో వాళ్లతో యెక్కువ సంబం ధం పెట్టుకోలేదు, వాళ్లందరికీ యీ గొడవంతా తెలిసి, యితన్ని సగం వెలిపడ్డ వాడివలె చూస్తున్నారు. యెవరూ రాలేదు. రాజమహేంద్రవరం శరణాలయానికి వెళ్లి, వితంతు వివాహం చేసుకుంటా నన్నాడు. యితని చరిత్ర విని, ఆ భార్యనంత చక్కగా చూసుకున్నావు, యింక యీ భార్యని యెంత బాగా చూసుకుంటావో, వెళ్లమ న్నారు. సిగ్గేసి యింటికొచ్చాడు. పిల్లలు అన్నం తినటం లేదు. ఆడుకోరు. రాత్రిలు ముగ్గురూ వూపిరాడకుండా చుట్టూ కావిలించుకుని గాని నిద్రపోరు. యిట్లా యింకో పదిరోజులు యేడిపించేప్పటికి, వాళ్ల మీది ప్రేమ అంతా యెగిరిపోయింది, వాళ్ల మొహాలు కనపడేప్పటికి, యెక్క డికి పారిపోదామా అనిపించేది. ఆఫీసునించి యింటికి వెళ్లడమంటే హడలుగావుంది. ఆ తల్లిలేని పిల్లల్ని తను కూడా విసుక్కోడం, కొట్టడం సాగించాడు. అంతే గాక, వీళ్లు తన బిడ్డలవునా కాదా, యీ శ్రమలూ, బాధ లూ, యెవరెవరి పిల్లలకోసమో పడుతున్నానా. అనే సంగతి అతని హృదయాన్ని ఒక్క నిమిషం బాధించడం మానలేదు. రాత్రులు నరాలు లాగి, గుండె పట్టుకుని, నిద్రపట్టక, బాధపడతాడు. లాంతరు తీసుకొచ్చి భద్రం గా వాళ్ల మొహాలు వెదుకుతాడు. యీ పిల్లల్ని వొదిలి తన భార్య యెట్లావుందా అని ఆశ్చర్యమూ నిలవలేక వొచ్చేస్తుందేమో నని ఆశ, మళ్లీ రానిస్తానా అనే కోపం, పిల్లల మీద వున్న ప్రేమనంతా చంపుతున్న ఆ స్త్రీ వికృత స్వభావానికి అసహ్యం, యిన్ని భావాలూ అతనిలో పోరుతో వుంటాయి ఆ ముగ్గురికీ ఫోటో తీయించి భార్యకి ఫోటోగ్రాఫుల్ని పంపమన్నాడు. యెందుకో బాగా తెలీని యేవేవో కారణాలు చెప్పు కుని సమాధాన పెట్టుకున్నాడు. యెంత అక్కర్లేక పోయి నా తల్లి కదా, పిల్లల్ని చూడాలని వుండదా, ఆమెకి హృదయం లేకపోతే తనకి లేదా అనుకున్నాడు. యింత లో రాజుకో పిల్లవాడికి హఠాత్తుగా పెద్దజ్వరం వొచ్చింది. సెలవు పుచ్చుకుని రాత్రింబగళ్లు అతనికి సేవ చేశాడు. ఒకరోజు రాత్రి ఆ పిల్లవాడి పక్కన కూచుని వుండగా 'ఆ జబ్బూ, ఆ కుర్రవాడి అసహాయత్వం, వాడి అమాయ కమైన ప్రేమా' అన్నీ తలపుకు వొచ్చాయి. అమ్మ దగ్గి ర్నించి యెందుకు తీసుకొచ్చావని అడగరు, మమ్మల్ని వొంటరిగా నౌకర్ల మీద పారేసి, కష్టాలు పెట్టడానికి నీకు చేతులెట్లా వొచ్చాయి అనరు, యెందుకు యిట్లా కొడతావు, తిడతావనరు, తననినమ్మి యిట్లా జబ్బులు తెచ్చుకుని, ఆ చేదుమందులు గొంతుకలో పోసుకుంటో, చావుకు కూడా సిద్ధమవుతారు. వెంకట బ్రహ్మానికి యెం తో యేడుపొచ్చింది. ఆ అబ్బాయిని విసుకుతో తను కొ ట్టిన దెబ్బలూ, ఆ బాధపడలేక వాడు పెట్టిన మొహం, అన్నీ జ్ఞాపకమొచ్చి, యేడ్చాడు. యింక తనదగ్గిర వీళ్లని వుంచుకోకూడదు; తన పరువుపోయినా సరే, ఆమెకప్పి,

అజబ్బునయం కాగానే, ముగ్గురు పిల్లల్నీ, తీసుకుని, ఆ రైటరూ, తన భార్య తను పూర్వం వున్న యింటోనే కాపరం చేస్తోవుంటే, అక్కడికి వెళ్లాడు. రైటర్ని, 'పర్మిషన్' అడిగి, ఆమెతో మాట్లాడి, సగం జీతం పంపేందుకు వొప్పుకుని, ఆ పిల్లల్ని ఆమె దగ్గిర దిగపెట్టాడు. ఆ రోజు రాత్రి యింకన్నా వాళ్లు అక్కడే భోజనానికి వుండమన్నారు, కాని వుండలేదు.

ఆ పిల్లల్ని దిగపెట్టి వొచ్చినప్పటినించి వాళ్లమీద మళ్లీ అమితమైన ప్రేమ మొలకలు పెట్టింది. వాళ్లేమి అల్లరీ చెయ్యలేదని తనే అన్యాయంగా వాళ్లని బాధపెట్టానని అనుకున్నాడు. వాళ్లని మళ్లీ చూడాలనే కోర్కెని అణుచుకోలేక అవస్థపడ్డాడు. మెల్లిగా మరిచిపోయినాడు. మూడేళ్లు యెట్లాగైతేనేం తోసుకు తిరిగాడు. తరవాత వాళ్లని వొక్కసారిన్నా చూడకుండా వుండడం అసాధ్యమైపోయింది. వాళ్లు బతికివున్నారో లేదో కూడా తెలీదు.

యెవరన్నా ఆ వూరి స్నేహితుల్ని తన పిల్లలెట్లా వున్నారో చూసి, రాయమంటే యెట్లావుంటుంది? తను ఆ వూరు వెడితే అందరూ తెలిసి నవ్వుతారు? ఒకరోజు తన పెద్దబ్బాయి బళ్లో కుర్రాడితో పోట్లాడి, దెబ్బలు తిని యింటికి వెళ్లినట్టూ, యింట్లో వాళ్లు కూడా చీవాట్లు పెడితే, తనని తలుచుకుని యేడుస్తున్నట్టూ, కలవొచ్చింది. కలలోంచి మెలుకువరాగానే, పిల్లలకోసం, వేదన ప్రారంభమయింది. ఆ రైటరూ తన భార్య, తనపిల్లల్ని యెంత బాధపెడుతున్నారో, అని భయంపట్టుకుంది. ఆ పిల్లలు తన కోసం యేడుస్తున్నట్టే వుంది. మర్నాడు రాత్రికి రాత్రికి చేరుకునేట్టు ప్రయాణమైనాడు. దొంగతనంగా వాళ్ల యింటి కిటికీ దగ్గిర చీకట్లో నుంచుని, లోపలికి చూశాడు. రైటరు చుట్ట కాలుస్తూ వరండాలో కుర్చీలో పడుకున్నాడు. తన పెద్దకుర్రాడు గదిలో పాఠం చదువుకుంటూ అప్పుడప్పుడు ఆ రైటర్ని 'బాబాయ్' అని పిలిచి సందేహాలడుగుతున్నాడు. సుభద్ర ఆ గదిలోనే మంచంమీద కూచుని చిన్నపిల్లకి పాటనేర్పుతోంది. రెండో కుర్రాడు ఆ రైటరు సైకిలు గోడనానించి వుంటే, యెక్కాలని ప్రయత్నం చేస్తున్నాడు. యిదంతా వెంకటబ్రహ్మంగారు చూశాడు. ఆయిల్లు మంతో 'కంఫర్టబుల్' గా సుఖంగా వున్నట్టు కనపడ్డది. ఆ సంసారం ఆ ఆనందం ఆ మూడేళ్లు వొద్దలుకోని యేకాకినై నాను కదా అని దిగులేసింది. ఎప్పుడూ లేనిది యీనాటి అనుభవంగా కనపడింది. యింత పెద్ద లోకంలో తనవొంటరితనం ఘోరంగా మనసుకి. కాంతిలో స్వర్గంలో వాళ్లుంటే, చచ్చిపోయిన పిశాచంలాగు తనెక్కడో లోకంనించి చూస్తూ తనవాళ్లని, చూస్తున్నట్లయింది. గుండెలు బద్దలై ఒక్కసారి ఆపిల్లల్ని కావిలించుకోవాలని తను తెచ్చిన 'ఫలహారాలు' యేమిటో అన్నీ విప్పిచెప్పి, ఆ చిన్నకొడుకుని వొళ్లో కూర్చో పెట్టుకుని ఆ రెండో వాణ్ణి సైకిలుమీద పడకుండా నిలబెట్టి ఎక్కించి చూపించాలనిపించింది. చివరకి ఆ యింటో కాలుపెట్టే తనకర్హత లేదనుకొని వెళ్లిపోయి ఆ రాత్రే రైలెక్కాడు.

వాళ్లనిచూచిన తరువాత అతని జీవితం పోయింది. ప్రతినిముషం బతుకు వొంటరిగా వున్నట్టు సంపాయించడం యెందుకు? యీనాటి కష్టాలు యెందుకు? హోటళ్లలో భోజనం, యెక్కడో నిద్ర! సంసారాల్లోకి యితన్ని రానివ్వరు. యెవరూ ఆహ్వానించరు. పెళ్ళిళ్ళకైనా పిలువరు. పిలిచినా బంధువుల్లో సిగ్గు. నావాళ్లనుకునే వాళ్లు లేరు. 'ప్రమోషన్' సంతోషం చెప్పుకునేందుకన్నా యెవరూ లేరు. నగలు చూస్తే, బొమ్మలు చూస్తే, యెవరికన్నా కొనాలనిపించేది. జబ్బు చేస్తే, యెట్లావుందని పలకరించేవాళ్లు, ఆపిల్లలు కావాలి కావాలని రాత్రింబవళ్లు అనుకున్నాడు. వాళ్లలో ఒక్కరన్నా తనసొంతపిల్లలై వుంటే అనుకున్నాడు. సంగతులన్నీ జ్ఞాపకము చేసుకుని వాళ్ల ఫోటోలు, తన ఫోటో దగ్గిరగా పెట్టుకుని కలలు చూసుకుంటాడు. కాని యేంచేస్తాడు! ఆ జ్ఞాపకాలతో కాలం గడుపుతున్నాడు.

తరువాత నాలుగేళ్లకి పాపం ఆ రైటరు చచ్చిపోయినాడు. తరవాత రెండు నెలల్లో వెంకట... సుభద్రా వెంకటబ్రహ్మంముగ్గురు కొడుకులూ, కూతురికి పుట్టిన చంటిపిల్లా అందరు సుఖంగా కాపరం చేస్తున్నారు. వెంకటబ్రహ్మం పెన్షన్ పుచ్చుకుని యింట్లోనే స్థిరపడ్డాడు. యిప్పుడుకూడా వాళ్ల యింట్లో ఆ రైటరుది పెద్ద ఫోటో వుంటుంది. వెంకటబ్రహ్మం పిల్లలూ ఆ రైటర్నే బాబాయి అంటారు. ... యీయన్ని 'నాన్న' గారంటారు.

# నిర్వాణసుయోధనము

ప్రభల రామబ్రహ్మానందము

క. గురుసుతుఁడవు మహనీయుఁడ వరయగ విప్రకుల కీర్తి వర్ధిష్ణుడవై
వరలెడి నిను కురురాజిదె సిరిమెరసిననాటి శిరము జేర్చుచ మ్రొక్కెన్.

చ. అనిమొదలందు గిట్టిరి మహాత్ములు భీష్ముఁడు ద్రోణకర్ణు లె
వ్వనికయి; మద్రరాజు సుతబాంధవ మిత్రయుతంబుగా గనె
వ్వనికయి భారవోసెఁ దనప్రాణము; తక్కినవీరవర్గమె
వ్వనికయిఁ జచ్చె; వాఁడు ధరఁబడ్డ విధమ్మునుఁ జూచినావుగా!

చ. ఎడదసహింపరాని విధమేగాని దుర్నయవృత్తిఁ దైవమే
పడగగఁ జేసెగాక! మనపక్షమునందలి వీరు లుక్కునన్
గడిమినిఁదీసిపోయెదరె? కంతమునందునఁ బ్రాణమున్న న
న్వడముడి యెంత? వజ్రధర వాసవుఁడున్ శివుఁడెత్తివచ్చినన్!

చ. చలమునఁ బోరుచున్న యెడ చావునకోడి వరమ్ముడించి శూ
రులమని యింతఁ జేసిరిది రూతుణభంగియె? పోటుపాడి! నా
కల తెరగెల్లఁ జెప్పు నినుఁ గన్న శుభాత్ముని ద్రోణుకర్ణు నా
వలనఁ గాదె భీష్మకురు బంధుల జంపిరి పోరిలోపలన్.

ఉ. ఇంత యెఱింగి నీవితనకింపొకయింత ఘటింపకున్కి కా
లాంతక్రమప్రకార భయదానిల విస్ఫురితాత్మియుగ్మఁడై
యంతకు చూడ్కి పెగ్గడ భుజాంతరసీమ నమర్చి యంత నా
పొంతకుపోయె భీము పృథవుత్రు వారింపగ నేను చెప్పుదున్!

చ. కనుగాని కృష్ణుడంత తనకార్యము పోడిమితప్పకుండనే
నునదా నమ్రుఁడై వినయమూర్తి యొసఁగ హూణుఁదాల్చి స

ట్లనువుగ నేమొపల్క విని యాహాలధారియు ఘూర్ణమానుఁడై
కనలుచు రాజబంధువులుఁ గప్పిన తమ్ములఁ జూచియిట్లనెన్.

క. పగగల్లదె? పోరకె, ధర? తెగిఁద్రుంతురె, తొడలు? నిట్టితీప్పలుగలవే!
తగవే? కడుబెట్టిదమై గగనపతికి రోతపాడముఁగా విసిసంతెన్.

క. ఏమనవలె శూరులరను నామమున నుదాహృతులయి సరపతులనగా
సీమలనేలుచు నిట్లుగ నీచు మెడలు హేయధర్మనిరతులుఁ గలరే?

మ. శితనారాచములంటి మండిపడి దుశ్శీలాత్ములై యేమిచే
సితిరో? భార్గవరాముపై నెదిరి యక్షీణోద్బలుండైన భా
రతవంశీయుఁడు గంగపుత్రుడును తూలంబోవువాఁడె సము
ద్ధతుఁడై మిమ్ములమట్టువెట్టడె? క్రుధాదావాగ్నిమైనంటినన్.

ఉ. పోయెనబో!నతండు కురుపుంగవు పూర్వపు కర్మఁజేసి స
ద్ధ్యేయుఁడు కుంభజుండు మిముతిన్ననసేయడ వేడితూపులే
మాయెనొ? కోట్లకై సురమండలి వచ్చినక్రమింగు సంగర
స్థేయుఁడు వాడిలేని కడుదీర్ఘపు బాణములంటి దాటెనే?

క. ఔరా! యశ్వద్ధామయు ధీరోదాత్తుఁడును కాలదీపన మనగా
వీరుఁడసి పేరుగొనియును నీకునఁజవివోయి మిమ్ము నిలిపెనే? పుడమిన్.

ఉ. ఎందరు వీరులున్న మరియేమగు వీరలపక్షమందునన్
మందర మేరుపర్వత సమాన మహోన్నత ధైర్యవంతు లెం
దెందరొ? వారివల్లనొకటిన్ గనుగొంటిమె? కాలచక్ర సం
బంధ తమఃప్రతానమున భాసిలవచ్చునె? యెట్టివారికిన్.

క. ఇలకీర్తిఁగొనెడు భీముఁడు విలయాంభోధర పిడుగుపిడిచెడునరకున్
కలగానమహిత లీలా విలసత్పథముల నితండు విహరించుతరిన్.

గీ. అనుచు వేగమ రథమునయందు నెక్కి తనపురము వంకచుఅచుఅతరలె నీరి
ద్రుపదపుత్రుఁడు మొదలుగా దొరలు తెల్ల వోయిచూడఁగ రిత్తచూపులనిమిడ్చి.

ఉ. మున్నుసమస్తభూపతిసమూహము తమ్ములువెంటనంటి నా
చన్న పథంబునేననువ సాగరవేష్టిత ప్రాజ్యధారుణీ
సన్నుతకీర్తినై మెలఁగఁజాలితి భూసుర పుణ్యవాక్య సం
పన్నుఁడ భూరిరాజ్య పరిపాలన మొప్పగ నిర్వహించితిన్.

మ. ఒకనాఁడా! సనుసేనలంగిసనిగా యుర్వీతలంబెల్ల మా
ఘన బాహ్యాంతరసీమసుప్తిఁగనె రమ్యాలేపసౌరభ్య సే

నికమై మోహిత దివ్యలోకసుషమావిర్భూతమాధుర్య భా
రకమై పంటలకెల్లఁబుట్టవయి వజ్రంపుంబ్రభామూర్తియై.

ఉ. అట్టిదినేఁడు దుర్దశల కక్కట! బాహువులొడ్డియెట్టి సం
ఘట్టనకైనోర్చి మదిఁగందెడు శోకలఁ జాలనొచ్చియు
న్నట్టన నన్ను నిల్పినది నీపరమాదరణంబుతోడుగా
నెట్టికృతజ్ఞతావిధి గణించి భరించెనొ నేఁడు నాపయిన్.

ఉ. నాఁడును మద్గురుండు కరుణాకరవిద్యల నేర్పి పెద్దకా
పాడినవాఁడు రాజ్యపరిపాలనమందున; యుద్ధసీమలో
వీడక నేఁడు నీవు నను వేదన పొందుచునున్న వానికిన్
యేఁడుగడైతివయ్య నిను నేమని మెచ్చఁగవచ్చు చెప్పుమా?

మ. తుదకీదుర్గతి పొందినాఁడననికాదోయీ విచారింప సం
పదలెల్లన్ క్షణభంగురంబులు సుధాపానీయమేంద్రావి గె
ల్చెదపో రాజ్యము సూర్యపుత్రుఁడెట? పుంజీభూతశౌర్యంబు భీ
ష్మదయాసింధుఁడికేడి? యస్త్రగురుగ్రీష్మాదిత్యుఁడేడీ ధరన్.

ఉ. తమ్ములబంధుమిత్రులను ధారుణికర్పణఁజేసి హేయభా
వమ్మగుభంగినిట్టుల వివాదము సేయుచు దుఃఖభార రా
జ్యమ్మును నేలుచుండుట దియారయ నెక్కడికోర్కె న్యాయమా
పమ్మున నాకు నీగతి విపర్యయమొందుట యుత్తమంబగున్.

చ. హృదయము నేఁడు చేరె మనమించుక నూరటఁజెందె నిప్డ న
మ్మదితుఁడనైతి నీకుతుదిముట్టగఁ జెప్పుటఁ జేసి యింకయే
విధముగనైన నాకుమది భీతిజనింపదు దుఃఖమేర్పడున్
రథికుఁడనైననేను రణరంగమునందునఁ జచ్చుటొప్పదే!

మ. అదిగో పూర్వదిశాభిరామమయి రత్నాలంక్రియారమ్య న
త్పదమై వెన్నెలచీకటింబలె మనోభావంబు రంజించు సం
పద నొప్పారు విమానరాజమున దేవాధీశుఁడున్నాఁడు న
న్నిదరా! రమ్మని సౌఖ్యఁ జేసె సెలవిమ్మా! వేగ నేనేగెదన్.

గీ. అనిపలికెనప్పుడు సుయోధన నరపతి విసీలవాసరోచులు దిగ్విలోలముగను
గురుకుమారుని కనుఁదమ్ముకొనలయందు నిలచినవి కెంపుకన్నీటి బొట్లు!!

# "నవీన బాలిక,,

సిరుగూరి జయరావు

కాలచక్రము గిఱ్ఱునఁ దిరుగుచున్నది; తిరుగుటచే దానికి నైజగుణముకాఁ బోలు. కాని, బండి చక్రమువలెఁ, దిరుగుచున్నంతసేపు ముందునకు సాగిపోవుచున్నదా? అభ్యుదయమునకు దారి తీయుచున్నదా? లేక రంకులరాట్నమువలె నొక్కచోటనే తిరుగుచున్నదా? లేక, పెంకిగుఱ్ఱమును గట్టిన బండివలె వెనుకకుఁ బోవుచు—సంఘసంస్కర్తల కొరడాదెబ్బలతో ముందునకు నభ్యుదయమునకై సాఁగుచు, మరల వెనుకకుఁ బోవుచు, మరల దెబ్బలు తిన్న తరువాత ముందునకు సాఁగుచు—ఈరీతి నవలంబించుచున్నదా?

చారిత్రకాంశములను జూచినను, మతదశలను జూచినను, ఏవిషయమును విమర్శించినను, పెంకిగుఱ్ఱపుబండి సామ్యమే సరిగానున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. ఇందువలన నేయేకాలమునకుఁ దగిన సంస్కారముల నాయాకాలమునకు నవలంబించుట మంచిదని కూడ తోఁచఁగలదు.

కాని సంస్కారములన్న నేమి! వానికి సరిహద్దు లేమి? ఈప్రశ్న పీడించుచుండుట చేతనే పల్వురు మానసికసంస్కారములు కల్గినను వానిని క్రియారూపముగ నన్వయింపఁ జేయుటకు జంకుచున్నారు.

ఇప్పుడు భారతదేశములో మానసికకల్లోలము నుత్పాదించుచున్న విషయము సంస్కార విషయికమే. కడకు రాజకీయ కల్లోలము కూడ సంస్కారసంబంధమైనదేయని చెప్పుట తప్పుకాదు.

పాశ్చాత్యసంఘర్షణచే భారతదేశమునకు సంభవించిన మనఃకల్లోలము చెప్పఁదరమైనది కాదు. ప్రాచ్య పాశ్చాత్యనదులు కలసినవి; ఎదురెదురుగఁ బ్రవహించుచు, ఆవేగముతోఁ గొట్టుకొనుచు వచ్చి కలసిపోయిన యీ నదుల కలయికచే నూతన సమస్యలు పుట్టినవి. ఇప్పుడు ప్రాచ్యనదికి స్వయం నిర్ణయ బుద్ధి పుట్టినది; పాశ్చాత్య నదీజలములతో సంబంధము వలదనుచున్నది. తనలో నింతవఱకు గలసిన పాశ్చాత్యనీరమ్మును తీసిపాఱవేయవలెనని జూచుచున్నది.

కాని యీ యెడఁబాటముఁ గల్పించుట సులభమైనది గాదు. పూర్తిగాఁ బాశ్చాత్యనీరమ్మును దీసివేయదలఁచినచోఁ దన నీరమ్మును గూడ కొంతమట్టునకుఁ బోఁగొట్టుకొనవలెను. లేదా, తన నీరమ్ము పోకుండనుండవలెనన్న కొంత పాశ్చాత్యనీరమ్ము మిగిలి పోవలసి వచ్చును.

ఇప్పటి భారత సమస్యలలో ముందునకు వచ్చినది, ముందునకు రాఁదగినది—స్త్రీ సమస్య. అతిబాల్యవివాహము విషయము మొదలుకొని, సంపూర్ణస్వాతంత్ర్యము విషయము వఱకు ఎన్నో సమస్యలు గలవు. వీని నన్నింటిని బరిష్కరింపక తప్పదు; కాని, ఎట్లు?

స్త్రీ సమస్యావిషయమై పెక్కు వాదోపవాదములు జరుగుచున్నవి. కేవల దయాస్వభావముతోఁ జర్చించువారు కొందఱు; కేవలశాస్త్రబుద్ధితో (Scientific attitude) వాదించువారు కొందఱు.

పాశ్చాత్యనాగరకతా సంఘర్షణల వలన మనకు, మన నాగరకతకు, మనబుద్ధికి, నూతనవికాసము—లేదా, నూతన ప్రబోధము—కలిగినదనుట నిస్సంశయము. కాని నూతనసమస్యాపరిష్కరణ మన ముందర పెట్టుకొన్నప్పుడు పాశ్చాత్యులపద్ధతుల నెంతవరకు ననుకరింపవలెనో, ఎంతవరకు బహిష్కరింపవలెనో, నిర్ణయించుకొను శక్తి బాగుగా కలుగవలెను.

పాశ్చాత్యపద్ధతులన్నియు మంచివికావనుటకు నిదర్శనములు పాశ్చాత్య సంఘవిప్లవములే. లోకాభిరామాయణమును జక్కగాఁ బరిశీలించువారల కీసంగతి తేటతెల్లముగాఁ దెలియుచున్నది. కాని, యిట్లు చెప్పినంతనే ప్రాచ్యసాంఘిక పద్ధతులన్నియు నుత్తమములని చెప్పుట సరికాదు. ఏయే దేశమునకుఁ దగినట్లు, ఏయే పరిస్థితులకు దగినట్లు, ఏయే వంశపారంపర్యతకుఁ దగినట్లు, వేరువేరు ఏయే శీతోష్ణస్థితులకుఁ దగినట్లు కూడ—ప్రత్యేకాచారములు, ఉండి తీరవలెను. అందుచేత మనసంఘములోనికిఁ గావలసినంత సదాచారములను దీసుకవచ్చి, అక్కఱలేని దురాచారములను బహిష్కరించి, దేశాభ్యుదయము కల్పింపవలసియున్నది. ఇట్లే పాశ్చాత్యులు కూడ వారి ప్రత్యేకస్థితిగతుల ననుసరించి సంస్కారములను తెచ్చుకొనవలయును.

నిషేకవయో నిర్ణయము, స్త్రీవిద్యావిధానము, స్త్రీ స్వాతంత్ర్యము, మున్నగునవి నేఁటి నాఁటి ముఖ్య సమస్యలు. ఇటువంటి సమస్యలు మనముందటనున్నప్పుడు, శాస్త్ర విమర్శనా కౌతూహలము కలవాఁడను గనుక, కొన్ని విషయములను—ఉన్నవి యున్నట్లుగానే—నిరూపింపఁ దలంచినాను. ఇందులో నా యభిప్రాయము లేమియు లేవు. నూతన సమస్యా పరిష్కర్తల యుపయోగార్థమై కొన్ని సంగతులను దెలుపుట యీ వ్యాసమునుద్దేశము.

"ది ఫోరమ్"—అను "అమెరికా" పత్రికలో "యౌవనము క్షయించినదా!", అను విషయమును గురించి యిద్దరు నారీమణులు—ఏన్ని టెంపిల్ కన్యయు, రెజీనా మేలోని కన్యయు. రెండు వ్యాసములను వ్రాసిరి. "అమెరికా" పాశ్చాత్యదేశమే; కాని, అమెరికాలోని సాంఘిక పద్ధతులు యూరోపులోని కన్నఁ గొంచెము ముందంజ వేసినవి. . . . . .

స్త్రీల విషయమై, ముఖ్యముగాఁ గామ విషయములపట్ల, గొప్పయుత్ప్లవము సంభవించినదని వీరిద్దరు నభిప్రాయము నొసంగిరి. మేలోనికన్య యభిప్రాయమున యౌవన స్త్రీలకు భావిదశ యింతయు మేలుగనే పరిణమింపవచ్చునట. కాని, టెంపిల్ కన్యకు మాత్రము భయంకరపరిణామములు గలుగునేమోయను జంకు కలిగినది. అమెరికా యౌవనవతుల పద్ధతులు బాగులేవనియు, ఇప్పటికే పెక్కుమర్దనలు పట్టినవనియు, ఇందువలన యౌవనము క్షయించునవనియు, ఆమె యభిప్రాయము. ఆమె యిట్లు వ్రాసినది;—

"కళాశాలా పట్టభద్రురాండ్రైన కన్యలలోఁ జాలమంది గర్భిణులైరని న్యూయార్కు నగరములోని యొక సుప్రసిద్ధ-మనోరోగ-శాస్త్రజ్ఞుఁడు చెప్పినాఁడు. ఇట్టిదశలు సంభవించినవని దిగులు పొందుటకు బదులు, ఇది కేవలము మానవస్వభావమనియు, అన్ని కాలములలోను సంగతులిట్లే యుండెననియు, అతఁడు సంతోషముతోఁ జెప్పివైచి, యీసంగతిని తేలికగాఁ గొట్టి పారవేసినాఁడు. బహుశః అతఁడు చెప్పినది సరియే కావచ్చును; అన్ని కాలములలోను సంగతులిప్పటి వలెనే యుండియుండవచ్చును. కాని, దాని నేను నమ్మఁజాలను"

టెంపిల్ కన్యయభిప్రాయములో నామెస సమకాలికులైన యౌవనవతుల స్వైరత యింతకుఁ బూర్వమెన్నడును లేదు. మనదేశములో నున్న యౌవనవతులను గురించి ముఖ్యముగా మధ్యరకపు వంశములలోని వారిని గురించి, యామె చెప్పిన విషయములను విన్నచో నెవ్వరికైనను దిగులు పుట్టకమానదు. ఆమెయిట్లు వ్రాసినది.

"కళాశాలలలో నిప్పుడున్న పరిస్థితులు రెండు మూఁడు తరముల క్రిందట లేవని నా యభిప్రాయము,

నేను కళాశాలలోఁ బ్రవేశించిన మొదటి సంవత్సరము లో, నేను వసించిన భాగములో, మఱి పదిమంది బాలి కలుండిరి. కొందఱు పెద్ద తరగతిలోను, కొందఱు చిన్న తరగతిలోను, ఉండిరి.................ఆ పను నొకండు బాలికలలో నైను మంది మాత్రము, తమ స్వం తవచనము ప్రకారము, ,,శుద్ధలును, నిస్సంకరులును'' ఐయుండిరి. స్వైరిణులైన మిగత యాఱు బాలికలలోను, ఒకతె, న్యూయార్కునగరము నుండి వచ్చిన నర్తకి; ఇం కొకతె, పడమటినుండి వచ్చిన బాలిక, యశేష భాగ్యము లును, వాంఛలును, గల్గిన పిల్ల; మఱియిద్దఱు వైద్యుల కొమార్తెలు. మిగిలిన యిరువురు బాలికలలో నొకతె తన స్వైరిణీవృత్తి వలననే చేతి ఖర్చు సంపాదించుకొనునట్లు స్వయముగాఁ జెప్పుకొన్నది. కడపటి పిల్ల మాత్రము చాల జాలిపుట్టించునదై యుండెను. అందములు, చందములును లేనప్పటికి. మగవారి నాకర్షించుటకుఁ దగినట్లు ప్రయత్న ములు చేయుచుండెను. తన స్నేహితులలోఁ జాలమంది తనకంటె నందకత్తెలైనప్పటికిఁ దానే జయించుచుండెను.

,,ఇటువంటి పరిస్థితులకుఁ గళాశాలలు మాత్రమే నెలవులు కావు. అట్టివి ప్రతిచోటను గలవు; నగరముల లో వర్ధిల్లుచియున్నవి; పల్లెలలో, జనపదములలోఁ గూ డ యెక్కువగాఁ బ్రబలియున్నవి. కడచిన పది నెలలో నేను చాలమంది బాలికలతోఁ గలుపుగోలుగా నుంటిని కొందఱు నగరములలోను, కొందఱు చిన్నపట్టణములో ను, ఉండిరి......................వారికిని, పురుషులకును గలసంబంధములను గుఱించి, నాకు ప్రసన్నముగా బలుకు దురు. ఏ ప్రశ్నలడిగినను దాచాటప్పకుండ జవాబుచెప్పెదరు ఏమియుదాఁచరు. ఒక్కొక్కప్పుడు నాకాశ్చర్యముఁ గలిగినవిషయమేమనఁగా వీరుతమ స్వైరిణీ సాహసము లలో ననుభవించిన సౌఖ్యముకన్న నెక్కువగా వానిని గుఱించి చర్చించుటలోఁ బొందుచున్నారేమో యని నాకుఁ దోఁచినది.

నిరుడు, పాఠకసంవత్సరముల బాలిక యొకతె ప్రత్యేకముగాఁ బ్రబలమైన చరిత్ర చెప్పినది. ఆమెపేరు ,,ఐరిస్'' అనుకొందము ,,ఐరిస్'', పడమటిదేశములోని, మధ్యతరగతివంశములో, తగుమైన సంపదలు గలిగిన, బా లిక. ఆమె తెలివితేటలు గల కళాశాలా పట్టభద్రురాలు; మంచిగాయకురాలు. ఐనప్పటికిఁ గడచిన యారుసంవత్స ములలోనలుగురై మగుప్రియులును, అంతకు రెట్టింపు [illegible] గనుగాండ్రును "(Fancies)" తనకుండినట్లు చెప్పు న్నదిఐరిస్ రెండు మారులు గర్భము మోసినది. వివాహ మబద్ధమైనను, ఇట్టి సంగతులను వనకుఁ దెలిపిన పురు టెలిగ్రాఫ్ వార్తగాఁ బంపుట ఆమెకు ఒక [illegible] నది. తన సంగతి వానికిఁ దెలియఁజేయుటకిది యొక పాయముగాఁ జేసికొన్నది. ఆమెకు మంచి యాప్యాయ (ఆమె సుప్రసిద్ధ పాఠశాలలో నుపాధ్యాయిని) [illegible] చితులైన మగవాని వద్దనుండి ధనము పుచ్చుకొనుట [illegible] స్థితులలో ఏమో యొక సమస్యగాఁ గనుపించుచున్న [illegible]

........ ఇంకొక బాలిక; ఇరువదినాలుగు వత్సర వయసు చిన్నది, తన పేరునకంటించుకొనుటకు [illegible] పత్రాలుగలవి, నాకొక చమత్కారమైన కథ చెప్పె కొన్ని నెలల క్రిందట నామెకొక యుద్దేశము [illegible] ఇరువది యైదు వత్సరములు నిండు వఱకుఁ గన్యాత్వ నిలుపుకొనుట యవమానకరమని తలంచినది; ఏదో [illegible] కట్టి, యొగు విషయమై, చేయక తప్పదు. అప్పటికా యొక చిన్న కళాశాలలో నుపాధ్యాయినిగా నుండె కాని కళాశాల ముగియుటకు ముందే తన యుద్యోగ మానుకొని, తత్క్షణమే తనకు ,,నవమానము'' అని తోచు సంగతిని పరిష్కరించుకొన్నది.

టొంపిల్ కన్య వర్ణించిన యీ విపరీత సంగతు ఎక్కడో నున్నవి కావంట! ,,అతిశయముగాఁ బ్రబ [illegible] స్ననియు'' పల్లెటూళ్లలోఁ గూడ తీక్షణముగా [illegible] నియు, ఆమె చెప్పుచున్నది.

ఈ పై సంగతులన్నియు యుక్కువ వచ్చిగా [illegible] మను; కాని, ఇవి బహుప్రబలముగా ,,[illegible] నున్నవని టొంప్లిన్ కన్య చెప్పుచున్నది.

ఈ విషయమును ,,నేషన్ ఆండు అథీనియమ్'' [illegible] పత్రికలలో సేంటుజాన్ ఎర్విన్ అను సుప్రసిద్ధ [illegible] విమర్శకుఁడు చర్చించినాడు; ఇట్టి దుర్దశలు, ఇట్టి [illegible] ణీప్రాబల్యము, ఇంకను ఇంగ్లాండు మొదలైన [illegible] లలో లేవని యతని యభిప్రాయము.

వాస్తవి విమర్శనబుద్ధితో సాంఘికాభ్యుదయ [illegible] స్యలను బరిష్కరింపఁ దలంచినవారికి [illegible] ముఖ్యములని నాతలంపు.



రాజారంగారావు బహద్దరు గారు

ఆంధ్రస్వచ్ఛంద సేవాదళోపాధ్యక్షులు

హైద్రాబాదు.

చంద్రికాంత ప్రెస.

# సందేహము

ప్రొ. వి. రాఘవరావు

వచ్చియురాని యట్టి జవ్వనమునందు
కులికి నితరుల కులికించు కలికి వోలె
తలిరుటాకుల పైట లోపలను దాగి
తొంగి దోబూచులాడె దేల వెంగలివయి
పుష్పమా! యెందుకిట్టుల పొంగిపోదు?
ప్రకృతియందు జీవంపు రాసిలోన
మృదులతమమగు జన్మంబు నందితంచు
నొడలు తెలియని మదమున నుండె దేల?
త్రుంప నరుదెంచుచున్నాడు తోటమాలి
వాని గని గర్వముడుగు పుష్పంబ నీవు.
తమ్మ తేనియ నాలోన గలద'టంచు
నిక్కి పొగరెక్కి మసలుట నీకు దగునె?
తేనెలుంటాక మొనరింప బూని షట్ప
దంబు ఝుంకారములతోడ తరలివచ్చె
పుష్పమా! యెందుకట్టుల పొంగిపోదు?
చీరకుచ్చెళ్ల పదముల చెలిమి సేయ
కాలి యందెలు గజ్జెలు ఘల్లురనగ
నిన్నడల దాల్పవచ్చె ఆ కన్నె మిన్న,
పుష్పమా యెందుకట్టుల పొంగిపోదు?
ముదిత కచమున వాడిపోయెదవు సుమ్ము.

* * *

ఇట్టికష్టము లెన్ని రాబెట్టుకొనుటకై
జన్మమిచ్చియుండెను నీకు జగమునందు
బ్రహ్మ? ప్రతిప్రాణి బ్రతుకగూడ
నింతయేసుమ్మటంచు బోధించుకొనుటకే?



# ఉగాది పచ్చడి

"ప్రకాశం"



మనవాళ్లు సంవత్సరాది రోజున ఉగాది పచ్చడి లేక ఒక చిత్రమైన పచ్చడి చేస్తారన్నమాట అందరికి తెలిసిందే. దీన్లో ఏమేం వేస్తారో తెలుసుకాదూ? కొత్త చింతపండు, బెల్లం, మామిడికాయ ముక్కలు, అరటిపండ్లు, వేపపువ్వు, చెరుకు ముక్కలు మొదలైనవి. దీనిలో "పోపు" పెట్టరు, సంవత్సరాది నాడు తెల్లవార గట్టే లేచి తలంటి నీళ్లు పోసుకొని, కొత్త బట్టలు కట్టుకొని, ఈపచ్చడి కొంచమునోట్లో వేసుకొని, నూతన సంవత్సరపు జీవితంలో ప్రవేశిస్తారు. ఈ ఆచారం మనలో అనాదిగా వస్తోంది. కాని దీని కారణం ఏమిటో, దీని అర్థం ఏమిటో మనలో చాలా మందికి తెలియదు. చాలా ఘంటేమిటి, ఎవరికీ తెలియను. కాని దీని రహస్యం నాకు నిన్న బోధపడింది. అదేదో ఈకథ చదివిం తర్వాత మీకే తెలుస్తుంది. గనుక ఇప్పుడు చెప్ప దలచుకోలేదు. ఇంక నాకథ మొదలెడతాను.

నిన్న ఉదయమే లేచి మామూలుగా మావాళ్లందరితోటి తలంటి నీళ్లుపోసుకొని కొత్తబట్టలు వేసుకున్నాను. మాఅమ్మ ఉగాది పచ్చడి చేసి సిద్ధంగా ఉంచింది. అందర్నీ రమ్మని పిలవడం మొదలెట్టింది. కాని మేము అతి ఖులాసాగా అటో ఇటో తిరుగుతూ అల్లరి చేస్తున్నాం. ఇంతలోకి మా మాస్టరు గారి నౌఖరువచ్చి "మా మాస్టరుగారు రమ్మంటున్నా"రన్నాడు. మా మాస్టరు గారంటే మా అందరికీ ఆదో మోస్తరు గౌరవ[...] భయమూను. మెట్రిక్ క్లాసులోకి వచ్చినా మా[...] యంను భయంపోలేదు. ఆయన రిఫార్మర్ అవ[...] ఆయన మీద భక్తి. మా అమ్మ అన్నయ్య వాళ్లు [...] లిడుతూంటే నాకు వాళ్లమీద చాలా కోపం[...] ఆయన హేట్, న్యూట్. వాళ్లింట్లో ఇంగ్లీషు [...] నాకు పూర్తిగా ఇష్టం లేదు, కాని ఆయన [...] ట్లాడుతూంటే, పాపం, ఆయన కళ్లల్లో, మ[...] టల్లో ఏదో ఒక హృదయ నైర్మల్యం (Sin[...] కనపడుతుంది దానితో ఆయన మీద మం[...] (prejudice) అంతా ఒకేసారి పోయి [...] గౌరవంపుడుతుంది క్లాసులో ఒకొక్క[...] ప్రతూ చెప్రతూ ఏదో స్త్రీల విషయమో [...] విషయమో వచ్చినపుడు, పాఠం చెప్ప[...] ప్లాట్ ఫారమ్మీదఅలా ఆడి పోతూ, కళ్లల్లో[...] య నైర్మల్యాన్ని కురిపిస్తూ మాట్లాడుతూ [...] ఆయన చెప్పినట్లల్లా చేసేదామా అనిపిస్తు[...] ఇంటికొచ్చిన తర్వాత మావాళ్ల ఆచారాలు [...] చూస్తే: స్నేహితుల్లో కొందరు చెప్పే మాట[...] నా అభిప్రాయాలు మళ్లీ మారిపోయి యథా[...] అయిపోతాయి. ఆయన చెప్పిన దొక్కటీ [...] నేను చేసింది ఏదీలేదు కాని, మా మాస్టరంటే [...] నాకుచాలా గౌరవం. ఆయనకూ[...]దా నామీద[...] చాలా ప్రేమ. నామీదే కాదు. కొందరు [...]

వాళ్లమీద కూడా ఆయనకి ప్రేమే. ఆయన దగ్గర సహాయం పొందుతూ, ఆయన్ని మోసంచేసి, వెనకాల తిట్టే వాళ్లు ఎందరో కూడా వున్నారు. అందర్నీ ఒక్కలాగే చూస్తారాయన.

నౌఖరు వచ్చి మాష్టరుగారు రమ్మంటున్నారనగానే, తక్షణం టోపీవేసుకొని జోళ్లు తొడుక్కొని సిద్ధమయ్యాను. అలాగు అప్పుడప్పుడు మమ్మల్ని ఆయన ఇంటికి పిలిపిస్తుండడం మామూలు. వెళ్లినప్పుడల్లా ఏవో చక్కని కథలు చెప్పి, ఏవో ఆట ఆడి అతిఖులాసాగా ఉంటారు వారితో. ఆయనచేత పిలవగానే పరుగులమీద వెడతాం మేం కొందరం ఆయనింటికి. నేను వెళ్లడానికి సిద్ధమవడం చూసి మా అమ్మ, ,,పచ్చడి తినకుండా మాష్టరుగారింటికి పోవడానికి అంత తొందరెందుకురా?'' అని కేకేసింది. కాని వినిపించుకోకుండా, ,,ఇప్పుడే వస్తున్నానని'' సైకిల్ ఎక్కి మాష్టరుగారింటికి రివ్వన వెళ్లి పోయాను.

అక్కడికి వెళ్లేసరికి మా మామూలు స్నేహితులందరూ హాల్లో కూర్చొని ఉన్నారు. మాష్టరుగారు కూడా వాళ్ల మధ్య కూర్చొని ఆయన మామూలు నవ్వుముఖంతో ఇష్టాగోష్టిగా మాట్లాడుతున్నారు. ఆయనకి నమస్కారంచేసి కుర్చీలో కూర్చున్నాను. ,,ఇంక అందరూ వచ్చారు గనుక మిమ్మల్ని పిలిచిన పని చెప్పమన్నారా?'' అన్నారు మాష్టరు గారు. ,,యస్ సర్!'' అన్నాం అందరం. ,,సరే చెప్తాను కాని ముందేదైనా ఒక ఆట ఆడుకుందాం'' అని ఫింగర్ బిలియర్డ్స్, డ్రాఫ్ట్స్ తెచ్చి ఎదురుగుండా పెట్టారు. కొందరం ఇది, కొందరం అది, ఒక అర గంట ఆడాము. ఆయన కొంచం సేపు మాతోను, కొంచం సేపు వాళ్లతోనూ ఆడుతూ, అందర్నీ నవ్విస్తూ ఆడారు. ఇది అయిపోయిన తర్వాత, ,,ఈ వాళ సంవత్సరాది కదా, మీరందరు ఉగాది పచ్చడి తిని వచ్చారా?'' అన్నారు. ఇంకా లేదని కొందరం తిన్నామని కొందరం సమాధానం చెప్పాం. తిన్నా సరే తినకపోయినా సరే కాని మాయింట్లో కొంచం పచ్చడి తినడానికి మీకేమైనా అభ్యంతరం ఉందా?'' అని అనగా చాలా మంది, ,,ఏం అభ్యంతరం లేదండి'' అన్నారు. కొందరు ఇటూ అటూ చూస్తూ అనుమానిస్తూ ఊరుకున్నారు. ,,ఏం భయపడకండి. ఉగాది పచ్చడికి ,,పోపు'' పెట్టరు గనుక దానికి అంటులేదు. ఎవరు చేసినా తినవచ్చు. అయినా ఇది మా వంట మనిషి చేయలేదు లెండి. నేనే చేశాను. అట్టే అనుమానం అక్కర్లేదు'' అన్నారు. కాని నాకిదేం బోధపడలేదు. 'ఈయన ఇలాటి ఆచారాలకి లెక్క పెట్టరు కదా, ఇదేమిటి ఉగాది పచ్చడి పెడతానంటాడేమిటి!' అని నాకు చాలా ఆశ్చర్యం తోచింది. ఇంతలో మాష్టరు గారు లోపలికి వెళ్లారు. మేమందరం ఒకళ్ల సందేహాలు ఒకళ్ని అడగడం మొదలెట్టాం. ఎవరికీ ఏమి బోధపడలేదు ఈయన ఉగాది పచ్చడి సంగతి. అంటే ఏం తంటా వస్తుందో అని చాలా మంది భయం చూపెట్టడం మొదలెట్టారు. ఇంతలో మాష్టరు గారు కొన్ని చైనా ప్లేట్లు పట్టుకొని వచ్చి హాల్లో రౌండు టేబిల్ మీద పెట్టి అందర్నీ కుర్చీలు దగ్గర లాక్కమన్నారు. అనుమానిస్తూ కొందరూ, జోరుగా, ఖులాసాగా కొందరూ, లాక్కున్నట్లు నటిస్తూ ఇతరుల్ని ముందుకు తోసి చోటులేనట్లు వెనక్కి తగ్గి కొందరూ ఇట్లా కూర్చున్నాం. ,,ఏదండి, పచ్చడేదండి మాష్టరుగారూ?'' అన్నారు మాలో కొంచం చురుకైన వాళ్లు. కొందరు ఇదిగో వస్తూంది, అన్నారు. ,,కొంచం ఆలస్యం ఉంది ఈ లోపుగా ఏదైనా మాట్లాడుకొందాం'' అన్నారు ఆయన. మా మాష్టరు గారి మాట్లాడే మాటేమో తెలుసు. స్త్రీ స్వేచ్ఛ విషయం, పాతభావాలు అణగదొక్కి, నూతన భావాలు సంపాదించడం, సంకుచిత స్వభావాలు వదిలేసి, ఉదారస్వభావం అలవాటు చేసుకోవడం, వాక్శూరత్వం మాని, కార్యశూరత్వానికి ఉద్యమించడం, ఇట్లాటివి ఆయన ఎప్పుడూ చెప్పే మాటలు. వీటిలో చాలా వరకు మాకు పూర్తిగా బోధపడకపోయినా, వాటిని ఆచరణలో పెట్టే వాళ్లం మాలో ఎవ్వరం లేకపోయినా, ఆయన ఆ మాటలు చెపుతుంటే వినడం మాకు చాలా సరదా. ఒక్కొక్కప్పుడు ఆయన మాట్లాడుతూంటే, స్త్రీలని అన్యాయంగా చూసే వాళ్లని, స్త్రీలని ఇంట్లో పడేసి ఉంచి వాళ్లకి ఉన్నత విద్యతో పనిలేదు, కుట్టుపని వంటపని, పిల్లల్ని సంరక్షించుకునే పనిచాలు, అంటూ కబుర్లు చెప్పేవాళ్లని మీదపడి చంపేస్తారా ఏమి అనిపిస్తుంది. ఆ ఉద్రేకంలో ఏదో కొంత ఆధ్యాత్మికావేశం కనపడుతుంది. అందుచేత వెనక్కి తగ్గిన వాళ్లు కూడా కొంచెం

ముందుకు వచ్చి, అందరూ ఆయన మాటలు వినడం మొద లెట్టారం. మెల్లిగా మొదలెట్టారు. నేను అనుకున్నట్లే. సరిగా మొదలెట్టారు. ఇంక ఆయిన చెప్పినవన్ని ఇక్కడ వ్రాస్తే చోటుచాలదు. ఒక చిన్న గ్రంథం అవుతుంది. ఎంతో చక్కని నవ్వు నవ్వుతూ, ఉద్రేకంతో కాలి పోతూన్న సమయంలో కూడా ముఖంలో సౌమ్యత్వం కదలకుండా, మన సంఘంలోఉన్న మంచి లక్షణాలు చూపెడుతూ, లోపాలు కనబరుస్తూ, దిద్దవలసిన పద్ధతులు సూచిస్తూ, ఒకగంట దగ్గర దగ్గర లెక్చరిచ్చారు. ఆ విషయాలన్ని తర్వాత ఏదైనా పత్రికలో ప్రకటించ వలసిందే కాని ఇప్పుడు వ్రాయడానికి ఇక్కడ చోటు లేదు. అంతా చెప్పి చివర ఇట్లా ముగించారు. ,,ఇప్పుడు ఇదంతా చెప్పినదెందుకో మీకేమైనా తెలుసునా? ఈ వాళ సంవత్సరాది. ఈ దినంయొక్క ప్రాముఖ్యత మీరు బాగా తెలుసుకోవాలి. తలంటి నీళ్లుపోసుకోడం, కొత్త బట్టలు కట్టుకోడం, ఉగాది పచ్చడి తినడం, పొట్టనిండా భోజనంచేసి దొర్లడం, పేకాటతో రోజంతా వృథా పుచ్చడం వీటితో సంవత్సరాది గడిపేస్తే వాళ్లు ఒక గొప్ప తరుణం పోగొట్టుకుంటున్నారు. ఈవాళ సెలవు ఇవ్వ కపోతే కొంప మునిగిపోయినట్లు గోలచేస్తారు. మా మతం పోయింది, ఆచారం పోయిందని నెత్తి నోరు కొట్టుకుం టారు. ఎందుకుసెలవు? ఈ పిచ్చి పనులకోసమా? మతం, పండుగ అంటే ఇదా అర్థము? మీరు ఆలోచించండి. ఆలోచించకుండా నామాటలు త్రోసెయ్యకండి. మీరు యువకులు. ముందు దేశనాయకులయేవాళ్లు దేశం యొక్క భావిభాగ్యం మీ చేతుల్లో ఉంది. గనుక నా హృద యంలో ఉన్న కొన్ని నా అత్యంత ప్రియమైన భావాలు ఈ వాళ మీ ముందు పెట్టినాను. అక్కడక్కడ కొం చం గట్టిగా మాట్లాడిఉంటాను. కాని మీ హృదయాలు నొప్పింపడం నా అభిప్రాయం కాదు. ఈ విషయాలు ఎంత తీవ్రంగా చెప్పినాచెప్పవలసిందే. ప్రతి సంవత్స రాదిరోజున మనం ఒక విధమైన ఆత్మ పరీక్ష చే సుకోవాలి. జరిగిపోయిన సంవత్సరంలో మనం చేసిన లోపాలు జ్ఞప్తికి తెచ్చుకొని ముందు సంవత్సరములో వీటిని సరిపెట్టుకునే ప్రయత్నాలు చేస్తామని ఒక విధ మైనటువో నిశ్చయం చేసుకోవాలి. నూతన ఆదర్శాలు, నూతన ఆకాంక్షలు పెంపొందించుకోవాలి. ఈ ... లు చెప్పడం కోసమే ఈవాళ మిమ్మల్నందరి ... నది. మీరందరూ వచ్చినందుకు చాలా సంతో... వుంది. మీ కందరికీ శుభ ప్రదమైన నూతన ... మును దేవుడు ప్రసాదించు గాక! (Wish you a Happy New Year)" అని మా అంత... షేక్‌హాండు చేశారు. ,,బహుశః మీ వాళ్లంద... కోసం చూస్తూ ఉంటారు కాబోలు, ఇంక ... అన్నారు. అందరం లేచి నిల్చున్నాం. మా ముఖాల్లో ... విధమైన నూతన కాంతి. నూతన నిశ్చయం, ఆనం... త్వంకలిసి తాండవమాడుతున్నాయి. ఇదివరకు ఎక్క... మాష్టరు గారు ఇలాంటి మాటలు చెప్పారు కాని ఎప్పుడూ మా హృదయాల్లో ప్రవేశించలేదు. ఇంటి... దామని అనుకుంటూండగా మాస్నేహితుడొకడు ... ఏదండి మాష్టరూ?" అన్నాడు. ,,ఇదేమిటిపచ్చడి ... కటినుంచితిని ఇంకా అడుగుతావేమిటి? అన్నారు... మాటలేమిటి అట్లా అంటారని ఆలోచిస్తూంటే ... ఆయనే మమ్మల్ని అడిగారు, ,,ఉగాది పచ్చడి... మేం వేస్తారు?" అని. చెప్పాం. ,,ఆ వస్తువుల... లేమిటి? పులుపు, చేదు, తీపికదా! నేచెప్పిన మా... అవి అన్నీ ఉన్నాయో లేదో చూసుకోండి. ... మనం చేసిన పాపాలు లోపాలుజ్ఞప్తికి తెచ్చుకో... పులుపు, వాటికోసం పశ్చాత్తాపం పడ్డం చేదు, ... కోసం ఆశతో ఉత్రూట లాడ్డం తీపి. ఇంకెన్ని పచ్చడి కావాలిమీకు? గుడ్‌బై" అని నవ్వుతూ ... మళ్లారు. ఈ పచ్చడి అర్థానికి అందరం ఒక్క... పెట్టున నవ్వి మాష్టరు గారి దగ్గర సెలవు ... ఇళ్లకి పోయాము.

ఇంట్లో అడుగు పెట్టగానే, ఏంరా ... ఆలస్యంచేశావు? అప్పుడే అందరు పచ్చడి ... విద్దంటూంటే ఇప్పుడే వస్తానని తుర్రుమని ... ఇంటికి పరిగెత్తావు. అదిగాకుండా ... ప్రొద్దుటా వాళ్లింటి కెందుకు వెళ్లడం ... పొద్దున్నేను. సరేలే, రా, త్వరగారా, ... నోట్లో వేసుకో, అంది మాఅమ్మ. మామాష్టరుగా... పులుపు చేదులు బాగా ఎక్కువయి నామనసుకి ...

నిశ్చయం తోటి, తీవ్రాతి తీవ్రత పచ్చడి మా మాష్టరుగారింట్లో తిన్నాను; ఇంక అక్కర్లేద''న్నాను. అదేమిట్రోయ్! వారింట్లో పచ్చడి తినడం ఏమిటి? ఏశిక్షనట్లే వుంది; వెధవ వేళాకోళం మాటలు. రా, త్వరగా రా; నేనింక మడిలోకి పోవాలి. ఈ పచ్చడి కొంచెం నోట్లో వేసుకో, అంది. ,,లేదమ్మా, నిజమే; మా మాష్టరుగారు పెట్టారు. మా అందరికీ ఈ వాళే ఉగాది పచ్చడి. అని అంక తెప్పుకూ తిరిగి మా అమ్మకిచ్చాను. మా వదిన (నా ఈడుది) మా చెల్లెలు (పాపం రెండు నెల్లాయె, వితంతువు అయి మా ఇంట్లోనే ఉన్నది) కూడా నా లెక్చరంతా ఎంతో శ్రద్ధతో విన్నారు. మా అమ్మకి నా మాటలు బోధపడలేదు. కాని మా వదినకి, చెల్లెలికి చాలా వరకు తెలిశాయి. ప్రేమ విగురించి, స్త్రీ స్వేచ్ఛను గురించి నే చెప్పిన మాటలన్ని విని వాళ్లు కళ్లమ్మట నీళ్లెట్టుకుంటూ విన్నారు. మా అమ్మ ,,ఇలాంటి వెర్రి వెధవ మాటలాపేయి, అన్నయ్య వచ్చిన తర్వాత వాడితో చెప్పి తన్నిస్తాను. నోరుమూసుకో, గాడిదా, ఇదేమిటి ఇలా తయారవుతున్నావు? కిరస్తానం వెధవ్వయిపోతేనే యోగం పట్టేట్లాగుంది, అంటో, ఏమేమిటో నన్నింత తిట్టిపోసి, తన్ను తిట్టిపోసుకొని, చచ్చిపోయిన మా నాన్నగారిని తలుచుకొని కొంచెం సేపు ఏడిచాది. ఆయన మహారాజు, ఇలాంటి అవాచ్యాలేమి వినకుండా వెళ్లిపోయారు. నాకింకా ఈ ఖర్మాలన్ని అనుభవిస్తూ ఈ లోకంలో ఎన్నాళ్లుండమని రాశాడో భగవంతుడు. ఈ పెద్ద చూలిన మాష్టర్లు, ఈ ఇంగ్లీషు చదువులు. వచ్చి సర్వం మాలకూడు చేసేస్తున్నాయి. అని మామూలు పాటపాడి మళ్లా పచ్చడి తినమనడం మొదలెట్టింది. ,,లేదమ్మా, నేనిక్కడ నుంచి ఈ పచ్చళ్లు గిచ్చళ్లు తినదలచుకోలేదు. ఇదే కాదు. ఈ పిచ్చి వేషాలన్నీ చాలా మానేస్తాను. ఈ వాళనుంచి ఏమైనా సరే. ఏకులోపం వచ్చినా సరే, నువ్వేడిచినా సరే.'' అని భీష్మించుకూచున్నాను. ఆవేళ మా అన్నయ్యకి నాకు యుద్ధం అయిపోయింది. మాటకి మాటనే సమాధానం చెప్పానని కోపంతో నన్ను తన్నాడు అతను. నేను తన్ని తిరిగి చెయ్యేసిముట్టుకోలేదు. దానితో అతనికి మరింత ఉడుకు మాత్రం వచ్చింది. ఏమైనా సరే కాని ఆవేళ ఉగాది పచ్చడి తినలేదు. అంతా అయిపోయిన తర్వాత మధ్యాహ్నం వదిన నా గదిలోకి వచ్చి, ,,బాగా చేశావోయి నువ్వీవాళ'' అని హెచ్చరించింది.





# తిక్కన

సిరుగూరి జయరావు

తెలుఁగులోకము లోనఁ దెలివి నిలిపిన వెలుఁగు,
తెలుఁగుపాటల తేఁట తీపుఁ జూపిన పులుగు,

తెలుఁగులో కిలకిలలు
తెలుఁగులో తళతళలు

తెమలించి, స్పృశించి, తెచ్చియిచ్చిన పాట
తెలుఁగుమనసుల్లోనఁ దెమ్మచల్లిన యూట

ఏ మింట నిపుడున్నదో?
పిలచినా——
మాకంట నేలపడదో? ౧

తెలుఁగుసంద్రముహోరుపిలచు నెవ్వని పేరు
తెలుఁగు దేశమ్ముపైరు తెలుపు నెవ్వని పేరు

తెలుఁగుపలుకుల కన్నె,
తెలుపు మెడపై వన్నె,

చక్కఁగానాలకించి నవురుమీటిన పేరు,
"తిక్కనా! తిక్కనా! తిక్కనా!" అను పేరు,

ఏ రూపమును బట్టెనో?
వెదకినా——
మా చూపునకుఁ దట్టునో? ౨

అమృతంబుచేఁబూని యవతరించిన వాణి
కమనీయ తపనీయ గరిమఁ దాల్చిన వాణి

జగమందు నొకచోటు,
యుగమందు నొకమాటు,

ఏర్పఱించుక వచ్చి, యిటునటుల తిలకించి,
తూర్పుకొండలవద్దఁ దొలుదొలుత పులకించి,

తెలుఁగుమాత్రమె తలఁచెనా?
భళి భళీ!——
తిక్కన్ననే వలచెనా? ౩

అణువులో, బ్రహ్మాండ తనువులో నొకరీతి
నఖిలచలనమువలన ముఖరించు సుఖగీతి

తనలోన లీనమై,
తనతోడి ప్రాణమై,

తెలుఁగువీణియమీఁద నలవరించినపాట,
తెలుఁగుమేడలమీఁదఁ గలవరించినమాట,

మఱలఁ బాడగరావయా
తిక్కనా!——
మఱల నాడగ రావయా ౪

కైలాసగిరికి వాహ్యాళికై వెడలితివో?
పాలమున్నీటిలోఁ దేలుటకు వెడలితివో?

కొండంత గొప్పలకు,
కొమ్మకైన తెప్పలకు,

నీకావ్యధోరణియె నీకుఁదోలుతను సాక్షి,
నీకార్యధోరణియె నీకుఁదోలుతను సాక్షి,
ఇప్పుడెక్కడ నుందువో?
తిక్కనా!—
ఏమిచేయుచు నుందువో? ౫

అఖిలమందఖిలమై, యణువునందణువగుచు,
ఆనందసత్యవిజ్ఞాన సంహతివగుచు,
ముక్తజీవము తోడ,
భక్తభావము తోడ,
మాలోపలనుగూడ మడఁగియున్నావేమొ?
మాపాటలనుగూడ మనుచున్నావేమొ?
నీమాట తెలుపవయ్యా!
తిక్కనా,—
నీమాయ తెలుపవయ్యా! ౬

తాఁటాకులకుఘంటఘాటి చూపిన చేయి
పోటుమగలకుఁ గత్తివ్రేటుచూపిన చేయి
రసవాహినులతోడ,
రక్తవాహినులతో,
భారతోన్నతిఁ జూపి, భారతోద్ధతిఁ జూపి,
బహుళాంధ్రలోక సంభ్రమముఁ జూపినచేయి
ఒకమారు సాఁచరాదా?
తిక్కనా!—
ఒకయూఁత నొసగరాదా! ౭

తంత్రరాజ్యాంగ సూత్రములు వర్ణించినా
తాఁకి, గరువపుబంట్ల తలలు దొర్లించినా
చేత చేసినదైన,
వ్రాతవ్రాసినదైన,
ఒక్కటేయురుఘాటి, ఒక్కటే పరిపాటి;
మొక్కవోవని విశ్వమూర్తశక్తుల మేటి!
నీసాటి యెవ్వరయ్యా?
చూపునో,—
నిలువెల్ల నవ్వరయ్యా! ౮

మెఱవుఁదీఁగెలలోని మిసిమిసంతయుఁ బేర్చి,
ఉఱుముచప్పుకులోని చుఱుకుఁదనమునుగూర్చి,
అదికొంత, యిదికొంత,
అలవరించిన వింత,
నీసారకవితాధునీవారి మగ్నమున
నీవైరివనితామణీ హృదయభగ్నమున
చూపింప మఱల రావా?
తిక్కనా!—
చూపింప మఱల రావా? ౯

ఆహితాగ్నులఁ గాంచె నటు సోమిదేవితో
ఆహవాగ్నులఁ గాంచె నిటు భూమిదేవితో
సత్రదీక్షుల తోడ,
క్షాత్రకక్షుల తోడ,
మంత్రసూక్తులలోన మహిమ చూపినశక్తి,
యంత్రయుక్తులలోన నదరు చూపినశక్తి,
మాకువరమీయ రాదా?
తిక్కనా!—
నీకుమారులము గామా? ౧౦




## శాసనములు

### (ఆంధ్రపరిశోధక సంఘము-హైద్రాబాదు)

సువాత రెండవ సంచికలో నాగులపాటి శాసనముల గూర్చి వివరించి యుంటిమి. శాసనముల మూలము ప్రకటించుట సమంజసమని పలువురు గోరియున్నందున వానిక్రింద యథాప్రకారము ప్రకటించు చున్నాము.

ఆ. ప. కా.

### నాగులపాడు, దక్షిణపుటాలయము

ఎద్దు, కత్తి, సూర్యుడు, లింగంపానపట్టం, చంద్రుడు.

1 స్వస్తి సకలగుణ గణాలంకార పరనారీదూర అ 1
2 మనికంటి పురవరాధీశ్వర వీరలక్ష్మినికేశ్వర 2
3 మాబ్బా అభిమ రంగరామ విశరణకన్నా 3
4 శౌర్యా స[ం]పన్న శౌచ
గాంగేయపతి హితాంజనేయ 4
5 స్వామి ద్రోహరగండ చేతనదండ సత్యరత్నాక 5
6 ర దుష్టజన భీకర మనుమకులాదిత్యసుభ 6
7 టసంస్తుత్యనామాది సమస్తప్రశస్తి సహితం శ్రీ 7
8 మతుమండలిక రేచెల్ల కాట్రెడ్డి అయ్యాంబికా 8
9 నందనుండు శకవరుషములు ౧౧౫౭ 9
10 లగు జయసంవత్సర వైశాఖ శుద్ధ త్రయో 10
11 దశి గురువారమున తమతండ్రి నామిరెడ్డి 11
12 కిందమతల్లి అయ్తసానంమహాందమహాంబి
13 న్యము గాను శ్రీనామేశ్వర దేవరాను శ్రీఅర్తే
14 శ్వర దేవరాను శ్రీకాటేశ్వర దేవరాను ప్రతి
15 ష్టసేసి తంమేలిన చలమర్తిగండ కాకతిగణ
16 పతి దేవమహారాజు ప్రిథివిరాజ్యం సేయంగా
17 ను ఈదేవరకు అంగరంగభోగాల బెట్టినవ్రిత్తి

### ప్రక్కనున్న శాసనము

1 నాగులపాటి మునిడికాలు
2 ఏ అంట అయును మఱుతురు
3 ఆయూరి తూర్పన నామస
4 ముద్రమను చెఱ్వునందు రెండు
5 మఱుతురు ఆతూర్పన వి
6 శ్వనాథ సముద్రమను చెఱ్వు
7 నందు నాల్గుమఱుతురు వె
8 రసి పక్షునకొండు మఱుతు
9 రూను ఆచంద్రార్కముగా
10 నిస్తిమి॥ యావచ్చంద్రశ్చ సూ
11 ర్యశ్చ యావత్తిష్టతి మేదిని
12 యావత్కృవకథాలోకే తావత్క్షేత్రే
13 ం పత్రిపాల్యతే॥ ఈధర్మమురె

14 వ్వరెంబ్రతి పాలింతురు వారికి 14
15 అనంతపుణ్యము ఈధమ్మాన్ 15
16 నకు ఎవ్వరే బాధసేయుదురు 16
17 వారికి అనేక బ్రిహ్మకల్పాలు నా 17
18 యకనరకములు। ఇదేకదా పెద్ద 18
19 ల వచనములు॥ స్వదత్తాంపర 19
20 దత్తాంవా యోహరేత వసుంధ 20
21 రా॥ షష్టిర్వర్ష సహస్రాణివి 21
22 ష్ఠాయాం జాయతేక్రిమిః॥ శత్రు 22
23 ణాపిశృలోధమ్మః పాలనీయః 23
24 ప్రయత్నతః। శత్రురేవ భవేచ్ఛతృ 24
25 ద్ధర్మశ్శత్రూనకస్యచిత్॥ 25

నాగులపాడు ఉత్తరపుటాలయము

1 శ్రీస్వస్తిశ్రీ సకలగుణ గణాలంకార 1
2 పరనారీదూర అమనగంట్టి పుర 2
3 వరాధీశ్వర వీరలక్ష్మీనివేశ్వర పరమమా 3
4 హేశ్వరమార్బ్గ అభిమ రణరంగరామ 4
5 వితరణకర్ణ: శౌర్య శౌపట్ను పతిహి 5
6 ఆంజనేయ శౌచగాంగేయ సత్సర 6
7 త్నాకర దుష్టజన భీకరమను మకులాది 7
8 త్యసుభట సంస్తుత్యనామాది సమస్తప్ర 8
9 శస్తిసహితుండగు శ్రీమతు రేచెర్ల కా 9
10 మిరెడ్డి అయితాంబికా నందనుండు॥
శకవర్షములు ౧౧౪౦ యగు 10
11 కాలయుక్త సంవత్సర మాఘ శుద్ధ
విదియా శనివారమున నా 11
12 గుల పాటను.................... 12
13......దితూవ్వన నామ 13
14 సముద్రముని చెఱ్వ్కెంతు. పాద్గువేవిష్ణూ పాలు
ఆచంద్రార్కమును గాను . 14
15 ఇస్తిమి॥ యావచ్చంద్ర.. ........... 15
16 ... ... ... 16
17 ... ... ... 17
18 ... ... ... 18
19 ... ... ... 19
20 ... ... ... 20
21 ... కస్యచిత్॥ ... 21

ప్రక్కనున్న శాసనము

1 రక్తాక్షి సంవత్సర జ్యేష్ఠ శుద్ధ 1
2 పాడ్యము గురువారాన గణపిర 2
3 డ్డిన్ని మల్లిడ్డి తమకంద్రి కామిర 3
4 డ్డికి తమకల్లి కామిసానికిం దమకుం 4
5 బుణ్యముగాను ముసిడి కాల్వను 5
6 నిరుసేలపడి మఱుకుడు నామ 6
7 సముద్రము తూర్పు గొమ్మనవె 7
8 లిపొలము లాఱుపుట్లున్న అ 8
9 చంద్రార్కముగాను అగ్గరం 9
10 గ్గభోగలకు ఇస్తిమి। 10
1 స్వస్తిశ్రీ మతుకాకతి గణ 1
2 పద్దేవ మహారాజుల 2
3 కుంబుణ్యముగాను 3

నాగులపాడు ఉత్తరపు టాలయము

1 స్వస్తిశ్రీ శకాభ్యుదయ శకవర్షంబులు ౧౪౬౫
అగునేండి శోభిసంవత్సర కార్తీక బ॥ ౧౦ గు॥
యొరికు సానింగారు ............ 1
2 లపాటికిమ చెరకువదోంటలు అకుందోంటలు యీ
నాపు చేలుకాల్చియ్యంచు (..................
ఆలీ సర్కారుహుజూరు) 2
3 (సైనుచిమ్మను బాలను ఛాధరి) చక్కబండ్డి నాగిరెడ్డి
ప [ట్ను] రెడ్డి యేలిక ............
4 మూంన్దరిమ పుత్రపౌత్రలు ఆచంద్రార్కముగాను
ఘూశారమ యిచ్చి బాధ్యలు...కరిమాదతో
మ్మది...లుమ తుశలవ్రాసిన కుళకర్ణి తడక 4
5 మహకాగిరాజా 5

## నాగులపాడు ఉత్తరపు టాలయము

1 శ్రీస్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౪౦౪ అగు 1
2 సుభకృత్తు ఫాల్గుణ బ॥ ౧౦ బు శామరాజు వె 2
3 ంకటాద్రిరాజుంగారు పృధ్వీరాజ్యం సేయంగాను వు 3
4 చ్చుపల్లి అక్కిరాజు పోతరాజుంగారికొడు 4
5 కు కాచనంగారనుజుండు అక్కన కామేశ్వ 5
6 ర లింగ్గానకు సానపట్టము సేఇంచ్చెను శ్రీ 6

## నాగులపాడు దక్షిణపు టాలయము

1 రక్తాక్షి సంవత్సర జేష్ట శు॥ ౧ గు।
శ్రీమతు కొమయ్య 1
2 నాయయ మల్లయలు మాతాండ్రి కాట్రెడ్డికి మాత 2
3 ల్లి పారసాని అమ్మకు మాకం బుణ్యము 3
4 గాను మసీదికాలువను పెట్టిన వ్రి 4
5 త్తి నాలుగు మటుతుర ఇత్రికి 5
6 ధవళ। క్షయసంవత్సర పాల్గుణ బ॥ ౧౧ సో॥ శ్రీమ 6
7 తు కామయంగారు మాతండ్రి

కాట్రెడ్డిం గారికి మా
8 తల్లి పారసానమ్మంగారికి మాకం బుణ్యము
9 గాను శ్రీనామేశ్వర దేవరకూ శ్రీఅర్తేశ్వర ది
10 వరకూ శ్రీకాటేశ్వర దేవరకూను నాగులపాటి
11 తూర్పున నామసముద్రాన రావికాల్వంను
12 అంగరంగ భోగానకై పెట్టినవృత్తి నాల్గుమట్టు
13 క్షయసంవత్సర ఫాల్గుణ బ॥ ౧౧ సో॥
శ్రీమతు నామ
14 యంగారు మాతండ్రి కాట్రెడ్డిం
గారికి మాతల్లి సార
15 సానమ్మంగారికి మాకం బుణ్యముగాను శ్రీనామే
16 శ్వర దేవరకూ శ్రీఅర్తేశ్వర దేవరకూ
శ్రీకాటేశ్వర
17 దేవరకూను పినదేవులపలి దక్షిణాన చింతలచె
18 ర్వున రెండు మటుతురు ఊరొ
19 ద్ద చెర్వు రెండు మటుతురు
20 నువృత్తి అంగరంగ భోగాలకు
21 పెట్టితిమి.



# గ్రంథవిమర్శనము

ఈ క్రిందిగ్రంథములు మాకార్యాలయము చేరినవి. కృతజ్ఞులము.

## క్షాత్రకాలపు హింద్వార్యులు

గ్రంథ కర్త: చింతామణిరావు వైద్యగారు
ఎం.ఏ. ఎల్‌ఎల్.బి.

అనువాదకులు: మాడపాటి హనుమంతరావు గారు హైకోర్టు వకీలు.

పైగ్రంథము పువ్వాడ వెంకటప్పయ్యగారి సంపాదకత్వమున నడుపబడుచున్న కృషిప్రచారిణీ గ్రంథమాల యొక్క ద్వితీయకుసుమము.

గ్రంథ కర్త చరిత్రకారులకు చిరపరిచితులు. వీరుహిందూయుగముపై పలుగ్రంథముల వ్రాసివినుతకెక్కిరి. వీరి హిందూమహాయుగము యొక్క మధ్యకాల చరిత్రయను గ్రంథము చాల ప్రసిద్ధికెక్కినది. క్షాత్రకాలపు హింద్వార్యులను గురించి వారు 'హిందూదేశ క్షాత్రయుగము' అను గ్రంథమునందు పలుశీర్షికలక్రింద విపులముగా ప్రమాణయుక్తముగా చర్చించిరి. మాడపాటి హనుమంతరావుగారు ఆకాలపు ఆర్యుల యుడుపులు, ఆహారము, వివాహములు, సాధారణ రాజ్యాంగస్థితి, భూగోళశాస్త్రవిజ్ఞానమునుగూర్చి వ్రాసిన వ్యాసములను చక్కనిశైలిలో మృదుమధురభాషలో ననువదించిరి. ఇట్టివ్యాసములు, గ్రంథములు తెలుగుభాషకు చాల ఉపయోగకరములు.

వలయువారు,

యామా రామనర్సయ్య గుప్త, సూర్యాపేట,
నైజాం అని వ్రాయవలెను.

## పునహా వ్యవసాయ ప్రదర్శనము

ప్రకటించినవారు: గోలకొండ ముద్రాక్షరశాలాధికారులు.

ఈ గ్రంథము చాలచిన్నదైనను వ్యవసాయమును గురించి ఏమి తెలియని వారికి కూడ వ్యవసాయమందభిరుచి పుట్టించును. ఇది రెండు భాగములుగా విభజింపబడియున్నది. మొదటి భాగమునందు పునహాయందు ప్రదర్శింపబడిన వస్తువులతో—పశువులు, తోటలు, మోటల యంత్రములు—పాఠకులకు పరిచితిజేయుచు ఆవస్తువుల యొక్క విశేషములను తెలుపబడియున్నది. చదువరులకు వాని విషయమై యిం

కింతవిపులముగా తెలిపిన బాగుండుసని తోచును. ఆయా వస్తువులను గుఱించిన వివరములను తెలిసికొన నిష్టమున్నవారు అందు పేర్కొన బడిన కంపెనీలకు వ్రాసి తెలుసుకొన వచ్చునను సమాధానము పుస్తకమును ప్రకటించినవారు వ్రాసినను చదువరులకు తృప్తి కలుగదు.

రెండవ భాగమందు పునహా వ్యవసాయ ప్రదర్శనము యొక్క వర్ణన, దానివలన మన ము పొందదగు లాభములను గుఱించి చర్చింప బడియున్నది. వ్యవసాయమే ప్రధానజీవనోపాధిగాగల మన దేశమునందు వ్యవసాయ స్థితి చాలదుర్దశయం దున్నదనుట శోచనీయాంశము. నౌకరీలపై నిప్పుడున్న యువకులందలి అభిలాషను వ్యవసాయముపై మరల్చుట విద్యార్థికుల, తల్లిదండ్రుల, ప్రభుత్వముయొక్కయు ప్రథమకర్తవ్యము. సేద్యకాడు వ్యవసాయముపైన మాత్రము నాధారపడియుండకూడదు. దాని కుపాంగములగు నితర పరిశ్రమలనుకూడ వృద్ధి పఱుపవలెను. నిజాంరాష్ట్రమున వ్యవసాయ కళాశాలయొక్క నిర్మాణ మత్యావశ్యకమై యున్నది. ఇక్కడవ్యాపారమా లేనేలేదనవచ్చును. ఉన్న వ్యవసాయము హీన దశయందున్నది. గ్రంథమును ప్రచురించిన వారుసూచించిన ఒక సంగతి చాల ప్రశంసార్హమైనది. వ్యవసాయ శాఖవారు ప్రచురించు మాసపత్రికను దేశభాషలలో ననువదించిన దానియొక్క ఉద్దేశము సఫలమగును. మన దేశము ఆవులను [illegible] టయందును, ఎడ్లను పోషించుట [illegible] చాల వెనకబడి యున్నది. చమత్కా[illegible] మాత్రమొకటి కనబడుచున్నది. [illegible] తనుగా భావించి పూజించునది మనమే. [illegible] ధేనువు మనపాలిదే. నందీశ్వరుడు [illegible] వాహనమే. మన భగవంతుడే గో[illegible] ఇట్టితఱి మన దుస్థవస్థకు అశ్రద్ధతప్ప [illegible] ణమగును?

గ్రంథమును కోరువారు.—

గోలకొండ ముద్రణాలయము,
త్రూపుబజారు హైదరా[illegible]
అని[illegible]

## మహమ్మదు జీవితము

గ్రంథకర్త: పురిపండ అప్పలస్వా[illegible]

అజ్ఞానాంధ కారమున నెటుతో[illegible] డుచుండిన అరిబ్బులసర్వతోముఖ[illegible] తమును ధారబోసి సఫలమనో[illegible] పీరుడగు హజరత్ మహమ్మదు [illegible] నిశైలిలో వ్రాయబడినది. హిందూ [illegible] దీయ సఖ్యతను పెంపొందింప జేయుట [illegible] ములు చాల అవసరము. ఈయవసర[illegible] ర్పప్రయత్నించుచున్న వావిళ్ల రామస్వా[illegible] స్త్రులు కంపెనీవారును, గ్రంథకర్త [illegible] న్యులు.

ప్రకాశకులు:
వావిళ్ళ రామస్వామిశాస్త్రులు కంపెనీ,
మద్రాసు.

రజతోత్సవసంచిక

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ రజతోత్సవసంచికయం దలరారువిషయములు చిత్రపటములు లీ రాష్ట్రీయాంధ్రుల భాషాసేవాభిమానమును, కార్యదీక్షను మఱియు స్వాభ్యుదయాభిలాషను సంపూర్ణముగా వ్యక్తీకరింపజేయుచున్నవి. సంచిక మిగుల నాకర్షణీయముగా నున్నది. ఇట్టి సంచిక రజతోత్సవ సమయమున వెలువరింపజేయుట ఎంతయుశుభావహము. కృష్ణదేవరాయలను గుఱించిన వ్యాసములు, తదాస్థానకవుల ప్రశంస, నిజాంరాష్ట్రాంధ్ర చరిత్రకు సంబంధించిన అమూల్యమగు విషయములచే నీసంచిక యెక్కుడు భాగ మాక్రమింప బడియున్నది. గ్రంథాలయోద్యమాభివృద్ధిని గురించియు, గ్రంథాలయముల పోషించు విధానములను గురించియు, చక్కని వ్యాసములు లేకుండుట, సంచిక యొక్క ప్రధానోద్దేశమునకు కొంత భంగము గలిగినదని చెప్పుటకు సాహసించుచున్నాము. నిలయాభివృద్ధికి తమ సంపూర్ణ సేవల నొసగిన గత కార్యదర్శుల చిత్రపటములను సంపాదించి ప్రకటించిన నెంతయు నాదరణీయముగా నుండెడిది.

వలయువారు,
శ్రీకృష్ణ దేవరాయ గ్రంథాలయ కార్యదర్శి గారికి, హైద్రాబాదు, అనిన్వాసి తెప్పించుకొన వచ్చును. వెల. ౨-౦-౦

# సంపాదకీయములు

**రక్షకభటశాఖ**

ప్రపంచము తన యాదర్శమును దర్శించుటకై అమిత వేగముతో పరుగుడుచున్నది. నిన్న చూచిన పరిస్థితులీరోజున గానరాకుండనున్నవి. ఈ త్వరితగమనమునం దప్పుడప్పుడది తప్పుత్రోవల బడుచున్నది. కొన్ని సమయములం దది తన బుద్ధిమాంద్యతకు కినుకుకొని తన తప్పులను సవరించుకొనుచున్నది. కొన్ని వేళలలో నెటుపోవుచున్నది లక్ష్యపెట్టక మదపుటేనుగవలె పరుగిడుచున్నది. మొత్తముమీద నీ విచిత్ర సంచలనము దానికి సర్వతోముఖ వృద్ధిని సమకూర్చుచున్నది. రాజ్యమను సంస్థయందు స్త్రీపురుషుల తారతమ్యములు నశించుచున్నవి. పురుషులతో సమానమైన హక్కులు వారు కొనంగుట సామాన్యమై పోవుచున్నది. కష్టఫలితముల గష్టజీవులే అనుభవింపవలెనను యంశ మెల్లెడల నాదరణీయమగుచున్నది. 'నేనే రాజ్యమును' అనుఅహంకార వాక్యములకీదినములలో తావు లేకుండనైనది. సామ్రాట్ పదవి ప్రజయందే కలదని యన్ని దిక్కుల చాటబడినది.

ప్రతి పౌరుడును తాను స్థాపించిన రాజ్యము తలక్రిందల జేయుట తప్ప అన్ని హక్కు సంపాదించ గలిగినాడు. సోదర పౌరులకు ము కలుగని అన్ని కార్యములను స్వేచ్ఛ చేయ మొదలిడినాడు. ఆతని చర్యల న వారు లేరు. అడ్డగించిన వారితో నెదు కవసరమైన శక్తి నాతడు గడించియే శత్రు భయమాతని కినుమంతైన లేదు.

భారతీయుల దురదృష్ట వశమున నట్టి లనము వారిలోనింక నుద్భవింపలేదు. కొ తత్ప్రయత్నముల చేయుచున్నను వారి త్నములింకను సర్వ జనాదరణ బొంద ఇక నిజాంరాష్ట్రము సంగతి చెప్ప లేదు. ఒకటి రెండు శతాబ్దములలోనై చములో నసమానమగునని నమ్ముటకు ము కలుగుచున్నది. విద్యావిషయిక ముల కంతరాయముల కల్పించు అధి కొందఱున్న మరేమన వలయును? ఘనత వహించిన మన ప్రభువుగా ప్రసాదించిన ఫర్మానును బట్టి మనకు

సభలు తప్ప తదితర సభల కూర్చుటకై నే యుద్యోగియొక్క ఆజ్ఞను కూడ పొంద నక్కరలేదు. కాని మొన్న జనగామ స్థానికులు "గ్రంథాలయములు: మన విద్యాభివృద్ధి" అను అతిసాధారణ విషయముపై నుపన్యసించుటకై మా. హనుమంతరావుగారి నాహ్వానింప నా యుపన్యాస సభను స్థానిక రక్షక భట శాఖవారు ఆపివేసిరి! తాలుకుదారు ఆజ్ఞ బొందమని తెలియజేసిరి! వారు ప్రభువునాజ్ఞకు భిన్నముగా ప్రవర్తించుటయే కాక శాఖ యొక్క ముఖ్యోద్దేశమును లక్ష్యపెట్టకుండుట కడు చింతనీయాంశము!

## ఆంధ్రరాష్ట్రము

ఇరువది వత్సరములనుండి ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకై జరుగుచున్న ప్రయత్నములు గత మాసమున కొంతవరకు విజయమును పొందగలిగినవి. మదరాసు శాసనసభలో నంగీకారముబడసిన తీర్మానముతో ఆంధ్రరాష్ట్రము యొక్క పునాది పండుగ జయప్రదముగా జరిగినది. రెండునెలల క్రితమది రాజ్య సంఘమునందు (Council of State) త్రోసి వేయబడి నప్పటికిని ప్రభుత్వము యొక్క ముఖ్యమగు నాక్షేపణ దూరమైనది కనుక, ఢిల్లీలోనది ఈసారి ఆమోదింపబడునని ఆశకలుగు చున్నది. ఢిల్లీలో నది విజయము గాంచినయెడల ఆంధ్రులకింతకంటె నెక్కువ సంతోషమైన విషయమును, భారమైన విషయమును మరొకటుండదు. ఆంధ్రులందఱు ఒకటేమైనను, గడచిన పదియిరువదేండ్ల నుండి అన్ని జిల్లాలవారును కలిసి మెలిసి వృద్ధిబొందుటలేదు. ప్రతి వారును తమ తమ గొప్పదనము పైననే లక్ష్యముంచుకొనుచున్నారని తెలియుచున్నది. ఈకూపస్థమండూక భావములను దూరముచేసి ఐక్యతతో తమ బాధ్యతను నిర్వహించుట అన్ని ప్రాంతముల యాంధ్రులపైనను ఉన్నది. అంతవరకు నాంధ్రు లితరుల కాదర్శప్రాయులు కానేరరు. ఐక్యభావములేనిది ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము వ్యర్థమైనదే.

## అమెరికా దుండగము

చీనా దేశము పరదేశీయులు తమతమ వైషమ్యముల వెడలగ్రక్కుటకును తమతమ బలములపరీక్షించుకొనుటకును రంగస్థలమై పోయినది. బాల్షివికులపైనున్న కోపమును ఆంగ్లేయులును మరియు నమెరికనులును బాల్షివిక్కుల పొరుగంటిపై తీర్చుకొను చున్నారు. ఇంగ్లాండు అమెరికాకు అక్క. అక్క చెప్పగనే చెల్లెలు కూడనీ అనర్థదాయక భండనమున దూకుచున్నది. అమెరికా రాజ్యాంగ నిర్మాణమునందలి మొదటి యంశము 'అమెరికా స్వాతంత్ర్యము కొఱకు స్థాపింప బడినదనియు, ప్రపంచ స్వాతంత్ర్యము కొఱకు తన యావచ్ఛక్తి నుపయోగ పఱచుననియు, ఉన్నను, దానిని లక్ష్యపెట్టక నిట్టికార్యమునకు గడంగినది! చీనా దేశీయుల మానప్రాణములను లెక్కించక తనకు నష్టము వాటిల్లినచో యుద్ధమునకై దిగెదనని చాటినది! అందఱిముందు స్వోత్కర్ష వాక్కులను చర్చించుట మాత్రము మరువలేదు. ఇతరులను నిందించుటయే కాని తానింతవరకు ఫిలిప్పైన్సు ద్వీపములకు స్వాతంత్ర్య మొసంగ

లేదు. పాశ్చాత్య పద్ధతులతో పెరిగిన అక్కడి ప్రజలింకను స్వరాజమున కర్హులుకారట! ఇప్పుడు పాశ్చాత్య రాష్ట్రముల మూలమున చీనా ప్రాణములు పోవునట్లున్నవి. ఇంకను జపాను చీనాతో సానుభూతి నెందుకు చూపుటలేదు? పాశ్చాత్య రాష్ట్రములకు ఆశియాపైనున్న భావమును జపాను మరచి పోయినదా? ఎంత వరకు ఆశియా రాజ్యములు ఏకీభవింపవో అంతవరకు ప్రాచ్యులకు క్షేమము లభింపదు. ఈనాడు చైనాపై జరుగుచున్న సంగతి రేపు అఫ్ఘానిస్థానముపై జరుగవచ్చును, రెండు దినములైన పిదప తిరిగి జపానుపైననే జరుగవచ్చును.

ప్రభావతీ ప్రద్యుమ్నులు

ఈపటమును శ్రీమాన్ క. రామాచార్యులుగారు దయతో చిత్రించి 'సుజాత'కు సంక్రాంతి కానుకగ నర్పించిరి. వీరు మహబూబునగరు జిల్లావారు. హైదరాబాదు ఆంధ్రజన కేంద్రసంఘమువారు వీరిని బంగరునకు చిత్రకళాభ్యాసమునకై పంపించిరి. సుప్రసిద్ధ చిత్రకారులగు ప్రమోదకుమార చటర్జీగారి దగ్గర సుమారొక వత్సరము వరకు వీరుకృషిసల్పిరి. ప్రస్తుతము వీరు హైదరాబాదయందే ఉన్నారు. వీరింకను కొన్ని వర్ణపటముల చిత్రించిరి. అప్పుడప్పుడు మా 'సుజాత' యందు వానిని ప్రచురించుటకై ఆజ్ఞనొసంగిన దులకు వారికి మేమెంతయు కృతజ్ఞులము.

# విషయసూచిక



## చిత్రములు

పార్వతి, (ద్వివర్ణ చిత్రము) వసంతక్రీడలు, పాలంపేట దేవాలయ స్తంభము. సహస్రస్తంభ దేవాలయము,

# శివాజీ ప్రశంస

---

శేషాద్రిరమణకవులు

---

పరసేనాజనితవ్యథాభరహతిచేఁ బాసిగాత్రులౌజాతికిన్ నిరం
తరబోధామృతధారచేఁ దనివి స్వాతంత్ర్యేచ్ఛగల్పించి దు
స్తరపాశ్చాత్యదురంతమాపితివి నీ జన్మంబుధన్యంబు సు
స్థిరవిక్రాంతివి భాసురాత్మక శివాజీ రాజకంఠీరవా!

సీ॥ మహిత వీరాంగనామణి భూషణంబైన
జిజియాబాయి పుత్ర్యకానేనంబొ
అసమ తపస్వియైన, సమర్థరామదా
సవరేణ్యశిష్యతా జాతకృషియొ
"కర్మభూమి" యటంచు ఖ్యాతిగాంచిన మహా
రాష్ట్రదేశపు తపఃప్రాభవంబొ
పరపీడనాలోల పాశ్చాత్యజనసమా
ర్జితఘోరపాతక ప్రతిఫలంబొ

తే. గీ॥ తావకాభ్యుదయమునకుఁ దావలమయి
చివికినమనస్సులకుఁ బునర్జీవభిక్ష
పెట్టి భారతభూమికిఁ బేరుదెచ్చె
స్థిరయశోలోల శ్రీశివాజీనృపాల!

మ॥ ఒక సామాన్యకుటుంబమందు • విధియోగంబునం బుట్టి
సేవకవృత్తిన్ విడి, మాతృదేశమును • సంపాదించి పాలింపఁదీ
ప్రకృషిన్ సల్పి కృతార్థుడైతివి • సమర్థశ్రీమహారామ
దాసకృపాపాత్ర! శివాజిభూపతివతంసా! రాజకంఠీరవా॥

# ఏకచ్ఛత్రాధిపత్యము.

---

అనుముల విశ్వనాథశాస్త్రీ

---

చ॥ కలియుగదయంబుదొట్టి మును గల్గిన రంతి దధీచ కల్పులై
వ్వలనఁ జనింపఁగొంచు నినువంటి నృపాలుఁడుగాక వంగళం
బులకును దావునా వెలయు వొందిన నీ శివనామ మార్య ని
శ్చలచరితంబు నీయది నిజంబు గణింపఁగఁ గొంకణాధిపా.

చ॥ అధిపతులుండరే ధరణియందు సమంతమునారలెల్ల రి
వ్విధినొక యాత పత్రమున వేలిక మువ్వానిరె సర్వవిద్విష
ద్రుధిర నిపానమైన యసిలోఁ గడియించిన నీ దులిబ్బనిన్
మధువునఁ దేంట్లఁ దోలి దొరమాడ్కిని భుక్తియొనర్చితోర్మిమై.

చ॥ పనవిరియొక్కొంచు వ్యాజ్యమున వచ్చునె నీ నియమించి పవ్వడ
మ్మున మొకమే పసెనే బులుఁగు మోదెనె ఘోరనిషాదుఁడవ్యతా
డనముగలిం గెరల్చుకొనె డాసిన బర్బరులుక్కువాయఁ
వనధిని పేచనంబోలయఁ బట్టముఁ గొంటివ దిక్కులోర్వుచున్.

చ॥ జైత్రిపు వేశనాఁడు పరశాసనమాచరియించి యొక్కొటన్
నత్రమునిల్పుచోఁ దాడిచి సైనికులందఱుఁ గత్తెనోర్తునీ
మైత్రికిఁ దెచ్చిరన్ వగచి మజ్జననీ తను విట్టులున్న నీ
మాత్రిపురూఁపు సేకుఱుఁ మాయనియాఁడవె నీకు నస్మలీ !

చ॥ పరిసెఁ బ్రసూనవర్షములు కుర్దనముల్ వొనరించిరచ్చరల్
హరిసుఖనిద్రఁ గూత్రె మహినాదరియించుచు నాగనాయకుం
డరసెను లాఘవంబు భగమంద జనాభము నెల్లచోటులన్
నరసులు నిండెఁ బుణ్యముపాసంగె శివక్షితిపాల నీజనిన్.

హైదరాబాదు మే ౧౯౨౭

సంపుటము ౧ ప్రభవ సంవత్సర వైశాఖము సంఖ్య ౫

# చింతాదేవి

## ఏకాంక నాటకము

ఒగ్గిరాజు రాఘవరంగారావు

(ప్రవేశము కొందఱు బుందేల్ వీరులు)

ఒకవీరుఁడు—(విషాదముతో) బుందేల్ వీరులారా! ఈనాఁడు మనకెట్టి దుర్దినము. మహావీరుఁడగు కలాపీనా యకుఁడు యుద్ధమునందు వీరగతి నందెగదా! ఇట్టివార్త మన కోట మనమాతని వీరపుత్రికకెటులు తెలుపవలసి వచ్చెగదా! ఏమని తెల్పవలయును? దుర్భరము—దుర్భరము—..

రెండవవీరుఁడు—

తే. వెన్నలో వ్రేలుగ్రుక్కిన విధముదోప
ద్వేషిగుండెల బల్లెముల్ బిట్టుగ్రుచ్చి
యుద్ధవిహరణ మొనరించు యోధుడిపుడు
వీరస్వర్గంబు నందెను వీరిమనను.

ఇట్టిమహాను భావుని కంతలో మృత్యువాటిల్లెను.

తే. ధరను బుందేలు ఖండస్వతంత్రమునకు
ప్రాణమర్పించినట్టియా పరమవీరుఁ
డిపుడు నాజీవమివ్వ జీవించినేని—
బదులుగా నా ప్రాణము నర్పణము జేతు.

మూఁడవ వీరుఁడు—మహావీరుని పుత్రికయగు చింతాదేవి యున్న యెడకు చేరగల్గితిమి. అయ్యయో! ఎంత దురదృష్టవతి యీచింతాదేవి?

సీ. కన్నులు దెరువని చిన్నప్రాయమునాఁడు
వాలాయముతల్లిని గోలుపోయె
పాలైనమఱువని పసితనంబునతన
యింటిని విడనాడి యేగవలసె

అన్న మెఱుంగక, నలము నాకులదిని
కొండలోయలలోన, నుండవలసె
తులలేని సుఖములు, వెలయందగిన కాంత
కటిక లంఘనముల, గాంచవలసె
కష్టములకోర్చియైనను, కాననైన
తండ్రిచాటున బ్రతికెడి, తన్వికిపుడు
నిల్వనీడయు లేకుండ, నెగడ వలసె
దైవవిధిచేత నేడు చింతాకుమారి.

పిట్టపిడుగనంటి యిట్టివార్త దైవమా! చెప్ప
జాల—చెప్పజాల—.

నాలవవీరుడు—పిడుగులవలె దాకెదు శత్రు సంప జడికి వెనుదీయని · సాహసికులకు నేడు చింతా ప్రోలకు జన కొల్లనవచ్చుట లేదు. అయ్యయో! చింతాదేవినివాసమునకు మిక్కిలి దగ్గరకు వచ్చితిమి. అక్కడ యిన దూరము గారాదా! చింతాదేవికొక గడియ కాల యిన విశ్రాంతి యుండెడిది. (అందఱుగుట్ట చెక్కటుకి నయింతురు.)

---

## ద్వితీయప్రదేశము—పర్వతోపత్యక.

(ప్రవేశము చింతాదేవి మంటిబొమ్మలతో వ్యూహ నిర్మాణము చేయుచుండును)

చింతాదేవి—మూడుదినములు గడచినవి. నాతండ్రిజాడలేదు. ఈమూడు దినములలో నీవగరాకులుదిని కాలముగడపితిని: ఇటులనే యభ్యాసము చేసిన చేదాకులనైతము దినవచ్చును. అభ్యాసమున్ని పనులను స్వాధీనముజేయును. సెబాస్! ఉదయమునుండి పన్నిన ఈ వ్యూహమిప్పటికి కుదిరినది. నిశ్చయముగా మంటిబొమ్మలతోగాక నిదేవ్యూహము సైనికులతో గట్టిన మహావీరునకైనను మరణముదప్పదు. (తిచ్చపడి) ఛీ! ఛీ!! నానోటనే డెట్టియమంగళము వెడలుచున్నది. మహావీరునకైనను—పాపము శమించుగాక. (క్రిందివైపు జూచి) అదిగో, మాసైనికులు వచ్చుచున్నారు. బ్రతికితిని. మూన్నాళ్లకైనను మాతండ్రి జాడబడయగలను.

(సైనికులు విషాదముతో ప్రవేశించి నిశ్శబ్దముగా దుఃఖించుచుందురు.)

చింతాదేవి—(ఉత్కంఠతో) వీరులారా! ఏల దుఃఖించెదరు? ఏమివాటిల్లినది? నాతండ్రియేడి?

సైనికులు మఱింత దుఃఖించుచుందురు.

చింతాదేవి—(ఉద్వేగముతో) మాటలాడక నేల దుఃఖించెదరు? నాతండ్రి వీరగతినొందెనాయేమి? అటులనేయైన దుఃఖించుట యేల? యోధులకింతకంటె యే మృత్యువు గల్గును? ఇంతకంటె యే పురస్కారము గల్గును? బుందేల్ మాత పాదములపై యా మహావీరుడాత్మ సువర్ణ పుష్ప పుష్పమర్పించి నాడు. ఏమి మహాదివసము! ఇట్టి మహాపర్వమున నే వీరబుందేలుడు శోకింపడు.

ఒక వీరుడు—(స్వగతము) సెబాస్! వీరపుత్రికయనిటులుండవలయును. తండ్రి మరణము గూర్చి ముఖమున వైవర్ణ్యములేదు, మనస్సులో మాలిన్యము లేదు, కంటతడి లేదు, కడుపులో దుఃఖములేదు. స్వాతంత్ర్యేచ్ఛకై ప్రాణము ధారవోసిన తండ్రినిఁ గూర్చి యెంత పూజ్య భావమున నున్నది?

ఇంకొక వీరుడు—(దుఃఖ గద్గద స్వరముతో) అది సరికాని ఏ గతియేమి?

చింతాదేవి—(అవష్టంభముగా) పిచ్చివాడా! రాజపుత్రేతరుఁ డడిగినట్లడుగుచున్నావు? మన జాతిలో తండ్రికొకగతి పిల్లలకొకగతి; భర్తకొక గతి. భార్యకొక గతి; ప్రభువులకొకగతి, ప్రజలకొక గతి, యెంతైన చూచియుంటిరా? లెండు, నా కొరకు గుణమున శస్త్రములను చెండు. నా తండ్రి రక్తము తడి యారకమున్నె శత్రురక్తముతో బుందేలుఖండ స్వాతంత్ర్య క్షేత్రము మడువ గట్టెద.

అదే వీరుడు—(తనలో) మా దేశపు ప్రతికోకిలము వసంత కాలమున నిటులనే కూజిత మొనరించును—కా పోలెయుఁగని పరభృతము. ఈ పరభృతమీ ప్రవర్త

పన నెటుల చేయునో? (అనుమానము సూచించు చుండును)

చింతాదేవి—(గంభీర స్వరమున) వీరుఁడా! ఏల యనుమానించెదవు? రాజపుత్రవని తెలిసినర కొన్నడు యుద్ధము చేయలేదా? నేనే మొదటి దాననా? అయినను వ్రత నియమములందు కొలికిపూసవంటి యొకమాట చెప్పెద వినుము. బాల్య చాపల్యమున సేనాముఖమున నా గుఱ్ఱమును బోనియకున్నను, శత్రువులకు వెన్నిచ్చి మీ కభిముఖునై పరచినను మీ కరవాలములు నాపై యనర్గళముగా బఱప వచ్చును. అటుల మీకు నిస్సందేహముగా నొనర్పుఁడని మనవి చేయుచున్నాను.

(అందఱు నిష్క్రమింతురు)

---

## తృతీయ ప్రదేశము—అరణ్యమందలి బుందేల్ శిబిరము

(రాత్రియగుటచే చింతాదేవి దీపపుకాంతిని గుడారములో మంచముపయి కూర్చుండి యుండును)

చింతాదేవి—(స్వగతము) ఈ సైనికు లెంత త్యాగశీలురు? దేశముకొఱకై తమ ప్రాణముల నవలీల సమర్పించుట కెంత సంతోషపడుచున్నారు? ఈ నాఁ డెక్కువ శ్రమనందుటచే సొలసి నిద్రించుచున్నారు! జాము న్నఱ రాత్రికాలేదు. యామికులు సైతము నిదుర మైకముచే సోలుచున్నారు. ఇప్పట్టున శత్రువులు వచ్చిన——? క్రోసెడు దూరమున అడవి యవతలనున్న శత్రువులకు మన శిబిర మిక్కడనున్నదని యేమి యెఱుక? పరుండనిమ్ము. శిబిరమున నెవరేని కర్మవీరులుండక పోరు. (వినుట నభినయించి) నా పతాకము నెవరో కదల్చుచున్నారు. (తెఱ చాటునుండి తొంగిచూచి) రత్న సింహునివలెనున్నాఁడు? అతనికి నా పతాకముతో పనియేమి? ఈ సేనలో రత్నసింహునివంటి యోధ వేఱొకడు కనఁబడడు. ప్రపంచమున కొందఱు వీరులు తమకు గొప్పదనము రావలయునని ఎలుకను జంపి యేనుఁగును జంపితిమని చెప్పుదురు. రత్నసింహుఁడో పులినిజంపి పురుగును జంపినానని సైతము చెప్పఁడు. యుద్ధమునుండి వచ్చిన పిమ్మట, తనముచ్చట యితరులే చెప్పవలయును గాని తననోట తానొక మాటయైన నాఁడఁడుగదా. రాత్రులందు నిదుర సైతము పోఁడు. అట్టివారలు ప్రపంచమునఁ దే చాల తక్కువ. ఇతనికి నా ధ్వజముతో నేమి పనియో చూడవలయును. (మంచము పై పరుండును)

---

## తురీయప్రదేశము—అదేస్థలము

(క్షతగాత్రుఁడగు రత్నసింహుని తొడలపయి నిడుకొని చింతాదేవి ప్రవేశించును)

చింతాదేవి—(కన్నరునించుచు) మహావీరా! రత్నసింహ! నాధ్వజమును దొంగిలించుటకిది యా కారణము? సేన అలసి యున్నది. నేనలసియున్నాను. ఏమరుపాటున శత్రువులు నాకెట్టి యపాయము చేతురోయను తలంపున దానిని నీగుడారమునకు గట్టుకొంటివే! ప్రతిదినమీలాగుననే చేయుచుంటివికాబోలు. ఔరా! నీదుబుద్ధికుశలత! నన్ను రహస్యముగా చంపదలఁచిన ముగ్గురిశత్రువుల నీ వొక్కండవే యెదిరి—నిశ్శబ్దముగా, రహస్యముగా నెదిర్చి—వారి ప్రాణములఁగొంటివే! అల్లరి చేసిన సేనచెదరి తమవారిని తామే పొడుచుకొనియెదరను తలంపునఁగాబోలు. ఏమిచిత్రము! యథార్థముగా రాజపుత్రుఁడవనిన నీవే రాజపుత్రుఁడవు. యావజ్జీవ బ్రహ్మచారిణినై బుందేల్ ఖండమునకు నాప్రాణముల నర్పించెదనని నేనొనరించుకొనిన నావ్రతభంగము గావించితివే. తండ్రిచావునకు జంకని నాహృదయమునకు జంకుగల్గించితివే! కంటనీరెఱుఁగని కన్యకకు కంటనీరు కల్పించితివే! పౌరుషమున బొబ్బలిడుకాంతకు స్త్రీత్వము గల్పించితివే. నిగూఢము, సుగుప్తమైన నాహృదయ పుష్పమపహరించితివే! కమ్ము—నీవే నాకు పతివిగమ్ము, సూర్యునకుకమలము. చంద్రునకు కైరవము, వీరునకు వీరయోష—కానిమ్ము. సేదదేరు వరకు పరిచర్య యొనరించుచుండెద. (పర్యంకము పైపరుండబెట్టి విసరు చుండును)

రత్నసింహుఁడు—(సేదదేరి కనులువిప్పి స్వగతము) చింతాదేవి [illegible] పరిచర్యగావించు [illegible]

(లజ్జావశీనయించి ప్రకాశముగా) దేవీ! ఆ వీసన నిటులనిమ్ము, నీకంత శ్రమయెందులకు?

చింతాదేవి—[సానురాగముగా] పతిసేవాశుశ్రూషలు భార్యకు ధర్మము గదా.

రత్నసింహుఁడు—(నాశ్చర్యముగా) పతి—భార్య—కళాపీనగరరాజ్ఞి! నేను స్మృతితో నున్నానా? లేక గాయముల వలని బాధవలన సంధివచ్చి విస్మృతి గలిగినదా? నేనెట్లు వినుచున్నది దయచేసి వినిపింపుము

చింతాదేవి—వీరుఁడా! నా వ్రత భంగము [illegible] నీ అసహాయ శౌర్యమువలన యత్నాభి రక్షితమగు [illegible] దయపుష్ప మపహరించితివి. ఇక నేను [illegible] యెట్లు?

రత్నసింహుఁడు—(విభ్రమమున) దేవీ! [illegible] ల్కులను నేను సక్రమముగా వినుచుంటినో లేదో [illegible] కొనుటకు నాకుశక్తి లేకుండనున్నది. నీకుశక్తి గలదేని హృదయమందు జొచ్చి పరీక్షింపుము.

చింతాదేవి—అవసరము లేదు. మనమిపుడు [illegible] లోనికేగుదము. (నిష్క్రమింతురు)

## పంచమప్రదేశము—కోట

(ప్రవేశము యుద్ధసన్నద్ధుఁడై రత్నసింహుఁడు, చింతాదేవి)

రత్నసింహుఁడు—దేవీ! యోధవరులదే అశ్వముల నెక్కి సన్నద్ధులైరి. సెలవీయుము. నేను నేగెద.

చింతాదేవి—పోకతప్పదా? ఈమాత్రము యుద్ధమునకు మన సైనికులు చాలరా?

రత్నసింహుఁడు—నాయకుఁడున్నట్లుండదు.

చింతాదేవి—ఇంక మీ బడలిక తీరనట్లగుపడు చున్నది.

రత్నసింహుఁడు—(మౌనము వహించును)

చింతాదేవి—మఱియొక యుద్ధమున కేగిన—?

రత్నసింహుఁడు—పోనిమ్ము.

చింతాదేవి—మీరు యోధులు. ఔద్ధత్యము తప్ప శాంతవిషయము విచారింపరు. అవసరము గనిపెట్టి—యుద్ధ మొనరించిన—

రత్నసింహుఁడు—(అర్ధోక్తియందు) ఒనరింపకున్న?

చింతాదేవి—నానోట నేలయనిపించెదరు. ఈనాఁడు నాహృదయ మేలనో దుర్బలమై పోయినది. ఈ యుద్ధము—ఇట్లాటి యుద్ధము, మున్నిసిన ముల్లు యుద్ధము చేయుటకు మనస్సు లేదు. యమునా [illegible] దున్నకొని శాంతముగా జీవనము చేయవలయునని యున్నది. ఇట్టి హృదయ దౌర్బల్యమునకు కారణ మగపడు [illegible] నిష్కారణముగా నేదియు సంభవింపదు. ఇప్పుడు నా [illegible] లో రాజసమునకు బదులు నారీత్వము పొడసూపి [illegible] భార్య, భర్త, ఇల్లు, పిల్ల యనునది రాజసమున లేదుగా!

రత్నసింహుఁడు—(మౌనము వహించును)

చింతాదేవి—(ఉద్విగ్న హృదయమున) పోకయుండిన నేమగును? నిన్న నేకదా మన వివాహము జరిగినది!

రత్నసింహుఁడు—(విచారముతో) పో—యెద—

(రత్నసింహుఁడు నిష్క్రమించును)

చింతాదేవి—(కనుచూపు మేరవరకును రత్నసింహునిజూచుచు కన్నీరునించుచు) అయ్యయో! నాచే [illegible] తెయుపరాధము జరిగినది? పాలవంటి కులమునకు [illegible] చ్చితినే? రణోత్సాహము గల్పింపవలసిన వీరునకు [illegible] రత్వముపదేశించితినే? మహాదృష్టులు బలి [illegible] కాళ్లకు సంకెలలు వేసితినే? పోలేక పోతే [illegible] ఛీ! ఈ నాజన్మము కాల్పనా? (ఆలోచించి) [illegible] మీ యుద్ధ పర్యవసానము బట్టి నిర్ణయింప వలయును.

(నిష్క్రమించును)

## షష్ఠప్రదేశము—అరణ్యము

(రత్నసింహుఁడు మఱికొందరు యోధులు ప్రస్తావము చేయుచు ప్రవేశింతురు.)

ఒకయోధ—రత్నసింగ్జీ! శత్రుశిబిర మొకకోసు దూరము మాత్రమే కలదు.

రెండవయోధ—అదిగో! అశ్వనంబడు గుట్టమీద కలదు.

రత్నసింహుఁడు—శత్రుసమూహ మెంతగలదు?

మొదటియోధ—దాదాపు రెండు వేలవఱకు గలదు.

రత్నసింహుఁడు—మనదళము?

మొదటియోధ—రెండునూర్లు.

రత్నసింహుఁడు—ఒకఁడు పదుగురఁ గెల్చునా?

రెండవయోధ—గెలుపోటము లెందున్నవి?

తే. గెలుపులోటము లెందున గలవుచెపుమ
జనులసంఖ్యలోనుండదు శస్త్రములను
నుండ; దెచటను? మనసులోనుండునిజము
పిఱికిచేతిబల్లెంబది బెండుగాదె
పందచేతిచర్మంబది పత్త్రిచేట
తెగినవానికిసంద్రంబు సగటులోతు
జానుదఘ్నంబుగాదె?ని స్సారమైన
మనసుతో ఘోరజయమన్న మాటసున్న
మంచివానికిశస్త్రము మంచెబడితె
యొక్కహుంకారమునజయ మొందలేడె?

మొదటియోధ శెబాస్! గీతము బాగుగనున్నది. జయాపజయములకు మనస్సే కారణము.

రత్నసింహుఁడు—మనస్సే కారణమని తరముమాలిన పనికి గడంగుటయు అవివేకము.

మొదటియోధ—ఈనాఁడు సింగ్జీనోట నిరుత్సాహవాక్యములు వచ్చుచున్నవి?

రత్నసింహుఁడు—(విచారము నభినయించును)

రెండవవీరుఁడు—ఇప్పుడు శత్రువులు యుద్ధప్రయత్నములో నుండరు.

మొదటియోధ—అటులయిన నిప్పుడుదాకిన నేజయములభించును.

రత్నసింహుఁడు—తీరమోసి మనముసమీపించువరకు వారలు సకలసన్నాహములతో నున్న—?

రెండవయోధ—అట్లెన్నఁటికిని కాదు. వారల దాపటకిదియే యదను.

మొదటియోధ—ఇదిగో! శత్రువుల డాసితిమి.

రత్నసింహుఁడు—వారలందఱు యుద్ధప్రయత్నములోనే యున్నారు.

రెండవయోధ—కార్యము మించినది. పౌరుషము జూపుటకంటె యదనులేదు.

రత్నసింహుఁడు—తిరిగిపోవుటకుసైతము వీలులేదు.

మొదటియోధ—(తనలో) బుందేల్ వీరుని నోట నేఁడెట్టి మాటవచ్చినది. (ప్రకాశము) సింగ్జీ! ఇప్పుడు మీరు వచించినది క్రొత్తశబ్దము. మేము నేర్చిన పాఠములో నీశబ్దమిదివరకు రాలేదు. (అందఱు శత్రువులపైకి యురుకుదురు.)

రత్నసింహుఁడు—[తనలో] నిజముగానిది క్రొత్తశబ్దమే. క్రొత్తగా నేర్చుకొనిన పాఠము. విజయసంశయాస్పదకాలములో పౌరుషము చూపుట ప్రధానము కాదు. చింతాదేవి యనినటుల యమునాతీరకృషికర్మయే ఉత్తమమయినది. మఱలి నాప్రియఁ జేరఁజాలెద. సుఖము లంబాసి ప్రాణముల బోగొట్టుకొనిన నేమిలాభము? నా ప్రియ—నాచింతాదేవి పాసములోనున్న—; అనవసరము— అనవసరముగా యుద్ధముచేయు సిపీయలు హాతము గానిమ్ము. "బ్రతికియుండిన శుభముల బడయువచ్చు" నని యనిన అర్జునునకురాని అపయశము నాకురాదు. [గుంపునుండి గుఱ్ఱమును తప్పదోలును]

## సప్తమ ప్రదేశము—కోటలోపలిభాగము

(విశాలమగు నొక గుండమున కట్టెలతో చిత బేర్వబడియుండును. సకల భూషణ భూషితయై చింతాదేవి ప్రవేశించును)

చింతాదేవి—(తనలో) ఉత్తమభారత క్షాత్రవంశమందుత్పన్నుడై అసమాన వీరుఁడగు రత్నసింహుని వరించిన యో చింతాదేవీ! ఈ నాఁడు నీవు మిగుల పాపకర్మ మాచరించితివి. నారీత్వము—కేవల నారీత్వము——————తుచ్ఛ భోగైకనిలయమగు నారీత్వమధిష్టించి నీ రత్నసింహుని చేతులార జంపుకొంటివి. అతని పైశాచదృష్టిని ప్రసరింపజేసి ఆతనికీర్తికి కళంక మాపాదించితివి. అతని హృదయమందలి పరాక్రమ వృక్షమును నీనారీత్వ ఖనిత్రమున వేరంట బెకలించి వైచితివి. తత్పవిత్రస్థానమున మోహవృక్షమును నాటితివి. చింతామణిని పోగొట్టుకొంటిని. చిల్లి గవ్వను బడసితివి. దేశద్రోహమును గావించితివి. నీ ద్రోహమునకు ప్రాయశ్చిత్తము బొందకయున్న లాభములేదు. అగ్ని భట్టారకుఁడునా పాప భూయిష్ట జన్మమును పవిత్రపరచుగాక! (ప్రకాశముగా) రాజ పుత్ర యోధులారా! ఉత్తమ క్షత్రియ వీరపత్నులారా! నిన్నటి దినమున జరిగిన యుద్ధమున నా పతిని బోగొట్టు కొంటిని. కావున నుత్తమ క్షత్రియ కాంతా ధర్మమును నిర్వహించు చున్నాను.

జనులు—[విషాదముతో] అయ్యయో! రత్నసింహుఁడు నిన్నటి యుద్ధమందు మరణించెనా! మొన్న నేప్రదేశమున నగ్ని స్థాపితమై వివాహతంతు నడచినదో ఆ ప్రదేశముననే నేఁడీ సతీ చర్యయా? అహోమార్పణకిది పూర్ణాహుతియా? తల్లీ! తల్లీ! చింతాదేవీ! కలాపీ నగర రాజ వంశ వృక్షమున నీ వొక్కతెవే పుత్ర రూపముననున్న దానవు. దేశము విప్లవ భూయిష్టముగానున్నది. దాస్యమునుండి మా రాజ్యము నుద్ధరించుటకు నీవు గాక మఱెవ్వరు? మాకేదియైని గతి జూపి నీవు చచ్చుచుకుము.

చింతాదేవి—బిడ్డలారా! తండ్రులారా! ఈ దీనురాలినిక్షమింపుడు. ఈహతభాగినిఎట్టి యధోగతిలోనున్నదోమీరే విచారింపుడు. తల్లిని, తండ్రిని, పతిని, అట్టులనే సర్వమును గోలుపోయిన యీయభాగ్యనిటుల చచ్చు మీరడ్డు పెట్టకుడు. నన్నాశీర్వదింపుడు. [చితారోహణ మొనర్చును.]

జనులు—[ఆశ్చర్యముతో] చుట్టు మంటలు లేచుచున్నను నీ దేవి యెంత నిశ్చలముగా నిలువబడియున్నది!

[గుఱ్ఱముపై రత్నసింహుఁడు ప్రజాపరోధము తొలగించుకొని పరుగెత్తి వచ్చును]

రత్నసింహుఁడు—[విషాదముతో] చింతా! చింతా! ఇదేమి?

చింతాదేవి—[మౌనముగా నుండును]

రత్నసింహుఁడు—చింతా! చింతా! నేను యుద్ధమున మరణింపలేదు. నన్ను జూడుము. నేను రత్నసింహుఁడను, రమ్ము. చితావరోహణ మొనరించి రమ్ము. అయ్యో! జనులారా! చూచుచున్నారేమి! మంటలు రొమ్ము ఎత్తుకు లేచుచున్నవి. చితను చల్లార్పరేమి! అయ్యో! అయ్యో!

[ప్రజలు చితను చల్లార్పుటకు యత్నింతురు; చింతాదేవి వలదని సైగ చేయును.

రత్నసింహుఁడు—(దుఃఖముతో) చింతాదేవి సంపూర్ణ వివశయైనది. నేను ప్రత్యక్షముగా గానవచ్చుచున్నను నన్ను పోల్చకున్నది. దేవీ! నేను రత్నసింహుఁడను. అబద్ధము చెప్పుటలేదు. నన్ను పోల్చుకొనుము. చితావరోహణము జేసిరమ్ము. అయ్యో! మంటలు నిలువెత్తున కెగయుచున్నవే. [చితను చల్లార్చుటకు ప్రయత్నము చేయును.]

చింతాదేవి—మహాశయా! అదేమి ప్రయత్నము! నా రత్నసింహుఁడు నిన్ననే మరణించెను. ఆ మహానుభావుని నేను చేతులార జంపుకొనినాను. అతడంతకుమునుపే పాదుస్వైక ప్రధానుఁడు, అసహాయ శూరుఁడు, నా భోగ వలన యుద్ధమునకు పూర్వమే మరణించినాడు. కావున నే నాయునతో సహగమనము చేయుచున్నాను.

రత్న—[చకితుఁడై తెప్పిరిలి] సత్యము. దేవీ! సత్యము. నీ రత్నసింహుఁడు నిన్ననే మరణించినాఁడు. ఇప్పుడు నీ కనుల యెదుట కనబడి మాటలాడుచున్నది జీవములేని రత్నసింహుని కళేబరము. కళేబరము దొఱకినవి మ్మట ఏకాంగినిగా సతిత్వ మందగోరుట ధర్మముగాదు. ఇదిగో నీ పతి దేహముచితలో వైచుచున్నాను.

సీ. పౌరుషయుక్తమై౯ బఱగెడు బుందేలు
ఖండమందునజన్మ౯ గాంచినాఁడు
వీరాతివీరుఁడై౯ వెలయు మహావీర
పాదసేవనమున౯ బ్రతికినాఁడు
అసహాయశూరుఁడం౯ చనిపిల్వఁబడియు త
త్తనుజ సుపత్నిగా౯ గొనినవాఁడు
మోహలాలసబుద్ధి౯ మూర్ఖుండునై మాతృ
వసుమతీద్రోహంబు౯ బఱపినాఁడు
తల్లి! బుందేలు రాజ్యమ౯ తల్లిపరమ!
పావుఁడగురత్నసింహుని౯ పాపములను
పరమకృపచేత క్షమియించి౯ పనుపుమమ్మ
జ్వాలనుమాలకమువీని౯ స్వర్గమునకు.

బుందేల్ ఖండనివాసులగు నో జనులారా!

తే. ఆత్మపరిశోధనంబని౯ యఱయలేక
తుచ్ఛమోహాబ్ధిలోబడి౯ ద్రోహినైతి
చపలు ననుక్షమియించియు౯ సత్వరమున
దేశముస్వతంత్రతంగాంచ౯ దివురుఁడయ్య.

బుందేల్ స్వాతంత్ర్యవృక్ష స్కంధరూపిణీ! వీరావతార రిణీ! చింతాదేవీ!

తే. వీరబుందేలు జగతినా౯ విర్భవించి
ధరణికై నిజశక్తిని౯ ధారవోసి
స్వల్పదోషంబునకు గొప్ప౯ ప్రాచితంబు
సలుపుచున్నట్టినీకు నం౯ జలి ఘటింతు.

తే. అమలవీరపతివ్రత౯ వైనసీదు
యొడలుమహితమైనసీయగ్ని౯ యురికినాగు
తనుపునీతంబు జేతు, మం౯ త్రంబుతోడ
నాజ్యమగ్నినిబడిశుచి౯ యైనయట్లు.

[అగ్నిలో దుముకును]

# గణపమ్మ

ఆండ్ర శేషగిరిరావు

గణపమ్మ మహిత ప్రతాపుడైన కాకతి గణపతి దేవుని రెండవ కూతురు. రుద్రాంబ చెల్లెలు; కోట బేతరాజు ఇల్లాలు. ఆమె ధర్మానురక్తి, పతిభక్తి పితృప్రేమ గలిగి వరలిన రమణీమణి. పతి యనంతరము ధరణికోట మండలము నేలి గణపమ్మ రుద్రాంబ వలెనే ప్రజాపాలనా పరిజ్ఞాన పాటవము నవదరించిన విదుషీమణి.

త్రిలింగ సామ్రాజ్య సంస్థాపనార్థము వీరాగ్రేసరుడైన గణపతిదేవ చక్రవర్తి వెలనాటిపై దండెత్తి వెళ్లి అచ్చటి రాజుల నోటుంబుచ్చి ఆ భూభాగమును తన రాజ్యమున చేర్చుకొనియెను. అప్పుడు మరియొక యుపద్రవము కలుగకుండ వెలనాటి ప్రాంతమున కాకతీయ రాజ్యము స్థిరపడుటకై తన రెండవ కొమార్తయైన గణపాంబా దేవిని ధరణికోట రాజును, మహామండలేశ్వరుడునైన రుద్రదేవరాజు సుతుడు బేతరాజునకిచ్చి పెండ్లి చేసెను.

ఇది కేవలము రాజకీయ వివాహముగ చూపట్టుచున్నను చుట్టరికము పాతదియే. గణపతి దేవచక్రవర్తికి మైనమ్మయను సోదరి కలదు. ఆమె వెలనాటిసీమ పాలకుడైన రుద్రరాజును పరిణయమై ఎనమండ్రు కొమారులను బయ్యాల మహాదేవి అను కొమార్తెను బడసెను. బయ్యాల మహాదేవి ధరణికోట ప్రభువైన కోటబేతరాజు వివాహమై రుద్రరాజను పుత్రుని గనెను. గణపాంబ పెనిమిటియైన బేతరాజు ఈ రుద్రరాజు తనయుడు. అట్లగుట కోట బేతిరాజు, గణపతి దేవ చక్రవర్తికి మేనగోడలి మనుమడన్నమాట. మేనగోడలి కుమారునికి కూతురునిచ్చి పెండ్లి చేయుటచే అల్లుడుకూడ నయ్యెను. విషయము సు-
గ్రాహ్యమగుటకు వంశ వృక్షములీయబడుచున్నవి.



కోటరుద్ర రాజు అనంతరము ధరణి కోట రాజ్యమునకు బేతరాజు ఏలికయై మహామండలేశ్వరుడను పేరొందెను. బేతరాజు వీరుడగుటచే మామయైన గణపతిదేవ చక్రవర్తికి జైత్రయాత్రలందు జేదోడై జయసంపాదనమొనర్చుచుండువాడు. బేతరాజునకు వయస్సు మీరకముందే ఆయుర్దాయము చెల్లిపోయినది.

బేతరాజు పరమపదించిన పిదప కోటగణపాంబా మహాదేవి ధరణికోట మండలమునకు పాలకురాలయ్యెను. గణపమ్మ కృష్ణానదికి దక్షిణమున నున్న ఆరువేల గ్రామములకు రాణియై ప్రభుత నెఱపెనని ఎనమదల శాసనము చాటుచున్నది. ఆమె దానశాసనములు క్రీస్తు శకము ౧౨౪౯–౧౨౬౦ వ సంవత్సరము వఱకు కనుపించుచున్నవి. ఓరుగల్లు పురము నుండి సోదరి రుద్రాంబ కాకతీయాంధ్ర సామ్రాజ్య పరిపాలనము సాగించుచుండ గణపాంబ ధరణి కోట నుండి తన సామంత మండలమును ఏలి ప్రజల మెప్పువడసెను.

గణపమ్మ దానశీల. ధాన్యకటకము (ధరణికోట) లోని అమరేశ్వరాలయ గోపురమున నుంచుటకై సువర్ణ కలశమును దానము చేసెను. అనేక దేవాలయములకామె అగ్రహారములు దానముచేసి దాననిరతిని వెల్లడిచేసెను. విప్రవరులకామె యొనర్చిన దానములకు లెక్కలేదు. ఆమె ధనకటక పురిలో పండ్రెండుగురు బ్రాహ్మణోత్తములకు భూవసతులు కల్పించి గృహములను దానము చేసెనని ఎనమదల శాసనము చెప్పుచున్నది.

రుద్రమ్మ వలెనే గణపమ్మ రాజనీతి విశారద. రాజనీతిని పాటించి ఎనమదల పరగణాలోని యిరువది గ్రామముల మీద ఆమె పన్ను తీసివైచెను. ఇట్లు పన్ను తీసివైచుటచే బొక్కసమున అర్థ సంపత్తిలోటు పడెడి మాట నిజమే; కాని రాజ్యక్షేమమును పలక్షించి రాజకీయ శక్తి లపుడపుడిట్టి పద్ధతి నవలంబించుట కలదు. క్రీస్తు శకము ౧౧౩ మొదలు ౧౩౪ వ సంవత్సరము దనుక ఇరువదియైదేండ్లు ధరణికోట రాజధానిగా శాతవాహన రాష్ట్రమును పరిపాలించిన గౌతమి పుత్రశాతకర్ణి విదేశీయులైన శకయవన రాజులు ఎత్తివచ్చినపుడు అదివఱకేవచ్చి స్వదేశీయులతో కలసియుండిన విదేశీయుల రాజద్రోహము తల పెట్టకుండుటకై వారిపైగల స్త్రీయమునగవిధించిన పన్నులను కూడతీసివేసెను, అట్లే గణపమ్మయు రాజనీతిని పాటించి తన మండలమున ఒక పరగణాలో పన్నులు తీసివేసెను.

గణపమ్మ పతిభక్తి పరాయణ. కావుననే పరమపదించిన ప్రాణనాథుని జ్ఞప్తికై కాంతగోరి ఆమె శివాలయమునొక దానిని నిర్మించి అందు తన భర్తపేరిట బేతేశ్వర నామముతో లింగప్రతిష్ఠ గావించెను. ఈ బేతేశ్వరాలయ గోపురమునందు గణపమ్మ కనక కలశమును నిర్మించెను. ఇంకటితో తనివినొందక ఈ ఆలయము చిరంతనముగ వెలయుటకు ధనధాన్యసమృద్ధమగు 'జేనదేవి' అను గ్రామము ధారాదత్తము చేసి దానశాసనము వ్రాయించెను. ఆత్మేశుని కీర్తికాయమునకు చిరంజీవత్వమును, అతనికి సుగతియు సంపాదింప దేవాలయ ప్రతిష్ఠ గావించిన గణపాంబ పతిభక్తి పరాయణత శ్లాఘనీయమైనది.

గణపాంబ పతిభక్తియే గాక పితృప్రేమ కూడ మెచ్చదగిన విషయము. తండ్రియశశ్శరీరము అనశ్వరమై వెలయుటకు ఆమె గణపతి దేవ చక్రవర్తి పేరిట గణపేశ్వర శివాలయమును నిర్మించి దాని సంరక్షణమునకై 'చింతపాడు' అను గ్రామమును దానము చేసెను.

రుద్రమ్మకువలె గణపమ్మకును శైవమతాభినిరతి మెండు. అట్లగుట ఆమె ఎక్కడ ప్రతిష్ఠించినను శివాలములనే నిర్మించెను. గణపమ్మ తన కడకాలమును మహేశ్వర ధ్యానముతో గడపెను.

గణపాంబాదేవి దానశీలము, రాజ్యపాలనాదక్షత, పతిభక్తి, పితృప్రేమయు, ఆమెను ఆంధ్రపురంధ్రీమతల్లులలో నొకతెగా స్మరించుటకు గారణములు.

గణపమ్మ కీర్తి గీతము ఎనమదల శాసనమిట్లు మ్రోగించుచున్నది. 'గణపాంబాదేవి తన హస్తములు సతతము శివుని యర్చించుటయందే వినియోగించెను; శివుని మహాత్మ్యమును ప్రకటించు శ్లోకములే ఆమెకానంద సంధాయకములు; ఆమె వేదములందు విశ్వాసముకల మహనీయురాల; కావుననే విశాల రాజ్య క్లేశము కలిగియున్నను ఆనందముతో నామె దినములు గడపెను. రెండవ పార్వతి యనదగిన గణపాంబ మహాత్మ్యము నెవరు తగినట్లు వర్ణింపగలరు?'

# ఋణవిముక్తి

సముద్రాల రాఘవాచార్యులు

సరసతాపేటి హృదయ పుస్తకమునుండి
తీసి కవిబాలకుండు చిత్రించినాఁడు
కమ్రజీవన కవితాముఖమ్మునందు
హృదయరుధిరమ్ముతోడ తత్ప్రేమకృతిని.
అదియొక పవిత్రప్రణయినీ హృదయగాథ
యనియెఱిఁగి సానుభూతి చిహ్నముగఁగూర్చి
రశ్రువులతోడ నాణిముత్యాలసరము
రాగమూర్తులు నవకవితాగురువులు.
కోమలశ్యామలా రాళ కుంతలముల
ఛాయలు నిస్సారమంచు చూపోపనట్టి
పరమయోగులు తద్గీత పతనమునను
శిల్లి వడివోయి మది కదలించినారు
పాడినాఁడేమొ అవ్యక్త ఫణితికరుని
రసపరిప్లుత తత్కథా గ్రంథమెల్ల
సాగరోపాంతభూమి తచ్చటులఘోష
మణచియాశీర్వదించె రత్నాకరుండు
వినియెఁగాబోలు వేతసవేశ్మమందు
ప్రకృతి తద్భగ్నహృదయ ప్రలాపనంబు
ఊర్చె వెచ్చనిగాలి నిట్టూర్పు; కుస్త
రించె మర్మరధ్వనుల కేంద్రీకరించి.
హృదయపీఠమునందు చిత్రింపబడితి
కవులలంకరించిరి త్రయీ కర్మవిదులు
చేనిమిరినారు జలధి యాశీర్వదించె
ప్రకృతి పరవశమయ్యె త్వత్ప్రణయధనము
నొసగెను గదా షాలంతి ధన్యుండయతడు.

# పృథ్వీరాజు

(చందుబరదాయి హిందీభాషలో రచించినరాసో కావ్యానుసారము)

శేషాద్రిరమణ కవులు

## I

చందుబర్ దాయి హిందీభాషయందాదికవి. హిందీభాషకు సంబంధించిన ప్రాచీన గ్రంథము లిప్పుడిప్పుడు దొరకుచున్నవి. వీనిలో చందుబరదాయిచే రచింపబడిన రాసో గ్రంథ మతిప్రాచీనమైనది. రాజపుత్రుల యొక్క భాషలో రాజుల గుణగాథాదులు గల గ్రంథములు దొరకుచున్నవిగాని రాసోమహా కావ్యమునందు వలె స్పష్టముగ దెలియుటలేదు. పాండవులచరిత్రము భారతమున వర్ణింపబడినట్లురాసోగ్రంథమున కథాసందర్భము సమకాలీనులగు ననేక రాజుల చరిత్రములు దెలుపబడి సాందర్భానుసారము పూర్వజుల వృత్తాంతము సంక్షేపముగ దెలుపబడియున్నది. చౌహానరాజగు పృథ్వీరాజు జీవనచరిత్రము అనగాపృథ్వీరా జేయేరాజులతో యుద్ధమొనర్చినదియు, పూర్వజుల వృత్తాంతములతో వ్రాయబడియున్నది. రాసోగ్రంథము సంవాదరూపమునయున్నది; అనగా కవియొక్క ధర్మపత్ని ప్రశ్న వేయుచున్నది. చందుకవి యందులకు సమాధానమొసంగుచున్నాడు.

భారతవర్షమున నరబియా దేశస్థులగు ముసల్మానులు ప్రప్రథమమున సింధుదేశములో క్రీ. శ. యెనిమిదవ శతాబ్దమున తమరాజ్యమును నెలకొల్పిరి. [illegible] శతాబ్దమున గజనీవంశస్థులగు తుర్కీముసల్మానులువచ్చిరి. ఆవంశములోని మామూదు లాహోరునందు తనయధికారము నేర్పరచెను. పండ్రెండవశతాబ్దాంతిమ భాగమున గోరీవంశస్థుడగు శహాబుద్దీన్, మహమ్మదుగోరీ, అజామేరుపతి చౌహానువంశీయుడునగుపృథ్వీరాజును జయించి డిల్లీనాక్రమించెను. తర్వాత నొక సంవత్సరము అనగా (1194) కనోజాధిపతియగు జయచంద్ర కమద్వజునిజయించి ఉత్తరభారతదేశమున హిందూరాజ్యమను మాటనే యెత్తివేసెను. ఈ యుద్ధముల వృత్తాంత మీరాసోగ్రంథమునదప్ప నే హిందూగ్రంథమునను గానవచ్చుటలేదు. ముసల్మానులు దమ జయవృత్తాంతము మాత్రము దమ గ్రంథములవ్రాసిరి. కావుననవి పక్షపాతపూర్ణములై యున్నవి. ఇంతేగాక ముసల్మాను లేఖకులు హిందూరాజులపేరులు గూడ స్పష్టముగా దెలుపరని చెప్పవచ్చును. ఈ సమయమున నీరాసోగ్రంథ మొక్కటియే యితిహాసములలో విశ్వాసనీయమైనదై యున్నది. కాని ప్రస్తుతము లభించియున్న శిలాశాసనములు, ప్రాచీన తామ్రపత్రములు, నాణెములు వీనినుండి పండ్రెండవశతాబ్దముయొక్క వృత్తాంతము ప్రకాశమైయున్నది. వీనినిబట్టి రాసోగ్రంథము సాహిత్యకావ్యములందు ప్రధానస్థాన మలంకరించినను సత్యమైనచరిత్రకు మాత్రము విశ్వ

సరియైనది కాదని స్పష్టముగ తెలుపవలసివచ్చుచున్నది. పృథివీరాజు ప్రసిద్ధయోధుడని చెప్పుటలో సందేహము లేదుగాని రాసోగ్రంథమున వర్ణించినరీతి మాత్రము సత్యమైనా కాదాయని సందేహ మొదవుచున్నది. రాసోగ్రంథమందలి సంగతులు సందేహములనుట కగు కారణములను తెలుపుచున్నారము. రాసోలో విక్రమశకసంవత్సరములు వ్రాయబడి యుండలేదు. ఆనంద సంవత్సరమని ప్రయోగింప బడియున్నది. ఈ ఆనందయనునది విక్రమశకము 91 నుండి అనగా క్రీ. శ. 34 నుండి మొదలు పెట్టబడినది. రాసోయందలి పరిచ్ఛేదములకు సమయములని వాడబడి యున్నవి. ఇది కాశీ నాగరీ ప్రచారణీ సభాపక్షమున ప్రకటింపబడినది. ఇందలి ఊవ అంతిమ సమయము మహోభాసమయమై యున్నది. దీనిలో పృథ్వీరాజు మహోబారాజు పరమాల్ యొక్క యుద్ధవర్ణనమున్నది.

1 చౌహాను వంశీయుడగు సోమేశ్వరుడు శాకంభరీ దేశమున రాజ్యము చేయుచు అజమేరు రాజధాని యందున్న సమయమున తోమరు వంశీయుడగు ననంగపాలుడు డిల్లీకిని, కమధ్వజవంశీయుడగు విజయపాలుడు కనౌజునకును రాజులుగానుండిరి. కొన్ని కారణములచే విజయపాలుడు డిల్లీపైకెత్తివచ్చెను. అనంగపాలుడుదూతనంపిసోమేశ్వరునిసహాయముకోరెను. సోమేశ్వరుడు సేనాసహితముగ డిల్లీని రక్షింప నేగెను. ఇరువురునుగలిసి డిల్లిని రక్షించిరి. విజయపాలు డాసమయమున ఉత్తరభారత దేశమునచక్రవర్తిగానొప్పుచుండెను. ఇతనిస్వాధీనమున నపరిమిత సైన్యముండెను. ఈతడు దిగ్విజయమునుగూడ జేసెను గాని డిల్లిని స్వాధీనము జేసికొనజాలకుండెను. అనంగపాలునకు పుత్రసంతానములేదు. ఇరువురు పుత్రికలుమాత్రముండిరి. పెద్ద కుమార్తెయగు సురసుందరిని, సేనతో దనపైకి నెత్తివచ్చిన విజయపాలునకొసంగి సంధిచేసుకొనెను. చిన్నకూతురగు కమలను సోమేశ్వరునకొసంగెను. కమల గర్భవాసము నుండియే పృథ్వీరాజు జన్మించెను. అని రాసోలో వ్రాయబడినది.

విజయపాలుని పుత్రుడగు జయచంద్రు, తండ్రి యనంతరమున కనౌజునకు రాజయ్యెను. కాని జయచంద్రు సురసుందరికి జన్మించెనా లేక మతియొక స్త్రీకి జన్మించె యనునది రాసోలో వ్రాసియుండలేదు. పృథ్వీరాజు ... సము క్రీ. శ. 1148 వైశాఖమున నయ్యెను. రాసోలో ... చోట (శరసమయములో) జయచందు పృథ్వీరాజు «మామా ఏవు మేమునొకటి» అని సంబంధమును ... నియున్నాడు. కాని సరియెచ్చటను ఈరీతి వ్రాసియుండ లేదు.

అనంగపాలుడు వృద్ధుడై బదరీ నారాయణమునకు యాత్ర పోవునప్పుడు దౌహిత్రుడగు పృథ్వీరాజు రాజ్య మొసగెను. పృథ్వీరాజున కప్పటికి ... సంవత్సరముల వయస్సుండెను. అనంగపాలుని ... త్రులు విదేశీయులగు పృథ్వీరాజునకు రాజ్యరక్షా... రమును కొలదికాలమున కొసంగుటకు గూడ ఇష్టపడ... కాని యనంగపాలుడది తెలిసికొనలేదు. ఇతడు ... యాత్రకేగిన రెండుమూడు నెలల తర్వాత పృథ్వీ... డిల్లీకి సంబంధించిన పెద్దపెద్ద రాజోద్యోగులను ... నుండి తొలగించి అజమేరునుండి తన బంధువుల ... వారికా పదవుల నొసంగెను. పదభ్రష్టులైన వారు ... లపై దుండగముగ ప్రవర్తింప సాగిరి. కొందరు ... రాయణమునకేగి యనంగపాలునికి దమ యవస్థ నెఱిం... యేడవసాగిరి. అందుపై నాతడు డిల్లీకి తెంచి పృథ్వీ... జును మందలించెను. కాని ప్రయోజనము గల్గలేదు. ... ధ్వీరాజు యనంగపాలునకు గొంత ధన మొసంగి బదరీనా... రాయణమునకు బంపివేసెను.

సోమేశ్వరుడు పృథ్వీరాజు వెంటనుండుటకు ... మంది యోధుల నియమించెను. వీరు మిక్కిలి ప్రసిద్ధ... యోధులు. రాసోలో వీరిని యష్టోత్తర శూరులని వ్రా... బడి యున్నది. ఈ యోధుల బలములో పృథ్వీరాజు ... గుల ప్రబలుడగుటయేగాక యెంతటి ఘోరయుద్ధ... సంప్రాప్తించినను సందేహింపక జయమును పొం... యుండెను. పృథ్వీరాజు అజమేరునకు యువరాజై ... నున్నప్పుడే డిల్లికి రాజయ్యెను. కొన్ని సంవత్సరముల ... సోమేశ్వరుని గుజరాతు ప్రభువు భీమదేవుడంత ... మటచే నజమేరు రాజ్యముకూడ డిల్లీతోకలిసి పో...

౨. కమధ్వజ వంశీయుడగు విజయపాలు డొకప్పుడు దిగ్విజయమునకు బయలుదేరెను. వేరువేరు దేశముల జయించుచు క్రమముగా ఒడిసాయందలి కటకనగరము నకుజేరెను. కటక పాలుడు, సోమవంశీయుడునగు ముకుంద దేవుడు తన కొమార్తెను విజయపాలున కుపహారమొసంగి సంధి చేసికొనెను. విజయపాలుడా రాజకన్యకను దన పుత్రుడగు జయచంద్రునకు, వివాహము చేసెను. ఈ రాజకుమారి యొక్క సరియైన పేరును వ్రాసియుండ లేదుకాని సౌందర్యమును బట్టి "జున్హైయా" అని పిలువ బడుచుండెను. ఈమెనుండి జయచందునకు సంయుక్త యను కుమార్తెగలిగెను. ఈ సంయుక్తయే దన తండ్రి యొక్కయు భర్తయొక్కయు కులనాశమొనర్చుటకు కారణ భూతయయ్యెను.

౩. సోమేశ్వరుని యనంతరమున పృథ్వీరాజు ఢిల్లిని రాజధాని చేసికొనెను. ఇచ్చటినుండియే గోరీతో యుద్ధము చేయ నేగెను. ఈతని యనంతరమున సంయుక్తకూడ ఢిల్లీలో సహగమన మొనర్చెను.

పై విధముగ రాసోలో వ్రాయబడియున్నది. శిలా శాసనములనుబట్టి తెలియుచున్న దేమనగా:—

1. ఢిల్లీలో నొక యశోకుని స్తంభమున్నది. దీనిని ముసల్మానుచక్రవర్తియగు ఫీరోజిషాహ క్రీ. శ 1351—1388 వేరొకస్థానమునుండి కొనివచ్చి ఢిల్లీలో స్థాపించెను. ఈస్తంభమునందొక శాసనమునకు క్రింద విక్రమశకము 1220 వైశాఖ పూర్ణిమను తెలుపుకొన్ని శ్లోకములున్నవి. ఈ శ్లోకములు సోమేశ్వరుని పెద్దసోదరుడు నాలవ విగ్రహరాజ వీసలదేవునిచే వ్రాయబడినవి. తీర్థయాత్ర విజయయాత్రలను తెలియజేయుచున్నవి. వింధ్యాచలము నుండిహిమాలయపర్వతము వఱకు గల దేశమును జయించి రాజులవలన కప్పములనుగొని ముసల్మానులను పారదోలి యార్యావర్తము నార్యావర్తముగా చేయబడినది. ఈ ముదకైన విషయము లిందు వ్రాయబడినవి. దీనినిబట్టి క్రీ.శ. 1168 సంవత్సరమునకు కొంతపూర్వము వీసలదేవుడు ఢిల్లి పరిపాలించినాడని తెలియుచున్నది. దీనినుండి, యింకను సోమేశ్వరుని రాజ్యకాలమున అజమేరులో కప్పము కట్టి రాజుగాని లేదా వేతనభోగి యగు నొక దుర్గరక్షకుడు గాని, యుండి యుండునని కూడ తెలియుచున్నది. పృథ్వీరా జజమేరునకు యువరాజుగా నుండెను. అతని తండ్రి యధీనమున నున్న సామంతరాజు యొక్కగాని లేక వేతన భోగియగు దుర్గ రక్షకుని యొక్కగాని సేవ మున కొంతకాలముండుట యసంభవము కాజాలదు.

2 రాసోలో జయచందు పృథ్వీరాజుతో నిట్లు జెప్పుచున్నాడు. "నీవు సాంభరునకు రాజువు. కావున నచ్చటికి వెళ్లుము. ఢిల్లీపతి సంతాన హీనుడై చనిపోయి నాడు. నేను చక్రవర్తినగుట వాని విధానము చేయగలను. అనంగపాలుడు నాకు రాజ్యమిచ్చినాడని తెల్పుచున్నావు. నేను చక్రవర్తినగుట నాయనుమతిని తీసికొనియుండ లేదు. కావున నీ దానము నొప్పుకొనను".

3. రాసోలో పృథ్వీరాజుయొక్క జననము క్రీ.శ. 1148 అనియు నితడు పండ్రెండు సంవత్సరముల వయస్సుననే ఢిల్లికి రాజయ్యెననియు వ్రాసియున్నాడు. అనగా క్రీ. శ 1160 సంవత్సరములో నితనికి ఢిల్లి రాజ్యము లభించి యుండును. ఇంతకు ముందుగనే వీసలదేవుడు ఢిల్లిని జయించియుండెను. హమ్మీరు మహాకావ్యము చౌహాణ వంశీయుల యితిహాసమైయున్నది. దీనిలో వీసలదేవుని దేహాంతమున అమరగాంగేయుడు రాజయ్యెను. వీని తర్వాత మూడవ పృథ్వీరాజు, వాని తర్వాత సోమేశ్వరుడు రాజయ్యెను. అనగా సోమేశ్వరుని సమయము క్రీ.శ. 1160 సంవత్సరము కాజాలదు.

4. పృథ్వీరాజుయొక్క జననము 1148 అయినప్పుడు, 1146 సంవత్సరము సోమేశ్వరు డజమేరుసింహాసనమెక్కినప్పుడు అనంగ పాలునికి సహాయముచేసి కను లను పొందియుండెను. అయితే 1169 సంవత్సరముయొక్క సోమేశ్వరునకు ముందురాజగు ద్వితీయ పృథ్వీరాజు శాసనము దొరకినది. మరియు 1170 సంవత్సరముయొక్క బిజోలియా యొక్క సోమేశ్వరునిశాసనము లభించినది. దీనినిబట్టి 1226 సంవత్సరములో ద్వితీయ పృథ్వీరాజు దేహాంతమున సోమేశ్వరుడు రాజయినట్లు తెలియుచున్నది. కాబట్టి 1204 సంవత్సరములో అనగా 22 వర్షములకు పూర్వమే

అనంగపాలునకు సహాయమొనర్చి కమలను వివాహము చేసికొనియుండడు.

5 సోమేశ్వరుని తండ్రియగు అర్ణోరాజు మిగుల ప్రతాపవంతుడు. ఇతనికి ముగ్గురు రాణులుండిరి. మార్వాడ రాజకన్య సుధవా పెద్దరాణి. ఈమెకు జగదేవుడు చతుర్థవీసలదేవ విగ్రహరాజులు జన్మించిరి. రెండవరాణి గుజరాతు రాజగు సిద్ధరాజ జయసింహుని కుమార్తె కాంచనదేవి. ఈమె సంతాన హీన. మూడవరాణి గుజరాతు పాలకుడగు సోలంకికుమారపాలుని సోదరి దేవలదేవి. ఈమెకు సోమేశ్వరుడు జన్మించెను. ఈ కుమారపాలుడు, గుజరాతుపాలకుడగు సిద్ధరాజజయసింహుని పినతండ్రి కొమారుడు త్రిభువన పాలుని కొమారుడు. మిక్కిలి ప్రతాపవంతుడు. సోమేశ్వరుడు వీనికడ నుండి శిక్షను పొందెను. ఈ సోమేశ్వరుడు చేదిభూపాలుడు, హైహయ వంశీయుడునగు నరసింహదేవుని కుమార్తెయగు కర్పూరాదేవిని వివాహమయ్యెను. వీరికి పృథ్వీరాజు హరిరాజు ననువారు జన్మించిరి. సోమేశ్వరుడు 1169 సంవత్సరము రాజ్యమునకు వచ్చి 1176 సంవత్సరము మృతినందెను. హమ్మీరు మహాకావ్యమున గూడ నీ కాలమే దెలుపుచున్నది.

సోమేశ్వరుని యొక్క శిలా శాసనములు నాల్గు లభించినవి. ఒకటి మేవాడరాజ్యములోని బిజైలియా దగ్గరనున్న పర్వతముపై చెక్కబడి విస్తృతమైయున్నది. ఇది 1226 సంవత్సరం ఫాల్గుణమున వ్రాయబడినది. దీనిలో సోమేశ్వరునికి ప్రతాపలంకేశ్వరుడని వ్రాయబడియున్నది. దీనిలో చౌహాన వంశీయుల ఇతిహాసము పూర్తిగ నున్నది. రెండవది 1228 జ్యేష్ఠ శుద్ధ దశమీతిథి నైయున్నది. 1229 శ్రావణ శుక్ల త్రయోదశి దైమూడవది యున్నది. ఈ పై రెండును ధోడా గ్రామమునందలి రూఠిరాణి మందిర స్తంభముపై చెక్కియున్నవి. నాల్గవది 1234 భాద్రపద శుద్ధ చతుర్థీ తిథిది. ఇది జహాజపూరు సమీపమైలలో నున్నది. వీనిలోని బైజోలియా శాసనము మిగుల విస్తృతమైనది.

6 హమ్మీరు మహాకావ్యము 1500 సంవత్సరమున జైనసాధువగు జయచంద్రు సూరిచే వ్రాయబడినది.

పృథ్వీరాజునకు దర్వాత నాతని పుత్రుడు రణవంథ... రాజయ్యెను. ఈ వంశమున నైదవరాజు హమ్మీ... వాడు. ఈ కావ్యమున సోమేశ్వరుని భార్య పృథ్వీ... తల్లి కర్పూరాదేవియని యున్నది. కాని యామె... వంశము నెరుక పరుపలేదు. మరియు పృథ్వీరాజు... భరపతియని వ్రాసియున్నాడు. కాని చౌహానవంశీ... డిల్లీయొక్క తోమరవంశీయుల పరస్పర సంబంధ... వ్యములను దెలిపియుండలేదు. ముసల్మానులకు ఢిల్లీ... కార మేర్పడినమీద సేనా సహితుడైన పృథ్వీరాజు ఢి... నాక్రమించెను. అని వ్రాసియున్నాడు. అనగా ముస... నులు డిల్లీని జయించుటకు పూర్వము పృథ్వీరాజు... లేదు.

7. ముసల్మానుచరిత్రకారులు పృథ్వీరాజు... మేరునకు ప్రభువని వ్రాసియున్నారు. వారి వ్రాతల... పృథ్వీరాజునకు డిల్లికిసంబంధమున్నదా లేదాయనుట తె... యుటలేదు. "తబ్ కాతేనాసరి" అను గ్రంథములో ఢి... పతి గోవిందరాజు లేక గోవిందరావని వ్రాయబడి యు... న్నది.

8. ఫిరిస్తా పిథౌరా సోదరుడగు చాముండ రా... యుడు డిల్లికి రాజని వ్రాసియున్నాడు.

9. తాజ్ ఉల్ మా ఆసీరు అను గ్రంథములో... శాహాబుద్దీన్ మహమ్మదుగోరి హిజిరీ 587 (క్రీ. శ. 119...) సంవత్సరమున గజనీనుండి లాహోరునకువచ్చి తనసరా... గు హంజాయను వానిని దూతగా నజమేరు పాలకుని క... కంపెను. అనివ్రాయబడియున్నది. మఱియునా మెకు... నజమేర్లు పాలకుని జయించివానిని విడిచివేసెను. కాని యా... తడు ముసల్మానులను ద్వేషించుచు దేశమునుండి పారదో... ప్రయత్నించుచున్నాడనియు వినియాయజమేరు ప్రభు... రక్తేద మొనర్ప నాజ్ఞనొసంగెను. పిథౌరా పుత్రుని... మేరపాలకునిగా నొనర్చి తాను డిల్లికేగెను. ఢిల్లీ ప్రభు... నకు కష్టముగట్టుచులోబడియుండునటుల వాని... చ్చెను. తర్వాత నాసుల్తాను కొంతసేన నింద్రప్రస్థ... నుంచి తానుగజిని చేరెను—అని వ్రాసియున్నాడు. ... వ్రాతను బట్టి అజమీరు డిల్లి పట్టణములకు...

ప్రభువులున్నటుల( దెలియుచున్నది. ఢిల్లి యజమేరుపాల కుల కేసంబంధముండెనో యది తెలియుటలేదు. ఈ యిరువురకు కుటుంబసంబంధముండుటయు సంభవముగాదు.

10. పృథ్వీరాజుయొక్క తామ్రనాణెములు కొన్ని లభించినవి. వానిపై నొక ప్రక్కన అశ్వారోహణ మొనర్చిన యొక మూర్తియు, 'శ్రీపృథ్వీరాజదేవ' యనియు వ్రాయబడియున్నది. రెండవ ప్రక్క నొక ఋషభమూర్తియు 'అసావరి శ్రీ సామంతదేవ' అనియు వ్రాయబడియున్నది. మఱికొన్నిటిపై నొకప్రక్క పృథ్వీరాజు పేరును రెండవ ప్రక్క 'సుల్తాను మహమ్మద్ సామ్' అని వ్రాయబడియున్నది. ఈముద్రణములనుండి పృథ్వీరాజు కొంతకాలము మహమ్మదునకు సామంతు( డయినటులను ఆసమయముననే యీనాణెములు వేయబడినటులను తెలియుచున్నది. తాజ్ ఉల్ మాఆసిరు గూడ యీయవస్థనే సమర్థించుచున్నది.

ఈ పైసంగతులనుబట్టి రాసోగ్రంధమున వ్రాసినవిషయము కల్పితమని తేలుచున్నది. ఈ సమయమున ఢిల్లిలో తోమవంశ రాజ్యమున్నటుల దొరకుటలేదు. ఒకవేళ రాజ్యమున్నను పృథ్వీరాజుయొక్క మాతామహవంశీయులు మాత్రము రాజ్యము చేయుటలేదు. పృథ్వీరాజు ఢిల్లీకి పోయియుండనులేదు. అతనికి ఢిల్లిరాజ్యమెప్పుడును దొరికియుండలేదు. అతడు తన యంతిమయుద్ధ సమయమున ఢిల్లిలోను లేడు. అంతిమయుద్ధ సమయమున నాతడు షహాబుద్దీనునకు కప్పముకట్టు సామంతరాజుగానున్నాడు. ఈతీరున నెంతకాలముండెనో నిశ్చయమైన యాధారములేమియు లభించియుండలేదు.

1. రాసోగ్రంథవర్ణనానుసారము పృథ్వీరాజునకు పదునొకండుసంవత్సరముల వయస్సుగలప్పుడు గుజరాతులో భోలారాయ భీమదేవుడు మఱియు అబూలో సలఖ ప్రమారు, రాజ్యము చేయుచుండిరి. ఈ యిరువురు రాజులు స్వతంత్రులును ప్రబలులునగువారు. పృథ్వీరాజు తన 108మంది శూరులగుయోధులలో నీయిరువురిని కూడ లెక్కించువాడు. భీమదేవునకొక సోదరుడుండెను. భీమదేవుడాసలిగిన వృత్తివలన వచ్చు

యములకు చాలకుండెను. ఎక్కువడబ్బుకావలసియున్నను భీమదేవు డొసగుటలేదు. ఇందుచే నీయిరువురు సోదరులకు వివాదమేర్పడెను. ఈసోదరుల దేహాంతమున వారి యెన్మిదిమంది కొమారులు రాజ్యమున దోపిడులు సాగించిరి. ఈ గారణముచే భీముడు వారిని రాజ్యమునుండి వెడలనడచెను. ఈ యెన్మిదిమంది కుమారులు సోమేశ్వరుని కడకేగిరి. సోమేశ్వరుడు శత్రుసోదరపుత్రులగు వారికాశ్రయ మొసగనెంచి పృథ్వీరాజునకు సహాయకులగుటచే నాతని వెంటనుండ నియోగించెను. ఒకనాడు పృథ్వీరాజు గృహమున మహాభారత కథ చెప్పబడుచుండెను. పృథ్వీరాజుయొక్క శూరులు, నీయెన్మిదిమంది గుజరాతు రాజపుత్రులు వినుచుండిరి. ఇంతలోనొక శూరుడు రాజపుత్రుని గొట్టెను. రెండు పక్షములవారును ఖడ్గములధరించి పోరాడ దొడగిరి. రాజపుత్రులను శాగుగ గొట్టిరి.

2. అబూదేశాధిపతియగు సలఖ ప్రమారున కిరువురుపుత్రికలు నొకపుత్రుడు నున్నటుల రాసోలో వ్రాయబడి యున్నది. పెద్ద కుమార్తెయగు మండోదరికి భీమదేవునకు వివాహమయ్యెను. చిన్నకొమార్తెయగు ఇఛ్ఛిని నిపృథ్వీరాజున కిచ్చుటకు ప్రదానమయ్యెను. కాని వివాహము మాత్రము కాలేదు. భీమదేవుడు మండోదరి యొక్క దాసీలచే ఇఛ్ఛిని సౌందర్యవిశేషమునువిని దూతముఖమున "ఇఛ్ఛినిని కూడ నాకేయిచ్చి వివాహము చేయవలసినది. అటులగాకున్న నాబూ రాజ్యమును నారాజ్యములోజేర్చుకొందు"నని సలఖ ప్రమారునకు జెప్పిపుచ్చెను. ప్రమారుడారాయబారికి దనయయిష్టము దెలిపిపుచ్చి వెంటనేవచ్చి వివాహమాడ వలసినదిగా పృథ్వీరాజునకు దెలియజేసెను. పృథ్వీరాజు వచ్చుటకుముందే భీమదేవుడాబూ నాక్రమించి ప్రమారు నోడించెను. కాని యంతఃపుర స్త్రీల జేజిక్కలేదు. భీమదేవు డాబూనందొక ప్రతినిధిని నిల్పి గుజరాతునకు వెళ్లెను. త్రోవలో పృథ్వీరా జెదిర్చెను. యుద్ధమున గుజరాతు లోడిపోయిరి. పృథ్వీరాజు జయభేరిని మ్రోయించుచు ఆబూ బ్రవేశించెను. మఱునాడు మహావైభవమున ఆబూసింహాసన మధిష్ఠించెను. అతర్వాత నిఛ్ఛిని కుమారికి వివాహమయ్యెను. సలఖుని పుత్రుడగు జైత కుమారుని సామంతరాజుగా నొనర్చి పృథ్వీరాజు

తిరిగి వచ్చెను. సలషుని పుత్రికను వివాహమాడ నేగియుం
డిన పృథ్వీరాజునకు అబూ సింహాసన మేటుల లభించెనో
అవిషయము వ్రాసి యుండలేదు. కాని సింహాసన మెక్కు
ట మాత్రము వర్ణింపబడి యున్నది. కొంత కాలమునకు
దర్వాత జేత తనరాజ్యమును వదలి పృథ్వీరాజు యొక్క
ప్రధానామాత్యపదవిని గ్రహించి ప్రభువుతోగూడ కన్నౌ
జునకేగి యచ్చట జీవములవిడచెను. జేత ముసల్మానులతో
పోరి స్వర్గస్థుడయ్యెను.

భీమదేవుడు పైని చెప్పిన పరాజయమునకు మారు
సోమేశ్వరునకు త్వరలోనే చెందించెను. అతడజమేరు
పైకెత్తి వచ్చెను. రాసోలోని సోమేశ్వర భీముల యుద్ధ
మును సోమేశ్వర వధఅని వ్రాసియున్నాడు. అనగా సో
మేశ్వరునికి సైన్యసంగ్రహము చేసుకొను నవకాశము గూడ
నొసంగలేదు. ఇందుచే నిది యధర్మయుద్ధమని వ్రాసి
యున్నాడు. యుద్ధమునకు పూర్వమే సోమేశ్వరుడు
పృథ్వీరాజునకు సంగతి నంతయువ్రాసి జవాబుగోరి లేఖ
నంపెను. అమరుదినముననే సోమేశ్వరుడు యుద్ధమున
హతు డయ్యెను. పృథ్వీరాజు, శ్రాద్ధానంతరము అజమేరు
సింహాసనమెక్కి భీమదేవునిపై దాడివెడలెను. యుద్ధము
అలో (44 సమయములో) భీముడు గతించెను. పృథ్వీ
రాజు పట్టణము స్వాధీనపరచుకొని భీముని పుత్రుడగు శిశు
వును సింహాసనమున గూర్చుండబెట్టి డిల్లికి వెళ్లిపోయెను.
యుద్ధ సంవత్సరమును చెప్పి యుండలేదు. కాని అజమేరు
రాజ్యమును పొందిన తర్వాత మొదటి యుద్ధమేయిది.
సోమేశ్వరుని మరణానంతరము గూడ పృథ్వీరాజు డిల్లీ
యందే నిలిచియుండెను.

ఈ సంబంధమున నితిహాసలేఖకు లేమివ్రాసియు
న్నారో, గుజరాతు యొక్క ఇతిహాస కావ్యనాటకా
దులు శిలాశాసనములేమి చెప్పుచున్నవో పరికింతము.

పృథ్వీరాజు సమయమునకు రమారమి రెండు శతా
బ్దములకుముందే అబూఅనగా చంద్రావతిలో ప్రమార
వంశీయులు రాజ్యము చేయుచుండిరి. అప్పటిరాజు
ధరణీవరాహుడను వాడు. ఈ ధరణీ వరాహునిపై
గుజరాతు రాజగు సొలంకీ మూలరాజు దండెత్తి యుద్ధ
మునకు వచ్చెను. ఈ సమయమున రాష్ట్రకూట ధ
లుడు (అబూరాజు) సహాయమొనర్చెను. కాని ధర
వరాహుడు పరాజయ మొంది గుజరాతు ప్రభువుకు
మంతుడు కావలసివచ్చెను. ధవలుని క్రీ. శ. 99[illegible]
త్సరపు శిలాశాసనమున నీవిషయము వ్రాయబడి యున్న
మూలరాజు క్రీ. శ. 961 నుండి 995 వరకు రాజ్యమేలు
యుండెను. కానివా రేసమయమున ధరణీ వరాహు
జయించిరో అది తెలియుటలేదు. ఈ సమయమునుండి క్రీ
శ. 1197 సంవత్సరము వఱకు అనగా పృథ్వీరాజుయొక్క
మరణానంతరము నాలుగు సంవత్సరముల వఱకు అబూ
రాజులు గుజరాతునకు సామంతులుగా నున్నటుల శాస
నప్రమాణములు దొరుకు చున్నవి.

మండన నామకుడగు నొక జైనలేఖకుడు కుమా
పాలప్రబంధమను పేరుతో గుజరాతు పాలకుడగు కుమా
రపాలుని జీవన వృత్తాంతమును వ్రాసి యున్నాడు. దా
లో శాకంభరీ పాలకుడగు అర్ణోరాజు [illegible] కుమా
యగు దేవల దేవితో పాచికలాడు చుండెను. ఈమె
కుమారపాలుని చిన్నచెల్లెలు. అర్ణోరాజు మాటి మాటి
రాణియొక్క పితా సోదరుల పేరులు బల్కుచు నవహా
మొనర్చుచుండెను. రాణికిది మిక్కిలి కష్టమగ నుండెను.
అయిన నామె యేమియు మాట్లాడకుండెను. ఈవిధము
గూడ నాతడట్లే యవమానింప సాగెను. రాణియది స
సహింపలేక పోయెను. ఆమె కోపముతో భర్తను గాంచి
యిక మీరిటులే పలుకుచున్నచో నాసోదరునితో చెప్పవ
సివచ్చును. అందుచే మీకు విశేషనష్టము కాగలదని అనెను.
రాజునకీపలుకులు ములుకులయ్యెను. వెంటనే యాగ్రహ
పరవశుడై రాణిని బాగుగా గొట్టి యాగదినుండి యావ
కీడ్చి యంతటితో నూరుకొనక సేవకుల, బిల్చి మీరిప్పుడే
ణినినామె సోదరుని కడకు చేర్చి రావలసినది’ని యాజ్ఞ
ను. దేవలదేవి తనసహోదరుని కడకుచేరి జరిగిన కథయంత
యు చెప్పెను.

కుమారపాలుడు క్రీ. శ. 1148 సంవత్సరం కార్తి
ములో సింహాసన మెక్కెను. ఈతడు మిగుల తేజ
యు ప్రకృతి స్వాధీనుడునగు రాజు. మంత్రి యాలోచ
లేకయే స్వతంత్రముగ రాజ్యమొనర్చుచుండెను.

నే రాజసభలో నందరును శత్రువులైరి. వాగ్భటుని కనిష్ఠ సోదరుడగు అరభట్టు ప్రధానామాత్యుడుగా నుండెను. పూర్వపు రాజగు సిద్ధరాజ జయచంద్రుడు అరభట్టును తన పుత్రునితో సమానముగ ప్రేమించుచు స్నేహవాత్సల్యములతో బలుమారు సభలో నిల్చుచుండెడివాడు. అటులుండగ నీకుమారపాలుడీతనిని బొత్తిగా చేరనిచ్చుట లేదు. ఇందుచే నితడీ కుమారపాలుని వదలి యర్ణోరాజు పాలికేగి గుజరాతుపై దాడి వెడలుటకు ప్రోత్సహింప సాగెను. మఱియు గుజరాతు సామంతరాజులచేరి యుద్ధమున నర్ణోరాజునకు సహాయులగుటగాని లేక యుద్ధక్షేత్రమున చేరకుండగాని సహాయ మొనర్చుడని సిద్ధమొనర్చెను. ఈ ప్రకారము అబూ పాలకుడగు విక్రమప్రమారుని కూడ దనపక్షమునకు ద్రిప్పికొనెను. అర్ణోరాజు కుమారపాలునిపై దాడివెడల నుండగా దేవలదేవిని వెడలగొట్టుట గూడ గల్గెను. అందుచే నతివేగముగ నర్ణోరాజు గుజరాతుపైకి ప్రయాణ మొనర్చెను. ఇది తెలిసికొనిన కుమారపాలుడు కూడ యుద్ధసన్నద్ధుడయ్యెను. ఉభయసైన్యములు యుద్ధక్షేత్రమున సిద్ధమాసప్పటికి గుజరాతురాజ్య సామంతరాజులు కొందరు తమ బలములతోడను గుజరాతు పక్షమువీడి అజమేరు పక్షమున జేరిరి. వీరిలో అబూపతియగు విక్రమ ప్రమారుడు కూడ నుండెను. విక్రమ ప్రమారుని సహోదర పుత్రుడగు యశోధవలుడు గుజరాతు సేనాపతిగానుండి సైన్యముఖమున నిల్చియుండెను

సాహసుడగు కుమారపాలకుడు సామంతులొనర్చిన విశ్వాసఘాతకతను విచారించెను కాని భయమును చెందలేదు. అతడు తన మావటీనితో దన గజము నర్ణోరాజు గజముపైకి సరాసరి పోనీయవలసినదని యాజ్ఞనొసగెను. మావటీనట్లే యర్ణోరాజు గజమున కెదుట దమ గజమును నిల్పెను. ప్రతి పక్షీయుఁ బలవంతుడునగు కుమారపాలుని యెదుట నిల్చుటకర్ణోరాజు భయపడెను. అరభట్టు ప్రక్కనే మఱియొక గజముపై నుండెను. అతడు కుమారపాలునిపై ధ్యాకదలచి యుండెను కాని మావటీని సాంకేతముచే గజము నిల్చిపోయెను. అందుచే నాతడు క్రిందబడిపోయెను. చక్కగా శిక్షింపబడి యున్న యాగజమా యరభట్టు లేవనుంకించుచుండగనే త్రొక్కివేసెను. ఇచ్చట కుమారపాలుడు వెంటనే యర్ణోరాజు గజముపైకి దూకి భీతాహుడై యున్న యాతని గొంతు నొక్కిపడ వేసెను. అర్ణోరాజు పరాజయమందెను. సామంతులలో గొందరాతని ననుకరించిరి. అందుచే యుద్ధమారంభము కాకుండనే జయము సమకూడెను. కుమారపాలుడాయర్ణోరాజునొక పంజరమున బంధించి యాతని గుట్టముల నేనుగుల జెండి వేసెను. అర్ణోరాజు తన సహోదరియగు జలహానాదేవిని తన కొసంగి దేవల దేవిని చక్కబఱచి యొప్పగించెను. ఆందుచే సంధియై మైత్రియొదవెను.

చాహానుల యితిహాసములో నెచ్చటను నీపరాజయకథ వ్రాయబడి యుండలేదు కాని గుజరాతు కావ్యగాథలు హాసనాటకాదుల యందీ కథయున్నది. ప్రస్తుత పరిశోధనము వలన జైనలేఖకులు కుమారపాలుని పక్షమున నత్యుక్తి పక్షపాతములు వహించిరని తెలియుచున్నది. అనగా ప్రస్తుతపరిశోధకుల యుద్దేశ్యమేమన, కుమారపాలుని సంబంధమున జైన లేఖకుల మతము విశ్వసనీయము కానిదని యైయున్నది. కుమారపాలుడు మొదట శైవుడు. ఇతడు హేమచంద్ర సూరియను జైన విద్వాంసుని పాండిత్యాతిశయమునకు మెచ్చికొని యాతనిని దనయాస్థానమున విద్వాంసునిగా జేర్చికొనియెను. తర్వాత నాతని ప్రభావ ప్రబోధమున కుమారపాలుడు జైనుడయ్యెను. హేమచంద్రుని గురునిగా స్వీకరించి తనరాజ్యమున నహింసావ్రతము ననుష్ఠింపజేసెను. ఇందుచేతనే జైనలేఖకులీకుమారపాలుని విశేషముగ ప్రశంసచేసియున్నారు.

చిత్తూరు దుర్గములోని సమిద్ధేశ్వరుని గుడిలో నొక శాసనమున్నది. దీనిలో గుజరాతు సోలంకిరాజగు కుమారపాలుడు శాకంభరీపతిని జయించి సపాదలక్ష దేశమును* మర్దించి తనదేశమునకు పోవునపుడు శాలీపురములో

* చాహానుల దేశము సపాదలక్ష దేశమని పలుకబడుచున్నది. ఇందుకు రెండు కారణములు గన్పడుచున్నవి. చాహానులు మొదట అహిక్షత్రపురములో నివసించుచుండిరి. అచ్చటినుండి లేచి పంజాబునందలి శివాలిక్ పర్వతములపై జేరిరి. శివాలిక్ అను పేరా పర్వతములకు (సవాలక్) ఒకటింబావులక్ష శిఖరములుండుటచే గలిగినది. అచ్చటనుండి శాకంబరీ దేశమునకు చేరిరి. తామునివసించిన (సవాలాక్) సపాదలక్షయనునది యాదేశమునకు కూడ వర్తించినది. ౨. చాహాను దేశమునకు సపాదలక్ష 125000 గ్రామములుండెను ఈ కారణముచే కూడ నీదేశమునకు సపాదలక్ష దేశమని వాడుకగలదు.

సైన్యమును నిల్పియుంటరిగ చిత్రకూటమును దిలకింప వచ్చియుండెను. అతనివలన 1207లో నీశాసనము వ్రాయబడెను. వీనిలో యుద్ధకాలము వ్రాయబడి యుండలేదు. కాని 1207 సంవత్సరమునకు పూర్వమేయైయుండును.

విశ్వాస ఘాతకులగు సామంతుల నడంచుటకే యీ యుద్ధమవసరమయ్యెను. అబూ (చంద్రావతీ) పాలకుని రాజ్యభ్రష్టు నొనర్చి యాపదవి యశోధవలున కొసంగెను. అబూపర్వతముపై అచలేశ్వర మందిరము యొక్కయు, వస్తుపాలుని జైనిమందిరము యొక్కయు క్రీ. శ. 1287 వ్రాయడిన శాసనము మిగుల విస్తృతమై ప్రశస్తమైయున్నది.

అబూపట్టణమునకు సమీపమందలి అజారీ గ్రామములో క్రీ. శ. 1202 (వి. శ. 1145) సంవత్సరము యొక్క యొక శాసనమున్నది. దీనిలో "ప్రమారవంశోద్భవ మహామండలేశ్వర శ్రీయశోధవల ......" అని వ్రాయబడి యున్నది. దీనిని బట్టి కుమారపాలకుని అర్ణోయొక్క యుద్ధము విక్రమశకము 1144 నుండి 1145 యొక్కమధ్య కాలమునయై యుండును.

ప్రస్తుతపు సిరోహిరాజ్యము యొక్క సీమలోని కాయద్రా గ్రామైకాంతమున నున్న కాశీవిశ్వేశ్వర మందిరములో క్రీ. శ. 1220 (వి. శ. 1163) యొక్క యొక శాసనమున్నది. ఇదియశోధవలుని జ్యేష్ఠపుత్రుడగు ధారావర్షుని చే లిఖింపబడినది. దీనిని బట్టి 1145, 1163, మధ్యనున్న సమయమున యశోధవలుని దేహాంతమును, ధారావర్షుని రాజ్యప్రాప్తియు నయ్యెనని తెలియు చున్నది. ధారావర్షుడు పరాక్రమవంతుడగు యోధుడై యుండెను. నేటివరకు గూడ నీప్రాంతము నీతని యశోచిహ్నములు గానవచ్చుచున్నవి. గ్రామవాసులు ప్రంశసలలో నీతని గాథలు వచింపుచున్నారు.

ముసల్మానులయొక్క తాజ ఉల్ మా అసీరులో హిజరీ 593. (క్రీ.శ. 1197 సంవత్సరము) లో కుతుబుద్దీన్ గుజరాతులోని అనహల్ వారారాజుపై దండెత్తెను. అప్పుడాతనితో గుజరాతు సామంతులగు రాయకర్ణ దారావర్షు (ధారావర్షు) లు యుద్ధమొనర్చిరి. దీనినిబట్టి ధారావర్షుడు క్రీ. శ. 1197 వఱకు జీవించియుండెననియు నప్పుడాతడు గుజరాతు సామంతుడుగా నుండెననియు దెలియుచున్నది.

ఈప్రకారము 1145 నుండి 1197 వఱకు అబూ పృథ్వీరాజుయొక్క జననమునకు మూడు సంవత్సరముల ముందునుండి మృతుడైన నాల్గువర్షములవఱకు ధారా[illegible] హిక యొక్క యితిహాసము దొఱకియున్నది. ఈసమయమున అబూపతి గుజరాతునకు సామంతుడుగా నుండె[illegible]

సోమేశ్వర భీమదేవులయుద్ధము, సోమేశ్వరు[illegible] పరాజయమును, చచ్చుటయును, సోమేశ్వరుని [illegible] వ్రాయబడియున్నది. దీనితర్వాత పృథ్వీ రాజాక్ర[illegible]చుట, భీమునితో యుద్ధమొనర్చుట, ఈ తని [illegible]త్రునకు రాజ్యపట్టము గట్టుట యీవిషయముల [illegible]త్యేకము రాసోలో వ్రాయబడియున్నవి. కానీయి[illegible] ఇతిహాసకావ్య నాటకాదుల యందివి దొఱకుటలే[illegible] గుజరాతు లేఖకులు, ముసల్మానితిహాసకులు అప్రాప్తవయస్కుడు బాలకుడగు భీమదేవుడు 117[illegible] శ. లో సింహాసనముపై నెక్కెను, మఱియు 19[illegible] కు రాజ్యము చేయుచుండెను. అనగా పృథ్వీరాజు [illegible] పోవుటకు 48 వత్సరములు వెనుక చనిపోయెను, అని వ్రాసియున్నారు. హమ్మీరు మహాకావ్యము 1179 సంవత్సరమున సోమేశ్వరుడుమరణించెను. పృథ్వీరాజు భీమదేవు[illegible]నొక్క సంవత్సరములలోనే రాజులయిరి; ఈసమయమున పృథ్వీరాజు 31 సంవత్సరముల యీడునుండెను; భీముడప్రాప్తవయస్కుడగు బాలుడు; అని వ్రాసినారు. ఈకారణముచే నతడుచాలా పెద్దవాడైతే 13, 18 సంవత్సరముల వాడై యుండును. అనగా పృథ్వీరాజు [illegible] దేవుడు 17 18. సంవత్సరములు చిన్నవాడైయుండెను. అందుచే పుత్రులు భీమదేవుని తమ్ముల పృథ్వీరాజునకు సమవయస్కులగుట అసంభవము. సలక్ష[illegible]రుని పెద్దకుమార్తెతో భీమదేవునకు వివాహమయ్యెను. తర్వాత యౌవన ప్రాప్తియైనవెనుక స్వామింటికి వెళ్లియుండెను. ఈసమయమున పృథ్వీరాజు [illegible] సంవత్సరముల వయస్సుగల వాడైయుండెను. ఇదియు [illegible] సంభవమే. రాసోలో పృథ్వీరాజుయొక్క పదునాలుగురు భార్యలపేరులు వ్రాయబడెను, వీరిలో ఇచ్ఛినికుమారిగూడ చేరియుండెను. ఈప్రమాణములచే పృథ్వీరాజునకు భీమదేవునితో యుద్ధము, ఆపైవిజయము, [illegible] శుపుత్రుని సింహాసనమెక్కించుట, కేవల మబద్ధము కా[illegible]

యసంభవకథకూడ నై యున్నవి. రాసోలో వర్ణింప బడిన సలఖ ప్రమారుడు జైత్రప్రమారుడునను వారుండనే లేదన్న, మండోదరి, ఇచ్ఛినికల్పిత నాయికలుండుటలో సందేహ మేమి యుండగలదు?

రాసోలోని పృథ్వీరాజు సమయములో, ఆబూలో ప్రమారవంశీయులురాజ్యము చేయుచుండుటయును, గుజరాతులో భీమదేవుడుండుటయు దప్పఁ తక్కిన సవాద మంతయు కల్పితమే. రాసో లేఖకుడు జరిగిపోయిన తర్వాత నెంత కాలమునకో కథా భాగములు వినియుండుటచే నాయకుల యొక్క వయస్సులు సరియైనవి గానివే వర్ణించి యున్నాడు. అందుచే నసంభవ విషయము లెక్కువగా గానవచ్చుచున్నవి.

రాసోయొక్క (౨౦ సమయము) వర్ణనాను సారము 1172 సంవత్సరములో పూర్వ దేశముయొక్క సముద్ర శిఖరగడములో యాదవ వంశ రాజగు విజయ పాలుడు రాజ్యము చేయుచుండెను. వీని రాజ్యము సముద్రము వఱకు వ్యాపించి యుండెను. పదివేల బర్మా వృత్తయశ్వారోహకులు, అగణిత గజములు, మూడు లక్షల పదాతులు కూడ నుండిరి. రాణులయొక్క సంఖ్య తెలుప లేదుగాని పదిమంది పుత్రులు పదిమంది పుత్రికలు నుండిరి. పద్మావతియను నొకకన్యను, కుమావూం రాజగు కుమోదమణి కొసంగి వివాహము చేయ నెంచిరి. కాని ఆ కన్య పృథ్వీరాజు యొక్క శౌర్యాదికముల విని యుండి; యాతని యందాసక్తి గొని యుండెను. వివాహము నాల్గైదు దినములలో నుండగా నాకన్య దనయనురాగమును దెలుపుచు నొక జాబును వ్రాసి పురోహితున కొసంగి పృథ్వీరాజున కంపెను. అజాబునందు „నీవు శీఘ్రముగా వచ్చి నన్నుద్ధరించి వివాహ మాడకున్న చో విషము భక్షించి ప్రాణములు వదలగలను" అని వ్రాయబడి యుండెను. అజాబు చేరగనే తన యంతరంగ బంధుమిత్ర పురోహితా మాత్యులతోడను గొలఁదిమంది యోధుల తోడను గూడి పృథ్వీరాజు వివాహమునకు ముందుదినమే సముద్ర శిఖరగడమునకు వచ్చి వేచి యుండి కులాను సారముగా నాకన్య నగర బహిర్భాగమున నున్న దేవీ పూజకొఱకు వచ్చుట నెఱింగి బలవంతముగ రథముపై నెక్కించికొని డిల్లీకిచేర్చి మహా వైభవము తో పంచ మహా వాద్యములతో వివాహ మాడెను.

పూర్వదేశములో సముద్రమువఱకు వ్యాపించిన రాజ్యముగల మూడులక్షలపదాతులు, అగణితగజములు గల గొప్పరాజు బంగాళమునకైనను లేక ఒడిసాకైనను రాజై యుండవలయును. దీనికంటె కొంచెముముందు రచింపబడిన గ్రంథములో—కన్నోజు పాలకుడగు విజయపాలుడు కటకముపై దండెత్తి యుండె. ఆసమయమున సోమవంశీయుడగు ముకుందదేవుడు తనకన్యను జయచంద్రునకిచ్చి వివాహముచేసెను. యాదవంశ్యుని సోమవంశ్యుడని పలుకుచున్నారు. అటులయ్యు నీవర్ణముచే ముకుందదేవుడు విజయపాలుడు అనునవియొక వ్యక్తియొక్క నామములు కావనియు సముద్ర శిఖరగడమను నేనగర కటకము కాదనియు దెలియుచున్నది. ఈసమయమునబంగాళములో నీవంశము లేదు. ఈపేరుతో నొప్పరేరాజును లేడు. సముద్రశిఖరగడమను నేటివఱకు నైతిహాసిక భూగోళిక విషయమున నేపురాతత్వవిదులకును లభించియుండ లేదు. ఈకారణముచే నీ వర్ణముకల్పనామాత్రమని తెలియుచున్నది. లేఖకుడు, రాఢ యొక్క పాల వంశీయులగు ప్రతాపవంతులైన, రాజుల పేరు లను బారేంద్రభూమియొక్క ప్రతాపుడగు రాజు విజయసేనుని పేరును, వినియుండి, యీ రెండు పేరులను కలిపి విజయపాలుడని రచించియుండును. రాసోయొక్క రసికుడైన లేఖకుఁడు మహాభారతమున వర్ణింపఁబడిన భగవానుడగు శ్రీకృష్ణ రుక్మిణుల వివాహకథ ననుసరించి యీ వివాహకథ నూతనవిధముగా రచించియున్నాడు.

(సశేషము)



# ప్రేమలత

పిసుపాటి వేంకటరమణయ్య

హృదయమునఁ బాదుఁ గొల్ప నిర్మించి మసిచి
దృష్టివృతినెందు నెడమీఁక రెప్పగట్టి
ప్రేమరసమునఁ దడుపుచుఁ బెంచినట్టి
కుసుమవల్లిక వాడివ్యాకులత గొలిపె.

ఆణిముత్యపుఁ దళుకు నీహారవారి
శాశ్వతానంద తనులతా జాతఘర్మ
బిందువులుగాఁగ మురియుచు జేలనైతి!
కాలగతిప్రేమ శృంఖలఁ గట్టువడునె?

కూర్మివల్లిక పెనఁగొన, కుట్మలములు
వికసితానంద ఫలరసామృతము గ్రోల
నదనుగలిగించు ననునాస యెదనుదడుప
నాశలన్నింటి నార్పి కొట్టుడచిపోయె!

ప్రణయపూరిత దక్షిణవాయువులకు
నమ్రతను జూపు వ్రీడతనంపుఁ బెంపు
హృదయమున నచ్చుపడినట్లు వీడిపోదు!
ప్రకృతివైచిత్ర్యములను నెవ్వఁడు వెలార్చు




"స్నేను"

## రెండవ అధ్యాయము.

నా రైలునుంచి వెళ్లగానే అటిటు తిరగాలెనని బుద్ధి పుట్టింది. అటు తిరగడానికి కిరరులకు డబ్బు కావాలె. బారిస్టరు పార్వతీశానికి డబ్బు కావాలె. కాని నావంటి కుశల బుద్ధి కలవాని కవసరంలేదు. రైలులో బాడిగ యివ్వకుండా తిరగాలని నిశ్చయించా. రైల్వే కంపనివాండ్లు మన దేశంలో ఆశ్రయమిచ్చినందుకు కృతజ్ఞత చూపక మన పైననే తమ గొప్పదనం స్థాపిస్తారు. మననే దోచుకొన ప్రయత్నిస్తారు. దోచుకోవడం శాసన సమ్మతమని వాదిస్తారు. ఏమి తెలియని మనదేశస్థులను మోసం పాలుచేస్తారు. నా ప్రభావ మెుకింత వీరికి తెలుపాలని మానసం తొందరపెట్ట మొదలు పెట్టింది. పాపం, దొంగలిండ్లకు దోపిడిగాండ్లు రారని కాబోలు వారినమ్మకం! అహాహా!!

నేను వరంగల్లునుండి వాడీవరకు, మహాబూబునగరంనుండి మన్మాడువరకు టికటు కొనకుండానే ప్రయాణాలుసాగించా. రేల్వేలో పనిచేయుచున్న కొందరితో పర్చయంకూడా లభించింది. పర్చయ మెన్నటికీ వ్యర్థం గాపోదు. సమయాని కక్కరకొస్తుంది. కాని నేను వారి నెన్నడూ యాచించలేదు. నా ఆత్మ గౌరవానికి భంగం కల్గించుకోలేదు. నాపేరు ప్రతిష్టకు లోటు తెచ్చుకోలేదు: నిజం విచారిస్తే నామనస్సులో దురభిప్రాయమేదీ లేకనే ఉండెను. నేను దొంగనుకాను, దొంగతమ్ముడనంతకు కాను. నాఉద్దేశం మీకందరికీ తెలిసినదే. నాచాకచక్యం వారికింత రుచిచూపించా లని మాత్రమే. నేనెప్పుడూ చేతిలో ఒక అందమైన బెత్తం, కంటికి మంచి అద్దాలు, తలపై రూమీటోపీ, ధరిస్తూ ఉండేవాణ్ణి. స్టేషనులో ప్రవేశించగానే సన్నగా యీలవేస్తూ ప్లాటుఫారంపై నటిటు పచారు మొదలు పెట్టేవాణ్ణి. టికటు కలెక్టర్లు టికట్లను పరీక్షించగానే రైలింక కదులుతుందనే సమయాన్నే ఫస్టు క్లాసో, తుదకు సెకండు క్లాసులోనో దూకేవాణ్ణి. మనవంటి వారికి తిరుగడం తప్ప వేరు వుద్దేశమేదీ వుండదుగదా. ఇష్టమైనచోట యేస్టేషనులో దిగాలనిపిస్తే అక్కడే దిగేవాణ్ణి. దిగి చేత బెత్తం షోకుగా తిప్పుతూ, బుక్కింగ్ ఆఫీసులో యేదోవిచారించడానికి వచ్చేపెద్దమనిషిలాగా జొరపడేవాణ్ణి. రైలు వెళ్లిపోయిం తర్వాత యీలవేస్తూ వూరి ముఖంపట్టేవాణ్ణి. ఒకాడూ "నీ వెక్కడినుంచొస్తున్నావు, ఏటిక్కటేది" అనిప్రశ్నించేవారు లేకుండిరి. టిక్కటు అడిగితే మాత్రం నేనెక్కడినుండి తెచ్చిచ్చేవాణ్ణి? టిక్కట్లపై డబ్బువ్యయ పరచడం నావుద్దేశానికి వ్యతిరేకమైన విషయం. యీవిధంగా నెలలు గడిచెను. నాచతురత నెవ్వరూ కనిపెట్ట లేకపోయిరి, అందరూ తెలివితక్కువ వారేయని నేననుకోమొదలు పెట్టితిని. తిరుగడానికిగూడా వ్యాప్తరాబట్టెను. ఒహాసాటు; కాలంతటస్థిస్తుంది, ఫస్టుక్లాసులో సెకండుక్లాసులో జవంచాలా వున్నంచున చోటుదొరకలేదు. టిక్కటులేని

ప్రయాణీకుణ్ణి కనక థర్డుక్లాసులో దూరితిని. మన లో థర్డుక్లాసు వాళ్ళేచాలా ఉన్నందున థర్డుక్లాసు వర్ణనచాలా చేయనక్కరలేదు. మీరనుభవించే వున్నారు, యీక్లాసుపై టికటు కలెక్టర్లదాడి యెక్కువుంటుందనే విషయాన్ని. నే నాక్లాసులోకూర్చున్న ఐదునిమిషాలకే రైలువెంటతిరిగే వొక టిక్కెటు యినిస్పెక్టరు పురుకుతున్న రైలుయొక్క యింకొక డబ్బాలోంచి నేనున్న డబ్బాలోకి ప్రవేశించెను. అతనిమరదృష్టవశానముందరనేనే వుంటిని, 'టిక్కెటుచూయించ' మని ప్రశ్నించెను.

„కొంచం చూచిమాట్లాడుము, ఇంకేజంగ్లీ గాణ్ణైనాపోయి అడుగుము. నేనుటిక్కెటు గిక్కెటు వుంచుకోను"అని గర్జించితిని.

„మంచి మాటలతో టికెటు చూయించక పోతే నీపైకేసు తేగలను" అని టికెటుయిన్స్పెక్టరు తీక్ష్ణంగా పలికెను.

„అహాహా! నీనోటినుంచివెళ్లిన మాటను పాలింప గలిగితే నాపై కేసుతెమ్ము. సంతోషం. లేనియెడల మాత్రం నిన్నేపట్టించే సామర్థ్యం నాదగ్గరుంది" అని అతన్ని గేలిచేస్తిని.

అతడు నివ్వెరపడిపోయెను! „ సికింద్రాబాద స్టేషను లో నీపాగరణచగలను " అనితీర్పు చేసెను! „మంచిదే. నిన్ను దుర్గతి పాలుచేసి సంతోషించగలను" అని ప్రత్యుత్తరమిస్తి. ప్రయాణికు లందరు మాదిప్రసంగంవిని ఆశ్చర్యపడి పోయిరి. మిస్టర్ టిక్కెటుకలెక్టరు వెలవెలబోయెను! అతడు రెండోడబ్బాలో టికట్లుపరీక్షించ వెళ్ళగానే అప్పాకంగారు యిదివరకాతడు పరీక్షించివచ్చిన డబ్బాలో ప్రవేశమైరి లోపల చేరగానే తిరిగి టికట్లుపరీక్షించ మొదలుపెట్టితిని. ఆడబ్బాలో వాండ్లందరు నన్నింకొక టిక్కెటుకలెక్టరని తలంచసాగిరి. కాని నామనోవీథియం దింకొకభావం పరుగిడుచుండెను. సికింద్రాబాదులో దిగేవాండ్లలో పరమానందయ్య శిష్యుడెవడైనా ఉన్నాడా లేడాయని. నాపని నిర్వహింప బడాలని నాకోరిక, వెతికితే దొరకం

దేది? „కష్టేఫలే." ఒక మహాత్ముడు చిక్కినాడు. అతని టిక్కెటు తీసికొని దానిపై నాసంతకముచేసి ఆటిక్కెటుపైనున్న సంఖ్యను నా నోటుబుక్కులో రాసుకొంటిని. తర్వాత తిరిగి నాడబ్బాలోపోయి కూర్చుంటిని. ఇరువై నిముషాలలో సికంద్రాబాదు రానేవచ్చెను. అందరికంటే ముందేనేను దిగితిని. ఇనిస్పెక్టరు కన్నానాపైననే ఉంటుండెను. „ఏయ్, ఎక్కడి కెళ్లుతున్నావు! నిలబడు" అని అరిచెను. „చిత్తం!" అని నిలబడితిని. అతడు నకొ్నక పోలీసు భటుని కప్పగించి అతనితొందర పనులను చక్కబెట్టి వెళ్ళెను. „ఇదీ నయమే" అని అనుకొంటిని. అందరు ప్రయాణికులు తమతమ టిక్కెట్లిచ్చి వెళ్ళిపోయింతర్వాత అతడునన్ను స్టేషను మాస్టరుముందు నిలబెట్టెను. నేను మౌనము వహించి నిలబడితిని. మాస్టరుగారు „నీవు టిక్కెటు లేకండా రైలెక్కినావా" అని యడిగెను.

„లేదు, యెన్నడూలేదు,"

„అయితే, నీటిక్కెటేది!"

„నాటిక్కెటాతడు రైలులోనే తీసుకొన్నాడు. యీతడునన్ను పైసలడగడం మొదలు పెట్టాడు, నేనివ్వనంటే యీ పురాణమంతా కల్పించాడు" స్టేషనుమాస్టరు నన్నొకసారి, ఇనిస్పెక్టరు నొకసారి సంశయదృష్టులతో చూడసాగెను. ఇనిస్పెక్టరు లేదో కుయ్యో మొర్రో అనుచుండెను. నన్ను నిందించ మొదలెట్టెను.

„ఆలోచించి మాట్లాడండి. లేకపోతే మీపైన కాక రేల్వేకంపనీపై గూడా మాననష్టపుదావా తేగలను. అప్పుడుగాని మీదురుడగా అణగవు" అని బెదిరించితిని. నాబట్టలు, నావేషము, పరిశుభ్రంగా వుండెను. కనుక స్టేషన్ మాస్టరు నన్ను గౌరవంగా సంబోధించెను. తెల్లబట్టలవాడు మంచివారని ప్రబలనమ్మకం మనలోవున్నది గదా!

„యిదిపోట్లాడే పలముకాదు. మీదగ్గిరనిజంగా టిక్కెటు కొన్నట్టాతే ఆటిక్కెటు నంబరు చెప్పవలె యండి"

„నేనుమీతో మొదలేమనవి చేస్తికదా. అతడు నాదగ్గరనుంచి టికటు తీసుకొని, అతడు నన్నడిగిన దక్షిణ ప్రసాదించనందున యింత మాయను పుట్టించినాడు" స్టేషన్ మాస్టరు వుత్తమ స్వభావంగలవాడు.

„మంచిది, మాదగ్గరన్ని టిక్కెటున్నాయి. మీటిక్కెటేదో వాటిలో వెదికి చూయించ[illegible]ి" అనిఅనెను.

అప్పుడేనోటు బుక్కును తీసి టిక్కెటునంబరు చూయించితిని.

„టిక్కెటువెన్క నాసంతకంకూడా వున్నది. యిదిగో నాకార్డు తీసుకవెళ్లి మీరే వెదకండి" అనివ్యాఖ్యానంచేసితిని.

ఈమాటలు నానోటినుండి వెళ్లంగానే యినిస్పెక్టరు తెల్లబోయెను. కానినేను టిక్కెటు లేకుండావచ్చినాని నమ్మకమున్నందున అతడు శాంతంగానిలబడెను. స్టేషన్‌మాస్టరు టిక్కెటువెదక వెళ్లెను. నేనుసంతకంచేసిన టిక్కెటు అనాయాసముగా దొరికెను. స్టేషన్‌మాస్టరా టిక్కెటును వెంటదీసుకొని నాదగ్గరికొచ్చెను, నన్నుక్షమింప వేడసాగెను.

„మాస్టరుగారు, క్షమించుటతో పనిసాగదు. ఈతడు నన్నవమాన పరిచాడు. మీరు, యీపోలీసువాడు సాక్షులుగా నున్నారు. నేనితనిపై మాననష్టపుదావా తేనున్నాను. మీరుసాక్ష్యంపలుక వలసి వుంటుంది. నేనిక్కడేదో తొందరపనిని గుఱించి వచ్చియుంటిని. ఆపని కాలేదు. రాకడపోకడ ఖర్చునాతలపై పడ్డది. ఈకారదాన నావ్యయ ప్రయాసాల ప్రత్యామ్నాయముకై (హర్జా) సివిల్ (దివాని) కేసునిర్ణయించినాను. మీయినిస్పెక్టరును ఊరకవదలను. తగినశాస్తి జరిగితీరాలె," అనిఅంటిని.

ఈమాటలు చెవినిసోకినకొద్ది యినిస్పెక్టరు ముఖం వికారములైన మార్పుల బొందుచుండెను. కాళ్లు చేతులు చల్లబడెను. స్టేషన్‌మాస్టరు నా కోపాగ్నినిచల్లార్చుటకై తన ఆఫీసులోనికి తీసుకవెళ్లెను. తనతో కాఫీత్రాగుటకై బలవంతపరచెను. కొంతసేపు గడచిన తర్వాత నాకోపము శాంతించెనని కనిపెట్టి „పాపము! బీదవాడు, జీతముకూడ యెక్కువలేదు. అతనిపై దావా చేసినంత మాత్రాన మీకయ్యేలాభమేమి, అతనికొల్లో మన్నుపడడం, అతడుజేయిలుకు పోవడంతప్ప? అనిప్రార్ధించెను.

„మీరుత్తములు. మీమాటపైనేను నాదృఢనిశ్చయము నుపసంహరించు కొందును. కాని నాతనికేదో యొకవిధమైన శిక్షదొరికితీరాలె. లేనియెడల నన్నుబాధపెట్టినట్టుల బీదసాదలను కూడ బాధించుట మానుకొనడు" అని సగర్వముగా జవాబిచ్చితిని. స్టేషన్ మాస్టరుగారు స్వయంగా నాతనిపై ఐదు రూపాయల జుర్మానా వేసిరి. ఆడబ్బు బీదలకు పంచిపెట్ట వలయునని ఆజ్ఞాపించి స్టేషన్ మాస్టరుగారితో సెలవుపొంది ఒక మంచి టాంగాలో నగరంలోకి వెళ్ళిపోతిని. వెళ్లుతూ వెళ్లుతూ ఆయినిస్పెక్టరుతో నీ విధమగు ప్రవర్తనం వదిలిపెట్టుమనియు, మానంగల వాండ్లను అవమాన పరచకూడదనియు, బోధించి వెళ్లితిని. ఇటువంటి చమత్కారమైన విషయాలు నాజీవితంలో యెన్నోవున్నాయి. వాటికైనతర్వాత మరొకటి మీకు వినిపిస్తా. జోరా నేను! జోరా నాప్రజ్ఞ!!

# స్వాగతము

పురిపండా అప్పలస్వామి కవితాసమితి

ప్రాణనాథునిప్రేరణ వలనఁ గాక
నీవుతావిదినిక్కమ్ము నేనెఱుఁగుదు;
రమ్ము రమ్మిదె సుస్వాగతమ్ముఁ గొనుము
కష్టమా! నాదుమైత్రి నీ కిష్టమౌకద!
కొలఁది నెఱుగని మూఢజనుల విధాన
నిన్నుఁగని ద్వారములను బంధింపఁ బోను
త్వన్మహోదార విమలభావములఁ గనక
పేరువినినంత మాత్రాన బెగడువడెడు
పిఱికివారలగతి నేను వెఱవఁ బోను
రమ్ము కష్టమా! సుస్వాగతమ్ముఁ గొనుము
తనవినిర్మలి ప్రేమబంధమున కిదియు
నొకమహా నిదర్శనముగా నుంపఁ దలచి
కాక నిన్నేల నిపుడు నాకడకు ననుపు?
అద్దిరాప్రాణపతికి నాయందు నెంత
ప్రణయమున్నదో యీదీనురాలిమాట
మఱవకిటునిన్నుఁ బుత్తెంచె మత్కుటీర
నిలయమున కహో!-వాకిట నిలిచె దేల?
రమ్ముకష్టమా! సుస్వాగతమ్ముఁ గొనుము
ప్రాణనాథుని దరినుండి వచ్చుకతన
నీవు నాప్రాణతుల్యంబవే నిజంబు
అరమరలు లేవు నీకునా ప్రాంగణమున
రమ్మునేఁటి నుండియును సర్వమ్ము నీయ
ధీనమయ్యెను నేను త్వదీయపాద
దాసినైతిని నీదుపాదములనాన
రమ్ముకష్టమా! సుస్వాగతమ్ము గొనుము.

# హిందూ స్త్రీ

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి

పూర్వవాఙ్మయములను బట్టి చూడగా హిందూగృహిణియొక్క పదవి గౌరవము పుట్టించునదిగానున్నది. స్త్రీ గృహమున కధిదేవత. సిరిసంపదలకు ఉత్పాదకురాలు; పురుషునకు చైతన్యమును ప్రసాదించు దేవి; సంఘమునకు గుండెకాయ. మనువు పురుషునకు స్త్రీ పూజ్యురాలని చెప్పినాడు. ఈ కారణములవలననే దేశ మప్పుడు స్వాయత్తమై యుండినది. హిందూదేశ మంతే ప్రపంచమున జ్యోతిర్మండలముగా నుండినది.

అట్టిదేశము పరులపాలగుటకు స్త్రీల పతనమే ముఖ్యకారణమని చెప్పకతప్పదు. కాలక్రమమున పురుషునకు స్త్రీ భోగ్యవస్తువను నభిప్రాయము దృఢపడినది. ఆ యభిప్రాయముతో స్త్రీకి పురుషుడు శృంఖలములను తగిలించినాడు. చివరకు పురుషునకు సేవ చేయుటకే స్త్రీ పుట్టినదని ఆమెకు నమ్మకము కల్గించినాడు. పురుషునకు భార్య అర్ధాంగి యను సిద్ధాంతమును స్త్రీకి పురుషుని దేవుని కంటెను ప్రథమ పూజ్యుడు అను సిద్ధాంతముతో కట్టివైచినాడు "నీ శరీరమున నేను సగమైతే నా శరీరమున నీవు సగము కావా?" అని పురుషుని స్త్రీ యడుగలేకపోయినది. దీనివలన మూడిన కీడేమనగా, పురుషుడొకడుండి స్త్రీల నైన పెండ్లాడవచ్చును. భార్య చనిపోతే వెంటనే యింకొకతెను కట్టుకొనవచ్చును. అట్లు చేయకపోయినా ఐహిక సుఖములను బడయవచ్చును. ఒక భార్యను విడిచిపెట్టి, అంటె ఆమె జీవితమును ధ్వంసము చేసి, మరి యొకతెను పెండ్లాడవచ్చును.

స్త్రీ యట్లుకాదు. భర్త పోతే స్త్రీ సహగమనము చేయవలెను. లేకున్న వికృత రూపిణియై ఐహిక ప్రవృత్తిని విడిచి ముండమోపియై యుండవలెను. నిర్దయుడై భర్త విడిచిపెట్టినచో కిక్కురుమనకుండ పడియుండవలెను. ఈ దౌర్జన్యముతో ప్రేమయొక్క యాధిపత్యము తుడిచిపెట్టుకొని పోయినది. దీనితో దాంపత్య ధర్మమునకు విఘాతము కలిగినది.

మనకు పరుల స్వేచ్ఛ లభించుట కనేక అనేకవిధముల ప్రయత్నించుచున్నారు. గాని స్త్రీల విషయమున శ్రద్ధ చేయుట లేదు. సత్యము లింకను గమనింపబడలేదు. స్త్రీని బాగుచేసితే మేని మన మిప్పుడు కొనసాగింపలేకున్న అనేకోద్యమముల నామె చక్కగ నిర్వహించి పురుషుని శ్రమను తగ్గింపగలదు.

మీరు నిర్బంధ విద్యను ప్రారంభింపుడు. బాల్యవివాహములను రద్దుచేయుడు. వితంతు వివాహములను శాసింపుడు. అస్పృశ్యతను తొలగింపుడు. రాటమును విసుడు. హిందీని నేర్చి కష్టించి కొనుడు. గర్భాదాన వయస్సును హెచ్చింపుడు. వేశ్యలను తగ్గించి నృత్యగానాభినయములను చంపివేయుడు. గ్రామపునర్నిర్మాణ మనబడు దానిని సాగింపుడు. హిందూ మహమ్మదీయ సఖ్యమును సాధింపుడు. రాటపు జెండా యెగురవేయుడు. శాసన సభల నాక్రమింపుడు. లేకున్న వానిని నాశనము చేయుడు. ఏమయిన చేయుడు గాని జాతి నాశనపడుట కివి మార్గములు కావు. జాతీయ నిర్మా

ణము పురుషుని పని గాదు. పురుషుని హృదయము నిర్మలము కావలెనన్న అది మాతృస్తన్యమువలన గాని కాదు. పురుషుని శక్తి నిశితము కావలెనన్న అది మాతృలాలనము వలన గాని కాదు. హిందూ స్త్రీ హృదయము సంస్కరింపబడునంతవరకును హిందూజాతి కున్నతి రాదు. హిందూ స్త్రీకి బంధముక్తి యగునంతవరకు హిందూదేశమునకు మోక్షము లేదు.

బైట పురుషు డెన్ని దంభములనైన పలుకవచ్చు. ఎంతయుద్రేకము నైన చూపవచ్చు. ఎంతయుత్సాహము నైన కనుపఱపవచ్చు. ఎంతపట్టుదలనైన బూనవచ్చు; గాని యింట స్త్రీపాదముల సన్నిధిని దాసుడై యుంటున్నాడు. ఆ స్త్రీ దేవీస్వరూపిణియై యుండినచో పురుషుడు వజ్రపుతునకరై యుండును; గాని యిప్పుడట్లు లే... ఆమె జంగమవల్లియై యున్నది. పురుషుడు మంటిముద్దగా నున్నాడు,

అయితే సర్వస్వతంత్రుడ ననుకొనుచున్న పురుషు డీసిద్ధాంతము నంగీకరించుటయు, దీని నాచరణమునకు తెచ్చుటయు సాధ్యము కాకపోవచ్చును. అతని యహ మిక యొంచు కంగీకరింపకపోవచ్చును; గాని ఇది యాచరణమున ప్రత్యక్షమగునంతవరకును హిందూజాతికి జీవత్వములు ఉండవు. ఇది యొక జాతిగానే పరిగణింపబడదు. ఇది నిలువనే లేదు. హిందూమతము చుట్టును మూగియున్న ప్రతిఘాతశక్తుల విజృంభణ మిందుకు కారణముగా నున్నది.

# లీలాదర్శనము

### ముదిగొండ శంకరుడు

గీ. అమర గంగానదీ తరంగములలోన
కుముద బాంధవ చంద్రికా సమితిలోన
భ్రమలకల్పించు నీల మేఘములలోన
శూలి! జూతు నీలీల మాలజాల.

గీ. గంధవాహుని మందంపు గతులలోన
బాడబజ్వాల మాలికా పటలిలోన
చిందుమకరంద నవ్య వీచికలలోన
ప్రీతిజూతు నీ లీలలన్, భూతనేత!

గీ. హీరపూరిత కంధర హారమందు
నీరజాత సంభరిత కాసారమందు
దారదారా సమాశ్లేష భారమందు
మారహర! నీదు లీలలన్ మేరగాంతు.

గీ. కలిత షట్పద కమనీయ గానమందు
మాఘ్యమందార మంజుల మాలలందు
నూలి రేగడి పుంభావ కేళులందు
కాలగళ! నీదు లీలలన్ జాలగాంతు.

గీ. దారుకావన వనితా విహారమందు
కంతుసంహార మొనరించు గాలమందు
త్రిపురదానవ కంతముల్ ద్రెళ్లువేళ
నిందుమౌళి! నీలీలలన్ గందుమిగుల

# శ్రీఛత్రపతి శివాజి

చరిత్రాభిమాని

కాలచక్రము మూడునూర్ల మార్లు తిరిగినది. మహారాజా శివాజీ భరతవర్షమున భవ్యతరముగ జనమందిన నాటినుండి నేటివరకెన్ని మహోన్నతములు, మహోత్కృష్టములునగు పరివర్తనములు భారతభూమిని కట్టుకాడించి వైచినవి. నాటి భారతము నేడులేదు, నాటి యాదర్శములు, నాటి జీవితప్రణాళికలు, నాటి ఆధ్యాత్మిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులు అద్భుత పరిణామము నందినవి. భారతమే యననేల, సమస్త విశ్వము పరివర్తన మహాసాగర వీచీకల్లోలమునం దల్లాడి పోయినది. పరివర్తనము ఈశ్వర విలాసము. లోకైక విభుని లీల, దురవగాహ పరివర్తనాశాసనముం దప్పుకొనుట ఏరితరము ?

కాని ఏతత్పరివర్తనామహ్య మధ్యంబున, ఏతత్సంక్షోభ గర్భ గర్భాంతరమున, అపరివర్తనీయములు, అనుశీతములనగు మహాసత్యములు కొన్ని ఎన్నటికిని స్వయం జ్యోతులై, మానవ జీవితమార్గదర్శనులై విరాజిల్లుటయు తథ్యము. దేశకాలములంబట్టి వీటి బాహ్యస్వరూపము మారుచుండుటయు తథ్యమే. స్వజాత్యున్నతికై ఘోరముగ పోరుసల్పి జీవితరక్తమును జాతీయ పాదపపోషణమునకై కాల్వల పారించు కర్మవీరులు, అనంతసత్యములందొక్కటియగు జాతీయతా మహాసత్యము నారాధించు మహాత్ములు. వీర అమృతులు. వీరుగతించి శతాబ్దములు దాటిపోయినను చిరస్మరణీయులే.

ఇట్టి వీరులందొక మహావీరుడు ఛత్రపతిశివాజి. అద్భుతతేజశ్శాలి. అవక్రపరాక్రముడు. కర్మయోగి, తిరిగి అర్జునుడే! హైందవజాతీయతా విజృంభణము, మొగలు సామ్రాజ్య ప్రతిష్టంభము, శివాజీ జీవితాశయములు. రెండిటియందును అద్భుతముగ గెల్పొందినాడు. వీరాగ్రేసరుడై విరాజిల్లినాడు. నతడు హైందవజాతీయ వీరుడు. కార్లైలుఋషి నిర్వచించిన వీరపురుష లక్షణము లీతనియందు గానవగు. ప్రజానాయకుడు. మొగలుల తీవ్రసంఘట్టనమును ప్రతిఘటించి, తత్సంఘట్టనచే నలిగి కృశించిపోయిన హైందవజాతిని ఒక్కమారు తిరిగి ఔన్నత్యమునకు దెచ్చుటయను దుస్సాధ్యమును సాధింప సమకట్టిన మహాపరాక్రమశాలి. పౌరాణికయుగమునందే జనించియుండినచో ఏ భార్గవుని రీతినో యొక యవతార పురుషుడై పరిగణింపబడవలసినవాడే. ప్రారంభమున „దొంగల నాయకుడే,” „కొండ యెలుక”యే యాతడు. ఏరాజు కాడు!—కాని అచిరకాలముననే మొగలు సామ్రాజ్య మహాపర్వతముం ద్రవ్వ ఈశ్వరుడంపిన క్షుద్రమూషికావతారుడై, కడకు స్వీయ వినిర్మిత మహారాజ్యాధిపతియై అఖండకీర్తి నార్జించినాడు, భారత చరిత్రయందు శివాజీ నామము, మహారాష్ట్ర విజృంభణము, శాశ్వత స్థానము నలంకరించినవి.

ఈ స్వజాత్యుత్కృష్టతాకాంక్ష ఎంతవరకు వాంఛనీయమనునది వేఱుప్రశ్న. ఈశ్వర విధానమునందు

ఏ ఒక్క విషయమునందును సంపూర్ణ సత్యము గానరాదు. ఇతరజాతుల నణగద్రొక్కి తన వైభోగమునందు దమను ప్రత్యేక జాత్యుత్కృష్టతా కాంక్ష లోకకల్యాణమునకు పెద్ద శత్రువు. ఈశ్వర విధానమున కనువుబాటు. మానవ సౌభాగ్యము నానాజాతి సమ్మేళనమునందిమిడియున్నది. ఎప్పటికైన మన ‚నానాజాతి సమితులు‘ ఒక ‚ఏకజాతి‘ని సృష్టింపనిచో నిలిచున్నియు పెద్ద బూటకములే. కాని అశుభసమయ మాసన్న మగువరకు ఏదేని యొక ప్రత్యేకజాతి ఇంకొక యితర జాతిచే సంభక్షింపబడి నిర్మూలింపబడు తరుణమున, నాజాతి ఉత్కృష్టతా కాంక్షచే నావేశమునందుట యొక ఈశ్వర సంకల్పము. అట్టి ఆవేశమే ఇన్ని వర్షములుగ భారత వాతావరణమును నావి జాతీయతా రూపమున వివిధ పరిణామములనొందుచున్నది. ఇట్టిదే మూడు శతాబ్దములక్రింద హైందవ ప్రపంచము నావేశ పూరితము జేసి శివాజీ రూపమున రుద్రావతారమై జనించినది. శివాజీ నాటి గాంధి! ఈశ్వర దత్తుడగు మహాత్ముడు!

హైందవుల నణగద్రొక్కుట మొగలుల యాశయమైనది. మొగలుల నిర్మూలించుట శివాజీ యాశయమైనది. ఈ తీవ్రసంఘర్షణ మధ్యమున భారతమునందాంగ్ల జాతికి ప్రవేశము కలిగినది. త్రివేణీసంగము సమకూరినది. లోకమునందు సజీవములయి యున్న ముఖ్యములగు మూడు మహా సంప్రదాయములు నేడు భారతదేశమున నొక యపూర్వసంఘర్షణయందు దగుల్కొనియున్నవి. ప్రస్తుతము భయానకమయ్యు, అంతరదృష్టికి భావి సౌభాగ్యము గన్పట్టక మానదు. జాతులు, జాతులు అన్యోన్య[illegible] అపూర్వమును, భయంకరమును నగు ఘోర సంరంభ[illegible] జేకొనుచున్నవి. పోయిన సంగ్రామము మహా సంగ్రామమనుకొనుట మౌఢ్యము. ఇంకయు ప్రాక్పాశ్చాత్య సంగ్రామము లెన్ని కానున్నవో. ఇంకయు భీకరప్రళయము లెన్ని దేశముల ముంచవలసియున్నవో! భారతము, ఒకనాడు లోకమున దీపంపు దివ్వెయై వెలిగిన భారతము, నేడు సాంఘిక, రాజకీయ విప్లవములకు అనువగు వాతావరణమున నాడుచున్నది. స్త్రీలయందశాంతి పెరుగుచున్నది. స్పృశ్యతా స్పృశ్యతా వాదములు, బ్రాహ్మణా బ్రాహ్మణ వివాదములు, పురాణ సంప్రదాయ ప్రాచ్య నాగరికతా సంరంభము ఒకదానితోనొకటి గలసి, దేశమునొక్కసారి కలచివేయుచున్నది. ఇన్నిటి మధ్యమున, ఈ భీకర శ్మశానమున నటరాజమూర్తి గజ్జెల మ్రోతమండి, ముక్కం[illegible] మృదుల సంగీతరవము, కల్గునని యాశింతము. మొ[illegible] విజృంభణమున నశించిపోవక ఈ మథనమునందు పొం[illegible]ను మహద్భాగ్యమును హైందవజాతికి ప్రసాదించి దాని నిలబెట్టిన వీరాగ్రేసరుడు శివాజీ. ఏతత్కారణమున హైందవ జాతనికి కృతజ్ఞులు. నాకేకాదు, లోకమంతయు శివాజీకి వినతు లొనర్ప వలసినదే. ఎందరెన్ని పొల్లొన్న సంత మధురమై విరాజిల్లగలదీ యమృతము. ఈ మాధుర్యమును ప్రసాదించుటకు రుద్రరూపుడై శివాజీ జన్మించినాడు. రౌద్రము మాధుర్యాత్మకమగుట ఈశ్వరలీల. శ్రీ శివాజీమహారాజ దివ్యనామమునకు సర్వజయమగుగాక?

# "యువకుఁడా!"

(శివ ప్రభాకరులు)

ఉ. పుట్టితి వాంధ్రదేశమునఁ బూర్ణముగాఁ బఠియించితాంగ్లమున్
దుట్టతుదన్ వశిన్ ముదముతో నొక సేవకవృత్తి నీవు చే
పట్టితిగాని యెన్నడును భారతమాతృపదాంబు జంబులన్
బట్టి నుతింపనోచవది పాపమటంచు దలంతువో మదిన్.

గీ. బాల్యమందాటలాడుచుఁ బ్రముదమంది యౌవనంబున విషయ సౌఖ్యంబులంది
యంత్యదశయందుఁ జింతల నందియుంది తనువు విడనాడుచోఁ బ్రయోజనముగలదె.

గీ. ఆంగ్లభావన నేర్చిన యట్టిసుగుణ గణము భవదీయ దేశోపకారమునకు
నుపకరింపఁ గఁ జేసిన యపుడుగాని బడయ వినుమంతయైన లాభంబుయువక.

సీ. తినుటకన్నము లేక చనిపోవు బీదలఁ గాపాడ బద్ధ కంకణుఁడ వగుము
దేశభాషావృద్ధి నాశించి దానికై నీయథాశక్తిమై సాయపడుము
భారతాంబకదాస్య బంధముల్ విదిలించి స్వాతంత్ర్యమార్జింపఁ బాటుపడుము
హైందవ ధర్మశాస్త్రాను గుణంబుగా నభ్యసింపంగఁ బ్రయత్నపడుము

గీ. లెమ్ము లెమ్మింక యువకుఁడా లెమ్ము రమ్ము, కాలమిసుంతయున్నట్టి కార్యమధిక
మాలసింపఁ గరాదిట్టి యవసరమునఁ గడలి యేతెంచి కార్యరంగమున దిగుము.

క. నలుప నసాధ్యంబిదియని పలుకుచుఁ గాలంబు బుచ్చ వలదెన్నడు నీ
యిలనెల్ల రిటులఁ జేసిన గలుగునె లాభంబు శతయుగంబులకైనన్.

# కవికర్ణరసాయనము

## వఝ్ఝల వేంకటేశ్వరకవి

శ్రీ సారస్వత ప్రపంచకమునఁ గవితాకన్యకఁ గాంచిన ప్రభువాత్ముఁడు వాల్మీకిమహాముని. అంత వ్యాసుఁడా మెకు ముద్దుమాటలు నేర్పెను. బాణుఁడు పదవిన్యాసముఁ గూర్పెను. భారవి యర్థగౌరవ మొసంగెను. కాళిదాసుఁ డలంకారముల నొసఁగెను. ఇవ్విధమున నెవరికిఁ దోఁచినరీతి వారు కవితాకన్యకకుఁ దమతమ శక్తులకొలఁది సహాయముఁ గావించి యామెం బెంచి పెద్దఁ జేసిరి. పిమ్మట నన్నయాద్యాంధ్రకవీశ్వరులుగూడ సమశక్త్యనుసార మామెం బోషించిరి. అట్టి కవితాకన్యక మహాకవీంద్రుల పోషణంబున మహోన్నతదశయందుండెను. కవితం బోషించిన యట్టి మహనీయులలో సంకుసాల నరసింహకవి యొకఁడు.

కవికర్ణరసాయనమను మహాప్రబంధంబును రచించిన నరసింహకవి కావేరీప్రాంతమునందలి వాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. ఇతఁడు గద్యమున, "ఇది శ్రీమద్భట్ట పరాశర దేశికేంద్ర చరణ సరసీరుహ సేవ కోపవీషక నరసింహ నామధేయ ప్రణీతంబైన" అనుటచేతను, ప్రథమాశ్వాస ప్రారంభమున,

క॥ గురువర భట్టపరాశర
చరణసరోరుహముల్ల సన్మానసుఁడన్

అనుటచేతను నితఁడు భట్టపరాశర దేశికేంద్రుని శిష్యుఁడనియు, వైష్ణవమతమునం దభిమానము కలవాఁడనియుఁ దెలియుచున్నది.

నరసింహకవి కృష్ణదేవరాయల కాలములో ఁడని చెప్పుటకొక కథగలదు. కవికర్ణరసాయ నారాశ్వాసముల మహాకావ్యము రచించి, యీ కృ దేవరాయల కంకితమిడి సత్కృతుల నొందఁదలంచి, స్థానకవియగు నల్లసాని పెద్దనకుఁ దొలుత వినిపించె ప్రాంతముగావిని పెద్దన, తత్కావ్యము తానప్పుడే వ్రా మనుచరిత్రముకన్న మిన్నయై యుండుట గ్రహించి, కృష్ణదేవరాయలకుఁ జూపించినచోఁ దన కృతినిఁ ననియెంచి, నరసింహకవికి రాయలవారి దర్శనము యఁడయ్యెను. అంతటనిసువుఁజెంది, యతఁడు తానాగ్రంధమును విడిచి శ్రీరంగేశునకుఁ గృతి అతఁడు ధనముకొరకై తనకావ్యములోని యొక ప నొక కోమటికమ్మెనట! ఆకోమటి యాపద్యము తాటియాకుపై వ్రాయించి తన దుకాణముకడ చెను. కృష్ణదేవరాయని కూతురగు మోహనాంగి యొకనాఁడా పద్యముం గనుంగొని, కోమటివలనఁ త్తాంతంబు నెఱింగెను. ఇట్లుండ నొకనాఁడు నాంగియుఁ గృష్ణదేవరాయలును చదరంగమాడు నేనుఁగునకు, మంత్రికి నడుమ బంటుండుటచే, తులమధ్యమునఁ బేదకుండఁదరమె" యని యాపద్య సరకు దానివలన నెఱింగిన మోహనాంగి బంటు నెచ్చెను. రాజాశ్చర్యపడి, యాపద్యము జదువుమన; మోహనాంగి,

ఒత్తుకొని వచ్చు కటికుచద్వయము
తరుణి తనుమధ్య మెచటికో తలఁగిపోవ

నుండెనేనియుఁ గనఁబడకున్నె యహహా!
యుద్ధతులమధ్యమునఁ జేవకుండఁ దరమె..

అని చదివెను. పిదపఁ గృష్ణదేవరాయలు పెద్దన కావించిన మోసముఁ దెలిసికొని చింతించెను. రాజ సత్కారము తనకు లభింపక పోవుటచేతనే, నరసిం హకవి,

సీ॥ అందోళికలయందు నంతరచరులైన
సవికృతాకృతులఁ బిశాచజనులు
పరకరాళంబులై ప్రార్థింపఁగనుఁగోక
వాయెత్తకుండు జీవచ్ఛవములు
వాలవీజనములఁ గ్రాలుచునీఁగకు
నంటీని ఖరవర్తు లాండసములు
వేత్రపరంపరా విలకంటకాకృతిఁ
జేరఁబోరాని బర్బూరతరులు

గీ॥ శంఖనాగస్వర స్వరశ్రవణసముద
విస్ఫుటచ్ఛత్ర విస్ఫారితస్ఫటాక
విష్టవిషవైద్య వశవర్తి దుష్టఫణులు
ప్రభుదురాత్ములు నెవ్వాఁడు ప్రస్తుతించు.

అని రాజుల నిందించెను. పైకథంబట్టి పెద్దన మను చరిత్రము వ్రాయు సమయముననే కవికర్ణరసాయనము కూడ వ్రాయఁబడి యుండునని యూహింపక తీరదు. కావునఁ బెద్దనయు నరసింహకవియుఁ గూడఁ బ్రబంధము నకు మార్గ దర్శకులు.

గీ॥ కావ్య ముత్పాద్యమైన సత్కావ్యమింక
సక్త కావ్యంబదే పునరుక్తిఁ దెచ్చుఁ
గానఁగవితాభి. ముఖుఁడైన కవివరునకు
మిశ్రకావ్యంబె కావ్యమై మెచ్చుఁగఁ దెచ్చు.

అని వ్రాయుచు మిశ్రకావ్యముల వ్రాసినవారిలో నేకవియే మొదటివాఁడు. దీనింజూచియే భట్టుమూర్తి వసుచరిత్రమున,

ఉ॥ కేవలకల్పనాకథలు
కృత్రిమరత్నము లార్యసత్కథల్
వావిరిఁబుట్టు రత్నముల
వారిత సత్కవి కల్పనావిశే
షావహపూర్వ వృత్తములు
సానలుతీరిన జాతిరత్నముల్
కావున నట్టి మిశ్రకథ
గానొనరింపుము నేర్పు చెంపునన్॥

అని వ్రాసియున్నాఁడు.

నరసింహకవి కుకవుల నేడెనిమిది పద్యములలో నధికముగాఁ దిట్టినాఁడు.

ఉ॥ సాంతముగాఁగ శబ్దగాహ్య
దయజ్ఞులుగా రుచితప్రయోక్తలై
వింతలుగాఁ బ్రబంధముల
వీథులుత్రొక్కఁగలేరు శక్తులై
దాంతరజల్లి బొంతనెడ
దూర్చిగతార్థముఁ గూర్చు దుష్కవి
భ్రాంతుల నందడించతవఁ
బాసె రసజ్ఞులకుం గవిత్వముల్.

అనియిట్లు కృత్యారంభముననే నిదించుటకాక, కావ్యము నందక్కడక్కడఁ గుకవి కవిత నుపమానము ద్భుత జమత్కారముగాఁ గుకవిదూషణముఁగావిం చెను. ఇందుకుదాహరణము లిచ్చుచున్నాఁడ.

1. కుకవికవితయుంబోలె భగ్నోరు ప్రాసంబును,

2. కం॥ ఇలలేనిఁ జూడఁ జనుతెమ్మి
లలనయొకతె తీర్చఁబడిన యలంకారములతో
వలయువడి ఁగూడనివడ
స్ఖలనంబునుగలిగి కుకవి కవితయుఁబో లెన్॥

3. మ॥ అనుకూలక్రియ చూపనేరక బల
వ్యాకృప్తిచే వక్రమై
యనుమానాకుల తంబదంబు మృదుశ
య్యాంగూర్పఁగాలేక చా
ల నిగూఢంబుగ. భావముం గుకవితా
లత్యస్థితిం జెందినై
ననవోఢాంగనచే సెవల్లభున కా
నందంబు డెంద ంబునన్.

సీ॥ శ్రవణ యోగ్యంబైన శబ్దమొక్కఁడు లేక
ప్రియముగొల్పెడు నలంక్రియలు లేక
సరసమై మృదువైన శయ్యఁగల్గుట లేక
యర్థసంగ్రహము పైనర్థి లేక
పరుఁడు పట్టినచోటఁ బ్రత్యుత్తరము లేక
ప్రాణహానికి గొంకు పాటు లేక
వర్ణగౌరవలాఘవములపై మతిలేక
వృత్తభంగమునకు వెరపు లేక

గీ. తారుదారయ తక్క నెవ్వారునరులు
తడవరాక మూలఁబడి ప్రసిద్ధములు కాక
యవుడ విద్వత్ప్రబంధంబు ననుకరిచె
జారిణీజారనవరహస్సంగమములు

పైపద్యములఁబట్టిరే, భట్టుమూర్తి వసుచరిత్రమున,

శా. భావంబేకడ లేక వృత్తినియమా
పాయంబుఁ జింతింపకెం
దేవర్ణించి పరార్థవాంఛనలచే
దీపించి మూర్ఖాళిసం
భావింపం గుకవి ప్రణీతకృతి
సాహసాన్యాకృతింబూని సై
పై వన్నెల్ పచరింప దానిఁదిలకింపం
జోరు ధీరోత్తముల్.

అని చమత్కారముగాఁగుకవినింద (చేసి)
నాడు.

ఇక గవి యీ కౌర్యము నేయుద్దేశమున ప్రా(రం)
భను గొందము.

గీ. యతివిటుఁడు కాఁకపోవుకై ట్లస్మదీయ
కావ్యశృంగారవర్ణ నాకర్ణనమున;
విటుఁడుయతికాకపోరాదు వెనమదీయ
కావ్యవైరాగ్య వర్ణనాకర్ణనమున.

అనియతఁడు కావ్యారంభమునసే పదియించె
చే, నితని కావ్యము ముఖ్యముగా శృంగార వైరాగ్య
ములతోడనే యుండునని గ్రహింప వచ్చును. "
శాఁకవయః" అనునట్టు మాటచేతనే తన ప్రజ్ఞ గనబడు
నిశ్చయముగా నతఁడట్టే తన ప్రబంధమును రచించెను.

క॥ ఏరసము చెప్పఁబూనిన
నారసమాలించువారి కడరింపనయా
నీరసపుఁగావ్యశవముల
దూరమున పరిహరింపుమరు నీతిజ్ఞుల్.

అనియాతఁడూరక చెప్పుటలేదు. నవరస భరితము
దాను గావ్యము రచించుటచేతనే యంత నిర్భయముగాఁ
బలుకఁగలిగెను.

ఇఁక గవికర్ణరసాయన కావ్యవిమర్శనమునకు
తము. ఇది యొకమహా ప్రబంధము. మహాకావ్య
మెట్టిదనిన,

మ॥ పురవారాశి మహీధరర్తు శశి
భృత్సూర్యోదయోద్యానపు



.... సహస్ర స్తంభ దేవాలయము హనుమకొండ.

స్మరకేళీ మధుపానమోహనవి
యోగక్షేమ సమానన్వయుం
వరపుత్రోత్సవ మంత్రదూత్యరణ
దోర్వీర్యప్రక్రాంతి సంకీర్తనా
కరమష్టాదశ వర్ణనాన్వితమునత్
త్కావ్యంబు భవ్యంబిలన్.

అని, చిన్నకోట పెద్దయమహాకవి కావ్యాలంకార చూడామణియందుఁ జెప్పినాఁడు కావున, నట్టియష్టాదశ వర్ణనాన్వితమే మహాకావ్యము. ఈపనునెనిమిది వర్ణనములేకాక, యితరవర్ణనములుకూడఁ గవికర్ణ రసాయనమున నధికముగానున్నవి. ఇన్నివర్ణనము లితర ప్రబంధములందుఁ గానరావు. కావునఁ గవికర్ణరసాయనము మహాప్రబంధముగాఁ బరిగణింపవలయును.

కవికర్ణరసాయనము నందలికథ షట్చక్రవర్తులలో నొకఁడగు మాంధాత గురించినది. ఇందు ప్రథమాశ్వాసమున, యువనాశ్వ నృపాలుఁ డొకమునిచే శాపంబుఁ బడయుటయు, నక్కారణంబున నాతని గర్భమున నొక కుమారుండు జనియించుటయు, యువనాశ్వుని మృతియు, నింద్రుఁడాతనికి జీవం బొసఁగుటయు, మాంధాత బాల్యము, రచియింపఁబడెను. ద్వితీయాశ్వాసమున యువనాశ్వుండు కుమారునకు రాజ్యమొసఁగి, తపోచరణంబునకుఁ జనుటయు, మాంధాత, దిగ్విజయముఁ గావించి రావణాసురు నోడించుటయు రచియింపఁబడెను. తృతీయాశ్వాసమున మాంధాత విమలాంగిఁ బెండ్లాడుట వర్ణింపఁబడెను. చతుర్థాశ్వాసమున సూర్యాస్తమయ చంద్రోదయ సూర్యోదయాదివర్ణనములు, నింకను ననేకవర్ణనములు, కావింపఁబడెను. పంచమాశ్వాసమున వసిష్ఠాది మునులు మాంధాతను దర్శించుటయు, వేదవేదాంత స్వరూప నిరూపణాదులు రచింపఁబడెను. షష్ఠాశ్వాసంబున మాంధాత తపస్సు నాచరించుటయు, నారదుని వలన దాని నతిలోగి యింద్రుఁ డప్సరాంగనల నతనికడకుఁ బంపుటయు, తపోభంగంబుఁ గావింప లేకుండుటచే, దేవలొగూడి యతండు విష్ణుని సందర్శించుటయు, ననంతరమున, విష్ణువు మాంధాతకుఁ బ్రత్యక్షమై, నిజపదాంబుజోద్భూతభక్తి నతనికిఁ బ్రసాదించుటయు, పిమ్మట మాంధాత రాజ్య పాలనముఁ గావించుటయు వర్ణింపఁబడెను. ఇదియే మాంధాతృ చరిత్రము నందలి కథాభాగము.

కవికర్ణ రసాయనమున తృతీయ చతుర్థాశ్వాసములు కేవల శృంగార రసప్రధానములు అందలి యౌవన వర్ణనము, విప్రలంభమునందు దశావస్థానిరూపణము, వనవిహార జలక్రీడా వర్ణనము, మధుపానరతి నిరూపణములు, నిజముగా యతిని విటునిగా నొనర్చునట్టు లతిశయోక్తి కానేరదు. ఇక పంచమ షష్ఠాశ్వాసములు కేవల వైరాగ్య వర్ణనా ప్రధానములు, భక్తిరసోపేతములు. అందలి కర్మస్వరూప బ్రహ్మస్వరూప నిరూపణము, వేదవేదాంత పురాణ స్వరూప నిరూపణము, భక్తి ప్రపత్తి రూపసాధన నిరూపణము, సంసార నిరూపణము, మోక్షవివరణము, వైకుంఠ వర్ణనము, భగవద్దివ్యమంగళ విగ్రహవర్ణనము, శ్రీవిష్ణు స్తోత్రము, విటుని యతినిగా నొనర్చునట్టు లతిశయోక్తి కానేరదు.

ఇట్టి నరసింహకవి శైలిం జూచి కొంత విచారింతము. ఇతని శైలి యతి మనోహరము, హృదయాహ్లాదకరము నైయుండుననుటకు సందియములేదు. అట్లని సులభముగాను చెప్పఁగానుండక, యెల్లరకు వేగముగా బోధపడదు. ఇతని కవిత్వమర్థ గౌరవము, పదలాలిత్యము, భావగుంఫనము, కలిగియుండును. ముఖ్యముగా నితని ప్రబంధమునందు కథాభాగముకంటె వర్ణనభాగమెక్కువ. వర్ణనములందు మనశ్చిత్రము దీనికి చేసిపోవలసినదే. ఈతని శైలి మృదుమధురమై, యెంతయు సొంపారుచుండును. ఈతని పద్యములందు సర్వసాధారణముగా నర్థాంతరన్యాసాలంకారములు, మంచియుపమాలంకారములు, లోకోక్తులు, నధికముగా నుండును. ఇదియేతని కవిత్వమునకు వన్నె పెట్టునది.

చ. ఖలుఁడిలఁ దప్పులే వెదకుఁ
గావ్యరసానుభవంబు చేయఁడేఁ
కొలుకులు కోయఁగాక మధు
మానఁగ గర్దభ మొంద నేర్చునే

మలయ మరుద్విధూత మధు
మానవికస్వర కేసరావళీ
గళితపరాగయోగ పరి
కల్పితపేశలతల్ప సౌఖ్యముల్.

క. కలకంఠ కలనఁజూపక
కలకంఠంబూరకున్నఁ గాకమకాదే
కవిత నిజ వాగ్విలాసం
బలరింపని పరుఁజ్ఞన నజ్ఞుండగుటన్.

ఇట్టి మనోహరములగు నుపమలతో, నితఁడు తన పాఠకుల నానందాబ్ధి నోలలాడించును. మరియు,

క. కాకేమి తన్నుఁదిట్టెనె
కోకిలతనకేమి ధనము కోకొమ్మనెనే
లోకముపగయగు పరుసని
వాకునఁజుట్టమగు మధురవాక్యమువలనన్

క. వనితనతనాభి తుంగ
స్తనములుగడచిచనలేవు జనపతిచూడ్కుల్
మనమునను మొయ్యాకొండో
యనియాందోళించువారికగునే తెగువల్.

చ. చరమధరాధరాగ్రమువ
జారెడువేళఁ బతంగుఁడంగజ
త్వరితమనస్కుఁడై నిలిచి
తన్నుఁగనుంగొను సౌధశేఖరో
పరితరుణీ జనంబు ముఖ
పద్మముల న్వికసింపఁజేసె స
త్పురుషులు తారు దుర్దశలఁ
బోవుచునైనను బ్రోతురాశ్రితుల్.

చ. కనకమయాంబుజ ప్రసవ
గంధములానియు బిందుపఙ్క్తిచే
ననయముదొప్పఁ దోఁగియును
నభ్రసరిత్పవనంబులప్సరాం
గనల ముఖాబ్జ సౌరభము
ఘుకుర్మజలంబులు గ్రోలెఁగ్రొత్తవై
ఘనతరలాభ ముంగలుగు

గైకొనరెధర నెంతతృప్తులుల్.

అని చమత్కారముగా నర్థాంతరన్యాసాలంకారములతోడను, లోకోక్తులతోడను మంచిభావములతోడను నింపి యితఁడు కావ్యమును రచించెను. ఇంకను శ్లేషగర్భితములై సత్కల్పనా విభాసురములై, శ్లాఘాపాత్రములై వెలయు పద్యములు కవికర్ణ రసాయనమున [illegible]ములు కలవు.

శా. కాసారంబులు సాహిణంబులు సరి
త్కాంతుండుపూఁదోఁట వి
ద్యాసీమంబులు రచ్చపట్లు సురకాం
తా లోక సీమంత భూ
షాసిందూరము పాదలాక్షయగు
భాషాదేవి మత్ప్రౌఢ జి
హ్వాసింహాసనమూనఁ గాఁగృతి
యుక్తాలంక్రియా హంక్రియల్.

అని నరసింహకవి సరస్వతీస్తుతిఁ గావించినాఁడు. సాహిణములనఁగా నశ్వశాలలు. అనఁగా వాహనము లుండు తావులని కవ్యాశయము. సరస్వతీదేవి వాహనము హంస కాసారములో నుండును. కావున సరస్వతికి కాసారములు సాహిణములని చెప్పినాఁడు. ఇట్టి భావములఁ గనుఁగొనవగును. ఇట్టి భావగుంభన మతని యసాధారణ ప్రజ్ఞను వెల్లడి చేయుచున్నది. మరియు,

చ. ఘనపథమత్య నిర్భరముగా
నుదయించి నిరుద్ధలోకలో
చనముగ సన్నికృష్ణముఖ
చంద్రములై శ్రితతారకంబులై
యనయముఁగుంభసంభవ మ
హాత్త్వవిజేతలు నాఁటఁ గన్యకా
స్తనములు వింధ్యముం దెగడి
సాటికి హెచ్చిన మేరుకూటముల్!

అని శ్లేషాలంకార సంయుక్తంబుగా, పురాణగాథ నందులో నిమిడ్చి, పయోధరవర్ణనముఁ గావించిన నరసింహకవి విశక్తి యత్యద్భుతము. ఇంతియకాక,

సీ. అవనిపైనుండుఁగాక నఁటికంబము లెట్టు
లనఁటి కంబములపై నవనినిలిచె
గగనంబుగిరిల పైఁగనుపట్టుగా కెట్లు

గగనంబుపైగిరు ల్గాననయ్యె
జలధరంబులమీఁద శశియుండుగా కెట్లు
శశిమీఁదనున్నది జలధరంబు
నాళంబుపైఁగాక నళినకోశం బెట్లు
నళినకోశంబుపై నాళమున్న
దనచు జూపరులకు విస్మయంబుఁ గొల్పఁ
దొడలుఁ గటిమండలంబును నడుముఁజన్ను
లాననముఁ గొప్పనాభియు నారునలర
నలరె విమలాంగి నవయావ నాగమమున॥

అని విమలాంగి యవయవంబుల నుపమింపుచుఁ బ్రకృతి విరుద్ధములుగా నుండుటచేఁ జూపరుల కాశ్చర్య మొదవించునని చమత్కారముగా వర్ణించినాఁడు. ఇట్టి వర్ణనాశక్తి గలిగిన నరసింహకవి నుతులొనర్ప మన మెంత వారము!

ఈతని కవిత్వము దీర్ఘసమాస జటిలంబయ్యు నచ్చతెనుంగుచేఁ గూడ ముచ్చటఁ గల్గింపుచుండును. ఇందు కుదాహరణముగా రెండు పద్యము లిచ్చుచున్నాఁడను.

మహాస్రగ్ధర. కనిరంతర్మగ్న భూభృ
త్కబళన చటులగ్రాహసంచార ధాటీ
జనితస్ఫర్థాళు వీచీ
సముదయలహరీ సంభ్రమదోర్భిగిపూత్కా
రనితంతోత్పాతితక్షీ
రవితతఘనధారా సహస్రస్వభావా
ఘనదిస్సైవ్రోపగూహో
ద్గతసుఖసుముఖాకార లబ్ధింబ యోర్థిన్.

చ. ముడిఁగిముసుంగుతో వెనుక
ముందునుజూడక వచ్చిలోనికిం
దొడుకొనిపోయి ప్రేల్మిడిన
ద్రొబ్బినఁ బెంపునకుం బసిండికిం
జెడితముఁ దారతిక్కొని
చీయని కేలువిదిల్చి రోయుచుక్
గుడిసెలుదూరి వెల్వడిరి
క్రొత్తగు సగ్గరిమిండలయ్యెడన్.

మఱియు నీతని పదలాలిత్యము, కవితానైపుణిఁ దెలుప నీక్రిందనొక పద్యముదాహరింపు చున్నాను.

ఉ. ప్రోడవుగాన నీపలుకు
పోలదుగాదనరాదు గాకయీ
పీడని తాపవేదనల
వేఁగెడుచెన్నటి మేనఁబ్రాణముల్
గూడివసింప నోర్వవిది
గోచనఁచున్న వియోగ ప్రీడయుం
గ్రీడయు నాకుహారమును
గీరముఁ జూతము గీతముం జెలీ!

పై పద్యములఁ బట్టి నరసింహకవి శైలి చాలవఱకుఁ దెలియఁగలదు. కవికర్ణరసాయనము లాక్షణికప్రబంధములలో నొకటి. కాని యిందక్కడక్కడ నల్పదోషములు గానవచ్చుచున్నవి.

„కాకేమి తప్పుఁదప్టెనె?"
„తిమరగజాసురువధించి తిత్తొలిచిన"
„దూషింపనొల్లరు దుష్టాత్మకులనైనఁ
బలికేయనొల్లరు పగతుకైన"
„పొదలుపయః ప్రపూరములఁ
బొడ్డ్మమతత్పరి వాహరేఖలై"

పై గీతలుగలచోట్ల వ్యాకరణ దోషములు కలవు. కాని యిట్టి దోషములఁ బెక్కు కవులు చేసిరి. కావున వానిని దోషములుగా గణింపరాదు.

సంకుసాల నరసింహకవి కహంభావము, స్వాతిశయమునుగలవని విమర్శకులిదివరకెనేకుల యభిప్రాయము. కాని యతఁడెన్నఁడు నట్టి వాఁడుకాఁడని యస్మదాదుల యభిప్రాయము. సుకవినింద నొకపద్యములోఁ ! ,

చ్చునా, పదిపద్యములలోఁ జేయరాదా? అంశమాత్రమున స్వాత్మశ్లాఘయ భావము కలవాఁడగునా?

చ. హృదయగతిం బురాతన
కవీశ్వరులేఁగని వీధిలేదు నేఁ
డనుమతిఁ గావ్య రచించు
కృతిరాత్మీయకులం గరగింపకుండునే
మదగజరాజముల్
చనిన మార్గములం గడునింపునింపవే
మదగజరాజయాన
మదమంథరబంధుర యానమానముల్.

అని వినయపూర్వకముగా దొలఁత విన్నవించుకొనియె, పిదప, "యతివిటుడు......వైరాగ్య పర్ణనాకర్ణనమున" అను పద్యముఁ జెప్పినాఁడు. ఇదియొక స్వాత్మశ్లాఘ భావము కానేరదు. మరియు నితర కవులవలె సితఁడు, కృత్యాదియందు దన్నుఁ గృతిపతి స్తుతించినట్లు తానే వ్రాసికొనుటయు, గద్యమున దన్నుఁ దానే పొగడుకొనుటయు, నొనరింపలేదు. కృత్యాదియందును గద్యమునందు "నరసింహ నామధేయుడు" ననియే వ్రాసికొనియెఁగాని "నరసింహకవి" ననియైన వ్రాసికొనలేదు. గద్యమున "మహాప్రబంధ" మని వ్రాసికొనక "కావ్య" మనియే వ్రాసికొనియెను. ఇవియెల్ల సితని నమ్రతత్వము, వినయ సౌశీల్యము, వెల్లడించుచున్నవి. ఇట్టి మహా[...] స్వాత్మశ్లాఘయ భావముకలవాఁడనుట కేవలము సందర్భ[...]

సర్వలక్షణ లక్షితంబై, సకలవర్ణనా [...] నవరస భరితంబై భావగర్భితంబై, యలంకార భూ[...]ష్టమై, యలరారు నిమ్మహాప్రబంధమున మహాచక్ర[...]న్నపపాలని యూహింప నగునా? మను చరిత్రముకన్న [...] వికర్ణరసాయనము వేయిమడుంగులు మిన్నయని [...]దేహముగా నొక్కి వక్కాణింప వచ్చును. కృష్ణదే[...]యలే, యీకావ్యమునకుఁ గృతికర్తయగుట లటపించియుం[...]డినఁదప్పక యితఁడే యాంధ్రకవితా పితామహుఁడన్న బిరుదంబుఁగొనియుండును. ఇట్టి మహాకావ్యము [...] తామృతరసాస్వాదముఁగానింపఁజాలిన వారికే ర[...]దదాయకంబై రుచించుఁగాని, రసము గ్రహింపఁజాల[...] కవికర్ణరసాయనము " పెద్దనార్యకృతమయిన మ[...]రిత్రముకంటె నేవిషయమందును గుణాతిశయము [...] కా" దని వచించు వీరేశలింగము మున్నగు వారి[...] రుచించునా? ఇందుకుఁ దార్కాణముగా నరసింహ[...] వ్రాసిన పద్యము నిదిగుడ నుదాహరించి యీశతిలో [...] సమును ముగించుచున్నాఁడను.

క. ఎల్లరుమెచ్చని మత్కృతి
నుల్లంబున మెచ్చఁగాక యొకఁ[...]
బొల్లని పల్లవి తాఁ [...]
గొల్లలుగాఁబొగడనొక్క కోయిల లేదే.

# "మనోరమా!"

ఉదయరాజు శేషగిరిరావు

(మూడవసంచిక తరువాయి)

ఉ. కోమలమల్లికా సుమ నికుంజ సభాభవనంబునన్ ఘన
శ్యామల మత్తమాధుకర ఝంకరణమ్ములు వందిమాగధ
స్తోమస భక్తికస్ఫుటవచో నిచయమ్ములుగావసన్ప్రియ
త్సామఘవంతుఁడొప్పె గనుమా! యుపకంఠమునన్ మనోరమా.

చ. విపులతుషారవారి సముపేత మనోహర సైకతస్థలీ
సమరుచిరావదాత పలుసంవృతమంజు కటీతటీపిన
ద్ధమణిగణ ప్రభాపటల ధామకనద్రశనాగ్ర కింకిణీ
సుమహితనిస్వనామృతము జుత్త్రైదశ్రోత్రపుటీ మనోరమా!

ఛ. నళిన విశాలలోచన పునఃపునరుద్గళ దశ్రుధారఁ జె
క్కులు మలినీకృతమ్ములుగఁ గోమలరోదర సోదరత్కుచ
స్థలిగత పైఠకజ్జలయుతమ్ముగ బాలరసాలసాలకై
సలపల భోజికూజితము బాయనఁగుందెదుగా మనోరమా!

ఉ. చూడవదేల? జేడిసల సోయగముంగురియించుచూడ్కి, మా
టాడవదేల? పాయస సుమాసవఫాణితగోస్తనీర సా
ప్రేమశిత మాధురిన్ కనికరింపక యాగతిమేనబావతో
మోడివహింపఁ బాడియె యమోఘనరోరమ! యోమనోరమా

చ. కనుగవమూసినేను నిశిగాఢ సుషుప్తిని జెందగా మనీ
యనికటసీమఁ జేరిహృదయంగమ ధాళధళీప్రసారి వ
ల్గునిశివృష్టి నాపయినిగుడ్చివ లగ్నవలగ్న మేఖలా
ఘనతర ఘంటికాపటిత ఘూణఘుణిన్ నడుతో మనోరమా!

చ. సళినవిలాసక్రమ సితనైగనిగే పరిభాసలోచనాం
చలవయి, హంసకాచరిత ఝూళఝుళీరవ మంజుయాసవై
వలఁచినయంత. నీవు నిరతంబు మదీయపవిత్రహృత్సర
స్సలిలవిహారమున్ సలుపఁ జాలెదు హంసికవై మనోరమా!

చ. పలువురు వోవుద్రోనఁపు బల్లెపుగాయలు వారజల్లితిన్
నలుగుర మోసబుచ్చితిని నాయముతప్పితి, ప్రక్కబల్లెమై
మెలగితి నెల్లవారలకు మేనతికమ్ముల నెత్తగొట్టితిన్
సిలుగులువెట్టకున్న తొలిజేసిన దోసములో మనోరమా!

(సశేషము)



# దేశీయ సంస్థానములు


ఎల్. శంకరనారాయణరావు


గత అయిదారేండ్లనుండి రాజకీయవేత్తలు తమ దృష్టిని దేశీయ సంస్థానముల వైపు సారించు చున్నారు. ఈ మధ్య సంభవించిన కొన్ని అనిరీక్షితమైన ఘటనలు (నాభా, ఇందూరు సంస్థానాధీశుల రాజ్య భ్రష్టత్వము) కొంతవఱకిందులకు కారణ భూతమయినను, నిజమగు కారణములు వేఱు. పైకి, సామాన్య దృష్టికి, గానరాకున్నను, అవి నిగూఢమై ప్రబలమై యున్నవి.

భారత దేశమున నేడు నిదానముగా నిశ్శబ్దముగా నొక పరివర్తనము జరుగుచున్నది. ప్రాత సాంప్రదాయములు, భావములు, నడతలు మాఱి, నూతనాశయములకు, అభిప్రాయములకు, కార్య పథములకు దావొసగుచున్నవి. సంఘమున స్త్రీవిద్య, స్త్రీస్వాతంత్ర్యము, అస్పృశ్యతా నివారణ, మున్నగువాని గూర్చి ప్రబల ప్రయత్నములు జరుగుచున్నవి. వ్యక్తి, సంఘశృంఖలముల నుండియు, సమిష్టి అర్థశూన్యములగు పూర్వాచార చట్టముల నుండియు, విమోచనము బడయ యత్నములు జరుగుచున్నవి. ఆర్థిక విషయములలో గ్రామపునర్నిర్మాణము, యంత్ర పరిశ్రమల స్థాపన, కార్మిక సంఘోద్యమము ప్రారంభమయినవి. రాజకీయములలో జాతీయాభిమాన ప్రజ్వలనము గణనీయమగుచున్నది. నేటి జాతీయావేశము భారతదేశమున ఎన్నడును ప్రబలియుండలేదు. రాజువెనుక రాజు, వంశము తరువాత వంశము, రాజ్యముల స్థాపించి పెంపొందించి, ఎన్నికళ్ళు, యటుపైని నీతిదూరులై, అధోగతిపాలై, తుదకంతఃకలహములచే వినాశమొందిరి. ప్రజలు వారిని కాదు కన్నటిబొట్టులతోనో, విశ్రాంతి నిట్టూర్పులతోనో, అనతికాలములోనే మఱచిపోయిరి. భారతదేశమనెడి విశాల దృష్టిగాని, భారతీయనెడు విశాలభావముగాని నాటి ప్రజలకు లేకుండెను. ప్రభువు స్వదేశీయుడైనను, విదేశీయుడైనను, స్వజాతి వాడైనను, పరజాతివాడైనను వారికొక్కటియె. వారి పట్టున మతమునకు హింస లేకున్న నంతియే చాలును. ఇట్టి దుర్లభమైనచో అడవుల బట్టుటయో, లేక "కర్మ" మని మిన్నకుండుటయో సంభవించుచుండెను. కాని "నేను మానవుడను. ప్రకృతిదత్తమగు జీవనేచ్ఛ నాకు గలదు. నాకు తినుటకు తిండి కావలెను. న్యాయముగ దాని నార్జించు స్వాతంత్ర్యము నాకుండవలెను. దైవదత్తమగు వాక్కు నాకుగలదు. దాని సువినియోగమునకు నాకధికారముండవలెను. నేను జ్ఞానసహితమగు జీవిని; ఈ విజ్ఞానమును స్వప్రయోజనమునకును, తోడి మానవుల శుభమునకును ఉపయోగించుట కవకాశముండవలెను. ఇది నా దేశము; దీని భావియే నా భావి. వీరు నా దేశీయులు; వీరి శుభమే నా శుభము. ఇది నా సమ్మతివడసిన ప్రభుత్వము; దీని వైభవమే నా వైభవము" అనెడి భావముల కావిర్భావమునకు చోటు లేకుండెను.

కాని ప్రస్తుత మీ పరిస్థితులు మాఱిపోవుచున్నవి. భారతదేశము, తన గ్రామము, పరిసరమున నున్న నూఱు గ్రామములే కాక యనేక లక్షల గ్రామములు గల నొక ఖండమనియు; భారతజాతి యనస్వమతానుయాయులు, బనులు, స్వరాష్ట్రీయులే కాక యనేక మతములను, అనేక భాషలను, ఎట్టి యవిచ్ఛిన్న జాతులను గల సమిష్టి జాతియనియు; ఎట్టి ప్రభుత్వము తమకొసంగినను, ఎట్టి శుభముల ప్రసాదించినను, ప్రజాప్రభుత్వము జాతీయ బాధ్యతాయుత ప్రభుత్వము.

తమతమ భారత జాతికిని, భారత పౌరునకును, ఒక తీరని కొఱతయనియు, నేఁడు ప్రజలు క్రమముగా గ్రహించు చున్నారు.

ఈ యార్థిక, సాంఘిక, రాజకీయ మార్పుల నన్నిటి ని మొత్తముగ ప్రజాప్రబోధమని పేర్కొనవచ్చును. స్వాతంత్ర్యము కొఱకు, స్వయంనిర్ణయాధికారము కొఱకు వ్యక్తి పాటుబడుచున్నాడు. స్వరాజ్యముకొరకు, స్వపరిపాలన (Republic) కొరకు సమిష్టి అకుంఠితప్రయత్నములు సలుపుచున్నది. పూర్వపు ప్రతిభ రాజులప్రతిభ. ఆనాటి కళలు, కావ్యములు రాజుల ఆసక్తి, ప్రోత్సాహము, పోషణలవలనజనించినవి. కాని నేటివైభవము ప్రజల వైభవము. కావ్యకళా శిల్పములు ప్రజాప్రేరేపకములు. నాటి గానములు రాజుల విజయగీతములు. నేటిగీతము లు గోపగీతములు—ఏలపాటలు, కృషీవల గానములు. నాటిరచనలు ప్రబంధములు, కావ్యములు. నేటిరచనలు నవలలు, నాటకములు, వ్యాసములు. నాటిగ్రంథములు రాజుల ఘనతకొఱకు—సంతోషముకొఱకు; నేటిగ్రంథములు పామర జనమనోల్లాసము కొఱకు—ప్రబోధము కొఱకు. హంసవాహన మెక్కి అంబరవీధి సంచరించు సరస్వతి నేఁడు ,,రెడ్డికన్న'' తోడను ,,ఎంకి'' తోడను సరసల్లాపము లాడుచున్నది.

ఇట్లు కళలేకాక రాజకీయములుకూడ రాజుల చేతినుండిజారిప్రజలపాలు ఐకుచున్నవి. నేఁడు ప్రతి విధానమును, ఉద్యమమును, వృద్ధికై, విజయమునకై ప్రార్థనా పూర్వకముగ రాజుల వైపు జూచుటమాని, ఉత్సాహముతో, ఆశతో ప్రజలవైపు దృక్కులు సారించుచున్నవి. నేటికాంగ్రెసుసంస్థలు, ఆర్థికసంఘములు, రాజకీయోద్యమములు, కవితానికేతనములు గ్రంథమాలలు—ఈప్రజా ప్రబోధసూచకములు, వ్యక్తీకరణములు.

ఈ ప్రబోధము మొట్టమొదట బ్రిటిషుఇండియాలో తలజూపినది, ఇది వాఙ్మయమున పత్రికాస్థాపన తోడను, రాజకీయములలో జాతీయమహాసభతోడను, ఆర్థికవిషయములలో అఖిలభారత ఆర్థికమహాసభతోడను, మతసంబంధమున ఆర్య, బ్రహ్మసమాజముల తోడను, పాదనూని, నానాటికి పెంపొంది నేఁడంతటను ప్రాకి, సంఘోపసంఘములతో నల్లికొని, ప్రజలయందు విజ్ఞానము వెదజల్లుచు, ఉత్సాహము పుట్టించుచు, ప్రజాసామాన్యమున కొక నూతనజీవన మొసగుచు, నూతనతేజ మాపాదించుచున్నది.

ఈ ప్రబోధమే క్రమ క్రమముగా దేశీయ సంస్థానములకు కూడ ప్రాకినది. గ్రంథాలయములు, సోదర సోదరీ సమాజములు, వర్తకమహాసభలు, మహాపురుషుల వర్ధంతులు, ఈ ప్రబోధ చిహ్నములు. వీటినన్నిటిని మించి, మిన్నయై కానవచ్చు ప్రబల నిదర్శనము దేశీయ సంస్థానముల ప్రజా సమావేశము.

ఈ నూతన వాతావరణమున, సంస్థానవాసులు, మార్గ దర్శకమునకై బ్రిటిషుఇండియావైపు దృష్టి నిగుడ్చుట, యచ్చటి ఉద్యమవిధానముల ననుకరించుట సహజము. బ్రిటిషుప్రాంతము వారు, సంస్థానవాసుల ఉద్యమములపట్ల సానుభూతి గనపఱచుటయు సమంజసమే.

ఇదియునుంగాక, మొగలుసామ్రాజ్యవినాశముతో, భారతజాతీయ సభ్యతాప్రవాహమునకు భంగము కలిగెను. బ్రిటిషుసామ్రాజ్యస్థాపనతో భారతజాతీయజీవనము పాయలు పాయలుగా చీలి పోయెను. బ్రిటిషుఇండియా యొక మార్గ మవలంబించెను. దేశీయసంస్థానము లొక్కొక్కటి ఒక్కొక్కదారి ద్రొక్కెను. రానురాను, ఈ వివిధపథములు భిన్నాతిభిన్నములై వింతవింత వైఖరుల వహించెను. ఒక ప్రాంతపు బాగోగులతో వేరొకప్రాంతమున కట్టిజోక్యము లేకుండబోయెను. చెన్నరాష్ట్రమున క్షామముచే ప్రజలు మలమల మాడవచ్చును. కాని మైసూరువాసులకు దానితో నెట్టి సంబంధములేదు. ఇందూరురాజు దుష్పరిపాలన దుర్భరమై యుండవచ్చును. కాని బ్రిటిషుప్రాంతీయులకు దానితో జోక్యములేదు. నిజామురాష్ట్రము విద్యావిహీనతకు, సాంఘిక దుస్థితికి పెట్టినపేరై యుండవచ్చును. కాని విద్యాసంపన్నులగు బరోడావాసులకు దీనితో నెట్టిపనియులేదు. ఎవరికష్టములు వారివి. ఎవరి సుఖములు వారివి. సానుభూతి, సహకారము సున్న.

ఈ భిన్నభావములకు ప్రబలకారణము పాలకులు భిన్నులగుటయే. బ్రిటిషుఇండియా తన కార్యము

చక్కబెట్టుకొనుటతోనే కాలము బుచ్చుచుండెను. ప్రతి సంస్థానపాలకుడును తన్ను, తన సంస్థానమును మాత్రమే ముఖ్యావధి నిడుకొని ప్రవర్తించుచుండెను దీనివలన గలిగిన దుష్ఫలమేమన మొత్తముపై భారతీయ సభ్యతా విజ్ఞానము క్షీణింప జొచ్చెను.

కాని నేడు పరిస్థితులు మారినవి. నాటివి పాలకుల దినములు. నేటివి పాలితుల దినములు, ప్రజలలో నొక నవీనప్రబోధము గలిగినది. వారు తమ స్థానిక, రాష్ట్రీయ, హద్దులనధిగమించి, ఏకజాతీయజీవనమునకు తలపడుచున్నారు. పాలకులు వేర్వేఱయినను, అన్ని ప్రాంతముల ప్రజల ఏకాదర్శము, ఏకదీక్ష, పాయలు పాయలుగా చీలిపోయిన జాతీయజీవనమును సకల యఖండ ప్రవాహముగా మార్చుచున్నది. ఈ ఏకగమ్యస్థానోన్ముఖ గమనమే సంస్థానములందలి యలజడికిని, రాజకీయ సంచలనమునకును కారణము. బ్రిటిషుప్రాంతవాసులకును, దేశీయసంస్థానవాసులకును, నేడు గలుగుచున్న అన్యోన్యతకుగల రహస్యమిందిమిడి యున్నది. సంస్థానసమస్యాబీజములుగూడ నిందులోనే లీనమై యున్నవి.

* * * * * *

ఈ సంస్థానములసమస్య తేటతెల్లమగుటకు వాని స్వరూపములగూర్చి తెలిసికొనవలసి యున్నది. బర్మాలోనున్నవాటిని విడిచి, భారతదేశమున 562 సంస్థానములు కలవు. వాని మొత్తపు వైశాల్యము 6½ లక్షల చదరపు మైళ్లు ఈయావరణము బ్రిటిషుఇండియా కొలతలో ⅔ భాగము. ఈసంస్థానముల మొత్తపు జనాభా 7 కోట్లు. బ్రిటిషుఇండియా జనసంఖ్యలో నిది మూడవవంతు. ఈవిశాలావరణము, గొప్పజనాభా, సంస్థానసమస్య కొక ప్రత్యేక ప్రాముఖ్యత నొసగుచున్నది.

ఈసంస్థానముల విషయమున మొట్టమొదట గమనింపవలసిన యంశము, వాని యన్యోన్యవిరుద్ధలక్షణములు. ఒకసంస్థానమునకును, ఇంకొక సంస్థానమునకును ముఖ్యమగు విషయములలో నెందును సామ్యము లేదు. పుట్టుకలో భేదము; ఆర్థిక స్థితిలో భేదము సంఘజీవనమున; భేదము, రాజకీయ నిర్మాణములలో భేదము, భావ్యభివృద్ధి పద్ధతులలో భేదము; ఇట్లన్నిటను భేదములే కానవచ్చుచున్నవి. ఈయన్యోన్య భిన్నలక్షణము సంస్థాన సమస్యను విషమముగా నొనర్చుచున్నది.

పుట్టుకయందు ఈసంస్థానములలో కొన్ని యత్యంత ప్రాచీనములు. జపానుదేశపు ప్రభువు (మికాడో) వలె ప్రాచీన వంశీయులు కొందఱు సంస్థానాధీశులు. కాని వీరి సంఖ్య బహుస్వల్పము. మొత్తముమీద అధిక సంఖ్యాకుల సంస్థానములు గత 300 సంవత్సరములలో స్థాపింపబడినవి. మహావైభవముతో ప్రబలిన మొగలు సామ్రాజము వినాశమొందుకతన బంగాళము, అయోధ్య, మీవారు, కాబూలు, దక్కను మున్నగు రాష్ట్రముల సుబేదారులు స్వతంత్రప్రభువులైరి. శివాజీచే స్థాపింపబడిన మహారాష్ట్ర సామ్రాజ్యము, రెన్నియో దశాబ్దములు గతించిన నూరు సంవత్సరములలోనే, విచ్ఛిన్నమై బరోడా, ఇందూరు, గ్వాలియరు, నాగపూరు, పూనా, రాజ్యములుగా పరిణమించినవి. బ్రిటిషువారు మనదేశమున కాలిడు సరికి చిన్నచిన్న రాజ్యము లావిర్భవించుచు, పెరుగుచు, విఱుగుచు, జీర్ణించి నూతన రాజ్యములకు దావొసగుచు, అంతఃకలహములచే ముక్కలుముక్కలుగా విడిపోవుచు, మిక్కిలి అవ్యవస్థితముగ నుండెను. ఈ గందరగోళములలో ననేక స్వతంత్రరాజ్యములు పొడసూపెను. ఇట్లు ఉత్తరమున నేపాళ, భూటా[illegible]లదేశములు, గోహిలుఖండు, ఉద్భవించెను. పశ్చిమమున సిక్కులు, రాజపుత్ర పాళెగాండ్రు, సింధు [illegible]రులు తలజూపిరి. దక్షిణమున హైదరాబాదు, మైసూరు, కర్నాటకము, తంజావూరు బయలుదేరెను. [illegible]తరణమున బ్రిటిషువారు కార్యరంగమున ప్రవేశి[illegible] దేశీయప్రభువులతో డీకొనిరి. వారు కొందఱిని [illegible]నకు లేకుండ నాశమొనర్చిరి. కొందఱిని తమ [illegible]ధులగు దాసులుగ జేసిరి. మఱి కొందఱిని శక్తిహీన[illegible] మిత్రులుగ మార్చిరి. ఇట్లు సుమారు నూఱు సంవత్సరములలో బ్రిటిషువారు, తమ రాజనీతి వలనను, భుజబల[illegible] వలనను, దేశీయపాలకుల బుద్ధిమాంద్యము వలనను, అంతఃకలహముల వలనను, భారతఖండమంతటికి[illegible] అప్రతిహత నాయకులైరి. ఈ విజయయాత్రలో బ్రి[illegible]వారు కొన్ని రాజ్యములను విరుగగొట్టిరి. కొన్నిటిని క్రొత్తగ స్థాపించిరి. కొన్నిటిని పెంచిరి. కొన్నిటి[illegible]జించిరి. ఇట్లు దేశీయరాజ్యములచరిత్ర పూర్తిగ [illegible] వేసిరి. పూర్వమువలె యవి స్వతంత్ర రాజ్యములు[illegible] బ్రిటిషువారి యనుగ్రహముపై నాధారపడియున్న[illegible]

స్థానములు మాత్రమే. వాని ప్రభువులు మారిరి. ప్రజలు మారిరి. ఆవరణము మారెను. వాని గుణస్వరూపములు పూర్తిగ మారిపోయెను. దీని ఫలిత మేమన, నేటి సంస్థానాధీశులందఱు ప్రాక్కాలమునకు జెందినవారు కారు. కొందఱు మొగలు, మహారాష్ట్ర సామ్రాజ్యములకు పూర్వులు. కొందఱా సామ్రాజ్యములకు వెనుకటివారు. మఱికొందఱు బ్రిటిషువారి నియామకులు. ఇంతియేకాక వాని పరిణామచరిత్రయు అన్యోన్య విరుద్ధము. కొందఱు సంధి పత్రబద్ధులగు మిత్రులు. కొందఱు బ్రిటిషువారి పరాజిత సామంతులు. మఱి కొందఱు బ్రిటిషువారి నియామక ప్రభువులు.

ఆవరణము, జనాభా బట్టి చూచినను ఈ వివిధ సంస్థానములు విచిత్రమగు భేదములు కలిగియున్నవి. మొత్తపు 6 1/2 లక్షల చదరపు మైళ్ల విస్తీర్ణములో 13 సంస్థానములు 4 1/5 లక్షల చదరపు మైళ్ల నాక్రమించి యున్నవి. మిగిలిన 2 3/10 చదరపు మైళ్లను (అనగా 1/3 భాగమును) 549 సంస్థానములాక్రమించియున్నవి. జనాభా లెక్కల ప్రకారము లక్షకుమించిన ప్రజగల సంస్థానములు 10 మాత్రమే. ఈ పదిసంస్థానముల మొత్తపు జనసంఖ్య 4 కోట్లు. 100 మైళ్లకంటె తక్కువ వైశాల్యమును, 20 వేలకు మించని ప్రజను, గలిగియున్న సంస్థానము లనేకములు గలవు. ఇంతియేగాక 5 చదరపు మైళ్ల వైశాల్యము, సాలుకు రూ|| 160 ఆదాయమును, 545 ప్రజలను గల విద్యారన్ వంటి విచిత్ర సంస్థానములు కూడ గలవు. ఇంతకంటె చోద్యమయిన సంస్థానము బిల్బార్ సంస్థానము. దీని సంవత్సరపు రాబడి రూ|| 90, దేశవిస్తీర్ణము 1 1/2 చదరపు మైళ్లు. ప్రజలసంఖ్య 321.

పరిస్థితులిట్లన్యోన్య విరుద్ధములగుటచే, సంస్థానాధీశుల హక్కులు, అధికారము హోదాలలో సహితము భేదములుండుట సహజము. కాని ఇంగ్లాండు ప్రభుత్వము వారీసంస్థానాధీశుల రెండు తెగలుగ విభజించి యున్నారు. మొదటి తరగతి రాజుల రాకపోకలయందు గౌరవ సూచకముగ 9 నుండి 21 వఱకు తుపాకుల ప్రేల్చెదరు. అట్టి వారిప్పుడు 118 మందిగలరు. వీరిలో 91 రు "హిజ్ హైనెస్" లేక "హర్ హైనస్" యను రాచబిరుదు గలిగియున్నారు. తక్కిన 111 సంస్థానాధీశులకిట్టి బిరుదుగాని తుపాకుల ప్రేల్పు గౌరవముగాని లేదు! ఇట్టివిభజన యేసూత్రము ననుసరించి యున్నదో తెలియకున్నది. మొత్తముమీద మొదటి తరగతి సంస్థానములు సంపద యందును వైశాల్యమందును, జనసంకీర్ణమందును, రెండవతరగతివానిని మించియున్నవు, ఈసూత్ర మన్నిసంస్థానములకన్వయించుటలేదు. రెండవతరగతిలో చేర్పబడిన కొన్ని సంస్థానములు ఆవరణ, సంపద, జనసంఖ్యల యందు మొదటివాని మించియున్నను, తత్ సంస్థానాధీశులకు మొదటివారి హోదాలుగాని, బిరుదులుగాని లేవు.

సామ్రాట్ పదవిని (Sovereignty) దృష్టియందుంచుకొని పరికించినచో అన్నిసంస్థానము లొకేసానములంకరించును. రాజకీయశాస్త్ర దృష్టిలో నేసంస్థానమును సామ్రాట్ కాదు. సామ్రాట్ పదవికి రెండు విలక్షణరేఖలుగలవు. మొదటిది బాహ్యస్వాతంత్ర్యము అనగా యితరదేశములతో వ్యవహార సంబంధములలో తాను స్వతంత్రయై ప్రవర్తించుట, యుద్ధమునకు గడంగుటగాని, సంధిచేయుటగాని దానికి వేరొక ప్రభుత్వపు సమ్మతితోగాని, అనుజ్ఞతోగాని పనిలేదు. తన బాగోగుల నిర్ణయించుకొనుటలో తానే సర్వాధికారి. కాని యిట్టిశక్తి మన దేశీయ సంస్థానములో దేనికినిలేదు. పర రాజ్య సంబంధము (Foreign Policy) సంస్థానాధీశుల యధీనమునలేదు. యుద్ధము, సంధి, వర్తకవ్యాపారపు ఒడంబడికలు చేయజాలరు. విదేశప్రభుత్వములతో నెట్టి స్వతంత్రసంబంధముల నేర్పఱచుకొనలేరు. తుదకు పరరాజ్యములనుండి యొక శుష్కబిరుదును పరిగ్రహించుటకుకూడ వీరికి అధికారములేదు. ఈ యధికారములను ఇంగ్లండు దొరతనమువారు వశపఱచుకొనియున్నారు. ఇంతియేకాదు. రెండుదేశీయసంస్థానములకు కూడ బ్రిటిషువారి యనుజ్ఞలేని యెట్టి సంబంధములు పొసగనేరవు. కాన మన సంస్థానప్రభువులు నామకార్థమునకు మాత్రమే రాజులు.(Sovereecgns)

ఇక సామ్రాట్ పదవి రెండవ రేఖ అంతరంగిక (సంస్థానాంతర్గత)(Internal) విషయములలో సర్వోత్కృష్టాధిపత్యము. సామ్రాట్ తీర్మానము శాసనము. దానికెత్తి కెదురులేదు. దాని యధికారమునకు (శాస్త్రీయముగా) పరిమితిలేదు. ఆర్థిక, సాంఘిక రాజకీయములలో చేయిజేసి కొ

నగలదు. నియమముల నేర్పఱుప గలదు. వానిని ప్రజలా
చరణలో బెట్టునటుల నిర్బంధింప గలదు. దాని యధికార
మును రద్దు చేయగల వ్యక్తిగాని సంఘముగాని యారా
జ్యమున నేర్పడుండబోదు. ఆదిసర్వశక్తి సమన్వితమగు
నిర్మాణము.

కాని మన సంస్థానము లిట్టివికావు. ఏసంస్థానా
ధీశుడయినను దుష్పరిపాలన మొనర్చిన, బ్రిటిషు దొరత
నము వారడ్డువచ్చి, స్వేచ్ఛా పూర్వకమగు రాజీ నామా
యను మారుపేరుతో, నాతని పదచ్యుతుని జేయుదురు.
ఒకప్పుడిట్లు పదభ్రష్టులగు పాలకుల రాజ్యములను బ్రిటిషు
వారు తన స్వంతరాజ్యము (బ్రిటిషు ఇండియా) లో
కలుపుకొను చుండిరి. డెల్‌హౌసీ ప్రభువు మతము
(Doctrine of lapse) ఇట్టిదయి యుండెను. కాని
ఇప్పుడది మాని పదభ్రష్టుడగు సంస్థానాధీశుని సన్ని
హిత వారసుని సింహాసన మెక్కించుచున్నారు. ఇందూ
రు, నాభా సంస్థానాధీశులగతి యీపైన చెప్పబడిన
సూత్రముయొక్క ఫలితము.

ఇట్లుమన దేశీయ సంస్థానముల పదవి, హోదా
బ్రిటిషువారి దయా ధర్మములపై నాధారపడి యున్నవి.
స్వకీయమగు అధికారము వానికిసుమంతయు లేదు. అవి
స్వతంత్ర ప్రభుత్వములు కావు—సామ్రాట్ రాజ్యములు
కావు.

సామ్రాట్ పదవిలేమి, సంస్థాన ప్రభువు
లెల్లరు నొకే తరగతికి జెందినను, తదితర రాజకీయాధి
కారములబట్టి, వారిలో నొండొరులకు హస్తిమసికాంతర
తారతమ్యములు గలవు. ఉదాహరణార్థము హైదరా
బాదు, విజయనగర సంస్థానముల పరిస్థితుల పరికిం
పుడు. నైజాము ప్రభువులకు సొంతసిబ్బంది గలదు;
పోలీసు గలదు; న్యాయస్థానములు కలవు; సుంకశాఖ క
లదు; ఇవియన్నియు విజయనగరాధిపునికి నున్న అయి
నను ఇద్దరు హిజ్ హైనెస్సులే!

ఇట్టి యధికార భేదములు ప్రధాన సంస్థానాధీశు
లందుగూడ గలవు. హైదరాబాదు పాలకుకు గలయధి
కారము మైసూరు మహారాజులకు లేదు. ట్రావంకూరుపరి
పాలకు గలస్వత్వములు బరోడాగైక్వారులకు లేవు.
సామ్రాట్ ప్రభువగు యాంగ్ల ప్రభుత్వమునకు, మనసం
స్థానాధీశులకునుగల యన్యోన్య సంబంధము కేవల
పై నాధారపడి యుండకపోవుటయే దీనికి కారణ
ఒక్కొక్క సంస్థానపాలకునితో బ్రిటిషు వారొ
క్క ప్రత్యేక సంధర్భ మేర్పఱుచు కొనియున్నా
హైదరాబాదు, కాశ్మీరము వంటి సంస్థా
తోడి వ్యవహార సంబంధములకు సంధిపత్రములా
ములు; రాజపుత్రసంస్థానములకు ఒడంబడిక లాధార
కొందఱు జమీందారులకు సనదులు ప్రమాణము;
కొందఱు పాలెగాండ్ర విషయమున ఆచార సం
దాయములే శాసన రూపకములు.

వివిధ సంస్థానముల ప్రజలస్థితిగతుల యందు
ఇట్టివ్యత్యాసములే కానవచ్చుచున్నవి. సంస్థానము
కెల్ల యధికారమందును, హోదాయందును, వి
మందును, జనాభాయందును మేటియైన నిజాంరా
మున నూటికి ౨.౮ మంది విద్యనేర్చినవారు. కొ
కొచిన్ వంటిచిన్న సంస్థానములో ౨౧.౬ విద్యా
తులు. ఇందూరులో (ప్రజా ప్రతినిధుల) శాసన స
లిప్పుడిప్పుడు తలచూపుచున్నవి; నిజాంరాష్ట్రము
నింకను ఆలోచన యందేయున్నవి. ట్రావంకూరు
తెలివితో మెలగుచున్నవి. జన సామాన్యమునకు
స్వత్వములన మనరాష్ట్రమున తెలియనే తెలియ
బరోడా వాసులిప్పుడిప్పుడు కలల గనుచున్నా
ట్రావంకూరు వాసు లొకటిరెండు కిరణముల గాంచినా
ఆర్థిక సౌకర్యములలోను, నిర్మాణములలోను మైసూ
దేశీయసంస్థానముల నన్నిటని మించుచున్నది.
ఏటి ధారల విద్యుచ్ఛక్తి నిర్మాణము, కృష్ణరాజసాగ
యానకట్ట. భద్రావతీ లోహపరిశ్రమ,
భూమి తనువభ్యాంకుల స్థాపన, ప్రజల సంపదగూర్చి
పిన ఆర్థిక విచారణ (Economic Enquiry)
సంస్థానములలో గానరావు. పెద్దపెద్ద సంస్థాన
స్థితియే యిట్లుండ నిక ఏమారుమూలనో,
లోనోచిక్కియున్న చిన్నచిన్న సంస్థానముల
గూర్చివేరు తెలుప నక్కరలేదు.

దేశీయ సంస్థానములలోని పరిస్థితులిట్లున్న
[illegible] సమస్యలను వేరొక వ్యాసమున చర్చించె

# శాసనములు

## ఆంధ్రపరిశోధకసంఘము హైదరాబాదు

సుజాత రెండవసంచికలో శాసనములు విమర్శింపబడెను. నాలుగవసంచికలో రేచెర్లవారికి సంబంధించిన నాగులపాటి శాసనములు 7 ప్రచురించియుంటిమి. రేచెర్లవారికి సంబంధించిన శాసనములింకను మావద్ద నుండుటచే చరిత్రజిజ్ఞాసువులకు విషయము సుబోధమగుటకు వానినిచూడ నిట నుదాహరించుచున్నారము.

### దోసపాటిశాసనము.

1. స్వస్తి శ్రీశకవర్షములు
2. 1112 అగుఆనందసం
3. వత్సర మార్గశిర బ॥ ౧౨॥ బు
4. దోసపాటి రుద్రయ హరిహ
5. రదేవనికి తమతండ్రి గుంచ్ర
6. డ్డికి, దపుతల్లి కామసా
7. నికిం బుణ్యముగా శ్రీకాం
8. డేశ్వర దేవర నవరికి ఆచయూ
9. రిదక్షిణపు నలని తనతో,
10. టన రాట్న ముకలప ఆడిప్ప
11. డ్ల ౧ సహితము గానిచ్చె॥

### సోమవరశాసనము.

1 వ వైపు

1. స్వస్తి శ్రీ సకల గుణగణా
2. లంకార। పరనారీమార అ
3. మనగంటి పురవరేశ్వర। వీర
4. లక్ష్మివిజేశ్వర। దోబరాలక్ష్మ
5. రణరంగరాము। వితరణక
6. ర్ణ। శౌర్యసౌవర్ణ। పతిహి
7. తాంజనేయ। శౌచగాంగే
8. య। సత్యరత్నాకర। దుష్టజ
9. నభీకర। మన్మకులాదిత్య।
10. సుభట సంస్తుత్య। నామాది
11. సమస్తప్రశస్త సహితులైన। శ్రీ
12. మతు రేచెర్ల బేతిరెడ్డికిశ
13. కవర్షములు 1185 గు
14. శ్రీముఖ సంవత్సర। చైత్రశుద్ధ
15. గురువారమునాండుతా
16. ను గొచ్చ బొల్లినాయుండు
17. విక్రమగిరి శ్రీయంభునా
18. మనాధ దేవరకుఅంగభో
19. గరంగ భోగార్థము బేతిరెడ్డి
20. రెగడువాసూ బొన్నినాయుం
21. డు ఒరపాలాంగాం చెఱ్ఱుల
22. చంగ్గ (ద్ర) స్థాయిగానిచ్చిరి ఆచెఱ్ఱు
23. ముందరరెండు మత్తురువేసుకను
24. కొత్వాబేతి రెడ్డికట్టించి ఇచ్చె
25. ను ఆచెఱ్ఱువులుకట్టులు రేవు
26. లు కూపవ్వాగట్టులాందక్షిణము
27. కింగ్గ చెఱ్ఱుపద్దయచెఱ్ఱుని ఉత్త
శత్రూరుప్యదిక్కు

1. శ్రీస్వయంభూనా
2. మనాథదేవరకు

3. ఉత్తమగండభీమ
4 నాథుండు ఒకటఇరా
5. కు ఒకవిధానకునా
6. చంద్రార్కస్థా ఇతన్ని
7. ప్రిత్తిమగు ఇచ్చెం
8. శ్రీమన్మహామండ లేశ్వరకా
9. కత గణపతి దేవమహారా
10. జులు ప్రిధివి రాజ్యము
11. సేయు చుండంగానుసమర్కతి
12. సంవత్సర చైత్ర శుగం శ్రీ
13. సోమనాథ మహాదేవరకు
14. అంగరంగ భోగాలకు జెలువం
15 + అసిర ఎండకుంగాలువసా
16 లు + + + +
17 + + + +
18 పాడపురము దామరాజు పో
19 తరాజునకు ధర్మ్మముగా నిచ్చే
20 సినది

## దక్షిణము

1. స్వస్తి సమస్త ప్రశస్తి స
2. హితులైన శ్రీమతుకాక
3. తీయగణపతి దేవమ
4. హారాజులకు స్వస్తిస (ఘ)
5. మన ప్రశస్తి సహితు
6. లైన శ్రీమతురేచెఱ్ఱు
7. ల రుద్దురడ్డికి ధర్మ్మ
8. ముగానిచిరి.

## ఉత్తరము

1. స్వస్తిశ్రీ జయాభ్యుద
2. యశకవరు
3. ౧౧౫౮గు జయసంవ
4. త్సర స్వమాఘ సుగుసాడు
5. ముతి + రేశర్ల
6. నామిరడ్డి తమ తండ్రికి
7. తల్లికి ప్రీతిగాను త
8. మకు ఆయురారోగ్య
9. సు శ్రీ స్థలాభి వృద్ధిగా
10 శ్రీస్వయం(౦) భు దేవరలను
11 గ + సానికిచ్చి నగరగలు
12. ౩౫

* ఇట్లు గుర్తుపెట్టఁబడిన తూర్పుదిక్కు శాసన ప్రకృతాంశమునకు సంబంధించినది కాకపోయిన ప్రత్యేక పునెంబరు లేకపోవుటచేతను, ఈ శిలయ యుంటచేతను నిట నుదాహరింపవలసి వచ్చినది. ప్ర శాసనము లన్నింటిలోను రడ్డిపదమే కనబడుచున్న రెడ్డిపదమునకు రడ్డిపదము ప్రాచీనరూపము కా పును. ఈ శాసనమునందు ఈచెర్లగోత్రులు మనుమ దిత్యులని వ్రాయఁబడియున్నది. మనమకుల మను భావము తెలియుటలేదు. ఈ శాసనములవలన రేచర్ల గుండ్రడ్డి, కామసాని, బేతిరడ్డి రుద్రరెడ్డి వారు పరిచితులగుచున్నారు. రుద్రరెడ్డినామము దొరతనమువారు ప్రకటించిన ఉప్పలపల్లి రామప్ప శాసన యందు గూడఁ గలదు. బేతిరెడ్డి గణపతిదేవుని సేనా యకులలోఁ బ్రసిద్ధుఁడగు బేతాళనాయకుడని తలంచుచున్నారు. సమకాలికములగు ఇతర శాసన లోను పిల్లల మఱ్ఱి శాసనములలోను రేచెఱ్ఱుమ రేచ ల అనిగూడ రేచర్లగోత్రమునకు రూపాంతరములు కన చుచున్నవి. కామసానియను నామము చివరగల సాని ము స్త్రీ వాచ్యము. ఇపుడీపదము నింద్యార్థముగ వాడు చున్నను పూర్వము గౌరవార్థమున వాడువారు. "కేస డుకు సానికిఁ" అని బమ్మెర పోతరాజులిట్లే వ్రా చియున్నాఁడు. ముందుసంచికలో పిల్లలమఱ్ఱి శాసన లను ముద్రితగ్రంథములలో నున్న పాఠాంతరము సూచించెదము. దీనివలన రేచర్లగోత్రుల చరిత్రము యుఁగలదు.

# లక్ష్మీదేవి

## లక్ష్మీకాంతరాఘవ కవులు

శా. కరిపై నెక్కి యొకండు సేవకులు ముక్తాచ్ఛత్రముల్ పట్టఁ జా
మరముల్ వీవగ హేమభూషణములన్ మైఁదాల్చి తిర్గాడు, ది
మ్మరు వేరొక్కఁడు గోచిపెట్టికొని ఖిన్నమ్లానాంగుఁడై విష్ణుసుం
దరి! యీరెంటికి హేతువుల్ భవదుదంచస్యంచితాలోకముల్.

చ. ఇదివరకెన్నఁడేనిఁ గలనేని నెఱుంగని వారితోడ సౌ
హృదము ఘటించు నీవలన నెంతయు శోభ జనించుదాన నా
పిదప నొకానొకప్పుడది విఘ్నముగాఁ బరగన్ విషాభవమా
గద భవదీయ నామమున గల్గిన శ్లేషయుసార్థకంబ, శ్రీ!

మ. అరయన్ బూర్ణకళాయుతుండయి బుధాహ్లాదప్రదుండై సుధా
కరుఁడుద్యోతతి భూజనప్రియుఁడునై సన్మార్గసంచారియై
హరిణాంకుంబలెఁ దేజరిల్లినను నీప్రాంచత్కృపాదృష్టియేన్
బరఁగన్ జాలవు నీకు నీసహజమా వైరంబు? పద్మాలయా!

మ. పలలాహారులు మద్యపాననిరతుల్ వారాంగనాదాసులున్
దులువల్ దుష్కులసంభవుల్ గఠినచిత్తుల్ వంచకాగ్రేసరుల్
కలితాసత్యమతుల్ నిరక్షరులు లోకంబందునన్ నీకటా
క్షుల సద్వీక్షణ మాత్రనొప్పెద రసంచద్వృత్తులై వంద్యులై.

మ. గురుదారిద్ర్యఘనాంధకారమున మగ్నుండై నరుండక్కటా
తెరవుం గానక నిన్నుఁ గూర్చి కడుఁ బ్రార్థింపన్ రవంతేనియున్
సరకున్ జేయవొకస్దచింతితముగా సాక్షాత్కృతిన్ బొంది తే
నిరహీన్ మాయమయయ్యెదర్థయుత మే నీనామమో చంచలా!

# సంపాదకీయములు

## స్కీనుకమిటీ నివేదిక

నెపోలియనుబోనపార్ట్, బ్రిటిషువారిని "వర్తకులజాతియని" యెత్తిపొడిచెను. ఈయాక్షేపణ యాక్షేపడునటుల బ్రిటిషు ప్రభుత్వము వారు భారతదేశము పట్ల ప్రవర్తించుచున్నారు. వారి రాజకీయ సంస్కరణలువోలె, సైనికసంస్కరణలు గూడ కోమ్మటిబేరపు పద్ధతుల ననుసరించి యున్నవి. ఆదిని భారతీయులకు సైన్యమున ఉద్యోగములు లభించుటయే దుర్లభముగ నుండెను. తదుపరి డేరాడూను కాలేజీస్థాపించి యచ్చటినుండి సాండహర్స్టు కాలేజీవంటి సైనిక శిక్షాసంస్థలకు విద్యార్థుల నంపి యచ్చట తగు శిక్షణవడసి పరీక్షలో విజయమొందిన వారికి ఉద్యోగముల నొసగుచుండిరి. కాని మొత్తముమీద ఇంగ్లాండులోని సైనికశిక్షాలయములందు నూరుస్థానములలో 5 కి మాత్రమే భారతీయులను చేర్చుకొనుచున్నారు. ఇంకను యెక్కువమంది శిక్షపొందుటకు వీలులేకున్నది. సాండుహర్స్టుకాలేజీలో భారతీయులకు 20 స్థానములు మాత్రముండెను. దీనిఫలితమేమన, సైన్యములో భారతీయయువకులకు ... అవకాశము

లేకపోయినది. మనసైన్యమున ఉద్యోగులు ... 3290; ప్రతిసంవత్సరము సుమారు 160 ... కలుగును. వానియందు దశాంశమయినను భారతీయులకు చిక్కుటకష్టముగ పరిణమించె ... కాన దేశీయనాయకు లసంతుష్టిజెంది కొం... వులాడిన పిదప, ప్రభుత్వమువారుకొంచెము ... సడలించి, ఎంతయో వితరణశీలతో ప్ర... చుచు 8 పటాలములను భారతీయోద్యోగు... ప్రత్యేకించిరి. ఇట్టి విధానమునకు ... యుల యభిమానమేకారణము. వారు ... తీయులట; కాన బ్రిటిషు సైనికులు భారతీ... ద్యోగులక్రింద పని చేయకూడదట; ఉద్యోగ... నొసగుటలో నిట్టి విచక్షణకలిగించి భారతీయ... యాత్మ గౌరము నధిక్షేపించిరి. కాన నిట్టి ... నము భారతీయులకు సంతృప్తి నొసగలేదన్న... దువింతలేదు. ఇది భారతీయుల తీవ్రమగు ... నకు, ఆక్షేపణకు గురి యయ్యెను. ఈ సం... మించుక నుపశమింప జేయుటకు స్కీను కమిటీ నియోజిత మయ్యెను. ఈ కమిటీ ... మనకొసగు వివరములివి:—1933 వ సంవ... మున భారత దేశమున నొక సాం...

వంటి సైనిక శిక్షా సంస్థ స్థాపించ వలె
ను. 1953 వ సం॥ నరికి సైనికోద్యోగులలో
సగము మంది భారతీయులై యుండవలెను;
ఇది క్రమముగా జరుపవలెను. ప్రస్తుతము సైని
కోద్యోగులలో నేప్పడు ఖాళీలకు 10 మంది
భారతీయుల నియమింపవలెను. 1928 సంవత్స
రమగు నరికి 20 మంది భారతీయులకు కమీ
షను ఉద్యోగము లివ్వవలెను. 1928 మొదలు
1933 సం॥ వరకు క్రమమున సంవత్సరమునకు
4 ఉద్యోగములను భారతీయులకు అధికముగ ని
చ్చుచుండవలెను" ఇంతకంటె నిపుణమగు బేర
ముగలదా? ఇట్టి చతురమతులగు 'బేరగాండ్లకు'
15 యేండ్లలో సైనికోద్యోగములలో సర్ధ
భాగము భారతీయుల మయమై యుండవలెననెడి
జిన్నాగారి సూచన రుచించునా?

పైలోపములతో, కమిటీవారు కొన్ని
గణనీయ సూచనలు చేసియున్నారు. వానిలో
ముఖ్యమైనది భారతీయుల సైనికోద్యోగము
లకు తగుదురనిన విషయము నిర్ధారణ పఱ
చుట. దీనివలన మనము కత్తిబట్ట జేతగాని వార
మనిన నుభిప్రాయము కొంతవఱకు తీసివేసిరి.
సైనికోద్యోగములకు భారతీయుల యర్హానర్హ
తల గూర్చిన శంక, తగవు, పోయినది. భారత
దేశముననే సైనిక కళాశాల స్థాపించుట
రెండవ విషయము. పిన్నతనముననే విదేశము
లకు బోవుట సుగమమగు విషయముకాదు.
అది శుభకరమునుగాదు. కాన మన దేశములోనే
యొక కళాశాలయుండుట భావ్యము. ఇందుసా
మాన్యకుటుంబములకు చేరిన బాలురకు కూడ
యవకాశమొసగు ఏర్పాటుకొని యాడదగినది.

కాని యీనివేదికతో బయలువెడలిన భార
తప్రభుత్వము వారిప్రకటన మనయాశలకు, ఉ
త్సాహమునకు భంగము కలుగచేయుచున్నది.
వారిప్రకటన యిది. "ఇండియా ప్రభుత్వమువా
రుగాని, సార్వభౌముని ప్రభుత్వము వారుగాని
ఈనివేదికను సంపూర్ణముగ ఇంకను పరిశీలింప
లేదు. ఎట్టితీర్మానమును గావించుకొనలేదు.
......భారతదేశపు పరిస్థితుల కనుగుణ్యమైన
సూచనలను కమిటీవారు వివరించి యున్నారు.
కాని సైనికోద్యోగుల నియమించుట వారికి శిక్ష
గరపుట మున్నగు విషయములు సామ్రాజ్యము
నకంతయు సంబంధించినవని గుర్తెరుగవలెను.
కావున ఈవిచారణ సంఘమువారి సూచనలను
సార్వభౌముని ప్రభుత్వమువారు, సార్వభౌముని
సైనిక శాఖవారు పరిశీలించవలెను...ఈ కా
రణముననుసరించి ఇండియా ప్రభుత్వమువారు,
ఆ నివేదికను కేవలము ఆధారముగ గైకొని సా
ర్వభౌముని ప్రభుత్వమువారితో ఉత్తరప్రత్యు
త్తరములను జరుపవలసియున్నది."

ఇదివఱలో కరెన్సీవిధానముగూర్చియు, అర్థి
కవిషయములగూర్చియు నెన్నియో విచారణసం
ఘములు నియమింపబడెను. కాని వారిసూచన
లను, ప్రభుత్వమువారు సరకుగొనకయో, లేక
కొన్నిటినామోదించి కొన్నిటిని నుపేక్షించి
యో, నిష్ఫలితములగజేసిరి. సార్వభౌముని
ప్రభుత్వమువారి పర్యాలోచనలో నిట్టిగతియే
స్కీను కమిటీ నివేదికకు గూడ బట్టునేమోయను

శంకవొడముచున్నది. ఇంతియేకాదు. సైని కోద్యోగుల నియామకము సామ్రాజ్యమున కంతటికి సంబంధించినదని ప్రభుత్వమువారు హెచ్చరించు చున్నారు. భారతీయులకు కొన్ని స్వత్వముల నొసగు తతి సామ్రాజ్య దృష్టి నవ లంబించు చున్నారు. ఆఫ్రికా కనడా మున్నగు దేశములలో భారతీయులు నానా యిక్కట్టు లనుభవించుచుండ ఈ సామ్రాజ్య దృష్టి విలో కించుట కడు చిత్రము.

## ఛత్రపతి శివాజి

ఒకప్పుడు "బందెకాడు" "కొండ ఎలుక" "మూర్ఖపుఛాందసుడు" మున్నగునామములతో నీ మహా పురుషుడు భూషింపబడుచుండెను. కాని నేడీ "బందెకాడు" మహా వీరుడనియు, "కొండ యెలుక" తనమార్గమధ్యమున వచ్చిన అన్యరాజ్యములను పర్వతముల నడుగంటచేసి "స్వరాజ్యమును" స్థాపించిన జాతీయ నా యకుడనియు, ఈ "మూర్ఖపు ఛాందసుడు" స్వమతాభిమానమును, పరమత సహనమును గలిగి విలసిల్లిన రాజశ్రేష్ఠుడనియు నేడందఱును గ్రహించినారు. అట్టి మహా పురుషుని గౌరవిం చుట మన భారతజాతిని గౌరవించుటయే, భారత మాత నారాధించుటయే.

శివాజీ ఘనత యెందు గలదు? అ యప్రతిహతమగు పరాక్రమమున గాదు. అ డ విజయములందు గాదు. సామ్రాజ్య నయందు కాదు. భూరి దానములందు కా ఆతని విజయ మాతని సందేశమందు గల అది "స్వరాజ్య" సందేశము. బాల్యమున గూర్చి కలలు గాంచెను; యౌవనమున అ ముగ నియమించెను; ప్రౌఢ తనమున సిద్ధి గెను; మరణశయ్యపై రాబోవు సంతతి క శముగ నొసగెను. దీనికై పితృ భ్రాతల ప్ర ఘటించెను; జాతి మత కక్షుల నుగ్గడించెను; ప్రాణముల యవిరళముగ ధారపోసెను. స్వరాజ్య దీక్షయే యాతని ప్రథమ సందేశము తుది సందేశము. ఈ స్వరాజ్యమంత్రము జపించి ప్రతి యువకుడు నూతన తేజము కార్య రంగమున ప్రవేశించు గాక.

## కృతజ్ఞత

విమర్శనార్థము మా కార్యాలయమునకు కొన్ని గ్రంథములు, పత్రికలు చేరినవి. కృతజ్ఞ తతో నందుకొంటిమి. స్థల సంకోచముచే వా విమర్శనలు యీ సంచికయందు ప్రకటి జాలకపోతిమి. రాబోవు సంచికలో వాని వి ములు ప్రచురించెదము.

---

Edited and Published by P. N. Sarma B.A. Troop Bazar Hyd. Dn.
Printed by S. Pratapa Reddy B. A. B. L. at the Golkonda Press, Hyderabad

# విషయసూచిక

# సుజాత

హైదరాబాదు జూన్ ౧౯౨౭

సంపుటము ౧ | ప్రభవ సంవత్సర జ్యేష్ఠము | సంఖ్య ౬

## రుధిరాభిషేకము

(ఏకాంక నాటకము)

ఒ. రాఘవ రంగరావు

### ప్రథమ ప్రవేశము : అనుమకొండ యందలి కాకతి రాజనగరు

(ప్రవేశము కాకతి ప్రోలరాజు, వ్యోజదండ నాథుఁడు, జయకర భట్టారక జ్యోతిష్కుఁడు, మరి కొందఱు సభ్యులు)

ప్రోలరాజు—(సంభ్రమముతో) వ్యోజదండ నాథా! జయకర భట్టారక జ్యోతిష్యులవారి ప్రశ్నావ మర్యాద్భుతము. నిన్నటి మన దినచర్యలన్నియు మొన్ననే మనకు వ్రాసి యిచ్చిరిగదా? అవెంత చక్కఁగా మన కనుభవమునకు వచ్చినవి!

వ్యోజదండ నాథుఁడు—చిత్రము.

ప్రోలరాజు—జయకర మహోదయా? నేఁ డేమ యున విశేషములు

జయకరుఁడు—మహారాజా! ఏమ కిప్పుడే కుమారుఁడు గలిగినాఁడు.

ప్రోలరాజు—[సంతోషముతో] ఏమి?

వ్యోజదండనాథుఁడు—మా రాజుగారికి కుమారోదయ మైనదా? ఎంత సంతోషకరమైన వార్త! ఇట్టి వార్త నెఱింగించి నందుల కీరత్నాంగుళీయకమును బహుమానముగ గొనుఁడు. [ఉంగరమీయఁ బోవును]

జయకరుఁడు—[త్రిప్పికొనక] వలదు, సేనాపతి! వలదు. రాజ బహుమానమునకు జయకరుఁడు నోచుకొనలేదు.

వ్యోజదండనాథుఁడు—[చకితుఁడై] అదేమి? మ హాశయా! అలా గనుచున్నారు?

జయకరుఁడు—అంతేకదా!

గీ॥ ప్రభువు మదిరంజిలంగను వదరివదరి
ధరకు జోస్యుఁడు బహుమాన తతిఁగాంచు
పాపభీతిని సత్యంబు బలికి ప్రభువు
కోపమునకు నాబోఁటులు గుఱియగుదురు.

ప్రోలరాజు—[స్వగతము] ఇదేదో విశేష మున్నది.

వ్యోజదండనాథుఁడు—నిజము. మందుకటువుగా నుండి గుణమిచ్చునట్లు సత్యవాదము నిష్ఠురముగా నుండియు ఫలము నిచ్చును.

దాసి—[ప్రవేశించి తొందరతో] జయము! జయము!! ఏలిన వారికి పుత్రోదయ మైనది.

[అందఱు విచారము నభినయించెదరు]

దాసి:—(ఆవేగముతో) అయ్యో! ఇది యేమివిచిత్రము? రాజుగారికి పుత్రోదయమైన సంతసించుటకు మాఱు మీరందఱు విచారించు చుంటిరేల?

జయకరుడు:—(విచారముతో) తల్లీ! విచారగ్ర... మున సంతోషము కవకాశ మెక్కడిది?

దాసి:—(తనలో) ఇదంతయు నితని పలుక్... గినది. పండువంటి కొడుకును బెట్టుకొని తల్లిదండ్రు... ని పాడు జ్యోస్యము మూలమున సుఖపడ నీయఁడే... (ప్రకాశముగా) వెఱ్ఱిబాపఁడా! పిచ్చిజ్యోస్యము చె...

ప్రోలరాజు:—(అర్థోక్తియందు) దాసీ! ... కుండుము.

వ్యోజదండనాథుఁడు:— జ్యోస్యమహాశయా! ...ర్యవసానము—?

జయకరుఁడు:— ప్రభుశిరమున మకుటము ... ముగా నుండుగాక! ఏలినవారు చల్లగా నున్నంతకాల... కుమార ప్రభువును చూడఁగూడదు.

ప్రోలురాజు:— సేనాని! జోస్యమహోదయు... సత్కరించి పంపుము.

వ్యోజదండనాథుఁడు—ఆజ్ఞ.

జయకరుఁడు—చెట్టునకు నీరు బోసి ఫలము ... కొనుటకు బదలు చెట్టును నఱుకగ వచ్చి ... నినట్టున్నదీ బహుమానము. (అందఱు నిష్క్రమింతురు)

---

## ద్వితీయ ప్రదేశము : శుద్ధాంత మండలి సూతికా గృహము

[ముప్పమ్మదేవి బాలుని యొడినుంచుకొని, మఱి కొందఱు చేటికలు ప్రవేశింతురు]

ముప్పమ్మ—[విషాదముతో] దైవమా? ఎంతటి విషమావస్థ తటస్థింపఁజేసితివి?

గీ॥ భర్తభార్యానురాగవిపాక మిట్లు
పుత్రరూపంబుగాబుట్టి ఫొక్కఁజేసె
అమృత ముద్భవ మగునంచు నబ్ధిదరువ
కాలకూటంబు పుట్టువు గాంచినట్లు.

ముప్పమ నోచిననోముల తాలుకారు పంటయాయెది.

గీ॥ జమ్మితో నటనఁబుట్టి యా జమ్మిఁగాల్చు
హవ్యవాహకు నట్టుల నస్మదీయ
గర్భమున జన్మమంది నా కాయమెల్ల
అగ్ని లేకుండ గాల్చెద వా కుమార!

చెట్టున నగ్ని లేకుండ చల్లార్పనైన వలయును ... దేని సమూలముగా చెట్టును కాలిపోనీయ వలయును ... శ్వరా! ఎట్టిస్థితి! మహామండలేశ్వర కాలి ... తనూజాతుండనైన ని కెంతగలిపట్టె.

సీ. ఆంధ్ర పౌరుషరమ కావాసమైయొప్పు
ముద్దులుగారెడి మోముగల్గి
ఆంధ్రధైర్యేందిర కాస్థానమైయొప్పు
విపుల వక్షస్థల విభవమమరి
ఆంధ్ర రాజ్యశ్రీకి నాటపట్టై యొప్పు
దృఢ బాహు లతలతో దేజరిల్లి

ఆంధ్ర విజయలక్ష్మి కానందమై యొప్ప
శూరోచితాంగక శోభగల్గి
కాకతీయాన్వయంబు ప్రకాశమంద
జన్మమెత్తితి వోతండ్రి! చలముబూని
నిన్నువిడనాడి యేట్టుల నిల్వవచ్చు
నేలబుట్టితి వోయయ్య జాలిగొల్ప.

అయ్యయో! ఇట్టి భవిష్య త్కాకతిపట్టభద్రుని నక్కల పాలు గావింపవలయునా? దుర్భరము! దుర్భరము!! ఇక నీ దైవోపహతకు వాత్సల్యమనుభవించు నదృష్టమెక్కడిది?

తే. గీ. కొడుకుపై ప్రేమ బెడబాయ కుంటినేని
భర్తృసౌఖ్యంబునకు బెడబాయవలయు
భర్తపై ప్రేమవీడక వలలితేని
కొడుకునడిగానలో ద్రోసికొనగవలయు.

ముందల గోయి వెనుక నూయియై యున్నది నా స్థితి.

చేటి—దేవీ! ఊరడిల్లుము. తలచల్లగానున్న తలమానికముల వేయింటిని దాల్పవచ్చును.

ముప్పమ్మ—ఎంతమాట వినవలసి వచ్చెను? ఈ ముప్పమ్మ కొడుకుల ముప్పమ్మ గావలసి వచ్చెనే? (మూర్ఛిల్లును)

చేటి—దేవి మూర్ఛ పోయినది. కుమారుని తప్పించుట కిదియేసమయము. స్వామీ! సిద్ధేశ్వరా! ప్రభ్వాజ్ఞను వర్తించి యీ బాలుని తల్లియొడినుండి బాపుచున్నాను. తల్లియొడిలోని పిల్లల బాపు మహాపాపము నన్నంటకుండ జేయుము. (బాలుని గ్రహించి నిష్క్రమించును)

## తృతీయ ప్రదేశము: సిద్ధలింగ దేవాలయము

(ప్రవేశము తమ్మళి సిద్ధలింగయ్య)

సిద్ధలింగయ్య—లోక మెంతటి స్వార్థపరమైనది. తన ప్రాణములకై యితరుల నెంత తుచ్ఛముగా నైనను జూతురు. ఆ బ్రహ్మకల్ప మెవ్వడును జీవింపడు. విధికి ప్రతి యొనర్ప గలమని నరులు నిక్కుదురుగాని అది యనిరుద్ధము. రాజాంతఃపురమునుండి త్రోసివేయబడిన బాలుడు నక్కల పాలిటికి బడక నా పాలిటబడియె. రాజ జ్యేష్ఠసంతానమునకు రాజ్యమువచ్చు యోగము తప్పినది. కానిమ్ము. పాలకుడు గాకున్న మానె; పాలితుని వలెనైన బ్రతుకడా? నన్నే తండ్రిగా భావించుచున్నాడు, పాపము! గంటగొట్టి జీవించు సిద్ధలింగయ్యకు ఖడ్గధారియగు పుత్రుడు గలిగినాడు. అంతియే చాలును—ఆంధ్రపౌరుషము నిలువబెట్టుట కలుగడియు బోరిన నామట్టుకు నాకంతియే చాలును. లోకులు నా కొడుకనక ప్రోలరాజు కొడుకనరు. నా బాలవీరుడు, నా రుద్రయ్య మల్లరంగమునుండి వచ్చువేళయైనది. త్వరగా శివార్చనజేసి వెళ్ళవలయును.

(నిష్క్రమించును)

## తురీయ ప్రదేశము: అదే స్థలము

(పూజా ద్రవ్యములబట్టుకొని తమ్మళి సిద్ధలింగయ్య ప్రవేశించుచున్నాడు)

సిద్ధలింగయ్య—(పూజా ద్రవ్యముల గర్భగృహమునుంచి) గ్రామములోగల శివాలయమునకు భక్తులెక్కువగా వచ్చెదరు. భక్తికిగూడ అంతస్థు లుండవలయును. రాజగృహమునందైన విశేషము జరిగినదే కాని మా యీశ్వరునకు భోగవైభవములు జరుగవు. ఏమో—(గొణుగుకొనుచుండును)

(రుద్రయ్య మల్లరంగమునుండి ప్రవేశించుచున్నాడు,

రుద్రయ్య—నాయనా! పూజకాలేదా?

సిద్ధలింగయ్య—ఈనాడిక్కడికి ప్రోలరాజుగారు వచ్చెదరు, కావున నాకు వచ్చిన నైవేద్యపూజ కావలయును. నివ్వొకటికివెళ్ళి భోజనము చేయుము.

రుద్రయ్య—నేనుకూడ పూజ అయినపిమ్మట నే వెళ్లెదను.

సిద్ధలింగయ్య—సరి. కాని. నీ వీనాఁడు బడలిన ట్లున్నావు.?

రుద్రయ్య—ప్రాంతము గా జనము చేయుసాము ముగిసిన పిమ్మట దొమ్మనాయఁడు నాతో దలపడినాఁడు. ఎటులనైన నేమి? అతని నోడించినాను. అందువలన నే బడలిన ట్లగు పడుచుంటిని కాబోలు. రాజుగారు వచ్చినదే లేపుము. అంతదనుక నే నీ మత్తడిమీద బరుండెద.

సిద్ధలింగయ్య—సరి.

[రుద్రయ్య మత్తడిపై నిర్గోచితముగా శయనించును]

రుద్రయ్య—[ప్రమీలాస్వరమున] నాయనా! ఈనాఁడు దొమ్మనాయఁడు „నన్ను నలుగురిలో నవమాన పఱచితివి గదా. ప్రొద్దుగ్రుంకులోపల నీయంతుగని వదిలెద” నని జెప్పినాఁడు. ఏమహా పాటున నాతఁడు నాపయి బడకుండ కొంచెము జూడుము. నేను మెలకువగా నున్నప్పుడు నూర్గురు దొమ్మనాయళ్లు వచ్చినను లక్ష్యము లేదు.

సిద్ధలింగయ్య—ఇక్కడి కెవ్వడు రాఁడు. తిన్నగా పరుండుము.

[రుద్రయ్య నిద్రబోవును. సిద్ధలింగయ్య గుడిలోని సమరుచుండును. ప్రోలరాజు వ్యోజదండ నాథుఁడు, మఱికొందఱు వీరులు సంభాషించు కొనుచు కొంచెము దూరమునుండి ప్రవేశించుచుందురు.]

ప్రోలరాజు—తరువాత?

వ్యోజదండ నాథుఁడు—ఏమని చెప్పవలయును. మా కనులు మిరుమిట్లు గొలుపునట్లు సాముజేసినాఁడు. ఆ సాముముందఱ నాగలేక దొమ్మనాయఁడు క్రిందగూలినాడు.

ప్రోలరాజు—దొమ్మ నాయఁడెవఁడు?

వ్యోజదండ నాథుఁడు—ఎవఁడో. క్షత్రియవంశమునకు తనే నని చెప్పట్టుచున్నాఁడు. మన పల్లెలలో నున్న ప్రజ్ఞ ప్రముగా మల్లవిద్య నేర్పుచున్నట్లు నాకు తెలిసినది. అతడు మాత్రము కాకతీయసైన్యములో జేరుటకు యుద్ధశిక్షణము బడయుచున్నాఁడనని జెప్పును. వర్తనము మాత్రము మానముగానే నామట్టుకు కానుపించుచున్నది.

ప్రోలరాజు—బాలుఁడెన్ని యేండ్లవాడు!

వ్యోజదండ నాథుఁడు—చాల చిన్నవాడు. [గుడిలో ప్రవేశించి] మహారాజా! ఇదిగో! ఆబాలుఁడిక్కడ పడుకొని యున్నాఁడు.

ప్రోలరాజు—[పడుకొని యున్న రుద్రయ్యను చూచి] నిజము. దండనాథా! నిజము. పౌరుషము కాంతి ని బాలుఁడు ముఖశ్యాలి. చూడుము.

గీ. అంపపొది తల గడగాఁగ-నమరఁజేసి
జోడుకత్తులు ప్రక్క-న-పోడిమలర
నొక్క-చేతితో వింటిని-చిక్క-బట్టి
బొజ్జు కై జారు నొక్కటి-పొందుపరచి.

గీ. ప్రకృతినందిన యావీర-రసమునంగ
కఠినమైన శివావేద-గాథనిద్ర
బోవుచున్నాఁడు చూడు నీ-పురుషుగన్న
పుణ్యశాలి యెవ్వండో బోధ పడదు.

ఒక అనుచరుఁడు—మన సిద్ధలింగయ్య కొడుకు

ప్రోలరాజు—అలాగా! దర్శనీయుడు. నేను ఈతఁడు మనయాంధ్రసేనలో యోధగా నిలిచియుండ

సీ॥ అతిశయ భుజబల మగుపడుటం జేసి
విఱ్ఱవీఁగదె యాంధ్ర వీరమాత
అతి యోగ్య యోధుని యనుచురుఁలై యుండ
విఱ్ఱవీఁగరే యాంధ్ర వీరవరులు
నితఁడు సేవకుఁడుగా నెగడి యుండుటఁజే
విఱ్ఱవీగఁడె యాంధ్ర పృథ్వీవరుఁడు
అనవరత జయంబు లందించుటం జేసి
విఱ్ఱవీగదె యాంధ్ర వీరలక్ష్మి
చుక్కల లోపల నొక్క చంద్రు
రీతి యోధులగుంపులో నీతఁడున్న

శిబిరమెల్ల పౌరుషమున వెన్నుమీటి
విజ్రుంభింగదె వెయాలు విధము లేల.

ఏమీ! బాలయోధసౌభాగ్యము —!

సీ॥ పాలుగారెడు నును పాపచెక్కులపైన
వీరరసంబంత వెల్లివిరియ
మదరెటుంగని లేత మురువంపు బాహువుల
బల పరాక్రమశక్తి పటిమజూపు
కనునీయ విపుల వక్షః ప్రదేశంబున
ధైర్యరమాకాంత తాండవించు
నవనీత మృదుల సౌందర్యతను స్నీను
పౌరుషవాహిని వాగుబాఱు

సిదుర తెప్పలమాటలో నెగ్గడియుండి
మొగ్గలో తమ్మితేకుల బోలియున్న
కనులు కరుణామరందమ్ము గ్రక్కుచుండు
సోయగము, శూరతయు వీని సొమ్ము నిజము

ఇతఁటినాఁడే నాకొడుకైన హిమాలయశిఖరములపయి, సేతుసాగర తరంగములపయి యాంధ్రయశస్సు మెఱయుచుండునా? [దగ్గరించి బుగ్గలు పుణుకును]

రుద్రయ్య—[ఉలికిపాటుతో] ఛీ! పామ్మ హాతకా! నిమరించువానినైనను ఏపాతకము. [కటారి బెత్తికి జొమ్మున గ్రుచ్చును]

వ్యాజదండనాథుఁడు—ఎంత ప్రమాద మెంతప్రమాదము! ప్రభుహత్య—ప్రభుహత్య!

రుద్రయ్య—[తత్తఱపాటున లేచి తెలివితెచ్చుకొని] ఎంత ప్రమాదము. నాచే నేఁడెట్టి పాపకార్యము జేయఁబడెను.

వ్యాజదండనాథుఁడు—కుమారా! తండ్రిగే— ఆంధ్రరాష్ట్రమున కంటకికి ప్రభువగుటచే ఆంధ్రుల తండ్రి నే—అయ్యో! కుమారా! ఎంతటిఘోరకృత్యము చేసితివి? ధర్మాత్ముఁడును, శూరుఁడును, ప్రభువును నైన కాకతిప్రోలక్షితీశు నే సంహరించుకొంటివే!

రుద్రయ్య—(తత్తఱముతో) హారాహారా! ఎంతటి పాపకార్య మీనాఁడు నాపాదు చేతు లోనరించెను? ప్రభుహత్య—వీరుఁడగు ప్రభుహత్య—అయ్యయ్యో! ప్రభు వనిన ప్రభువా?

తే॥ గీ॥ ఆంధ్రరాష్ట్రంబు నందలి యాంధ్రజనుల
కడుపులో చల్లబేఱగా గాచునాతఁ
డట్టి నమ్రాట్టు యమపురి కంపివైచి
ఘోరపాపంబు నేనమకూర్చుకొంటి!

ఇట్టి పాపకృత్యమునకై నేనెట్టి దండనను పాలుగావలయునో గదా. ఎట్టిదండనకైనను సిద్ధము. చేసిన గునునకు తప్పించుకొన నెవరికి శక్యము? సంతోషముగా సిద్ధము—అయినను ఘోరకృత్యజనిత పాపమునకుమాత్రము నిష్కృతి గాజాలదు.

ప్రోలరాజు—(ఆయాసమునను భవించుచు) కుమారా! అదిపొఱపాటు.

రుద్రయ్య—(దుఃఖముతో) దేవా! నదయారస దృష్టి కది పొఱపాటువలె గాన్పించుచున్నది కాని నిశ్చయముగా నాయట్టిపాపి లేడు. ఈ నిష్ఠురపాపచిత్తునకు యుక్తదండన ప్రసాదించి యమదండన తగ్గింపుఁడు.

ప్రోలరాజు—(ఆయాసమున మూల్గును)

రుద్రయ్య—అయ్యయ్యో! పరమపావనుల ప్రభున కింతటి యాయాసము సంభవించెగదా! ఈ రుద్రహతకుఁ డిప్పుడే ప్రాణములఁ దీయవలసియున్నవాఁడో. అట్లిట్టి రాకముళ్ళె యీతని తెగుచోటికి బంపుకొనవలయును.

తే గీ॥ తండ్రీ! సిద్ధలింగేశ్వర! ధరణినాథ
మరణకారకుఁడతుల దుర్మార్గచరితు
డాత్మహత్యా మిమంజేసి ప్రాణములను
వీడుచున్నాఁడు,క్షమియింపు వీనియఘము

సర్వేశ్వరా! సత్వరముగా నన్ను నీ లో గలిపి కొమ్ము. (కత్తి దూసికొని పొడుచుకొనఁబోవుచున్నాఁడు)

సిద్ధలింగయ—(లోపలన ప్రవేశించి రుద్రయ హస్తము బట్టుకొని) కుమారా! సాహసము వలదు. (ప్రోలరాజు మొగంజూచి) మహాప్రభూ! ప్రోలభూమీశా!

ఇంతవఱకు కడు గోప్యముగా దాచిన ఏ విషయ మిఁక దాచుటకు వీలులేదు. ఈ వీరుఁడు కాకతి రుద్రదేవ భూమీశుఁడుగాని తమ్మళి రుద్రయ్యగాఁడు. కాకతి ప్రోలరాజ తనూజుండుగాని సిద్ధలింగయ కొడుకుగాఁడు. జ్యోతిశ్శాస్త్ర కారణమున మీ రీతని బాలవైవ దిక్కు లేకుండ నేడ్చుచున్న ఏతని పెంచి మీ కపమృత్యు తుల్యుఁడైన వాఁడీ తమ్మళి సిద్ధలింగ ఘాతకుఁడు. ఈ దోషిని క్రమవిధిని శిక్షింపుడు.

అందఱు—(ఆశ్చర్యముతో) నిజముగా ఏ బాలుని యందు ప్రోలరాజు పోలిక అచ్చొత్తినట్లున్నది.

ప్రోలరాజు—(ఆయాసమున) దోషి కిదివఱకే శిక్ష యైనది.

గీ. తుచ్ఛమగు బ్రతుకుకొఱకు నిర్దోషియింక
కనులు దెరువనికందును కాననమున
పారవైచిన పాపి కీపాటిశిక్ష
చాలదెప్పుడు చాలదు చాలదయ్య.

రుద్రయ్య—పారవైచ బడినప్పుడేల యీ పాడు రుద్రయ్య చావరాదు? ఈ ఘటనయంతయు కలుగకుండ బోవునే. (తండ్రిపాదములపయిబడి దుఃఖించుచుండును.)

ప్రోలరాజు—(కుమారుని శిరము దువ్వుచు) కుమార శరీర స్పర్శవలన నా కీబాధ యెంతమాత్రము కానుపించుట లేదు. ఈ పదిగూఱు సంవత్సరము లీ కొడుకుతో కలిసి యున్న నెంతటి సంతస మబ్బియుండెడిదో! మొలక దీకి కొని దిపవానికి పండు నిచి యెట్లు దొరకును. కుమారా! రుద్రదేవా! ఆంధ్ర రాజ్యేందిర నీ యవలంబనమునకై వేఁచి యున్నది.

రుద్రయ—(శోక గద్గద స్వరమున) తండ్రీ! ఈ పాపి అందులకు దగఁడు.

గీ. తండ్రి కష్టించి చెమ్మట గార్చికూడ
బెట్టద్రవ్యంబు పుత్రుండు ప్రేమతోండు
పితృరుధిరదిగ్ధమైన యీ క్షితినైవంపు
కనులతోఁ గాంచి బ్రతుకంగ గలఁడు తండ్రీ!

వీరగతి నందిన పితృరుధిరదిగ్ధమైన రాజ్యమునకు యది యొకతెన్ను. చేజేత జేసికొనిన దీనికి ప్రాయశ్చిత్త మెక్కడిది? ఆర్షధర్మయగు ప్రాయోపవేశమున నే దేహ శుద్ధి యొనర్చెద. రాజ్యము తగినవాని కప్ప జెప్పుడు.

ప్రోలరాజు—తండ్రీ! రుద్రదేవా! కాకతీయాన్వవాయమునకు ఏవేకదా సంతతివి. ప్రమాదమున ప్రశ్నత్కమని వాదింపఁబూనకు. సంతతి లేని వంశపు పితృగతులు లేవని దుఃఖమునఁ బ్రుంగెదరు. అందురాజుగాన సర్వవర్ణముల ధర్మములను కాపాడఁదగిన రాజు శము. అట్టిదానిని యత్నముచే రక్షింపవలయును. కులక్షయము వలన ధర్మక్షయమగు గాన కుమారా! ఇదే నీకు నాంధ్ర రాజ్య రాజ్యాభిషేకము సేయుచున్నాను. సుస్థిరుడవై కూరుచుండుము.

రుద్రయ్య—అయ్యో! దైవమా! ఎక్కడి స్థిరత్వము.

వ్యోజదండనాథుఁడు—ఏమి ప్రోలరాజు వాక్యము.

మఱియొక యోధ—(ఆశ్చర్యముతో) ఈ ఘటన అనురాగ పరీక్షవలె నున్నది. ఇంతటి ఘోరపరీక్షయందు పోరిల సార్వభౌముఁడు గెలిచినాఁడు.

రుద్రయ్య—(ప్రబలదుఃఖముతో) ఛీ! ఛీ!! ఇది యనురాగ పరీక్షయా?

గీ. తండ్రిహృదయానురాగ మింతటిది యనుచు
గుండెవ్రచ్చి పరీక్షించు కూళగలఁడె!
కాకతి క్షీరవారధి కాలకూట
నిభుఁడనై జన్మమందిన నేనుదక్క.
హా! తండ్రీ! తండ్రీ!! (మూర్ఛపోవును)

ప్రోలరాజు—దండనాథా! కుమారుని గూర్చుండ బెట్టుము. రాజాలంకారమున కిదియే యదను. నతఁడు స్వీకరించుట కష్టము.

[వ్యోజదండనాథుఁడు రుద్రయ్యను కూర్చుండ బెట్టును. ప్రోలరాజు తన కిరీటము రుద్రదేవుని శిరమున బెట్టి చేతికి ముద్రాంగుళీయకము నుంచును]

ప్రోలరాజు—[ఆయాసము నభినయించుచు] లింగయ్యా! అభిషేకోదకము శివ నిర్మాల్యములును తెమ్ము.

[సిద్ధలింగయ్య అభిషేకోదకము దెచ్చును]

ప్రోలరాజు—నా కొడుకును త్రివేణి సంగమ పవిత్రోదకముచే నభిషిక్తుంజేయ నోచుకొననైతిని గదా!

వ్యోజదండ నాథుండు—మహారాజా! ఆ విచారమక్కఱలేదు.

తే॥ గీ॥ తావకీ యానురాగ వాత్సల్య రసము
　　హృదయ కుమార వినిర్గత రుధిర రసము
　　భగవదభిషిక్త పావన వారి రసము
　　మూడుంగూడి త్రివేణిని బోలకున్నె?

రుద్రయ్య—(తెలివొంది) అయ్యయో! ఎట్టి—ఘ—ట—న—? ఈ—.

ప్రోలరాజు—(అభిషేకముజేసి) కుమారా! నా ప్రాణములు నిలుచునటులలేదు. రాజనీతియందలి యమూల్యమణుల వంటివి, రాజగువాం డెప్పుడును విస్మరింపందగిని వి నొకటిరెండుమాటలం జెప్పెద వినుము.

తే॥ గీ॥ పుత్రధర్మంబు కతమున ప్రోలరాజు
　　స్వర్గలోకాన శాశ్వత సరణినుండు
　　దీని నెప్పుడు మదిలోన పూనియుంటి
　　వేని నీతండ్రి యెపుడు జీవించియుండు

తే॥ గీ॥ తండ్రిం జంపితి ననుచింత దవిలిరాజ్య
　　భారము నుపేక్షతో జూడ వలదుసుమ్మి
　　పృథ్వీభారంబు నీవయి బెడితికొడుక!
　　నిష్కలంకంబుగా దీని నేలవలయు.

లేకున్న దేవుని చెంత నీ వుత్తరవాదివై యుండవలసివచ్చును.

సీ॥ ఆంధ్రప్రజలపైన నభిమాన ముంచుము
　　పరజనమ్ముపైన కెగ్గు బొఱయదీకు
　　ఆంధ్రరాజ్యంబును నభివృద్ధి గావింపు
　　మన్యరాజ్యంబుల నణపంబోకు
　　ఆంధ్రగౌరమును నరసి కాపాడుము
　　పరగురుత్వముచెడ బలిపంజనకు
　　ఆంధ్రవిద్వాంసుల నాదరణము నేయు
　　మితరపండితుల గర్హింప కెపుడు
　　తనదు యభివృద్ధికోస మితరులనొంచు
　　పాతకమునకు ప్రతిమయె ప్పాప మిలను
　　లేదనుచునెంచి రాజ్యంబు బ్రోదిసేసి
　　కాకతికులంపు కీర్తికి గరిమదెమ్ము.

ధర్మ మేవజయతి! ఇకనన్ను గోటలోనికి గొంపొవుడు.

అందరు—హా! హా!! ఎట్టి ఘటనము.

(నిష్క్రమింతురు)

# సీత—అశోకవనము

పంగనామముల రామచంద్రరావు

(మూడవ సంచిక తరువాయి.)

అని యనుమాన కారణ మహాసహిమంబున మోడువెట్టునె
మ్మనము చిగిర్చుచుండ హనుమంతుఁడు వారిసమీప భూమికిం
జని సడిలేక నిశ్శ్వసన సాంద్రతఁ గొంత సడల్చి యోలముం
గాన నవమల్లికాసురభీ కోమల కుంజ గుహాంతరంబునన్.

అమితోగ్రంబగు సింగపుం గదుపు మధ్యన్ లేడిమాడ్కిన్ వైదే
శమహాఘోరనికృష్ట నాగరకతా చంచత్పిశాచీకదం
బములో భారతమాతవోలె భయకంపంబెత్తి ఘోషించుచుం
డె మహాసాధ్వి కఠోరరాక్షస వధూటీ మండలాసీనయై.

దానవీపరుష వాగ్దంధహ్యమానయై
శ్రీరామ ఘనకృపాసార మెంచు
అసురాంగనాపరిహాస చంద్రికలొప్ప
రఘువర ప్రావృడభ్రముఁదలంచు
రావణేశ్వరకథల్ రాక్షసస్త్రీలెంచ
శ్రవణపుటంబు హస్తమునమూయు
భర్తృప్రతాప దుర్వర్ణనంబలు విన
నోడుచుమనసులో నుదిలకొనును

సాంద్రవిషమార్తిలోన నిశ్చలితయైన
ధ్యానయోగిని మాడ్కి సీతాలతాంగి
రామ—శ్రీరామ—రఘురామ రామయనుచు
రామ జపమొంచుచుండె ధైర్యంబువిడక.

(సశేషము)



సహస్రస్తంభ దేవాలయము. హనుమకొండ.



చంద్రికా ప్రెస్.



విఠ్ఠలస్వామి దేవాలయపు రథము.



పంపాపతి దేవాలయము.

# జైనరామాయణము

సురవరము ప్రతాప రెడ్డి

ప్రపంచమంతయు వాల్మీకి రామాయణము నెఱుగును. కాని శ్రీరాములవారి కథను జైనులలో చాల భిన్నముగా జెప్పుకొనుచున్నారు. హిందువులీ విషయమును గమనించలేదు. ఈ జైనరామాయణము హేమచంద్రాచార్యులు రచించిన త్రిషష్టి శ్లోక పురుష చరిత్రము గ్రంథములో నొక ఘట్టమైయున్నది. ఇప్పుడా కథను వివరింతును. వాల్మీకిరామాయణమునకును దీనికిని భేదములున్న భాగములే వివరింతును. తక్కినవి సామ్యములే యని గ్రహింప వలయును.

## ౧ వ అధ్యాయము

### రాక్షస వానరోత్పత్తి

భరత ఖండమందలి వినీత పట్టణమున-ఇక్ష్వాకు వంశీయుడైన సగర చక్రవర్తి రాజ్యము సేయుచుండెను. అతడొక నాడు వేటకరిగి బాట తప్పి యలసి యుండెను. అప్పుడరణ్యమందతడొక సుందరిని జూచెను. ఇరువురు మోహించిరి. అప్పుడొకడు వచ్చి యా సగరునితో నిట్లు చెప్పెను: "అయ్యా, విద్యాధరులలో నొకరైన సులోచనయను రాజు గగనవల్లభ పట్టణము నేలుచుండెను. అతనికి సహస్రనేత్రుడను కుమారుడును, సుకేశయను కూతురును కలరు. రదనపురాధీశ్వరుడైన పూర్ణమేఘుడను వాడు సుకేశను గోరియు నభీష్టము నెఱవేరనందున సులోచనుని జంపి రాజ్యమపహరించెను. ఇప్పుడు సహస్ర నేత్రుడును తన చెల్లెలగు సుకేశయు నీ యరణ్యమున దాగియున్నారు. తాము సుకేశను పరిగ్రహింప నర్హులు"

అట్టి ప్రకారము సగరుడు సుకేశను పెండ్లియాడి సైన్యయుక్తుడై పూర్ణమేఘుని [illegible] తన మఱ[illegible]డి రదనపురము నేల నియోగించెను. కొంతకాలమునకీ బావమఱదులు తీర్థయాత్ర చేయుచుండ పూర్ణమేఘుడు వీరికొమరు కాగా సహస్ర నేత్రుడతని జంపెను. పూర్ణమేఘుని కొడుకు ఘనవాహనుడు. భీముడను రాక్షస రాజతని జూచి యిట్లు పలికెను "అయ్యా, నీవు నాకు పూర్వ జన్మమున పుత్రుడవు. నా కాలము సమీపించినది. కావున నీకు నా నవ వజ్రములహారము నిచ్చితిని. నీవు రాక్షస ద్వీపమందలి నా లంకా పట్టణమునకు పాతాళ లంకకు రాజవుగమ్ము" అని యతనికి పట్టము కట్టెను. ఇతనికి మహా రాక్షసుడు, అతనికి దేవరాక్షసుడు, అతనికి కీర్తిధవళుడును, అతనికి తతిత్కేశుడును బుట్టిరి.

ఇక వానరోత్పత్తి యెట్లనగా:—రత్నపురమును దొల్లి పుష్పోత్తరుడను విద్యాధరుడు రాజ్యము చేయుచుండెను. అతనికి పద్మోత్తరుడను కుమారుడును పద్మయను కూతురును గలిగిరి. శ్రీకంఠుడను రాజు పద్మను వివాహమాడదలచి తన విమానముపై నెత్తికొని పోయెను. పుష్పోత్తరుడు కోపించి శ్రీకంఠుని జంప నుద్యుక్తుడయ్యెను. అప్పుడు పైన చెప్పబడిన కీర్తిధవళుడను రాక్షసుడు వారికిసంధి సమకూర్చెను. కొంతకాలమునకు శ్రీకంఠుడు వానర ద్వీపమునకు రాజయ్యెను. ఇతనికి వజ్రకంఠుడు, అతనికి దధరథుడు పుట్టిరి.

పైచెప్పిన రాక్షసరాజగు తతిత్కేశుడొకనాడు వానర ద్వీపమందు భార్యాసహితుడై యుద్యానవిహారము చేయుచుండ నపుడు భార్యాముఖము నొక వానరము బట్టికొట్ట భర్త కోపించి వానిని బంపెను. పిమ్మట పశ్చాత్తప్తుడై వైరాగ్యమును బొంది తన కొ

మరుడగు సుకేశునికి బట్టము గట్టెను. అచ్చట వానర
ద్వీపరాజగు దధిరథునకు కిష్కింధుడు పుట్టెను. ఇతనిని
స్వయంవరమందు మందరమాలియను రాజుహితను
వరింపగా అశనివేగుడను రాజు కోపోద్దీపితుడై వానర
ద్వీపమును జయించి యచటినుండి కిష్కింధుని పార
దోలి రాక్షస ద్వీపముపై తనసైన్యమును నడుపగా
సుకేశుడును పాఱిపోయెను. ఈసుకేశుడును, కిష్కిం
ధుడు పాతాళలంకలోను దాగుకొనిరి. అచ్చట కేసు
శునికి మాలి, సుమాలి, మాల్యవంతులను ముగ్గురు
కుమారులు పుట్టిరి. మాలి పెద్దవాడైన పిమ్మట తన
తండ్రి కపచారము చేసిన రాజును, నతని రాజ్యమును
జయింపగోరి బయలుదేరెను. కాని యతడు యుద్ధ
మందు మరణించెను. అతని తమ్ముడగు సుమాలికేకసి
యనుదాని బెండ్లియాడి దానివలన రత్నశ్రవసుడు,
భానుకర్ణుడు, విభీషణుడను కుమారులను, చంద్రన్న
యను కూతును కనెను. వీరి పూర్వీకు డిచ్చిన నవరత్న
ముల హారములు సుమాలి దగ్గఱనుండెను. దానినెవ్వ
రును ఎత్తజాలకుండిరి. దానిని వేయిసర్పములు గావ
లిగాచి యుండెను. అట్టి వజ్రహారమును రత్నశ్రవసు
డవలీలగా ధరించెను. అనవరత్నములందీ బాలుని
ముఖ ప్రతిబింబము జూచి తండ్రి సంతసించి యతనికి
"దశముఖ" అనుబిరుదమిచ్చెను. భానుకర్ణునికి కుంభ
కర్ణుడని పేరునిచ్చెను. మఱియు చంద్రనఖకు శూర్ప
నఖయని పేరునిచ్చెను.

## ౩ వ అధ్యాయము

### రావణుని దిగ్విజయము

దశముఖుడు పెద్దవాడై తపస్సుచేసి యనేకశ
క్తుల సంపాదించి మండోదరి యనుదాని పెండ్లియాడి
ఇంద్రజిత్తను కొడుకును బడసెను. పిమ్మట లంకాపు
రమును సాధించి దాని కధీశుడయ్యెను. వానరరాజైన
కిష్కింధుని కొడుకులగు ఆదిత్యరాజస్సు, ఋక్షరాజస్సు
అనువారు నరకములో బడినారనివిని యమురాజును
పారదోలి వారిని వానర ద్వీపమందు రాజులనుగా జే
సెను. ఆదిత్య రాజస్సునకు ఇందుమతి వలన వాలి,
సుగ్రీవులు పుట్టిరి. ఋక్షరాజస్సునకు నలుడు నీలుడు
పుట్టిరి. వాలి కిష్కింధ నేలెను. దశముఖుడు
లంక నేలుచుండెను. దశముఖుడు వాలి పరాక్రమ
వినినవాడై పూర్వక యతనిపై యుద్ధమునకు బయ
దేరి యోడిపోయి బంధింపబడెను. పిమ్మట వాలి యత
నిని విడిచిపెట్టి మేరు పర్వతముపై తపస్సు చేయబో
యెను. సుగ్రీవుడు తన కూతురగు సుప్రభను దశముఖు
నకిచ్చి పెండ్లిచేసెను. దశముఖుడంతఃపురముతో [illegible]
డక రత్నావళియను నందకర్త నిత్యాలోకమున [illegible]
దనివిని దాని తెచ్చుకొనదలచి పోవుచు మార్గము
మందు వాలినిజూచి మేరువుక్రింద చేయిపెట్టి పర్వత
ముతో గూడ నతనిని గూల్పజూచెను. కాని వాలి
బొటన వ్రేలితో పర్వతము నణచగా క్రిందనుండి
న దశముఖుడు పీడితుడై యనేక సంవత్సరములు రో
దనము చేసెను. అందుచేత నితనికి రావణుడను పేరు
వచ్చెను. రావణుడట్టికేలకు ముక్తినొంది మరుత్తు
రాజు యజ్ఞము చేయుచుండ జీవహింస చేయువా
లను కుపితుడై యాయజ్ఞముల ధ్వంసము చేసెను. పిమ్మట
నలకూబరుడను రాజు ప్రజాపీడకుడని విని వానిని శిక్షిం
ప రావణుడు బయలుదేరెను. కాని నలకూబరుని భార్య
యగు ఉపరంభ తనభర్తను సన్మార్గమునకు త్రిప్పవల
వేడుకొనగా రావణుడు క్షమించి పోయెను. పిమ్మట
రథనూపుర రాజగు ఇంద్రుని జయించెను. ఇంద్రుడిట్లు
పరాజితుడగుటకు గారణ మేమి యని [illegible]
చుండ నొకముని యిట్లు చెప్పెను. "ఏవు [illegible]
భార్యయగు అహల్యను నవమానించి యుంటివిగా
నికిప్పుడీ యవమానము కలిగినది" ఇట్లు దిగ్విజయో
త్సుడై రావణుడు దన రాజధానికరుగుచుండ [illegible]
వీర్యుడను ముని యతనితో నిట్లనెను. "ఓయీ, [illegible]
పరదారాసక్తుడ వగుటంజేసి పవిత్రలో [illegible]
ధాంశసంభూతుడను వానిభార్యను [illegible]
దాని వలనవిను [illegible] కుమా[illegible]
రావణుడు కటకటపడి తన్ను తానై కోరని స్త్రీ [illegible]
పొందనని రావణుడు శపథము చేసికొని పోయెను.

### 3 వ ప్రకరణము

#### హనుమంతుని జన్మకథ

మహేంద్రపురమునకు మహేంద్రుడను రాజుండెను. అతనికి హృదయసుందరి వలన అంజనాసుందరి యను కూతు రుద్భవించెను. అనేక రాజులీ బిడ్డను వివాహమాడ గోరిరి. ఆయా ఇద్దఱు మాత్రము మహేంద్రుని కిష్టులైరి. అందొకడు విద్యుత్ప్రభయను నతడు. అతడు గుణవంతుడు రూపవంతుడు కాని అల్పాయుష్మంతుడని విశదమయ్యెను. రెండవ వాడు పవనాంజయుడు. అతడు విద్యలలో దక్షుడు కాని వాడైనను దీర్ఘాయుష్మంతుడగుటచే అంజనాసుందరి నాతనికే వివాహము నిశ్చయించెను. బంధువులందఱు వచ్చేసిరి. వివాహదినసమున అంజనాదేవి చెలికత్తె యామెతో నట్లనెను. "అమ్మా, మన రాజు ఎంత పొరపాటొనరించినాడు. ఉత్తమ నాయకుని విడలి సాధారణ నాయకుని ఏ కంట గట్టెనే. అమృత మొక దినమైన త్రాగినమేలు. యావజ్జీవము విషము త్రాగుట పాపముసే" ఈ మాటలు విని అంజనాసుందరి యేమియు ననలేదు. ఈ సంభాషణము పవనాంజయుని చెవినిబడెను. పెండ్లియైన వెంటనే భార్యనొక గదియందుంచి యామెను బలుకరింపక పోయెను. అంత కొంత కాలమునకు రావణుడు వరుణునితో యుద్ధము చేయువాడై పవనాంజయుని సాయముకోరెను. పవనాంజయుడు ప్రయాణమై పోవుచు మార్గమందొక పెంటియుంచ తనవిభుని ప్రవాసమునకు వగచుచు విరహతాప మొందుట గాంచి తన భార్య జ్ఞాపకమునకు వచ్చి వెంటనే తన నగరుచేరి అంజనా సుందరితో భోగించెను. పిమ్మట యదే రాత్రి తానుమరలి పోవునప్పుడు తన ముద్రాంగుళీయకమును నామెకు గుఱుతుగానిచ్చి పోయెను. క్రమేణ ఆమె గర్భవతియగుట అత్తమామలు చూచి ఆశ్చర్యభ్రాంతులై యామె వ్యభిచరించెనని భావించి యెన్ని చెప్పినను వినక యామెను వెడల నడిచిరి. ఆమె హనుపురమను పట్టణమందు నివసించుచుండ ఆమెకు కుమారు డుద్భవించెను. అతనికి హనుమంతుడని జన్మస్థానపు పేరునుబెట్టెను. భర్త యుద్ధము వెండి మరలివచ్చి భార్యవార్త విని చింతించి యామెను వెదకి మరల తనయింటికి పిలిచికొని వచ్చెను. హనుమంతుడు పెద్దవాడై తన తండ్రివలెనే రావణునికి యుద్ధములందు జాల సహాయముచేసెను. రావణుడు ప్రీతుడై సత్యవతియను తన కూతురును అతని కిచ్చెను. శూర్పణఖ కూడ తనకూతురగు అనంతకుసుమ నతని కిచ్చెను. ఈ యిద్దఱ భార్యలతో హనుమంతుడు తన దేశమునకు మరలివచ్చినప్పుడు సుగ్రీవుడును, నలుడును తమ మిత్రుడగు రావణునికి సాయపడినందున హనుమంతునికి తమ కూతుండ్రగు పద్మరాగను, హరిమాలిని వీరినిచ్చి పెండ్లిచేసిరి.

### 4 వ ప్రకరణము

#### శ్రీరాముని జననము

హిమచూడాదేవి భర్తయు, వజ్రబాహు పురందరుల తండ్రియునగు విజయుడు అయోధ్యనేలుచుండెను. వజ్రబాహుకు కీర్తిధరుడు, అతనికి కోసల, అతనికి హిరణ్యగర్భుడును బుట్టిరి. అతని తర్వాత 28 గురు రాజులు రాజ్యము చేసిరి. కడపటి వాడగు అనారణ్యుడు రఘురాయని కుమారుడు. అతనికి దశరథుడు పుట్టెను. ఇక్కాలమందొక నాడు రావణుడు వినోదార్థముగా నారదునితో నిట్లనెను. "ఓయి నారదా, నేనెప్పుడు మృతింతునో చెప్పగలవా" నారదుడు గుణించి యిట్లు చెప్పెను. "దశరథుని కొడుకును జనకుని కూతురును నీకు మరణమును ప్రసాదింతురు" రావణు డులికిపడెను. కాని విభీషణుడతని భయము బోనార్చి వారికి సంతానము కలుగక పూర్వము వారిరువురిని సమయింతును జూడుమని చెప్పి బయలుదేరెను. నారదు డంతకుమున్నే యీ యిద్దఱికి వార్త నంపెను. దశరథుడును, జనకుడును భీతులై తమ సింహాసనముల పై తమ విగ్రహములనునిచి యిద్దఱును గలిసి యెటకో బోయిరి. విభీషణుడు వారి విగ్రహముల నరుల గొట్టి తృప్తినొందిపోయెను. దశరథుడు తన నలుగురు భార్యలతో మగధ దేశము చేరెను. ఈ నలుగురి పేర్లు అపరాజిత, సుమిత్ర, కైకేయి, సుప్రభ. అందు కైకేయి యను నామె భర్తతో ప్రవాసమందొక యుద్ధ

మందు సాయపడుట జేసి భర్త ప్రీతుడై రెండు వరములు కోరుకొనుమనెను. కైకేయి కావలయు వేళ కోరుకొందునని చెప్పెను. పిమ్మట దశరథునికి నల్గురు కుమారులు పుట్టిరి. అపరజిత్తునకు పద్ముడు పుట్టెను. ఇతడే రాముడు, సుమిత్రకు లక్ష్మణుడు పుట్టెను. ఇతడు నీల వర్ణుడు. విష్ణ్వవతారుడు. కౌన నారాయణయను పేరుపొందెను. ఇతడే లక్ష్మణుడు. కైకేయికి భరతుడును. సుప్రభకు శత్రుఘ్నుడును.బుట్టిరి. ఇకొ్కనప్పుడు జనకునికి వైదేహవలన సీతయను కూతురుద్భవించెను. ఒక నాడు బర్బర దేశమందలి మయూరమాలకు-రాజైన అతరంగము యను మ్లేచ్ఛుడు మిథిలపై దాడివచ్చెను. జనకుడు దశరథుని సాయముకోర రాముడు పోయి యతని నోడించెను. జనకుడు ప్రీతుడై సీత నిత్తునని మాటయిచ్చెను. తంటాలనారదుడు ఒకనాడు సీతను కూడవచ్చెను. నారదముని గడ్డము జడలు మున్నగు భయంకర చిహ్నముల జూచి సీత బెదరి యింటిలో దాగుకొనగా మన కలహ భోజనుడు సరదు దాటికనని భామండల యను రాజును సీతను బలాత్కారముగ నెత్తికొని పొమ్మని పురికొల్పెను. అతడట్లు చేయక తన దగ్గఱి ధనుస్సును జనకునకు బంపి దానిని రాముడెత్తి బాణము సంధింప గలిగనేని పెండ్లిచేయుమని చెప్పెను. రాముడా ధనుష్సు నవలీలగా నెత్తెను. సీతను పెండ్లియాడెను. లక్ష్మణుడు విద్యాధరులలోని ౧౮ గురి స్త్రీలను పెండ్లియాడెను. దశరథుడు వృద్ధుడై తన రామునికి రాజ్యమప్పగింప గోర కైకేయి తన వరముల రీతి రాముని నడవికంపెను. సీతారామలక్ష్మణులు అడవిలో తిరిగి తిరిగి చిత్రకూటమును జేరిరి.

## ౫ వ ప్రకరణము

### సీతాపహరణము

అచ్చటి నుండి విజయపురమును జేరిరి. అచ్చట నొక సుందరి లక్ష్మణుని వరించియాతని మెప్పింపలేక యురిపోసికొన దొడగెను. అప్పుడు రాముడు వారిరువురికి పెండ్లిజేసెను. క్షేమాంజలి యను రాజ్యములో జితపద్మయను రాజన్నియను లక్ష్మణుడు పెండ్లియాడెను. పిమ్మట దండకారణ్యమును ప్రవేశించిరి. అచ్చట శూర్పణఖ కుమారుడు శంబూకుడు తపస్సు చేయుచుండ లక్ష్మణుడు ‹‹చంద్రహాస››ముతో నతని జంపెను. శూర్పనఖ శ్రీరామునితో మొఱపెట్టుకొనబోయి యతని మోహించెను. మోహము విఫలమయ్యెను. ఆమె భర్తయగు ఖరుడువచ్చి రామునిచే చచ్చెను. రావణుడు తనచెల్లలిని తృప్తిపఱపదలచి లక్ష్మణుడు లేని సమయములో దూరమునుండి లక్ష్మణుని వలెనే యార్తనాదము చేసెను. సీత రాముని లక్ష్మణుని సహాయార్థ మంపెను. అంతరావణుడు సీతనెత్తుకొని విమానములో వెడలిపోయెను.

## ౬ వ ప్రకరణము

### సీతాన్వేషణము

రాముడు వెదకి వెదకి విఫలుడయ్యెను. అంతనొక సందర్భము జరిగెను. సహజజాతి అనువాడు సుగ్రీవుని భార్యయగు తారను ప్రేమించి మాయచే సుగ్రీవుని వేషముతో నామతో క్రీడించెను. నిజసుగ్రీవుడు వచ్చి చూచి మాయా సుగ్రీవునితో తగవులాడి యోడిపోయి రాముని యాశ్రయింప నతడు యథార్థము నెఱిగి దొంగమగని జంపి సుగ్రీవునికి రాజ్యమును తారను నిప్పించెను. పిమ్మట హనుమంతుడు లంకలో సీతను జూచి రావణునికిరీటములన్ని లంకలో గడబిడ జేసి తిరిగివచ్చెను.

## ౭ వ ప్రకరణము

### యుద్ధకాండము

రావణుడు ఇంద్రజిన్నాగముతో రామసైన్యము గట్టెను. లక్ష్మణుడు తనగరుడవాహనమున వీని నాగముల నాశనము చేసెను. రావణుడు లక్ష్మణునిపై శక్త్యాయుధమును ప్రయోగింప అతడు చచ్చినట్లు క్రిందబడెను. భామండలుడు ‹‹ద్రోణఘను›› నుండి అమృతము తెచ్చి లక్ష్మణుని బాగుచేసెను. లక్ష్మణుడు అప్పుడు గరుడారూఢుడై తన చక్రముతో రావణుని తల దునిమెను.

## ౮ వ ప్రకరణము

విభీషణుడు లంకకు రాజయ్యెను. కుంభకర్ణుడును, ఇంద్రజిత్తును చిన్న చిన్న రాజ్యములకు రాజులైరి. రాముడు పుష్పకవిమానములో అయోధ్య చేరెను. రాముడు పట్టాభిషిక్తుడయ్యెను. సీతతోడను, ప్రభావతి, రతినిభ, శ్రీదమ యను తక్కిన ముగ్గురు భార్యలతోడను శ్రీరాములు సుఖముగా నుండెను. లక్ష్మణుడు తన యెనమండుగురు భార్యలగు విశల్య, రూపావతి, వనమాల, కల్యాణమాలిక, రత్నమాలిక, జితపద్మ, భయవతి, మనోరమ యనువారితోడను, వారి ౨౫౦ పుత్రులతోడను, పైగా తన ౧౬ వేల యొక్క డుభార్యలతోడను సుఖముగా నుండెను.

### లఘువిమర్శ

ఇది జైన రామాయణ సారము. స్థలసంకోచముచే ఇంకను కొన్ని విషయములు ప్రక్షిప్తము లయ్యెను. దీనివలన తెలిసికొన దగిన విషయములు కొన్ని కలవు. మనము జైనగ్రంధముల నవలోకనచేయుట అవసరమయ్యెడి: మనమతమునకు విరుద్ధములైన బౌద్ధమతమును, జైనమతమును, చార్వాకలోకాయతకాలవాముల సిద్ధాంతములను మనము పాషండమతముల పట్టీలో చేర్చి నాస్తికులనియు, వేదవిరుద్ధులు వేదబాహ్యులు వీరని నిందించియు నుపేక్షా భావమును జూపినారము. అట్టికమీద చేయుట అహంభావ చిహ్నమగును.

ఈకథ వాల్మీకి రామాయణమునకు చాలభిన్నమైయున్నది. రాక్షసులకు వానరులకు సంబంధముండెనని తెలియుచున్నది. సీత అయోనిజ కాదు. రాముడేకపత్నీవ్రతుడు కాడు. హనుమంతుడు నిత్యబ్రహ్మచారి కాడు. రావణుడొక్క స్త్రీలోలత్వమందు తప్ప తక్కిన విషయములందాదర్శప్రాయుడే. రాజులకు స్త్రీసంగతి నాటికిని నేటికిని మిక్కుటము. కాని రావణుడెన్ని చేసినను సీతాపచారకుడు కాకుండిన నిప్పటి యనేక విటరాజులవలె, రాజవిటులవలె నిందాస్పదుడు కాకుండెడివాడు. అత డహింసాప్రియుడు. యజ్ఞములందు హింసయుంటచే యజ్ఞధ్వంసి యయ్యెను. కాని వాల్మీకులవారు వేదమతద్వేషియనియు, ముని హింసకుడనియు, తన కలమునొక్క మసిచే రావణుని ముఖమును నల్లగ చిత్రించెను. లక్ష్మణునికి ఎనిమండుగురు పట్టపు భార్యలట. ౧౬ వేలపై పెండ్లాలట! ఈ గుంపునంతయు భాగవతమందు శ్రీకృష్ణులవారి కంటగట్టినారు. ఈ భేద మేప్రాణకునివలన జరిగెనో దురూహ్యము. ఇచ్చట లక్ష్మణుడే గరుడవాహనుడు. చక్రి. రావణాంతకుడు. మఱియు నారాయణాపరావతారుడు. ఇందు మారీచి లేడు. బంగారుజింక అసలేలేదు. ఇందలి వంశావళులు వాల్మీకులవారి వంశావళులతో భేదించుచున్నవి. శంబుకుడు శూర్పణఖ పుత్రుడనియు నతనిని లక్ష్మణుడు వధించెననియు నిందున్నది. శంబుకుడను శూద్రతపసిని రాముడు ఖండించెనని యుత్తర రామాయణము నను్నది. శూద్రుల తపస్సు అంతయోర్వరానిదై యుండెనే! "దశముఖ" యను పదమున కుత్పత్తి హేతువిందు చాల సమంజసముగా గనబడుచున్నది. జైన రామాయణమందు కుంభకర్ణుడును, ఇంద్రజిత్తు మరణించలేదు. మఱియు సంజీవి పర్వతమును హనుమంతుడు తెచ్చెనన్నదిచట కల్ల. భామండలుడు (ఇతడెవడో?) అమృతమును దెచ్చెనని యున్నది. రావణుడు తపస్సు మహేశ్వరునిగూర్చి చేసెననియు, చేతుల దురదవదలనట్లు కైలాసముపై బొటనవ్రేలితో శివుడే యదిమెననియు మనము వినిన సంగతి. ఇది వాలిచే నడచబడెనని యున్నది. మఱియు నీ జైన రామాయణములో నహింసా విషయమును, రావణుని యజ్ఞధ్వంసకత్వమును తెలుపుట జైన సిద్ధాంత ప్రచారమునకై చేసియుండును. మహేశ్వరునికి మారుగా నిచ్చట ప్రతి ఘట్టమందు జిననాథుని పేర్కొనియున్నారు. ఇదియు మత ప్రచారార్థమే యుండెనోపు. ఈ రామాయణములో విశ్వసనీయ విషయము లనేకములున్నవి. వాల్మీకి రామాయణమందు రాముని నాదర్శపురుషునిగా జేయుటకై యేకపత్నీవ్రతునిగా జేసియుందురు. మఱియు రావణుని సర్వదుర్మార్గునిగా జేయుటకై యతని గుణపోషణమందు చాల పక్షపాతము చేసియుందురు. ఇది హిందూ మత సాంప్రదాయమే. కాని యిట్లు చేయుట చరిత్రకు నష్టము. విద్వద్వరేణ్యులీ జైన రామాయణము నింకను విమర్శించి యదార్థమును నిర్ణయింతురు గాక.

# సోదరీ సందేశము

శేషాద్రిరమణకవులు

గీ. వేదయుగమున శ్రుతులఁ గల్పించియంత రస్థమగు భావములనెల్ల రాజసభల
జాటియశముఁ గన్న స్త్రీజాతి నేఁడు వెనుకఁబడెనయ్యొ విద్యావివేకములను.

గీ. కార్యదీక్షయు విజ్ఞాన కౌశలంబు నాత్మ విశ్వాసమును స్వతంత్రాభిరతియు
నాతికెన్నండు తొలఁగెనో నాటనుండి పారతంత్ర్యంబులో గ్రుంగె భారతంబు.

గీ. యముని గెల్చిన సావిత్రి ననుకరించి పేరుగాంచిన కాంతలున్నారుగాని
సత్యవంతుని తోఁబోల్ప సాధ్యమైన పురుషజాతికిఁ గటకటా కఱవు గలిగె.

గీ. మగని చితి పుష్పశయ్యగా మది దలంచి ప్రేంపుమై దూఁకనుఱుకు సాధ్వీపవిత్ర
సాహసాణువై పూరుషజాతికున్న సస్వతంత్రత గలుగునే హైందవులకు.

గీ. మతము, వేషము, భాషయు మాఱుపడినఁ బాపకాలంబునను; బతివ్రతంబు
సంతరింపని యీ మాతృజాతికతన పురుషజాతికి రాకున్నె పూర్వమహిమ.

గీ. భోగపాత్రంబులు మనంబునఁ దలంచు యాఁడువారల నరికట్టు నంతవఱకు
అల్పసత్త్వులు పారతంత్రాభిరతులు విగత తేజులు పూరుషు లగుట నిజము.

గీ. నడలి నీరైన పాండవ శౌర్యపటిమ ద్రౌపది పరాక్రమములనే ధన్యయయ్యె
స్వల్పసంతుష్ట పూరుషజాతి పెంపు శీలవతులగు కాంతలచేతఁ గలదు.

గీ. సోదరీ! మాతృదేశనిస్తుల విభూతి స్నేహపరిపూతమైన నీ చేతగలదు
అతులవిజ్ఞానమార్జించి యాత్మసదృశ మహిత తేజులగనుమ నమస్కరింతు.



# సహకారసంఘోద్యమము

కే. రాములు

౨

ఈ పత్రిక రెండవ సంచిక యందు సహకార సంఘోద్యమమును గురించియు, శాసన రూపము దాల్చిన పిదప ద్వాదశవర్ష కాలమున నీయుద్యమ మెట్లు విజృంభించినదియు గొంతవరకు చర్చించి యుంటిని. నిజాం రాష్ట్రమందలి ప్రస్తుత సహకార సంఘముల సంఖ్య, మొత్తము భాగస్థులు, మూల ధనము, గూడ సూచనగ జూపబడి యుండెను. ఈసంచిక యందా విషయములను విపులముగా చర్చించ బ్రయత్నించెదను.

ఈయారాష్ట్రమన నేమి, భరత ఖండమంతయు నార్థికముగ నెంతయో వెనుకబడియున్న విషయము మన మందరు నెఱిగినదే. దీనికి రెండు ప్రబల కారణములు గలవు. ఒకటి పరిశ్రమలు నశించుట, రెండవది కర్షక వృత్తి తృప్తికరముగ సాగకుండుట—వృత్తులబట్టి భారతీయులు, కర్షకులు, వణిజులు, ఉద్యోగులు, యాచకులు—అను నాలుగు పెద్ద తరగతులుగ విభజింపబడుదురు. ప్రస్తుత మీ చాతుర్వృత్తులవారు ఆర్థిక కష్టములకు సమానముగ గురియగు చున్నారనుట వివాదము లేని యంశము.

మున్నొకప్పుడు నల్దిశల కగ్రభాగి, విదేశీయుల మెప్పును పొందజేసిన మన పరిశ్రమలు నేడు నశించుట వలన కార్షికవృత్తి దినదినాభివృద్ధి నొందుచున్నది. పారిశ్రామిక దృష్టితో జూచిన ప్రస్తుతము నేలెన్నిక గన్నభూదేశములం దెట్టి వికలాంగునకైనను వికలాంగునకైనను, కర్మాగారములందేదో యొక పని సృష్టింపబడి యుండును. ఇతరాంగములన్ని సక్రమముగ నుండియు నొక్క కాళ్లులేని కారణమున మన దేశమందొక నిరుపేద కార్షిక వృత్తి నవలంబింపవలసినదే. ఒక యంగము గ్రహచారవశమున లోపించిన భారతీయుని ఇతరాంగములుగూడ నిష్ప్రయోజన కారులుగ జేయబడుచున్నవి.

ఒకడు సంపాదింప, నలుగురింట, నిరుద్యోగులై భుజించు కారణమున నుద్యోగవర్గము కూడ ఆర్థిక కాఠిన్యము ననుభవించు చున్నది. నెలజీతము జీవితావసరములకే సరిపోదు. దీనికి దోడు, కాలానుగుణ్యముగ దమ వైఖరుల (Fashion) మార్చుకొనకున్న సంఘ మాతని పై నైచ్యభావముల గనపరచును. ఇంటనుండు స్త్రీల యుద్యోగము వంటయింటివరకే! ఇంక నీ తెగ బాగు పడ వలయునన్న నేమి యుపాయము?

పరిశ్రమ లడుగంటుటచే వణిజ్యంబునకు గూడ నధోగతి పట్టినది. ఉన్నంతవరకు గృహపరిశ్రమల గౌరవించు వాడును లేడు.

ఇంక కర్షకులు. వీరిసంఖ్య భరత ఖండమంతయు గలిపి నూటికి డెబ్బదియైదుకన్న నెక్కువై యున్నది. వ్యవసాయిక దృష్టితో నిఖండము వైశాల్యము ౮౩ కోట్ల ఎకరములని తెలియుచున్నది. కాని దీనిలో మూడవవంతు మాత్రమే సేద్యమునకు యోగ్యమై యున్నది. నిజాము రాష్ట్రమున వ్యవసాయమునకు యోగ్యమగు భూమి [illegible]

కోటి రెబ్బదిలక్షల ఎకరములని తెలిసికొన బడినది, కాని యిందులో సగముకన్న నెక్కువ భాగము అయోగ్యమై యున్నది. ఇచటి కృషాణులు తదితర రాష్ట్రీయులకన్న నెంతయు వెనుకబడి యున్నారు. వీరి జీవితానుసరము లతిస్వల్పములు. ఇట్లుండియు, నేను వీరనుభవించుచున్న ఋణబాధ అపారము. సహకార సంఘోద్యమము మన రాష్ట్రమున ప్రారంభింప బడిన దాదిగ కృషీవలులకు గొంత మేలుచేకూరినదికాని అది సహకార సంఘముల నుండి యప్పుదీసుకొను నంతవరకు మాత్రమే. కావున, నీయుద్యమ తత్త్వము వారికింకను బోధ పడలేదనియే చెప్పవలసి యున్నది.

మన కర్షకుల హైన్యమునకు రెండవ ప్రబల కారణము వారికిస్వంతభూములు లేకుండుట_ఒకగ్రామమం దలి భూమియంతయు సాధారణముగ గ్రామోద్యోగుల పేరిటను, పలుకుబడిగల తదితర లక్ష్మీపుత్రుల పేరిటను నుండును. ఇక నీ బీదరైతుల కితరుల భూములే శరణ్యములు. సంగతి సందర్భము లిట్లుండ కృషాణుల యభివృద్ధి గగనకుసుమమగుటలో నాశ్చర్యమేమున్నది.

సాధారణముగ రాష్ట్రమందంతటను, ముఖ్యముగ కృషీవలులందును ప్రబలియున్న హైన్యార్థిక దుస్థితిని తొలగించు నుద్దేశముతో, మహోన్నత వహించిన మన నిజాంప్రభుత్వము వారిప్పటికి పండ్రెండు సంవత్సరముల పూర్వము అనగా 1324 ఫసలీలో సహకార సంఘోద్యమమును అమలునకు దెచ్చిరి. హైదరాబాదునందుగల డొమినియను బ్యాంకుతో కలసి మొత్తము ఇరువదైదు వ్యవసాయసంఘములు ప్రప్రథమమున స్థాపింప బడెను. ఆసంవత్సరాంతమున భాగస్థుల సంఖ్య 600; మూలధనము 186, 000 రూపాయలై యుండెను. మరుసటి సంవత్సరమున ఇన్ఫ్లుయంజా మొదలగు జాడ్యములు ప్రబలుటచే నీయుద్యమమునకు గొంత యాటంకము గలిగినది. దీనికి దోడు క్షామదేవతగూడ రాష్ట్రమందంతట ప్రత్యక్షమై యుండెను. కాని, పాలకవర్గము వారి యవ్యాజ్య కరుణా కటాక్షము వలన నుద్యమము సాగుచునే యుండినది. తత్ఫలముగ బదిసంవత్సరముల కాలములో అనగా 1334 ఫసలీవరకు సంఘముల సంఖ్య పండ్రెండ్రు ది; (Central Banks) సెంట్రల్ బ్యాం కులతో గలిసి, 25 నుండి 1747 వరకు పెరిగినది; భాగస్థుల సంఖ్య 36600 అయినది; మొత్తము మూలధనము 1,25,00,000 వరకు హెచ్చినది. ఇవిగాక 88 ఇతర సంఘములుగూడ నెలకొల్ప బడినవి. ప్రస్తుతము వీనిసంఖ్య, ఈ పత్రికయొక్క రెండవ సంచిక యందు వ్రాయ బడినట్లు, 2000; భాగస్థుల సంఖ్య 50,000 వరకు యున్నది.

మొత్తముమీద పై సంఘములన్నియు (1) వ్యవసాయ సంఘములు, (2) పరిశ్రామిక సంఘములని ద్వివిధములు. ఉద్యోగులు తమ సాంఘికావసరములకై స్థాపించుకొనిన సంఘములు గూడ కొన్నికలవు. కాని మన మెక్కువగా మొదటి రెండు సంఘముల గురించియే తెలిసికొన వలసి యున్నది.

వ్యవసాయ సంఘముల యభివృద్ధికి నిక్కముగ విచారించిన వ్యవసాయ దారులే యుత్తరవాదులు. అందును, కర్షకులను ఋణబాధనుండి విముక్తులజేసి, వారికి భయహస్తమివ్వవలసిన బాధ్యత (Rural Bank) గ్రామపు బ్యాంకు వారిపైనున్నది. బ్యాంకులు పూర్వ ఋణముల దీర్చికొనుటకు ఇతర (Agricultural purposes) వ్యవసాయ విషయములకొరకు, ఎంత విరివిగ ధనమునిచ్చినను, వ్యవసాయదారులస్థితి తృప్తికరముగా బాగుపడి నట్లులేదు. ఈసందర్భమున నాకు లభించిన గొన్ని సంఖ్యలవలన బ్యాంకులనుండి ఒక్క [illegible] లీయందు వ్యవసాయపు పనుల గురించి [illegible] రూప్యముల నప్పుగా నిచ్చినట్లు తెలియుచున్నది. ఈ మొత్తమును ఆర్థిక సమస్య లన్ననేమో తెలియని కర్షకులెట్లు వినియోగించినది దేవుడెరుగును? కావున, కేవలము బ్యాంకులపైనను, ప్రభుత్వముపైనను, ఆధారపడి యుండక మనలో నెందరో యువకులు గౌరవోద్యోగముల నొల్లక, కొని గ్రామములందు ప్రచారము జేయుచు, అజ్ఞానులగు రైతులకు సహకార సంఘతత్త్వముల బోధించి, మన మహా సమస్యల వారికినచ్చజెప్పి నప్పుడే వారు మన మనుకొనునంత యభివృద్ధి బడయగలరు. సాధ్యమైనంతవరకు [illegible] కులు (Unproductive purposes) వ్యర్థమగు ఇతర పనులకై అప్పుదీసి కొనకుండ [illegible] బ్యాంకు వారుగూడ నిప్పట్ల మిక్కిలి జాగ్రత్తతో [illegible]

సంఘముల బాగోగుల విచారించుచు, నిటు తమ యార్థికస్థితిని జక్కబెట్టు కొనుచుండవలయును. మూలధనము, భాగ్యస్థులసంఖ్య, (Reserve fund) నిలువధనము—ఇవి విశేషముగా నుండునట్లు ప్రయత్నించ వలయును. సహకారసంఘోద్యమము జయప్రదముగా గొనసాగు రహస్యమిదే నిమిడి యున్నది. ఇంతియుకాక, కర్షక జనమునకు ఋణముయొక్క అవశ్యకత క్రమేణ లేకుండ జేయునప్పుడే గమ్యస్థానము లభించినదని గర్వించ వలయును.

నిజాం రాష్ట్రమున పరిశ్రామిక సంఘముల గమనము మందగించి యున్నదనియే చెప్పవచ్చును. ప్రభుత్వముకన్న కార్మిక జనమే ఇప్పట్ల మిక్కిలి శ్రద్ధవహించ వలసియున్నది. ప్రభుత్వమువారీ మధ్య 72 వేల రూప్యములను పరిశ్రామిక సంఘములవారికి మూడు సంవత్సరముల కొరకు వడ్డియును మాటలేక, నప్పుగ నిచ్చి తమ పరిశ్రమాభిమానమును వెల్లడించి యుండిరి. ఈ సంఘములవారి కటుతరువాత నెట్టి ప్రోత్సాహము లభించినది అంతగా దెలియకున్నది. కాని, (Urban Banks) నగరసంబంధమైన బ్యాంకులు మన రాష్ట్రమున విరివిగా స్థాపింప బడక పోవుటబట్టి, పరిశ్రామిక సంఘముల యభివృద్ధి యింతక అసంతృప్తికరముగ నున్నదని యూహించుట కవకాశము గలుగుచున్నది సాధారణముగ కార్మికజనము పట్టణములందే నివాస మేర్పరచుకొని యుండును గనుక ప్రతి జిల్లాయందొక అర్బన్ బ్యాంకు స్థాపింపబడు నవసరము కలదు. ఇప్పట్లగూడ స్థానిక యత్నములెంతయు ముందంజ వేయవలసి యున్నది. గౌరవోద్యోగముల స్వీకరించి, శిక్షాలయములున్న ఏ బొంబాయి వంటి ప్రదేశమునకో యేగి క్రమశిక్ష బొంది దేశమునకు మహోపకారము జేయవలసి యున్నది. ప్రత్యేకముగ కససంఘమొక మాసపత్రికనైనను వెడలవలసి యుండు ననుట అతిశయోక్తి కాజాలదు. నిజాము రాష్ట్రీయుల నిట్టి యౌదార్యమునకు, తగిన సుచిరకాలములో నాసన్నమగుగాక!

# అజ్ఞాతాన్వేషణము

'మధురకవి'

దర్శనీయ సంధ్యాకాంతి, దారకాళి
కాంతియుతరాత్రియందు, నాకాశదివ్య
మంజులచ్ఛవియందు, హిమాంశునందు
వెదకితినిగాని కానక నెట్టినైతి.
రమ్యమైన యుషఃకాంతి రక్తిమమున.
మిట్టు గొల్పెడి మబ్బుల మించులందు
ఘోరశార్దూల రవముల; ధారుణీంద్ర
శృంగశృంగారములయందు; శీతవాత
మందసంచారములయందు; సుందరస
వికసితాంభోజములయందు వెదకినాను
వ్యగ్రచిత్తత కానంగ బడవునీవు.
ఫుల్లసుమ సౌరభమునందు; పుష్పజీవి
ఝంకృతమునందు; స్వేచ్ఛాను నారిపతగ
రమ్యగతిని; తరంగిణి రామణీయ
భంగములయందు; శోభా విభాసమాన
చంద్రికాజాత నీహార శైత్యమందు;
వెదకితినిగాని గాన విమలమూర్తి
కాంతకమనీయ హావ భావాంతరమున
మాతృవాత్సల్యమున శిశుమంజురావ
కాకలీస్వరమందున గానజాత
కర్ణలోలు పతత్త్రౌఘ ఘనములందు;
స్వేచ్ఛలో; కావ్యకల్పనావృత్తులందు
వెదకితినిగాని కానని విమలమూర్తి
ఎచటనుందువో; నీరూప మేదొనాకు
చీమకాలంత తెలియంగజేయరాదె.

# నిజమేనా?

(ఒకరు)

౧

యత్రోన్మత్త భ్రమర ముఖరాః
పాదపా నిత్యపుష్పాః

—మేఘసందేశము.

మా సాంసారిక జీవనము ఎంతో మనోహరముగ నారంభమయ్యెను. ఏండ్లుగడచినకొలఁది మా యనురాగము మరింత పెంపొందుచుండెను. వయస్సునందు మా యిరువురకు ఎంతో భేదములేదు. మాధవునకు ఇరువది రెండేండ్లు; నాకుపదునెనిమిదేండ్లు. రమ్యముగాఁగట్టఁబడి యున్న మా గృహ మొకతోటకు మధ్యభాగమున నిలచి, హృదయాకర్షకముగ నుండెను. ప్రతిదినమును ప్రభాతవాయువులు మా వనమందు వికసించియుండు పువ్వుల సువాసనల మోసుకొని మేడపై నుండిన గదిలోని మా శయ్యాతలమునకు లాగికొనివచ్చి మమ్ము మేల్కొల్పును. మనోజ్ఞములగు పక్షులగానము మాకు తనివిదీర లభించుచుండును!

మా యింటికి కడుసమీపమునగల "కీర్తిసరోవరము" స్వచ్ఛమైన అమృతతుల్యమునగు జలముతోను, నేత్రోత్సవములగు కమలములతో సాయంసమయములందు మమ్ము తనవద్దికి గుంజుకొనును. మాధవుఁడును నేనును అట్టివేళలందు ఒకరితోనొకరము పందులు వేసికొనుచు వేగమున నా రమణీయ దృశ్యమును సమీపించి, రంగుల సినుమా పడవపైనెక్కి "కీర్తిసరోవరము" నందలి పిల్లతరఁగములవెంట పరుగులుపెట్టుచు, కమలగంధముతో మిళితమైయుండు చల్లనిగాడ్పుల దేలుచు గానామృతమును చవిఁగొనుచు అస్తమయము దాటువరకు విహారము సేయుచుందుము!!

మాధవుఁడు నన్నొకమారైనను కసరుకొనలేదు. నేనును నా భర్తపై నొకసారియైన కోపపడినట్లు జ్ఞప్తిలేదు. అతని ప్రేమకు నే నెన్నఁడును సాటియించి యొసఁగను, నే నాతని చరణముల మనఃపూర్వకముగఁ బూజింతును. మా మానసముల పరిశీలింపనివారు, నన్ను 'భర్తయెడ మర్యాద లేనిదాని'గను నా మాధవుని 'భార్య చేతిలోని కీలుబొమ్మ'గను నిర్ధారణచేసి కొందురేమో. కాని మాహృదయము కీర్తిసరోవరములోని జలమువలె స్వచ్ఛములుగా నుండెను. జీవితప్రవాసమున నప్పుడప్పు డెదురు వచ్చుచుండు ఆటంకములను మే మవలీలగా నెట్టివేయుచుంటిమి! మహాకవి కాళిదాసు వచించినట్లు, మా జీవితము యొక్క సరళప్రవాహము 'మార్గవశాత్' వచ్చి యడ్డగించు 'మహీధరము'ను దప్పించుకొని, కొంచెము ప్రక్కలకుఁ దొలఁగి యావలఁ మరల నేకముగా గలసికొని పరమానందమై సాగిపోవుచుండెడిది!! మా యుద్యాన వనములోని వృక్షములు ఎల్లప్పుడు పుష్పఫలితములై వీనులకింపు నింపు భ్రమరఝంకారములతో నొప్పుచుండెను!!!

నన్ను మాధవుఁడెప్పుడును "పద్మా" యని పేరువఁ బిలుచుచుండువాఁడు. నే నాయనను పేరఁబిలువ సిగ్గుపడుచుందును. మా పరస్పర ప్రేమాప్రకటనమునకును, బెట్టుసొంపుగని వర్తనమునకును అంతరాయము కల్పించునదేదియు నిఁకనుండలేదు!

పచ్చని పచ్చికతోను, దానికి నడుమ బారులు దీర్చిన సేవకులవలె మాటిమాటికి తలలువాల్చి 'దాసోహమ్మ'ని తెల్పు వృక్షములతోను, రంగురంగుల పుష్పవాటికలతోను మనము నాకర్షించుచుండు కీర్తిసాగర తటముల పైనను, గృహోద్యానములోని దట్టములగు పొదరిండ్లలోను మాజీవనము హెచ్చుతగ్గులెరుఁగక గడచుచుండెను.

(౨)

క. ....................కుటీరా వాసములకు
నుచితమె, నీ విలసిత రూపకాంతి
నిర్మలగుణముల్.

—మహాభారతము.

మా యింటికి ప్రక్కనే దేవాలయ మొకటియుండెను. అందునివసించు దంపతులు ఆ యాలయపు పూజారియు నతని భార్యయు.

మధుసూదనుని వయస్సు నలుబది వత్సరములు. నిమ్మపండువంటి శరీర ఛాయఁ గలవాడు. కొంచెము స్థూలమగు శరీరమును, అందమగు మీసమును, గడ్డమును అతనికుండెడివి; త్రిపుండ్రములతో నెప్పుడును అలంకరింప బడియుండు నాతని మొగము, సహజ మార్దవము గల యాతని వచోధోరణియు చూచువారల కాతనియెడ గౌరవ భావమును బురికొల్పుచుండును!

సామాన్యులగు పూజారులవలె కాక మధుసూదనుఁడు మంచి పండితుఁడు. సంస్కృత భాషయం దతనికద్భుతమగు పరిచయ ముండెను. పురాణకథ లాతనికి కంఠస్థములు. వేదాంత సంబంధములగు గహనవిషయము లాతనికి కరతలామలకములు. ఏదేని విషయమును ఇతరులకు బోధించుటయందు మధుసూదనుకుండిన ప్రజ్ఞ అనన్యసామాన్యము. మంచి సంగీత జ్ఞానము అతని పాండిత్యమునకు మరింత వన్నె దెచ్చెను. ప్రశాంతమగు ఉషఃకాలమున నాతఁడు పాడు ప్రార్థనాగీతములు మాతోటలోని వృక్షముల పైని పక్షుల మనోహర కూజితములతో ఆనందరస ప్రవాహమును వెల్లి విరియఁ జేయుచుండును! నిరుపమానమగు విజ్ఞానతేజ మాతని ఫాలభాగమున సర్వదా ప్రజ్వలించు చుండును.

మాధవునకు మధుసూదనునకు క్రమముగా స్నేహము కుదిరి యది, స్నేహముగ మారసాగెను. నాకును రుక్మిణికిని చెలిమి హెచ్చయ్యెను. రుక్మిణి నాకంటె రెండు సంవత్సరములు చిన్నది. తోఁబుట్టువుల నెఱుఁగని నాకు రుక్మిణిపై ప్రేమ వొదవుటకు ఎంతోకాలము పట్టలేదు. తెల్లవారు జామున భర్తకంటె ముందే లేచి కాలకృత్యముల నిర్వర్తించుకొని, రుక్మిణి మా తోటలోనికి వచ్చి పూవులు గోసికొని పోవుచుండును. పోవుచు నొక్కసారి మా యింటిలో నడుగుపెట్టి నాతో రెండుమాటలాడకుండ నొక్కమారైన నుండలేదు. మధ్యాహ్నమున భోజనములైన తరువాత మా మేడపైన నేను రుక్మిణియు ముచ్చటలాడుచుందుము. దినములు గడచుచున్న కొలఁదిని రానురాను, మా మైత్రి హెచ్చి, బంధుత్వ దశకు వచ్చి తరువాత సోదరీ ప్రేమగా బరిణమించెను. రుక్మిణి యొక దినమేని మా యింటికి రాకపోయిన నేను వారి దేవాలయమునకుఁ జని పిలచికొని వచ్చెదాను. రుక్మిణి కాలిలో ముల్లు గ్రుచ్చుకొనిన నేను వేదన పడుదాను. మధుసూదనుడును, నాయందలి గౌరవముచేతనైన నేమి మాధవుని యెడ గల అనురాగము వదలక రుక్మిణిని మా యింటి కంపుచుండును. తాను పురాణము చెప్పఁ బోవునప్పుడును, "మీ అక్కయ్య ఏమి చేయుచున్నదో చూచిరా? "ఇచ్చట తొందరపను లేమియు లేవు" అని రుక్మిణిని నాకడకు పంపును! మాధవుఁడును నేను గ్రంథపఠన మొనర్చునప్పుడు పలుమారు రుక్మిణి మా చెంగటనుండి సంతోషమున పాలుగొనును. చదరంగపు మున్నగు నాటల దంపతులము ఆడుకొను చుండునప్పుడు రుక్మిణి మా కాలోచనము చెప్పును, ఎత్తులను సూచించును. మా సాహవాసమున తానును ఆనందమనుభవించు చుండెను! ఈ విధముగ రుక్మిణి మా కుటుంబమున ఎడబాటులేని స్నేహితురాలయ్యెను!!

రుక్మిణి యాకారమును వివరముగ వర్ణించుట కంటె ఆమె మూర్తీభవించిన సౌందర్యమని చెప్పిన చాలును. వయసునకు దగిన అంగ సౌష్టవమును, బంగరు రంగు శరీర శోభయు, విషయముల నతిశ్వరితముగ గ్రహించు కుశాగ్ర బుద్ధియు, శుభప్రదమగు నారోగ్యమును, యున్ని లేకన్న మిన్నయగు నామె కలుపుగోలు తనము

మాధవుఁడును నేనును తలచు మెచ్చుకొనుచుందుము! "ఇట్టి సౌకుమార్యము, ఇట్టి లావణ్యము, ఇట్టి ముఖకాంతి, రాజప్రాసాదములకుఁ దగియుండును కాని దేవాలయమునకుఁ దగియుండునా? నే ననుభవించుచున్న సౌఖ్యములవంటి వాని ననుభవించుటకు రుక్మిణి కేల హక్కు ఉండఁగూడదు? నా ప్రియ సోదరియగు రుక్మిణికి మేడలలోని సుఖజీవనము, ఆరామములలోని విహారము, ఈడు జోడుగనుండు భర్త సాహచర్యము, భోగాభిలాషియగు ప్రియుని యుత్సంగము ఈశ్వరు డేల ప్రసాదింపఁడయ్యె" అను తలంపులు నన్ను పలుమారు తొందర పెట్టును. ఇట్టి ప్రశ్న ఎన్నియో మారులు మాధవుఁడును, కడుజాలితో నా యెదుట వేసికొని, ప్రత్యుత్తరములను ఊహించి తర్కించును.

కాని రుక్మిణి యొకమారైన తన జీవితమును గూర్చి విసుకుచెందినట్టు కనుపడలేదు. మా స్నేహము అతి గాఢమైన తరువాత గూడ తన విషయమున ఆమె యెన్నడును అతృప్తిని నాకు కనుపరుపలేదు. మధుసూదనుని ప్రసక్తి వచ్చినప్పు డామె యాతని సదయ హృదయమును, ఆతని యపేక్షను, అంతరంగమున నా యెదుట ప్రస్తుతించును! ఉదయమునను సాయంత్రమునను, వేరేల, ఎప్పుడైనను, మధుసూదనుని సేవచేయుట యందు ఆమెకు కలుగుచుండు ఆనందము చూచు వారికి ఆమె భావౌన్నత్యమును, కర్తవ్య పరాయణత్వమును, సంతృప్తి స్వభావము వెల్లడి చేయుచుండెను.

(3)

బహుగుణరమణీయః, కామినీచిత్తహారీ,
తరువిటప లతానాం బాంధవో నిర్వికారః
జలదసమయ ఏష ప్రాణినాం ప్రాణభూతో
దిశతు తవహితాని ప్రాయశో వాంఛితాని॥

—ఋతు సంహారము.

వర్షకాలమునం దొకనాఁడు మూఁడుజాముల వేళ నేనును రుక్మిణియు, మా మేడపైగూర్చుండి ఋతుసౌందర్యమును నేత్రోత్సవముగాంచుచు సంతసించు చుంటిమి. క్రీడా సరోవరముయొక్క యుపరిభాగమున ఘనమేఘావృతమగు ఆకాశము ప్రతిఫలించుచుండెను. సరోవరతటమునందలి వృక్షములు స్వచ్ఛమగు వాననీటిని స్నానము గావించి పవిత్రములై నలుదెసల వీచుచున్న చల్లనిగాడ్పులకు తలలాడించుచు, శాఖాహస్తముల నెగుర వైచుచు నానందించుచున్న వానివలె కానవచ్చుచుండెను! నడుమ నడుమ జలజలరాలు వాన తుంపురులు మా కన్నులకు మేలుముత్తెములవలెఁ దోచుచు మోదమును గూర్చుచుండెను.

"అక్కా! నేటి దినమెంత సొంపుగా నున్నదో చూడు!" అని రుక్మిణి యనెను.

"అవును";

"రుక్మిణీ! మన [illegible] ఋతుసంహారమున్నది. తెమ్ము; మహాకవియొక్క రసవంతములగు పద్దెములను జదువుదము!" అని యంటిని.

రుక్మిణి చప్పున లేచి యలమారు వద్దికిబోయి పుస్తకముఁ గొనివచ్చెను.

మేము చాల ఉత్సాహముతో ఆదలి శ్లోకరాజముల చెరి కొంత చదువుచు, మధ్యమధ్య కొంత తడవు క్రీడాసరోవరము వైపును, గృహారామమునందలి వృక్షలతాచయము వైపును, ఆకాశవీధిని నిముషనిముషమునకు ఆకారముల మార్చుచు వేవేగముగ ఇటునటు పరువులిడుచున్న మేఘశకటములను, అవలోకించుచుంటిమి మరలఁ జదువుచుంటిమి.

అంతవరకు, ఎచ్చటికో పోయియుండిన మాధవుఁడు తటాలున మేము మాటలాడుచుండిన తావునకు వచ్చెను!

ఆనందవార్ధిఁ గ్రుంకులిడుచున్న మేము, మాధవుని రాకను లెక్కఁగొనలేదు.

బట్టలువిడిచి, మాధవుఁడు, మాకు కొంచెము యెడముగ గూర్చుండి యనెను.

"పద్మా! ఈ దినము ఎంతసొంపుగానున్నదో చూచితివా"?

నేను: "నిజము! మీ రిచ్చట లేకపోయితిరి. రుక్మిణియు నేనును హృద్యమగు నీ సమయమున ఋతుసంహార

రూపమున మహాకవి అనుగ్రహించిన అమృతపు గుటుకల మ్రింగుచు ఆనందించుచున్నాము"!

మాధ: "సరేకాని, మనతోట యావలిగట్టునను, సమీపమునన్న మఱ్ఱిచెట్టున ఉయ్యాల వేయింతునా? సొంపునింపు నీ సమయమున ఉయ్యాల నూగుదమా"!

ఈ తరుణమున, నిట్టిసంతోషావహమగు నుపపాదనమును ఆమోదింపనివారున్న, బలపఱపని వా రుందురా?

"మంచిమాట చెప్పితిరి! సిద్ధము!! "రుక్మిణినికూడ తీసికొని పోదము" అనియంటిని.

రుక్మిణి కనుగవయందు సంతోష కాంతులు మెరిసెను. చిరునవ్వు ఆమె చెక్కుటద్దములపై తాండవించెను. దానిమ్మపువ్వువంటి యెఱ్ఱనివగు ఆమె పెదవులు విడివడి ముత్తెములవంటి పలువరస ప్రకటించెను. గులాబిపువ్వు రంగుగల ఆమెబుగ్గల నడుమ గుంటలు ఏర్పడెను. సోదరి రుక్మిణి హృదయమున వెడలిన యుత్సాహ తరంగము, నాహృదయమును కూడా ముంచివైచెను.

"అభ్యంతరమేమి?" అని మాధవుడు నాసూచనకు మారుపల్కెను,

రుక్మిణి దృష్టిని వాల్చి, మౌనముచేత నంగీకారము తెలియఁజేసెను.

పదునైదు నిముషములలో మేము మువ్వురము మా యుద్యానవనము యొక్క యావలితుదను, కీర్తిసరోవరమునకు కడుసమీపమున మఱ్ఱిచెట్టునకు వేయఁబడిన యుయ్యాలవద్ద నిలువఁబడియుంటిమి!

(౮)

కుర్యాంహరస్యాపి పినాకపాణేః

ధైర్యచ్యుతిం; కేమ మదన్వినోన్యే?

—కుమార సంభవము.

మందమగు గందపుఁజెక్క పలకయు, చిత్రవర్ణశోభితములగు పట్టుత్రాళ్లును గల యా యుయ్యాలచెక్క నా మానసమునొందర పఱసాగెను. మాధవుని యుత్సాహాతిశయము ముఖమున స్పష్టముగ చిత్రితమై యుండెను, మా మువ్వురిలో చిన్నదియగు నా చెలిమికత్తె రుక్మిణియు యందరికంటె ముందుగా డోలికాక్రీడ వలని యానంధము ననుభవింపఁదగునని నా కోరిక.

"రుక్మిణీ;" "మొదటి వంతునీదే. ఎక్కుము" అంటిని. రుక్మిణి "మొదట మీరివ్వు కానిండు"

మాధవునిజే మొదటి వంతని తుదకు నేను తీర్మానించితిని—ఆప్రకారమే అసలు జరిగెను. రుక్మిణి డు ఉయ్యాలదిగి యొక చెట్టుక్రింద గూర్చుండి పేర్చుకొను చుండెను.

అంతట చల్లని గాడ్పు ఒకటి వీచెను. ఆకాశమువేవేగముగ ఎంతోపని గలదానివలె పరుగిడుచున్న మబ్బుతునకయొకటి మామీద సన్ననితుషారముల నాస్వాదనావలకుఁబోయెను.

ఉయ్యాల పలక ఎత్తుగ నుండినందున నేను గెంతెను ఎగిరి దానిపై గూర్చుండి వృక్షాగ్రముతో సమముగు నెత్తువరకు ఊగుచుంటిని. రుక్మిణి గుడిలో పూవులు ప్రోగుచేయుచు నటునిటు దిరుగుచుండెను.

సుమారు పదినిముసముల తరువాత దిగినేను చుట్టుప్రక్కల నేత్రాకర్షకముగ నున్న పూవుగుత్తుల కడకు బోయితిని. వానిలో మంచి మంచివాని గోసితెచ్చి మాధవునకొక పుష్పమాల వేయ మనస్సున సంకల్పించి నాకైయిటునటు తిరుగుచుంటిని. ఉయ్యాల నాకొక వందగజముల దూరమున నుండెను.

ఇంతలో రుక్మిణి తాను గోసితెచ్చిన పూవులను ఒడిలోనుండి గులిపి ఉయ్యాలవద్ద నొకచోట పోసి, ఉయ్యాల పలకపై నెక్క యత్నించెను.

పూవుల గోయుచుండిన నేను, వేగముగ రుక్మిణివైపు ద్రిప్పి చూచితిని. పలక యెత్తుగ నుండినందున నాకంటె పొట్టిగ నుండిన రుక్మిణి దానిపై నెక్కుటలో మొదటిమారు విఫల ప్రయత్న మయ్యెను. మరల యెక్కఁబోయి, మరల యట్లె యయ్యెను. మాధవుడు ఉయ్యాల ప్రక్కనే నిలఁబడి యుండెను.

"రుక్మిణి ఎక్కజాలక తిప్పల బడుచున్నది. కొంచెము సాయము చేయుఁడు" అని ప్రార్థనా పూర్వకములగు చూడ్కుల మాధవునిపై పరపితిని.

మాధవుఁడు సులభముగనే రుక్మిణిని ఉయ్యాల నెక్కించెను. పైకెక్కెనో లేదో "ఛీ"యను కర్ణకఠోరశబ్దములు నోట వెలువడెను.

పలువర్ణములగల క్రొత్త పూవులు ఏవో కానవచ్చినందున వాని గోయుచుండిన నాగుండె రుక్మిణి నోటినుండి వెడలిన యా ధ్వనిచే జల్లుమనెను. తటాలున నేను పొర్యోలకడకు పరుగు పరుగున వచ్చితిని. ఏమి చెప్పుదును.

రుక్మిణి ముఖము, అప్పుడే మేఘముల నడుమ నుండి క్రోధము చేసుకొని ముసుగుచున్న సూర్యబింబము కంటె నెక్కుడుగ నెఱ్ఱబడెను. కన్నులు నిప్పులు వెదజల్లుచుండెను. పెదవు లదురుచుండెను. మందహాస మొలుకుచు దర్పణముగ నుండు నా మొగము ఎంతో మచ్చిక గల నామానసమునకే భయంకరముగ దోచెను.

“తుచ్ఛము. తుచ్ఛము.” అనుమాటలు రుక్మిణి నోటినుండి మరల వెలువడెను.

క్రోధ జ్వాల లామె కన్నులనుండి వెడలి మాధవుని పై గురియుచుండెను. మానవుడేమి యనలేక, చేష్టలుదక్కి చెట్టు మొదలున కానుకొని, మోము నేల వాల్చి నిలచుండెను,

నాశరీరము. ఆమూలాగ్రము వడకెను. ఏమియు తోచలేదు.

మరల రుక్మిణి మోమును తేరిపారం జూచితిని. ఆ యగ్ని చల్లారలేదు. మూర్తీభవించిన యా క్రోధదేవత నేను తనపాదముల కడ దీనవదనముతో నిలచియుండుట నైన గమనింపలేదు.

మరియొక నిముసమున, రుక్మిణి యా తోటనువదలి వేవేగమున దేవాలయముతట్టు మొగమై నడచుచుండుట కానవచ్చెను.

నేను పరుగు పరుగున వెంటనరిగి ముందడుగువైచి రుక్మిణి చేతులు పట్టుకొని యాపి విన్నవదనము జూపు చూపులతో వేడికొంటిని. “సోదరీ. శాంతింపుము. శాంతింపుము”

రుక్మిణి కఠోరమగు ధ్వనితో ననెను: “శాంతమా? కాదు. ప్రాయశ్చిత్తము.”

నా నేత్రములనుండి కన్నీటి బిందువులు, ప్రవాహ వేగముతో వెడలసాగెను. మరల ధైర్యము చిక్కబట్టి, రుక్మిణియొక్క నడక నాపి, గడ్డముపట్టి ప్రతిమాలితిని. “సోదరీ. నన్నుజూచి, నామానవుని తప్పైన నుండెనేని మరచిపోమ్ము. తోబుట్టువగు నన్ను అనుగ్రహింపుము. క్షమింపుము.”

రుక్మిణి నా చేతులను వదలించుకొని “ప్రాయశ్చిత్తము.” అనుచు సాగిపోయెను. ఇంటికిబోయి యారాత్రి మాధవుడును నేనును ఎట్లు గడపితిమో వర్ణించుటకంటె, ఊహించుట సులభము. మరునాటి వేకువన దేవాలయమందు, మధుసూదనుడును రుక్మిణియు కనుపడరైరి. వారెటుపోయిరో నేటికిని తెలియలేదు.

# అన్వేషణము

సముద్రాల రాఘవాచార్యులు

ఈమధ్య చరిత్ర కొంచెంగా చదవాలని మనసుపుట్టి గ్రంథాలు తిరగవేయటం ప్రారంభించేసరికి పాలకాలంతోపాటు వంశాలవెంటవశాలు చదివినపేజీలతో చరచరా నడచుపోతుంటే కాకతీయవంశము కనిపించింది. రుద్రదేవుడు గణపతిదేవుడు రుద్రమ్మల కథలుచదివి ప్రతాపచక్రవర్తి పరిపాలనంతో నాహృదయము పరవశమయి వెనక్కుమళ్లింది. ఒక్కసారి సింహావలోకనము చేసేటప్పటికి సందేహాలవెంట సందేహాలు ఒకటిగాను రెండుగాను చరిత్రంతా హృదయమంతా సందేహాలోకమై పోయింది. నిరుత్సాహ పూరితమైంది. మనసు వూరుకోలేదు. విచారణ ప్రారంభించింది.

వారుచేసిన ఘనకార్యాలు ఒక్కసారి మనసుకి గోచరించి వారియందు కల్గిన అవ్యాజానురాగాన్ని అఖండమైన నిష్కళంకభక్తిని వారి పాదాలయందు సమర్పించి ధన్యుణ్ణని చెప్పుదామనుకొంది. చూచుకుంటే ఫలితము లేకపోయింది. ఈలోకంలో వారికిరోజులు తనకును రక్షలు లేవని తెలిసికొంది హృదయం. వారి ఘనకార్యాలతోనే వారుకూడ పోయినారని జ్ఞప్తి దెచ్చుకుంది. ఇంత గాజటిల లేనవాళ్లను మెచ్చుకున్న వాళ్లంతా పోయినారు. ఒకరివెంటనొకరు అంతాపోయినారు. విచారించుకొంటే పొయ్యినా రనడమే, ప్రాచీనచరిత్రల వుపసంహారవాక్యమని తేలింది. పోయినారు పోయినారంటే ఒకలాగు పోలేదు. ఒకరు పోయినత్రోవనే మరొకరు పోయా డు. కొందరు గౌరవంతల్పమీద శయనించారు. కొం యశస్సమరంలో ప్రాణాలు ధారపోశారు, కొందరు రవిజయాభిలాషలలో కుత్తుకలుకత్తులకొఱిచేశారు. కొం ఆశామోహాలకు లొంగించ్చిన తంత్రాల్లో కూలిపోయా కొందరిక్కడ కొందరక్కడ. ఒకచోటగాదు. ఒక గాదు. దొరలు, దొంగలు, ధీరులు, శూరులు, రులు, అందరు తమ అస్థులురాల్చారు. హెచ్చు త లేకుండా అనాదియైన కాలగర్భంలో అఖండమైన గర్భంలో మృదవచ్ఛిన్న స్వరూపాలతో లైన తమ అమృతకాయాలు అధునాతనుల దృష్టి కుండా వీరశయనాలమీద శాశ్వతనిద్రాసుఖ స్తున్నారు.

> "Huddled in dirt the Engine lie
> That was so great and thought
> himself so wise",

అగాధమైన భూగర్భంలో నిద్రాగీతాలు పా సామ్రాజ్యాలు స్థాపిస్తూవుండే ఏ కవిసామ్రా మూలు లోకం మరిచిపోయిందో దానికరం కాలం రోజూ కూలివాళ్లు తవ్వితీస్తూవుండే, రయితులు నా లతో బద్దలు చేస్తుండే అస్థికలు సమాధులు ఎవ్వరి లవో అనేదానిసందేహం కాలమహాత్మ్యంవల్ల మ

# గోలకొండ మంత్రులు.




అక్కన్న మంత్రి.




మాదన్న మంత్రి.

పాలంపేట దేవాలయాంతర్భాగము



పోయిన ఆ మహాపురుషుల దివ్యాశయాలు ఏ సీమకార్యానుపయోగ పడుతున్నారో అనిదా నిశ్చయం. మృత్యుదేవత విజయలక్ష్మిని నిష్పక్షపాతంగా గౌరవించి పావన స్తంభంగా గౌరవించుకున్న సిద్ధపురుషుల జీర్ణకాయాలేవి? బౌద్ధాదిమతాలకు ఒకనాడు లోకోత్తరమైన ఆశ్రయం యిచ్చి సర్వంకష మొనరించిన మహామహుల మతరాజ్యాధిపతుల శిథిల దేహాలెక్కడున్నయి!

ఆంధ్ర జాతికి ఆంధ్రానికి ప్రత్యేకత్వం ప్రసాదించిన గణపతిదేవుడు—రుద్రమ్మలను ఆంధ్రలోక మెట్లు శాశ్వత స్మరణంలో గౌరవం చేస్తుంది? ఆంధ్ర దేశానికి ముఖ్యంగా తెలంగాణమునకు ఆశక్తి లేకపోయిందా? ఊహా బలం చాలక పోయిందా! అంతా నశించి పోయింది. వారివారి శిల్పాలు లేఖనాలు, సమస్తం మట్టిపాలైనయి. రూపనామ శేషాలు లేకుండా శీర్ణించి పోయినయి. ఆ పేర్లే ఆ భావాలే ఆంధ్రుల హృదయాల్లో అదృశ్యమై పోయ్యేకాలం సమీపించింది. కాని అదృష్టవశంచేత కవులు చరిత్రకారులు వ్రాసిన వ్రాతల్లో వారి స్వరూపాలు ప్రతిబింబిస్తూన్నయి. ఆకాలంలో పాడిన జాతీయ గీతాల్లో వారి జీవనచరిత్రలు కొన్ని కనిపిస్తూన్నయి. ఆ ప్రతిబింబాలు సృష్టికర్తల వూహాచ్ఛాయలే గాని సత్యస్వరూపాలు కాకపోవడం మాత్రం దురదృష్టం. ఎంత వైభవ మనుభవిస్తేనేం, ఎంత ప్రతాపం ప్రకటిస్తేనేం ఆచారం తప్పిందిగాదు.

పదకొండు వందలేండ్లు ఆంధ్రుల కాశ్రయమిచ్చి కొడుకు కూతుళ్లతో ఆంధ్రదేశమంతా అమృత జ్యోతులు వారజల్లిన కాకతమ్మ గూడా—కాల గర్భంలో గలిసి పోయినది.

"Death like an over flowing
Sweeps us among our life's a dream".

కాకతమ్మ ముందో ప్రతాపచక్రవర్తి ముందో దానికింకా తెలియలేదు. సర్వమయి అయిన ప్రకృతికే ఆ విషయ మింకా తెరచాటుగా వుంది. ప్రతాప చక్రవర్తిపేరు హృదయాన్నే గాదు. ఆంధ్ర జాతికే పులకరింప జేస్తుంది. కన్నులు ముత్యపు చిప్పలవుతయి.

ఇందాకట్నించి ఒక్క విధంగా అనుభవిస్తూవున్న నిర్వేదం అదృశ్యమయింది. భారత యుద్ధంలో భీష్ముని వలె హృదయం పడుతువారింది. తప్పపాటిలో ఓడ్ర, ద్రవిడ, కర్ణాట, మహారాష్ట్ర దేశాలను మ్రింగివేసిన ఆంధ్ర సామ్రాజ్యం కన్పించింది. వైరిజన భద్రుడని లోకం నమ్ముతూ వుండే చక్రవర్తి మూడు కన్నులతో సాక్షాత్కరించాడు. త్రిపురాంతక కాంబదేవుల భయంకర యుద్ధాలు కన్నులగట్టి నట్లయినయి. విద్యానాథాది మహాకవులు ఘంటము ఆకులు పుచ్చుకు నంచునట్లు తోచింది. హృదయం తనలక్ష్యాన్ని మరిచేని 'మీదకో' త్రిప్పినట్లు చేయి కదిలింది, కలం జిక్కింది. కన్నులలో నుండి జారుతూన్న ముత్యాలు క్రిందపడ్డంతోనే జాజువారినాయి. అది ఆంధ్రవీరుల పవిత్ర రక్తంతో పునీతమైన కర్మభూమి గావున. కాలం మారిపోయింది. ఆంధ్రదేశం, ఆంధ్ర జాతి, ఆంధ్రం తమ ఆశలు దాచిపెట్టుకున్న ఆంధ్ర చక్రవర్తి విజయ లక్ష్మి అదృశ్యమై పోయింది. పరిజనం పోయింది. చక్రవర్తి పోయినాడు. మహా సామ్రాజ్యంగాని వైభవంగాని సామంతరాజుల వినయప్రేమలుగాని మాచల్ దేవి సౌందర్య సాహిత్యాలుగాని ఆయనకు జీవం ప్రసాదింపలేను. ఒక్క క్షణంగూడ రక్షించుకో లేకపోయినయి.

ఇంతటితో ఆయన జీవితము ముగిసిపోయింది. ఆయన నిర్మింపించి రక్షించిన శిల్పం సాహిత్యం చరిత్ర కన్న మరి అధికుణ్ణి చూడాలంటే వేరొక సాధనం లేదు.

ఆంధ్ర మందిరంలో వెలుగుతువుండే ఒక విస్తృత ఆరిపోయింది. ఆంధ్రాకాశంలోనుండి ఒక నక్షత్రం నేల రాలింది. ఆంధ్ర భాండారంలోనుండి ఒక అనర్ఘ్యరత్నం శకలీభూతమై భూమిలో లీనమైంది. ఆంధ్రము అంధః ప్రాయమై నరకమైంది. నిజానికి ఆ నక్షత్రాన్ని ఆ మహా రత్నాన్ని కొందరాంధ్రు లసలే ఎరుగరు. కొందరికి కథ కొత్త నాటకము. కొందరి చెవుల కది నూతనభాష. ఒకనాడాంధ్రనగరంలో పురంధ్రుల నందరిని తుంగభద్ర శిఖరారోహణ మొనర్పించిన ఆ మన్మథుణ్ణి చూడాలంటే ఆంధ్రులు నవ్వుతున్నారు. ఆంధ్రజాతియొక్క ప్రత్యేకత్వం గౌరవం ఆ మహామహుని చరిత్రాన్వేషణంలో

వుండంటే ఆంధ్రుల చేవ తక్కువడం లేదు. బౌద్ధులు బుద్ధుని యొక్క అవయవాలు తురకలు మహమదు యొక్క వెంట్రుకలు దాచిపెట్టుకున్నారంటే ఆంధ్రులేం దాచుకున్నారు? ఈ ప్రశ్నకు జవాబేలేదు.

మా ప్రాచీనాంధ్ర కవుల తాళపత్ర గ్రంథాలు భోగిమంటల పాలు. మహారాజుల శాసన శిలలు తటాక సోపానాల పాలు. అని పరిశోధకులు కనిపిస్తూవుండే అనుతాపం ఆంధ్రులను ఇంకా పూర్ణంగా కదిలించలేదు. ప్రత్యేకంగా పల్లెకొక్కరు చొప్పున ఆంధ్రులు బయలుదేరి శిల్పాన్ని చరిత్రను సంపాదించంది, పరిశోధించంది ఆంధ్రుల చరిత్ర పూర్ణంగాదు. సందేహాలు విచ్చిపోవు. ఆంధ్ర చక్రవర్తులకు ఆంధ్రజాతి అచ్చుదగియున్న ఋణం విముక్తిగాదు. శిల్పాన్ని పరిశోధించి ఆంధ్ర చక్రవర్తు విగ్రహాలు గుర్తించంది లేఖనాలు ప్రచురించి చరిత్ర గ్రంథాల విప్పంది జన్మమరణ దినాలు గ్రహించి పవిత్ర దినములుగా వానిని గణించనిది వారివారి సేవలను రాజకములుగా పూజించంది ఆంధ్రజాతి ప్రత్యేకంగా తెలంగాణము పునీతం గాదు. కృతార్థంగాదు. తెలుగువాడై తెలుగు మాటాడే ప్రతివాడికి నన్నదగినది ధర్మం అని సాంద్యా ఋణములు ప్రతిబింబించే మిత్రుని కన్నుల్లో నుంచి ఆంధ్ర లక్ష్మి నెత్తుర చుక్క ఆంధ్ర హృదయం లాగుకొయ్యి వారియున్న ఆంధ్ర సాగరము నొకసారి పరీక్షించి నిర్వేద పూరితంగావున్న ఆ న గానాన్ని ఆ అన్వేషణ యోగాన్ని గ్రహించు. స్పష్టం తెలుస్తుంది.

## ప్రణయతరంగిణి

గవ్వా అమృతరెడ్డి

జగముల సృష్టించి సమయించు నట్టి • సగుణ నిర్గుణ మందుఁ జరియించు నట్టి
అఖిలలోకంబుల కాదియై నట్టి • సుఖదుఃఖ చయములో నురగి యున్నట్టి
దేవదేవుని జూచు తీవ్రవేదనయె • భావాన నిలచిన్ర బాధించుగాక!!

* * * * * *

వేదవారాశిపై విహరించువాడు • సాధులోకంబులోఁ జరియించువాఁడు
ప్రణయసాగరముపైఁ బవళించువాడు• మణిమయమూర్తి, నిర్మలమనోవాసి
పావనరూపుండు పరమాత్ముఁడనెడి • భావంబె ననుబట్టి బంధించుగాక!!

* * * * * *

శుభలోకపూజ్యుండు సుజనబాంధవుఁడు•నభవుండు నిత్యుండు నమృతరూపుండు
భవభంజనుండు నన్ బాలించువాఁడు • కవగూడినాతోడఁ గాచు నన్ననెడి
విపుల విశ్వాసాన విహరింతుఁగాక!!

* * * * * *

చేతులెత్తితి నన్నుఁ జేర్చుకొమ్మనెడి • నేతవై నాపైన నెనరుంచు మనెడి
గతినీవ నాకు లోకము నీవ యనెడి • జతనంబు నన్ గాంచ జరుపవే దనెడి
నుడువులెల్లపుడు నా నోటవసియించి • కడసారి నీలోనఁ గలుపునుగాక!!

# మహమ్మదీయ రాజులు సంస్కృత భాష

**శేషాద్రిరమణ కవులు**

మహమ్మదీయు లంకితమునందిన యాంధ్రకావ్యములలోఁ దపతీసంవరణోపాఖ్యానము, యయాతి చరిత్రము మాత్రము మన మెఱుఁగుదుము. మనకుఁ దెలియరాక యింకెన్ని యాంధ్ర కావ్యములు గలవో. మహమ్మదీయులలోఁ బెక్కండ్రు నృపులు సంస్కృతభాష నాదరించి సంస్కృత కావ్యములను గూడ నంకితముగాఁ గొన్నటులఁ గొన్ని గ్రంథ. దృష్టాంతములు గలవు.

ఇట్టి కావ్యములలో 'సులేమచ్చరిత' మొకటి. ఈ గ్రంథము సంస్కృత భాషలో శ్లోకాత్మకముగా వ్రాయఁబడెను. గ్రంథము నాలుగు భాగములుగానున్నది. వరుసగా నా భాగముల పేరులు ౧ దావూదు మోహో ద్భవః ౨ దావూదు మనోరథావాప్తిః, 3 సులైమ ప్రాదుర్భావః ౪ చిత్రకథా పాదనమ్.

గ్రంథ మంతయు ౫౪ పేజీల మీఁద వ్రాయబడినది. పూర్వకాలపుఁ గాగితపు ప్రతి. పుస్తకము 9½ అంగుళముల పొడవు 6¾ అంగుళముల వెడల్పు గలిగియున్నది. రమారమి ప్రతిపుటకు ౨౦ పంక్తులు కలవు. తెలుగులిపి. గ్రంథము సమగ్రముగ నున్నది. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తకాలయములో నీ గ్రంథము సంస్కృత గ్రంథముల పట్టికలోన నెం 12175 యగ నున్నది.

ఈ గ్రంథమును రచించిన కవిచంద్రుఁడు కల్యాణమల్లుఁడు. ఈయన 'అనంగరంగ' మను వేఱొక సంస్కృత కావ్యమును గూడ రచించియున్నాఁడు. సులేమచ్చరితము నందలి కథాంశము బైబిలు నందలి దావీదు కుమారుఁడగు సులేమాను అను వాని చరిత్రము. ఈ కావ్యరత్నమును కల్యాణమల్లుఁడు అయోధ్యా పాలకుఁడును మహమ్మదీయ వంశాలంకారుఁడును అహమ్మదు అను నాతని కుమారుఁడునగు లాడేఖాను అను మహమ్మదీయ నరపాలకుని ప్రోత్సాహమున రచించినటుల గ్రంథము వలనఁ దెలియుచున్నది. క్రైస్తవమత బోధకమగు బైబిలు పై గౌరవబుద్ధియు దానిని సంస్కృతమున నాదర భావముగల యీ మహమ్మదీయ నృపాలుఁడు ప్రశంసా పాత్రుఁడు. సంస్కృత వాఙ్మయము నెడ నాదరము చూపి సుప్రసిద్ధుఁడగు కల్యాణమల్లకవిని గౌరవించి గ్రంథ రచనమునకుఁ బురికొల్పిన పరమత సహనశీలుఁడగు మహమ్మదీయ నృపునిచరిత్రము గ్రహించుటకై తత్కావ్యాది నుదాహరించుచున్నారము.

శ్రీశ మీశంచ వాగీశం లక్ష్మీం గౌరీం సరస్వతీం
గణేశ మపి వాల్మీకిం వ్యాసంచాపి నమామ్యహం
ఆసీ దయోధ్యాధిపతి ర్బలవాన్ బలభిత్సమః
వైభవే విక్రమే తస్య నాస్తి తుల్యో నరప్రభుః
విద్వాన్ విశేష విచ్ఛురః ప్రజాపాలన తత్పరః
లోడి వంశావతంసశ్చ దయాదాక్షిణ్య తత్పరః
అహమ న్నృప ఇత్యేవం విఖ్యాతో ధరణీతలే
తస్యపుత్రః సుశర్మాత్మా నీతిమాన్ ప్రీతిమాన్ వశీ
గాంభీర్యౌదార్య సౌందర్య ధైర్య శౌర్యాది సద్గుణైః
మేధా విజిత దేవేజ్యః రూపనిర్జిత మన్మధః
కామసిద్ధాంత విద్యాంశ్చ కామినీనాం మనోహరః
లాడిఖాని ఇతిఖ్యాతో లాలిత్య గుణమండితః
సకదాచి త్సమాసీనః సభాయాం సహపండితైః

కథాభి రభిరామాభి రితిహాసైః పురాతనైః
శాస్త్రవాదైః కలావాదై ర్ధాతువాదైర నేకశః
విద్వద్విశేషంవిజ్ఞాయ దానమానాదిభిశ్చతాన్
సంభావయన్ సమాసీనో మహాపురుష సత్కథాం
శ్రోతుకామ స్తదాసూరి మండలే స్వాశ్రితంబుధం
పప్రచ్ఛ కవిరాజేంద్ర కావ్యనిర్మాణ కౌశలం
కల్యాణమల్ల నామానాం కవిం స్తుత్యసవాఙ్ముఖం
త్వమస్మదాస్థానకవిః సర్వశాస్త్రార్థ పారగః
పురాహ్య నంగరంగాఖ్యం కలాశాస్త్రం కలాస్పదం
గీర్వాణభాషయా విద్వ న్మానసానంద దాయకం
కృతవానసి మత్ప్రీత్యై బంధురం లోకసుందరం
ఇదానీమపి సద్విద్వ ఛ్ఛ్లాఘ్యం సర్వార్థ గోచరం
సులేమచ్చరితం బ్రూహి చిత్రం గీర్వాణ భాషయా
దావూదు తనయోవిద్వాన్ సులేమాన్ జ్ఞాన విగ్రహః
ద్వాపరాంతేచ కల్యాణా న్మ్లేచ్ఛ వంశే మహాతపాః
సముత్పన్న స్సప్తసుతాః గర్భభర్తా చంద్రమా ఇవ!

(తాత్పర్య సంగ్రహము. అయోధ్యా పరిపాలకుఁడును అప్రతిమానుఁడును పండితుఁడు పరిపాలన తత్పరుఁడు లోధివంశజుఁడు నగు అహమ్మదు అను నృపాలుఁడు గలఁడు. అతని కుమారుఁడు బుద్ధిశాలి, సౌందర్య వంతుఁడు లాడిఖాన్ గలఁడు. అయన విద్యా వాదములు ధాతు వాదములు శాస్త్ర వాదములు చేయు పండితులతో నావరింపఁ బడిన తన సభాస్థానమునం దాసీనుడై మహాపురుషుల జీవిత కథ నాలకింపఁదలంచి పండిత మండలమునం దున్న తన యాశ్రితుఁడును కవిరాజును ఆస్థాన కవియు నగు కల్యాణమల్లకవిని పిలిచి గౌరవించి, కవీంద్రా, నీవు మునుపు అనంగరంగ మను కలా శాస్త్రమును సంస్కృతమున రచించి నన్నానందపఱచి నాఁడవు, నేఁడు దావూదు పుత్రుఁడగు సులేమాన్ చరిత్రము సంస్కృతమున రచింపుమని కోరను).

పై గ్రంథ భాగము వలనఁ గల్యాణమల్లుఁడు లాడుఖాన్ ఆస్థాన కవియనియు నాయన యాస్థానము సంస్కృత పండితులచే నావరింపఁబడి యుండునదనియు, కల్యాణ మల్లకవి అనంగ రంగమును లాడుఖాన్ ప్రభుని యాదరణమున నే రచించెననియుఁ దెలియుచున్నది. గ్రంథాంతమునందీ శ్లోకములు గలవు.

ఏవం భూపతి రాత్తమిత్ర మతులై ర్వస్త్రైర్మహా భూషణైః
అశ్వైర్వారణ గోఖరోష్ట్ర మహిషీ శ్వాజావికై ర్విస్తరైః
సంపూజ్యా త్యజనైః సమం స్వనగరీం సంప్రేషయామాసత
ద్భార్యాకార్యమ వార్యమాత్మ నిమహాశ్చర్యేణ

(సంపూర్ణము

కవికాలమును కవిగ్రంథ రచనా కాలమును గూర్చి మఱియొక మాఱు ప్రత్యేక వ్యాసమున జర్చింప నున్నారము. పాఠకులఁ గూడఁ జరిత్రాంశమునఁ గృషి చేయుటకై గ్రంథము నందలి చరిత్రాంశములఁ దెలియఁ జేయు కథా భాగము మాత్రమె యుదాహరించినారము. ఇంకను మఱికొందఱు సుప్రసిద్ధ సంస్కృత కవులు మహమ్మదీయ నృపాలుర యాదరణమున గ్రంథములు రచించి యున్నారు. ప్రకృత కవి జీవితములోని యంశములు తెలియుటకై సులేమచ్చరిత్రము నందలి గద్య నుదాహరించి యింతతో నీవ్యాసము ముగించు చున్నారము.

'ఇతి శ్రీమదయోధ్యాపురాధి నాథ సకల కలా సనాథ విద్వజ్జన జేగీయమాన గాన విద్యానిధాన లాడఖాన ప్రమోద సంధాన సుకవి హృద్వల్ల కల్యాణమల్ల మహాకవిరాజ విరచితే సులేమచ్చరిత్రే చిత్రకథా పాదనం నామ చతుర్థః పటలః॥'

# స్వప్న చిత్రము

"కవిసోదరుడు"

పల్కుపల్కుల దేనెలు జిల్కుచుండ
కనుల విద్యుత్ప్రసారంబు గల్గుచుండ
దేహమున క్రొత్త తేజము దేజ రిలఁగ
నడకలోన నొయ్యారంబు నటనసేయ

* * * *

లీలలోన శృంగారము లెక్కఁగొనఁగ
కట్టులోపల కాంతులు గదలుకొనఁగ
సిగను నొకక్రొత్తదౌయెమ్మె చిందులాడ
బొట్టులోపల నొకవింత పొటమరించ

* * * *

నగలలోపల క్రొత్త విన్నాణమొప్ప
కలను నేనొక కాంతనై కానఁబడితి;
మూఁగినారు నాచుట్టును పురుషవరులు
వంకపాగాలు క్రొత్త వైభవము నెఱప

* * * *

కట్టుధోవతుల్ చక్కని కళలనీన
లాగు లొక కొంత వగలను లావుసేయ
కంటిజోళ్లొక విధమైన కాంతిగొలుప
నంగరఖులు మంజుత్వ మందికొనఁగ;

* * * *

ఏలవీరంత మూఁగిరో యెఱుక పడదు
కన్నుసైగల నొకఁడు సన్నగించు మనుచు

చేతిసైగల నొకఁడ న జ్ఞేసుమనుచు
స్పష్టముగ నొక్కరుండు నావంకజూచి

* * * *

"తరుణి! నీచేత నామనస్తాప మారు
వనిత! నీచేత నాగీము వాసిగాంచు
అతివ! నీచేత నాదు మర్యాద పెరుగు
రమణి! నీచేత నాకు గారవము గల్గు
బరుపవే దృష్టి నామీఁద బాళిమీఱ"

* * * *

యనును; 'కులమున నేపెద్ద'యనునొకండు
'గుణమునను నాకు తులలేదు కోమలాంగి'
యనును నొకరుండు; నీవిధ మంతగాంచి

* * * *

దిగులు పుట్టెను మనమందు, దేహమంత
చెమ్మటించెను, యిదియేమి చేటువచ్చె?
తనదు వృత్తి రవంతయు దప్పనేని
ప్రజలు చుల్కన జూతురు ప్రతిభ చెడఁగ"

* * * *

ననుచు గుప్పున తెలివంది కనులు విచ్చి
చూచితిని కంటి కేదియు దోచలేదు
స్వప్నచిత్రం బటంచును నఁగుకొంటి



# విచిత్ర హత్య

## వెంపటి నాగభూషణం

(౧)

అపరాధ పరిశోధక శిఖామణి శ్రీ గోవర్ధనశాస్త్రి అప్పుడే వూరినుంచి వచ్చాడు. స్నేహితుడు, చెంగల్వారాయచెట్టి క్రొత్త కబురు లేమిటన్నాడు. భార్య వచ్చి క్షేమమా, అన్నది. పిల్లలు చుట్టూ ముగారు. ఈ సమయంలో టెలిగ్రాఫ్ బంట్రోతు వచ్చి శాస్త్రి కొక తంతివార్త నిచ్చాడు. అత డది విప్పి చూచే సరికి యిట్లా వుంది.

,,అయ్యా, నా తండ్రి గిరిరావు నిన్నరాత్రి అకస్మాత్తుగా హత్య గావింపబడినాడు: అపరాధిని పట్టి యిచ్చేవారికి మంచి బహుమానం యివ్వబడును. మీరు యీ విషయాల్లో మిక్కిలి సమర్థులు. కాబట్టి తరితమే వచ్చి పరిశోధన మొదలు పెట్టవలసింది.

రాధాకాంత.,,

శాస్త్రి, అంతా చదివి, వేడి నిట్టూర్పొకటి విడిచి చెట్టి వైపుకు తిరిగి యిట్లన్నాడు—,,ఓరే, విన్నావా? లక్ష్మీపుర వర్తక శిఖామణిన్ని, లక్షాధికారిన్ని అయిన గిరిరావు నిన్నరాత్రి హత్య చేయబడ్డాడని అతని కూతురు తంతి పంపింది. అటువంటి దయార్ద్ర హృదయునికి, ధర్మ శీలునికి, శత్రువులుండుట అసంభవముగా కన్పడుతుంది. చూడగా, యిదేదో విచిత్ర హత్యలాగున్నది హంతకుని కనుగొనటం కష్టమే గావచ్చు. అయినా, చెట్టీ, నువ్వుగూడా నాతో ఆ వూరికి రావాలి. తెలిసిందా? త్వరగా సిద్ధపడు.,,

అంతా విని, చెట్టి గూడా ఒక నిట్టూర్పు విడిచి స్నేహితుడితో లక్ష్మీపురానికి వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాడు.

*  *  *  *

పన్నెండు గంటల రైలులో, శాస్త్రి; చెట్టి లక్ష్మీపురానికి బయల్దేరారు. అందులో కూర్చుండి వారు యీ హత్య విషయమే మాట్లాడు తుండగా, రైలు లక్ష్మీపురం ప్రక్క స్టేషను చేరింది. అక్కడ ఆగడంతోనే ఒక బలిష్ఠకాయుడొచ్చి వీరున్న బండిలోనే ఎక్కాడు. శాస్త్రి, యేదో పత్రిక చదువుతూండడంచేత. ఆ నూతన పురుషుడు చెట్టి నుద్దేశించి ,,ఏమండీ మీ రెందాకా ప్రయాణం,, అని ప్రశ్నించాడు.

,,లక్ష్మీపురానికి,, అన్నాడు చెట్టి క్లుప్తంగా.

,,లక్ష్మీపురానికీ, నేనూ అక్కడికే;,,

,,మీ రెందుకు అక్కడికి పోతున్నారు?,,

,,నేనావూళ్లో ప్లీడర్ని. నా పేరు కృష్ణారావు— అయితే. మీ రెందు కెళ్తున్నారు?,,

నాపేరు శాంగల్వ రాయచెట్టి. ఈతడు, నామిత్రుడు గోవర్ధనశాస్త్రి. లక్ష్మీపురంలో జరిగిన గిరిరావు హత్య విషయంలో, హంతకుని కనుక్కోడానికి శాస్త్రిగారిని రమ్మని, రాధాకాంత వ్రాసింది. అందుకని మేము అక్కడికి వెళ్లుతున్నాము!!

„అట్లాగా. గిరిరావు హత్యా రహస్యాన్ని తెలిసికోడానికేనా మీరు వెళ్లేది. మంచిది. అతనెంత మంచివాడండీ! అటువంటివాడు మరొకడు లేడు. అతనిహత్య చిత్రంగా వుంది. పాపం, ఇప్పుడాతని కూతురు, రాధాకాంత, కొంటకత్తె” అంటూండగానే రైలు లక్ష్మీపురం జేరింది. రైలు యింకా సరిగా ఆగక పూర్వమే, కృష్ణారావు తన సామానుతో ఆటాలున దిగి, త్వరితంగా పోయినాడు.

శాస్త్రి, చెట్టి, కృష్ణారావుయొక్క విచిత్ర సంభాషణ, విపరీతపు చేష్టలనుగురించి ముచ్చటిస్తు, మోటారులో, రాధాకాంత యింటికి పయన మైనారు.

(౨)

మోటారు ద్వారందగ్గర ఆగగానే, జరీదుస్తులు ధరించిన బంట్రోతు నొకడొచ్చి, అతిథుల నిద్దరిని లోపటికి తీసుకుపోయి, ఒక గదిలో కూర్చోపెట్టాడు. ఆగదిలో వివిధరంగుల వింతపటాలు, అద్దపు బొమ్మలు, నిలువుటద్దాలు, చలువరాతి బల్లలు, కుర్చీలు, సోఫాలు, వున్నాయి. శాస్త్రి, చెట్టి, వాటి నన్నింటిని చూచి ఆశ్చర్య పోతూండగా, ప్రక్కనున్న తలుపు తెరచికొని ఒక సౌందర్యవతి వచ్చి వారిచెంతనే నిలువ బడ్డది. సుమారు పదహారేళ్లుండవచ్చు వయస్సు...ఈమెయే రాధాకాంత!

„శాస్త్రిగారూ, టెలిగ్రాం అందిందా?” అన్నదామెమెల్లి...మృదువుగా,

„ఆ. అందింది: అందుకేకా, వెంటనే, బయల్దేరి స్నేహితున్నికూడా తీసుకొచ్చాను:”

రాధాకాంత దుఃఖించడము చూచి శాస్త్రి యిట్లన్నాడు. „అమ్మాయీ. నువ్వు అట్లాఏడవకు. జరిగిన చరిత్రంతా విపులంగా చెప్పు. హంతకుని కోసం తగిన కృషిచేస్తాను”

రాధాకాంత దుఃఖ మాపుకొని యిట్లా చెప్పింది. „శాస్త్రిగారూ, జరిగినదంతా చెప్తున్నాను వినండి. నాకిప్పుడు పదిహేనేళ్లు మాత్రమే వున్నాయి. నా యెనిమిదవ యేటే తల్లి చచ్చిపోయింది. అప్పటినుంచి నా తండ్రి నన్నతిగారాబముతో పెంచుతున్నాడు. నేనంటే అతిప్రీతి. ఆయనికి కొమారులు కొమార్తెలు, అంతానేనే. ఎప్పుడూ నాకుసౌఖ్య పెట్టేవాడు. తల్లిలేని కొరత తీర్చాడు.......................నిన్న సాయంత్రం, నేను నా తండ్రి మోటారులో షికారు వెళ్లాం. తిరిగి వచ్చి భోజనం చేసే టప్పటికి తొమ్మిదిగంటలైంది. అందుకని, ఎవరి గదిలోకి వారుపోయి నిద్రించాము. అర్ధరాత్రాన ఒక తుపాకి ప్రేలినట్లు చప్పుడైంది. వెంటనే లేచి యిటుఅటు చూచాను. కాని అంతా నిశ్శబ్దంగా వుండడంచేత పొరబడ్డానేమో అనుకొని తిరిగి నిద్రపోయాను.

„తెల్లవారినా నా తండ్రి బయటకు రాలేదు. స్నానపువేళ మించిపోవడంచేత, ఆయన్ని మేల్కొలిపేటందుకు సేవకుని పంపాను. తలుపు గడియవేసివుంది, పిలుస్తే పలుకలేదు, అంటూ వాడు తిరిగి వచ్చాడు. అందుకని, నేనే స్వయంగా ఆ గది దగ్గరకు వెళ్లాను, కాని ఎన్నిమారులు పిల్చినా బదులు రాలేదు. చేయున దేమి లేక నాౘర్లచేత ఆ తలుపు విరుగ గొట్టించా. లోన ప్రవేశించి చూచే సరికి నా గుండె అదరిపోయింది. నా తండ్రి శయ్యమీద విగత జీవుడై పడివున్నాడు” అంటూ రాధాకాంత ఏడ్వ దొడంగింది,

„అమ్మాయీ, వూరకే అట్లా ఏడువకు. ఇంకేమైనా వివరాలు చెప్పు

„పక్క యెక్కడా చెదరలేదు, ఒకచోట మాత్రం నెత్తురు మరక అయింది.....పైగా, తలదిండు క్రిందవున్న రూకల సంచికూడా కదిలించలేదు. ఆ గది కిటికీ అద్దం వొకటి మాత్రం బ్రద్దలైవుంది”.

„సంచిలో యే మాత్రం డబ్బుండేనుటి?

„నిన్ననే బ్యాంకునుంచి వచ్చిన రెండువేల రూపాయల నోట్లకట్ట, ఆయన తలక్రిందే పెట్టుకొని నిద్రించారు. ఆలోచించగా, యీ హత్యకు చోరత్వమే కారణంగా తోస్తోంది. శాస్త్రిగారూ. పోలీసువారు, హంతకుని కోసం ప్రయత్నించి వ్యర్థులైనారు. మీయొక్క అనుభవ జ్ఞానం వల్లనో, పరిశోధనా నైపుణ్యంవల్లను

హత్యారహస్యాన్ని మీరే కన్గొనాలి. ఆబాధ్యత మీది"

"అమ్మాయీ, యీ గృహాంతర్భాగాలని, హత్య జరిగిన గదిని; నేనొకసారి చూడాలి."

"ఆ తప్పకుండాను. అందుకు సందేహమేమి? అయితే, మీ అభిప్రాయం మేమిటి?—ధనం కోసం హత్య అంటారా, లేక హత్యయే ప్రధాన మంటారా,

"ఆసంగతి యిప్పుడే యెట్లా నిర్ణయింపగలం? నిలకడ మీదగాని నిజం బయల్పడదు. అయితే; నిన్నరాత్రి మీ నౌకరు లందరూ వారివారి స్థానాలలో వున్నారా? వారసలు నమ్మకస్థులేనా?"

"ఆ. నౌకర్లందరూ, వారి యథాస్థానాలలోనే వున్నారు. వార్ని అనుమానింప వలసిన పనిలేదు." అంటూ రాధ ఒక పరిచారికను పిల్చి కాఫీ తెమ్మంది. మరొక క్షణంలో వారు ముగ్గురూ వెండిగిన్నెల్లో కాఫీ స్వీకరించి గృహం చూచేటందుకు లోపలికి వెళ్ళారు.

(౩)

అట్లా వారు ముగ్గురూ పోతూండగా, ఒక ప్రక్క గదిలో కృష్ణారావు కూర్చొని వుండడం చూచారు, శాస్త్రి, చెట్టి, అతన్ని పలుకరించి "వచ్చి ఎంతసేపైంది" అన్నారు.

"ఇప్పుడే. పదినిమిషాలైంది" అని క్లుప్తంగా సమాధానం చెప్పి, పెడమొగం పెట్టాడు. అసలతడు అక్కడికి ఎందుకు వచ్చాడో, అడుగుదామను కొని, తిరిగి యెందుకో అనుమానించి వూర్కొన్నారు. పోయి, పోయి వారు గిరిరావు శయ్యామందిరం చేరారు. ఆగదికున్న మూడు కిటికీలు పూదోటలోనికి తెరచుకొన్నాయి. భూమిపైనుండి, సుమారు నలభై, అడుగులెత్తుంటుంది. ఆమూడు కిటికీలలో ఒకదానికి అద్దం బ్రద్దలైవుంది. కొంతసేపు వారు యిటు అటూ, చూచి తిరిగి వస్తున్నారు. అప్పుడు శాస్త్రి, రాధాకాంతని "ఏమమ్మా, మీనాన్నగారి తలక్రిందున్న రివాల్వ రేమైంది" అనిఅడిగే సరికి" ఇదిగో, యీబీరువాలో పెట్టాను "అని వచు వెత్తికొని వెళ్ళి తీసుకవచ్చి "అయితే, ఏమండి, మానాయన తలక్రింద రివాల్వ రున్నదని మీకెట్లా తెలుసును" అనడిగింది.

"ఏమో, యింత భాగ్యవంతుడు, రివాల్వ రుండకుండావుంటుందా అనివూహించాను" శాస్త్రి రివాల్వరు తీసుకొని పరిశీలించి చూచి, అడిగాడు ప్రశ్న—"ఏమమ్మా యిందుండి ఒకగుండు ప్రేల్చబడివుందే?"

"అవును. మొన్న మానాన్నగారే పేల్చారు దాన్ని."

"ఎందుకు!"

"వేటకిబోయి. కుందేలుపిల్లనొకదాన్ని కాల్చారట."

"ఏకీసంగతి యెవరుచెప్పారు?"

"ఆయనేచెప్పారు."

"అయితే, ఆయనచేసిన ప్రతిసంగతి నీతో చెప్తుంటారా?"

"అప్పుడప్పుడు చెప్తారు."

"సరేగాని, మరొకసంగతి. ప్రస్తుతం రహస్యసంగతి అట్లేపెట్టు. దొంగతనముచేసినవారు, ఆస్థలానికి వారు దినం వస్తారట."

"ఎందుకూ?"

"ఏమో తెలియదు. కాని తప్పకవస్తారట. అందుకని నేనీరాత్రి తోటలో కాపలావుంటాను."

"సరే మీరు యిష్టంవచ్చినట్లేచేయండి. దానికేమి అభ్యంతరం. ఏవిధానైనా అపరాధిని కనుక్కోవటమే ముఖ్యం."

(౪)

రాత్రి, శాస్త్రి వెళ్ళి తోటలో చెట్లచాటున దాగుకొన్నాడు. నిద్ర రావడం చేత చెట్టి, ఒక గదిలోకి పోయి, అందుకొరకై సిద్ధం చేయబడిన శయ్యపై పడుకొన్నాడు.........తరువాత కొంత సేపటికి గదిలో ఏదో చప్పుడైంది. అందులో కెవ్వరో నల్లని దుస్తులు ధరించిన వ్యక్తి వచ్చి పోయినట్లు తోచింది. వెంటనే చెట్టిలేచి గడియారం చూచేసరికి, ఒంటి గంటైంది. మిత్రుడు శాస్త్రి, తోటలో యేమిచేస్తున్నాడో చూద్దామని చెట్టి గవాక్షం దగ్గర కెళ్ళాడు. నల్లని దుస్తులు ధరించిన వ్యక్తిని, శాస్త్రి మెల్లగా వెంబడిస్తున్నట్లు కనబడ్డది. శాస్త్రికి సహాయం చేద్దామనే అభిప్రాయంతో చెట్టి తొందరగా మేడమెట్లుదిగి వస్తున్నాడు. కాని వెంటనే చెట్టి దేనిలో తగిలి క్రింద పడ్డాడు.

ఆ నల్లనిదుస్తులు ధరించిన మనుష్యుని వెంబడించుచు, ఆ వ్యక్తి తొందరగా నడుస్తూ దొడ్లోవున్న గమలవైపుకు పోయాడు. ఆ కోటు చేరడం తోనే ఆగూఢ పురుషుడు చెట్టిని గట్టిగామోది . అదృశ్యమైనాడు.

చెట్టి కండ్లుతెరచి, తానొక మంచముమీద పరుండి వుండడం, ప్రక్కనశాస్త్రి కూర్చుని వుండడం, చూచి „నన్నిక్కడికి కెవ్వరు తీసుకొచ్చారు" అని ప్రశ్నించాడు.

„నేనే" అన్నాడు శాస్త్రి.

„ఎట్లా?"

„నువ్వు వెంటాడిన గూఢవ్యక్తిని నేనుగూడా వెంబడిస్తున్నా. నేనొక చోటికి వచ్చేటప్పటికే నీవు స్పృహ తప్పి పడి వున్నావు. ఆవ్యక్తి లేడు. అప్పుడు నేనే నిన్ను మెల్లగా, యిక్కడికి తీసుకు వచ్చాను."

„అయితే, ఆవ్యక్తి దొంగయనా నీ యభిప్రాయం?"

„అవును. వాడే హంతకుడు గూడ!"

„ఎట్లా!"

„చెప్తా, విను. నేను తోటలో దాగివున్న సమయం లో ఒకడు నల్లనిదుస్తులు ధరించివచ్చి, ఒక చెట్టు మొదట యేదో త్రవ్వ ప్రారంభించాడు.. వాణ్ని పట్టుకో డానికి నేను బయిటికి వస్తుంటె, వాడుజూచి, అగమలవైపు పారిపోయినాడు. ఆ వేషం చూస్తేనే కొంచెం అనుమానంగావుంది. అందుకనే పూర్తిగా వెంబడించకుండా సగంలో ఆగిపోయాను. వాడే హంతకుడనే తోస్తోంది. ఏమో; యింకా కొంత పరిశ్రమచేస్తేనే కాని నిజం తెలియదు."

(౫)

శాస్త్రి, చెట్టి, రాధాకాంత—మువ్వురు మాట్లాడుకుంటున్నారు.. అప్పుడొక సేవకుడొచ్చి రాధ కొక కార్డు యిచ్చాడు. అందుపై „వెంకటరావు" అని వున్నది. „సరే రమ్మను" అన్నది రాధ.

ఒక సన్నని పొడుగు మనిషి, మంచి విలువగల దుస్తులు ధరించి లోపలికి వచ్చి, ప్రథమ సందర్శనా మర్యాద కేమీ లేకుండానే „ఏం, రాధా, ఎందుకో రమ్మన్నావుట?" అన్నాడు. అంత రాధలేచి, „ఇప్పుడే వస్తాను" అని శాస్త్రి, చెట్టితో చెప్పి, వెంకటరావుని తో మరొక గదిలోకి పోయింది.

„అయితే, శాస్త్రి, యింత పిన్నవానికి రాధాకాంతతో ఏమిపని వుంటుంది" అని చెట్టి అడుగగా, „బహుశః ఆతడు రాధాకాంత ప్రియుడు కావచ్చు. లేకపోతే ఆతడు చనువుగా అందరిలో ,రాధా' అంటాడా?"

ఒక పావుగంటలో, రాధా వెంకటరావులు, నవ్వుతూ, గుసగుస లాడుతూ, బయటకొచ్చారు. అతన్ని సాగనంపి, రాధ, శాస్త్రి దగ్గరకు వచ్చింది. వచ్చిపోయిన పురుషుడెవ్వరో, ఇమె చెప్పదుకాని, వారు అడుగటకాని సాహసించలేదు.

ఇంతలో శాస్త్రి, చెట్టిని పిల్చి చెప్పాడు—

„నిన్న రాధసేవకులు కోర్టులో యేవో వాఙ్మూలాలు యిచ్చారట. ఇప్పుడు నీవక్కడకుపోయి, వాటి నకళ్లు తీసుకు రావాలి". „అలాగే" అంటూ చెట్టి వెళ్లాడు.—

చెంగళ్వ రాయచెట్టి కోర్టుకు చేరునప్పటికే, జడ్జీ తీర్పు పలికించాడు అప్పుడే, వెంకటరావు, జడ్జీకెదురుగా బోనులో నిలబడి యిట్లు ప్రారంభించాడు

„అయ్యా, గిరిరావు హత్యారహస్యాన్ని తెలియజేయడానికే నేనిపుడు వచ్చింది. అతన్ని వధించినది నేనే!" అని కంటతడి బెట్టాడు. చుట్టునున్న వారంతా ఆశ్చర్యపోయినారు.

„అయితే, అతన్ని యేల చంపవలసి వచ్చింది?" అన్నాడు జడ్జీ.

„ఇదుగో, యీ రెండువేల రూపాయల కోసమే" అంటు నోట్లకట్టను జడ్జీకిచ్చాడు. కోర్టులో కలవరం చెలరేగింది.........ఇక అక్కడ నిమిషమైన నిల్చోకుండా, నకళ్లమాట మరచిపోయి, చెట్టి, యీ సంగతంతా శాస్త్రితో చెప్పడానికి పరుగెత్తుకొని పోయినాడు.

౬.

ఈ వార్త విన్నవెంటనే శాస్త్రి సంతోషంతో తలవూపాడు. తరువాత లేచి, రాధాకాంత వున్నగదిలోకి వెళ్లాడు. ఇతను వెళ్లేసరికి ఆమె, ఒక సోఫాపై

కూర్చుండి పూలు కట్టోంది. శాస్త్రి గది ప్రవేశించి, సంకోచింపకుండా ఒక కుర్చీ లాక్కొని రాధకు దగ్గరగా ఆసీనుడైనాడు.

,,ఏం, శాస్త్రిగారూ, యిట్లా వచ్చారు'' అన్నది రాధ.

,,అపరాధిని కన్గొన్నాను!''

,,నిజంగా?''

,,అవును'' అంటూ శాస్త్రి తన జేబూనుండి ఒక తాళంచెవి, అద్దాలుకోసే పనిముట్లు బయిటికి తీశాడు. వీటిని చూడడంతోనే రాధముఖంలో కొంచెం మార్పుకల్గింది.

,,ఈపని ముట్లు, నాకు, తోటలో, ఒక చెట్టు కుదిటిలో దొరికినాయి!'' అన్నాడు శాస్త్రి.

,,అట్లనా!

,,పరీక్షించి చూడగా, అగది అద్దం బ్రద్దల కొట్టబడినట్లు తోచుటలేదు.''

,,మరి!

,,ఎవ్వరో, యీపనిముట్టుతో అద్దాన్ని లోపలనుండే కోసినట్లుగా తెలుస్తోంది.''

,,లోపలనుండా?''

,,అవును. ఈతాళంచెవి, నీతండ్రిగదిది. ఈపని ముట్టుతో అద్దం కోయబడినది.'' అంటూ ఆరెంటిని రాధకు దగ్గరగా చూపాడు.''

,,అదెట్లండీ?''

,,వెలుపలినుండి మనిషి లోపలికి వచ్చుట అసంభవం.''

,,అయితే, యిప్పుడు మీ యభిప్రాయం ఏమని!''

,,అపరాధి. స్త్రీయని!''

,,స్త్రీయా?''

,,అవును.''

,,ఎవ్వరామె!''

,,ఎవ్వరోనీకు తెల్సు. చెప్పమంటావా!''

,,ఆ. అంత నీచంగా, నాతండ్రిని చంపి డబ్బును దొంగిలించిన, దుర్బుద్ధి గలస్త్రీ పేరు చెప్పండి''

,,ఆమెయా!''

,,చెప్పండి—అనుమాన మెందుకు.''

,,ఆమెయా, రాధాకాంత!''

,,ఆ. ఆ. తుచ్ఛుడా. ఏమంటున్నావూ.'' అంటూ రాధాకాంత, తన చేతులోవున్న సన్నని సూదితో శాస్త్రిని పొడువ సాహసించింది. శాస్త్రి ఆమె చేతిని గట్టిగా పట్టుకొన్నాడు. సహాయంకోసం రాధ కేకవేయబోతూండగా ,,అగు. మెదలకు. తప్పు నొప్పుకో. లేదా, నీ ప్రాణాలు నిలికావు.'' అని రివాల్వరు గురిచేశాడు. రాధ ముఖమున కత్తివేటుకు నెత్తురులేదు.

౭

వలవల రోదిస్తూ గద్గద స్వరంతో రాధాకాంత యిట్లు చెప్పింది.—,,శాస్త్రిగారూ, చరిత్రంతా చెప్తాను వినండి.—నేను కృష్ణారావు అనే ప్లీడర్ని ప్రేమించాను. నాతండ్రి కది యిష్టంలేను. వెంకటరావుకిచ్చి వివాహం చేయడానికి నిశ్చయించాడు. నాయభీష్ట సిద్ధికై ఆటంకముగా వున్న నాప్రియ జనకుని తొలగించుటకై తగు సమయం కోసం వేచి యున్నాను. మొన్న రాత్రి, పన్నెండు గంటలకి నే నాయనగది ప్రవేశించి, యీ పాపిష్టి చేతులతో.........'' అని రోదిస్తూను.

,,తరువాత?''

,,నాయం దవ్వరూ, అనుమాన పడకుండా, కిటికీ అద్దాన్ని బ్రద్దల కొట్టాను. పైగా, పోలీసు వారికి ఫిర్యాదు చేశాను. మీకు టెలిగ్రాం పంపాను.''

,,ఈ తాళంచెవి, అద్దాలుకోసే పనిముట్టు యెందుకు?

,,మానాయనగారు తలుపుబిగించి పరున్నారు. నేను బయటినుంచి, యీ చెవితో తలుపు తీశాను. పైగా ఎవ్వరో దొంగలు బయటినుండి లోపలికి వచ్చినట్లుండేటందుకు అద్దం తీసేశాను. బ్రద్దలకొట్టే చప్పుడవుతుందేమో అనే భయంతో, యీపని ముట్టుతో మెల్లగా కోశాను.''

,,అయితే, తోటలోకి రాత్రి వచ్చిం దెవరు?''

,,నేనే. దొంగతనం జరిగిన మరురాత్రి తిరిగి దొంగ ఆచోటుకు వస్తాడని మీరు నిన్న చెప్పారే. మీరు, చెట్టు మొదట పాతిన, యీపనిముట్టు తీసుకు వస్తామనుకున్నాను. కాని మీచే తరుబడి, దొడ్లో కొట్టవేశ్తాను. పాపం, చెట్టని కొట్టాను గూడాను.''

„సరేగాని, యీదినం కోర్టులో వెంకట్రావు చెప్పిన దానికర్థంమేమిటి,?

„అతన్నిగూడా, నా త్రోవనుండి తొలగించడానికే యీయుక్తి పన్నితిని—తానే హంతకుడని కోర్టులో చెప్ప మంటిని. మరియు, నేనుగూడ వచ్చి నేనే హంతకురాలని చెప్పెదనంటిని. అప్పుడు కోర్టువారు యదార్థం తెలుసుకోలేక ఇద్దరను విడిచి వేస్తారన్నాను. అతడట్లాచేసిన, అతన్ని పెళ్లిచేసుకుంటానని చెప్పాను. నామాటలుకొంత అసమంజసముగ నున్నను, ప్రేమాంధుడగు వెంకట్రావు, సరే, అన్నాడు. పాపం! అతనిచేత అట్లా చెప్పించి, నేను తటస్థంగా వుంటే, అతనికి తప్పక వురిశిక్ష పడ్తుంది. నాకష్టం తీర్తుంది. అప్పుడు నేనూ, కృష్ణారావు వివాహ మాడవచ్చునని వువ్విళ్లూరితిని. అందుకే, ఇంత పాపిష్టి కార్యానికి వడిగట్టాను. శాస్త్రిగారూ, నన్ను క్షమించి, రక్షించండి! అని రాధాకాంత, గోవర్ధనశాస్త్రి పాదముల మీద పడ్డది.

# ఆశయములు

## కృష్ణమాచార్యులు

సరిగ శిరమున బర్హిపింఛము వెలుంగ, రుచులనీనెడి దరహాస రుచులు వెలయ
జగము వెలిగించు నైజతేజంబుఁ గలుగు, శ్యామసుందరుఁ జూడంగ జనెడు కోర్కె—

*　　*　　*　　*　　*　　*

లలిత పీతాంబరము దేహమలమికొనఁగ, కాళ్ల చిరుగజ్జియలు ఘల్లు ఘల్లుమనఁగ
తవిలి కాళీయుమౌళి నృత్యంబు సలుపు, భువనమోహనుదరి జేర బుద్ధి పుట్టె.

*　　*　　*　　*　　*　　*

గళమునను పుష్పహారముల్ కదలుచుండ, మేఘమాలల హసియింప మేనిసొబగు
లోల దృష్టుల జగములఁ దేలి యాడు, నంద నందను గొలువంగ నాకు వాంఛ.

*　　*　　*　　*　　*　　*

స్వచ్ఛ నిర్మల జ్యోత్స్న విశ్వంబుఁగప్ప, సంతతధ్వని యమునా స్రవంతి పార
ప్రకృతి కన్యక మోదబాష్పముల రాల్ప, శ్వేతలెల్లరు బొమ్మల రీతినిలువ

*　　*　　*　　*　　*　　*

పిల్లనగ్రోవి మోవికి నల్లి జేర్చి, నవ్యమోహన మధుర స్వగంబులెగయ
దివికి—బృందావనంబునఁ దజిరిల్లు, నా పరంజ్యోతి గలియంగ నాశనాకు.

# పెట్రోలియము పరిశ్రమ

(మూడవసంచిక తరువాయి)

పుల్లమరాజు వేంకటేశ్వర రావు

పెట్రోలియములో పలు రకముల తైలములు, ద్రావ్యాలు మున్నగు పదార్థములున్నవని మూడవ సంచికలో నూచింపబడినది. వీనిని వేర్వేరుగా విడదీయుటెట్లు? ఈ సమస్య పెట్రోలియములో నుండు గ్యాసునూనె, మోటారు పెట్రోల్, వ్యాసెలీన్ మొదలగు వివిధ ద్రవ్యముల భిన్న ధర్మముల (Different Properties) పై నాధార పడియున్నది. పెట్రోలియమును యొక ప్రత్యేక యూష్ణోగ్రతను బొందువరకు గాచినచో, కొన్ని తైలముల సమూహ మొకటి స్రుతమగును (distil] over). ఉష్ణోగ్రతను మరింత హెచ్చించినచో మరికొన్ని ద్రవ్యములు స్రుతమగును. ఇట్లు భిన్నయూష్ణోగ్రత దశలయందు (at different temperatures) కొంతభాగమును మాత్రమే స్రుతీకరించి, దానిని (స్రుతీకరణఫలమును— distillation product) వేరుగానుంచి, తిరిగి యిటులే చేయుటవలన, భిన్న యూష్ణోగ్రత దశలందు నావిరిగా మారు ద్రవములు (Liquids of different boiling points) ఒకదానితో నొకటి గలసియుండినచో, వేర్వేరుగా విడదీయ వచ్చును. ఇట్టివిధానమును "భిన్న స్రుతీకరణము" లేక "ఆంశిక స్రుతీకరణము" (Fractional distillation) అనెదరు. ఈ యాంశిక స్రుతీకరణము ద్వారనే పెట్రోలియములోనుండు వివిధ తైలములు, ద్రావ్యాలు విడదీయబడును.

అల్ప యూష్ణోగ్రతచేతనే స్రుతమగు తైలము, ఆలకెగా నుండును. అనగా మిక్కిలి సాంద్రత (Density) గలదియై యుండదు. ఇందువలన దానియొక్క తారతమ్య గరిమ * (Specific gravity) తగ్గియుండును. ఇట్టి తారతమ్య గరిమగల తైలము సంపూర్ణముగా స్రు

---

* ఒక చెంబునిండ నీరు నింపి దాన్ని తూచినచో నీరు తూగునను కొనుడు. అదే చెంబునిండ పాదరసము నింపి తూచినచో నీ. ౧౩½ తూగును. నీటికంటె పాదరసము యొక్కువ సాంద్రమైనదగుటచే భారమైనది; నీటికంటె ౧౩½ రెట్లధికమైనది. అదే చెంబునిండ నూనె నింపి తూచినచో నూనె నీటికంటె యల్పమైనదగుటవల్ల నీరుకంటె తక్కువ యనగా 9/10 వంతు తూగును. నీటి యొక్క బరువును నియమిత మానము (Fixed standard)గా నుంచుకొని, ఏ వస్తువైనను నీటికంటెయెన్ని రెట్లు యెక్కువగాని తక్కువగాని తూగునో నిర్ణయించుటయే దాని తారతమ్యగరిమను నిర్ణయించుట.

పైయుదాహరణములలో పాదరసము యొక్క తారతమ్యగరిమ ౧౩½——(౧౩. ౫ దశాంశ). నూనె యొక్క తా. గ. తొమ్మిదిలో పదివంతులు 9/10 (౦. ౯ అంతే).

వస్తువుల యొక్క బరువును దానికి సమాన ఘనపరిమాణముగల నీటియొక్క బరువుతో భాగించినచో లభించు భాగఫలములను తారతమ్య గరిమగా నెరుగవలయును.

తా. గా. = వస్తువుయొక్క బరువు / సమానస్థూలతగల నీటిబరువు.

(Weight of equal volume of water)

పైవర్యాత యూష్ణోగ్రతను హెచ్చించెదరు. ఇప్పుడు స్రుతమగు తైలము మొదటి దానికంటె యధికమైన సాంద్రతను గలిగియుండును. అనగా దీని తారతమ్యగరిమ హెచ్చియుండును. ఇట్లు ప్రత్యేక రకమునకు జెందిన తైలము, ప్రత్యేక వర్ణమును, సాంద్రతను, తారతమ్య గరిమను గలిగియుండుటచే, వీనిని యాధారముగా గైకొని, ఆ ఘటములోనుండి స్రుతమగు తైలమును, వర్ణము, తారతమ్య గరిమ మారినదనుక నొకచోట సబ్బయి మొనర్తురు. ఇమ్మట యూష్ణోగ్రతను హెచ్చించుటచే, హెచ్చిన తారతమ్య గరిమగల తైలము స్రుతమగును. దీనిని మొదట స్రుతముచేయబడిన తైలముతో కలుపక పరస్పరముగా నుంచవలయును. తిరిగి యూష్ణోగ్రతను హెచ్చించుటచే యధిక తారతమ్యగరిమగల తైలము స్రుతమగును. దీనినిగూడా పరస్పరముగా నుంచవలయును. ఇక మీద నిటులే యూహించు కొందగును. ఈ యాంశిక స్రుతీకరణ ఫలమును (పరిస్రుత తైలమును) పారిభాషిక వాడుకలో ,,అంశము'' [Fraction] యనెదరు, పెట్రోలియుమందు స్థలవిశేషమును బట్టియు గావలసి నటువంటి వస్తువులనుబట్టియు, చూడు మొదలు పది యంశములు లభించువరకు ఏ యాంశిక స్రుతీకరణ విధానము నుపయోగింతురు.

మొదటి యంశము 'అ' యొక్క తారతమ్యగరిమ ౦.౬౬౬ మొదలు ౦.౭౫౬ వరకు. ఇది సితేవతె వర్ణహీనమై, నీటికంటె మిక్కిలి యలుకనిదై యుండును. 'అలుకని నప్తా' [Light nophthal] అని పేరు. ౦.౭౦౫ మొదలు ౦.౭౭౭ వరకు. తారతమ్య గరిమగల యంశము. 'క' మొదటిదాని (అ) కంటె అధిక సాంద్రముగను, కొంచెము వర్ణముగలదియునై యుండును. దీనిని ,,బరువైన నప్తా'' యందురు. ౧౨ మొదలు ౧౫ వంతులవరకు 'అ', 'క', యంశములు ప్రతిమారు వంతుల పెట్రోలియమునుండి లభించును. 'క' యంశము ను తిరిగి స్రుతీకరించినచో నిక్రింద చెప్పబడిన వస్తువులు లభించును.

(౧) సైమోజీన్ (Cymogene) వాయువు (Gaseous at ordinary temperature. Boiling point 0°c). అతి శీతమును గలుగ జేయు నుగాన మంచుగడ్డను (Ice) ను జేయుటలో నుపయోగింతురు.

(౨) రైగొలీన్ (Rhigolene) మంచు గడ్డయు క్కా శీతముచేత, నట్టివాయువు ద్రవీకరింతురు. [Lipuify B. P. 18.3°c.] తారతమ్యగరిమ 0·60°—వైద్యములో దీని నుపయోగింతురు.

(౩) పెట్రోలియం ఈథర్ (Petroleum ether) తా. గ. ౦.౬౫౦—౦.౬౬౬—సామాన్య యూష్ణోగ్రతలో (at ordinory temperature) ద్రవముగానే యుండును. యంత్రములను నడపుట కుపయోగింతురు.

[౪] గ్యాసోలీన్ [gosolene] తా. గ. ౦.౬౬౬—౦.౬౯. యంత్రములను నడపుట కుపయోగింతురు. ఇది పెట్రోలియం ఈథర్ వలెగాక కొంచె మెక్కువ యూష్ణోగ్రతను ఓర్చుకొనును, అనగా కొంచెమూష్ణము తగిలిన వెంటనే యావిరిగా మారదు.

'క' యంశము (నప్తా—Naphtha) నుండి యు మోటారు బండ్లను నడపు పెట్రోల్ (Petrol) లభించుచున్నది. సామాన్యముగా పెట్రోలియం ఈథర్ మరియు గ్యాసోలీన్ యొక్క మిశ్రణము. దీనికే బెంజైన్ [Ben zine] యను నామాంతరము గలదు.

నప్తా తైలము లన్ని స్రుతమైన పిదప, వానికంటె ఎక్కువ సాంద్రమైన [తా. గ. ౦, ౭౮౬—౦.౮౦౬] స్రుతమగుట కారంభించును. దీనిని 'చ' యంశమనుకొను డు. ఇది కొంచెము వర్ణముగలదియై యుండును. ఇదియే మనము దీపములలో గాల్చు గ్యాసునూనె [Kerosine oil] సాంద్రత లేక తారతమ్య గరిమను, వర్ణమును బట్టి రెండు మూడు రకముల తైలములున్నవి. వీనిని వేర్వేరుగా స్రుత మొనర్చినప్పటికి, నవి దీపములను, స్టౌవులున్నను వానిలో నుపయోగించు తైలములు [Burning oils] లో చేరినవి. ఇవి సంపూర్ణముగా స్రుతమైన తోడనే, పచ్చని వర్ణముగల సాంద్రమైన తైలము ఘటమునుండి వెల్వడును. ఇట్టి తైలంబులు పూర్తిగా లోపలి యొక్క గాలిన ఒక యంత్ర ఘటములో

బడునట్లుల జేసినచో, తైలములు రసాయనిక వియోగము నొందును. భాగలు వెల్వడును. ఇట్టిభాగల (తైల వాయువుల) ను చన్నరులో మునిగి యుండు 'ఒ' గొట్టముల గుండా (చూడుడు చిత్రము 3 వ సంచిక) బంపినచో, యవి ద్రవీకరింప(On their lequifaction) నఫ్తా గ్యాసునూనె, పెట్రోల్ మొదలగు ద్రవ్యములు లభించును. ఈ విధానమును పారిభాషిక వాడుకలో "క్ర్యాకింగు విధానము" (Cracking process) అనెదరు. దీనికై, పైన గన్పరచిన యంత్రము గాక మరొక యంత్రము నుపయోగించ వలసి యున్నను, యీ రెంటిలో అతి స్వల్ప భేద ముండుటచే, కొంచె మించుమించుగా రెండును నొకేతీరుగా యుండునని యూహించ వలయును. విస్తర భీతిచే పటమును బొందు పరచలేదు. క్రాకింగు విధానముచే, మరికొంత నఫ్తా, గ్యాసునూనె (Burning oils) లభించును ఇట్టినూనె 'చ' యంశములో లభించు నూనె యంత నిర్మలమైనది గాక అపరిశుభ్రముగా యుండును. ఇట్టి అపరిశుభ్ర తైలమును, లోపలి ప్రక్కలో సీసపు రేకులు యమర్చియున్న ఇనుపతొట్ల (Lead lined Cast iron vessels) లో బోసి కొద్దిగా (నూరుభాగముల తైలమునకు ౭౫ వంతుల చొప్పున) గంధక ధృతమును (Sulphuric acid) చేర్చి ప్రత్యేక యంత్ర సహాయమున బాగా కలిపి, కొన్ని గంటలవరకు తొట్టిని కదలించకుండా యుంచినచో, గంధక ధృతము మలినమును దీసికొని యడుగున జేరును, పైకి శుభ్రమైన తైలము దేలును. తొట్టికి క్రింద యమర్చియుండు రొుక నాళము ద్వారా ధృతమునంతయు దీసివేయుదురు. తైలములో గంధకధృత శేషమైనా లేకుండ జేయుటకు కొంత కాస్టిక్ సోడా ద్రావణము (Caustic soda solution) ను జేర్చి బాగా కలిపి కొంతకాలమువరకు యుంచినచో, ఆ ద్రావణము తైలమున కంటియుండు ధృతమును గ్రహించి తొట్టిలో యడుగున నిలచును. తైలము మందటి వలెనే పైన తేలియుండును. ద్రావణమును, ధృతమును దీసిన నటులే దీసివేసి, తైలమును నీటితో కడిగినచో శుభ్రమైన తైలము లభించును. యవసరమైనచో నిట్టి తైలమును స్రుతీకరించుట గూడా గలదు. ఇట్లు జేయుటచే నిర్మలమైన తైలము లభించును. ఇదియే మనము వాడుకొను గ్యాసునూనెను జేయు విధానము. నూరువంతుల పెట్రోలియమునుండి ౭౫–౮౦ వంతులకు గ్యాసునూనె తయారు చేయబడు చున్నది.

'చ' యంశము స్రుతమైన తర్వాత, 'అ' ఘటములో నడుగున మిక్కిలి సాంద్రమైన నల్లని ద్రవము "టారు" (Tar) మిగిలి యుండును. దీనిని "ప" గొట్టముల ద్వారము గుండా బయటికి దీసి, మరియొక స్రుతీకరణ ఘటములో జేర్చి హెచ్చిన యూష్ణోగ్రతను బొందునటుల గాచెదరు. దీనిలో మొదటి యంశము (స్వల్పము) ను గ్యాసునూనెలలో జేర్చెదరు. రెండవది ప్యారఫిన్ (Paraffin oil) తైల మనబడును. గ్యాసునూనెను శుభ్రపరచినటులే దీనినిగూడా శుభ్రపరుతురు. ఇట్టి ప్యారఫిన్ తైలమును తిరిగి స్రుతీకరించినచో మైనము, మరియు యంత్రములు, మోటారుబండ్లు, ఇంజనులలో కందెనగా నుపయోగింపబడు నూనెలు (Lubricating oils—ల్యూబ్రికేటింగు నూనెలు) లభించును. మూడవ యంశములో పసుపు వర్ణముగల క్రొవ్వు లభించును. ఈ క్రొవ్వు సంపూర్ణముగా స్రుతమయిన పిమ్మట స్రుతీకరణ ఘటములో మిగులునది బొగ్గు (Coke). ఇంతటితో, పెట్రోలియము యొక్క స్రుతీకరణము సమాప్తమగును.

విస్తర భీతిచేతను, పారిభాషిక పదముల లేని యిబ్బంది చేతను, యెన్నియో విషయములను వదలివేయ వలసివచ్చినది. మన దేశములోనే యుండు బర్మాలో పెట్రోలియం పరిశ్రమ దినదినాభివృద్ధి గాంచుచున్నది.

ప్రతి సంవత్సరము పెట్రోలియము నిచ్చు నూతన ప్రదేశములను గనిపెట్టు చున్నారు. బర్మా ఆయిల్ కంపెనీవారు క్రీ. శ. ౧౯౨౪ లో ౧౪౩౨, ౫౦౦,౦౦౦ నేర్లు, ౧౯౨౫ లో ౧౪౪౩, ౫౦౦,౦౦౦ నేర్ల పెట్రోలియమును దీసిరి. అసాములోయున్న పదారీపుర ప్రాంతములో గూడా పెట్రోలియం పరిశ్రమ యభివృద్ధి గాంచుచున్నది. ఈ కంపెనీలన్ని విదేశీయులవే! వీరు పెట్రోలియమునందు నూతన ప్రదేశములను గనిపెట్టుట కన్నో పాట్లు బడుచున్నారు. ఈ పరిశ్రమ వలన లక్షలకొలది ధన మార్జించు చున్నారు. స్వదేశీయులు నిదురమాంది మేల్కాంచరు గాక!

# ఖార్జ్ సాహెబు తోట వద్ది శాసనము, వరంగల్లు

(ఆంధ్ర పరిశోధక సంఘము, హైద్రాబాదు)

ఇది ఒరంగల్లు కోటలోని మట్టివాడ నుండి పోవు రోడ్డు ప్రక్కను, కోట ఫర్లాంగు దూరముండఁగా రోడ్డు ప్రక్కను; ఎడమచేయి వైపున నున్న దిగుడు బావిచెంత ప్రాతబడియున్నది. పై భాగము ఒకమూరవ రకు పగులఁ గొట్టబడినది. శకలము గాన రాదు. శాసనము మూడువైపుల మాత్రమే వ్రాయఁబడి వి. వర్ణములు గల భాగము కొంతనేలలో (త్రాతికొని యుండ త్రవ్వించి విషయము అచ్చుతీసితిమి.

ఉత్తరపు దిక్కు

\+ + + +

౧ శేశ్వర పరమ మా
౨ హేశ్వర శ్రీ స్వయం
౩ భునాథ దేవ దివ్య శ్రీ
౪ పాద పద్మా రాధక
౫ పరబల సాధక ప్ర
౬ త్యక్ష ప్రధమ గణావ
౭ తారలాడ చోడకట
౮ కచూఱ కాఱమం
౯ నియు బెంట కాఱక
౧౦ దన ప్రచండ చల
౧౧ మతి గండ విభ
౧౨ వ దేవేంద్ర సత్య
౧౩ హరిశ్చంద్ర చతుస్స
౧౪ ముద్ర పరమ దిక్పా
౧౫ లక కీర్తి సప్తమ చక్రవ
౧౬ ర్తి ఉపమన్యు ప్రముఖా
౧౭ దిసకలభక్త జనానంద
౧౮ కారణవైరి సంహరణ
౧౯ అధిరాజ చారుచరి
౨౦ త్ర సుజనైక మిత్రసుస్థి
౨౧ రనిజ రాజాన్వయసు నా
౨౨ మాదిసమస్త ప్రశస్తి స
౨౩ హితం శ్రీమన్మ హామం
౨౪ డలేశ్వర కాకతియ్యప్ర
౨౫ ర వరాధీశ్వర గణపతి
౨౬ దేవ మహారాజులు సు
౨౭ ఖ సంక థాదివినోదంబు
౨౮ నం బ్రుథివి రాజ్యంబు సే
౨౯ యు చుండంగాను సర్వ.
౩౦ ధారి సంవత్సర శ్రావణ శు
౩౧ ద్ధ పంచమిం గురువారము
౩౨ నాడు శ్రీ వీరభద్రేశ్వర దేవ
౩౩ రకు అంగరంగ భోగాలకు
౩౪ మరియును ఇచ్చిన అ +
౩౫ నిచిన మరియు అ +
౩౬ దేశి పరదేశి బే +
౩౭ నిసులిచ్చిన అ +
౩౮ తి అందుమాడ

దక్షిణ దిక్కు

౧ డెలమకు ఇచ్చిన అయ
౨ మునిలి అందుమాడను కం
౩ డుబీసాలు పోక మేరను ప్య
౪ దేశి పరదేశి బేహరులు
౫ నూ నఖరమూను ఇచ్చినవా
౬ యుముపోకల అంఘులత్తు
౭ ను పాదిక సానిబ్బరూను
౮ ం కులపంటను ఇచ్చిన అ
౯ యును బెఱుకకవలను
౧౦ ఆకులు కూరకాయ బేహ
౧౧ రులలోను ఇచ్చిన అయా
౧౨ లు కూరకాయబండ్ల అందు
౧౩ బండినిపాదిక నారికాకప్ర
౧౪ కాయమాదుఫలపు కాయకం
౧౫ మ రేను పండుమామిడిపం
౧౬ ను చింతపండు మొదలు

౧౭ గాగల ఫలజాతులం దెల్లాను
౧౮ బండినిపాదిక ఊరుకా
౧౯ యలబండ్ల అందు బండి
౨౦ ని పాదికనువ్వులబండ్ల అం
౨౧ దుస్వదేశి పరదేశి బేహారు
౨౨ వెల్లనుఇచ్చిన ఆయాలు
౨౩ నూవులు గోధుమలు పెసలు
౨౪ వడ్లు జొంనలు మొదలు కా
౨౫ గల బుసి భండాలం దెల్లాను
౨౬ బండిని మ్మానెడు నూనె నేతి
౨౭ బండ్ల అందు బండి: మానెడు
౨౮ బుసి భండాలందు పడి: సెలు
౨౯ కలమానెడు ఉప్పు బండ్లఅందు
౩౦ స్వదేసి పరదేసి విదశే వర్తులు
౩౧ లోను ఇచ్చిన ఆయాలు పడి పె
౩౨ ఋకుల మానెడు బండ్లందు బెల్ల
౩౩ [మా] నెడు నూనె బేహారు లెల్లా
౩౪ ను ఇచ్చిన ఆయము కడున
౩౫ నిత్యలు అందుమేర ఆశేషనగ
౩౬ రమూను ప్రతియూర్లాను ఇ
౩౭ చ్చిన అయము ఇంటను పాధికి
౩౮ బియ్యమునందు నఖరము ఇచ్చి
౩౯ న ఆయము ఉపహారానకు ని
౪౦ త్యలు గడిని బురడు సేసి చయ్యి
౪౧ ము కాలబోధకుడు ధుఖంమచ్చోప

పడమరదిక్కు

౧ దలుగాగల గంధ్య భం
౨ డాలంచు మాడపాదిక
౩ ఆవలు ఓరియూలు తన
౪ కానుపునూనె మొదలు గా
౫ గల కోలభండాలం దెల్లా
౬ ను మాడపాదిక గంధ్య
౭ వారూను తగరం వారూను
౮ మూసలవారూను ఇచ్చిన
౯ ఆయము తగరమునందు
౧౦ నసమనందుర్గాగి అందు
౧౧ తులానపలమెడు లోహా
౧౨ ౦లందెల్లాను ఈలెక్క ఉభయ
౧౩ నానా దేశినిఇచ్చిన ఆయాలు

౧౪ చందనమునందు తులాన
౧౫ పలమెడు,కర్పూరము నం
౧౬ దు వీశెనరెండు సింనా
౧౭ లు జవాది ఆంగుమాడ
౧౮ పలుక కస్తూరి అందు నూ
౧౯ లు చిన్నాలను రెండు సిన్నా
౨౦ లు పట్టునూలి అందుతులా
౨౧ న చింనము చవలాలందు
౨౨ తులానచింనము మంజిష్టి
౨౩ అందుమాడను అరవీసాము
౨౪ దంతము దానూరిపట్టు ప
౨౫ చ్చపట్టందు కోటబాదిక
౨౬ డమునందు వీశెచందనము ము
౨౭ త్యము రుద్రాక్ష గాట పూస
౨౮ మొదలుగాగల మణిభండా
౨౯ లందెల్లాను మాడ వీసాము
౩౦ ఉభయ నా నా దేశిని ఇచ్చిన
౩౧ ఆయాలు పసపు నందు ఉల్లి
౩౨ అంమజాజానంను అల్లము
౩౩ నందు కంద అందు పెండలము
౩౪ నందు మాడను రెండు వీసాలు
౩౫ ఉభయ నా నా దేశికిని ఇచ్చిన
౩౬ ఆయాలు నూలి మేలగల
౩౭ ౦ దు గోణు పదాల మలగల
౩౮ + నులక బాదిక మంచాల
౩౯ + ల లందు నూంట చింనము
౪౦ + నము పట్టులందు నూంట
౪౧ + + ము.

నోటు.

బుసియను పదము ఆహారవస్తువను నర్థమున ప్రయోగింపఁబడెను. ఇటులే భండాలు! వస్తువు దేశము చో శవర్ణము సవర్ణము వాడఁబడెను. ఎల్లను, వీసము అ పదముల రెండవ వర్ణము దీర్ఘములుగాఁబలుచోట్ల వ్రాడఁబడెను. పాతికయను పదమునందు తకుమారుదవర్ణము కలదు. కూరగాయలనుచో కూరకాయలనియు రెండు తలముల వాడఁబడెను. రేఁగునరేను అనికలవు. రూపములు భాషావిషయకములు గమనింపఁదగినవి.

పై భాగము శాసన శిల ఖండింపఁబడుట చే నిందలి విషయము సమగ్రముగాఁ గలియుటలేదు.

# దక్కన్ పూర్వ విభజనము

బి. యన్. శర్మ

సుజాత మూడవ సంచిక యందు 'భాగ్యనగర ప్రాంత పూర్వ విభజన'మను శీర్షిక క్రింద దక్కను నందలి యారు సుబాలలోని భాగ్యనగరపు సుబా విపులముగా దెలుపబడి యుండెను. మిగత అయిదు సూబాల విభజనము వివరముగా దెలుప ప్రయత్నించెదము.

మొత్తము దక్కనులో అరు సుబాలుండెను. [౧] సూబె దారుజ్జఫర్ ఉర్ఫ [లేక] బీజాపురము [౨] మహమ్మదాబాదు ఉర్ఫ బిదర్ [౩] బరార్ ఎలిచ్పూరు ఉర్ఫ గావెల్లి పురము ఉర్ఫ ఎలిచ్ పురము [౪] దౌల్తాబాద్ ఉర్ఫ ఖజిస్తాబునియాద్ లేక ఔరంగాబాదు [౫] ఖాందేశ్ ఉర్ఫ బురహాన్పురము [౬] ఫర్ఖుందెబునియాద్ ఉర్ఫ హైద్రాబాదు.

(౧) బీజాపురపు సూబాయందు (౧౭) సీమలుండెను.

[౧] బీజాపురము [౨] అసద్ నగరము లేక అక్లోజ్ [౩] అజంపురము లేక బేలగాంవ్ [౪] హైదర్ ఖాజ్ఖుర్ లేక అవదోని [౫] ముస్తఫాబాద్ లేక రాచోలు (ఇది రాయప్రోలైయుండవచ్చును.) [౬] ఖాజిపురము [౭] ఫిరోజానగరం లేక రాయచూరు [౮] నసరతాబాదు లేక సగర్ [౯] తారిగలు [౧౦] పణికాపురము [౧౧] మహమ్మదు నగర్ లేక ఏకరి [౧౨] గుల్బర్గా [౧౩] నల్లదుర్గము [౧౪] కర్నాటకము [౧౫] మోదగల్లి [౧౬] అద్రమోదాబాదు లేక మిరజ్ [౧౭] రాయిబాగ్ [౧౮] బనిపాదుర్గము లేక పనపాలము.

౧. బిజాపురపు సీమలో (సర్కారు) ౩౦ పరగణా (మహాల్లు) లుండెను.

౧. హవేలి బీజాపురము [౨] ఏండి [౩] ఆలమేల్ [౪] ఓఖ్ల [౫] అధేని [౬] కర్జగి [౭] కొలహారు [౮] కోకసపురము [౯] గాటి [౧౦] చమల్గి [౧౧] చాంద్కోటి [౧౨] కోకటనూరు [౧౩] జత్ [౧౪] తాబ్ల [౧౫] యత్నపురము [౧౬] నర్గాందు [౧౭] బిలోలి [౧౮] బాగెవాడి లేక బసోనా [౧౯] బిదరి [౨౦] మొలవాడ [౨౧] రా [౨౨] సిద్ధనాధము [౨౩] షజ్గి [౨౪] పాలసంగి [౨౫] హోల్వారు [౨౬] హోల్వాడ [౨౭] హోరతి [౨౮] హిపర్గి [౨౯] యాదవోలు [౩౦] మంగలదవేడి

౨. అక్లోజు సీమలో (౧౧)పరగణాలుండెను.

[౧] హవేలి అక్లోజు [౨] వేలాపురము [౩] ఆటపాడి [౪] నాబహరి [౫] పాంగోలి [౬] కాసెగాంవ్ (దీనిక్రిందనే వరదపురపు పరగణాయుండెను) [౭] భాలాతి [౮] (మేహాడ్ దీనిక్రిందనే దేహిగాంవ్ యుండెను) [౯] లమోడి [౧౦] బుద్ధఫాచెగాంవ్ [౧౧] దెహిగాంవ్ దీని క్రిందనే ఇస్లామపురముండెను

౩. అజమ్పురము లేక బెల్గాం సీమలో ౧౬ పరగణాలుండెను.

[౧] హవేలి అజంపూర్ బెల్గాంవ్ [౨] అజరి [౩] కాపశి [౪] కేవరపురము [౫] రవాముఘుర్ లేక కోకల్ [౬] పావాపురము [౭] నసరి [౮] తవే [౯] బెలహార్ లేక మహకిఖాతాపురము [౧౦] మతోలి (౧౧) లా(క.)ట. (౧౨) సోవతూరు (౧౩) సదల్గాంవ్ (౧౪) హుబిసమగాంవ్ [౧౫] హుూకలి [౧౬] ......

(౪) హేతియాత్ ఖుర్ లేక ఆవదోనిసీమ లో [౮] పరగణాలుండెను.

[౧] హవేలి ఆవదోని [౨] ఖమర్ నగరము లేక కమలము [౩] కో (తూ)ను ఖుర్ [౪] డోణ [౫] బం హారి [౬] కలకోట.

౫. ముస్తఫాబాదు లేక రాపోలు సీమలో (౭) పరగణాలుండెను.

[౧] హవేలి ముస్తఫాబాదు లేక వాపోలు ౨ ముజ ప్ఫరాబాదు లేక రాస్గన ౩ రేగనా ౪ గోదాను ౫ ఖారి పాటన ౬ ఖేలన లేక విశాలగడము ౭ కాటి ౭ కలశి.

౬. ఘాజిపురపు సీమలో (౨౩) పరగణా లుండెను.

౧ హవేలి ఘాజిపురము ౨ అబెహాలు ౩ కాయ లకోటి ౪ కపింపురము ౫ ఫేకాను ౬ చాంగ్కమిరి ౭ ఖిలుగల్లు ౮ పస్పుల్ ౯ హోగన్ పల్లి ౧౦ బతీర్ బల జర్ ౧౧ ఫేడ్ తేనుయుదద్ ౧౨ అఖరాసపురము లేక షీ రాల్ ౧౩ మోక ౧౪ హొదనూను కలియా ౧౫ మోసుల్ వాడ ౧౬ బలగొండ ౧౭ ఎలనూను ౧౮ అక్క-లకో ట ౧౯ సైదాపురము ౨౦ కోధగగోండి ౨౧ పెదవార ౨౨ రావల్ కోట ౨౩ వీరవానరము

౭. ఫెరోజునగరము లేక రాయచూరు సీ మలో (౯) పరగణాలుండెను.

౧ హవేలి రాయచూరు ౨ ఏలూరు ౩ ఏని ౪ కో తాల్ ౫ పరడ్ ౬ జాలెహాల్ ౭ బహను ౮ మోసల కార్ ౯ బేలదడవా

౮. నుసరతాబాదు లేక సగర సీమలో (౫) పరగణాలుండెను.

౧ హవేలినుసరతాబాదు ౨ ఫేంబాకి ౩ డాగరు గోగి ౪ తల్లికోట ౫ దేననుగ్గము

౯. తోరగల్లు సీమలో ౧౯ పరగణా లుండెను.

౧ హవేల తోరగల్లు ౨ అతిఛరా ౩ కేడోరు న లాబత్ ఖాని ౪ కాముదాబాదు లేక గులగీర్ ౫ కు ఖండి ౬ తిరోలి ౭ బహద్దురునగరము ౮ తోలుగొం ౯ బాదామి ౧౦ బాగకోట ౧౧ జమగి ౧౨ మాన్వ రు ౧౩ మోతూలగండి ౧౪ యాదవాడ ౧౫ కోవ పురము ౧౬ మొధోల్

౧౦ వణికాపురపు సీమలో ౧౬ పరగణా లుండెను.

౧ హవేలి వణికాపురము ౨ కొండగోలు ౩ కార డ్గడి ౪ కేతరణ ౫ గదక్ ౬ ధారవాడ్ లేక నసరాబా బాద్ ౭ నిర్గుల్ ౮ మాల్వార్ ౯ మసేరికోట ౧౦ మోటవాలి ౧౧ లక్ష్మేశ్వరము ౧౨ రాయహవేలి ౧౩ బలహార్ ౧౪ మామనగల్లు ౧౫ హరిహరము ౧౬ వా తేపల్లి.

౧౧ మహమ్మదునగరము లేక యెకరి సీమ లో ౭ పరగణాలుండెను.

౧ హవేలి మహమ్మదునగరము ౨ గాడగని ౩ ఱ డ ౪ బార్నహాలి ౫ చందపోటి ౬ మదనహాలి ౭ సోధ

౧౨. మోదగల్లు సీమలో ౧౩ పరగణా లుండెను.

౧. హవేలి మోదగల్లు ౨. ఎలగరము ౩. కట్టగి ౪ క్షేత్రవాడి ౫. కొప్పల ౬. కోకనూరు ౭. తాదరిక గో ౮. గంగావతి ౯. నల్లదుర్గము ౧౦. ఖలగొంద ౧౧. సత్య సుపురము ౧౨ ఎలగొండ ౧౩. కంకగిరి.

౧౩. ముజ్మరాబాదు లేక మిరజ్ సీమలో ౬ పరగణాలుండెను.

౧. హవేలిమిరజ్ ౨. కోటె ౩. అష్టి ౪. ఖానాపు రము ౫. బేడకే ౬. మొహసల్

౧౪. రాయెబాగ్ సీమలో ౧౨ పరగణా లుండెను.

౧ హవేలిరాయబాగ్ ౨. కాగల్ ౩. కోలవాపు ము ౪. వరుణ ౫. వాలవి ౬. ఖటావ్ ౭. ఔంధ్ ౮.

అంతిఖాయార్ ౯. హవేలి ౧౦. కరాడ (దీని క్రింద నే థానే శ్వరముండెను, ౧౧. సింహాడ్మోటిని ౧౨. శిల్లర్

౧౫. నబిపాదుర్గము లేక వినహాల్ సీమలో ౯ పరగణాలుండెను.

(౧) హవేలి వినహాల్ [౨] అజంతారా లేక సతారా [౩] చందన [౪] వందన [౫] నాథవాడ [౬] వాయిన [౭] వాసోట [౮] నుసరతాబాదు లేక పర్లి [౯] షీరాలి

౧౬. గుల్బర్గా సీమలో ౧ క్రోసు వెడల్పు ౬౦ క్రోసుల నిడుపుగల నొకటే పరగణా యుండెను.

౧౭ నల్ల దుర్గపు సీమలో ౮ పరిగణాలుండెను.

(౧) హవలివే ల్లదుర్గము (౨) ఆలంద్ [౩] గంజ పట్టి [౪] బీడ్ [౫] ఏలంగా [౬] ధారా సేవనము లేక ఉస్మానాబాద్ [౭] ధోకి [౮] మైందర్గి

౧౮ కర్ణాటక సీమలో ౫౪ పరగణాలుండెను

౧ షేర్దిల్ [ఈ పరగణాలో దకోలా, ఖస్బెహ పల్లి మొదలగు ౫ పరగణాలుండెను] ౬ పీలుగొండ ౭ పోరియావాల్ ౮ పెద్దబాలాపురము ౯ చిన్న బాలాపురము ౧౦ సుల్తాన్ పురము లేక బస్వపట్టణము ౧౧ హోస్కోట ౧౨ ఇస్లాంపురము ౧౩ అరడా ౧౪ అనగొంది ౧౫ ఔరధటి ౧౬ మాల్యాలూరు ౧౭ మావినకోట ౧౮ మాతాపురము ౧౯ బాదూరు ౨౦ బోకరాయి సముద్రము ౨౧ శివగిరి ౨౨ టిఫనగంది ౨౩ తీపురము ౨౪ తత్తలీ కోట ౨౫ దయారమానపురము ౨౬ దీవనహాలి ౨౭ దేవటాన్ ౨౮ కర్కేరి ౨౯ నిమసగంగా ౩౦ రసూలు పురము ౩౧ రణనగరము లేక దేవపురము ౩౨ సీరమా రణహాలి ౩౩ పోకారసాడి ౩౪ పోడికొన ౩౫ శ్రీనాణక లేక శ్రీశైల మల్లిఖార్జునము ౩౬ షేనూరు పాగడేలి ౩౭ శివగంగ ౩౮ ఆబేకరా ౩౯ గంగా విసరము ౪౦ కేసూరు ౪౧ పట్టులగేది ౪౨ నానికోలహార్ ౪౩ డాఫ్ పెందూరు ౪౪ మాయాచార్ ౪౫ ఎర్రపల్లి ౪౬ బానవారాధ్ ౪౭ కోరటని ౪౮ కాడమద్గి ౪౯ మాయా గొండనహాలీ ౫౦ వటపగల్లు ౫౧ నిటసలీ ౫౨ నోపలి ౫౩ వాజుక పట్టణము ౫౪ లేకూర్

బీజాపురపు సుబాలో ౧౮ సీమలుండెను. వాని వాని పరిగణలు వివరముగా తెలుపబడినవి. ఇవియే గాక యీ సూబాలో మరికొన్ని సంస్థానములు, జమీందారీ లుండెను. ఆవసర సమయములందు వీరు కొంత రొక్కము చెల్లించుచున్నను యితర సమయములందు మాత్రము వీరు స్వతంత్ర ప్రభువులుగా మెలగుచుండినటుల దెలియు చున్నది. ఈ సంస్థానములన్నియు శ్రీరంగ పట్టణపు సంస్థానమునకు లోబడియుండెను.

౧ వైద్యనూరు ౨ సూధిమాఘరము ౩ రాయి దుర్గము ౪ ఛత్రదుర్గము ౫ భవధొండి ౬ కారిమళీ ౭ తీర్కెరా ౮ రత్నగిరి ౯ కానరకేరి ౧౦ కామిలవాడ

౧ మర్గిరా ౨ నాయకసాలెము ౩ ఎనిఫల్ ౪ కోసగడి ౫ మార్వన్ హేలి ౬ గంభీరి ౭ గానవరము ౮ కోనకోట ౯ శంకరగిరి ౧౦ బలబారి మొదలగు పరగణాలు జమీందారుల యాధిపత్యము క్రింద యుండియుండెను.

సూబా మహమ్మదాబాదు లేక బిదరులో ౭ సీమలుండెను.

౧ హవేలి బిదరు ౨ అక్కలకోట ౩ కల్యాణి ౪ రామగిరి ౫ యాదగిరి లేక ఫెరోజగడము ౬ నాందేడు ౭ ముజఫర్ నగరము లేక మల్ ఖేడ్

౧. హవేలి బిదర్ సీమలో ౮ పరగణాలుండెను

౧ హవేలిబిదరు ౨ ఔరాదు ౩ కొన్దమోగి ౪ చటనుప్ప ౫ ఖాలక్ ౬ హాకుమారు ౭ ఆకేలి ౮ హసనాబాదు

౨. అక్కలకోట సీమలో ౭ పరగణాలుండెను

౧ హవేలి అక్కలకోట ౨ హాగర్గా లేక మహమ్మదనగరము ౩ ధాకు లేక ఫర్యాఖాను ౪ ఉద్దర్ ౫ హిపర్గి ౬ మత్రూరు ౭ మాషాల్

౩ కల్యాణి సీమలో ౨ పరగణాలుండెను.

౧ హవేలి కల్యాణి ౨ ప్రతాపపురము

౪ రామగిరి సీమలో ౧ పరిగణాయుండెను.

౧ హవేలి రామగిరి

౫ యాదగిరి లేక ఫెరోజుగుడెములో ౧ పరగణాయుండెను.

౧. హవేలి ఫిరోజుగడము.

౬ నాందేడు సీమాలో ౪౪ పరగణాలుండెను.

౧ హవేలి నాందేడు ౨ ఉసా ౩ అరధాపురము ౪ ఇందూరు లేక నిజామాబాదు ౫ బోద్గిర్ ౬ కేలాహీర్ ౭ కొల్చాత్ కోకన్ ౮ కత్రఖండము ౯ కోటగిరి ౧౦ కానేబూటు ౧౧ ఖిడిదిసాద్ ౧౨ ఖడ్కా ౧౩ ఖుదావందుపురము ౧౪ జలకోట ౧౫ నిర్మల ౧౬ టంబూర్తి ౧౭ దగేమూరు ౧౮ ధోరోటు ౧౯ వాసర ౨౦ బోధన ౨౧ ఖందహార్ ౨౨ బిస్మత్ నగరము ౨౩ బీడ్ ౨౪ వారు (డేరే) ౨౫ భోకర్ ౨౬ హొగ్గటు-ముతఖేడ్ ౨౭ దాధాల్ ౨౮ భైంసా ౨౯ మద్దు ౩౦ రాకోరు-(అహమదుపురం) ౩౧ లోహంగావ్ ౩౨ నూరు ౩౩ వాందకుమే ౩౪ హాదాపి ౩౫ వాలాద్-వాకాద్ ౩౬ వాకడి ౩౭ వాలకొండ ౩౮ ఎనె ౩౯ పోన్నట ౪౦ షేదాఘోర్ ౪౧ బద్దపల్లి ౪౨ సార్వాడము ౪౩ హంటి ౪౪ జమ్మగల్లు.

౭ మఖ్లేడ్ లేక ముజప్ఫరునగరపు సీమలో ౧౪ పరగణాలుండెను.

౧ హవేలి మఖ్లేడ్ ౨ ఉట్నూరు ౩ కాల్గి ౪ కోడోలి ౫ అచ్యుతపురము ౬ నిరోగ్డి ౭ సైండియా ౮ షంగల్గి ౯ వర్మాక్ ౧౦ మఖ్తల్ ౧౧ చింకోలి ౧౨ అమరచింత ౧౩ కిడ్డిచెరువు ౧౪ కాంకోడ్తి.

(సశేషము)

# అంటరానివాఁడ !

### శే. రామానుజాచార్యులు

సీ. కడు నేహ్యమగు మాసికల గోచులే కాని॰ధరియించుటకు వస్త్రతతులు లేవు
ఆతపవాత వర్షాలయంబులె కాని॰వసియించుటకు గేహ పటలి లేదు
పగలెల్ల పనిజేసి పస్తుండుటలె కాని॰తినుట కెన్నడు మంచి తిండిలేదు
పుడమి నెచ్చటికైన నడచిపోవుటె కాని॰గమియించుటకు వాహనములు లేవు
తే.గీ. ఎంతకాలంబు నుండియో యెవ్వఁడెఱుఁగ॰నడపుచున్నావు జీవన నౌకనిట్లు
బాలిశుండగు తామర చూలికేమి॰హాని జేసితివో యంటరానివాఁడ!

సీ. పాలబుగ్గలతోడి పసితనంబున యందు॰సొంపొప్ప నిన్ను చుంబింపలేము
బాహార్గళముతోడి పటు యౌవనము సందు॰అంపిల్లి నిన్ను నగ్గింపలేము
మహిమావళుల తోడి మధ్యకాలమునందు॰నింపార నిను గౌఁగిలింపలేము
పలితకైశ్యము తోడి వార్ధక్యదశయందు ॰ పెంపెక్క నిను గౌరవింపలేము
తే.గీ. భరతజనయిత్రి గర్భసంభవుల మనల॰వేఱు గావించె నిట్లు నిష్కారణముగ
బాలిశుండగు తామర చూలికేమి॰హాని జేసితివో యంట రానివాఁడ!

సీ. నిను గాంచి దుఃఖించు నీరజాతవిరోధి నేత్రముల్ మంచు కన్నీరు గార్చు
నిను గాంచి దుఃఖించు నీరజాప్తు ముఖంబు మనుజ సంఘంబుపై మండిపడును,
నినుగాంచి దుఃఖించు నీరధివక్త్రంబు ॰భూరి ఘోషణల వాపోవుచుండు
నినుగాంచి దుఃఖించు నీరద హృదయంబు॰కరుణానిలాహతిం గరగిపాఱు
తె.గీ. ఐననేమి నీదురవస్థ యెంత మొందు॰దారిగాన్పించదయ్యె నెవ్వారికేని
బాలిశుండగు తామర చూలికేమి॰హాని జేసితివో యంట రానివాఁడ!

# గ్రంథ విమర్శనము

## ఆంధ్రవీరులు: (ప్రథమభాగము)

గ్రంథకర్తలు: శ్రీశేషాద్రిరమణకవులు.

ప్రకాశకులు: వెంకటరామ్‌అండుకో, బెజవాడ.

వెల: అ. ౦-౮-౦.

వేర్వేరు కాలములం దుద్భవించి ఆంధ్రపౌరుషమును జగోశ్చాటించిన ఆంధ్రయోధులయొక్కయు, ఆంధ్రుల యైశ్వర్యమును వివిధ విధముల పెంపొందింపజేసిన ఆంధ్ర మహాపురుషుల యొక్కయు జీవిత సంగ్రహములు సుల భశైలిలో వ్రాయబడి యీపుస్తకమున గూర్చబడినవి. "చాణక్యుడు ఆంధ్ర బ్రాహ్మణుడని యాధునికులు విశ్వసించు చున్నార"ని గ్రంథకర్తలు చాణక్యచరిత్ర తుది భాగమున వ్రాసియున్నారు. ఏయాధునికులీ నవీనవిషయమును విశ్వసించుచున్నారో, వారివిశ్వాసమున కాధారములేవో పాఠకులకు తెలిపిన చాణక్య జీవితచరిత్రను ఆంధ్రవీరుల గ్రంథమున జేర్చుటకు కారణము స్పష్టమగుచుండెడిది. అక్కన్న మాదన్నలు ఆంధ్రులా మహారాష్ట్రులాయను యంశమిదివరకు చరిత్రకారులు తేల్పలేదు. నిజము తెలిసినంత వరకు వారుమనవారేయని సంతోషపడుచుందము! "చెవులు చిల్లులు పడునటుల కీర్తింపబడిన ఖడ్గతిక్కన, కృష్ణదేవరాయలు మొదలగువారి జీవితము లీపుస్తకమున కూర్పబడినవ"ని యొకపత్రిక అభిప్రాయము. ఆయామహావీరుల జీవితములు వినివిని చెవులు చిల్లులు పడినను తిరిగివినుట కయోగ్యములే. వారికీర్తికి వారసులమైన మనము వారి జీవితమును మననము చేయవలసినదే.

ఆంధ్రభారతి యభిప్రాయ పడినటుల మేమును మహారాష్ట్ర విద్యాశాఖవారు పాఠశాలలయందిట్టిదానిని ఉపవాచక గ్రంథముగా నిడుటకై నొప్పుకొందురని నమ్ముచున్నాము.

## సర్వలక్షణ సారసంగ్రహము

గ్రంథకర్త: శ్రీశిష్ట్లలూరి కుప్పునయ్యంగారు, వెల ౪ అణాలు ప్రకాశకులు వెంకటరామ్‌అండుకో, బెజవాడ.

ఈ గ్రంథము నేటి ఇంగ్లీషు విద్యాభ్యాసము చేయుచు ద్వితీయ భాషగా దెనుగును స్వీకరించిన విద్యార్థులకు గొంతవఱ కుపయోగించు ననుటలో సందేహము లేదు. దీనిని వ్రాసినవారును ఇంగ్లీషున్నత పాఠశాలలో నుపాధ్యాయులైయున్న కతన బాలుర యవసరములఁ బట్టి వ్రాసిరి. ఇంగ్లీషు భాషా మర్యాదలు మన తెనుగున లేకున్నను, తత్సమ విశేషణంబులగు నితర తమలను (Degrees) చూపించుటయు, ప్రయోగ పథకము, (Analysis) శబ్దలక్షణ క్రమము (Parsing), వీనిని బోధించుటయు దీని కుదాహరణములు. ఈవ్యాకరణము అబ్బాయి నాయుడు వ్యాకరణమువలె చాల సంకుచితము కాక, చిన్నయ్య సూరిగారి "బాల" వ్యాకరణమువలె బాలురకు దురవగాహమైనదిగాక, అప్పకవీయమువలె పాండిత్య వేద్యముగాక బాలురకు సులభ గ్రాహ్యమైనదై ముఖ్యాంశములను బోధించునదై యున్నది. కాని కొన్ని భాగములింకను విపులముగా నుండిన బాగుండెడిది. మఱియు గొన్నియంశము లిందుఁ జేర్పఁబడలేదు. ప్రత్ర ప్రకృతికముల విషయమై వ్రాయబడలేదు. ఇట్టి సంవేద్యాంశములు మృగ్యములు.

దీనికి గ్రంథకర్త శిష్యులైన కట్టమంచి రామలింగారెడ్డిగారు పీఠిక వ్రాసినారు. ఇందు గ్రంథ విషయమేమియు లేదు. గ్రంథకర్త గారి జీవితమును తమకు వారికిని గల సంబంధము నిందు జర్చించి యున్నారు. మఱియు నేటికిని నాంగ్లేయోన్నత పాఠశాలలందుఁ జెల్లి వచ్చుచుండు ద్వితీయభాషాధ్యాపకులకును దమ కుండు సంబంధములీ పీఠికలో హాస్య రసోత్పత్తికముగా విపులీకరింపఁ బడినవి. మొత్తముపై గ్రం

థమింగ్లీషు స్కూల్విద్యార్థులకుఁ బఠన యోగ్యమని మా యభిప్రాయము. సు. ప్ర.

మరణదుఃఖ నివారణము

లేఖకుడు : ఆర్య నారాయణ మూర్తి గారు.

వెల అ. ౦—౧౦—౦

ఇందు గ్రంథకర్త గారి ఛాయాపటముగలదు. హిందూ వేదాంతముయొక్క విశాల సిద్ధాంతముల ననుసరించి చక్కగ వ్రాయబడినది. స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరముల సంబంధములను దెలుపు కోష్టకములు పాఠకులకు జాల నుపయోగ కరముగ నుండగలవు. చక్కని శైలితోడను, సామాన్య ఉదాహరణములతోడను విరాజిల్లుచు విషయము సుబోధకము గా వ్రాయబడినది. ఆంధ్ర భాషయందు ఇట్టి గ్రంథములు విశేషము అనవాదములే. కాని ఇది స్వతంత్ర గ్రంథ మగుటచే గ్రంథకర్త గారి స్వీయానుభవము ప్రతివాక్యమునందును స్పష్టముగా ప్రతి ఫలించుచున్నది. జీవితావసరములు, విషయకాంక్ష మెండగుచున్న ఈ కాలమున, నిజమగు యానంద మార్గమును జూపించు ఈ గ్రంథము ఎంతయో లాభకారి. భాషాసేవయు దేశసేవయు ఇట్టి మార్గమున జేయుచున్న గ్రంథకర్త గారెంతయు వంద్యులు. వలయువారు గ్రంథకర్త గారిపేర హిందూపురమునకు వ్రాసిన బడయగలరు.

మా. రా.

సాంఘిక దర్పణము : ప్రథమభాగము.

గ్రంథకర్త :—మల్లాది నాగభూషణము గారు. వెల ౧—౪—౦

పింగిలి లింబాద్రిరెడ్డిగారి సంపాదకత్వమున, విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల యొక్క ౧౨ వ కుసుమముగా వెలువడినది. వెల చాల హెచ్చుగా నున్నది. గ్రంథ కర్తగారి ఛాయా పటముగలదు. ఈ గ్రంథము నందు హిందూసంఘము పూర్వమునుండియు ఎటుల క్రమముగా మార్పులు పొందినదియు, పూర్వ కాలమున నున్న కొన్ని సుగుణములు ఈ మధ్య ఎటుల లోపించినవియు మొదలగు విషయములు కడు నేర్పుతో వైదికాధారమున చర్చింప బడినవి. సంఘమన కేవలము మార్పులేని జడపదార్థము కాదనియు, పరిస్థితులను బట్టి నియమముల యొక్క మార్పులు కలుగుట వైదిక కాలమునుండియు వచ్చుచున్నదనియు, నరక స్వర్గాదులు వర్ణాశ్రమములు, మొదలగు విషయముల గురించి సాధారణముగా జనులయందు వ్యాపించియున్న భావములయొక్క అస్వాభావికతను వెల్లడిచేసియు, శ్రుతుల ప్రమాణము గైకొని నిజమగు తత్వము విశదీకరించ బడినది. మూఢ విశ్వాసములకు లోనయిన పూర్వాచార పరాయణులకు ఈ గ్రంథము మహాసూర్యావర్తి. ప్రపంచ జ్ఞానమను తేనెతో కలిపి ఈ మహౌషధమును వారు స్వీకరింప నగును. సంపాదకులు ద్వితీయ భాగము సహితము త్వరలో ప్రచురించి దేశీయుల కృతజ్ఞతకు పాత్రులగుదురని నమ్ముచున్నాము.

మా. రా.

రాధాబాయి

గ్రంథకర్త : ఓరుగల్లు నరసింహముగారు.

ఇదొక వేశ్య స్త్రీ జీవితచరిత్రము, ఇందువేశ్యలు ముఖ్యముగా నేర్చుకొన దగిన పెక్కునీతి విషయములు గలవు. కళావంతుల సంఘోద్ధరణముకై నిట్టి జీవిత చరిత్రములు చాలవరకు సాయమొనర్పగలవు. వెల ౦-౩-౦

వలయువారు యస్. శ్యామారావు కంట్రాక్టరు పరోపకారిణీ బాలికాపాఠశాల సికింద్రాబాదు. వ్రాసి బడయగలరు.

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి చండాలవిలాపము.

గ్రంథకర్త : శివపురపు వీరభద్రపాకయాజిగారు. వీరి విపరీత విమర్శనములు ఆంధ్రలోకమునకు చిరపరిచితములు. ఈ గ్రంథమంతయు వ్యక్తిదూషణములతో నిండియున్నది. గ్రంథ పఠనమువలన పాఠకుల కిసుమంతయైనను లాభముకలుగనేరదు.

ప్రహ్లాద నారాయణ యుద్ధము

గ్రంథకర్త : ముడుంబ శింగరాచార్యులు గారు ప్రకాశకులు : విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల జగిత్యాల (నైజాం). వెల తెలియదు.

ఈశ్వరశతకము

గ్రంథకర్త : గుళ్లపల్లి నారాయణ మూర్తిగారు శ్రీ. శే. కందుకూరి వీరేశలింగము పంతులు గారి శ్లోకములు తిరిగి ఆంధ్ర లోకమున ప్రబలుటకై ఈ శతకము వ్రాయబడినటుల గ్రంథకర్తగారు స్వయముగా వ్రాసినారు. చక్కని శైలిలో ౧౦౦ పద్యములు గలవు. వలయు వారొక కాణీ టికెట్టు గ్రంథకర్తగారి పేర రాయవరము, తూర్పు గోదావరి జిల్లాయని బంపిన బడయగలరు.

———:0:———

# సంపాదకీయములు

## శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు

దేశీయ మహాసభాధ్యక్షులును, స్వార్థత్యాగులును నగు శ్రీమాన్ అయ్యంగారు ఇటీవల చెన్నపురియందు చేసిన ప్రసంగము దేశీయ విద్యార్థులందు విచారము కలిగింపక మానదు. వీరు తమ్ము గూర్చి తాము చెప్పుకొనిన యంశములు చదివినప్పుడు, మహాభారత కర్ణపర్వములో అర్జునుడు అన్నయగు యుధిష్ఠిరుని జంపబూని కృష్ణుని ప్రేరణమున నా యుద్యమము మాని, ఆత్మ హత్య చేసుకొనబోవగా, అది కూడదని వారింపబడి దానికి ప్రత్యామ్నాయముగా ఆత్మ స్తుతి చేసికొనిన కథ మాకు జ్ఞప్తికి వచ్చినది. ఆంధ్రకేసరి ప్రకాశము గారికిని శ్రీమాన్ గారికిని కలిగిన యభిప్రాయ భేదము యొక్క కారణములతోగాని, దాని కంతర్గర్భితమగు రాజ్యాంగ సూత్రములతోగాని మా కిప్పుడు ప్రసక్తిలేదు. కాని రెండు విషయములు మాత్రము, దేశీయ రాజ్యములలోనుండిన వారమైనను, మాకు సంతాపము కలిగించినవి. మొదటిది, భారతవర్ష స్వాతంత్రసంపాదనమున నవిశ్రాంతముగ పాటుపడుచు, స్వజాతీయులవలన నీసేమునకై పలుబాధలకు లోనైన బి. జి. హార్నిమన్ వంటి పురుష పశ్యుని విడిలించివేసి కూడనాడుట. రెండవది, పత్రికాధిపతులు రాజ్యాంగ విషయములలో జోక్యము కలిగించుకొనకూడదని నిర్ణయించుట. విఖ్యాత న్యాయశాస్త్ర వేత్తలును, జాతీయ సౌధ నిర్మాతలును నగు శ్రీమాన్ గారు ఇంత తర్కరహితముగను, ఇంత దూరదృష్టి హీనముగను, ఇంత నిర్దయాళుత్వముతోడను వేలకొలది జనులయెదుట తమ కీర్తి కాంతయొక్క విహార ప్రదేశమగు చెన్నపట్టణమున బహిరంగముగ మాట్లాడుట మా కత్యాశ్చర్యము కలిగించినది! భారతీయ రాజ్యాంగ వేత్తలు ఇట్టి మార్గముల బోవసాగినచో దేశముక్తి కడుంగడు దూరము పోవునని మాకు నిరాశ కలుగుచున్నది. శ్రీమాన్ గారు చల్లని వేళలో నాలోచించి, తమ పశ్చాత్తాపమును ప్రకటించిన శ్రేయము.

## కళావంతుల సంస్కరణము

గత మాసమున దిఖ్యాత సంఘసేవా పరాయణులగు శ్రీయుతులు గుడిసేవ సుబ్బయ్య, భాస్కర్ల ఈశ్వరుడు గార్లను ఆహ్వానించి, హైదరాబాదు సికింద్రాబాదులలో వారి యుపన్యాసముల జేయించి, అత్యావశ్యకమగు నీ సంస్కారోద్యమమునకు నిజాంరాష్ట్రమున దోహదము కలిపించిన సికింద్రాబాదు మానవ సేవా సంఘము వారును, కళావంతుల సంస్కరణము నకై అవిశ్రాంతముగ సికింద్రాబాదునందు పని చేయుచున్నవారు నగు శ్రీ శ్యామారావు గారును దేశీయుల కృతజ్ఞతకు పాత్రులు. విలాసమగు జీవనమునకు శతాబ్దములనుండి పేరు పొందియున్న హైదరాబాదు రాజ్యమున కళా

వంతుల సంస్కరణము ఎంతో జరుగవలసి యున్నది. ఈ రాష్ట్రములోని జిల్లాలలో నీయుద్యమ వ్యాప్తికెంతయు నవకాశము కలదు. శ్రీ శ్యామరావుగారు తమ యుద్యమమును నిజాంరాష్ట్రములోని జిల్లా లోనికిని గొంపోవ ప్రార్థితులు. ఆర్థిక విషయము ఆరంభమున కొంత నిరుత్సాహకరముగ నుండునన్న మాట వాస్తవమే కాని అవతలినుండి వచ్చిన ప్రచారకులకు ఒకనాటి ప్రయత్నమున వంద రూపాయలు కళావంతుల వలన లభింప గలిగినచో, స్థానికులగు కార్యశూరుల ప్రయత్నములు ఫలింప గలవనుట నిస్సంశయము.

## శ్రీమతి చాట్రాతి లక్ష్మీనరసమ్మగారు

సుప్రసిద్ధ కవయిత్రియు, పండితయు, హనర్ పర్తి (వరంగల్లు జిల్లా) బాలికాపాఠశాల ప్రధానోపాధ్యాయినియునగు నీయమ గతమాసమున మండువేసవిలో విశ్రాంతికై దొరకిన సెలవు దినములను నల్లగొండ సూర్యాపేటలందు స్త్రీ విద్యా ప్రచారమున వినియోగించియుండుట ఎంతయు ప్రశంసింపదగిన విషయము. గత వత్సరమీ దినములలో పై రెండు స్థలములందును ప్రభుత్వమువారు సభల నాపిన నాటినుండి జనులలో నిరుత్సాహము వ్యాపించి యుండెను. అట్టి తావులందీ సోదరీమణి యుత్సాహమును పుట్టించి స్త్రీల సభలలోను పురుషుల సభలలోను ఉపన్యాసముల నిచ్చి, సోదరులకు ధైర్య విషయమున గుణ పాఠము నేర్ప గలిగెను. పై రెండు స్థలములందును ఈ వనితా రత్నము సన్మాన పత్రములచే గౌరవింపబడెను. నిజాం రాష్ట్రాంధ్ర జన కేంద్ర సంఘము వారు ఈ ప్రయాణ వ్యయములను సంఘమునుండి యంగీకరింప ప్రార్థించిరి. కాని ఈ క్రింది వాక్యములతో నీమె యాద్రవ్య సహాయమును నిరాకరించెను:

„దేశసేవ విషయములో కేంద్ర సంఘము వారికెంత బాధ్యతకలదో నాకునునంత బాధ్యతకలదు. లోకోద్ధారకులవలె ఘనకార్యములు చేయు శక్తి నాకులేదు. మరియు నేనాచరించు నీ స్వల్ప కార్యము నా విధియేకాని దేశోపకారము కాదు .. నేను స్త్రీనే కనుక స్త్రీలోకము మూఢమై నశించుచున్నదే యను హృదయవేదనమును భరింపలేక స్త్రీలకు దెల్పుటయు పురుషుల బ్రార్థించుటయు నను పేరున నీ కార్యము చేయబూనితిని..."

ఇట్టి భావౌన్నత్యమును, సేవాసక్తిని బడసిన శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు ప్రాచీన ఆర్య స్త్రీత్వాదర్శమునకు చిహ్నముగా నలరారుచున్నారు. నిజాంరాష్ట్రాంధ్రుల పక్షమున నీయమ యొక్క సేవను మరల ప్రశంసించు చున్నాము.

## సమిష్టిని యోజిక వర్గము

గతమాసమున బొంబాయిలో అఖిల భారతకాంగ్రెసు సంఘమునసమావేశమైచేసిన అత్యుత్కృష్టకార్యములలోనిది ముఖ్యమైనదియు, హిందూమహమ్మదీయమైత్రికి గట్టిపునాది వేసినదియునై యొప్పగలదు. దేశనాయకు లీవిషయమున మంచి దూరదృష్టిని, మతసహనమును ప్రదర్శించిరి. అనుదినమురక్తపాతవార్తలు మత కలహావృత్తాంతములు హృదయముల భేదించుచుండిన ఈకాలమున కాంగ్రెసుసంఘమువారి ఈ నూతనపద్ధతి కోట్లకొలది భారతీయులకు చిత్తశాంతి కలిగింపగలదనుట నిస్సంశయము.

Edited and Published by P. N. Sarma B.A. Troop Bazar Hyd. Dn.
Printed by S. Pratapa Reddy B. A. B. L. at the Golkonda Press, Hyderabad

# విషయసూచిక

హైదరాబాదు జూలై ౧౯౨౭

సంపుటము ౧ ప్రభవ సంవత్సర ఆషాఢము సంఖ్య ౭

# అల్లసాని పెద్దనార్యుఁడు

మేడేపల్లి వేంకట రమణాచార్యులు.

అల్లసాని పెద్దనార్యుఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు. చొక్కనామాత్యుని పుత్రుఁడు. బళ్లారి ప్రాంతమందున్న దూపాడు పరగణాలోని దోరాల గ్రామము యితని జన్మస్థానము. కృష్ణదేవరాయుల యాస్థానమందుండెడు కవీశ్వరులలో నితఁడగ్రగణ్యుఁడు. ఇతఁడు మొట్టమొదట నద్వైతసిద్ధాంత నిష్ఠుఁడైనను పిదప విశిష్టాద్వైత సిద్ధాంతము నవలంబించి శఠకోపయతికి శిష్యుఁడయ్యెను. మనుచరిత్ర కృత్యాదియందు,

"క॥ కొలుతు నమ్మద్గురువిద్యా
నిలయుం గరుణాకటాక్ష నిబిడ జ్యోత్స్నా
దళితాశ్రితజన దురిత
చ్ఛలగాఢ ధ్వాంత సమితి శఠకోపయతిన్"

అని స్వాచార్యుని స్మరించెను. కృష్ణరాయలు తన కొసంగిన కోకటగ్రామమును వైష్ణవుల కగ్రహారముజేసి దానికి శఠకోపపురమని పేరిడెను. ఈ కవిప్రకాండుఁడు రాజునొద్ద మిక్కిలిగౌరవ సంమానముల నొందినవాఁడై యున్నను రాజు చెప్పుమన్నప్పుడుగాక తనయిష్టము వచ్చినప్పుడు మాత్రమే కవిత్వము చెప్పు స్వాతంత్ర్యము కలవాఁడనియు రాజొకనాఁడు కవనము జెప్పుమని ప్రార్థింపఁగా నతఁడు చెప్పక యీక్రిందిపద్యమునుఁ జెప్పెననియు వాడుక కలదు.

"చ. నిరుపహతిస్థలంబు రమ
ణీ ప్రియదూతిక తెచ్చియిచ్చు క
ర్పూర విడెమాత్మ కింపయిన
భోజన ముయ్యెలమంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలి
యంగల లేఖక పాఠకోత్తముల్
దొరికినఁగాక యూరక కృ
తుల్ రచియింపుమటన్న శక్యమే?"

ఈకవియే కవిత్వముండవలసిన రీతినిఁగూర్చి యీ క్రిందిపద్యమును జెప్పెనని వాడుక గలదు.

చ. ఘనతర ఘూర్జరీ కుచయు
గక్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యర
చాటగు నాంధ్ర వధూటి చొక్కపుం
జనుగవలీల గూఢతయు
జాటుతనంబును లేకఁ జె
ప్పిన యదె పో కవిత్వ మనిపించు
నగించటుగాక యుండినన్॥

పెద్దనార్యుఁ డాంధ్ర గీర్వాణభాషలయందు నిరుపమానపాండిత్యము గలవాడు. ఇతఁడొకనాడు కృష్ణదేవరాయల యాస్థానములో సకలవిద్వత్కవీశ్వరు లుండగా రాజప్రార్థనపై నుభయ భాషాపాండిత్యమును బ్రకాశింపజేయుచు నొక యుత్పలమాలిక నాశుకవనముగా జెప్పియా సభలోనున్న రాజును విద్వాంసులను కవులను మెప్పించి కాలికి చిరుదండ వేసికొనెను. పెద్దనార్యుఁడు స్వారోచిష మనుసంభవము (మనుచరిత్రము) హరికథా సారము మొదలగు ననేక గ్రంథములను రచించెను. వానిలో మనుచరిత్ర మాంధ్ర వాఙ్మయమందు మిగుల బ్రసిద్ధిఁ గాంచిన మహాప్రబంధము. హరికథాసారము నామమాత్రావశిష్టము. దీనిలోని పద్యములు కొన్ని లక్షణగ్రంథములలో నుదాహరింపఁబడియున్నవి. ఈ పెద్దనార్యునికిఁ బూర్వమందున్న కవులందరును సంస్కృత పురాణేతిహాసాదుల నాంధ్రీకరించుటయే గాని స్వకల్పనలను జేర్చి స్వతంత్రముగా బ్రబంధములను రచించినవారు కారు. ఈతఁడే మార్కండేయ పురాణమునుండి స్వారోచిషమనుసంభవ కథఁ దీసి వికసింపజేసి యీ మనుచరిత్రమును రచించిన వాఁడగుటచే నాంధ్రకవితాపితామహుఁడను బిరుదును లభించెను. ఈతని కాలము మొదలుకొని తక్కిన కవులందరు నితడు రచించిన మనుచరిత్రము నే ఆదర్శకముగా దీసికొని తమ ప్రబంధములను రచించిరి. ఈ కవియే మొట్టమొదటఁ దెలుగు ప్రబంధములలో నన్యదేశభాషాపదములను బ్రయోగించుట కారంభించిన వాఁడు. ఎట్లనగా:

సీ॥ పచ్చనిహురుమంజి పనివాగె పక్కర
పారసిపల్లంబు పట్టమయము
మహిపసిండిపరుంజు మొహదా కెలంకుల
తావు గుజ్జరివన్నె కేవడంబు........।

ఇత్యాదులు [మను. 4 ఆ 28 ప.]

ఈతనినిఁ జూచి యా కాలపు వాడైన ధూర్జటియు దన కాళహస్తి మాహాత్మ్యములోని క్రిందిపద్యమం దన్యభాషాపదములఁ బ్రయోగించియున్నాడు.

సీ॥ బిజమాడు దేవర నిజకృపా మహిమ
జెన్నారు నాయిల్లు బిడారు నీకు
ఒడయచిత్తేశ నాయునికి మజ్జన
మాడు శివార్చన మాడు బేకు॥

ఇత్యాదికము. మొట్టమొదట నాంధ్రప్రబంధములయందు దీర్ఘములైన సంస్కృతసమాసములను విస్తారముగా నుపయోగించినవాడు శ్రీనాథుఁడు. అతడు కవిత్వమం దతిప్రీతియు బహుమానబుద్ధియు గలవాఁడగుటచే నాతని ప్రబంధములను బలుమారు చదివి పెద్దనకూడ నాతని రీతులనే అనుసరించెను. అందువలనే పెద్దన కవనమంచు శ్రీనాథుని కవిత్వపు పోలికలు గాన వచ్చుచున్నవి. ఎట్లనగా :

సీ. నళినసంభవు వాహనము వారువంబులు
కులము సాములు మాకుఁ గువలయాక్షి
చద వేటిబంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకుఁ బువ్వుబోడి
సత్యలోకముదాక సకల లోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరములైన మా మాటలు వినంగ
నమృతాంధసులు యోగ్యు లనుపమాంగి

భారతీదేవి ముంజేతి పలుకుచిలుక
సమదగజయాన సబ్రహ్మచారిమాకు
వేదశాస్త్రపురాణాది విద్యలెల్ల
దరుణి నీయాన ఘంటాపథంబుమాకు॥

(శృంగా—నై—2 అ)

సీ. చిన్నివెన్నెలకందు వెన్నుదన్నిసుధాబ్ధిఁ
బొడమినచెలువ తోఁబుట్టు మాకు
రహిమీఱ జంత్రీ గాత్రముల రాల్గరగించు
విమల గాంధర్వంబు విద్య మాకు
ననవిల్తుశాస్త్రంబు మినుకు లావర్తించు పని
వెన్నతోఁడఁ బెట్టినది మాకు
హయమేధ రాజ సూయముల నఁబేర్వడ్డ
సవన తంత్రంబులుం కువలు మాకు
గనగ నగసీమకల్పవృక్షముల నీడ
బచ్చరాగట్టు గమి రచ్చపట్టుగూకు
బద్మసంభవ వైకుంఠ భర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర॥

(మను 2 అ)

ఉ. వానిఁ బ్రశంస చేయదగు
వాఁడు కృతార్థతముండు వానిచే
నీ నిఖిలంబు పావనము
హీన కృపా విభవంబెలర్ప నె
వ్వాని గృహాంగణంబునకు
వచ్చినత్రోవ రజంబులందు నీ
మానిత పాద యుగ్మకమ
మర్చు బ్రఫుల్లసరోజ ధామమున్॥

(నైష 3 అ)

ఉ. వానిది భాగ్యవైభవము
వానిది పుణ్యవిశేషమెమ్మెయిఁ
వానిదవంధ్యజీవనము
వానిదె జన్మము వేరునేయ
కెవ్వాని గృహాంతరంబు నభ
వాదృశయోగి జనంబు పావన
స్నాన విధాన్నపానముల
సంతస మొందుచు బోవు నిచ్చలున్॥

(మను 1 అ 68 ప)

పెద్దన్న శైలి మిక్కిలి మృదువైనది. కవనము సలక్షణముగాను నిర్దుష్టముగా నుండును. ఈవిషయము నేకృష్ణరాయలు:

“కృతి రచింపుము మాకు శిరీషకుసుమ
పేశలసుధామయోక్తుల బెద్దనార్య”

అనుపద్యము బోధించుచున్నది. మనుచరిత్రము శృంగార రసప్రధానమైనది. ఇది సాధారణముగా సంస్కృత పద భూయిష్ఠమై యున్నది. కొన్ని చోట్ల సంస్కృతాంధ్ర పదము లతిమనోహరముగా గలపబడినవి. ఈగ్రంథమం దలి చతుర్థాశ్వాసము కేవలాంధ్ర పదమయ మైనది. ఈతని కవిత్వమందలి పదగుంభన విశేషముంబట్టి

“అల్లసానివాని యల్లిక బిగియును”

అని ప్రసిద్ధి గలిగినది.

ఈదిగువ వ్రాయబడిన కొన్ని ఆభాస హేతువు లనుబట్టి ‚ఆముక్తమాల్యద’ కూడ పెద్దనార్య కృతమేగాని కృష్ణరాయలు రచియింపలేదని కొందరు వాదించుచు న్నారు.

1. మను చరిత్రములో పీఠికయందున్న పద్యములే ‚ఆముక్తమాల్యద’ పీఠికలోఁగూడ గానవచ్చు చుండుటచే నిది పెద్దనార్యకృతముగాని కృష్ణరాయలు రచియింప లేదని వారివాదము.

కృష్ణరాయఁడు భగవదాజ్ఞచే నీయాముక్తమాల్యద యను మహాకావ్యమును రచింప సమకట్టి కృత్యాదియందు గ్రంథకర్త యొక్క వంశమును వర్ణించుట సాంప్రదా యము నాచారము గావున నాప్రకారముగా దనవంశము ను వర్ణించుకొనెను. రాయలు:

అవికత్థనః క్షమావానతి
గంభీరో మహాసత్త్వః
స్థేయాన్నిగూఢ మానోధీరో
దాత్తోదృఢ వ్రతఃకథితః"

అనుకారికలో జెప్పఁబడినట్లు ధీరోదాత్త నాయక లక్షణములు గలవాఁడు గావున దన్ను దనవంశస్థులను శ్లాఘించు కొనుట కిష్టములేక తనయాస్థాన కవీశ్వరుఁడు తన కంతరంగుఁడునైన పెద్దనార్యుఁ డింతకుమున్ను రచించిన మను చరిత్రములోని స్వవంశవర్ణనాపరములైన పద్యములనే యిచటఁ దిరుగ వాడినచో నేమి దోషము? ఇంత మాత్రముచేఁ గృష్ణరాయని పాండిత్యమునకు లోపమా? ఇందువలనఁ బెద్దనార్యుఁడే యాకృతిని రచించెనని సమర్థించుట కది సాధనమగునా?

౨. కృష్ణదేవరాయ లల్లసాని పెద్దనను, రామరాజ భూషణుని ప్రబంధముల రచించి తెమ్మని యాజ్ఞాపించె నని య్యు దదాజ్ఞానుసారముగా వారిరువురు గ్రంథముల రచించి రాయలకడకుఁ దేగా రాయలు చూచి వసుచరిత్రము కంటె మనుచరిత్రము కొంచము తేలపాకముగా నున్నదని పలుకగా నంతఁ బెద్దన కుపితుఁడై అతికాఠిన్యముతో నాముక్తమాల్యదను రచించెననియుఁ జెప్పుదురు.

ఇది కేవలమసంగతము. 'మనుచరిత్రము' రచింపఁబడిన తరువాత మఱికొంత కాలమునకు 'వసుచరిత్ర' పుట్టినదనియు, రామరాజభూషణుఁడు రాయల యాస్థానకవులలో నొకఁడై యుండలేదని ఋజువు చేయుటకు దగిన ప్రబల ప్రమాణములు గలవు. 'మనుచరిత్ర' కృష్ణరాయల దిగ్విజయ యాత్రకు దరువాతను రాచూరి ముట్టడికిఁ బూర్వమందును రచింపఁబడి యుండుట స్పష్టము. అనగా క్రీ.శ. ౧౫౧౬ సంవత్సరమునకును ౧౫౨౦ సంవత్సరమునకును మధ్యకాలమున రచింపబడినది. 'వసుచరిత్రము' క్రీ. శ. ౧౫౪౪ వ సంవత్సరమునకు దరువాతనే రచియింప బడినదని మనము నిర్ధారణఁ జేయగలము. 'వసుచరిత్రము'ను గృతినందిన తిరుమలదేవరాయలు ౧౫౬౭ సంవత్సరమున దన రాజధానిని 'పెనుగొండ'కు మార్చుకొనెను. ఈతఁడు 'పెనుగొండ'ను రాజధానిగా జేసికొనిన తరువాత మహమ్మదీయులతో జేసిన యుద్ధమును గురించి కవి 'వసుచరిత్రము'లో నీవిధముగా జెప్పియున్నాడు:

"చ. తిరుమలరాయ శేఖరుని
ధీర చమూభట రాజియాజి భీ
కర యవనేశ్వర ప్రహిత
ఖానబలంబుల జిక్కు సేయ నీ
ధ్ధర బెనుగొండ కొండలును
దద్విపచర్మక పాలమాలికా
పరికర భూషితంబులయి
బల్విడిగాంచె గిరీశభావముల్".

క్రీస్తుశకము ౧౫౪౪ సంవత్సరమందు దురుష్కులు తిరుమలదేవరాయని పెనుగొండనుంచి చంద్రగిరికిఁ దరిమినట్లుగా మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసియున్నారు. అంతియకాక 'వసుచరిత్రము'ను గృతినందిన తిరుమలరాయడు శ్రీరంగరాజు కుమారుఁడు. ఈ శ్రీరంగరాజునకు తిరుమలరాజుగాక కోనరాజు, తిమ్మరాజు, రామరాజు, వెంకటరాజు నని మరినలుగురు పుత్రులుగలరు. వీరిలో రామరాజు కృష్ణరాయుని యల్లుఁడు. ఇతని కళియరామరాజని పేరు. కృష్ణరాయని ఆనంతర మీతఁడు ౧౫౪౪ సంవత్సరమున విజయనగర రాజ్యము నాక్రమించుకొని యేలెనని 'నరపతివిజయ'ము నందును 'రామాభ్యుదయ' మందును జెప్పబడియున్నది.

గీ. సలికవిభు తిమ్మరాజు నేనలను ద్రుంచి
గుత్తి పెనుగొండ మఱి గండికోట కంద
నోలిపుర మాడలే నవలీల గెలిచి
తొలుదొలుత రామనృపతి దోర్బలము
[మెరసె.

ఉ. ఆ పటుకీర్తి రామవను
ధాధిపచంద్రుడు కృష్ణరాయ ధా

శ్రీపతి సార్వభౌమ దుహి
తృప్రియుఁడై వితతప్రతాప సం
తాపితశత్రుఁడై యల స
దాశివరాయ నిరంతరాయ వి
ద్యాపుర రాజ్యలక్ష్మికిని
దానము దానయి మించెనెంతయున్.

కాబట్టి 'వసుచరిత్రము' ౧౫౭౦ సంవత్సరమునకు ద
గ్గరనే ప్రారంభమైనది. ఇందువలన 'వసుచరిత్రము'ను
రచించిన రామరాజభూషణు డను నామాంతరముగల
భట్టుమూర్తి కృష్ణరాయలయాస్థానమందుండెడు కవి కాడ
నియు, 'మనుచరిత్రము' రచింపఁబడిన కొంతకాలమునకు
గాని 'వసుచరిత్రము' రచింపబడలేదనియు కృష్ణరాయల
కాలమునకు కృతిపతియగు తిరుమలరాయడు బాల్యదశ
లో నుండెననియు స్పష్టమగుచున్నది. కావునబూర్వోc
క్తమైన ఆముక్తమాల్య దోత్పత్తి అసద్ధేతుకముగాని సద్ధే
తుకము కాదు.

3. 'ఆముక్తమాల్యద'కవిత్వము మిక్కిలి కఠినము
గా నుండుటకును, అచ్చటచ్చట గొన్ని స్ఖాలిత్యంబు
లుండుటకును గారణంబు జూడక యీగ్రంథంబు పెద్దన కవి
త్వంబు గాదనియు, రాయలు రచించెననియు లోకులకు
దోచుటకై పెద్దన బుద్ధిపూర్వకముగా గొన్నితప్పులను
వ్రాసి యింతకఠినముగా నాముక్తమాల్యదను రచించెన
నియు గొందఱభిప్రాయ పడుచున్నారు.

ఇది సమంజసము కాదు. సామాన్యముగా పండితు
లైనవా రెవరైన పరులకొరకు స్వగౌరవమును బోగొట్టుకొ
ని ఇట్లు తప్పులు వ్రాయుదురా? దానిలో విశేషించి పెద్దన
వంటి మహాపండితుడు లక్షణవేత్త మరియొకడు దీనిని ర
చించినాడని లోకులకు నమ్మించుటకు వ్యాకరణదోష దు
ష్టముగా నీ గ్రంథమును రచించె ననుట పండితులైన వారు
విశ్వసింతురా?

ఈ ప్రబంధమును రచించినవాడు క్షత్రియుడై
యుండవలెనుగాని బ్రాహ్మణుడు గాడనుట కీగ్రంథ
మందే కొన్ని సాక్ష్యములున్నవి:

శా. తారుణ్యాతిగ చూత నూత్న ఫలయు
క్తైలాభి ఘూరస్వన
ధారాధూపిత శుష్యదంబుహృతమా
త్స్యచ్ఛేదీ పా కోద్గతో
ద్గారంపుంగనరార్చు భోగులకు నం
ద్యావేళలంగేళి కాం
తారాభ్యంతర వాలుకాస్థితహిమాం
త ర్నారికేళాంబువుల్.

(ఉ. ప — ౨౫,

ఈ పద్యముంబట్టి విచారింపగా గేవలము మత్స్య
ములను దినువాడును, అందులోగూడ రాజభోగ్యముగా
దానిని పచనముచేయు విధము ఇట్టివర్ణనము చేయజాలడు.

కావున నీ 'ఆముక్తమాల్యద' మత్స్యమాంసభోజి
యగు క్షత్రియునిచే రచింపబడి యుండవలెను గాని మ
త్స్యభుక్కులుగాని బ్రాహ్మణులగు పెద్దనామల వలన ర
చియింపబడలేదని నిశ్చయముగా జెప్పవచ్చును. వెర్యేల
ప్రతివారును స్వానుభూతిచే పరికించిన నీ సంగతి విశదము
గును. 'మనుచరిత్ర' నొక చేతిలోను, 'ఆముక్తమాల్యద'
మరియొక చేతిలోను బట్టుకొని వరుసగా బదముల జదివిన
చో మనుచరిత్ర పద్యముల కున్న శ్రావ్యత మాధుర్యము
ఆనందము, సారళ్యము మొదలగు గుణములు 'ఆముక్తమా
ల్యద' పద్యముల కున్నదా? ఈ తారతమ్యజ్ఞానమును గలిగి
యుండుటకెవ్వనికిని విశేషపాండిత్యమక్కరలేదు. 'మను
చరిత్ర' పద్యములు చదువువారికి వినువారికిని హృదయము
నం దమృతము జిలికినట్లుండును. 'ఆముక్తమాల్యద'యన్న
నో పాషాణ కల్పము, పాకమా నారికేళపాకము, శబ్దగ్ర
థనమా దీర్ఘసమాసజటిలము. ఇందలి వేదాంతఘట్టము

లు రామానుజ బ్రహ్మసూత్రభాష్యమును గురూలంకషము గా వ్యాసంగముచేసి రామానుజ మతసంప్రదాయము నెఱింగిన వారికిగాని సామాన్యులకు దెలియవు. ఇదిగాక యామునాచార్యుడు తన కుమారుని కుపదేశించిన రాజ నీతిని విమర్శింపగా రాజ్యపరిపాలన మందు చిరకాలాను భవము గల యొక మహీపాలు డిట్లు వ్రాయగలవాడు గాని తనకు రాజనీతి శాస్త్రముగూడ దెలుసునని లోకులకు వెల్ల డింప గోరిన తదితరు డిట్లు వ్రాయజాలడు. కాళిదాసాది మహాకవుల గ్రంథములయందు సాధారణపద ప్రయోగము లు, అభిప్రాయైక్యము మొదలగు కర్తృత్వైక్యసూచ లింగములున్నట్లీ రెండు గ్రంథములలో నేమియు గాన రావు. కావున బూర్వోక్త హేతువులనుబట్టి 'ఆముక్త మాల్యద' కృష్ణరాయ విరచితముగాని పెద్దనార్య కృతము గాదు. ఈవిషయము ఆముక్త మాల్యదకు నేను వ్రాసిన పీఠికలో విపులముగా జర్చింపబడి యున్నది. గాన నిచట విరమించుచున్నాను.

# అర్చకురాలు

యామర్తి. సూర్య ప్రకాశరావు

మీ సుధాధర క్రీడలు మెలగుచుండు
స్వచ్ఛ శృంగార సరసిలో జలకమాడి,
అసిత కేశాగ్రముల వారిలేశవితతి
విమల ముఖ దర్పణంబులో వెలుగుచుండి,
ప్రేమసీహార లేశ ప్రస్ఫీత గరిమ
వర కపోల ద్వయమునందు వరలుచుండి,
సచ్చిదానంద రూపుని చంద్రకాంతి
గరిమ, కట్టుడు చీరగా గలిగియుండి,
పాద పద్మద్వయశ్రీల భాగ్యరాశి
కురుల ననుదినంబు ముడుచు కుసుమము లన
మస్తకమున దాల్చుకొని యీమధురవాణి,
పల్లవానిభ మృదలమౌ పాణిలోన
భవ్యనామ ప్రసూనంపు వ్రతతిగొనుచు,
పద్మినీ హృదయపుటాళి పాత్రయందు
విమల నీరాంజనం బిదు వేడ్కతోడ
తమరి సేవార్థమై నేడు దరలుచుంటి,
సకల పూజావిధానముల్ సలుపగోరి!
ఇవియె నాభాగ్యభోగ్యము, లిదియనాకు
గల్గిన యతిలావణ్యవికాసతనువు:
స్వీయ పరిచారికగ నెంచి స్వీకరింపు
దేవ, దేవాది దేవ! ఈదీను రాల్ని!!!

# పృథ్వీరాజు

చందుబరదాయి హిందీలో రచించిన రాసోకావ్యానుసారము

శేషాద్రి రమణ కవులు

౧

రాసోనామక గ్రంథమందలి ౨౫,౨౬ సమయముల లో నిటుల వ్రాయబడి యున్నది. దక్షిణ దేశ సంకలియొక్క ప్రసిద్ధనటుడు ఉత్తరభారతదేశమందలి తీర్థ సంచర్య మొనర్చుచు పృథ్వీరాజ సభాస్థలమున గొన్ని యాటల జూపించెను. పృథ్వీరాజా నటునితో నొనర్చిన ప్రసంగముచే దేవగిరి నివాసులగు ప్రతాపవంతులగు యాదవ రాజులలో భానుడను నొకడు గలడనియు నాతకి నద్వితీయ సౌందర్య రాశియగు శశివ్రతయను కొమార్తె గలదనియు నాకన్యను కనోజపాలకుడగు జయచంద్రున కిచ్చుటకు ప్రయత్నము జరిగెననియు వివాహము పదిపదునేను దినములలో కాగలదనియు దెలిసికొనెను. తరువాత నానటుని సత్కరించి యంపి యాశశివ్రత యందు దగిలిన చిత్తమును మరలింపజాలక మరునాడు దగు పరివారము తోడను కొలది సైన్యముతోడను బ్రయాణముచేసి దేవగిరిని చేరి యాదవులతో గూడిన జయచంద్రు నోడించి తండ్రి యొసంగగా నాశశివ్రతను వివాహమాడెను. శశివ్రతతో గూడ పృథ్వీరాజా ఢిల్లిని చేరవచ్చుచుండగా దేవగిరి పంపిన యొకదూత చేరవచ్చి, 'మహారాజా, తమచే జయింపబడిన జయచంద్రుడు తనరాజ్యమునుండి యపరిమిత సైన్యముతో వచ్చి దేవగిరి రాజ్యమును మంటగలిపెదనని ప్రేలుచున్నాడు. కావున దేవగిరి పాలకుడు దమ సహాయమును గోరుచున్నాడ'ని మనవి యొనర్చెను. అదివిని పృథ్వీరాజు దన సంపూర్ణ సైన్యముతో నేతెంచి జయచంద్రుని జయించి దేవగిరిని రక్షించెను, అని యాగ్రంథమున వ్రాయబడి యున్నది. కాని యీ యుద్ధకాలము దెలిపియుండ లేదు. సముద్రగడ యందు జరిగిన యుద్ధమునకు దర్వాత మాఘమాసమున జరిగినదని మాత్రము దెలియుచున్నది.

దక్షిణదేశమున సోలంకులయొక్క రాజ్యము కల్యాణనగరమున మిగుల బురాతనకాలమునుండి యుండెను. ఆకల్యాణనగరము ప్రస్తుతము కల్యాణియని వాడబడుచు హైద్రాబాదురాజ్యమున నొకనవాబుకు జాగీరుగా నున్నది. పూర్వకాలము నొకప్పుడీ కల్యాణరాజ్యము తూర్పున సముద్రమువరకు నుత్తరమున నర్మదవఱకు దక్షిణమున కాంచివరకు వ్యాపించియుండెను. పృథ్వీరాజునకు యవ్వనమున నీకల్యాణరాజ్యమున నొక రాజోద్యోగి ప్రతినిధిగానుండి పాలించుచుండెను. క్రీ. శ. ౧౧౮౯ సంవత్సరమునకు దర్వాత నానగరపాలకు డసమర్థుడగుటచే ద

మరాజ్యమున గలుపుకొనుటకు ప్రయత్న మొనర్చి పదమూ డవశతాబ్దమునందు దేవగిరియాదవరాజు లత్యంతగౌరవము గా లోగాని పాలింపసాగిరి. తత్సమృద్ధి విశేషమును చెలిసికొని అల్లావుద్దీన్ ఖిల్జీ క్రీ. శ. ౧౨౯౪ సంవత్సరమున దేవగిరిని దోచుకొనియెను. ఆసమయముననే దక్షిణభాగమునగూడ మొగలుసైన్యములు ప్రథమమున నాక్రమణ మొనర్చెను. రాసోలో కాలమును దెలిపియుండలేదు కాని శశివ్రతయొక్క వివాహము క్రీ. శ. ౧౧౯౫ సంవత్సరమునకు మొదటనైయుండును. ఈ సమయమున దేవగిరిలో కళ్యాణ రాజోద్యోగి దుర్గరక్షకుడు గానుండెను. కాని భాను నామకుడగు సుప్రసిద్ధరాజును లేడు. శశివ్రతయను రాజకుమార్తెయును లేదు. ఆలేఖకుడు దేవగిరిపాలకులగు యాదవులకేరు వినియుండెను. అంతేకానియాతడు పృధ్వీరాజునకు సమకాలీను డౌనా కాదాయని విచారింపలేదు. కాబట్టిరాసోగ్రంధము పదిరెండవ శతాబ్దమునాటిదికాదని తోచుచున్నది.

రాసో గ్రంధమందలి 33వ సమయములో ఇంద్రావతి యొక్క వివాహవర్ణన మున్నది. మాళదేశపాలకుడగు భీమదేవుడు దనకొమార్తెను పృధ్వీరాజున కొసంగవలెనని యుద్దేశించి యాతనికడ కొకదూతను బంపెను. భీమదేవుని యభిమతమునకు సమ్మతించి కవిగాయకాది పరివారముతో పృధ్వీరాజు మాలవదేశమునకుజేరెను. వివాహమునకు నింకగొంత వ్యవధి యుండెను. అందుచే బృధ్వీరాజు నర్మదానదీ పరిసరారణ్యములను వేటాడుట కేగెను. ఇంతలో దన పట్టణమునుండి యొకదూత వచ్చి గోరి చిత్తూరును ముట్టడింప వేంచెసెనని తెల్పెను. అది విని యాతడు దన ఖడ్గమునకు వివాహము చేయునటుల దెలుపుచు వెడలి పోయెను. భీమదేవుడాఖడ్గమునకు బెండ్లిచేయుటకు సమ్మతింపలేదు కాని కవిగాయకాదుల ప్రబోధముచే నటుల నొనర్చెను. తరువాత నా పృధ్వీరాజు పరివార మా కన్యను దీసికొని ఢిల్లికిచేర్చిరి. గోరీనిజయించి పృధ్వీరాజు యింద్రావతిని వివాహమాడెను.

ఈ వివాహ సంవత్సరమును కూడ దెలిపియుండలేదు. ఇందులకు గొంత ముందు ౩౦ వ సమయములలో మాళవరాజనామము యాదవరాయడని వ్రాయబడెను. రాసో శ్వర యుద్ధమున నితడు పరాజయమొందెను. 33 వ స యమందలి భీమదేవుడు 20 వ సమయమందలి యాదవ యుని పుత్రుడో పౌత్రుడోనని యనుమాన మొదవుచున్న

ఈ సమయమున కెంతయోముందు మాళవ పరమారులలో మిగులగొప్ప ప్రతాపవంతులుండి యు డిరి. ఇతిహాస ప్రసిద్ధులగు విక్రమాదిత్యుడు, భోజు వారీ సుప్రసిద్ధవంశమున కలంకారముగ జనించియుండి ఈ వంశము నందింకను ప్రసిద్ధులగు రాజు లనేకులు జన్మించిరి. కాని కాలాంతరమున నీ వంశీయులశక్తులై మున కాదినము క్షమతాహీనులైపోయిరి. గుజరాతు దలి సోలంకరాజగు సిద్ధరాజు జయసింహుడు మాళవ తియగు యశోవర్మను జయించి తనసామంతునిగా జేసెను. క్రీ. శ. ౨౪ సంవత్సరమున యశోవర్మ జయసింహు లిరువురును మరణించిరి. ఆసమయమున గుజరాతురాజు తా నవంతి నాధుడనని తెలుపుకొనుచుండెను. కాని దేశ వాసులగు గుజరాతులు రాజుగానొప్పుకొనలేదు. దేశమున నరాజకత్వ మేర్పడియెను. యశోవర్మ జ్యేష్ఠపుత్రుడగు జయవర్మ నామమాత్రపు రాజుగానుండెను అతని యొక సోదరుడగు అజయవర్మ ఒక ప్రదేశమునకు రాజయ్యెను. రెండవసోదరుడగు లక్ష్మీవర్మ, జయవర్మ యొక్క యాజ్ఞ తీసుకొని యొక ప్రక్కరాజ్యము స్థాపించెను. ఈ యిరువురు సోదరులు గుజరాతు రాజ్య కుడగు మాలవుని కృషకులినుండి బలపూర్వకముగా రాజస్వము తీసికొన సాగిరి. ఈ కారణము వన్నిటిని క్రీ. శ. ౧౧౪౩ నుండి ౧౧౪౪ వఱకు నను విశ్వాసవాదము అభిప్రాయపడుచుటలేదు. యశోవర్మ పుత్రులగు జయ అజయ వర్మ లిద్దరియొక్క దానపత్రములు లభించి యున్నవి. వాని యందు వారివంశలత యీక్రింది తీరుననున్నది.

౧ యశోవర్మ

౨ జయవర్మ — ౨ అజయవర్మ

౩ లక్ష్మీవర్మ — ౩ వింధ్యవర్మ

౪ హరిశ్చంద్ర — ౪ సుభటవర్మ

౫ ఉదయవర్మ — ౫ అర్జునవర్మ

౬ హరిశ్చంద్ర దేవుని పుత్రుడగు దేవపాలదేవుడు

క్రీ. శ. ౧౧౯౩ సంవత్సరములో పృథ్వీరాజ మరణానంతరము చౌహాన దేశవాసులపై ముసల్మానులు దుండగములు చేయసాగిరి. ఈ సమయమునను దేశ వాసులగు ననేకులు బయలుదేరి మాలవకనోజు రాజ్యమున నివసింపసాగిరి. ఈ సమయమందే మండలకర్ [దీనిని ప్రస్తుతము మాండల్ ఖడ్ అని వాడుచున్నారు. ఇది మేవాడురాజ్యములో నున్నది.] నివాసియగు ఆశాధరుడను కవి మాలవదేశమున నివాస మేర్పఱచి కొనెను. ఈసమయమున మాళవరాజులో కవియగు బిల్హణునకు బాంధవ్య మేర్పడెను. ఈకవియు నాశాధరుడును పై రెండుశాఖల యితిహాసముల వ్రాసియుండిరి. మొదటి శాఖయొక్క జయవర్మ సోదరుడగు లక్ష్మీవర్మయొక్క క్రీ. శ. ౧౧౪౩ సంవత్సరపు దానశాసనము దొరకినది. దీనిలో నతడు తన తండ్రి యశోవర్మ [౧౧౩౪ సంవత్సరము యొక్క] దాన స్వీకార మొనర్చెను. లక్ష్మీవర్మ పుత్రుడు హరిశ్చంద్రుని [౧౧౭౯] దాన పత్రము హరిశ్చంద్రుని పుత్రుడు ఉదయవర్మయొక్క [౧౧౯౯] దాన పత్రములు దొఱకియున్నవి. రెండవ శాఖయందలి యజయవర్మ పుత్రుడు విధ్యవర్మ సమయములో ఆశాధరుడు మాలవకు వచ్చి యుండెను. పృథ్వీరాజావసానసమయమున నీవింధ్య వర్మయే మాలవ దేశమునకు రాజుగానుండెను. క్రీ. శ. ౧౨౧౦ సంవత్సరమున నీతని పుత్రుడు సుభటవర్మ రాజయ్యెను.

ఈరాజుల దానపత్రము లభించి యుండుటచే వీరి యస్తిత్వమునకు సందేహము నందవలసినది లేదుగదా. ఈ దానపత్రములనే ప్రమాణములుగా గ్రహించిన భీమదేవుడు రాసో గ్రంథమున వ్రాసిన యింద్రావతీ యాదవ రాయలు కల్పిత నాయకీ నాయకులు కావలసి వచ్చును.

రాసోయొక్క ౩౬ సమయములో నిటు వ్రాయబడి యున్నది. రణదంభ నామక యాదవ వంశ్యుడు భానుడను రాజు కన్యయగు హింసావతి చందేరియొక్క శిశుపాల వంశరాజగు పంచాయిన్ వివాహ మాడవలసి యుండెను గాని భానుడు స్వీకరింపలేదు. బలవంతుడగు పంచాయిన్ బలవంతముగా గన్యను స్వాధీన పఱచుకొనుటకు రాచుండగా భాను డది తెలిసి పృథ్వీరాజునకు బంచాయిన్ దుర్మార్గమును దండించి మానునటుల చేయవల



సినదనియు నటు లొనర్పగనె నాకన్యకను నిచ్చి వివాహ మొనర్పగలననియు జెప్పి పంపెను. పృథ్వీరాజు పంచాయిన్ను జయించి హింసావతిని వివాహమాడెను. ఈ హింసావతీ వివాహకాలమును దెలుపలేదుకాని ఇంద్రావతీ వివాహోపరాంతమున నిదిజరిగి యుండవచ్చును.

పృథ్వీరాజ కాలమున రణదంభలో స్వాధీనుడు (అనగా సామంతరాజు) లేకుండెను. రణదంభము పృథ్వీరాజుయొక్క యొకదుర్గము. దీనియందు చేతనభోగి యను నొకదుర్గ పాలుడుండి యుండెను. హమ్మీరు మహాకావ్యము విక్రమశకము ౧౫౦౦ సంవత్సరమున వ్రాయబడియున్నది. పృథ్వీరాజు యొక్క యైదవతో...హమ్మీరు రణదంభమునకు రాజయ్యెను. కావున నీ కావ్యము చౌహాను వంశీయుల విశ్వసనీయయితిహాసమై యున్నది. పృథ్వీరాజ నిధనకాలానంతర మీతని పుత్రుడు గోవిందరాజు రణదంభము నివాసయోగ్య ప్రదేశముగా నెంచి యచ్చటికి వచ్చి నివసించెనని దీనియందు వ్రాసియున్నది. ఈ గోవిందరాజే రణదంభము యొక్క ప్రథమ రాజుగా గన్పడు చున్నాడు. గోవిందరాజునకు పూర్వము పృథ్వీరాజు సమయమున నీ రణదంభమున రాజు లేకుండెను. విక్రమ శకము ౧౨౩౯ లో (మదనపురశాసనానుసారము) మహోబా రాజగు పరమాలు చందేలునుండి పృథ్వీరాజు రాజ్యముయొక్క పశ్చిమార్థము చీల్చివేసెను. దీనిచే చందేరీ మహోబా పృథ్వీరాజును గలిసి పోయెను. క్రీ. శ. ౧౧౮౨ సంవత్సరమునకు మొదట చందేరిలో పరమాల్ యొక్క దుర్గరక్షకుడు అటు తర్వాత పృథ్వీరాజుయొక్క దుర్గరక్షకుడు నుండియుండెను. చందేరిలో పృథ్వీరాజు కాలముననే రాజును లేకుండెను. ఈ కారణముచేత శిశుపాల వంశీయుడగు పంచాయిన్ కల్పిత నాయకుడు. రాసోరచించిన సమయమున చందేరీ, రణదంభ అను రెండుదుర్గములలోను పాలకులున్న సమయము పృథ్వీరాజునకు దర్వాత చాలాకాలమునకై యున్నది.

రాసో గ్రంథానుసారము డిల్లీ పతియగు యనంగపాల్ తోమరుయొక్క కన్యకయొక్క గర్భ వాసమునుండి సోమేశ్వరునకు నిరువురు సంతానము గల్గెను. పుత్రుడు పృథ్వీరాజును పుత్రికయగు పృథ్వీకుమారియును నను

వారు. రాసోలో పృథ్వీరాజునకొక సోదరుడున్నటుల వ్రాయబడి యున్నది. కాని యాతడెద్దాని గర్భమున నుద్భవించినది తెలియుటలేదు. పృథ్వీకుమారి చితౌరు పతియగు అమరసింహునితో వివాహ మయ్యెను. పృథ్వీరాజునకు పండ్రెండు సంవత్సరముల వయస్సున పృథకు వివాహ మయ్యెను. క్రీ. శ. ౧౧౯౩ సంవత్సరమున గోరీతో నొదవిన యుద్ధమున సమరసింహుడు చనిపోయెను. అప్పుడు పృథకు రత్నసింహుడను నొక్క పుత్రుడు బాలకుడై యుండెను. అమరసింహుడు చితౌరు నుండి యాత్ర చేసుటకు ముందుగా రత్నసింహుని సింహాసనమున నుంచి యుండెను. కాని సమరసింహ, రత్నసింహుల దానపత్రములు కొన్ని లభించి యున్నవి. దానిని బట్టి అమర సింహుడు పృథ్వీరాజునకొక శతాబ్దమునకు క్రింద నున్నట్లును వాని కుమారుడగు రత్నసింహుడు క్రీ. శ. పదునాల్గవ శతాబ్దమున నలాఉద్దీన్ ఖిల్జీ సమయమున నున్నటులను తెలియుచున్నది. ఇంకను సమరసింహుడు పృథ్వీరాజునకు బావమఱది అనగా రత్నసింహుడు పృథ్వీరాజునకు సోదరీ పుత్రుడని తెలియుటలేదు. చిత్తూరు రాజవంశమున ఒకనికంటె యధికముగ సమరసింహ రత్నసింహ నాము లుండి యున్నారు.

హమ్మీరు మహాకావ్యము నుండి సోమేశ్వరుని భార్యయొక్క పేరు కర్పూరాదేవి యని తెలియుచున్నది. మరియు నామె గర్భమునుండి పృథ్వీరాజు హరిరాజు లనువారిరువురు జన్మించినటు లవ్రాయబడియున్నది. పృథాకుమారి పేరందు లేదు.

మఱియు నా రాసో గ్రంథమందనేక చోటుల బహిరంగముగను సాంకేతముగను కనౌజ పాలకుడగు జయచంద్రు డీర్ష్యచే పృథ్వీరాజును చూచుచున్నాడనియు పృథ్వీరాజాతనికి భయపడుచున్నాడనియు వ్రాయబడి యున్నది. మఱియు పృథ్వీరాజాతని భయమువలన రాజధానియందు నివసింపక శూరాగ్రేసరులగు గొందఱు యోధులతో వేటకు వెళ్లి డేరాలయందు నివసించుచుండెను. ఒక్కొక్కచోట ౪,౫ రోజులకంటె నెక్కువ నివసించుటలేదు. జయచంద్రుడు పృథ్వీరాజును జయింప శక్తుడు కాకపోయినాడు కాని మహమ్మదు గోరీతో తటస్థించిన ఘోరయుద్ధమున పృథ్వీరాజునకు సహాయుడు కాలేదు. అందుచే పృథ్వీరాజు చనిపోయెను. ఐకమత్యము పరస్పర సహాయము లేమి చేతనే హిందువుల రాజ్యము హస్తములనుండి తొలగిపోయెనని రాసోలో సంకేతించి వ్రాయబడి యున్నది.

పృథ్వీరాజు
|
గోవిందరాజు. రణదంభముయొక్క మొదటిరాజు.
|
బాలహాన్ దేవుడు
|
వాగ్భట్టుడు
|
జైత్ర సింహుడు
|
హమ్మీరుడు

పృథ్వీరాజు చనిపోయిన ౨౫౦ సంవత్సరముల తర్వాత [౧౫౦౦ విక్రమ శకము] గ్వాలియార్ యొక్క తోమరు వంశ్యుడగు వీరముని సంస్థానమున నయచంద్రసూరి యను జైన విద్వాంసుడుండెను. వీరముడు వీనిచే హమ్మీరు మహాకావ్యమును రచింప జేసెను. ఈకావ్యమున ప్రధాన నాయకుడు పృథ్వీరాజున కైదవతరము వాడును రణదంభ ప్రభువునగు హమ్మీరుడు. ఈతడు క్రీ. శ. ౧౨౮౩ సంవత్సరమున రాజ్యమేలుచుండెను. ఈ గ్రంథమున చౌహాన వంశీయుల ముఖ్యముగ పృథ్వీరాజు యొక్క వర్ణము నితిహాసములున్నవి. పృథ్వీరాజ పుత్రుడగు గోవిందరాజు రణదంభ ప్రథమ పాలకుడు. గోవిందుని దేహాంతమున బాలహాన దేవుడు రాజయ్యెను. కాని గోవిందదేవునికీ బాలహాన్ దేవుడేమి యగునో దీనియందు వ్రాసి యుండలేదు. బాలహాన్ దేవుని పుత్రుడు వాగ్భట్టుడు. ఈతని పుత్రుడు జైత్ర సింహుడు. రాజయ్యెను. జైత్రసింహుని తర్వాత పుత్రుడగు హమ్మీరు రాజయ్యెను. హమ్మీర నేక వత్సరములు అల్లాఉద్దీన్ ఖిల్జీతో పోరాడుచువచ్చి తుద కాతనిచేతనే యుద్ధమున ప్రాణమును పోగొట్టుకొనెను.

ప్రసిద్ధుడగు మైథిలీకవి విద్యాపతి ఠాకూరు క్రీ. శ. [illegible] సంవత్సరమున ,,పురుష పరీక్ష'' నామ

గ్రంథమును వ్రాసియున్నాడు. దీనియందు జయచంద్రుని చారిత్రము విస్తృతమైయున్నది. పృథ్వీరాజు యొక్క పతన సమయమున పృథ్వీరాజు విజయ మహాకావ్యము రచియింపబడి యుండెను. ఈ పుస్తకమునందలి రాజవంశగాథల వలనగాని యీసమయమున నింతకు వెనుకటి సమయమున రచియింపబడిన పుస్తకములు శిలాలేఖనములు మొదలగు వానివలన గాని జయచంద్రుడు పృథ్వీరాజుపై విరోధమున మొగలులకు సహాయ మొనర్చినను విషయము దెలియుటలేదు. కావున నీసంగతి యనుమానింప నగుచున్నది. శహాబుద్దీను గోరీని చతురుడగు సేనానాయకుడు దూరదర్శి రాజనీతివిశారదుడునగు రాజై యుండెను. వీనికి గుజరాతు పాలకుడగు సోలంకి భీమదేవుడు, అజమేరు పతియగు పృథ్వీరాజు, కనౌజు దేశాధీశుడగు జయచంద్రుడు, మహోబా, పరమాల్, చందేల్, చితౌరులకు రాణా యనను ఏర్వురు ప్రసిద్ధ విరోధులుత్తర భారత దేశమున నుండిరి. వీరిలో నొక్కొక్కరే యనేక మారులు ముసల్మానుల నోడింప గలిగి యుండిరి. అట్టిచో నీపంచశత్రులొక్కటో నేకీభవించిన నీముసల్మానులీ భారత వర్షమున కోటలనుగట్టి పాలింప గలరా. కావుననే నీగోరీ వారిలో వారికి పరస్పర వైర మొదవించి యొక్కొక్కరినిగా జయించి యుండునని తోచుచున్నది. చౌహానులకు ప్రబల విరోధిగా గుజరాతు రాజుండెను. వీరొకరితో నొకరు పోరాడుచుండిరి. కనౌజు పాలకుడగు జయచంద్రుడు వీని తండ్రియగు విజయపాలుని నాటినుండి యుత్తర భారత దేశమున చక్రవర్తిగా బరిగణింప బడుచుండెను. కాని యొక్క పృథ్వీపాలుడు మాత్రము లోబడలేదు గాని భయపడుచునే యుండెను.

ఈ సమయమున మహోబాలో శ్రావణ మాసోత్సవములు మిగుల బ్రసిద్ధిగ జరుగుచుండెను. దీని శేష చిహ్నములీనాటికిని బనారసు, మిర్జాపుర ప్రాంతముల సంగీత విశేషములతో గానవచ్చుచునే యున్నది. పృథ్వీరాజు తన రాజధానిలో మహోబాలోకంటె నింకను ప్రసిద్ధముగా నాయుత్సవముల జేయింప సాగెను గాని మహోబాలోని యుత్సవములను మించి యుండలేదు. అప్పుడాతడు మహోబా నాక్రమింప నేగెను. మహోబా నాక్రమింప నేగుటనుగూర్చి వేరువేరు కారణములు పలుతావుల గానవచ్చుచున్నవి. కాని వీనినన్నిటిని బట్టి పృథ్వీరాజునకు గల్గిన యీర్ష్యయే మహోబా ముట్టడింప జేసెనని చెప్పవచ్చును. బేత్వానదీ తటమున ఘోరయుద్ధమయ్యెను. మహోబారాజ్యపశ్చిమ భాగమును పృథ్వీరాజు జయించెను. ఇందుచే నారాజ్యము దుర్బలమయ్యెనే కాని పృథ్వీరాజు బలసంకుడు కాలేదు. అనగా విదేశ విరోధి యాక్రమణమున కిరువురేకీభవించుటకు పూర్వమే బలహీనులయిరి. పృథ్వీరాజు తర్వాత కనౌజున కేగి జయచంద్రుని కొమార్తెను హరించి తెచ్చెను. ఇందుచేనైన యుద్ధమున నిరుపక్షములయందును సుప్రసిద్ధ యోధులు పడిసిరి. ఆఫ్గనులతో రానున్న ఘోరయుద్ధమునకు పూర్వము, పృథ్వీరాజు దన సేనయొక్క స్థితి చూచి తన పురాతనాష్టోత్తరశతశూరులస్థానముల నాశూరుల పుత్రపౌత్రులుండుట చూచి వారు బాలకులగుటయు, నంతవఱకు యుద్ధమన్నది యెఱుగని శూరులగుటయు, విచారించి కన్నుల నీరు నించెను. దూరదర్శి, రాజనీతి విశారదుడగు గోరీ యీసమయమును గుర్తింపక పోలేదు. పృథ్వీరాజు నీరెండవ యుద్ధమున బలమును గూర్చుకొన నీయకయే సమ్ముఖ సమర మొదవ నిచ్చెను. ఈ కారణముననే గోరీకి విజయము లభించెను.

యుద్ధ మొదవుటకు పూర్వమే పృథ్వీరాజు దూతలనుబంపి గొప్పకొద్ది యనుభేదము విచారింపక రాజుల సహాయము గోరవలసి యుండెను. కాని మహోబా గుజరాతు కనౌజు, పాలకుల సహాయము గోరి యుండలేదు. తమ్ము బిలువకుండుటచే వచ్చియుండలేదు. ఇందు వారి దోష మేమాత్రమును లేదు. పిలువ నంపకుండుట పృథ్వీరాజ దోషమే. దోషమెవరి దయినను కానిమ్ము. ముసల్మానునే హిందూరాజులును బిలిచి యుండలేదు. ఏ హిందూరాజులును దమ ప్రతి పక్షులతో నొదవిన యుద్ధమున సహాయకులు గాలేదు. రాసో గ్రంథములో గొన్ని యసంభవములు నైతిహాసికములునగు విషయములు వ్రాయబడి యున్నవి.

౧. రాసోగ్రంథ సారము పృథ్వీరాజు గోరీని పదియారు మారులు జయించి బాధించెను. కొన్ని పర్యాయము లేవియో కానుకలు తీసికొని మఱికొన్ని పర్యాయములు సలాములు చేయించుకొని వదలివేసి యుండెను. ఇది

అసంభవమని తోచుచున్నది. ఏరాజును బలవంతుడగు శత్రు నిమాటిమాటికి జయించి యీప్రకార మెప్పుడును వదలివే యడు. కాబట్టి యిది నమ్మదగినదికాదు. వర్షాకాలము నా లుగు నెలలును రాజు లేయాక్రమణ నొనర్పరు. విజయదశ మి మొదలు రాజులు తమ సైన్యములతో శత్రువుల జయింప నేగుచు ప్రక్కలనున్న రాజ్యముల జయింపను నేగ దరు; ఇందుల కేకారణము నగత్యము లేదు. దుర్గములన్ని యు నవరోధకాలము కొఱకగు నన్న పానీయముల ముం దుమందే సిద్ధము చేయబడి యుండును. తత్పాలకులు రహ స్యచారుల వలననే రాజెంతెంత బలముచే చైత్రయాత్ర బయలుదేరుచున్నదియు, నెవనిమీది కేగుచున్నదియు ముందుగనే దెలిసికొను చుందురు. రాజునకు చారులు నేత్ర ములబోలి యుందురు. ఈప్రకార మెన్మిది మాసములు రాజులు జయప్రయాగమున నుందురు. పృథ్వీరాజు తన బుద్ధినలుగూడ నిటులే యొనర్చియుందురు. పృథ్వీరాజు గోరీని బంధించినటు లనేక పుస్తకముల నుండి తెలియుచున్నది: కావ్య నాటకాదులనుండి తెలియు నీసంగతియందాకింతేని సత్యముండక పోవని తోచుచున్నది: హమ్మీరు మహాకావ్యములో నేడుమారు లతనిని బందీని చేసినటుల వ్రాయబడి యున్నది. రెండవ లేఖకుడు ౧౧, మారులనియు నింకొకడు ౨ మా రులనియు నిట్లే తమయభిరుచి కొలఁదియు సంఖ్యను హెచ్చించి వ్రాసియున్నారు. అన్ని మారులు బంధించె ననుటలో గొంత యసత్యమున్నను తుదకొక్కమారైని తప్పక బంధించియుండునను టలో సందేహము లేదు. బల దర్పితుడగు శత్రువుతో నాశ్రయ దాతయగు క్షత్రియ వీరుడు పలుకునుగదా. "రాజపుత్రులమగు మేము క్షమిం చము. దాన మొసంగుచున్నాము. నిన్ను వదలి పెట్టుచు న్నాము చూడు. మేము నీకంటె నెంతటి బలవంతులమో నీ వెంత పిరికిపందవో తెలిసికొనుము; సాహసుడవైన చో తిరిగిరమ్ము. తిరిగి నిన్నువిధముగనే బంధించెదము" గోరివంటి చతుర శత్రువొక మారు పట్టుబడి తిరిగి యా తనిపై కెప్పుడును యుద్ధమునకు రాడు. దూరమందుండి యే సేనాపతి నంపి పోరాడించును. ఆసమయపు నిశ్చయ మైన రాజపుత్రుడు ముసల్మానుల చతురత్వము దెలిసి కొనలేడు. ఇందుచే బలుమారు విపత్తుగల్గెను. భారత వర్షమందలి హిందూ మహమ్మదీయులిరువురు విదేశీయ కూటరాజనీతిప్రచారము నెఱుంగక విపత్తులొందిరి.

౨ రాసోలో ననేక చోటులందు పృథ్వీరాజ సా మేశ్వరుల సమయమున పంజాబు లాహోరులు వారి స్వా ధీనమునందుండెననియు లాహోరులో వారియొక్క వేన్న భోగియో సామంతుడో శాసించుచుండెననియు వ్రాసి యున్నాడు. ఈ పెద్దయుద్ధసమయమున అనగా ౧౧౯౩ సంవత్సరములో పృథ్వీరాజుయొక్క సూరసా మంతుడొకడు లాహోరులో నుండెను. చందకవి పృథ్వీ రాజుయొక్క సమయమున ఏసామంతుడు గోరీకి సహాయ ము చేయనుండగా చంద లాహోరునకేగి ,నీవు స్వధర్మ పరులగు పూర్వరాజులయొక్క సహాయకుడవు మాని అధర్మ పరులగు ముసల్మానుల సహాయము చేయవలదని చెప్పిన టుల వ్రాసి యున్నాడు. కాని చాంద ధర్మ వాక్యముల నా సామంతరాజు పాటించిన వాడుగాడు. జనులెల్లరు ,పృథ్వీరాజు సంయుక్తయందే పూర్తిగ మెల్లపుడు వీడకున్నాడు. ఆరు మాసములలో నాయన నేజనుడును జూచి యుండలేదు. మరియు నాతడింత వఱకు జీవించి యున్నాడని ప్రమాణ మేమి యున్నది. ఇప్పటి కారు మాసములు గడచి పోయినవి. ఏప్రభువు ప్రజల కష్టసుఖ ములను విచారించి పాలింపడో యట్టివాని సేవవలన ప్ర యోజనమేమి యున్నది. ప్రస్తుతము ముసల్మానులకు భగ వంతుడుకూడ సహాయము చేయుచున్నాడు. మనమేప్ర కారము సహాయకులము కాము.' చందకవి సామంతుని పల్కినపై వాక్యములను విని విచారమునంది తన సఖుడగు రాజునకు సహాయ మొనర్చుటకు, భగవంతుని ప్రార్థింప వెడలి పోయెను.

ముసల్మాను ఐతిహాసికులు లాహోరు విషయములో నీక్రింద విషయములనుగూడ వ్రాసియున్నారు. క్రీ. శ ౧౧౨౨ సంవత్సరములో గజనీసుల్తానగు మహమ్మదు లాహోరు జయించి తన ప్రతినిధిని నియమించి యుండె ను. ఈ సమయమునుండి లాహోరులో గజని వంశము యొక్క ముసల్మానుల రాజ్యమయ్యెను. మహమ్మదు వం శజులగు గోరవంశీయులగు రాజులు గజనినుండి పార దోలినప్పుడు వారు గజనినుండి లాహోరులో రాజ్య ము చేయసాగిరి. శాహాబుద్దీను మహమ్మదు గోరీసమయ

మలో లాహోరునందు మహమ్మదు వంశీయుడగు ఖుసు
్రోమలిక్ రాజ్యము చేయుచుండెను. క్రీ. శ. ౧౧౮౬
సంవత్సరములో శాహబుద్దీన్ వానిని మోసగించి బంధిం
రాజ్యము చీల్చివేసెను. ఈ సమయమునుండి లాహోరు
లో గోరీ వంశీయులు రాజ్యము చేయుచుండిరి. అటులే
క్రీ. శ ౧౦౨౩ సంవత్సరమునుండి పృధ్వీరాజుయొక్క
పున సమయమువరకు ముసల్మానుల యధికారముననే
లాహోరుండెను. తర్వాతగూడ లాహోరులో ముసల్మా
నుల రాజ్యమే యుండెను. దీనినిబట్టి లాహోరురాజ్య
విషయమున రాసోలో అసంభవము, అనైతిహాసికము
లగు సంగతులు వ్రాయబడి యున్నవని తెలియుచున్నది.

౩ రాసోలో నప్పటి చితూరురాణాయగు సమర
సింహుని విషయమున్నది. శాహబుద్దీన్ గొప్ప సేనతో
ఢిల్లీ పైకి నెత్తివచ్చినప్పుడు పృధ్వీరాజు తననవోఢా
రాణియంతఃపురమున రాత్రింబవళ్లు గడపుచుండెను. తుద
కాతనికి రాజ్య విశేషము లాతని చెవులబడుటలేదు. అప్పు
డాతడు శాహబుద్దీన్‌తో పోరాడుటకు బయలుదేర సిద్ధ
పడెను. ఈ యుద్ధము నుండి జీవములతో దిరిగిరానని
యాతడు దెలిసికొని యుండెను. ఈ కారణముచే రాజ్య
వ్యవస్థ యొనర్చుట మాని యాత్ర చేయుచుండెను. రెండవ
రాణివలన గలిగిన కుంభుడు, పృధ్వీరాజు చెలియలగు పృథా
దేవి కొమారుడగు రత్నసింహుడు నుండిరి. సమరసింహు
డు తన కుమారుడగు రత్నసింహుని సింహాసనమునుంచి
యొక మంత్రిని నియోగించెను. ఇది విని చంద్రకవి భా
ర్య 'సమర సింహుడు దన పెద్దకుమారునకేల రాజ్యమొ
సంగలేద'ని యడిగెను. కవి జబాబుగా, 'పెద్దకుమారుడు
తండ్రితో కలహించి దక్షిణ దేశమునకు వెడలి పోయెను.
అచ్చట బీదరు రాజగు ముసల్మానుసఖ్యతగాంచి కాల
ము గడపుచుండెను, అని చెప్పియున్నాడు పాఠకులారా
కొంచెము శ్రద్ధతో నీ విషయమును దిలకింపుడు. ఇది
క్రీ. శ. ౧౧౯౭ సంవత్సరమునైన యున్నది. ఇంతవ
రకు రాజకొమారుడగు కుంభుడు బీదరు రాజు స్నేహ
ము పొందెడని వ్రాసియున్నాడు. చరిత్ర నెరింగిన
పాఠకులు దక్షిణమున మొట్టమొదట అల్లాయుద్దీన్‌ఖిల్జీ
క్రీ. శ. ౧౨౯౪ సంవత్సరమున రాజ్యము స్థాపించెనని
యెరింగినియే యుందురు. అటు తర్వాత అల్లాయుద్దీన్

సింహాసనమెక్కి తన సేనాపతియగు మలిక్ కాఫూర్‌ను
దక్షిణ దేశమును జయింపబంపెను. అతడు సేతువు,
రామేశ్వరము వరకు జయించి మహమ్మదీయ రాజ్యమున
గలిపెను. ౧౩౪౭ సంవత్సరములో తొగలక్ వంశ
చక్రవర్తి నుండి చీలి కొందరు సామంతులగు సుల్తానులు
దక్షిణమున స్వతంత్ర రాజ్యములు స్థాపించిరి. మఱియు
గుల్బర్గాకు తమరాజధానిని మార్చిరి. ఈ వంశముయొక్క
మహమ్మదుశాహబమహామని ౧౪౨౨ సంవత్సరములో
ప్రాచీన విదర్భనగరముయొక్క భగ్నావశేష పట్టణ స
మీపమున (ప్రక్కను) దనరాజధానిని గట్టించి దానిపే
రు మహమ్మదాబాదు బీదరు అనిపెట్టెను. ప్రస్తుతకాల
మున మహమ్మదాబాదను నామము ప్రసిద్ధముగాక కేవ
లము బీదరని మాత్రము వాడుచున్నారు. బీదరు హైద్రా
బాదు రాజ్యములో హైద్రాబాదు నగరమునకు ౭౦ మై
ళ్లలో నున్నది. సమరసింహ, చంద్రకవి కాలమునకు తర్వా
త ౨౩౦ సంవత్సరములకు బీదరు నగరము గట్టబడి యు
న్నది. ఈకారణముచే సమర సింహుని కుమారుడు బీద
రుయొక్క ముసల్మాను రాజువద్దకు రాజాలడుగదా.
దీనివలన చంద్రకవి బీదరుయొక్క ముసల్మానురాజుల
వృత్తాంతము వ్రాసినప్పుడు దక్షిణమున ముసల్మానుల
రాజధాని బీదరు ప్రసిద్ధమై యుండెను. అనగా రా
సోగ్రంథ ప్రణేత క్రీ.శ ౧౪౫౦ సం॥ తర్వాత నొకసమ
యమున బుట్టియుండునని తోచుచున్నది. అందుచేతనే
రాసోగ్రంథము ౧౫. ౧౬వ శతాబ్దములలో రచింప
బడియుండునని చెప్పవచ్చును.

౪. రాసోగ్రంథములో ముసల్మానులు పృధ్వీరా
జును యుద్ధములో బందీని చేసియుండిరని వ్రాయబడి
యున్నది. అచ్చట వారొక స్వల్పాపరాధియగు తస్క
రునివలె పృధ్వీరాజు యొక్క కన్నులుతీసి కారాగారమున
బాధించి యుండిరి. యుద్ధ సమయమున చంద్రకవి కాం
గడాలో నుండెను. అచ్చటినుండి దన రాసోగ్రంథమును
పూర్తి చేసి తిరిగి గజనీపోయి వినయ విధేయతలతో ముస
ల్మానుల మన్ననగాంచి బాధితుడైన పృధ్వీరాజు సమ
క్షమున నుండుటకు ననుమతిని పొందెను. అచ్చటనుండి
యొకనాడు పృధ్వీరాజునకుగల శబ్దభేది ప్రజ్ఞావిశేష
మును గోరీతో చెప్పెను. గోరీ యుద్దానిని చూడద

లంచెను. అందుకొఱ కొక స్థలమునందు ధనుర్బాణములు ధరించి నిలువబడెను. గోరీ లక్ష్యప్రదేశమును చెప్పినప్పుడు పృథ్వీరాజాతని శబ్దమును గుర్తించి బాణమును వదలెను. గోరీ మరణించెను. సందడి గలుగుచుండగనే పృథ్వీరాజు చందకవు లిరువురును కత్తులను దూసి యాత్మహత్య చేసికొనిరి. అనిచూడ వ్రాయబడి యున్నది. ఈవ్రాతను బట్టి పెద్ద యుద్ధమైన యొకటి రెండు సంవత్సరములలోనే గోరీ, పృథ్వీరాజు, చందకవి యీ మువ్వురు నొక్కనాడే చచ్చిరని తెలియుచున్నది. ఈ సంబంధమున ముసల్మానులు మఱొక విధముగా చెప్పుచున్నారు. పృథ్వీరాజు సమ్ముఖసమరములో వీరగతి నొందగా సరస్వతీ నదీతీరమున నాతని శరీరము దొరక వెదకి తరువాత దహనాదుల జరిపిరి. ఈ యుద్ధమునకు తర్వాత ౧౨, ౧౩ వర్షములవఱకు గోరీ దేశ విదేశములలో దండయాత్ర సల్పి విశేష దేశము జయించి పెద్ద సోదరుడు గతించిన తర్వాత సింహాసన మెక్కి క్రీ. శ ౧౨౦౬ సంవత్సరములో సింధునది యొడ్డున గక్కరుల చేతులలో చనిపోయెను.

ఈ రెండింటిలో యేదైన నిజముగా నిండు. గాని ముసల్మానుల వర్ణనములో పృథ్వీరాజు సన్మానము అతిశయించి యున్నది. హిందూ కవుల వర్ణనములో తగ్గియున్నది. దీనిలో సందేహమేమియు లేదు.

X పృథ్వీరాజ శత్రుడగు శహాబుద్దీన మహమ్మదు గోరీ గోరను నగరమున నివసించుచుండెను. ఆనగరమిప్పుడుపాడునున్నది. శహాబుద్దీనమాత విధవరాలై యుండగా నిద్దరు పుత్రులు పుట్టిరి. ఆ సమయమున రాజవంశమునందున పతనముల స్థితిలో జిక్కియుండ నామాత పితృవిహీనులగు పుత్రుల దీసికొని కాపాడుకొన బయలుదేరెను. అట్లామె పట్టణము విడచి దాగి యుండెను. ఆ పిల్లలు పెద్దవారైనప్పుడు రాజ్యము ప్రాప్తించెను. పెద్దవాడు రాజును చిన్నవాడు ప్రధాన సేనానాయకుడును నైరి. పృథ్వీరాజు సమయమున నీ యిరువురు గోరునకు ప్రభువులుగ నుండిరి. చిన్నవాడగు శాహాబుద్దీన పృథ్వీరాజుతో యుద్ధమొనర్చెను. బాల్యమున గోరులో గోప్యముగ నుండిరి. అందుచే గోరీ అనుచున్నారు. ఈ యాడంబర విశేషముతో నితిహాసమున కేమియు సంబంధము లేదు. కాని,

రాజపుత్ర ప్రవదానుసారము చౌహానులయొక్క శాఖకు గాడియా చౌహానులను పేరున్నది ఈ శాఖవారగు చౌహానులు సింధునదియొక్క పశ్చిమతటమునకు వెళ్లి నివసించి యుండిరి. వారు మహమ్మదీయులుగా మారిన యనంతరమున వారి విశేషములేమియు తెలియుటలేదు. ఈ గాడియా చౌహానుల గాడియా శబ్దము గోడీలేక గోరి అయియుండ వచ్చును. కాని ఇందులకై తిహాసికాధారమేమియు లభించుటలేదు. కాబట్టియే యిది విశ్వసనీయముకాకున్నది. ఇస్లాం మత సంచలనమునకు పూర్వము కాబూల్ కంధారు క్షత్రియులకు భారతదేశ క్షత్రియులకు వివాహ సంబంధములుండి యుండెను. మహాభారతములో చంద్రవంశపు రాజగు ధృతరాష్ట్రుడు గాంధార దేశరాజకుమారియగు గాంధారిని వివాహమాడెను. కాబూలు కంధారులలో నేటికి హిందువుల పట్టణముల నేకములున్నవి.

రాసో గ్రంథమునందు వ్రాయబడిన వంశవృక్షముతో శిలాశాసనములు హమ్మీరకావ్యము మొదలగువానినుండియుపలబ్ధమైన వంశవృక్షమును పరిశీలించి చూచిన నెంత భేదమున్నదియు దెలియగలదు. శిలాలేఖయందలి వంశవృక్షముయొక్క నామములవెంట విక్రమ సంవత్సరము వ్రాయబడియున్నది. ఈ వంశవృక్షము విజోలియాయొక్క పర్వతగాత్రములో ౧౨౨౬ సంవత్సరము యొక్క సోమేశ్వరుని విస్తృతశిలాశాసనములో సోమేశ్వరుని వఱకు వ్రాయబడియున్నది. తర్వాత ౧౫౦౦ సంవత్సరము వఱకు హమ్మీరు కావ్యమును బట్టి వ్రాయబడినది.

వంశ వృక్షము.

రాసోగ్రంము ననుసరించి

చాహుమాన వంశీయ వీసల దేవుడు

|

సారంగదేవుడు

|

అనారాజు

(౪౧ సం॥ రాజ్యమేలెను)

|

జయసింహుఁడు

(౧౨౮ సం॥ రాజ్యమేలెను)

|

ఆనందదేవుడు.

(౧౦౦ సం॥ రాజ్యమేలెను)

|

సోమేశ్వరుఁడు.

|

పృథ్వీరాజు.

|

శేఱుసింహుడు.

(శేవసీ)

శిలాశాసనములు, హమ్మీరు కావ్యమనుసరించి

(౧) విగ్రహరాజ బీసలదేవుఁడు. (తృతీయ)

|

(౨) పృథ్వీరాజు (ప్రథమ)

|

(౩) అజయదేవుఁడు

|

సుధవ (౪) అర్ణోరాజు—దేవలదేవి

మారవారుకన్య కుమార పాలుని సోదరి

[౫] జగదేవుఁడు [౬] విగ్రహరాజబీస ప్రదాపలంకేశ్వరుఁడు [౭] సోమేశ్వరుడు
లదేవ (చతుర్ధ) ౧౨౧౬, ౨౮–౨౯–౩౪

[౮] అమరగాంగేయుడు

[౯] పృథ్వీరాజు [ద్వితీయ]

౧౨౪౪–౨౫–౨౬. [౧౦] పృథ్వీరాజు [౧౧] హరిరాజ
తృతీయ
౧౨౩౯

|

గోవిందరాజు

రణధంభముయొక్క

ప్రథమరాజు

——హమ్మీరు కావ్యములో (౫) జగదేవుని రాజ్య ప్రాప్తిని గురించి యేమియు వ్రాయబడి యుండలేదు. అర్ణోరాజు తర్వాత విగ్రహరాజ బీసలదేవ (చతుర్ధ) నామమున్నది. హమ్మీరు కావ్యకవి యిందులకు కారణము వ్రాయుచున్నాడుగదా. జగదేవుడు తనతండ్రిని జంపివేసి సింహాసనమెక్కెనే కాని యభిషిక్తుడు కాలేదు. ఏలనన నింతలో నాతని తమ్ముఁడు విగ్రహరాజబీసల దేవుఁడు జగదేవుని జంపి రాజ్యమును దీసికొనెను. వానిని జంపి అమర గాంగేయుఁడు నాల్గైదు దినములే రాజ్యము చేయగల్గెను. జగదేవుని పుత్రుడగు పృథ్వీరాజే ఘాతను తనతండ్రి రాజ్యమును పొందెను. పృథ్వీరాజ విజయ కావ్యమునందును విజైలియా యొక్క ౧౨౨౬ సంవత్సర శాసనము నందును అమర గాంగేయుని నామములేదు.

సంపూర్ణము.

# కృతయుగము — కలియుగము

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి

సీ. ముక్కారుఁబండు భూములు పచ్చగడ్డియు • మొలవని చవుటి పట్టులుగ మాఱెఁ
ప్రాణికోటులకు జీవనము లిచ్చుచునుండు • వారిదశ్రేణులు వట్టిపోయెఁ
బండ్లకొలంది యెప్పట్లఁ బండులనీను • చెట్ల మొత్తంబుల చేవ దఱగెఁ
బిదికినఁ గడవల పెచ్చుగాఁ బాలిచ్చు • నెల్లయావులపొదుగు లెంకిపోయె

గీ. నోషధుల శక్తియడుగంటె నూచముట్టు
తీసె విజ్ఞాన వాహిని తేమ మిగుల
నానవాలును గాన్పింప కాఱి పోయె
బొత్తిగా దేహబల రేఖ భూప్రజలకు.

సీ. పుడమిపై దేవతాపూజ్యభావము గన్న • బ్రాహ్మణ తతి పశుప్రాయ మయ్యె
లోకకల్యాణావలోకంబుఁ గల్పించు • గ్రహములు దమ యనుగ్రహము వదలె
స్వాద్యమైనట్టి సుధార్ణవాంతర తరం • గము లుప్పుతెట్టెలు గట్టియుండెఁ
ప్రకృతిదేవీకంఠ పరిణామ సూత్రంబు • విపరీతరీతులఁ బెరిగిపోయెఁ

గీ. ఇంద్ర సూర్యాగ్నులును దమసహజతేజ
ములను వెలిగింపకయుఁ గప్పిపుచ్చుకొనిరి
కనులు గలిగియు నెదుటిది కనఁగ లేక
మెదుకు దెబ్బలు తినుచుండి రెల్లమంది.

* * * * * *

గీ. అతిథియై ప్రతివాని గృహంబుఁ జొచ్చి
పడయకుంట నాతిథ్యంబు కడుపుమండి
ధర్మదేవత యాతుశనేత్రములఁ గనుచు
శాపమిచ్చెనో! లోకం బశాంతి బొగుల.



విఖ్యాత దానకర్ణులగు శ్రీ రాజా ప్రతాపగిర్ బహద్దరుగారు



హంపిలోని శిథిలమైన ఒకరాచ నగరు



హంపి దేవాలయపు ఎదుటనున్న మండపము



# భగ్నహృదయము

జొన్నలగడ్డ వేంకట రాధాకృష్ణయ్య

ఉదయ మెనిమిదిగంట అవుతుంది. బరంపురములో నవహీవారి వీధిలో వున్న ఒక గృహమున, సూరమ్మ సావిట్లో కూచుని కూతురైన అనంతలక్ష్మి తలదువ్వుతున్నది. సూరమ్మ వితంతువు. ఆమెభర్త చనిపోయి నాలుగేళ్లవుతుంది. అప్పణ్ణుంచీ, ఆమె పుట్టింటనే నివసిస్తున్నది. ఆమెకు అనంతమను కూతురే గాక సుబ్బారావు అను కుమారుడు కూడా కలడు. ఆమె సోదరులక్కడ ఉద్యోగాలు చేస్తున్నారు. ఇంతలో ప్రక్కయింటి కనకమ్మవచ్చి ,,ఏమమ్మా! సూరమ్మ వదినా! అమ్మాయి తల ప్రొద్దునే దువ్వి అలంకరిస్తున్నావు పెళ్లివారు వస్తారాయేమిటి?'' అన్నది.

సూరమ్మ—,,అవునమ్మా! మాయింట్లోనే అరేళ్లు కాపరమున్నారు కొచ్చర్లకోటవారు, ఎరుగుదువా? రమణయ్యగారు చనిపోయినాడు. వారిస్థితికూడ మా స్థితివలెనే వుంది. వారి అబ్బాయి కృష్ణమూర్తి. మెట్రిక్యులేషను చదువుతున్నాడు. స్ఫురద్రూపి. ఏమో చిన్నతనంలో చూశాను. ఎంతో బాగుండేవాడు. ఆ అబ్బాయి కింకా పెండ్లి కాలేదు. సంపన్న కుటుంబం. ఏమంత బెడద లేదు. తల్లీ కొడుకే. అందుచేతనే మాఅమ్మా, అన్నయ్యా వెళ్లారు రాజమండ్రి''.

కనకమ్మ—,,అనంతంపెళ్లయ్యాక మాతో మాటాడక మాటాడదు కాబోలు''

అనంతలక్ష్మి అద్వితీయ సౌందర్యవతి. వయసు పదకొండు వత్సరాలు. ఆమె మందహాసము చేస్తూ ,,కనకంపిన్నికెప్పుడూ వేళాకోళమే''అన్నది.

* * * *

సూరమ్మ తల్లి వెంకమ్మగారు, ఆమెఅన్న రామారావు రాజమండ్రీలో కొచ్చర్లకోట రమణయ్య గారింటికి వెళ్లారు. కొంచెంసేపు పరామర్శా, క్షేమ సమాచారాలు పరస్పరము ప్రశ్నించుకొన్న పిదప వెంకమ్మగారు తానువచ్చిన కార్యంసంగతి చెప్పింది, సుబ్బమ్మతోటి. సుబ్బమ్మ చనిపోయిన రమణయ్యగారి భార్య. సుబ్బమ్మ తన తమ్ముడైన కామేశ్వరరావును పిలిచి చెప్పింది. కామేశ్వరరావు బి. ఏ. చదువుచున్నాడు.

,,ఏం కట్నమిస్తారు?'' అన్నాడు కామేశ్వరావు.

,,ఏం కావాలి?'' అన్నది వెంకమ్మ.

,,మీ ఉద్దేశం చెప్పండి ముందు.''

,,నాయనా! ఈనాడంటే కట్నాలు గిట్నాలువచ్చినై. పోనీ. రమణయ్య బ్రతికివుంటే, యీమాటవినగానే మేఘాలమీదవచ్చి పెళ్లిచేసును. పోనీ దానికేమి? వెండిచెంబూ. కంచం, గిన్నీ, పట్టుతాపితాలూ, రొఖం అయిదు వందలు. అయిదు రోజులూ పట్టువోణీలు. ఏభార్యకు లాంఛనాలు.''

„సరేగాని కర్చులు మాటేనా?”

„అదెక్కడి న్యాయమండి?” అన్నాడు రామరావు.

„ఒకకర్చు, అంటే కాలుకర్చు రాకడ మీరు భరించండి. పోకడ మేం పెట్టుకుంటాం. తరువాత, మీరిచ్చే కట్నంనగలు చేయిస్తాం”

„సరే!” అంది కామాక్షమ్మగారు. శుభముహూర్తం జ్యేష్ఠ శు॥ 3 నాడు నిశ్చయించినారు. కృష్ణమూర్తి ఇకంతావిని తనకు వివాహ మవుతుందని సంతోషించాడు. అనంతలక్ష్మి కృష్ణుల వివాహము మహావైభవంగా జరిగింది. చూచిన వారందరూ అనుకూల దాంపత్యం అన్నారు.

ప్రతి వివాహములోలాగే పెండ్లికొడుకువారికీ పెండ్లికూతురువారికీ అభిప్రాయ భేదాలు కలిగినవి. పెండ్లికొడుకు తరఫువారు తమ విడిదిలోనే అన్నం వండించి భోంచేశారు, చిన్నవంక పెండ్లికూతురు వారిమీద పెట్టి. ఆపెళ్ళివారువచ్చి „మా లోపాలు క్షమించి మీరు భోజనానికి రావలి” అన్నారు. వీరికోపం పోయింది. సంతోషంతో వెళ్ళి, వాళ్ళు పెట్టిన పచ్చగడ్డి పచ్చడిలేదనిపించేరు. ఒకనాడు అందరూ మహంతు మేడ చూసేందుకూ, కారు పైన రసూల్ కొండ చూసేందుకు వెళ్ళారు. వివాహానంతరం మగపెళ్ళివారు రాజమండ్రీ తిరిగి వచ్చారు.

౨

రెండేళ్ళు గడిచేయి. కృష్ణమూర్తి రెండేసి నెలల కొకమారు బరంపురం వెళ్ళినాడు. అనుపమాన సౌందర్యవతి అయిన అర్ధాంగి లభించుటచే కృష్ణమూర్తికి వర్ణనాతీతమయిన ఆనందము కలిగింది. ఎల్లప్పుడు అనంతలక్ష్మి సుందర వదనమే, అతని మనోనేత్రాల యెదుట తాండవమాడుతు వుండేది.

ఇట్లుండగా, అనంతలక్ష్మి రజస్వలయిందని ఉత్తరము వచ్చినది. కృష్ణమూర్తి ఆనందముకు మితిలేదు. సుబ్బమ్మగారు కూడా చాలా సంతోషించింది. వైశాఖ మాసములో పునస్సంధానము చెయ్యటానికి నిశ్చయించారు. ...వైశాఖమాసంవచ్చింది. శుక్లపక్షదశమినాడు నూరమ్మ చెల్లెలి కూతురు వివాహము నిశ్చయించారు. నూరమ్మ చెల్లెలు బందరులో కాపురము చేస్తున్నది. అసలు పునస్సంధానముహూర్తం దశమి నాడే స్థిరపరిచారు. కాని చెల్లెలి కూతురు వివాహముకు వెళ్ళితీరాలి. బందరునుంచి కృష్ణమూర్తికి గూడా శుభలేఖ వచ్చినది. ముందుగా సుబ్బారావు కృష్ణమూర్తిని, సుబ్బమ్మగారిని, సప్తమి నాటికి బందరు ప్రయాణముకు సిద్ధముగా ఉండవలెనని ఉత్తరము రాశాడు. కాని కృష్ణమూర్తి బందరు వెళ్ళుటకు వీలు లేక పోయింది. ఆతని పరీక్షలు సమీపించినవి. సప్తమి నాటికి కృష్ణమూర్తి, అనంతలక్ష్మికి సబ్బు, తలనూనె, సెంటు, మిగిలిన వారికి రొట్టె తీసుకు వెళ్ళాడు, స్టేషనుకు. ఆరు గంటలకు మెయిలు వచ్చింది. వారిని కలిసికొని పరీక్షా సమయము కనుక తనకు రావీలు లేదని చెప్పాడు. అనంతలక్ష్మి కృష్ణమూర్తిని క్రీగంట వీక్షిస్తున్నది. అతడూ ఆమె తేజోమయ నేత్రములను గాంచి ఆనందించాడు.

మెయిలు బయలుదేరింది. అప్పుడామె కృష్ణమూర్తివంక దీనంగా చూసింది. „నేను రావటం లేదని నా అనంతానికి కష్టంగా వుంది కాబోలు” అనుకొని కృష్ణమూర్తి ఒక నిట్టూర్పు పుచ్చి „వెధవ పరీక్షలు ఇపుడెందుకొచ్చాయో!” అని విసుగుకొని విచార హృదయుడై, ఇంటికి వెళ్ళినాడు. కాని అతని దృష్టి మాత్రం బందరు వైపే మొగ్గివుంది.

* * * * *

నూరమ్మ చెల్లెలి యింటిపేరు చోడవరము వారు. ఆమె భర్త సుందర రామయ్యగారు. సుందర రామయ్యగారి గృహము సమస్త బంధుజన పరివార సమాకీర్ణమయి వున్నది. ఆయన నూరమ్మతో „వదినగారూ! అందరూ వచ్చారని చాలా సంతోషంగా వుంది కాని కృష్ణమూర్తి వచ్చాడుగాదు.” అన్నాడు. „నాయనా! ఏంచెయ్య మన్నావు. పరీక్షలు సమీపించినవట. లేకపోతే తప్పకుండా వచ్చువాడే” అని ఆమె బదులు చెప్పింది. వారి యింట్లో అక్కివరము నారాయణరావు అనునతడు కాపురమున్నాడు. అతనికి పదేండ్ల కూతురున్నది. ఆమెకు హఠాత్తుగా స్ఫోటకము సోకినది. ఆబాలిక జీవించునని నిరాశ చేసుకున్నారు. కాని భగవదనుగ్రహం వల్ల ఆమె బ్రతికింది. ఆమె సహజ సౌందర్యము లోపించినది. ముఖ బింబం వికృత మయిపోయినది. బందరు వెళ్ళగానే

అనంతలక్ష్మికి జ్వరము తగిలినది. ఆస్థితిలో మశూచి వ్యాధి గ్రస్త అయిన బాలికను చూసి, హడలి పోయింది అనంతలక్ష్మి. జ్వర మెక్కువయినది. అందరూ తలోవిధంగానూ వైద్యం చెయ్యమన్నారు. ఒక వృద్ధురాలు వచ్చి „మాశైరి, బంగారంగానూ.] ఊరుచివరగూడెంలో వున్న వెంకడి దగ్గరకు పంపండి, సోదికి. అగమ్మత్తేదో తేలుతుంది" అన్నది. „సరే!" అని బండిపైన బయలుదేరారు, సలహా ఇచ్చిన వృద్ధురాలూ, సూరమ్మా, వంటలక్క లక్ష్మీనరసమ్మా, వెంకమ్మగారూ సుబ్బారావును. కాని వెంకడు కనపడలేదు. మర్నాడు వెడితే „నేనిప్పుడు భోంచేశాను. చెప్పను. రేపురండి." అన్నాడు.

వారు మర్నాడు వెళ్లారు, అయిమడబ్బులూ, కానిప్రాబాణీ తీసుకుని. సంగతి కొంచెం ఉపోద్ఘాతంగా చెప్పారు. వెంకడు ప్రారంభించాడు:

„అ! నన్ను మరిసిపోయారు మీరు. నేనంటే జ్ఞాపకంలేదు. నేను ఎంతకష్ట పడుతున్నానో చూడటంలేదు. అయ్యో! మీరు సుఖంగా వున్నారు."

వెంకమ్మ—„ఎవరు నువ్వు"

వెంకడు—„ఏం. నన్ను మరిచి పోయావా? నన్ను పెంచావు. పెళ్లి చేశావు. మరుపా?"

వంటలక్క—„సూరమ్మ సవితేమోనమ్మా"

వెంకమ్మ—„నువ్వు స్త్రీవేనా? పురుషుడవా?"

వెంకడు—„నేను స్త్రీనే. నాకు ఒక్కచీర పెట్టలేదు"

వెంకమ్మ—„అయితే ఇప్పుడెందుకు కనపడ్డావు"

వెంకడు—„ఏమిటి? అయ్యో! చెప్పాలా?"

వంటలక్క—„సరే. నడవండి. చీరపెడితే చాలమ్మా. అవును పాపం"

వెంకడు—„ఊఁ! చీర పెట్టాలి. లేకపోతే నేను వెళ్లను. పీక్కుతింటాను"

సూరమ్మ—„వెళ్లమ్మా! నీకు చీరపెట్టిస్తాను. ఏం కావాలంటే ఆపిండివంట చేసిపెడతాను. బొమ్మలా ఎదిగి వున్నపిల్ల నేమి చేయకు"

అందరూ లేచారు. కాని సుబ్బారావుకి ఇదంతా చూడగానే నవ్వొచ్చింది. అందరూ బండెక్కారు. అతను వెంకని సమీపించి „నువ్వుచెప్పింది నిజమట్రా! చెప్తావా! ఛార్జియివ్వనా, యిలా అందర్నీ మోసగిస్తున్నావని?" అన్నాడు.

వెంకడు—„బాబూ! వాళ్లెరగని సివాఁయేంటండి. కడుపు కక్కుర్తిగ్గాని."

ఇంటికి వెళ్లగానే నౌకరును బజారుకుపంపి అయిదు రూపాయల చీర తెప్పించి పొరుగింటి బీదరాలున కిచ్చింది. పెండ్లికొడుకు బంధువులలో నౌకరువచ్చి „వెంకమ్మ నాయనమ్మ గారూ. పిల్లకి కొంచెం విభూతి పెట్టించలేకపోయారా? గాలిచేష్టేమో, తెలుస్తుంది" అనగా నౌకరునుపంపి రామసుబ్బయ్యను పిలిపించారు. „ఘుందు మారణహోమం చేస్తా నన్నాడు, రామసుబ్బయ్య. అది వద్దన్నారు వీరు. „అయినా సంగతి కని పెడతాను. అని అనంతలక్ష్మి వున్న గదిలోనికి వెళ్లాడు. అప్పుడే అన్న మెంగిలిపడిన అనంతలక్ష్మి, అందరూ పెళ్లి తొందరలోనూ, ఊరేగింపులోనూ, ఆటపాటలలోను నిమగ్నులయి వుండగా ఒక్క కునుకు తీసినది. దానితో ఆమెకు సంధించినది. ప్రేలాపన మొదలు పెట్టింది. ఇది ఎవరూ కనిపెట్టలేదు. రామసుబ్బయ్య మాత్రం అది తప్పకుండా గాలి (దయ్యము) వల్లనే అన్నాడు. ఆమెపక్కని కూచున్నాడు. రామసుబ్బయ్య స్ఫోటకము తగిలిన మనిషి. అందులో భూతవైద్యుడేమో, నుదుట పెద్ద కుంకుమ తిలకము ధరించుటచే మరింత వికృతముగా కనబడుతున్నాడు.

రామసు—„నువ్వెవరవు?"

అనంతం—„అయ్యో! అమ్మో! దొంగలు. అదుగో దయ్యాలు. నన్ను పీక్కు తింటున్నాయి. రక్కుతున్నాయి. పీకుతున్నాయి. తరుముతున్నాయి. అమ్మా! దగ్గరకు రావొద్దు! వద్దు నువ్వు వద్దు. కోపంవస్తే చీపురుతో కొడుతావు. నాన్ననీ—బాబయ్యనీ—పిలు. బావరాలేదూ."

ఈ విధంగా మతిలేక పలుకుతున్న అనంతలక్ష్మి దుస్థితి చూసి, అందరూ జాలిపొందారు. కాని సూరమ్మ దుఃఖమునకు మితిలేదు: సుఖముగా పెళ్లికివస్తే ఇదే

మి కర్మంఅనుకొని లోలోపల నేడుస్తున్నది. పైకిబిగ్గరగ విలపిస్తే ,,పెండ్లిగృహాన రోదనం ఏమిటం”టారు? అని భయం.

రామసుబ్బయ్య · ఆదర్శి అక్కణ్ణుంచి వెళ్లిపొమ్మని, అనంతము వంకచూచి ,,నువ్వెవరవో చెబుతావా? నిన్నుమారణ హోమంచెయ్యనా?” అన్నాడు.

అనంతం—,,నువ్వెవడవు. పో. నీ మొహం చూస్తే భయం వేస్తోంది. వెధవా. అంట్ల వెధవా? నన్ను బెదిరిస్తావా? మొహమ్మీద తంతాను.”

,,నాదగ్గరనా నీ వేషాలు దొంగా!” అని ఫడేలుమని అనంతలక్ష్మి చెంపపై కొట్టి ,,ఇప్పుడు చెప్పు” అన్నాడు. అనంతలక్ష్మి ‚అయ్యబాబోయి’ అని కవ్వున కేక వేసి ఏడవ నారంభించింది. ‚చెప్పు’ అని అరడజను లెంపకాయలు కొట్టి ,,అయ్యా! వెళ్లి పోయింది. అబ్బాయికి రూపాయ యిచ్చి విభూతికి పంపించండి.” అని చెప్పివెళ్లిపోయినాడు రామసుబ్బయ్య. అనంతలక్ష్మి ఏడుపు చూసి అందరూ దిగులు పొందినారు. పాపము! మూసిన కన్ను తెరవటము లేదు అనంతం. డాక్టరులు వచ్చారు, ఇంజెక్షనులు చేశారు, గరళము మిగించారు. కొంత సేపటికి ఏడుపుమాని నిద్రపోయింది ఆమె. జ్వరము తగ్గుదల మార్గము పట్టినది. రాత్రి కలత నిద్రపట్టింది. తెల్లవారేప్పటికి ఆమె శరీరాన స్ఫోటక చిహ్నాలు కనిపించేయి. సాధారణంగా స్ఫోటకవ్యాధిగ్రస్తులయిన యిళ్లలో అపరిశుభ్రంగా వుండాలని, పిండివంటలు వండుకో కూడదని, చాకలికి బట్టలు వెయ్యకూడదని, అనాచార కృత్యాలు జరగకూడదను ఒక నమ్మకం. అనాదినుంచీ, సుందరరామయ్య గృహమున యీ ఆచార మణుమాత్రము పాటింపబడలేదు. ఈ ఆచారాన్ని సరిగా పాటిస్తే వ్యాధి గ్రస్తులు బ్రతుకుతారా బ్రతకరా అంటే ఆయన ,,నా కింములో నమ్మకం లేదంటాడు.

వెంకమ్మగారు బాలా త్రిపుర సుందరీ పూజచేసి, ఆ విగ్రహాలను కడిగిన నీరు సోలెడు అనంతముచే తాగించేది. ఎవరికీ తెలీకుండా పెళ్లికూతురు వచ్చి రెండు టూకిలు పెట్టింది అనంత లక్ష్మికి. వాట్లన్నిటివల్లా వ్యాధం ఎక్కువైనది. మళ్లా సంధించింది. సుబ్బారావు కృష్ణమూర్తికి యీ వార్త తెలుపుతూ తక్షణం రమ్మని తంతి ఇచ్చాడు. కృష్ణమూర్తి హృదయం విషాదముతో నిండిపోయింది. సుబ్బమ్మకు భరింపరాని ఆవేదన కలిగింది. కాని కృష్ణమూర్తి పరీక్షలు మర్నాడు ఉదయముతో గాని ముగియవు. అందుచేత సుబ్బమ్మ తన తమ్ముడు కామేశ్వరరావుతో బయలు దేరింది.

సుబ్బమ్మ వెళ్లినది. అనంతలక్ష్మిని చూసి నిర్ఘాంతపోయింది. సూరమ్మ ,,అమ్మా! అనంతం! రాజమండ్రీ నుంచి అత్త వచ్చింది, చూడు,” అన్నది. అనంతము అత్తగారివైపు చూసినది. ,‘అత్తా! అమ్మా! డబ్బులే!” అంది. సుబ్బమ్మ రెండురూపాయల డబ్బులు తెప్పించి ఆమె పక్కలో పోసింది. సుబ్బమ్మ నిలువున నీరయిపోయినది. ,,అయ్యో! అనంతం! ఎల్లా మారిపోయావు నారలీ!” అంది. కన్నులనుండి కన్నీరు ప్రవహింప సాగింది. అనంత లక్ష్మికి స్మృతిలేదు. ,,అమ్మా! బావ వచ్చాడా” అంది. వెంటనే సుబ్బారావు కృష్ణమూర్తికి తంతినిచ్చాడు. అందులో అనంతము స్థితి మాత్రం తెలుపలేదు. తగ్గిపోతుందంటున్నారు, అందరూను. కాని ఒకవితంతువు ఇలా అంది—,,అయ్యో! అయ్యో! ఇదంతా వాళ్ల స్వయంకృతాపరాధ ఫలితమమ్మా సుబ్బమ్మగారూ! మొదణ్ణుంచి అపథ్యమే. ఒక నియమమా, నిష్టా? సోదికి వెళ్లారు. భూత వైద్యుడు రామసుబ్బయ్య—వాడి మొహం ఈడ్చా వాడేకారణం. పాపం పిల్ల జ్వరతీవ్రంచే తెలివితప్పి అసందర్భంగా మాట్లాడుతూంటే ఫెడఫెడ చెంపమీద కొట్టేడు. హడిసి పోయింది కుర్రది. అపైన వెంకమ్మగారు బాలాత్రిపురసుందరీ దేవతా ఉపాసన జలం తాగించేవారు. ఇంకా బూర్లూ, అవీఇవీ పెట్టేవారు. నారాయణ నారాయణా! ఇదింతా వీళ్లేచేశారు. ఆ భగవంతుడు—శ్రీమన్నారాయణమూర్తి దయతలంచి బతకాలి గాని,”

సుబ్బమ్మ స్తంభించి పోయినది. అవిరళముగా అశ్రుధారలు ప్రవహిస్తున్నై ఆమె కన్నులనుంచి.

* * * * *

నాడు బుధవారము. తిథి అమావాస్య. నిశీథ సమయం. పన్నెండు గంటలవుతుంది. ప్రకృతి నిశ్శబ్దంగా ఉన్నది. భయంకరంగా కూడా కనబడుతున్నది. కన్ను

ట పాకుచుకొన్నా కనబడని కటిక చీకటి ఎల్లెడలా వ్యాప్తమయి వుంది. అనంతలక్ష్మి చైతన్యరహితయై పడి వున్నది చాలామంది మేల్కొని చుట్టూ కూర్చుని ఉన్నా రు. సుబ్బారావిచ్చిన తంతి చదువుకొని, తన ప్రేయసి వ్యాధి సంపూర్ణంగా తగ్గివుంటుందని, అందుచేతనే తక్షణం రమ్మని తంతి నిచ్చారని తలచి ఆనందమయ హృదయ ముతో ఒయలుదేరిన కృష్ణమూర్తి జట్కాబండిదిగి లోనికి వెళ్లి అనంతమున్న గదివైపు వెళుతున్నాడు.

„ఇంకేముందర్రో! నాఅనంత నన్ను విడిచివెళ్లి పోయింది దేముడో!" అని సూరమ్మ ఏడుపు వినబడింది. అందరూ ఏడువ నారంభించారు. కృష్ణమూర్తి ఆహృదయ విదారక రోదన ధ్వని నాలకించి, భగ్న హృదయుడై మొదలు నరికిన చెట్టులాగున క్రిందకూలబడి పోయాడు. పాపము! ఆతడు మళ్ళీ లేవలేదు.

---

# గంగావతరణము

### పెనుమర్తి వేంకటరత్నము (యువకవిమండలి)

ఆ భగీరథు భ్రుకుటివీధి భసితము
లోన, జంద్రమగ కాంతి వల్లులు చిగిర్చె!
ఆకసము నుండి భూమికి లోకనాథ
నిస్తులాతీతమూర్తి పుంజీభవించె.
ఏకపదమున నిలబడి ఆకపర్ది
పాదమంజీర ఘంటికా ఫణితులందు
భాసమాన నైశ్చల్య నిష్ఠా సమాధి
మారు మ్రోగించుకొనియె నోంకారఘంట!

రజతశైల దరీకుహరంపు టెల్ల
లందు శైవత్రిలోచనస్యంది భుగభు
గాగ్ని కేడుగడంబలె నన్ని కడల
నావరించెను బ్రళయ వేళావిషాగ్ని.
గంగ జెలువవ్వ తరంగలు పొంగిపోవ
నల్ల జూచెను! లోక లోకాధిపుండు
వారి యన్యోన్య దృఙ్మరీచీరసంబు
లోన లోకమ్ము ప్రణయ విలీనమయ్యె.
శాంకర జటావనీ వికస్వర పవిత్ర
దివ్య కల్లోలములు సుధాంతికములయ్యె
ప్రమథ లోకతాండవ సుధా భాగధేయ
దివ్య గీతము లల్లన తెరలివచ్చె!

ఆ విశ్వేశ జటావనీపథముం
దారబ్ధసాయంనట
చ్ఛైవస్ఫీతరవానుసారముగఁ బ్రాం
చద్దివ్య కల్లోలినీ
గ్రీవాభంగ విముగ్ధ గీతికలు పొం
గెన్ శుష్కవారాన్నిధిన్
బ్రావృణ్మేఘము లాశ్రయించినవి! తృ
ష్ణా కార్శ్యరూపమ్ములన్.

నిశ్చల ధ్యానముకుళిత నేత్రములను
అల్ల దెరచె భగీరథుడంతలోన
శివ జటాజూట నిస్స్రుత దివిజ గంగ
పూరితములయ్యె నాలుగు వారి నిధులు!

ఆ వేలాంబరచుంబితోర్మికల దీ
వ్యద్దివ్య వీధీపథం
బావేష్టించి రథః ప్రపాతిత మహాం
హఃకల్మషులై, సాగర
శ్రీ విస్తారితులైన రాణ్మణులు రం
జిల్లెన్ మహాయోగి, గీ
తావాద్యంబులు ఖేచరాప్సరసనృ
త్య క్రీడలందచ్చెనో!

కపిలమౌని క్రుధావిలోకనములోని
ఎఱువుతో వారి పాపము విఱిగిపోయె
శశ్వదాభోగ దివ్య వేశ్మములయందు
సాగరుల దివ్యదీప్తులు సంక్రమించె!
ఆ భగీరథు హృదయ జన్య ప్రశాంత
మధురహర్ష సామ్రాజ్య సంపత్తులోన
కనుగొనెనతండు నిర్మల ప్రణయ రేఖ
లలవరుచుకొన్న పితరుల యాశిషమ్ము!

# భవభూతి 'సీత'

అక్కిరాజు నిత్యానన్దశాస్త్రి

శ్లో॥ అస్మిన్నేవలతాగృహేత్వమ
భవస్తన్మార్గదత్తేక్షణ
స్సాహంసైఃకృతకౌతుకా చిరమ
భూద్గోదావరీ రోధసీ
ఆయాన్త్యాపరిదుర్మనాయితమివ
త్వాంవీక్ష్య బద్ధస్తయా
కాతర్యాదరవిన్దకుట్మలనిభోము
గ్ధః ప్రణామాంజలిః॥

ప॥ కన్నులర్పించి ఆమార్గమునకు
ఈపొదరింటనే ఉన్నావు నీవు
హంసలుతొవ్వించు హర్షమ్ము వలన
గోదమీదటమున చిరమున్నదామె
దుర్మనాయితవలెనున్ననిన్జూచి,
భయమున రీతిరచుచున్నట్టి ఆమె,
పద్మకోశమునకు సదృశమ్మైన
ముగ్ధ ప్రణామాంజలిని ఘటియించె॥

ఇది సరళిష్టభావసముదాయాన్ని అద్భుతంగా ప్రదర్శించే సర్గం. రాజ్యబహిష్కృతుడై దండకారణ్యానికి పోయి, పర్ణశాలలో నివాసం చేస్తూవున్నా, తనను ఆరాధించే భార్యతో సుఖంగా కాలక్షేపం చేసే సూర్యవంశపు మహావీరుడు, కథా సందర్భాన్ని స్మరించిన మనకు ఈ సర్గంలో కనపడతాడు. కవి యేర్పరచిన రంగస్థలం గోదావరీ నదీతీరం. పొదరింటిలో రాముడు కూర్చుండి సీతా ప్రత్యాగమన దర్శనం కోసం, నదీమార్గం మీద కండ్లుపెట్టి, ఆత్రంతో చూస్తుంటాడు. నదిగట్టున హంసలతో క్రీడిస్తూ భర్త తనరాకను ఆసహనంతో ప్రతీక్షిస్తున్నాడని సీతమరచిపోతుంది. చివరకు తిరుగు దోవబట్టి రాముణ్ణి సమీపిస్తూ ప్రశాంత మనోహరంగా వుండే ఆయన ముఖంలో కలవరాన్ని చూసి కారణం గ్రహిస్తుంది. తన మూలంగా పతిచిత్తశాంతికి భంగం కలిగినందుకు కంపిస్తుంది. ఆయన వాగ్రూపంగా కోపాన్ని వెల్లడించడు. వాక్కులతో ఆమె క్షమాపణను అర్థించదు. భర్తృగతమైన విశ్వాసనురాగాల ప్రేరణవల్ల ప్రార్థన పూర్వకంగా, ముకుళిత కరతలాలతో నమస్కరిస్తుంది.

ఈ సర్గంలో వున్నది విస్పష్టంగా భారతీయమైన విషయం. తత్సదృశ్యం అన్య వాఙ్మయంలో అరుదు. వివాహానంతరమైన స్త్రీప్రేమప్రశంసలో పాశ్చాత్య కవులకు రుచిలేదు. ఆ ప్రసంగాన్నే భారత కవులు విసుగులేకుండా ఆదరిస్తారు. ప్రస్తుత విచారణాంశమైన శ్లోకం ఈవిధమైందే. దీని ప్రధానభావం దంపతుల గాఢమైన పరస్పరానురాగంలో యిమిడియున్నది. సత్పృష్ఠతనంవల్లనే వర్ణ్యస్థితి సత్వం స్ఫురింపజేయడంలో కవినైపుణ్యం కనబడుతున్నది. ప్రియాప్రత్యాగమనాన్ని ఆత్రంతో ప్రతీక్షిస్తున్న రాముణ్ణి, మందయానంలో భర్తను సమీపిస్తున్న సీతను, పతిదృష్టి కభిముఖమైన ఆమె దృష్టి ప్రసారాన్ని భర్తృచిత్తశాంతి భంగమైనందున కలిగిన ఆమె సంతాపాన్ని, అపరాధ క్షమాపణను అర్థించడాన్ని భారతీయ గృహిణీచిహ్నమైన అంతులేని పతిభక్తిని, కవి అయత్నసిద్ధదృష్టాంతాలను చేశాడు.

ఇంతేకాకుండా ఈ ప్రధానభావాలతో మనోహరమైన అనేకోపభావాలను కవి అతికిపెట్టాడు. ఆశ్రంలో ప్రత్యాగమనాన్ని ప్రతీక్షిస్తుండడం రాముడికి సీతమీదఉన్న అగాధమైన ప్రేమను సూచిస్తున్నది. సీతకు అత్యంత ప్రియమైన ప్రకృతిని తెలియచేస్తున్నది. సమానమైన ప్రతిపత్తిగలవారికే ఒకరిమీద ఒకరికి నైసర్గికమైన ప్రేమ ఉడడం చేతను, సీతచుట్టూ, హంసలు గుమిగూడి క్రీడించడంచేతను, ముఖ్యంగా శృంగారమైన సీత గతివిశేషం స్ఫురిస్తున్నది. ముకుళితాలైన ఆమె కరతలాలను తామరమొగ్గతో పోల్చడంవల్ల ప్రతిలేని సీత సౌందర్యం సౌకుమార్యం గోచరమవుతున్నవి. ఈ విషయాలను కవి వర్ణితం చెయ్యక పోయినా, గర్భితం చేసివుంచాడు.

ఏ చిత్రకారుడికైనా తన కళాప్రావీణ్యప్రదర్శనానికి ఇంతకంటె సంతోషదాయకమైన విషయం లభించదు. చిత్రపుపృష్ఠభాగములో తరులతానిర్మితమైన సాంద్రారణ్యం పచ్చగా కనబడుతున్నది. సమీపంలో గోదావరినది మనోహరంగా ప్రవహిస్తున్నది. స్నిగ్ధచ్ఛాయగల లతాగృహంలో లోకనాథుడు ఆసీనుడై వున్నాడు. ప్రభూత సుందరియైన సీత ఘటితాంజలితో సమీపంలో వర్తిస్తున్నది. దంపతుల ముఖాలు కవితకలితమైన అనురాగంతో ఉద్దీపిస్తున్నవి. ముఖాల్లో మరికొన్ని చిత్తవృత్తి విశేషాలుగూడా కనబడుతున్నవి. ప్రదేశ సౌందర్యానికి మెరుగుపెట్టే ఈ ప్రదర్శనం అద్భుతమైన భావ సౌందర్యాన్ని ప్రసాదిస్తున్నది.

# భావసమర్పణము

(కవియుగము)

దేవదేవా! ప్రవిమల త్వదీయ దివ్య
పాదరాజీవ మధురసా స్వాదనంబుఁ
చేయఁదుమ్మెదగాఁ బుట్టఁ జేయవైతి—
ముద్దు మోమును జూపింపుము, రమణీయ
మధుర మురళీ విరావ వారిధినిఁ దేలి
భవ్యభపదీయ పద సమీపమును గనెద.
ఏమి కానుకగా నీకు నేనిత్తు? దేవ!
మలిన మామక భావసుమంబుఁ దక్క—
ముద్దుమోమును జూపింపుము, కమనీయ
సవ్యభవదీయ పదసుమనఃప్రదేశ
సన్నిధినిఁజేర్తు భావ పుష్పంబు; అయ్యో!
దేవ దేవ! దూరంబుగాఁ బోవ నేల?
మలినమగు దీనిఁ బదములఁ దొలగఁద్రోసి
వేయమా!

అప్పుడైనను వేడ్కమీరఁ
బ్రీతితోడుత నీకు నర్పించుకొనను
మలినమైవాడి పోయిన దళము నొంటు.
—ఈ మనోహరపావన ప్రేమపూర
పవనసంఘాతములకు నోర్వంగలేక
వాడిపోవుచునుండె పుష్పంబు;

దీని

రక్షణము సేయ నీదు భారంబుసుమ్ము.

# నిజాం రాష్ట్రము

## పరిపాలనా విధాన చరిత్ర

### గంగరాజు రఘునాధరావు

ఏ ప్రభుత్వ రాజ్యాంగ నిర్మాణమైనను రెండు భాగములుగ విభజింపబడి యుండును. మొదటిది కేంద్ర ప్రభుత్వము. రెండవది రాష్ట్రీయ ప్రభుత్వము. ప్రతిదేశమున కొక విధమగు కేంద్ర ప్రభుత్వము కలదు. కొన్ని ప్రదేశములయందు రాజు కలడు. అతనికి సలహా నొసంగుటకు కొన్ని సభలు గలవు.

ఈ రాజ్యాంగ దృష్టితో జూచిన నిజాం రాష్ట్రమునందు పూర్వము కేంద్ర ప్రభుత్వమునకు రాజే అధ్యక్షుడు. అతనికి సహాయము చేయుటకు మంత్రియుండెను. వీరిరువురు గలసియే అధికారము చెలాయించుచుండిరి. రాజాజ్ఞ తుది ఆజ్ఞ. దానిపైన అప్పీలు లేదు. అది తప్పక ఆచరించబడవలెను. ఏవిషయమునందైనను మంత్రిపిదప ఆజ్ఞ యిచ్చువాడు రాజు. ఇంతవఱకును జూచినచో ఆసిఫిజా వంశమునందు రాజులు నిరకుంశ ప్రభువులయినను, ప్రజారంజకముగనే దేశమును పాలించి యున్నారు. పూర్వమునుండి నేటివఱకును ఈ వంశీయులు తమ దేశమును "ఫర్మాను"ల ద్వారా శాసించుచున్నారు. రాజంగీకరించు ప్రతివిషయము మనకు "ఫర్మాను" ద్వారా దెలియవచ్చుచున్నది. మంత్రికి సర్వాధికారముండెను. అతడు తనకు మించినవని తోచిన విషయములగూర్చి ప్రభువాజ్ఞ బడయుచుండెను. ఏవిషయమయినను, ప్రభువు మంత్రికి వ్రాయుచుండువాడు. మంత్రి ఆయాసంబంధీకులకు వ్రాసి అమలు జరిపించువాడు. రాజు అధికారమున్నంత ఆసిఫుజా వంశీయులు పరిపాలించు నాటగోలె నేటివఱకు యేమార్పులు చేయబడలేదు. వారు సంధిపత్రములననుసరించి బ్రిటిష్ ప్రభుత్వమునకు లోబడి సర్వాధికారమును భవింపవచ్చును. వారి అంతరంగిక పాలనమునందు బ్రిటిష్ ప్రభుత్వము జోక్యము కలిగించుకొనను. అవసరమునచో తగు సలహా నొసంగుచుండును.

ఇంతవఱకు దేలిన విషయమేమన కేంద్ర ప్రభుత్వమునందు రాజును, మంత్రియు నిద్దరేయుండిరి. సర్ సాలార్ జంగుగారి తుది సంస్కరణముల వఱకిదే జరిగెను. వారి కాలమున జరిగిన సంస్కరణములు, పిమ్మట ఇటీవల చేయబడిన మార్పులు ముందు తెలుపబడును. ఇక రాష్ట్ర అంగముగూర్చి దెలిసికొనుటకయి ప్రయత్నింతము.

పూర్వము నిజాం రాష్ట్రముయొక్క పరిపాలనము రెండు శాఖల (మహాకమాలు)చే జరుగుచుండెను. ఒకటి "దఫ్తరుమాలు," రెండవది "దఫ్తరు దివాని." వీని పాలించువారు దఫ్తరుదారు లనబడుచుండిరి. వీరు రాష్ట్రముయొక్క రికార్డులును, లెక్కలును, జాగీరుల

దానములు, మొదలగునవి నుంచువారు. వీరిపైన మంత్రి పర్యాజ్ఞల నిచ్చుచుండెను. ఈ యాజ్ఞా పత్రములంపుట కేర్పాటైన శాఖ „దఫ్తర్ ఇన్షా” అనియుండెను. దీనికి తోడు తపాల క చేరికూడ నుండెను. అంపు సర్కారు కాగితములు, అజ్ఞా పత్రములు, జిల్లాల కంపుచుండిరి. అయినను ఇప్పటివలె చక్కని యేర్పాట్లు లేకుండెను. జిల్లాలలోను, తాలూకాలలోను, ప్రభుత్వకార్యాలయము లేవు. తాలుక్దారులు తమ యిష్టానుసారము ముసద్దీల (గుమాస్తాలు) నియమించి వ్రాతపని జరుపుకొను చుండెడివారు.

రాజధానిలో „దారుల్ ఖజా,” „సదారతుల్ ఆలియా,” „కొత్వాలి” అనుమూడు న్యాయస్థానము లుండెను. పై రెంటిలో న్యాయ విచక్షణ జరుగుచుండెను. మూడవది రక్షక శాఖకు సంబంధించినది. ఇందు రాజధానికి సంబంధించిన అభియోగములు తీర్పు గావింపబడుచుండెను. ఈ న్యాయస్థానములు జిల్లాలలో లేవు. మహారాజా చందూలాల్ బహదురు పేష్కారుగనున్న కాలమున „అదాలత్ దివాని” „అదాలత్ ఫౌజదారి” అనరెండు న్యాయస్థానములు రాజధాని యందేర్పాటు చేయబడినవి. అయినను వీనియందు కూడ నగరముయొక్క వ్యాజ్యములు విచారింప బడుచుండెను. దీనికి తోడు లాలారాంబక్షు మంత్రి కాలమున మాల్వేల న్యాయసభ (దారుల్ కజా) నియమింప బడినది.

పిమ్మట సిరాజుల్ ముల్కు పరిపాలనమున 'అదాలత్ దివాకాఖానా' అను న్యాయస్థానములు జిల్లాలలో స్థాపింపబడినవి. ఈ మంత్రి పుంగవుడు కొన్నిచిన్న న్యాయస్థానములు 'మున్సిఫ్' 'మీర్ అదల్' అన్యత్షత క్రింద యేర్పాటు చేసెను. కాని మంత్రులు మారుచుండుటచే నవికొన్ని సంవత్సరముల పిదప తొలగింప బడినవి. మరల సిరాజుల్ ముల్కు మంత్రికాగ ఆయనచేసిన మార్పుల ప్రకృత్యములయి యుండెను.

జిల్లాలలో రక్షక శాఖలేదు. ప్రభుత్వముచే మాలుజారి (భూమిశిస్తు) వసూలుచేయుటకు నియమింపబడిన తాలుక్దారులు జిల్లాల పాలించుచుండిరి. ఎల్లపుడు బందిపోట్లు, దొంగతనములు, లూటీలు జరుగుచుండెను. సైనికులు తమ యిష్టానుసారము తిరుగుచుండిరి. బాటసారులను దోచుకొను చుండిరి. క్రమశిక్షణ లేకుండెను. వీరి జీవితములు చాలవఱకు పాడైపడియుండెను.

రాష్ట్రములో ప్రభుత్వ పాఠశాలలు లేవు. ధనవంతులును, జాగీర్దారులును, విద్యాశూన్యులయి యుండిరి. వ్యాపారము మందముగ నుండెను. మంచిబాటలు, నదులపై వంతెనలు లేకుండెను. ఇవియన్నియు గాక ప్రతిశాఖ యందు నుద్యోగులు లంచములు తీసుకొను చుండిరి.

పరిస్థితు లీరీతి యుండగ నవాబు ముఖ్తారుల్ ముల్కు సర్ సాలారుజంగు బహదురు ౧౮౫౩ లో మంత్రిగ నియమింపబడిరి. వీరు రాజ్యాంగమునందు నూతన మార్పులు ప్రవేశపెట్టుటకయి యత్నించయెన్నియో కష్టముల నెదుర్కొనెను. ఎందరో సర్దారులు, అధికారులు శత్రులయిరి. వీరిని తుదముట్టించుటకు కుట్రలు పన్నసాగిరి. అయినను ధైర్యము వీడక సంస్కరణముల ప్రవేశపెట్టి రాష్ట్రాభివృద్ధికి మార్గదర్శకులయిరి. వీరి సంస్కరణములను రెండు భాగములుగా విభజింప వచ్చును. ప్రథమ సంస్కరణములు క్రీ. శ. ౧౮౫౩ నుండి ౧౮౬౭ వఱకును, ద్వితీయ సంస్కరణములు ౧౮౬౭ నుండి ౧౮౮౩ వఱకును, రాష్ట్రమునందు గావింపబడినవి. వానివలన రాష్ట్రపరిపాలనమునందే మార్పులు గలిగెనో తెలిసికొనుటకు ప్రయత్నింతము.

## ప్రథమ సంస్కరణములు

నవాబు ముఖ్తారుల్ ముల్కు సర్ సాలారుజంగు మంత్రి కాగానే ప్రాతచట్టములు దేశాభివృద్ధికి తోడ్పడవని తలంచెను. భూమి శిస్తు వసూలు చేయుటకు తాలుక్దారులు నియమింప బడుచుండిరనియు ఇదివరకే వ్రాయబడినది కదా. వీరు రాజనగరులో నివసించి తమ నియ్యుక్త ధర్మము నెరవేర్చుటకు కొందఱు సహాయోద్యోగుల నియమించుచుండిరి. ఈ యుద్యోగుల తొలగింపుటకును ప్రభుత్వమునకే మాత్రము సంబంధము లేకుండెను. కనుక రాష్ట్రముయొక్క పరిపాలన మంతయు మంత్రి చేతిలో నుండెనని తలంచుటకు వీలులేదు. తాలుక్దారులు రూపాయికి రెండణాల పన్ను వసూలు చేయుచుండిరి. ఈపన్ను ప్రజల యుపయోగార్థము వెచ్చింప బడకుండెను. కొందఱు తాలుక్దారులు భూమ్యాదాయ లెక్క-

లు సరిగ నుంచకయు, కొందఱు కుంటికారణములు సూచించియు ధనము దక్కించుకొను చుండెడివారు. అందుచే మంత్రికి యెన్నియో చిక్కులు సంభవించు చుండెను.

సర్ సాలారుజంగు పై తాలుక్దారుల తొలగించి వారి స్థానే స్వల్ప మాస వేతనములపై నూతన తాలుక్దారులను, వీరి సహాయార్థము ఇతరోద్యోగులను ప్రతి జిల్లా యందు నియమించెను. ఈ మంత్రి పుంగవుడు ఈ నూతన సంస్కరణములను తన స్వంత జాగీరునందు ప్రవేశపెట్టి అనుభవము సంపాదించి యుండెను. ఈ నూతన మార్పులు చేయుటలో డైటను అను ఆంగ్లేయాధికారి సహాయ పడియుండెను. ప్రథమమున సంస్కరణములు తెలుగు జిల్లాలలో ప్రవేశ పెట్టబడెను. అటుపిమ్మట రాష్ట్రి మంతటను యీ విధాన మేర్పడెను. దీనివలన భూమి శిస్తులు వసూలు చేయుటకును, లెక్కలు సరిగా వ్రాసియుంచుటకును సులభ మయ్యెను. రైతుల కష్టములు కూడ తొలగి పోయెను.

దివాని తాలూకాలలో „మీర్ అదల్" „మున్సిఫులు" దివాని, ఫౌజ్దారీ, (Civil and Criminal) అభియోగములు విచారించి తీర్పు చేయునట్లు ఏర్పాటు గావించెను. ఇంతియకాక ఈ మున్సిఫులు అపరాధ పరిశోధనమును, దుష్టశిక్షణమును, చేయవలసి యుండిరి. ౧౮౬౯ వ సంవత్సరమున ఈ అధికారులు ౫౦ గురుండిరి. ఇందులకు ప్రతి సంవత్సరము ౧౫ వేల రూపాయలు వ్యయమగుచుండెను.

రాజధానియందు ఇదివరలో చెప్పబడిన న్యాయ స్థానములు గాక మూడు నూతన న్యాయస్థానము లేర్పరచెను. ౧౮౬౩ మున „అదాలత్ పాదుషాహీ" యను, సిక్కులు. ఇతర సైనికుల విచారించుటకు ౧౮౬౯ మున మరియొక కోర్టును స్థాపించెను. ౧౮౭౦ మున పేష్కారీ ఇలాకాకు సంబంధించిన వివాదములు పరిష్కరించుటకు గోవిందరావు అనువారి అధ్యక్షతక్రింద నొక కోర్టు యేర్పాటు చేయబడినది.

జిల్లాలలో డాకాలును, దొంగతనములును, నివారించుటకు ప్రతి తాలుక్దారువద్ద రెండువందల రక్షకభటులుం చబడిరి. రోహిలాల దుండగములు నివారించుటకు „జమియ్యత్ జిలేదారి" అను సైన్యము ప్రతిజిలేదారు క్రింద నుంచబడెను. ఈసైన్యము రాష్ట్రియొక్క ఏభాగమున బందిపోటులును దుండగములును జరుగుచుండెనో అచట నుండెడిది. ఇయ్యది నలుగురు సభ్యులుగల యొక సంఘమాధీనము నందుండెను.

నూతన తాలుక్దారులు నియమింప బడుటచే „దారుల్ ఇన్షా" యందు పని అధికమయ్యెను. త్వరగా ఆజ్ఞా పత్రము లంపుటకుగాను. „మున్షిఖానా" అను నూతన శాఖ తాలుక్దారుల వద్దనుండి వచ్చువానికి ప్రత్యుత్తరములు వ్రాయుటకు స్థాపింపబడెను. ఇందువలన „దారుల్ ఇన్షా" యందు బ్రిటిషు ప్రభుత్వముతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుటయు, నూతన చట్టములు ప్రవేశ పెట్టుటయు, జరుగుచుండెను.

ఇంతకు పూర్వము జిల్లాలో కాని, రాజధానియందేగాని ప్రభుత్వ ధనాగారము లేకుండెను. అందుచే రాజధానియందు ౧౮౬౮ మున ప్రభుత్వ కోశాగారము (ఖజానా) స్థాపింపబడినది. జిల్లాలలో నమ్మకము గల సాహుకారుల వద్ద నుంచుట కేర్పాట్లు చేయబడెను.

౧౮౭౦ సంవత్సరమున రాయచూరు దోఅబు (Doab) నిజాం ప్రభుత్వమున కొసంగబడెను. అచట ఇంతవఱకు జరుగుచున్న పరిపాలనా విధానమే నుంచబడెను. రాష్ట్రిములో గల యీ రెండు రాజ్యాంగ విధానములచే గందరగోళము కలుగకుండుటకును, ఈ జిల్లా నిమిత్తము భూమ్యాదాయ వివాదములకు „కచహరీ అదాలత్ ముస్తరిదా" యను, జిల్లా అధికారుల తీర్పు విచక్షణకు „సదరు అదాలత్ అజిలాయె ముస్తరిదా" యును, మంత్రిగారి యాధీనమున స్థాపింపబడినవి.

౧౮౭౧ సంవత్సరమున రాజధానియందు న్యాయ స్థానములందు దాఖలుచేయు దరఖాస్తులు మొదలగు వానికి „రసుం అదాలత్" (Court Fees) విధము చేయు శాఖ నేర్పాటు చేయబడెను. దీని వలన ప్రతి దస్తావేజు స్టాంపు కాగిదముపై వ్రాయునట్లును, న్యాయ స్థానములయందు దాఖలుచేయు కాగిదములపై స్టాంపు అంటించుటకును ఆజ్ఞ అయ్యెను.

౧౮౬౭ మున న్యాయస్థానము వారిచే డిక్రీ పొందుటకొజ్ఞ పొందిన కేసుల అమలు జరుపుటకు ఒక ప్రత్యేక శాఖ మంత్రిగారి ఆధీనమున రాజధానియందు నియమింపబడెను.

౧౮౬౮ మున మంత్రిగారి క్రింద కార్యదర్శి శాఖ యేర్పాటు చేయబడెను. ఇంతవరకు రాయచూరు జిల్లాల కొరకు గల ప్రత్యేక శాఖ ఇందు గలిపి రాష్ట్రముయొక్క అన్ని ప్రాంతముల న్యాయస్థానముల తీర్పులు విచారించుటకు „సదర్ అదాలత్ అజులారియె ముస్తరిదా వ తక్షిహి తాలూకాత్" అనుపేర నూతన న్యాయస్థానము స్థాపింపబడెను.

## ద్వితీయ సంస్కరణములు

ఇంతవఱకు ప్రవేశ పెట్టిన సంస్కరణముల వలన రాష్ట్ర పరిపాలనమునందు కొంత యభివృద్ధి గన్పట్టెను. ఈ నూతన మార్పులు ప్రజల కనుకూలముగ నుండెను. అందుచే ఇంకను కొన్ని శాఖలు నిర్మించుటయు, పూర్వమున్న వానిలో కొన్ని మార్పులు కలిగించుటయు, అవసరమయ్యెను. కనుక ౧౮౭౪ నుండి ౧౮౮౦ వఱకు రాజ్యాంగమునందు పెక్కు మార్పులు చేయబడినవి.

లోగ „మున్షిఖానా" „కచహారీ అజులారియె ముస్తరిదా" అను రెండు ప్రభుత్వ కార్యస్థానములు స్థాపింపబడినవి. ఈ రెండును కలిపి „మాలుగుజారీ" (భూమ్యాదాయ శాఖ) అనుపేర నూతనశాఖ యేర్పాటు చేయబడెను. ఇంతవఱకు రాష్ట్రము జిల్లాలుగ విభజింపబడలేదు. తాలూకాలుగ భాగింపబడియుండెను. జిల్లాలు చేయుటకు కొన్ని జిల్లాలలో సరఫుఖాసు (రాజ్య పరిపాలకుల స్వంత జాగీరు) పాయెగా (రాజ కుటుంబమునకు సంబంధించిన వారి జాగీరులు) మఱియు ఇతర జాగీరుదారుల ఇలాకా గ్రామములుండెను. కొన్నిటిలో లేవు. అయినను వీనిని ఆయా జిల్లాలలోనే చేర్చి రాష్ట్రమునంతయు పదునాలుగు జిల్లాలుగ భాగించిరి. మరల వీని ఆదాయమును బట్టి మూడు తరగతులుగ భాగించిరి.

రాష్ట్రమంతయు గలిపి ౭౪ తాలూకాలయ్యెను, పూర్వమున్న „మున్సిఫులు," మీర్ అదల్"లు తొలగింపబడిరి. ప్రతి తాలూకాకొక తహసీలుదారుడు నియమింపబడెను. ఈ అధికారికి, ఫౌజ్దారి (Criminal) దివాని (Civil) మాలు (భూమ్యాదాయము) అధికారము లొసంగబడెను. ఈతడు తన తాలూకా భూమి కిస్తు వసూలు చేయుటయు, తత్సంబంధమగు వివాదములు పరిష్కరించుటయు, న్యాయ రక్షణము చేయుటయు విధులయియుండెను. ప్రతి జిల్లాకొక తాలూకాదారును, ఇద్దరు సహాయ తాలూకాదారులును, నియమింపబడిరి. వీరు తమ జిల్లాయందున్న తాలూకాల తనకీ చేసి, తహసీలునుండి వచ్చిన అప్పీళ్లు విచారించి తీర్పుచెప్పుచు, న్యాయ రక్షణము చేయుచుండిరి. జిల్లా తాలూకాదారు తమ జిల్లాయందున్న అన్ని శాఖల ప్రధాన అధికారిగ తలంబడుచుండెను.

### జిల్లాల వివరము.

| | జిల్లాపేరు | తాలూకాల సంఖ్య | ఆదాయము. |
|---|---|---|---|
| 1. | ఔరంగాబాదు | 7 | 11,05645 |
| 2. | పర్భని | 5 | 8,40368 |
| 3. | నాందేడు | 5 | 8,40465 |
| 4. | ఇందూరు | 5 | 10,62489 |
| 5. | బీడు | 5 | 9,50131 |
| 6. | మెదకు | 4 | 9,89342 |
| 7. | బీదరు | 5 | 7.78589—1.89561 |
| 8. | ఎలగందల | 5 | 7,30637 |
| 9. | నలకుర్గ | 10 | 11,63168—6,54250 |
| 10. | షోరాపూరు | 5 | 12,07073 |
| 11. | తూర్పు రాయచూరు | 4 | 10,24689 |
| 12. | పశ్చిమ రాయచూరు | 4 | 9,67042 |
| 13. | ఖమ్మం | 5 | 9,30461 |
| 14. | నల్లగొండ | 5 | 9,55926 |
| | మొత్తము | 74 | 1,35,46024 |
| | సర్ఫఖాసు | | 7,93811 |
| | బాకీ | | 1,27,52213 |

జిల్లాలలో ప్రభుత్వ కోశాగారములు లేకుండెను గదా. జిల్లాలు, తాలూకాలు ఏర్పాటుకాగ, ఖజానాలు నిర్మించుటావశ్యకమయ్యెను. ప్రతి తాలూకా ఖజానా

రము, జిల్లా కూటమునందు జిల్లా ఖజానా [మండల కోశాగారము] ఏర్పాటు చేయబడెను.

ఇంతవఱ కేర్పాటు చేయబడిన జిల్లాలలో గ్రామాదులు చాల యున్నందున మరికొన్ని జిల్లాలు చేయవలసి వచ్చెను. ఒకటి తూర్పు భాగమునందు నాగరకర్నూలు, రెండవది దక్షిణమున గుల్బర్గా, మూడవది ఉత్తరమున తాండూరు, ఇంతియ కాక రెండు డివిజనులు ఇబ్రాహింపట్నం, అమరాబాదు, ఏర్పాటు చేయబడెను. పూర్వము ఇబ్రాహింపట్నం ఎస్వంతరావుఅనుజాగీరుదారునకుండెను. అతని మరణాంతరము ఖాల్సా [ప్రభుత్వాధీనము] చేయబడినది. కాని కొన్ని సంవత్సరముల పిదప యీ రెండు డివిజనులు నాగరకర్నూలు జిల్లాలో చేర్చబడెను. పిదప పర్గీ అను తాలుకాకూడ ఇందు కలిసిపోయినది.

౧౮౭౮ మున మాల్గుజారీ [భూమ్యాదాయశాఖ] స్థాపింపబడినదని పైన వ్రాసియున్నాము. ఈ శాఖాధీనమున దివాని ఇలాకా భూమి శిస్తు నిగ్రాసియుండెను. ఈ బోర్డు (Board) నందు అధ్యక్షుడును, నలుగురు సభ్యులుండిరి. ఓట్ల ప్రకారములు తీర్పులు జేయబడుచుండెను. వీరికి లోబడియున్న శాఖల వివరము:—

1. వ్యవసాయము 2. వాణిజ్యము 3. సుంకములు 4. అబ్కారీ 5. స్టాంపు 6. రోడ్లు చెఱువులు, ఇతర మరమ్మతులు, పురపాలక సంఘములు.

ఇంతవఱకు జిల్లాలయందు రక్షకశాఖ ప్రత్యేకముగ లేకుండెను. ప్రతి తాలూకా కొక పోలీసు ముంతెజం [ఇన్స్పెక్టర్] ప్రతి జిల్లాకొక మొహతెమిం [Superintendant of Police] నియమింపబడిరి.

వైద్యము, విద్య, చెఱశాలలు, వీనికి ప్రతి జిల్లాయందును ప్రత్యేక శాఖలు, ప్రత్యేక అధికారుల క్రింద నియమింపబడియుండెను.

,,స్టాంపు అదాలత్'' [Court Fees] ఇంతవఱకు మాల్గుజారి [భూమ్యాదాయ శాఖ] కు సంబంధించియుండెను. కార్య భారము హెచ్చుటచే ఈ శాఖ మాల్గుజారీ నుండి విడదీసి ప్రత్యేకముగ నొక మొహతెమిం [Superintendant] క్రింద నియమింపబడెను.

సుంకపు శాఖ కార్యస్థానములు వ్యాపార స్థలములలో స్థాపింపబడెను ఇతర రాష్ట్రములనుండి వచ్చు సామానులపై పన్ను విధించి వసూలు చేయబడుచుండెను. స్వదేశ సామగ్రికి సుంకము లేకుండెను.

౧౮౮౪ సంవత్సరమున అడవులు గాపాడుటకును ఒక మొహతెమిం క్రింద అటవిశాఖ యేర్పాటయ్యెను.

ఈ సంవత్సరముననే జిల్లాలన్నియు క్రింది విధమున విభాగింపబడెను.

1. పశ్చిమోత్తర భాగము:—ఔరంగాబాదు, బీడు, పర్భని.
2. పశ్చిమ భాగము:—బీదరు, నాందేడు, నలదుర్గ
3. తూర్పు భాగము:—నల్లగొండ, ఖమ్మం.
4. దక్షిణ భాగము:—షోలాపూరు, పశ్చిమ రాయచూరు, ఉత్తర రాయచూరు.
5. ఉత్తర భాగము:—మెదక్, ఇందూరు, ఎలగందల

ప్రతి యొక భాగమున కొక ,,సదరుతాలుక్దారు'' నియమింపబడెను. వీరికి కూడ తాలుక్దారులవలె ఆ భాగము యొక్క అన్ని శాఖలపై సర్వాధికారముండెను. ౧౮౯౨ సంవత్సరమున ఈ ప్రతి భాగమునకొక ,,సదరు మొహతెమిం తామీరాత్ వఅప్పాషీ'' [Divisional Engineer] ను, రాజధానియందు చీఫు ఇంజనీరు ఏర్పాటు చేయబడిరి. వీరు గాక విద్యాశాఖ మొహతెమిములు కూడ నియమింపబడిరి.

౧౮౯౩ సంవత్సరమున క్రింది విధముగ ,,సదరుల్ మహాములు'' [మంత్రులు] ఏర్పాటు కాబడిరి:—

1. న్యాయశాఖ:—బషీరద్దౌలా బహాదురు.
2. భూమ్యాదాయశాఖ:—ముకర్రముద్దౌలా బహాదురు
3. రక్షక శాఖ:—షంషీరుజంగు బహాదురు
4. ఇతర శాఖలు:—షహాబుజంగు బహాదురు

౧౮౯౨ సంవత్సరమున ఇనాములును, విచారణ చేసి ఇనాందారుల యొక్కయు, మక్తేదారుల యొక్కయు, పేరు నమోదు చేయుటకు గాను ,,సిరిష్తె ఇనాం'' స్థాపింపబడినది. బందోబస్తు శాఖ ఒక కమిష్నరు క్రిందను, జిల్లాలపై మొహతెమిములును, ఇతరోద్యోగులును ఏర్పాటు చేయబడిరి. వీరు ప్రతి గ్రామము నక్షా

స్తానలు తయారు చేసిరి. ౧౮౪౯ మున సరిహద్దు తీర్పు శాఖ స్థాపింపబడెను. ఇదేసంవత్సరమున మాల్గుజారీ మంత్రి యాజమాన్యమున „గజెటు శాఖ" నియమింపబడినది.

౧౮౬౨ మున జిల్లా న్యాయస్థానముల తీర్పులు విచారించుటకు „మహాకమే సదరు మురాఫా అజిలా" స్థాపింపబడినది.

౧౮౫౨ మున రాజధానియందు వైద్యకళాశాల స్థాపింపబడెను. ౧౮౭౭ మున వైద్య శాఖ యేర్పాటయ్యెను. జిల్లాలపై కూడ డాక్టరులు నియమింపబడిరి.

౧౮౫౨ మున రాజధానియందు కళాశాల స్థాపింపబడెను. ౧౮౭౭ మున వైద్యశాఖ యేర్పాటయ్యెను. జిల్లాల పై అధికారులు నియమింపబడిరి.

౧౮౭౪ మున „సదరు మహాసబీ"(అకౌంటెంటు శాఖ) సదరుమహాస్సబుగారి క్రింద స్థాపింపబడెను. ప్రతి శాఖ మువాజినా (Budget) ఈశాఖకు పంపుటకు యేర్పాటు చేయబడెను.

౧౮౭౧ తపాలశాఖ స్థాపింప బడినది. ౧౮౭౪ „దఫ్తరు ముల్కి" (Political Department) బ్రిటిషు ప్రభుత్వముతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుటకును, రాష్ట్రమునకు సంబంధించిన ఇతర చట్టములు చేయుటకును, స్థాపింపబడినది.

౧౮౭౪ మున సైన్యము తగు కట్టుదిట్టములతో ఏర్పాటు చేయబడినది. సైన్యము రెండుశాఖలుగా విభజింపబడెను. ఒకటి రెగులర్ ఫోర్సు (Regular Force) రెండవది ,నజంజమియ్యత్' (Irregular Force). ఈ శాఖ కొక మంత్రి నియమింపబడెను.

మొత్తముపైన రాష్ట్రపరిపాలనము దిగువ పేర్కొనిన పదునాలుగు శాఖలుగ విభాగింప బడియుండెను.

| | |
|---|---|
| ౧. న్యాయశాఖ | ౮. సైన్యము |
| ౩.. భూమ్యాదాయశాఖ | ౯. ఆర్థికశాఖ |
| ౨ రక్షకశాఖ | ౧౦. తపాలశాఖ |
| .౪ తామీరాత్ ఆప్పాషి (Irrigation) | ౧౧. రైలు, తంతి. |
| ౫. విద్యాశాఖ | ౧౨. సరఫ్ఖాసు, |
| ౬. వైద్యశాఖ | ౧౩. పొలిటికల్ డిపార్టుమెంటు. |
| ౭. పురపాలకసంఘములు | ౧౪. [illegible] |

మొదటి యేడుశాఖలు నలుగురు మంత్రులక్రింద ను, తదితర శాఖలు ప్రధాన మంత్రి క్రింద నుండెను. ప్రధాన మంత్రికి సహాయము చేయుటకు „పేష్కారు" ఉండెను.

ప్రతిగ్రామమునందు గ్రామాధికారులు నియమింపబడిరి. మాలీపటేలును, పట్వారియు, భూమిశిస్తువసూలు చేయుటకును, పోలీసు పటేలు గ్రామ రక్షణార్థము నియోజితులయిరి. వీరికి „మాల్గుజారి" భూమిపన్నునుండి రూపాయికి ఒక అణాన్కేలు ఏర్పాటు చేయబబడెను.

## 1881 మున చేసిన సంస్కరణములు

ఇంతవరకు మంత్రులకు ఆయాశాఖలు చక్కగా భాగింప బడకుండెను. అందుచే ౧౮౮౧ సంవత్సరమున శాఖల విభజించుటలో కొన్ని మార్పులు చేయబడినవి.

౧. న్యాయ శాఖ:—

(i) అదాలత్ (ii) దివానీ (iii) చెఱశాలలు

౨. భూమ్యాదాయశాఖ, ఆర్థిక శాఖ:—

[i] మాల్గుజారీ [ii] ఆబ్కారి [iii] కరోడిగిరి [సుంకము] [iv] బందోబస్తు [v] అడవులు [vi ఇనాములు [vii] ఎతెందారీ విరాసత్ ]viii] రుసుంఅదాలత్ ]ix] ఆప్పాషీ [x] మహాసబీ [xi] ఖజాన [xii] టంకసాల [xiii] తపాల.

౩. రక్షక శాఖ:—

[i] రాజధాని పోలీసు [ii] జిల్లాల పోలీసు.

౪. వివిధ శాఖలు:—

[౧] వైద్యము [౨] విద్య [౩]పురపాలకసంఘములు [౪] తామీరాత్ [౫] ఇంజనీరింగుకాలేజి [౬] భూగర్భశాఖ Geology [౭] గనులు [౮] కర్మాగారములు; నిధులు Work Shops and Stores [౯] గజెట్ [౧౦] భాషాంతరీకరణము [౧౧] ముద్రాక్షరశాల.

ఈ సంవత్సరముననే „జుడిషల్ కమిటీ" స్థాపితమయినది. ఈ రీతి ౧౮౮౧ సంవత్సరము వలను చేయబడిన మార్పులు, తేట పరచబడినది. పిమ్మట చేయబడిన సంస్కరణముల చరిత్ర మరియొకసారి తెలిసికొనుటకు ప్రయత్నింతము.

# అనురాగము

## ఉమరు అలీషా

### రంగము—గుడారము

(అభిమన్యుడు ఉత్తర ప్రవేశించియుందురు)

అభి—ఉత్తరా, అజాతశత్రుఁడగు యుధిష్ఠిరుఁడు నేడు గురువైన ద్రోణాచార్యునిచే నడుపబడుచున్న సంగ్రామమున పన్నినపద్మవ్యూహమును భేదించుటకునన్నునాయత్తముచేసి, 'నాయనా, యభిమన్యు కుమారా, నేడు మాదండగము నిలుపవలయును సుమా' యని వాత్సల్యమునఁ దలద్రువ్వి పలికినాఁడు. నేనిదే నీయొద్ద అనుజ్ఞను దీసికొని యుద్ధభూమికిఁ బోవుచున్నాను. ఇది మిగుల సుదినము. నాతల్లి సుభద్ర గర్భమున నేనున్నప్పుడు మామామ శ్రీకృష్ణుడు పద్మవ్యూహ ప్రవేశాది రణపాండిత్యము నభ్యసింపఁ జేసినాడు. అదినేను ప్రదర్శింప వలసిన యవసరము తటస్థించినది. కాంతా, మనకు నేడెంత భాగ్యమో వింటివా.

ఉ. ద్రోణుఁడు కర్ణముఖ్యకురు
దోర్బలయోధులు యుద్ధభూమిలో
బాణములన్ ధరించిరణ
పాండితిఁజూపెడు వేళవారివి
న్నాణమడంచి నాపితృ ఋ
ణంబునుదీర్చి హితంబుగూర్తు గీ
ర్వాణులు కీర్తిగీతములు
పాడగపార్థివు లెల్లచూడగన్

ఉత్త—నాథా, లోకభీకరులును, శస్త్రాస్త్రకోవిదులును నగు కురుయోధులనంత సులువుగా నెట్లు జయింప సాధ్యమగును.

అభి—ఉత్తరా, సందేహించెద వేల?

మ. తలపూవాడఁగనీక చెక్కిటను స్వే
దంబైన జాల్వారనీ
... ... ... ... ...రిపుసం
ఘాతంబు నిర్జించిరా
జ్యలతాంగిన్ గొనివత్తు దుందుభులు మ్రో
యన్ దివ్యులావైరి కో
టల యూధలంబులనెక్కి కీర్తిసతి నా
ట్యంబాడనే యెంతయున్.

ఉత్త—ప్రాణేశ్వరా, నీవన్నది నిజము. నీశౌర్యము త్రిలోకవిదితము. కాని,

చం. పరఁగుదునంచు నీతులను
బల్కెడుదానను గానుకాని యీ
దురమునకీవు బోవలదు
ద్రోహులు కౌరవులన్ జయింప దు

స్త్రము మురారికైన, రణ
ధాత్రిని గాండివిలేనియట్టి యీ
తరుణమునన్ రణంబు సుభ
దంబనితోఁచదు ప్రాణవల్లభా!

అభి—కాంతా, నీకింత చింతయేల?

ఉ. ఆలమురల్చి నాజనకుఁడర్జును
డప్పుడునీకు శత్రులన్
గూలిచి బొమ్మపొత్తికల
కున్ వసనంబులు దెచ్చియిచ్చెనే
నాలములందు వారిహత
మార్చితదీయ కిరీటపంక్తిర
త్నాలను తెచ్చియిచ్చెదను
నచ్చనగాయలు నాడుకోటకున్.

ఉత్త—అట్టి యదృష్టమునాకుఁ బట్టునా, నాథా!

ఉ. ఆడినమాటెగాని యెదు
రాడగనీయవు, కోట్లుచెప్పినన్
వీడవునీమతంబు, గురు
వీరులుక్రూరులు, వారినోర్చగా
గూడునెనీకు, నీరణము
గూడదు నామనవాలకించు, న
న్నాడదటంచు దిట్టితెగ
నాడకు, రమ్ము, శుభంబునీకగున్.

అభి—(చేయిపట్టుకొని) కాంతా, నీవెంత వెలవు! కాశక్రమునా గల మహావీరాధి వీరులువచ్చి సమరసము త్సాహులైయున్న నీసమయమున వెన్నిచ్చి పాఱిపో మ్మనుచున్నావా! చాలు.

ఉ. క్షత్రియుఁడై జనించిననె
చాలదు! యుద్ధమునందు శూరుఁడై
శాత్రవులన్ జయించనిజ
శౌర్యములోకము మెచ్చఁబోరుచే

తాత్రముగాన నేమజని
కౌరవకోటిని నుక్కడించి మా
గోత్రమునిలుపుదున్ ప్రజలు
గోవులు బ్రాహ్మణులున్ సుఖింపగన్.

ఉత్త—నీవెన్ని చెప్పినను నేనియుద్ధమునకు నిన్ను బొమ్మని చెప్పనోపను. నాకేమో నేడన్నియు దుశ్శకున ము లగుచున్నవి.

అభి—అవియెట్లు సంభవించును! శకునములు దేవ తల చేతులలో నుండును. ముక్కోటి దేవతలు మనకు విజయము చేకూర్తురని సుంభుభులు ప్రాయించు చున్నా రు. ఇకను నీవు దుర్నిమిత్తములేల శంకింపవలెను.

ఉత్త—అదియేమో కాని నీపురణమునకుఁ బోవుటకు నామనం బంగీకరించుట లేదు.

అభి—అది స్త్రీజన స్వభావము.

చం. మగడు రణాంగణంబునకు
మార్తురగెల్వఁగఁ బోయెదంచు నా
త్మగరితతో వచింపప్రమ
దంబుననౌనని చెప్పివంప నే
మగువయు సాహసింపదిది
మార్గము సాధ్వులకెల్ల ప్రాయికం
బుగనిటవచ్చు చున్నదిఁ
బోలునెవీరుడు నాడ మాటలన్.

ఉత్త—నాథా, అటులైన నన్నును నీవెంట యుద్ధ మునకు దోడ్కొని వెళ్లుము.

అభి—అది యసంభవము.

చ. వనములఁదోడి నెచ్చెలులు
పాటలుపాడఁగ నాటలాడుచున్
దినములు బుచ్చినావురణ
తీరు లెఱుంగవు బాణతూణముల్
గొనిరిపు కోటికుత్తుకలఁ
గోయు టెఱుంగవు, పట్టుపట్టినా

వెనుకను వచ్చి చూడఁదగు
వేడుక యేమిని, వచింపుమంగనా?

ఉత్త—నేనునురిపుర్రి కాయనిచ్ఛేదన మాచరించి నీ కంటఁబోడువాఁడఁమనై యుండెదను.

అభి—అదియసంభవము. నీ విట్టులేగని కోరికలు కోరవలదు.

ఉత్త—ఇది తగని కోరిక గాదు.

ఉ. ఎందఱు సుందరాంగులని
కేగరు వైరుల గెల్చి ధాత్రిపో
వ్వందఱు సత్యభామ వరకాసురు
నిక్కమున మున్న గూల్చెనే
నెందుకు ధార్తరాష్ట్రుల జయంప
నొ చూచెద నేడునీవు నీ
స్యందన మెక్క నేను రథ
సారథినై వెనువెంట వచ్చెదన్.

అభి—(కౌగలించుకొని) భర్తృదారికా, నీ ప్రసన్న హృదయమున కనవరతదనుతనై యభినందించుచున్నాను. అదే, రణనిస్సాణము మ్రోయుచున్నది. నాకై యెల్ల వారు సమరోత్సుకులై నిరీక్షించుచుందురు. (అని నిష్క్రమించును)

ఉత్త—నేనును నీ వెన్నంటియే వచ్చుచున్నాను. అక్కటా! అంతవేగమున బోవు నిన్నునే నెట్లుకలిసి కొగలను. నేనిక హతాశనుగదా! హతాశులు ప్రాణములు వాయుదురందురే? నేనేల వీడలేదు.

తే.గీ. మెఱుపువలెనాదు విభుని సుందరముఖాబ్జ
మనియునెను కారు మేఘాల నంతరించె
నాదుహృదయంబు దగ్ధమై వేదనవిష
హరిగ్నాలియుచున్నది నేన్బ్రతుకనింక.

ఉ. ఈయల జవ్వనంబు నెటువీడ్తును
నొంటిగదుఃఖ భాజనం
బై మెసఁగాదు నాబ్రతుకు
నందిక సౌఖ్యము లేదులేదు

ప్రాయమువ్యర్థ మీకలిమి
వ్యర్థము ప్రాణవిభుండులేనినా
గేయమురుద్ర భూమిని ము
గించెద జీవిత నాటకాంకమున్.

సీ. ఎవరు నాహితమును నర్థింతురనేను నె
వ్వరి హితంబెనసి జీవనము నేతు
ఎవరునన్నింక మెప్పింతునేను నె
వ్వరి మెప్పింప కాపురము నేతు
ఎవరు నాయెలప్రాయమీక్షింతు రెవని ప్రా
యముజూచి నేను నెయ్యంబునేతు
ఎవరు నాముచ్చటలీడేర్తు రెవరి ము
చ్చట దీర్పనేను నిచ్చనము నేతు

తే.గీ. ఎవరితోడిదాలోకంబు ఎవరు విభుఁడు
అతఁడె లేకున్న నేనెట్లు బ్రతుకగలను
భూమి నూడదీసిన చెట్టుబోవనేల
వ్రాలి వసివాడి దుఃఖాల గూలిపోదు.

సీ. ఈ ప్రాణముల నిల్ప నేది నావిభు వచ
శ్శృంగార రస సుధా సేచనంబు
ఈ ప్రాయమును బెంప నేది నావిభుపృగం
చలచలన్మధుపూర కలశ చయము
ఈ కాలమునుబుచ్చ నేదినావిభునవ్వు
నెమోమ్మము సొగసు వెన్నెల వెలుంగు
ఈ వైభవముబూడ నేదినా విభు పదం
బుల మ్రోయు గజ్జలందెలరవంబు

తే.గీ. లేదు, నేనింక జీవింపలేను, నాదు
కట్టుకొనిపోయి నానాథు కడను బెట్టు
డతని వీక్షించి ప్రేమాగ్ని యందుకాలి
కరగి పోయెద నానాథు కొఱకు నేడ్చి!

(తెరపడును)

ప్రజా సత్యాగ్రహ నాయకులు



నాగపుర సత్యాగ్రహమునందు ౪ వత్సరముల కఠిన శిక్షకు పాత్రులైన

శ్రీ మంచెర్షా అవారీ గారు

# అగస్త్య మహర్షి

## ఆర్య ధర్మోద్ధరణమునకు వారు చేసిన పని

వి. యన్. శర్మ.

ఈశ్వర సంకల్పము అత్యద్భుతమైనది. సకల చరాచరములను ఈ ధర్మకార్య నిర్వాహణార్థమీ ప్రపంచమున సృష్టించినది. ఎవరీ మహాతత్త్వమును గ్రహింతురో వారే ధన్యులు. అప్పుడే వారు భగవానుని యాజ్ఞ నిర్వహించుటకు ముందంజ వేయుదురు. తమ సర్వస్వమును ఈశ్వర సేవార్థము వినియోగించి కృతార్థులు కాగలరు.

సకల యుగములలోను ఈ యజ్ఞపూజార్థము మహాత్ములనేకు లుదయించుచు, అజ్ఞానాంధకారమున తమ శక్తిసంపదలను మరచి నానా బాధల ననుభవించుచున్న ఈ ప్రపంచ రాసులను జ్ఞాన సామ్రాజ్యమున కాహ్వానించుచుందురు. ప్రజాకోటి ఈ మహనీయుల సేవారాధనమును గుర్తించక, వారి ధర్మకార్యములను భగ్నపరచుటకు పెక్కు రీతుల ప్రయత్నముల సలుపుచున్నను, ఏమాత్రమును పరకు గొనక, కష్టపరంపరలను అత్యంత సంతోషముతో నెదుర్కొనుచు, తమ విధ్యుక్త ధర్మకార్యముల నిర్వహించుచుందురు. ఇట్టి వారి సేవా సంపత్తిని గుర్తించి భారతీయ సారస్వత మంతయు వేనోళ్ల పొగడుచున్నది. అంతియే కాదు, భారత సభ్యతలో అత్యంత గౌరవస్థానమును వారికి ప్రసాదించి, మన ప్రాచీనులు కృతకృత్యు లయిరి. ఇట్టి మహనీయుల ప్రశంస మన గ్రంథములలోనే గాదు. నాగరకతాలక్షణములు గల ప్రతి జాతి విజ్ఞాన కోశములలోను గాంచగలము. అన్ని మతములును అవతారపురుషులుగ వీరలను భావించి, ఎల్లకాలములలోను పూజించుచున్నారు.

ఒక యుగము మారి, క్రొత్తయుగ మాసన్నమగు కాలమున ఈశ్వర సంకల్పమును నెరవేర్చుటకు లోకరంగమున ఎందరో ధీరోత్తము లవతరింతురు. మన పురాణములు ఇతిహాసములు, ఈ నూతనమగు పరిస్థితులను ప్రస్తావించుచు, ఈ సంధిగ్ధకాలమున అధర్మమెక్కువగ విస్తరిల్లుచుండు ననియు, అన్యాయము పెచ్చుపెరుగుచు, ప్రజలు సనాతన ధర్మములను మూల ద్రోయుచుందురనియు, సాధుపుంగవులు మానవకోటినుండి అనుభవించవలసిన కష్టములకు పరిమితియే యుండదనియు నుడువుచున్నవి. ఈ సంధికాలము మానవాభ్యుదయమున కత్యావసరము. ఎప్పుడు మనము కష్టములననుభవింతుమో, యప్పుడే ధర్మతత్త్వమును చక్కగా తెలిసికొనగలము. ధర్మమార్గమునకు ఈ కష్టపరంపరలు అత్యంతావశ్యములని అందరికిని తెలిసిన విషయమే గదా! ఇట్టి సంధిపరిస్థితు

లలో ప్రజాకోటిని కాపాడుటకు, ధర్మమును పునరుద్ధరించుటకు, దేవతా మూర్తులు మానవ లోకమున రాజులుగను ఆచార్యులుగను జనించి, ధర్మరాజ్యమును సంస్థాపించి, సనాతన ధర్మములను పునరుద్ధరించెదరని మన గ్రంథములు చూపుచున్నవి. ఒకొక్క మన్వంతరమునకు అధికారపురుషులుగ నుండు మనువే రాజుగ జనించుననియు తనసనాతధర్మము నుద్ధరించుటకు ప్రతియుగమునను, ఆచార్యస్థానమునధిష్ఠించుచు మహామునులుగను జగద్గురులుగను అవతరించుచురనియు ఈఋషుల సేవారాధనకు అన్నిరీతులతో డ్పడుటకు, దేవతలు, దేవరాజులు, సప్తఋషులు ఈ లోకరంగమునకు విచ్చేయుచురనియు మనగ్రంథములు చాటుచున్నవి. ఇట్టి ప్రస్తావనే, ఇతరదేశీయుల ఇతిహాసములలో సైతము మనము గాంచవచ్చును. దేవతాగణము రాజ్యపాలనాధికారమున రాజునకు అన్నిరీతుల తోడ్పడు చుండును, మనువు ధర్మరాజ్యమును సంస్థాపించి భూతలమును వీడి పోయిన తదనంతరము, వారి రాజ్యబాధ్యతలను వహించి, రాజచక్రమును నడుపుచుందురు. జగద్గురువులవారు లోకమున నవతరించి, ప్రజాకోటిలోని అజ్ఞానమును బాపి, జ్ఞానతేజమును ప్రసాదించుటకు చేయుసేవలో ఋషిగణము నిరంతరము తోడ్పడుచుండును. వారు లోకరంగమును వీడి వెడలిన తదనంతరము జగద్గురువులవారి జ్ఞానపీఠము నధిష్ఠించి వారి ధర్మచక్రములను నిర్వహించుచుందురు.

నేటి ప్రపంచరాజ్యపాలనాధికారమునకు భాధ్యులు, ఈ మన్వంతరాధిపతులగు వైవస్వత మనువులు ప్రజాకోటిని రక్షించుటకు వారు నిరంతరము చేయుచున్న ప్రయత్నములు వర్ణింప తరముగాదు. జ్ఞానరాజ్యమున నేడు జగద్గురు స్థానము నధిష్ఠించి వారల కాపాడుచున్నవారు మైత్రేయులు. వారి ధర్మరాజ్య వ్యాపనమునకు నిరంతరము అన్నిదేశములలోను తోడ్పడుచున్న ఋషిసత్తములు ఏడుగురు గలరు. వీరిలో అగస్త్యుల వారొకరు. వీరిని గురించి చదువని, వినని భారతీయుడెవడని చెప్పవచ్చును అనాదిగ వీరు ఈశ్వరసంకల్పమును నెరవేర్చుటకు చేయుచున్న సేవ వర్ణింపతరముగాదు. భారత దేశోద్ధరణమునకు తమ సర్వస్వమును సమర్పించి కీర్తిగాంచియున్నారు. అందు ముఖ్యముగా, దక్షిణాపథవాసుల నుద్ధరించుటకు, అనాదిగ అగస్త్యులవారు బూనిన సేవారాధనను ఎవరును మరచి పోజాలరు.

ఆర్య నాగరకత వృద్ధిగాంచ సాగినది. అనార్య జాతులు మూఢ విశ్వాసముల కెన్నిటికో లోనై తమ శక్తి సంపదలను స్వార్థమునకు వినియోగించుచు లోకవాసులను బెట్టు బాధ లపరిమితములగుచుండెను. అంతటను అశాంతి. ధర్మమడుగంటెను మంత్రశక్తిని సైతము కొందరు తమ స్వలాభ నిర్వహణమునకు వినియోగించుచు, ఈశ్వర సంకల్పమునకే ఎదురడ్డసాగిరి. అట్టి సంధిగ్ధ పరిస్థితులలో అగస్త్యులు ధర్మ చక్రమునధిష్ఠించిరి. ఆర్యనాగరకతను దక్షిణ ప్రాంతమున వ్యాపింప జేసి, ప్రజాకోటి నుద్ధరించుటకు ముందంజ వేసిరి.

అగస్త్యుల ప్రశంస మన మతకోశములన్నిటిలోను గలదు. అన్నియు ఈ మహాశయుడు ఆర్య ధర్మవ్యాపనమునకు చేసిన సేవను ఎంతయో వర్ణించుచున్నవి.

పురాణగాథల నటుండనిచ్చి, ఇతిహాస పరిశోధములను బట్టిచూచిన యెడల అగస్త్యమహర్షి, దక్షిణ ప్రాంతములలో ఆర్య సభ్యతను వ్యాపింప జేయుటకై వచ్చినటులను, ఇందులకుగాను, క్రీస్తుకు పూర్వము అనేక శతాబ్దములకు ముందే అనేక బ్రాహ్మణ శ్రమములను నిర్జరారణ్య పర్వత ప్రదేశములతో నిండియున్న దక్షిణాపథమున నిర్మించి నటులను మనము అనేక సాధనముల వలన తెలిసికొన వచ్చును.

ఆకాలమున దక్షిణా మండలముల నేలుచున్న ద్రావిడరాజ పుంగవులు బ్రాహ్మణులను సత్కరించుచు, వారి ఆశ్రమములను నిరంతరము సంరక్షించు చుండిరి. మహర్షులు, రాజవంశములకు పురోహితులుగ నుండి రాజ ధర్మములను సక్రమముగ నడపుచుండు నటుల అనేక గాథలవలన తెలియుచున్నది. పాండ్య రాజులు అగస్త్యులను తమ రాజపురోహితులని పలుసార్లు పేర్కొనియుండుట మనము చరిత్రములలో గాంచగలము. ద్రావిడులకు అరవమను ప్రత్యేకముగ నిర్మించి, వ్యాకరణము నొకదానిని వ్రాసియుండిరని కొన్ని గాథలలో గలవు. మధుర తమిళ భాషాపరిషత్తు సంస్థాపించి, తమ యీ కార్యమును నిర్విఘ్నముగా నెరవేర్చిరనియు, కొంత కాలమునకా పరి

షత్తు, జలప్రళయము వలన నశించగా, తమ నాయకత్వ
ము క్రిందటనే రెండవ తమిళ పరిషత్తును నిర్మించినటులను
తమిళసాహిత్యము ప్రకటించుచున్నది. వీనినిబట్టి పరికించిన
యెడల, అగస్త్యులు అనేక యుగములలో తమిళ
జనసంఘ మధ్యమున అవతరించిరో లేదా, తమ శిష్యపుం
గవుల ప్రేరణ చేతనో, తమిళ భాషను చక్కపరచి, అం
దలి సాహిత్యము నెంతయో పెంపొందింప జేసిరని చెప్పవ
చ్చును. జీవన్ముక్తులకీ సేవా తంత్రము అత్యంత సులభ మని
యు, ఈ కార్యసిద్ధి కొరకే మహానీయులు తమ తపశ్శక్తి
నంతయు వినియోగించు చుందురనియు భారతీయులకు
చెప్పుట అనవసరము.

అగస్త్యమహర్షులు చరిత్రమునకు సంబంధించిన
గాథలు ఆశ్చర్యాద్భుతములయినవి. మహాఋషులు దక్షిణా
పథమును కష్ట పరంపరలనుండి ఏరీతిని రక్షించినదియు,
ఆదేశమును సశ్యామలముగ చేయుటకు నిరంతరమాయన
చేయుచుండిన సేవయు శత్రురాజుల దండయాత్రలనుండి
రాజ్యముల నేరీతిని కాపాడినదియు దేశీయులకు విజ్ఞాన
మును, నాగరకతను ప్రసాదించి, కాపాడినదియు, మన
ము దీని వలన తెలిసికొన వచ్చును. మనువులు తాము
ప్రపంచోద్ధరణమునకు సృష్టించిన ఆర్య జాతిని, యేరీతిని
రక్షించికాపాడి, ఆర్య సభ్యతను భూమండలమునంతను
వ్యాపింప జేసెనో, ఆరీతినే అగస్త్యమహర్షులు భారత
భూమినంతటను ఆర్య సభ్యతను ఆర్య విజ్ఞానమును వ్యా
పింప జేసి, ధన్యత గాంచియున్నారు.

ఒక మత విషయములలోనే గాక, పరిపాలనా
విషయములలోను అగస్త్యమహర్షుల వారికి గల శక్తిసం
పదలు వర్ణింప తరముగాదు. వీరు నిర్మించిన రాజ్యముల
కు పరిమితియే లేదు. జలాశయముచే భూమండలమం
తయు బహు కష్టముల పాలగుచుండెను. సింహళము
సముద్రముచే ముంచి వేయబడెను. ఇతర చోట్ల సముద్ర
ప్రాంతములలో నుండి భూప్రదేశములు రాసాగెను.
అట్టి సమయమున మహర్షి భారత భూమి చక్కబరచు
టకు చేసిన ప్రయత్నములను గురించి యెన్నియో కథలను
చెప్పుకొందురు. ఒక్కసారి వింధ్య పర్వతములు శక్తి
మదములో సూర్యుని గెలువవలయునని విజృంభించ
నారంభించినవట. వీనివలన యీ ప్రజలకు సంభవించిన
కష్టములు వర్ణించుట కష్టతరము. వీనిని గాంచినంత
మాత్రముచే ఆపర్వతముల గర్వము నాపెనట.
దైత్యులు కొందరు ఇంద్రుని జయించి ఇంద్రుని,
ఆయన ఆయుధములను సముద్రములో దాచిరట. ప్రజలను
దయా దాక్షిణ్యములులేక బాధించసాగిరట. వీనిని సహిం
చజాలక దేవతలు, బ్రాహ్మణులు, అగస్త్యుల వారిని శర
ణుజొచ్చి, తమ కష్టములను నివారింప ప్రార్థించగా,
ఆయన తమ ఆశ్రమమునుండి వెలుపలికివచ్చి, సముద్రోద
కమును సంపూర్ణముగా త్రాగివైచి, నీళ్లలో దాగుకొని
యున్న దైత్యులను ఓడించి, పాతాళమునకు బంపివైచి
రట. తరువాత కొంతకాలమునకు దేశమంతటను దుర్భిక్ష
మాసన్నమైనది. అంతటను నెటికరవు సంభవించెను. భూ
ములన్నియు ఎండిపో సాగెను.

అపుడు దేవతలు, మానవులు, ఏమియు చేయుటకు
తోచక అనావృష్టిచే బాధపడు చున్నామనియు, ఈ
కష్టములనుండి మానవ సంఘమును రక్షించ మనియు
విష్ణుమూర్తిని ప్రార్థించిరట. విష్ణుమూర్తి నియందు విష
యమున ఏమియు తోచక బ్రహ్మకు భూప్రజల కష్టముల
నివేదించెనట. బ్రహ్మ, ప్రజల బాధలను భగీరథుని తప
స్సంపత్తిచే, గంగాభవాని భూమండలమును జలశోభిత
ముగ చేయగలదనియు జవాబిచ్చిరట. ఈ గాథలను
బట్టి చూచిన యెడల అగస్త్యులవారు నిర్జనారణ్య ప్రాంత
ములను సైతము యేరీతిని స్వాధీనము చేసికొని మానవ
నివాసమునకు వసతు లేర్పరచు చున్నదియు, వారి కష్టము
లను రక్షించుటకు సతతము జన సముదాయముననే యేరీ
తిని నివసించు చున్నదియు మనము గ్రహించగలము. తమ
సర్వస్వమును ప్రజల భాగ్యోదయమునకు సమర్పించి, కృ
తార్థులై యున్నారు.

ఈ క్షామకాలములోనే ప్రజలకు తిండిలేక మల
మల మాడుచుండిరట. అపుడు మహర్షులవారు ప్రజలను
కష్టములనుంచి కాపాడుటకు తపశ్శక్తిచే ప్రజలకు కావ
లసినంత ఆహార పదార్థములను సాధించుటకు పన్నెండు
సంవత్సరముల కాలము వ్రతము బూనిరట. అందరును
భూములను చక్కజేసికొని విత్తులనాటి వర్షదేవుని అనుగ్ర
హము కొరకు వేచియుండిరట. ఇంద్రుడు భీష్మించి,
[illegible] వీనివలన సాగుబడి నిరుపయో

గము కాజొచ్చెను. ముసలి సంగని మహర్షి చెంత నివేదించి, తమ యజ్ఞములన్నియు, దీనివలన నిష్ప్రయోజనములు కాగలవని భయపడిరట. అపుడు అగస్త్యులవారు అనేక విధములగు యజ్ఞముల నాచరించి, తమ దీక్షనింకను అత్యధికముగా కొనసాగించుటకు పూనుకొనిరట. ఈ నూతన పరిస్థితులకు ఇంద్రుడు భయభ్రాంతుడై తన ఆచార్య వర్యుడగు బృహస్పతిని వెంటగొని, మహర్షి యొద్దకు వచ్చి తనతప్పును క్షమించ ప్రార్థించెను. అంతటినుండి వర్షము కురియుటయేగాక, అన్ని విధములగు భాగ్య సంపదలు భూప్రజలకు ప్రసాదింప బడినవట.

ఇంకను ఈ మహామహుని లోక సేవను గురించి ప్రస్తావించు గాథలనేకములు గలవు. ప్రాచీన కాలమున అట్లుంటియను తాంత్రికులు ద్రావిడ దేశమున విచ్చలవిడిగా సంచరించుచు, తమ మంత్రతంత్రములచే ద్రావిడ నాగరకతకు పెట్టరాని బాధలన్నియు పెట్టసాగిరి. ప్రజలు తమ శక్తిసంపన్నతను మరచి, మూఢ విశ్వాసములకు దాసానుదాసులగుచుండిరి. ఎచ్చట బట్టినను అజ్ఞానాంధకారము విచ్చలవిడిగా వ్యాపించుచుండెను. ఆ సంధిగ్ధ పరిస్థితుల నుండి ద్రావిడ జాతినుద్ధరించుటకు ఆర్య జనాంగము దక్షిణ ప్రాంతమునకు అగస్త్యులవారి నాయకత్వము క్రింద రాజొచ్చెను. ఆసమయమున, అట్లుంటియను జాతులవారు ద్రావిడుల రాజ్యముల నాక్రమించుకొని, నిరంకుశాధికారమును చెలాయించ సాగిరి. వీరిలో నొకరు ఇళ్వరాజు. ఇతనినిగాంచిన సర్వులు భయభ్రాంతులు కాజొచ్చిరి. ఆర్యాశ్రమములపై దాడివెడలుచు, బ్రాహ్మణులను బంధించి, తన గృహమునకు దీసికొనివెళ్లుచు, మాంసాహారమును వారికి బలవంతముగా బెట్టుచు, నానాబాధల బెట్టుచుండెను. ఈ కార్యములలో అతని సోదరుడగు వాతాపి, అన్నకు అన్నిరీతుల తోడ్పడుచుండెడివాడు. ఎట్టి రూపములనైన ధరించుటలో వాతాపి అత్యంత సామర్థ్యుడు. మాంసములో సూక్ష్మ రూపమునచేరి బ్రాహ్మణుల దేహములలో ప్రవేశించి, వారి దేహములను చీల్చి వైచుటకు బయలునకు వచ్చెడివాడట. సోదరులిద్దరు కలిసి, అనుదినమాచరించు రాక్షస కృత్యములకు పరిమితియే లేదు. ఎల్లరును వీరిని గాంచిన వెంటనే తల్లడిల్లు చుండిరి. ఈ రాక్షసుల వాత నుండి జనాంగమును సంరక్షించ వలయునని అగస్త్యులవారు పట్టుపట్టెను. వీరి నివాసగృహమున కరిగి, నాతిథ్యము నపేక్షించెను. మహర్షిని సైతము తమ పన్నాగములచే నశింపజేసి, ఆర్యాధికారమును నామావశిష్టము చేయవలయునని సోదరులు, తమకు లభించిన అవకాశమున కెంతయు నానందించి, ఋషిని తమ గృహమునకాహ్వానించి, భోజనమిడిరి. వాతాపి యథారీతిని మేక రూపము ధరించెను. ఇళుడు అతనినిచంపి, మాంసమును చక్కగా పచనముచేసి, మహర్షిని భుజింప ప్రార్థించెను. మహర్షి వీరి పన్నాగము నంతయు పరికించుచున్న వారుగావున, దానిని వెంటనే „వాతాపి జీర్ణ” మని భుజించెను. మామూలు ప్రకారము ఇళుడు తమ్ముని పిలిచెను గాని, అతడు మహర్షి శక్తి ప్రభావమున నెప్పుడో నశించెను, గావున బాధము లేక పోయెను. తన రహస్య వ్యాపారమును మహర్షి కనుగొనెనని భయపడి పారిపోసాగెను. అగస్త్యుడు వెంటనే అతని పట్టి బంధించి, అన్యాయవృత్తివలన సంపాదించిన ధనము నంతయు, స్వాధీనము చేసికొనెను. దానవుల వలన నే బాధలును లేకుండునటుల, ఆదేశీయులను రక్షించి, కృతార్థులైరని ఒక గాథ తెలుపుచున్నది. దీనిని బట్టి చూచిన మంత్ర శక్తిని కొందరు స్వార్థపరాయణత్వమునకు వినియోగించుకొనుచు, ఈశ్వర సంకల్పమున కెంతయో నిరోధము గల్పించుటయు, ఆర్య జాతులలో సైతము కొందరు వీని మంచి చెడ్డలను దెలిసికొనక, మంత్ర వేత్తల చేతులలో కీలు బొమ్మలగు చుండిరనియు, వీనివలన ఆకాలపు జనాంగము వారు ఎన్నియో బాధల ననుభవించవలసివచ్చినదనియు మనము దెలిసికొనవచ్చును. దుర్వినియోగము చేయబడుచున్న ఈ మంత్ర శక్తిని సరిచేయుటకు సామాన్య మానవులకు శక్యముగాదు. ఎంతయో తపోనిష్ఠ యుండవలయును, యోగదీక్షాపరులై యుండవలయును. తపోసంపత్తిని, స్వలాభమున కిసుమాత్రమైన వినియోగించుకొనక, మానవజనాభివృద్ధికి సమర్పించు ధీయుతియుండవలయును. అట్టివారే ఈ శక్తివిజృంభణము నొక నిమిషమాత్రమున నాపగలరు. దాని విషవాయువుల నివారణ చేయగలరు. అట్టి శక్తి సంపన్నతలో అగస్త్యునికి పెట్టినది పేరు. వారే ఈ క్షాత్రపరంపరల నుండి

జనులను రక్షింప వలయునని యీశ్వర సంకల్ప మైయుం డెను. మహర్షి, ఈశ్వరాజ్ఞను నెరవేర్చి, కృతకృత్యు డయ్యెను.

ఈ మహనీయుడు బహుకాలము వివాహమాడక బ్రహ్మచర్య వ్రతమును బూనియుండెననియు పితురు లిం దులకు కినుక వహించి, మహర్షి వెంటనే వివాహ మాడక పోయిన, స్వర్గమున తమకు పుట్టుగతులు లేవని నుడివిరట. అప్పుడు మహర్షి తమ తత్వము నకనుగుణ్యముగ నుండు స్త్రీని వెదకుటకై దేశమున సంచరించుచు, కొంత కా లమునకు, లోపాముద్రను గాంచి, ఆమెను పెండ్లియాడి రాను ఇలుని యొద్దనుండి స్వాధీనము చేసికొనిన సంప త్తిని ఆమెపోషణార్థము వినియోగించిరట. ఇంకొక గా థలో, సాధారణ జీవులగు బిడ్డలు వెయ్యిమంది కావల యునా లేక, వెయ్యిమంది జీవుల శక్తిసంపదలు గల కుమారుడొకడు కావలయునాయని తనభార్య నడిగెనట. భర్త తత్వమును చక్కగా తెలిసికొనిన ధీరురాలు లోపా ముద్ర భర్తసేవకు సహాయభూతికై వెయ్యిమంది చేయు పనిని చేయు సామర్థ్యముగల కుమారుడొకడు తనకు జనిం చిన చాలునని చెప్పెనట. వీని నన్నిటిలో ఎంతయో గూఢార్థమున్నది. ఇవన్నియు ఆమహనీయుని లోకసేవను ప్రకటించుటకు ఎన్నియో రీతుల తోడ్పడ గలవు.

భారత జనాంగము నుద్ధరించి, భారతీయ సభ్యత ను ఆనార్య జాతులన్నిటిలో వ్యాపించి, లోకకల్యాణ మునకు తోడ్పడిన మనగురు దేవులు, ఆకాలములు మారి పోయినను, ఆరాజ్యములు నశించినను ఆనాటివలెనే నేటి కి చిరంజీవులై జీవన్ముక్తులై, తమ ఆచార్యపీఠము నధిష్ఠిం చియున్నారు అహోరాత్రములు తమ తపోమహిమను లోకరంగమునకు ప్రసాదించుచు మనలను ధన్యులనుగా చేయుచున్నారు.

నూతన యుగము ప్రవేశించ బోవుచున్నది. నూత న సభ్యత లోకోద్ధరణకు, ప్రసాదింప బడబోవుచున్నది. ప్రాచీన కాలములలో ఈ ధర్మకైంకర్యమునకు పాల్గొ నిన మహనీయులే, నేడును నూతన యుగ నిర్మాణము నకు ముందంజ వేయబోవు చున్నారు. మన గురుదేవులు సైతము, ఈ కల్యాణోత్సవముల కొరకై వేచియున్నారు. ఆయుమలకు కావలసిన సన్నాహమును తయారుచే యుచు దక్షిణా పథముననే నేటికిని నివసించుచు, మనల పావనము చేయుచున్నారు. మహర్షులవారి ఆశ్రమము నీలగిరి ప్రాంతారణ్యములలో గలదు. ఆనాటి వలెనే, నేడును, శిష్యగణము లనేకములు, గురుదేవు నారాధిం చుచు, వారి సేవారాధనలో పాల్గొనుటకు శిక్షణమును బడయుచున్నారు. భక్తులు కొందరు మహర్షులవారిని నిరంతరము వారి ఆశ్రమమునకు వెళ్లి దర్శించుచు కృతార్థు లయి యున్నారు. నేడు అనేక మూఢ విశ్వాసములకు, యిద్ధాలతములకు లోనై కళావిహీనమై యున్న హిం దూ ధర్మముయొక్క కళంకమును నిరాకరు చేయుటకు బద్ధకంకణులై యున్నారు. మరల హిందూ మతము లోకపీఠము నధిష్టించి లోకము నుద్ధరించుటకు కావలసిన శక్తి సంపదలను ప్రసాదించుటకు బూనుకొని యున్నారు. నేడు మన ధర్మము కుంగుటకు, మనము స్త్రీలయెడల జూపు అనాదరణమే యని యు, స్త్రీ లెపుడు తమ స్వశక్తిని తెలిసికొని, మాతృ దేవతాస్థానము నధిష్టించి, జగదంబ లగుదురో అపుడే మన మతము బాగుపడుననియు సమస్త లోకవాసులకు శాంతిని ప్రసాదించ గలదనియు వారి యభి మతము. ఈధర్మ కైంకర్యమునకు తమ యోగశక్తి న.తయు విని యోగించుచున్నారు.

మన గురుదేవుల సేవారాధన అతి భారమైనది. శిష్య కోటి యంతయు ఈ సేవా కార్యమునకు తోడ్పడవలయు ను. అపుడే మన గురు ఋణమును దీర్చుకొన గలము. ఈశ్వర సంకల్పమును నెరవేర్చగలము. దీనిలోనే లోక కల్యాణము. అందరమును గురు దేవులకు తోడ్పడగలము. వారి సేవా చక్రమును అన్ని చోట్లను వ్యాపింపజేసి కృత కృత్యులమగుదుము.

# ఆత్మసమర్పణము

### తాడేపల్లి మృత్యుంజయరావు

ప్రభాకరుడు తనతండ్రిదగ్గర గణితము నేర్చుకొనుచున్న సమయముననే సుభద్ర జామపండ్లను తినుచు తన యింటి కిటికీలోనుండి చూడసాగెను. సుభద్రపై లక్ష్యము పోయినతోడనే అతనికి లెక్కలపై నిర్లక్ష్యము మొదలయ్యెను. తండ్రి యెంతశ్రమపడుచున్నను ఆలెక్కను విడదీయు రహస్యము ప్రభాకరునికి బోధపడదయ్యెను.

తండ్రి విసుగుకొని చేతనున్న పుస్తకమును తనబలముకొలది నేలకుజరచి „నీవు యీడుముదిరినకొలది ఎక్కువ మూర్ఖుడవై పోవుచున్నావు. పరీక్షలో నుత్తీర్ణుడవగు లక్షణములు అగుపడుటలేదు. ఇటునటు దిరుగుటయందో లేక నే హనుమంతరావు వ్రాసిన ప్రేమగాథలను చదువుటయందో నీవుకాలమును గడుపుచున్నావు. పిల్లలను నిరంకుశమనస్కులచేయుటకై సాహితీసమితి సభ్యులిటీవల సిద్ధమైనారు. నీవాసమితిసభాపతి పుస్తకమును చదువుట మానుటకై యెన్నిసారులు చెప్పలేదు? నీపోషణ నీవు చేసుకొనలేవుకాని, ఎప్పుడును ‚హృదయేశ్వరికై, తహతహ పడుచుండువు'' అని కొడుకును కోపపడెను.

ఇంకేపోటనైన ప్రభాకరుడీ కఠినోక్తుల భరించగలగియుండెనేమోకాని సుభద్ర ముందాతని కవమానము జరిగినందులకు తల క్రిందికి వేసుకొనెను! దుఃఖము పొంగసాగెను.

బహుకాలమునకు పుత్రసంతానము కలిగినందున తనకుమారుని పరితాపమును చూడలేక నాతడు „నాయనా, నీవుకొంత శ్రద్ధతో ప్రయత్నించిన నీలెక్క లేకావు, జీవితమునందలి కష్టసమస్యల నెన్నిటినో యవలీలగా దెలిసికొనగలుగుదువు. మంచిది. పో, కొంతసేపటునిటుతిరిగి రా'' యని మందలించి వెడలి పోయెను.

జనకుడు వెడలిపోయిన రెండవక్షణమే ప్రభాకరుడు సుభద్ర యుండజేరెను. ఇద్దరును కలిసి సుభద్రయింటి వెనుకనున్న జామపాదుకడ కేగిరి. ప్రభాకరుడు త్వరగా చెట్టుపైనెక్కి కొన్ని సుభద్రకొఱకును మరికొన్ని తనకొఱకును జామపండ్లను త్రెంపి దిగెను. కొంతసేపా పెరటిలో నాడుకొని ఎవరును లేనిదిచూచి ఇద్దరును జామపండ్ల చవిచూచుచు దగ్గరనేయున్న స్రవంతి కడకేగిరి.

అది వేసవికాలము. గులాబీరంగుగల మేఘములు గుంపులు గుంపులుగా నాకాశము నడుమ పరుగిడుచుండెను. క్రింద మర్మరధ్వనుల జేయుచు గొప్పయజగరమువలె నేఱు పాఱుచుండెను. చిన్నచిన్న యలలు పిల్లవాయువులతో నాడుచుపాడుచు తిరిగాడుచుండెను. ప్రభాకరుడు సుభద్రను నీటియందు దిగుటకై బలవంతపెట్టెను. సుభద్ర తనతల్లి భయమువలన నొప్పుకొనలేదు.

„అయిన, నీవు కూర్చుండుము. నేను రెండే మునుగులు మునిగి వచ్చెదను'' అని ప్రభాకరుడు బట్టలు విడచి నీటియందు దూకెను. తనకీతయందుగల ప్రవీణతను సుభద్రకు ప్రదర్శింప బోచ్చెను. కొంతకాలము వరకు సుభద్ర ఊరకుండ గలిగినది కాని ప్రభాకరుని యానందమును జూచి యిక నిలువలేక పోయెను. తల్లిభయమును మరచిపోయి నీటియందు తానుకూడ లంఘించెను. ఆనందములో నుభయులును ఈదసాగిరి.

ఇంతలో సుభద్రయొక్క పరిచారిక నీటి సమీపము వచ్చెను. సుభద్రాప్రభాకరులిరువురును నీటియందాడుచుండిరి. వచ్చిన పరిచారిక మొగము చిట్లించుకొని „సుభద్రా, ఏమీవేషము! కాని సమయమునందు నీటమునిగిన జబ్బుసేయదా?'' అని యనెను.

ఎవరామాటలను లెక్కపెట్టువారు! పరిచారిక మన్నించిన కొలది సుభద్ర నవ్వుచు నెక్కువ లోతునకు బోసాగెను. పరిచారిక కోపముతో „ఏమి! వినవా!... అమ్మతో నిప్పుడే పోయి చెప్పెద'' అని గద్దించెను.

„వద్దువద్దు, ఇప్పుడే వచ్చెదను, చెప్పవద్దు. రెండే ‚కోడిపుంజుల' నాడివచ్చెదను'' అని సుభద్ర వేడుకొనెను.

కాని సుభద్ర 'రెండే ఆటలు' గంటకాలము గడ చినను పూర్తిగా నటుల తోచెను. పరిచారిక "ఏకిష్టమై నంతసేపు యాడుకొనుము. నాకు తెలియును. నేవెళ్ళి పోదుగాకనని గృహోన్ముఖు రయ్యెను.

"లక్ష్మి లక్షణముజూచ నమ్మతో చెప్పునని తో చుచున్నది. ఇకనాటల చాలింతమా?" యని సుభద్ర ప్రభాకరునితో ననెను. సుభద్ర యొక్క నిర్మల ప్రేమా పాశమున దగిలిన ప్రభాకరుడు మారుపలుకక నొప్పుకొనెను. ఉభయులును ఒడ్డుపైకివచ్చి బట్టలధరించిరి.

ఇసుకపై నడుచుచుండ సుభద్ర ప్రభాకరునేదో పాట పాడుటకై బలవంత పెట్టెను. ప్రభాకరుని నోటి నుండి అప్రయత్నముగా నీక్రింది గీతము వెళ్ళెను:

"వేదవడియున్న నామనః పేటి మిగుల
దనరు నుజ్వలభావరత్నములతోడ
త్వద్వదననీరజాత సందర్శనమున,
నీవు నాపాలిటికి రమాదేవివమ్మ!"

ఇద్దరును ఆనంద పరవశులై గృహముల జేరిరి.

౨

సుభద్ర తండ్రి ఆ గ్రామమునకు దేశముఖు. భూములు కూడ నెక్కువ యున్నందున స్వంత వ్యవసాయము పెట్టుకొని యుండెను. లక్ష్మీదేవత అతనిపై సంపూర్ణానురాగముగలదై యుండెను. సత్స్వభావుడు కనుక నాతనిన గ్రామస్థులకు చాల ప్రీతి.

అతనికి సంతాన మొకటే. ఎన్నోనోముల నోచి సంపాదించిన వరమొక సుభద్రయే. అందువలన నాతడును, అతని ధర్మపత్నియు తను ముద్దులపట్టి సౌఖ్యమే తమ సౌఖ్యముగను, ఆమె యానందమే తమ యానందముగను భావించుచుండిరి.

ప్రభాకరుని తండ్రి గొప్ప పండితుడు. పూర్వాచార పరాయణుడు. ఉద్యోగమునందాతడు తన సంపూర్ణ జీవితమును గడపెను. వృద్ధాప్యము వచ్చినందున నాతనికిపుడు ఉపకారవేతనము దొరుకుచుండెను. ఆతడు శ్రీమంతుడు కాకపోయినను బీదవాడు మాత్రము కాడు. కుమారుడొకడే కనుక విద్యాభ్యాసనార్థమే మండలమునకును పంపక సమీపము నందున్న నొక పేటలో మెట్రిక్యులేషన్ చెప్పించు చుండెను. తండ్రి మనస్సులో తనకొడుకు ఇంజనీయరు కావలెనని యుండెను. లెక్కలనిన మన ప్రభాకరునికి చాలవిసుగు!

సుభద్ర కప్పుడు పండ్రెండు సంవత్సరములు. ఎక్కువ మాటలాడు స్వభావము కలదికాదు. ఆమెమేను తంగేటిపూలచాయనుపోలి దినదినము నెక్కువ సొంపును వెదజల్లు చుండెను. ప్రభాకరునికి పదునెనిమిది వత్సరములు. అంత అందకాడు కాకపోయినను అతని మొగము నుండి దివ్యప్రభ ఉట్టిపడుచుండెను. సుభద్ర తనతండ్రికడ తెనుగును, కొంత సంస్కృతమును పఠించు చుండెను. ఇద్దరు నన్యోన్యమైత్రితో కాలము గడుపుచుండిరి. ఆటల మధ్య కొన్ని సమయములందిద్దఱికిని వాక్సమరము జరిగినను రెండవ నిముసమే తమ అభిప్రాయ భేదముల మరచి పోవు చుండిరి. ప్రభాకరుడు వెలుగెత్తి పాడునపుడు సుభద్ర తన్మయురాలై పోవుచుండెను. ఆమెతీర్పు ప్రకారము త్యాగరాజు ప్రభాకరునితో తులదూగడు. గండుకోయిల ప్రభాకరుని పాటకు సిగ్గుపడి పోవును. ప్రభాకరమధుపమును చూచి సుభద్రాపుష్పము మురిసి మురిసి పోవుచుండెను!

సుభద్రకు పండ్రెండు వత్సరములైన నిండక మునుపే నాయనమ్మ తనయవసానకాలము సమీపించు చున్నందున తనకంటితో మనుమరాలి పెండ్లి మురిపెము చూడవలెనని కుమారుని తొందర పెట్టసాగెను. పిల్లకు పెండ్లి తొందరేమి వచ్చినదని ఆతడు మందలించినను వృద్ధురాలగుతల్లి ఆమాటను చెవినిపెట్టు కొనలేదు. తల్లి యాజ్ఞను తీసివేయులేక నాతడు సమీపగ్రామముననే వరనిశ్చయము జేసెను. జ్యేష్ఠ శు॥ ౧౦ నాడే పాణిగ్రహణ మహోత్సవము నిశ్చయమయ్యెను.

సుభద్ర సిగ్గుతో నీవార్త ప్రభాకరున కందించెను.

ఆతడు కొంత విచారపడినవాడై "అయిన, నీపెండ్లి కాగానే నీయత్తగారింటికి వెళ్ళెదవు......మనము వేరైపోదుము" అని మెల్లగా ననెను.

"కాదుకాదు, నేను మాయమ్మతో పోనని చెప్పెదను."

"పిచ్చిదానా, నిన్నెక్కడివదు నడిచ్చెదరు? నీకిష్టము లేకున్నను బలవంతముగానైన వెంటబెట్టుకొని పోవుదురు."

"దీనిలో బలవంతమెందులకు?......అయిన, మా అత్తగారివారు వచ్చిన తక్షణమే లక్ష్మియింట దాగుందును......అప్పుడేమి చేయుదురు?...ఊ!"

సుభద్రకప్పుడే యుంతజ్ఞాన మెక్కడిది? పెండ్లియనిన, పాపమామె, యేదోఆట యనుకొనినది! కాని ప్రభాకరుని హృదయము మాత్రము విచారగ్రస్థమై పోయెను.

సుభద్రలగ్నము చాల సంరంభముతో జరిగెను. వివాహానంతరము సుభద్ర తనమొగని యింటికి ప్రయాణమయ్యెను. అంతవరకు పెండ్లియనిన నొక చమత్కారమనుకొనెను. కాని ఇపుడు తనస్వేచ్ఛకు భంగము కలుగనున్నదని సుభద్రకు దుఃఖము రాజొచ్చెను. తల్లి తండ్రుల విడిచిపోవలసి వచ్చెననియు, ప్రభాకరునితోనున్న స్నేహమిక నంతరించెననియు మనస్సునకు దృఢమయ్యెను. స్మారక చిహ్నముగా గాబోలు, నా యమాయకురాలు ప్రభాకరునికి తన బొమ్మలపెట్టెను ఒప్పజెప్పి జాగ్రతగా నుంచుమని నొక్కి నొక్కి చెప్పి కంటనీరు కార్చుచు నాతని సెలవు పుచ్చుకొని అత్తవారింటికి వెడలి పోయెను!

సుభద్ర దృక్పథము దాటినతోడనే ప్రభాకరుని హృదయము దీపము బొడగొట్టికొనిన పతంగమానసమువలె తత్తరపడ జొచ్చెను.

* * * *

అత్తవారింట నొకదినమైన గడుపలేదు, సుభద్ర దుఃఖముతో సగమై పోయెను. తండ్రిని యింటికి దీసుకొని పొమ్మని పీడించ సాగెను. జనకుడెంత సమాధానపఱచినను వినుట మానెను. ప్రభాకరునైన నొకసారి చూపించుమని వెక్కి వెక్కి యేడ్వసాగెను. ప్రభాకరుని పిలువనంపిరి. మొదలాతడు రాననెను. అతని జీవితాదర్శమే మార్పుజెందు చుండెను. బలవంత పెట్టిన తర్వాత నాతడు సుభద్ర కడకేగ నియ్యకొనెను.

ప్రభాకరుడు వచ్చినదినము సుభద్ర తన దుఃఖమునంత మరచిపోయెను. ఇద్దరు నాటల పాటలలో కాలము గడపిరి. 'తెనుఁగుతోట' నుండి కొన్ని పద్యముల జదివి యానందించిరి. మరునాడే ప్రభాకరుని జనకు డకస్మాత్తుగా నశక్తుడయ్యెనని వార్తవచ్చెను. అతికష్టముతో నాతడు సుభద్రను వీడగలిగెను.

3

కాలము విచిత్రమైనది! మనుష్యు డొకటి తలచిన తానొకటి చేయ నిశ్చయించును. దురూహ్యమైన కాఠిన్యము వహించును. పచ్చగా నున్నవారికి భస్మ లేపనము చేయ సమకట్టును. దానికి సహన శక్తి లేదు. ఒరుల సంతోషము చూచి దాని కండ్లు మండును.

సుభద్ర వివాహమై యేడాది నర్ధము గడచెను. ప్రభాకరుని తండ్రి పరలోకగతుడయ్యెను. సంసారభారము మన కథానాయకునిపై బడినది. తల్లిదప్ప నాతని కితరాప్తులెవరును లేరు. అటు విద్యాభ్యసనము చేయుచు నిటు జీవితనౌకను స్వహస్తములతో నడుపుచు దినముల గడపుచుండెను. ఒకనాడు పొరుగిల్లైన సుభద్రతండ్రి యింటినుండి గొప్పరోదన ధ్వని ప్రభాకరునికి వినబడెను!

కారణమేమో ఒకగంట తదుపరి యింటివారలు మధ్య మధ్య బిగ్గరగా ననుకొని దుఃఖించుచున్న దానిబట్టి తెలిసెను! అతని హృదయముపై పెద్ద పర్వతము పడినటులయ్యెను!! సుభద్ర సౌభాగ్యమును యమకింకరులు కొల్లగొట్టుకొని పోయిరి!!! శోభంజిమ్మిన సుభద్ర తిలకము బలవంతముగా తుడిచివేయబడినది. ఆపవిత్రస్థానమున నిపుడు బూడిద యధిష్ఠించి యున్నది! అనాథయైన సుభద్ర భయపడిన లేడిపిల్లవలె తనతండ్రి శరణుజొచ్చినది.

ప్రభాకరుడు వారినుపలాలింప వెళ్ళెను. ఇంటియందు కాలిడగనే సుభద్రాదర్శనమే యయ్యెను. ఆమెను చూచి ప్రభాకరుడు స్తంభీభూతుడై పోయెను. ఆతని జూడగనే పరుగిడుచు వచ్చునట్టి యలవాటుగల ఆ సతతానందమయమూర్తి దుఃఖముచే జీర్ణించి ధవళవసనధారిణియై ఒక స్తంభమున కానుకొని కదలక మెదలక నిలువబడి యుండెను. ఇరువురి నోళ్లనుండికూడ నొక్కటైన వెడలలేదు. ప్రభాకరుడా యమ దురవస్థ జూడలేక పోయెను. అశ్రువులాతని చెక్కులపై దూకసాగెను. ఆ వేదన నంతయును మనసార వెళ్ళబోసుకొనెను. సుభద్ర కంటినుండి ఒక యశ్రు బిందువైన రాలలేదు. ప్రభాకరుడు నిలిచినంత కాలము రెప్ప వాల్చక దీనముగా నాతనినే చూచుచు నిలువబడెను.

ఎక్కువసేపు ప్రభాకరుడా దృశ్యము నవలోకింపలేక వెడలిపోయెను.

* * * * * *

ఒకటి రెండు నెలలు గడచెను. ఒకనాటి సాయంతనము, సుభద్ర తండ్రి ప్రభాకరుని వెంటబెట్టుకొని ఊరి యుపతలికి వెళ్ళెను. నిర్జన స్థలమునకు పోయి యిద్దరును ఒక శిలపై కూర్చుండిరి. సుభద్ర తండ్రి ప్రభాకరుని సంబోధించి విచార వదనముతో ,, నేను నీతో నొకసంగతి నాలోచింప దలచినాను. సుభద్రకంటె నాకీ ప్రపంచమున ప్రియమైనవారు మరొకరులేరు. దాని సౌఖ్యమును చూచి నేను సుఖముగా నుందును. దాని యానందమును చూచి నేనానందపడుదును. 'మా ఫాలశిలయందేమి వ్రాసి యుండెనో ఆవిధముగ జరిగిపోయినది. నేను [illegible] సుభద్రకు వివాహము చేయదలచినాను. మీరుభయులును బాల్య స్నేహితులు. ఒకరి కొఱకు మరొకరు ప్రాణమైన

జీవన త్యజింతురు. నీహస్తముల నాజీవిత సర్పింప దలచి నాను. వృద్ధురాలగు తల్లి తప్ప నీ కితరబంధువు లెవరును లేరు. నీస్వతంత్ర ప్రవర్తనమును బట్టిచూడ సంఘమునకు కూడ నీవు భయపడవని తలంతును. మీ రధియులును నాయా స్తికంతటికిని అర్హులగుదురు. మీసౌఖ్యము జూచి నా పరితాపము నణచికొందును” అని యనెను.

ప్రభాకరుడు మౌనము వహించి తదేకధ్యానముతో వినుచుండెను.

“నీ యభిప్రాయమేమి?” యని సుభద్రతండ్రి యడిగెను.

“నేనాలోచించి చెప్పెదను” అని అధరము కంపించుచుండ ప్రభాకరుడు గొణిగెను.

సుభద్రతండ్రి దీర్ఘనిశ్వాస వదలి వెడలిపోయెను.

౪

ఆరాత్రి యంతయు ప్రభాకరుడు నిద్రింపనేలేదు. సుభద్రతండ్రి మాటలు మాటిమాటికి నాతనియందు గొప్ప యుల్లాసముల గల్పించుచుండెను. మొదలుమొదట మాత్ర మాతడు సంతోషమును పట్టజాలక పోయెను. సుభద్రా ప్రాప్తియు గొప్ప యాస్తియు, అతని నొసట వ్రాసి యున్నవని తలచిన తోడనే ఐహికవాతావరణ మాతనిని మోహపరవశుని జేసెను. అతనికికనంత యదృష్టవంతుడు ప్రపంచమున మరొకడుండడని తోచెను.

కానియాలోచన కొంతసేపటికంత దివ్యము నగుపడదయ్యెను. సుభద్రను మరల కృత్రిమ సంసారమున పడద్రోయుట అతనికి నచ్చలేదు. రెండుసెలల క్రితమే ఆమె నొక దేవతగా భావించి పూజించి తిరిగిప్పుడు తనసేవ రాలినిగా చేసుకొనుట కాతని మనస్సు ఒప్పుకొనలేదు. నిష్కల్మష ప్రేమను నాశనపఱచి ప్రాపంచిక మోహమును తావొసంగుట గొప్ప పాపమని తలంచ సాగెను, తన చిరసౌఖ్యమును దీర్చుకొనుటకై అకళంకయు, పవిత్రురాలు నగు సౌభద్రను ప్రపంచమున నేవిధముగ నున్నతేయుటయని విలపింప జొచ్చెను. సుభద్రకు కళంకము తెచ్చిపెట్టుట అమానుష కృత్యమని ఆతడు నిశ్చయించెను. దేవత దేవతగానే యుండవలెను. భక్తు నిపని తన సర్వస్వము నర్పించుటయే! ఏమియును ఆసింపక పోవుటయే అతని ముఖ్యలక్షణము. ఆత్మశాంతికిదియే పరమోత్కృష్ట సాధనము. ఈ యాలోచనతో నతనికి కలిగిన యానందమునకు మేరయేలేదు. తన్మయుడై పోయెను. నోటినుండి గీతములు వెళ్ళెను;

“దేవి, నీరమ్యమూర్తి మదీయహృదయ
పుండరీకాననమున బ్రపూర్ణభక్తి
నిష్టదేవతముగ బ్రతిష్టించి, యెపుడు
వివిధవిధముల నిన్ను సేవించువాడ.
అపరిమేయానురాగ తోయమ్ముతోడ
నీకు దివ్యాభిషేకంబు నెరపువాడ.
మధురభావ పంపరామాల్యములను
లలితభవదీయ కంఠం బలంకరింతు.”

ప్రభాకరుడు సుభద్రతో పరిణయ మాడజాలనని స్పష్టముగా దెలిపి వైచెను!

సుభద్ర తండ్రికొక పర్వత శిఖరమునుండి క్రింద బడినటులయ్యెను. సుభద్ర తన తల్లితో “నాయన గారితో చెప్పుము, నాకీసేవయందే సంతృప్తి యున్నదనియు, మీచరణ సేవలో జీవితశేషమును గడపుదునని” అని యనెను.

* * * * *

మరునాడేదో పర్వదినము. ఉషః కాలముననే సౌభద్ర స్నానముకొఱకు యేటికడ కేగియుండెను. ప్రభాకరుడుకూడ నాకారణముననే నటకేగెను. అతనికి సుభద్రరాక సంగతి తెలియదు.

రెండు సంవత్సరముల క్రితమెట్టి శాంతితో స్రవంతి స్రవించుచుండెనో అశాంతితోనే యానాడు కూడ ప్రవహించుచుండెను. పక్షులు కూడ నానాటి కిలకిలారవములనే సలుపుచుండెను. ప్రకృతిలో నేభేదమును కనబడలేదు. తరంగములలో కూడ నప్పటికి బాల్యక్రీడలే యగుపడెను. ఆనాడు సుభద్రతో నాడుకొనిన యాటలన్నియు ప్రభాకరుని కండ్లకు కట్టినట్లయ్యెను. సుభద్ర తనవెంట నున్నదని తలపోసెను. ఆనాటి యుత్సాహమే యిప్పుడు కూడ కలిగి నీటియందు లంఘించెను!

స్త్రీలు స్నాన మాచరించు ఘట్టమువైపు నాకస్మికముగ నాతనిదృష్టులు మరలెను. సుభద్ర స్నానము చేయుచుండెను! ఆమె నీల కుంతలములు నీటియందు కలుతలలుగల నల్లని నాగుబాములవలె నాడుచుండెను. ప్రభాకరుడు రెండు వత్సరముల క్రింద చూచిన దినమును అదినమును ఒకటేయని భ్రమ జెందిపోయెను.

ఇంతలో సుభద్ర తనవుచు చుంబించిన ఒక తరంగ కన్యపరుగిడుచువచ్చి ప్రభాకరుని తనవునుసోకెను. ప్రభాకరుని సర్వస్వము నాయుల కౌగిలించుకొని పోయెను! నీటి సుభద్ర నీరుమున్న ప్రభాకరుని సర్వాంగములను ఆతనిని వర్జించి

వెళ్ళెను. సుభద్ర ముఖావలోకనము జేయుచు మనఃసముద్రమునుండి ఉబికివచ్చుచున్న యీ పదముల బైకి రానివ్వెను:

"అతివిశాలగభీరభవార్ణవంబు
నన్నుదరియింపజాలిన నౌకవీవ;
స్థిరపవిత్రమదీయ హృత్పీఠనిహిత
దివ్యవిమలానురాగాధి దేవివీవ!
నిన్నుధ్యానించుచుండ నిర్నిద్రమగుచు
భ్రమదమునజేరు మానసకంభరంబు
రాధికానాధుపాద నీరజయుగమ్మొ,
వింతగొల్పెడినాముక్తి కాంతవీవ!"

పై గీతములు పూర్తిగా నోటినుండి వెడలనేలేదు. బలహీనుడైన ప్రభాకరుని ప్రవాహిని హటాత్తున మాయము చేసెను! సముద్రుని దర్శనార్థమే వెంటబెట్టుకపోయెనో మరేమి చేసెనో మేముచెప్పలేము. ఆపిదప సుభద్ర గతియేమయ్యెనో అదియు మాకు తెలియదు.

—••❖••—

## అంజలి

వర్ఝుల వేంకటేశ్వర కవి

మ. అవనిన్ మాఘుడవై జనించి యటుపై నా కాళికాదేవి సం
స్తవముంజేసి యమాసభూరికవితా సంపాదనల్ చేసి స
త్కావితా లోకమునన్ మహాకవియనంగాఁ బేరుఁగొన్నాఁడవో
కవిరాజాగ్రణి కాళిదాస! కొను మింకన్ నానమస్కారముల్.

శా. సంగీతంబుననిట్టి ధీరుఁ డెవఁడున్ జన్మింప లేదన్న కీ
ర్తిన్ గైకొంటివి; రామచంద్రపదభక్తిం గొల్చి, నిత్యంబుగా
రంగన్నామము నిల్పుకొంటివి మహీరంగంబునన్; నిన్ను నె
న్నంగా శక్యమె! త్యాగరాజ! నిను స్వాంతంబందుఁ బ్రార్థించెదన్.

మ. భవదీయ ప్రతిభా ప్రభావకలనా భాగ్యంబునం గాదె ప్రా
భవ మొప్పారఁగఁ జిత్రలేఖన కళల్ వ్యాపించె లోకంబునం
దు; విశేషంబుగ నీదుకీర్తి దెసలందున్ నాటె స్థైర్యంబుగా
రవివర్మా! వరచిత్ర లేఖన కళారమ్యా! నమస్తే నమః.

మ. జననీ దుఃఖముఁ బాప నెంచి నిజమున్ స్థాపింపఁగా నెంచి స
జ్జనులం బ్రోవఁగ నెంచి పాపముల డిందంజేయఁగా నెంచుచున్
జననం బందిన దైవతంబవని నిచ్చల్ నాదు భావంబునన్
నినుఁగీర్తింతు మహాత్మ నామనుత గాంధీ! లోకరత్నామణీ!

మ. ప్రతిభామండిత వీరవాసిత మహారాష్ట్రంబునం బుట్టి యు
ద్ధత శౌర్యంబు, పరాక్రమంబు, బలమున్ ధైర్యంబు నౌదార్య సం
గతియుం గల్గి మహా మహుండవయి యేకచ్ఛత్ర పాలుండవై
క్షితిఁ గాపాడిన నీకు మ్రొక్కెద శివాజీ! రాజచూడామణీ!



# గణపవరము శాసనము

(ఆంధ్రపరిశోధక సంఘము, హైద్రాబాదు)

శాసనసంఖ్య ౪౩. ఇది నల్లగొండజిల్లా హుజూరు నగరు తాలూకా కందిబండను నాలుగుమైళ్ల దూరములో నున్న మాలపల్లెదగ్గరనున్న పూడిపోయిన శివాలయమునకు సమీపము న బడియున్న శిలాఖండముగా నున్నది. ఉన్నంత వఱకు శిలమీది వర్ణములు స్ఫుటముగా పఠనయోగ్యముగా నున్నవి. పైభాగము విరిగిపోయినది. ముక్క కనుపించుటలేదు. ౧–౪ వైపుల పఙ్క్తులు పోయి యుండుటచే విషయము సమగ్రముగా లేదు.

౧ వైపు

౧ + పశ్చిమాబ్ధేః శ్చ+
౨ + ప్రతినృప+
౩ + సర్వాన్స్వగర్వాన్ఃతట+
౪ -++ క్షిణా+
౫ + దతోరుద్రదేవాను (జ)
౬ (ము) మాదేవనృపాత్మజః+
౭ శక్తిజయప్రియా
౮ + మాధ్వానేధిగంతే శత్రుణా
౯ + ర్వాణ సౌధభవన +
౧౦ + త్ప్రతిష్ఠానతః సంగ్రా
౧౧ + నపక్షిత్యో గణపతిత్వ +
౧౨ + మాగచ్ఛతిక్షి ప్రయాతం+
౧౩ + దివిమితితదా తేషాము +
౧౪ + స్తి॥ యస్యానుకూల స+
౧౫ సేవవిభూయ మానాస్తు
౧౬ ద్వైతాగ్ర నిహితాః పృతనోపేతో +
౧౭ + తాఃక్షిప్రంపలాయన పరా+
౧౮ +వ తేది దూరానానారిపుక్షి+
౧౯ తిపతించతజ్ఞయంతి॥ సంగ్రా
౨౦ మసాకులాశ్వ ప్రచుర ఖరఖు
౨౧ రక్షేణిభిన్నక్ష మోద్యద్ధూళీ (ధూ)
౨౨ సప్రకాండ ప్రసవతమిహిర
౨౩ ధ్వతపుంజేయదీయైః శస్త్రైశ్చ
౨౪ న్నిద్యద్యుగ్రప్రతినృపతిశి
౨౫ రాస్యైకలయ్య ప్రయాతోరా
౨౬ మద్యూహాభ్రమేణస్యమణి
౨౭ రితిజనావిస్మితా స్తర్క-యంతి॥

౨ వ వైపు

౧ + + + + ప్రయుతోద
౨ + యాసౌసర్వాన్నృపాలహేమ+
౩ రకోటిస్ఫురద్రతోన్నద్భా+
౪ పీతమహిత శ్రీపాదప (ద్మా)
౫ యాత్ సూరై సంనుత శౌర్యాభూష (ణ)
౬ భృతోహేంమాది దేవాఖ్యధీ శ్రీమ (ద్భా)
౭ లసరస్వతీతి విదితం నామోత్తమః+
౮ బ్రవాన్ యుంజగద్దేవ భూపాలో
౯ ధ్యాహేమాది భూపతిః సేనాప
౧౦ తిమమాత్యంచచక్రే విక్రమధీయు
౧౧ తం॥ యశ్చారి వీరా వివిజత్యనిత్యాం రణై
౧౨ + + + + భూమిభర్తుః ఆపూ+
౧౩ యద్దేశమపేశతాః శ్రియాగమే
౧౪ మేఘమివాంబు వర్షైః తత్పుత్రో భూద్దేవ
౧౫ మాల నామధేయోధీ యాన్నిధిః జ
౧౬. గద్దేవ మహీపాలన పాలితః సమ్మత
౧౭ స్సతాం॥ యస్పాది భక్తమాలక్ష్యాజ
౧౮ గద్దేవాదనంతరం కాకతీశః ప్రో
౧౯ లభూపస్సో భరాంపర్య పాలయ
౨౦ త్॥ ప్రాజ్యైర్భోజ్యైః ప్రాణినః ప్రీణయంతం

మూడవవైపు

౧ + + + +
౨ మాతరవః క్వచిచ్ఛస్త్రి శ ప్త్రప్ర+ +
౩ + వ్యతికరం క్వచిద్వంది వ్రాతస్ఫుట+
౪ క్వ ప్రసరణం॥ క్వచిద్వీణా నాదస్ఫు
౫ రిత గానవినదం క్వచిన్నాదధ్వా నోధర

౬ నాకృతధియాం స్వచిన్హా నారత్న
౭ యవాక్యంచనతి ।జా। మతేషు గిగ +
౮ తతయస్యనగరే॥ స్వప్రాణాధిక తా +
౯ + తేనాజయ+గతాయ+ +
౧౦ వైభవయుతిశోణీవరేంద్రపార్థతం। +
౧౧ సంమతేషుమిషువాభుజ ప్రమోదా++
౧౨ నాతేసతైరనంత విభవ ప్రజ్ఞాన్వితా జ్యా+
౧౩ చిచ్చిత్తః సదనే వివేక తయనేజ్ఞాన ప్రదీపే
౧౪ యాకాతిష్ఠంతి సమత్వసంయమముఖ్యైః+
౧౫ సచ్చిత్రేసుణైః।ధీతాదూతిక యాసదాశివ
౧౬ మవాసియశ్రేతేయస రమ్యం+ + +
౧౭ రసస్య వ్యాదయాతేనానిశం క్రీడతి + + +
౧౮ ద్దిస్సేన్యం సకలకలాలాప ముఖరితమకుటాత్
౧౯ సస్యై సమృద్ధముపవనవిరాజమానం గణపతిపు
౨౦ రం॥యత్రస్వారతరోవిభాతఫలధీప్రఖ్యాకడాగోత్తమః
౨౧ స్వచ్ఛంపాథుచసారణీ పరిగతేమావైర్యదీయం
౨౨ జలంజిత్వా పక్వఫలోరుభారనమితైఃశాలిప్రజః
శోభతేమా
౨౩ యఃపాతు మివానతికృత శిరావక్త్రైః స్వకీయైరపి॥
౨౪ శాకాబ్దైః బాణభువన భానరి సుధాకిరణగుణితేః
౨౫ శ్రీముఖ సంవత్సరేమ (మా)ఘ శుక్లాష్టమ్యాండన
కరదినేశ
౨౬ కవష౯ ౧౧౭౫ శ్రీమద్రుద్రేశ్వరంపర్త్యేష్టాప

నాలుగవవైపు

౧ + ఃకేవలమువ్విర్ +
౨ + యస్యసాజ +
౩ + + పాద్యగణ +
౪ + + ॥గణపతిపు +
౫ + మందేవద్విజగడాయ్యర్ +
౬ + యంథమ్మను నేతున్నబృపా +
౭ + ౦పాలసీయో + + +
౮ + తాన్యావినః పార్థివేం +
౯ + యోభూయోయాచ +
౧౦ + మచన్ద్రః॥ స్వదత్తాంపర (ద)
౧౧ + యోహరేత వసుంధరాం
౧౨ (ష) స్టివష౯ సహస్రాణి విష్టాయా (౦)
౧౩ (జా) యతేక్రిమిః గ్రామే +
౧౪ మేకామాహె + + +
౧౫ రన్నరకమాప్నోతి యావదాభూ +
౧౬ ద్భుపంభా౯ద్వాజస్యరోదస్సమం
౧౭ గుణక ధావణీ౯ తేందస్యవిద్యా
౧౮ లీలాశాలానవస్య క్షీతివర +
౧౯ తయశోనన్ది మిత్రస్యపుత్రః
౨౦ వాణీప్రేయో భుజంపఃసుభ
౨౧ + + + నిరతోయత్న్వితారేచన
౨౨ + స్తైనోక్తంనన్ది నామ్నాజయ
౨౩ తిక్రుతధియా శాసనంయా
౨౪ వదక్క౯౦ + + +
౨౫ + + + +
౨౬ + + + ÷

## సూచన

ఈశాసనము కాకతీయగణపతి దేవుని కాలమున స్థాపింపఁబడినది. ఇందు గణపతి దేవుఁడు మహాదేవరాజుల కుమారుఁడని చెప్పఁబడెను. ఇందుఁజెప్పఁబడిన హేమాద్రి భూపతి శాలసరస్వతి చరిత్రమున కపరిచితుఁడు. కాకతీయ ప్రోలరాజుచే జయింపఁబడిన జగద్దేవుని ప్రశంస యిందు గలదు. జగద్దేవుని యనంతరము దేవపాలితుఁడు రాజ్యమునకు వచ్చెను. వీరెవరో యెటువంటివారో సందర్భమేదియో తెలుపు భాగములు శిథిలమైనవి. నందిమిత్రుని కుమారుఁడగు నందియను పండితుఁడు శాసన గ్రంథమున రచియించినటులఁగలదు. శాసన భాగములు నలుగెలంకులఁబగలిపోవుటచే ఈ శాసనమునందలి యమూల్యాంశములు గ్రహింప వీలులేకపోయినది. ఇందు వర్ణింపఁబడిన పురవర్ణనముగణపురవర్ణనము కానోపు. ఇది డీగ్రామము చిలుపల్లెగమారి యున్నది.

# గ్రంథ విమర్శనము

## జయంతి

ఇది „రెండు మాసాల కొకసారి వొచ్చే" క్రొత్త పత్రిక. సాలుకొరదా రు-౦-౦లు, సంపాదకులు విశ్వనాథ సత్యనారాయణ గారు. దొరకు చోటు: కొ. రామకోటీశ్వరరావుగారు, బి. ఏ., బి. ఎల్., ఆంధ్రజాతీయ కళాశాల, బందరు, కృష్ణాజిల్లా.

జయంతి ప్రభవ గ్రీష్మర్తు సంచిక (మొదటిది) మా కార్యాలయ మలంకరించినది. ఇది చక్కని ఫెదరు వెయిటు కాగితములమీద ముద్రిత మయినది. ౭౦ పుటలు. „అధునా" అను సంపాదకీయ వ్యాసములో వి. స. గారును, కొ. రా. గారును పత్రికోద్దేశములు వెలువరిచినారు. ఈపత్రికలోని విషయములు రెండు భాగములు. సారస్వత విషయములో భావకవిత్వమునకును, దేశభాషకును, దేశ కవిత్వమునకును దోహద మొసంగ బడును. చారిత్రక విషయములో ఆంధ్రులకు, ఆంధ్రదేశమునకు సంబంధించిన పరిశోధక వ్యాసము లుండును.

ఈ సంచిక యందలి వ్యాసములలో విశ్వనాథ సత్యనారాయణగారి వేగిక్షేత్రమును గూర్చిన పద్యములు హృద్యములై దేశాభిమానమును ప్రజ్వలింప జేయునవి; ఫలశ్రుతి, కలకనిమర, కోకిలమ్మపెళ్లి భావకవిత్వ సంబంధమగు పాటలు; పున్నవ లక్ష్మీనారాయణగారి „సంజయరాయబారము, బెల్లంకొండ రాఘవరావుగారి సీతారామాంజనేయము", విశ్వనాథ వేంకటేశ్వర్లుగారి 'ఎత్తినశిల్పము' ఆంధ్రకవుల ప్రతిభను జాటెడు విమర్శక వ్యాసములు; అడవిబాపిరాజు బి.ఏ. గారి 'కళ ప్రకృత్యనుకరణము' అను వ్యాసము బాపిరాజుగారి చిత్రకళాభిజ్ఞతను జాటుచున్నది. గుడిపాటి వేంకటాచలం బి. ఏ., ఎల్. టి. గారి 'తెనుగునవల' అను సంభాషణము, ఇప్పటి తెనుగు నవలలో అంధపరంపరగా నచ్చుకథా సంవిధానములోని వర్ణనల లోపములు చక్కగా వెల్లడించును. కొ. రామకోటీశ్వరరావుగారి „మురర్తుజానగరు సర్కారు' రాజమహేంద్రవరము సర్కారుఏలబడి", అను వ్యాసములు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారి 'ప్రాచీన రాజ్యపాలనము' చరిత్రాత్మకములు, పరిశోధనాఫలితములు' నూతనాంశ సమన్వితములు మొత్తముమీద పత్రిక భావగ్రాహ్యము. ముద్రణాదికములు నూతన ఫక్కి. పత్రికాదర్శము „జయింతితే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరః" అను భర్తృహరి సూక్తి.

సంపాదకులు వివరించినట్టుల ఈపత్రిక „ఆంధ్రుల సాహిత్య, చారిత్రక, వార్తాశిల్ప, నాటక విషయముల గురించిన్ని, ఆంధ్రులకు ఆంధ్ర భాషకు ఉత్తేజము కలిగించే విషయాలను ప్రకటించుచు, ఆంధ్ర చరిత్రకు ఆధార భూతములైన శాసనాలు, కయిఫీయ్యతులు, వంశ చరిత్రలు, ఏమూలల్లోనో అడగి వున్నవాటిని, కొద్దిమంది పరిశోధకులకు మాత్రమే తెలిసినవాటిని, సామాన్యముగా చదువుకున్న ఆంధ్రు లందరికీ అందుబాటులో నుండేటట్టు ప్రకటించి, భారత భాగవతాలు ఎంత శ్రద్ధగా చదువుతారో, దేశ చరిత్రకూడా అట్లా చదివేటట్టు రుచి కల్పించుచు," చిరకాలము మనగాకమని కోరుచున్నాము.

## పిక్టోరియల్ హైద్రాబాదు

సంపాదకులు: దిట్టకవి జగన్నాథరావుగారు

ప్రకాశకులు: కృష్ణస్వామి ముదిరాజుగారు

చంద్రకాంత ప్రెస్, హైద్రాబాదు.

పై గ్రంథముయొక్క మాదిరిప్రతి మాకార్యాలయము చేరినది. కృతజ్ఞులము.

మాదిరి ప్రతినిబట్టియు, ప్రకాశకుల ప్రయత్నముల బట్టియు చూడ గ్రంథము నాలుగైదు వందల నవీన చిత్రములతోడను, ఆ చిత్రముల క్లుప్త వర్ణనలతోడను, సుందరముగా ముద్రింపబడి వెలువడునని తోచుచున్నది.

ప్రకాశకులగు కృష్ణస్వామి గారును, సంపాదకులగు దిట్టకవి జగన్నాథరావుగారును, హైద్రాబాదు పౌరులకు చిరపరిచితులు. మొదటివారు బాలికా పాఠశాలల స్థాపించి, హిందీ ప్రచారమునందు ప్రతిదినము ప్రయత్నించి విమలకీర్తి పాత్రులైనారు. రెండవవారు, 'హైద్రాబాదు యూథు' అను సచిత్రాంగ్లేయ మాసపత్రికను నిరాఘాటముగా కొంతకాలము వరకు నడిపినారు.

త్వరగా సుభగులును ఇట్టి ఉత్తమ గ్రంథమును ప్రకటించి, అనేక నవీన చిత్రములద్వారా హైద్రాబాదు చరిత్రను దెలుపగలరని విశ్వసించు చున్నాము.

# సంపాదకీయములు

## కళింగ మహాసభ

గడచిన మాసము 16,17 తేదులయందు ముఖలింగమునం దీమహాసభ ఆంధ్ర దేశైతిహాసిక మండలివారి యాజమాన్యమున జయప్రదముగా జరుపబడినది. పలువురు సుప్రసిద్ధాంధ్రులు కళింగులకు సంబంధించిన నూతనాంశములను సభయందు వెల్లడి చేసిరి. వారి వ్యాసములు కళింగ సంచికయందు ప్రచురింప బడును. ఆ మహాసభకధ్యక్షులైన శ్రీ అన్నెము పరశురామ పాత్రోగారు తమ యధ్యక్షోపన్యాసమున కళింగ సామ్రాజ్య చరిత్రను చక్కగను, క్లుప్తముగను విశదపఱచిరి. ఈ మహాసభను సఫలవంతముగా నొనరించిన ఆంధ్ర దేశైతిహాసిక మండలికార్యనిర్వాహకులు మిగుల ప్రశంసార్హులు. వీరి అద్భుత కృషి యింతకు పూర్వము రాజరాజనరేంద్ర పట్టాభిషేక మహా సభ ద్వారా ఆంధ్ర లోకమున కంతకు తెలిసియే యున్నది. పై రెండు మహాసభలవలె నోరుగల్లునందు కూడ కాకతీయుల ప్రతిభను పునరుజ్జీవింపజేయు మహాసభ నొకదానిని చేసినచో తెలంగాణము నందలి యాంధ్రులకు మిక్కిలి ప్రబోధకరముగను, కాకతీయ సామ్రాజ్యమునకు సంబంధించిన చారిత్రకాంశములు ఆంధ్ర ప్రపంచమునకు దెలియుటయు నగును. భాగ్యనగరాంధ్ర పరిశోధక సంఘము వారీ విషయమై తగురీతి నాలోచించి, అనుభవజ్ఞులగు ఆంధ్రదేశైతిహాసికమండలివారి సహాయముతో నట్టి మహాసభను సల్పుటకై సూచించు చున్నాము. త్వరలో నీ యాశయము కార్య రూపము దాల్పగలదని విశ్వసించు చున్నాము. స్థానిక ప్రముఖు లీ విషయమై శ్రద్ధ వహించిన నీసభ సమావేశమగుట కష్టమైన కార్యము కాదు.

## సంఘ సంస్కార మహాసభ

హైద్రాబాదు నం దిదివరకు సంఘ సంస్కారార్థ మెన్నియో సభలు సమావేశమైనవి. కాని గడచిన మాసమున సమావేశమైన సంస్కార మహాసభ హిందువులయందు పుట్టింప గలిగిన యావేశము నే సభయు నిదివరకు పుట్టింప లేక పోయెను. హిందువు లన్ని విధముల అధఃపతితులై పోయిరనియు, వారి సంఘ స్వాతంత్ర్యము తదితర స్వాతంత్ర్యములపై నాధారపడియున్న దనియు, ఆ స్వాతంత్ర్యములను బడసిననే గాని సంఘ స్వాతంత్ర్యము లభించి హిందువులు సర్వతోముఖవృద్ధిని బొందజాలరనియు, ప్రప్రథమున సంఘ స్వాతంత్ర్యమునకు మొదటి సోపానములనదగు నితర స్వాతంత్ర్యమునకై ప్రతి హిందువుడును ప్రయత్నింప వలెననియు శ్రోతల హృదయ పీఠములపై నాహ్వాన సంఘాధ్యక్షులగు శ్రీ బ్యారిస్టరు రామచంద్రనాయకుగారు, ధృడముగా నాటిరి. హిందువుల ఔన్నత్యమునకు ముఖ్య కారకులు బ్రాహ్మణులనియు, వారు తమ విధ్యుక్త ధర్మమును వర్జించి నందుననే హిందూ సంఘమునకు లెక్కలేని యరిష్టములు సంభవించు చున్నవనియు, తిరిగి వారు తమ నిష్కామ కర్మ యోగము నుజ్జీవింప జేయవలెననియు, అద్భుత యోగమే హిందూ సంఘముయొక్క

అపూర్వ ప్రతిభను మరల వెల్లడి చేయగలడ నియు సత్యమును వెల్లడిచేసి సభాధ్యక్షులు రాణిగు ప్రభాదేవి చౌధరాణీ గారు సభకు చక్కని యాదర్శమును చూపించిరి. ఈ మహాసభ ప్రత్యేకత్వము, హిందువులందొక విధమగు విచిత్ర సంచలనము గలిగింపజేసి వారి దుస్థితిని వారికండ్లకు కట్టుటయందు కలదు. ప్రాచ్యుల జీవనము పాశ్చాత్యుల జీవితము వలె వేర్వేరు భాగములుగ విభజించుటకు వీలులేదు. వారి జీవిత సంచలము లన్నియు నొక దానితో మరొకటి త్రెంపులేని సంబంధము కలిగి యున్నవి. ఒక విధమగు సంచలనము మరొక విధమగు సంచలనము యొక్క సహానుభూతి లేనిది వృద్ధి పొందనేరదు. మన దేశపు రాజకీయ పరిస్థితులు, ఆర్థిక పరిస్థితులు, మన సంఘాభివృద్ధి కనేకాంతరాయముల కల్పించు చున్నవి. ఆ యంతరాయముల దొలగించిననేగాని హిందూసంఘము వృద్ధికి రానేరదు. హిందూసంఘ సంస్కారము వితంతూ ద్వాహమో, బ్రహ్మచర్యాశ్రమపునరుద్ధారణమో చేయుటకు వీలు కలిగిన తోడనే పూర్తి కానేరదు. హిందూసంఘ సంస్కారమనిన హిందువుల దృష్టి ప్రకారము హిందూ సంఘముయొక్క సర్వతోముఖ వృద్ధియే. దానిని బడయుటకు హిందువు లని గర్వించు ప్రతి మనుజుడును ప్రయత్నింపవలయును! అప్పుడేయిట్టి సంస్కార సభల యొక్క ఉద్దేశము సమంజసమని తలంప బడును.

## సహకార సంఘ మహాసభ

హైదరాబాదు సహకార సంఘ మహాసభ జూన్ ౧౭-౧౩ తేదులయందు నూతనముగా వాణిజ్య శాఖాధ్యక్షులుగా నియమింప బడిన బి. ఎ. కాలన్స్‌గారి యగ్రాసనాధి పత్యమున జరిగినది. సహకార సంఘోద్యమ మితర దేశములవలె మన దేశమున నింకను పూర్తిగా వ్యాపింపలేదు. ఈ యుద్యమము ముఖ్యముగా బీద జనులకు సంబంధించినది. ప్రజా సామాన్యమునకు తెలియునటుల తత్శాఖాధికారులు ప్రయత్నములు సలుపవలసి యున్నవి. ఇదివరకు వారి ప్రయత్నములు కస్బా (ఎక్కువ జనసంఖ్య గల) గ్రామములను దాటలేదు. కొన్ని గ్రామములందీ యుద్యమమన నేమో ప్రజలకు తెలియనే తెలియదు. బ్రిటిషు యిండియాయందు 'ధాన్యపు సంఘములు', 'ఎరువుల సంఘములు' 'పశువుల సంఘములు' కృషీవలులకు చాల సాయ పడుచున్నవి. రైతులు దివారాత్రములు కృషిసలిపి, పండించిన ధాన్యమును నామమాత్ర ధనమునిచ్చి సాహుకారులు కొల్లగొట్టుకొని పోకుండునటుల నా సంఘములు ప్రయత్నించుచున్నవి. ఇట్టి సంఘము లీరాష్ట్రమున విరివిగా ప్రబల వలెనని సభవారు తీర్మానించి యున్నారు. ఈ తీర్మానమును త్వరలో నమలు నందు బెట్టి మన దేశమునకు ప్రాణమనదగు వ్యవసాయ దారుని విముక్తికై పాటుబడెదరని విశ్వసించు చున్నాము.

## కీ. శే. పువ్వాడ వెంకటప్పయ్యగారు

వీరు నిజాం రాష్ట్రాంధ్రజన కేంద్ర సంఘ ... రాష్ట్రము నందలి పలుతా

వులయందు ప్రబోధము సల్పిన దేశసేవా ధురంధులు; ప్రభుత్వోద్యోగమును ప్రజాసేవకై వర్జించిన త్యాగ శీలురు. వీరు గత మాసము ౧౨వ తేదీనాటి రాత్రి అకస్మాత్తుగా మసూచిక వ్యాధిచే పరలోక గతులైరని దెలుపుటకు చింతిల్లు చున్నాము. నిజాం రాష్ట్రాభ్యుదయమునకై కృషి సలిపిన మహాపురుషులలో వీరిని గణింప వచ్చును. వీ రకాల మృత్యువు నోటబడినందున మన దేశమునకు చెప్పరాని నష్టము వాటిల్లినది. వారి కుటుంబమునకును, దేశీయులకును సంభవించిన పరితాపమును, విధాత యుపశమింప జేసి వారి యాత్మకు శాంతి ప్రసాదించు గాక!

కాళీమోహన ఘోష్

శ్రీయుత కాళీమోహన ఘోష్‌గారు భారత దేశమున జానపదుల క్షేమ యోగముల కొఱకై ప్రయత్నించిన వారిలో ముఖ్యులు.

వారి జానపద సేవ రవీంద్రుని హృదయము నాకర్షించెను. ఇరువదివత్సరముల క్రితము కాళీమోహన ఘోష్‌గారు రవీంద్రుని శాంతి-నికేతనమున ఉపధ్యాయపదవిని స్వీకరించి, పదునేను వత్సరములకు పూర్వము ఇంగ్లండునకు వెళ్లి తిరిగి స్వదేశమునకు వచ్చిన పిదప క్రీ.శ.౧౯౨౨లో ఠాకూరు పరమమిత్రులగు ఎల్మ్ హర్స్ట్ గారితోబాటు గ్రామపునర్నిర్మాణమును గుఱించి ప్రథమమున వంగదేశమునందలి బీరుభూమ్ జిల్లాయందు కృషిసలిపిరి.

రవీంద్రు డీపనియందు చాల శ్రద్ధబూనె నని తెలుపుటకు ఆతని శాంతినికేతనమునందు సలుపుచున్న ప్రయత్నములే నిదర్శనములు. ఆతడు గ్రామ పునర్నిర్మాణార్థ మాదినుండి కృషి సల్పుటయే సాక్షి.

గతమాసమునందు కాళీమోహన ఘోష్ గారు నిజాం ప్రభుత్వము యొక్క ఆహ్వానముపై హైద్రాబాదునకు దయచేసి వివిధ ప్రదేశములందు తమ యనుభవముల ప్రజలకు తెల్పిరి.

నిజాంరాష్ట్రమునందు గ్రామ పునర్నిర్మాణార్థ మెవరును పూనుకొనుట లేదు. విద్యాభ్యాసము పూర్తిచేసిన యువకులు కొందఱీ విషయమై శ్రద్ధబూని జానపదసేవ జేయుదురుగాక!

Edited add Published by P. N. Sarma B. A., Troop BazarHyd, Dn.
Printed by S. Pratapa Reddy B. A. B. L. at the Golakonda Press, Hyderadad.

# విషయసూచిక



" ఊరికావలిచెరువులోఁ
నీరుదెత్తురు నిరతమ్ముగ
పౌరభామలు కడవలఁగ
జారుసందెలు మెఱువఁగ ..

Lakshmi Art, Bombay, 8.

హైదరాబాదు ఆగష్టు ౧౯౨౭

సంపుటము ౧ ప్రభవ సంవత్సర శ్రావణము సంఖ్య ౮

# నలునిపరితాపము

గుళ్లపల్లి నారాయణమూర్తి

యుష్మ దమలానురాగ వర్షోపమాన
రమ్యశారద చంద్రికా రశ్మినేఁడు
దుర్భరవియోగ జడధి నుద్భూతమైన
బాడబానల తీక్ష్ణతఁ బరిణమించె!
ఏ యశుభముహూర్తమున నా హృదయభృంగ
మానఁగ్రోలె నీ ప్రణయ పుష్పామృతమును!

* * * *

నాఁడె లిఖియించె విరహార్తి నలువ నుదుట
నీచముక్తాప్రసూస్థలి వృష్టిపాత
మట్లు ప్రేమవార్తల రాజహంస సల్పె
నస్మదాంగకముల పులకాంకితముగ
నీశ్వరప్రసాదిత రత్న నిర్మితాంగ

శ్రీప్రభావముచే సుందరప్రవేశ
కృత్యము ఫలింపఁగాఁ దిలకించినాఁడ
సిగ్గు మొగులులలో ముఖశీతకిరణు
నంత తచ్చంద్రికల్ మదీయాననమున
మోహరసముచు వెదజల్లి ముగ్ధుఁ జేసె.

అమరులే కృత్రిమ స్వరూపములఁ దాల్చి
స్వీయవరమున నిన్న పేక్షించినారు
సురలనుఁ దిరస్కరించి యా శుష్కజీవి
నీ తిమిరలోక వాసినీ యిహసుఖాభి
లాషి నీ ద్యూతకేళీమనీషిఁ గోరి
నూదితోదారమైతి వీ పేదజీవ
నమున సహధర్మచారిణీత్వము స్ఫురింప,

అపుడు, ఆస్వల్పకాల మా యనని మేష
మైన గాఢ్టింబు వీడి సన్యాసుఃట్లు
కట్టుబట్టలతో గిరిగహ్వరవన
కంటకావృతవిజన దుర్గమభయంక
రప్రదేశములను విహారములు సల్పు
తఱి మహోద్యానమైన కాంతారసీమ
దుర్భరానంతవిరహదోదూయమాన
భంగపూర్ణాబ్ధియై నేఁడు పరిణమించె.
అపుడు, ఆనందగీతల నాలపించి
నాఁడ, నపుడు నా మైశ్వర్య నష్టభావ
ములు నశించె; అపుడు మహా భోగములు తొ
లంగె నపుడు నా యాత్మ నైర్మల్యమొందె;
మాధవీలత నవమధుమాసము నర
సాల తరునమాశ్లిష్టమాలీలనొప్ప
ననులతావేష్టితాలింగనములఁదన్పి
నవనవోత్సాహముల మది నాటి తీవు!

* * * *

కపట చుంబన ద్యూతాది కల్పనముల
నకపట ద్యూత రక్తుల నాశలుడిపి
మన్మనోవ్యథాగాధ తమస్వినలను
చిరు నగవు కాంతులఁ దొలఁగఁ జేసినావు!

* * * *

అప్పుడీ విశ్వమే యనూయత వహించె,
అప్పుడు సన్నిహితులమైన యల్పకాల
మునకె రతిమన్మథులు వేగి పోయినారు,
పత్రభూషణములు రాల్చెఁబ్రకృతి కాంత,

శీతలానిల వీచికా శితకఠోర
విశిఖజాలము నిర్జిత భీరువట్లు
వృక్షగిరిసీమలను విజృంభింప నేర్చె
నాకు నీవయి నీకు నేనై కనఁబడి
నీకు నీవయితి విపుడింక నాకు నేన
నాకు నేనె! ఎవ్వరు లేరు నానేనె!
ఈ మహావిశ్వమున నాదు ప్రేమపుష్ప
సౌరభాఘ్రాణపుణ్యలేశమున కలరు
ప్రాణియే లేదు; ప్రణయసౌరభము లెల్ల
ద్రవమయి ఘనీభంచి చక్రాతివోలె
భారమై నాహృదయమును బట్టిలాగు
అస్మదాశాప్రవాహమీ యంతులేని
చిరవియోగ శీతల వాత భరముచే శి
లాహిమనమూహమయ్యె.........
అస్మ దనివార్యశోకబాష్పాంబువులను
మన్మనోవృతవిక హాభ్రమాలికలు హ
రించి తమలోన నిడియె కోర్కెల కొసంగ
ప్రబల దీర్ఘనిశ్వాస ప్రభంజనాను
రూపమున సాహసోత్సాహ రోషములు క
లంచి కంపించివేయు నీ ప్రకృతినెల్ల
నవలతాచలనోద్భవ నాదమాది
బాష్పఫేనములను జల్లి పరిభవమున
మొండికెత్తిన సాగర మూర్ఛనాద
మైన నాయూర్పురవమున నణఁగిపోవు
చలియు వేడియు సుఖ దుఃఖములును తూర్పి
పాసలు నశించె; కసిదీర ప్రకృతితోడ
నీవనేనా యటం చాజి నిల్చినాఁడ!

# ఉమర్ ఖయ్యామ్

బూర్గుల రామకృష్ణారావు

౧

పాశ్చాత్యుల ప్రశంసకు పాత్రులైన పారసీకవులందరిలో 'ఉమర్ ఖయ్యామ్' కవి యగ్రగణ్యుడని చెప్పవలయును. ప్రాచ్యసారస్వతమునం దభిరుచిగల పాశ్చాత్యులలో 'ఉమర్' కవితా మధువును గ్రోలని వారును 'టాగూర్' కావ్యామృతము నాస్వాదించని వారును మిగుల యరుదు. ఉమరు ఖయ్యాము కావ్యమునకు ఫిట్జ్ జెరాల్డు అను ఆంగ్లేయ కవి చక్కని యనువాదము చేసి యున్నాడు. పారసీ భాషరాని ఆంగ్లేయ విద్యాధికులగు భారతీయులు ఫిట్జిజెరాల్డు యొక్క యనువాద కావ్యమును తరచు చవులూర జదివి యానందింతురు. ఆకావ్యము ననుసరించి శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారు రచించిన 'మధుకలశము' (భారతియందు ప్రకటితమయినది) నుండి చవిజూచినవారు 'ఉమర్' కవితయొక్క ప్రత్యేకసౌందర్యమును గొంతవరకు గమనించి యుండిరి.

'ఉమర్ ఖయ్యాం' కవి పారసీక దేశమునందలి ఖొరాసాన్ ప్రాంతమున చేరియున్న 'నైషాపూర్' పట్టణమందు క్రీ. శ ౧౦౧౫,౧౦౨౦ సంవత్సరముల మధ్యకాలమున జనించె ననియు క్రీ. శ. ౧౧౨౩ కి సరియగు ౫౧౭ హిజరీయందు శతాబ్దము కంటె నెక్కువ వయసున స్వర్గము చేరెననియు దెలియుచున్నది. అతని పేరు 'గియాసుద్దీన్ అబుల్ ఫతహ ఉమర్ బిన్ ఇబ్రాహిమ్ అల్ ఖయ్యామీ.' 'గియాసుద్దీన్' అను పూర్ణ నామమునకు బదులు సంక్షిప్త నామమగు 'ఉమర్' అను పేర నందఱిచే పేర్కొనబడుట గనుచున్నాము. 'ఖయ్యామ్' యను పదమునకు 'గుడారములు నేయువాడు' అని యర్థము. అనేక పారసీకవులకువలె ఈవిశేషణ మాతని పూర్వుల వృత్తిని సూచించుచున్నదని పలువురు విశ్వసించుచున్నారు. ఆదేశపుకవుల చరిత్రమును ఆకాల పరిస్థితులును గనుగొనిన నీ విశ్వాసమునకు బలమైన యాధారములు గలవు. ఈతనియొక్క జీవిత చరితమును, స్వభావగుణ విశేషములను, కవితా సారస్యమును అనుభవించి అందు ప్రతిఫలించిన వ్యక్తియొక్క ప్రతిబింబమును మనోదృష్టిచే జూచియే తెలిసికొనవలయునుగాని జీవితముయొక్క వివరములు దెల్పు చారిత్రకాధారములగు గ్రంథములు పెక్కులేవు. ఐనను సమకాలికులగు కొందఱి గ్రంథములవల్ల 'ఉమర్' చరిత్రము కొంత తెలియుచున్నది.

ఈమహాకవి 'నైషాపురము'నందలి గొప్ప విద్వాంసుడును పండితుడునగు 'ఇమామ్ మువఫఖుద్దీన్' వలన విద్యలనభ్యసించి, తర్కము, వైద్యశాస్త్రము, తత్వశాస్త్రము, గణితము, జ్యోతిష్యమునందు గొప్ప పండితుడుగా బరిగణింపబడుచుండెను. ఇట్లు సకలశాస్త్ర వేత్తయైన ఉమరునకు గణిత జ్యోతిష్యములపై నభిమానము మెండు. సమకాలికులచే గొప్పదైవజ్ఞుడుగను శాస్త్రవేత్తగను పరిగణింపబడి యున్నాడు. 'ఉమర్' యొక్క జీవితమునకు సమకా

లు మధువనియును త్రిప్తిగానునదే అర్థమును సూచించి నాడు. తెనుగు పద్యములో పోల్చి తారతమ్యము గను డు. ఇంకొక పద్యమును గనుడు.

చ॥ కడునరుణమ్ముగా నెచట కస్నెగులాబి జ్వలిం చునచ్చట౯। బడదగు మున్న నీజునృపాలుని రక్తమ టంచునెంతు, నేకడ జవుదోటలో ప్యలిసుగంధపు మ మ్ములు రాలిపోయు, నాకడనొక సుపర సఖి నిగారపు పీడెము రాల యుండెడి౯.

పైపద్యములో ఫారసీ గీతము ననుబట్టి తెనిగించిన క్రిందిపద్యమును బోల్చిచూడుడు!

చ॥ వనముల నెట్టినా కుసుమవాగము కాంతుల నీను చోటుల౯। వెనుకనృపాలరక్తము భువి౯బడిపేర నుమట్టిగాగ; నెమ్మనమున నీలసరజము మాటునదాగిన క్రొత్తయాకును౯। గనుమది కామనిరుచిర గండయుగి౯ గల పుట్టుమచ్చరుయే

ఇట్లే మధుకలశములోని ప్రతి పద్యము నుదాహ రించుచు తెనుగు కవి యాంగ్లకవిననుసరించి కాబోలు గావించిన మార్పులం జూపెట్ట వచ్చును. Fitzgerald యొక్క యనువాదము గాని 'మధు కలశము' గాని కేవల భాషాంతరములు గాక మాతృక లోని భావమును అవసరమైనచో విస్తృతముగా లేక సం కుచితముగా మార్చి కళాపోషణకు దగిన తొడ వులం దొడిగి మనోహరముగ వ్రాయబడి యున్నవి. రస వంతములగు కల్పనలను గావించి రమ్యములగు చిత్రము లను దిద్ది తమ భాషలకుందగిన యలంకారములను దొడిగి 'ఉమర్' గీతములకు వన్నె బెట్టిరి. ఫారసీ భాషయందు సహజ మాధుర్యము గలిగియు 'ఉమర్' గీతము లాంధ్ర పద్యములంత లలితముగా నుండవు. ఆంధ్ర పద్య ములందు వలె 'ఉమర్' నైతిక సందేశములు ఫారస యందు అలంకారములను నాచ్ఛాదనములనుండి తొంగి చూచుట లేదు. విస్పష్టముగాను నిస్సందేహముగాను ఎదుర్కొనును. ప్రతి భాషకు కొన్ని గుణములు దాని వారసత్వమును బట్టి (పూర్వ చరిత్రమును బట్టి) గలు గును. ఫారసీ భాషయందు 'సూఫీ' తెగకు సంబంధించిన భక్తులుగాని సామాన్య కవులుగాని, ఇస్లాం మతమునకు విరుద్ధమైనప్పటికిని, మధువును, పానపాత్రను పాత్రలం దిచ్చు 'సాకీ' మున్నగు విభావ సామగ్రిని పరిత్యజించ లేదు. భక్తి పూరితములగు కావ్యములందును ద్రాక్షా సవమునకు మిక్కిలి గౌరవము గలదు. ఫారసీ భాషయొ క్కయు జాతి యొక్కయు చారిత్రిక వారసత్వ పరిణా మమది.

పై కారణముల వలన 'ఉమర్' పేర్కొన్న మధు వు కేవల ద్రాక్షాసవమా లేక 'అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృత' మా, కామించిన ప్రే యసి కేవల చంచలాక్షియా లేక పరబ్రహ్మమా, యను ప్రశ్న పలువురను బాధించినది. కొందఱు చరిత్రమును బట్టి చూడ 'ఉమర్' సంతోష ప్రియుడనియు, భోగ పరాయణుడనియు, తరుణీలంపటుడనియు దెలియు చున్నది. కావున నతని గీతములు, పాంచ భౌతిక శరీరధారిణియగు స్త్రీకానొక లతాతన్విని గూర్చిన స్మ రింతలు కాని పారలౌకిక వాంఛలచే పీడింపబడిన భ క్తుని ప్రణయ నివేదనములు కావని యభిప్రాయ పడినా రు. మఱికొందరు తత్వజ్ఞానియు సూఫీయు నగు వాకిం ఉమర్ ఖయ్యాం అతి కాంక్షతో వలచిన భోగము కేవల భక్తి పారవశ్యజనితానందాతిరేకమనియు, ద్రావిన మధు వు భగవత్పాదారవింద ధ్యానామృతమనియు, కామిం చిన పరాశక్తి సచ్చిదానంద స్వరూపమగు పరబ్ర హ్మమేయనియు నిరూపించెదరు. నిజమేమో 'ఉమర్' నకును వాని దైవమునకే తెలియును! కాని ఇదమిద్ధమని ఇతర సూఫీ కవుల తెగనుండి బహిష్కరించి ఉమర్ యొక్క ప్ర ణయమును 'యిష్కెహకీకీ' (దైవభక్తి) నుండి యిష్కెమజా జీ (లౌకిక ప్రేమ) లోనికి దిగద్రొక్కుట కాధారములు గనపడవు. అనేక గీతములు ద్వ్యర్థి పరముగానున్నను, కొన్ని గీతములు దైవపరముగాక యర్థమే గావని సకల సమ్మతము. కొన్ని కేవల ఐహిక సంబంధములని గూడ చెప్ప వచ్చును. కాని అంతమాత్రమున 'ఉమర్' ను కొన్ని లేక ఎవ త్య పండితుల వలె చార్వాకీయుడని గాని ఎపిక్యూరియన్ అనిగాని తలంచుట గొప్ప పొరపాటు. శృంగార కవిత్వము యొక్క పరిభాషనుపయో గించుట సూఫీల సుప్రసిద్ధమైన యలవాటు. 'మౌలా నా రూమ్', 'జామీ', 'హాఫిజ్' సర్మద్ సర్మస్తు' మున్నగు సూఫీ మహాకవుల వాఙ్మయమునందు నేటి గీతములందు 'ఉమర్' యొక్క భావములే స్పష్టముగా ధ్వనించును

త్త్వముల వేదాంత తత్త్వముల నప్పటికే సూఫీలు గొంత వర కంగీకరించిరి. యు౦-8. [క్రీ. శ. ౯౩౩ వ సంవత్సరము న మార్చి తేదిన 'అనల్ హక్' (సోహం బ్రహ్మ) యని తపమ్ము తేయు 'మన్సూర్ అల్ హల్లాజు'న కురిశిక్ష విధింప బడియుండె. మన్సూర్ యొక్క తత్త్వము సర్వ స మ్మతము వడయుకున్నను సూఫీ తెగవారు మహమ్మదీయ తరసిద్ధాంతములగు సాంఖ్య సిద్ధాంతములను గ్రీకుల నియోప్లెటానిజం యొక్క తత్త్వములను స్వీకరించిరి. సత్య స్వరూప మజ్ఞేయ మనియు, సర్వాంతర్యామియగు శక్తి నిర్గుణమనియు, జీవుడు కర్మబద్ధుడనియు, జీవితము క్షణభంగురమనియు కావున ప్రేమయే (భక్తియే) ముక్తిసాధన మనియు సూఫీలయుపదేశము. వైరాగ్యముకూడ నొక సాధనముగా నంగీకరించినను జీవిత సామగ్రి నుపయోగించు కొనవలయునని యే వారి యభిప్రాయము. ఐహిక ప్రేమ దైవభక్తికి మార్గదర్శకమని వారి మతము. అందువలనే స్త్రీ పురుషుల భేదము లేకుండ (అనగా ప్రేమింప బడిన వ్యక్తి స్త్రీయైనను గావచ్చును పురుషుడైనను గావచ్చును) ప్రణయములోనికిదిగి శృంగారరసపరిప్లుతములగు గీతములను పాడియున్నారు. అట్లే పారసీకుల పూర్వాభ్యాసమగు మధుసేవయు కవులకు తృప్తి సామగ్రిగను భక్తులకు పారవశ్య చిహ్నముగను ఉపకరించెను. సూఫీకవులందరికీ గుణములు సామాన్యమగునవియే. అట్లైన ఉమర్ను వారలనుండి ప్రత్యేకించు గుణము లెవ్వి? 'ఉమర్' వ్రాసినంత నిష్ఠురముగాను నిర్భయముగను ఇతరులు వ్రాయలేరు. లోక వ్యవహారములను విమర్శించుటెడగాని, లోక శంకాతంక మనస్కుడగు జిజ్ఞాసువు యొక్క ఆత్మీయాందోళనమును వెలిబుచ్చుటెడగాని, తాము నిజమని పరిగ్రహించు తత్త్వముల నుపదేశించుటెడగాని, 'ఉమర్' జూపెట్టు నిశ్చలబుద్ధియు, జంకు లేమియు యితరుల యందు గానము. అందువలనే శక్తివంతముగను పరిణామకరముగను, ఆకర్షకముగను గన్పడును. అందువలననే ఎపిక్యూరియన్ అను పేరునకు పాత్రుడై యశమునో అపయశమునో పొందుచున్నాడు. కాని తాత్త్వికముగా మిక్కిలి భేదము లేదు. "ఉమరు" యొక్క తత్త్వసూత్రములను సోదాహరణముగా వివరించినగాని స్పష్టముగా దెలియదు. ఈ విషయమును గూర్చి యింకొక వ్యాసమున జర్చించెదము.

—••❖••—

# నిరీక్షణము

ఆలపాటి కామేశ్వర రావు (కవి మండలి)

శీతలకిరణకాంతి నతీతముగను
హర్షమలరఁగలానిధి యంబరమునఁ
వెలిగి యిహలోకవీధియం దలరఁజేసెఁ
జల్లగా పిల్లవాయువులెల్ల నుల్ల
సిల్లసిల్లఁగ నెల్లెడ నల్లుకొనియె
"కుహూ! కుహూ!" యని కోయిల కూయుచుండెఁ
బ్రణయ వేదనను భరియింపంగ లేకఁ
బ్రణయకాంతులఁ జేరిరి పడతులెల్ల;
యింతవడవేల వృధ నాచరింతువీవు
కృష్ణ! నీరాకకై నిరీక్షించుచుంటి
రావనన్గావ! దేవ! రాజీవనయన!
అంబునంభవమైన పద్మంబుఁబోలు
భవ్యభవదీయ వదనబింబంబుఁజూచి
నీముజలజాతపత్రనేత్రాదుల, గసి
మోహమనెడి పారావారమున మునింగి
సుందరోద్యానసీమ నానందగరిమ
ఘనతచంద్రశిలావేదికపయినిలిచి
కృష్ణ నీరాకకై నిరీక్షించుచుంటి
రావనన్గావ! దేవ! రాజీవనయన!



# ముమ్తాజు మహల్

[ఏకాంకనాటకము]

జొన్నలగడ్డ వేంకటరాధాకృష్ణయ్య.

## ౧ రంగము ముమ్తాజ్ మహల్

[ప్రదేశము—ఉద్యాన వనము]

[ముమ్తాజ్ చెలికత్తెలు]

ముమ్తాజ్

చెలీ! ఈ వెన్నెల యెంత మనోహరముగ నున్నది. చల్లనిగాలి పుష్ప సౌరభముతో గలిసి వీచుచు ఉల్లమును రంజింప జేయుచున్నది. నా మేనత్త నూర్జహాను జహాంగీరు సార్వభౌమునితో సరస సల్లాపములనాడు చున్నది. మనమేదైన నాట నాడుకొందమా?

చెలి

అవును. ప్రకృతి మనోహరముగ నున్నది. దాగుడు మూతలాడుదము. చెలులారా, రండు. ముందుగ ముమ్తాజ్ కన్నులకు గుడ్డనుకట్టి దాగుకొందము.

చెలికత్తెలు

సరే.

[ముమ్తాతాజ్ కన్నులకు గుడ్డకట్టి అందఱును దాగొనుచున్నారు. ఆమె వెదకుచున్నది. ఒక పొదలో దాగొన్న యిరువురు దొంగలామె నెత్తుకొని పోవుదురు.]

* * *

దొంగ ౧

అన్నా, దూరమున కనబడు చున్నాడొక వ్యక్తి, ఇట్లే వచుచున్నట్లున్నది, అయ్యో!

దొంగ ౨

మనకేమి భయము? మనము యమునా నదీతీరము సమీపించినాము. నావ నెక్కినచో సురక్షితముగ యువరాజు ప్రాసాదము జేరగలము. [నావను సమీపింతురు.]

కరీము

ఓరీ, ఎవరు మీరు? ఆకన్యనేల తీసికొని పోవుచున్నారు?

దొంగలు మౌనము.

కరీము

ఏమి నిర్లక్ష్యము! ఆమెను విడిచెదరా? ద్వంద్వ యుద్ధమునకు సన్నిద్ధులయ్యెదరా?

దొంగలు

నీ వెవడవో ముందుగా తెలుపుము?

కరీము

ఏమి కండకావరము! (కత్తి తీయును)

[దొంగలు పోవుదురు].

కరీము

(ముమ్తాతాజును సమీపించి) పాపము! మూర్ఛబోయినదామె. నీరుచల్లి శైత్యోపచారముల జేయుచుందును. ఆహా! నిక్కముగ నీమె అంతఃపురాంగనయే.

దొంగలు [పునః ప్రవేశము]

మేము యువరాజు తర్వేషు భటులము. మేమామెను తప్పక గొంపోవుదుము. నీవు మమ్మడ్డగొనినచో [illegible] తెలిసినదా?

కరీము

ఏమీ! ఇది యువరాజు పార్వేషు ఆజ్ఞయా? నేను మాను విడువను. యుద్ధమునకు రండు. (కత్తి త్రిప్పును)

దొంగలు [నిష్క్రమింతురు]

కరీము

నేను జహాంగీరు సార్వభౌముని పుత్రుడనని వీరికి తెలియదు, పాపము! కాని, ఆహా! ఈమె సౌందర్య మెంత ఆకర్షణీయముగ నున్నది? కోమలమగు కాయము, విశాలమగు ఫాలరంగము! ఆకర్ణాంతములగు లోచనములు. ఈమె నూర్జహాను సోదరుడగు నాసఫ్ ఖాను కూతురేమో. ఈమెను వివాహము జేసికొనిన ధన్యుడ నగుదును.

ముమ్తాజ్

(లేచి దేరి, కరీమును గాంచి సిగ్గున లేవబోవును. కరీమామె చేయి పట్టు కొనును)

కరీము

సుందరీ! నీవాసఫ్ ఖాను తనూజవా?

ముమ్తాజ్

అవును.

కరీము

నేను కరీముకు, నీవు తెలియదేమో.

ముమ్తాజ్

నాకాసంగతి తెలియును

కరీము

దుష్టులబారినుండి నిన్ను విడిపించినది నేనే.

ముమ్తాజ్

నన్ను కాపాడిన మీ ఋణమెట్లు తీర్తునాయని యోచించు చుంటిని.

కరీము

ఋణమా? నా విధ్యుక్త ధర్మమది. ఆర్తులను రక్షించుట వీరోచితము గదా!

ముమ్తాజ్

వీరోచితమే. అయినను ఫలాపేక్ష కలుగుట సహజము గదా!

కరీము

ప్రతిఫల మొసంగెదవా? ఆట్లయిన.

ముమ్తాజు

అట్లయిన.

కరీము

కోమలీ! నీహృదయములేదా? ఏల వేధించెదవు నన్ను. నీ సుందర వదనమును జూచినది మొదలు హృదయము ప్రేమ పిపాసామయ మగుచున్నది. నిన్నేమని వర్ణింతును? నేను కవి నాదు నేని నీ యశఃపవమాన సౌందర్యమును గూర్చి గీతముల వ్రాసెడివాడను. చిత్రకారుడ నాదు నేని నాహృదయ పటమున చక్కగా చిత్రించియుంచు ను నీప్రతిమ. (ముద్దుపెట్టుకొనును.)

౨ రంగము

ప్రదేశము: పర్వేషుగది

కరీము

అన్నా! పర్వేష్! ఎన్నిమారులు బోధించవలయును? అనాడు మద్యమెప్పుడును సేవింపనని యొట్టు పెట్టుకొంటివి. మరల నీ ప్రక్కనెన్ని మద్య పూరితములగు గాజు గిన్నెలున్నవి.

పార్వేషు

తమ్ముడా! ఎంత ప్రయత్నించినను, నీ యలవాటు విడువజాల కున్నాను. క్రమముగా మానుదును.

కరీము

ఇంకనీవు పరకాంతాసంభోగ మనిన అపరిమితానందము నొందుదువు.

పర్వేషు

నేనేమి చేసితిని?

కరీము

ఏమియు లేదు. అసఫ్ ఖానుకూతురును తీసికొనిరమ్మంటివటకాదా?

పర్వేషు

(అచ్చుబడి) లేదు. లేదు.

కరీము

నీవు నేడో రేపో సింహాసనాసీనుడవు కానున్నావు. ఇట్టి నీచకృత్యములు చేయ న్యాయమా? సరే. నీయిష్టము. [అని వెడలిపోవును] ఇంక నేను ధ్యానమునకు బోవుదునా అమగో. రఘువీరసింగొక ఫకీరుతో యిటువచ్చుచున్నాడు

అసఫ్ ఖాను

తగిన వరు నన్వేషించుచుంటిని కాని ఎచ్చటను, ఎవరును, తగిన వారలు దొరుకుట లేదు.

నూర్జహాను.

శేనా కవాట సంబంధము కుదిర్చితిని, బహుశః అయ్యది నీకును సమ్మతమే యని యెంచెద.

అసఫ్ ఖాను

అమ్మా! ఎవరిని నిర్ణయించితివి?

నూర్జహాను

యువరాజు షర్యేషు. నీ కంగీకారమే నా?

అసఫ్ ఖాను

మహాభాగ్యము. నీయాజ్ఞ శిరసావహింతును. శుభదినమున చిరువురకు పాణిగ్రహణ మహోత్సవ మొనర్చెదను [పోవును]

నూర్జహాను

ఇప్పుడిక డేమి చేయును!

3 రంగము

ప్రదేశము: అగ్రానగర బాహ్య ప్రదేశము,
ప్రవేశము: రఘువీరుడు.

రఘువీరుడు

అహా! కరీము గృహము బోవలెనని బయలుదేరితిని. కాని అన్నియు నపశకునములే. ఈయశుభశకునముల ఫలిత మెట్లుగా పరిణమించునో గదా! అదిగో! అయ్యో! పాపమెవరో యబలను, తుంటరులగు యువకు లేడ్పించుచున్నారు. ఆమెను రక్షించెదను.

[పరుగెత్తును]

దులారి

[ఏడ్చుచు] అయ్యో! నన్ను రక్షింపుడు. అబలను అసహాయను, ఈదుర్మార్గు లేడ్పించుచున్నారు నన్ను. దిక్కెవరు లేకపోవుటచే గొంతెత్తి యేడ్చుచున్నాను.

(రఘువీరుని జూచి వారు పారిపోవుదురు)

రఘువీరుడు

నీ వెవరవు!

దులారి

అయ్యా! నా పేరుదులారి. నేను జహాంగీరు సార్వభౌముని యంతఃపుర కాంతలకు పూలదండల నల్లియిచ్చుచుందును: ఇచటి ఉద్యాన వనములలోనికిబోయి, పుష్పముల దెచ్చుకొనుచుండగా నీదుర్మార్గులు నన్ను సమీపించి వివిధములగు దుర్భాషల నాడుచున్నారు. వారిని పెండ్లియాడవలెనట! ద్రౌపదినట!! వారు పాండవులట!!! మహానుభావుడవు. దేవునివలె వచ్చి కాపాడితివి నన్ను. ప్రత్యుపకృతి యెట్లొనర్తు నాయని యోచించు చున్నాను.

రఘువీరుడు

ఇప్పుడే వచ్చి అంతఃపుర ప్రాసాద పాశ్చాద్వారమున నిలువబడి యుందును నీ కొరకు. వచ్చెదవా, ఖచించెదవా?

దులారీ

సరే. (పోవును)

(రఘువీరుడు కరీము ప్రాసాదమును సమీపించును)

భటుడు

నీ వెవరవు?

రఘువీరుడు

నేనా? రఘువీర సింహుడను. యువరాజు కరీముని కంగరక్షకుడను. లోనికి బోవుటకు నాకు హక్కు లేదా!

భటుడు

లేదు.

రఘువీరుడు

వెళ్లెదను

భటుడు

తన్నెదను.

(కొట్టబోవును. రఘువీరుడు కత్తి త్రిప్పును, చివరకోడిపోవును. బంధింప బడును.)

(లోనుండి) కరీము

అయ్యో! మిత్రుడా! నన్ను చూడవచ్చి శిక్షింపబడు చుంటివా? దుర్భరము. అయ్యో!

దులారీ (ప్రవేశించి)

అయ్యో! ఇదేమి! నా ప్రాణదాత కరచరణములు బంధింపబడి యున్నవి. [వారిని సమీపించి] అయ్యా! ఇతని నేల బంధించిరి.

భటుడు

ఓహో! ప్యారీ రమ్మ నీవా? నన్ను పెండ్లాడెదవా?

దులారీ

ఇతని విడిచి పుచ్చెదవా?

భటుడు

ఇతడు నీ కేమగును దులారీ!

దులారీ

శత్రువుల బారినుండి అతడు నన్ను రక్షించెను. నాపై ప్రేమయుండెనేని నాకోరకాతని విడువుము.

భటుడు

అట్లయిన నాకోరిక దీర్తువా?

దులారీ

ఏకాలకి?

భటుడు

మొదటిది వివాహము జేసికొనుట, రెండవది ఇపుడొకముద్దిచ్చుట

దులారీ

ఉహూ!

భటుడు

కరమునర్పింతును

దులారీ

సరే

[రఘువీరుడు విడువబడును]

దులారీ

ఓయీ! రహీము! ఈతడు యువరాజు. కరీమును జూడ నభిలషించి యిచ్చటికి వచ్చియున్నాడు. ఒకమారు మాటాడనిమ్ము.

భటుడు

అట్లొనర్చినచో ప్రతిఫలమేమి యొసంగెదవు?

దులారీ

[మెల్లగా]ముద్దు

భటుడు

ఎప్పుడు?

దులారీ

సాయంకాలము

భటుడు

సరే! రఘువీరా! నీవు త్వరగ తిరిగిరమ్ము. ఇయ్యది రాణి చూచినచో మోసము వాటిల్లును

[రఘువీరుడు లోనికేగి కరీమును గాగిలించుకొనును]

కరీము

మిత్రుడా! గాయములు తగిలెనా?

రఘువీరుడు

లేదు. కాని నీవేల యిట్లు బంధింపబడితివి?

కరీము

ప్రేమకొరకు. నాప్రణయిని ముమ్తాజును నేను బరిగ్రహింప నూర్జహాను సమ్మతించుటలేదు, వికృత వదనయగు ఖుస్రూ ఉన్నిసాను బెండ్లి యాడవలయునట.

రఘువీరుడు

పాపము! ఆమె నిన్ను వరించినదా?

కరీము

నిజముగా నన్నామె ప్రేమైక దృష్టులతో జలకించినది. మనస్ఫూర్తిగ నన్ను ప్రేమించినది.

రఘువీరుడు

సరే. నేనేమైన చేయవలసియున్నచో చెప్పుము. త్వరగ పోవలయును. ఆలసించిన అపద కలుగునేమో.

కరీము

విరహానలమ్మునబడి క్రుస్సుచున్న నాయీలేఖ నెట్లయిన నా ప్రేయసికి నందజేయుము. ఆమె నీరేయినంత పురోద్యానమున నుండుమని వ్రాసితిని. నీవింక నరుగవచ్చును

[రఘువీరుడు వెడలిపోయి దులారీ కీయుదంతము సాంతముగ నెఱిగించి లేఖ నిచ్చి "సాయంత్రములోపుల జవాబు తీసికొని రావలయు"నని చెప్పి వెడలిపోవును]

* * * * *

[ఆసఫ్ఖాను ప్రాసాదమున నొక గదిలో ముమ్తాజ్ శయ్యపైబడి యుండును. వ్యాధి పీడితయగు నామె పర్యంకముచుట్టును తలిదండ్రాదులు గూర్చుని యుందురు]

ఆసఫ్ఖాను

దైవమా! ఏమిగతి! మహావైభవమున నాతనూజను షార్యేషునకిచ్చి వివాహమొనర్ప సంకల్పించుకొని యుంటిని. కాని యింతలోనే, యీమె రోగపీడిత కావలెనా? అయ్యో! ఎందరు వైద్యులెన్ని మందులిచ్చినను గూడ నివారణమగుటలేదీమెబాధ

ముమ్తాజ్

అయ్యో! అయ్యో! ఊ! ఊ! ఊ!

ఆసఫ్ఖాను

అమ్మా! ఏమి?

ముమ్తాజ్

అయ్యో! నన్ను అగ్నిచే కాల్చివేయుచున్నట్లున్నది. అబ్బా, దుర్భరము.

[దులారీ ప్రవేశించును.]

ఆసఫ్ఖాను

దులారీ! మాముమ్తాజ్ దుర్భరమగు దుఃఖమును బొందుచున్నది రోగమాయున్న నేవ్యాధియు కాదని వైద్యులు వచించుచున్నారు. నీవుసరసముగ సంభాషింతువు. ఏది! నీచమత్కృతులచే నామె నానందపఱచేయుము.

ప్రేయసీ! ఇచట చాల యుడుకుగ నున్నది. రమ్ము ఉద్యానవనములోనికేగి లతామంటపముపై నొకపరి విశ్రమింతము.

[పోవుదురు]

దులారీ

అమ్మా! ముమ్తాజ్

ముమ్తాజ్

ఛీ!

దులారీ

అమ్మా. ముమ్తాజ్

ముమ్తాజ్

ఛో.

దులారీ

అంతకోపమా తల్లీ

ముమ్తాజ్

అయ్యో. నీవు వెళ్లిపొమ్మ

దులారీ

ఈ నీవిచాగము తెయు నెందులకో నే నెరుగుదును సుమా.

ముమ్తాజ్

పొమ్మ. పొమ్మ.

దులారీ

నన్ను నమ్మవా

ముమ్తాజ్

ఊహుం.

దులారీ

నా కెందుకమ్మా. ఇవిగో పూవులు. ఇదిగో ఉత్తరము. యువరాజే కరీమిచ్చెను.

[పోబోవును]

[లేచి ససంభ్రమముగ] దులారీ. ఆగుము. ఇదిగో రత్నహారము,

దులారీ

ఇపుడును నీవ్యాధి తగ్గినదా?

ముమ్తాజ్

సంపూర్ణముగ నంతరించినది. కాని దులారీ. కూర్చుండుము. కరీము బంధింపబడెనని వింటిని. ఇది నిజమా?

దులారీ

అవును. అదినిజమే. అతడు నీకంటె వేయిరెట్లు విచార మనుభవించుచున్నాడు. అతని జూచిన జాలికలుగును. ప్రస్తుత కర్తవ్య మాలోచించుటకే నిన్నటకు రమ్మనెను.

ముమ్తాజ్

సరే. ఇంకనీవు పోవచ్చును. చెలీ. ప్రాణనాథునికోర్కె నిరాకరింతునా? ఇంతదనుక నాహృదయమేలాకో ఉద్విగ్నమయి యున్నది. కుదుట బడినదిపుడు సరే. తప్పక వచటికే తెంతునని చెప్పుము.

[దులారీ నిష్క్రమించును]

ఆహా. నాజీవితేశ్వరుని సౌందర్య మద్వితీయము. అవిశాల సుందర లలాటము—ప్రకాశమాన నేత్రము—ధృఢకాయము మధుర సంభాషణ—ఇవి యన్నియు నాహృదయమును ప్రణయరసరంజితము గావించినవి. అతని కొరకు ప్రాణమైనత్యజింతును. తల్లి దండ్రులనైన విడిచి, యతనివెంట నెట్టిదుర్గమ ప్రదేశములకైన యరుగుదును.

అదిగో! భాను డస్తమించు చున్నాడు. ఆకసము నీలమేఘావృతమగుచున్నది. ఇక నేను సుందరముగ నలంకరించుకొని ప్రియునికొరకుద్యాన వనమున వేచియుండెద.

*  *  *  *  *

౪ రంగము

ప్రదేశము: కరీము ప్రాసాదము

నూర్జహాను

కరీం! నీతలంపేమైనది.

కరీం

అదియెన్నటికిని చలింపదు. నేను స్థిరచిత్తుడను. నాహృదయము పర్వతమువలె గంభీరము. అచలము.

నూర్జహాను

హసన్‌ను వివాహము జేసికొనవా?

కరీము

ఈ జన్మమునగాదు.

నూర్జహాను

సరే! భటులారా? ఇతని నిచటనుండి తీసికొనిపోయి కారాగృహమున బంధించుడు.

[వెడలిపోవును]

*  *  *

రఘువీరుడు

ఆకాశము నల్లని మబ్బులతో నిండియున్నది. ఝంఝూ మారుతము వీచుచున్నది యమునానది ప్రణయవేగమున ప్రవహించుచున్నది. ప్రకృతి భయంకరముగనున్నది.

కరీము కారాగారమున బంధింపబడినాడు. ఇట్టి సమయమున గూడ నాహృదయము మాత్రము స్వస్థముయియే యున్నది. అతని విడిపింపవలయును. ఇచటనేగదా భీమసింగాదు లుండవలెనని. తేరే. ఎందువలన వారిటకు రాలేదు చెప్పుమా?

ఇది నిశీథ సమయము. కరీము కారాగార విముక్తుడగుట కిదియే తగినతరుణము. అదుగో! భీమసింగాదులు దెంచుచున్నారు. వెనుక వైపునుండిగూడ హాహాపోష వినంబడుచున్న దేమి? (పరికించి) పాపము! దులారీవచ్చుచున్నది.

భీమసింగు

రఘువీర! రెండు వందలమంది సైనికులు, యిచటికొక మైలు దూరమున నున్నారు. ఎంత కష్టపడియైన

కరీమును నేను తప్పింపవలయును. నిజముగా నీవు పంపి నరాజసీహుని ఉదయమున తెలిపినాను కనుకనే యిచటకు వచ్చితిని. లేనిచో వేట కేగియుందును.

దులారీ

అయ్యో! ఏమి సెలవు?

రఘువీరుడు

ఏవేళ వచ్చితివి?

దులారీ

పరిస్థితులను గమనించి సలహా కొరకిటకే తెంచితిని వెళ్లిపోదునా?

రఘువీరుడు

దులారీ ఇంతలోనే కోపమా? కరీమేమి చేయుచున్నాడు.

దులారీ

కారాగృహములో నున్నాడు. కునుకుచున్న కావలివానిజంపి కరీమును విడిపింపరాదా.

రఘువీరుడు

ఇంతులను దగిన ధైర్యవతివి, నీవే. త్వరితముగ బోయి యీపని చేయుము.

[దులారీ వెడలిపోవును]

[కారాగృహద్వార సమీపమున గునుకుచున్న వానిని కత్తిలోబొడిచి కరీమును దులారీ విడపించును]

కరీము

భయంకరదృశ్యము. అయ్యయ్యో. ఘోరహత్య యా. నా ప్రాణ రక్షణకొరకొక ప్రాణము నష్టమయ్యెనా. రక్తపాతము—రక్తస్రావము—భయంకరము—అయ్యో దులారీ. అశ్వము.

దులారీ

నేను పోయెదను. అదిగో యశ్వము యమునానదీ తీరమున రఘువీరుడు భీమసింగు మున్నగువారు తమకై వేచియున్నారు.

కరీము

సరే. [అశ్వమారోహించును]

౪ రంగము

[యమునానదీ తీరమున భీమసింగు మున్నగువారుందురు.]

కరీము

ఓహో. దులారీ చెప్పగా వింటిని. భీమసింగు సర్దారుడై నన్ను రక్షించుట కరుదెంచెనా, ఏమి సౌభాగ్యము. మిత్రుడా. నేనేమి చేయవలయును?

భీమసింగు

ఉదయపురమున కేగుదము. కాని నీవు నదినిదాటి రఘువీరునితో జయపుర మార్గము ననుసరించి యేగుచుండుము. మేము నగరమునుజుట్టి మరొక మార్గమున వచ్చి మిమ్ము పదిమైళ్ల దూరములో గలిసి కొందుము. నీవు వేగముగ బోవలయును. ఆలసించిన మన ప్రయత్నములు విఫలములగును. అంతే మన హృదయములు భగ్నములగును.

కరీము

సరే, కాని నేనెందులకిట్లు దేశాంతర గతుడగుచున్నానో, నీకు తెలిసియే యుండును,

భీమసింగు

ఎందులకు మిత్రమా? ముమ్తాజ్ కొరకా?

కరీము

అవును. ముఖ్యముగా నామెకొరకే. ఆమెలేని నాజీవితము వృధ. ఆదుచే నేనామెను తృటికాలమున దీసికొని వచ్చెదను. మీరుపొండు.

భీమసింగు

ఆలసించెదవు సుమీ. ప్రమాదము సంభవింపగలదు.

కరీము

అణుమాత్రమైన ఆలసింపను. [పురాభిముఖుడై, అసఫ్‌ఖాను ప్రాసాదమును జేరి కిటికీలోనుండి తొంగి చూచును]

అహా! నామనోహారి నిద్రించుచున్నది. నిద్రాభంగ మొనర్తునా? (లేపును.)

ముమ్తాజ్

[లేచి] ఇదేమి! ఈ యర్ధరాత్రమున మీకు భయములేదా నాథా! మీ మోము స్వేదచే నిండియున్నది.

కరీము

ప్రేయసీ! సరస సంభాషణ కిదిసమయముగాదు. ఈ నగరమున నే నుండినచో, రెండుమూడు దినములలో, నాగ్రహావేశాయత్తచిత్తయగు నూర్జహాను నన్ను కఠోరశిక్ష పాల్జేయును. స్వప్రాణ రక్షణార్థ ముదయపురమునకు పలాయితుడ నగుచుంటిని.

నీవు నాతో రావలయును. సఖీ! నాపై నీకు ప్రేమయున్నచో. నాకొరకు నాప్రాణముల కొరకు నీమాతాపితృల ద్యజింపుము. కొలది కాలములో మన మిచ్చటికి మరల రాగలము.

ముమ్తాజ్

నాథా. ఇది నిజమా లేక పరిహాసార్థమిట్లు పలుకుచున్నారా.

కరీము

ప్రేయసీ. నాపలుకుల విశ్వసింపుము. వేగముగ ప్రయాణ సన్నిద్ధవుకమ్ము. నీవురా నిరాకరింతువా? నేను ప్రయాణము మానుదును. నూర్జహాను ఆగ్రహానలమున కింధనము నగుదును.

ముంతాజ్

అయ్యో. ఎంతమాట జీవితేశ్వరా. అదుగో. నాతల్లి యిటు వచ్చుచున్నది. మీరెటనైన దాగొనుడు.

కరీము

ఎచట.

ముమ్తాజ్

ఈ మంచముక్రింద

[కరీమట్లు చేయును. ముమ్తాజ్ జనని వచ్చి] దొంగ. మంచముక్రింద దొంగ. కరీం. ఇవతలకురమ్ము

కరీము

అత్తా. వందనము.

ముమ్తాజ్

చాటుననుండి మీ సంభాషణ వినుచుంటిని. మొన్నటి రేయి మిమ్మిరువుర నుద్యానవనమున గాంచితిని. ఏమియు ననలేదామెను. అనినచో దుఃఖించునని సంశయించితిని.

చంచల చిత్తులగు రాజపుత్రుల ప్రేమ బుద్బుదము వంటిది. సౌందర్యతృష్ణ నపశమింప జేసికొనుటకై వారు తాము వలచిన సుందరీ మణులతో సంభాషించుచు నమృత మొలికింతురు. అట్లే నీ ప్రేమయు నని శంకించితిని. కాని యిపుడు మీరిరువురు ప్రగాఢ ప్రణయ పాశబద్ధులని గ్రహించితిని. ఇపుడే మీ కిరువురకు వివాహము చేయుదును. ఒకగంట యాలస్యము. ఇట్లు జరుగునని యూహించితేని యిట్లొనర్చితిని.

* * * * *

నూర్జహాను

సోదరా. ఆసఫ్ ఖాన్.

ఆసఫ్ ఖాను

బంధింపబడిన కరీము కనంబడడు. కారాగార ద్వార మున్ముక్తమయి యున్నది. కావలిగాయు భటుడు దారుణహత్య గావింప బడి యుండెను. ముమ్తాజ్ యెచట?

ఆసఫ్ ఖాను

ప్రేయసీ. ఒక్కమాటకు విచ్చేయుము.

[లోనుండి]

కరీము ముమ్తాజ్‌ని తీసికొని పోయినాడు. నిశీధ సమయము. అందరము నిద్రించు చుంటిమి. ఇట్లని పరిచారకుడు తెలుపు చున్నాడు.

నూర్జహాను

ఇదంతయు కుట్రవిష పరిణామము. గులాం. భటులను నలువైపుల కంపుము ముమ్తాజ్‌ల బంధింప బంపుము.

* * * * *

కరీము

ప్రేయసీ. ఎంతగా నలసిపోతిమి? దాహ బాధకు తాళజాలక అశ్వము మరణించినది. అయ్యో! నీవు నడువజాలకున్నావు గదా.

ముమ్తాజ్

నాథా. దాహమగుచున్నది. పిపాసాబాధ దుర్భరముగనున్నది. కంటకములు గ్రుచ్చుకొనుచున్నవి. ముందనకు నడువజాలను.

కరీము

అదిగో. తటాకమట గన్పించుచున్నది. రమ్ము. ఓర్పుతో నీ కష్టముల సహించుము. త్వరలో శుభదినములు

[వారు చెరువును సమీపించిరి త్రాగుదురు]

ముమ్తాజ్

అయ్యో. నాథా. శత్రువులు—మనకింక తెరువేయ్యది?

కరీము.

[నిశ్చేష్టుడై] ఏమీ. సరే. రానిమ్ము. మనము పోరిపోజాలము.

[శత్రువులు సమీపింతురు. కరీము కత్తి త్రిప్పును. పోరు ఘోరముగ జరుగును. కరీము రక్తసిక్తాంగుడగును. దూరముననున్న భీమసింగాదులగాంచి శరవేగమున హయములపై వచ్చి శత్రువుల నెదుర్కొందురు. నూర్జహాను సైనికు లోబడిపోవుదురు. గాని భీమసింగనకుప్రద్రవ గాయములు తగులును. శిబిరమును నిర్మించి శయ్యపై భీమసింగును బరుండబెట్టి వివిధోపచారముల సల్పుదురు.

కరీము

అయ్యో, మిత్రమా. నాకొరకు నీ వెంత ఘోరముగ పోరితివి. నా సోదరుడగు మహారాజా కర్ణాసింగునకు గబురంపితిమి. అతడు వచ్చియున్నాడు.

భీమసింగు

ఎపుడు?

కరీము

ఇపుడే.

కర్ణాసింగు

[ప్రవేశించి] తమ్ముడా! ఏవి గాయములు అయ్యో! [ఏడ్చును.]



కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారు

చంద్రకాంత ప్రెస్.



సహస్ర స్తంభ దేవాలయ స్తంభమండలి
ఒక విగ్రహము హనుమకొండ



రామప్ప దేవాలయ స్తంభమండలి
ఒక విగ్రహము

భీమసింగు

సోదరా! విలపింపకుము. పలుకుల నాలకింపుము. గాయముల బాధ దుస్సహముగ నున్నది. కొలది నిముసము లో నేను మరణింతును. మనసహాయము కుద్ధరించి వచ్చిన కరీమును గౌరవించి కాపాడుము. ఇతని రక్షింప ప్రాణ ములైన నవసరము వచ్చిన నో సమర్పింపుము. హిందూ మహమ్మదీయ కలహము లంతరించు ప్రయత్నముల నొన ర్పుము. వారితో యుద్ధముల జేయకుము. హిందూ మహ మ్మదీయ సఖ్యతయే నాశేష జీవిత పరమావధిగ దలం చుము. నాకొరకు చింతింపకుము. నేను స్నేహార్థము ప్రాణమర్పించితిని. వీర స్వర్గము లభించుకతన నిశ్చింతు డనై మరణింతును. అయ్యో. దుస్సహము. అయ్యో...

[మరణించును]

## ౬ రంగము

జహాంగీరు

సఖీ, నూర్జహాను. కరీము విప్లవకారుడైనాడను ఏదం తి ప్రబలముగ వ్యాపించి యున్నది. పార్వేషును బంపవ లయును, విప్లవము వణచివేయుటకు. కాని నిర్భాగ్యుడు వాడెప్పుడు సురాపానము—నారీలీలామృత అధరామృత పానము—చేయుచుండును.

నూర్జహాను

అట్లే తప్పక పంపవలయును. ఓరి, గులాం పా ర్వేషుని పిలువుము.

పార్వేషు

[వచ్చి] ఏమి?

నూర్జహాను

కరీము విప్లవకారుడైనాడు. తెలిసినదా? విప్లవో ద్యమము నణచి వేయుటకై ఉదయపురమునకు బో వలయును.

పార్వేషు

పానము

జహాంగీరు

పార్వేషు

ప్రభూ. చిత్తము. అట్లే చేయుదును.

[పోవుచు ఓరి గులాం. సారాసీసాలు—పానపాత్రలు—మరచి నావో—జాగ్రత్త.

* * * * *

ఉదయపురమున కరీము—ముమ్తాజ్

కరీము

ముమ్తాజ్, కర్ణసింగు చాలమంచివాడు.

ముమ్తాజ్

అతని యాదరాభిమానము లనుపమానములు.

గులాం వచ్చును.

కరీము

ఏమిరా.

గులాము

ప్రభూ, పార్వేషుని జంపితిని. అతడిచ్చటికి పది మైళ్ల దూరములో నుండెను. నేను స్త్రీనని సురాపాన మైకమున గాగిలించి కొనెను. మీరు సింహాసనా రూఢు లగుట కేయభ్యంతరము నుండదని, అతని వధించితిని.

కరీము

ఓరి నిర్భాగ్యుడా. ఎట్టి ఘోరకృత్య మాచరిం చితివి. [ఏడ్చును.]

* * * * *

కరీము

పదునైదు వత్సరము లైన దిటకరుదెంచిరి. ఎప్ప టికపుడు క్షేమ సమాచారముల దెలిసికొను చున్నను వృద్ధ జనకుని చూడవలయునని యున్నది. నాదక్షిణ నేత్ర మదరుచున్న దేమి చెపుమా.

[అనవిలసుండెమంత్రులు, సైనికులు, ప్రజలు ప్రవేశింతురు.]

మంత్రి

యువరాజా, వందనము. రాజ్య మరాజకముగ నున్నది. మీ జనకుడు దివంగతుడు—

కరీము

అయ్యో. [మూర్ఛిల్లి నేల దేలును]

మంత్రి

నూర్జహాను పాలన మెవరికి నంగీకారముగా లేదు.

కరీము

సరే.

౭ రంగము.

ప్రదేశము: ఆగ్రానగరము: ప్రవేశము

కరీము

నేను సింహాసనాసీనుడనయిన నాడే నూర్జహాను చనిపోయినది. నాటినుండియు, సుఖముగ గడపినాము, నాలనయులు, ముమ్తాజు నేను. కాని పాపమిపుడామె వ్యాధి గ్రస్తయై యున్నది. ఆమె జీవించునా? దైవమా. నాసుఖ మప్పుడే యంతరించునునా? ఆమెను మరల చూచెదగాక! వైద్యుల ముఖములు మాత్రము తెల్లనై యున్నవి.

భటుడు ప్రవేశించి

ప్రభూ.

కరీము

ముమ్తాజ్ ప్రాణము పోయినదా యేమి?

భటుడు

చిత్తము.

కరీము

అయ్యో. [మూర్ఛిల్లును]

*       *       *       *       *

కరీము

ఆమె స్మారక చిహ్నముగ ప్రపంచమంతయు మెచ్చు టను లేని దివ్యసౌధము నిర్మించి ఆమె పేర ముమ్తాజ్ మహాల్ అని నామమిడుదును. ఆమె కోరిక ప్రకారము మరియొక వివాహము జేసికొనను. ప్రియావియోగసం జనితసంతాపానలమునబడి క్రుగ్గి క్రుగ్గి కుడక నశింతునుగాక. అపుడు నాయాత్మకు శాంతి కలుగు నేమో. అయ్యో!

# సంతృప్తి

### శ్రీ శేషాద్రి రమణకవులు

గీ. పలుకుపలుకున దేనియ లొలుకుచుండు
తెలుఁగుభాష కవిత్వంపుఁ దీయములను
నేకతంబునఁ జవిజూచి యేనె మిగుల
ధన్యుఁడ నటంచు నెమ్మదిఁ దలఁచికొందు.

గీ. పదము భావంబు సమముగాఁ బదిలపఱచి
భావగీతంబులనువ్రాయు బాలకవుల
యనుపమ మనోజ్ఞ నవకవితామృతంబు
గ్రోలు నామోదమునకును గొలఁదిగలదె!

గీ. బాసకై యెన్నొ కడగండ్లుపడి మొగంబు
చిఱునగవు చిల్కఁగా మాతృసేవఁజేయు
సోదరాంధ్రులు మిగటమి జూచునపుడు
నే ననుభవించు ముదమున కౌన గలదె.

గీ. మతము సంఘంబు నధికార రతియుఁ గలసి
సమముగాఁదమ్ముఁగూల్చిన జాలిబడక
మాతృసేవకుఁబరతెంచు మాలవాంధ్ర
పొలుపుగన నింత యనరాని మోదమబ్బు.

గీ. మాతృదాస్యంబుఁ దొలగింప మది దలంచి
కార్యరంగంబుఁ జేరి త్యాగంబుసలుపు
ఆంధ్రయువకుఁ నెమ్మోము లరయునపుడు
నేను ధన్యుండ ననుకొందు నెమ్మనమున.

# కొ. వే. లక్ష్మణరావుగారు

## వారి ఆంధ్ర రచన

(ఒకరు)

ఆధుని కాంధ్రవాఙ్మయమును నిర్మించిన మహాశయులలో కీ. శే. రావు బహద్దరు వీరేశలింగము పంతులుగారి తరువాత స్మరింప దగినవారిలో కీ. శే. కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు ముఖ్యులని చెప్పినచో నందతిశయోక్తియుండజాలదు.

వీరు ఆంధ్ర వాఙ్మయ సేవ నారంభించిన కాలమున విశ్వవిద్యాలయపట్టభద్రులలో మాతృభాషాసేవయందుత్సాహము కలవారు అరుదుగ నుండిరి. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి యుద్యమమింకను ఆంధ్రదేశ రంగమున నవతరించి యుండలేదు. ఆంధ్ర పత్రికా సంవత్సరాది సంచికలలోని వ్యాసములకు కర్తలగు పట్టభద్రులు అప్పటి కింకను ఆంధ్ర భాషయందు అభిమానము చూపుచుండలేదు. అట్టి కాలమున, విశ్వవిద్యాలయమున ఎం. ఏ. పట్టమును బొంది, బంగాళీ, హిందీ, సంస్కృత మహారాష్ట్రాది బహుభాషాకోవిదుడగు నీయాంధ్రసాహిత్యకుని కీర్తి చంద్రికలు మధ్య పరగణాలలోని నాగపురమునుండి మాతృదేశమగు ఆంధ్రభూమిపైన బ్రసరింపసాగెను. పిమ్మట నీ మహాశయుని కార్యరంగము ఆంధ్రదేశమునకు మారెను. తరువాత సుమారు ౨౦ సంవత్సరములవరకు ఈతని సారస్వతజీవనమునకు విజ్ఞానచంద్రికయు విజ్ఞానసర్వస్వమును అజరామరములగు సాక్ష్యములై యొప్పారుచున్నవి.

ఆంధ్ర దేశమున వేలకొలది పట్టభద్రులుండ, ఈ నవీనవాఙ్మయనిర్మాత మహారాష్ట్రదేశములోని నాగపురము నుండి దిగుట ఎట్లు సంభవించినది? ఈ ప్రశ్నకు ఉత్తరము ఇచ్చుటకు పలుసాధనములును లభించినవి. మన లక్ష్మణరావుగారు తమ మొట్టమొదటి ఆంధ్రరచనయగు "శ్రీ శివాజీ చరిత్రము"ను రచించుటకు మున్దే మహారాష్ట్ర వాఙ్మయమున సత్కీర్తి గడించియుండెను. విఖ్యాత మహారాష్ట్ర కవిశేఖరుడగు, మోరోపంతు కృత కర్ణపర్వమును వ్యాఖ్యాన సహితముగ ప్రకటించెను. కావ్యమాలా ప్రచురణ కర్తలలోని యుత్తమ లేఖకులలో నొక్కడుగా యశము గడించియుండెను. రామాయణీయ "పంచవటి" ప్రదేశము "నాసిక్" యందుండెనా, భద్రాచలము కడనుండెనా యను చారిత్రక వాఙ్మయ విషయిక చర్చయందు కొమ్ములు తిరిగిన మహారాష్ట్రపండితులతో, లోకమాన్య బాలగంగాధరతిలకు మున్నగు వారితో వాద వివాదములు సలిపియుండెను. ఈ విధముగ తెనుగు మాతృభాషగాగల మన లక్ష్మణరావు మహారాష్ట్ర దేశమున, మహారాష్ట్రవాఙ్మయమున ఉత్తమ లేఖకుడుగ, విమర్శకుడుగ, పరిశోధకుడుగ, ప్రఖ్యాతివహించిమాతృభాషా సేవకుపలయు అవకాశమును పొంది, ముందు రానున్న తన ఆంధ్ర సారస్వత జీవనమునకు సంసిద్ధత నొంది యుండెను.

ఆకాలముననే దేశభాషావాఙ్మయములలో తల యెత్తియుండిన మహారాష్ట్రభాషను గూర్చియు, లోకమాన్యునివంటి సత్పుత్రుల బడసిన మహా రాష్ట్రదేశమును గూర్చియు మన లక్ష్మణరావునకు పూజ్యభావ ముండుట అబ్బురము కాదు. ,,బంగాళీభాషతో సమానముగా పర దేశములో నభివృద్ధి పొందుచున్న రెండవభాష మహారాష్ట్రము......'' అను వాక్యమును, (౧) ,,ఇటుల రెండవ (రెండవ పులకేశి యొక్క) మరాటీ సైన్యములు తమ స్వాతంత్ర్యమును రక్షించుకొనిరి. ఈ మరాట వారిప్పుడును ఇట్టి పట్టుదలయు స్వదేశాభిమానము గలవారు. హిందూదేశ మంతయు గెలిచిన ఔరంగజేబు చక్రవర్తి మరాటా రాజగు శ్రీ శివాజీని గెలువలేక పోయెనని చదువరులు ముందు చూడగలరు''(౨) అనువాక్యములను పైన నుల్లేఖించియున్న యాంశములను రుజావు బరుపగలవు.

లక్ష్మణరావునకు మహా రాష్ట్ర వాఙ్మయమును గూర్చియు, మహారాష్ట్రులను గూర్చియు గల యభిమానము రావుగారి రచన లందెట్లు చిహ్నితమగుచున్నదో సులభముగనే కానవచ్చును. ఆంధ్రమున వారు మొట్ట మొదట రచించిన గ్రంథము ,,శ్రీ శివాజీ చరిత్రము''. హిందూదేశ కథా సంగ్రహమను పేర నారంభించిన భారత వర్ష చరిత్రయందు, సాధారణముగ వాడుకయందున్న మూడు (హిందూ మహమ్మదీయ బ్రిటిషు) మహాయుగముల చరిత్రను మూడు గ్రంథములుగ వ్రాయుదలపక ,,మహారాష్ట్ర చరిత్రము''ను ప్రత్యేకముగ వ్రాయ నిశ్చయించెను. ఈ సందర్భమున ఈయన ఇట్లు వ్రాసియున్నాడు: ,,మహా రాష్ట్రుల చరిత్రకూడ నిందు రావలసినదే. కాని యా చరిత్ర కొద్దిలో వ్రాయుట కిష్టములేక ఇందు విడిచి వేసినాడను ఈ గ్రంథముయొక్క మూడవ భాగమునందు మహారాష్ట్రుల చరిత్ర సవిస్తరముగా వర్ణింపబడును.'' (౩) ఇట్టి నిశ్చయము విజయనగరసామ్రాజ్యము విషయమునగాని, రాజపుత్రస్థానచరిత్ర విషయమునగాని చేసియుండలేదు!

నవీనాంధ్ర వాఙ్మయమున ,,విజ్ఞానచంద్రిక'' ప్రవేశించుటకుపూర్వము, ,,యూనివర్సిటీ''యను ఆంగ్ల పదమునకు బదులు ,,సర్వకలాశాల'' యను శబ్దము వాడుకయందుండెను, అట్లే ,,నేషనల్'' అను ఆంగ్ల శబ్దమునకు ,,జాతీయ'' అను పదము ఉపయోగమునందుండెను. (నేటి వరకును పలుతావుల నీ పదమే వాడబడుచున్నది). ,,ఎజ్యూకేషను'' అను మాటకు ,,విద్య'' యను శబ్దము సర్వసాధారణముగా వాడబడుచుండెను. అట్లుండియు లక్ష్మణరావున కీ శబ్దములు నచ్చక ,,నేషనల్ ఎజ్యూకేషను'' అనునప్పుడు ,,రాష్ట్రీయ శిక్షణము'' అనియు, ,,నేషనల్ యూనివర్సిటీ'' అని వచ్చిన చోట ,,రాష్ట్రీయ విశ్వవిద్యాలయ''మనియు మహారాష్ట్ర వాఙ్మయమున వాడుకలో నున్న పరిభాషను తెనుగున క్రొత్తగ దెచ్చి పెట్టెను. (౪) ,,ఎడిటర్'' అను పదమునకు ,,పత్రికాధిపతి'' యను శబ్దము అంతకు పూర్వము వాడుకయందుండ ,,సంపాదకుడు'' అను నవీన శబ్దమును ప్రవేశపెట్టెను. (౫) ,,ఫలాని'' సంవత్సరము అని వాడుకగా చెప్పవలసిన తావున ,,అముక'' వత్సరము అని వాడి, ,,అముక'' శబ్దమును తెనుగులోనికి మార్చెను (౬). పైన చూపబడిన క్రొత్త శబ్దములన్నియు మహారాష్ట్ర భాషయందు వాడబడుచున్నవే యని చదువరుల గ్రహింపవలసి యున్నది. అట్లనుటచేత, ఈ శబ్దములు మహారాష్ట్ర భాషలోని దేశ్యపదములని ఈ లేఖకుని తెలుపుటలేదు. ఇవి సంస్కృత శబ్దములే. ఆకారణము వలన వానిని వాడుకొను హక్కు మహా రాష్ట్రులవలెనే మనకును కలదని వాదింపుట కట్టి యాభ్యంతరమును లేదు. కాని ఇదివరకే యర్థము దెలుపుటకు ఆంధ్ర వాఙ్మయమున వేరు శబ్దములు స్థిరముగనుండ, క్రొత్త శబ్దములను ముఖ్యముగా మహారాష్ట్రభాషయందు వాడబడుచున్న పరిభాషా పదములను తెనుగులో ప్రవేశపెట్టుట లక్ష్మణరావున కాభాషయందు గల యభిమానమును, పూజ్యభావమును చాటుచున్నదని నిరభ్యంతరముగా చెప్పవచ్చును.

---

(౧) ఏబ్రహాము లింకను చరిత్ర. ఉపోద్ఘాతము. పుట ౮.
(౨) హిందూ దేశ కథాసంగ్రహము. హిందూమహాయుగము. పుట ౧౯౦.
(౩) మహమ్మదీయ మహాయుగము. పీఠిక పుట ౩.
(౪) ఏబ్రహాములింకను చరిత్ర: ఉపోద్ఘాతము పుట ౮.
(౫) ,, ,, ,, ౯.
(౬) హిందూ దేశ కథాసంగ్రహము. హిందూ మహాయుగము, పీఠిక పుట ౮.

"అనన్య సామాన్యశాస్త్ర తేజంబులతో వెలుంగు ఉత్కృష్ట కథానకంబులతోడను, పౌరుష ప్రధానంబులగు ఆస్థానీయ వీర చరిత్రంబులతోడను, స్వదేశ స్వమత స్వ ధర్మములను రక్షించుకొనుటకై పూర్వపుసింగ్లవలె దక్షుశిరః ప్రకరంబుల రణక్షేత్రమున నర్పించిన వీరవర నామసహ స్రములతోడను, శరణాగత దీర్ఘ దుర్మార్గ శత్రుని సైతము రక్షించి యౌదార్య "ప్రసంగముల"తోడను, వేయి సంవత్సరముల కాలము పగవు సంతులేకుండ నిండియున్న ఈ మేవాడ్ దేశచరిత్రమును పూర్తిగ వ్రాయుటకు వేయి పుటలైనను చాలవు." (౪). ఇది లక్ష్మణరావుచే రచింపబడిన ఆత్యుత్తమ వాక్యములలో నొకటి యని చెప్ప వచ్చును. అయినను, దీనిలోని "కథానకము" అను మాటకు మన భాషలో 'కథ' యని వాడుకగా చెప్పుదుము. ఈ శబ్దము కొన్ని తెనుగు నిఘంటువులలో కానరాదు. "ప్రసంగము" అను శబ్దమును మన భాషలో 'వాదము' "సంభాషణ" అను నర్థములలో వాడుచుందుము. "మేవాడు చరిత్రము" ఔదార్య ప్రసంగములతో నిండియున్నదనగా, ఉదారములగు వాదములతో గాని సంభాషణలతో గాని నిండియున్నదని అర్థము చెప్పగలమా? అది పొసగదు. ఇక ఈ "ప్రసంగము" ఏ యర్థమున వాడబడినది? "సందర్భము" అను నర్థములో వాడబడినది. ఇట్టి యర్థమునందే ఈ శబ్దము మహారాష్ట్రభాష యందు సామాన్యముగా వాడబడుచున్నది. మరియొక తావున ప్రతాపుని కనుపరచిన "ప్రసంగావధానము" ప్రశంసింపబడినది. (౫) ఈ శబ్దము "సమయోచిత బుద్ధి" యని తెనుగున వాడబడు అర్థమును స్వీకరించుటకై యుపయోగింపబడినది. "ప్రసంగావధానము" అను దాని కిట్టి ప్రయోగమే మహారాష్ట్రభాషయందు సర్వసామాన్యముగా గలదు. సంస్కృతమున నుండిన నుండవచ్చును కాని తెనుగున నట్టి వాడుక లేదు. ఇట్టి శబ్దప్రయోగములు లక్ష్మణరావు రచనయందు దశసంఖ్యాకములుగా నున్నవి. గ్రంథవిస్తరభీతిచే వివరింప బూనలేదు.

పై యుదాహరణములను బట్టి, ఈ వ్యాసకర్త మన వాఙ్మయ నిర్మాతయగు లక్ష్మణరావు నాక్షేపించుచున్నాడని గాని ఇతర భాషలలోని శబ్దములను వాడగూడదనుచున్నాడనని గాని భావింపగూడదు. మన లక్ష్మణరావునకు గలిగిన మాతృభాషాభిమానము మహారాష్ట్ర వాఙ్మయ పఠనమువలన నుద్భవించి, పెంపొందినదనియు, కనుకనే ఆయన రచించిన ఆంధ్ర వాఙ్మయమునందు మహారాష్ట్ర వాఙ్మయములోని ప్రయోగములు అవసరమున్నను లేకపోయినను, అప్రయత్నముగ దూరినవనియు, ఆయనకు మహారాష్ట్ర దేశమునందును తద్దేశవాసులయందును ఎక్కువగా గౌరవముండెననియు మాత్రమే ఈ వ్యాసకర్త ముఖ్యోద్దేశము. లక్ష్మణరావు వంటి వాఙ్మయ సేవాధురంధరుని గన్న యాంధ్రమాత కడుధన్యురాలు. లక్ష్మణరావు కీర్తికాయము సదా దేశీయుల స్మరణయందుండుగాక!

## హిమాంశోదయము

ఆలపాటి కామేశ్వరరావు (కవిమండలి)

హాటకంబను దినమణికి వార్షమాణుడౌచు సాయమునెడి ధూర్తుడత్తులారగనిఘనావేక్షుడై దాని గొనగదలచి
పూర్ణశుభ్రాంశుడను శ్వేత పూదెను తపనీయవనమందు నంత మున్ప్రియు జగంబు.
ట్టిగొనగి తమమందు నంచనంబొనరజేసి
జాతరూపంబనెడి హారిక సంగ్రహింప
నంత ఘనముగ నూర్ధ్వదిశాంగణమున
భాసిలుచునుండె ధవళుడై ప్రభల విధుడు!

(౪) మహమ్మదీయ మహాయుగము: పుట ౨౩౨

(౫) " " " ౨౬౪.



# జానకి

## గుడిపాటి వేంకటాచలము

రామరావు చూడగానే ఆ కొత్తవూళ్లో వెంటనే తనకి బాల్య స్నేహితుడు దొరికాడు కదా అని సూర్యనారాణకి చాలా సంతోషమయింది. తక్కిన మనుషులెవరూ కళ్లబ్బలో లేనట్లే అనుకుని; యిద్దరూ బిలియర్డ్సుగదిలో మూల కూచుని కాలేజి స్నేహితమంతా పునశ్చరణ చేసుకున్నారు. యిద్దరూ ఒకే గదిలో వుండి, ఒకరిడబ్బు యింకొకరిదిగా వాడుకుని, ఒండొవారికి తెలిని రహస్యాలు లేకుండా, నాలుగేళ్లు గడిపి నాలుగేళ్లే అయింది. వాళ్లమాటలు వింటే, యిన్నాళ్లు వొకర్ని విడిచి యింకొరు యెట్లా విడిగా బతకగలిగారా అనుకునివుంటారు. మర్నాడు రామారావు సూర్యనారాయణని కలుసుకోగానే,

"మీనాన్నగారు రామచంద్ర పురంలో డాక్టరుగావున్నారుటకదూ కొంత కాలం?" అని అడిగాడు. ఆ సంగతి సూర్యనారాయణ వొప్పుకున్న తరువాత,

"అయన పేరు రామస్వామి నాయిడుగారు. అవునా?"

"యేమిటి? యేమన్నా ఆయిన బాకీలు చేసి పోయారా యేమిటి?"

"అయితే జానకినిన్ను బాగా యెరుగునుటగా!"

జానకి! జానకి! అర్థం తెలీకుండానే ఆ మాటలినేప్పటికి సూర్యనారాణ మనసు ఝల్లుమన్నది. జానకి?

"జానకి. యేజానకి?"

అంటో వుండగానే అతనికే నిశ్చయంగా తెలిసిపోయింది. జానకి వొక్కతే తన ప్రపంచంలో.

"సబ్ జడ్జీపని చెయ్యాలా, రామచంద్ర......"

"తెలిసిందిలే, జ్ఞాపక మొచ్చింది. అయితే జానకి నీకెట్లా తెలుసు?"

జానకి తను గోషాలో దాచుకున్న తురక భార్యలాగూ, జానకిపేరుకూడా యితరుల వుచ్చరించడంకూడా నేరమైనట్లు" అన్నాడా మాట సూర్యనారాయణ.

"యెట్లా తెలుసా? యెట్లాగో కొంచెం తెలుసనుకుంటా, జానకి నాభార్యగనక! "ఏభార్యా! జానకి ఏ భార్యా!"

జానకి యెవరిభార్య కావడమూ ఘోరమైన విపత్తే, జానకి యెప్పుడూ అటువంటి నీచమైన కార్యం చేస్తుందని తను అనుకోనట్టూ వినపడ్డాయి అతని మాటలు.

నాలుగు ముహూర్తాలలో బయస్కోపులో మల్లే సూర్యనారాయణ కళ్లముందు బాల్య నాటకంలో ముఖ్యమైన ప్రకరణాలు గిరగిర తిరిగాయి, యింకోసారి. చిన్నప్పటి సంగతులన్ని చాలవరకు మరిచి పోయినాడు, గాని జానకితో సంబంధించిన నిముషాలుమాత్రం మెరుగు పెట్టినట్లు మరుపు చీకట్లోంచి తళతళలాడుతో కనపడ్డాయి.

చిన్నప్పుడు సూర్యనారాయణ చెల్లెలికీ జానకీ స్నేహం మొదట. వీళ్లునాయిళ్లూ, వాళ్లు బ్రాహ్మలూ. బలిచెడుగుడు ఆడి అలిసి, 'నెపోలియన్' వలె యీ బాల శత్రుని జయించేశానని వుప్పొంగుతో, చంద్రవంక తెలుపూ, రాత్రినలుపూ, మబ్బుల మీదనించి మొహంమీద పడ్డ పసుపూ కలిసే ఒక వింత సంధ్యలో, సూర్యనారాయణ, యింటికి పరిగెత్తుకని వొస్తున్నాడు. దొడ్డి తడికి దగ్గర వెలుతురుకుమ సకలో వొక్కతే నుంచుని, తగ్గిపోతున్న కాంతికోసం దుఃఖించే వనకన్యలాగు, జానకి కనపడ్డది. కళ్లనికప్పిన గుప్పెట్లు కన్నీళ్లతో తడిశాయి.

"యెందుకూ జానకీ యేడుస్తున్నావు?"

"నావుంగరం పడిపోయింది, యిక్కడ. కితకితలు ఆటలో వేలు పట్టుకు లాగింది."

"ఎవరి వాళ్లందరూ యేరీ?"

„వెతికాము, కనపళ్లేదు. వాళ్లమీదకొస్తుందని పా రిపోయారు......అమ్మకొడుతుంది”.

దేశాల్ని జయించిన „నెపోలియన్” గోవిందుని, ప్రసిద్ధికెక్కిన కోటయ్యని, పట్టిపడేశిన లౌకిక వీరుడు, జానకి వుంగరం వెతికి కనుక్కోలేక పోతాడా? అనాథలైన యిట్లాంటి బాలికలను మ్లేచ్ఛుల నించి కాపాడేరూ, రాజపుత్రవీరులు „రాజస్థాన కథావళిలో” మరి కెక్కిందే? సూర్యనారాయణ జానకీమళ్లీ వెతికాడు. అతను లాంతరు తీసుకొస్తానంటే వొద్దంటుంది, కాని వుంగరం దొరకందీ యింటికి వెళ్ల నంటుంది. యీ తీవ్ర సమస్య! తల్లిరాక్షసి నించి, యీ బాల నెట్లా కాపాడ గలను, అని, గానుగరాయి నధిష్ఠించి, చుట్టూ నున్న సున్నపు కుప్పలతో కలిసి యోచించాడు సూర్యనారాయణ. పడమట ఒక్క మెరుపు మెరిసింది. తలమీద అంగారకుడు పొడిచాడు. చలిలో రోడ్డుమీదీ దీపాలు వొణికాయి వాళ్లకుక్క „జాకీ” వొచ్చి చెయ్యి నాకింది. యెదురుగ, నుంచుని వుంది దీన బాలికాస్వరూపము. చప్టనరాయిమీద నించి దూకి, వేలినున్న వుంగరం తీసి జానకివేలు కితనే పెట్టాడు, వొడుగునాడు పిన్ని యిచ్చిన వుంగరం.

„ఈరాత్రికి దీనితో సరిపుచ్చు, తెల్లవారకట్టే నీకు నీవుంగరం నేను తెచ్చి పెడతాను” అని యుగంధర ప్రతిజ్ఞ చేశాడు.

„నిజంగా తెస్తావుకదు, సూరయ్యా?” యెక్కడ పోయిందో, యీసున్నములో కనపడుతుందా అనేతన సందేహాన్ని దిగమింగుతో „యిక్కడే వుంటుంది. యెక్కడ పోతుంది. రాత్రంతా వెతికనా, నేను కనుక్కుంటాగా” అన్నాడు.

జానకి వెళ్లగానే లాంతరు పట్టుకువొచ్చి వెతికితే అక్కడే కనపడ్డది. వెంటనే వెడదామనుకుంటే, భోజనము లయి యింటిదగ్గర పాఠాలు చెప్పేఅన్నా, నిద్రా, ఆటంక పడ్డారు. తెల్లారకట్టే లేవాలనేనిశ్చయం ప్రకారం ధీరుడు కనక లేచాడు. చలిలో జానకిగారి యింటికి చేతలు ముడుచుకు పరిగెత్తాడు. వాళ్ల పెద్దమ్మ యింటిముందు ముగ్గు వేస్తోంది.

„జానకి లేచిందా?”

„అర్ధరాత్రే. జానకెందుకు కావలిసి వొచ్చింది, నాయనా,”

„పనుంది,”

జానకి పెద్దమ్మకి పిల్లలు లేరు, తన చిన్నతనం. అసలు తను చిన్న దానిగా వుండివుండ వొచ్చుననే విషయం, మరిచి పోయింది. యెవరన్నా ఆమె చిన్నదిగా వుండేదని జ్ఞాపకం చేసినా, సృష్టిని పరిశీలించి, చిన్నకాకండా పెద్దది కావడానికి వీలులేదని ఆలోచించి వొప్పుకో వొచ్చు. అప్పటికి కూడ 'సైజు'లోనే గాని యింక రూపంలో గాని గుణంలోనూ, పెద్దమనిషితనంలోనూ వొప్పుకోదు„పని! పనులు యీచిన్న వాళ్లకి! జానికి యిప్పుడప్పుడే లేవదు. మొగపిల్లవాడికి నీకు జాన కెందుకు? యీడా జోడా, సహవాసమా, బడా, పాఠాలా. నీ పనుంటే మళ్లీరా. పొద్దెక్కిం తరవాత.”

ఆయిల్లు భూగోళం అతనికి బాగా తెలీదు, అందులో జానకి యెక్కడ పడుకుంటుందో. ఆలోచిస్తో నుంచున్నాడు. చలిగాలి చంపల్ని చరుస్తోంది. తూర్పున వేగుచుక్క ఆకలన్ని వొదులుకో నక్కు లేదంటోంది. తనముందు కాయితం మీద మంచుదేవుడు వేసిన ముగ్గుని పెద్దమ్మ సున్నపు ముగ్గుతో పోలుస్తోనుంచున్నాడు. సాతానివాళ్ల పాట దగ్గిర కొస్తోంది. తెల్లని శాలువ ముసుగు పెట్టుకుని, జాగ్రత్తగ జానకి బైటికి వొచ్చింది.

„యెక్కడికే యీ అర్ధరాత్రి వెళ్లి చపుతా నాన్న లేవని,” అనే పెద్దమాటలు వినిపించు లోన, సూర్యనారాయణతో రోడ్డు మీదికి వెళ్లింది. ఆమె వుంగరం ఆమె వేలుకిపెట్టి, తనది తీసుకున్నప్పుడు జానకి తనవంక తిప్పినచూపు యీనాడు మళ్లీ జ్ఞాపకం వొచ్చింది. అప్పణ్ణించి ఒక యేణ్ణర్థం జానకి అతనికి స్నేహం. ఆడపిల్ల లబ్బాయి అని బళ్లో అతన్ని వెక్కిరించే వారు. ఆటలకిరాక పోతే „నెపోలియన్” యుద్ధాలతో అలిసి, శ్రమతీర్చుకుంటున్నాడు ప్రస్తుతం. నిష్కారణంగా, అవాచ్యంగా, ఒకరోజున, జానకిని ముద్దుపెట్టు కోనాలెవని కోర్కె ప్రారంభమై యింక ఆ అమ్మాయిని చూసినొద్దీ, అధికమై పోయింది. యింకెవరు లేకుండ వొంటరిగా వుండాలని ప్రయత్నించినా సాగలేదు. ఆప్రయత్నం మంతా ఆతని వొక్కడిదే కావడంచాత, యోచించి ఒక సామ్రాజ్యం ఒక ఆట కల్పించాడు. తనుదొంగ, నిద్రపొయ్యే పిల్లన్ని ఒక్కొక్కళ్లనే యెత్తుకుపోయి గుహలో దాచేస్తాడు. గుహ గన్నేరుచెట్టు గుబురు. జానకిని దాస్తో నిద్రలో కళ్లుమూసుకుని వున్న జానకిని ముద్దుపెట్టుకో పోతే, సగంకళ్లు తెరిచి చూస్తోందో యేమో, మొహం తిప్పేసింది. ఆ అమ్మాయి పెదిమెలు తనబుగ్గకి రాసుకుని యెంగిలై అతని కసహ్యమేసింది.

ఒకరోజు అతని చెల్లెలు „జానక్కి పెళ్లి” అంది,

„నీ కెట్లా తెలుసు?” అన్నాడు. అమాంతం చెల్లెన్ని తినేశాట్టు!

‘యివాళ సాయంత్రము మామగారు పిల్లని చూసుకోడానికి వొస్తున్నారు.’

పక్కనవున్న కుక్కని నిష్కారణంగా వొక్క తన్ను తన్నాడు. యీతన్నకి అర్హత పొందడానికి తను చేసిన అపరాధ కోసం వెతుకుతో వెళ్లి పందిరి కొయ్యదగ్గర వుంచుని వెనక్కి తిరిగి అతన్ని గురించి తన అభిప్రాయం తెలియచేసింది. సూర్యనారాయణ ఆ కోపం లోనె వెళ్లి చేతులోని కర్రతో బొమ్మ జెముడు ఆట్టవి అయిదారూ, జావ్వి మొక్క కొమ్మలు రెండూ విరకొట్టి వెళ్ళిపోయి మధ్యాహ్నందాకా తిరిగాడు, బడి మానేసి యెక్కడో. మూడింటికి జానకి వాళ్లయింటికి చేరుకొని చూసేప్పటి, ఆ అమ్మాయి మూలచాపమీద కూచునివుంది. మొహ మల కోటూ, పట్టంచు పావడా, కోటుమీద కాసుల పేరూ, వడ్డాణం, చెవులకి జూకాలతో ముస్తాబై ముందున్న హార్మోనియం లోంచి, తనకిరాని పాటని లాగా అని తంటాలు పడుతోంది. యెదురుగా కుర్చీలమీద, పెద్ద తలపాగ, పొడుగాటి కోటూ, వెండిపొన్ను కర్ర, పట్టుకుని ఒకాయన కళ్ల జోడులోంచి, ఆపాటని పరీక్షించి, వింటున్నాడు. పక్కనే కాస్తులా జాతకాలు తిరగేస్తున్నాడు. ఒక వితంతువ యింకోకమూల కూచుని, తనన ట్లా చూడడానికి వొచ్చినరోజులు గాజాల్ని జ్ఞాపకం చేసుకుని. యీర్ష్య మోహం పెట్టి చూస్తోంది. జానకితో పాటు యెంతడబ్బిస్తే తీసుకోవచ్చు యీపిల్లని అని పరీక్షిస్తున్నట్టు కనపడ్డారువాళ్లు సూర్యనారాయణకి. జానకి మీద అపరిమితమైన కోపంతో యింటికి పరిగెత్తుకుని వెళ్లాడు. మర్నాడు రాత్రి సూర్యనారాయణ వాళ్లయింటి వరండాలో వేళాడుతున్న లాంతరు క్రింద జానకి కనబడి మామూలు ప్రకారం అతని చెయ్యి పట్టుకుంది. యింకా ముస్తాబు అట్లానేవుంది, కళ్లకాటికతో అందంగా కనపడుతోంది.

‘నీకోసమే చూస్తున్నానం’ది.

అతని చెయ్యి విదల్చుకుని,

‘యెందుకొచ్చావు మళ్లీ’ అన్నాడు.

‘అదేమిటి అట్లా అంటావు? నేనేంచేశాను?’

‘నిన్న సాయంత్రము నేను చూడలా? నీకు పెళ్లి కదూ.’

సిగ్గుతో తలవంచుకుంది.

‘అయితే?’ అంది నెమ్మదిగా.

‘నాకిష్టంలేదు’ అన్నాడు దూకుడుగా.

‘మావాళ్లు చేస్తున్నారుమరి.’

‘చెయ్యకూడదు’

‘నీకెందుకు కోపం?’

దానికి ప్రత్యుత్తరము చెప్పగల నిజమైన కారణం అతనికప్పుడే వుదయించలేదు. యేంచెప్పాలో తెలీక వూరుకున్నాడు.

సూర్యనారాయణ తరవాత తొరలోనే కాలేజి చదవడానికి యింకోవూరు వెళ్లాడు. మళ్లీ శలవల్లో వొచ్చేప్పటికి జానకివాళ్లకి బదలాయింపై పోయింది.

“జానకి నీవు బాగా జ్ఞాపకమున్నావు, మీ చిన్నప్పటి సంగతులేమిటో చెప్పింది. యింటికి వెళ్లేప్పుడు నాతోరా.” అంటున్న రామారావు మాటలు అతన్ని మళ్లీ ప్రస్తుతపు జీవితానికి తిరిగి తెచ్చాయి.

జానకిని చూడగానే ఆమెలో అందంకన్న అద్భుతమైన, ఉన్నతమైన, ఆకర్షణ, వున్నదని సూర్యనారాయణకి తోచింది. చిన్నప్పటి పోలిక యెక్కువగా లేదు. కొత్తగా ఆమెని పోల్చుకోలేక పొయ్యేవాడే, ఆమె చూపుల్లో, మాటల్లో, ఆమె ఆత్మమాధుర్యం పరిమళించి అతన్ని ఆవరించినట్లయింది. కంఠస్వరంలో యింద్రజాల మున్నది. హృదయాన్ని చెప్పి జయిస్తుంది. ఆమెకప్పుడే ఒక కొడుకు. అతన్ని చూసి, జానకి,

“మీరేనా, చిన్నప్పటి సూర్యనారాయణ గారు, యెంత యెదిగారూ!”

“నన్ను మీ రంటారెందుకు?”

“నన్ను మీరో యిప్పుడు!”

యిద్దరు నవ్వారు.

“నువ్వుమందంటే నేనన్నాను.”

“మరియిప్పుడు గొప్ప యిన్స్పెక్టరు గారు కదూ నువ్వు!”

“నువ్వుమాత్రం తాసిల్దారుగారి భార్య కాలేదు!”

అంత చనువైన తరువాత వొకటే మాటలు, ముగ్గురూ మూడు జతలుగా, వొకరి నొకరరుగుదురు. ఒకజతి అనుభవాలు యింకోకజతికి తెలీవు. యేయిద్దరు మాట్లాడుతున్న మూడోవాళ్లు చూస్తో కూచోవాలి. సూర్యనారాయణ్ణి చూసి జానకికళ్లు నవ్వుతున్నయి, చిన్నప్పటి అల్లరి జ్ఞాపకం వొస్తున్నట్టు.

ఆ యింట్లోకి కాలుపెట్టగనే సూర్యనారాయణకి తో ప్రణయ దేవాలయంలో కాలు పెట్టినట్లు తోచింది. అధిష్టాన దేవత జానకి. ఆమె కనుపన్నల్లో మెలుగుతో, ఆమె పలుకుల్ని, ఆమె చీర చెంగునుంచి రాలే, దారాన్ని, తలలో వాడిన పువ్వుల్ని ఆరాధించే భక్తులు, భర్తా, కొడుకూ. జానకి, రామారావుకి తల్లిలాగూ, అతని అమాయకత్వం చూసి జాలిపడి జాగ్రత తీసుకోడానికి, వొచ్చిన సరస్వతీదేవిలా వుంటుంది. అబ్బాయి ఆమెని ప్రియుడి లాగు ప్రేమిస్తాడు. ఆమె ప్రేమకోసం

ఆమె కంఠస్వరం వినడంకోసం, చూపుల విచిత్రాలు చూ డడంకోసం, తన్మయత్వమునొంది, యెట్లా చెపితే అట్లా ఆటలో, ఆమె కనుసన్నల్లో మెలగుతో వుంటాడు. జానకి పట్ల వీళ్లిద్దరిలోనూ ఐక్యమైపోయింది.

యింటికివెళ్లి సూర్యనారాయణ జానకినే తలుచు కుంటున్నాడు రాత్రల్లా. తలుచుకుంటే, ఆమెలో అందం లోచను. కళ్లనిర్మలత్వంలో తెలివీ, పెదిమలదగ్గర దయా దాక్షిణ్యం సాక్షిలోనూ, వెంట్రుకలు ముంగురు తాకిన నొసటా, వేళ్ల చివర్లలోనూ, అన్నిటిలోనూ యేదో ఆకర్ష ణ తెలుస్తాయి అంతే. అందంలేక పోయినా, ఆ తనకం ఒచ్చినప్పటి చేతివొంపు, చిన్నవవ్వు నవ్వుతే, పెదిమలు పైకి పట్టి నప్పుడు, తీరైన యెర్రని పెదిమలు గలవారికి రాని, మెత్తగా మనసు కలవరపెట్టే మబ్బు చివర వెలుతురు వంటి మెత్తని కాంతి, అన్ని అతను యెంత ఆటంక పరచి నా లొంగక అతని ధ్యానంలో యిటూ ఆటూ స్ఫురిం చాయి.

౨

పక్కని యిల్లు నిశ్శబ్దంగా చీకటిగావుంది. తోట చెట్లు కదలకుండానిలిచి, గాలివేపు చూస్తున్నాయి. విడా కానికి తల్లోమరువం వాసన సూర్యనారాయణకి వేస్తోంది. యూనివర్సిటీ జాలు కావడంచేత రామరావింకా రాలేదు. అబ్బాయి ఆమె వొళ్లో నిద్ర పోయినాడు. ఆమె రెండు చేతులూ అతని కాళ్లకింద, మెడకింద్గా వున్నాయి. నె త్తిమీద బృహస్పతి పొడిచాడు. చీకట్లో చంద్రకాంతి పువ్వులు తెల్లగా విచ్చాయి. చీకటి పడ్డ తరువాత చివరిసారి వొచ్చే గులాబికాంతి భూమ్యాకాశాన్ని నింపింది. సూర్య నారాయణ చెవి మీదగొల్లభామ కూచుంది! అతనుతో సే స్తే యెగిరి జానకి మెడమీద వాలింది. ఆమెఅదిరి, వడు కుచూచి, అబ్బాయికిందనించి చెయ్యిలాక్కుంటోంది. సూర్యనారాయణ దాన్ని ఆమెమీదనించి తీసేస్తేవుం టే, అతనికి తన వేళ్లకింద ఆమె మెడ వొణికినట్లు తోచిం ది. చేతిని అట్లానే వుంచాడు. జానకి తనమెడని పక్కకి తొంచి, దూరంగా జరిగింది.

“జానకీ!”

ఆమె లేచి మాట్లాడకుండా యింట్లోకి వెళ్ళిపోయి మళ్లీరాలేదు. యింటివేపు వెళ్లడానికి ధైర్యంరాలేదు. త ను వెళ్లిపోతే తప్పుపనిచేసి పరిగెత్తినట్లుంటుంది.

యింటికి వెళ్లింతరవాత మనసులో యేమేమిటో అ పూర్వపు ఆలోచనలు తోచాయి. జానకి కోపంవొ చ్చింది. రామారావుతో చెపుతుంది. యింకా తనెట్లా వా ళ్లమొహాలు చూస్తాడు! అంతమాత్రం నిగ్రహశక్తి లేక పోవడ మేమిటి తనకి. భార్యాభర్తాతన నెంతో ప్రేమతో చూసి ఆదరిస్తోవుంటే, అట్లాంటి పనిచెయ్యడానికి తన కెంపట్టింది? జానకిని క్షమాపణ కోరుకోవాలని నిశ్చయు చేసికున్నాడు. మర్నాడు సూర్యనారాయణ వెళ్లేప్పటికి రామారావు యింటోవున్నాడు. తనతో తగూలాడడాని కో, జానకితో మళ్లీ తను వొంటరిగా వుంకకుండా చె య్యడానికో కూచున్నట్టుంది సూర్యనారాయణ్ణిచూడగా నే జానకి, నవ్వుతో, లేచి,

“అమిగో, వొచ్చాడమ్మా!” అని అతని వేపు సంతో షంతో వొచ్చింది.

“యీవాళ యీ యనకితలనొప్పిగావుంది. ఆఫీసుకు వెళ్లలేదు. యేం తోచక నిన్నే తలుచుకుంటున్నాము” అంది. ఆ సాయంత్రమంతా ఆతనితో యెప్పటికన్న సర దాగా చనువుగా మాట్లాడుతో, ఆందరిని ఒకటే నవ్విం చేది కొడుకుతో నవ్వులు, పరుగులు, ఆటలు. సూర్య నారాయణ ఆ వసంత దేవినించి కళ్లుతిప్పుకో లేదు. యింటో అట్లాంటి స్త్రీయే వుంటే, యింకా స్వర్గంకోసం వేళ వెతక్కాలా! తన ఆకర్షణా ప్రభావం, వుత్సాహదీప్తి అతనికి చూపి వూయించి, యేడిపించడానికి ఆ ప్రయత్న మంతా అన్నట్లు తోపించింది. అతనికి దగ్గరగా కుర్చీ జరుపుకుని నెమ్మదిగా రహస్యంవలె వుత్తమాటే మా ట్లాడి, యేంలేనట్టు నవ్వేస్తుంది. మాటలు చెవులని ముద్దు పెట్టుకున్నాయి. కళ్లనించి కాంతులు చుట్టూ మెరిశాయి. ఆమె మాధుర్యంతో, ఆనందంతో, కలకలమనే కంఠర వంతో సృష్టి నిండి పోతున్నట్టు తోచింది. యింక మళ్లీ విచారానికో, లోభత్వానికో స్థలమెక్కడ వుంధా అను కున్నాడు. యింతచేసి తమాషాకి ఆవేషం వేసినట్టు తన కేం సంబంధం లేనట్టు తల వూపేసి చులకనగా నవ్వేస్తుంది, అబ్బాయి నవ్వినట్టే! ఆ నవ్వే!! ......

యెక్కడో హృదయంలో కలిచి, యింకయీ కాంతి కి దూరమై జీవించి ప్రయోజనమే మనిపిస్తుంది. యెంతరా త్రైనా సూర్యనారాయణని యింటికి పోనీదు. ఆ కళ్లూ, పె దిమలూ దగ్గిరికి రమ్మని పిలుస్తున్నాయే అనుకున్నాడు. కుర్చీలోంచి చీకట్లో తనవేపు మెడవొంచి మాట్లాడితే, అక్క “యిట్లారా” అని చేతులు జాచినట్లు తోపించేది. అక్క డే భోజనంచేసి, యింటికి వెడతో జానక్కి తన మీద ప్రే మ అనిన్ని ప్రశ్నించుకుని, తనవెర్రి తనానికి నవ్వుకుని, సి గ్గుపడి, ఆపాపపు తలపుకి పెదిమ గట్టిగా కొరుక్కున్నా డు. తనకి తగినశాస్తి చేసింది. రామరావుతో, చెప్పిందో లేదో గాని, తనని౦చి మాహాంతప్పేసి, కోపంచూపించ డంకాదు, స్నేహం, యింతదగ్గిరిగా, సులభంగా, సుంధ ......

తరంగా, స్వేచ్ఛగా, నిర్మలంగా, వుండవొచ్చు, దాన్ని, మోహమనుకోడం యెంతటి దపో, మూర్ఖత్వమో, విజ్ఞాన విహీనమో, చూపి, అంతకన్న వెయ్యిరెట్లు శిక్షించింది. జానకిమీద అమితమైన గౌరవం కలిగింది.

సూర్యనారాయణ యిదివరకంతా తనది చాలా స్వేచ్ఛగల బతుకని; గర్వపడేవాడు; యిప్పుడు తనది చాలా వొంటరి బతుకని బాధ పడ్డాడు. పెళ్లి చేసుకుదామా అంటే, జానకి మాటల మాధుర్యం చెవులలో మోగుతున్నాళ్లు, యెవరి మీద తన మనసు పోతుంది! వాళ్లిద్దరూ యెంత ఆనందంగా వున్నారో, తనకూడా అట్లా వుండడానికి వీల్లేదూ? ఒక చిన్న యిల్లూ, తోటా, గదీ, అన్నీ తలుచుకుంటే, వాటిల్లో యెక్కడ చూసినా, జానకి రూపమే కనపడుతుంది!

3

వరండాలో యెవరో పెద్ద మనుష్యులతో రామారావు ఆఫీసు పని మాట్లాడుతున్నాడు. వాళ్లందరూ యెప్పుడు వెడతారా అని సూర్యనారాయణ తోటలో కాచుకుని కూచున్నాడు. అతనిముందు కామినీచెట్టు విచ్చింది. చంద్రుడు వుదయించబోయ్యేట్టు తూర్పు తెల్లబడుతోంది. మిణుగురు పురుగులు రెండు దిక్కులేని వాటి మల్లే, చెట్టంతా తిరుగుతున్నాయి. గాలి పువ్వుల్ని వొదలలేక, ఆచెట్టు కొమ్మల్లోనే తిరుగుతోంది. యింకా జానకి రాలేదు. యెందుకో? వెనక క్రోటను లోంచి రెండు చేతులు అతని బుజాలమీద ఆనుకున్నాయి. వేడివూపిరి అతని చంపలకి తగిలింది. తలంటి పోసుకొని, ఆరనిజుట్టు అతని మొహాన్ని కప్పింది. కాలపు వైఖరి తప్పి పోయింది తిరిగి చూసేప్పటికి యెవరూ లేరు...నిజమా? నిజమా? కలా? తనమనసులో తానైనా బిగ్గిరిగా ఆలోచుకోలేని తన ఆశ నిజమా........

రామారావూ అతనివెంట జానకీ వొచ్చారు. ఆమెతల ఆరకుండా యింకా సాంబ్రాణివాసన వేస్తోంది. జానకి. తనమీద ప్రేమచేతనేనా? కాదు, వేళాకోళమేమో? అసంగతి యిప్పుడెత్తులా కూడదా? రామారావుకి తెలీకుండా తనదాచవగిన విషయంకింద భావించుకున్నట్టు తోచదు కదా! ఆమెనే యెత్తి. ఆమెతో వొక్కసారి వొంటరిగా వుండాలి. ఆమెకూ అట్లానే వుందేమో! అప్పుడు......ఆశలపులో అతని కంఠమూ మనసూ మహాశక్తి గట్టిగా పట్టేసింది. యెవరన్నా కాకూడదు, రామారావుకో?

"యేమిటి ఆలోచిస్తున్నావు చెప్పు అట్లాంటి అవస్థలో సత్యం చేసావు?" అని అడుగుతోంది జానకి. మొహమాటం యేమిటో చెప్పాడు. కొంచెంసేపుండి రామారావు సిగరెట్టుపెట్టె కోసం యింట్లోకి వెళ్లడానికి లేచిపోతూవుంటే, సూర్యనారాయణకిగుండెల్లో, ఆపరాని వుద్రేకం కలిగింది. జానకి అతనికి మొహంచూస్తో,

"నేనూ వొస్తున్నాను. ఆగండి" అని లేచి, భర్త బుజం మీదచెయ్యేసి, తనూ లోపలికి వెళ్లి, మళ్లీ అతనితో వొచ్చింది. అంతంలేని కబుర్లట్లా వొస్తాయో!

సూర్యనారాయణ మర్నాడు వెళ్లేప్పటికి జానకి యింట్లో లేదు. పేరంటానికి వెళ్లి అయిదింటికి వొచ్చింది. అతన్ని తోటలో చూసి, కొంచెం నవ్వి, యింట్లోకి వెళ్లిపోయింది. యెంతసేపున్నా మళ్లీ బైటికి రాలేదు. మనసు పట్టలేక అతను లోపలికి వెళ్లి చూసేప్పటికి, నిద్రపోయిన అబ్బాయి వుయ్యాల వూపుతో ఆలోచనగా నుంచుని వుంది. చాకలి పక్క వేస్తున్నాడు. అతన్ని, అతని కళ్లలో నిశ్చయాన్ని చూడగానే, తత్తర పడి,

"వొస్తున్నాను, పదండి, మీ వెనకే" అని చాకలివాణ్ణి వుయ్యాల వూపుతో వుండమని, వెనకనే నడిచి వొచ్చింది. యిద్దరూ అరుగుమీద తోటలో కూచున్నారు. జానకి మెళ్లో గంధం అతనికి తెలుస్తోంది. గులాబీ చీనా పట్టుచీర పమిటకిందియెత్తు అతనివొళ్లు మరిచేట్టు చేసింది. ఆమె ప్రేమకోసం యెదురుచూస్తో ఐదు నిమిషాలు కూచున్నాడు. రాత్రి అనుభవాన్ని పట్టి, యేసమిపాన యేంచేస్తుందో అని మనసు ఆత్రుతతో వొణికి పోయింది. యీ సరుగాలిలో మంటవలె ప్రజ్వరిల్లే, కత్తుల్ని అణచిపెట్టడం కష్టమయింది. ఆమె తనకోసమే కాచుకునివుందని నిర్ధారణ చేసుకొని ఆగకనే సాహసించేసి చివాలునలేచి ఆమెకాళ్లయెదటే ముందుకి తన తలవొంచాడు. ఆమె రెండు చేతులతో బలంగా అతన్ని తోసేసి, లేచి నుంచుని వలలో పడ్డ కుందేలు లాగు ఆరచేధకంగా, "పాపం, తప్పు; వొద్దు" అని అరిచి, దూరంగా నుంచుంది. సూర్య నారాయణకి, ఆశ్చర్యం కలిగింది. రాత్రిది కల అనుకున్నాడు.

"నేను పొరపాటు పడ్డట్టున్నాను. క్షమించు." అని వెళ్లిపోతో, ఒకసారి తిరిగి చూశాడు. ఆమె మంచాన్ని పట్టి, తను తిరిగి చూడకపోతే, తనని వెనక్కి పిలిచి యేదో మాట్లాడేదేమో నని తోచి, కొంచెం ఆగాడు. అతను ఆగడం చూసి, జానకి యింటివేపు తిరిగి వెళ్లి పోయింది.

యింటికి వెళ్లి సూర్యనారాయణ చాలా బాధపడ్డాడు. మళ్లీ తను పొరబడి జానకి నవుమాన పరచాను, తన స్నేహితుడి విశ్వాసాన్ని అన్యాయం చేశాను, పశ్చాత్తాపపడి, తనని తాను ద్వేషించుకున్నాడు. యింక స్త్రీలతో, పవిత్రులతో మెలగడానికి తను తగడు. తన

ముహం సిగ్గుతో దాచేసుకోవాలి. తను జానకినీ, జానకి మీది స్నేహాన్ని మరిచి పోవాలి. యింకా వాళ్లింటికి వెళ్లకూడదు. కాని జానకి తనకి కావాలని, జానకిని మరిచి పోవడం తన చాతకాదని, అంత రంగంలో వివరంలోనే వుంది. జానకి దగ్గిరికి వెడతానే వుంది. యింకా ప్రయత్నించి, ఆమెని స్వాధీనం చేసుకోవాలనే కోర్క కలుగుతోంది. భర్త యింటో నే వుంచి, యేపది మందికి చాటుగుండా అనుభవిస్తే, సంతుష్టి కలిగించే కపు స్త్రీ కాదు జానకి. ఆమె కళ్లల్లో నిర్మలమైన దయ, కలకలమని నవ్వు, కాంతిని వెదచల్లే ఆమె స్వభావం పూపరిమళంవలె నెమ్మదిగా, తనదిగా, విశ్రాంతిగా అనుభవించాలి. అది అసంభవమని తెలుసు. కోసిక ప్రయత్నించినా, ఆయింటోంచి జానకి కదలను, కదలి బతకదు. చెట్టుమంచి పూవుని కోసినట్టే. యింక జానకిని చూడకూడదు, వాళ్ల యింటికి వెళ్లకూడదని నిశ్చయించుకున్నాడు. నిశ్చయించుకున్నా, మర్నాడు సాయంత్రం అయ్యేప్పటికి, సూర్యనారాయణకి యింటిదగ్గిర కాలు నిలువలేదు. యిట్లా కాదని, పూరు విడిచివెళ్లి, వారంరోజులు యెక్కడెక్కడో తిరిగాడు, యెన్నడో తను మరిచిపోయిన స్నేహితులందరికీ తను యింకా వాళ్లని మరిచి పోలేదని, యింకెన్నడూ మరిచి పోనని, జ్ఞాపకం చేసి, కొంతమంది తట్టతగలేసిన బంధువుల తో మళ్లీ సంబంధం కలుపుకుని తిరిగి వొచ్చాడు.

౪

నాలుగు రోజులకి రామరావుక్లబ్బులో కనబడి.

„వొచ్చావా? నీకోసమే చూస్తున్నాను, యిన్నాళ్లెక్కడ?” అన్నాడు.

తన అవివేకపు నడవడి సంగతి జానకి చెపితే తనని చివాట్లు పెట్టడానికి వొచ్చాడనుకున్నాడు. రామారావు మొహం చాలా జాలిగా దిగులుగా కనపడుతోంది. యిద్దరూ టెన్నిసుకోర్టు మూలబల్లమీద కూచున్నారు.

„యివాళంతా పిచ్చి పట్టినట్లు తిరిగాను. అదేమిటో, కాలని నప్పుడే మనుష్యులు మాయమౌతారు. యెక్కడికి వెళ్లావు?”

తన మేనమామ సవితి తమ్మునికి యేదో జబ్బుగా వుందని గోణిగాడు.

„యెప్పుడొచ్చావు?”

„నిన్నే.”

„యింతవరకు యింటికి రాలేదేం?”

„ఆఫీసు పనితో పూపిరాడ్డం లేదు” అని గోణిగాడు.

„సరేలే, నీకూ అసహ్యం పుట్టింది. నాకన్నీ అట్లానే తటస్థ పడుతున్నాయి. సంగతేమిటంటే, పది పదిహేను రోజులనించి, జానకిలో పెద్ద మార్పొకటి వొచ్చింది. డాక్టరికి చూపిస్తే యేంటో జబ్బు లేదంటాడు. మనసులో విచారం పట్టుకున్నట్టుంది. జానకిని యెంతో అడిగాను. యేమి లేదంటుంది.”

„అసలు జబ్బని యెందుకనుకున్నావు?”

„మునపటి జానకే కాదు జానకి. నవ్వుచూసి నెల రోజులయింది. నవ్వకపోతే జానకికి జబ్బుగా వుందన్న మాటే. నాతో సరిగా మాట్లాడదు. అబ్బాయితో ఆడుకోడం మానేసింది. రాత్రులు వులికిపడి లేస్తుంది. ఆలోచనగా కూచుంటుంది. యేమన్నా నొక్కి అడిగితే చప్పున యేడుస్తుంది.”

„తమాషాగానే వుంది. యెందుకో!”

„అదే తెలీక కొట్టుకుంటున్నాను.”

„అయితే యేమంటావు, యిప్పుడు?” రామారావుకి కోపమొచ్చింది.

„నీకేం పట్టినట్టుందేం? పోనీలే.”

అని లేచాడు సూర్యనారాయణకి సిగ్గేసింది, “అది కాదు రామా. కూచో. నాకేం అర్థంగాక నాగోలలోనే నుండి అట్లా అన్నాను. నీకే తెలీకపోతే నాకేం తెలుస్తుంది? చెప్పు? అంతేకాని,....పోనీ నన్నేం చెయ్యమంటావో చెప్పు. చూస్తాను.”

నువ్వుమాత్రం యేం చేస్తావులే. కాని నీతోటిచెప్పుకుంటె నాబాధ కొంత తీరుతుందనుకుని యెప్పుడొస్తావో అని గంపెడాశతో కాచుకుని వున్నాను. ఒక్కవారం రోజుల్లో యిట్లా మారిపోయినావేం? నువ్వు మారిపోయినావు. జానకి మారిపోయింది. యిప్పుడాలోచించగా, మీరుకాదు నేను మారిపోయినానని పిస్తోంది. „యెవ్వరూ యేమీ మారిపోలేదోయ్. జానకికి యేదో కొంచెం మనసు చెదిరిపోయి వుంటుంది; అదేపోతుంది నాలుగురోజుల్లో.”

„అట్లా తోసెయ్యకు. నాకేదో గొప్పఆపద రాబోతుంది. జానకి యెంతమారిపోయింది! యెంత చిక్కిపోయింది!” „అదంతా నీభయం. అసలే భయస్తుడివి. కొంచెం.....”

రామారావుకి కోపం వొచ్చింది. “అట్లా చెప్పలేకపోతే, యింటికొచ్చి వొకసారి చూడరాదూ?” „నేనా? నేనా? వొస్తాలే. తొందరేం” రామారావు మాట్లాడలేదు. లేచి వెళ్ళిపోయినాడు. సూర్యనారాయణ కేం చేస్తాడు. మళ్ళీవెళ్ళి యేదో సమాధానం చెప్పి, మర్నాడు మాయింటికి వొస్తానన్నాడు.

జానక్కి యిట్లా మన స్తిమితం తప్పడానికి కారణమేమిటి? తనభర్త స్నేహితుడు, తన బాల్యమిత్రుడు, తనని అవిధంగా అవమానం చేస్తే తను సహించలేక, తన భర్తతో చెప్పలేక, మళ్ళీమళ్ళీ అతను అవిధంగా ప్రవర్తిస్తావుంటే తనస్నేహాన్ని నిర్మలమైన ప్రేమని అవిధంగా మలినం చేస్తోవుంటే, యేంచెయ్యడానికీ తోచక, యీసారి కనపడ్డప్పుడు అతనితో యెట్లా ప్రవర్తించాలో తెలీక, మనోవ్యథపడి, రామారావుకికూడా యిట్లా విచారం కలిగిస్తోంది. యీశోభకంతా కారకుడు తనూ, తక్షుద్ర మోహమూ. దూరంగా వుందామంటే, యీ రామారావు తనని వొదిలేట్టులేడు. వెంటనే బదిలీకి రాశాడు. జానకి యింటికి వెళ్ళనేలేదు.

వారంరోజు లయింతరువాత ఒకరోజు సాయంత్రం రామారావు జానకీ సూర్యనారాయణ యింటికి వొచ్చారు. జానకిచంపలు చిక్కిపోయి పల్చపడ్డాయి. మనోవ్యాధి పట్టుకున్నవాడివలె రామారావు కనపడుతున్నాడు. ,టీ' తాగి కొంతసేపు కబుర్లు చెప్పుకున్నారు. వెడుతో జానకి సూర్యనారాయణ వేపుకిరిగి.

,నువ్వు రాకపోతె మేమే వొచ్చాము, నిన్ను చూడడానికి అంది. మర్నాడు రామారావొక్కడు వొచ్చాడు.

'సూర్యా, నేను గొప్ప అపదలోనున్నాను. జానక్కి పిచ్చిపట్టింది. లేకపోతే గ్రహబాధో.''

గ్రహబాధల్లో నమ్మకం కుదర్తోందా యేమిటి? అన్నాడు సూర్యనారాయణ లేనినవ్వు తెచ్చుకుని.

" రామారావు అతన్ని మాటల్ని వినిపించుకోలేదు.

"సర్కీటువెళ్ళి నాలుగురోజులకిందట సోమవారంరాత్రి తిరిగి వొచ్చాను. వెంకన్న తలుపుతీశాడు. స్నానంచేసి జానకి గదిలోకి వెళ్ళాను. రాత్రి రెండుగంటలయింది. జానకి నిద్రపోతోందనుకుని, చప్పుడుకాకుండా లోపలికి వెళ్ళాను. గదిలో పెద్దగా దీపము వెలుగుతోంది. జానకి కిటికీలో కూచుని, చీకట్లోకి చూస్తోంది. పిలిచాను, పలకలేదు. చెయ్యిపట్టుకుని వూయిస్తే కళ్లుతెరిచి నావంక శూన్యదృష్టితో చూస్తుంది. కొంచెంసేపటికి గావును, కొంచెం పలకరించింది. అప్పటికీ యీలోకానికి సంబంధించిన కంతంకాదది. నేనేమనుకుంటానో అని, కష్టంమీద, నాతో మాట్లాడుతున్నట్లు తెలుస్తోనేవుంది. ఆయింటినే పెనుభూతం ఆవరించినట్టయింది. తనబాధ నాతో చెప్పమని కాళ్ళమీదపడి ప్రాధించాను. మాయిద్దరి ఆనందమూ ముక్కలు చెయ్యవొద్దన్నాను. నాయేడుపుచూసి, తనూ మొదలుపెట్టింది. మధ్యాన్నం ఆఫీసునించి వొచ్చి గదిలో కాగితాలు చూసుకోంటూ కూచుంటే జానకివచ్చి, నాకుర్చీమీద కూచుని,

"మీదగ్గర్నించి నేను వెళ్ళిపోతే మీరు సుఖంగా వుండలేరూ?'' అంది అర్థంగాక చూశాను.

'కావలిస్తే మళ్ళీవెళ్ళి చేసుకోండి'

,,యేమిటిది జానకీ'

నేను వెళ్ళిపోవాలిసి వొస్తుందేమో! తప్పదేమో అట్లా రాసివుందేమో!

నాహృదయంలో పుట్టిన గాఢవిషాదం నామొహంలో చూసిందేమో! యింటోకి వెళ్ళిపోయింది. భయంతో కుర్చీలోంచి లేవలేకపోయినాను. పదినిమిషాలసేపు కాళ్ళు వొణికాయి. బావిలో పడడానికో యెట్లాగో ప్రాణహత్య చేసుకోడానికో వెళ్ళిందనుకున్నాను. వెళ్ళిచూసేప్పటికి యేంచూడాల్సి వస్తుందో అనే భయంతో అసలు లేవలేను. చివరికి గదిలోకి వెళ్ళిచూసే అబ్బాయిని కావిలించుకొని యేడుస్తోంది...... యింక ధైర్యంలో నమ్మక మేంచెయ్యను?...

సూర్యా, నీకర్థంకాదు. యెట్లాచెప్పను? నా ప్రాణాలన్నీ సంతోషమంతా జానకే, దేవుడు నాకిచ్చిన మహావరం నాజీవనానికి వెలుగు. తరవాత నా ప్రాణాధికుడు. అబ్బాయి. వాళ్ళిద్దర్లో యెవరు కనబడకపోయినా చచ్చిపోతాను. యీ ఆపదలోంచి నన్నెవరు రక్షిస్తారు? దేహానికి జాడ్యమైతే, కుదర్చ వొచ్చు యిదెట్లా!......యెన్ని సార్లడిగినా, నాతో యీవిచారానికి కారణం చెప్పదు. నాకేమి తెలీటం లేదు... నువ్వురా. సూర్యా, నువ్వింకెట్లా అయినావు! యెందుకు మాయింటికి రావటం లేదు? పూర్వంవలె ఆనందంగా వుండటం లేదనా! జానక్కి స్వస్థత కలిగితే, మళ్లీ అట్లానే వుంటాం. మన ముగురం గడిపిన దివ్యమైన ఆరోజుల సంతోషం జ్ఞాపకం తెచ్చుకో. నాకు ఆదర్శపూర్వకమైన భార్యగాక, స్నేహితుడు కూడా దొరికాననుకున్నాను. మన ఆనందంచూసి సహించలేకో యేం చెయ్యమో, జానకి నాశరించి, మనని దుఃఖకూపంలో కూల తోసింది......నువ్వురద్దూ! ఒకవేళ నీతో చెపుతుందేమో!''

రామారావు వ్యధని చూసి సూర్యనారాయణకి చాలా జాలేసింది. తనే జానకితో మాట్లాడాలనుకున్నాడు. రామరావు బాధ చూడగానే జానకి మీదితన ప్రేమ పోయినట్టే కనపడ్డది. స్నేహితుడి మీది పాతస్నేహమంతా స్ఫురించి, యేమైనాసరే తను ఆతనికి విచారం కలగచెయ్యకూడదని నిశ్చయించుకున్నాడు

౫

నిండుచంద్రుడు కనబడకుండా పట్టిన వానమబ్బు. గాలి తిరిగేస్తోంది. గాలికళ్లమూసి చీకట్లో అప్పుడప్పుడు మబ్బులోంచి ఒక్కొక్క చినుకు రాలుస్తున్నాయి. సూర్యనారాయణ వరండాలో దీపంముందు చదవడానికి కూచున్నాడు. పక్కనున్న జాజీ, నైట్ క్వీన్, వాసనలేస్తున్నాయి. గాలిని, పరిమళాన్ని మరచిపోవాలని తలవొంచి రాసుకుంటున్నాడు. వరండాక్రింద క్రోటను ఆకులు కదిలాయి. అపరధ్యానంగా తలెత్తి చూశాడు. తోవ మెల్లిగా కాలుతో తడుముకుంటో తెల్లని ఆకారం నడిచి వొస్తోంది. అతని గుండెలు దబదబ లాడాయి. శరీరం కృంగిపోయింది. తెల్లనిమజిలిన చీరెకట్టుకుని, నీలం పువ్వుల కాయిల్ జాకిట్టు వేసుకుని, జుట్టు విరబోసుకుని చెట్లలోంచి నడిచివొచ్చిన, లావణ్య రేఖలోలాగు, వొచ్చింది జానకి. సూర్యనారాయణ నుంచున్నాడు.

"జానకీ!"

పలకలేదు. కాలుతో తడిమి మెట్లెక్కింది. సూర్యనారాయణ ఆమె దగ్గిరిగా వెళ్లి మళ్లీ పిలిచాడు. అతనివంక తిరగనైనా తిరక్క, సరాసరి గదివేపు వెళ్లిపోయింది. మొహంవొంక చూశాడు; నిద్ర పోతోంది. ఆశ్చర్యంతో యేంతోచక ఆగాడు. గది తలుపు తెరవబొయ్యేట్టు తడిమిందిగాని, తలుపు తెరిచి వుండడంవల్ల ముందుకి తూలింది. అతనుపట్టుకుని తీసికెళ్లి పక్కమీద పడుకోపెడితే, కదలకుండా అట్లానే పడుకుంది. సూర్యనారాయణ దీపం యెక్కించి, కుర్చీలో కూచున్నాడు. కలలోవలె, లేదా? యిట్లాజానకి తనగదిలో మంచంమీద పడుకుని వుంటుందని యెన్నడన్నా తలచుకున్నాడు. నిద్రపోతో యెట్లావొచ్చింది? యెందుకొచ్చింది? ఆమె పెద్దవల్లనిజుట్టు అలలవంటి నొక్కులతో అలసముద్రపు అలలాదిగిన నల్ల యిసికవలె పక్కమీద పరుచుకునివుంది. పక్కకి తిరిగి వున్నప్పటి పిరుదల వొంపు, బుజం అందం, సన్నని జాకెటు లోంచి కనపడే చర్మపు మెరుపు అతన్ని బాధ పెట్టాయి. రామారావు, అతని స్నేహమూ, మరిచి పోయినాడు ఆ నిమషాన. యెందుకొచ్చింది? తన బాధ చెప్పుకోడానికా? అతని మీది ప్రేమ చేతనా? అతని మనసులోని పట్లు తప్పి పోతున్నాయి. జానకి కళ్లుతెరిచి యేమంటుంది? తనని నమ్మి యిట్లా వొస్తే, తను యీ అక్రమంతలచి వొచ్చా? నిద్దట్లో యెట్లా వొచ్చింది? తన కోసమే. గడ్డంకింద చెయ్యేసి, యెన్నిసార్లో తను ఆశపడ్డ ఆమె పెదవుల కేసి చూశాడు. ఆమె చిన్నవూపిరి అతని ముక్కుని తాకింది. ఆమె పెదవులు అతనివేపు వొస్తున్నట్టే కనపడ్డది. అతని ముద్దుతో నూరేళ్ల నిద్ర మంత్రంనించి మేలుకుంటున్న దానివలె, దీర్ఘ నిశ్వాసం విడిచి, కళ్లు తెరవకుండానే, సన్నని చేతులు జాచి, వేళ్లతో అతని మెడ వెనక అదిమి పట్టుకుని బలంగా దగ్గిరికి లాక్కుంది.

"జానకీ, జానకీ" గట్టిగా వూయించివేశాడు. కళ్లుతెరచి అతనిమీద ఒక్కనిమషం కళ్లు నిలిపింది. మహాసంతుష్టితో మూసుకునివున్న కళ్లలోకి, వెంటనే భయంకరమైన చూపు. వేటాడబడె మృగపు మరణవేదనచూపు వొచ్చింది. దేహం అతన్నించి దూరంగా ముడుచుకుని సన్నగా, బాధతో, కూసింది.

"యెట్లా వొచ్చానిక్కడికి; యెందుకు దీసుకొచ్చావు? యేంచేశావు!"

"నువ్వే వొచ్చావు"

"నేనా? ఛీ, ఛీ, అబద్ధం."

"నిజం. నువ్వేవొచ్చావు.

"నేను రాలేదు. నేనెందుకొస్తాను! నేనురాను. యెన్నటికీరాను. నన్నుకోసినా రాను. నా నరాలు కాలిపోతున్నా రాను.

మెత్తని నవ్వుతో, కన్నీళ్ల చిరునవ్వులతో చూసే ఆమె కళ్లలో, గుడ్లుమధ్యకి వొచ్చి, కిందికిదూకేట్టు, మిడిసిపడుతో కనపడ్డాయి. భయం కరిగిపోయింది. అతని గుండె కరిగిపోయింది. మోహమంతా చెదిరిపోయింది. అతనామె చెయ్యిపట్టుకుని;

"జానకీ, నిజం చెపుతున్నా. నువ్వే నిద్దట్లో వొళ్లు తెలీక యిట్లా నడిచివొచ్చావు. నావల్ల నీకేమి భయంలేదు. యిట్లాచూడు. నాలో నమ్మకముంచి, నీబాధంతా నాతో చెప్పు. చెప్పితీరాలి. నీకోసం, నీసంతోషం కోసం, శాంతి కలిగించడంకు నాప్రాణమన్నా యిస్తాను." అన్నాడు.

ఆమె వేదన అంతా కరిగి కన్నీళ్లై కారింది. రెండు చేతులూ అతని బుజాల మీదవేసి, తలని అతని దగ్గిరగా ఆనించి యేడ్చింది. వాన కురిస్తే, భూమి చల్లపడి, ఆకాశం తేలికైనట్లయింది, ఆమెచూపు.

"యిందుకూ నాబాధంతా యిందుకూ. సూర్యనీతో యిట్లా వుండడానికి వీల్లేదు గనక. అక్కపెట్టి, స్నేహిపించినా కఠినాత్మురాలివని, నీకళ్లు ప్రతి సాయంత్రం డిపించినా కఠినాత్మురాలివని, నిన్ను చూసి నన్ను తిట్టడం చూసి వొర్చుకున్నాను. నిన్ను చూడకుండా వుండలేక, నాశక్తికి, నావాంఛ అతీతమై, యెంతఆపినా ఆగక, నిన్నిట్లాతాకి, పాపమని, ద్రోహమని, నీయెడలి అన్యాయమని, బాధ పడేదాన్ని.

"కాని బాధయెందుకు?"

"నీముందు వొప్పుకోడానికి వీల్లేనప్పు వొప్పు నా నా

నీమీందు, గోతులో పడ్డానన్న మాటే. నేనుపడ్డ బాధ యెంత కరమవుతుంది? రాత్రింబగళ్లు ఒక్క నిమిషం విశ్రాంతిలేక, ప్రతిరోజూ యెక్కువై, యేకరము కనపడని నబాధ.

,,యెందుకూ? చెప్పమ''

"రామారావుగారినీ, అబ్బాయినీ, నాసిగ్గునీ, మర్యాదనీ, అన్నిటినీ, పారేసి, నీతో వుండడమెట్లా? ఆయన జీవితమే నమ్మి నామెళ్లో వేశారు. యెట్లా తెంపను; మళ్లీ నాకెందుకు కనపడావునువ్వు? నన్నెందుకిట్లా అంతా లాగేసుకున్నావు? ...నేనోర్చుకోలేనింక. యెన్నాళ్లని ప్రాణాలు బిగపట్టి.....''

"యెందుకట్టా శ్రమపడ్డావు. జానకీ? నాఅభిప్రాయం తెలిశా?''

"కాదు. మొదటినించీ తెలుసు, అందుకనే యీ వేదనాధిక్యత కాని నీతో అట్టాటి సంబంధం బెట్టుకోడం నా కసాధ్యమైనపని. ఆయనవిశ్వాసమే నన్ను కట్టేసింది. నిన్ను రహస్యంగా కలుసుకుని, ఆయినయింటో ఆయన పక్కమీద.....మళ్లీఆయన రాగానే నవ్వి, ప్రేమ చూపి, ఛీ, ఛీ.....కాని నీవించి- నామనసును ఒక్క నిముషం మళ్లించలేక పోయినాను. యేవి జరగనియ్యకూడదని నిశ్చయించుకున్నానో, అవన్నీ జరిగినట్లే ఆలోచించుకుని స్వల్ప సౌఖ్యాన్ని పొందేదాన్ని. చచ్చి యీ పీడనంతా తప్పించుకుందామని, అపాడు బతుకు చాలించాలని, దేటోగోపడాలని యెంతో ప్రయత్నం చేశాను. కాని అబ్బాయినీ, ఆయన్నీ, వాళ్ల నిస్సహాయత్వం, దుఃఖం, తలుచుకుని, కష్టంమీద నాయత్నంమాని, చెప్పలేని, ఓర్చుకోలేని, బాధని అణుచుకుని చచ్చేదాన్ని తెల్లారిందాకా.''

"జానకీ, నాతో చెప్పకండా, దాచుకుని, పాపం, యిట్లా యిన్నాళ్లు, పిచ్చిపుట్టేటంత వ్యధపడ్డావా? నా చిన్ని జానా? నాతో చేపితే, నేను కామాంధుణ్ణై, పశువునై, నీకిష్టంలేందే, స్వాధనం చేసుకుంటాననుకున్నావా? అయ్యో. వృథాగా యెంత నలిగిపోయినావమ్మా.....యిప్పుడు చెప్ప, యీ సమస్య చెట్లా విడతియ్యాలో? రామారావు అబ్బాయీ 'నేను' పాతివ్రత్యం అన్నీ కావాలి నీకు. యెట్లా!.....పోనీ రామారావుతో యీ విషయం మాట్లాడితే:.....''

,,యేమని? ''

,,మన పంబంధాన్ని అతను వుదారంగా వొప్పుకోవాలని.''

,,యెట్లా వొప్పు కుంటారు? మన మెట్లా మాట్లాడతావు? అంత సాత్వికుడైనందువల్ల, సహిస్తడనా, నీవుద్దేశం? మళ్లీ నీ భార్య నైనా కాదుకదా. ఆయనతో సంబంధం నువ్వోర్చుకోగలవా? అందులో భర్త...''

,,ఆమె మాటలు నిజమేనని సూర్య నారాయణకి కూడా తెలుసు''

,,మరి యింకెట్లా జానకీ. నేను నీకు కనపడకుండా వెళ్లి పోతాలే.''

జానకి భయంతో నిండిన కళ్లతో చూసింది.

,,వొద్దు. యేమన్నా కాని. నువ్వు మాత్రం వెళ్లిపోవద్దు. యెంత కష్టపడ్డా, పదిరోజులకన్నా వొక్కసారి నిన్ను చూస్తే కొంచెం విశ్రాంతి కలుగుతుంది. నువ్వు కనబడక పోతే, యింక నిరాసతో, విశ్రాంతి నివ్వని వేదనతో మాడి పోతాను. యేమన్నా కాని, నువ్వుమాత్రం వెళ్లిపోకు.''

,, అయితేయెట్లా! నువ్వు వాళ్లనివొదిలి నాదగ్గరికి వొచ్చెయ్యి. రామారావు అలిగి పోతాడంటే, పోవాలి. యేం చేస్తాం. నాకూవుంది అతని మీద నీకున్నంత ప్రేమ. యిట్లా బాధ యెన్నాళ్లు పడగలవు? యిట్లా చిక్కి, బాదపడి, పిచ్చెత్తి, యెన్నాళ్లు బతుకుతావు! నువ్వు చచ్చిపోతే యేమవుతాడు? అంతే అనుకో. అట్లా ఆయింట్లో వుంటే యెట్లానూ బతుకు యెవరికి కాకుండా పోతావు.''

రామరావుగారి నవనాగరికంలో తర్ఫీదైనా, అదంతా పై ఆడంబరమే గాని, చిన్నప్పుడు తల్లి దగ్గరినించి నేర్చుకుని పూర్వోత్తరపు అభిప్రాయాలే మనసుని పట్టి, స్వాధీనం చేసుకుని వున్నాయి. భర్తని దైవంగా చూసుకోవాలని, పరపురుషుడి మీద మోహం నీచమని, ఆమె నిశ్చితాభిప్రాయం. సూర్యనారాయణ మీది ప్రేమ ఆమె శక్తి కతీత మయింది. కాని యీ పాత అభిప్రాయాన్ని, కూలతోయ్య లేకపోయింది. సూర్యనారాయణ మీది ప్రేమ వల్ల రామరావు మీద తనకి ప్రేమ వుండదనే సంగతి మరుగుపడ్డది. యిప్పుడిక సూర్యనారాయణని వదలలేనని తెలియగానే, రామ

...లేదనే అనుకుంది. తనకి రామారావు మీద ...భక్తి, సూర్యనారాయణకి మార్చాలని ప్రయత్నించి, ... రామారావు తనకు పరాయివాడు... సూర్యనారాయణ మాటలు విని, ...మర్నాడు రాత్రి, రామారావు నిద్రపోగానే అబ్బాయిని తీసుకుని, ... బంగళా వెనక బయలులో సూర్యనారాయణని కలుసుకుని, అతనితో వొచ్చేస్తానంది. సూర్యనారాయణ చీకట్లో జానకీని తీసుకుని బైలుదేరి, రామారావు యింటి గేటు దగ్గర దిగబెట్టి వొచ్చాడు.

౬

రాత్రి పదిగంటలయింది. అబ్బాయి తొట్టిలో నిద్ర పోతున్నాడు. బల్లమీద 'టేబిల్ లైట్' వెలుగుతోంది. వాన, గాలి, లోపలికి రాకుండా కిటికీ అద్దాల తలుపులు మూసి వున్నాయి. దీపం అద్దంలోపల మెరుస్తోంది. జానకి మంచంమీద కూచుని వుంది. రామారావు ఆమె వొళ్లో చేతులూ తలా పెట్టుకుని కింద కూచున్నాడు. పొద్దున నించి జానకి చర్య విపరీతంగా కనపడి అతనికి విచారం కలిగిస్తోంది. తను చచ్చిపోతే యేమి చేస్తావని అడిగింది. మరిచిపోలేదా? అందరూ ... పోవడం లేదా? మళ్లీ పెళ్లి చేసుకోరాదా?" యిట్లా ప్రశ్నలు, వెర్రి చూపులు, యిటూ ఆటూ ...గడం, 'యిదే ఆఖరుసారి' అనడం యెంత బతిమాలినా కారణం చెప్పకపోవడం అతనికి భారమే కాకుండా కోపం కూడా కలిగించాయి; యెన్నాళ్లో ... అనిపించింది. జానకి మెల్లిగా అతనిజుట్టు నవ్వుతో "వెళ్లి పడుకోండి." అంది.

రామారావు లేవలేదు. పది దాటింది, యింకా ...డేం! యితన్ని వదిలివెళ్లి పోవడమేనా?... అతి... మెడని వేళ్ళతో రాస్తోంది. అతన్ని చూసిన కొద్దీ ...వస్తోంది. మొహం తిప్పేసి సూర్యనారాయణ సంగతి ఆలోచించింది.........

రామారావు నిద్రపోయినట్టు తోచగానే మంచం దిగి, అతనికేసి చూస్తో ఒక్క నిమిషం ...ఉంది. తర్వాత [illegible] కట్టావు-టావు? [illegible] మెల్లిగా [illegible] వెళ్ళి చెవులకమ్మలూ, చేతుల బంగారు గాజులూ తీసి బల్లమీద పెట్టి. అతనివేసిన ... ఉంగరం ... అతను తన పుట్టినరోజు బహుమతి యిచ్చిన 'బ్రోచ్' తీసి, ఆరోజు అతను తనతో అన్నమాటలు జ్ఞాపకం వొచ్చేప్పటికి యేడుపొచ్చి కుర్చీలో కూలపడి, చేతులూ, తలా బల్లమీద ఆనించి మెల్లగా యేడ్చింది. [illegible]. సూర్యనారాయణ వానలో తనకోసం నుంచుని వున్నాడు, అబ్బాయి వుయ్యాల దగ్గరికి వెళ్ళింది. యెత్తుకుంటే లేవడూ? బయిటికి చీకట్లో వానలోకి వెళ్ళగానే అబ్బాయి లేచి 'అమ్మా! యెక్కడికో అంటే!... అన్నట్లు 'ఫ్లానల్' చొక్కా తియ్యాలి. [illegible] వొకటి కావాలి వుయ్యాలదగ్గరికి మళ్ళీ వెళ్ళి, అబ్బాయి యెత్తుకునేప్పటికి, చంద్రమతి లోహితాస్యుడి శవాన్ని యెత్తుకుడిగో, యేడ్చిన పద్యం జ్ఞాపకమొచ్చి, చేతులు వొణికి, అబ్బాయిని చప్పున వుయ్యాల్లో పడుకోపెట్టింది. అబ్బాయి 'అమ్మా!' అన్నాడు కళ్ళు తెరిచి. రామారావు తిరిగిచూసి, "జానకీ!" అన్నాడు. తన వొంటిమీద నగలు లేకపోవడం చూస్తాడు.

"జానకీ"

"...స్తున్నా. అబ్బాయి లేచాడు." అని వుయ్యాల వూపుతో కొంచెంసేపుండి "వొస్తావా? నేను రానా?"

యింకేం చెప్పను! దీపం బాగా తగ్గించి పక్కదగ్గరికి వెళ్ళింది. యిప్పుడు మళ్ళీ యెందుకు లేచాడు? యింకా యెంతసేపటికో ఏమో! కొంచెం ముందు బైలుదేరి వుంటే? యీపాటికి సూర్యనారాయణ కౌగిలిలో, అతని మొహముకేసి చూస్తో..........ఆనందంతో వొళ్ళు వొణికింది. నిన్న అతను గట్టిగా [illegible] స్పర్శ జ్ఞాపకమొచ్చింది.

"జానకీ, యింకా రావేం!"

రామారావు ఆమె చెయ్యిపట్టుకుని మంచంమీదికి లాక్కున్నాడు.

"పడుకోండి. వొస్తాను"

రాత్రంతా జానకి యిట్లా లేచి [illegible] వుండడం, విచారంలోనూ, పరధ్యానంలోనూ మునిగి, తననించి తప్పించుకుంటున్నట్టు తోచింది రామారావుకి. జానకిని తనదాన్ని చేసుకోవాలని అతని "సబ్‌కాన్షస్‌నెస్" లో తోచింది.

రామారావు స్పర్శలోనే అతని భావాన్ని జానకి గ్రహించి భయపడ్డది. సూర్యనారాయణతో హృదయం నిండివుండగా, రామారావుకి లోబడ కూడదు. కాని వెళ్లిపోతే, యితని ఆఖరు కోర్కె యెట్లా నిరాకరించడం? తన మెడచుట్టూ అతని చేతు లట్లా పెట్టాకుంటే, అతన్ని తోసెయ్యగలనా? అతని స్పర్శయెంత మధురంగా వుందో, చంటి పిల్ల వాడు ప్రార్థిస్తున్నట్టు? కాని యెట్లా వొప్పుకోడం?

«నాదేహం మనసూ బావుండలేదు. పడుకోండి»

రామారావు వినిపించుకోలేదు. ఆమాటలన్నది కాని, ఆతృతతో అతనివేపు జరుగుతున్న తన దేహమే చెప్తోంది, రామారావు కావాలని, సగం చీకటో అతను కనపడకుండా కళ్లు మూసుకుని, సూర్యనారాయణ రూపం నల్లమందు కల్పించుకుని రామరావు మోహానికి దేహం వప్పచెప్పింది. అతనిచేతులు ఆలిసిన ఆమె మనసు పట్ల తపించి, మార్చుపోయే దేహాన్ని, అంత గాఢంగా స్పృశిస్తున్నాయి.

..................................................

..................................................

పదకొండున్నర కొట్టింది. రామారావు జానకి బుజంమీద తలపెట్టుకుని నిద్రపోతున్నాడు. ఆమె కళ్లు తెరుచుకుని పైకి చూస్తే, గంటవిని వులికి పడ్డని సూర్యనారాయణ యేమను కుంటున్నాడో? పాపం, వొక్కడూ ఆ చీకట్లో? ఆ తలని తన చేతులతో తీసెయ్య లేదు. రామారావు మీద విడవలేని ప్రేమ అని తెలుస్తోంది. జానకి కాదు. రామారావు తనకి కావాలి.

చిన్నతనంనించి ఆమె జీవనాన్ని నడుపుతున్న వూహాలలోనించి తప్పించుకుని, తనకి యిద్దరిమీదా ప్రేమేఅని తెలుసుకొని వొప్పుకోగల జ్ఞానమూ, ధైర్యమూ, జానక్కి యింకా రాలేదు. భర్త వొక్కడే స్త్రీకి, అతనే దైవమనే సెంటిమెంట్ల ఆమె కళ్లని కప్పింది. రామారావుని వొదిలి సూర్య నారాయణతో వెళ్లడం, పాపమని ఆమె అభిప్రాయము.

ఆ పాపమైనా చెయ్యగలను కాని, వాళ్లిద్దరూ వొప్పుకున్నా; యిద్దరితో తను జీవితం గడపడం ఆమెకి అసాధ్యం. కనక యిద్దరిమీద ప్రేమ అనే సంగతి ఆమె కు స్ఫురించడం అసంభవమయింది. యేపనులు చెయ్యడానికి ధైర్యంలేదో, అవి మంచివనికాని, అవి లోకంలో సహజములనికాని వొప్పుకోడం, కష్టం.

౪

గోజల్లా చినుకులు పడుతో యీదురుగాలి వేస్తోంది. యిల్లంతా నాలుగు గంటలకే చీకటి. లోకమంతా విచారమయంగా, జీవితం అర్థహీనంగా, ఆదర్శాలు, ఆశలూ, అబద్ధాలుగా తోచాయి. రాత్రి యెనిమిదింటికి జోరనివాన మొదలు. సూర్యనారాయణ, ప్రతి నిమిషం బైటికివెళ్లి ఆకాశం యేమూలన్నా తెరిపివిచ్చినట్ట నక్షత్రం కనబడు తుందేమోనని చూశాడు. గుండెల శబ్దం తొందరవల్ల ఒక్కనిమిషం కూచోని నరాలవల్ల పడిన్ర కి బైలుదేరాడు, ఆవానలో చీకట్లో జానకి రాదేమో! కాని వొస్తే! వొచ్చినా రాకపోయినా, తను యింట్లో నిలవగలడా? రోడ్డు మీదికి వెళ్లేప్పటికి వానపడి గొడుగు జ్ఞాపకం వొచ్చింది. యింటోకివొచ్చి దీపం వెలిగించాడు. జానకి వొచ్చేప్పటికి యిల్లిట్లానే వుంటే. అన్నీ సద్దాడు. మంచంమీద పక్కేశినాడు. వానలోనే వెళ్లితెచ్చిన చామంతి పువ్వుల దండని యెదురుగా తగిలించాడు. జానకీ వొచ్చేప్పటికి సిద్ధంగా వుండాలని కాచివుంచిన నీళ్లు వేడిగా వున్నాయో లేదో, వేళ్లుపెట్టి చూశాడు. గొడుగు దగ్గిరికి వెళ్లేప్పటికి, యింకో ఆలోచన తోచింది. జానకి గొడుగేసుకుని వొస్తుందా? అబ్బాయిని చంక నెత్తుకుని వొంటరిగా, చీకట్లో, నడిచి వొస్తుంది, అబ్బాయి నెత్తి మీద చెరుగుకప్పి......తనకి గొడుగా? జానకి రాగానే కావిలించుకోడానికి తన రెండు చేతులూ కాళీగా వుండవొద్దూ?

తడుస్తో, చీకట్లో, నీళ్లగుంటల్లో బురదలో నడ్చాడు, బంగాళా వెనకాల తుమ్మల మైదానం మీదికి. గాలిలో చెట్లు చింపిగల దెయ్యాల మల్లే వూగుతున్నాయి. ఆకాశపు మెరుపు దెబ్బలు భరించలేక, భూమి బాధతో భయంతో మూలుగుతోంది. సూర్య నారాయణ జుట్టులోంచి, కనుబొమ్మల మీదనించి, జోబుల్లోంచి నీళ్లు కారుతున్నాయి. చలిలో వొణుకు పుడుతోంది. జోరుమని కొట్టేవాన పురిమేమబ్బులు, కారుచీకటిని కల్పిస్తోగంతు లేసేచెట్లు, తడి, చీదర, కాళ్లమీద పైకిపాకే గండుచీమ

ఆరవ నిజాం రాష్ట్రీ హిందూసంఘ సంస్కార మహాసభ



అధ్యక్షురాలు
శ్రీమతి సరళాదేవి చౌధరానీగారు,
బి. ఏ.



ఆహ్వాన సంఘాధ్యక్షులు
శ్రీయుత రామచంద్రనాయకు గారు
ఎం. ఏ., బార్ ఎట్ లా.

C. K. PRESS.

మా, పకిని అరగంట అనుభవించేప్పటికి సూర్య నారాయణకి మోహం తగ్గింది. దేవుడే తన కీవిఘ్నం కలిగించడానికి, యిట్లా భయంకరరూపం దాల్చినట్లయింది. పాపం, యీ చలిలో, గాఢాంధకారములో అబ్బాయిని మోసుకుంటో జానకెట్లా వొస్తుంది? రామారావుని ఇంటిమీద, అయింటికంతా వొంటరిగా వొదిలి? తన మీద రామారావు విశ్వాసమూ, ప్రేమా జ్ఞాపకం వొచ్చాయి. యెందుకు తనిట్లా రామారావు సంసారం పాడుచెయ్యడం? అతనా దిగులుతో నిజంగానే చచ్చిపోతే? పిచ్చెక్కితే? మర్నాడు తన యింటికివొచ్చి అల్లరిచేస్తే? దుపత్తెలో లేచిపోయి వొచ్చిన వాడని బంధువులూ, స్నేహితులూ, అందరూ మొహాలు తప్పించడం, జానకి దిగులు పెట్టుకోడం రామారావు కోసం, నిద్దట్లో లేచి పోకడం, అన్నీ తలపుకొచ్చాయి. యెన్నాళ్లీబతుకు? యీయింద్రియసుఖాలు! అని ఆలోచిస్తో చీపురుపుల్లలాగు ప్రచండవాత పాతంలో బాధపడుతో, నుంచున్నాడు.

౮

,,అక్కడ ముల్లుగుచ్చుకొని నెత్తురు కారుతోంది. లేకను నువ్వువెళ్లి పోతావేమో ననుకున్నాను. అయినా ఒకవేళ యీ వానలో నువ్విట్లానే నుంచుని వుంటావేమో ననే దిగులుతో ధైర్యంచేసి వొచ్చాను. నువ్విక్కడనే కనపడకపోతే, మళ్లీ యింటికెట్లా వెళ్లగలిగేదాన్ని! నా ఆక్రమాన్ని చూసి, దెయ్యాలు నన్ను యెత్తుకు పోవడానికి వొచ్చినట్టే భయమేసింది, ఆచెట్లు కొగలో వుంటే........,,

మెరుపు మెరిసింది. ఆమె తలలో దపనం పడిన పట్టువించి, తడిలో అతుక్కుని వేళ్లాడుతోంది. గులు దగా చంపలపైన వుంగరాలజుట్టు చీదరగా చంపలకి అతుక్కుని చెవుల చివరనించి నీళ్లు కారుతోంది. చీరా రవికా తడిసి వొంటికి కతుక్కున్నాయి. కాని అతనిలో మోహాన్ని లేపలేక పోయింది. షర్టు గుండీలు ఆమెకి నచ్చుకొండా తీసి కింద పారేసి, మెల్లిగా ఆమెని కావిలించుకున్నాడు. చలిలో యిదివరకిట్టి సౌఖ్యమతని కలగలేదు. ,,అబ్బాయి యేడీ? తీసుకురావా?,,

జానకి మాట్లాడలేదు. జవాబుకి ప్రయత్నించి సిద్ధపడుతున్నట్టుంది.

,,యేం జానకీ?,,

,,సూర్యా, నేను రాను, రాలేను. రాలేను.,, ఆ కంఠస్వరం కాదు. ఘోరపాపాలుచేసి, చచ్చి, అన్ని యేళ్లా నరకించినా యీలోకాన్ని వదలలేక ఆతుమ్మచెట్లలో వూగే దయ్యమేదో అంటున్నట్టు ధ్వనించింది.

,,యెందుకు, జానకీ, మళ్లీ యిట్లా అంటావు?,,

"అయన్ని వొదలలేను....నాకే యిష్టంలేదు,,

,,మరి నేనూ? యీవాళ యెందుకిష్టం లేకుండా పోయింది? నన్ను వొదిలేస్తావా?,,

,,నిన్ను వొదిలెయ్యలేను. కాని నేను రాను.,,

,,తమాషా చేస్తున్నావు. రావూ, యెందుకూ?,,

,,రమ్మనకు, నువ్వు గట్టిగా రమ్మంటే, వెళ్లేశక్తి పోతుంది నాకు. నీకు నామీదయిష్టం లేదు పొమ్మను. అబద్ధమే. కాని నమ్మి వెళ్లిపోతాను.,,

,,యేమిటి, జానకీ? యెందుకట్లా మాట్లాడతావు.,,

,,నేను నీతో వున్నా, యేమిసౌఖ్యమివ్వను. నేను పిశాచిని. యెవరికీ సౌఖ్యమివ్వను. నన్ను పొమ్మను. నాకు నీమీద మోహమేమిటి? పొమ్మ,,

,,విచారంతో నీకు మతిచలించింది. యిట్లా కూచో,,

"సూర్యా! నీకాళ్లమీద పడతా. నన్నొదిలెయ్యి. అట్లా లాగావంటే నీతోవచ్చేస్తా. నిన్నింక వొదలను. నన్ను తీసికోకు. వొదిలేసి వెళ్లిపో. నామాట వినవూ? నామీద దయలేదూ? జాలిగలగలేదూ?

కింద కూచుని అతని మోకాళ్లని కావిలించుకుంది. ఆమె జుట్టు నీళ్లలోపడి కొట్టుకుపోతూంది.

"ముందింటికి వొచ్చెయ్యి. స్తిమితంగా రేపాలోచిద్దాము.,,

"యింక మళ్లీనిన్ను వొదలగలనా? యింకరేపూ లేదు యేమీ లేదు. నేనురాను."

'అయితే ప్రస్తుతం వెళ్లు జానకీ. నీవిచారం భరించలేను.'

ఆమాటఅనడం అంతసులభం కావడం అతనికాశ్చర్యం వేసింది.

,,వెళ్లనా? యెట్లా వెళ్లను? మళ్లీ నువ్వులేకుండా అయింటో...అబ్బా, ఆబాధ పడలేను. నేను,,

అతని కసహ్యం వేసింది ఆమె విచారం.

,,అయితే యేమంటావు?,,

మాట్లాడదు. మెల్లిగా జానకిని తీసుకుని బైలుదేరాడు. రామారావు బంగాళా గేటుదగ్గిర నుంచోపెట్టాడు.

,,నన్ను మరిచిపోయి సుఖంగావుండు. రామారావుని వొదిలేవు. నేను నీకింక కనపడను,,

వెనక్కి తిరిగాడు. ఇంకా అట్లానే నుంచునివుంది, అతని వేపుచూస్తో వానలో తడసి, తలవొంచుకుని వెళ్లిపోయినాడు.

సూర్యనారాయణ రైల్లో కూచున్నాడు. ట్రాన్స్ఫర్ ఆర్డరు రావటం వొచ్చింది. రైలు కదుల్తోంది. రామారావు పరిగెత్తుకుంటూ వొచ్చాడు. అసహ్యమే సేటంత చీదరాగా వున్నాడు. పొట్టి. బెంగాలి పంచా, కంటమెడ ఆఫారం వేసుకున్నాడు.

"సూర్యా నువ్వు రైలు దిగాలి. దిగుతుంది. తర వాత చెప్తాను."

"యేమిటి, చెప్పు."

"జానక్కి జబ్బుగావుంది చాలా. ఆదివారం రాత్రి యింటికో తడిసింది. నెమ్మానిగా వొచ్చి, సంధి తోస్తుంది. నిన్నే కలవే పిలుస్తోంది. దిగుమరి."

సూర్యనారాయణకు మాట్లాడలేదు. దిగకుండా యెట్లా? దిగితే? తరవాత?

"రా. దిగవేం!"

సూర్యనారాయణ లేచాడు. దిగాలి తప్పదు. కాని దిగితే మళ్లీ జానక్కి కనపడితే. జానకి జబ్బు, రామారావు గోల! అబ్బా.....

రైలు వెళ్ళిపోతుంది. కిందికిచూశాడు, దిగ్గడానికి లేదు. బడి యెక్కువయింది.

వెనక్కి చూశాడు. పెదిమలు వొణుకుతో కళ్లనిండి నీళ్లు కారుతో, తనని పిలుస్తో రామారావు కనపడ్డాడు యెండలో కాలే, ప్లాట్ ఫారంమీద.

# శ్రీకృప

యామర్తి సూర్యప్రకాశరావు

తావకీన సాన్నిధ్యమం దమరగలుగు
నిరవధికమైన యానంద నిర్మలోద
క కరుణ సరసిలోఁ బుట్టు కమ్రతర త
రంగ డోలి కాంతర మనోజ్ఞాంక మందు
ననిశ మానంద మూర్తినై యాడుకొంటి
త్వత్కరుణ సరసీజ పత్రాంతరమున
వరలు మాధురీ సుధను ద్రావంగ, దేవి!
ఏల నీ దీన మధుపున కిచ్చినావు
చోటొకింత, యచట గ్రోలి సొక్కమనుచు!
ప్రతి ఫలించెమిఁ గోరి ప్రబలతర మహా
దానురాగ మరుద్వీచి కాంతర చలి
త హృదయారవింద విలసద్యళము నందు
జేర్చుకొన్నావు దీనునిఁ జేయి జూపి!
నిష్ఠ దారిద్రిబుణభార మెటుల దీర్చి
ధన్య జీవుఁ జేసని నీవు తలచినావు!
త్వన్మనోహర హృదయ స్థానంబులోని
దివ్యదరమ్యా కవాటము తెరచి వైచి
శుభ్ర సోపాన పథమున సోలకుండ
దీను నెక్కించుకొన్నావు దేవి! నీవు.
అధికతమమైన బుణభార మవని నిపుడు
దీర్చుకొనుటకే జీవికిఁ దెరవులేదు:
తలచుకొన్న, నీరంధ్ర ఖేదాగ్ని కీల
లందు, దగ్ధమైపోవు హృదయంబుజమ్మ!
వందనమ్ము దివ్యాంభోజ వదనమునకు!
వందనమ్ములా కింకిణీ పాదములకు!
పరమ సాధ్వీను దేవికి—వందనముల్!

'అమావాస్య'నుండి

# చంద్రికాపరిణయ వ్యాఖ్య

శ్రీ శేషాద్రిరమణ కవులు

ఆంధ్రమునందున్న యుత్తమకావ్యములలోఁ జంద్రికాపరిణయ మొకటి. సురభిమాధవరాయ నృపాలరచితమగు నీ చంద్రికాపరిణయమును అవధానము శేషశాస్త్రులు వెల్లాల సదాశివశాస్త్రులు వారలను విద్వాంసులచే శరదాగమమను వ్యాఖ్యానము రచింపఁజేసి శ్రీ జటప్రోలు సంస్థానాధీశ్వరులగు రాజా సురభి వేంకటలక్ష్మణరావు బహద్దరువారు 1904లో ముద్రించితదాదిగా నేటికిని యాంధ్రపాఠకలోకమున కుచితముగా నొసఁగి కృతజ్ఞతాపాత్రు లగుచున్నారు. ఇప్పుడా గ్రంథరత్నము ద్వితీయ ముద్రణము కానున్నది. వ్యాఖ్యాతలలో నొకరగు శేషశాస్త్రిగారు చిరకాలము క్రిందట కాలధర్మము నొందిరి. రెండవవారగు సదాశివశాస్త్రిగారు పునర్ముద్రణమునకు వ్యాఖ్యానము బరిష్కరించుచు నీ మధ్య కాలధర్మము నొందిరని వ్రాయుట కెంతయు విచారించెదము.

శాస్త్రియుగళము శరదాగమవ్యాఖ్య వ్రాయక ముందీ గ్రంథరత్నమునకుఁ బూర్వకవి ప్రణీత వ్యాఖ్యానము గలదాయను నంశము ఆది శ్రీ శాస్త్రిద్వయ మెఱిఁగియుండునాయను నంశము ప్రకృతము చర్చింపఁదలఁచియున్నది. ముద్రిత చంద్రికాపరిణయమునకు వ్యాఖ్యానము శ్రీ శాస్త్రియుగళము స్వయముగా వ్రాసినటుల వేదము వేంకటరాయశాస్త్రిగారును కం. వీరేశలింగము పంతులుగారు అభిప్రాయము లొసంగియున్నారు. గద్యములోఁ దాము స్వతంత్రముగా వ్రాసితిమని వ్యాఖ్యాతలు చెప్పుకొనియున్నారు. ఈ యుత్తమ కావ్యమునకు వీరొనరించిన సేవ జయప్రదమైనది సమగ్రమైనదే గాని యింతకుమున్నె యుత్తమకావ్యమునకు వ్యాఖ్యానమున్నట్లును దానిని శ్రీ శాస్త్రియుగళము చిత్తగించినటులును దలంప నవకాశములు గలవని తెలుపనున్నారము.

చంద్రికాపరిణయ గ్రంథకర్తయగు సురభిమాధవరాయనృపాలుఁడు విద్యానగరసామ్రాజ్యాంతిమరాజగు అళియ రామరాజు సమకాలికుఁడు. కాన నీ కవికాలము పదునాఱవ శతాబ్దప్రాంతమని యింతకుమున్నె మేము 'సారస్వత సర్వస్వము' పత్రికలోను సంవత్సరాది సంచికయందును జర్చించియున్నారము. ఎలకూచి బాలసరస్వతిగూడ వేఱొక చంద్రికాపరిణయమును రచించెను. బాలసరస్వతి మాధవరాయని తాతయగు మల్లభూపాలుని యాస్థానములోనివాఁడు. ఆవలికథాంశము, చరిత్రము వేఱుగాన మనకు దానితోఁ బనిలేదు. ప్రకృత విమర్శనీయగ్రంథము మాధవరాయ కృతి చంద్రికా పరిణయము.

ఓరియంటల్ లైబ్రరీలోని గ్రంథముల పట్టికలో 203సన చంద్రికాపరిణయవ్యాఖ్యాన మొకటి కలదు. కేవల యామోదమని యా వ్యాఖ్యానమునకుఁ బేరు పెట్టఁబడినది. వ్యాఖ్యాత తన నామాదికము నీ క్రింది విధముగాఁ జెప్పుకొనినాఁడు:—

సీ॥ శ్రీసతీపరివృఢ శ్రీకరాపాంగ ద
ర్శన సుధాసంలబ్ధి గసినవాఁడ
నవచంద్రికాపరిణయ ముఖ్యకావ్య వి
ర్మాణచణస్ఫూర్తి మనినవాఁడ
విబుధసేవన విమలసారస్వత
ప్రాభవప్రాప్తిచేఁ బ్రబలువాఁడ
సర్వసర్వంసహా చక్రచంక్రమణ క్రి
యాచింత విఖ్యాతి నలరువాఁడ

తే. గీ॥ ప్రకట పులిమామిడీ దుర్గపటుకవాట
కీలముద్రాజశక్తిచే గొనినవాఁడ
సురభివంశాబ్ధి జనియించి సొబఁగుమీఱు
వాఁడ మాధవరాయాఖ్య వఱలువాఁడ॥

తే. గీ॥ ప్రమదమున నేను చంద్రికా పరిణయమున
......వ్యాఖ్యాన మొనరఁజేతు
ధరణివిబుధులు వర్ణింపఁదరముగాక
బాలకవిగాహ యోగ్యమై ప్రబలునట్లు

గద్యము. శ్రీమదనగోపాలప్రసాదసమాసాదితోభయభాషాకవిత్వకళాకళత్ర కౌశికగోత్రపవిత్ర సురభిమల్లమాంబాపాల సత్పుత్ర కవిజన విధేయ మాధవరాయ ప్రణీతంబైన కుసలయామోదంబను చంద్రికా పరిణయవ్యాఖ్యానంబునందుఁ బ్రథమాశ్వాసము.

చరిత్రాంశములు ప్రకృతమునకుఁ గావలసినంత వఱకే వాఖ్యనుండి పద్యాదికము లుదాహరించినారము. వ్యాఖ్యానముగ యుదాహృత పద్యములవలన లోన మాధవరాయకవి చంద్రికా పరిణయమునే గాక వ్యాఖ్యానమునుగూడ రచించినట్లు సిద్ధాంతమగుచున్నది. వ్యాఖ్యానము సమంజసముగా శ్లేషార్థబోధకముగా సుశ్లిష్టముగా నున్నది. వాడుక భాషలో వ్రాయఁబడియున్నది. నిఘంట్వాదులనుండి యుచితస్థలములఁ నుదాహరణములొసంగఁబడియున్నవి. ఇట్టియుత్తమ వ్యాఖ్య కవి వ్రాసినదియుండఁగా నూతన వ్యాఖ్యతో నేపనియుండెను. ఇంకను విపులముగా వ్రాయఁదలంచిన పూర్వవ్యాఖ్యానము మాటయైన చెప్పవలసియుండ శ్రీ శాస్త్రియుగ్మమెట్లుఁ జెప్పకుండుటకుఁ గారణము విచారణీయము. వ్యాఖ్యాతలలో నొకరగు సదాశివశాస్త్రిగారు వెలుగోటివారి వంశచరిత్రము కొఱకు ప్రాచ్యలిఖితపుస్తకాలయమంతయు గాలించిన పరిశోధకులు. పూర్వవ్యాఖ్యానము తెలియకుండుట సంతాపకరము.

శ్రీ రాజాసురభి లక్ష్మారావుబహద్దరువారు ద్వితీయముద్రణములోనైన గ్రంథరచయిత వ్యాఖ్యానమును బరిశోధింపఁజేసి యందలియములాంశములను జేర్చుటయుచితమని మా మనవి. ప్రాచ్యలిఖిత పుస్తకాలయమునందలి వ్యాఖ్యానప్రతికిఁ బ్రత్యంతరములు సంపాదించి గ్రంథపాఠములు సవరింపవలసి యున్నది. కవి స్వయముగాఁ దాను వ్రాసిన వ్యాఖ్యానమున కెంతయేని విలువయుండును. కవి వ్రాసిన భావములు సాధారణముగా వ్యాఖ్యాతలకు స్ఫురింపక పోవచ్చును. చంద్రికాపరిణయమువైలక్షణ్యమునందు వసుచరిత్రమును మించియుండును. శ్లేషయమకాదు లందు అద్వితీయమైన యుత్తమ కావ్యము. తమపూర్వుల ప్రతిష్ఠకొఱకు ముద్రింపఁబడు నీపునర్ముద్రణమున గ్రంథకర్త వ్యాఖ్యానము పూర్తిగాఁ జేర్చుటయో అందుంచి యమూల్యాంశములున్నఁ జేర్చుటయో యుక్తమనియు ఆవశ్యకర్తవ్యమనియు ప్రకాశకులకు విన్నవించుచున్నారము.

# మోహాబ్ధి

వర్ఘుల వేంకటేశ్వరకవి

శాంతభాను ప్రభా మయూ
ఖాంతకలిత
చిత్రనటనాసమంచితా శ్లేషరాగ
తళతళన్న వ్యళీకరార్ద్రి ప్రసన్న
వ్య రాజీవ మయసరోవరతరంగ
లిత జోలావితాన డోలాయమాన
మలయ మారుతపోత శీతలవిశాల
కల్పిత విహారణోత్సాహకలనc
ప్రణయభావాబ్ధివీచికా పటలిc దేలి
యాయిపోయితి నొక్క సాయాహ్నమందు.

ప్రణయరాగ విలీనమై భావములర
కుదెసల నేను బరికించి నాcడ నంత
సుకుమారిని చూతావనీజతన్వి
గ్గచేcగ్రిందికించుక శిరమువంచె;
శానిc గనినంత మత్స్వాంత దర్పణమునc
ప్రణయమూర్తియా మత్ప్రియ ప్రతిఫలించె
మధురమంజుల మహిత కోమలమనోజ్ఞ
రవంబంత వీనుల విందొనర్చె;
లలితగీతికానుషం గ్రోలినంతc
గ్రాణనాయక నవమనోహరకలస్వ
నామృతమును గ్రోలుచుండిన యట్లుతోచె
క్కనేయంత నాదృష్టిపథమునందు
శోకముగనొప్పు నొక్కగులాబిపొక్కె;

అందులోనాదు సఖిచెక్కులందుc గలుగc
జాలులే సిగ్గొకించుక జాజువార
మల్లెపూవుల గములచే నల్లసిల్లు
మృదులవల్లిక యొండు నా దృష్టిcబడియె
ఆ లతికనాదు నవమోహనాంగిమంజు
తనువుc దలcపించి తలcపించి ననువుcగొల్ప
నామె యవ్యాజ నవమందహాసరుచులc
దెలిపె నాదేహమంతటc బులకలు జనింప.

ఆమెచూపుల లోపల నండమైన
నిగనిగలనీటు లెంతయు నింకుకొనcగ,
నామెముద్దుల మధురంపు టధరమంత
లేత మునిమునినవ్వులు లీలనలర,
నామెదేహంపు నునుజాయలందు మేల్మి
జాలువాక్రొంబసిcడికాంతి జాజువార,
నాకు నల్లంత దూరాన నాలతాంగి
యొక్క మృదువల్ల ప్రక్కనే యుండితోచె.
లీలనొయ్యారముగనొప్పు వాలుగంటి
దృష్టితోcగూడ నాదృష్టి యేకమయ్యె
ఆమెకడకేcగి మెల్లిన నాలతాంగి
నాదు బాహుల నాలింగనంబొనర్చి
తనవితీరంగ ముద్దాడి తనువుమరచి
యపరిమితమైన యానందమంది మివుల
మోహవారాశిలోపల మునిcగిపోతి.

# నిజాంరాష్ట్రము

## పరిపాలనా విధానము

గంగరాజు రఘునాథరావు

(గతసంచిక తరువాయి)

### మాల్గుజారీ

(భూమ్యాదాయశాఖ)

1887 మున భూమ్యాదాయ శాఖ కార్యదర్శి తొలగింపబడెను. మరల రివిన్యూబోర్డు పునరుద్ధరింపబడెను. సదరుల్ మహాములు మొయినుల్ మహాములుగ మార్చబడిరి. భూమ్యాదాయ ఆర్థిక శాఖలోని మొయినుల్ మహాము ఆధీనమునందుండెను. 1888 మున ఈ రెవిన్యూబోర్డు తీసివేయబడెను. టంకసాల, స్టాంపులు, తపాల భూమ్యాదాయ కార్యదర్శినుండి తీసి హోంసెక్రెటరీయొక్క వశమునకు చేర్చబడెను. ప్రత్యేకముగ ఆర్థిక శాఖ యేర్పాటుచేయబడెను. 1898 మున వికారుల్ ఉమ్రా భూమ్యాదాయశాఖ మంత్రి (మొయినుల్ మహాము) కాగా మరల రివెన్యూబోర్డు స్థాపింపబడినది. ఈ బోర్డు 1901 వరకుండెను. పిమ్మట తొలగింపబడి రివెన్యూ కార్యదర్శి నియోజితుడయ్యెను. ఈ శాఖ ప్రధానమంత్రి అధీనమున నుంచబడెను. 1911 మున రివెన్యూశాఖకు డైరెక్టరు జెనరలు నియమింపబడెను. ఈ అధికారి మంత్రి అభిప్రాయానుసారము కార్యములు జరుపుచుండెను. 1918 మున డైరెక్టరుజనరలుపదవి తొలగింపబడి సదరుల్ మహామును, కార్యదర్శియును, నియమింపబడిరి. ప్రస్తుతము పైవిసము డైరెక్టరు జనరలు కూడ గలడు.

1898 నుండి 1901 వరకు వికారుల్ ఉమ్రా ప్రధాన మంత్రిగ నుండెను. ఆయన కాలమున పరిపాలన నందీ సంస్కరణములు చేయబడినవి:—

౧. తామీరాతు శాఖయు (Public works) ఆబ్పాషీ శాఖయు (irrigation) వేర్వేరు చేయబడినవి.

౨. రిజిస్ట్రేషను శాఖకు ఇన్స్పెక్టరు జనరలు నియమింపబడెను.

3. శాసనసభ స్థాపింపబడినది.

౪. హిందూ మత సంబంధ అభియోగములు విచారించుటకు "శాస్త్ర న్యాయమూర్తి" అను అధికారి నియమింపబడి యుండెను. ఈపదవి తొలగింపబడి న్యాయమూర్తి నియోజితుడయ్యెను.

౫. జిల్లాల కొరకు సెషన్సు జడ్జీలు నియమింపబడిరి.

౬. ౪౪ గురు జాగీర్దారులకు న్యాయాధికారములు వారివారి ఆదాయమునుబట్టి యొసంగబడెను.

౭. 1898 న మంత్రులసభ (Cabinet Council) ఏర్పడినది. ఇందు ప్రధానమంత్రిగాక మరి యైదుగురు మంత్రులు సభ్యులుగా నుండిరి. ఇందు ఆదాయవ్యయ పట్టికయు, ఇతర అభియోగములు విచారింపబడుచుండెను. వీరన్ని విషయములు విచారించి తుది ఆజ్ఞ కొరకు శ్రీ గారి వద్దకు బంపుచుండిరి. రాజ్యమునందుగల అన్ని శాఖలు దిగువ విధమున విభజింపబడియెను:—

ప్రధానమంత్రి:—ఆర్థిక శాఖ, భూమ్యాదాయశాఖ, స్టాంపు, టంకసాల.

సైనికమంత్రి.—సైన్యము.

న్యాయశాఖామంత్రి:—న్యాయశాఖ, కారాగారములు, రిజిస్ట్రేషన్, వైద్యశాఖ, తపాలశాఖ, కోర్టుఆఫ్ వార్డ్సు, మతశాఖ, ముద్రాక్షరశాల.

[...]శాఖామంత్రి:—రక్షకశాఖ, తామీరాత్ (Public works) రైల్వే, ఖనిజములు, పురపారిశుద్ధ్యము, ఆరోగ్యము.

రాష్ట్రమంతయు రెండు భాగములుగ విభజింపబడియుండెను.

౧. మహారాష్ట్రము. ౨. తెలంగాణము.

౧. మహారాష్ట్ర జిల్లాలు:—ఔరంగాబాదు, బీడు, పర్భని, నాందేడు, గుల్బర్గా, రాయిచూరు, నల్దుర్గ, బీదరు.

౨. తెలంగాణము:—ఇందూరు, మెదకు, ఎలగందల, నర్సాపూరు టాండూరు, ఓరగల్లు, మహబూబునగరము, నల్లగొండ.

1901 మున సర్ కృష్ణ ప్రసాదు బహద్దురు ప్రధానమంత్రులయిరి. వారికాలమున కొన్ని సంస్కరణములు చేయబడినవి.

ఇంతవరకున్న రెవిన్యూబోర్డు తొలగింపబడెను, భూమ్యాదాయశాఖకొక అధ్యక్షుడు నియమింపబడెను. ఈ పదవిపై డన్లాపు దొరగారు నియోజితులయిరి.

మతశాఖ కార్యదర్శి నియమింపబడెను. భూమ్యాదాయశాఖ ఆర్థికశాఖనుండి వేరుపరుచబడెను. ఇంతవరకు ప్రాంతాధికారుల పాలనముక్రింద ఆయాజిల్లాల రక్షకశాఖయుండెను. వారి అధీనమునుండి ఈ శాఖ తొలగింపబడెను. రెగులర్ సైన్యమునకు నొక కమాండరు నియమింపబడెను. 1903 మున కమిష్నరు ఇనాం [...]లకొరకు ఆ పదవిపై ఇతరుల నియమింపక డిస్ట్రిక్టుమీ[...] అధికారము ప్రాంతాధికారుల కొసంగబడెను [...]ములగూర్చి కొన్ని నియమములు తయారు చేయబడెను.

1905 మున జిల్లాలు మరియొకసారి విభజింపబడెను. రాష్ట్రమంతటికి నాలుగు సూబాలు (ప్రాంతము[...]) ఏర్పడెను.

౧. ఔరంగాబాదు:—ఔరంగాబాదు, బీడు, పర్భని, నాందేడు, ౪ జిల్లాలు, ౨౯ తాలుకాలు.

౨. గుల్బర్గా:—గుల్బర్గా, రాయిచూరు, ఉస్మానాబాదు, బీదరు ౪ జిల్లాలు. ౨౭ తాలూకాలు.

3. వరంగల్లు:—వరంగల్లు, కరీంనగరము, ఆదిలాబాదు 3 జిల్లాలు. ౨౫ తాలూకాలు.

౪. గుల్షనాబాదు (మెదకు):—మెదకు, నిజామాబాదు, మహబూబునగరు, నల్లగొండ. ౪ జిల్లాలు. ౨౩ తాలూకాలు.

మొత్తము ౪ ప్రాంతములు ౧౫ జిల్లాలు, ౧౦౩ తాలూకాలుగ భాగింపబడెను. నేటివరకు యీ విభజనమే నిలచియున్నది. కాని ప్రధానస్థానములలో మార్పులు గలిగినవి.

1923 మున ఈనాలుగు సూబాలు తీసివేయబడెను. రెండుసంవత్సరము లిట్లు పరిపాలనము జరిగెను. అనంతరము 1925 మున తెలంగాణ మొక ప్రాంతముగాను, మహారాష్ట్ర మొక ప్రాంతముగాను ఏర్పాటు చేయబడెను. వీనికి ప్రాంతాధికారులు (సదరునాజంమాల్) నియోజితు లయిరి.

౧౯౧౪ మున పరిపాలన మంత్రమునకు ప్రధానమంత్రియే ముఖ్యుడుగా నుండెను. ఆ సంవత్సరమునుండి నిజాం ప్రభువుగారు పరిపాలన కార్యభారము తామకూడ వహించిరి. ౧౯౧౧ మున నిజాం ప్రభువుగారు ఒక అధ్యక్షునిక్రింద కార్యనిర్వాహక ప్రభుత్వసభ (బాబెహుకూమత్) అను నామాంతరముతో నేర్పాటుచేసి నియమము లంగీకరించిరి. అనుభవజ్ఞ మంత్రుల ఆలోచనసభ (క్యాబినెటు కౌన్సిలు) తొలగింపబడినది. నూతన సభయందు అధ్యక్షుడును ఆర్థిక, న్యాయ, సైనిక, భూమ్యాదాయ ఇతర శాఖల యేడుగురు సభ్యులు, ఒక అనధికార సభ్యుడునునుండిరి. స్థాపనకాలమున సభావివరము:—

(1) సర్ అలీ ఇమాం సా॥ కె. సి. యస్. ఐ అధ్యక్షులు.

(2) ఆర్. ఏ. ఆర్. గ్లాన్సిగారు ఆర్థికశాఖ సభ్యుడు.

(3) నవాబువిలాయత్ జంగుబహద్దురు న్యాయశాఖ.

(4) నవాబు అతాఫత్ జంగు బహద్దురు పబ్లిక్ వర్క్సు

(5) రాజా ఫతెనవాజు వంత్ బహద్దురు భూమ్యాదాయశాఖ

(6) నవాబు [...] జంగుబహద్దురు పబ్లిక్ వర్క్సు

(7) నవాబు నిజామతుజంగు బహద్దురు రాజకీయ శాఖ

(8) సర్ ఫరీదూన్ ముల్కు బహద్దురు కె. సి. ఐ. సి. ఓ. ఇ. అనధికార సభ్యుడు.

సర్ అలీయిమాంసా॥ 1922 మున తమ యుద్యోగమునకు రాజీనామా నొసగిరి, నవాబు ఫరీదూన్ ము

అప్పటివరకు రాష్ట్ర కార్యదర్శులుగా నియమింపబడిరి. 1921 మున గ్లాన్సిగారు ఉపకారవేతనము పొందుటచే నవాబు హైదరునవాజుజంగు బహదురు ఆర్థికశాఖ సభ్యులయిరి. రాజా ఫతేనవాజుజంగ్ బహదురు స్థానమున అబ్దుల్లా యూసుఫ్ అలీ సా॥ బి. సి. యస్. భూమ్యాదాయ శాఖకు మంత్రులయిరి. పిమ్మట మరల ఫతేనవాజుజంగ్ బహదురు భూమ్యాదాయ శాఖా మంత్రికాగా అబ్దుల్లా యూసుఫ్ అలీ సా॥ వాణిజ్యపరిశ్రమల శాఖా మంత్రి యయ్యెను.

హైదరాబాదు సదరుల్ మహాములు శాఖ పేషీ సదరుల్ మహామికరు కలరు. మతశాఖకు "సదరుల్ సుదూరు" గలరు. వీరికి ప్రభుత్వసభ [బాబె హుకూమత్] నందు స్థానములు లేవు.

ప్రభుత్వశాఖల కన్నిటికిని మొత్తముగ పదకొండుగురు కార్యదర్శులు గలరు.

| కార్యదర్శి | శాఖలు |
|---|---|
| 1. ప్రధాన కార్యదర్శి | పేషీ |
| 2. రాజకీయ ,, | రాజకీయ పురపాలక సంఘశాఖలు |
| 3. ఆర్థిక ,, | ఆర్థికశాఖ, టంకసాల విమ్యాచ్ఛ్రీ దఫ్తరు దివానీ. |
| 4. న్యాయశాఖ ,, | న్యాయశాఖ, పోలీసు, తపాల, విద్య, రిజిస్ట్రేషను, స్టాంపు, అర్షశాఖ |
| 5. భూమ్యాదాయ శాఖ కార్యదర్శి. | భూమ్యాదాయము, బందోబస్తు, సుంకము, అటవి, కోర్టుఆఫ్ వార్డ్సు, అబ్కారీ, స్టాటిస్టిక్సు. |
| 6. శాసనసభ కార్యదర్శి | శాసనసభ |
| 7. పబ్లిక్ వర్క్సు (General Branch) | P. W. & water Works |
| 8. P.W.I.B. | P. W. (I. B.) & తంతి |
| 9. సైనిక కార్యదర్శి | సైన్యము, వైద్యశాఖ, ఆరోగ్యము, పశుచికిత్సశాల. |
| 10. వాణిజ్య పరిశ్రమలు | గనులు, లోకల్ ఫండు, సహకారసంఘములు, వ్యవసాయము, కారాగారములు. |
| 11. మతశాఖ కార్యదర్శి | మతశాఖ |

## శాసన సభ

సర్ సాలారుజంగ్ గారు 1870 మున మహమ్మదీయ న్యాయవాదుల సంఘము శాసనములు చేయుటకు స్థాపించియుండిరి. పిమ్మట మంత్రులసభయే శాసనసభ యయ్యెను. బిల్లులు, మొదలగునవి తయారుచేసి సహాయపడుటకు గాను నొకసభ యేర్పాటు చేయబడియుండెను. 1890 న ఒక అధ్యక్షుడును, కార్యదర్శి క్రింద లాకమిషన్ యేర్పాటయ్యెను. అధ్యక్షుడు మంత్రిమండలిటను పర్యటనము చేసి సూచనలు చేసినవి శాసన రూపము లగుచుండెను. ఉన్నత న్యాయస్థానము నియమములు సూచించుచుండెను. 1893 మున మంత్రిమండలికిని శాసనములు చేయుటకు శాసనసభ స్థాపితమయ్యెను. శాసనసభయందిపుడు అధ్యక్షుడును ౨౩ సభ్యులును గలరు. ప్రభుత్వసభాధ్యక్షుడే శాసనసభ కధ్యక్షుడు. అధ్యక్షుడు లేనిసమయమున ఏబిల్లు ఉపపాదింపబడునో దానియం దభిరుచి గల సభ్యుడు ఉపాధ్యక్షుడగును. సభ్యులలో మువ్వురు అధికారేతరులు. ప్రధాన న్యాయమూర్తి, న్యాయశాఖ కార్యదర్శి, Legal Adviser యును; తదితర ౨౦ సభ్యులను రెండు సంవత్సరములకొకటి నియమింప బడుదురు. అయినను ఆగడువు పిదప మరల యెన్నుకొనవచ్చును. వీరిలో 9 గురు అధికారులు, 11 అధికారేతరులు. అధికారేతరులలో జాగీరుదారుల పక్షమువారు ఇద్దరు, హైకోర్టు న్యాయవాదుల పక్షమునుండియు యెన్నుకొనబడినవారు. మిగత 7 గురు దిగువ విధమున గలరు:—

1 రు హైదరాబాదు పురపాలక సభను

2 రు జిల్లాల బోర్డులనుండి యెన్నుకొనబడినవారు.

3 రు అధ్యక్షునిచే నామినేటు చేయబడినవారు.

ప్రస్తుత పాయిగానుండి యొకరును, ఒక ప్రజాప్రతినిధి, ఇద్దరు కాలపరిమితి అయిపోవుచున్న సభ్యులనుండియో లేక ఉపపాదింప బడుచున్న బిల్లుగూర్చి పరిశోధింపబడువారినుండియో యెన్నుకొనబడుదురు. సభ్యుల పేర్లు ప్రస్తుతము దిగువ విధమున చక్కగా తెలియుగలవు:

౧. ఆర్డినరీ సభ్యులు:— మున్షీరు ఖానాన్; మౌల్వి మద్ ఉన్నూరుల అమీరు, ప్రధాన న్యాయమూర్తి.

౨. అధికారసభ్యులు:— మతశాఖ కార్యదర్శి, ఆర్థికశాఖ కార్యదర్శి, భూమ్యాదాయశాఖ కార్యదర్శి, రాజకీయశాఖ కార్యదర్శి, వాణిజ్యపరిశ్రమలశాఖ కార్యదర్శి, విద్యాశాఖ, జిల్లాల రక్షకశాఖ, అడిషనల్ న్యాయమూర్తి, సరఫ్ఖాను అవ్వలు తాలుక్దారు.

3. అధికారేతరులు:— పాయిగా, ఇద్దరు న్యాయవాదులు, ఇద్దరు జాగీర్దారు ప్రతినిధులు, వర్తకుడు.

౪. గైరుమామూలీ:— ఇద్దరు.

ముష్షీరు ఖానూన్ సభకు కార్యదర్శి. ప్రభుత్వ సభాధ్యక్షుని అనుమతి లేనిది దిగువ విషయములకు సంబంధించి బిల్లులు సభయందు ప్రవేశ పెట్టబడవు.

(౧) ప్రజాదాయము.

(౨) నిజాం దేశీయుల మతము.

(౩) సైనిక శాఖ శిక్షణ.

(౪) బ్రిటిష్ ప్రభుత్వముతో నిజాం ప్రభుత్వ సంబంధము.

ఈ విషయముల గూర్చిన బిల్లు ప్రవేశ పెట్టబడినను నిజాం ప్రభువుగారనుమతించునంతవఱకు శాసనములు గాజాలవు. ఇతర బిల్లులు శాసన సభవారామోదించినవి ప్రభుత్వ సభాధ్యక్షు డంగీకరించిన వెంటనే శాసనము లగును. అయినను నిజాం ప్రభువుగారికి వానిని మార్పుచేయుటకు హక్కు గలదు. ఏ బిల్లు ప్రవేశ పెట్టినను, మహమ్మదీయమతమునకును, హిందూశాస్త్రములకును, ఇతరజాతుల ఆచారములకును, బ్రిటిషు ఇండియా, ఇతర నాగరిక దేశముల పద్ధతులకును వ్యతిరేకముగ నుండగూడదు. ఇంతియకాక మహాఘనత వహించిన నిజాం ప్రభువుగారి అధికారమునకు భంగము కలిగించుటకు శాసనసభ కధికారములేదు.

## ఇటీవలి సంస్కరణములు

మంత్రులు సర్వీసు చాలించుకొని ఉపకారవేతనము పొందుటచే ప్రభుత్వ సభయందు వారి స్థానమున నూతన మంత్రులు నియమింపబడిరి. సర్ అలీ ఇమాం గారు చాలించుకొనిన పిదప ఫరీదూన్ ముల్కు బహదురు గారు ప్రభుత్వ సభాధ్యక్షులు (సదరుఆజం) అయిరి. వారి పిమ్మట నవాబు వలీఅద్దౌలా బహదురు గారు నియమింపబడిరి. ఇటీవల ఘనతవహించిన శ్రీనిజాం ప్రభువుగారి ఫర్మానుసారము ప్రభుత్వసభ (బాబేహుకూమాతు) యందు దిగువ విధముగ మంత్రులును, అధ్యక్షుడును గలరు.

(౧) మహారాజా కృష్ణప్రసాద్ బహదురు యెమినుస్సల్తనత్ జి. సి. ఐ. ఇ. అధ్యక్షులు (సదరు ఆజం).

(౨) సర్ అమీనుజంగు బహదురు కె. సి. ఐ. ఇ. యస్. ఐ. మంత్రి. శాసనశాఖ:—శాసనసభ, జుడిషల్ కమిటి, న్యాయచట్ట అభిప్రాయము.

న్యాయశాఖ:—మతశాఖ, తోషక్ ఖాన అమ్రా (توشک خانہ عامرہ)



(౩) హైదరునవాజుజంగ్ బహదురు మంత్రి.

ఆర్థికశాఖ:—లెక్కలు, కోశాగారములు, టంకశాల, స్టాంపులు, స్టేషనరీ, రైల్వే, విద్యుచ్ఛక్తి, సహకార సంఘములు.

(౪) లెఫ్టినెంట్ కర్నలు నిజామత్ జంగ్ ఫ్రెంచ్ సి. ఐ. ఇ. ఓ. బి. ఇ. మంత్రి మాలశాఖ:—భూమ్యాదాయము, అతియాత్, కోర్టుఆఫ్ వార్డ్సు, బందోబస్తు, వ్యవసాయము. అధినివేశములు, అబ్కారీ, సుంకపుశాఖ, అటవి, స్టేటస్టిక్సు (اعداد و شمار) లోకల్ఫండు, పరిశ్రమలు, వాణిజ్యము.

రక్షకశాఖ:—నగర రక్షకశాఖ; జిల్లాల రక్షకశాఖ, కారాగారములు.

(౫) నిజామత్ జంగ్ బహదురు సి. ఐ. ఇ. ఓ. బి. ఇ. మంత్రి రాజకీయ శాఖ:—ప్రెస్ కమిష్నరీ. అతిథిసత్కారము, పురపాలక సంఘము, మోటరు బగ్గిఖాన అమ్రా, పురోద్యానవనము.

(౬) ఎలీ అద్దౌలా బహదురు మంత్రి.

విద్యాశాఖ:—పాఠశాలలు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, నక్షత్రశాల, వైద్యశాఖ, ఆరోగ్యము, ఇంగ్లీషు యూనాని ఆసుపత్రులు, వివిధశాఖలు, రిజిస్ట్రేషన్, స్టాంపు, టపా, ముద్రాక్షరశాల, అర్షశాఖ సైన్యశాఖ, పశువైద్యము.

(౭) అకీలుజంగు బహదురు మంత్రి.

తామీరాత్ శాఖ:—భవనములు, ఆప్పాషీ, నీటిసప్లై, డ్రైనేజి, తంతీ, జిల్లాలయందలి విద్యుచ్ఛక్తి పనులు.

(౮) సర్ ఫరీదూన్ ముల్కు బహదురు, కె. సి. ఇ. సి. యస్. ఐ. జి. బి. ఇ. మంత్రి Member without port folio)

పరిపాలనము చక్కగ జరుగుట లేదనియు, ఉద్యోగులలో లంచములు దీసికొనుట ప్రబలిన దనియు, న్యాయము జరుగుట లేదనియు, బ్రిటిష్ ప్రభుత్వమువారు నిజాం ప్రభువుగారికి అల్టిమేటం నంపిరి. దాని ననుసరించి మహారాజా సర్ కృష్ణప్రసాదు బహదురు ప్రభుత్వసభాధ్యక్షులుగను, భూమ్యాదాయ శాఖ, రక్షకశాఖ, అవరాధ పరిశోధకశాఖ, వాణిజ్య పరిశ్రమలశాఖలపై ఇంగ్లీషు అధికారులను నియమింపబడిరి. అంతియేకాని మరి యే మార్పులు జరుగలేదు.

# ఇనుగుర్తి శాసనములు

(ఆంధ్ర పరిశోధక సంఘము, హైద్రాబాదు)

## ౧౮

ఈ ఇనుగుర్తి ఒరంగల్లు జిల్లా మానుకోట తాలూకాలో నున్నది. ఊరికి నరమైలు దూరమందున్న గుంటి చెఱువు ప్రక్కనున్న కొండమీద గుహలో నొక భైరవ విగ్రహము చెంత నీ శాసనము వ్రాయఁబడినది, రాయి మిక్కిలి గగ్గులుగా నున్నది. పంక్తులు తొమ్మిది.

౧ స్వస్తి శ్రీ మతు కా
౨ కతీయ ప్రోలమహా
౩ దేవులు యినుం
౪ గుఱితిని వాయివ్య
౫ పు పర్వతము (నంచు)
౬ జలంధరేశ్వర
౭ భైరవునిం బ్రతిష్ఠ
౮ సేయించె మంగళ
౯ మహా శ్రీ శ్రీ

### సూచన

కాకతీయ ప్రోలరాజు శైవదేవతలకే గాక వైదిక దేవతలకుగూడఁ బ్రతిష్ఠాదులు గావించెను. భైరవపూజ కాకతీయుల కాలమున మిగుల వ్యాప్తిలోనికి వచ్చెను. తటాకము చెంత కొండపై భైరవ విగ్రహ ముంటచేతను వర్షము ప్రసాదించి చెఱువు నిండించు దేవతయని కాఁబోలు జలంధర భైరవనామము దేవున కొసంగఁబడి యుండును.

## ౧౯

శాసన శిలయందలి యొక తలము ఇనుగుర్తిలో జియ్యర్ స్వామియను నొక సాతాని వైష్ణవుని యింటిలో కల్యము చెక్కఁబడి గోడకలో నున్నది. దాని తలములుగాని యితర విశేషములుగాని తెలియవు. నాలుగువైపుల వ్రాయఁబడి యున్నది. కాని కల్యము చెక్కఁబడిన భాగము వర్ణములు చెడఁగొట్టఁబడినవి.

### మొదటి వైపు

౧ స్థిరం॥ సాస్థాపయన్మ
౨ రకతం శివమత్ర లింగం
౩ బయ్యాంబికా ఇతివి
౪ శ్రుతవ * * * ౦॥ యు
౫ ద్దీధితి ప్రతతి విస్ఫుర
౬ మార్జిత శ్రీర్వ్యయాలవ
౭ ం తకనకకల్పిత కల్ప అ
౮ సీత్॥ శ్రీ శ్రీ.

### రెండవ వైపు

౧ ॥ * * ప్రత్యేకమే
౨ * త్కృత్తిణః । తేషుత్వద్యదివ
౩ * ం రతేషుస్సకలాభాల: *
౪ * సభా * స్గుణాన్ । ధాత్రా
౫ * త్రుసమస్త ధర్మ్మావస
౬ * (త) శ్రేయో భవత్ కల్పితో
౭ * స్తోక * * * * పతిషుచా

### మూడవ వైపు

౧ వస్తగాంబుగలీ॥ శంభు శ్రీ
౨ పదపంకజ ప్రణము
౩ * స్తశోభోజస్స
౪ రూపచరితమ్ *
౫ మైలల * * * విమ
౬ నోహరణం। అకస్మి *
౭ సుపీత * * * పసా
౮ * * *

### సూచన

శాసనలిపి కాకతీయ గణపతి దేవుని కాలమునాటి. గణపతి దేవుని సేనా నాయకుని శాసనమువలె నున్న. విర్యాల వంశము కాకతీయుల సేనా నాయకుల వంశము. పాకుంటి తూరుని శాసనములోఁగూడ విర్యాల వంశము పేర్కొనఁబడినట్లుల జ్ఞాపకము గలదు. ఈశాసనమునందు బయ్యాంబిక నామ మొకటిమాత్రము గానవచ్చుచున్నది. వర్ణములంత పరిశుభ్రము లేవు. తాలుగూడ రాళ్లను చెక్కఁగొట్టఁబడుటచే విషయము తెలియరాదు.

### ౧౦

ఇనుగుర్తి రాతికోటలో బిగింపఁబడిన రాళ్లలో శాసన ఖాడములు కొన్ని గలవు. రెంటిని మాత్రము త్రవ్వించి పైకిఁదీసి ప్రకటించితిని. ఒకదేవళమును కూలఁద్రోసి కోట గట్టినట్లు తెలియుచున్నది. చిక్కని మొక్కలను పోసిక ప్రతులు దీయుటచే విషయమంతయు సమగ్రముగ నున్నది. చక్కనిశిల. మనోహరమగు లిపి.

### మొదటి వైపు

౧ దన మిహామహీ * *
౨ శాకభూతిథి భూసంఖ్యే *
౩ దిని। జ్యేష్ఠే మాసి సితేపక్షేదశమ్యాం
౪ భానువాసరే॥ తత్రాపిచిత్రసుణ
౫ ధామ్మినిశేననామ్నా రాజల్లలాట లట
౬ * * సంపుమాంశం। గారీ *
౭ * * * ల్యము దారభోగ

### రెండవ వైపు

౧ * * * *
౨ స్థాత్యాత్మధ్వని * *
౩ స్యవిన్యజ్ఞనవి *
౪ * * * *

### మూడవ వైపు

౧ * * షః కిలాసుగ్గ *
౨ * యోన్నత సర్వ్య భాషణను
౩ ప్రాణనఖ్యాతిః పాత్రోధ *
౪ * శాదాకుగుకోణ *
౫ * * * * *

### నాల్గవ వైపు

౧ స్యవనికరే శకస్యనిత్య సంగత్యాస్య
౨ * వస్య॥ రేఖాకారం నిజకరతలే విగ్రః *
౩ * పస్మాం పావన్యాసాశ్ నిధిపరమ. * *
౪ * వ్యాతిపన్మమేన। స్యేయుం నిత్యంతులి।
౫ * * లాపత్యశాంస్వీయమూపం నృణా
౬ * * ప్యమకమగనాశంకిచిత్తం
౭ * ం వఈసిమల్లి రుద్రన్న.

### సూచన

ఈ శాసనము నందలి లిపి మిగుల మనోహరముగ నుండి హనుమకొండ వేయిస్తంభముల మండపములోని శాసన లిపిని సర్వవిధముల బోలియున్నది. ఇది రుద్రదేవుని శాసనము కానోపును. ఈ శాసనమునకు సంబంధించిన శిలాశకలము ఇనుగుర్తి కోటపైభాగమునందు ఆనగాచిన శిలాశకలము. ఇనుగుర్తి కోటలో పై భాగమున బిగింపఁబడి యున్నది. తీయ వీలు కాలేదు.

# గ్రంథ విమర్శనము

## సూర్యరాయాంధ్ర నిఘంటువు

ఈ నిఘంటువుయొక్క మచ్చు ప్రతి మాకార్యస్థాన మలంకరించినది. శబ్దరత్నాకరమునందు లేని పదములు లెక్కకందు సూచింపఁబడినవి గాని అంత మాత్రమున నీ నిఘంటువు సమగ్రమనఁ జాలము. వృత్తులకు సంబంధించిన పదము లింకెన్నియో చేరవలసి యున్నవి. కురమవాండ్రు గొంగడులకు ఉన్ని కత్తిరించుట మొదలు గొంగడి పూర్తిచేయు వఱకు ఎన్నియో ఆంధ్ర పదములు వ్యవహరింపఁబడుచున్నవి. ఇటులే యన్ని వృత్తుల నుండియుఁ బదజాలము సేకరింపవలసి యున్నది. నిజాము రాష్ట్రము నందలి ఆంధ్ర దేశమునందు వ్యవహరింపఁబడు దేశ్యము లితర స్థలములలో వాడుకగా లేవు. మన్నెము సరిహద్దులలో నున్న చెంచు, కోయ, బాలసంతు, శారదకాండ్రు లోనగు జాతులనుండి గూడఁ గొంత పదజాలము సేకరింపవలసి యున్నది. ముద్రిత గ్రంథములు తాళపత్ర గ్రంథములతోఁ బోల్చిన మీఁదట ఉదాహరణమునకుఁ గైకొనుటకుమాఱు తమ యిచ్చవచ్చిన ముద్రణాలయ ప్రతిని ఆధారముగాఁ గైకొనుట సమంజసముగా లేదు.

ఆంధ్ర పదములు ద్రవిడ కర్ణాట మహారాష్ట్ర మళయాళ ప్రాకృతముఖభాషాపదములకుఁ గొన్ని యెడలఁ దద్భవములుగా నున్నవి. సోదరభాషల నుండి పదముల పరివర్తనము వ్యుత్పత్తులుఁగూడ సేకరించి పదస్వరూప నిష్పత్తి చేయవలసి యుండ నీ నిఘంటువు సంపాదకులా కార్యము మానుట చాల నిరుత్సాహకరము. సూర్యరాయాంధ్ర నిఘంటువు నందిట్టి లోపము లుంటచే నిదియు శబ్దరత్నాకరమునకుఁ బ్రతిబింబముగాఁ బరిణమించునేమో యని తోఁచుచున్నది. నిఘంటువు కార్యము చాల మందముగా నడచుట సంతాపకరము. బహుజనపల్లి సీతారామాచార్యులు, పరవస్తు రంగాచార్యులు, మహాకాళి సుబ్బారాయుఁడు, లక్ష్మీనారాయణశాస్త్రి, చిన్నయసూరి ప్రముఖులొక్కొక్కరే ప్రజాసహాయము నపేక్షింపక నిఘంటువులను త్వరలో ముగించి యున్నారు. పరిషత్తునకుఁ బలుకుబడి గలదు. వేదము వేంకటరాయశాస్త్రి, కంజనగిరము తేవప్పెరుమాళ్లయ్య గారలవంటి ప్రముఖులు నిఘంటూద్యమమున మిగులఁ బనిచేసిరి. పీఠికాపురాధీశ్వరులు వ్యయభారము భరింపు చున్నారు. జయంతి రామయ్య పంతులు గారు, కూచి నరసింహము పంతులుగారు, పానుగంటి లక్ష్మీనరసింహరావు పంతులుగారు మున్నగు ప్రముఖులిందుఁ బాటుపడు చున్నారు. ఇన్ని శుభలక్షణముల గరియు సూర్యరాయాంధ్ర నిఘంటువు సాంగముగా—సలక్షణముగా—సత్వరముగా నెన్నఁడు వెలువడునా యని పదునైదు సంవత్సరముల నుండి యాంధ్రులు ఎదురు చూచుచున్నారు. ప్రజాభిప్రాయముల ప్రకారము గ్రంథము ముగించుట యసాధ్యము. కార్యనిర్వాహక వర్గము వారు యుక్తమార్గము నన్వేషించి సూర్యరాయ నిఘంటువునందు దేశ్య పదములకుఁ బ్రాముఖ్య మొసంగుచు సజాతీయ పదములు సమకూర్చి త్వరలో గ్రంథమును బ్రచురింపఁ బ్రార్థితులు.

## వెన్నెలకుప్పలు

వెల చందాదారులకు ౧—౦—౦ ఇతరులకు—౧—౮—౦.

ఇందు వర్తమానకవుల (విశేషముగా మద్రాసు విశ్వవిద్యాలయ స్నాతకుల) నవ్య భావములచే నిండిన మాదిరి పద్యములు సంకలింపఁబడినవి. భావమే ప్రధానమని యీఖండ కావ్య సంపాదకుల యుద్దేశమై యుండినట్లు తోఁచుచున్నది. విమర్శనల మూలమున నేమి, రామలింగారెడ్డిగారి వంటివారి ప్రశంసా వాక్యముల వలన నేమి, విశేష ప్రచారము గలిగిన „యెంకి పాటలు" రెండిందు గలవు. ఇతరులకెట్లోగాని మాకు దానిలోని కొన్ని పదములు గ్రామ్యములుగ నవు. „కత్తిమీదే సాము కొత్తిమీరే కూడూ, సత్తు వెలిగిన వారే విస్తుపోమూ". కొన్ని పద్యములలోని వ్యాకరణచ్ఛందో దోషములు ప్రధానములు కావనిచో వాని భావములు ప్రశంసనీయములే. సముద్రాల రాఘవాచార్యులు (శతావధాని) గారి ఆత్మవేదన మందలి „ఆతిదీన యాచక పరాభూతప్రస్తుత శరశ ప్రణయాగ్ని కీలికాదహ్యమానః", „నైజ విశ్వాస ప్రేరణోన్మత్తమదనః" ఇట్టి స్థలములందు సర్వలక్షణసార సంగ్రహకారుని మత మనుగమనింపఁ బడినది—ఈ ఆత్మవేదనములోని పద్యములు జక్కన విక్రమార్క చరిత్రములోని „(సీ॥) కల్పాంత దుర్దాంత కలుషాంత కస్వాంత దుర్వార

వహ్నికి నోర్వవచ్చు" అను పద్యపద్ధతిని బోలియున్నవి. ఈ గ్రంథములోని అబ్బూరి రామకృష్ణారావుగారి „మందార శిశువు"ను శేషాద్రి రమణకవుల „మాళిచందనము"ను ముఖ్యముగా పేర్కొన దగినవి. శైలి భాష యందును భావ విలసనమందును నద్వితీయములు. వాకవిగారి పద్యములు మనోహరముగా నున్నవి. మఱియు భండారు రాజేశ్వరరావుగారి యొక్కయు బసవరాజు అప్పారావుగారి యొక్కయు పద్యము లానందదాయకములైనవి.

# సంపాదకీయములు

## లోకమాన్యుడు

లోకమాన్య బాలగంగాధరుడు కర్మప్రపం
చమునుండస్తమించి సప్తవర్షము లంతరించినవి.
భారతదేశవిముక్తికై తమసర్వస్వము నర్పించిన
ఆధునిక దేశభక్తులలో తిలకుమహాశయున క
గ్ర్యస్థానము కలదు. స్వరాజ్యాందోళనమును
సార్వజనిక సమస్యగా జేసిన మహావ్యక్తి ఆత
డు. బిపిన చంద్రపాలుడు నుడివినటుల పంథొ
మ్మిదవ శతాబ్దాంతమున దేశసేవకై గడంగిన
వారందరును పాశ్చాత్యవిద్యా సంస్కారమును
బొందిన వారలే. క్రీ. శ. ౧౮౮౮లో కలక
త్తాయం దుపన్యసించుచు హేళన పూర్వకము
గా లార్డుడఫిరిన్ నుడివినటుల వారి సంఖ్య ఆ
కాలమున నామమాత్రముననేయుండెను. ఈ
కొలది దేశభక్తులతో దేశమునకు స్వాతంత్రము
లభింపదని తెలిసికొని లోకమాన్యుడు స్వరా
జ్యోద్యమమును సర్వజనసామాన్యముగా జేయ
సంసిద్ధుడయ్యెను. ఈ కారణముననే ప్రప్రథమ
ము సంఘసంస్కార సమస్యలనిన జనసామాన్య
ము భయపడిపోవునని ఆ విషయలందాతడు జో
క్యము కలిగించుకొనలేదు. జనసామాన్యము
నాకర్షించుటకొఱకే మహారాష్ట్రదేశమున నా
డు ఛత్రపతిశివాజీయొక్క ఉత్సవముల ప్రతి
వత్సరము జరుప ప్రోత్సహింపసాగెను. ఇటీవల
శివాజీ మహారాజును భారతదేశమంతయు
గౌరవించుచున్నది. కానీ యుత్సవమును మొద
లు పెట్టిన ఆచార్యుడు బాలగంగాధరుడే.

జనసామాన్యము నాకర్షించుటకై గణపతి
దేవుని 'గణ' రాయని చేసి, ఆతని యుత్సవ
మునకతిశయప్రాముఖ్యత నొసంగెను. ఈ యు
త్సవముకూడ దేశమునందెల్లడల జనుల నాకర్షిం
చుచున్నది.

లోకమాన్యుడు భారతరాజకీయ పరిస్థితుల
లను సమగ్రముగా తెలిసికొనియుండెను. స్వరా
జ్యమననేమియని యిదివరకును వాదోపవాద
ముల సలుపుచు పర్యవసానము దేల్పకున్నకొంద
ఱు నాయకులకు స్వరాజ్యమేమో ఆ మహావ్య
క్తి ఎన్నో దినములక్రింద తేటపరిచెను. "ఆంగ్లే
యులు, అమేరికనులు తమదేశములందే విధము
గనున్నారో ఆవిధముగనే నాదేశీయులు నాదే
శమున నుండవలెను".

రాజకీయరంగమున మాత్రమే లోకమాన్యు
డు వినుతికెక్కలేదు. ఆతడు భగద్గీతపైవ్రాసిన
వ్యాఖ్యజగత్ప్రసిద్ధికెక్కినది. ఆతనికిచరిత్రయందు
గల యభిరుచి ఆతడు వ్రాసిన 'ఓరియన్' అను
పుస్తకమువలన తేలును.

మద్రాసు నందొకసారి ఉపన్యసించుచు శివాజీ
మహారాజు తన రాజ్యమునందు సంస్థాపించిన
అష్టప్రధాన పద్ధతిని విజయనగర సామ్రాజ్యము
నుండి స్వీకరించెనని వాక్రుచ్చెను. ఈ యుదా
హరణమువలన నతడు కలినతమ రాజకీయ సమస్య
లతో ఘోరముగా పోరాడుచున్న నెపోలియన్
బోనాపార్టువలె నితరవిషయముల నంతేశ్రద్ధతో
నన్వేషించుచుండెనని తెలియుచున్నది. అతడు

తనజీవితము ద్వారా, కారాగారవాసిగాను న్నప్పుడువ్రాసిన భారతీయుల జీవిత సూత్రమగు భగవద్గీత వ్యాఖ్యద్వారా, విశుద్ధకర్మయోగమును దేశీయుల కండ్లకు కట్టుచున్నాడు. కండ్లు తెరచిచూచి తత్ప్రకారము నడుచుకొనినచో భారతీయులు స్వారాజ్యమును సంపాదించుట ఎంతటిపని?

## కీ. శే. కొ. లక్ష్మణరావు గారు

కీ. శే. కొమర్రాజు. వేంకట లక్ష్మణరావు గారి జీవితమునందలి ప్రథమభాగము మహారాష్ట్ర వాతావరణమునందును, మహారాష్ట్ర దేశమునందును. గడిచెను. ఆకాలములో వారియందు గట్టిగా నాటుకొనిన విలక్షణములైన మహారాష్ట్ర గుణములు వారి జీవితమున కొక విలక్షణత్వము నొసంగెను. వారి సంస్కృత వాఙ్మయ విమర్శనలు మహా రాష్ట్ర విమర్శనాపద్ధతి ననుసరించినవి. చారిత్రక పరిశోధనయం దభిరుచియు, జ్యోతిశ్శాస్త్రపఠనయం దభిలాషయు, వారికి మహారాష్ట్రుల సహవాసమునం దేయలవడెను. శ్రీరావుగారు మీమాంస శాస్త్రమును, సాంఖ్య మతమును చక్కగా పరిశీలించియుండిరి. ఆకారణముననే వారి విమర్శన లతి తీవ్రములుగను, తర్కశాస్త్రము ననుసరించియు నున్నవి. ఆనందమే ప్రధాన పర్యవసానమని తలంచబడు కవిత్వమును మరియు అలంకార శాస్త్రమును కూడ వారు తర్కదృష్టితో విమర్శించుట మానలేదు.

మనుష్యుని ప్రస్తుత పరిస్థితియు, వాని చుట్టుముట్టుగల నిజమైన వాతావరణమును వారు ముఖ్యముగా గణించెడివారు. అందువలననే వారు నవలలయందలి అతిశయోక్తులను నిరసించుచుండిరి. మనుష్యుడు పొందుటకు వీలులేని ఆదర్శములను, ఆశయములను వారు గమనింపలేదు. శ్రీ రావుగారు గొప్ప నీతిమంతులును, న్యాయపథావలంబకులునై యుండిరి. వారి రచనలయందు, చర్యలయందు నీ యుత్కృష్ట గుణములు విరివిగా గాననగును. పరిశోధనా రంగమున వారు చూపిన న్యాయాన్యాయ విచక్షణ ఆదర్శప్రాయమై నిలువగలదు.

పగిలియు, బండబాఱియును, పాడరియున్న శిలాతలంబులను, మరియు కీటములు సాపడి పుచ్చిన తాటియాకులకు మిగిలిన అక్షరశేషములను వారెంతో భక్తితోడను, నమ్రతతోడను సమీపించుచుండిరి. ఎప్పుడును త్వరపడి తప్పు పర్యవసానములను తేల్పసాహసించలేదు; తప్పులు చదవి హాస్యాస్పదులు కాలేదు. శ్రీ రావుగారు దేశభాషలు స్వతంత్రములై విలసిల్లవలెనని కోరిన మహాపురుషులలో నగ్రగణ్యులు. వీరెన్నడును ఏ విషయమైనను పలుసారులాలోచించనది బహిరంగ పఱచలేదు. అందుచేతనే వారు బహిరంగపఱచిన విషయములన్నియు సకారణముగను సమంజసముగను నున్నవి. వారు పత్రికయు, ఉపన్యాస వేదికయు యనిన కొంత సిగ్గుపడుచుండిరి. వారు వ్రాసిన పుస్తకముల సంఖ్య, ప్రచురితములైన పుస్తకములను బట్టి తేల్ప కూడదు. ఆంధ్ర దేశమున నాకాలమున జరిగిన వాఙ్మయ కృషితో వారి కేదో విధమైన సంబంధము తప్పక నుండెను. ఇతరుల ద్వారా తమ భావముల వెల్లడిచేయుట వారికి చాల యిష్టము. సంఘ సంస్కార విషయములందు గొప్ప గొప్ప సభలలో పాల్గొనకపోయినను స్వయముగా వారు. సంస్కార ప్రియులును, విశాల హృదయులునై యుండిరి. సంస్కార విషయమున ముందంజ వేయువారైనను రాజకీయ రంగమున మాత్రము జాగ

గా మెదలుటవారి మతము. కొంతవరకు వా యమునందు కూడ మిక్కిలి యాలోచించి నవీన సాంప్రదాయములను చేర్పుట కిష్టపడు చుండిరి.

శ్రీ లక్ష్మణరావు పంతులుగారు నిజమైన పండితులు. పవిత్రమైన విజ్ఞానమును వెదజల్లు మహావ్యక్తి. వారి జీవితము, ఉచ్చమైన యాదర్శముల కొఱకును, పవిత్రమైన భావముల కొఱకును, స్వచ్ఛమైన రచనల కొఱకును, నిశ్చలమైన సత్యము కొఱకును ఉదాహరణ ప్రాయము.

**కే. శే. పాపిరెడ్డిగారు**

విఖ్యాతాంధ్ర భాషాభిమానియు, న్యాయవాదియు, సత్పురుషుడును అగు పాపిరెడ్డి గారు స్వగ్రామమగు తూపురాణ నందాకస్మికముగ గాల ధర్మమొందిరని తెలుపుటకు చింతిల్లుచున్నాము. వీరెన్నియో భాషా సంస్థలకు, పత్రికలకు, సహాయపడుచుండిరి. ఇట్టి త్యాగశీలురు, భాషాభిమానులు, విగత జీవులగుటచే నిజాం రాష్ట్రాంధ్రోద్యమమునకు అపారమైన కొఱత వాటిల్లినది. పరమేశ్వరుడు వారి ఆత్మకు శాంతికలిగించుగాక!

**గుజరాతు సంక్షోభము**

భారత వర్షమున కుద్యానవనమని వినుతికెక్కిన గుజరాతు ప్రాంతము నేడు శ్మశాన వాటికయై పోయినది. సుమారెనుబది ఇంచుల వర్షము కురిసి గుజరాతు, కాఠియావాడు ప్రదేశములు సర్వనాశనమునకు గురియైనవి. అయోమార్గము, తంతీమార్గము, ధ్వంసమైపోయినవి. నదీపురములు భాగుచేయబడినట్లు వార్తలు వచ్చుచున్నవి. ప్రజలధోగతిపాలై యున్నారు. వేలకొలది గృహములు కూలిపోయినవి. పౌరులు తినుటకు తిండిలేక, నివసించుటకు స్థలములేక అల్లలాడుచున్నారు. బరోడాలో దప్ప మిగత ప్రదేశములందు అంతగా జననష్టము కలుగలేదు. జాతిమత భేదములను, అస్పృశ్యతను, ఈ ప్రళయకాలమునందు ప్రజలు మరచిపోయిరి. భారత దేశమునకు భిక్షనొసంగుచున్న గుజరాతు నేడు తానే భిక్షాపాత్రను ధరించవలసి వచ్చినది. శరణని వేడుచున్న గుజరాతు సోదరులకు నిజాం రాష్ట్రాంధ్రులు రక్షింప ముందంజ వేయరా?

**ఆదర్శనీయుడగు పాలకుడు**

మైసూరు మహారాజాగారగు శ్రీ కృష్ణరాజ ఒడయారుగారు జి.సి.బి., జి.సి.యస్.ఐ., సింహాసన మధిష్టించి ఆగస్టు నెల ౮ వ తేదీకి యిరువదియైదు సంవత్సరములు గడచినవి. వారి దీర్ఘ పరిపాలనమునకు సంతసము వెలిబుచ్చుటకై రజతోత్సవము జరుపబడినది. మహారాజాగారు తమ రాష్ట్రాభివృద్ధికై యెంతయో పాటుబడిరి. అక్కడ నిర్బంధ ప్రారంభ విద్య ప్రవేశ పెట్టబడినది. ప్రత్యేక విశ్వవిద్యాలయము స్థాపింపబడినది. ప్రజాప్రతినిధుల శాసన సభ గలదు. వైజ్ఞానిక, సాంఘిక, రాజకీయ సంస్కరణముల వలన మైసూరు రాష్ట్రము నాగరక రాష్ట్రములలో నొకటిగ నెన్నబడుచున్నది. మహారాజాగారు విజ్ఞాన సంపన్నులు. పరమత సహనగలవారు. వీరికి హిందూ మత సంప్రదాయముల పై యాదరణము మెండు. వారి సత్పరిపాలన కాలమున హిందూ మహమ్మదీయ కలహములు మచ్చునకయినను గానరావు. మైసూరు దేశమన్ని విధముల అభివృద్ధినొందుచున్నది. ప్రజానురంజకుడగు పాలకుని మూలమున పాలితులు సుఖ జీవనము గడపుచున్నారు. ఇట్టి మహారాజాగారికి పరమేశ్వరు డాయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక!

## నౌకాదళ నిర్ణయసభ

ప్రపంచశాంతి మూడు పెద్దజాతులగు ఇంగ్లండు, అమెరికా, జపాను పైన ఆధారపడియున్నది. ఈ మూడుజాతులే ప్రపంచ వాణిజ్యమునందు ముఖ్యస్థానము వహించియున్నవి. పరిశ్రమలయం దొకజాతి వేరొకజాతితో పోటీచేయుచున్నది. ఇట్టి అల్లకల్లోలము లణచి ప్రపంచమందు శాంతి సమకూర్చుటకు అమెరికా ముందుకువచ్చినది! ఎంతయో వాదము జరిగినపిదప సభ జరుపుటకు అంగీకరింపబడెను. ఈ సమావేశము జనివా పట్టణమున సమకూడినది. ఇంగ్లండు తన వాణిజ్యనౌకల సంఖ్య తగ్గించుకొనుట కొప్పుకొనలేదు. సర్వదా యీ నౌకలు యిరుకు సముద్రములమధ్య ప్రయాణము సేయుచుండ వలయుననియు, వ్యాపారముమీదనే ఇంగ్లండు జీవించుననియు, యుద్ధనౌకలు అమెరికాతో సమానముగనుంచవచ్చుననియు, ఇంగ్లండువాదము. అమెరికా ఇంగ్లండుయొక్క వాణిజ్య యుద్ధనౌకలతో సమానసంఖ్య నౌకలు నుంచుటకును, వాణిజ్యనౌకలు అవసరమునుబట్టి యుద్ధనౌకలుగ మారవచ్చుననియు, పోరాడినది. చివరకు పర్యవసాన మేమియు తేలలేదు. క్రీ. శే. ౧౯౩౧ సంవత్సరము వఱకు వాషింగ్టను యొడంబడిక మార్చ వీలులేదని అమెరికా సూచించినది. ఇట్టి వ్యతిరేకాభిప్రాయములవలన సభ భగ్నమయినది. అయినను దీనివలన ఇంగ్లండు అమెరికా స్నేహమునకు ప్రతిబంధకము లుండవని సంతసించుచున్నది. అధ్యక్షులగు కూలిజ్‌గారు మైత్రికి భంగము కలుగునని తలంచుచున్నారు. నిజము నిలుకడపైన తేలగలదు. ప్రపంచములో యుద్ధములు నావికదళముతగ్గించినంతనే అంతరించి పోవుట యసంభవము. సైన్యములు, మారణ యంత్రములు, మొదలగునవి యెన్నియో ఇతర సాధనములు గలవు. నావికదళముగూర్చియే ఈమూడు జాతుల కేకాభిప్రాయము గలుగకుండిన ఇతర సాధనములగూర్చి కలుగునని తలంచుట ఒట్టికల. స్వార్థమువీడనంత వఱకే విషయముకూడ నిర్ణయము కాజాలదు. త్యాగమే అన్నిటికిని ముఖ్యావధము. కాని పాశ్చాత్య ఖండములందిట్టి త్యాగము లోపించి యున్నది.

Edited and Published by P. N. Sarma, B. A., LL.B., Troop Bazar, Hyd, Dn.
Printed by S. Pratapa Reddy, B.A., B.L., at the Golakonda Press, Hyderabad.

# విషయసూచిక

# బీజ్ బంద్

బీజ్ బంద్:—శక్తిపోయిన వీర్యమును గట్టిపరచుట కు లోక ప్రసిద్ధి జెందినది. స్వప్నమందుగాని మూత్రము తోగాని వీర్యము స్ఖలితమగుచున్న యెడల తత్క్షణం నిలిపి వేయును. ముసలితనమును, నపుంసకత్వమును తొలగించి యౌవన మొసంగును. ఎంతబలహీనుని కయినను రెండు గంటలలో నరములకు బలమునిచ్చి సంసారసుఖము అను భవించునట్లు జేసి సంతానవంతులుగజేయును. ఉత్తరము లు రహస్యముగా నుంచబడును.

20 మాత్రలు సీ॥కి 1- 2-0-0. వి. పి. చార్జివేరు.

## ఆర్యవైద్యాశ్రమం,

౩, బైరాగిమఠం వీధి, మదరాసు.

---

# అద్భుతమైన జర్మను ఎలక్ట్రిక్ దీపము



దీనిని మేడపైనను, గోడలో ను పెట్టవచ్చును. రాత్రిలో పడకలో నుండి యీ దార ము (వైరు) యొక్క సహా యము చే వెలిగించుటకును నిలుపుటకును, ఎనతిమైనది. గాలికొట్టినను కూడ దీపముపోదు. పండుగదిన ములలో దీనిని వెల్గించిన యెడల, ఆవిమేయము చూచుటకు జనులు గుంపులుగా చేరుదురు.

బాటరీతో లైటుధర రు 4—8—0

తపాలుఖర్చులు ,, 0—10—0

**PARIS EMPORIUM,**
George Town, Madras.

---

# డిటెక్షను లేక రహస్యమును గనుగొను యంత్రము

దీని ఉపయోగము:—ఉన్నచోటనుండియే నీయొక్క ప్రియురాలిని, ఆమెచేసెడి పనులను ఆమెకు తెలియకనే. ఈ యంత్రమునుగొని నీవు తెలిసికొనవచ్చును. నీవెనుకను, ముందును, నీకు తెలియకనే జరిగెడి విషయములను ఏకకాలముననే దీని మూలముగా దెలిసికొనవచ్చును. నీకు తెలియకుండ గన్ను పెంబడించివచ్చునాతని నీవు తిరిగి జూడకనే దీనినిగొని తెలిసికొనవచ్చును, దీనితో పలురకముల రంగులతో తయారుచేయబడిన పడకటింటి ఫోటోగ్రాఫ్ పటములు అందమైనవి నాలుగు పంపబడును. దీని ధర రూ. 2-0-0 పరదేశములకు వీ. పీ. మూలముగా పంపబడవు గాన పైకము ముందుగానే పంపవలయును.



ప్యారిసు ఎంపోరియము, జి. టి. మద్రాసు.

---

# కుసుమ

సీసా 1-కి, రు 2-0-0 వి. పి. చార్జివేరు.

ఈమందు గనేరియా అను సెగరోగమును 24 గంట లలో నివారించి మూత్రద్వారమునుండి వెలువడు స్రావ మును మూత్రము విడుచునప్పుడు గలుగు చురుకు, పోటు, మొదలగు బాధలను వెంటనే నిలిపివేయును. స్త్రీలకుగల గు యేవిధమయిన కుసుమవ్యాధులయినను ఆశ్చర్యముగా కుదుర్చును,

**ఆనందకుటీరము.** ౩, బైరాగిమఠంవీధి, మదరాసు.



శరీరమునందెల్లెడల గాయములు తగిలినను లక్ష్యపెట్టక ఓరుగల్లు
పరిహారిపై నాట్యమాడుచున్న వినాయకుడు.

PHOTO BY :—THE ANDHRA VOLUNTEER CORPS.

హైదరాబాదు సెప్టెంబరు ౧౯౨౭

సంపుటము ౧ ప్రభవ సంవత్సర భాద్రపదము సంఖ్య ౯

# ప్రకృతి సందర్శనము

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి

౧. చుట్టుఁ గోటల బంధించి కట్టుకొన్న
పైఁడి మేడల, రతనాల మాడుగులను,
నంతిపురములయందు, నహర్నిశంబుఁ
గాపురము సేయుచున్న భూకాంతులార!
ఆననంబుల కంటుకొన్నట్లు గూరు
చుండి రొక్కంబు లెక్కించు చూపిరాడ
కర్ధరాత్రంబు దాఁక, నన్యంబుఁగనమి
వెండి బంగారములు దప్ప విశ్వమందు
వేఱు లేదని తలఁచు కుబేరులార!
దీపములు పెట్టి రేలునిం దీఱకుండ
లేకరులచేత వ్రాయించు లేకరీతిఁ
గ నరికొట్టుచు సంతృప్తిఁగవక పనికి
ఖాది ఖంపానఁబట్టుచుఁ బ్రజలని...
దమను కార్యాలయంబె స్వర్గముగఁ దలఁచి
ప్రభుతఁ బ్రకటించు నధికారి వర్యులార!
సర్వకాలంబు మీ సౌధ జాలమందె
కడపుచున్నార లన్యలోకంబు గలద
టంచుఁ గూడ నెఱింగిన యట్లు లేదు;
ప్రకృతి దృశ్యంబులను జూడ వచ్చుమీకు
రండు మా కవితాకుటీరముల వైపు
గనుఁడి! యొకతూరి మీదు చూడ్కినినిగుడ్చి
కొండ చిలువలు వగిదినిఁ గుటిలగతిని
శైలములఁబాఱు సెలయేళ్ల జాలులవిగో!
వృక్షములనీడ నెమరులు వేసికొనుచు
హాయిగాఁ బండుకొనియున్న యావులవిగో!
పదలు తెలియఁజాలని క్రొత్త భాషలోన

ముచ్చటలు చెప్పుకొనుచున్న పులుఁగులవిగో!
రండు! మఱికొంతదూర మా ప్రక్కఁగనుఁడు
తడపలును దారములును నల్లడలఁ దీఁగి
తెచ్చుకొని గూండ్లనల్లుకొను పిచ్చుకలిగో!
గాలికెదురుగఁ బడగెత్తి కమ్మనైన
వాయువులు మ్రింగుచున్నట్టి పాములవిగో!
ముండ్ల చెట్లకు నెగఁబ్రాఁకి ముందుగాళ్ల
నాకు జొంపంబులను మేయు మేఁకలవిగో!
చూపు మఱలించియింక నీవైపుఁగనుఁడు!
పువ్వునిగ్గుల కలకలనవ్వు మొగము
లూని చిగురాకుఁ జేతుల నొండొరువుల
దగ్గఱకుఁ బిల్చుకొనుచున్న తరువులవిగో!
పాలు ద్రావెడు దాఁకనుం గాలునిలక
చంగు చంగున దాఁటు చాశాముఖములఁ
దోఁకలెత్తుక పఱచు నా దూడలవిగో!
పైరుమేయుచుఁ బచ్చికపట్ల బంతి
వోలె నెదురైన వెఱుగులం బొదరుటిండ్ల
నెగిరి దూఁకుచునున్నవి మృగములవిగో!
తలను బైకెత్తి యిఁక వియత్తలముఁ గనుఁడు!
పల్లటీల్వేయుచును మేఘపంక్తిదాఁటి
పోవుచున్నవి యే లోకమునకొ? యింక
మరల మనకగపడవు పావురములవిగో!
రెక్కలను జాఁచుకొని యంతరిక్ష సీమఁ
గనగ వలయాకృతిఁ జరించు గ్రద్దలవిగో!
ముక్కుతోఁబట్టి సన్నని పుడకయొకటి
యాకసమునందుఁ బరులెత్తుఁ గాకియదిగో!
ఇదిగో! యీ వైపు దృష్టి సారించి కనుఁడు!
ఇచ్చటచ్చటఁ దిరుగాడి యెర్రను దెచ్చి
యాత్రమునఁ గిచకిచలాడు చహామహమిక
డాసి నోటినిఁ దెరచు బిడ్డలకు నోటఁ
జొనిపి తమనోటి యెరనిచ్చు శుకములవిగో!
కాయలనుగొట్టి వేయుచు గంతులిడుచు
నల్లసమునఁ జెట్లఁ జరించు నుడుతలవిగో!
చాళ్లు చాళ్లుగా దున్నిన చాయలవిగో!
ఏపుగా గడ్డపట్టిన యెడలు నవిగో!
మిటమిటని మిట్టిపడుచుండె మిడుతలవిగో!
రండు మరికొంత దవ్వుఁ గాంచుండు
బీటఁ బశువుల మేఁపుచు గోటిబిళ్ల [మరియు
లాడుచున్న కాపరి పిల్లలరుగో! కనుఁడు!
దూరగతు లొండుఱులు తనవారిఁ గూర్చి
ప్రీల్చుకొనిపోవ గొంతుక వేసినట్టి
కేకలే వేయుచున్నారు కెరలి యరుగో!
క్రొత్తగాఁగట్టి నార లాకొడెదూడ
లాగుచున్నది బండిఁ బల్లమున కిదిగో!
యమునివలె దున్నపైనెక్కి యరుగుచుండె
గొడ్లకాపరివాఁడఁడుగో! యొకండు.
ఇదిగో! యీవైపు దృష్టి సారించికనుఁడు!
కుఱువు పయిఁబండుకొను పిల్లకోఁతిపేల
నేఱి తినుచుండెఁ గొమ్మపై నిదిగో! కోఁతి.
దోసెలను గాల్చుచు నొకర్తు ద్రోవప్రక్క
నమ్ముచున్నది పిల్లలకదిగో! యవ్వ
కూరగాయల కావళ్లవారు పట్ట
ణమున నమ్మంగ వెళ్లుచున్నారలరుగో!
చెఱువుగట్టున బైరాగి చెట్టునీడ
వేషమును దిద్దుచున్నాఁడు వీఁకనదుగో!
ఇంక నెన్నెన్నొ గనుదోయి కింపునింపు
దృశ్యములు గానఁబడుచుండు నిచటమీకు
విలువఁ గట్టుండు మీ సౌధములకు మాదు
గుడిసెలకు బత్తెపాతంబుఁ గొనకమీరె.

# మధురా విజయము

**ఆవంత్స వేంకటరంగారావు**

మధురా విజయమని గాని వీరకంపరాయ చరితమని గాని వ్యవహరింపఁబడుచున్న ఈ సంస్కృతకావ్యమును రచించినది గంగాదేవి యని సర్గాంత గద్యముచేఁ దెలియబడుచున్నది. "ఇతి శ్రీ గంగాదేవ్యా విరచితే మధురా విజయనామ్ని వీరకంపరాయచరితే ప్రథమస్సర్గః" తరువాత ఈమె క్రీ. శ. ౧౩౬౪ సం|| ప్రాంతమున కాంచీపుర సింహాసనాధ్యక్షుండై రాజ్యమేలిన కంపభూమీపతియొక్క మహారాజ్ఞి యని సప్తమ స్సర్గమందున్న ౩౯–౪౧ శ్లోకముల వలన గోచరించుచున్నది.

శ్లో|| అథకంప నృపోపి కృత్యవిత్
కృతసంధ్యాసముచిత క్రియః।
అవనీ సవిధస్థితాం ప్రియాం
భువి గంగేత్యభినందితాహ్వయామ్|| ౩౧

శ్లో|| ఇతి సాదయితేన భాషితా
దరవ్రుంసకతే ముఖాంబుజమ్|| ౪౧

(సప్తమః సర్గః)

ఇతిహాసములనుండి కథలు గైకొని కావ్యములు వ్రాయుట సామాన్యముగా కవులనేకమంది కాచారముగా నుండెను గాని ఈమె తన కావ్యమునందు నిజభర్తయొక్క జీవిత చరిత్రయే ప్రధానాంశముగాను తీసికొని యాతని భర్తయెడల నామెకుఁగల గౌరవాదరములను, అనన్యసామాన్యమైన కవితాధోరణియును వెల్లడించినది. ఈ కావ్యము ప్రాచీన కావ్యముల ననుసరించి అష్టాదశ వర్ణనలతోఁ గూడియున్నది. శ్లోకములన్నియును వైదర్భరీతిలో వ్రాయఁబడి కడుసులభముగా నర్థములగుచు భావగర్భితములై శ్రోత్రరసాయనముగా నున్నవి. కాళిదాసమహాకవి వరేణ్యుని వలె నీమె తనకుఁ గావలసిన యుపమానము లన్నియును ప్రకృతినుండియే గైకొని యా కవీశుని మార్గముల ననుసరించినట్లును, అయిన యాదిమెకుఁగల గౌరవము నీక్రింద శ్లోకమువలన దేట తెల్లమగును.

శ్లో|| "దాసతాం కాళిదాసస్య కవయః కేవబిభ్రతి।
ఇదానీమపి తస్యార్థా నుపజీవంత్యమీ యతః||

ఈ కావ్యమామె రచించునప్పుడు రఘువంశమును మాతృకగ నుంచుకొనినట్లు కొన్ని కొన్ని శ్లోకముల వలన స్పష్టమగుచున్నది. రఘువంశములోఁ గాళిదాసు యొక గర్భిణిని క్రిందివిధముగ వర్ణించి యున్నాడు.

శ్లో|| శరీరసాదా దసమగ్రభూషణా
ముఖేన సాలక్ష్యత లోధ్రపాండునా।
తనుప్రకాశేన విచేయతారకా
ప్రభాతకల్పా శశినేవ శర్వరీ||

గంగాదేవి కూడ నట్టి సందర్భముననే తనయత్రాగా రగు దేవాయినిట్లు వర్ణించుచున్నది:

శ్లో॥ ముఖేనతస్య శరపాండరేణ
విముక్తరత్నాభరణా విరేజే।
విలూనరాజీవనాదినాంతే
ఛాయాశశాంకేన శరన్నదీవ॥

రఘువంశములో నొక మహీపతియొక్క చైత్ర యాత్ర యీ క్రిందవిధమునఁ జెప్పబడి యున్నది.

శ్లో॥ ససేనాం మహతీకర్షన్ పూర్వసాగర గామినీమ్।
బభౌహర జటా భ్రష్టాం గంగామివభగీరథః॥

మన కవయిత్రికూడ కంప భూపాలుఁడు, పృతనా ధ్యక్షులతో ద్రవిడ కర్ణాటాధిపతుల జయించుటకు వెడలు టను వర్ణించుచు,

శ్లో॥ సనయన్ మహతీం సేనాం వ్యరుచ ద్వీరకుంజరః।
పయోదమాలా మాకర్షన్ పారస్య యివమారుతః॥

అని చెప్పియున్నది. పై సంగతులు గమనించి చూడ గంగాదేవి కాళిదాసుని మార్గముల నవలంబించిన దని చెప్పక తప్పదుకాని యామె కేవల మాతని యుప మానములనే వాడక, స్వతంత్ర రచనలుచేసి తన మేధా శక్తిని వెల్లడిఁ జేసినది.

సర్వలక్షణ లక్షితంబైన ఈ కావ్య మొక స్త్రీయైన గంగాదేవిచే రచింపబడినది. కాదని కొందఱు పండితు లనుమానింప వచ్చును. కాని యట్టి తలంపు స్త్రీజాతికి పెద్ద యనర్థము దెచ్చుచున్నది. కవిత యొకరి సొమ్ము కాదు. స్త్రీలలో గొప్ప మేధాశక్తి గలవారున్నరు. తోరూదత్తు యొక్కయు, సరోజనిదేవి యొక్కయు గవితా సామర్థ్యమే ప్రస్తుతము మనకుఁ దార్కాణము. తరువాత మధురావిజయ మిప్పుడే కాక అప్పటి కాల మునఁ గూడ మంచి గౌరవముఁ బడసినదని చెప్పుటకొక యుదాహరణ మివ్వవచ్చును. క్రీ.శ. ౧౭ వ శతాబ్దములో సుమతీంద్రమతాధిపతియగు మధ్వాచార్యుని (రాఘవేం ద్రస్వామి) గూర్చి నారాయణ కవిచే వ్రాయఁబడిన రాఘవేంద్ర విజయమను కావ్యమునకీ మధురా విజయము మాతృకగా నుండెనని కొన్ని తార తమ్యముల వలన వెల్ల డి యగుచున్నది.

శ్లో॥ చేతసోస్తు ప్రసాదాయ సతాంప్రాచేతసో మునిః
పృథివ్యాం పద్యనిర్మాణ విద్యాయాః ప్రథమంపదం॥
(మధురావిజయం)

శ్లో॥ సుధీంద్రయోగినం వందే సాధుస సత్కృత సంపదమ్।
సగద్యపద్య నిర్మాణ విద్యాయాః ప్రథమంపదం॥
(రాఘవేంద్ర విజయం)

శ్లో॥ గుణం విహాయ కావ్యేషు దుష్టదోషాంగవేషతే।
వనేషుత్యక్త మాకందః కాకో నింబ మపేక్షతే॥
(మధురావిజయం)

శ్లో॥ కావ్యేగ వేషతే కశ్చిత్ దోషమేవ గుణంపరః।
పిచుమందం యథాకాకః పికశ్చూతలతాంయథా॥
(రాఘవేంద్రవిజయం)

శ్లో॥ నిర్దోషాప్య గుణావాణీ నవిద్వజ్జన రంజనీ।
పతివ్రతాప్య రూపాస్త్రీ పరిణేత్రేవ రోచతే॥
(మధురావిజయం)

ఆదోషాప్య గుణే త్యుక్తి
స్త్వక్తుం యుక్తానవై బుధైః
పతివ్రతా గుణేత్యేవ
పత్యాకిం త్యజ్యతే ప్రియా॥
రాఘవేంద్ర విజయం

ఈమె శైలినిగూర్చి యించుక. శ్లోకములను దేట మాటలతో సులభ గ్రాహ్యములుగను, భావ గర్భితములు గను రచించుటలో నీమె కసమానమైన ఔచిత్యము గలదు. ఒక్కొక్క శ్లోక మొక్కొక్క ద్రాక్ష ఫలము వలె రుచికరమై శ్రోతల స్వాంతములు రంజింపుచుం డును. కావ్యారంభమున నిష్టదేవతా స్తోత్రముఁజేసి ప్రాచీన మహాకవులఁ బేర్కొను సందర్భమున రచింపఁ బడిన శ్లోకముల నీక్రింద పొందుపరచుచున్నాడను:

శ్లో॥ కల్యాణాయ సతాంభూయా ద్దేవో దంతావళాననః।
శరణాగత సంకల్ప కల్పనా కల్ప పాదపః॥

శ్లో॥ స్రష్టుః త్రిపురస నిర్మాణ మాతృకా రూపధారిణీ।
ప్రసేద్య ప్రతిబోధాయ చిత్ప్రకాశాత్మ కాశివా।

శ్లో॥ మహాకవి ముఖాంభోజ మణిపంజర శారికామ్।
చైతన్య జలధిజ్యోత్స్నాం దేవీం వందే సరస్వతీమ్॥

శ్లో॥ అసాధారణ సార్వజ్ఞం విలసత్సర్వ మంగళమ్।
క్రియాశక్తి గుణం వందే త్రిలోచన మివాపరమ్॥

శ్లో॥ చేతసోస్తు ప్రసాదాయ సతాం ప్రాచేత సోమునిః।
పృథివ్యాం పద్యనిర్మాణ విద్యాయాః ప్రథమం పదమ్॥

శ్లో॥ వైయాసికేగిరాం గుంఫే పుండ్రేక్షు ర్వివలభ్యతే।
పద్యః సహృదయాస్వాద సారః పర్వణి పర్వణి॥

శ్లో॥ నాసతాం కాళిదాసస్య కవయః కేనబిభ్రతి।
ఇదానీమపితస్యార్ధా నుపజీవం త్యమీయతః॥

శ్లో॥ వాణీపాణి పరామృష్ట వీణానిక్వాణహారిణీమ్।
భావయంతి కథంవాన్యే భట్టబాణస్య భారతీమ్॥

శ్లో॥ విమర్దవ్యక్త సౌరభ్యా భారతీ భారవేః కవేః।
ధత్తే వకుళమాలేన విదగ్ధానాం చమత్క్రియామ్॥

శ్లో॥ ఆచార్య దండినోవాచా
మాచాంతా మమృత సంపదామ్।
వికాసో వేధసః పత్న్యా
విలాస మణి దర్పణః॥

శ్లో॥ సాకాపి సురభిః కంకే భవభూతేః సరస్వతే।
కర్ణేషులబ్ధ వర్ణానాం సూతే సుఖ మయీంసుధామ్॥

శ్లో॥ మందారమంజరీ స్యంది మకరంద రసాబ్ధయః।
కస్యనాహ్లాదనాయాలం కర్ణామృత కవేర్గిరః॥

శ్లో॥ తిక్కయస్య కవేఃసూక్తిః కౌముదీవ కళానిధేః।
సత్ప్రజ్ఞైః కవిభిః స్వైరం చకోరై రివసేవ్యతే॥

శ్లో॥ చతుస్సప్తతి కావ్యోక్తి వక్తృవైదుష్య సంపదే।
అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయేత్ కోనుకోవిదః॥

శ్లో॥ స్తుమస్తమపరం వ్యాసం గంగాధర మహాకవిమ్
నాటకచ్ఛద్మనాదృష్టాం యశ్చక్రేభారతీం కథామ్॥

శ్లో॥ చిరంసవిజయా భూయాత్
విశ్వనాథః కవీశ్వరః।
యస్యప్రసాదాత్ సార్వజ్ఞ్యం
సమింధే మాదృశేష్వపి॥

శ్లో॥ క్వచిదర్థః క్వచిచ్ఛబ్దః క్వచిద్భావః క్వచిద్రసః
యత్రైతే సంతి సర్వేపి సనిబంధో నలభ్యతే॥

శ్లో॥ ప్రబంధమేకమాత్రేపి దోషోనయతిదూష్యతామ్।
కాలాగురు ద్రవభరం శు కిష్కారకణోయథా॥

శ్లో॥ నిర్దోషాప్య గుణావాణీ నవిద్వజ్జన రంజని॥
పతివ్రతాప్య రూపా స్త్రీ పరిణేత్రే నరోచతే॥

శ్లో॥ గుణం విహాయకావ్యేషు దుష్టదోషంగవేషతే।
వనేషుత్యక్త మాకందః కాకోనింబ మపేక్షతే॥

శ్లో॥ చార్యార్జితేన కావ్యేన కియద్దీవ్యతి దుర్జనః।
ఆహార్య రాగి నచిరం రుచిరః కృత్రిమోపలః॥

శ్లో॥ తార్కికాః బహవః సంతి శాబ్దికాశ్చసహస్రశః।
విరలాః కవయోలోకే సరసాలాప పేశలాః॥

శ్లో॥ కరోతి కీర్తిమర్థాయ కల్పితేహంతి దుష్కృతమ్।
ఉన్నలయతిబాహ్లాదం కింనసూతే కవేః కృతిః॥

శ్లో॥ నప్రార్థనీయః సత్కావ్య స్పృత్యైసహృదయోజనః।
స్వాదుపుష్ప రసాస్వాదేక ప్రదేయతి షట్పదమ్॥

శ్లో॥ తస్మాదీయ మిదం కావ్యం విబుధాః శ్రోతుమర్హథ।
మధురావిజయం నామ చరితం కంపభూపతేః॥

అని కథ ప్రారంభించినది. కావ్యాంతర మందీమె రచించిన శ్లోకములుకొన్ని క్రింద నుదహరించుచున్నాము.

శ్లో॥ ఆసీత్ సమస్త సామంత మస్తకన్యస్యశాసనః।
బుక్కరాజ ఇతి ఖ్యాతో రాజా హరిహరానుజః॥

శ్లో॥ యదయా దక్షిణః పాణిః కృపాణగ్రహణచ్ఛలాత్।
అశిక్షత విపక్ష శ్రీ వేణీకర్షణ కౌశలమ్॥

శ్లో॥ పరిపంధి నృపప్రాణ పవనాహార దారుణః।
అసృజత్ భుజగోయస్య కృపాణః కీర్తికంచకమ్॥

శ్లో॥ అవైక్షత క్షమాశరీరయష్టేః కుమార ముత్సంగతం
సదేవ్యాః।
శరత్కృశాయిన శైవిన్యా స్తరంగలగ్నం కల
హంస శాబమ్॥

శ్లో॥ శ్యామయమానచ్ఛవినాముఖేన స్తన ద్వయం తా
మరసేక్షణాయాః।
సందష్టనీలోత్పల యోరభిఖ్యాం రథాంగ నా
మ్నోరధరీచకార॥

శ్లో॥ సౌభాగ్యగంధ్యదిపదానలేఖారరాజితస్య నవరో
మరాజీ॥
తేజోనిధింగర్భితతే నిగూఢం కాలోరగీ రక్షితు
మాగతేవ॥

శ్లో॥ మహార్ద్రుమాః పల్లవపాటలేన మూర్తిక్రతేన ద్విత
యేనపాణ్యోః॥
అరాతిలక్ష్మీ కచసంచయానా మాకర్ష శిక్షా మినశీల
యంతమ్॥

కథావిషయము

ఈ కావ్యమందలి కథ గంగాదేవియొక్క భర్తయైన కంపమహీపతిదే యని మున్నె సుడివి యున్నాడను. ఆచట్టిదనిన, హరిహరానుజుఁడైన బుక్కభూపతి తుంగభద్రాతీరస్థమైన విజయనగరమును బరిపాలించుచుండెను. అతని రాజ్యముత్తరమున వింధ్యపర్వతముల వఱకును, దక్షిణమున మలయాద్రి వఱకును పశ్చిమమున అస్తాచలము వఱకును, దూర్పున నుదయాచలము వఱకును వ్యాపించియుండెను. ఈతనికి దేవాయియను నామె వలన ముందు కంపనుఁడను వాఁడును దరువాత కంపలసంగమాలను యిద్దరు తనయులు జన్మించిరి. శాత్రువులను గంపింపఁజేయగలరని కుంతల భూమిపాలుఁడు తన జ్యేష్ఠ, ద్వితీయ తనయులకుఁ గంపనులను నామకరణమొఁచేసెను. ప్రథముఁడగు కంపనుఁడు యౌవనమునందిన వెంటనే బుక్కరాజాతనిని, తన శత్రుఁడును; దుండీరభూమండలాధినాథుండును నగు చంపరాయని జంపనంపెను. యుద్ధములో వానిని జంపి కంపనుఁడు కాంచీపురమునఁజేరి పరిపాలించుచుండెను.

ఇట్లుండ నొక నాడొక యువతి కంపనుని ముంగల నిలచి దక్షిణ భూభాగమంతయుఁ దురుష్కవాహిని సమాక్రాంత. మరియొనను వృత్తాంత మెఱింగించి తత్ప్రదేశమంతయుఁ బాప భూయిష్ఠమగుచున్నదని బిట్టువిలపించెను. ఆ మాటలు విని సహింపనివాఁడై కంపనుఁడు దాడి వెడలి వాని నోడించి తురుష్కులచే నాక్రమింపబడిన మధురాపురమును వశపరుచుకొనెను. అందుచేతనే ఈ కావ్యమునకు మధురా విజయమని పేరు. మధుర విజయమైనదికనుక.

గంగాదేవి ఈ కావ్యము రచించునప్పుడు విస్మృత చారిత్రక విషయములనేకములు తలవనితలంపుగాఁ బొందు పఱచి యుండుటచే నీ పాత్రము ముఖ్యమైనదిగా గణింప వలసియున్నది. దీనివలన హంపి విజయనగర రాజ్య చరిత్ర చాల మట్టుకు తెలియవచ్చుచున్నది. దీనిని పట్టపరీక్షకుఁ బఠనీయ గ్రంథముగా నియమించిన చెన్నపురి విశ్వవిద్యాలయము వారెంతయు బ్రశంసనీయులు. దీనిని ప్రచురించి హిందూదేశమునకు మహోపకార మొనరించిన పండితులు హరిహర శాస్త్రిగారికిని శ్రీనివాసశాస్త్రిగారికిని మనమెంతయుఁ గృతజ్ఞులము.

ఈ కావ్యము జీర్ణమైనతాళ పత్రములలో లభించుటంజేసి విచారించుచు హరిహర శాస్త్రిగారిట్లు వ్రాయుచున్నారు.

It is much to be regretted that it has not been possible to secure a complete manuscript of the work, consequently this edition (second) differs very little from the former except that a few textual corrections, the result of further study and careful revision, has been inserted.

Pandit V. Srenivasa Sastri who had participated in the pleasure of bringing out the first edition of this small work and who would, with his untiring patience, perhaps have succeeded in procuring a more perfect manuscript, is now no more, and in his untimely deathSanskrit re-search has lost a persevering and conscientious worker.

" ఈ కావ్యమును గూర్చి ౧౯౧౩ వ సం॥ మార్చి నెల మాడరన్ రివ్యూ (Modern Review) యిట్లు వ్రాయుచున్నది:

"........Its authoress Gangadevi was the queen of Kampana one of the Kings of Vijayanagara Empire. The subject of her present work is the life of her royal consort with special reference to Madura then under the Flag of the Mahammadan rule. Hence the Kavya is termed Madhuravijaya or Virakamparayacharita. The book thus throws a flood of light upon the history of that time in the Deccan........"

"As to the poetic merits of the work the poetess has exhibited her so much poetical talents in every direction that it deserves to be classed among the writings of Mahakavis (the great poets in Sanskrit literature)

......Indeed a new chapter will be added to Sanskrit literature by the discovery of this work, and India may be proud not only of her one Gangadevi the Sacred river Ganges, but also of another Gangadevi the poetess of Madhura-Vijayam."

## నీతి పంచకము

సురవరము ప్రతాపరెడ్డి

౧ పరుల యన్నంబు రుచిగన్న బానిసీఁడు
స్వేచ్ఛనుండెడి జనులను జెఱుపఁజూచు,
నరుని యుపలాలనంబునఁ బెరుఁగులేడి
పరమృగంబులఁ దన స్వామి వశము సేయు.

౨ పరులఁ బీడించి బ్రదికెడి పాతకుండు,
స్వీయ మర్త్యత్వనంబులఁ జెడును నిజము,
పట్టుపురువెద్ది గూళ్లని భ్రమసె మదిని,
వద్ది తనకు శ్మశానంబె యగును దుదకు.

౩ బలియు దర్పంబు నడఁగింప వలయునేని,
బలియుచేతనె సాధింప వలసియుండు,
వజ్రకాఠిన్యమును ద్రుంప వలయునేని,
వజ్రమునె యుపయోగింప వలసియుండు.

౪ బలిమిగలవారె పూజ్యులు వసుధలోన,
బానిసలకెందు మన్నన వడయనౌనె?
తేఱిచూడరు మృగరాజు దిక్కెవరు,
గార్దభంబులఁ బడఁదన్న ఘనులు జనులు.

౫ మనుజుచెయ్యుల మూలంబు మనమెసుమ్ము,
మనసునుండియె సర్వంబు జనన మొందు,
దుష్టచేష్టల వెన్నంటు దుఃఖమెపుడు,
పాపురాలను వేటాడు బైరిపడుపు.

## ఏకాంతసేవ

ఊటుకూరు సత్యనారాయణరావు

లలిత సుకుమార మైన గులాబిరేకు
లన్ని కనుగంకి రాగ రమ్యంబులయ్యె,
అవి భవన్మృదుపాదవిన్యాసచిహ్న
ములు, అటె పోయినావేమొ తొలగి నాథ!

* * * *

ఈ యుపవనాంతమందార వృక్షశాఖ
కల సోనల బిందువులు రాలు; వలపుకలుకు
పూవు లన్నియుఁ గోసికో పోయినట్లు
శోనఁబకునిట త్వన్నభాష్పములు నాథ!!

* * * *

నాథ! ఆత్రోవబోవుచున్నావ యేమి?
జలజలని పాఱు సెలయేటి జాలు, వెంట
నంటి గానంబు సేయు నీ యలఘుమహిమ
గానరావేమి, కన్నులు గలిగియున్న?

* * * *

ఆ సరోజపథంబుల...నీసుమాళి
ఇచటనే ...ఇటనె, వెలుఁగు లిటె తోచె,
కనులు మిరుమిట్లు గొలిపె, నామనను చెదరె,
ఇది భవన్ముఖ కాంతులా నేమి? నాథ!!!

# గుంటూరు ప్రయాణము

మునిమాణిక్యం నరసింహారావు

(సాహితీ సమితి సభ్యులు)

౧

అసలు నేను ఎక్కడికీ ప్రయాణం చేసేవాడిని కాను. ప్రయాణం అంటే అయిష్టం కలిగింది. దానికి ఒక చిన్న కారణం ఉంది. నేనూ అందరిలాగ అందంగా ఉండవలెనని చూస్తూ ముందు జుట్టు ముచ్చటగా దువ్వుకొని పైన పట్టుకండువా వేసుకొంది సాధారణంగా బయటికిరాను. నేను వీధివెంట వెడుతూ ఉంటే వాకిళ్లలో చక్కగా ఆడుకొంటున్న పిల్లలు నన్ను విపరీతంగా కళ్ళు ఆర్పకుండా చూసి, కెవ్వున కేకలేసి, ఇళ్లలోకి పరుగెత్తుతారు. మా అక్కయ్య కూతురు కూడా నన్ను జూచి బూచివాడు బుయ్యిస్' అంటుంది. వీళ్ల కళ్లకు నేను ఏమిలాగ కనపడుతానో? నేనేమైన అరవవాడిలాగ కనిపిస్తానాఏమి మళ్ళీ. ఏమిటోమరి! బజారున వెడుతూఉంటె అంబోతు ఎద్దు నన్ను చూడటంతోనే సాధారణంగా పొడవ వస్తుంది. అది సాత్త్వికమైన జంతువు పిల్లలు దగ్గరకెళ్లినా ఏమీ అననిజంతువ. నన్నుజూచి పొడవరావటానికి ఏదో కారణం ఉండకమానదుగదా? కారణం ఫలానా అని నేనేమి చెప్పేది.

వీధివెంట అటూఇటూ చూస్తూ సరదాగా వెళ్లే ప్రాప్తంలేదు. ప్రతిజంతువ నన్ను చూచి బెదరిపోతుంది! ఆడవాళ్ళు బెదిరారంటే పోని అదేదో వాళ్ళకు సహజగుణం అనుకోవచ్చు. కోడిపెట్ట నన్నుజూచి బెదిరి నన్ను తరిమితే నేనేమనుకోవాలి!

ఇంతకూ అది నా జాతకఫలం. నన్ను ఎవ్వరూ సరీగా అర్థం చేసుకోలేరు. ఈమధ్య కొంచెం సరదాపడి గిరజాలు పెట్టించాను. అవి బాగాపెరిగిన తరువాత అందంగా ఉన్నవి. మొఖానవున్న స్ఫోటకం మచ్చల వల్ల అందానికివచ్చిన లోపం దీనితో పోయిందని అనుకొన్నాను. ఒకరోజున గిరజాలు చాలా అందంగా దువ్వుకొని హాజ్లిన్ స్నో (Hazline Snow) మొఖాన రుద్ది సిల్కు కండువా పైన వేసుకొని బయలుదేరాను. ఆరోజున ఎందుకో మహా కులాసాగా ఉంది. నేను వెడుతూఉండగా ఒక పెద్ద మనిషి నన్ను వెనకనుంచి కేకలేసి పిలిచాడు. ఎవరో పెద్దమనిషిగదా అని ఆగి „ఎందుకండీ" అన్నాను. అతడు "ఏమోయ్ నిన్న మీఅన్నయ్య కాబోలు ఆతడు నీ మోస్తరే ఉంటాడు. మాయింట్లో పరుపుకుట్టటానికి ఒప్పుకొని రేపు వస్తానని చెప్పి మళ్లీ రాలేదు. రేపు తప్పక రమ్మని చెప్పుమీ" అని వెళ్ళిపోయినాడు. నాకు అరికాలిమంట తలకెక్కింది. నేను దూదేకుల సాహెబుకమ్మడినా! బుర్ర చితుకకొడుదామని అనుకొన్నాను. ఇంతలో అతడు వీధిమలుపు తిరిగి జనంలో అదృశ్యుడైనాడు. నాసమీపంలో ఉంటే ఏమి జరిగేదో!

అసలు రైలుప్రయాణం అంటె ఎందుకు ఇష్టంలేదో చెప్పబోయి ఇదంతా ఉపోద్ఘాతంకింద వ్రాశాను.

...విషయం చెబుతాను. ఒకమాటు రైలులో ప్రయా... ...పెట్టెలో ఎక్కాను. నేను ఎక్కిన పెట్టెలో ఒ... అరవదేశపు స్త్రీ తనపిల్లలు కాఫీడబ్బా పెట్టుకొని కూ... ర్చున్నది. నేను ఎక్కీ ఎక్కడంతోనే ఆమె చంటిపిల్ల... వాడు నావంక వెఱ్ఱిచూపులు చూచి కెవ్వున కేకేసి తల్లి ... ఒళ్లో నిరుచుకు పడ్డాడు. నాకు చెడ్డకోపం వచ్చింది. ...దాకా అనుకుంటున్నవాడు నన్ను జూసేచూడ... తోనే విరుచుకు పడటానికి నేనేమైనా పెనుభూ... తాన్నా? పోనిలే అరవ వెధవ అని ఆబాండిలోనే ఎక్కి... కూర్చున్నాను. పిల్లవాడు ఒక్కతీరున గుక్కబట్టి ఏ... డ్వటం మొదలు పెట్టాడు. తల్లి ఎన్నోవిధాల సముదా... యించాలని చూచింది. సనేమిరా వాడు వినడు. ఆమె ... పాపం కాఫీ యిచ్చింది, బిస్కట్టు పెట్టింది. ఏమేమో ... పెట్టి వాణ్ని మరిపించాలని చూచింది. కాని ఏమిలాభం ... లేపోయింది. వాడు ఊరికే నావంక దిగాలపడి చూడ... టం, ఏడవటం! ఆమె విసికిపోయి ఆఖరుకు "ఏమో... నాయనా ఎవరినిజూచి జడుసుకొన్నావో, ప్రతివాళ్లు ఆ... డవాళ్లు ఉన్నారనిలేదు. పసిపిల్ల లున్నారనిలేదు, ఇ... ష్టంవచ్చినట్లు బండిలోకి పాకుతారు" అని నావంక చూ... స్తూ అన్నది. నాకూ విసుకుపుట్టి ఏలూరులో దిగిపోదా... మని ప్లాటుఫారంమీద కాలుపెట్టానో లేదో వాడప్పు... డే ఏడ్పు చాలించి నవ్వటం మొదలుపెట్టాడు. అందు... కని నేను సాధారణంగా రైలులో ప్రయాణం చెయ్య... టం మానుకున్నాను. కాని ఆరోజు తప్పని సరిగా ప్ర... యాణం చెయ్యవలసి వచ్చింది. మాబావ నన్ను తక్ష... ణం బయలుదేరమని ఈవిధంగా వ్రాశాడు.

"నీవు యీవుత్తరం చూచిన వెంటనే స్టేషనుకు ...అంటే పోలీసు స్టేషనుకు కాదు రెలుస్టేషను-టికె... ట్టుకొని గుంటూరులో దిగి బండిమీద (N.B. రైలుబం... డి మాయింటిదాకా లేదే అని దిగులుపడబోకు. నాఉద్దే... శం జట్కా మీద అంటె టాపుమీద ఎక్కి కూర్చునే ...లోపలే కూర్చొ) మాయింటికి యకాయకినిరా."

ఈఉత్తరం చూచుకొని నీ తెలివికి సంతోషిం... చాంలే అని వ్రాయాలనుకొని పోన్లే, వెళ్ళుతున్నాంగ... ...అనేది ముఖాన ఎదుట అందామని బయలు దేరాను. ...మర్నాడు ప్రయాణం కాబట్టి ఆరోజూనే బట్టలు ...సర్దుకున్నాను. తెల్లవారకపూర్వమే లేచి స్నానము ...చేసి బయలుదేరాను. ముత్తైదులు ఎదురుగావస్తే మం... చి శకునం అంటారు. ఏముత్తైదైన ఎదురుగా వస్తున్నా...

నన్నుజూచి బెదిరి మరోదారిని పోవటం నా అనుభ... వంలో విషయమే. నాభార్య మంచి ముత్తయిదు... వే కాబట్టి ఆవిడనే ఎదురుగా రమ్మని గుమ్మందా... టినతరువాత జట్కావాడిని వేగిరం రమ్మన్నాను. వా... డువచ్చి

"ఏవూరండి బాబు పయానం కట్టారు" అన్నాడు.

"గుంటూరుదాకానోయి" అన్నాను.

"ఓస్ గుంటూరుబండికండీ! ఏబండో అనుకొని గుర్రంతినే దాణా తీసివేసి వచ్చాను. అరగంట ఆలస్యం గా వెళ్లినా ఫరవాలేదు.దయచేసి మీరు కాఫీ పుచ్చు కొంటూ ఉండండి."

అనివాడు నన్ను హోటలులోకి పంపి వెళ్లిపోయి నాడు. దాణా తిన్నతరువాత వచ్చి నన్నెక్కించు కొన్నాడు. అప్పటికే రైలు కదలే టైం అయింది. బండి అందదనినునస్సులో అనుకొని "సరేపోని నివ్వేతీసు కొద్దుగాని లేవమ్మీ" అని వాడితో అన్నాను.

బండి ప్లాటుఫారంమీద ఉంది. నేను టికెట్టు కొ నుక్కొనే నిమిత్తం వెళ్ళాను. ఒకాయన ఆ గూట్లో చె యిబెట్టి "ఏమండోయి పీకంటిత్యండి. గుంటూరులో యాజ్యం తలపెట్టాను" అంటున్నాడు. నీవు ఎందుకు వె ళ్ళుతున్నది, ఆయనకు చెప్ప నవసరంలేదు. అని నేను అంటుంటె. నామాటలు వినిపించుకోకుండా అతను రెండు మొగ టికెట్లు ఒక ఆడ టికెట్టు యివ్వమన్నాడు. నాకు నవ్వొచ్చి "ఆడ టిక్కట్లు మొగటిక్కట్లు ఏమి టయ్యా" అన్నాను. ఆడబండ్లూ మొగబండ్లూ ఉన్న ప్పుడు టిక్కట్లు ఎందుకుండవంటూ అతడు వెళ్ళిపో యినాడు.

నేను వెళ్ళి "గుంటూరుకు ఇంటరు మీడియట్ టి క్కట్టు యివ్వండి" అన్నాను. అతడు నావంక ఎగా ది గా చూచాడు. ఆచూపులు వింతగా ఉన్నవి, "నీకా టిక్కట్టు ఇంకెవరికైననా? నీవెప్పుడైన యింటరు టి క్కట్టు కొన్నావా? ఇదే మొదటిసారి కొంటున్నా వా? ఇంటరు టిక్కెట్టు కొంటె ఎంత అవుతుందో తెలు సునా?" అని అర్థం ఇచ్చేచూపులు చూశాడు.

ఇటువంటి చూపులు అర్థం చేసుకోటం నాకు కొంచెం అలవాటే. కూరల దుకాణం దగ్గరకువెళ్ళి "వం కాయలు ఎల్లాయిస్తున్నావయ్యా"అని అడిగితే "సవాశేరు మూడు అణాలు" అంటాడు. మూడుఅణాలు విపరీతమై

వధం అని, నేను వేరేచెప్ప నక్కరలేదు. సాధారణంగా ప్రియంగా అమ్మే రోజులలో సయితం సవాసేరు అణాకు యిస్తారు. అయినా మరీ ప్రియంగా వున్నవేమో అని అణాకు అడిగితే బాగుండదనుకొని ,,అణన్నరకు యిస్తావా లేదా'' అని అనేసరికి వాడు ,,ఏమయ్యా యింత తెలివితక్కువగా మాట్లాడుతావేమి? వంకాయలు ఎప్పుడన్న కొని తిన్నావా? నీకు ధరల విషయమై బొత్తుగా తెలియని అడివిమనిషిలా ఉన్నావే''? అని తాత్పర్యం వచ్చే చూపులు చూస్తాడు. ,,నీవు ఏమయ్యా అల్లా చూస్తావు? వంకాయలైనా ఏమంత బాగుండలేదు. కనరెక్కిన వంకాయలలా ఉన్నయిగా'' అని నేననేసరికి ఇవా కనరెక్కిన వంకాయలు అని పెద్దగా అనిచి ఒకరకం చూపులు చూస్తాడు. నేను అంత వెర్రి వెంగళప్ప నయినట్టు నా అంత బుద్ధిహీనుడ్ని అతడు యీ విశాలమైన ప్రపంచంలో ఎప్పుడూ ఎక్కడ చూడనట్టూ భావం ప్రకటించే వింతచూపులు చూస్తాడు. ఇటువంటివి నాకు రోజూ అనుభవంలోనివే. అందుకని అట్టి చూపులు మాటలలోకి తర్జుమా చెయ్యడంలో నాకు కొంచెం పరిశ్రమ ఉంది.

అటిక్కట్లు అమ్మే ఆయన అటువంటి చూపులు చూచినప్పుడు, నాలో నేను ,,నీకు కూడా పుట్టింది, యీ వికారం. అని అనుకొని టిక్కటు యివ్వండి. చూస్తాశం'' అన్నాను.

,,ఈ బండిలో ఇంటరు మీడియట్ క్లాసు లేదని తెలియదా'' అని అంతటితో ఊరుకోక సెకండు క్లాసు యివ్వనా అని ఒక కన్నుమూసి ఒకకన్ను తెరచి వెకిలినవ్వు నవ్వాడు. కోపం వచ్చింది. కాని వాడితో వాదనలోకి దిగితే బండి అందదేమో అని భయపడి ,,వెధవ గుంటూరుబండిలో యింటరుక్లాసు ఉండదు'' అని విసుక్కొని థట్ క్లాసు యివ్వండి అన్నాను టిక్కెట్టు పుచ్చుకొని గేటులో వాడు ఎవ్వరితోనో మాట్లాడుతుంటె వాడిని పిలిచి బతిమిలాడి టిక్కట్టు కత్తిరించుకొని తరువాత ప్లాటుఫారం మీదికి వెళ్ళాను, వెంటనే బండిలో ఎక్కి కూర్చున్నాను.

అప్పటికే బండి కదలవలసినటైము అయిపోయి పావుగంట అయింది. ఇక ఒక నిమిషంలోనో అరనిమిషములోనో బండి కదులుతుందనుకొని పరుగెత్తుకుంటూ వెళ్ళి బండిలో కూర్చున్నాను. కాని ఎంతసేపటికి బండి కదలదు. ఏమిటి చెప్మా అని విచారించగా గార్డు భోజనం యింకా కాలేదని తెలిసింది, మరో పావుగంటలో ఆయన భోంచేసి బొర్ర కదుపుకుంటూ వచ్చాడు.

౨

ప్లాటుఫారం మధ్యగా నుంచుని అటూ యిటూ దేనికోసమో చూడడం మొదలుపెట్టాడు, గార్డు. గ్రీకు పురాణాలల్లో ,,జేసినను ప్రయాణాలు'' అని ఒక ఘట్టముంది. అతడు (బంగారు ఉన్నికై) ఒక వింతదేశానికి వెళుతున్నప్పుడు అతనితో అనేకమంది పండితులు గాయకులు శిల్పులు వెళ్ళారు. అందులో ఒకాయన ఎంతదూరపు వస్తువులైనా చూడగలడు, కాని తన కాళ్లక్రింద దగ్గరలో వున్న వస్తువును మాత్రము చూడలేడు, అని చదివినప్పుడు నాకు ఎంతదూరపు వస్తువులైనా ఎల్లా కనపడుతుందా అని సందేహము కలిగి మాపంతులుగారిని అడిగితే ఆయన అతడు బహుశః భూతద్దపు సహాయము వలన చూడగలిగియుండును, అని సమాధానం చెప్పినాడు. అయితే కాళ్లముందు వస్తువులను ఏల చూడలేడు అని అడిగితే మా మాస్టరుగారు జవాబు చెప్పలేక పోయినారు. ఇప్పుడు నాకు దానికి సమాధానం ఈ గార్డును చూచేసరికి స్ఫురించింది. ఈగార్డుకు అంతపెద్ద బొర్ర ఉండటంవల్ల దూరం కనిపించినా తనకాళ్ళముందు వస్తువ బొత్తిగా కనిపించదు. మధ్య్య బొర్రపర్వతం అడ్డం.

దేనికో యిల్లా చూస్తాడు అని అనుకొంటూ ఉండంగానే అతడు ,,దీని దుంపతెగ. ఈబండి దగ్గర ఒక పోర్టరు వెధవ అయినా కనిపించడు'' అని విసుక్కున్నాడు కాసేపు అక్కడే నిల్చుని ఒక పోర్టరు కనిపించటంతోనే వాడిని రమ్మని పిలిచినాడు. కాని వాడు ,,కొంచెం ఉండవయ్యా వస్తాను అ గార్డు పిలుస్తున్నాడు'' అని తెనాలిబండి వైపు పోయినాడు. చిన్నబండి గార్డు అంటే పోర్టర్లకు కూడా అలుసు కాములు అని నాలో నేను నవ్వుకొన్నాను. వాడు మళ్లీ పది నిమిషాలలో వచ్చాడు, గార్డు వాడిని పిలిచి ,,ఒరే నువ్వు ఈపచ్చజండా ఊపు, బండి కదిలేలోపల ఇంటికెళ్ళి కొంచెం తొందరపని చూచుకొని అటువచ్చి గేటుదగ్గర ఎక్కుతా'' నన్నాడు. ఆమాటలు విని నేను ఇది రైలుబండేగదా ఇంత అలస్యంగా కదులుతుందేమి అబ్బా అని అనుకొంటూ ఉండంగా పోర్టరు ,,మీరు ఊపినప్పుడే దిక్కులేదు. నేను జండా ఊపితే బండి కదులుతుందా'' అన్నాడు. గార్డు ,,ఊపవోయి'' అని వెళ్ళిపోయినాడు.

పోర్టరు మొఖం ముడుచుకొని పచ్చజండా ఊపటం మొదలుపెట్టాడు. డ్రైవరు ఏదోపనిమీద ఉన్నా

...కోలు యినా, చూడలేదు. పోర్టరు జండాను విసి ...ఊపాడు అప్పటికి లాభించనందున విసుకుపు ...జండాను గట్టిగా నాలుగుసార్లు నేలకేసి కొట్టుతూ ...క్కడి మేళం తెచ్చిపెట్టి పోయినాడు నాకు గా ...అని విసుక్కున్నాడు. ఆఖరుకు పెద్దగా డ్రైవరు ...పెట్టి పిలిచినాడు. నేను కిటికీలోనుంచి తొం ...ఏమిటోయి అన్నాను. ,,ఏమిటండీ చూస్తున్నా ...అంటూ వాడిని ఇటు పిలవండి బాబూ అ ...న్నాడు. మా ఉభయుల ప్రయత్నాలు ఫలించలేదు. చి ...పోర్టరు ఆజండా అక్కడ పారేసి చకాపికిని ...స్టేషను మాస్టరు దగ్గరకు వెళ్లి ,,ఎంతసేపు జండా ఊపి ...డ్రైవరు చూడడు. అజాగ్రత్తగా ఉన్నాడు'' అని ...చెప్పాడు. డ్రైవరుకు పోర్టరుకు అదివరకే విరోధం. ...దెబ్బతో డ్రైవరు ఉద్యోగం ఊడుతుంది అనుకొ ...న్నాడు. కాని స్టేషను మాస్టరు ,,ఏడ్చావులే పో, గుం ...టూరుబండికి తొందరేమిటి? అన్నాడు. నీవు చేసేది ఏ ...సరీగా ఇంజను దగ్గరకు వెళ్లి, శల ముఖ్యకొంటు ...డ్రైవరును జండాతో కొట్టి ఈసారి అయినా చూ ...పోయి'' అని చెప్పి ఇంజనుకు ఎదురుగా నుంచొ ...పచ్చజండా ఒకేమయిన ఊపాడు.

అప్పుడు డ్రైవరు లేచి బహుప్రయాసంమీద కూత ...యించాడు, అంతాబండిఎక్కారుగాని మా పెట్టెదగ్గ ...ర ఇద్దరు న్యూసు కుర్రాళ్లు కింద షికారు చేస్తున్నారు. ...ఒకడు ,,ఒరే బండి కూతేసిందిరా? అన్నాడు. ...ఈనాయనమ్మ బెదిరింపులకేమిలే'' అన్నాడు.

అక్కడ డ్రైవరు మరల తిప్పాడు. బండికేమాత్రం ...చలనం గలుగలేదు. న్యూసు కుర్రాడు ,,నేను చెప్పలే ...దా ఇది గర్భిణీ స్త్రీరా'' అని గట్టిగా నవ్వాడు. ఆవిరి ...చాలా ఎక్కుటంలేదనుకొని డ్రైవరు బలంకొద్దీ మరలు ...తిప్పాడు. బుస్సున ఆవిరి పోవటమే గాని బండి కదలదు. ...ఆఖరుకు ప్రబల ప్రయత్నంమీద మళ్లీ కూత కూ ...యించాడు. నా ప్రాణాలు కొంచెం కుదట పడ్డయి. ...బండి కదలుతుంది గదా, కదిలితే ఎంతలోకి పో ...అనుకొని న్యూసుపేపరు విప్పి చూస్తున్నాను. ...ఇంతలోనే మా ముందుపెట్టెలోని వాళ్లంతా గబగబ ...దిగుతున్నారు. ఏమిటి ఇంతలోనే ఏమి ఉపద్రవం వచ్చినద ...చూస్తుంటె డ్రైవరు పెట్టెపెట్టె దగ్గరకూవచ్చి ,,దిగం ...బండి కదిలిం తరువాత ఎక్కొచ్చుకాని దిగండి'' అని ...కొంటు పెట్టెల వెంట పరుగెత్తినాడు. ఇదెక్క ...గోలరా అని విసుక్కొని మేమంతా దిగి నుంచున్నా

ము. నేను ,,సామాను కూడా దింపాలా ఏమిటి'' అ న్నాను. డ్రైవరు ఏమి చెప్పకుండా వెళ్లి పోయినాడు. ఇంజను దగ్గర ఇదంతా చూస్తున్న ఒక కమ్మ పెద్దమని షి "మొన్న మావూరులో మోటారు ఇట్లానే కదలక డబడబ కొట్టుకొంటె మేమంతా కలిసి నెట్టితే చక్క గా పోయింది. చూస్తారేం? తలోచెయ్యి ఎయ్యండోయి'' అన్నాడు.

ఇట్లా అంటూ ఉండగానె బండి అమాంతంగా మహావేగంతో కదిలింది. మేమంతా చప్పున బండిలో ఎక్కి కూర్చున్నాము. నేను ఎంత చెడ్డదైన రైలు బండి కదా ఇహ పోతుంది ఘంటకు నలభై మైళ్ల వేగంతోటి అని అనుకొని సర్దుకు కూర్చుని పేపరులో మొదటి బంతి చదివేలోపల బండి టక్కున ఆగింది. మళ్లీ ఏమొచ్చిం దో, తిరిగి కదలే సరికి ఎంత ప్రయత్నం కావాలో అని గుండెలు తల్లడిల్లి పోయి నాయి. కొందరు ఎవరో తీగలాగారని ఎద్దు అడ్డం వచ్చినదని ముసలమ్మ బండి ఎక్కలేదని ఎవరికి తోచినట్లు వార న్నారు. ఇంకో ఆయన ముసలమ్మ కోసం బండి ఆగు తుందా అన్నాడు,

దాని ధర్మానబండి మళ్లీదానంతటదే కదలి రైలు గేటు దాకా, రైలుబండి లాగా నడిచింది. గేటుదగ్గరకు రాగనే వేగం అంతాపోయి మెల్లగా నడవటం మొదలు పెట్టింది. మళ్లీ ఆగుతుందేమోరా బాబూ అని అనుకొ న్నాను.

సరే దేవుడి మీద భారంవేసి గుండె రాయిచేసు కొని కూర్చున్నాను. దాని ధర్మాన అది ఆగక అల్లాగే ముసలి నడక నడిచింది. బ్రిడ్జి మరమ్మత్తులో ఉంటంవల్ల అల్లా నడిచింది గాని మరేమి ప్రమాదం లేదని చెప్పారు. నాకు కాస్త మనశ్శాంతి అయింది. అక్కడ నుండి దుర్గ గుడి కనిపిస్తున్నది. బండి సక్రమంగా గుంటూరు నడిపిం చు తల్లీ అని మొక్కుకొన్నాను. వంతెన దాటి ఒక అర ఫర్లాంగు దూరంవరకు బండి చురుకుగా నడిచింది. మళ్లీ న డక చప్పున మందగించింది.

అక్కడ కూలీలు రోడ్డు బాగుచేస్తున్నారు. వాళ్లు బండివస్తున్నదని తప్పు కోటానికి బదులు ఆండి బవమని బండివాని కేకేశారు. ఎందుకు అన్నాడు డ్రైవరు. వాళ్లు డ్రైవరును కేకేశారు. ఎందుకు అన్నాడు డ్రైవరు. వాళ్లు ,మేకులు బిగిస్తున్నాము, ఇదికాని తొలుకాని అన్నారు.

,,ఏమోయి రైలుబండి అనుకున్నావా మరేమను కొన్నావు''

,,ఏమీ నాకు తెలుసు లేవయ్యా గుంటూరు బండి''

,,ఆ! దార్లో, శేవంద్రా, బండి మీదుగా తోలే స్తాను సుమా!

ఓసి మాటచెప్పవచ్చావు. శేవయ్యా. మొన్న గేటు దగ్గర రైలుక్రింద కుక్కబడితే బండి ఆగిపోలేదా! మేము నలుగురము నాలుగుచేతులు వేస్తే బండి యాడికి కదులు తుంది అన్నారు. ఇక డ్రైవరు లాభములేదు అనుకొని అరే శేవంద్రా బండి ఆపటానికి వీలులేదు. ఆగిందా అం టే మళ్లీ కదలదు. మీకు మాకూ పనినష్టం. వచ్చేటప్పుడు దోసకాయలు యిస్తాలే అని బతిమిలాడుకొన్నాడు. వాళ్లు దయదల్చి తొలిగారు. మళ్లీ బండిసాగి కృష్ణ వంతెను సమీపించిది. మరో నిమిషంలో కృష్ణవంతెనలోకి ప్రవేసించింది.

3

కృష్ణానది నురుగులు కక్కుతూ కిందుగా ప్రవహిస్తున్నది. ఇంత ప్రవాహాన్ని సహితం లెక్కచేయను చూచారా అని విజయభేరీని మోగించినట్లు పెద్దగా రైలు కూత పెట్టింది. ఇంతలో తాడేపల్లి స్టేషనుకు సమీపంలోకి వచ్చాము. నడక మందగించింది. ప్రతిబండి వస్తున్నప్పుడు అది నిరభ్యంతరంగా రావచ్చునని తెలుపటానికి చక్కవంచే ఆచారం ఉన్నది. ఈబండి వస్తున్నదని తెలిసినా తాడేపల్లి స్టేషను మాస్టరు పనిలో ఉండటం చేత కాబోలు ఆచక్క వంచలేదు, పోర్టరు ,,అయ్యా చక్క వంచాలండి'' అన్నాడు. ,, సరేలే! ముందు యీపని చెయ్యి దానికేం అదే వస్తుంది. చక్కవంచక పోతే మట్టుకు రాకూడదా ఇక్కడ ఏమిఅడ్డం ఉన్నదని దాని కాట్టు''అని అతడు అన్నాడట. మాకీ విషయము తరువాత తెలిసింది.

ఇక్కడ మాబండి షడ్జమ స్వరములో అరిచి విసికి కేకేస్తే అందుకుంటేమో అని శక్తిఅంతా వినియోగించి కేక వేసినా లాభంలేక పోవటంవల్ల డ్రైవరు తనుస్వయంగావెళ్లి చక్కవంచుకో వలెనని తలంపుతో బయలు దేరాడు. ఒక కూరల కావడివాడు, ఆవైపు వెళ్లటం చూచి వాన్నిపిలిచి ,,నాయనా గుంటూరు బండివచ్చి కూచున్నది. చక్క వంచమని చెప్పుదూ'' అన్నాడు డ్రైవరు. వాడు అమాత్రానికే కోపం తెచ్చుకొని ,,ఏమిటయ్యా ఇదేపని అనుకొన్నావా నాకు. ప్రతిబండి వచ్చిందని మేము చెబుతుంటమా! మొన్న ఏదో పాపం అని చెప్పాను. ఎప్పుడు అదేపనా!'' అని గట్టిగా అనేసి కావడిబద్ద జాయ్ జాయ్ అని ఊపుకుంటూ వెళ్లిపోయినాడు. అక్కడికి స్టేషనుకు అరమైలు దూరములో ఉంది. డ్రైవరు పాపం విక్క మొఖం వేశాడు. ఏంచేస్తాడు పాపం ఏంచెయ్యను తోచనపుడు. అక్కడికి చక్కస్థంభం రెండువందల గజాల దూరంలో ఉంది. మళ్లీ ఆలోచించకుండా యకాయకి స్థంభం దగ్గరకువెళ్లి, ఎక్కి చక్కవంచి చేత్తోపట్టుకొని బండి తీసికొని రమ్మని ఇంజనులో వాళ్లను కేకేశాడు.

అక్కడ ఇంజనులో నిప్పు తోసేవాడు డ్రైవరు పీఠాధికారి అయినాడు. ఈనవీన పీఠాధిపతి తనఠీవి నంతా చూపిస్తూ ఆపీఠంమీద కూర్చుని ఛాతీవిరిచి మావంక చూశాడు. మేమూ ఆదర భావంతో చిరునవ్వు నవ్వాము, కాని అతని ఠీవికి భంగం గలిగే సమయం వచ్చింది ఆపీఠం మీద కూర్చోవచ్చునను కొన్నాడు కాని బండి నడపవలసి వస్తుందని అతడు కలలో నయినా అనుకోలేదు కాని ఇప్పుడు ఆపని చేయుక తప్పిందికాదు. సరే యీమాత్రం పనిచేయలేక పోతానా అని మరల దగ్గరకు వెళ్లి ఆలోచించగా ఏమర లిప్పితే బండి కదులుతుందో తోచలేదు సరిగదా పైగా ఏంముట్టుకుంటె ఏమిప్రాణంమీదికొస్తుందో అని అతనికి భయంవేసింది. అయినా చూద్దామని ఒకటి రెండు తిప్పాడు, కాని లాభం లేక పోయింది. అపుడు అతని బుద్ధిలో ఒక ఆలోచన మెఱుపులాగ మెరిసింది. చప్పున అతడు ఉన్న మరలన్ని వరసబెట్టి సాంతంగా తిప్పేశాడు.

అసలు రైలుబండికి ఓ అచారమున్నది. ఆచారబద్ధమయినా జీవితముగడిపే ప్రాణికోటిలో రైలు ఒకటి. అది దాని ఆచారాలలో ఒకదానికైన లోటు లేకుండ ఎండనక వానఅనక నిర్వర్తించు కొంటుంది, అటువంటి ఆచారాలా ఒకటి, బండిముందు మెల్లగా కదలి క్రమంగా వేగం వృద్ధిచేసుకోటం. ఇప్పుడు బండి కదిలే కదలటంతోనే ౫౦ మైళ్ల వేగంతో కదిలినందు వలన బండ్లలో వాళ్లంతా అకదులటకు మొగాళ్లమీద ఆడవాళ్లు ఆడవాళ్లమీద మొగాళ్లు పడ్డారు.

అక్కడ ఇంజనులో అన్ని మరలుతిప్పటంవల్ల వేడినీళ్లు చల్లనీళ్లు ఆవిరి వేటిదారిని అవిస్వేచ్ఛగా పోయినాయి. క్రొత్త డ్రైవరు మట్టుకు కోరమీసం తిప్పుకొంటూ కొరవి దయ్యంతో కూర్చొని ,,చూచుకోండి. నేనడిపితే బండి ఎల్లా పోతున్నదో'' అని అర్థంవచ్చే నవ్వునవ్వాడు.

ఇంతలో బండి చక్కస్థంభాన్ని సమీపించింది. అక్కడ ఉన్న డ్రైవరు ఎక్కటానికి వీలులేనంత వేగంతో బండి వెళ్లటంచూచి ఓరే ఏకేమి తెగులు వచ్చింది.

దీర్ఘా ఎక్కటం అని అరచినాడు. „అపటానికి నాత రూ రైలుబండి మాటిమాటికి ఆగుతుందా” అని ఇతను హాసం మొదలెశాడు. పాపం డ్రైవరు విచారగ్రస్తుడైనాడు. ప్రతి శరీరుడైనా అప్పు డతనిని జూస్తే జాలిపడక మాన రు. అట్లు అతడు పదచ్యుతుడై పైపెచ్చు పరాభవింప బడునుగాని ఏమి కాలవై పరీత్యము? నాప్రక్కనున్న శా స్త్రిగారు అన్నాడు.

ఇక బండి సంగతి చూద్దాం. బండి భయంకర రూపము ధరించి రయ్యిన పోతున్నది. స్టేషనునూ ఎఱ్ఱజం డాను సహితం ధిక్కరించి అక్కడ ఆగేదేమిటి అను గాని వెళ్లిపోయింది. స్టేషను దాటి అర ఫర్లాంగు దూరం పోయిన తరువాత ఆవిరి అంతాపోవుటంచేత బండి దా నంతటదే అప్రయత్నంగా ఆగిపోయింది.

స్టేషను మాస్టరు బండి దగ్గరకు పరుగెత్తి ఈ పరీ త చర్యకు డ్రైవరు లేక పోవటానికి కారణం ఏమిటని అడిగాడు. చక్కవంగక పోవటం, డ్రైవరు స్వయంగా వెళ్లటం, బండి తను నడిపే సరికి అది తన స్వాధీనంలో నుంచి తప్పిపోవటంగల కథంతా సవిస్తరంగా విప్పి చెప్పారు. వాళ్లు కడుపులు పట్టుకొని నవ్వారు. వాళ్లకు గార్డు అయినా బ్రేకు వెయ్యక పోయినాడా అని సందే హం కలిగింది. ఆంత గార్డు పెట్టె దగ్గరకు వెళ్లేసరికి అతను గాఢనిద్రా పరవశుడై ఉన్నాడు. ఇంత ప్రమాదం జరు గుతూఉండే సమయంలో, ఈతడు నిద్రావస్థలో ఉండ టం మరీ విపరీతంగా ఉంది. వాళ్లంత అతనిని లేపినారు స్టేషను మాస్టరు ఏమయ్యా? ఇంతగోల జరుగుతుంటె నిద్ర పోతున్నావ్ అని కోపంతో అన్నాడు. అతడు శాంతం గా రాత్రి..........రామ విలాస సభవారు ప్రతాప రుద్రీయం వేశారు. మన రైలు వాళ్లకు టిక్కట్లు యి చ్చారు. అందుకని రాత్రి నిద్రలేదు అన్నాడు. స్టేషన్ మాస్టరు ఆశ్చర్యపడి మన గుంటూరు రైలు వాండ్లకు కూడా టిక్కట్లు ఊరకే యిచ్చారా? అన్నాడు.

„అంటె ఒక సందర్భం వచ్చింది. పెద్దబండి వాళ్లు కొంతమంది చాలాసార్లు చూడటంచేత రానందు వల్ల మనబండి వాళ్లకు యియ్యటానికి అవకాశం కలి గింది” అన్నాడు గార్డు „అల్లాచెప్పు, చెట్టులేనిచోట ఆముదపు మొక్క వృక్షమైంది అన్నమాట. లేకపోతే యిక్కడ వచ్చారు! సరే బాగానే ఉంది? కాని నీవు మే ల్కొని ఉండి బ్రేకు వేసినట్లయితే ఇంత అపాయం లే కపోయేది సుమా!” అన్నాడు మాస్టరు. ఆమాటవిని గార్డు ముఖం చిట్లించుకొని „ఏడ్చింది లెద్దూ నేను బ్రేకు వేసినప్పుడల్లా ఆగిందీ! ఏమిటో భ్రమ!” అని అన్నాడు. అక్కడవున్న వాళ్లందరమూ కాసేపు నవ్వుకున్నాము ఆమాటలువిని.

ఇంజనులో ఆవిరంతా పోవటంచేత అది నడవ నంటె నడవనన్నది. అప్పుడు ఏమిచె చెయ్యటం, ఎవరికి ఏమి తోచిందికాదు. ఒకడు డి.టి.యస్. కు వైరు యివ్వ మన్నాడు! వెంటనే తంతి పంపినారు. ఆయన మా తెలి వికి సంతోషించాడు! క్రొత్త ఇంజను బెట్టి బండి నడ పండి అని జబాబు పంపినాడు. అకట ఈ మాత్రం మనకు తోచక పోయెనే అని అక్కడున్న బుద్ధి మంతు లంతా నాలిక కొరుక్కున్నారు!

కొత్త ఇంజను వచ్చిన తరువాత బండి కదిలింది. నాకప్పటికి పూర్తిగా విసుకెత్తింది. క్రొత్త ఇంజనుతో సక్రమముగానే నడిచింది బండి చాలా సేపు. కాని మంగళగిరి సమీపంలో ఈ ధూమశకటం తన నిజస్వరూపం దాల్చి మందగమనము అవలంబించింది. మళ్లీ ఏంరోగం వచ్చిందా అని కిటికీ లోనుంచి తొంగి చూచాను. అప్పటికే గేటుకాడున్న మనిషితో తీవ్రమైన వాదంలోకి దిగాడు మా డ్రైవరు, గేటు వెయ్యలేదు. రెండెడ్లబండ్లు రైలు పట్టాలమీదగా నిర్భయంగా నడుస్తున్నవి. నాకు పెద్ద సంశయము వచ్చిం ది. రైలునుచూసి బండ్లు ఆగుతవా? కాక బండ్లకోసం రైలు ఆగుతుందా? అని. అయినా యీ బండి మామూలు ఏమిటిఅని కిటికీలోనుంచి బయటికి చూసి చాలా ఆశ్చ ర్యంవేసి ఏమిటయ్యా అన్నాను. „అవేళప గేటు వెయ్య డు చూడండి రైలు పోనిస్తే ఎడ్లుచస్తవి” అన్నాడు డ్రైవరు. గేటువాడు కోపంతో „ముష్టికొచ్చినా నీటు తె గ్గదు మాగుంటూరు డ్రైవర్లకు. ఎడ్లు చస్తయ్యట. బండి ఆగకపోతే అదే పదివేలు. కాసేపు ఉండు. నీకు నాకు తొందరఏమిటి. ఈపట్టి బండ్లు పోనీ. చెరొక సవారీరు గిట్టుతుంది” అన్నాడు. డ్రైవరు బండిని అటు పోనియటా నికి ఇష్టంలేక ఇటు పౌరుషహీనంగా అపటానికి ఇష్టంలేక ఏదో ఒక మాస్తరు సంసారపక్షంగా బండిని నడిపించాడు. కాని ఎంతసేపటికి ఆ బండ్లు పోవటం కాలేదు. అవీ తాపీగా నడుస్తున్నవి. అందుచేత తప్పని సరిగా రైలు బండిని ఆపి ఆఎద్దు బండ్లు అన్ని పోయేంత వరకు దిగాల పడిచూస్తూ నిల్చున్నాడు. మరికొంత సేప టికి బోగ తెరిపి అయింది. కాని రైలును కదపటం వీడి తరమా! భగీరథ ప్రయత్నాలు చేశాడు కాని కదిలింది కాదు. మన ప్రయత్నాలు ఫలిస్తయా. మనవాళ్లు చెప్పి

నట్లు దేనికైన దాని ఘడియ రావాలే. కొంతమంది పిల్లలు ఎన్ని సంవత్సరాలయినా ఒకటే క్లాసులో ఉంటారు. మాస్టర్లు వాళ్లను పై క్లాసులోకి ఎల్లాగయినా నెడదామని ఎన్ని ప్రయత్నాలు చేసినా వాళ్లు కదలరు. ఏనాలుగేండ్లకో దాని ఘడియొస్తే సరి టప్పున పై క్లాసులోకి పోతారు. అల్లాగే డ్రైవరు చేసిన ప్రయత్నాలు లాభించలేదు. కూత కూసిన వెంటనే కదలటం ఇంజనులకు సాధారణమైన ఆచారం. కాబట్టి కూత వేయించిన తరువాత కదలకపోతే పదిమంది ఏమైనా అనుకొని పోతారని భయపడి అయినా కదులుతుందేమో అని భారంఅంతా ఇంజనుమీద పారేసి కూత కూయించాడు. అప్పటికి చలనం లేదు, డ్రైవరు మరమట్టుకు తిప్పేసి తన స్థానంలో తాను కూర్చున్నాడు. దానియిష్టం వచ్చినప్పుడు అది కదలనీయమని. రవంతసేపులో దాని ధర్మాన అది కదిలింది. ఆ డ్రైవరు బెజవాడదగ్గరే కొంచెం ఓపిక చేసుకొని ఏ బ్రాహ్మణిచేతనో కాస్త పంచాంగం చూపించుకొని వర్జంలేని ఘడియలలో బయలుదేరినట్లయితే వాడికి మాకు యింత శ్రమ లేకపోయేది. ౨౦ మైళ్ల ప్రయాణానికి ఇన్ని తిప్పలా?

కంపెనీవాళ్లు అక్కడక్కడ కాఫీ హోటళ్లు అయినా పెట్టిస్తే బాగుండేది. మధ్యమధ్య దిగి కాస్త కాఫీ అయినా తాగి కూర్చునేవాళ్లం మరి. కొంచెంసేపట్లో బండి మంగళగిరి చేరింది.

బెజవాడ అమ్మవారికి ఇదివరలో మొక్కుకొన్నాను. కాని ఏమి పని చేసినట్లు కనబడలేదు. అక్కడికి నరసింహస్వామి కోవెల గోపురము దానిపైనున్న బంగారపు శిఖరములు కనిపిస్తున్నవి. లేత ఎండలో అవి తళతళలాడుతున్నవి. నరసింహస్వామికి కొంతమంది దండాలు పెట్టారు. కొండపైనున్న పానకాలరాయుడు అంతకంటే సత్యంగలదేవుడని ఆయనకు కొందరు ముడుపులు గడుతున్నారు. నేనుగూడా కళ్లు మూసుకొన్నాను. ఏం మొక్కుకుందామా అనుకొని పానకాలరాయుడిని మనస్సులో తల్చుకొని స్వామీ! ఈతడవ జట్కా కట్టించుకవచ్చి అయినా నీ మొక్కు చెల్లించుకుంటాను. గుంటూరుకు చేర్చు నాయినా అని మాకు పైని కోటప్ప ఉండటంవల్ల ఆయనను తల్చుకొని మనసార నమస్కారంచేసి చేవతో కోటప్పా చేదుకో అని ప్రార్థించాను. ఇంతలో బండి మళ్లీ కదిలింది.

అప్పుడు ఎందుకో స్టేషను మాస్టరు ఎఱ్ఱజండా ఊపాడు. పానకాలరాయుడి ప్రభావంవల్ల కామోలు ఎఱ్ఱజండాను ఏమాత్రం లెక్కచేయక మాస్టరు జండా బలంకొద్దీ విసురుతూ ఆగమని కొట్టుకొంటున్నా వినక బండి నడవసాగించింది. రైలురోడ్డుకు రెండువైపుల మెట్టపైరు పండి బరువువల్ల నేలకు వంగి ఉంది. అపచ్చని పొలాలలో బంతిపూలు మధ్యమధ్య విరియపూచి మనోహరంగా ఉన్నవి. అక్కడక్కడ పచ్చిక బీళ్లలో మేస్తున్న పశువులు రైలును చూచి బెదిరి చెంగున గంతులేస్తున్నవి.

కాపు పడుచులు నేతి దుత్తలను ఒకదానిపైన మరొకటి పెట్టుకొని ఏలపాటలు పాడుతూ కొందరు, ఊరికే మాట్లాడుకొంటూ కొందరూ, నవ్వుకొంటూ కాలిదారిని నడుస్తున్నారు. ఆపొలాలలో ఉన్న ఒక కాపు ఒకకట్టకు చివర వంకాయలు గోంగూర మొక్కజొన్న కండెలు కట్టి డ్రైవరుకు అందించినాడు. అతను అవి పుచ్చుకొని రెండు నిప్పుకణికలు గిరాటు పెట్టాడు. ఈ ఇచ్చిపుచ్చు కోతలకు బండియొక్క వేగం ఏమి అడ్డం రాలేదు.

ఆటుతరువాత బండి మటుకు బాగానే నడిచింది పాపం! ఏమాట కామాటే చెప్పాలె. మాపెట్టెలో ఒక అతను రైలు బండిలాగ నడుస్తుందిరా? అన్నాడు. ఇంకొకడు రైలుబండేంటోయ్ పిట్టలాగెగిరిపోతుంటే అన్నాడు. పాపం ఆకాస్త నడి వీళ్ల ప్రాణానికి మహావేగంలా ఉందికాబోలు మంగళగిరిలో ఎక్కిన పెద్దమనిషి ఒకాయన నాముందు కూర్చున్నాడు. అతనికి మీసాలు ఉన్నవి. గడ్డం మాసింది. పట్టెవర్ధనాలు పదిలంగా దిద్ది గండభేరుండఅంచుకండువా పైన వేసుకొన్నాడు.

'అయ్యా మీదేవూరు!'

'మాది తిరువూరండి!'

'ఎక్కడండి ఆవూరు!'

'ఏటుపాలెం దగ్గిరండీ!'

'తిరువూరు గంపలగూడెమూ ఏమిటండీ!'

'అవును'

'మీరెవరి కుమార్లు!'

'నాగేశ్వరరావుగారి'

'మీఇంటిపేరు!'

'పుల్లంరాజువారు!'

'అయితే బాబు మీకునూ మాచిరాజు వారికిని సంబంధ బాంధవ్యాలు ఉన్నయ్యా అండీ!'

...న్ని ఈయన కొడుకో అనుకొని అయినా పెద్దవాడు ...దా అని „ఉన్నారండి' అన్నాను. అంతటితో పోనియ్య ...మళ్లీ ఆయన.

„అయితే మీకెంతమంది బిడ్డలు?'

„ముగ్గురము'

„ఆడపిల్ల లెంతమంది మొగపిల్లలెంతమంది?"

ఇక ఆడపిల్లల పెండ్లి అయినసంగతీ, వాళ్ళకు ఏ ...రు యిచ్చిందీ, వాళ్ళకు సంతానం ఎంతమంది అయిం...డీ, వాసంతానం ఎంతమందో, మొదటినుంచి చివర వ...రకు అడగక మానడని ఆవిషయం మార్చాలని „బా...బూ, ఈగుంటూరుబండి ఇంత మెల్లిగా నడుస్తుందేమం...డీ" అన్నాను.

ఆయన అసలు వసతాగినబిడ్డ. నోరు ఊరుకోదు. ...మాత్రం అవకాశం తీసుకొని ఆయన లెక్చరు ఆరం...భించాడు. నేను విస్తారము మాట్లాడక ఊ అన్నాను.

„ఈ గుంటూరు బండి అసలు పూర్వం బాగా ...పోయేది. ఈ మధ్య ఒక బ్రాహ్మణుడు శాపం యిచ్చి...నందు వల్ల దానికి గతిపట్టింది. ఒకమాటు ఒకకాపు పెద్ద...మనిషికి ఓ సందేహం కలిగింది. అంతా గుంటూరు బం...డి వేళాకోళం చేస్తారు. ఇది మటుకు రైలు కాదా? ...మన్న హోటల్లా తటాలున ఆగుతుందా అని వే...గంగా పోతున్న బండిని „బండి ఆపు బండి ఆపుమని" ...కేకాడు, డ్రైవరు తక్కున బండాపి ఏమకయ్యా అన్నా...డట. అతనికి ఏమి తోచింది కాదు, ఆగమంటె ఆగిన...దేంటా అని నవ్వటాలకు కేక వేస్తే నిజంగానే ఆగింది. ...ఏమి తోచక నిలుచున్న పాటున నిలువబడి పోయి ఆలో...చించాడట. చిన్న తనంలో చదువుకొన్న కధ ఒకటి ...జ్ఞాపకం వచ్చింది:— ఒకడు కట్టెలు కొట్టుకొని అవి ...అమ్ముకొని జీవిస్తూ ఉండేవాడు. రోజూ కట్టెలు ...కొట్టుకోవటం అమ్ముకోవటం అతనికి బహు ...కష్టముగా ఉండేది. ఒకరోజు అడవి అంతా ...తిరిగి బహు ప్రయాసపడి ఎండు కట్టెలు కొట్టి ...మోపు గట్టుకొని తన జీవితం తనకే భారం అనిపించి ...బహుకష్ట మూనికొని భగవంతుడికి నామీద కరుణ ...లేదా:— ఈ బ్రతుకు బ్రతికే కంటె చస్తే మేలు. ...చావు వస్తే బాగుండును. అనుకొన్నాడు. కళ్లు తెరి...చేసరికి వాని కట్టెమట మృత్యు దేవత నిలబడి „ఎందుకు ...పిలిచావు" అన్నది. వాడు నిర్ఘాంతపోయి ఎవరు నీవు ...నేనెవరిని ఇప్పుడు పిలవలేదే! అన్నాడు. ఎవ్వరిని పిలవ లేదా! ఇప్పుడేకదా చావు వస్తే బాగుండునను కొన్నావు. నేనే చావును! అన్నది. వీడిగుండెలు కొట్టుకోటం మానే సినవి. కాళ్లు చేతులు చల్లబడ్డవి. కాని తక్షణం తెప్పరిల్లి—ఓహో ఏమేనా అచల్లని తల్లివి. పిలవంగానే వచ్చావు. ఎంత మంచిదానవు! అన్నాడు. ఎందుకు పిల్చావు? అని చావు అడిగింది. ఎబ్బె, ఎందుకులేదు. ఈమోపు కాస్త ఎత్తిపో అని ఎత్తించుకొని తన దారిని పోయివాడట. అట్లాగే ఇతడు దప్పున తెప్పరిల్లి „ఎబ్బె ఏమిలేదు, కాస్త చుట్టనిప్పు ఇస్తారా? అన్నాడు" అని చెప్పేసరికి మేమంతా విరగబడి నవ్వినాము." ఇది విన్నారా అని మళ్లీ మొదలుపెట్టాడు. ఒకమాట బండి పోతుంది. డ్రైవరుకు దూరాన ఒక ముసలమ్మ కనిపించింది. ఆమె పాపం కడువృద్ధురాలు, దేహం అంతా పండిపోయి ముడుతలుపడ్డది వృద్ధాప్యంచేత వొంగిపోయి చేతికఱ్ఱ సహాయంచేత నడుస్తున్నది. ఎండ పైనమాడుస్తుంటేం ఈ మాడుకాళ్ల ముసలిది ఆ తాలాలలో పోతున్నది. క్రిందకాళ్లు పైన నెత్తి మాడుతున్నవి. ఆ ముసలిదాన్ని చూస్తే ఎవరికైన గుండె కరుగుతుంది. మన డ్రైవరు గుండె అసలే నిప్పునగ్గర ఉండటం వల్ల కరిగి నీరై పోయింది. ఆయన పాపం బండిని ఆపి ముసలమ్మను పిలిచి „ముసలమ్మా నీవు పాపం చాలా ముసలి దానవు, నువ్వు నడవలేవు, పానీ ఈ బండెక్కు నిన్ను తీసుకెళ్లి గుంటూరులో వదిలేస్తాను, నాకేమి ఇవ్వ వద్దులే" అన్నాడు.

ముసలమ్మ చిరునవ్వు నవ్వి, "ఇంతమందిని చూచాను గాని నీఅంత మంచివాడిని నే జూడలేను! రైలు ఉద్యోగస్థులలో నీ అంత మంచివాడుండటం అరుదు. నీ హృదయం చాలా మంచిది; ఎక్కటానికి ఏమి అభ్యంతరం లేదు; కాని గుంటూరులో కొంచెం తొందర పని ఉండటం వల్ల ఎక్కటానికి వీలులేదు, మనస్సులో కోపం ఉంచుకోకు ఇంకోమాటు తప్పక ఎక్కుతాను. అని చెప్పింది" అన్నాడు మేమంతా చాలాసేపు నవ్వినాము.

మరోమాటు ఒక ముసలమ్మ తన మనమడ్ని వెంటబెట్టుకొని గుంటూరు వచ్చింది. గేటులో టిక్కట్టు తీసుకునే ఆయన ఈకుఱ్ఱవాడికి అరటికెట్టు తీసుకొన్నావేం? నిండు టిక్కట్టు కొనేటంత పెద్దవాడేనే అన్నాడు. ఆమె ఏమి మాట్లాడలేదు. అక్కడ ఉన్నవాళ్ళంతా పోనీలే పెద్దది ఏదో తెలియక చేసింది. అల్లా అన్నారు. వాడు పోనియ్యక పెద్దముండ్రాళ్లుకూడా అర టిక్కట్టు పుచ్చుకొంటె కంపెనీ ఏమి బాగుపడుతుంది,

సకెశె రంఢింతలు పైకం కట్టు అని నిలిపేశాడు. అప్పుడా ముసలమ్మ కర్రెళ్ళజేసి, ఏమయ్యా, ఏం జేస్తావో చెయ్యి. ఎక్కేటప్పుడు మావాడు చిన్నవాడే అన్నది.”

అని చెప్పేసరికి మాబండిలో వాళ్లంత విరగబడి నవ్వినారు. ముసలమ్మ చాలా తెలివిగలదని టికట్ కలెక్టరును బాగా మాడ్చిందని అన్నారు. పక్క బండిలో వాళ్లంతా మాబండిలో ఏదో హడావుడి జరుగుతున్నదని తొంగి చూశారు. ఇంతలోకే నంబూరు స్టేషను వచ్చింది. అక్కడ ఆయన దిగిపోయినాడు నంబూరులో ఎక్కేజనం ఎక్కుతుండంగానే ఒకాయన తనిఖీకి వచ్చాడు. ప్రక్క బండిలోనుండి మాబండిలో ప్రవేశించి టికెట్టుఅని తనచేత్తోఉన్న కత్తెర టక్ టక్ మని కొట్టాడు. నేను మొగదల కూర్చున్నాను. కాబట్టి చప్పున జేబులోనుంచి టిక్కట్టుతీసి చూపాను. తరువాత నాప్రక్కనున్న పల్నాడు పెద్ద మనిషి ముందు బొడ్డులో వెతికి కనిపించకపోతె తలగుడ్డ మడతలోనుంచి తీసి యిచ్చాడు. తరువాత ఒక్కొక్కడిని టిక్కట్టు అడిగాడు. అందరూ చూపించారు.

మాపెట్టెలో చెక్కమీద ఒకమ్మాలు కుర్రాడు పడుకొన్నాడు. అంతకుముందు మాతో ఏమేమిటో కబుర్లు చెబుతున్న కుర్రవాడు టికెట్టు కలెక్టరును చూచే చూడటంతోనే అమాంతం నిద్రపోయినాడు. టికట్ కలెక్టరు కత్తెరతో ఠాక్ ఠాక్ న కొట్టినా అతని గాఢ నిద్రకు ఏమి భంగం కలుగలేదు. పై పెచ్చు అతడు గుఱక పెట్టడం ఆరంభించాడు, పగలు పది గంటలకు అనిద్ర! టిక్కట్ కలెక్టరు అతని దగ్గరకు వెళ్లి ఏమండోయి టిక్కట్టు అని అస్తు తన దగ్గరఉన్న కత్తెరతో అతలుపు చెక్కలమీద ఠకఠక కొట్టినా మనవిద్యార్థికి ఏ మాత్రం మెళకువ రాలేదు సరిగ వా. పైగా ముసుకుబిగించాడు. టిక్కట్టు కలెక్టరు ముఖంమీద గుడ్డ తొలగించటానికి కొంచెం ప్రయత్నం చేయగా నిద్రా భంగం అయిన వాడివలె అతడు అబ్బ అని చెయ్యి యాడించాడు. ఆచెయ్యి ఆ అరవ టికెట్టు కలెక్టరు చెంపమీద తగిలింది.

తలదగ్గర ఉంటె చెయ్యి విసుర్లు తగలక మాననని అతడు కాళ్లకేసివచ్చి „ఏమయ్యా నీవులెయ్యి టికెట్టు చూపువయ్యా” అన్నాడు. నిద్రాభంగం కలగటం వల్ల కాబోలు ఆవిద్యార్థి కాళ్ళుసాచి విదిలించాడు.

ఈపెంకితనం జూచి వాడు ఈతనిని వదలక ఒకటేవిధంగా చెక్కమీద కొట్టడం ప్రారంభించాడు, విద్యార్థి కళ్ళు నలుపుకుంటూ లేచి ఏమిటీజాతర? నిద్రపోనివ్వవా? అన్నాడు.

„టిక్కెటు నూపు”

„అలో వచ్చావ్—అనుకుంటునే వున్నా అప్పుడే వచ్చావు జామడిలాగ ఇస్తానుండు” అని జేబులో చేతులుపెట్టి చప్పునతీసి ఒక పాతటిక్కట్టు అతని చేతిలో పెట్టాడు, వాడు అది తీసికొని „ఇదేమయ్యా ఎప్పటిది? ఇది పాతది అన్నాడు.

„పాతకొత్త లేటికి సువస్తువులకు”

“పుచ్చుకో అన్నాడు.”

“ఏమయ్యా”

“అదేమిరోగం సరిగా మాట్లాడలేవు. ఎవరనుకున్నావు. జాగ్రత్త. మర్యాదగా మాట్లాడు లేకపోతె ఊరుకో. అరవవాడివి, ఏమండీ అనలేవు. పో, పో. నిన్ను చూస్తెనే............”

„ఇది ఏమి కర్మమయ్యా! ఈటిక్కట్టు పాతది లేవయ్యా.”

„అదుగో మళ్ళి ఏమయ్యా అంటావు. యిసుగో యీ తడవ గనక అంటివా అంటే......పడతయి సుమా. అరవవాడివి అంటులో” అని తిట్టాలిసినవన్ని అనేసి, తనమనస్సు ఏదో పొరపాటున అది ఇచ్చినట్లూ అసలు టిక్కట్టు ఎక్కడో ఉన్నట్లు నటిస్తూ „ఆహా! పొరపాటు ఉండు అని ఇంకో జేబులో చెయిపెట్టి వెతికి ఏదో ఇత్యో బోయి అరరే ఎక్కడో వుండాల వెధవముండా టిక్కట్టు సమయానికి కనపించదు. అని మళ్లా వెతకడం ఆరంభించాడు.

అయ్యయ్యో—ఇదేమయ్యా నన్ను నిలిపేస్తావు, నాకేం పనిలేదా?

„మళ్లి ఏమయ్యా అంటావు సరేఉండు అరవవాడా నా పెట్టలో పెట్టానేమో చూడని”

అని పెట్టెతీసి ఒక్కొక్క వస్తువే బైటపెడుతున్నాడు.

„ఇదేమి ధర్మమయ్యా అదంతా అయినదాకా నేనుండనా?”

„నీవు కొంటెగదయ్యా ఉంటానికి”

„మరి ఏమయ్యా, అరవాయనా నీవు ఇలా మాట్లాడితే తగులుతవి తెలుసునాను.”



ఓరుగల్లు కోటగోడలలో పడియున్న నొక
కమలము యొక్క శకలము.



మహమ్మదీయ శిల్పముతో నక్కడక్కడ నంపగింపబడినదొక
కాకతీయ రాజ మందిరము

PHOTOS BY :—A. V. C.

# భావప్రకటనము



"ఎవరు? నేనెవరని? కమలాప్రేమను ప్రదర్శించు
భృంగమువలె మోహినీగుణసౌందర్యముల వర్ణించు
గాయకుడను కానా?"

బి. యె. బెంజమిన్ గుంజాళ్ పాత్రగా 'క్షమః కుంజము'

BY COURTESY :—ARYA SUBODH MANDALI.

„నిజంచెప్పితే నీకు కోపం. టికెట్ కొంటే కనపడ
...కుండేది"

„ఏమయ్యా అవసర పడతావు. ఇస్తానుదా" అని
...అరవ తెలుగులో వాడిని మాడ్చి. "ఆ జ్ఞాపకం
...వుంది. మా స్నేహితుడి దగ్గరనుండి ఇప్పిస్తానురా.
...మా పెట్టెలో నుంచి తీసికెళుతూ మా వంక జూచి
...నవ్వు నవ్వాడు. ఏదో తిప్పలు పెడటానికి తీసికెడు
...న్నాడని నేనూడ వాళ్లతో వెళ్లాను. రెండుమూడు
...పెట్టెలు వెతికి నల్లే వెతికి అతనిని పిలిచి „ఆ మరిచి
...పోయినా. ఈమధ్య బొత్తిగా నాకు జ్ఞాపకం శక్తి
...పోయింది, అసలు టిక్కెట్టే కొనడం మరచి పోయి
...నాను!!" అన్నాడు.

„ఆ సంగతి నేను మొదటే చెప్పా, మరి డబ్బు
...ట్టు."

‚ఎంత?'

'డబల్ చార్జ్' (Double charge)

"అట్టితే ఏమిలాభము. కంపెనీకి పోతుందా. అసలు
...డబ్బు చెరిసగం తీసుకుందాం."

„ అల్లా వీలుపడదు. పెనాల్టీతోగూడ కట్టవలి
...సిందే. స్టేషను మాస్టరు దగ్గరికి..................."

...ఆగుమరి. ఈ బెదిరింపులు అణగటానికి మందు నా
దగ్గరుందిలే. ఇదో అని అతని చేతిలో రూపాయి పె
ట్టాడు, వెండిబిళ్ల స్పర్శ తగిలేసరికి అతడికి ముఖం చే
టంత అయింది: పో. బ్రదర్ పో. గుంటూరులో నన్ను
...గేటులో వాడితో చెప్పి పంపిస్తా అన్నాడు.
...బండి ఇంకా స్టేషనులోనే ఉంది. ఇద్దరు పల్లెటూరి
వాళ్ళు వెళ్లి ఆడవాళ్ల పెట్టెలో కూర్చున్నారు. ఫో!
...చూచి దిగండయ్యా యిది ఆడవాళ్ల బండి.. అన్నా
డు. వీళ్ళకు తెలిసినానికి ఏమిలోటు లేక పోవటంచే
... "ఎందుకు దిగాల ఆడోళ్ళబండి అయితేమటుక్కు. మొగో
...ళ్లు ఎందుకు ఎక్కకూడదు? అయినా ఇవి మొగోళ్ల బం
డ్లు ఇవి ఆడాండ్ల బండ్లు అని వాటిమొగాన రాసి ఉన్న
యా" అని ఆరంభించాడు: అన్నిరకముల తెంకలనాల
...కు అనాయాసంగా పనిచేసే ఎట్టి తలగుడ్డను కనపర్చే సరికి
వాళ్లు దిగిపోయినారు.

అప్పుడే ఒక పెద్ద వక్కొగుంపు వచ్చింది. వాళ్ల
...బట్టలు మూటలు తాళ్ల గంపలు మొదలయిన సామాను
... తయారయ్యా, ఎక్కటానికి సరియయిన బండి
...కట. పట్టాయిస్తుండగా. అందులో ఒకతె

ఈటకు రండోవ్ దఫా ఖాళీగా ఉంది అని కేకేసింది.
వాళ్లంతా వెళ్లారు. అది వదువుదేసి ఉన్న బండి. ఎక్క-
టమా మానటమా అని ఆలోచిస్తూ ఉండంగానే గార్డు
పచ్చజెండా ఊపాడు. ఆచేత ఇక ఆలస్యం చేస్తే
లాభం లేదని సామానులు అందులోకి తోసి వాళ్లూ
ఎక్కి కూర్చుని బీడీలు చుట్టలు వెలిగించారు. వీళ్ల సం
గతి ఎవరూ చూడలేదు.

బండి కదిలింది. కాకాని చెరువు సమీపంలో
కొంచెం దాహం తీర్చుకొని మళ్లీ నడక సాగించింది.

అటుతరువాత మాకో గాలివాన తగిలింది. ఎ
దురు గాలిలో ఆరైలుబండి రొప్పుతూ క్షయరోగి లాగ
ఎల్లాగో అతి ప్రయాసంమీద నడిచింది. చెప్పడం మరచి
పోయినాను, నాగాను దారి బంగళాదగ్గర ఆగి అక్కడ
ఒకరిద్దరిని యెక్కించుకొంది. లాభ సాటి వేరం, ఆది డ్రై
వరుకు ఫైరుమ్యానుకు చేరో నాగాకుకట్ట గిట్టింది.

ఆబండిలోనే కొందరు న్యాయ్యూ లుకుర్రాళ్లు కనిపించి
గుంటూరు సంగతి యీమొస్తరుగా చెప్పారు. „గుం
టూరు భావుల్లలో నీళ్లులేవు, అంటే కొన్ని భావులలో
అసలే లేవు. మరి కొన్ని భావులలో నీరు ఉంది లేంది
భూత అద్దాలతో పరీక్షించి తెలియ జేయమని ఇంజను
ర్లకు అర్జీలు వెళ్లినాయి. వాళ్లువచ్చిచూచి సాధారణ
భూత అద్దాలు పనిచేయటం లేదని ఇందుకోసం
ఎక్కువ లీవరుగల అద్దాలు సీమనుంచి తెప్పిస్తున్నామని
జవాబు ఇచ్చారట. ఒకరోజున మాలిలో ఒకాయనచే
త వేశాడట. ఎంతసేపు చేదినా చేతపైకి తేలదు. అప్పుడు
ఏమిటి చెప్మా. అని నిల్చున్నపాటున నిలబడి ఆలో
చించగా నిజం నీటిబుడగలాగ మనస్సులో పొంగింది.
ఆసమయంలోనే అమెరికావాడు కూడా చేద వేసి ఉం
టాడు. ఈరెండు బొక్కెనలు అంకవేసుకోవటం వల్ల
కదలటంలేదని గ్రహించి, ఇంకా గట్టిగా లాగితే ఆ
బొక్కెన తనతోపాటు అమెరికావాడ్ని కూడా లా
క్కొస్తుంది; అప్పుడు వాళ్లంతా ఇండియాను కొత్త
మార్గం కనిపెట్టాం అని డాబులు కొట్టుకొని వచ్చి పడ
తారని యోచించి ఆచేత అపళంగా వదిలేశాడు.

బంధువులు గుంటూరు వెడితే పళ్లెంలో నుంచోని
కాళ్లు కడుక్కొమంటున్నారు. గంగాళంలో కూర్చొ
బెట్టి స్నానాలు చేయిస్తున్నారు"!

అతను చాలా కులాసా కుర్రవాడు. మా ప్రక్కనే
ఒక పెద్దమనిషి కూర్చున్నారు. ఆయనకు పైన ఉత్త

కీయం లేదు. తలకుమట్టుకు పెద్దతలగుడ్డఉంది, మరీ విపరీత విషయం ఏమిటంటే ఆయనకు స్తనములు లావై కొంచెము బరువై జారినవి. కొంతమందికి లావుగా ఉండే మనుష్యులకు అలా ఉంటవి. నూక్కాలు కుర్రాడు అవిచూచి తనలో తాను నవ్వు కొన్నాడు. ఇంతలో మందులు అమ్మేవాడు వచ్చి ౧౭౨ రోగాలకు ఒకటే మందు, అనుపాన భేదంతో సేవిస్తే అన్ని రోగాలు కుదురుతాయి నిన్న కావలంటె ఇప్పుడే రుజాఇస్తానని ఏకద మ్మున లెక్చరు ఆరంభించాడు. మన కుర్రవాడు అయ్యా మీవద్ద అమ్మంటెనా ఇంకేమైనా మందు లున్నయ్యా అండి అన్నాడు. ఇంకేమి మందులు కావాలో చెప్పండి యిస్తాను అన్నాడు. అతడు ఎచ్చే అట్టే పెద్దమందులు అక్కరలేదండి క్షీరవర్ధని రెండు సీసాలు కావలె అది బాగా పనిచేస్తున్నట్టు కనిపిస్తుంది. అని ఆపెద్ద మనిషి వక్షస్థలమును చూశాడు. అటు దృష్టినిలిపి. బాగా పనిచేస్తుందండీ, క్షీరవర్ధని అని మళ్లీ అన్నాడు. బండిలో ఉన్నవాళ్లంతా దిగబడి నవ్వారు.

మన విద్యార్థి అంతటితో ఊరుకోక పోలేదండి. ఆ మందు దొరక్క పోతే పోనియండి. నాకూ చిన్న జబ్బు ఏర్పడ్డదండీ. మందు ఏమైనా మీదగ్గర దొరకొచ్చు ననుకొని చెబుతున్నాను.

„చెప్పండి బాబూ. కావాలంటే ప్రత్యేకంగా మాట్లాడుతాము. తరువాత" అన్నాడు డాక్టర్

„ఎచ్చే అవసరం లేదండీ. ఈమధ్య మూడు నెలలు నుంచీ నుమండీ నాకీ జబ్బు. కిందటి సంవత్సరం పరీక్షల ముందే కనబడ్డది.

„అయ్యో పాపం...... అన్న ఇష్టం"

„అన్న ఇష్టం ఎక్కువయింది. అన్నం. అన్న కంటె ముందు పుట్టిన కాఫీ లోపలికి సక్రమంగా నే వెడతాయి"

„అహా! అయితే నిద్రపట్టదు కాబోలు"

„అటువంటిది కాదండీ. రాత్రి ఎనమిది గంటలకు పడుకుంటె ప్రొద్దున ఎనిమిది గంటల వరకు నిద్రే"

„దగ్గు అటువంటిది కాబోలు. దగ్గుకు మావద్ద ఉన్న మందు అమోఘంగా పని చేస్తుంది లేండి. క్షయ దగ్గు ఉబ్బసముదగ్గు పడిశెముదగ్గు మరేదగ్గు అయినా సరే అనుపాన భేదంతో పుచ్చుకొంటె ఖుషా బాగా పనిచేస్తుంది"

ఎందుకు చెబుతారు మీకు ప్రయాసం. అదికాదు కాదు"

„మరి ఏమిటో శెలవియ్యండీ"

„ఏముదండీ! పుస్తకం తెరిస్తే సరి"

ఓహో కళ్లవెంట నీరు కారుతాయా అండీ"

ఈమందు నే చన్ను పాలలో రంగరించి కరిగాక ఉపయోగిస్తే పనిచేస్తుంది. గుణం రెండుకోజాలలో కనిపించకపోతే కణిక పారెయ్యవచ్చును.

"అదికాదయ్యా పుస్తకం తెరిస్తే నిద్రవస్తుంది. చదువుకోవాలని ఏ మాత్రం బుద్ధి పుట్టదు. ఫుట్‌బాల్ అయినా టెన్నిస్ అయినా ఆడుకోవాలంటే ఓపిక ఉంటుంది కాని పుస్తకం తెరిస్తే సరి నిద్రాదేవత పూనుతుంది. సినిమాకు వెళ్లినా చీట్లాడుతున్నా నిద్ర అసలే రాదు."

„అబ్బా ఇది ఉపద్రవమైన జబ్బు"

„మరి సాంతం వినండీ. ఇప్పుడు మీరిచ్చిన నోటీసు కాయితం చూశానా అందులో ఒక్కొక్క రోగ లక్షణాలు చదువుతుంటే ఆ రోగాలన్నీ నాకున్నట్టు తోస్తుంది. నడుము నొప్పి అని చదవటంలోనే, నడుములో నొప్పి. క్షయ అని చదవటంలోనే గొంతులో దగ్గు. రక్తహీనం అని చదవగానె వెంట్లో బలహీనత నాకు ఉన్నట్లు తోస్తుంది. ఇహ అమృతాంజనము డబ్బామీది రోగాలు నొప్పులు చదువుతున్నప్పుడు అవన్నీ నాకున్నట్లు, నాకోసమే అమృతాంజనం కనిపెట్టినట్లు నాకు తోస్తుంది అటువంటి సమయాలలో నేనే ఆసుపత్రి నని వైద్య విద్యార్థులంతా ఇకనుంచీ నా దగ్గరకే వచ్చి Practice Study చేయాలని నాభ్రమ."

„ఇటువంటి రోగాలకండీ మంచిమందు ఒకచోట దొరుకుతుందండి"

„మీకు ఎట్లా తెలుసును"

„నేను చూచాను అండీ"

„అదెక్కడండీ,"

„విశాఖపట్నంలో పిచ్చి ఆసపత్రి"

„అవును చూచానన్నారు. తమరక్కడనుంచేనా రావటం"

అని అనేసరికి మాబండ్లో వాళ్లంతా విరగబడినవ్వారు.

పుస్తకాలమ్మే వాడొచ్చి మహాకవి కాళ్లకూరి వారి పుస్తకాలలోని పద్యాలుచదివి కొన్ని పుస్తకాలు అమ్మినాడు. అతడే జింతాన్ మాత్రలు రోమనాశనివంటి ధలయిన మందులు పుస్తకాలతో పాటు అమ్మేవాడు.

ఇంతలో మేమంతా వాడలిపోయేలాగున బండి కూత వేసింది. మరికొంచెం సేపట్లో బండి పూర్తిగా ఆగింది ఇదే సమయం అనుకొని గార్డు దిగి పరుగెత్తుకుంటూ పొలంలోకి పోయి నాలుగు పండుదోసకాయలు కోసికొని ఒకటి కొరుక్కుంటూ గబాగబా వచ్చి రైలు ఎక్కాడు, నేను రెండు తెచ్చుకొనే వాడినే ఆసంగతి తెలిస్తే అని మా విద్యార్థి విచారపడ్డాడు.

ఇంతలో గుంటూరు సమీపించింది. అవతారప్పుడు గొల్లవాళ్లు వస్తున్నారు. వాళ్ళనుజూచి కామాలు బండినడక మందగించింది. రైలుబండికి కూడా మన్మథ వికారం ఉంటుంది కాబోలు. ముందు డ్రైవరు తర్వాత గార్డు వాళ్లతో సరసా లాడారు. వాళ్లు చిరునవ్వులు వీళ్లపై విసిరారు.

ఇంతలో గుంటూరు మరీ సమీపంలోకి వచ్చింది. ముందు కాలేజీ గోపురము కనిపించింది. చెక్కస్తంభం పైన చెక్క సగంమాత్రం వంగింది. వంగటానికి ఇష్టం లేకపోయినా ఏదో బాగుండదని మోమాటముచేత వంగినట్లు వంగింది.

ఆటు తరువాత పల్లె పిల్లలు, కాపుపిల్లలు, రైలు వెంట పరుగెత్తారు. వాళ్లే ముందు వెడితారేమో అని మాకు భయంవేసింది. కాని డ్రైవరు పౌరుషానికి లోపం లేకుండా విసురుగా నడిపించి వాళ్లకంటె ముందు పోయినాడు. స్టేషను వచ్చింది. టికెట్టు కలెక్టరు మనదేశంవాడే. నల్లటివాడు. రెండు క్లాసులోకి ఎక్కాడు. అక్క ఈ ఉప్పరదొరలు కనిపించారు. వాడు నవ్వుతూ Black beggars అన్నాడు. వాడిరంగు ఏమిటో!

ఉప్పర్లు దిగారు. వాళ్లను కట్టింపు చార్జి యిమ్మండి అన్నాడు. వాళ్లు ,,మమ్ములను మోసపుచ్చి డబ్బు తీసుకోవాలని చూస్తున్నావా? ఏదో ఒక పెట్టెలో ఎక్కాం? మరి అడనే చెప్పక పోయినావా? ఎక్కినప్పుడు ఎందుకూరకున్నావు మరి యిప్పుడు డబ్బియాడది, యేం చేస్తావో చెయ్యి అన్నారు.

పిచ్చుకపై బ్రహ్మాస్త్రం అన్నట్లు వాళ్లమీద చర్చ నడపటం ఇష్టంలేక పొండిరా? అన్నాడు. వాళ్లకు జాతకఫలంరీత్యా గొప్ప వాహనయోగం ఉంది కాబోలు అనుకొన్నాం మేము. గుంటూరు వచ్చాము. వకమాట,

ఇది పూర్తిచేసిన తరువాత ఇది వ్రాసినసంగతి గుంటూరు బండిలో తిరిగేగార్డులకు ఎల్లాగో తెలిసి వాళ్లు ఎల్లాగయినా యీసారి బాపుకోవలెనని కాబోలు నేనున్న ఇంటి ముందుగా బండి (నేను కట్టపక్కనే బ్రాడీ పేటలో వున్నాలెండీ) వెళ్లేటప్పుడు పెద్దగావిజిలు వేయించటం చాలా విసురుగా నడిపించటం మొదలయిన పనులు చేస్తున్నారు. నేను అదిచూచి గుంటూరుబండి విషయములో నేను వ్రాసినదంతా అబద్ధమని నమ్మి ఆ వ్యాసమును ప్రచురించకుండా ఉంటానని వారు అభిప్రాయ పడ్డారని వినికడివలన తెలిసింది.

కాని అమాత్రానికి నేను లోబడను. ఇక్కడమా యింటి దగ్గర విసురుగానడిస్తే మట్టుకు దాని నిజస్వరూపం ఎవరికి తెలియదు. రెండోది వారు నామీద విరోధభావం నేనుకనిపిస్తే సరి, నన్ను ఝడిపించటానికో లేక పరిహాసానికో విజిలు వేయిస్తునారు. నా మీదికిబండి విసురుగా నడిపిస్తున్నారు. ఇదేగాక వీరంతా కంపెనీపై వాళ్లకు వ్రాసి నన్ను గుంటూరు బండిలో ఎక్కనీయకుండా ఆర్డర్లు ప్యాసు చేయిస్తారని కూడా వదంతి పుట్టింది

ఇటువంటి ఉపద్రవం నాకు రానున్నప్పటికిన్ని సత్యము దాచకూడదని లోకోపకార నిమిత్తం దీనిని నేను ప్రచురిస్తున్నాను. అటువంటి యిబ్బందులు వచ్చినట్లయితే, పాఠకులు ఇదివరలో పై చూపబడిన మ వాజీన యావమంది ఇదంతా నిజమని ఇందులో ఏమి అబద్ధము లేదని సాక్షం యివ్వటానికి సిద్ధంగా ఉండాలి.

# విజ్ఞప్తి

వఝ్ఝల కాళిదాసకవి

స్వామి! బహుఘోర సంసార సాగరమున
నేఁగుచుండఁగఁ గష్ట వీచీగణంబు
జీవయాత్రను సాగింపఁ బోవుచున్న
యస్మదీయ మానసనౌక కడ్డుఁ పవిలి
పుణ్యతర భవత్పదతటంబునకుఁ బోవు
చున్న నన్ను వేఁబుగఁ ద్రోయుచుచుండెగనుమ
స్వామిమధురమా ప్రణయపాశంబుతోడ
యుంచినాఁడ వందున ముద మొందుచుంటి
విడువఁబోకు, ప్రభూ! దాని విడువబోకు
నావయెంతయుఁ గూడ చంచలము సుమ్ము
ఎందునన్ దూలిపోవునో యేమియగునో
ఆర్ద్రమగునట్టి నామధురాత్మదేవ
ప్రణయవారాశిఁ గష్టవిభ్రమణవీచి
కాగ్రరంగంబునం దేలి యాడలేదు!

# భిక్షు

మంగిపూడ శ్రీరామ శాస్త్రి

ప్రకృతిగీతాలు హాయిగా బాడుకొనుచు
నంబర తలాన దిరుగు విహంగరాజ!
యెరువుగా నాకు నీ రెక్కలీగ దోయి!!
పోయి కను గొందు బ్రియురాలి ముద్దుమోము.
ఆ యమాయిక బాల పుణ్యాత్మురాలు
లోకపావన మధుర ప్రేమైక జీవ
అమితకోమల కరుణారసార్ద్ర హృదయ
ప్రణయ సామ్రాజ్య దేవతా భవ్యమూర్తి.
రెక్కలే నాకు గలిగిన నొక్క మొగిని
నీతి తరానంత ఘోరదైన్యంబు వీడి
వ్రాలకుందునె; ప్రణయినీ పాదపద్మ
యుగళమందున «రివ్వున» నెగిరిపోయి.

# వనౌషధుల ప్రభావము

హెచ్. సుబ్బరాయ శాస్త్రి

కవీశ్వరులు వసంతాగమము వర్ణించునపుడు తాపసులకుకూడ మదన వికారము కలుగక మానదు. ఇటుల నుటకు కవీశ్వరుల వర్ణనలే కాక, ఋతు సంబంధ ప్రకృతి సౌందర్య దర్శనోత్సుకము కూడ, కారణ మగునని తెలియ వచ్చుచున్నది. శ్రీ కాళిదాసాదిమహాకవులీ రహస్యమును గుర్తించి యుండుట యీక్రింది శ్లోకముచే తెలియగలరు.

తస్మిన్వనే సంయమినాం మునీనాం
తపః సమాధేః ప్రతికూలవర్తీ।
సంకల్పయోనే రభిమానభూత
మాత్మాన మాధాయ మధుర్జజృంభే॥

(కుమారసంభవము_స. 3)

వసంతఋతువు సురభి అనగా సమస్త జీవరాసుల కోర్కెలీడేర్చును. కామధేనువుగా కూడ వర్ణించినారు. శ్లేషోక్తి ల్వమిందులో నారోపింప బడినది.

చ॥ చిగురుబికాళికి న్ఫలము
జిల్కల గుంపునకున్మధూళి దే
టిగమికి దావిగాలికి వి
టీవిటకోటికి బువ్వులుండలం
బుగ గృపనీ నియున్సురభి

(ఆముక్తమాల్యద. అ. 2)

ప్రకృతి శాస్త్ర వేత్త లనబడు ఆంగ్లేయులు చెట్ల ఆకులన్నియు వాటి శ్వాసకోశములుగా నిరూపించినారు. గాని, వసంతాగమమునకు ముందు కొన్ని పెద్దపెద్ద వృక్షములపై ఒక్క ఆకుకూడ ఉండదు అట్టివో, వాటి ఉచ్ఛ్వాసనిశ్వాసము లెట్లు జరుపుకొనునో కదా? ఎవరును తెలుపజాలరు.

శ్రీ కాళిదాసు ఊరహస్యమునువిశదీకరించుటకే,

అయాచితోప స్థితమంబు కేవలం
రసాత్మకస్యో దుప తేశ్చరశ్మయః
బభూవతస్యాః కిలపారణావిధి
ర్న వృక్షవృత్తి వ్యతిరిక్త సాధనః॥

(కుమారసం. 2)

వృక్షములు అయాచితముగ పడిన వర్షబిందువుల వలనను, చంద్ర రశ్మివలనను, జీవించుచుండునని దీనిచే తెలియుచున్నది. మరియు వీటిని గిరికాదేవి తీవ్రతపోనిష్ఠకు పోల్చుటచే, అవి కుసుమాగమఫలపుత్ర ఫలావాప్తికిగాను ఆచరింపబడు అనుష్ఠానము సూచించుచున్నది.

మాఘశుద్ధపంచమి వసంతపంచమి అనబడును. ఇది మొదలు కామదహన (హోళి) పండుగ వరకు ఆబాలగోపాలము వినోదోత్సుక క్రీడా విలాసములచే నవవనోద్యానసరోవరసీమల విహరించుచుందురు. శ్రీ జయదేవకవి, వసంతోత్సవ క్రీడలలో పాడినపాటలు పాఠకులెందరో నేటికిని పాడుచున్నారు,

వసంతేవాసంతీ కుసుమ సుకుమారై రవయవై।
ర్భ్రమంతీకాంతారే బహువిహితకృష్ణాను సరణామ్।
అమందంకందర్పజ్వర జనితచింతాకులతయా
బలద్బాధాం రాధాం సరసమిదమూచే సహచరీ॥

ఇచట వసంతమనగా మాధవీలతా (Hiptage Madhablota.) దీని వ్యాఖ్యానము:—కాచిత్సహచరీ సఖీవసంతే సరసంయథాస్యాదేవం రాధామిదం వక్ష్యమాణమూచే ఉవాచ। వసంతీకుసుమసుకుమారైః మాధవలతాపుష్పతోల్యమృదుభిరై:

శ్లో॥ మృగమదసౌరభ రభసవశంవద
నవదలమాల తమాలే।
యువజనహృదయ విదారణ మనసిజ
నఖరుచి కింశుక జాలే।
మదనమహీపతి కనకదండరుచి
కేసర కుసుమవికాసే
మిలతశిలీముఖ పాటలపటల
కృతస్మరతూణవిలాసే॥

*  *  *  *

మాధవికాపరిమల లలితే
నవమాలతిజాతి సుగంధౌ।
మునిమనసామపి మోహనకారిణి
తరుణాకారణ బంధౌ।
స్ఫురదతిముక్త లతా పరిరంభణ
ముకులిత పులకితచూతే।
బృందావనవిపినే పరిసర
పరిగత యమునాజలపూతే॥

ఇందులో తమాల (చీకటి చెట్టు Pithacalobeum Saman,) పర్ణ సౌభాగ్యముచే వసంతము నకు మాలయొసగెను. కింశుక (మోదుగ Butea Frondesa) పూ గుత్తులు, కోరకములు, మన్మధుని నఖరాయుధముగా కన్పట్టెను. కేసర (పొగడ—వకుళ—Mimusops Elengi (Saporatta) వృక్షము యొక్క పూలు మన్మధుని కనకధ్వజము కట్టైన ఛత్రమువలె నుండెను. పాటల (కలిగొట్టుచెట్టు—Stercespermem Sanveolensy) పుష్పములు మన్మధుని తుమ్మెద బాణమువలె యుండెను. ఇంకను ఏమి కన్పడెను? విలాసయువజనుల స్వాభావిక మిత్రులైన మంచి పరిమళములు గల మాధవీ పుష్పము, విరజాజులు మొదలగు జాతిసుగంధ పుష్పములుండెను. వసంతాగమములో అతిముక్త (మాధవీ) లతలయొక్క మంజరులు పులకాంకితమైన వనితవలె యుండెను.

బృందావన విపినముల, యమునాజల పూతమైన ప్రదేశములలో నీదృశ్యములన్నియు కడు రమ్యముగా వర్ణించుటలో శ్రీ జయదేవకవి, అచేతనములైన వృక్షాదులకు మదనవికారచేష్టలన్నియు కల్పించి సాత్వికభావము ప్రదర్శించి చెప్పెను.

శ్రీ హర్షదేవుడు రత్నావళిలో మధుమాసములో చెట్లు మద్యపాయులై యుండునని యీరీతిగ వర్ణించెను

ఉద్యద్విద్రుమకాన్తిభిః కిసలయైః
స్తామ్రాంత్విషం బిభ్రతో।
భృంగాలీ విరుతైః కలైర విశద।
వ్యాహార లీలాభృతః।
ఘూర్ణంతో మలయానిలాహతి చలైః।
శాఖాసమూహైర్ముహు
ర్భ్రాంతింప్రాప్య మధుప్రసంగ జనితాం।
మత్తాఇవా మీద్రుమాః।

చిగుళ్ల ఎరుపువర్ణము, భ్రమరముల కలరవములు, గాలిచే వీచుచున్న శాఖలు యీ దృశ్యము మద్యముచే కలుగు రక్తిమకు, మత్తుచే కలుగు మాటలకు, ఊగుటను పోల్చి ఉత్ప్రేక్షగా వర్ణించినాడు.

ఈ యర్థమే శ్రీ కాళిదాసుని విక్రమోర్వశీయములో

ముగ్ధత్వస్యచ యౌవ్వనస్యచ సఖే। మధ్యేమధు శ్రీస్థితా।

అను కడపటి పాదమందు కన్పడుచున్నది.

వసంతోత్సవ క్రీడలు స్వభావసిద్ధముగ, వర్ణించుటలో అసమానపాండిత్యము చూపిన కవులలో శ్రీహర్షదేవు డొక్కడని యీ క్రింది వర్ణనచే తెలియుచున్నది

„విదూషకుడు—ప్రేక్షస్వ, తావదస్య మదమత్తకామినీ స్వయంగ్రాహా గృహీత నృత్యస్నాగరజనజనిత కౌతూహలస్య సమంతతః శబాయమాన మర్దలోద్దామ చర్చరీశబ్దముఖరరథ్యాముఖశోభినః రజప్రకీర్ణపటవాస పుంజపింజరీక్రియమాణ దశదిశః సశ్రీకత్వంమదన మహోత్సవస్య॥

రాజు—కీర్ణైః పిష్టాతకౌఘైః కృత దివసముఖైః
కుంకుమ క్షోదగౌరైః।
హేమాలంకార భాభిర్భరన మితశిరః
శేఖరైః కైంకిరాతైః।
ఏషా వేషాభిలక్ష్యస్వ విభవ
విజితాశేషవిత్తే శకోశా
కౌశామ్బీశాతకుంభ ద్రవఖచితజనే!
వైకపీతా విభాతి॥"

పై వచనములో మదన మహోత్సవ మప్పుడు నాయకులు నాయికలను స్వీకరించుటయు, మద్దెల శబ్దములు ప్రాగ పుష్పాదులు ఒండరులపై చల్లుటచే కలిగిన చీకటులను వివరించుచున్నది, శ్లోక తాత్పర్యము—స్వర్ణమయ వస్త్రులను ధరించిన కౌశాంబి నగరవాసులు వసంతము చల్లుకొనుటచే సూర్యోదయమునుసూచించినవారైరి అని భావము. వసంతోత్సవ సందర్శన విలాసము వర్ణించుటలో ఆంధ్ర కవులు సంస్కృత కవుల కేమాత్రము తీసిపోలేదనియే నమ్మకము. వసు చరిత్రములో రామరాజభూషణుడు ప్రకృతిస్వభావచిత్రపు వర్ణన చూడుడు.

తే॥ నాథ చివురులురంజిల్లె ననలు మొలిచె
నలరె విరులెల్ల పూపలు దరలుసూపె।
బసిమినిరవొన్దె బిందియల్బలసెనవళ
లాటువులు సాంద్రరుచుల ఫలంబులెగసె॥

మరియు,

సీ॥ ఏపారుపాదరిండ్ల నాపాటలాశోక
దీపార్చి గనక కలాపమరసె।
సాలావలులుదాటి యేలాలతావార
బాలావితి పరాగ పటములూడ్చె।
నానామధువ నవ్యగానామృతముమెచ్చి
సూనాసవములెల్ల జూరలిచ్చె।
ఝంకారరహిత ధీర హుంకార శుకభటా
హంకారముల ఫలాహతియొనర్చె।
నంచు నాగంధవహుని ధౌర్త్యముదెలుపు
లీలవిరసిన విగులురాలిన రజంబు
లొలికినరసంబులు రాలినఫలములదిపు
ప్రోల నిడిపల్కిరుద్యాన పాలురవుడు

ఇంతకన్నను రసాధిక్యత యీ క్రింది పద్యములో కురిపించినాడు.

సీ॥ చిగురుకెంగేలసాచె రసాలవల్లరి
తేటచూపుల చూచె తిలకలతిక
పికగీతిబాడిచూపె ప్రియాళు లతపల్కె
గిరభాషలగర్ణికార శాఖ
ముఖరక్తినింపె నింపుగల సంపగి కొమ్మ
వన్నెగానగియె లేబొన్నతీగ
సురభిశశ్వసనంబు నెరపెసింధుకవల్లి
గ్రుచ్చెదావులుసోక గ్రోవిరెమ్మ

తే॥ యాత్మరుచిరోప చారంబు లధిపకల్ప
కంబునకు దత్తదామోదగరిమ బెనుప
నంగనానిత్యకలిత దోహదవిశేష
సన్నుతాచారముల నడిసన్నకతన॥

ఈ పద్యములో (1) మామిడి (2) బొట్టుగుచెట్టు (తిలక) (3) ప్రేంకణ ప్రతీగ (ప్రియాళు) (4) కొండగోగుచెట్టు (కర్ణికార), (5) సాంపంగి (చంపక) (6) పొన్న (పమేరు) (7) వావిలి (సింధువార) (8) గోవిరెమ్మ (కురవక), యీ ఎనిమిదిచెట్లు వసురాజుకు హస్తస్పర్శన (Thanks giving) వీక్షణ (Kindly sight) గాన (Singing) సల్లాప (Gossipping) ముఖరూప (Cozy appearance), హసిత (Smiling) ముఖ వాయురూప (Emitting sweet odours from the mouth), ఆలింగన (Embracing) అను యీ ఎనిమిది విధములైన మంగళకరఅహ్వానములచే వరుసగా తమ ప్రేమ ప్రకటించెనటలో ఆయా స్త్రీలము ల కాయావిధమైన చర్యలచే ఋతుమతులగునని సూచింపబడినది.

కావ్యాదులలో ఏ మహాకవి వర్ణించినను, ఈపై ఎనిమిది చెట్లయొక్క దోహదక్రియా లక్షణములు, అత్యద్భుత శైలిని వ్రాసి యుండుట చూడ, కావ్యనిబంధనలో నీవర్ణన ప్రాధాన్యము పొంది యున్నటుల తెలియుచున్నది. కాని, ఆయాచెట్లకు చెప్పిన దోహదక్రియవలన చెట్లు పుష్పించునది చూచి వర్ణించిన మహాకవులు ఒక రిద్దరైన ఉందురో లేదో చెప్ప వీలుకాదు.

వైద్యశాస్త్రములో దోహదకాలమనగా స్త్రీ యొక్క గర్భధారణ కాలమందు కలుగు కోరికల కాలము. ఇది గర్భస్థ శిశువు ప్రారబ్ధ కర్మానుసారముగ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ స్వరూపమై యింద్రియార్థములను గోరుచుండును. ఇటులనే మామిడి—స్పర్శరూపమైన దోహదమును—ప్రేంకణ—శబ్దరూపమైన దోహదమును—సంపంగి—ముఖరూపమైన దోహదమును, వావిలి—గంధ రూపమైన దోహదమును—వకుళ—రసరూపమైన దోహదమును—వాంఛించు చుండునని పూర్వకవులు యేరీతిగ ఎట్టులో నిర్ణయించ గలిగిరి.

శ్లో॥ స్త్రీణాంస్పర్శాత్ ప్రియంగు
ర్వికసితవకులః సీధుగండూషసేకాత్,
పాదాఘాతాదశోకస్తిలకకురవకౌ
వీక్షణాలింగనాభ్యామ్।
మందారోనర్మవాక్యాత్పటు
మృదుహసనాచ్చంపకోవక్త్రవాతాత్।
చూతోగీతాన్నమేరు
ర్వికసితచపురో నర్తనాత్కర్ణికారః॥

ఇంకను దోహదశాస్త్రములో—

శ్లో॥ తరుగుల్మలతాదీనా
మకాలే కుశలైః కృతమ్।
పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం
దోహదంస్యాత్తు తత్క్రియా॥ శబ్దార్ణవః॥
ఆలింగనాత్కురవకస్తిలకోవీక్షణేనచ।
కరస్పర్శేనమాకందో ముఖరాగేణచంపకః
సల్లాపతఃకర్ణికారస్సింధువారోముఖానిలాత్
గీతాత్ప్రియాళుర్నృత్తరాం నమేరుర్హాసితేనచ.

1 ప్రియాళు (ప్రేంకణము.) హస్తస్పర్శముచే పుష్పించును.
Aglaia Roxburghiana.

2. వకుళ పొగడ] ఉమియుటచే ,,
Mimosops Elengi

3. అశోక [కంకేళి] పాదతాడన ,,
Saraca Indica

4. తిలక [బొట్టుగుచెట్టు] చూచుట ,,
Not identified. It is understood as Lodhra wrongly.

5; కురువక [గోరింట] ఆలింగనముచే పుష్పించును,
Lawsenia albe

6. మందార [కూమగ] మృదుభాషణ ,, ,,
Butia frondosa

7 చంపక [సంపంగి] నవ్వులు, హాస్యము ,,
Michili Champaka

8. చూత [మామిడి] నోటి సుగంధము ,,
Mangifera Indica

9. నమేరు [సురపొన్న]—గానముచే పుష్పించును
Calophyllum Inophyllum

10. కర్ణికార [కొండగోగు] నాట్యముచే;;
Piterosepermum acreipolium

ఈలాటి దోహదములచే పైజెప్పిన బడిన వృక్షాదులు పుష్పించునని యీ క్రింది కాళిదాసుని మేఘదూతము ఉత్తరార్థమ్—౧౫ శ్లోక వ్యాఖ్యలో కనబడుచున్నది.

రక్తాశోకశ్చలకిసలయః।
కేసరశ్చాత్రకాన్తః।
ప్రత్యాసన్నౌ కురువకవృతో।
ర్మాధవీ మండపస్య।
ఏకఃసఖ్యాస్తవసహమయా, వారు పాధాభిలాషీ
కాఙ్క్షత్యన్యో వదనమదిరాం
దోహదచ్ఛద్మనాస్యాః॥

దోహద శాస్త్రములో యీపై కాళిదాసాదులచే విశదీకరింపబడిన లక్షణములు మరొక్కతీరుగా కన్పడుచున్నవి.

1. కురువక (గోరింట) ఆలింగనముచే
Lawsonia alba (Henna shrub)

2, తిలక (బొట్టుగు) చూచుటచే

3. మాకంద (మామిడి) కరస్పర్శచే
(Mangifera Indica)

4. చంపక (సంపంగి) ముఖలావణ్యముచే
(Michelia Chempaka)

5. కర్ణికార (కొండగోగు)—సల్లాపముచే
Petroerspomum acerifolium

6. సిందువార(వావిలి) నోటిగాలిసుగంధముచే
Vitex Niguudo

7. ప్రియాళు(ప్రేంకణము)—గానముచే

8. నమేరు (సురపొన్న—నవ్వుటచే పుష్పించునని చెప్పబడినవి.

శ్రీ కాళిదాసు, రామరాజభూషణుడు, మల్లినాథుడు యీదోహదలక్షణములు వేర్వేరుగా వివరించియుండుట యీక్రింది విమర్శనలో చూడదగును.

| సంఖ్య | చెట్ల పేర్లు | కాళిదాసు | రామరాజ భూషణుడు | దోహదశాస్త్ర శబ్దార్ణవ |
|---|---|---|---|---|
| ౧ | ప్రియంగు | హస్తస్పర్శముచే పుష్పించును. | గానముచే పుష్పించును. | గానముచే పుష్పించును. |
| ౨ | వకుళ (పొగడ) | ఉమియుటచే ,, | చెప్పలేదు. | చెప్పలేదు. |
| ౩ | అశోక (కంకేళి) | పాదతాడనముచే ,, | చెప్పలేదు. | చెప్పలేదు. |
| ౪ | తిలక (బొట్టుగుచెట్టు) | చూచుటచే ,, | చూచుటచే ,, | చూచుటచే |
| ౫ | కురవక (గోరింట) | ఆలింగనముచే ,, | ఆలింగనముచే , | ఆలింగనముచే ,, |
| ౬ | మందార (మోదుగ లేక, పారిజాత) | మృదుభాషణచే ,, | చెప్పలేదు. | చెప్పలేదు. |
| ౭ | చంపక (సంపంగి) | నవ్వుట, హాస్యముచే,, | ముఖరూపముచే ,, | ముఖరూపముచే ,, |
| ౮ | చూత (మామిడి) | నోటి సుగంధముచే ,, | హస్తస్పర్శముచే ,, | హస్తస్పర్శముచే ,, |
| ౯ | నమేరు (సురపొన్న) | గానముచే ,, | నవ్వుటచే............ | నవ్వుటచే ,, |
| ౧౧ | కర్ణికార (కొండగోగు) | నాట్యముచే ,, | సల్లాపముచే ,, | సల్లాపముచే ,, |

ఈ వివరమును బట్టి, సంస్కృత కవులును, తెలుగు కవులును దోహదక్రియాలక్షణములు తెలుపుటలో ఒకే నియమము ననుసరించలేదని తెలియుచున్నది. మను ష్య స్త్రీ రత్నములవలెనే వృక్షాదులకు కూడ వేవిళ్ళు లేక దౌర్హృద కాలముండుననియు, వృక్షాదులలో ఆ వేవిళ్ళ (కోరికలు) పుష్పవతులగు కాలము సూచించుననియు మా త్రము తెలియవలెను. స్త్రీలకు దోహద కాలములో కలుగు కోరికలను సమకూర్పకున్న

> యేషుయేష్వి న్ద్రియార్థేషు
> దౌహృదే వై విమాననా
> ప్రజాయేత సుతస్యార్తి
> స్తస్మిం స్తస్మిం స్త థేన్ద్రియే॥

సుశ్రుతశారీరము అ. 3.

అటుల మనోరథములు పరిపూర్తి చెందక పోయిన బిడ్డలకు ఆయా విషయాదులకు సంబం ధించిన యింద్రియములు లోపించును లేక వాటి యందు బాధకలుగును. ఇటులనే వృక్షాదులలో కూడ, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు కోరునట్టి చెట్లను ఆయా అను రూపమైన, కరస్పర్శ, గాన ముఖరూప, గండూష, హాసిక, హాస్యాది దోహదములు కలుగక పో యిన పుష్పములలో ఉండవలసిన సౌరభ్యము గాని సుమనో హరముగాని, సౌందర్యముగాని ఉండదని అభిప్రాయము సూచించుటకే ఆదిమ కవీశ్వరులు స్థావరగుణధర్మములు కనిపెట్టి వివరింప కలిగిరి. ఇదియే వనౌషధులయందు గల మొదటి ప్రభావము.

దీనిచే సమస్త ప్రపంచములో గల వృక్షాదులన్ని యు దోహదము నపేక్షించునా? యనిన:—అన్నియు అపేక్షించునో లేదో చెప్పజాలము. కాని, సుగంధ జాతి వ్యక్తిత్వము పొందిన వనౌషధులన్నియు, అపేక్షించుచుం డుననియే భావించినాము. అయితే, ,,అశోక చెట్టును తనితన్ని తుదకు కాలంతయు రక్తగాయములతో నిండిపో యెను. వకుళ చెట్టుపై మద్యముగ్రాగి ఎంత ఉమ్మివేసి నను, ఒక్క పుష్పము కూడ యివ్వలేదు. సంపంగి చెట్టు ఎదుట ఎంత నవ్వినను, హాస్యసరసోక్తులాడినను పుష్పిం పదు కదా!,, యని యీ పై ఓషధులు తెలిసిన వారిలో కొందరడుగ వచ్చును ఇవియంతయు కవిసమయ ప్రసిద్ధ ములని నమ్మవలయునే కాని నిజ మేమాత్రము యీ వర్ణ నలలో లేదని దూరుచుండు వారనేకులుండుట కూడ మన మెరుగుదుము. అట్లనుటకు వీలుకాదు. ఏలనన్న ఆంధ్ర కవులేమి, సంస్కృత కవులేమి దోహదక్రియాలక్షణ ములు వర్ణించినప్పుడు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధా దులు కోరుచుండు వృక్షములు, ప్రత్యేక జాతి స్త్రీలు ఆయావిషయాదుల కనురూపమగు దోహదముచేసి యుం డినటుల చెప్పిరే కాని, ఎవ్వరు చేసినను పుష్పించునని ఎచ టనేని నుడివియున్నారా? ఇదుగో చూడుడు! యీ క్రిం

ది లక్షణములు గల స్త్రీలే దోహక్రియలు చేసినట్లు మహా కావ్యములలో నేమి, నాటకాదులలో నేమి, వివరింప బడినది.

శ్లో॥ కమలముకుళమృద్వీ ఫుల్లరాజీవగంధ
స్సురత పయసియస్యా స్సౌరభం దివ్యమంగే
చకితమృగదృగాభే ప్రాంతరక్తేచ నేత్రే
స్తనయుగళమనర్ఘ్యం శ్రీఫల శ్రీవిడంబి
తిలకుసుమసమానాం బిభ్రతీ నాసికాంచ
ద్విజగురు సురపూజా శ్రద్ధధానా సదైవ
కువలయదళకాంతిం కాపిచాపీయ గంధ్రీ
వికచకమలకోశా కారకామాతపత్రా
వ్రజతిమృదుసలీలం రాజహంసీవత్ర్యస్రి
వళివలితమధ్యా హంసవాణీ సువేషా
మృదు శుచి లఘుభుక్త్వా మానినీగాఢలజ్జా
ధవళకుసుమవాసా వల్లభా పద్మినీస్యాత్॥
రతిరహస్యే॥ కాకుంత ౪౪

ఈ లక్షణములుకలవారలే ఉత్తమజాతియగు పద్మిని స్త్రీలు. ఇట్టి సంపన్న గృహస్థులుగా నుండు వారు వారివారి భార్యలు పద్మినిజాతి స్త్రీలగుదురా? కారా? అని తెలిసికొనుటకై ఈ వృక్షములు పెంచ కూడదు. తెలిసికొనుటలో ప్రమాదము లేదుగాని, అట్లు దోహదముచేసియు పుష్పించకపోయినవారు పద్మిని స్త్రీలు కారని క్రోధించుకుందురని సవినయముగా ప్రార్థించుచున్నాను. ఈ భయముండుటచేత నేకాబోలు మన శ్రీకృష్ణ దేవరాయల రజతోత్సవ కార్యనిర్వాహకులు, దోహదక్రియాదులచే అశోక, వకుళ, ప్రేంకణ, బంధూక కర్ణికార, కదంబాదులు పుష్పించు మాహాత్మ్యము చూపనుద్యుక్తుడైయుండియు, విఫలమనోరథునిగ జేసిరి. అట్టితరి మాటలతో కాక, క్రియారూపమున ఓషధుల ప్రభావము వెల్లడిచేయ అవకాశమెక్కడిది. వేదములో

"త్రిస్సప్తైః యవైః పాఠాం పరికిరతి"

(ఆపస్తంబ సూత్రము)

21 యవలను పాఠఅను ఓషధిపై చల్లవలెను. దీనికి మంత్రము.

వారుణ్యసి వరుణాద్వా నిష్క్రమిణామి సౌమ్యసి
సోమాత్వా నిష్క్రమిణామి।

వరుణుడు, సోముడు, దీనికి అధిష్ఠాదేవతలు. వారి నుండి క్రయమును కొనుచున్నాను.

"సపత్నీ భాదనం స ఏ తేనైవ కామేన"

దీని తెచ్చి తలక్రింద పెట్టిన వశ్యుడగునని చెప్పబడినది.

ఓషధీ అను శబ్దమునకు వేదములో ఓష [దోష]—మలములు, ధీ—కడుగునది అని తెలుపబడినది.

సూక్తము:—వనస్పతిఃసహ దేవైర్న ఆగన్।
రక్షఃపిశాచనప బాధమానః॥

అథర్వ ౧—౧—౩—౧౫

దీని భావము—వనస్పతులన్నియు దివ్యగుణములు కలిగియుండును. అవి జంతువులను పిశాచములను నాశ మొందింతును.

ఇట్టి వనస్పతుల విషయమై వేదములో గల వాటిని కొన్నింటిని రాబోవు సంచికలో వివరించెదము.

# పృచ్ఛ

పా. వి. రాఘవరావు

(సారస్వత మిత్రమండలి)

కాకిమూక నడుమఁ • గష్టమొందు పికంబు
వగరు మావిచిగురు • వంకఁజనును
చంచరీకంబులఁ • జలితమౌ పుష్పంబు
వెఱకు కార్ముకమునఁ • జేరఁజనును
రత్నాకరములోన • రాట్పదు వజ్రంబు
ధరణీశు మకుటంబు • దరికిఁ జనును
దందశూకంబుల • బందినుండు వెదురు
కరిగొల్ల వేణువు • గాగఁజనును

కాని, కష్టసంద్రిపుటూర్మి • కలనఁగందు
నీ పతితుజీవ మయ్యయో • యెన్నడైన
పద్మసదృశమౌ భవదీయ • పాదములను
వేడి కన్నీటఁ దడుపు నా • వేదవేద్య!

* * * *

వేడి కన్నీరు నకు కాదు • వేమిలేదు
కాని దేవ! నీపాదముల్ • గానరావు.

* * * *

నాదు వేడినిట్టూర్పులు • నవయునంచు
బైటఁబడనీవు కాఁబోలు • పాదములను?

* * * *

నలువురునఁజూచి నవ్వేడు • నాదు బ్రదుకు
నీకుఁగూడను హేయమై • నెగడనేమొ?



# శ్రీ రాధా తత్త్వ విచారము

సముద్రాల రాఘవాచార్యులు

౧

ప్రస్తుతం భావకవుల కావ్యాలన్నీ రాధాకృష్ణుల ప్రణయంలో పరిణమిస్తూ వున్నయి. చిత్రకారుల లేఖనాలకు గూడ అదే పరమాదర్శమై కనపడు తోంది. వర్తమాన కాలంలో వైష్ణవులే కాక అన్ని మతాల వారు అన్ని జాతులవారు రాధా సమారాధనమంటే మురుస్తూ వున్నారు. ఈ ఆవేశంలో అనేక అనువాదాలు, నాటకాలు, విమర్శలు రాధా కృష్ణుల సంబంధాన్ని ప్రతిష్ఠాపిస్తూ బయలు దేరినయి. అందుచేత ఆ పాత్రల తత్వం యిదమిద్ధమని నిర్ణయం చేయడానికి సులభంగా కన్పించడం లేదు. ముఖ్యంగా రాధ చాలా గూఢంగా వుండి గ్రహణ యోగ్యంగాక పోవడం చేత యీ వ్యాసం బయలుదేరింది.

## రాధయొక్క ప్రాచీనత్వము

శ్రీకృష్ణునికి రాధకు గల సంబంధం ప్రాచీనమే గాక దృఢమైన దైనట్లైతే కృష్ణుని చరిత్ర గల ప్రధాన గ్రంథాలు అన్నిటిలోను కన్పించవలసి వుంది. కాని శ్రీమహాభాగవతంలోను, మహాభారత, హరివంశ, విష్ణు పురాణాలలోను రాధ కన్పించడం లేదు. రాసేశ్వరి అని వైష్ణవాచార్యులు, భావకవులు వర్ణిస్తూ వుండే రాధ శ్రీ మహాభాగవతములోని రాసపంచాధ్యాయంలో కన్పించక పోవడంచాత ఆ పాత్రయొక్క ప్రాచీనత్వాన్ని గురించి సందేహం దృఢంగా వుంది. అంతమాత్రంచేత రాధ ఐతిహాసిక పాత్ర కాదంటానికి వీలులేదు. నవీన వైష్ణవాచార్యుల గ్రంథాల్లో రాధ కనిపిస్తోంది. బ్రహ్మవైవర్త పురాణం, బ్రహ్మ సంహిత, గర్గసంహిత మొదలైన గ్రంథాల్లో రాధవుంది. జయదేవుని గీతగోవిందం రాధయొక్క చరిత్రాన్ని ఘంటా ఘోషంగా గానం చేస్తోంది. బంగాళీల సారస్వతమే కాకుండా హృదయాలు కూడా రాధా కృష్ణులతో నిండి వున్నాయంటే అతిశయోక్తి లేదు. శ్రీ కృష్ణచైతన్యదేవుని కాంతారసాత్మకమైన భక్తివాదమంతా రాధా కృష్ణుల మీదనే ఆధారపడివుంది, ఇంత ప్రబలంగా వుత్తరహిందూస్థానాన్ని ఆవరించుకున్న రాధాతత్వం నిరాధార మనడానికి వీలు లేకనే ఆ ఆధారాలు పరామర్శించి వాని బలాబలాలు మనం నిర్ణయించవలసి వుంది.

బ్రహ్మవైవర్త పురాణాని కంటె భిన్నంగా వుండే యే పురాణాల్లోను రాధ కన్పించక పోవడంచేత బ్రహ్మవైవర్తమే రాధకు జన్మస్థానమని తెలుస్తుంది. దానిలో వుండే రాధ త్రిమూర్తులకు ఆధార భూతురాలు. సృష్టికర్త్రిణి. సమస్త సృష్టివ్యవహారమును రాధ చేస్తోంది. ఆమె నివాసమైన గోలోకంలో వుండే గోపాలురు దేవతలకంటె గొప్పవారు. ఆమె సంబంధం లేకపోతె కృష్ణుడు నిర్వీర్యుడు. నిర్ధనుడు. సర్వవిధముల రాధకంటె శక్తివంతమైన తేజోవంతమైన వ్యక్తి ప్రకృతిలో మరొకటి లేదు. ఆమె మూలప్రకృతి. పురాణకారుడు పై అంశాలు ధృవపరుస్తూ ఆ పురాణంలో అనేక ఘట్టాల్లో చాలా సార్లు ఉపన్యసించాడు. తాను ఆ సందర్భాల్లో ప్రతిష్ఠాపించుకున్న సిద్ధాంతాలు దృష్టాంతీకరించుకునేందుకు రాధాపాత్ర సామవేదంలో వుందంటూ అనేక రకాల అర్థకల్పనలు చేసి చూపించాడు. వాని పరమార్థమూ సామంజస్యమూ ముందు వివరిస్తాం.

ఈ దృఢమైన ప్రభావంతో గోలోకాన్ని పరిపాలిస్తూ వుండే రాధాదేవికి శ్రీకృష్ణుడు భర్త. గోలోకంలో కూడా శ్రీకృష్ణుడు ఏకపత్నీవ్రతి కాడు. విరజ, చంద్రావళి మొదలగు వారు మరికొందరాయన ప్రేమానికి పాత్రులుగా వున్నట్టు వుంది. కృష్ణభక్తులు ఆ సంబంధంలో యేదో పరమార్థం వుందని యువేదాంతానికి ముడిపెట్టుకున్నా చరిత్ర జిజ్ఞాసుల సంశయగ్రంథులు విడిపోవని తోచును. దాని ఫలితము కూడా ముందు వివరిస్తాను.

గోలోకం యొక్క స్వరూపస్వభావములను ముందు అవసరమున్నప్పుడు తెలుసుకోవచ్చును. కాని గోలోకానికి సర్వాధికారులైన రాధాకృష్ణులు, ఆనందమయులని, ప్రేమ పరవశులని, పరతత్వములని మాత్రం ఆ పురాణం చెపుతుంది. వారి దాంపత్యం కూడా పరిపూర్ణతా విలసితం కాదు. వారి గోలోక చరిత్రలో చరిత్రకారులు గమనింప దగిన ప్రత్యేక విశేషాలు లేవనియే చెప్పవచ్చును. ఇది గోలోక రాధా కృష్ణుల చరిత్ర స్వరూపం.

భౌతిక పాత్రగా శ్రీ విష్ణువుయొక్క అంశాసంభూతుడుగా తలంపబడే యాదవకృష్ణునకును ఈ గోలోక కృష్ణునకు గల సంబంధాన్ని యిక వ్రాస్తాను. అంతకంటె ముందు పాఠకులకు మరో సంగతి తెలుపవలసి వుంది. రాధా చరిత్రంలో స్ఫుటంగా కన్పించె సందేహాల యొక్క మూల బీజాలన్నీ కృష్ణచరిత్రలోనే వున్నట్టు కనపడతవి. కొందరు కృష్ణుడు వైకుంఠాధిపుడున్నూ లక్ష్మీ భర్తయున్నూ అయిన శ్రీ మహావిష్ణువుయొక్క అవతార మంటారు. మరికొందరు గోలోకవాసియు రాధా ప్రియుడున్నూ అయిన శ్రీకృష్ణ పరమాత్మ యొక్క అవతార మంటున్నారు. మొదటి తెగ విష్ణు భాగవత పురాణములకు చెందినది. రెండవది బ్రహ్మవైవర్తపుది. కనుక రాధతో సంబంధంగల గోలోక కృష్ణుని కథను ముందు వర్ణిస్తాను.

ఒకనాడు శ్రీకృష్ణుడు విరజ యింటికి వెళ్లాడు. విరజ శ్రీ కృష్ణుడు ఆనందంగా విహరిస్తున్నారు. రాధా సఖులు ఆ సంగతి రాధతో చెప్పారు. ఆమెకు మితిమీరిన కోపం వచ్చింది. పరాంగనా సక్తుడైన గోపాలుణ్ణి చూపిస్తె దండిస్తానని రాధ చెలికత్తెలతో చెప్పింది. వెంటనె వారు విరజా కృష్ణులున్న రత్నమండపానికి వచ్చి ద్వారపాలకులను బెదరించుచు కోలాహలంతో లోపల ప్రవేశించింది. రాధ యొక్క ఆగమనాన్ని తెలిసికొని కృష్ణ అంతర్ధానమైనాడు. విరజ యోగబలంచాత ప్రాణములను వదలింది. ఆమె దేహము నదీరూపంతో ప్రవహించింది. రాధ లోపలికి పోయి చూచె టప్పటికి యెవ్వరు కన్పించక పోవడం చేత తన ప్రభావానికి గర్విస్తూ యిల్లు సేరింది.

తరువాత కృష్ణుడు విరజానది (విరజ దేహము) ప్రక్కన సేరి యెలుగెత్తి విరజ కోసరం దుఃఖించాడు. తన ప్రభావం వల్ల ఆమెకు పునః శరీరము నిచ్చి ఆమె యందు యేడ్గురు పుత్రులను కన్నాడు. మరోనాడు విరజా కృష్ణులు అనంగోన్మత్తులై యుండగా ఒకానొక కొడుకు వారి కానంద భంగం కలిగించాడు. కృష్ణుడు రాధా మందిరానికి వెళ్లాడు. దానివల్ల విరజ దుఃఖించి తన బిడ్డలను సముద్రములు కండని శపించింది. ఈ గండరగోళం యావత్తు మళ్లీ రాణిగారికి వెళ్లింది. రాధమ్మ కోప మందిరాన్ని అలంకరించింది.

శ్రీదామునితో గలిసి కృష్ణ పరమాత్మ రాధా మందిరం ప్రవేశించాడు. కోపావిష్టరాలైన రాధ ఉద్రిక్తరాలైంది. కృష్ణణ్ణి "చోర రతిలంపటుడవని, గురులకు గురుడవైన నీతత్త్వం తెలిసిందని నాయింటికి రావలదని, విరజ యింటికి పొమ్మని, మనుష్య యోనిం బుట్టుమని" యిష్ట ప్రకారం తూలనాడి శపించింది. ఇంటిలోనించి కృష్ణణ్ణి వెళ్లగొట్టుడని చెలికత్తెలను ఖండితముగా కోరింది. సమయజ్ఞుడైన కృష్ణుడు రాధాసఖుల సందేశానుసారం రాధా మందిరాన్ని విడిచి వెళ్లుతూంటె కృష్ణసఖుడైన శ్రీదాముడికి కష్టంగా వుండి రాధాదేవితో ఆమె గౌరవానికి, ప్రభావానికి కారణభూతుడైన కృష్ణణ్ణి అలాగు తూలనాడడం తప్పని కఠినంగా చెప్పాడు.

తనకు అసూయా పాత్రుడుగా వుండె కృష్ణణ్ణి అలా శ్రీదాముడు పొగడడం కష్టమనిపించి "విస్మయలంపట కింకరుడవు గావున తల్లిని నిందించి తండ్రిని భూషి

స్తున్నావు. అది అసుర విధానం గనుక నీవు అసుర యోనిలో బుట్ట వలసింది" అని శపించింది ఇక శ్రీదాముని కోపం అగక ,,మనుషిన్లాగె నాగ్రహించితివి శపించితివి. కనుక మనుష్యయోనింబుట్టి శతవర్షాలు కృష్ణ వియోగాన్ని అనుభవించు" అని ప్రతిశాపం యిచ్చాడు. ఇరువురి అగ్రహం కన్నీళ్లతో కడిగివేసుకున్నారు. అప్పుడు కృష్ణుడు భవితవ్యం అట్టా వున్నది. గనుక నిష్కారణంగా యిలాంటి శాపాలు సంభవించినయి. ఇది ఒకందుకు మంచిదేనని వుపసంహార వాక్యాలతో ఓదార్చాడు.

నవీన వైష్ణవులు శ్రీకృష్ణ పరమాత్మ యొక్క భూలోకావతారానికి కారణంగా పై కథను చూపిస్తున్నారు. రాధా అవతారానికి చరిత్రలో యింతకంటె ప్రబల కారణం మరోటి కన్పించదు. ఇతర గ్రంథాల్లో యీ అవతారము లేదని ముందే చెప్పాను. కాని మరోరకంగా కృష్ణావతారానికి కారణాలు వారుకూడ చెప్పారు. అవి మన రాధాచరిత్రానికి సంబంధించినవి కాకపోయినా కృష్ణ చరిత్ర ఒక్కటి రాధాచరిత్ర నిర్ణయానికి ఉత్తమ సాధనం కావడంచేత ఎత్తి చూపిస్తాం.

త్రేతాయుగంలో రాముణ్ణి ప్రేమించినమహర్షులు మిథిలాకోసల పురంధ్రులు: ఆయన అనుగ్రహాన్ని ప్రార్థించేటప్పటికి ఏకపత్నీవ్రతుడైన రాముడు ఉత్తరజన్మంలో మధురలో పుట్టి వారి కోర్కెలు నెరవేరుస్తానన్నాట్ట. అంగుళీల గోపికలుగాపుట్టి పైవారు వాని పురుషార్థాన్ని ద్వాపరంలో సంపాదించుకున్నారట అని వ్రాస్తూ గర్గాచార్యుడు. రాధా చరిత్రాన్ని మాత్రం బ్రహ్మవైవర్త పురాణ కారుని అడుగుజాడలనుబట్టి వ్రాశాడు. కాని అవతార కారణాన్ని మాత్రం ఇతర పురాణాలవలె బ్రహ్మదుల ప్రార్థనమున దుష్ట సంహార కొరకవతరించినట్లు సూత్రించాడు.

స్వయంప్రభా చరిత్రాన్ని వ్రాసినాతడు వింధ్యపర్వతాల్లోవున్న స్వయంప్రభరాముని వరంచేత ద్వాపరంలో రాధగా పుట్టినట్టు వ్రాశాడు. గర్గుని గోపికావతారానికి సంకేపప్పు స్వయంప్రభావతారానికి కారణం ఒక్కటిగానె కనపడుతోంది. నమ్మితె రెండూ నమ్మాలి తొలగిపోతె రెండూ త్రోసి వెయ్యాలి. ఏపని అంత తేలికగా తోసివేయ దగిలేవు. మొత్తముమీద యీవిషయాన్ని నిర్ణయంచేయడానికి యితర గ్రంథదృష్టాంతం లేక పోవడంచేత నమ్మటం కష్టంగానెవుంది. కనుక బ్రహ్మవైవర్త పురాణ కథనుకూడ పరిశీలించి చూపి ముందు కథ విసరిస్తాను.

రాధ దురభిమాని. కోపిని. కావుననె విరజా శ్రీకృష్ణ సంబంధమును అంగీకరించ లేక పోయింది. భగవంతుడని కాక పోయినా భర్త అనియైనా కృష్ణుణ్ణి గౌరవించకుండా పరదారాగమనప్రాయశ్చిత్తముగా అతన్ని నిష్కారణంగా దండిస్తానని బయల్దేరింది. విరజా కృష్ణులు అదృశ్యులైనపుడు తన గొప్పదనానికి తానెంతో సంతోషించుకుంది. పునఃకృష్ణుడు విరజానురాగాన్ని కోనట్లువిని మండిపోయింది. సమీప గతుడైన కృష్ణుణ్ణి బహిష్కరించడమె కాకుండ శపించింది.

శ్రీకృష్ణుడు విరజయందు ప్రేమయే కాక సంతానము కూడ కలిగి యుండుట చేత నా సంబంధము పవిత్రమైన దనడానికి వీలులేదు. విరజ శ్రీకృష్ణునకు ధర్మపత్ని యనిచెప్పడు. సకలసృష్టికర్త్రిణిగా వుండె రాధ పవిత్రమైనదైన యెడల విరజాకృష్ణ సంబంధాన్ని యెవగించ వలసిన అవసరంలేదు. పరాత్పరుడుగాను, దుష్టసంహర్తగాను, వర్ణింపబడె కృష్ణుడు రాధకు జడయవలసిన అవసరం కన్పించదు. రాధయొక్క సర్వాధార భూతత్వాన్ని మూల ప్రకృతత్వాన్ని ధ్రువపరచే మతే యితర గాథలు కన్పించవు. రాధ తన్నావిధంగా కూనాడి శపించినప్పుడుకూడ కృష్ణుడు మౌనం వహించాడు. పైపెచ్చు విరజావిరోధంలో మానవునివలె యేడ్చాడు. పైకారణాలచేత అట్టికృష్ణుని పరాత్పరత్వాన్ని అంగీకరించము.

పై పనులు చేయక పోనియెడల అతని పరాత్పరత్వానికిగాని ఆదర్శ జీవితానికిగాని కొరత రాదనడమె మాకారణం.

కొంద రభిప్రాయపడ దగియున్నట్లు మాసంకుచిత దృక్కులకు పై కార్యములయందు మానవత్వం వున్నట్లు తోచడమే కాకుండా రాధకృష్ణునిచర్య మానవత్వ [illegible]

క్షమని తోచింది. అప్పటి ఆమె ప్రవర్తన గూడ మానవ ప్రవర్తనవలె నున్నదని శ్రీదాముడు ప్రత్యాఖ్యానం చేగాడు.

అందువల్ల ఈకథా వస్తువు రాధాకృష్ణులను పర దైవములని నిర్ణయింప జాలను. బ్రహ్మవైవర్తపౌరాణి కుని కల్పనకూడ జటిలంగాలేదు. అతుకులు అతుకబడి గట్టియున్నవి. ఇందలి రాధా చరిత్రము ప్రారంభకుని కవితాసృష్టివలె నుండుటచేత బ్రహ్మవైవర్తమే రాధ నీవిధముగా సృష్టించిందని ఏవంవిధముగావాడబడె రాధా పాత్ర కల్పితమని చరిత్ర జిజ్ఞాసువులు అభిప్రాయ పడక తప్పదు.

ఇది సిద్ధాంతముగా వుంచుకొని రాధా చరిత్రను పరామృశించి దాని సత్యత్వము నిర్ణయించి చూపుతాం.

# ప్రేమభావము

‘కవియుగము’

మామక పవిత్ర నిర్మల ప్రేమభావ
మతిభయంకర నిబిడ మహాంధకార
పూరిత తమస్వినీ చరదుగ్ర్యాభరనీల
కాలధారాధరావళీ గర్భమందు
మెఱసి మిఱుమిట్లుఁ గొల్పెడు మెఱపుఁదీవ;
కఠిన భీకర వల్లికా కలితబహుళ
కర్కశక్రూరతర కంటకముల నడుమ
నలరు కోమల నవమనోహర సుమంబు;
పరమ గంభీర వార్ధిగర్భంబునందు
భవ్యకాంతుల వెలయించు భాసురమణి;
ఉజ్జ్వలజ్వాలనజ్వాలి కోగ్రతీక్ష్ణ
విస్ఫుటాంతరాళంబునఁ బ్రస్ఫుటముగఁ
గలుగు మేలిమితళుకు బంగారుపూఁదె;
కాని-చో నను భూతేంబు శోకయున్న?
ఎవరికై కొనఁగల్గు వాఁడెంక దీని?
నిర్భరవిషాద తామసీ గర్భమందుఁ
తేజమేటికి?
అత్యంత తీవ్ర వేద
నాబ్ధి హృదయాన రత్న మేలా?
విశేష
మానసోద్రేకకంటక మధ్యమందుఁ
బ్రసవమేటికి?
పావకజ్వాలనంచ
యాంతరమ్మున స్వర్ణమేలా?
కటకట!
ఇట్లు వ్యర్థంబుఁ గావింప నేల దీని?
చేయుము తదీయ మూల విచ్ఛేదనంబు
స్వామి! అప్పుడెన నావాంఛ నఫలమగును.

# ఆహార పదార్థములు

పుల్లమరాజు వేంకటేశ్వర రావు

మనము ప్రతిదినము భుజించు పదార్థముల గుణధర్మములను, మరియు వాని సంఘట్టనమును దెలిసి కొనుట యత్యావశ్యకము. పూర్వకాలమున చరక, శుశ్రుత మహర్షియులచే గుణధర్మములు (Properties) కనిపెట్ట బడినవి గాని వాని సంఘట్టనము (Composition) నిర్ణయింప బడలేదు దీనికి కారణము రసాయనిక విజ్ఞానము యొక్క కొరతయే. అధునిక రసాయనశాస్త్రవేత్తలగునట్టి పాశ్చాత్య పండితులు, తమ జీవితములను ధారబోసి, ఎక్కు పరిశోధనలు గావించి, ప్రతి పదార్థము యొక్క పరిమాణ సంఘట్టనమును, అనగా దానిలో నుండు మూలద్రవ్యముల (Elements) మఱియు మిశ్రద్రవ్యముల [Compounds] పరిమాణములను నిర్ణయించిరి. మనము సామాన్యముగా భుజించు పదార్థముల రసాయనిక పరిమాణ సంఘట్టనము [Quantitative Chemical composition] నీవ్యాసమునందు వివరించుటయే ముఖ్యోద్దేశము.

ధాన్యములు, కూరగాయలు, తైలములు, పాలు పెరుగు మొదలగునవి "సేన్ద్రియ రసాయన శాస్త్రము" [Organic Chemistry] నకు జెందినవి. వీనిలో నుండు మిశ్రద్రవ్యములను, వానివాని రసాయనిక ధర్మములను [Chemical properties] బట్టి నాల్గువిధములుగా విభజింపవచ్చును. [౧] ప్రొటీనులు [Proteins] [౨] క్రొవ్వులు [Fats]; [౩] కార్బొహైడ్రేటులు [Carbohydrates]; [౪] లవణములు [Mineral salts; వీనికితోడు కొంత జలముగూడా పదార్థములలో నిమిడి యుండును.]

## ప్రొటీనులు

౧. ఇవి సామాన్యముగా మాంసాదులలో నెక్కువ శాఖము ధాన్యములలో తక్కువగా సంభవించుచున్నవి పప్పుద్రవ్యములు మాత్రము వీవిషయములో, మాంసాదులకు వెనుదీయవు. "ప్రొటీన్" యొక కుటుంబమునకు జేరిన పలురకముల మిశ్రద్రవ్యముల సమూహము. ఒక ప్రొటీన్ లోనుండి ౧౫—౨౦ మిశ్రద్రవ్యములను పృథక్కరింప వచ్చును. దాని యొక్క రసాయనిక ధర్మములను బరిశీలించుట, రసాయనశాస్త్రములో బరిచయములేని పాఠక మహాశయులను గొప్ప చిక్కులలో బెట్టుటయేకాక, పారిభాషిక పదముల దొరకమిచే యీ విషయమును విస్తరించి వ్రాయుటకు వీలులేదయ్యెను. సంక్షిప్తముగా కొన్ని విషయములను మాత్రము గనుగొందము. ప్రొటీనులు, వానియొక్క ప్రత్యేక రసాయనిక ధర్మములనుబట్టి ౭—౮ విధములుగా విభజింప బడియున్నను ఏకకుటుంబమునకు జేరిన రసాయనములు "ప్రొటమిన్"లు (Protamins) "హిస్టోన్"లు [Histones] "గ్లోబ్యులిన్"లు [Globulins] "గ్లయేడిన్"లు (Gliadins) "ఫాస్ఫొ ప్రొటీన్"లు (Phosphoproteins) "అల్బ్యుమిన్"లు



ఓరుగల్లు కోటలో క్రుంగిపోయిన నొక దేవాలయము ముందు నిలువబడిన అపూర్వశిల్పకళను పరిదర్శించు ఒక ధ్వజస్తంభ శకలము: దానికై చింతించుచున్న నందులు మూడు నాలుగు.

PHOTO BY :—A. V. C.

(Albumins) మొదలగునవి. వీనిలో నొకదానిని మా క్రమము మమ్మునకు నూచించెదము.

"అల్బ్యుమిన్"లు [Albumins]:—కోడిగ్రుడ్డు యందలి ధవళము యీశాఖకు చెందినది. దీనిలోనుండి అల్బ్యుమిన్ యను పదార్థమును విడదీయుట సులభసాధ్యము. శుద్ధ అల్బ్యుమిన్ పసుపుధాతువును గలిగి, కాంతియుతమై సన్నని పొరలు [Scales]గా యుండు ఘన పదార్థము. రుచి, మరియు గంధవిహీనమై యుండును. నీటిలో దీర్ఘకాల ముంచినచో కరగిపోవును. ఈ పదార్థమువంటి మిశ్రద్రవ్యములు [Compounds] స్వల్ప భేదములతో, పాలు, గోధుమలు, పప్పులు, ఆలుగడ్డ [బంగాళాదుంప] చిక్కుడికాయ మొదలగు వానిలో గలవు. వీనికి ప్రత్యేక నామములున్నవి. గాని సులభముగా విషయమును గ్రహించుటకై వీని నన్నింటిని అల్బ్యుమినాలే యుండునని భావింప వలయును. వీని పరిమాణ సంఘటనము ఈక్రింది విధముగా నుండును:—మాదిరి

[౫౨.౭] మొదలు [౫౪.౫] వరకు కర్బనము అనగా బొగ్గు [C = 52.7-54.5 percent] ఉదజని వాయువు ౬.౯-౭.౩ [H = 6.9-7.3 P.c.] నత్రజని యను వాయువు ౧౫.౪-౧౭.౬ [N = 15.4 17.6 P.c.] అమ్లజని యను ప్రాణవాయువు ౨౦.౯-౨౩.౫ [O = 20.9-23.5 P.c.] గంధకము ౦.౮-౫.౦ [S = 0.8-5.o P.c.] పైన చెప్పిన వలెనే ఇతర ప్రోటీనులన్నిటి పరిమాణసంఘటనము కూడా యిటులే యున్నది. కొన్నిటిలో మాత్రము స్వల్పముగా "భాస్వరము" [Phosphorous ఫాస్ఫరస్] అను ధాతువుగలదు.

ప్రోటీనులు మాంసపేశముల [Muscles] పెంపు, వానికి పుష్టిని గలిగించుచున్నవి. ప్రోటీనులులేని భోజనపదార్థము భుజించినచో మన శరీరము క్షీణించును.

౨. భోజన పదార్థములలో నుండు రెండవ ద్రవ్యము క్రొవ్వు [Fat]:—ఇది ముఖ్యముగా మాంసము, పాలు, మాంసాల్లో సంభవించును. శాఖ ధాన్యములలో స్వల్పముగా నిమిడియున్నది. క్రొవ్వులు కూడా యనేక విధములై యున్నవిగాని సామాన్యముగా అధిక పరిమాణములలో లభించు మూడింటిని మాత్రమే చెప్పెదము.

స్టీరిన్ (Stearin —$C_3H_5(C_{18}H_{35}O_2)_3$

పామిటిన్ (Palmitin]-$C_3H_5(C_{16}H_{31}O_2)_2$

ఓలీన్ Olein—$C_3H_5(C_{18}H_{33}O_5)_3$ స్టీరిన్ క్రొవ్వువస్తువుల నంద రెరుగుదురుగదా! స్టీరిన్ అను క్రొవ్వు గ్లిసెరిన్ (Glycerine—$C_3H_5(OH)_3$) మరియు స్టీరిక్ ఆసిడ్ (Stearic acid—$C_{18}H_{36}O_2$) యొక్క సంయోగముచే గలిగినది. పామిటిన్, గ్లిసెరిన్ మరియు పామిటిక్ ఆసిడ్ (Palmitic acid-$C_{16}H_{32}O_2$) యొక్క సంయోగముచేతను ఓలీన్ గ్లిసెరిన్ మరియు ఓలిక్ ఆసిడ్ (Olic acid—$C_{17}H_{34}O_2$) చేతను కల్గినవి. స్టీరిన్, పామిటినులు మెత్తగా నుండు తెల్లని ఘన పదార్థములు. ఓలీన్ మాత్రము ద్రవరూపముగలది. మనము వంటలలో వాడుకొను నూనెలన్ని యధికముగా ఈ మూటితో మిశ్రితమై యున్నవి. గాని ఓలీన్ యొక్క పరిమాణము తక్కిన రెంటికంటె యధికమై యుండుటచేత, నూనెలు ద్రవరూపమును, క్రొవ్వులు, మైనము మొదలగు వానిలో ఓలీన్ తక్కువ స్వల్పముగా యుండుటవలన ఘనరూపమును బొందియున్నవి. వెన్నలో మరి ఇతర ద్రవ్యముల జతను, ఈమూడును, క్రింద వివరించిన విధముగా చేరియున్నవి—మాటిలో, (౩౮) వంతులు ఓలీన్, సుమారు (౨) వంతులు (౧౯౧) స్టీరిన్, (౪౦) పామిటిన్.

ఈ యుపోద్ఘాతము యొక్క సారాంశమేమన, క్రొవ్వు [Fat] యొక్క కుటుంబమునకు చేరిన ద్రవ్యములు అధిక పరిమాణములలోనో, అల్ప పరిమాణములలోనో, అన్ని భోజన పదార్థములలో రూపాంతరమును

బొంది చేరియున్నవి. వానియొక్క రసాయనిక సంఘట్టనమును, ప్రత్యేక ధర్మములను బట్టి, వేరు వేరు నామములు గలిగి యున్నప్పటికి, యివన్ని క్రొవ్వుల కుటుంబమునకు జేరినవని యెరుగ వలయును. క్రొవ్వులు దేహమునకు, ఉష్ణము, శక్తి, బలము నిచ్చుచున్నవి—"Fats are a good source of heat and mechanical energy to the body."

మూడవ ద్రవ్యము కార్బొహైడ్రేట్లు (Carbo hydrates).:—వీని సంఘట్టనములో నుండు మూలద్రవ్యములు, కర్బనము, ఉదజని, అమ్లజని. వీనియొక్క ప్రత్యేక రసాయనిక ధర్మములనుబట్టి వీనికి కార్బొహైడ్రేటులు, అనగా "కర్బనోద జనితము" లను నామముగలదు. కర్బనోద జనితములు నాలుగువిధములైయున్నవి.

[అ] డెక్ట్రోజ్ (Dextrose $C_6H_{12}O_6$)

ఇది యొకవిధమైన శర్కర. డాకపండ్లు, నారింజపండ్లు, సీతాఫలము మొదలగు తియ్యని ఫలములలోను, తేనెలోను, మధుమేహ మూత్రములోను యీశర్కర సంభవించుచున్నది. గోధుమ వర్ణము గలిగి పిండివలె మెత్తగా నుండును. మనము సామాన్యముగా వాడుకొను శర్కరకంటె కొంచెము తక్కువ మాధుర్యము గలది. ఈశాఖలో మరికొన్ని విధముల శర్కరలు గలవు. వీనియొక్క రసాయనిక సంఘట్టనములో భేదమేమియు లేదు, గానికొన్ని గుణవిభేదముల ననుసరించి వీనికి వేర్వేరు నామము లియ్యబడినవి. వీని నన్నింటిని డెక్ట్రోజ్ వంటివనే భావింప వలయును. ఫ్రక్టోజ్ (Fructose or fruit sugar—$C_6H_{12}O_6$) అనగా "ఫలశర్కర" గూడా పై దానివంటిదే. ఇదిగూడా, పుష్పములయొక్క తేనె, మరియు మధుర ఫలములలో, డెక్ట్రోజ్ జతకు, సంభవించు చున్నది. వీని పరిమాణ సంఘట్టనము నూటిలో:—

| | | |
|---|---|---|
| కర్బనము | ...... ౪౩.౩౫ | వంతులు. |
| ఉదజని | ...... ౬.౬౫ | ,, |
| అమ్లజని | ...... ౫౦.౦౦ | ,, |
| | ౧౦౦.౦౦ | |

[ఆ] స్సాకరోజ్ (Saccharose—$C_{12}H_{11}O_{22}$) అనగా మనము సామాన్యముగా వాడుకొను శర్కర చెరుకులోనే గాక మరికొన్ని వృక్షముల లేతకొమ్మలలో గూడా సంభవించు చున్నది. నూటిలో

| | | |
|---|---|---|
| కర్బనము | ...... ౪౨.౧౦ | వంతులు. |
| ఉదజని | ...... ౬.౦౧ | ,, |
| అమ్లజని | ...... ౫౧.౮౯ | ,, |
| | ౧౦౦.౦౦ | |

(ఇ) ల్యాక్టోజ్ [Lactose] యనుశర్కర పాలలో నూటికి మూడు మొదలు, అయిదు భాగములవరకు గలదు. చనుపాలలో నింతకంటె కొంచె మధికముగా నుండును దీని రసాయనిక సంఘట్టనము మనము వాడుకొను శర్కరయొక్క సంఘట్టనము వలె యున్నప్పటికి కొన్ని కారణములచే కొంచెము గుణ విభేదము గల్గుట వలన ప్రత్యేకింప బడినది. శుభ్రమైన ల్యాక్టోజ్ తెల్లని స్ఫటికాకృతిని దాల్చియుండును. తీపి స్వల్పము.

[ఈ] స్టార్చి [Starch] బియ్యము, గోధుమలు, జొన్నలు, పప్పు మొదలగు ధాన్యములలో నూటికి ౬౦, ౭౦ వంతుల వరకుగలదు. సబ్బుబియ్యంలో ౭౦,౮౦ వంతులు ఈ ద్రవ్యమే గలదు. కూర గాయలలోగూడా గలదు. బియ్యమునుండి విడదీయబడు తవుడును స్టార్చి యని చెప్పవచ్చును. దీనిలో అత్యధిక భాగము "స్టార్చి", స్వల్పముగా "డెక్ట్రిన్" [Dextrin], మరియు "సెల్యులోజ్" [Cellulose] యనునవి, ఈశాఖకు జెందిన ద్రవ్యములే యున్నవి. శుభ్రమైన chmeically pure] స్టార్చి మృదువైన తెల్లని పొడిగానుండి, రుచికి చప్పగా నుండును. ఇది చల్లని నీటిలో కలియదు.

. స్టార్చి, డెక్ట్రిన్, చెరకు శర్కర, ఈ మూడును కొద్దిగా [గంధకి కామ్లము Sulphuric acid, లేక ఉదజనహరి తామ్లము—Hydro-chloric acid చేర్చిన నీటితో—dilute acid—] గాచిన, డెక్ట్రోజ్ యను శర్కరగా పరివర్తనము నొందుచున్నవి. ఫలములు, కూరగాయలు మొదలగువానిలోనుండు సార మ

# పటిక (౧)

## బి

నూరు భాగముల పదార్థములలో, ఈ క్రిందివిధముగా ఇతర మిశ్ర ద్రవ్యములుండును.

**Percentage Composition.**

| పదార్థము. | నీరు. | ప్రొటీడ్లు. Proteins | కొవ్వులు. Fats | కర్బనోదజనితములు—Carbohydrates: శర్కరలు Sugars. | బంక మున్నగునవి. Gum & dextrin | స్టార్చి Starch | సెల్లులోజ్ Cellulose &c. | బూడిద Ash: లవణములు, మున్నగునవి Mineral matters |
|---|---|---|---|---|---|---|---|---|
| గోధుమలు? | ౧౩ ౬౫ | ౧౨.౩౫ | ౧.౭౫ | ౧.౪౫ | ౨.౩౮ | ౬౪ ౦౮ | ౨ ౫౩ | ౧.౮౧ |
| బియ్యము (పోటు వేయనిది) | ౧౧ ౯౮ | ౭.౦౨ | ౧ ౯౬ | ౭౬.౦౫ | | | ౦.౯౩ | ౧.౧౫ |
| బియ్యము (పోటు వేసినది) | ౧౨ ౩౪ | ౭ ౧౮ | ౦.౨౬ | ౭౯.౩౬ | | | ౦.౪౦ | ౦.౪౬ |
| జొన్నలు. | ౧౬.౦ | ౯.౦ | ౩.౫ | ౭౦.౫ | | | | ౧.౦ |
| కొఱ్ఱలు. | ౧౭.౦ | ౧౨.౦ | ౩ ౨ | ౬౬.౮ | | | | ౧.౦ |
| సజ్జలు (రాగులు) | ౧౪.౦ | ౯.౦ | | ౭౫.౦ | | | | ౨.౦ |
| సామలు. | ౧౫.౦ | ౧౦.౧ | | ౭౩.౦ | | | | ౨.౦ |
| కందిపప్పు. | ౧౦.౬౩ | ౧౯.౮౩ మొదలు ౨౦.౭౮ | ౧.౧ | ౬౧.౯ మొదలు ౬౪ ౩ | | | ౫.౮ | ౩.౧౧ |
| పప్పు పెసలు. | ౧౦.౮ | ౨౨.౨ | ౨.౭ | ౫౪.౧౦ | | | | ౪.౪ |
| పెసలు. | ౧౧.౪ | ౨౩.౮ | ౨.౦ | ౫౪.౮ | | | ౪.౨౧ | ౩.౮ |
| †బఠాణీలు? | ౧౦ ౧ | ౨౨.౭ | ౧.౨ | ౫౫.౮ | | | ౪.౮ | ౪.౪ |
| శనగలు. | ౧౧.౨ | ౧౯.౫ | ౪ ౬ | ౫౩ ౮ | | | ౭.౮ | ‡ ౨.౩+ |
| శనగపప్పు. | ౧౧ ౪ | ౨౨.౦ | | ౫౯ మొదలు ౬౩ ౦౮ వరకు. | | | ౩.౯ | § ౧.౫+ |
| †చిక్కుడు కాయ (నార తీసి వేసినది) | ౬౮.౫ | ౭.౧ | ౦.౭ | ౨౨.౧ | | | ౧.౭ | ౧.౭ |
| ?గడ్డ (ఆకుమున్న ? పంటకు సిద్ధముగా చేసినది) | ౯౧.౫ | ౧.౬ | ౦.౩ | ౫.౬ | | | ౧.౧ | ౧.౦ |
| ? (సమగ్రము) | ౯౨.౩ | ౧.౮ | ౦.౫ | ౪.౭ | | | ౧.౦ | ౦.౭ |
| ?కాయ (చెక్కు తీసినది) | ౯౩.౧ | ౧.౦ | ౦.౧ | ౫.౨ | | | ౧.౨ | ౦.౬ |
| ?గడ్డ (నార తీసినది) | ౯౧.౮ | ౧.౩ | ౦ ౩ | ౮.౩ | | | ౦.౭ | ౧.౦ |
| ?కాయ (చెక్కు తీసినది) | ౯౫.౪ | ౦.౮ | ౦.౨ | ౩.౧ | | | | ౦.౫ |
| ? కాయలు (ఉడకబెట్టి?) | ౯౪.౩ | ౦ ౯ | ౦.౪ | ౩.౯ | | | ౦.౬ | ౦ ౫ |
| ?గడ్డ (బంగాళాదుంప) | ౭౪.౦ | ౨.౦ | | ౨౩.౦ | | | | ౧.౦ |
| ?గడ్డ (పొట్టు తీసినది) | ౮౭ ౬ | ౧ ౬ | ౦.౫ | ౧౩.౫ | | | ౨.౫ | ౧.౪ |

వివరములు. Remarks.

*వీని లోనుండు కర్బనోదజనితము అను పేరుచే వగా నిర్ణయింపలేదు. వినను స్టార్చి తప్ప తక్కిన ద్రవ్యముల పరిమాణము ౩–౪ వంతులు మాత్రమే యుండునని తెలుగవలయును.

§ పెసరు పప్పులో, పొట్టు మున్నగునవి లేకుండుటవలన, పెంటలోజా పరిమాణము ౪.౨ కు బదులు ౧.౧ వరకగును, గాన ఇతర పరిమాణములు స్వల్పముగా హెచ్చును.

Phosphoricacid
† ఫాస్ఫారిక్ ఆసిడ్
‡ (౦.౮ ,, ,,)
§ (౧.౧ ,, ,,)

‡ క్రింది పరిమాణములు 'Atwater' యను గ్రంధకారుని చే నిర్ణయింపబడినవి.

## పటిక (౨)
### ట

## Composition of the ash of foods——percentages.

నూరు భాగముల పదార్థమునుండి లభించు బూడిదలో నీక్రింది విధముగా ధాతువులుండును.

| పదార్థము | పొటాసియామ్లజనిదము $K_2O$ | సోడియామ్ల జనిదము $Na_2O$ | ఖటికామ్ల జనిదము $CaO$ | మగ్నామ్ల జనిదము $MgO$ | లోహామ్ల జనిదము $Fe_2O_3$ | స్ఫురామ్ల జనిదము $P_2O_5$ | హరితము (క్లోరిన్) $Cl$ | మొత్తము Total | వివరములు. Remarks. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| గోధుమలు. | ౦. ౬౨ | ౦. ౦౬ | ౦. ౦౬౫ | ౦. ౨౪౦ | ౦. ౦౨౬ | ౦. ౯౪ | — | ౧. ౯౫౧ | భూమితీను, |
| అలుగడ్డలు [ఎండినవి.] | ౨. ౨౭ | ౦. ౧౧ | ౦. ౧౦౦ | ౦. ౧౯౦ | ౦. ౦౪౨ | ౦. ౬౪ | ౦. ౧౩ | ౩. ౪౯౨ | కాలమును బట్టి వీనిలో మిక్కిలి స్వల్ప భేదములు కలుగ వచ్చును. |
| పప్పులు [కంది, పెసరు.] | ౧. ౧౩ | ౦. ౦౩ | ౦. ౧౩౮ | ౦. ౨౨౦ | ౦. ౦౨౪ | ౦. ౯౯ | — | ౨. ౫౩౧ | |
| కోడిగ్రుడ్డులోని ధవళము. | ౧. ౪౪ | ౧. ౪౫ | ౦. ౧౩ | ౧. ౧౩౦ | ౦. ౦౨౬ | ౦. ౨౦ | ౧. ౩౨ | ౫. ౬౯౬ | |
| చనుబాలు. | ౦. ౫౭ | ౦. ౧౮ | ౦. ౨౪౩ | ౦. ౦౫౦ | ౦. ౦౦౩ | ౦. ౩౫ | ౦. ౩౨ | ౧. ౮౧౬ | |
| పాలు. | ౦. ౧౮౫ | ౦. ౦౮౦ | ౦. ౧౪౦ | ౦. ౦౧౮ | ౦. ౦౦౧ | ౦. ౧౮౦ | ౦. ౧౦౭ | ౦. ౮ | |
| | | | | | | +గంధకము—౦. ౨౮౦ | | | |

Bunges Physiological & Pathological Chemistry నుండి, ఈ సంఖ్యలు గ్రహింప బడినవి.

దలగునది [Crude fiber] సెల్యులోజ్ గా నెరుగవల యును. ,,బంక'' ను యొక విధమైన డెక్స్ట్రిన్ గా నెరుగ వలయును.

సారాంశమేమన, కార్బోహైడ్రేటులు లేక శర్క రోత్పాదితములనగా పైన వివరించిన వన్నియో లేక వాని లోనొన్ని ద్రవ్యములు మాత్రమో యైయుండునని గ్రహిం పవలయును

## లవణములు

౪ ( Mineral matters.):— భోజ న పదార్థములలో, సోడియము (Sodium), పొటాషియము (Potassium), మగ్నము (Magnesium)—మ్యాగ్నీసియుం, లోహము, ఖటికము (Calcium—క్యాల్సియం], స్ఫురము (Phosphorous—ఫాస్ఫరస్] మున్నగు ధాతువుల అమ్లజనిదములు (Oxides) మరియు లవణములు [Salts] నిమిడియున్నవి. ధాతువులు అమ్లములతో సంయోగము నొందుట వలన వణములు జనించు చున్నవి. మనము సామాన్యముగా వాడుకొను ఉప్పు సోడియమను ధాతువు, మరియు ,,హరి తము'' (Chlorine—క్లోరీన్) యనబడు వాయువు, ఈరెండు మూల ద్రవ్యముల సంయోగముచే జనించిన మిశ్ర ద్రవ్యము. ఇట్టి వివిధ లవణములు, భోజన పదార్థ ములలో, స్వల్ప పరిమాణములలో నిమిడి యున్నవి.*

## జలము

౫ ఫలాదులు కూరగాయలు మున్నగువా నిలో నుండుట సర్వజన విదితమే. బియ్యము, గోధు మలు, జొన్నలు మున్నగు ఎండిన ధాన్యములలోను, అపాలు, మిరియాలు, కొంత మొదలగు వానిలోను గూడా కొంత జలము నిమిడి యున్నది.

పట్టిక [ౘ] లో పదార్థముల సంఘటన మును జూపబడినది. ఈ పరిమాణములు Yillier, Collin, మరియు Prof., Thurch వరులచే నిర్ణ యింప బడినవి. భూమి తీరు, కాలమును బట్టి, యీ పరి మాణములలో స్వల్ప భేదములు గల్గుట సంభవము.

---

* పదార్థముల పృథక్కరణా విధానములో, ఏ పదార్థమును గాని ఎఱ్ఱగా గాల్చి భస్మము చేయుటచే లభించిన బూడిదలో, లవణములు, క్షారములు మొదలగు నవి యుండును. రాబోవు వ్యాసమునందు వివరముగా విశ దీకరించుదుము.

# సంకీర్తనము

(పూడిపెద్ది వెంకటరమణయ్య)

—(కవితాసమితి)—

తంత్రమున నాహృదయ వీణా
తంత్రులను గలయంగ మీటిస్వ
తంత్రగీతములనుహరీ! నిను
ధ్యానమొనరింతున్.
రాగమున శబ్దములు పుష్పప
రాగమట్టులనెగురఁగళలన
రాగమున మధుర సకణమ్ములు
పాలసతిఁ యింతున్.

కొనలుసాగిన తీవలైగుది
గొనిన చివురుల ప్రోవులై గుమి
గొనెడిభావములను హరీ! నిను
గూర్చికీర్తింతున్.
కంఠమొరసెడిదాకఁ నశ్రులు
కంటమొరసెడిదాక భక్త్యు
త్కంఠమొరసెడిదాక నిను నే
గానమొనరింతున్.
కరముభక్తిని భవత్సుగుణో
త్కరముఁబాడుచు మాధవా! నా
కరములను జోడించి నిలువునఁ
గరఁగి ప్రవహింతున్.



# అపరూప ప్రేమ

మ. వేంకటరమణారావు

"నీ మాటలన్నీ విచిత్రంగా ఉంటాయిరా, విశ్వపతీ! నాయిక పరకీయ ఐతేనేగాని, చెప్పే మాటలకీ, చేసే చేష్టలకీ, ఆవనే ఆ 'శోభ' రాదాఏమిటి? బాగా అనురాగం ఉన్న భార్య, భర్తకి అమాదిరిగా కబురంపకూడదూ!"

"అదికాదురా! దూరంకొండలునునుపని ఒక సామెతఉంది తెలుసునా? పరిచయం ఐనకొద్దీ, అందుకుందుండే ఆవేదన అంతా తగ్గుతుంది. బయటికి ప్రకటించే అవట్టరాని విరహమంతా మాయమౌతుంది. ప్రయాసలేకుండా లభించే వస్తువమీద క్రమేణా మోజు తగ్గిపోతుంది. రోజూ ఎదురుగుండా చూస్తుండే మొగుడు, ఒకనాడు ఆలస్యంగా యింటికివచ్చినా, ఎదురుచూచి కళ్లు కాయలు కాయడం, చంద్రుడి వెన్నెలకి సొమ్మసిలిపోవడం, తుమ్మెదలమీద కోకిలలమీద దుమ్మెత్తిపోయడం ఉంటాయా? అసలు అవుకోకుండా ఉంటారనికాదు. కాని ఈ మాదిరిగా, నాటకాల్లో ముక్కలన్నీ, ఏరి అవన్నీ ఆనాయకుడి దగ్గిరికి మాటకట్టి పంపించి, "చూడవయ్యా! మా అమ్మాయి స్థితి ఎట్లాఉందో" అంటే, అతడేమనుకోవాలి?"

"అంటే, నీవు చివరకు తేల్చింది, అమాదిరివన్నీ దొంగ కబుర్లనేనా?"

"ఆ! ఒకటి రెండు ముక్కలుపోను, మిగిలే కబుర్లన్నీ అలాటివే!

"నీవు రాలేదని బెంగ పెట్టుకున్నది. మనసులో కుమిలి కుమిలి ఏడుస్తూంది," అని చెపితే నిజమనుకోవచ్చుగాని తింటూ కూర్చుండి, ప్రకృతిలోకనబడ్డ వస్తువల్లా తిడుతూ, ఇస్సో, అస్సో అనుకుంటూ కాలక్షేపం చేయడం దొంగ వేషంకాదూ? పోనీ నిజంగా, అంత వేదనపడి ఉన్నిమాట్లూ మూర్ఛపోయి, ముత్యాల హారాలన్నీ కరిగి, నానా అవస్థ పడుతూందనుకుందామన్నా, కర్మం చాలక ఆ నాయకుడు కాస్తా అక్కడికి వచ్చాడా అంటే ఎగిరి గంతేసి, మెదలనీయకుండా చేతుల్తో కట్టేసి, కళ్ల నీళ్లన్నీ అతని ముఖానికి పుసవటం—ఇవన్నీ చూస్తే నాకు బలే నవ్వొస్తూందిరా. ఏదో పాఠం అప్పజెప్పటం లాగుంది. అంత గందరగోళం చేసి, ఆ నాయకుణ్ణి కూడలగొట్టించకపోతే, తన నాయికత్వానికి ఎక్కడ లోటు వస్తుందో, తనని తెలివిగలది కాదాటారేమో అని చేసే గల్లంతు కాని, మరేమి కాదు. ఈ తమాషా అన్నీ చేసే ఆడవాళ్లు బాగా డబ్బున్న వాళ్లయి ఉంటారు. పిల్లామేకా ఉండరు, యింట్లో పనిపాటా చేయాలిసిన అవసరం ఉండదు కదా? మరి, తీరుబడిగా కూర్చుని, మొగాడు బయటికి వెళ్లగానే, దాసీవాళ్లు ఎక్కడ కాస్త కూర్చుంటే పోతారోఅని, పొద్దుపుచ్చడానికి ఇన్ని రకాల వేషాలు వేస్తూంటారు. పాపం, ఆ చెలికత్తెలన్నా వాళ్లేరా, వీళ్లకి ఈ శైత్యోపచారాలు చేయలేక చచ్చేది. చేతులు పడేట్టు గంధం తీయాలి, అదంతా ఒంటికి పూయాలి. ఆయనగారు వస్తారంటే, అదంతా పోయేట్టు స్నానం చేయించి సింగారించాలి. ఏం అవస్థ—

„అదుగో, ధోరణి మార్చేస్తున్నావు. నేను చెప్పే ది అంత అనురాగం ఉండి, ఆ మాదిరిగా ప్రేమిస్తూ, అనిషమున్నా ఎటువంటి బాధ్యతలేకుండా ఉండే భార్య ఉండ టం ఎంతో అదృష్టం అని”

„నీకు చదువు కున్నకొద్దీ మతిపోతూంది కాని పనేంలేదు. మన అలంకారశాస్త్రాలలో ఉన్న సంగతులన్నీ, ఎంత చదువుకున్న అమ్మాయి అభినయించ గలిగినా, అదంతా అవతల వాళ్లని మోసం చేయడానికే కాని, వే రొకందుకు. ఆ మాదిరిగా మొగ్గ వేసి, అటూ ఇటూ పరు గెత్తి, అల్లరి చేస్తే, కావలసినంత ప్రేమ ఉన్నట్లు, లేక పోతే లేనట్లునా?”

„కనక నీవు చెప్పేది: విరహవేదన అనేది బయటి కి కనబడదని; అంతేనా?”

„నిజమైన వేదన అనేది ఉంటే దాగదు. అయితే దాన్ని మటుకు సులభంగా అందరూ గ్రహించడం కష్టం. ఆ మాదిరిగా కష్టపడుతూన్న వాళ్లో, దాన్ని గుర్తెరిగిన వా ళ్లో మాత్రం కనిపెడతారు. మీరు పుస్తకంలో చదివి, విను కుంటారే, ఆ సంగతులు మాత్రం అబద్ధాలు. ఎందుకంటే ఎవరు కూడా కానని, పనికి మాలిన పండుల్ని, వస్తువుల్ని లోకుల్ని తెలివి తక్కువగా పోల్చి అంట గడదామని, తప్పుడు ప్రకటనలు చేస్తారం టారు, అలాటివాటితో, నీవు నేర్చుకున్న ఆ విషయాలన్నీ. అవి అందరికీ తెలియాలనే, ఆ మాదిరిగా, విరహమునకు తపించి సున్నితమైన పూలన్నీ నలగ్గొట్టటం కోకిలమీద, కాకి పావురం మీద కోపం చేయడం, ఉన్నవాటికి లేనివి నాలు గు చేర్చి, నోట్లో నవ్వుగింజ నానని దాన్నీ చేత బయటికి పెట్టటం ఇవన్నీ నిజం సంగతు లనుకోమంటావా?

„పోని, ఆ సంగతులన్నీ వదిలేయి. భార్య ఆమాదిరి గా ఉండడానికి ఈ కాలంలో అవకాశ ముండం టావా?”

„అంటే, ఆ మాదిరిగా పుస్తకంలో అవసలన్నీ అ ప్పజెప్పడం, విరస తప్పకుండా, చంద్రదూషణంతో మొ దలెట్టి చలికి తెరచి చెంప పెట్టుతో తేల్చడమేనా, నీ ఉద్దేశం,

„అదే, ఎంతో అనురాగవతి గాని అమాదిరిగా వేదనపడలేదనకుంటాను. అంత ప్రేమ చూపించే భార్య లుంటారా,

„అటూ, యిటూ తిరిగి అలసి యింటికి వచ్చినప్పుడు ఆ పెళ్లాం అమాదిరిగా కలవిరబోసుకుని, అన్నం వండకుండా, దొడ్లో కూచుని, ఏకో విలాపం తీస్తూ ఉంటే ఏ మొగాడూరు కుంటాడు.”

„మొగాడికి అమాదిరివి ఇష్టమై భార్య అమాదిరి గా ఉండాలని కోరేవాడైతే!”

„అప్పుడు కూడా అంత తెలివితక్కువది అయితే సరిపోతుంది. లేకపోతే నిబోటివాడు; బలవంతపెట్టి ఆ మాదిరిగా రోజూ భార్యను ఏడిపిస్తావా. చూచేవాళ్లు ఊరుకుంటారా? ఇందాక చెప్పావు కాదూ, అదంతా, పనిపాటూ లేకుండా తిని కూర్చున్న వాళ్లు ఆడే నాటకా లని.”

„సామాన్య మానవులు అర్థం చేసుకోలేని ఊహ లున్న వాళ్లంత మనసులో ఉన్న వేమి నెరవేర్చుకోలేం దుకు వీలు లేదన్న మాట.”

„నీవనే అసామాన్య మానవులు మాత్రం, మా మూలు పద్ధతి గాకుండా, వేరేవో ఇక్కట్లు తెచ్చి వాటిని బయ టికి పెట్టేస్తారు. అమాదిరి పిచ్చివాళ్లందరూ ఒక చోట చేరి, లోకానికి నచ్చని పనులన్నీ చేసుకోవచ్చు. అంతే కాని, నలుగురిలోనూ నుంచుని నాయిష్టం అంటే ఏలా చెల్లుతుంది?”

„ఇంత తెలివితక్కువతనంతో మనవాళ్లెట్లా బ్రతికే స్తారూ! ఎల్లకాలం, ఈధోరణిలోనే, అజ్ఞానంలో సరస సాలాడుతుండాలిసిందే.”

„ఎందుకురా, వృథాగా పోట్లాట, రాజా! నీవే నిజంగా ఈమాదిరిగా అనుకుంటూంటే మన వాళ్లందరూ నిన్ను చూచి నవ్వుతారు. నీవు బాగుపడే ఉపాయం చూ స్తా.”

౩

„విశ్వపతి గారున్నారా?”

„ఉన్నా. లోపలికి రండి ఎవరో” అంటూ లేచి కూర్చుని తువాలు కప్పుకొని, చేతిలో పుస్తకం మూసి అవ

తలపెట్టాను. తలుపులోనుకుని, మా రాజాలు మామగారు లోపలికి వచ్చారు. ఇదివరకెప్పుడూ మాకొట్లోకి రాలేదు. ఆయన; ఊళ్లో పెద్ద మనుష్యుల్లో ఒకడూ, చాలా పలుకుబడీ, పేరూ ఉన్నవాడూ. ఎందుకు వచ్చాడా, అని నాకు భయమేసింది: వెనక చాలాసార్లు మాతో తిరగవద్దని రాజాను మందలించినట్లుగా విన్నాను. కాని, మా సహవాసంవల్ల ఏంచెడ్డాడో చెప్పమని అడుగుదామనుకున్నా ఆయన మమ్మల్నిగనక ఆసంగతి అడిగితే. ఈ రాకకూడా అందుకేనేమో ననిపించింది. లేకపోతే నాతో ఆయనకేం పని?

'దయచేయండి', అని కుర్చీలోఉన్న పుస్తకాలూ, బట్టలూతీసి ఇవతలకు జరిపాను. ఆయన కూర్చొని 'నీవు కూడాకూర్చో' అన్నాడు. 'పరవాలేదులెండి' అని బల్లను ఆనుకుని ఆయనవైపు చూస్తూ నుంచున్నాను.

"మా రాజాసంగతి మీతో మాట్లాడదామని వచ్చానండీ" కొంచెంసేపు ఆగి నావంక చూశాడు. నాకు ఏమీ తోచలేదు. పెద్దవాళ్లతో పోట్లాడాలిసి వస్తుందే ఎట్లాగా అనే ఆలోచనలో పడ్డాను.

'మాకెందరికీ ఆసంగతులేమీ అర్థంకావటంలేదు. వినా. ఏదో పూర్వకాలం వాణ్ణి, నాకు మీకాలపు సంగతులంతగా తెలియవు. ఎవరితోనన్నా చెపితే నవ్వుతారేమోనని భయం. అతనికి మీకు చాల స్నేహంగనక మీరుతప్ప ఎవరివల్లా లాభంలేదని ఇక్కడికి వచ్చాను.'

'విషయమేమిటో దయచేసి చెప్పండి. రాజు నాకు తమ్ముడులాంటివాడు. అతనికోసం నాశక్తికి మీరని పనేదున్నా తప్పకుండా చేస్తాను. తమరింత శ్రమతీసుకుని రావడం ఎందుకూ! నాకు తెలియచేస్తే నేనే తమ దర్శనానికి వచ్చేవాణ్నిగా!"

'అంతా విన్నతరువాత తెలుస్తుంది నీకు, నా ఆదుర్దాకు కారణం ఏమిటో. రాజు తెలివితక్కువగా ఎప్పుడన్నా ప్రవర్తిస్తుంటాండా మీదగ్గర? మతిలేని వాడేమోనని ఎప్పుడన్నా తోచిందా?"

నాకుమాత్రం అప్పుడేమీ తోచిందికాదు.

'మీరనేదేమీ నాకు అర్థం కావటంలేదు. దురుసు పనేదన్నా చేశాడా ముందూవెనుకా ఆలోచించకుండా?'

'ఏం దురుసుపని చేసినా నాకుసంతోషమే. కాని సంగతి మాత్రం అదికాదు. అసలు ఏమిటంటే—రాజాది చాలాగౌరవం ఉన్న కుటుంబం. మాకు దగ్గరబంధువులే, సంగతి సందర్భాలన్నీ మాకు తెలుసు. పిల్లాడు తెలివిగలవాడు. అక్కర కొస్తాడు అని పిల్లనిచ్చాం. దానికి తగినట్లుగానే ఏదో బి. ఏ. దాకా చదివాడు. వ్యాకరణం అవీ కష్టించి నేర్చుకున్నాడు. మాకూ సంతోషంగానేఉంది. గాని విధివిధానం ఇలాఉంది అని అనుకోలేదు: చదువుకున్నవాడు పిల్లను సుఖపెట్టలేడా—,

మెరుపు మెరిసినట్లు, రాజు ఆరోజున మాట్లాడిన మాటలన్నీ నాకు తట్టినాయి. సంగతంతా అప్పుడు అర్థం అయింది. అయినా ఆయన నోటివెంటనే చెప్పిద్దామని—

'ఏమన్నా కష్టపెడుతున్నాడా ఏమండీ? అతనల్లాంటివాడు కాడే!

"ఏంచేసినా నాకు సంతోషమే కాదునా! అసలు విషయం ఇది. పునస్సంధానం జరిగి సంవత్సరం అయింది. కొన్నాళ్లదాకా మాకేం తెలియలేదు. సిగ్గుపడుతూన్నట్టుగా మాట్లాడే వాడట. అమ్మాయికూడా మాకేం చెప్పలేదు. కొన్నాళ్లు పోయిన తరువాత ఏవో దానికి అర్థంగాని సంగతులు చెప్పేవాడట. నాయిక అని ఇంకా ఏమేమో. వాళ్లతల్లి చూచాయగా నాతో చెపుతూ వచ్చినా తన తెలివంతా పెళ్లాందగ్గర చూపించాలని తంటాలు పడుతున్నాడు కాబోలనుకుని నవ్వి ఊరుకున్నాను. ఆమీద క్రమంగా తెలియవచ్చింది.

ఒకనాడు అతను మాయింటికి వచ్చాడు. అదివరకు వారంరోజులు అయింది ఊరువెళ్లి. నాతో కొంతసేపు మాట్లాడాడు. తరువాత స్నానానికి యింట్లోకి వెళ్ళాడు. మాఅమ్మాయి సావిట్లో కూర్చుని ఉంది. తల్లికూడా గుమ్మంలో నుంచుంది. ఈతను బయట నుంచుని 'తువ్వాలు!' అని కేక వేశాడట. అది, లేచి లోపలికి వెళ్లిపోయి, తమ్ముడుచేత పంపించింది, తల్లిఎదుట స్వయంగా తెచ్చి ఈయడానికి సిగ్గుపడి. ఆనాడు రాత్రంతా ఏడుస్తూనే ఉన్నాడట: 'నీకు నామీద ప్రేమ లేకపోవడం నాదురదృష్టం' అంటూ పెద్దపెట్టున రాగాలు మొదలుపెట్టాడట. పిల్ల భయపడి తల్లిదగ్గరకువచ్చి చెప్పిందట. అత్తగారు లేచివచ్చి 'ఏమిటోయి రాజా!' అని పిలిస్తే

ఎంపలికాడుకాదు. తరువాత ప్రతిరోజూ ఎదుటపడ తవాయిగా ఏదో పెద్ద తెక్కచ్ఛుకొడుతూ ఏడుస్తూండే వాడట. తనమీద తనభార్యకు అంత ప్రేమ లేకపోవడా నికి ఎంతపాపం చేసుకున్నాడో అని మాకేం అర్థమయిం దికాదు. అమ్మాయివల్ల లోపం ఏమన్నా ఉందేమో నని చూచాము. కాని ఏమిలేదు. చివరకి, అతని ఏడుపుకు బదగా. అమ్మాయికాపురం ఇట్లా అయిందేమో అని మేముకూడా ఏడుపు మొదలుపెట్టాము!

ఎవరితో చెపుదామన్నా మనసొప్పేదికాదు. నే దట్లాఅడగనూ, ఎందుకు ఏడుస్తావని. చివరకి అతని భార్యచేతనే అడిగించాము. ఏడుపుకు కారణం ఏమిటో ఆ తప్పేమిటో, తానెల్లా వర్తించాలో. దానికిజవాబు పు స్తకాలలో ఉన్న సంగతులు చెప్పడం మొదలు పెట్టా డట—మొగుడు రావటంతోనే భార్య పరుగెత్తుకు వెళ్లి కౌగలించుకుని లోపలికి తీసుకువెళ్లి చాలాసేపు మాట్లా డాలి. ఒక నిమిషం మొగుడు కనబడక పోతే ఎంతో తపించాలి. అతనికోసం ఎదురు చూస్తూండాలి—నాకు ఈ సంగతులు చూస్తూ, వింటూ ఉంటే నవ్వు వచ్చేది. చివరకి మతి చెడ్డదేమోనని భయంకూడా వేసింది. అయితే మాతో మాట్లాడేటప్పుడు సరిగ్గానే మాట్లాడేవాడు. అతనికి అదంతా ముచ్చటేమోనని, పోనీ అతను చెప్పిన ప్రకారం నడుచుకొనే ఏర్పాటులు చేశాను. అతనువచ్చే టప్పటికి మేమెవ్వరం కనబడే వాళ్లంకాము. భార్య అతను చెప్పిన అన్ని ఉపచారాలూ చేసేది. రాత్రి బవళ్లు దానికి తీరికే ఉండేదికాదు.

ఆమాదిరిగా కొన్ని రోజులు గడిచినాయి. ఇంత లో రాజు ఊరికి వెళ్లాడు. వస్తానన్న రోజుకు పదిరోజు లు ఆలస్యంగా వచ్చాడు. ఆనాడు మాయింట్లో పండుగ. అల్లుడుకూడా సమయానికే వచ్చాడని సంతో షించాము. ఆసందడిలో అమ్మాయి చేయవలసిన ఆదరణ మాట మరచి పోయాము. మళ్లీ యథాప్రకారం ఏడు పు మొదలు. అనురాగవతి ఐనవాయిక అయితే మొగు డు అన్నాళ్లు ఊళ్లో లేక పోతే చిక్కి శల్యంఅయి మాసిన చీరగట్టుకుని, తలవెంట్రుకలు జడగట్టి ఉంటుందని ఇం కా ఏమో చెప్పి ఏడవటం మొదలు పెట్టాడట. తను వస్తాడని ఆమాదిరిగా శుభ్రమైన చీర కట్టుకున్నానని అల స్యమైనందుకు మనసులో తపిస్తూన్నా, ఇంటికి వచ్చేట ప్పటికి ఏడుపు ముఖంతో ఎదుటబడితే, మనసు చిన్న బుచ్చుకుంటారేమోనని నవ్వుతూ వచ్చానని పెండ్లాంఎంత చెప్పినా వినలేదట. ఆమాదిరిగా కొన్ని రోజులు గడచి నాయి. పిల్లమనోవ్యాధి పెట్టుకుంది. అన్నంనీళ్లు లేకుం డా కళ్లగుంటలు పట్టిఉంది. రాజు ఈపదిరోజులు నుం చి కనబడుటమేలేదు. మొన్న పార్కులో చూచాను. గుర్తుపట్ట లేనట్టుగా మారిపోయినాడు. నన్నుచూచి ఎటో వెళ్లిపోయినాడు. ఎవరన్న డాక్టరుకి చూపిద్దామ న్నా, ఏంచేద్దామన్నా నాకేం పాలుపోవటంలేదు. మీ సలహాకోసం వచ్చాను. అతని మనస్సు తిరిగితే అమ్మాయి బ్రతుకుతుంది. అని కళ్లనీళ్లు పెట్టుకున్నాడు,

నాకు కూడా అయిన్ని చూస్తే చాల జాలివేసి ఏ డుపు వచ్చింది'.

'పరవాలేదు లెండి అతన్ని బాగుచేస్తాను. మీరే మీ దిగులు పడకండి. మీ అమ్మాయిని ధైర్యం తెచ్చుకుని కులాసాగా ఉండేగాని అతని మనసుకూడ తిరగదని చెప్పి జాగ్రత్తగా కాపాడండి. అతను బాగాఅయి, భా ర్యకోసం వస్తే ఆమె మంచంలో పడిఉంటే చూస్తే జబ్బు తిరగబెట్టుతుంది: అతను సరిగా ఆరోగ్యం సా దికాదు,

'నాయనా! నీకెంతో పుణ్యం ఉంటుంది, ఇద్ద రిని బ్రతికించినవాడ వవుతావు. రాజు కూడా ఎంతయో గ్యుడు. మాకర్మం, ఈ మాదిరిగా సంభవించడం, పిల్ల దాని అవస్థ చూడ లేక తల్లికూడా బెంగపెట్టు కుంది. నేను బయటికి ఏడవలేక లోపల కుములుతున్నాను. ఎట్టా నిర్వహిస్తావో?,

'తమరు వేరే ఏంచెప్పవలసిన అవసరంలేదు. రా జుకు సంబంధించిన పని ఏదైనా చేసే తీరుతాను; అందు లో ఈ లాటి విషయాలలో ఉపేక్ష చేస్తానా?,

'ఇక ధైర్యం వచ్చింది నాయినా! వెళ్లివొస్తాను' అని చాలా కులాసాగా ఇంటికి వెళ్లిపోయినాడు.

3

చాలా పెద్దచిక్కే వచ్చింది. రాజు ఈ మాదిరి గా మారిపోతాడని కలలోనన్న అనుకోలేదు. నేనూ, మా స్నేహితులూ కలిసి మరునాడు మధ్యాహ్నం అతను ఉండేచోటికి వెళ్లాం: మనిషి ఆనవాలు పట్టడానికి వీలు లేకుండా మారిపోయినాడు సిగరెట్టు కాల్చుకుంటూ మంచంమీద పడుకుని ఉన్నాడు.

మమ్మల్ని చూడటంతోనే ముఖం చిట్లించుకుని కొంతసేపుదాక మాట్లాడలేదు. చివరకి నేనే, 'రాజా ఏమిటిరా యీ వేషమంతా?'' అన్నాను

తమాషాగా నవ్వి, 'ఎప్పటికన్నా తేలాలిసిన వేషం ఇదే' అని కళ్లు మూసుకున్నాడు.

నేను దగ్గరకు వెళ్లి, మంచంమీద కూర్చున్నాను. "నీసంగతంతా ఇప్పుడు బాగా అర్థమయిందిరా నాకు. స్నేహితుణ్ణి కదా, నీ మనసులో ఏదన్నా ఉంటే నాతో చెప్పలేక పోయినావా? ఈ మాదిరిగా శుష్కించి, ఈ లోకంలోనుంచీ ప్రయాణమయ్యే స్థితిలోకి రావాలిసిన గతి ఏంపట్టింది? నీ కోసం నేను చేయలేని పనేముందీ'?

'నాకు కావాలిసింది లిప్స'

చివె సంతోషంగా ఉండి, కులాసాగా తిరుగుతూంటే నీవనుకునే పనులన్నీ జరుగుతాయి. నీవు చాలా పొరపాటు పడుతున్నావు. నీవనుకునేదంతా తప్పని, నే నా చెప్పిన ప్రకారంగా చేస్తూంటే నీకే తెలుస్తుంది'.

'సరే నీయిష్టం'......

సాయంకాలం మళ్లీ అక్కడికి వెళ్లాను. ఈ మారు లేచి కూర్చుని మాతో మాట్లాడాడు. రెండుమూడు రోజుల్లో మామూలు ప్రకారం మా కొట్లోకిరావడం మొదలు పెట్టాడు. మొదటికన్న మనిషి కాస్త తేటగా ఉన్నాడు కూడాను. ఐనా, భార్య ప్రస్తావన ఏమైనా తెస్తే మార్చిపోయేట్టుగా అయ్యేవాడు. మతి చెడిపొయ్యేది పాపుగా.

రాజు చిన్నప్పటినుంచి కూడా చాలా ఉద్రేకమైన భావాలున్నవాడు. దానికి తోడు అలంకార శాస్త్రం పట్టుపట్టి చదవడం చేతను ఈ అవస్థ సంభవించింది అని నిశ్చయించుకున్నాను. ఈ మాదిరి పిచ్చి డాక్టర్ల మందిచ్చి కుదర్చలేరని చెప్పారు. అందుచేత, నేనే ఏదన్న వుపాయం ఆలోచిద్దామని అనుకున్నాను.

నేను చాలా తెలివిగల వాడననే గర్వమున్నా, ఈ పని మాత్రం నాకు శక్యమయేట్టు కనిపించలేదు. మావాళ్లనందరిని కూడా అడిగిచూచాను. ఆలోచించి చెప్పమన్నాను. నన్ను గురువుగా భావించుకునే వాళ్లకు నాకన్న ఎక్కువ ఆలోచన తోస్తుంది? ఎటు తిరిగిన దగ్గరకే వచ్చింది. సరే వారిని వీరిని అడిగితే ప్రయోజనంలేదు. మనమే స్వయంగా కానిద్దామనుకున్నాను.

ఎక్కడనుంచి మొదలు పెట్టాలో తెలియలేదు. రాజుకు పిచ్చి ఎక్కిందన్నమాట వాస్తవం. అది కుదర్చడం సాధ్యమయేటట్టు కనిపించడంలేదు. పుస్తకాల్లో చదివి ఒంటపట్టించుకొన్న ఆ అలౌకిక ప్రేమ పద్ధతులన్నీ ప్రత్యక్షంగా అనుభవించాలనే ఆశ, లోకజ్ఞానం లేని వాడవటం చేత ఏర్పడ్డా. అతనికి ఆ మాదిరి ప్రేమ వున్నదని చూపిస్తేనేగాని ఆపిచ్చి కుదరదు. అందుచేత మనవాళ్లు 'పచ్చి శృంగారం' వుండటూరే ఆ నాటకాలు చూపిద్దామనుకున్నాను, కాని ప్రయోజనం లేకపోయింది. ఆ మాదిరి కృత్రిమ వర్తనలు రాజును మోసగించలేకపోయినాయి. 'మేరాదిల్ తుంహర్ రహా' అని వచ్చిరాని తురక ధోరణిలో నాయిక పాడుతూంటే అసహ్యించుకున్నాడు. తెలుగు, అరవనాయికల విరహ పద్ధతికూడా నచ్చిందికాదు.

ఇంకో కొత్తదోవ తొక్కితే బాగుంటుందని తోచింది. మాజట్టులో సుబ్బ అనే పదహారేళ్ల కుఱ్ఱవాడున్నాడు. గులాబీరేకుల చాయ పెదవులు, చక్కని కళ్లు, గుండ్రనిముఖం, నాజూకు చెవులు,—మామూలుగా చూసేటప్పుడే ఆడపిల్లలాగుండేవాడు. అతన్ని నాయికనుచేసి నాటకమాడిద్దామనుకున్నాను. ఒక చిన్న ఉత్తరంతో కథ మొదలు పెట్టాను. "మీరు వున్న మావిధిని నేను తూంతగా చూచాను. మీదర్శనం కోసం చకోరపక్షులు చంద్రుడికోసం లాగా ఎదురు చూస్తున్నాను. అన్నం నిద్ర మానేశాను. త్వరలో అనుగ్రహించి దర్శనం ఇప్పించాలి" అని అర్థంవచ్చేటట్టు, 'లలిత' అని సంతకం చేయించి అతనికి పోస్టులో పంపించాను. నేను అనుకున్నట్లుగానే, ఆ ఉత్తరం నాదగ్గరకే తీసుకువచ్చి సలహా అడిగాడు. అతన్ని నిజంగా ఎవరో అమ్మాయి వలచిందనే నమ్మకం కలగ జేశాను, కాని అప్పుడేవెళ్లవద్దని చెప్పాను. మరునాడు, పూలచెండులో పెట్టి ఒక ఉత్తరం, ఇంకా తమాషా సంగతులున్నది, ఒక చిన్న పిల్లవాడు రాజు చేతికిచ్చి పరిగెత్తాడు. ఆనాడు కూడా రాజును వెళ్లనియ్యలేదు.

ఈమాదిరిగా నాలుగయిదు రోజులు గడిచినాయి. రాజు వెనుకటి జబ్బంతా మాయమైంది. ఏమన్నా ఆలోచించడానికన్నా అతనికి అవకాశం ఈయకుండా ఎప్పుడూ ఎవరో ఒకరు దగ్గిర మాట్లాడుతూండేవాళ్లం అందుచేత యింటిధోరణి మరిచి పోయినాడు.

చివరకి ఒకనాడు లలితతో సమావేశం సంఘటించాం. కను చీకటిలో, పొదల్లో ఒక మూల తన కోసం ఇన్నాళ్లనుంచి కలవరిస్తున్న ఆపిల్లను రాజు కౌగిటిలో అనుకున్నాడు. లలితకూడా ఏమేమో చాలా మాటలు చెప్పిందట: ఇంతలో వాళ్లసంతోషానికి భంగం కలిగింది. ఎవరో అటుకు వస్తూన్నట్టు అలికిడిఅయింది. మర్నాడు కలుసుకుంటానని, ఆపిల్ల చెట్లచాటున మాయమయింది.

ఈ మాదిరిగా రెండు మూడుమాట్లు 'లలిత' ను పార్కులో కలుసుకున్నాడు. కాని ఎప్పుడూ ఎవరో ఒకరు రావడం, వాళ్ల ఏకాంతానికి భంగం కలిగించటమూ ఉండేది. నాలుగయిదు నిమిషలన్నా మాట్లాడటానికి వీలుండేది కాదు.

రాజు చాలా కులాసాగా సంతోషంగా ఉన్నాడు. మళ్లీ వెనకటి మనిషి అయినాడు. కొద్ది రోజుల్లో సంపూర్ణంగా కుదిర్చి యింటికి పంపుతానని వాళ్ల మామగారికి ధైర్యం చెప్పాను, కాని ఇకముందు ఏం చేయాలో నాకే తోచింది కాదు. రాజు భార్య మాత్రం ఈ సంగతి విని ఉత్సాహంతో ఉందని వింటూండే వాణ్ని.

ఒకనాడు సాయంకాలము షికారు వెళ్లివస్తూన్నాం అందరం. దోవలో ఒకరి యింట్లో పెళ్లి అవుతూంది. ముత్తైదువలందరూ చక్కగా అలంకరించుకుని బయట నుంచున్నారు పల్లకీతో బయలు దేరడానికి. మేము మా దోవన తలవంచుకు వచ్చేస్తూన్నాం. ఇంతలో వెనకనుంచి ఎవరో 'అడుగోనమ్మా రాజు' అన్నారు. రాజు వెనక్కి తిరిగి చూచాడు. అంతే, అదేం చూచాడో తెలియదు, వెనకటి జబ్బంతా ఒక్కమారి అవేశించింది. ముఖంలో కళంతా తగ్గి, క్రిందపడి పోయేవాడిలాగా తూలాడు. నేను అతన్ని క్రింద పడకుండా చేతుల్తో పట్టుకుని, ఏమిటా కారణం అని ముత్తయిదువుల వైపు చూచాను. పాపం, ఆ అభాగ్యురాలు, రాజు భార్య, అందరిలాగా అలంకరించుకుని పెళ్లివారిలో నుంచుని ఉన్నది.

౪

నేను పడ్డ శ్రమంతా చివరకి వ్యర్థం అయింది. రాజు మళ్లీ మామూలు స్థితిలోకే వచ్చాడు. మేం ఎన్నో రకాల చెప్పి చూచినా ఏమీలాభం లేకపోయింది. రోజు రోజుకు అతను క్షీణ దశకు వస్తున్నాడు. మందులేమన్నా పనిచేస్తాయేమోనని పెద్ద డాక్టర్లందరికీ చూపించాము. వాళ్లే ఏం జవాబు చెప్పేవాళ్లు కాదు. బ్రతకడం కష్టం అని అనుకున్నాం.

ఈ సంగతులన్ని ఊళ్లో ఎవరికీ తెలియకుండా చూశాం. వింటే ఎవరన్నా నవ్వుతారేనని, వాళ్ల మామగారు యీ విషయంలో చాలా పట్టు పట్టారు. దగ్గర బంధువులకి కూడా ఈ సంగతి తెలియనే తెలియదు. భార్యతో యీ విషయం చెప్పాం, వారు కూడా నమ్ముద్రదాల్చారు.

ఎన్ని విధాలో ప్రయత్నించాడు, కూతురికి ఈ పరివర్తనమంతా తెలియకుండా ఉండాలని, కాని ఎట్లా తెలియకుండా ఉంటుంది? ఒంటరిగా ఉన్నాననుకుని తల్లి ఎప్పుడన్నా కళ్ల నీళ్లు పెట్టుకుంటూ విచారిస్తూంటే చూచి ఉండవచ్చును. తెలివిగలపిల్ల తరువాత సంగతులు ఊహించుకోలేదూ? ఆ అమ్మాయి కూడా యథాప్రకారం మంచంబట్టింది.

కలలో ఏవన్నా సంగతుల్ని చూచి ఆశ్చర్య పడతాం ఒక్కొక్కప్పుడు, ఇవి జరగడానికి వీలుంటుందా అని. కాని ప్రత్యక్షంగా చూచే సంగతులు మరి విచిత్రాలుగా ఉంటాయి. రాజు సంగతి అలాటిదే. శుభ్రమైన పిల్లవాడు ఆమాదిరిగా చెడిపోవడం, అతని కోసం, ఆ పిల్లకూడా. అటా అవస్థ పడుతూండటం తలచుకుంటే, కలా నిజమా అని అనుకునే వాణ్ని కొన్ని సమయాల్లో. ఎదురుగుండా కనబడు తూంటే ఎట్లా లేదను కోనూ?

రాజు సంగతి చూస్తే మరీ భయంవేస్తూంది. మంచానికి అంటుకు పోయినాడు. ఎన్నాళ్లో బ్రతికేట్టు కనబడలేదు. అతని భార్యస్థితి కూడా ఆమాదిరిగానే ఉన్నట్లు తెలుస్తూంది. చేతికి మించిపోయింది, ఇక లాభం లేదు అనుకున్నాను. ఆశ వదులుకున్న తరువాత గరళం పోసినట్టు ఆఖరి ఎత్తు సిద్ధం చేశాను.

'రాజా నీ భార్య నీ స్థితిచూచి బెంగపెట్టుకొని చాలా జబ్బు స్థితిలో ఉంది రా, బ్రతకదని కూడా తోస్తుంది. నీవుకూడా చాలా సుస్తీగా ఉన్నావు. ఇకనన్నా యింటికి వెళ్లి చూడవూ' అన్నాను.

నా మాటలకు ఎంతో అసహ్యించు కున్నావాడిలాగా 'నాదగ్గర ఆ మాటలు తేవద్దురా. నన్ను శ్రమతే కూడా చచ్చిపోనియ్యి. ఎవరికోసం వాణ్ణి ఎంతకూ ఊరికే బ్రతకడం?'

'ఈ చావస్తం ఎక్కడనుంచి వచ్చిందిరా? పోనీ నిన్ను చూడడానికన్నా మీవాళ్లు రావచ్చునా?'

'నేనొక్కటే చెప్తున్నాను. నన్ను ఈ స్థితిలో బయటికి గెంటేయాలని కోరిక ఉంటే, నీ యిష్టం వచ్చిన పనిచేయి' అన్నాడు. ఎంతో ప్రయత్నం మీద ఏడుపు అపుకుని ఇవతలకు వచ్చాను.

సగం చెడిపోయింది. మిగతాది కూడా ప్రయోగానికి దేనికి?

తిన్నగా రాజా అత్తవారి యింటికి వెళ్లాను. దంపతులిద్దరూ కూతురి దగ్గర కూర్చుని ఉన్నారు:

'రాజా వొంట్లో ఏమీ బాగా లేదండీ. మీరందరూ ఒకమారు రావాలి', అన్నాను.

వెంటనే బయలు దేరుతా మన్నారు. కాని మధ్యాహ్నము రమ్మని చెప్పి తిరిగి వచ్చేశాను.

'రాజా! నీకో చిత్రం చూపిస్తానురా: నేను చెప్పే మాటల్ని నమ్మితే ఎంత బాగుండేదో నీకు అప్పుడు తెలుస్తుంది! 'సరే' అన్నాడు.

రాజా, అత్తమామలూ, భార్య, వచ్చేవేళకు, రాజాను పక్క గదిలో కూర్చో బెట్టాను. ముందు గదిలో మనిషి పడుకున్నట్లు గుడ్డలతో అమర్చి పైన దుప్పటి కప్పాను. రాజా కూర్చున్న గదిగుమ్మానికి తెర అడ్డం ఉన్నది అతను ఇదంతా చూడటం లేదు. మా సుబ్బాను అక్కడ వుండుమని చెప్పి బయటకు వెళ్లిపోయినాను.

సరియైన వేళకే వాళ్లు వచ్చారు. నేను చాలా ధైర్యమున్ని అనుకునేవాణ్ని. ఆనాడు మాత్రం తగని భయమేసింది. అనుకున్నట్టుగా నా వంతు నిర్వహించ లేక పోయినాను. మా స్నేహితుల్లో ఒకణ్ణి బయట వుండమని చెప్పి నేనుకూడా రాజా కూర్చున్న గదిలో చేరాను.

వాళ్లందరూ బండిదిగి వచ్చి, గుమ్మంలో నుంచున్న మావాడిని 'ఎలావున్నాడు?' అని అడిగారట. వాడు కళ్లనీళ్లు పెట్టుకొనే వాడిలాగా ముఖం వెనక్కి తిప్పి లోపలికి నడిచాడు. అతని వెంట వాళ్లందరూకూడా వచ్చారు.

'అయ్యో! అని కేకవేసి, పరుగున వచ్చి, మేము మనిషిలాగా అమర్చిన ఆగుడ్డలమీద పడ్డది ఆ అమ్మాయి. ఆ ఆర్తనాదం, దిక్కులంతా మారు మోగినట్లు, ప్రక్కంతా ఒకమారుగుండె పగిలేటట్టుగా 'అయ్యో' అని అరిచినట్లు అనిపించింది నాకు: చేష్టలన్నీ ఉడిగి ఎంతసేపట్లా నిలుచున్నానో తెలియదు.

తెలివి తెచ్చుకుని అటూయిటూ చూచాను. గుమ్మానికి ఉన్న తెర ఊడి క్రిందపడిఉంది. ఆవతల గదిలో, రాజా, భార్యను కౌగిలించుకొని ఏడుస్తున్నాడు. ముసలి దంపతులు వాళ్లిద్దరికన్నా ఎక్కువగా కళ్లవెంట నీరు కారుస్తున్నారు. ఆనంద బాష్పాలని తరువాత తెలిసింది.

కొంత సేపటికి, రాజుభార్య కౌగిలి లోంచి తప్పించుకుని అతని చేయి పట్టుకుని మెల్లిగా బయటికి నడిచింది. తల్లిదండ్రులిద్దరూ మాట్లాడకుండా దూరంగా వెనకనే వెళ్లారు. దూరాన బండిలో రాజా నవ్వుమొగం చూచాయగా కనపడ్డది.

* * * *

నెల రోజుల తరువాత ఒకనాడు కాఫీతాగి వస్తూండగా రాజా ప్రత్యక్ష మైనాడు,

దగ్గరకు వచ్చి బుజంమీద చేయివేసి 'విశ్వపతీ! నీవు నాకు తీరని ఉపకారం చేశావు. ఇన్నాళ్లనుంచీ సిగ్గుచేత నీకు కనబడ లేను. నీరుణం ఏలా తీర్చుకోను?'

'వెనకటి వన్నీ కదిలించ కుండా, నీవు కష్టపడి ఇంకొకరిని కష్టపెట్టకుండా ఉంటే నీకూ నాకూ బాధ లేదన్న మాటే' అన్నాను,

'ఆ వన్ని మంటలన్నీ ఆరిగి పోకముందే తిరగ తెచ్చుకుంటా' అని నవ్వాడు మావాడు:

ముసలాయనా ఎప్పుడు చూచినా నవ్వుతూనే కనబడుతాడు. తాతయ్యనవుతానని సంతోషమే కాబోలు అదంతా!

# వరంగల్లు శాసనములు

ఆంధ్ర పరిశోధక సంఘము, హైద్రాబాదు

## ౯

మట్టెవాడలో ఎల్లమ్మ బజారునకు బోవు త్రోవ లో కట్టికె రామన్న దొడ్డిలోనున్న శాసనము, అడుగు భాగము పగిలిపోయినది. ఉత్తరపు దిక్కు వ్రాయలేదు ఈ ధర్మము దెలుపు ఆలయముగాని చిహ్నములుగాని కానరాని దొడ్డిలో ఏ శాసనము ఎంత కాలమునుండి యున్నదో స్థానికులకే తెలియదు.

### తూర్పువైపు

౧ స్వస్తి సమధిగత పంచమహా
౨ శబ్ద మహా మండలేశ్వర పర
౩ మహేశ్వర అన్మకొండ పుర
౪ వరాధీశ పరనారీ సహోద
౫ ర అదివోడ కటకచూఱ
౬ కారమన్నియ చండకార విభవ
౭ దేవేంద్ర సత్య హరిశ్చంద్ర శ్రీ
౮ స్వయంభూదేవర దివ్యశ్రీ
౯ పాదపద్మారాధక పరబల
౧౦ ప్రతాపాశ్రిత వితరణక
౧౧ ణాతాప్రత పోషక శరగి శా
౧౨ య్యామంబర పరబలసా
౧౩ ధక ఉపమన్యు ప్రముఖ చక్రవనాసం
౧౪ కరణ వైరిసంహారణ చతుస్సము
౧౫ ద్రముద్రాధిక అర్జిత కీర్తిసప్తమ
౧౬ `క్రవర్తి అదిరాజచారు చరిత్రి
౧౭ రాజేశ్వర + + + స్థిరత నిజ రాజా
౧౮ న్య (ము) నామాది స్వస్తి సమస్త ప్రశస్తి స
౧౯ హితం శ్రీమన్మహా మండల
౨౦ కాకతి గణపతిదేవమహారా
౨౧ జులు సుఖసంకథా వినోదం
౨౨ బున పృథ్వీరాజ్యంబు సేయగా

### పడమర

౧ శ్రీమతు చిరమట్టలోను
౨ నకరమునకరేసు
౩ దేవరకు అర్చన
౪ వ్రితిలన ఇడినిచిన
౫ ను దీనికి శివ వక్రము
౬ కరుకు కీడును + పమలి
౭ డము. దీనికి విగినము వ
౮ లికిన ఎరికి నరకాము

### దక్షిణము

౧ శ్రీమతు ఓరుకంటి
౨ స్వయంభు దేవరకు వి
౩ శాలపెద చలువు వ్రి
౪ తి అదవితుకడి పె
౫ ద్దచెలువున వ్రితి

### సూచన

వ్రాత తప్పులు తుప్పగా నున్నవి. వర్ణములు స్పష్టముగా లేవు. వ్రాతలోపములు మిక్కుటముగా నున్నవి. ఇందు దానకర్త నామము గానరాదు. అ భాగము బహుశః పగిలిపోయి యుండనోపు. ఇందలి బిరుదములే గణపతి దేవుని ౨౨వ శాసనములోని బిరుదములు. (సుజాత సంచిక ౬) శింకికి గొ.చమే మాస్య గలవు. గణపతి దేవుడు ఓరుగల్లులో రాజ్యమేలుచుండియు రాజధాని అన్మకొండయని చెప్పాలెను.

## ౧౫

హనుకొండ ఒరంగల్ మధ్యనున్న భద్రికుడి మంచె పస్తంభములపై వ్రాయబడిన శాసనము. పై ౧౭ శాసనపస్తంభముల పై వ్రాయబడిన శాసనము. ఏ శాసనమునకుగూడ ములోని విశేషాంశములన్నియు ఏ శాసనమునకుగూడ సాబంధించియున్నవి.

### ఒకటవ శాసనము.

౧ భూళరవిత్తన ఎఱ్ఱాధిపతి పం
౨ చాశ్చవీ వమను : ముక్తి
౩ ం నమశ్శివాయ తవారీప్తసుతం
౪ చాశ్చరోమను॥

### రెండవ శాసనము

౧ మహేశ్వరు సంధత్తే
౨ మార్గశిరౌ కనకాచలే । మ
౩ ంత్రివిత్తన ఎఱ్ఱమూ
౪ గ్గణౌ : మహీతలే॥

### మూఁడవ శాసనము

౧ దాతారోహితతంత్ర
౨ త్యాద్వాపరే మిత్రమూ
౩ తఁయః । భూతిశేశ్చ
౪ రథ+రం+విత్తనఎఱ్ఱ

### సూచన

భద్రి అనఁబడుశక్తి కాళియను దేవత కాన్పు. ఈ శక్తివిగ్రహము పురుషప్రమాణము నతిశయించి మిక్కిలి భయంకరముగా నున్నది. కటకు రాతిమంటప స్తంభములపై ప్రకృతి శాసనములు చెక్కఁబడి యున్నవి. ఎఱ్ఱన దైవభక్తి పరుడనియు, త్యాగశీలుఁడనియు జప తపః పరాయణుఁడని మాత్రము శాసనము వలన గ్రహింప వీలు కలదు. ౧౪ నెంబరు వానమకొండ శాసనము చూడుఁడు.

౧౪

ఈ శాసనము వానమద్గిరి నాథుని యాలయము లోని మండపస్తంభములపై చెక్కఁబడియున్నది. శిల అంత ప్రశస్తమైనది కావు. దాదాపు ఇందలియంశముల తోనే యిచటికి సమీపమునను న్న భద్రిదేవాలయమందుఁ గూడ శాసనములు చెక్కఁబడి యున్నవి. శాసనలిపి పదు నేనవ శతాబ్దమునకు పైదిగా జాలదు.

### ఒకటవ స్తంభముపైన

౧ దుర్వ్యవిత్తన పుత్రస్య ఎఱ్ఱయా (మా)
౨ త్యశిర దయారు ముఖ్య
౩ లుస్తంభ స్సూతి నృపశిరితి

### రెండవ స్తంభముపైన

౧ నృశింహవ్యయనమః++సహ
౨ ంవిష్ణుమయం జగత్ । మంత్రి
౩ విత్తన ఎఱ్ఱ సర్వాంగం కేశవసం
౪ జయం॥

### మూఁడవ స్తంభముపైన

౧ మంత్రి మిాసరగం
౨ దేవ వితలా మాత్యానూ
౩ సునా ఎఱ్ఱయనస
౪ మోదాతా నభూ
౫ తో నభవిష్యతి।

### సూచన

ఎఱ్ఱయ్యనియోగిబ్రాహ్మణుఁడు. లిపిపదునేనవశతా బ్దపుది. గావున నాకాలమున నీ యెఱ్ఱన ప్రసిద్ధుఁడై యుం డును. హరి భట్టువలన వరాహ పురాణము అంకితముగాఁ గొన్న కంబము మెట్టు నివాసియగు కొలిపాక యెఱ్ఱయా మాత్యుఁడే యీతఁడేమో యోచింపవలసి యున్నది చ క్యుఁంశమనుటలో భావము బోధ కాకున్నది. భద్రి దేవా లయములోని యెఱ్ఱయ శాసనము ౧౫ గురున హనుమ కొండ శాసనము అను పేర పైన వ్రాసియున్నాము. చరి త్రి దృష్టితో రెంటిని సమన్వయింప వలసి యున్నది. లిపియందు రెంటికి మాత్రము వ్యత్యాసము లేక ఒక కా లమునందె చెక్కఁబడి నటులున్నవి. వ్రాతస్పష్టముగా లేదు.

౧౫

ఒరంగల్ చెంతనున్న ఓరుగల్లు కోటలోని తూర్పు ద్వారముయొక్క ద్వారశాఖపై వ్రాయఁబడియున్న శా సనము.

౧ ప్రమాది సంవత్సరమా
౨ ఘ శు ౧౨ వ । గజపతిక
౩ పిలేంద్రమహారాయ
౪ ల కుమారుండు రా
౫ చ్చదేవ కుమారమహా
౬ పాత్రుండు వాయంగ్య+
౭ కోటగొానెను.

### సూచన

శాలివాహన శకము ౧౪౬౧ ప్రాంతమున కపిలేం ద్ర గజపతి కుమారులు మహమ్మదీయులనుండి ఓరుగల్లు కోట గ్రహించినటులఁ జరిత్రములందు గలదు. ఒక గ్రం థమున ఉర్వర దేవకుమార మహాపాత్రుఁడు పరశురామ తనయుఁడు వీరభద్రరాజు కలసి ఒరంగల్లు గ్రహించినటు లఁ గలదు. రాచ్చిదేవకుమార మహాపాత్రునే పొరపా టున ఉర్వరదేవ మహాపాత్రునిగ వ్యవహరించి యుండు రు ఈ పాత్రుఁడు ఓఢ్రదేశమునుండి వచ్చి ఓరుగల్లుతో టను మహమ్మదీయులనుండి తొలంగించెను.

# సంపాదకీయములు

## నిజామురాష్ట్రము: రాజ్యాంగ సంస్కరణములు

మన రాజ్యాంగ సంస్కరణముల సమస్య మరల ప్రభుత్వసభ [బాబె హుకూమత్] యెదుటకు వచ్చినట్లు బొంబాయినుండి వెలువడు పత్రికల వలన దెలియుచున్నది. మొట్టమొదట మహాఘనతవహించిన మన ప్రభువుగారు ౧౩౩౦ ఫసిలి లో ఫర్మానుద్వార సంస్కరణములు చేయు వాగ్దాన మొనర్చుచు, ప్రభుత్వ సభవారిని ఈవిషయమున వివరముల సిద్ధము చేయించుటకై కోరియుండిరి. సుమారు ఒక సంవత్సరము వరకు కీ. శే. రాయ్ బాలముకుందుగారు ప్రత్యేకాధికారిగా నియోజితులై పరిశ్రమచేసి కావలసిన వివరము లన్నియు సంపాదించి రెండు సంపుటములను సిద్ధపఱచిరి. అప్పుడు ప్రభుత్వసభాధ్యక్షులు [సదరె ఆజమ్] గా నుండిన సర్ అలీఇమాముగారు తమ నివేదికను సిద్ధపఱచి. శ్రీ నిజాము ప్రభువుగారి సాన్నిధ్యమున కంపియుండిరని మాకు రూఢిగ దెలియును. కాని రెండుసంవత్సరములవరకు ఏమియు జరిగినట్లు కానరాదు. తరువాత మన ప్రభువుగారు ముగ్గురు మంత్రులను, దివానుబహాద్దరు కృష్ణమాచార్యులుగారును, గల యొక ఉపసంఘము నేర్పఱచి వారినుండి నెలదినముల గడువులో నొక నివేదికను తెప్పించుకొనిరని చదివియుంటిమి. తరువాత మరల రెండు వత్సరములు గడచిపోయినవి. కొన్ని మాసములక్రింద మహారాజా సర్ కృష్ణప్రసాద బహద్దుర్ యమీనుస్సల్తనత్ గారు ప్రభుత్వ సభాధ్యక్షులుగా మన ప్రభువుగారిచే నియోగింపబడిన తరువాత మొట్టమొకటి శాసననిర్మాణ సభా సమావేశమున, దేశభక్తులగు మౌల్వీ మహమ్మదు అస్గర్ బారిస్టరుగారు అనధికార సభాసదుల పక్షమున రాజ్యాంగసంస్కరణములను గూర్చి అధ్యక్షునకు విన్నపము సల్పియుండిరి. అందుపైన ఈవిషయమును సానుభూతితో నాలోచింతుమని అధ్యక్షులు అభయ మొసంగియుండిరి. తరువాత ఒకే మాసముక్రిందట, నవాబు అమీనుజంగు బహద్దరుగారు న్యాయశాఖ మంత్రిగా నేర్పడిన పిమ్మట, ఏండ్లకాలది ఆలోచనలో బడియున్న నీ సమస్యను బయటికి లేవనెత్తిరట. ఈమారైనను మన ప్రభుత్వమువారు ముఖ్యాతిముఖ్యమగు నీసంస్కరణముల సమస్యను పరిష్కరించి దేశీయులందు పరిపాలనా యోగ్యతను, దేశసేవాసక్తిని, స్వాతంత్ర్యానురక్తిని పెంపొందింప జేసెదరు గాక!

చిన్నచిన్న దేశీయ రాజ్యములందు సైతము రాజ్యాంగ సంస్కారములు ప్రజాప్రాతినిధ్య పద్ధతి పైన ప్రవేశపెట్టబడి జయప్రదముగా జరుగుచుండుటను ప్రతిదినము చూచుచున్న నిజాంరాష్ట్రవాసులు, దేశీయరాజ్యములలో నాయకమణి యనదగినట్టియు, ఏడుకోట్ల రూపాయల వార్షికాదాయమును, కోటి యిరువదినాలుగు లక్షల జనసంఖ్యయుగల తమ

దేశమున శాసనసభ మాట యటుండ తుదకు
పురపాలకసంఘము (మజ్లిసె నఫాయి) నందు
గాని, జిల్లా, తాలూకా, లోకల్బోర్డు సంఘము
లయందు గాని, నేటివరకు ప్రజాప్రాతినిధ్య పద్ధ
తి లేకపోవుటను గాంచి ఇతర సంస్థానముల ప్రజ
ల యెదుట, సిగ్గుతో తల వంచుకొనుచున్నా
రు. ఇట్టిస్థితి క్రమక్రమముగా దుస్సహమగు ద
శకు వచ్చునని మాకనుమానము కలదు.
కావున ప్రభుత్వమువారును, మహామేధా
సంపన్నులగు నిజాంప్రభువుగారును తమ ప్ర
జలయందు కలుగుచున్న నిరుత్సాహ భావ
మును త్వరలో తొలగింతురని విశ్వసించు చు
న్నాము.

ఎరంగల్లు నగరము : కళాశాల (కాలేజి)

వరంగల్లులోని హైస్కూలునందు రెండవతర
గతి కళాశాల తరగతులను, ఉస్మానియా విశ్వ
విద్యాలయమువారు గత మాసమునుండి ఏర్ప
రచిరను వార్త నిజాంరాష్ట్రములోని యాంధ్రు
లకెల్ల సంతోషదాయకముగా నుండగలదు.
ఈయుత్కృష్ట కార్యమునకుగాను నిజాంప్రభు
త్వ విద్యాశాఖవారు ఎంతయు ప్రశంసార్హులు.

అయినను, కళాశాల తరగతులలో సం
స్కృతాంధ్రములు బోధించు నేర్పాటులు ఇం
కను జరుగలేదని పత్రికాముఖమున తెలియుచు
న్నది. ఈభాషలు „ఆంధ్రనగరము" నందు స్థా
పితమైన కళాశాలయందు ఉండవలయునా వ
లదాయ ప్రశ్నకు తావేలేదు. ముఖ్యములగు
నీభాషల నిచ్చట నేర్పరచనిచో గొప్ప లోప
మనియు, ఈవిషయమున ఆంధ్రదేశమునందు
తప్పక ఆక్షేపము వెలువడుననియు మాతలంపు.

ఉస్మానియా విశ్వవిద్యాలయమున బోధనా
సాధనము (జర్యేతాలీం) ఉర్దూ యనియు, తెను
గు, సంస్కృతము నేర్పవలసిన అవసరము లే
దనియు, ఇట్టికోరిక ద్వేషభావము ప్రదర్శిం
చునదనియు, హైదరాబాదులోని దినపత్రిక
యగు „రహబరె దక్కను" ౩౦ మెహరు
౧౩౩౯ ఫసలి నాడు వ్రాసినది. ఇది యాప
త్రికయొక్క అవ్యక్తతకు నిదర్శనముగ ను
న్నది. మహా ఘనతవహించిన మన ప్రభువు
గారు ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు
ఉర్దూభాష బోధనా సాధనముగ నిర్ణయించి
యు, అధికభాషగా „సంస్కృతము" „తెను
గు" „మహారాష్ట్రము" „కన్నడము" ము
న్నగువానిని నేర్పు నేర్పాటులు విశ్వవిద్యా
లయకళాశాలయందును, ఇతర సంస్థలందు
ను చేసియున్నారు. అట్టిచో „ఆంధ్రనగరము"
నందే ఆంధ్రభాషను బోధింప నవసరము లే
దను తర్కము „రహబరెదక్కను" కు గౌరవ
ము గలిగించజాలదు. కొంతకాలము గడ
చిన తరువాత, దేశ భాషాభిమానులగు ప్రభు
త్వమువారు „ఆంధ్రనగరములో" ని కళాశాల
యందు ఉన్నత విజ్ఞానమును ఆంధ్రభాషామూ
లముననే వ్యాపింపజేయు విధానము నవలం
బింతురేమో? ఆసంగతి యెట్లున్నను ప్రస్తు
తము హైదరాబాదులోని కళాశాలల వలెనే
ఆంధ్రనగర కళాశాలయందును సంస్కృతాం
ధ్రములుకూడ బోధించు నేర్పాటులు చేయు
ట అత్యంతావసరమని సూచించుచున్నాము.

Edited and Published by P. N. Sarma, B. A., LL.B., Troop Bazar, Hyd, Dn.
Printed by S. Pratapa Reddy, B.A., B.L., at the Golakonda Press, Hyderabad.

## విషయసూచిక

# క్షాత్రి కాలపు హిందూర్యులు

రామాయణ భారతముల కాలమున మన వారు ఎట్టి వేషములు వేసికొనుచుండిరి? ఏమి భు జించుచుండిరి? ఈ సంగతులన్నియు ఈగ్రంథ మున ప్రమాణములతో, శ్రీయుత మాడపాటి హనుమంతరావుగారి వలన మృదుమధురముగ వ్రాయబడియున్నవి. వెల టపాఖర్చులు కాక హాలీ [౧_౨] అణాలు.

చేపూరు లక్ష్మారావు

"ఆంధ్రకుటీరము." రెసిడెన్సిబజారు

హైద్రాబాదు [దక్కన్]

# శమీపూజ

"కృష్ణవేణీ హరితసస్య పృథివియందు
గౌతమీ పుణ్య కల్యాణ కంఠసీమ
తుంగభద్రా శుభోపాంత గంగములను
అందికొనుము, శమీలక్ష్మి! ఆంధ్రపూజ.

* * *

ఆలపాదుగుల ప్రాణపయస్సుగురిసియు,
శాలిభూముల ధాన్యమంజరులు మెరయు,
జాతిపూవుల స్వచ్ఛంద సారమొలుక,
పరుపుమీ యాంధ్ర జగతి సువర్ణవృష్టి!"

జడకుచ్చులు.

# దసరా

కాలప్రవాహమునందెన్నియో సంవత్సరములు మునిగినవి; ఎన్నియో మునుగనున్నవి. ప్రతిసంవత్సరమందును దసరా దినములు హిందూజనమానసముల నలరించుచున్నవి.

* * *

ఈ పండుగ సమయములందు హిందువులు నూతనవస్త్రములను ధరించెదరు. మధురతమపక్వాన్నముల భుజించెదరు. ఈ పండుగదిన మంతరార్థ మింతయేనా?

* * *

దేవి నవరాత్రములను పేరుతోఁ గొందరు పూజలు సల్పెదరు. అవును. ఇవి శక్తిపూజాదినములే. కాని శాక్తేయుల మనుకొనువారు చేయు పూజా విధానము ఈపండుగ ఉద్దేశమునకు భిన్నముగాదా?

* * *

"శక్తి" శబ్దము సంస్కృత వ్యాకరణము ననుసరించి స్త్రీలింగవాచక మగుటచేఁ గాఁబోలు, ముక్కు, మొగము, కాళ్ళు, చేతులు మొదలగు నవయవములచే నొప్పారెడు స్త్రీ విగ్రహమును బూజించుటతో శాక్తేయులు తృప్తి జెందుచున్నారు. ఆహా! శక్తిపూజయనఁగా నదియేనా విధము?

* * *

శక్తిపూజ యనఁగా మానవునియం దంతర్భూతమైన శక్తిని గౌరవించుట. విద్వాంసుఁడు విద్యాశక్తినిఁ బ్రకటింపవలయును. వీరుఁడు బాహుశక్తినిఁ బ్రకటింపవలయును. కార్మికుఁడు కళాశక్తినిఁ బ్రకటింపవలయును. దేశసౌభాగ్యమున కాకరములైన యిట్టి శక్తులను గౌరవించుటయే శక్తిపూజ. మరియొండు గాదు.

* * *

ఇంక నీపండుగ చరిత్ర యేమి తెలుపును? కార్యసాధనకొరకుఁ గష్టముల ననుభవింపవలయునని పాండవాజ్ఞాతవాసము దెలుపుచున్నది. గోసంత్రాణము ప్రధానకార్యమని విజయుని దేవదత్తము ఘోషించుచున్నది. దుష్టశిక్షణము విధికృత్యమని రావణ నిధనము శాసించుచున్నది. ఎట్టి సమయమందును నీతిని విడువగూడదని విజయునిశీలము బోధించుచున్నది.

* * *

మఱియు, కౌరవుల బలమునందలి పరస్పర ద్వేషములచే కౌరవులు పరాభూతులయిరి. విభీషణుని మూలమున రావణుఁడు నశించెను. దీనిభావమేమి?

* * *

జాతీయోత్సాహప్రదములగు నీ పవిత్రదినములం దాంధ్రులు తమ సర్వశక్తులను బ్రదర్శించెదరుగాక! ఆంధ్రుల విద్యామహిమ, ఆంధ్రుల ప్రతాపగుణము, ఆంధ్రుల కళావైదుష్యము అఖండ తేజస్సుతో వెలుంగుగాక! ఆంధ్రులు కార్యశూరులై, ఐకమత్య గుణసంపన్నులై బలపడెదరుగాక! ఆంధ్రులు తమ భాషను, దేశమును వికాసవంతము గావించుటకు ఈ పండుగదినములు దివ్యదినములై పరిణమించును గాక!

హైదరాబాదు అక్టోబరు ౧౯౨౭

సంపుటము ౧ ప్రభవ సంవత్సర ఆశ్వీయుజము సంఖ్య ౧౦

# అల్లసాని పెద్దనార్యుని గూర్చి కొన్ని విశేషములు

కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి

ఆంధ్ర కవితా పితామహుండగు నల్లసాని పెద్దనార్యుని యొక్క చరిత్రమును గూర్చి పండిత శిరోమణులగు శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులు గారొక యుత్తమ వ్యాసమును వ్రాసి పత్రికా తల్లజమగు ఈ "సుజాత" లోని ౯వ సంఖ్య గల సంచికలోఁ బ్రచురించియున్నారు. ఈ వ్యాస రాజము ప్రశస్తమయి విరాజిల్లుచున్నది. కాని వాఙ్మయ పరిశోధన మంతగా లేని కాలమున బయలువెడలిన 'కవుల చరిత్రము'నందు నవిచార పూర్వకముగా వ్రాయఁబడియున్న యంశముల నాధారముగఁ దీనికొన్నిటిని రమణాచార్యుల వారు తమ వ్యాసమును వ్రాసియుండుటచే నూతనముగఁ దేలిన కొన్ని విశేషము లందు సరిగఁ దెలుపఁబడి యుండలేదు. కానఁ బెద్దనార్యుని సత్య చరిత్రములోఁ గొన్ని యసత్యాంశములును, గొన్ని లోపములును గాన్పించినవి. 'సత్యచరిత్రము లోకమునకు బోధపడునట్లు చేయుటకై నాకు విశేషములుగాఁ దోచిన యంశముల నిందు గ్రిందఁ బొందుపఱచుచున్నాను. చదువరులు పరిశీలించి చూచుకొందురుగాక!

## పెద్దనార్యుని కులము

ఈ విషయమై రమణాచార్యులవారి క్రిందిరీతిని లిఖించిరి. "అల్లసాని పెద్దనార్యుఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు."

ఇది కవులచరిత్రము నందలి వ్రాఁత ననుసరించి యున్నది. అప్పటికి లభించియున్న యాధారముల ననుసరించి కవుల చరిత్రకారు లట్లు వ్రాసిరి. కాని యిటీవలి వాఙ్మయ పరిశోధనము పెద్దనార్యుని కుల విషయమునఁ గొన్ని విశేషముల దేల్చుచున్నది. పెద్దనార్యుని 'మను చరిత్రము'నందే యాతఁడు నందవరీకుఁడని తెలుపఁబడి

యున్నది. కాన నితఁడు నందవరీకుఁడనునది సరిగనే యున్నది. కాని నియోగి బ్రాహ్మణుఁడనునది సరికాదు. మన ప్రాచీన వాఙ్మయము మీ నందవరీకులు వైదికు లని తెల్పుచున్నది. ఈ యంశముఁదెల్పు ప్రాచీన గ్రంథములు నాల్గు గలవు. ౧. చాడేశ్వరీ విలాసము (సంస్కృతము) ౨. ఆంధ్ర చాడేశ్వరీ విలాసము. ౩. నంద వైదిక చరిత్రము. ౪. చాముండికా విలాసము. ఈ నాలుగింటి వలననుగూడ నందవరీకులు వైదికులే యని తెలియుచున్నది. ఈవిషయమై 'యాంధ్రచాడేశ్వరీ విలాసము' ప్రాచీన ద్విపద కావ్యములో నిట్లున్నది:

"ఈ రీతి వృత్తులు నేనూరు నేసె
వారిజోద్భవ వంశ వార్ధిచంద్రులకుఁ
గాసి కావళ్లల్లఁ గడనుంచి యపుడు
వాసికెక్కిరి నంద వైదికు లనఁగ"

ఇందున్న "నందవైదికు లనగ" అను పదములు నందవరీకులు వైదికులని తెల్పుచున్నది. ఈ గ్రంథరాజములో వీరు వైదికులని యిచట మాత్రమే వ్రాయఁబడి యుండలేదు. ఇందు నీ వైదికపదమే పలుసారులు వాడఁబడుచు వచ్చినది. అదిగాక దుగ్గనప్పయ యను నియోగి యొకఁడు తనకి నందవరములో నొక వృత్తినిచ్చి తన్నుఁ గూడ నందవరీకులలో చేర్చుకొనుండని వేడఁగా వారు పొలము నిత్తుము, ధనమునిత్తుము, కాని కులము నీయమని స్పష్టముగాఁ జెప్పినట్లీ క్రిందిరీతిని వ్రాయబడియున్నది:

"ఆవేళ నొకవిప్రుఁ డార్వేల కులుఁడు
దుగ్గనప్పయ వచ్చి తోడనే నిలిచి
అంబవేంబడి మీర లరుదెంచు నపుడు
వెంబడి వచ్చితి వేదాఢ్యులార
నాకొక వృత్తిచ్చి నన్నాదరించి
మీకులంబునఁ గల్ప మేరతో నుండు
నని యాతఁడీరీతి నాడు వాక్యములు
విని యంతటను జూచి విప్రు లిట్లనిరి
మానక నిన్నిట్లు మాకులంబునను
గలపము గావునఁ గావలసినది
పొలమైన ధనమైనఁ బొందుగాఁ గొనుము
మలపడఁ గులమున మఱి చేరనీము."

దీనింబట్టి నందవరమును నగ్రహారముగాఁ బడసి నూరు వృత్తుల క్రింద విభాగించుకొని యనుభవించిన నందవరీకు లెల్లరును వైదికులుగాని నియోగులు కారని కూడ విస్పష్టమగుచున్నది. ఈ 'యాంధ్రచాడేశ్వరీవిలాసము' సంస్కృతమునను న్న 'చాడేశ్వరీవిలాసము' యొక్క భాషాంతరీకరణమై యున్నది. ఈ సంస్కృత గ్రంథము తెలుఁగు పొత్తము కంటెను ప్రాచీనమని వేఱుగఁ జెప్ప నక్కఱలేదుకదా! (ఇది యింకను లభ్యము కాలేదు.) మూడవ గ్రంథము నందవైదికచరిత్రము. ఈ గ్రంథ నామమే నందవరీకు లెల్లరును వైదికులని స్పష్టముగఁ దెల్పుచున్నది. ఇదియును, పై గ్రంథముల వలెనే తెలుపుచున్నది. నాలవది చాముండికావిలాసము. దీనింబట్టికూడ నియోగులు వేఱు, నంద వైదికులు వేఱను భేద మేర్పడుచున్నది. ఈ పురాతన గ్రంథము లన్నియు నందవరీకు లెల్లరును వైదికులని తెల్పుటయే గాక నియోగులు కారని కూడఁ దెల్పుచుండుటచేఁ దాను నందవరీకుఁడనని తెల్పుకొనిన యల్లసాని పెద్ద నార్యుఁడు వైదికకులజుఁడగును కాని నియోగి కులజుఁడు కానేరఁడు. ఇది ప్రాచీన గ్రంథములంబట్టి తేలుచున్న చరిత్రాంశముగాని యెట్టి పుక్కిటి పురాణము గాదు. ఈ విషయమై యింకను విశేషములు తెలిసికొనఁ దలఁచువారు పండితవరులగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిచే నాంధ్ర పత్రికా సంవత్సరాది సంచికలో (౧౯౨౪—౨౫ వానిలో) వ్రాసిన వ్యాస రాజమును జూచుకొన వలెను.

## పెద్దనార్యుని వాసస్థలము

ఈ విషయమై కూడ మన శ్రీరమణాచార్యులవారు కవుల చరిత్రము ననుసరించి యీ క్రింది రీతిని విచారించిరి. "బళ్లారి ప్రాంతమందున్న దూపాడు పరగణాలోని దోరాల గ్రామ మీతని జన్మస్థానము." ఇదియును సరి కాదు. బళ్లారి మండలములో దోరాలయను గ్రామము లేనే లేదు. కానఁ బెద్దనార్యుఁడు బళ్లారి మండలములోని దోరాల వాస్తవ్యుఁడను సంగతి సత్యము కానేరదు. ఈతని

వాసస్థలము దూపాటి సీమలోని ద్రోణాదుల యని కవి చరిత్రయందుఁ దెలుపఁబడి యున్నది. ఇదియును సత్యము కాదు. దూపాడు జాగీరు గాని సీమ కాదు. పరగణా యనుగాదు. అందు ద్రోణాదుల యను గ్రామమును లేదు. కర్నూలు మండలములో దోరణాల యను గ్రామమున్నది. ఇదియే యాతని వాసస్థానమని వాఙ్మయ పరిశోధకులు చెప్పుచున్నారు.

నందవరమును గర్నూలు మండలములోనిదే కాన నందవరీకులు మొదట కర్నూలు మండల వాసులయి యుండి, యిటీవల నితర మండలములందుఁ గూడ వ్యాపించిరి. ఈ కవి కర్నూలు మండలములోని వాఁడనుటకు 'మనుచరిత్రము'నుండి యొక చిన్నయుదాహరణము గూడ శ్రీసూర్యనారాయణ శాస్త్రులవారిచ్చి యున్నారు. మన కవి తన గ్రంథములో „అచట బుట్టిన చిగురు కొమ్మయినఁ జేవ" అని వ్రాసియున్నాఁడు. చిగురు కొమ్మ అనఁగా లేఁగొమ్మ అని టీకాకారులు వ్రాసిరి. కాని శ్రీ సూర్యనారాయణ శాస్త్రులవారది సరిగాదనిరి. కర్నూలు మండలములో „చిగురు చెట్టు"ను నొక చెట్టు కలదఁట. దానిని లోకులీ కాలమున చిగురు చెట్టందురఁట. ఈ చెట్టింతయుఁ జేవలేనిది యఁట. కొమ్మ లతికర్కశములఁట. ఈ చెట్టు నుద్దేశించియే పెద్దన „అచటఁబుట్టిన చిగురు కొమ్మయినఁజేవ" అనెనఁట. ఇది కొంత సరసముగనే యున్నది.

## ఈతని సూత్ర శాఖాదులు

ఈతని సూత్ర శాఖాదులను గూర్చి శ్రీ రఘునాథాచార్యుల వారేమియును వ్రాసియుండలేదు. తాను వ్రాయించిన యున్నూరు శాసనమును బట్టి యీతఁడు ఆశ్వలాయన సూత్రుఁడు. ఋక్శాఖీయుఁడునని తెలుచున్నది.

## ఈతని గోత్రము

ఇప్పుడు అల్లసాని వారిలోఁ గొందఱు శ్రీవత్స గోత్రులు గలరు. అది గని కొందఱీతఁడు తద్గోత్రజుఁడని భ్రమపడవచ్చును గాని, పై శాసనముఁబట్టి యితఁడు వాసిష్ఠగోత్రుఁడని తెలుచున్నది.

## ఈతని కవితా విశేష ప్రశంస

'మనుచరిత్ర' గద్యములలోఁ గొన్నిటియందు దీతనికి „చతుర్విధ కవితాధురంధర" అను విశేషణము గాన్పించుచున్నది. కొన్ని ప్రతులలో నిది కానరాదు. పరికించి చూడ మన పెద్దనార్యుఁడు చతుర్విధ కవితా ధురంధరత్వమునుగూర్చి తన గద్యములో వ్రాసికొని యుండుననుటకు నవకాశము కాన్పించుటలేదు. ౧ బంధ కవిత్వము. ౨. గర్భ కవిత్వము. ౩. చిత్ర కవిత్వము. ౪. ఆశు కవిత్వము అనునవి చతుర్విధ కవిత్వములని మనవారు చెప్పుచున్నారు. మన పెద్దనార్యుఁడాశుకవిత్వము చెప్పినట్లు కొంత వాడుక గలదు. కాని గర్భకవిత్వాదులయందభిరుచి కలవాఁడనుటకు సాధారణము లేమియుఁ గానరావు. ఈతఁడు 'మనుచరిత్ర' మను నాశ్వాసముల ప్రబంధ రాజమును విరచించి యున్నాఁడు. బంధ కవిత్వాదులయం దాసక్తిగల కవులు తమ కావ్యములలో నాదియందో, మధ్యమునఁనో యంతమునందో తమకుఁగల బంధ గర్భాది కవిత్వముల నైపుణ్యమును జూపుట వాడుకయై యున్నది. ఈకవి యట్లు తన గ్రంథమున చూపి యుండలేదు. కావున „చతుర్విధ కవితా ధురంధర" అను విశేషణములేని గద్యమే సత్యమైనదిగా గాన్పించుచున్నది. ఇట్లు వ్రాయుటచే గర్భకవిత్వాదులందుఁ బెద్దనార్యునకు నేర్పులేదని తెలుపుచున్నట్లు చదువరులు భ్రమపడ దగదు. ఈగర్భ కవిత్వాదులందు కొందఱు మహాకవులకు రుచియుండును. మఱికొందఱి కుండదు. అభిరుచిలేని వారిలో నీతఁడొకఁడై యుండవచ్చుననుటకై యీ వాక్యములు వ్రాయఁ బడినవే కాని యీతని సామర్థ్య లోపములను దెలుపుటకు గాదు. ద్వివిధ గద్యములలో నేది సత్యమై యుండునో తెల్పుటకిది వ్రాయఁ బడినది. కొందఱు గ్రంథ లేఖకులు కవుల గద్యములలో గూడఁ గొన్ని మార్పులను పెట్టుచు వచ్చిరి.

చ॥ ఘనతరఘూర్జరీ కుచయుగక్రియ గూఢము
గాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరచాటగు నాంధ్రవ
ధూటి చొక్కపుం

జనుగవలీల గూఢతయుఁ జాటుతనంబును లేక
యుండఁ జె
ప్పిన యదె పో కవిత్వ మనిపించు నగించటు
గాక యుండినన్,

అను పద్యము నితఁడు విరచించినట్లుగా లోకమున వాడుక గలదు. వాడుక గలదనియే శ్రీ మదాచార్యుల వారును వ్రాసి యున్నారు. కాని యీ వాడుక యంధ పరంపరగా వచ్చుచున్నది గాని సరియైనది గాదు. ఈ పద్యరాజము భైరవ రాజు వేంకట నాథ కవి కృతమగు ,,పంచ తంత్రము''లోఁ గాన్పించుచున్నది. లోకు లొకరి పద్యముల నిక నొకరికి నంటగట్టుట వాడుకరైయున్నది. ఈ పద్యరాజమును శ్రీకృష్ణ దేవరాయలు పెద్దనార్యు నుద్దేశించి పలికినటు లాంధ్రక విజీవితములందు గలదు. మనవారు భర్తృహరి సుభాషితములో,

,,మధు తిష్ఠతివాచి యోషితాం
హృది హాలాహల మేవ కేవలమ్
అతఏవ నిపీయ తే ధరో
హృదయం ముష్టిభి రేవ తాడ్య తే॥"

అను శ్లోకమును తీసికొనిపోయి దండికి సగమును, కాళిదాసునకు సగమును బంచిపెట్టిరి. ఇట్టి వనేకములు గలవు. ఇట్టి ప్రతీతులు నమ్మదగినవి కావు. ,,ఘనతర ఘూర్జరీ'' యను పద్యము పంచ తంత్రములోనిది కాని పెద్దనార్యుఁడు గాని, కృష్ణదేవరాయలు గాని చెప్పినది గాదు.

## అన్యభాషా పదప్రయోగము

ఈ మహా కవి అన్యభాషా పదప్రయోగము గావించినట్లుగా లోకమున నొక వాడుక గలదు. కాని యది సరికాదు. ఈతఁ డన్యభాషాపదములఁ బ్రయోగించిన సుటకై

,,పచ్చని హురుముంజి పనివాగె పక్కెర
,,పారసీ పల్లంబు పట్టమయము........"

అను పద్యమును మన వారుదాహరించుచున్నారు. ఈపద్యమునందు ,,పారసీ'' లోనుగాఁ గల దేశ నామములు మాత్రమే పరభాషా పదములతోఁ గూడియున్నవి కాని తదితరము లేవియు నట్లు లేవు. దేశపురుషాది నామములు లోక వ్యవహారము ననుసరించి యుండవలయును గాని మన యిచ్చవచ్చిన భాషలోనికి మార్చుకొన వలను పడదు గదా! ,,ఎడ్వర్డు'' చక్రవర్తి గారిని యే భాషలో వ్రాసినను ఎడ్వర్డు అనియే వ్రాయవలెను. చీనాదేశమును చీనా యనియును, పారశీదేశమును పారశీ యనియు నే యన్ని భాషలలోను వాడవలయును. రామరాజ భూషణుఁడు తన 'వసుచరిత్ర' ములో నానా ,,వజీరా'' అని వాడినట్లును ,,మాడబేస'' మన్నగు కన్నడ పదముల తన 'కాళహస్తి మహాత్మ్యము'లో ధూర్జటి కవి వాడినట్లును నీతడు సామాన్యములగు యన్యభాషా పదములు వాడియుండలేదు. కావున నీతని ప్రబంధములో నన్యభాషాపదములు వాడిన వానినిగా దీసికొనఁ దగదు. మఱియు నీతఁడు ,,హిందూ రాజ్య రమాధురంధర'' అని 'మనుచరిత్రము'లో 'హిందూ' శబ్దమును వాడి యున్నాఁడు. ఇది తురుష్క పదమని కొందఱు పొరపడు చున్నారు. కాని అది సరికాదు. ఇది సంస్కృత పదమే. ఈ విషయమై పత్రికామతల్లిక యగు శ్రీ ,,భారతిలో'' నే నొక వ్యాసమును బ్రచురించి యున్నాను. ఇచ్ఛగల వారా వ్యాసముఁ జూచుకొనఁ దగును. ఈ మహాకవి 'మను చరిత్ర'మను తన మహా ప్రబంధములో నిర్మలములైన యాంధ్ర భాషా పదములను వాడెనే కాని, అన్య దేశ పదముల వాడియుండ లేదు. ఈతఁడు కావ్యములోఁ బర భాషాపదముల వాడవచ్చునను తలంపు కలవాఁడు కాఁడు. ఇతఁడు పర భాషా పదములఁ బ్రయోగించి యీ క్రింది చాటువులఁ జెప్పినట్లు వాడుక కలదు.

మ. సమరక్షోణిని కృష్ణరాయల భుజా
శాతాసిచేఁ బడ్డ దు
ర్దమదోర్దండ పుళిందకోటి యవన
వ్రాతంబు సప్తాశ్వమా
ర్గము నంగాంచి శబాసహో హరిహరా
గాఖూబు భోడాకితే
తుముకీబాయిల బాయి దేమనికియం
దుర్మింటి కింబోవుచున్.

శా. రాయగ్రామణి కృష్ణరాయ భవదు
గ్రక్రూర ఖడ్గాహిచే
గాయంబూడ్చి కళింగ దేశనృపతుల్
కానిర్ఝరీ పోషిణీ
మాయాభీకు ముటూకులోటు కుహూటూ
మాయానటా జాహరే
మాయాగ్గేయ మడీయటంద్రు దివిరం
భాజారుసిక్ యత్రునిక్.

ఇవి యీతఁడు చెప్పినవవునో కావో తెలియదు. వాడుక ననుబట్టి యీతఁడు చెప్పినవే యనినను హానిలేదు. ఇవి చాటువులు. చాటువుల గమనిక వేఱు. ప్రబంధముల గమనిక వేఱు. అది యట్లుండ పైపద్యములలో ,,అందురు" అని అనుకరణము వేయబడి యున్నది. అనుకరణము వేసి, అన్య భాషాపదములు వాడుట స్వభాషా కావ్యములలో స్వేచ్ఛగా నన్యభాషా పదములు చేర్చుట కానేరదు. కావున నీ మహాకవిని దన కావ్యములలో నన్యభాషా పదముల స్వేచ్ఛగా వాడిన వానినిగా బరిగణించుట యుచితము కాదు.

## ఈతని గ్రంథసంఖ్య

ఈతఁడనేక గ్రంథములు రచించినట్లుగా మన శ్రీ రమణాచార్యుల వారు లిఖించిరి. ఇదియును గవుల చరిత్ర ననుసరించి వ్రాసిన వ్రాతయే. ఈతఁడనేక గ్రంథములు రచించె ననుటకు నాధారమేదియును గానరాదు. తన 'మనుచరిత్రము'లోఁ దానదివఱకేవేవో గ్రంథములు వ్రాసినట్లు చెప్పుకొనలేదు. కృష్ణదేవరాయల నుద్దేశించి యీతఁడు చెప్పిన పద్యము నందును 'మనుచరిత్రము' మాట కలదే గాని తదితరము మాటలేదు. కొందఱు లక్షణ గ్రంథకారులు పెద్దన విరచిత 'హరికథాసారములో'నివని కొన్ని పద్యముల నుదాహరించిరి. ఇది యిప్పుడెచటను గానరాదు. అయినను ఆ లక్షణ కారుల వ్రాతలంబట్టి యీతఁడు 'హరికథాసారము' గూడ విరచించి యుండినట్లు మనము చెప్పుకొనుటకు నవకాశము కలదు. అంతియే కాని యనేక గ్రంథములు వ్రాసెననుటకు నాధారములు గాన్పించుట లేదు. 'అనేక' శబ్దమునకు రెండను నర్థము చెప్పినచో సరిపోవచ్చును. పై గ్రంథ ద్వయము కంటె హెచ్చుగా నీతఁడు గ్రంథముల విరచించి యుండలేదని నిరూపించుటకై నేనీ వాక్యమును వ్రాసియుండ లేదు. అనేకముల నీతఁడు వ్రాసియుండ వచ్చును. వ్రాయక పో వచ్చును. వాని నిర్ధారణము చేయుటకు మన కవకాశము లేదు. అదియే యిందుఁ దెలుపఁ దలఁచితిని.

## ఆముక్తమాల్యదా విషయము

ఈ గ్రంథ రాజమును బెద్దనార్యుఁడు విరచించి కృష్ణదేవరాయల పేరు పెట్టినట్లు లోకములో వాడుక గలదు. ఆ వాడుకను మన శ్రీ రమణాచార్యుల వారు పరిపరి విధముల ఖండించివైచి తద్గ్రంథకర్త రాయల వారేయని స్థిరపఱచిరి. అది బాగుగనే యున్నది. కాని కొన్ని మాంసపు కూరలు మున్నగు వానిని గూర్చిన ప్రశంస గ్రంథమున నుండుటచే నిది బ్రాహ్మణ విరచితము కాదనియు, క్షత్రియ విరచితమై యుండవలెననియు మనవారెల్లరును జెప్పుచున్న యుక్తి మాత్రము సమంజసముగా లేదు. ఏమన కవు లపరిమిత మేధావంతులై తమ కనుభవము లేకున్నను బహుద్వారములుగా విషయములను దెలిసికొని వానిని జక్కఁగా నభివర్ణింతురు. 'కనుఁగొనగంటె నచ్యుతముగా నెఱిగింతు రతీంద్రియార్థముల్' అనియు 'రవిగాననిచోఁ గవిగాంచు నేకదా!' యనియు మనకవి తల్లజాలే వ్రాసి యున్నారు. బ్రాహ్మణుని యనుభవములో నుండని విశేషముల ననేకముల మన పెద్దనార్యుఁడు 'మనుచరిత్రము'న వర్ణించి యున్నాఁడు. కావున బ్రాహ్మణుల యనుభవములో నుండని వర్ణనము లున్నంతన, ఆముక్తమాల్యద, బ్రాహ్మణ విరచితము గాదనుట సమంజసమై యుండదు. ఈ పొత్తమును బెద్దనయే విరచించెనని ఋజువు చేయుచు బ్రహ్మశ్రీ మహోపాధ్యాయ వేదము వేంకటరాయ శాస్త్రుల వారొక వ్యాసము వ్రాసిరఁట: అది నాకు లభింపలేదు. కృష్ణదేవరాయ విరచిత మనుటకు మన శ్రీ రమణాచార్యుల వారు మున్నగు వారు తెల్పిన యుక్తులు మొత్తము మీఁద సరసముగనే కాన్పించుచున్నవి.

ఈ విశేషములంగూర్చి ముచ్చటించుటకై నేను శ్రీ రమణాచార్యులవారి వ్యాసము నాధారముగఁ దీసికొంటిని గాని దానిని ఖండించుటకుఁ గాదు. ఆచార్యుల వారు తక్కిన విషయముల నన్నింటిని బాగుగా వ్యక్తీకరించి యున్నారు. పెద్దనార్యునిది మృదు కవిత్వమని వీరు సెలవిచ్చిరి. ఈ యూహతోఁ గూడ నే నేకీభవింపఁ జాలను. ఈతఁడు తనవి ,,శిరీషకుసుమపేశల సుధామయోక్తులు"ని తన 'మనుచరిత్రము'లో వ్రాసికొని యున్నాఁడు. కాని మొత్తము మీద నీతనిది కఠిన కవిత్వము గాని మృదు కవిత్వము కాదు. ప్రౌఢ ప్రబంధములందు కవిత్వము కఠినముగ నుండుటయు నొప్పిదమే యని నాతలంపు.

# భరద్వాజము*

వఝ్ఝుల వేంకటేశ్వర కవి

ఓ విశ్వాత్మక జంగమోన్నత కవితజ్యోతిః పరబ్రహ్మమా!
హా! నీవెన్నఁడుఁ బక్షిమాత్రమవుకా; వాకాశమ్ముం దేగుచో
గానాలాప సలత్సుధారసము లొల్కంజేయు నానందమూ
ర్తీ! నీ కియ్యదె స్వాగతంబు గొనుమా! ప్రేమాభిమానంబులన్.

శా. అనలజ్వాలచయోపరిప్రథిత మిధ్యాతథ్యమధ్యస్థ స
ద్ఘనరాజింటన భూమిపైఁ దరలిపైపైఁగామీఁదికిన్మీఁదికిం
జనుచుం దద్గగనంబునం దెగుర కీ సంగీతముల్పాడుచున్
మనసారం గగనంబునం దెగురుచున్ సంగీతముల్పాడవే.

మ. విలసన్నీలఘనాఘన ప్రకరముల్ వెల్గొందుఁగాఁ జేయు స
ల్లలితాస్తంగత భానుబింబకిరణోద్యత్కాంతులం దేలుచున్
లలిగాఁ బర్విడుచున్ నిరాకృతి సదానందంబవై యేరికిం
దెలియంబాలక తేజరిల్లెదవు కాదే యో భరద్వాజమా!

మ. భవదీయాంచలమందుఁ జిత్రతర సద్వర్ణైక సంతానముల్
రవితాఁ బశ్చిమ వార్ధిఁ జేరఁజను వేళం జిందు వారుంగదా!
పవలభ్రంబునఁ జుక్కరీతిఁ గనుపింపంబోక భాసిల్లు చుం
దువు కానీ, భవదీయగీతికల విందుల్ విందులం బొందుచున్.

ఉ. వెన్నెలకీఁడు ప్రొద్దునన వెన్నెలఁ బాసి యదృశ్యుఁడయ్యుఁ దా
గన్నులఁగట్టినట్లు దివిఁ గన్పడురీతిగ, నీదుగాన సం
పన్నత వీన్నాకఁట నభంబున నింకను బాడుచుండి నీ
వున్నటు తోఁచుచుండెదవహా! యిపుడెచ్చటికేగియుందువో.

మ. విమలాభ్రంబునఁ గల్గు నొక్కఘనముల్ వేఁబాసి చంద్రుండు తా
రమణీయోజ్జ్వల చంద్రికామృతము ధారల్ గాఁగ వర్షించు చం
దము నన్ నీకురిపించు తన్మధుర గీతశ్రేణి భూమ్యంతరి
క్షముల న్నిండుచుఁ బొంగుచుం బార లెడింగాదే భరద్వాజమా!

శా. నీవెవ్వండవొ! నిన్నెఱుంగఁ దరమా! నీరూపమెట్లుండునో
భావింపందరమా? త్వదీయ నవభాస్వద్గీతగానంబు లెం

*షెల్లీ అను నాంగ్లకవి 'టుదిస్కైలార్కు' అను పద్యమ్మునకనువాదము.

తేవర్షించు సుధాకణంబులగతిం దీపించు నేయింద్ర చా
పావిర్భూత తళత్తళత్కృతపయో దాంభఃకణానీకముల్!

శా. ఆలోకంబుల గోచరింపక యనంతాలోచనాలోక ది
వ్యాలోకంబున దోఁగుచుం దనకుఁ దా నానందగీతస్వరం
బాలాపించుచు లోకమూర్తి మివులఁ బ్రేమాశావిభిత్యాది
భావాళిం దేల్చి మదంబొసంగుకవియో యన్నట్లు భాసిల్లవే!

శా. వాసిన్ భూరి నిగూఢవృత్తి వెలయన్ భాసిల్లు నంతఃపుర
ప్రాసాదంబునఁ బ్రేమరాగ కవిత స్వాంతంబు నోదార్చుచున్
వేసారుల్ కడుఁబొంగి పైకుబుకు సత్ప్రేమైకగీతాళి ను
ల్లాసప్రక్రియఁ బాడు రాత్తునయు లీలం జాల వెల్గొందవే!

మ. మహికాకల్పిత గాఢ ధూమ పటలీ మధ్యంబునం బోవుచున్
మహితోత్ఫుల్ల సుమాళి చాటునఁ దనంతందా సువర్ణద్యుతుల్
రహి నెవ్వారును గోరకుండఁ జెలువారం జల్లు తన్నస్మదా
వహఖద్యోతము భాతి గానలహరీభాస్వత్ప్రసం జల్లవే!

మ. నవ శోభామయ పర్ణమధ్యమున వింతం బొల్చియామోద సం
స్తవనీయంబగుచున్ నవీన వికసత్పత్రావళీ శోభ్యమై
పవమానాంకుర చోరశేఖరునకుం భవ్యోల్లసద్వాసనా
ద్రవిణంబిచ్చెడు మేల్గులాబి యనఁగా రమ్యంబుగా నొప్పవే.

చం. లలితతళద్ద్యుతిం బయళులం దగు పచ్చికపైని, వర్షబిం
దుల వికసించు పూలపయిఁ దొల్కరివాన లొనర్చు నారవం
బుల ననవేటికిన్? విఫలముల్, ప్రమదాంచితముల్, వినూతనం
బులునగు వాని, నీ మధుర భూషితగానము మీరునే కదా!

శా. ఓనిర్మాతుక జాతమోది కవిత జ్యోతిః పరబ్రహ్మమా!
ఆనందామృత మాధురిన్వెలయు నీవాభావముల్ నేర్పుమా!
ఆనందామృత వర్షముంగురియు ప్రేమానంద గీతావళీ
గానంబీగతి నాదు కర్ణముల సోకన్ లేమను మ్మొన్నఁడున్.

శా. నీ దివ్యామృత మాధురీ ప్రవిలసన్ నిర్మాల్య గీతావళీ
నాదబ్రహ్మముతోనహా! సమము లౌనా ప్రేమగీతావళీ
నాదంబుల్, జయగీత నాదములు, నెన్నం కంభముల్గాక? యే
దేదో లోపల లోపముంగలుగుఁ గాదేయన్వి తేజోకృతీ!

మ. భవదీయామలగీతగానతటినీభవ్యప్రవాహంబు లే
యవి? కేదారములో, తరంగతతులో, యా శైలరాజ్యంబులో?
యవి యభ్రాకృతులో, ధరాకృతులొ? యాహా! యెట్టిత్వత్ప్రేమ భా
వ విలాసంబులొ, సౌఖ్య సంగతములో, బాధా విశూన్యంబులో!

మ. భవదీయంబగు నిశ్చల ప్రమద సద్భావైక గానంబు నెం
త వినం గల్గదు తృప్తి; నీదరి విషాదచ్ఛాయకున్ నిల్చి యుం
డ, ఏశంబెన్నఁడుఁగాదు; నీవు ప్రణయానందంబునం బొల్చుచుం
దు; వెరుంగంజనలే వతీతమగు తద్దుఃఖాకర ప్రేమమున్.

మ. అరయం జాగ్రదవస్థయందయిన నిద్రావస్థ యందైన నిన్,
ధరమర్త్యాకృతిఁ గొన్న మేము కడుఁబొందంబోవు కష్టంబులున్
మరణాదుల్, కనలేవు; కాని యెడల న్మాధుర్యతన్ నీ నవ
స్వర సంగీత సుధాస్రవంతి ప్రవహింపంజాలు టింకెట్లగున్?

శా. ముందున్వెన్కను మేము చూచుచు నతంబుల్కానివా వానికై
క్రిందున్మీదును గొట్టుకొందు; యిక నార్తిప్రాప్తముల్ మామహా
నంద స్మేరము; లింక మా మధురగాన స్వాన సద్గీతికా
సందోహంబులు దుఃఖ భావకలనా సంవేష్టితంబుల్ సుమీ!

మ. అయినంగాని మనుష్య మాత్రులము మే మాటన్ భరద్వాజమా!
భయగర్వాదులు వీడి దుఃఖమును సంభావింపఁబోకుండినన్
నయనాభః కణజాలముం గలుగకున్నన్, ద్వత్సమానప్రమో
దయుతాత్మం జరియింతు మేమొ! యెఱుఁగం దక్షుండనేఁ గాఁ జుమీ!

మ. ధరణింగల్గు సమస్త విస్ఫుట సుధా ధారాభ సంగీత సు
స్వర జాలంబుల కంటె, సర్వకవికావ్య శ్రేణులంగల్గు భా
సుర సంపద్విభవంబుకంటె, మరి నీ శుంభత్ప్రభావంబె యా
దరణీయంబు సుమీ కవీంద్రునకు సన్మార్గ ప్రవర్తీ సదా.

మ. జగతీనిత్యవిసర్జనంబ! విను, నీ సంతోషభావంబునన్
సగమైనన్ మరినాకు నేర్పఁ గదె? తత్సంతోషమత్తుండనై
తగు గీతంబులఁ బాడువాఁడ, నపుడీ ధాత్రీ జనుల్ మోదపా
రగులై విందురు, నీదుపాట మనసారన్ నేడు నే విన్నటుల్.

# ఉమరు ఖయ్యామ్

బూర్గుల రామకృష్ణరావు

(శ్రావణ మాసపు సంచిక తరువాయి)

౨

## ఈశ్వర తత్త్వము

'ఉమరు' నాస్తికుడా, ఆస్తికుడా? ఆక్షేపవాదము నందును నాస్తిక వాదము నందును చాల భేదము కలదు. ఉమరు కవిత్వమునం దీశ్వరుడు లేడని సాధించు గీతములు కనబడవు. ఇందుకు వ్యతిరేకముగా ననేక గీతములం దీశ్వరుని సగుణాత్మకమగు స్వరూపమును పురస్కరించుకొని విప్రలంభరూపముగను, యితర రీతులను దూలనాడుచున్నాడు.

ساقی قدحی کہ کار ساز ست خدا
در رحمت خود بندہ نواز ست خدا
می خور بہ بہار و بار طاعت مفروش
کز طاعت خلق بے نیاز ست خدا

చ. సకియరో! పాత్రనించు మొగి
సర్వఫలప్రదు డీశ్వరుండు తా
సకల జనాళినిన్ తన విశాల కృ
పారసవృష్టిఁ బ్రోచెడున్
ప్రకట వసంతసీధు రసపాన
ము జేసి దురంతమైన సే
వకత తొలంగు మా ప్రభువు
బానిస సేవల గోరడెన్నడున్.

ఇంకొకటి జూడుడు:

ఉ. పాపము పాపమంచు మము!
బాపురె వావిడులేల సం
తాపము బొంది గాసిలిన
దక్కెడులాభము లేశమేనియున్
పాపము జేయ కెవ్విధి కృ
పారసపాత్రుడు జీవుడౌనొ? యీ
పాపులకై కృపాప్తి భగ
వంతుడు కైకొనె చింతలేటికిన్

చూచితిరా, ఉమరుయొక్క తర్కము!! భగవత్కల్యాణగుణంబులను సార్థక మొనరించుటకయిన బాపము చేయ వలయునట! మరియొక చిత్రము:

ناکرده گناه در جهان کیست بگو
آنکس که گناه نکرد چون زیست بگو
من بد کنم و تو بد مکافات دهی
پس فرق میان من و تو چیست بگو

చ. ధరనపరాధ మెన్నడును
తప్పియె జేయని వాడెవండు? యా
నరుడెటు లిజ్జగంబున మ
నఁగలిగెఁ దురితంబు జేయకే?
దురితములే నొనర్చెదను,
దుష్టఫలంబుల నిత్తువీవు శ్రీ
హరి! మఱి భేదమున్న నిను
మంత వచింపుము నీకు నాకునుఁ

పాపకర్మలు, వాని ప్రతిఫలంబని చెప్పబడు శిక్షావిధానము, ఇంటి విషయము తీవ్రమైన యాక్షేపణ కదా! ఇందు సంబోధింపబడిన యస్తిత్వమెద్ది? ఈ క్రింది పద్యమును గమనింపుడు. అందు విస్పష్టముగా పిలిచి పానపాత్రమును బద్దలోసిన నేరము నారోపించుచున్నాడు.

ابریق مرا شکستی ربی
بر من در عیش را ببستی ربی
بر خاک فگندی می گلگون مرا
من مست نیم تو مستی ربی

ఉ. ముక్కలుగా బగిల్చితివి
మోహనమా మధుపూర్ణపాత్రముఁ
మక్కువగూర్చు భోగమణీ
మందిరధాగము మూసినావు మేల్
చిక్కని ద్రాక్షలం దొరసి
చిందు గులాబిరసంబు మంటిపై
గ్రక్కున జల్ల మత్తుడవు
గావె హరీ? యెటులేను మత్తుడఁ?

ఇటువంటి వెన్నియో 'రుబాయీలు' గలవు. వీనిని జదివిన నీశ్వరతత్వము లేదను నాస్తిక వాదమునకు ఉమరు దిగలేదనియు, ఆతనిని నాస్తికుడనుట గొప్ప పొరబాటనియు స్పష్టమగును.

## తత్వవిజ్ఞానము

అట్టిన నీశ్వర స్వరూపమెద్ది? జీవునికి ఈశ్వరునికి సంబంధమేమి? అను ననేకప్రశ్నలు బయలుదేరును. ఈ ప్రశ్నల కన్నింటికి 'ఉమర్' యొక్క ప్రత్యుత్తర మొకటే. సత్యస్వరూప మజ్ఞేయము. ఈశ్వరతత్వజ్ఞానము దుస్సాధ్యము. ఈతత్వమునే ననేక భంగుల చెప్పియున్నాడు.

చ. అరుగగ దోవలేదిల ర
హస్యపటాంతర సీమ కేరికిఁ,
ఎరుగరు రాకపోకలకు
నెయ్యది, యాత్మకు కారణంబొ, ఎ
వ్వరిని ధరాశయాంతర ని
వాసముదప్ప మఱొంటు లేది కె
వ్వరవున చిత్రమిక్కథయు
వేగిర మంతము నొంద దక్కటా!

మ. అలనా డీడిచినై చిలీవిచట నా
యాసంబుతో నెట్టులో
నిలజీవించి గడించు విస్మయముగా
కింకే ఫలంబొందమిఁ
కల ప్రాణంబు వీడజాలక మహా
కష్టంబుతో నేగిరిఁ
దెలయఁ జాలను రాకపోకలకు ను
ద్దేశ్యంబు నీయున్కికిఁ,

చూడుడు!

చ. నిగమవిచారబద్ధులయి
నిష్ఫలశాస్త్ర వివాద పంకమం
దొగిదిగి, 'యస్తి' 'నాస్తి' యను
నూహాలమై గరగంగ శూన్యులై
తొగిలెడువార లీఘనత
మోవృతరాత్రము నీద్రిదోవ దీ
యగనక సెప్పి కొన్నికథ
లంతటితో విరమింత్రు నెచ్చెలీ.

మఱియు,

చ. కరమనురక్తి భావనలఁ
గాంచి పరార్థపు మేలిముత్తెపుల్
నరులనుగూర్చి, తత్వముల
సార మిదంచు వచించు పెద్దలుల్
పరమరహస్య సూత్రముల
భావ మొకించు కెఱుంగలేదు, తీ
వరముగ నెవ్వరో బలికి
వార్తలు, నిద్రలుజెంది రక్కటా!

ఇటులే శాస్త్రములన్నియు గురువుల వలన నభ్యసించితి ననియు, తెలిసినవారిని సేవించి విచారించితి ననియు, సత్యస్వరూపమును నిర్ణయింపజాలరనియు వాపోవుచున్నాడు. ఒకప్పుడు విజ్ఞానము కలిగినటుల భ్రమ పడియో లేక నిజముగా జ్ఞానతేజము కనుల కగుపడియో,

చ. ఒకతృటిజాలు నాస్తికమ
హోదధిదాటి పరాత్పరుల్ దయా
ప్రకటితుగాంచి శంకలను
బాసి సునిశ్చిత బోధమందగల్
సకియరో! యట్టిమేలి నిము
సంబది దుర్లభమందు బ్రీతితో
సుకపడ నబ్బుకాలమును
జూడగ నీ నిముసంబె లోకపుల్.

యని ఆత్మశాంతిని ధ్వనింప జేయుచున్నాడు. మఱియొకసారి తన తత్వము నీ క్రింది విధముగా ప్రకటించు చున్నాడు.

చ. అది వెలలేని మానికము
అబ్బెడు వేఱొక కోనయందు, పో
మ్మది సరిలేని మౌక్తికము
అందున వేఱొక చిహ్నముండెడిన్
'అది' 'ఇది' యంచు నూరకమె
యాతురపెట్టుదు మీవు నేనునున్
వదలక, ప్రేమగాథలకు
వాఙ్మయ మింకొక టుండగావలెన్

జీవిన్మిథ్యాత్వము

ప్రపంచములోని ప్రతి వస్తువు భౌతికమనియు మానవుడు మరణానంతరము మన్నై పోవుననియు, క్షణభంగుర మగు నీ జీవితము దాటిన పిదప మఱి రే యాశలేదనియు, స్వర్గ నరకఫలములు కేవలము కథలనియు మమ్మాలు నొక్కి చెప్పుచున్నాడు.

చ. నరనుడు మిత్రు డిష్టుడును
సన్నిహితుం డొకరుండు లేక, యొం
టరిగను భూమిగర్భమున
డాగి వసించెడ వెన్నియేండ్లో, నే
ధుర సముద్రావు మింపుగ న
ధూమణీ! తెల్పకు మీరహస్య మె
వ్వారికిని, విచ్చబోదికను
వాడినపువ్వు మదెన్ని నాళ్ళకున్.

మఱియు,

ఉ. మాసిన జీవితాంశుకము
మారదు క్రొత్తదికాగ నెన్నియున్.
జేసిన కార్యముల్ మనకుఁ
జేకుర దిష్టఫలానుసారిమై
ఓసఖి! ద్రావుమమ్మ మధు
వున్నది గిన్నెలనిండ చింతలే

కాసవపాత్రముల్ బగిలి
యున్నియు మన్నయిపోకముందరన్

ఈ భౌతికజీవితము ముగిసిన పిదప మఱియే యాస లేదనియు తరువాత సంగతులన్ని యూహాలనియు, ఈ భౌతిక జీవితముగూడ క్షణభంగుర మనియు, ఈ ముదిసిన భూమిపై ప్రతియడుగు మిగుల జాగ్రతగా నిడవలెననియు, ఎందఱో చక్రవర్తులు, ఎందఱో సుందరులు స్వల్పము లగు తమ జీవితయాత్రల జాలించి మంటియందు గలసి రనియు మిగుల విషాదముతో చెప్పుచున్నాడు.

చ. అల సెలయేటి తీరమున
నంధపు పచ్చిక మొల్చె, వేలుపు
న్జెలువల మోవిపై నిది...
...నటంచు దలంచి, దానిపై
బలముగ పాదమూనకుము
వంచకభావము నుంచకివ్వి, యే
జలజముఖీకపోలముల
సొనలుదీటిన మేలిమొల్కలో.

మఱియు,

చ. హరిణము బిడ్డలన్ గనిచ
నక్కట! సింహము విశ్రమించెడిన్
ధరణివిభుండు 'బహ్రాము' న
దా మధువానిన సౌధమందు, నా
నరపతి వేటలాడెను వ
నంబులలో మనుబిళ్ళనవ్వియే
యరమరలేక యిత్తఱిని
నాతనిజేరు సమాధి త్రవ్వుచున్.

కేటో, చో,

చ. మన మిటు రాకమున్న గనె
మానిని, రేలుబవల్లు నండె నే
ఘనమగు కార్యమో నలుప
గా గగనంబిటులే భ్రమించుచుం
డెను; పదిలంబుగా పదము
నీ విటబెట్టు ధరిత్రి నిద్దియే
కనక సుగాత్రి మోహనపు
కన్గవరెప్పల మట్టియో చెలీ!

అని హెచ్చరించుచున్నాడు. మఱియొకచో,

మ. మున్నీ పాత్రిక రూపుడైనరుడు దా
మోహించి దుఃఖించెనో
యన్నా! నావలె కామినీశిరమునం
దల్లాడు ముంగుర్లపై
నున్నాడానతో; చూడు మిక్కలమునం దు
న్నట్టి హస్తాగ్రముల్
ఎన్నాళాయెనో, ప్రేయసీగళము న
న్వేయంగ నీహస్తమే.

యని విషాదగీతము పాడుచున్నాడు.

చ. ముదిసినతూర్పుకొండలివి
'మోసెసులున్' పదివేలువచ్చి చూ
చి దివముం జేరి; రీ గుడిని
'జీసను' లెందఱో పూజసల్పినా;
రిది పదివేల 'కైజరులు'
నెక్కిన సౌధవతంసమందు; రి
య్యది 'కిసురాలు' లక్షలు వి
హారము జేసిన గూడునెచ్చెలీ!

అని జగమువొక్క పురాతనత్వమునో లేక జీవితమువొక్క క్షణభంగురత్వమునో చాటుచున్నాడు. అటులే యీజగమందు తమ కర్మబద్ధములగు ఫలముల ననుభవించి జీవులు వచ్చి పోవుచుందురని చెప్పుచున్నాడు.

ఉ. ఈజగమందు ప్రాతగిల
రెవ్వరు, క్రొత్తగనుండి రెవ్వరా
యాజనులందరున్ దుదకు
నన్నియభీష్టము లొక్కటొక్కటే
రాజిల గాంతురో సకియ!
రంకుజగంబిది నేటివెంబడిన్

భోజన, డెల్లకాలమును
పోయిరి వచ్చిరి పోదు రెందఱో.

మఱియు,

చ. తిరిగితి నెంతయో నఖుని
దివ్యకవాటము జుట్టుముట్టు నే
నరిగినపట్ల నల్గడల
నారసి యారసి వేసరిల్లితిన్
ఎరుగుము మూలసూత్రమిది
యిప్పథమందు జరించివచ్చి యొ
క్కరుడును వచ్చు ద్రోవబడి
క్రమ్మఱిబోక మనంగ లేదిలన్.

స్పష్టముగా కర్మతత్వమునుగాని లేక పునర్జన్మతత్వమునుగాని అత డంగీకరింపలేదు. కాని కొన్నిగీతములందు ఏతత్వములు కవి మనస్సునం దాందోళిత మొనర్చిన చిహ్నములు కలవు. మానవుని ఆత్మశాంతిని సర్వదా భంగమొనరించు విషయమేదేని గలదేని అది జీవితముయొక్క విషాదకరమగు క్షణభంగురత్వము. తత్వజ్ఞాసకు మనుజుని బుద్ధిని బలవంతముగా సిద్ధపఱచు శక్తియే యిది. జీవితనాటకముయొక్క యీ విషాదాంతకథ జిజ్ఞాసకు ప్రోత్సాహకరమైనను, జిజ్ఞాసువు పరమభక్తుడు కావచ్చును, విరాగి కావచ్చును లేక కేవలనాస్తికుడో, లోకాయతుడో చార్వాకుడో కావచ్చును. లేక మార్గమధ్యమున దృక్పథ మనేకవిధములగ మారి వివిధములైన తెగ్గలుగాను తరగతులుగాను యేర్పడవచ్చును. జిజ్ఞాసువులయొక్క మార్గమున 'ఇంతవరకే, ఇకముందు వలదు' (Thus far and not further) అను యవధి వాని సామర్థ్యమును బట్టి కలుగును. ఉమరునకీ మార్గమధ్యమున గలుగు శంకలను, అటంకములను మనోహరముగ వర్ణించి యున్నాడు.

చ. తెలతెలవారె పానగృహ
తీవ్రనినాదము వీనులన్ బడెన్
తెలియుము మత్త! మేల్కొనుము
తియ్యని ద్రాక్షరసంబు గ్రోలు మీవల నిదురింపవెల్లునే? ని
దానము తథ్యమె జీవితంపు ని
ర్మల మధు పాత్రనింపుకొని
వ్యగ్రకపూర్వమే పాత్రనింపుమా!

అని మత్తజనాళినాకర్షించి వారిని కర్తవ్యపరాయణులఁజేయ ప్రయత్నించుచు మేలుగొల్పి పిలుచుచున్నాడు.

ఉ. మత్త జనాళి గేరుటయె
మానుము, మద్యము గ్రోలకున్న నీ
చిత్తము, కోపగించునెడ
చేరి విరించిని వేడుకొందు, నే
బొత్తిగ ద్రాగ' నంచిటుల
బూటకముల్ పలుకంగనేల? పే
రెత్తిన ఘోరకృత్యముల
నెన్ని యొనర్పగలేము మిత్రమా!

అని మిత్రుల జడిపించుచున్నాడు. ఒకవంక డెబ్బదిరెండుమతముల వివాదముల నిరసించుచున్నాడు. వేఱొకచో,

చ. గురువర! మాయభీష్టమొన
గూడగ నిమ్మొకసారియైన నీ
వఱచుటమాని దైవపథ
మందు జరింపగ నిమ్ము మమ్ము నీ
తెలివులు మంచివే యగును
తిన్నగ జూడగలేవు గాన, వం
కర గనిపించు, పొమ్మికను
కన్నుల కంజన సేవసేయగన్.

అని గురువునకు తిరుమంత్ర ముపదేశించుచున్నాడు.

ఉ. భూజలమిశ్రమంబుననె
బుద్ధియుతున్ ననుగన్ననాడె, వా
డీ జగమెల్ల దుఃఖముల
నిచ్చి నరున్ బరితుష్టుచేసె, మి

త్రా! జడిపింపనేల నను
'త్రాగకు త్రాగకు' మంచు పల్మరుర్
వేఁజని త్రాగకుండుటకు
వెచ్చము రొక్కము లేమిచాలదే?

అని దైన్యముట్టిపడ బలుకుచున్నాడు.

మ. సెలయేటర్ ప్రవహించునీరును
........సమీరాంబులర్
బలె, నీనావయసందు నీ దివస
ముల్ వ్యర్థంబుగాబోయె, నే
నిలజీవించిన యన్నినాళ్లు వ్యస
నంబింతేని నీ కెందురో
జులకై, దాల్ప ననాగతాగత ది
నస్తోమంబు గాంక్షించుచున్.

అని అనాగత కాలచింతల పాఱదోలుచున్నాడు. 'రేపు, రేపు' అనుమాట మరచిపొమ్మనియు, ఎన్ని 'రేపులు' యున్ని 'నిన్న' లందు గలసిపోలేదనియు హెచ్చరించుచున్నాడు. వేరొకచో,

ఉ. 'మాపని' 'రేప' టంచు మధు
మానినిసేవ యొనర్ప వాయిదాల్
బాపురె! చెల్లునే! మధుర
భాషలచే నెరదప్పియారునే?
పాపనెలర్ శశాంకముఖ
పానము సేయుము దివ్యసీధు వే
లోపము లేక, వెన్నెలలు
లోకులుకోరిన యప్పుగాయునే?

ఇటులే జీవితాదర్శ మీ క్రిందివిధముగ ప్రకటించుచున్నాడు.

ఉ. ఆసవపాత్రముల్, మధువు,
అందపు నెచ్చెలి, తోటసీమలున్
ఆసవహింపగా మనకు
నంతకు మిక్కిలి స్వర్గమేద లే
దో సఖ! స్వర్గము న్నరక
మున్న తెఱుంగు నెఱుంగుబోకు మా
వాసము జేసె నెవ్వడట?
వచ్చెనెవం డటనుండి క్రమ్మరన్.

మఱియు,

ఉ. పాంథుడు మత్తుడై సతము
పాయనిమైమఱపొందుగాత, కా
మాంధతవిహ్వలుండగుచు
మానము గోల్పడుగాత, నిట్టియే
యంధత లేక మేల్కొనిన
నన్నిటి చింతదహించు; త్రాగి ని
ర్బంధముగాగ మత్తిలుము
పాడయి తేమి జగం బదెట్టులన్?

అని పాంథుని యాశీర్వదించుచున్నాడు!

ఉ. భాసురచంద్రకాంతులను,
భావమనోజ్ఞ విలాస సంపదన్
భాసిలు సుందరిన్, వికచ
పద్మసుగంధితమూర్తిఁ జేసి, 'నీ
వాసలు గోల్పు చూడ్కులతో
నెచ్చెలి జూడకు' మంచు జెప్ప దీ
వాసవ పూర్ణపాత్రమును
నడ్డము బట్టిన నేల జారదే?

در میان قعر دریا تخته بندم کرده ای
باز میگوئی که دامن تر مکن هشیار باش

అని యీశ్వరుని ప్రశ్నించుచున్నాడు. ఇంకొక ఫారసీ కవి

గీ॥ గాఢతరమైన యట్టి యగాధజలధి
మధ్య పర్యంకమును గట్టి "మలినమగును,
తడిసిపోవును కట్టిన యుడుపులెల్ల
భద్ర"మని హెచ్చరించుట పాడియగునె?

అని యాజ్ఞవల్క్యునితో వాదించినాడు. ఇట్టి గీతములు కొన్ని భక్తిపారవశ్యమున బాడిన పరమవైష్ణవశిఖామణియగు యాళ్వాందారును జ్ఞప్తికి దెచ్చును. కొలదు తమ తల్లితండ్రులపట్ల జూపు నిష్ఠురలాలనములుగా గన్పడును.

అనేక గీతములు సత్యవర్తనమును, పరోపకారమును శ్లాఘించుచున్నవి. బాహ్యచిహ్నములకు ప్రాముఖ్యతనొసంగి, సదాచారుల'మని నిక్కుచుండు ,బాహ్యులను గూడను సత్యమును త్యాగమును అవలంబింపవలయునని హెచ్చరించుచున్నాడు. ధనమును, పదవిని, గౌరవమును గర్హ్యములుగా జూచుచున్నాడు.

ఉ. న్యాయముగా విరించి మన
కన్నము బంచి విధించె నెంతదో
నూ, యణుమాత్ర మంత బొడ
నూపవు హెచ్చులు తగ్గు లేమియుం
పాయని రక్తిఁ గల్గినవి
పంచుక తృప్తినిఁ బొందగావలెఁ
న్వీయ మనోగతిఁ నమువ
జీవిత సర్వవిముక్తి గావలెఁ.

ధనగౌరవముల గుఱించిన వైరాగ్య మొకప్పుడు 'ఋణంకృత్వా ఘృతం పిబేత్' అను సందేశమువలె నుండును. అటులే,

ఉ. ఏను మృతుండనైన శవము
నేమరకన్ మదిరాఘరిన్మృత
స్నానము నల్పుడీ నవర
సాన్నము పిండము లేల? మద్యమే
పానమొనంగుడీ; ప్రళయ
పాతము వేళను నిష్టమేనిన
స్లానగ...............

కమ్మని తేనియ జిమ్ముచుండు మా
పాన గృహాంగణస్థలిని
బాలసమీర సువాసనావళుల్.

అని చాటునప్పుడు

'పీత్వా పీత్వా పునఃపీత్వా
యావత్పతతి భూతలే'

అను శ్లోకము స్మరణకు రావచ్చును. కాని సక్రమముగా జదివి సూఫీకవుల వాఙ్మయముయొక్క రుచి జూచి, ఉమరుకాలమున నరకికిన సూఫీతత్త్వములు పరిపూర్ణరూపముల దాల్చియుండలేదని గమనించినచో, కవియుపదేశములపైగాని, భావములపైగాని, నిరసనభావము పుట్టదు. శుద్ధమగు దేకేశ్వర వాదముతో సాంఖ్యసిద్ధాంతములను, యోగసూత్రములను బౌద్ధతత్త్వములను సమన్వయించు ప్రయత్నమున మార్గమధ్యమందుండిరి. అట్టి జిజ్ఞాసను మనోహరముగను, శాశ్వతముగను, చిత్రించిన ఉమరు సమాధిపై 'హీరాత్' పట్టణమునందుద్యాన లతాంతలు తమ సుమముల వర్షించుచుండుట సౌభాగ్యమని చెప్పవచ్చును ఉమరుయొక్క శిష్యుడగు 'నిజాము సమర్ఖందీ'యి ధనమునకు పూర్వము 'బలఖ్' పట్టణమున గురువును దర్శించిన సమయమున నేదో ప్రశస్తియందు "నాసమాధిపై నెల్లప్పుడు పువ్వులవాన కురియుచుండు"నని పలికెనట. కొన్ని సంవత్సరముల పిదప నిజాము గురుసమాధి దర్శనముసేయ "హీరాత్" పట్టణమునకు బోయి నిజముగా పుష్పవర్షముల గురిపించు లతాచుల నీడలందు, సమాధిని గాంచి భక్తిపూర్వకముగా నశ్రువులచే తడిపితినని వ్రాసియున్నాడు. అట్టి మహాశయుని యశస్సును గోజాపుష్పములు తమ నిరంతర దృష్టిచే చిరస్మరణీయముగా నుంచుగాక!

సంపూర్ణము.

# చాటుధారలు

(అనుముల విశ్వనాథ శాస్త్రి, సికింద్రాబాదు.

## రుక్మాంగదుడు

---

(మోహినితో)

పంచ. ప్రతారణంబు మానవో మరాళరాజయాన చం
ద్రతార సాక్షిగా భవత్కరంబు లేఁగుఁబోఁకఁటన్
గ్రతువ్రజంబు సాక్షిగాఁగ బ్రస్తుతింతుఁ బట్టఁగా
మఱిన్ దలంచి యగ్నిమున్న మన్మథానుదిష్టతన్.

## దుష్యంతుడు

(శకుంతలతో)

శా. గాంధర్వంబున కెట్లు బెగ్గిలెదు నిక్కం బెల్లరుం జేసినా
రంధుల్ గారు మహాత్ములింత పితరుల్ రక్షించి శిక్షించిరిన్
బంధింపంగలరే దలంప ననురూపంబైన కామంబునన్
సింధువ్యాపృత భూమినెల్ల జనులన్ సిద్ధంబులీ చందముల్.

## విశ్వామిత్రుడు

(మేనకతో)

చం. ఒదవు సరోజముఖ్య శరయూధము నెట్టన నేయు కాము నె
మ్మదిఁదలపోసియేఁ దలఁక మానిని బెగ్గిలకుందు వేలతా
మృదుతనుమార్దవాత్మవుగదే నను మేనకయేల శిల్గువె
ట్టెమ తమకించి గూడుదము టెక్కెము నెత్తుచు మారుడార్వగన్.

## మేనక

(విశ్వామిత్రునితో)

చం. నను వినుమీ వలంచి మునినాథ సతీవ్యసనంబు మిమ్ముబోం
ట్లను దగులంగరాదు వనలాలిత వాతము భక్షణంబుగా
దనువు గృశింపగా దపము దారుణబుద్ధి నొనర్పు మీకు నా
కును దగులంబు పుట్టుటానగూడునె సౌఖ్యము మెచ్చ రేచలుల్.



హైద్రాబాదు ఆంధ్ర స్వచ్ఛందసేవాదళము

మధ్య: శ్రీయుత కొరివి కృష్ణస్వామి ముదిరాజుగారు



హైద్రాబాదు జీవరక్షాపరిచారకమండలివారు కొచ్చి యందలి అమరావతీవీధిలో దేవీప్రీత్యర్థ మొసంగబడుచుండిన పశు బలిని ఆపివేసిరి. ఆసంతోషమును వెలిబుచ్చుటకై పూజారులును ప్రచారకులును దేవీదేవాలయమునందు కూడిరి.




గుడిపాటి వేంకటాచలం

పోలీసు ఇన్స్పెక్టరు భవానిరావుతో నేనూ వెళ్లాను. బ్రాహ్మణ వీధిలో చిన్న పురాతనపు పెంకుటిల్లది. దాని ముందు పెద్దగుంపు పోగయింది. పోలీసు జవాను నుంచుని ఎవర్నీ లోపలికి పోనీటంలేదు. మేమిద్దరం నడవాలోంచి గదిలోకి వెళ్లాము. దాంటో కిటికీ కింద మూలనున్న పెద్ద నవారుమంచంమీద ఆ అమ్మాయి శవం వుంది. మాసిపోయిన చంగావి చీర, తెల్లని రవికా రక్తంతో తడిసే వున్నాయి. మెడకింద పళ్లతో చీల్చినగాయం కనపడుతోంది. అంత చంటిపిల్ల మొహం నే నెవరికి చూడలా. చిన్నపిల్ల నిద్రలో భయమేసి కలవొచ్చి చిన్న రొమ్ము దుముకుతున్నట్టే ముద్దుగావుంది ఆమె మొహం చావులోకూడా. నాకు ఆపుకోలేని దిగులూ, విచారమూ కలిగాయి. ఆపనిచేసిన అనిర్భాగ్యుడి దగ్గిరకి వెళ్లాము. వాణ్ణి నడవాలో కూచోపెట్టి కావలున్నారు. భవానిరావు పలకరిస్తే వాడు పరా మాట్లాడలేదు. ఇన్స్పెక్టరు శవంగదిలోకి మళ్లీ వెళ్లి 'నోట్సు' తీసుకుంటున్నాడు. నేను ఆ అమ్మాయి చూపు భరించలేక బైటికి నడిచాను.

అరుగుమీద కూచునివున్న పడుచుకుర్రవాడి మొహాకటి నన్నాకర్షించింది. అతని మొహంలో భయమూ, అధైర్యమూ, బాధా విచారమూ నాకళ్లని కట్టేసి నిలబెట్టి జాలి కలిగించాయి.

„నువ్వెవరు?" అన్నాను దయగా.

„వాణ్ణేం చేస్తారండీ?" అన్నాడు ఆత్రుతగా లోపలికి చూసి. నేను లోపలికి మళ్లీ ఆ హంతకుడి వేపు చూశాను. జరిగే యీ గోలతో తనకేం సంబంధం లేనట్లూ, తనేదో తపస్సులోనో, పరలోక ధ్యానంలోనో వున్నట్టూ కూచుని వున్నాడు.

„ఏం చేస్తే నీకేం?"

„మీరూ పోలీసువారేగా! అందుకని అడిగాను"

„నేనెవరైతేనేం! నువ్వెవరో చెప్పవేం?"

„వాణ్ణిప్పుడేంచేసి యేంలాభం? పోయిన దివ్యమూర్తి మళ్లీ రామకదా? చచ్చింతరవాత తయారవుతారు పోలీసు సిబ్బంది. బతుకున్నప్పుడు కాపాడేందుకు ఒక్కరూ కనపడరు...యిప్పుడు వాణ్ణి వురితీసి యేం లాభం? యేం న్యాయం? ఆ పిచ్చివాణ్ణి!"

„పిచ్చా వాడికి!"

„ఐవుండాలి. మీ డాక్టర్లని అడగండి" అని వెళ్లిపోయినాడు.

ఆసాయంత్రం యేంతోచక కాలవవొడ్డున చాలా దూరం షికారువెళ్లి యింటికి తిరిగి వొస్తున్నాను. రాత్రి తొమ్మిది ఘంటలవుతుంది. తదియచంద్రవంక రక్తంతో తడిసిన శంకరకత్తి వలె పడమట జారుతోంది. గాలి రివ్వున వీస్తోంది. కాలవ వాలుకు యెదురుగా రెండోవొడ్డున శవం కాలుతోంది. పక్కనున్న యేలూరులో శవపరీక్ష చేయించి, తీసుకొచ్చి ఆరాత్రే ఆ అమ్మాయి శవం

దహనం జరిగిస్తున్నారు. యెగరకొట్టే ఆగాలిలో నాలికల వలె యెర్రని జ్వాలలు చితిమీదనించి లేచి ఆ నలుగురిని కూడా ఆంతుకో చూస్తున్నట్లుంది. పొద్దున్న చూసిన ముడతలు పడ్డ చిన్న నుదురూ, యేడుస్తున్నట్లున్న ఆ మాయకపు నోరూ తగలపడి పోతున్నాయి. యింక యీ లోకంలో యెవరికీ కనపడవు అనుకుంటో వెళ్ళిపోతున్నాను, గుండెల్లో దిగులు ఆరంభించింది. ఆ సన్నని వెన్నెలలో, ఆ చితి యెర్రనిరంగు తన మొహాన వెలుగులో, వెర్రి చూపుతో, వొళ్ళంతా తడిసి, గాలిలోకూచుని గుండె పగిలేట్టు యేడుస్తున్నాడు.

నా శవముకూడా అవిశ్వంగా తగల పడేరోజును కళ్ళయెదుట భావించుకుంటున్న నాకు, అసమయంలో నా దురభిమానమూ, అధికార గర్వమూ, విద్యాధిక్యతా, అన్నిపోయి, సమస్త జీవరాసులతోటి సమానత్వమూ, తటస్థించినట్లు తోచింది. అతని దగ్గిరికి వెళ్ళి బుజంమీద చెయ్యేసి, “తమ్ముడూ, అబాధేమిటో నాతో చెప్పరాదూ? అన్నాను.”

వెంటనే హృదయకుహరపు తలుపులు విడిపడ్డట్టు “కాలిపోతోంది. కాలిపోతోంది.” అని బిగ్గిరగా యేడ్చాడు. పది నిమిషాల్లో సద్దుకుని, యిట్లా చెప్పాడు నాతో.

“వాళ్లది బీద కుటుంబం అపిల్ల ప్రతిరోజూ మా యింటికి మజ్జిగకు వొచ్చేది. నాభార్య యెప్పుడూ యీపిల్లతో సరసాలాడేది; నేనూ అప్పుడప్పుడు తమాషాకి ఒకమాట వేసేవాణ్ణి. చక్కని చిన్నవవ్వు నవ్వేది. ఆనవ్వు చూడాలని నేనేదో ఒకమాట అనేవాణ్ణి. ఒకసారి బుగ్గమీద నల్లని పెద్ద మచ్చతో మాయింటికి వొచ్చింది. నాభార్య అదేమిటంటే, తడబడ పడి, సిగ్గుపడి, మంచంకోడు తగిలిందని చెప్పి తప్పించుకోవాలని చూసింది. నాభార్య వదలక నిజం చెప్పమని అడుగుతోంది.”

“దుర్గమ్మా! వారం కిందట, దీని మెడమీద యెర్రటి మచ్చొకటి వుంది. అదెట్లా వొచ్చిందో, అడుగు” అన్నాను ఆ అమ్మాయితో. అప్పుడు అరవైనట్టుంది నాభార్యకి అమచ్చ సంగతి. ‘మరీ అట్లానా!’ అని ఆ బుగ్గకేసి చూసి చూసి నవ్వడం మొదలు పెట్టింది. దుర్గమ్మ వుడుక్కుని, కళ్లల్లో నీళ్లు తిప్పుకుని, మజ్జిగ తీసుకోకుండానే వెళ్ళి పోయింది. మరీ అంతమోటు నవ్వేమిటని నాభార్యని కోపగించాను. తరవాత ఒక నెలకి అట్ల తద్దిరోజున నాభార్య ఆ అమ్మాయిని వుయ్యాలమీద వూపెయ్యడానికి నడుం పట్టుకుంటే, నెప్పిని అరిచి, బాధతో కింద కూచుందిట. చీర బలవంతంగా తొలిగించి చూస్తే, యెర్రని మచ్చొకటి కనపడ్డదని చెప్పింది.

మళ్లీ ఒకేసారి మా యింటికి నాలుగు రోజులు మజ్జిగకి రాలేదు. బావిదగ్గిర నా భార్యకి మొహంమీద కట్టొకటి కట్టుకుని కనపడి పిలుస్తున్నా వినిపించుకోనట్టు వెళ్లి పోయిందిట. తరవాత నాలుగు రోజులకి అకట్టుతోనే వొచ్చింది. నేను తమాషా కీలాగు, ఆ కట్టుని లాగేశాను, చూడాలనే. యేం కనపడ్డదంటావు? రెండు బుగ్గల మీదా రెండు వరసలు పళ్లు దిగపడ్డ గుంటలున్నాయి. కళ్లెంబడి నీళ్లు పెట్టుకుంటో దుర్గమ్మ పారిపోయింది. నాకాగాయం చూస్తే భయమేసింది. కారణం వూహించలేక పోయినాను. ఆమె మొగుడు రత్తయ్యని నేనెరుగుదును. చిన్నప్పుడు వాణ్ణి పిచ్చి రత్తయ్య అనేవాళ్లం. ముంగి. యేమీ ఆటలాడేవాడు కాదు. యేం ఆలోచిస్తున్నాడో, యెందుకు బతుకుతున్నాడో తెలిసేది కాదు. తరవాతా అంతే. పెద్దవాడైనా యెవరితోనూ మాట్లాడడు. ఒకరి జోలికి రాడు. భార్య వొచ్చింతరవాత తల్లితో పోట్లాడి వేరే కాపరం పెట్టాడు. వాడి ప్రకారం యీ అమ్మాయిని యెందుకు బాధిస్తాడో(?) చాలా అనుకున్నాను. అడుగుదామంటే అంత పరిచయం అతనితో లేదు. దుర్గమ్మనే అడుగు దామనుకున్నాను. కాని నాభార్య వెనక నుంచుని పరిహాసమే గాని, ‘సీరియస్’గా ఆ అమ్మాయితో మాట్లాడే సంబంధం నాకు లేదు. నా భార్య నడిగ మన్నాను.

ఒకరోజు దుర్గమ్మ తండ్రి మానాన్నగారి దగ్గిరికి వొచ్చి, తనకూతురిని పుట్టింటికి రావాలని వుందనన్నా, రత్తయ్య పంపటం లేదనిన్నీ చెప్పుకుని యేడ్చాడని తెలిసింది నాకు. తరవాత రెండు రోజులకే రత్తయ్య పెళ్లాన్ని రాత్రులు కొడుతున్నాడని వాళ్ల యింటిపక్కన వుండే నాగన్న అందరితోనూ అంటున్నాడని తెలిసి, వాణ్ణి నిజమేనా అని అడిగాను. వాడు నాకే రుజువు చేస్తా

ను, రాత్రి పదకొండింటికి రత్తయ్య యింటిపక్కన నించోబెట్టాడు గాని యేమి తెలీలేదు. మళ్లీ వాళ్లింటికి తొరగా రమ్మని లేపి తీసుకుపోయినాడు. గదిలో పల్చంచాలిగా బాధతో మూలుగు వినపడ్డది. అది యింకా పెద్దదై యేడుపు మోస్తరుగా మారింది. కంఠం స్వరం దుర్గమ్మది. కాని కోపంతో కేకలు లేవు. రత్తయ్య వల్ల మళ్లీ విన్నాను. నాకర్థమై పట్టరాని నవ్వొచ్చింది. పైకొచ్చి, నాగయ్య పిలిచి; ఆమూలుగు అర్థం, సిగ్గూ నవ్వు కలిపి వంతవరకు చెప్పాను. వాడు మరీ అంతభయంకరంగానా? అని నవ్వాడు. మర్నాడు దుర్గమ్మ రాగానే కనుక్కోమని నాభార్యతో చెప్పాను. మర్నాడు నేను నాభార్య, దయగా అడిగాము, „నిన్ను రత్తయ్య కొడతాడా? మేం మందలిస్తాము" అని. మొహంలోకి భయము చెప్పరాని భయంకరమైన సిగ్గూవొచ్చి, "లేదు, లేదు" అని యేదో విధంగా అంది. మళ్లీ మళ్లీ అడిగినా యింకేం చెప్పలేదు. అటు తరవాత యీ గాయాలన్నీ వాళ్ల సరసాల తరహా అని దుర్గమ్మకికూడా ఆ విధమైన ప్రేమ సుఖంగానే వుందని, నిశ్చయించుకున్నాము. దుర్గమ్మని చూడగానే పట్టరాని నవ్వు వొచ్చేది. ఆ అమ్మాయిని చూడగానే, "యేందుర్గమ్మ, యెక్కడన్నా కొత్తమచ్చలు?" అని మొదట నాభార్యా, తరవాత నేనూ అనడం మామూలయింది.

తరవాత నెలరోజులలో నాభార్య ప్రసవానికి పుట్టింటికి వెళ్లింది. ఒక సాయంత్రం మాదొడ్లో దుర్గమ్మ గోంగూర కోసుకుంటూ వుండగా నేనక్కడికి వెళ్లడం తటస్థించింది. అప్పుడే చీకటవుతోంది. విచ్చుతున్న పచ్చచంద్రకాంతి. పువ్వులతో నవ్వుతో సరసా లాడుతోంది గాలి. రాత్రి శాంతి అప్పుడే భూమి నావరించింది. ఆకులు దాటాకు యెదురు చూస్తో, తాళ్లు లాక్కుంటున్నాయి. దగ్గిరికి వెళ్లి, మామూలు ప్రకారం, „యేం కొత్తమచ్చలు లేవూ" అన్నాను. సిగ్గుపడక చిన్న నవ్వుతో „లేవండి". దాంతో నామనసులోకి యెన్నడూ ఆమె మీద కలగని వికార మొకటి వుదయించింది. భార్య దగ్గర లేక పోవడమే కారణమనుకుంటా. యింకా దగ్గిరగా నుంచుని కొంటెగా, „యేం కొత్తమచ్చలు లేవూ" అన్నాను.

„వుంటే కనపడవూ!" అంది ధైర్యంగా. „కనపడని చోట్ల." అన్నాను.

కళ్లూ తలా తిప్పేసింది. యెప్పుడూ అనిపిస్తుంది, కాని ఆసమయంలో ముఖ్యంగా ఆ అమ్మాయిమీద, నిష్కారణమైన జాలీ, ఉన్నతమైన ప్రేమా కలిగాయి. ఆమె చూపులో యేదో వుంది. యెట్లానన్నా ఆమె కేదో సహాయం చెయ్యాలనిపిస్తుంది. నేను చెయ్యగలిగిన సహాయం ఒక విధమే కనపడ్డదప్పటికి. ప్రేమకి, కామానికి, జాలికి, యెంత సన్నిహితమో! తెల్లచీర మోకాళ్లవరకు కట్టి వొళ్లో ఆకులు వేస్తోంది. పచ్చని రవిక ఆమె చిన్న రొమ్ముని బిగువుగా కప్పివుంది. పాపం ఆ చీకటి వొంటింటో యీ గోంగూరని వండి, ఆ ముంగిమొగుడికి తినిపిస్తుంది...వాడి తిట్లు పసుతో, యెంతో చెప్పరాని జాలి కలిగింది. యెట్లా యివ్వను సంతోషం యీ చిన్ని లేత హృదయానికి? ఆమె మొహం నాకేసి తిప్పుకుని „యేవీ, మచ్చలేవీ, చూడనీ," అని భుజంమీద పమిటా, రవికా తొలిగించాను. దుర్గమ్మ మెల్లిగా మళ్లీ కప్పుకుంది. ఆమె నిదానంగా యింకా కూర కోసుకుంటోంది. చూస్తే నా అవస్థ ఆమెకర్థమై వుండును. నాకాళ్లు వొణుకుతున్నాయి. రెండో భుజం చూశాను. అక్కడో పెద్ద నల్లమచ్చ కనపడ్డది. యింకొంచెం కిందిగా యింకోమచ్చ.

„చూడకండీ" అని సిగ్గుతో పైట లాక్కుంది.

„పాపం, దుర్గమ్మా!" అని దగ్గిరికి లాక్కున్నాను. అప్పటికి కూడా మోహావేశంలో నాకే అర్థం కాలేదు.

„యెందుకు నామచ్చల గోల నీకు? యెప్పుడూ నవ్వుతావు వొళ్లంతా అవే" అని మోకాళ్లమీద చీర తీసి చూపింది. అల్లరికి యింకా పైకి చప్పున లాగాను. దాంతో నాకు పిచ్చిపోయింది. ఆమెను గట్టిగా పట్టుకున్నాను. ఆ అమాయకపు కళ్లలోకి అప్పటికి కలిగింది జ్ఞానము. వెంటనే భయంకరమైన మార్పు వచ్చేసింది. ఆచిన్న మొహంలోకి. యిప్పుడు కాలిపోతున్న ఆమొహంలోకి బాధ, చెప్పలేని బాధని, ఆ మొడకాయి తెగుతున్న గొడ్డి వేళ్లలోకి వొచ్చే మార్పు.

"నీకు చెల్లెల్ని అన్నయ్యా, కొరక్కు. నీకు మంచిదా యీ బుద్ధి? నీకాళ్లు పట్టుకుంటా, నన్ను కొరక్కు." అని కీచుమని అరిచింది. నా మోహమూ, పొక్కు దెబ్బతో ఝుగిరి పోయింది. భరించలేని సిగ్గుతో నామీద నాకే పరమ అసహ్యంతో, యింట్లోకి వెళ్లిపోయి, చాల సేపు ఒంటిగా ఆలోచించుకున్నాను. కళ్లమ్మట నరకంలో నిండిన ఆశ చూపే నిండి పోయింది. నన్ను నేను కోసుకోవాలన్నంత అసహ్యం దిగులూ పుట్టాయి. ఆకళ్లి పాటికి పొగ్గయి వుంటాయి. అప్పటినించి యింతవరకు నేను పరాయి ఆడదాన్ని తాకలేను. యెన్నోసార్లు అట్లాంటి సమయాలు తటస్థించినా, తనే కాకుండా లోకాన్నంతా నాకు చెల్లెళ్లని చేసేసింది దుర్గమ్మ. తల్లి కాలి పోతోంది.

అట్లా, 'కొరకొద్దన్న' యెంత దీనంగా అరిచిందో. ప్రేమన్నా, లాలనన్నా, దుర్గమ్మకి కొరకడమని, లేక కొరకడంతో మొదలని అభిప్రాయం కాబోలు! యెంతో జాలి పుట్టికలిగింది. ఆ రత్తయ్యని వెళ్లి తన్నాలనుకున్నాను. కాని దుర్గమ్మతో యిట్లాంటి పని జరిగిం తరవాత వాడిని తన్నడంగాని, వాడితో మాట్లాడడంగాని, వీలు లేదనిపించింది. యేంచెయ్యను? దుర్గమ్మని తెచ్చేసి మాయింటో వుండమంటే, పారిపొమ్మంటే, యెక్కడన్నా వుంచితే! నాపైరి వూహాలుచూసి నేనే సిగ్గుపడి వూరుకున్నాను.

తరవాత నాలుగు నెల్లు నే నత్తవారింటికి వెళ్లాను. భార్యతోనూ, కొత్తగా పుట్టిన మొదటి బిడ్డతోనూ నామనసు నిండిపోయి సంతోషంతో పొళ్లుమురిచి వున్నాను. అప్పటికి రత్తయ్య మీద పూర్తంతా పుకార్లుగా వున్నాయి. కొంద రీతనికి పిచ్చెత్తిందంటున్నారు. యిద్దరు ముగ్గురు యీడిగ ఆడవాళ్లని పట్టుకుని మీదపడి కరవడంతో మొదలు పెడితే, వాళ్లే అతన్ని తన్ని పంపించారు. తరవాత బైటికి వెళ్లిన ఆడవాళ్లని వెంబడించి, బలవంతం చేసి పట్టుకుని, కరవబోతే, వాళ్లు దొంగ అనుకుని గోల పెట్టారట. దుర్గమ్మ రెండుసార్లు యింట్లోంచి పారిపోయిందట. ఆమె పారిపోయినప్పుడే యీ రత్తయ్యకి యీ దుర్గుణాలు యెక్కువ కావడం కనిపెట్టి, దుర్గమ్మ అతని దగ్గిరే వుండేట్టు వూరివాళ్లు ప్రయత్నించారు.

ఒకరోజు రాత్రి పదింటికి దుర్గమ్మ పక్క సందులోకి తెరుచుకునే తలుపు కొట్టింది మాయింటికి. నా గది అదేపని తెలుసు. నేను తలుపు తెరిచిచూసి లోపలికి రమ్మన్నాను. నాభార్య మంచంమీద నిద్ర పోతోంది. నేను కుర్చీలో పడుకుని చదువు కుంటున్నాను పిల్లవాడి తొట్టి వూయిస్తూ. మమ్మన్ని, సౌఖ్యంవూడిపడ్డట్టు కనపడే మాగదిని దుర్గమ్మ మాట్లాడక, తేరిపారచూస్తూ కొంచెంసేపు నుంచుంది. ఆమెనట్లా చూస్తూ కూచోడం నేనుభరించ లేక "యేమిటి దుర్గమ్మా, యింతరాత్రి వొచ్చావు?" అన్నాను.

"యీరాత్రికి మీయింట్లో... ఆ వసారాలో... యెక్కడన్నా పడుకోనియ్యండి" అంది కష్టంగా. నాకాశ్చర్యం కలిగింది. ఆవింత ప్రార్థనకీ కారణం తెలుసుకోవాలని కోర్కె చాలా ఉదయించింది. "దానికేం; పడుకో... కాని యెందుకు దుర్గమ్మా! మీయింట్లో వీలులేదా?"

మాట్లాడక, గుడ్లనీళ్లు కుక్కుకుంది. యింక మాట్లాడేట్టు లేకపోతే, నేను లేచి వరండాలో మంచమూ, జంపకానా వేసి, వెళ్లి పడుకోమన్నాను. నా వెంట వొచ్చింది. మంచం దగ్గిరికి వెళ్లగానే, నా చెయ్యి తీసుకుని కళ్ల నద్దుకుని, వెక్కి వెక్కి యేడ్చింది. మంచంమీద కూచోపెట్టి, తలమీద చెయ్యేసి, తన విచారమంతా నాతో చెప్పమని బతిమాలాను. నాకు అపరిమితమైన జాలి కలిగింది. కాని యెంతసేపున్నా యేడుపేగాని, యేమి చెప్పదు.

"నిర్భాగ్యురాలిని. నాతో మీ కెందుకు? వెళ్లి పడుకోండి" అంది.

మన పక్కనే వుంటారు, మనతో స్నేహంగా వుంటారు, బాధపడుతో, గాయాలుపడుతో, మన కళ్ల యెదటె మృత్యువుపైపు నడుస్తోవుంటారు, కాని సహాయం చెయ్యడం మన చాతకాదు, సహాయం తీసుకోడం వారి చాతకాదు. విచిత్రమైన లోకం! భయంకరమైన జీవితం!

తెల్లారి నేను లేచేప్పటికి అప్పుడే వెళ్లిపోయింది దుర్గమ్మ.

మళ్లీ రెండురోజుల తరవాత, ఒకనాటి మధ్యాహ్నం నేను వసారాలో పడుకుని అబ్బాయిని కాళ్ల మీద కూచోపెట్టుకుని గిలిగింతలతో నవ్విస్తున్నాను, దుర్గమ్మ వొచ్చి మంచం పక్కగా కూచుంది.

„అన్నయ్యా, నన్నెక్కడికన్నా పంపియ్య రాదా?" అంది. కన్నీళ్లతో.

„యెక్కడికి పంపను? యెందుకు వెళ్లిపోతా నంటావు? నీకష్టమేమిటో నాతో చెప్పవుకదా?"

మళ్లీ మాట్లాడలేదు. ఆమె వంక చూస్తే నాతో చెప్ప తలుచుకున్నట్లు కూడా లేదు.

„రత్తయ్య నిన్ను బాధ పెడతాడా? నీకేం భయం లేదు చెప్పు. నిన్ను మళ్లీ యేం చెయ్యకుండా కట్టుదిట్టం చెయ్యగలను."

„ఆయన చాలా దయగానే వుంటారు. కాని నా ఖర్మం. మీరేమి మళ్లీ ఆయనతో అనకండి."

„అయితే యెందుకు వెడతానంటావు?"

మాట్లాడదు.

„సరే, మీ పుట్టినింటికి వెళ్లరాదా, పోనీ మీ అన్నయ్య యింటికి వెళ్లకూడదా?"

„ఆయనకి యెక్కడున్నానో తెలీకూడదు"

„ఇదంతా విచిత్రం దుర్గమ్మా! అంతమంచి మొగుడి దగ్గిర్నించి పారి పోవడ మెందుకు?"

మాట్లాడదు. విసుగెత్తి వూరుకున్నాను. అప్పుడు నా కర్థంకాలేదు. యీవాళ డాక్టరు శవ పరీక్ష చేసినప్పుడు; చూస్తే, వొళ్లంతా కొరుకులు, మచ్చలు, గాట్లు, పొట్ట తొడలు రొమ్ములు, అన్నీ ఆచిన్నమృదు శరీరం, యెన్నెన్ని పడ్డదో ఆబాధ పాప మాబిడ్డ! నాతో చెప్పలేదని నాకు కోపం, చిరాకూ వొచ్చాయిగాని, యెట్లా చెప్పు కుంటుంది నాతో! నాకర్థ మవుతుందనుకుంటుందా? అభిమానంగల స్త్రీ యెట్లా చెప్పకుంటుంది?

మళ్లీ రెండు రోజుల్లో యింటోంచి పరుగెత్తుకొని పోయిందని పుకారు. అందరూ వొకటే నవ్వు ఆ కాపరాన్ని చూసి. వెకాకోళాలు. యింత వూళ్లో, యెందుకిట్లా పరిగెత్తి పోతుంది, యెవరిది తప్పు అని తెలుసు కోడానికి ప్రయత్నించినవాడు ఒక్కడు లేడు. పొద్దున్నే మర్రిచెట్టు కింద కబుర్లు చెప్పుకొనేందుకు విషయం దొరికింది కదా, అని సంతోషించే వాడే కాని! అయినా, నేను మాత్ర మేంచేశాను, వాళ్ల వనడ మేగాని పదిరోజుల్ల తరవాత, తిండిలేక, వడ తగిలి పడి పోతే, యీతల్లో, గవళ్లవాళ్లు తీసుకొచ్చి రత్తయ్య దగ్గిర దిగపెట్టారు. యింక వూరుకో కూడదు. నేను రత్తయ్యతోనే మాట్లాడి దుర్గమ్మకి బాధ మాన్పించాలని నిశ్చయించు కున్నాను. రాత్రి యీ పని జరిగింది. రాత్రి దుర్గమ్మని వాడు కొడుతో వుంటే కాలస్త్రీవుంటే, వూరంతా వింటున్నారు. ఒక్కరు కదల్లేదు. తెలార్లూ కిటికీలూ, తలుపులూ, బిగించుకుని, లోకంలో యేం జరుగుతున్నా తెలియక, నాభార్యతో, బిడ్డతో హాయిగా నిద్రపోతున్నాను.

యేం జరిగిందో యెన్నడన్నా తెలుస్తుందా? యెవరు చెపుతారు? వాడా! వాడేమి చెప్పడు. చెప్పినా అన్నీ అబద్ధాలు. వాడికి అసలు తెలుసా? ఆ కాలిపోయిన పెదిమలు యిది వరకు చెప్పలేవు. యింక చెప్పవు.

# నిశాగీత

పెనుమర్తి వేంకటరత్నము (యువకమండలి)

౧

పరిచితములైన యీ ధరాభాగము లివి
అతినిశాతహేతిచ్ఛటాగతులు గ్రమ్మె!
కాలుకదపిన నేదిశాంగణము నుండి
వచ్చునో యేమొ! మొనతర వాఁకిటఁత!
తలుచుక్రమ్మిన చీఁకటి పొరలలోన
విస్మృతించితి దైనిక విభవమెల్ల
కడలఁబరికించి ననుగూడఁ గానఁబడఁడు
దాని యంతశ్చరిత్ర సంధాత యెవఁడు?
గీనబుచివు నాకు న జకుంకుమము తాకి
కాలతామిస్రలాస్యముల్ గ్రమ్ముకొనియె!
ఈ యనంతక్ష్మాలక్రమ మింకమీఁద
నడువదా! యేమి, యని భయోన్మాదినైతి.

౨

ఎపుడు నాటెనో నాకస లెఱుకలేదు!
నాచరణరేఖ రుధిరసంధ్యాస్రవంత్రి
యయ్యె, కొంచెము శమియించినట్లె యుండి
కలకవెట్టె గాటముగ నాకంటకమ్ము.
చిగురువంటి పాదమ్ము, గ్రుచ్చితిని కొక్క-
ముల్లు, పూర్వపు కంటకమ్ము వెలిదీయ
ఏమిసేతును! కంటక మ్మదియుఁ గూడ
మొదటిదానికిఁ దోడుగా ముసుచుకొనియె!

౩

ఒక కుటిలపన్నగమ్మునన్ గికుఱవెట్టి
లాగుకొని పోవుచున్నది! లాఘవముగ
దాని యాజ్ఞానుసారము, దాసుఁడనయి
పోవుచుంటిని గహనంపు భూములందు!
అది పృథఙ్మార్గగామియై, అరగి యరగి
అట్టె పెనుఁబడివచ్చు నన్నాగ్రహించు
ఓప్రభూ! యని వినయనతోత్తమాంగ
భక్తిభావప్రకర్షులఁ బల్లటిలుదు!
ఎన్ని దినములనుండి యిట్లేగుచుంటి
నేల చనుచుంటి ననిగూడ నెఱుఁగలేను!
దాని పూత్కార జిహ్వాకా దాసుఁడనయి
ఒదిగి యొదిగి నమస్కృతు లొనఁగుచుంటి!
బాట తప్పిపోయితినేని పాపతేని
చూడకుండ నిమేష మోర్చుకొనలేను!

౪

ఏలనో! పోవుచుంటిని, యెఱుఁగలేను!
తీవ్రమ్ముగ పిచ్చియెత్తినది నాకు!

# స్త్రీల ప్రభుత్వము

గంగరాజు రఘునాథరావు

సైబేరియా ఉత్తరభాగమున స్టాకం అను పట్టణముగలదు. ఇది రెండుపర్వతములమధ్యనున్నది. సైబేరియా ప్రాంతము నిర్జనముగనున్నట్లు మనకు తెలిసేయున్నది. అచటనచటనున్న పురములు బహుదూరమున నుండుటచే ఒకరి సంగతి వేరొకరికి తెలియదు. స్టాకం పట్టణము జన సమ్మర్దమునుండి అతిదూరప్రదేశమున నున్నది. ఇది సైబేరియా దేశపు చివరిభాగమున నుండుటచే ఆదేశీయులలో పెక్కుమందికి పట్టణమున్నట్లు తెలియదు. రష్యాదేశమును జారుచక్రవర్తులు పాలించుచుండిన కాలమున సైబేరియాప్రాంతముయొక్క ఇతర పట్టణములవలె స్టాకంకూడ రాజకీయబందీల నివాసస్థానమయి యుండెను. రష్యావిప్లవమునందు స్త్రీలే అధిక సంఖ్యాకులు పాల్గొనిరి. వీరు ప్రభుత్వముచే అరెస్టుచేయబడి స్టాకం మొదలగు పట్టణములకు పంపబడుచుండిరి. స్టాకం పట్టణమునకు స్త్రీలే అధికముగ పంపబడుచుండుటచే కొన్నిసంవత్సరముల పిదప వీరిసంఖ్య పురుషుల సంఖ్యకంటె పెరిగి పోయెను. వీరిలో పెక్కురు సమర్థురాండ్రగుటచే ఈ పట్టణపరిపాలనమునందు ప్రాముఖ్యము వహించిరి. జారుప్రభుత్వ మంతరించిన పిదప సైబేరియా నందలి పట్టణములన్నియు స్వతంత్రములయ్యెను. అందువలన స్టాకం నివాసులొక ప్రజాస్వామ్యము (Republic) స్థాపించిరి. స్త్రీలే అధిక సంఖ్యాకులుండుటచే పరిపాలనాయంత్రము వారే నిర్వహింప దొడగిరి. పురుషులు స్త్రీలుపాలించుట తమకగౌరవమని తలంచి స్టాకం పట్టణమును విడచిపోవుట కుద్యమించిరి. కాని పట్టణము విడచి పోకుండునట్లు శాసనములు చేయబడెను. కొన్ని సంవత్సరములు గడచిన పిదప రాష్ట్రముయొక్క పరిపాలనమంతయు స్త్రీల హస్తగత మయ్యెను. అందుచే సైన్యమును, రక్షకశాఖయును కూడ స్త్రీలే చేపట్టుకొనబడిరి. పురుషుల సంఖ్య మొదటినుండియు స్వల్పముగ నుండెను. వారయినను విద్యాగంధము లేనివారు. కనుక పురుషులు స్త్రీలకు సంపూర్ణముగ లోబడిపోయిరి. కొందరు ధైర్యవంతులు అడ్డు తిరుగగ వారు చంపబడిరి. పూర్వమునుండియు యీపట్టణమునకు ఇతర ప్రపంచముతో సంబంధము లేకుండెను. రిపబ్లిక స్థాపనానంతరము వారు తమసంబంధము సంపూర్తిగ విసర్జించుకొనిరి. ఇతరులు యీప్రభుత్వము యొక్క అనుమతి లేనిది రిపబ్లికు హద్దులలోనికి రాకుండునట్లు శాసింపబడెను. ఈ లోయలోనికి పోవుటకు ఒకటే కనుమగలదు. ఇచట సైనికభటస్థానము గలదు. వారు నిరంతరము కాపలా గాయుచుందురు. అందుచే ప్రభుత్వానుమతిలేనిది యెవరయినను రాష్ట్రమునందు కాలిడజాలరు. స్టాకం పట్టణము గాక ఆ లోయనందిప్పుడు సుమారు ౨౦౦ గ్రామములు గలవు. మొత్తము జన సంఖ్య ౮౦ వేలు.

సైబేరియా ప్రాంతమున ఆరు మాసములు అమితముగ మంచు కురియుటచే సేద్యము జరుగజాలదు. కాని యీరాష్ట్రమువారిఅదృష్టమువలన కొన్ని వేడినీటిచెలమలు కనుగొనబడినవి. వీని సహాయమున ఇప్పుడు సంవత్స

రము పూర్తి నేద్యము జరుగుచున్నది. అందుచే నీ రాష్ట్రము దినదిన సక్రమము అభివృద్ధి నొందుచున్నది.

స్త్రీలు రాష్ట్రపరిపాలనమునే తమ హస్తగత మొనర్చుకొనలేదు. వారన్నివృత్తులు నవలంబించి పురుషుల లోబరచుకొని యున్నారు.

స్త్రీలు స్టాకం రిపబ్లికు స్థాపించుటకు దిగువ సూచింపబడిన కారణములయి యుండవచ్చును:—

(౧) రాష్ట్రమునందు స్త్రీల సంఖ్య హెచ్చుగా నుండుట

(౨) నూతన మతము:— ఈ మతమును రష్యా విప్లవమునకు పది సంవత్సరములకు పూర్వము మాస్కో పట్టణమున నొక స్త్రీ [క్లారాడోన్సికీ] ప్రచారము చేయుచుండెను. ఆపె ప్రభుత్వము వారిచే పట్టుబడి స్టాకంకు పంపబడెను. అచట యీ మతము ప్రచారము నొందుట చే రిపబ్లికు స్థాపింపబడెను. ప్రస్తుతమీ మతమే రాష్ట్రీయులు స్వీకరించియున్నారు. ఈ మతము యొక్క ముఖ్య సూత్రములివి. తల్లియు, తండ్రియు, కొడుకులోను, తల్లియే ముఖ్యస్థానము వహించియున్నది. తల్లి మేరీయు (Mary) దేవత వలన సృష్టింపబడినది. అందుచే తల్లియే ముఖ్యదేవత: తండ్రి సహాయకుడు మాత్రమే. కొమారుడగు జీసస్ క్రైస్తు ప్రవక్త మాత్రమే. అందువలన యీ మతమును నమ్మువారు స్త్రీలకే పురుషులకన్న గొప్ప దర్జా నివ్వవలెనని యెంచుదురు. హిందూ ధర్మమునందు „మాతృదేవోభవ, పితృదేవోభవ" అని యున్నది ఇట్టి వ్యతిరేకాభిప్రాయములు కలుగవందుకు సూచింపవలసి యున్నది.

(౩) పురుషులకు స్వాతంత్ర్యములేకుండ చేయుటకు చేయబడిన రాజకీయ యేర్పాట్లు దీనివలన వారికి నామ మాత్రము కూడ నుండిన స్వాతంత్ర్యము కొన్ని శాసనముల ద్వారా లేకుండజేసిరి. పురుషులు గృహములందుంచబడిరి. వారు బయటికి వచ్చి ఇతరులతో కలియకుండ యేర్పాట్లు జేసిరి. ఇంతేకాదు. వారు వేరొక పురుషునికి లేఖయైనను వ్రాయకూడదు వ్యతిరేకముగ నడచిన వారికి శిక్ష లొసంగబడెను. ఇంతియేకాక మత ప్రచారకురాలగు క్లారాడోన్సికీ ఇంటింటికి పోయి పురుషులకు పై శాసనము పరమేశ్వరునిచే పంపబడినట్లును, దీనిపైననే వారి అభివృద్ధి యాధారపడి యున్నట్లును, వారి ముక్తి మార్గమయినట్లును, బోధించెను. స్త్రీలు తమ విధ్యుక్తధర్మములు నిర్వహించిరి. పురుషుల యిల్లువెడల నీయలేదు. కొంత కాలము పిదప ఇది ఈ నూతన మతము యొక్క నొక ధర్మమయ్యెను. పురుషులు గృహములయందుండుట మతధర్మమని తలంపబడెను.

ఈ విప్లవమునకు కారణము లేమయినను పర్యవసానము మాత్రము విచిత్రముగ నున్నది. గృహకృత్యములన్నియు పురుషులే చేయవలయును. పిల్లలను కూడ వీరే కాపాడవలయును. స్త్రీలు గర్భిణులయియున్న ప్రభుత్వ కార్యములనుండి సెలవొసంగబడును. ఈ కాలమున వారికి వేతనము లభించును. ప్రభుత్వోద్యోగముల యందు లేనివారికి ప్రైవేటు నిధులవలన సహాయము చేయబడును. ప్రతి శిశువుకు ప్రభుత్వము వారు వేతనము నొసంగెదరు. బాలికలకు బాలురకన్న రెండింతలివ్వబడును. స్త్రీలు శిశువులకు మూడుమాసముల వఱకే పాలిచ్చెదరు. అటుపిమ్మట శిశువులను పురుషులు గోవులు, మేకల పాలతో సంరక్షించవలయును.

పురుషులేకాక బాలురు కూడ గోషా యందుంచబడుదురు. వీరు తండ్రితో కూడ గృహకృత్యములు నిర్వహించవలయును. పురుషులకును, బాలురకును విద్య గఱపబడదు. స్టాకంనందు కళాశాలలు, పాఠశాలలు గలవు కాని అవి స్త్రీల కొఱకును, బాలికల కొఱకునే ప్రత్యేకింపబడియున్నవి.

వివాహవిషయమునందు కూడ యొక నూతనపద్ధతి గలదు. దీనికై నొక ప్రత్యేక కార్యాలయము కలదు. ఇందు బాలురయొక్కయు, భార్యావియోగపురుషులయొక్కయు, పేర్లు, విలాసములు, ఇతరవివరములు వ్రాసియుంచబడును. ఏ స్త్రీయయినను వివాహము జేసికొన దలచిన యీ కార్యాలయమున దరఖాస్తు ఇవ్వవలయును. పిమ్మట స్త్రీయొక్క వయస్సు, బుద్ధి కుశలత, ఆస్తి, మొదలగునవి తెలిసికొని పురుషుల పేర్లపట్టిక నొసంగబడును. అంత ఆమె తనకు తగిన వానిని యెన్నుకొని అధికారికి తెలుపును. పురుషుడు కూడ స్త్రీని మెచ్చిన వివా

హము జరుగును. పురుషుని వివాహసంబంధము గూర్చి విచారించరు. చట్టానుసారము ఆతడు తన పోషకుడు సమ్మతించిన స్త్రీనే వివాహమాడవలయును. పోషకులలో మొదలు తల్లి. తల్లి లేనిచో సోదరి. వీరిలో రుషులు లేనిచో వివాహమైన బంధుత్వమున్న స్త్రీయగును. ఇది కూడ లేనిచో ఆ పురుషునికి దగ్గరగిన క్షేమాభిలాషయున్న ఆ స్త్రీయే పోషకురాలుగ నిర్ణయింపబడును.

వివాహ సందర్భమున చర్చి (ప్రార్థనాలయము) అలంకరింపబడును. వరుని అలంకరించి గోషాయందుంచి అచటికి గొనివత్తురు. సమీప బంధువులు దప్ప ఇతర పురుషులు రాకూడదు. ప్రార్థనాలయమంతయు స్త్రీలచే నిండియుండును. పురుషుడు మరియొక దేవతా విగ్రహము యెదుట ఎల్లప్పుడు స్త్రీకి లొంగియుండెదననియు, మత ధర్మములు, రాష్ట్ర శాసనములు మనస్ఫూర్తిగా ఆచరించెదననియు, ప్రమాణము చేయవలయును. ఇది జరిగిన పిదప దంపతులు గోషా బండియందు ఎక్కి తమ గృహమునకు పోవుదురు. ఇంతియుకాక ఆ రాష్ట్రమున పురుషులు గడ్డము, మీసములు, నున్నముకొనుటకు అనుమతించి యుండలేదు.

ఈ నిబంధనల వలన పురుషులకు కష్టములున్నను, స్త్రీలు వారిని బాగుగనే చూచెదరు. స్త్రీలు ఆడంబరహితమయిన దుస్తులు వేసికొందురు. పురుషులకు అందమైన విలువగల దుస్తుల నిచ్చెదరు. వారికేలాటి కష్టము కలుగకుండ చూచుచుందురు. సాయం సమయమున గోషా బండ్లయందు ఎక్కి షికారుకు పోవుటకు పురుషులకు సెలవు నిచ్చియున్నారు. వారి శాసనములకు వ్యతిరేకముగ నుండని అన్ని విషయములు అనుభవించుటకు అనుమతించియున్నారు.

ప్రస్తుతము రిపబ్లిక్ ప్రభుత్వము పట్టణమును ఆరోగ్య సూత్రములననుసరించి నిర్మించుచున్నారు. ప్రతి యింటి వెనుకభాగమున ఉద్యానవనముండును. ఇందుచే పురుషులకు సాయంత్రము గాలిలో తిరుగుటకు వీలు కలుగును.

అచటి గ్రంథములు స్త్రీలు పురుషుల గోషాయందుంచుట రాజకీయ కారణములు కావని నిరూపించుచున్నారు. పురుషుడు సంఘమునందలి చెడుగులకు ముఖ్య కారకుడనియు కనుక అట్టి పురుషుని గోషాయందుంచిన చెడుగులు వ్యాపింపవనియు చెప్పుచున్నారు.

పై విషయములు చదివిన పిదప మనకు మహాభారత కాలమునాటి ప్రమీల రాజ్యము జ్ఞప్తికి వచ్చును. అయినను ఆ రాష్ట్రమున పురుషులు మచ్చునకయినను లేకుండిరి. పైన చెప్పబడినట్టి అనవసరమగు శాసనములుకూడ లేవనియే చెప్పవచ్చును. స్త్రీస్వాతంత్ర్యమనగా నిట్టిదియే యనుటలో సందియము లేదు? విద్య లేనిచో మనుజులు పశువులుగా మారవచ్చును. మన దేశమునందు విద్యాగంధము లేని స్త్రీలు స్టాకం నందలి పురుషుల వలె జీవితము గడుపుచుండుట లేదా? కాల మొక్కరీతి యుండదను విషయము స్టాకం ప్రజలు జ్ఞప్తియందుంచుకొందురుగాక!

# ఆంధ్ర పుత్ర!

మల్లాది వేంకట నాగభూషణము

అమ్మవోలెను సర్వకాలమ్ము లందుఁ
బాడి పంటల నొసఁగి కాపాడుచున్న
యాంధ్ర దేశంబున జనించి యశము నందు
త్యాగవీరులఁ దలఁపుమో యాంధ్రపుత్ర!

వాసిగన్న నాగార్జునా వాసభూమి
మల్లికార్జునభ్రమరాంబ మందిరంబు,
మించి పాతాళగంగ రహించుచోటు
యట్టి శ్రీశైలమునునెంచు మాంధ్ర పుత్ర!

ఆంధ్ర దేశోదధీద్వార మనఁగ వెలసి
ప్రబల విఖ్యాతి గాంచిన పట్టణంబు
నోడలాగెడు రేవచు నుల్లసిల్లు
నట్టి మోటుపల్లిని నెంచు మాంధ్ర పుత్ర!

ధాన్యరాసుల కునికియై ధాన్యవాటి
కయను సార్థకనామానఁ గ్రాలుచుండి
చోడులకు రాజధానియై సొంపు గాంచి
నట్టి చందవోలును నెంచు మాంధ్ర పుత్ర!

వేయికాళులమండపమే యశంబు
చాటుచుండ రాచరికంపు నీటు చూపి
పాత కథలను బాడుచు వఱలుచున్న
యట్టి యనుమకొండను నెంచు మాంధ్ర పుత్ర!

క్రూరరాక్షసమృగకోటి గూడియున్న
సాంద్రవనియై తనరు నీ యాంధ్రభూమిఁ
బ్రథమరాజ్యంబు స్థాపించి ప్రణుతులందు
నట్టి యాంధ్రవిష్ణుని నెంచు మాంధ్రపుత్ర!

గౌతమీ పినాకిని మధ్య భూతలంబు
గెల్చి ధరణికోటపురిని నిల్పి యాంధ్ర
దేశ మఖిలగతుల యశోరాశిఁ జేసి
నట్టి శాతవాహను నెంచు మాంధ్ర పుత్ర!

ధరణిని బృహత్కథాసరిత్సాగరంబు
దేశభాషను రచియించి తేజ మొప్ప
శాతవాహను మంత్రియై నీతి నిలయుఁ
డా గుణాఢ్యశర్మను నెంచు మాంధ్ర పుత్ర!

గంగ కావేరులకు మధ్య గత తలంబు
లీల నేకఛత్రంబుగా నేలుచుండి
వార్థి కావలిరాజుల ప్రార్థనంబు
లందు శాతకర్ణుని నెంచు మాంధ్ర పుత్ర!

రోము చీనా టిబెట్టు సయాము తుర్క
పారశీకమై గుప్తాదిప్రభువరేణ్య
రాయబారుల వినతి పత్రంబులందు
నట్టి పులుమాయిప్రభు నెంచు మాంధ్ర పుత్ర!

టిబెటు చీనా జపానాది దేశములకు
నాంధ్ర దేశప్రతిభతోడ సతుకు వఱచి
బౌద్ధనీతిధర్మగ్రంధవారములను
నంపు నాగార్జునుని నెంచు మాంధ్ర పుత్ర!

తేజమందిన చాళుక్యరాజధాని
యాంధ్రభారతి నర్తించు నాటపట్టు
కీర్తివల్లరి నెలకొల్పి కేరుచుండి
నట్టి రాజమంద్రిని నెంచు మాంధ్ర పుత్ర!

పీఠికాపురమందున విమలదాన
శాసనంబును నెలకొల్పు సద్గుణాబ్ధి
శ్రీజయాంబికభర్తయు రాజమౌళి
యైన మనుమగొంకని నెంచు మాంధ్ర పుత్ర!

అనుమకొండను రాజ్యంబు ననువు పఱచి
కటకమును దేవగిరి గెల్చి కాంచి యశము
భవ్య భవనమందిరంబుల బ్రబలఁ జేసి
నట్టి కాకతీయుల నెంచు మాంధ్ర పుత్ర!



# ఆహార పదార్థములు

పుల్లమురాజు వేంకటేశ్వరరావు

(గత సంచిక తర్వాయి)

ఇక భోజన ద్రవ్యముల గుణముల (Physiological properties) నాకించుక దెలిసికొనవలయును. అప్పుడే మనము చేయు భోజనముయొక్క విలువ— అది ఎంతవరకు పుష్టికరమైనది— తెలియ నగును.

భోజనద్రవ్యములు నోటిలోనికి జేరినది మొదలు, జీర్ణించి, సమ్యగ్గ్రహణి [Assimilation] ని బొంది, అజీర్ణాంశము మలమూత్రములద్వారా శరీరము నుండి వెడలిపోవు వరకు, పలువిధములైన భౌతిక, రసాయనిక [Physical and Chemical] వికారములను బొందుచున్నది. ఈ వికారములను జర్చించు శాస్త్రము "శారీరక రసాయన శాస్త్రము" [Physiological chemistry]; ఈ విషయమును సవిస్తరముగా జర్చించుట పారిభాషిక పదములు లేమి, యసాధ్యము. కావున నొకటి రెండు ముఖ్యమైన విషయములను సంక్షేపముగా గ్రహించుట మేలు. ప్రోటీనులు, క్రొవ్వు, కార్బోహైడ్రేటులు, ఈ మూడును శరీరమున కుష్ణము, శక్తి, బలము నిచ్చుచున్నను, ప్రోటీనులు మాత్రమే మాంసపేశము(కండ)లను—Muscles—పెంచుచున్నవి. దీని బట్టి నివి, శరీరపోషణము, పటుత్వమునకెంత యవసరమైనవో గ్రహింప వచ్చును. "Proteins, fats and Carbohydrates, all yeild heat and energy; but proteins alone are capable of being transformed into muscle and other living cells, whence they are called "flsh-formers." Fats and Corbohydrates are not tissue formers; their primary function is to supply the body with fuel or, heat and energy."

ఏ పదార్థముగాని శరీరమునకిచ్చు యుష్ణశక్తిని గొలచుటకు కొన్ని విధానములు గలవు. భుజించిన పదార్థము, శరీరములో రసాయనిక వికారములను బొందిన, యట్లు, జ్వలనము (Combustion) చే కొంత యుష్ణము బయల్వెడలును. ఇట్టి యుష్ణరాశి [quantity of heat] ని నిర్ణయించవలసియున్నది. ఏ పదార్థముయొక్క జ్వలనోష్ణరాశి [heat of combustion] ని నిర్ణయించవలసియుండునో, దానిని "బాంబు క్యాలొరిమీటర్" [Bomb-calorimeter] యను నొక యంత్రములో నుంచి, కొన్ని నిబంధనల ననుసరించి, యది సంపూర్ణముగా జ్వలనము నొందునటుల గాల్చెదరు.

కెంత యుష్ణము జనించునో యారాశిని దెలిసికొని, దీనినిబట్టి, యా వస్తువ తన జ్వలనముచే మన శరీరమున కెంత యుష్ణము నియ్యఁగలదో, నిర్ణయింపవచ్చును. ఇట్టి యుష్ణరాశికొలత పరిమాణము [unit of measurement] ను "క్యాలోరి" యనిరుదురు. మనము దీనిని "ఉష్ణరాశిమానము" యనవచ్చును. "క్యాలోరీ" యనగా, యీ వ్యాసములో ఒక వేయి గ్రాముల [సుమారు ౮౪౨ తులములు] నీటి యుష్ణోగ్రత [Temperature] ను ఒక అంశము 1° centigrade] గుండా హెచ్చించుటకు గావలసిన యుష్ణమని యెరుంగ వలయును, ఇట్టి మానము యొక్క పరిభాషయే యింకట యుపయోగింపబడును. ఒక క్యాలోరీ యుష్ణరాశిని చలన శక్తి [మెకానికల్ శక్తి Kinetic energy] గా మార్చినచో, ఒకటన్ను [౧౧౨౦ సేరులు] బరువును ౧.౫౪ ఫూటుల యెత్తుకు లేపగల్గును—A calorie of heat, when trans formed to mechanical engery, would raise 1 ton to 1.54 feet.

సామాన్యముగా ఒక గ్రాము [౧౧.౩౪ గ్రాములు ఒక ౧ తులము] ప్రోటీను, ఒక గ్రాము కర్బనోదజనితము, ల జ్వలనముచే, వేర్వేరుగా ౪.౧ క్యాలోరీల యుష్ణము నిచ్చును. ఒక గ్రాము క్రొవ్వు ౯.౩ క్యాలోరీల నిచ్చును. ఈ విధముగా ౧౦౦ గ్రాముల పాలలో ౩.౫ గ్రాముల ప్రోటీనులు, ౪ గ్రాముల క్రొవ్వు, మరియు ౫ గ్రాముల కర్బనోదజనితము లుండినచో, [౩.౫ × ౪.౧] + [౪ × ౯.౩] + [౫ × ౪.౧] = ౭౨ క్యాలోరీల యుష్ణమునిచ్చును. గుమ్మడి విత్తులలో నుండు తెల్లని నూనె ౧ గ్రాము ౫.౯౫; ౧ గ్రాము స్టార్చి ౪.౩౭౫, ౧ గ్రాము చెరకు శర్కర ౪.౧౬౩, ౧ గ్రాము నెయ్యి ౯.౧౬౯ క్యాలోరీల యుష్ణము నిచ్చును. ఐనను మన శరీరమునకు నెంత యుష్ణము (శక్తి) జీర్ణాంశముపై నాధారపడియున్నది.

జీర్ణాంశము:—మనము దిను భోజనములో నెంత పరిమాణము మాత్రము జీర్ణమయి, శరీరముచే పీల్చుకోబడి సమ్యగ్పరిణతి నొందును? అజీర్ణాంశములు మలమూత్రముల ద్వారా వెడలిపోవును. భోజనము ఏ పరిమాణములో జీర్ణమయి, సమ్యగ్పరిణతిని పొందునో, అట్టి పరిమాణము యొక్క "జ్వలనోష్ణరాశి" యే మన శరీరమునకు చెంది, శక్తి [Kinetic energy] గా మారుచున్నది——1. The heat given off during the combustion is a measure of the latent or potential energy of the food. 2. the Kinetic energy of the food is the amount of heat developed by the proportion whch is digested.

పరిపాచనీయాంశము లేక జీర్ణాంశము [Digestibility] ను నిర్ణయించు విధానము:— రుబ్నర్ [Rubner] యను పండితు డీవిషయమును చక్కగా దెలిసికొనెను. ఒకడు దిను భోజనమును తూచి, దానియొక్క జ్వలనోష్ణరాశిని నిర్ణయించవలెను. ఈ రాశి ఉష్ణరాశిమానము యొక్క మొత్తము— calorific value. ఇట్టి భోజనమును దినుటవలన బయలువెడలిన మలమూత్రములను బరీక్షించి, పృథక్కరించి, వానిలోనుండు ప్రోటీను, క్రొవ్వు, కర్బనామ్లజనితముల పరిమాణములను, వాని వాని జ్వలనోష్ణరాశి లేక ఉష్ణరాశిమానము యొక్క మొత్తము (Calorific value) లో నుండి, మలమూత్రాదులలోనుండు ద్రవ్యముల జ్వలనోష్ణరాశిని దీసివేసినచో, మిగిలిన ఉష్ణరాశి (Physiological heat value) అనగా ఆహారముయొక్క విలువ [Food-value] ను దెల్పును.

"In order to acertain the physiological availability of energy, the food should be burnt in a bomb-calorimeter, and the figure obained will be the gross heat value; from this must be subtracted the heat yeilded by the urine and foeces by combustion and the net will show the physiological availalbility of energy,, Food-value.

మాంసాదులలోనుండు ప్రోటీనుల నూటికి ౯౨ వంతులు, క్రొవ్వు నూటికి ౯౫, కర్బనోదజనితములు నూటికి ౯౭ వంతులు, సామాన్యముగా జీర్ణమగుచున్నవి.

# పట్టిక (౩)
బి

| పదార్థము: భుజించుటకు దగిన భాగము మాత్రమే Edible Portion Only | Percentage Composition. నూరు భాగములలో నుండు ద్రవ్యము. | | | | | ఒక పౌను పదార్థము యొక్క జ్వలనోష్ణరాశి | వెయ్యి గ్రాముల పదార్థము యొక్క భోజన విలువ. Food value: Comparison of 1000 grammes. | వివరములు Remarks. |
|---|---|---|---|---|---|---|---|---|
| | జలము Water | ప్రొటీన్ Proteins | క్రొవ్వు Fat | కర్బనోదజనితములు Carbohydrates. | బూడిద Ash. | | | |
| ఒక విధమైన చేప Eel. | ౬౭.౬ | ౧౮.౭ | ౯.౧ | — | ౧.౦ | ౪౬ | ౧౧౬౪ | ౧౦౦౦ గ్రాములు |
| మరియొక విధమైన చేప | ౭౧.౫ | ౧౯.౫ | ౭.౬ | — | ౧.౪ | ౪౧ | ౧౧౭౦ | = ౮౭౫౦ తులములు. |
| *ఆవుపాలు. ... | ౮౭.౩ | ౩.౫ | ౩.౭ | ౪.౬ | ౦.౭౩ | ౨౦ | ౩౨౦ | |
| వెన్న మిక్కిలి శుభ్రమైనది | ౧౩.౦ | ౧.౦ | ౮౨.౦ | ౧.౫ | ౨.౦ | ౨౨౫ | ౨౩౭౧ | |
| వెన్న ... | ౧౬.౦ | ౨.౦ | ౭౩.౦ | ౪.౦ | ౫.౦ | ౨౦౩ | ౨౨౩౫ | |
| గోధుమలు ... | ౧౩.౦ | ౧౨.౦ | ౧.౦ | ౬౮.౭ | ౧.౭ | ౧౧౬ | ౧౨౪౨ | |
| మైదాపిండి (గోధుమ) | ౧౦.౫ | ౧౧.౯ | ౧.౬ | ౭౫.౪ | ౦.౫ | ౧౧౪ | ౧౨౮౩ | * ఇది మాత్రము |
| గోధుమపిండి (పొట్టుచెరుగనిది) | ౧౦.౮ | ౧౨.౨ | ౨.౨ | ౭౩.౬ | ౧.౦ | ౧౧౪ | ౧౩౦౦ | ఒక |
| జొన్నలు | ౧౨.౦ | ౧౨.౬ | ౪.౬ | ౬౨.౨ | ౨.౮ | ౯౭ | ౧౩౦౯ | పౌను |
| బియ్యము. | ౧౨.౪ | ౬.౯ | ౦.౪ | ౭౯.౪ | ౦.౫ | ౧౦౨ | ౧౦౮౪ | పాల |
| గంజితీసి వేసిన అన్నము. | ౭౨.౫ | ౨.౮ | ౦.౧ | ౨౪.౫ | ౦.౨ | ౪౫ | ౨౫౮ | విలువ. |
| గోధుమ రొట్టె | ౩౫.౧ | ౮.౩ | ౦.౨ | ౫౩.౦ | ౦.౪ | ౬౭ | ౮౭౪ | |
| ఆలుగడ్డ (చెక్కుతీసినది) | ౭౫.౬ | ౨.౦ | ౦.౧౬ | ౧౯.౫ | ౧.౦ | ౨౪ | ౨౭౩ | |
| ఆలుగడ్డలు (చెక్కుతో ఉడికించినవి) | ౭౫.౫ | ౨.౫ | ౦.౧ | ౨౧.౦ | ౧.౦ | ౨౬ | ౩౧౨ | |
| పప్పులు. (కంది, పెసరు) | ౯.౫ | ౨౩.౮ | ౧.౮ | ౬౦.౩ | ౨.౬ | ౧౦౪ | ౧౫౪౪ | |
| శెనగ పప్పు | ౧౦.౫ | ౨౪.౪ | ౧.౫ | ౫౭.౩ | ౩.౭ | ౧౦౧ | ౧౬౦౯ | |
| బాదాము పలుకులు. | ౪.౮ | ౨౧.౦ | ౫౪.౯ | ౧౭.౩ | ౨.౫ | ౧౮౯ | ౨౬౪౫ | |
| కొబ్బరి. | ౩.౫ | ౬.౩ | ౫౭.౪ | ౩౧.౫ | ౧.౩ | ౧౭౩ | | |

వెన్న, గోధుమలు, పప్పులు, రొట్టె శరీరమున కెంత బలమునిచ్చునో చూడుడు. గంజి తీసిన యన్న మెంత పుష్టికరమైనదో, చూచితిరా?

ఈ పై పట్టిక (౩) లో పదార్థముల "ఆహారపు విలువల" ను జూపబడినవి. పెక్కు ప్రయోగముల వలనను యనుభవముల వలనను శాస్త్రజ్ఞులచే నిర్ణయింపబడినవి. ఇంకొక విషయమును మాత్రము సంక్షిప్తముగా సూచింపవలసియున్నది. పైన దెల్పిన ద్రవ్యములేగాక "వైటమిన్" లను ప్రత్యేక సంఘటనముగల ద్రవ్యములు ప్రొటీనుల తో కలిసి చేరినవి. భోజనపదార్థములలో యున్నట్లు పెక్కు పరిశోధనలచే నిర్ణయింపబడినది. ఈ ముఖ్యద్రవ్యములయొక్క లోపముచే, ఆరోగ్యము చెడి, శరీరము రోగములకు లోనగును. వైటమినులు, బియ్యము, గోధుమలు, పప్పులు శాకములు మొదలగువానిలోగలవు. బియ్యమును తెల్లగా పోటు వేయుటచే దానిలో యుండు "వైటమిన్" నష్టమొందును. గంజి తీసివేయుటతో, సంపూర్ణ సారహీనమై పోవును. పెక్కు ప్రయోగము [Experiment] లచే పోటువేయని బియ్యము, పోటువేసినవానికంటె, పెక్కువి బలము నిచ్చునవిగా నిర్ణయింపబడినది. జొన్నలు మున్నగు ధాన్యములు గూడా నిటులే. కూరగాయలు, సామాన్యముగా [illegible] యుష్ణగ్రతను [110°c- 120°c.] పొందునటుల చాలాకాల ముడికించినచో, వానిలోనుండు వైటమినులు నష్టము నొందుటచే, పదార్థము సారహీనమై, యపుష్టికరమగును. ఈ విషయములయొక్క సత్యము, పొట్టు పూర్తిగా చెరిగివేయని, పోటువేయని బియ్యము, జొన్నలు, రాగులు, మున్నగు ధాన్యములను, చాలాకాల ముడికించని పప్పు, కూరగాయలను భుజించిన కష్టముచేయు కృషీవలులను జూచినచో బోధపడును. గంజివార్చిన ప్రాత బియ్యపు యన్నమును దినుచు, పుష్టికరములగు గోధుమలు, జొన్నలు, రొట్టె మొదలగువానిని విసర్జించిన మనము మన యాహార సమస్యయందు శ్రద్ధవహించినగాని మనము ఆయురారోగ్యైశ్వర్యములం గాంచి మేధావంతులము గాజాలము.

## మీకంటె

మామునూరు నాగభూషణరావు

ఏను ధన్యుడగానో కో......

నిలచియున్నవి ప్రణయ-నిధులు నాయెదలో......

ఏను ధన్యుడగానో కో......

కంటి కగపడనీక-మింటివరకును బఱపి

కంటి మడతలకోన-లంటుకొను నీరూపు .....

ఏను ధన్యుడగానో కో......

అందాల నీముద్దు-కుందనము దిగద్రిమ్మి

సుందరారుణకాంతి-నొందెనా చిఱుపెదవి.......

ఏను ధన్యుడగానో కో......

తెలి తళుకు లొలుకునీ-ఝలుగు నగవుల ద్రావి.

లలితశారదచంద్ర కళలయ్యె నాకనులు......

ఏను ధన్యుడగానో కో......

ప్రేమకై ప్రేమించి, ప్రేమపాదంబంటి

నన్ను నేనేమరచి-నవ్వుకొనుచున్నాను......

ఏను ధన్యుడగానో కో.........

# మురళి

వెంపటి నాగభూషణం

ఆ ఘంటకాన్నరి పథమున పడుచు, లేచుచు, ఆ అం
ధబిక్షువు పోతున్నాడు. తనకు యిబ్బందిగా వున్నా
డనే నెపముమీద గ్రామస్థు లందరూ కలిసి ఆ మురళి మ
స్కారిని ఊరినుండి వెడలగొట్టారు. జీవనోపాధికై మరో
క గ్రామానికి పోవలని ఉన్నది. ఇట్లా కష్టాలు అనుభ
విస్తూ పోతున్నాడు. భోజనముచేసి అయిదు దినాలైనది.
చేతులు కాళ్లు తేలిపోయినాయి. ముఖం వాడినది. శక్తి
తగ్గినది. గ్రామం చేరడ మెట్లు? అయినా పోతున్నాడు.
పోతే వక్కసారే పీడ వదులుతుందనుకొన్నాడు. ఏమిలాభం
బ్రతికి? ఎవరికోసం, ఎందుకోసం?......ఇంకా అట్లా
గే పోతున్నాడు, ముళ్లలోంచి. వినుగులేదు. విరక్తి లేదు.
......నది వొడ్డుకు చేరుకునేసరికి ప్రాణం లేచివచ్చిం
ది. ఆ నిర్మలోదకము కాస్త త్రాగి, [illegible] శీతల
వృక్షచ్ఛాయలో కొంచెము కాలం విశ్రమించాడు. మరి
కొంతసేపటికి అతనికి యెక్కడనుంచో సంగీతము విన
వచ్చింది. త్రుప్పుపట్టిన హృదయపేటిక దీప్తవంతమైన
ది. అతనిలో ఆనందతరంగములు లేచినాయి. మెల్లమెల్ల
గా సంగీతము దగ్గరగానే వినవచ్చింది...... అయిదా
రేండ్ల బాలిక, ముద్దులు మూటగట్టు బాలిక, మురళి వా
యింపుచూ అతని దగ్గరకు వచ్చినది. అప్రయత్నముగా
అతను ఆపిల్లను చేతులలోకి తీసుకొని ముద్దాడి బుజ్జగించా
డు. ఆ పిల్లగూడ అతని కంఠంచుట్టూ కౌగిలించుకొని,
పా, పా, అంటూ గంతులువేస్తూ మురళి ఊదింది. తో
[illegible] ఆనంద బాష్పాలు కార్చినా
డు. సృష్టి పులకరించింది. అతనికి అంధత్వము అంతరిం
చినది. ఆ కిశోరముగ్ధమూర్తి సౌందర్యమును పూర్ణముగ
గాంచి అతడు విహ్వలుడై, ఆమెను కొన్ని ప్రశ్న లడిగె
ను. కాని ఆమె సరిగ ప్రత్యుత్తర మీయలేకపోయెను.
అన్నిటికి బదులుగ మురళిని ఊదుచుండెను. తన జీవిత
మే కష్టసాధ్యమైనప్పుడు యీ పిల్లనుగూడా యెట్లు పో
షింపగలడు? అయినా, ఆయ్యది దైవబహూకృతి గావున
పోషణ తప్పదనుకొన్నాడు. పిల్లతో గూడా భిక్షువు ప్ర
యాణం చేశాడు. పిల్లకు వేరేపేరు లేకుండా, మురళి,
అనే పిల్చినారు. [illegible] గ్రామం చేరుకున్నారు. అక్క
డక్కడ భిక్షమెత్తి పిల్లకు క్షుద్బాధ తీర్చి తాను తినవా
డు. తరువాత ఆమె యెప్పటిరీతి మురళి వాయింప గ్రామ
మంతా విరగబడివచ్చి ఎవరికితోచింది వారు యిచ్చిపో
యిన్నారు. కాని చిన్నపిల్ల, యెక్కడేమి అపకారము వ
స్తుందోయని ఆమెను యెక్కువకాలము మురళి వాయింప
నియలేదు భిక్షువు. అవిధముగా ఆపిల్ల పాడిన స్థలము
ల్లా డబ్బు కొల్లలుగ వచ్చింది. అవసరమైనదానిని విని
యోగించి తక్కినదాన్ని ధర్మం చేసెడివారు. ఎక్కడ
కుపోయినా సరే. భిక్షువు మాటలాడవలసిన పనిలేదు.
ఒక్కసారి మురళిని వాయించిన చాలును. డబ్బు
వచ్చును. ఇట్లా భిక్షువు మురళితో గూడా దేశసంచా
రము చేయుచూ ఆనాకేమీ లోటుము గాకుండా చూచు



హైదారాబాదు జీవరక్షా ప్రచారకమండలి పక్షమున దక్షిణ హిందూస్థానము నందలి పలుతావులందు

పరిచారముసలిపిన మహాశయులు.

మధ్యవారు: సేటు లాల్‌జీ మేఘజీ గారు, మండలి యొక్క అధ్యక్షులు

ఉండేను........ అయిదారేండ్లు తరలిపోయినాయి. మురళికి పన్నెండేళ్ళ ప్రాయం. వయస్సుతో పాటు రూపము, కళ, అభివృద్ధి పొందినాయి. ఆమె తిరిగేది భిక్షువుతోనైనా, కట్టుకునేది జీర్ణమలినవస్త్రాలైనా, తినేది తొన్నకూడు గంజినీళ్ళు అయినా ఆమెలో రాజకళ కన్పడుతుంది. అనిమేషత్వం అవిర్భవించినది. ఆభిక్షువునకు మురళి ఆశాజ్యోతి.

తిరిగి తిరిగి పట్టణం చేరుకున్నారు. పట్టణమంతా అల్లకల్లోలంగా, గలభాగావున్నది. అయిదారేండ్ల రాకొమార్తెను నగలకోసం యెవరో యెత్తుకపోయి అయిదారేండ్లయింది. ఎంత కృషిచేసినా పిల్ల కనిపించలేదు. ప్రియపుత్రిక, ఏకపుత్రిక పోయినందులకు రాజు విచారములో మునిగిపోయి, రాజ్యం విసర్జించి విలపిస్తున్నాడు. ఉన్మత్తుడై తిరుగుతాడు. ఊరంతా ఎవరెన్ని విధముల ఊరడించినా లాభము లేకపోయింది. ఎవరి పిల్లను జూచినా తన కొమార్తెయే అనుకొని భ్రమించి తీసుకుంటాడు. రాజు ఉన్మాదుడై తిరుగుతుంటే ప్రజలలో ఐక్యమెక్కడి? పట్టణమంతా అరాచకమే!

ఈ సంగతి భిక్షువునకు తెలియదు. పట్టణము మధ్య అంగడిలో నిలువబడి మురళిచేత మురళి వాయింపించాడు. ఊరంతా విరగబడ్డారు. ఉన్మాదిరాజు కూడా వచ్చాడు. విన్నాడు. తటాలున పోయి మురళి చెయ్యి పట్టుకొని కవ్వున కేకవేశాడు. అందరు ఆశ్చర్యపడ్డారు. భిక్షువు సంగతి యేమిటన్నాడు. ఆమె తాను గోల్పోయిన కొమార్తె అన్నాడు రాజు. మురళి వలవల యేడ్చింది. భిక్షువే తన తండ్రి యన్నది. రాజు ముఖం విప్పారింది. కొమార్తెతో సంగతి చెప్పాడు. కాని ఆమె విశ్వసింపలేదు. భిక్షువును విడిచిరానన్నది. భిక్షువు ఆమెను విడువనన్నాడు. ధన ధాన్యము లిస్తానన్నాడు రాజు. అక్కరలేదన్నాడు భిక్షువు....రాజుకు ఆగ్రహమొచ్చింది రెండు మూడు మాటలు చెప్పాడు. కాని వ్యర్థమైనది. బలవంతముగా రాజు మురళిని గొంపోయినాడు. భిక్షువు విషాద దవాగ్నిలో పడ్డాడు. మురళి నానాటికి కృశించి క్షీణించినది. మనోవ్యాధి అధికమైనది. హృద్వేదన యెక్కువైనది....మురళి మూగవోయినది. రాజు యెప్పటి యట్టి ఉన్మాదుడే! *



## తొలిమెఱుపు

వి. గోపాలకృష్ణారావు

'తెలిమబ్బు' తేటలో
తేలిపోతున్నాయి
తెల్ల తెల్లని నన్న
రెక్కలే బావ!
చల్లకాలము వచ్చి
సాగిపోతుండాది
సంతోషమున తనువు
మరిచేవె మరదలా!

మెల్లమెల్లగ నల్ల
మేఘాలు కమ్మాయి
చోద్యమయ్యె నిదేమి
సొంపోయె బావ!
కంటి కింపొదవంగ
కండ్లు మూసుకపోగ
మిణుగురని తొలిమెఱుపు
మెఱిసెనే మరదలా!

# హైందవస్త్రీలు

రత్నాల కృష్ణాబాయి

భారత భూమియొక్క ముఖ్యమైనట్టియు అత్యవసరమగునట్టియునగు అభివృద్ధులలో స్త్రీల యభివృద్ధి యొకటి. ఉద్రేక పూరిత సమస్యలలో మునిగిన జాతీయవాదులును, రాజకీయ వేత్తలును, ఈ విషయమును చులకనగా చూచుచుండుట సహజముగా మనము చూచుచున్నాము. అది గొప్ప పొరపాటు. జాతీయ వాదులు, దేశోద్ధరణకై కంకణము కట్టుకొనిన వారు తప్పక తమ దృష్టులనీ విషయముపై మరల్చుట చాల యావశ్యకము. ప్రస్తుత యుగము ముఖ్యముగా స్త్రీలను మేల్కొలుపుటకై సందేశము తెచ్చినది. ఆసందేశోద్దేశమును కనుగొని పాశ్చాత్య నారీరత్నములు ఆశ్చర్య జనకమగు వృద్ధిని పొందుచున్నారు. ఇదివరకు వారికొసంగబడ వనిన హక్కుల కొన్నిటినో వారిప్పుడు సంపాదించినారు. కాని ప్రాగ్దేశములపై, ముఖ్యముగా భరతఖండముపై దృష్టి ప్రసాదించుడు! ఏమాశ్చర్యము! భవిష్యత్సంతతి బాగుపడవలెనన్నిన భరత భూమి ఉత్కృష్ట రాజ్యములలో నొకటిగా పెంపుబడయవలె ననిన, అది తనచిత్తమును జాతియొక్క కేంద్ర స్థానమనదగు గృహముపై [Home] మరల్పవలెను. గృహము మానవుని ఉత్కృష్ట గుణములకు పెన్నిధి. గృహము మానవునికి మానవత్వము ప్రసాదించును. అతనిని వీరునిగా నొనరించును. అతనిలో దేశాభిమానము పుంజీభవింపజేయును. అతనిని రాజకీయ వేత్తగా మార్చును. తన్మూలమున గొప్ప శక్తి గలజాతిని తయారు చేయును. జాతియొక్క బలమును వెదజల్లు పవిత్ర స్థానమేది? అది చక్కగా సంచలించిన గృహమునందు గలదు. కర్మస్వరూపిణియగు దేవిచే నడుపబడు గృహ నౌకయొక్క గమ్యస్థానము జాతి. ఉత్సాహ పంతులగు యువకులు 'భారతమాత' నున్నత స్థానమునకు చేర్పదలచినచో మొదలా యున్నతస్థితిని గృహములలో సృష్టింపవలెను. జనని స్థలమగు గృహమునందు జనింప చేయవలెను.

భారత దేశమునకు పవిత్రమైన తల్లుల యావశ్యకము చాల కలదు. గృహమునందు దివ్యమైన వాతావరణము కలుగుటకై మన స్త్రీలకు సరియైన శిక్షణ నివ్వవలసి యున్నది. స్త్రీల కొసంగబడుచున్న విద్య వారి శిశువులను గొప్పవారిగ చేయునట్టిదై యుండవలెను. స్త్రీ రాజ్యాంగ విషయములలో పాల్గొని జాతుల కర్మల నడుప నక్కరలేదు. ఐనను, స్త్రీయొక్క రహస్య హస్తమే శిశువును భావికాలమునందలి వీరుని జేయును. శిశువు యొక్క శిక్షణ తల్లిగర్భములో ప్రారంభమగును. చిన్న పిల్లలకు వినబడు శబ్దములపై వారి గుణనిర్ణయమగును. ప్రతి తల్లికిని యిట్టి శిక్షణములభింప జేసినచో భరత ఖండమునకు కలుగు ముక్తి ఎంత ఘనమైనదై యుండును!

ప్రాచీన భారత చరిత్ర యిట్టి జాతినిర్మాణ చతురత గల స్త్రీలతో క్రిక్కిరిసి యున్నది. ఏ విధముగ తల్లులు మనుష్యుని రహస్యముగా గొప్ప వానిని జేసిరో, వారి ప్రభావము వలన భావికాలమందు మనుష్యుడే యే సామర్థ్యముల నార్జించెనో వేరు చరిత్రలకు పోక మన చరిత్రయందే విచ్చలవిడిగా చూడనగును. జిజియాబాయి తన కుమారశివాజీ మనం దేవిధముగ తన

గారి సౌభాగ్యముల నింపెనో మన కందరికి తెలిసిన విషయమే. అతని రాజకీయ జీవితసౌధమును నిర్మించిన మహాశక్తి ఆమెయే. పంచమ వేద మనదగు మహాభారతమునందు స్త్రీ తేరీతిని భారత వీరులలో ధైర్య సాహసముల నుజ్జీవింప జేయుచుండిరో కాననగును. పాండవుల విజయములను వారికి తగిన తల్లియగు కుంతీదేవియే కారణము.

„మనుష్యుడు పుట్టి ప్రపంచమునను విద్యగఱుపును, స్త్రీ జననమునొంది మనుష్యుని విజ్ఞానవంతుని జేయును". ఆకారణమున భారత దేశోద్ధరణకై భారతరమణీమణులు కంకణ బద్ధులు కావలెను. వారికి సరియైనవిద్యాభ్యాసము జేయించవలెను. ప్రస్తుత మొసంగబడు శిక్షణ వారి బహిరింద్రియములకు లాభము కలిగించుచున్నది. దాని వలన నిజమైన విజ్ఞానము కలుగుటలేదు. పర్యవసానమేమి? మన తెలివితేటలు, మనయందలి లలితకళాభిరుచి, ఆధ్యాత్మికజీవనము, ఏతి నశించిపోవుచున్నవి. మన జాతీయవాదులలో నొకడు నుడివినట్లు: Our character has grown in Foreign tubs, not even in tubs but in orchids, our manhood has been hung upon the verandah having no roots in the actualities of our nations." మనము వాసనలేని పుష్పములవలె పెరిగి పోవుచున్నాము. జాతీయజీవనమనునది మచ్చునకైనను కానరాకుండనైనది. మన మనస్సు, ఆత్మ, గుణము, పౌరుషము వివిధ మార్గముల బట్టుచున్నవి. ప్రస్తుత శిక్షణ మన బాలురలలోనే యిట్టి పర్యవసానము దేల్చుచుండిన ఆడ పిల్లల గతి యేమి? ప్రస్తుత శిక్షణాక్రమము మన సంసారావసరములను దీర్చుటలేదు. విద్యాభ్యాసమనగా నాయభిప్రాయ ప్రకారము గొప్పగొప్ప పట్టములను సంపాదించుటకాదు. సుశిక్షణమున స్త్రీగుణములు బాగుపడవలెను. తన భర్తకు మిత్రురాలును, మంత్రియును, సౌఖ్యదాయినియగు భార్యగా తేలవలెను. స్త్రీకి యోగ్యమగు శిక్షణ నొసంగినచో కళలు, పరిశ్రమలు, వాఙ్మయము, మతము వృద్ధిపొందును. ప్రాచీన భారత స్త్రీలు అద్భుత విద్యా సంస్కారమును బొందినవారై యుండిరి. "మొల్ల" మరియు "అవయార"వంటి కవి శిరోమణులు జన్మించిరి. మనుష్యుని ప్రక్కన నిలువబడి సమరచక్రము త్రిప్పిన వీరవనితలు ఉద్భవించిరి. అంతఃపురమున గూర్చొని కఠినతర రాజకీయ సమస్యల విడదీసిన స్త్రీ రత్నములు మన ప్రాచీన చరిత్రకు వన్నె దెచ్చిరి. భారతీయుల వివిధసంచలనముల కన్నిటికిని తమ యపూర్వ మేధాసంపత్తిని పంచిపెట్టిరి. పాశ్చాత్య నారీమణుల పథముల ననుసరించి మన స్త్రీలు నడుచుటకంటెనే కర్తవ్యమునకు వారు తగినవారో, ఏ కర్మలవారు నిపుణతతో నిర్వర్తింపగలరో, వాని కొఱకై వారిని శిక్షితుల జేయవలెను. వారిని మంచి తల్లులను జేయు శిక్షణ నొసంగవలెను. మంచి తల్లులే మనభూమినుద్ధరింపగలరు.

నెపోలియన్ బోనాపార్టు ఫ్రాన్సు దేశమే విధముగ సౌఖ్యప్రదమగునని స్టేల్ తో విచారించగా నాదేవి ఫ్రెంచు దేశీయుల తల్లులకు సుశిక్ష నొసంగుమని బోధించెను. భారత దేశాభ్యుదయము కూడ మంచి తల్లులపైననే ఆధారపడియున్నది. గృహమునందుతల్లికి చాల ముఖ్యమైన కర్తవ్యములు గలవు. భవిష్యద్వీరులను దేశభక్తులను తయారుచేయు భార మామెపై గలదు. శాసన నిర్మాణ సభలను, న్యాయస్థానములను సృష్టించుట అంత కఠినమైన పని కాదు. స్త్రీలందరును తమ తమ కర్తవ్యముల నిర్వర్తించినచో భారతదేశమునుద్ధరించుటకై చేయు ఉద్యమ మక్కరలేదు. భారతీయుల యాదర్శమును సంపాదించు శక్తిగల మహాశక్తి సుశిక్షితయైన తల్లియే.

# స్మృతి

యడ్లపాటి వేంకట సుబ్బారావు

తరుణ విస్తృత పల్లవ తరళ నూత్న
మల్లికాలత మొగ్గల పల్లవించి
విరిసి సౌరభ మెదజల్లు విధము దోప
కాలకీటక మీ వెంత కష్టమతివొ
ఘోరదంష్ట్రాగ్ని కీలల గూర్చి తకట!

నీల జలధర మాలికా లీలలందు
క్షణికమునగు విద్యుల్లతా కాంతిలోన
అతివ! భవదీయ దేహచిహ్నముల గనుచు
స్తంభితుడనౌదు హృదయ చాంచల్యమునను.

నవవసంతపు లేమావిచివుళ్ళ మెసవి
ప్రణయమున దేలు కోకిలారవము వినుచు
కాంత! భవదీయ కంఠరాగంబు దలతు
అది యనంత పదవి నైక్య మగుట మరచి.

లలిత ఝుంకార నాద విలాస పటిమ
కమలమున వ్రాలు తేటుల గాంచు నపుడు
ప్రాణరత్నమ! నీదు ముఖాంబుజమున
గోల లాడెడు భ్రమరక లీల దలతు.

చలిత జలనిధి తరగల కలతనొందు
కలువరాయని రూపంబు గాంచునపుడు
అభ్రవాయువులందు విన్యస్తమైన
నీదు ముఖచంద్ర బింబకాంతిని దలంతు
భ్రాంతిపైకొన నస్పష్ట భావ వితతి.

పడతి! భవదీయ సుకుమార ప్రాణలతను
ప్రళయ పాశంబు గొను నాటి రౌద్ర గరిమ
సాంధ్యరాగ ప్రదీప్తిని సంతతంబు
నూహజేతు వివేక శూన్యుండ నగుచు.

ఇంతి! కనుమూసి నిన్ను ధ్యానించు వేళ
మందహాసాంకురజ్యోతి మది దలంతు
ముక్తికాంతను ధ్యానించు ముని వరుండు
జ్ఞాన తేజోమయజ్యోతి గాంచునట్లు.

నవ వికసిత ప్రసూన సంతతిని గూర్చి
ఇష్టదేవత భక్తి పూజించునట్లు
కలికి! నీమీప హృదయ రాగంబు దెలుప
అశ్రుసుమముల పూజింతు నహరహంబు.

# లండన్ విద్యార్థి

ఒద్దిరాజు రాఘవ రంగారావు

---

## మొదలు

గురురావు గొప్పజమీందారుడు. అతని మిరాసీ గ్రామములు పల్లెలనుట బట్టి పల్లెల యందుండుట కిష్టము లేక పట్టణమున నివాసము చేయసాగెను. పల్లెల అధికారమంతయు దివానుగారు నడిపెదరు. అనగా దివాను గారే జమీందారుగారు. జమీందారుగారే దివానుగారి వలన భూతాది పూర్వకముగా జీవించు నాథుడు. ఎవని సొమ్ము వానికి నష్టము గాకుండ అభివృద్ధిగా వలయునని మనస్సుండును. కాని యితరునికేమి? జమీందారుని జమీను చెడితే దివానుకేమి! బాగు పడితే దివానుకేమి! „ఊరుషారు హుసేన్ సాయబు" అంటె „పోతే పోరు బడే సాయబు" అన్న సామెత యెవరెరుగనిది. చెరువులు మరమ్మతు చేయించుట, బావులు త్రవ్వించుట, కాల్వలు గట్టించుట, మొదలయిన సౌకర్యములు రైతులకు కలుగజేయుట యేమిలేదు; కాని యెండలో నిలువబెట్టి మీద బండరాతి, మాఫిరకం అను పేరుతోక నిక్యం అయినా కాకున్నా సిస్తు వసూలు చేయుట మాయనపని. దివానుకు దయవచ్చి సిద్ధము చేసినంత రకములో పట్టణములో సౌఖ్యపడుట గురురావుగారి పని.

### కీడులో మేలు

పూర్వ మొకడు ఓక కోమటి బాట వెళ్లుచుండగా దొంగలు సంధించిరట. కోమటి దగ్గర ద్రవ్యము కొంచెమైనను దొరకక పోవుసా ?ని చింపిరిగుడ్డలు వెదకి గాని అందుకు వారికి వెదకుటయే మిగిలినదనుట. జత్తుల కోమటి ద్రవ్యము నవరంధ్రాలలో దాచుకొనగలడని వారికి అనుమానము కలిగి నోరు మొదలు అన్ని రంధ్రాలలో వెదకిరట! ఎక్కడ యేమి కనబడక పోవడము చేత దొంగలు రెండుదెబ్బలు కొట్టి వెళ్లి పోయిరట. కోమటి యిదుట బడిన వాండ్లతో „దొంగలు కొట్టినా మానె గాని కీడులో మేలు జరిగినది" అని చెప్పుచుండెనట. „అదేమని వారు ప్రశ్నింప „ద్రవ్యము కొరకు వారలు నవరంధ్రాలు వెదకు సందర్భమున మొదలు నోటిలో వెదకి తరువాత తక్కినవి వెదకినారు. అట్లుగాక మొదటే తక్కినవి వెదకి నోటిలో వెదకితే చచ్చేవాణ్ణి" అని చెప్పినాడట! అన్నట్లు గురురావు రైతుల విషయమయి, జమీను విషయమయి యెట్లు వున్నా తలిదండ్రుల మాట జవదాటు వాడు గాదు! భార్య యన పరమ ప్రేమ. అవల యెన్ని పనులున్నను తండ్రిపిలుపు వచ్చిందంటే అన్నిటిని వదలిపెట్టి వెళ్లేవాడు. ఎంత మందిలో ఉన్నా తండ్రి వచ్చినాడంటే లేచి నిలువబడి తండ్రి ఆజ్ఞ అయ్యే పర్యంతము కూర్చొనకుండేవాడు. ఈ గృహ లక్షణము పట్టియే గురురావునకు నగరమున కీర్తి విస్తరించి పోయినది. కీడులో మేలంటే ఇదే. మొగిలికి ముల్లు, చంద్రు

నకు నలుపు, చందనపు చెట్టునకు పాము. ఒక మంచికి ఒక చెడ్డ తగిలించే ఉంచినాడు దేవుడు. మంచి చెడ్డ కలిసి ఉన్నప్పుడు మంచిముందర చెడ్డమాట పడి ఉంటుంది. చంద్రుని నలు పెవ్వనికి కావాలి? „అహా!, వెన్నెల యెంత మంచిగా నున్నదయా" అని అందురు. గురురావుగారి కైతలగతి యెవడు చూడ బోయినాడు? „గురురావెంత మంచి వాడయ్యా" అని మాత్రమే అందురు. ప్రపంచ ధర్మమే అది.

## గారబాల కొడుకు

పూర్వమెక కవి—

„గీ. బొగ్గ వజ్ర మీరెంటికి—పుట్టువొకటి
గుణముచే రూపములవేరు—గూర్పు కొనును
కాంతియు క్రయంబునట్టులే—గలిగియుండు
కాన గుణధారణంబే ప్రధానమరయ."

అని చెప్పినాడు. పాలసముద్రములో హాలాహలము పుట్టినది. హిరణ్యకశిపుని కడుపున ప్రహ్లాదుడు పుట్టినాడు. మంచిలో చెడ్డబుట్టుట, చెడ్డలో మంచి పుట్టుట ప్రపంచ ధర్మము. మంటిలో బంగారం పుట్టిందే కాని గని నుండి త్రవ్వి మళ్లీ మంటిలో వేసిన మన్నయి పోతుంది. మంచిగా కరిగి తంపివేస్తే పదారు వన్నెల బంగారం అవును. రెండు సారులు కంసాలి యింటికి వెళ్లి వస్తే మళ్ళీ మన్నౌతుంది. ఈ ప్రకారముగా మన కు ప్రకృతి యిచ్చిన గుణపాఠాలు నేర్పుతునే వుంటుంది.

గురురావుగారికి కుమార రత్నం కలిగినాడు. రూప మేమయిన లోపమా? గుణమేమయిన లోపమా? తెలివి యేమయిన లోపమా? నగరములో చదివినాడు. చదివినాడు. బి. ఏ ప్యాసు అయినాడు. సెకెండరీ చదువునప్పుడే వివాహం అయింది. ఇక కావలసిన దేమి? బ్రతుకు తెరువునకు మార్గము కలదు. వృత్తి విద్య అంత అవసరము లేదు. కాని అంత మాత్రమున తృప్తి యెక్కడిది? వృత్తి విద్య యుండేనో? అది మాత్రము దేశమున లేదా? వైద్యము చదువ వలయునన్న ఎం. డి. పట్టున కెక్కడనే గలదు. న్యాయవాదము ఎల్ ఎల్. బి, పట్టున కెక్కడనే గలవు. ఇట్టులనే అన్నియు నెక్కడనే గలవు ఎంత చదివి ఎంత జ్ఞాన మార్జించినను సీమకు వెళ్లివచ్చిన దర్జాయే వేరు.

## సమాలోచన

రామాచారి, విశ్వనాథశర్మ, లతీఫ్ సాహెబు మొదలయిన వారలు కొందరు గురురావు గారింట నొకనాడు కూడిరి. వయి వారంతా నగరములో ఉద్యోగమో, న్యాయమో చేయుచు కాలము గడపే గౌరవనీయులే. వారందఱు గురురావు గారి కుమారుడగు తుకారాంగారి విద్యాభ్యాసమును గురించి చర్చ చేయుచుండిరి.

„ఈ దినములలో లండను, కేంబ్రిడ్జి మొదలగు విశ్వ విద్యాలయములలో చదివిన వారలకే కీర్తి ప్రతిష్ఠలు గాని మన దేశీయవిశ్వవిద్యాలయములలో చదివినవారలకు గౌరవము లేదండి" అని రామాచారి గారనిరి.

„అయితే మా తుకారామును ఎక్కడికి తోలించవలయును?" అని గురురావుగారనిరి.

„సీమ చదువే పాడండి. మన ఆచార వ్యవహారాలు బొత్తిగా పాడు కావడమే కాక పిల్లలు మళ్లా మన కక్కరకు రాకుండా అయి వస్తారు. ప్రతి సంవత్సరము ఇండియానుండి యేరెండు వందల మందియో విదేశములకు వెళ్లి డబ్బంతా పాడుచేసి వస్తున్నారు కదా! వారలు యిండియాకు వచ్చి వెలగబెట్టిన దేమిటి?" అని విశ్వనాథ శర్మ నుడివెను.

„సీమ బారిష్టరులకు గౌరవ మెక్కువండి" అని రామాచారి వక్కాణించెను.

„పల్లాడ గొట్టుకొనుటకు పర్వతానికి పోయినారట రాయి కొఱకు. ఇన్ని వేలు కర్చుచేసి సీమకు పోయి మళ్లీ వకాలతీయేనా? మొన్న నొక బారిష్టరు ముక్తారునామా తీసుకొని వచ్చిన సుబ్బందర్జా వకీలుతో వాదించలేక గుటుకలు మింగినాడు. మన దేశములో చదివిన వకీళ్లు పిడుగులవంటి వారు లేరనా? సీమకుపోయి వస్తే పోకులకు కర్చు లెక్కువచేయడము తప్ప తక్కిన వానిలో యెందుకు పనికిరారు" అని శర్మ తీక్ష్ణముగా పలికెను.

„సీమకుపోయివచ్చిన వాళ్లమట్టు తెల్లదొరసానులు తమ డాన్సులో నిరాటంకముగా చేర్చుకుంటారు.

తక్కువ వారికెంత పాండిత్యమున్నా చెప్పలేను. ఇది యొక సమస్యయే." అని లతీఫ్ సాహెబనెను.

„సరి! ఎలుకను బట్టుటకు గుట్ట త్రవ్వినారట. దొరసానుల ఆటలలో చేరుటకు వేల రూపాయలు పోసుకొని సీమకు పోయిరాకడమా? బాగు బాగు. ఈ పోవు విద్యార్థులు సీమకు బోయి తెచ్చేది యోగ్యత యేమి? వారు విమానములచేయ నేర్తురా? మోటారు బండ్లు చేయ నేర్తురా, తుదకు కుట్టుమిషన్ గానీ సూదిచేయు తెలివిని నైనను కొనివచ్చుట లేదు. ఇకయేమి తెచ్చెదరంటే ఇంటగల ద్రవ్యమంతయు వ్యయముచేసి దరిద్రపు పెద్దమ్మవారిని తెచ్చెదరు. ఒకొక్కొక్కడయితే వానికి దొరను శేషభాగము గుల్లచేయుటకు సీమ దొరసానిని తెచ్చును. ఇంతకంటె విశేష మేమియు నాకు కనబడ లేదు." అని శర్మ పరిహసించెను.

„అందరంతేనా? కొందరు సరిగా మెదలి వచ్చుట లేదా? మీ అబ్బాయిని తోలించి చూడండి. కుఱ్ఱవాడు మంచి తెలివి తేటలు గలవాడు. వినయ విధేయతలు మంచిగా గలవు. చెడిపోగూడదు." అని రామాచారి నుడివెను.

„మంచి మనస్సుంటే యెక్కడికి వెళ్లినా యేమి భయ్యాలేదు." అని లతీఫుసాహెబు చెప్పెను.

„గురు రావుగారూ! పిల్లవానిని పంపించుట నాకెంత మాత్రము నచ్చదు. చూడండి, ఈ వినయ విధేయతలు మారి వ్యర్థుడయి రాకుంటే నా పేరు తీయించుకొందును. యౌవనంపుల కేదో పరీక్షలలో నెగ్గినట్లు కమ్మల తెచ్చుకొనక పోడు. ఆ కమ్మలతో రాగానే కడుపునిండదు. మళ్లీ యెక్కడ తంటాలు పడి జీవనోపాధికి మార్గం కల్పించుకోవలసి వుంటుంది. చూడండి, వానికిం. పైసా ఖర్చు లేకుండానే ఆ తంటాలు యిక్కడ పడితే బాగని నా యభిప్రాయం. పిల్లవాడంతగా చెడడు" అని శర్మ చెప్పి యూరకుండెను.

ఎవరెంత చెప్పినను గురురావుగారికి తుకారామును సీమకు పంపి తీరవలయునని నిశ్చయమై యుండెను. కావున తదితరుల మాట నెగ్గలేదు.

## విశ్వ విద్యాలయము

తుకారాం లండన్ విశ్వవిద్యాలయములో చేరెను. ఇండియానుండి వచ్చిన వారంతయు దొరాజాలో, ఏ కోటీశ్వరుల కొమారులో అని అక్కడి వారి విశ్వాసము. ఏమిటన గౌరవము పొందకుండను కొనలేదని వీరలు మితి మీరి ఖర్చుచేసెదరు. ఆ కల్పితమాది. వారలు వీరిని భాగ్యవంతులనుకొనియుందురు. అయినా చీటికిమాటికి ఆత్మారాం సేటువద్ద ప్రాంసరీ నోటు వ్రాసి చేయుచున్న వైభవమని పాపము వారలకేమెఱుక? ఇదియుగాక ఇక్కడినుండి చదువబోవువారలలోన బిడ్డనో కొడుకునో కనియూ లేక యౌవనాదేరిన పెండ్లాము నింటనుంచియూ చనియెదరు. ఈ సమాచార మక్కడి యువకులకు చెప్పరు. ఆదేశమున యీ కాలమునకు ప్రాయశః జనులలో వివాహములు కాకుండు. హేతువుచే వచ్చిన వారలు అవివాహితులనియే వారు తలచెదరు. వివాహితులని వారికి తెలిసినచో వారు వారి దగ్గరికి చేరరు. ఎన్ని తమాషాలు! గాంధిమహాత్ముని వంటి ఒకరిద్దరు విప్పిచెప్పు రావలెగాని అక్కడిరహస్యాలు బట్టబయలు చేస్తే మాకేమి ఆయింది.

తాను లండన్ యూనివర్సిటీలో చేరినానని, రెండు మూడు విషయములలో తంటాలు పడుచున్నానని, తనకు సహాధ్యాయురాలుగా మిస్ కొంగా దొరసాని చేరినదని జాబు వ్రాసెను. అన్నియు సరికాని కొంగ మాట వినగానే గురురావు గుండె గుభేలు మనెను. ఏమి చేయగలడు? తుకారాం భార్యకు మాత్రము సమాచారము తెలియకుండెనా? ఆమెకు మగడు కాడనియే నిరాశ చేసుకున్నది.

„తూ"

కొంగా దొరసానికి తుకారాం అను పేరు పాడుగాను ఉచ్చారణ సౌకర్యము లేనిదిగాను కానుపించెను. కావున తత్ప్రత్యామ్నాయము „మిస్టర్ తూ" అను పేరువచ్చినది. కొంగాదొరసానికూడ „మిస్టర్ తూ" అను పేరుమార్చుకొనెను. వారుభయుల మిత్రులు, తోటి నవారలు „తూ" అనసాగిరి. ఇండియాదేశమునందలి వారలు „తూ" అనబడుచున్నప్పుడభిమాన పడవలె తుకారాము „తూ" అనబడుచున్నప్పుడభిమాన పడవలె

నియుండెడిది. కాని అది యింగ్లండు అక్కడ "తూ" అన్నను మరేమన్నను అభిమాన పడవలసిన అవసరము లేదు. అదిగాక తానొక్కడే "తూ" అనబడుచున్నాడా? తనదంటకు "మిసెస్ తూ" ఒకతె లేదా? ఉభయులు ఏకరీతి "తూ, తూ" అనబడుటయు నొకవిధమయిన గౌరవముగానే యుండెను.

## ఇండియా ప్రయాణము

పరీక్షలు ముగిసినవి. తుకారాంగారు పత్రయోగ్యతకు పాత్రుడైనాడు. ఇండియాకు ప్రయాణమైనాడు. మిసెస్ తుకారాం (కొంగ దొరసాని) తోడ రాదలచినది. కాని యిండియాకామెను తీసుకొనివచ్చి యేమి పెట్టగలడు? ఇకముందు తండ్రి డబ్బియునా? ఉన్నది పాడుచేయు తెలివికంటె యింకొక తెలివి ఆతని దగ్గరలేదు. అక్కడనున్న దినములన్నియు డిన్నరులలో, డాన్సులలో, షికారులలో, డ్రామాలలో, సినిమెటోగ్రాఫులలో గడచిపోయెను. ఇక యేమియోగ్యతకొరకతను శ్రమపడవలసియుండెను. కాని కష్టమనిన చేతగానివాడుగా మారెను. ఇకముందిండియాకువచ్చి సంపాదనమార్గము నేర్చుకొనవలయును.

నాల్గుసంవత్సరములు సీమలోనుండి సంపాదించిన మాయ, మర్మము, కుట్ర, కుహకములు వినియోగించి వెనుకనుండి పిలిపించుకొన్నిరోదనని కొంగ నొడంబడికజేసి యావలనుసరికి తుకారాంగారికి తలప్రాణము తోకకువచ్చినది. కాని ఇండియనులకు ధైర్యములేదు, సాహసములేదు, పిరికిపందలు, ఒక ఇడుదాని స్వాదలేదు అని కొంగపోట్లు తలవాయునట్లు తినక తప్పలేదు. చేజేత అనుభవింపక యెవనికి దప్పదు.

## బొంబాయి రేవు

"క్యాంబ్యాటి" అను పడవ బొంబాయి రేవులో దిగినది. గురురావుగారు రెండుదినములకు ముందే బొంబాయికి దివాను గారి యుక్తమువచ్చి రేవునకుబోవు టికెటు గొనియుండెను. పడవవచ్చినదని తెలిసినది. నాలుగు సంవత్సరములనుండి చూడక కండ్లుకాయలు కాచినట్లుండుటచే యెప్పుడు కొడుకును చూచెదనాయని కుతుకముతోనున్న గురురావు రేవునకు పరుగెత్తుకొని వెళ్ళెను. ఇంకను తుకారాం పడవనుండి దిగలేదు. రెండు మూడుదినములు పడవలోనే విశ్రాంతిగొనచుండెను. సముద్రపు నేగుట బాగుండదనియో, లేక మరేకారణమునో, దివానును పంపించెను గురురావు. దివానులోనికేగి "మీతండ్రి నిన్ను చూచుటకు రేవులో నున్నాడని చెప్పెను. అంతటాతడు "Oh! this isn't my leisure time, ask him to come at five" అనగా ఇది విశ్రాంతిసమయము గాదు, సాయంకాలమయిదు గంటలకు రమ్మనుమని చెప్పినాడు. "సీమకుపోయి యెంతగౌరవ మర్యాదలు నేర్చుకొని వచ్చినాడు? ఎంత ప్రేమావిశ్వాసములు నేర్చుకొనివచ్చినాడు? తండ్రి గది గుమ్మమువద్ద నిలిచియుండి తన్ను చూడనున్నప్పుడు దనవలె వినమాట యిదియేనా? నాలుగు సంవత్సరముల శిక్షకు ఫలమాయిది?" అనుకొని గురురావుగారి వద్దకు వచ్చెను. "కుమారుడేమనె" నని గురురావాతురతతో యడిగెను. కాని మంత్రికి చెప్పుటకు నోరెక్కడగలదు? కొమారుడన్నమాట లేనోటితో చెప్పగలడు? మంత్రి యింక నీమకు వెళ్ళి రాలేమగదా? "సరి చూచెదము. యుక్తిచేయుదిదుకురము" అని గురురావును వెంటనిడుకొని పోయెను. తండ్రి వెళ్ళువరకు కొడుకు పరుండియుండెను. తండ్రిని చూచిన పిమ్మటనైన లేచి ప్రత్యుత్థానము చేయలేదు. తండ్రి పట్టరాని దుఃఖముచే కొడుకుపయిబడి దుఃఖించెను. ప్రేమావిశ్వాసముల నడుమ పెరిగినవాడు తండ్రి. నల్లతోలుసంచిలో తెల్ల విజ్ఞానమును నింపుకొని వచ్చినవాడు కొడుకు. ఉభయులకెంత తారతమ్యము? "అమ్మ బాగున్నదా? తమ్ముడు చదువుకొనుచున్నాడా! కోడలిక్కడనే యున్నదా?" అను కుశల ప్రశ్న లేవియు లేవు. మీటదొక్కిన సిడిపలె తటాలున లేచి గదిలో నొకమూలకు "హూషుహూషు" అని యీలవాడుచు నిలుచుండెను. ఈ చర్యను చూచి తండ్రికి మరింత దుఃఖము వచ్చినది. కాని కడుపు తీపి చెడ్డది! మాలిన్యము కలదయినను లేనట్టు దోచును. ఈ చర్యనంత సహించుకొని "తుకా! బసకుపోదామురా. వంట సిద్ధముగా నున్న" దని పిలిచెను. కొడుకుతో కలసి తినక తండ్రి . . . కెంత కాలమయినది. "That's not fit for me" అని సాక్షాత్కించెను. అనగా ఆ భోజనము నాకు సరిపడ

దని అర్థము. తల్లి పాలు చేదయినప్పు డెవడేమి చేయగలడు.

## పడక గది

సర్వాలంకార భూషితయగు భార్య అగ్నిసాక్షిగా వివాహ మాడిన భార్య, పడక గదిలోనికి వచ్చి నిలచెను. తుకారామామెను ఎగాదిగ చూచి "Who are you please?" అని ప్రశ్నించెను. అనగా నీవెవరని యర్థము. ఆరవంతముక్క తెలుగున ననలేకపోయెనా? (నాలుగు సంవత్సరములకే తెలుగు పూర్తిగా మరచెనా? తలిదండ్రుల, చేసికొనిన భార్యను మరచెనా? మాతృభాషలో మాటలాడిన మానహానియా? విదేశమునకేగి వచ్చుట యన జన్మాంతరమంది వచ్చుట కాబోలు.

ఆ యింగ్లీషు ముక్కలు పాపమా బాలకేమెరుక, "ఈ నాలుగు సంవత్సరములు క్షేమముగా నున్నారా? నన్నెప్పుడయినా తలచుకొనుచుంటిరా?" అని కుశలప్రశ్న చేసెను: ఆ ప్రశ్న ప్రేమలో మునిగి, పాతివ్రత్యముద్దికట్టున్నది. కాని ప్రయోజనమేమి?

ఇక తుకారామునకు తెలుగు మాట్లాడక తప్పలేదు. "నీవెవరు?" అని ప్రశ్నించెను. "అయ్యో నేను మరచున్నారా? మీభార్యను గానా? మీరాక కొరకె యెదురు చూచుచున్నదానను కానా? నన్నితరు......" అని యిమాట అనలేక యేడువసాగెను. ఆ యేడుపునకు హిమాలయము ఖంతటిది కరిగి పోవలసినదే. కాని ఇది హిమాలయముగాక ఆలెప్ అయెను. "ఓ ఓ, నాపైకా? ఛీ ఛీ నాకు వద్దు, పో, పో" అనెను. ఆమెకక్కడ నిలకడేమి గలదు? ఆమె యేడ్చుచు పోయి అత్తమామలతో నిసోద జెప్పెను. వారామెననుకరించుట కంటె యేమి చేయగలరు.

## పరిశిష్టము

రెండు పూటలింట, ఒక పూట డియాంజలిస్టు హోటలులో భోజనము చేయుచు ఈ ప్రకారము మూడు మాసములు గడపినాడు. ఒకనాడు బొంబాయికి చెప్పకుండ వెడలినాడు. కారణము విచారింపగా కొంగా దొరసాని వచ్చినట్లు కబురు రాకడయే. "మిస్ తూ" "మిస్టర్ తూ" లు కలసినారు. ప్రస్తుతము పిన్నమొదలు పెద్దదాక వారినందరు "తూ, తూ" అనే అంటారు. లండను నగరములో రహస్యముగా పెట్టుకొనిన పెళ్లి హిందువులకెట్లు తెలసినవి? వారికి దివ్యజ్ఞానము కలదుగా. ముందు అవకాశముంటే "తూతూ దాంపత్యమని" వారి అనంతర జీవితము వ్రాయబడును.

# పిటికిపంద

వి. నరసింహాచార్యులు

పిటికిపందలు తమ చావువేళ రాక
మునుపె మాటిమాటికి చచ్చిపోవుచుంద్రు;
చావుసచ్చి ధీరుం డొక్కసారిం జూడు;
నేను విన్నట్టి వింతలలోన నెల్ల—
సారెసారెకు "నక్కటా! చావనుంటి,
దైవవశమున గండంబు దప్పెం గాని,"
యనుచు ననుకొనంగాం జేయు నట్టి పిటికి
తనము కడువింత యైనది; జనన మొందు
వారలకునెల్ల సహజమై వచ్చుచుండు
చావొకముగింపు దానికై జడియనేల?
వచ్చువేళకు నదిరాక వచ్చుగాని.

(మహాకవి, డబ్ల్యు. షేక్స్పియర్ గారిపద్యమునకనువాదము)

# గ్రంథ విమర్శనము

**తులసి:**

గ్రంథకర్త: డాక్టరు కె. ఎస్. కేసరిగారు

వెల ౦—౮—౦

ప్రకాశకులు: కేసరీ కుటీరము, ఎగ్మూరు మద్రాసు.

ఈ గ్రంథమునందు తులసిచెట్టుయొక్క యుపయోగములు ఆయుర్వేద దృష్టితో ఆధారముల సహా విపులముగా చర్చింప బడినవి: ఇందు తులసీపురాణమును, స్త్రీల నాకర్షించు తులసీదేవిపైని వ్రాయబడిన పాటలును, చేర్పబడినవి. ఇవిగాక పాము విషములను తత్క్షణము నిర్మూల్యము చేయునట్టి విధమును, సామాన్యముగా ప్రతి స్థలమున లభించు అతి దివ్యౌషధముల సంగతి తెలుపబడినది. మొత్తము మీద పుస్తకము పండిత పామరుల నాకర్షించునట్టి శైలిలో వ్రాయబడి చక్కని యచ్చుతో ముద్దుల గురియుచున్నది. తులసీమహాత్తును తెలిసికొన నిచ్ఛగించు ప్రతి యాంధ్రుడును యీ పుస్తకమును చదువ వలసినదే. ఆరోగ్య ప్రసాదినియగు తులసమ్మ గొప్ప దనము తెలిసికొనుట మనందరి విధి.

**భావోద్రేకము:**

వెల: ౦—౬—౦

ప్రకాశకులు: ఆంధ్ర సారస్వత గ్రంథమాల

పిల్లలమర్రి, సూర్యాపేట పోస్టు. (నైజాం)

నిజాంరాష్ట్రాంధ్రుల యభివృద్ధికై పాటుపడుచున్న మహనీయులలో నొకరగు శ్రీ కె. రాములు గారి భోవోద్రేక ఫలిత మీచిన్న పుస్తకమున వివిధ భావములను వేర్వేరు శీర్షికల క్రింద హృద్యంగమగు శైలిలో వ్రాయబడి యున్నది. శ్రీ ఆంధ్రసారస్వత గ్రంథ మాలవారు తమ తృతీయ కుసుమము గా నీపొత్తమును ప్రచురించిరి. ముద్రణా లోపములు చాల గలవు.

**హరిశ్చంద్ర మహారాజు:**

ప్రకాశకులు. సెక్రెటరీ, యస్, ఆర్, లైబ్రరీ, లక్ష్మి నర్సాపురము పిఠాపురము, పోస్టు, తూర్పు గోదావరిజిల్లా.

వెల ౦—౮—

ఈ పొత్తము ఆంధ్రసాహిత్య సరస్వతి, కావ్యనిధి, మరియు విద్యాభూషణ మొదలగు బిరుదములు బొందిన శ్రీ చెలికాని వేంకట నరసింహారావుగారిచే వ్రాయబడి ప్రచురిత మైనది. సూర్యవంశమునకు మకుటమైన సత్యహరిశ్చంద్రుని సుచరిత్రమును సులభమైన తెలుగులో వ్రాయబడినందున పామరులకును, పిల్లలకును, స్త్రీలకును, చాల లాభమును కలిగించును.

వెల: ౧—౮—౦

**స్త్రీపురుష రహస్యములు:**

గ్రంథకర్త: ఆర్. కె. టాల్టీగారు

ఈ గ్రంథము రోగవ్యాప్తి ఖండన సంఘము, విశాఖ పట్టణము వారిచే ప్రచురింపబడినది. పుస్తకము చాల చిన్నదైనను అందు చర్చింపబడిన విషయములు ప్రతి మనుష్యుడు తెలుసుకొన తగినవి. విమర్శింప తగిన విషయము ఒకటే కలదు. ఇంతచిన్న పొత్తము వ్రాయబూనినప్పుడు విశేష వాదవివాదములు అనుచితములు. స్త్రీపురుషులకు సంబంధించిన రహస్యములపై యొక్కువ విపులముగా వ్రాసియుండిన బాగుండెడిది. వినను పై సంఘము వారు మరికొన్ని గ్రంథముల నీ విషయమును గురించి రచించి ప్రచురింప నిశ్చయించి యున్నారు. కనుక ఆంధ్రలోకమునకు వానివలన చాల లాభము కలదు. ఇట్టి గ్రంథముల పఠన వలన లోకులు నీతి బాహ్యులై పోవుదురను వాదము నిరర్థకమైనది. వారివాదము "విద్యావంతులైన నొకరిద్దరు దుర్మార్గము నవలంబించిరి కనుక మనుష్యుడు విద్యాభ్యాసనము చేయనే కూడదు" అను దానిని బోలియున్నది.

మొత్తముమీద ఇట్టి ముఖ్యమైన సమస్యలకు ప్రబల ప్రయత్నముల చేయ సంసిద్ధులైన పై సంఘము వారిని మే మభినందించుచున్నాము.

సంఘము వారిక ముందు ప్రచురించు పుస్తకముల ముద్రణయందు ఎక్కువ శ్రద్ధ జూపుదురని నమ్ముచున్నాము.

# శాసనములు

ఆంధ్ర పరిశోధక సంఘము, హైదరాబాదు.

## (నెం ౧౦) నగునూరు శాసనము

నగునూరు కరీంనగరమునకు నెన్మిది మైళ్ల దూరమున నున్నది. ఖిలమైన జైనాలయములు శివాలయములు పెక్కులు గలవు. ఊరిబైటనున్న శక్తిఆలయమునకు యెదురుగా మండలాకారముగా నున్నవి. గ్రామములోని ఒక దాని క్రింద ని శాసనము రెండువైపుల వ్రాయబడి యున్నది. చాళుక్యలిపి

### మొదటి వైపు

౧ స్వస్తిశమస్త ప్రశస్తి సహితం
౨ శ్రీమను మహామణ్డలేస్వరం
౩ దొమ్మరాజు శ్రీమచ్చా
౪ ళుక్య విక్రమ గాద
౫ ఉత్తమ విస్య నాశ్య నేద్ద
౬ ప్రమాదిసంవత్సరద వై
౭ సకబహుళ చదివెలు
౮ పుయమగు సుక్రవర
౯ మునాడు, మేడెరజు జ
౧౦ గదేవడుం ఎవళఇ
౧౧ వెలితో పొడిచి గెలి
౧౨ చె

### రెండవ వైపు

౧ సర్వజిత్తుసంవత్సర పాల్గుణ సుద్ధ ద
౨ శమి గురువారమున చపాండు ప
౩ ట్టిస। అనడు మానుకుదీయస్థల
౪ దేశన ధర్మసాలియజనులా
౫ యాదల పంపునామని జెల్లంగా
౬ అముల్లిసెట్టిని ఆయున కొడుకు
౭ పెన్నిసెట్టిని నాకేశ్వరదేవరప్రతి
౮ ష్టను గణపదేవ మహారాజు
౯ సరగిణ పరేశ్వరమును సకే
౧౦ ల భక్తులమేరను సకలేశ్వరము
౧౧ ను ప్రతిష్ట చిల్లరి దేవరకు అం
౧౨ గరంగ విభోగాలకు ఇచ్చిన
౧౩ ఆయవృత్తులు తమ ఆమేరి
౧౪ చరలపగడినాన వీసము ఇ
౧౫ స్త్రిమి ఆచంద్రార్క్యాదినిలిచె
౧౬ డిని ఈనివాను గంగకలురె
౧౭ కవిల పొడిచిన వాను వీను
౧౮ సమయానకును వెలిసి వా
౧౯ ద్రోహులాడు వానిపుట్టుకు
౨౦ దేఃడునింత సడ్డవీను
౨౧ వాండు శివద్రోహి

### సూచన

శాసనమునకు బయిభాగముగ వీరవిగ్రహము చెక్కబడినది. సంగరమునందు గెలిచిన వీరుని జ్ఞాపిక 'కానోపు రెండు శాసనముల లిపి ఒక కాలము నాటిదే. వ్రాతతప్పులు మెండుగా గలవు. కాకతీయప్రోలరాజు శాసనలిపికి ఈ శాసనలిపికిని గొంతవఱకు పోలిక కలదు. మొదటి శాసనము కన్నడమిశ్రమగు నున్న తెలుగు రెండవది తెలుగు. మొదటి శాసనములోని దొమ్మరాజు, జగద్దేవుడు, మేడరాజు అను మువ్వురు కాకతీయ సామ్రాజ్యమునకు ప్రత్యర్థులుగా నుండి ప్రోలరాజును ప్రతిఘటించిన వారు వీరిలో దొమ్మరాజు. రుద్రదేవుని కాలము నాటికిగూడ ప్రతిఘటన సలుపుచు వచ్చి క్రమాభివృద్ధి నొందు కాకతీయులబలముముందాగక జాలక రాజ్యము కోలుపోయిరి. రెండవ శాసనములోని లిపి గణపతి దేవుని కాలమునాటి లిపికంటె మిగుల బూర్వమైనదిగా నున్నది. గావున అందు చెప్పబడిన

గణపతిదేవుఁడు ఎవఁడో తెలిసికొన నగును. నగునూరిలోని వీరశిల లన్నింటిని త్రవ్వించినచో క్రింది భాగమున నేమేని చారిత్రకాంశములు బయలు పడవచ్చునను విశ్వాసము గలదు.

## (నెం ౩౦) ముప్పవరము శాసనము

ఓరుగల్లు తాలూకాలో ముప్పవరము (ధర్మ సాగరమునకు సమీపమున నున్నది) గ్రామమునకుఁ బైటచెఱువు కట్టమీఁద పాడుపడియున్న గుడిచెంతఁగల కొండ మీఁద నొక మాలరాతిమీఁదఁ జెక్కఁబడిన శాసనము. ఒకవైపు సమగ్రముగను రెండవ వైపసమగ్రముగను వ్రాయ బడినది.

మొదటి వైపు

౧ స్వస్తి శ్రీమతు
౨ కాకతి గణప
౩ తి దేవర సుఖ
౪ రాజ్యము సేయం
౫ పంతబొల్లిరెడ్డికి
౬ కొమ్మసానికిం బుట్టి
౭ న కొడుకుమల్లి
౮ రడ్డి రామేశ్వర దే
౯ వర ప్రతిష్టసే
౧౦ సిగుడి గట్టించి ఈ
౧౧ దేవర వృత్తులు
౧౨ పండి వాయమర
౧౩ ప మిట్ట కొమ్మవద్దిచె
౧౪ ఱువు

రెండవ వైపు

౧ కట్టకడమ
౨ ఱుకు యిా ధమ్మ౯
౩ మూసెడి పో
౪ కుండవస
౫ పిన వారికి
౬ క్షేమంగా
౭ ఇంతిపట్టు
౮ గణపతి
౯ దేవర
౧౦ + + +

సూచన

శాసనశిల సరిచేయని నల్లరాయి. శాసనమునకు సంబంధించిన ఆలయము పాడుపడి యున్నది. ఈ శాసనమున మొదట రెడ్డి పదము తరువాత రడ్డి పదము వాడఁబడి యున్నది. గణపతి దేవుని కిటీవల శాసనములలో రెడ్డి పదము వ్యవహారమునకు విశేషించి వచ్చియుండు నని శాసనముల వలన గ్రహింప వీలు కలుగుచున్నది. చివరపంక్తి మాత్రము గ్రహింప వీలుగా నున్నది. శాసన లిపి ప్రశస్తమైనది కాదు.

## (నెం ౪౧) శాసన ఖండము

హుజూరునగరు తాలూకాలోని కందిబండ చెంతనున్న మేళ్లచెఱువు శివాలయములో ఱోలు కొట్టించుటకై శివార్చకుఁడు తెచ్చియుంచిన శాసన ఖండము ప్రకృత మిది శివాలయమునకు వెనుకఁ బడియున్నది.

౧ డ్డోలిక దొరవరాత్మ జాతః చో
౨ వరాదివజ్జరాజః పతోఱు
౩ + గుణాన్వితో ముదమ
౪ తో గుణైక నిలయస్స
౫ మోస్యవర పదమాఖ్య
౬ స్స్వ౯ గుణ మశ్ృత్వా+
౭ స్వస్థత

సూచన

ఇందలిలిపి తొమ్మిదవ శతాబ్దమునాఁటి చాళుక్య లిపి. వర్ణములు పశ్చిమ చాళుక్యుల యొనిమిది తొమ్మిది శతాబ్దములలోని శాసన లిపిని సర్వ విధముల ననుకరించు చున్నది. ఇతను దొరవరపుత్రుఁడగు వజ్జరాజ పేర్కొనఁ బడినాఁడు. ఈ యనను గూర్చిన విశేషము లేవేని భవిష్యత్పరిశోధనమునఁ గాని తెలవు. లిపి ఉన్నంతలో స్పష్టముగాఁ బరిశుభ్రముగా నుండి పఠన యోగ్యముగా నున్నది.

## (నెం ౪౫) బూరుగుగడ్డ శివాలయ శాసనము

ఇది నల్లగొండ జిల్లా హుజూరు నగరు తాలూకాలోని గ్రామము. ఈ శాసనము శివాలయ ప్రహరీలో నాగుబాము చెక్కఁబడిన శిలకు వెనుక వైపున వ్రాయఁబడి యున్నది. శిలపైఁ గొన్ని భాగము అరిగిపోవుటచేఁ బ్రతిలోని కొంత భాగము తెలియుట లేదు.

౧ స్వస్తిసమస్త ప్రశస్తి సహితులైన శ్రీ
౨ మహాదేవ సగోత్ర పురఃరాధీశ్వరులై
౩ న బాముకూరి అనభీమానాయనింగారి కొ
౪ డుకు అంనమనాయినింగారు పృధ్విరాజ్య
౫ ము చేయుచు.డంగాను బూసుగడ్డ గ్రామ
౬ మంద పదివేయి గుళముచిన + + + +
౭ + శకాభ్యుదయ శక॥ వరుషంబులు ౧౩౨౦
౮ అగునేంటి పింగళ సంవత్సర జేష్ట శు ౧౫ గురు
౯ వారమునాండు బూసుగడ్డ గ్రామ
౧౦ మందు తమ తండ్రిపేరు కొలమునకుంబుణ్య
౧౧ ముగాను రామేశ్వర దేవరను బ్రతిష్ట సేయిం
౧౨ చి ప్రతిష్ట కాలమపుడు భీమనాయనింగారి
౧౩ కిం బుణ్యముగాను + + + + +
౧౪ + + +     + + +

శ్రీ శ్రీ శ్రీ యీ క్షేత్రముద్రో
యువాయ బ్రహ్మత్యాదిపాతకాములగుబవు
వారు శ్రీ మహాదేవాయనమః॥

సూచన

ఇందుఁ జేర్కొనఁబడిన అనభీమనాయనింగారు అన్నమనాయనింగారు వెలమ వీరులేమో యని తోఁచుచున్నది. ఈ యిరువురిని గూర్చిగాని శాసనములందుఁగాని చరిత్రములందుఁగాని విశేషాంశములు తెలియరాకున్నవి. కాకతీయసామ్రాజ్య పతనానంతరము స్వతంత్రముగాఁ జిన్ని రాజ్యములు స్థాపించిన సేనానాయకులు కానోపుదురు. పదునాలుగవ పంక్తినుండి కొన్నిపంక్తులు పూర్తిగ అరిగి పోవుటచే గ్రహించి వ్రాయవీలు కాదయ్యెను. చరిత్రకు కావలసినంత భాగము పయినుదాహరింపఁబడియే యున్నది.

# ప్రేమగానము

## దామరాజు వేంకటరమణమూర్తి (కవిమండలి)

విరహవేదనచేదూలి వివశమగుచు
దుఃఖమునఁ గాచ్చు నానేత్రతోయకణము
లవియె! మత్స్వాంతదీపితమైన ప్రణయ
జ్యోతి నార్పుచుండఁగఁజూచి యోర్వలేను
రమణి! భవదీయప్రేమ తైలములతోడ
సారముల దక్కు కాంతి ప్రసారములకుఁ
బ్రాణములుపోసి మామకస్వాంతవీధి
దివ్యతరకాంతి శోభాప్రదీప్తకలిత
ప్రణయజ్యోతి నుస్థిరముగఁ బాదుకొల్పి
తావకామల కారుణ్య భావమొలుకు
కృతులఁ బాడెద నాప్రేమ గీతలనుచు.

# సంపాదకీయములు

## మహాత్ముడు

మహాత్ముని ౭౫ వ జన్మదినోత్సవ మీ నెల ౨ వ తేదీనాడార్యావర్తమందంతట నతిప్రేమతో జరుపబడినది. కాలవశమున గాంధీ మహర్షి భరతఖండమున నుద్భవించినను మానవ ప్రపంచమంతయు గర్వపడవలసిన సుగుణ సంపన్నుడాతడు. భారతీయులకై ప్రస్తుత మాతడు తన సర్వస్వము నర్పించినను భారతీయులపై యాతనికి ప్రత్యేకాభిమాన మేమియు లేదు. భారత దేశము గొప్పగొప్ప ఋషిపుంగవులకు పుట్టినిల్లైనను మహాత్మునియందలి వ్యక్తిత్వము వారెవరిలో కూడలేదు. వారిలో పలువురు గొప్పగొప్ప గ్రంథముల వ్రాసిరి. తమ నిగూఢాత్మానుభవమునకు మనను వారసుల జేసిరి. తమ తపఃప్రభావముచే సంపాదించిన ఆధ్యాత్మిక జ్ఞానముయొక్క వృత్తాంతమును మనకందజేసిరి. కాని మహాత్ముడిట్టి జ్ఞాన విషయములతో తృప్తి సౌఖ్యము కలిగించుకొనలేదు. తన జీవితమునం దార్జించిన తపోబలము నంతను కష్టభాజనులైన మానవులకై ముందువెనకలు విచారించక వ్యయపరచుచున్నాడు. బుద్ధదేవుడు, ఏసుక్రీస్తు తప్ప ప్రపంచమునందిదివరకింతటి త్యాగమూర్తి మరొకడు పుట్టలేదు. ఇట్టి మహనీయుని కాయురారోగ్యముల ప్రసాదించుగాత యని దయామయుడగు పరమేశ్వరునితో మేము ప్రార్థించుచున్నాము.

## ౧౯౪౩-౪౪ (౧౩౫౩ ఫ) సం॥రపు ఆదాయ వ్యయ పట్టిక

ఈసంవత్సరపు బజెట్టు నివేదికను జూచినచో నిజాంసర్కారువారి యంచనా ప్రకారము ఖర్చులుపోగా ఆదాయమునుండి ౪౪ లక్షలు మిగులునని తెలియుచున్నది. కరవు కొరకై కొన్నిలక్షలు నిలువ యుంచబడినవి. ఖర్చు పట్టికలో కాలువలకు, చెరువులకు, ప్రభువుగారి డిల్లీలోని బంగ్లాకు (దీనికి ౭ లక్షలు పట్టును), ఆదిలాబాదు జిల్లాయొక్క అభివృద్ధి కొరకు గ్రాంటు రూపకముగా ననేకలక్షలియ్యబడినట్లు తెలియుచున్నది.

మొత్తముపై గొప్పనిలువ ప్రభుత్వమునకున్న దనుటలో ప్రభుత్వముయొక్క శక్తి వెల్లడియగుచున్నది. ఆదాయమునకన్న ఖర్చెక్కువగానున్న ఆదాయాభివృద్ధికై యేమేమి హెచ్చించవలెను, ఖర్చులెందు తగ్గించవలెను, అను విషయముల విచారింపవలసి యుండును. కాని ఆదాయమే యెక్కుడున్న మిగిలినదానిని ఖర్చు ఎట్లు చేయవలెను, వసూళ్ళలో నేమైన తగ్గించవచ్చునా యనువిషయములు చర్చనీయములు. ప్రకృతము మన ప్రభుత్వమువారు రైతుల భారములు కొన్ని తగ్గించిన బాగుండును. నిజామురాష్ట్రమందలి భూములపై నున్న పన్నులు సాధారణముగా బ్రిటిషుఇండియా భూముల పన్నులకన్న హెచ్చుగా నున్నవి. ఫలితము తక్కువ. వ్యవసాయశాఖ సహాయమా అదియు మృగ్యము. మరి రైతుల తెలివితేటలా యితరులం దనూయను గలిగించని యమాయకత్వమందు మునిగియున్నవి. ఇట్టిచో రైతులభూములపై పన్ను తగ్గించుటకు మారుగా హెచ్చించియున్నారు. ప్రభుత్వమువారీసంగతి గమనించి నోరులేని రైతులను సంతోషపెట్టుదురు గాక! అదిగాక రాష్ట్రము గొప్ప వ్యాపారస్థలమైన గాదు. లోపలి ధాన్యము బ్రిటిషు ప్రాంతములకు పంపబడుటయే ముఖ్య వ్యాపారము. అనగా

కఠోడిగిరి విశేషముగా రైతులకే తగులు చున్నది. కావున ప్రభుత్వమువారు వ్యవసాయ కులపైన దెబ్బతీయక, కేవల సౌఖ్యము కొఱకే (Luxury) పంపబడు, తెప్పింపబడుసామానులపై పన్నుల విశేషముచేసి ధాన్యాదులపై తగ్గించిన ప్రజలకు లాభకారిగా నుండునని సూచించుచున్నాము.

విద్యామహాసభ

రాబోవు దీపావళీ దినములలో హైద్రాబాదు విద్యామహాసభయొక్క అష్టమ సమావేశము కానున్నది. ఎనిమిది వత్సరములనుండీ మహాసభ జీవించి యున్నను యిక్కడి ప్రజలకు లాభమును కలిగించు గొప్పసమస్యల నేమియు నీసంస్థ విడదీయలేదు. నిజాం రాష్ట్రేతరులలో నిజాంరాష్ట్రమును గుఱించి సదభిప్రాయమును కలిగించు ప్రయత్నములలో నొకటిగా నీమహాసభ తలంపబడుచున్న దేకాని నిజాంరాష్ట్రవిద్యావిషయము లేవియు నీసంస్థవలన పరిష్కరింప బడుటలేవు. మొదటినుండియు యీ మహాసభతో ప్రజాపక్షమువారు జోక్యము కలిగించుకొనుటలేదు. ఆసభయందు పాల్గొనిన సభికులును, సభా సమావేశకులును చాలవరకు ప్రభుత్వోద్యోగులే. విద్యాశాఖకు సహాయపడుటకై స్థాపింపబడిన సంస్థ, ఆశాఖయందలి లోపములను జూపించి, దేశోపకారకములగు విషయముల సూచించు సంఘము, ప్రభుత్వోద్యోగులతో నిండియున్నందున వారికి విద్యాశాఖకు జెందినవారిని విమర్శించ సాహసము లేకుండ నైపోయినది. మొదటినుండియు యీ మహాసభ కధ్యక్షులుగా నున్నవారు ప్రభుత్వోద్యోగులే. ఉన్నత పదవులందున్నవారలే. ఆకారణమువలన నాసభయందు పాల్గొనదల చినవారు కొందఱు ప్రజాపక్షమువారైనను తమ ప్రయత్నము అరణ్యరోదనము లగునని జోక్యము కలిగించుకొనకుండిరి. ప్రతిసంవత్సర మానభ కూడుటయు, అందు పాల్గొనినసభికులు పరస్పర కృతజ్ఞతావందనములు సమర్పించుకొనుటయు, కొన్ని వేల రూపాయలివరకు విద్యార్థులకు సహాయ వేతనముల నిచ్చితిమని నివేదిక చదువుటయు, రాబోవు సంవత్సరము వరకు మౌనము వహించి యుండుటయు జరుగుటతప్ప మరేపనియు యిక్కడి ప్రజలు వినుటలేదు. విద్యార్థులకు సహాయవేతనముల నిచ్చుట గొప్పపనియని తలచినను దేశమునందలి ఒకపక్షము వారే ఎక్కువ లాభము పొందుచున్నారని తెలియుచున్నది. రాను రానీ సంస్థయొక్క యునికి హాస్యాస్పదమై పోవుచున్నది. నిజాంరాష్ట్ర విద్యావిషయము లెన్నియో సంస్కరింప దగినవిగా నున్నవి. గతవత్సరము హైద్రాబాదు విద్యాశాఖవారు ఖాస్గీపాఠశాలలపై బెట్టిన నిర్బంధన మనకందఱికి తెలిసినవిషయమే. విద్యా మహాసభ గట్టిగా నీవిద్యాశాఖయొక్క చర్యను ఖండించి ఆశాఖను తనలోపమును సవరించుకొన నిర్బంధింపవలసి యుండెను. ఒక సంవత్సరము గడచినను ఆమహాసభయటుల చేయలేదు. లక్షల రూపాయల ఆదాయము గల సర్ఫెఖాస్ (Crown lands) నందు పేర్కొనదగిన యొక యుత్తమ పాఠశాల కనబడుటలేదు. సుమారు కొందుకోట్ల ఆదాయముగల జాగీరులలో నెూత విద్యావిషయిక ప్రయత్నము లేమియు జరుగుట లేదని తెలుపుటకు సిగ్గగుచున్నది. గతసంవత్సర మారుట్లమును అత్రాపు బల్దా యందలి ఒకగ్రామమున ప్రజలొక పాఠశాలను స్థాపింప ప్రయత్నింప సర్కారి జాగీరుదారు డనుజ్ఞ నీయలేదు. ఈవిషయమై అక్కడి ప్రజలు నిజాం ప్రభుత్వముతో నివేదింప "జాగీరువిషయములలో

మేము జోక్యము కలిగించుకొన"మని తెలిపిరి. ఈ ఉదాహరణమువలన విద్యావిషయమును గురించి ప్రభుత్వముయొక్క నిర్లక్ష్యము తెల్లమగుచున్నది. బరోడా, మైసూరు రాష్ట్రములలో నిర్బంధ ప్రాథమిక విద్య యొసంగబడుచున్న సమయమున నిక్కడి విద్యాశాఖవారు విద్యావిషయమై ౭౦ లక్షల రూప్యముల వ్యయపఱచుచున్నామనియు, ప్రాశ్చాత్య విద్యాక్రమముల పరీక్షించుటకై ఉద్యోగుల పంపుచుంటిమనియు చాటుటకంటె గొప్పపని మరేనియు చేయుట లేదు. ఏబది వత్సరములనుండి వారు చేసిన ప్రయత్నముల ఫలితమేమన నూటికి ౩.౮ లోకులు విద్యా సంస్కారము నొందినవారు బయలుదేరినారు! ప్రతివత్సరము సుమారు ౯ లక్షల వ్యయము కలిగించుచున్న ఉస్మానియా విశ్వవిద్యాలయము వలన దేశమునకే యౌన్నత్యము కలుగుచున్నది? విశ్వవిద్యాలయమునందు సున్నీ మహమ్మదీయులకు మాత్రమే మతబోధ జరుపుటకై యేర్పాటు చేయబడినది. షియా విద్యార్థులకును, హిందూ విద్యార్థులకును, మతబోధ యవసరమని తలంపబడలేదు! నీతిబోధ గడచిన సంవత్సరమునుండి మాత్రమే వీరికి గరుపబడుచున్నది. ఈ యుభయులును నీతివంతులైన తదుపరి మతబోధ జరుపుదురేమో! సున్నీలు పుట్టుకతోడనే నీతివంతులై పుట్టిరి! విశ్వవిద్యాలయమునందు తెనుఁగు, సంస్కృతము, కన్నడము, మహారాష్ట్రము, మొదలగు భాషలపై మహమ్మదీయ పరీక్షకులు (Censors) నియమింపబడి యున్నారు! ఉర్దు, ఫార్సీ, అరబీ భాషలను పరీక్షించుటకై యే హిందువుకూడ నియమింపబడలేదు! ఇక్కడ స్థాపితమైన విద్యామహాసభకు లోపములు లోపములవలె నగుపడుటలేదు. సంస్కరింపదగిన విషయము లేవియు వారికి గోచరించుట లేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయము స్థాపింపబడినందువలన ఉర్దూభాష వృద్ధి పొందుచున్నది. అది సంతోషమైన విషయమే. కాని దేశములోనున్న యితర భాషల వృద్ధి యెటుల కావలెను? దేశమునందలి లోకులందరు విశ్వవిద్యాలయమునం దభ్యసించెదరను మాట ఒట్టికల. అట్టి తఱి వారికి ప్రపంచజ్ఞానము కలుగుటయెట్లు? ప్రభుత్వమువారిపై దేశభాషల నన్నింటిని పోషించవలసిన బాధ్యత కలదు. ఇదివరకీవిషయములను గురించి విద్యామహాసభ చేసినప్రయత్నము లేవియు లేవు. ప్రజలీ సంస్థయందు పాల్గొనకుందునంతకాలము దానిస్థితీవిధముగనే యుండును. హైదరాబాదునందలికొందఱుప్రజలు కొన్ని చిత్తుతీర్మానములను మొన్ననే విద్యామహాసభ కార్యనిర్వాహక వర్గమువారికి పంపినటుల తెలియుచున్నది. ప్రజలలో బహుళ సంఖ్యాకులీ సభయందు పాల్గొని తమకు విద్యావిషయిక సౌకర్యముల కలిగించమని ప్రభుత్వమును కోరవలెను.

అటుల చేయనియెడల నిర్బంధములు ప్రతిదినము పెరిగిపోవుచు మన జీవితములు నిర్భరములై పోవుననుట నిశ్చయము. "అడగంది అమ్మగూడా పెట్టద"ను సామెతయొక్క రహస్యము మనమందఱమును తెలుసుకొనుట ముఖ్య కర్తవ్యము.

Edited and Published by P. N. Sarma, B. A., LL.B., Troop Bazar, Hyd, Dn.
Printed by S. Pratapa Reddy, B.A., B.L., at the Golakonda Press, Hyderabad.

# విషయసూచిక

# సుజాత

హైద్రాబాదు డిసంబరు ౧౯౨౭

సంపుటము ౧ | ప్రభవ సంవత్సర మార్గశీర్షము | సంఖ్య ౧౨

## అల్లసాని పెద్దనార్యుఁడు వైదికియా?

శేషాద్రి రమణ కవులు

మను చరిత్రమును విమర్శించి యందలి గుణదోషములఁ జర్చించి విద్యాధికులు వ్యాసములు వ్రాయుచున్నారు. ఈ మధ్య బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు ఆంధ్ర సాహిత్య పరిషత్సభమున అల్లసాని పెద్దనార్యుని కవిత్వతత్త్వము అను నొక వ్యాసము చదివిరి. అది పరిషత్పత్రిక ౧౦ సంపుటము ౫-౬ సంచికలలో ముద్రింపఁబడి యున్నది. అందలి యంశముల నిరాకరించి పెద్దనార్యునిగూర్చి వేఱొక వ్యాసము బ్రహ్మయ్య శాస్త్రిగారు సుజాత ౧వ సం. ౧౦వ పత్రికలో వ్రాసియున్నారు. దాదాపుగా ఆ వ్యాసములోని పెద్దనార్యుని నివాసస్థల చర్చ, జాతి నిరూపణము ౧౯౨౫-౨౬ ఆంధ్ర పత్రికా సంవత్సరాది సంచికలలోని పెద్దనార్యుని యుదంతమను వ్యాసమునకు అనుకరణమై యున్నది. ఈ యుభయ వ్యాసములు గూడ నందవరీకులు వైదిక బ్రాహ్మణులని నిర్ణయించుచున్నవి. ఇందలి సత్యాంశము నిర్ణయించి నందవరీకులు వైదికులని నిర్వచింపఁ దగునో తగదో గుర్తించుదము.

నందవరీకుల చరిత్రము గ్రహించుటకుఁ గొన్ని గ్రంథములు గలవు అందు వీర కుంశీలాదికములు గలవు గాని యింతలకు విషయసమన్వయమున నిష్పక్షపాతబుద్ధి యావశ్యకమై యున్నది. నందవరీకులు వైదికులను వాదము ౧౯౨౫ సం. ఆంధ్ర సంవత్సరాది సంచికలో బయలు వెడలినది. సుజాత ౧౦ యవ సంచికలో బలపఱుపఁ బడినది. ఇందలి యంశములకు సత్యముగలదో ఈ నిర్ణయ...

కొంతవఱకు ఉచితమో తెలిసికొనుట కర్తవ్యము. నందవరీకుల వృత్తాంతములు దెలుపు గ్రంథములు:

1. చౌడేశ్వరీవిలాసము. (సంస్కృతము)
2. చౌడేశ్వరీవిలాసము. (పద్యకావ్యములు)

—కోట నారాయణకవి

3. చౌడేశ్వరి విలాసము. (ద్విపద)
4. నందవైదికి చరిత్రము.

—ధరణికిమధ్య రాయకవి.

5. చాముండావిలాసము.

—నన్నయభట్టు (ఆరోపితము).

6. నందవర చరిత్రము.

—మాచవరపు వేంకట మంత్రి.

ఈ గ్రంథములలో మొదటిదగు సంస్కృత గ్రంథ మిపుడు కానరాదు. తక్కిన గ్రంథములన్నియు నందవరీకులు కాశీ నివాసులగు బ్రాహ్మణులనియు నందుఁడను మహారాజును తమమంత్ర మహిమచే మెప్పించి కర్నూలు జిల్లా నంద్యాల తాలూకా నందవరము నగ్రహారముగా నొంది యది మొదలుకొని యగ్రహారమున వసించి నందవరీకులని పిలువఁబడుచు వచ్చిరనియుఁ దెలుపుచున్నది. విషయములలో నించుక భేదమున్నను అన్ని గ్రంథముల సారము సమన్వయించితిమేని నందవరీకు లనఁబడు బ్రాహ్మణులు నందుఁడను రాజు కాలమున తామపీడితులై కాశినుండి కర్నూలు మండలమునకు వచ్చి నందవరమున వృత్తి స్వాస్థ్యముల నార్జించి నిలిచిరనియు నాటగోలె ఆ శాఖీయు లెచటికేఁగినను నందవరీకులను నామముతో వ్యవహరింపఁబడిరనియు నిర్ణయింప వచ్చును. ఆంధ్ర చాముండికా విలాసములో నీ యంశమించుక మార్పు గాఁగలదు. వచ్చిన బ్రాహ్మణ కుటుంబములు కొన్ని దినములకుఁ గాశికిఁ బోవునపుడు అందు ఆఱువేల కుటుంబములు ఆంధ్ర దేశమునందలి దక్షిణ భాగము నందుండి యార్వేలవా రనఁబడిరనియు ఐదువందల కుటుంబములు కాశికిఁ బోయి శక్తి యను గ్రామము బడసి రాజుచే నగ్రహారము బడసిన వారిగ నందవరీకు లనఁబడిరనియుఁ దెలియుచున్నది. ఇది యవిశ్వసనీయమైనచో ఆఱువేల నియోగులు నందవరీకులు తొలుత నొక్క శాఖవారని విశ్వసింప వచ్చును. నందవరీకులు వైదికు లనుట యెంతవఱకు సంగతమో విచారింపదము.

నందుఁడను రాజెప్పటివాఁడో కాశినుండి వచ్చిన బ్రాహ్మణులు నందవర మగ్రహారముగా నొందిన దెప్పుడో నిర్ణయింపఁదగు నాధారములు కానరావు. ఈ కథాంశమునందద్భుతసృష్టిజేసి గ్రంథ రచనము గావించిన కవులు గూడ దాదాపు రెండువందల సంవత్సరముల కిటీవలివారు. కాన కాశీ ప్రాంతముల నుండి ఆంధ్ర దేశమునకు బ్రాహ్మణ కుటుంబములు వలస వచ్చిన కాలము గుర్తింప వీలుకాదు. ఆంధ్రదేశమున నియోగి వైదికి భేదము మధ్య కాలమునందుఁ గల్పింపఁబడినది, కాని చిరకాలము క్రిందిది కాదు. ఈ విభేదమొక యాంధ్రదేశము నందెగాని యితర స్థలములందుఁ గానరాదు. కాశీతీరవాసు లాంధ్రదేశమునకు వచ్చినది దాదాపుగఁ బదునేను వందలసంవత్సరములకు పైకాలము నందని కొందఱు చెప్పుచున్నారు. ఏది యెట్లున్నను గాశీతీర బ్రాహ్మణులు ఆంధ్ర దేశమునకు వచ్చి నందవర మగ్రహారము బడసిన నాటికి ఆంధ్ర దేశమున నియోగి వైదికి భేదములు లేకుండెనని విశ్వసింప నగును. నియోగులలో బహుసంఖ్యాకులుగ నున్న ఆఱువేల నియోగులు గూడఁ గాశీ ప్రాంతమునుండి నందుని సందర్శనమునకు వచ్చిన వారని పూర్వోక్త గ్రంథములు చాటుచున్నవి. ఆఱువేల వారిలోఁ బూర్వ మెవరును దాము నియోగులమని చెప్పుకొనక ఆఱువేల వారమనియే చెప్పుకొనిరి. నందవరీకులు గూడ నిటులే తాము నియోగులమని తెలుపుగఁ జెప్పుకొనలేదు. దీనిచే నుభయ శాఖలు కాశీ ప్రాంతములనుండి వలస వచ్చెనను నందవరీక చరిత్ర గ్రంథకర్తల వాక్యము విశ్వసనీయము కావచ్చును. ఆఱువేలవారు గూడ పూర్వమునుండి నియోగి పదమును కలుపుకొని జాతినామము వ్యవహరింపలేదు.

సీ. అఖిలరాజాధిరాజాస్థాన జనహృద్య
విద్యావిహారు లార్వేలవారు

—ఉత్తరరామాయణము.

సీ. నను భరద్వాజగోత్రుని నదాపస్తంబ
సూత్రుని బాంధవస్తోత్రపాత్రు
పాకనాటార్వేల వంశప్రసిద్ధుని
నూర్జటిపౌత్రు బంధురచరిత్రు

—కుమార ధూర్జటి కృష్ణరాయ విజయము.

సీ. కౌశికగోత్ర విఖ్యాతుఁ డాపస్తంబ
సూత్రుఁ డార్వేల పవిత్రకులుఁడు

—పారిజాతాపహరణము. ముక్కు తిమ్మనకవి.

సుగంధి. దుర్వారయాఱువేల
　　　వంశవార్ధి పూర్ణచంద్రమా!

—రాజశేఖర చరిత్రము. మాదయగారి మల్లన.

ఇఁక తిమ్మరసు మంత్రి మేనల్లుఁడు నాదిండ్ల అప్పామాత్యుఁడు ప్రశంసింపఁ బడియున్నాడు. చాముండికావిలాసాది గ్రంథములలోని యంశమును విశ్వసించి యాఱువేలవారు గూడ నందవరీకులతోఁ బాటు కాశినుండి వలస వచ్చిన వారనియుఁ బూర్వ కాలమునుండి ఆఱువేలవారు గూడ నందవరీకులవలె నియోగినామము ధరింప లేదనియు విశ్వసింతుమేని నంద వరీకులు ఆఱువేలవారు నొక తెగవారే యని నిర్ణయింప వలసివచ్చును. నందవరీకులు నందుని వలన అగ్రహారమును సంపాదించుకొని సుఖజీవనము జరుపుచుండఁ యచటి యార్వేల బ్రాహ్మణుఁడు వచ్చి మేముగూడ మీతోఁ గాశినుండి వచ్చితిమి గదా? మాకును మీతోఁబాటు వృత్తిస్వాస్థ్యముల నొసంగి బాధుత్వము గలుపుమని కోర నందవరీకులు నిరాకరించిరట! ఆయంశము చాడే శ్వరీ విలాసమునుండి యిట నుదాహరింతుము

«ఈరీతివృత్తుల నేమాఱుచేసె
వారిజోద్భవ వంశవార్ధిచంద్రులకు
కాశికావల్లిల్లఁ గడచుంచియుపుడు.
వాసికెక్కిరి నందవైదికులనఁగ.
ఆవేళనొక విప్రుఁడార్వేలకులుఁడు
దుగ్గనప్పయ వచ్చి తోడనేనిలచి
అంబవెంబడిమీకు నరుదెంచునపుడు
వెంబడి వచ్చితి వేదాఢ్యులార
నాకొకవృత్తిచ్చి నన్నాదరించి
మీకులంబునఁగల్ప మేరకోనుము
అని యాతఁడీరీతి నాడువాక్యములు
విని యంతటఁజూచి విప్రులిట్లనిరి:
మానక నిన్నిట్లు మాకులమందుఁ
గలుపము . ."

దీనివలనఁ దేలు సారాంశము—నందవరీకులు, ఆఱువేలవారు ఒక్కే కాలమునఁ గాశినుండి వచ్చిన బ్రాహ్మణులనియు నాఱువేల వారాంధ్రదేశమున నుండి పోవఁ దదితరులగు నేమాఱు [illegible] బ్రాహ్మణులు కాశికేఁగి చాముండ సాయముతో తిరిగి వచ్చి నందుని మెప్పించి నందవరాగ్రహారము బడసిరనియు నాటనుండి ఆఱువేల వారు నందవరీకులు వేఱైరనియు ఆఱువేల బ్రాహ్మణుఁడు కలియనెంచ నందవరీకులు నిరాకరించిరనియును.

ముఖ్యముగా విచారింప వలసిన యంశ మిట నొకటి గలదు. నియోగి వైదికి భేద మాంధ్ర దేశమునందే గలదు. ఈ విభేదము గోపరాజు రామ మంత్రి కాలమునుండి వచ్చినదని కొందఱు, అంతకుమున్నే గలదని కొందఱు చెప్పుచున్నారు. మా యుద్దేశము కాశీ ప్రాంతముల నుండి బ్రాహ్మణ కుటుంబములు కొన్ని నియోగి వైదికి భేదము లాంధ్రదేశమున నేర్పడని కాలముననే వచ్చిరనియే. క్రమముగా నియోగి వైదికి భేదములు వృత్తిని బట్టి యేర్పడిన మీఁదట ఆఱువేలవారు నియోగులుగఁ బరిగణింపఁబడిరి. అటులే నందవరీకులు గూడ లౌకికవృత్తులు స్థలగణికత్వములు సంపాదించి అమాత్య నామధారణము రాజనామధారణము గావించి నియోగులుగ గణింపఁ బడిరి. ప్రాచీన గ్రంథములలో నందవరీకులు వైదికులమని వ్యవహరించి కొన్నటులఁ గాన రాదు. ఒక చాముండా విలాసము నాధారపఱచికొని యీ సమస్య పరిష్కరించుట సాహసము. నందవరీకులు తాము నియోగులమని గ్రంథములలోఁ జెప్పించి కొనిరి. నియోగుల వలె నమాత్యపదము వృత్తిని బట్టి కాక పౌరుషేయముగా ధరించిరి. సుప్రసిద్ధులగు నందవరీకులందఱు అమాత్య పదధారులు, దండనాథపదధారులునై యున్నారు. ఆంధ్ర దేశమునందుఁ గల వైదికుల కిట్టి పరంపరానుయాతములగు నామములు గానరావు.

నియోగులలో నద్వైత మత ప్రవిష్టులు, విశిష్టాద్వైత ప్రవిష్టులు గలరు. వైదికులలో నద్వైతులే గలరు. నందవరీ వారందఱు శంకరాచార్య పీఠ సంబంధులే. నందవరీకులు నియోగుల వలె విశిష్టాద్వైతులు నద్వైతులు గూడ నై యున్నారు. తిరుపతి దేవస్థానములో సంకీర్తనాచార్యులు గానున్న తాళ్లపాక అన్నమాచార్యులు నందవరీకి వైష్ణవ సంప్రదాయ విశిష్టుఁడు. ఇతని సంకీర్తనాది గ్రంథములు తిరుపతి దేవస్థానములో భద్రపఱుపఁబడి యున్నవి. అన్నియు వైష్ణవ సంప్రదాయానుసారముగా «శ్రీమతే రామానుజాయనమః" అను నమస్కార వాక్యముతో నారంభింపఁబడినవి. సంకీర్తన లక్షణములలో:

«చ. ధరలోఁ దాళ్లపాకయన్నయ గురు
　　　త్తముఁడుండు"

"తే. గీ. తిరుమలార్యుఁ డఖిలదేశికుండు",

అని అన్నమాచార్యుఁడు, తిరుమలార్యుఁడు వైష్ణవ గురుబృందములలోని వారుగ సంప్రదాయ సిద్ధములగు గురూత్తమ సందేశిక పదములచే వాచ్యులైరి. తిరువేంగళ నాథుఁడు వైష్ణవ సంప్రదాయ ప్రవిష్టుడగుట కతని పరమయోగివిలాస ద్విపద కావ్యము దార్కాణము కాగలదు. "నాతాత ద్రావిడాగమ సార్వభౌమ బిరుదముగల పరమ విద్యాసింధుపారంగతుండగు తాళ్లపాక అన్నయాచార్యుఁడు," అని తాళ్లపాక చిన్నన్న అష్టమహిషీ కళ్యాణాదులలోఁ జేర్కొనెను. ఈ వంశీయులగు నందవరీకు లిప్పటికిఁ దిరుపతిలోనుండి వైష్ణవ సంప్రదాయ సిద్ధముగ నాచార్య నామధారణులై ప్రసిద్ధులై యున్నారు.

సుప్రసిద్ధాంధ్ర కవియగు పెద్దనార్యుఁడు శఠగోప యతీంద్రుల శిష్యుఁడు. ఈయన గోకటమను గ్రామము శఠగోప పురమను పేర వైష్ణవ ప్రీతిగా వినియోగించినాఁడు. దీనిని బట్టిన పెద్దనార్యుఁడును వైష్ణవ సంప్రదాయము వాఁడే. ఇంతియగాక నందవరీకులలో సుప్రసిద్ధులు గుంటుపల్లివారు. గుంటుపల్లి సోమయ్యగారు దండకవిఁ బట్టి వ్రాసిన రాయన మంత్రి భాస్కర చరిత్రమున నాతని మతమును గూర్చి యిటుల వ్రాసియున్నారు.

"కొండవీటి రెడ్ల కాలములో నీ భాస్కరుని తండ్రి తాత ముత్తాతలగు రాయప్ప త్రిపురాంతకుఁడు. తిప్పమంత్రియుఁ గడపట నీ భాస్కర మంత్రియుఁ గూడ నుండి కొండపల్లి సీమ దేశపాండ్యాధికారము అనుభవించిరి. వీరికి ఇలువేల్పు శ్రీ వేంకటాచలపతి. వాసిష్ఠ గోత్రము. ఋగ్వేదము. శాకలాయన సూత్రము. నందవరీకులు విష్ణుభక్తులు. వీరికి శ్రీవైష్ణవ మత నిర్వాహకులైన రామానుజాచార్యుల మేనల్లుఁడగు కందాళ మొదలి ఆండాన్ సంబంధమైనచో రంగిపరము దొడ్డయాచార్యులు గురువులు గనుక ఈ వంశము పవిత్రమైనదిన్ని కీర్తి పౌరుషములు కలదిన్ని వినయుండెను."

—రాయనమంత్రి భాస్కరచరిత్రము ప్ర ౨౪.

మాచవరపు వేంకటమంత్రియను నందవరీకి నందవరచరిత్రము పద్యకావ్యముగా వ్రాసెను. ఇతఁడు శ్రీవత్సగోత్ర సంజాతుఁడు. పాపనామాత్యుని కుమారుఁడు. దీని ప్రతి ప్రాచ్య లిఖిత గ్రంథ నిలయములో మద్రాసునందున్నది. వేంకట మంత్రి తన గురువును [illegible] ముగ నందవర చరిత్రమునందుఁ బ్రశంసించి యున్నాఁడు:

సీ. శ్రీ వీర వలికుల సింధుసుధాకరుం
డలరంగ శ్రీనివాసార్య సుతుఁడు
కౌండిన్య సద్గోత్ర గాంభీర్య ధుర్యుండు
నిత్య భగవద్విషయ నిష్ఠలుండు
వానమామలదివ్య వరయోగి కరుణచే
కొనియెంచు వైష్ణవ కోవిదుండు
పోషకధారక పోష్యంబులను హరి
దలఁచుచున్న సద్ధర్మ యశుఁడు

తే. గీ. శాంతశమదమగుణగణ సాగరుండు
దానజనరక్షణోపాయ ధన్యుడైన
కూర్మికోన నప్పలాచార్య గురుని పాద
సరసిజంబులు సేవింతు సంతతంబు.

ఈ పద్యమువలన శ్రీవత్స గోత్రులగు మాచవరపు వేంకట మంత్రి వంశజులగు నందవరీకులు వైష్ణవ శిష్యతా సంబంధులని తెలసినది. ఇట్టి యాధారములు చాల సేకరించినారము. దీనిచే నందవరీకులలో వైష్ణవమత ప్రవిష్టులు పలువురు గలరని తెలియుచున్నది. వైదికులలో వైష్ణవాచార్య సంబంధులు వైష్ణవ మత ప్రవిష్టులు లేరు. నియోగులలో వలె నందవరీకులలో వైష్ణవ మతస్థులుండుటచే నందవరీక వైదికులనుటకంటె నియోగులనుటయే యొంతయు నొప్పిదముగా నున్నది.

నియోగులంతఁ దఱచుగ మంత్రిపదము తత్పర్యాయపదములు తిక్కన కాలము నుండి నేటివఱకు రూఢముగాఁ గానవచ్చుచున్నవి వైదికుల యెడ నిట్టి పదప్రయోగము కానరాదు. సుప్రసిద్ధులగు నందవరీకు లందఱు అమాత్యపదమును వృత్తిని బట్టిగాక వంశ పరంపర ధరించుచున్నారు. నియోగులయెడఁ గ్వాచిత్కముగఁ గానవచ్చు దండనాథ చమూనాథ పదములు గూడ నందవరీకులు ధరించిరి, సామాన్యముగ రాజ పదము గూడఁ గొందఱికిఁ గలదు, మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు పెద్దనార్యుని యుపంశమను వ్యాసమునందు నందవరీకుల యెడఁ గానవగు అమాత్యపదము నీ క్రింది విధముగ ఖండించి వైదికులని నిశ్చయించి యున్నారు. ఆ వ్యాస భాగము నిట నుదాహరించెదము. "నందవరీకులు కాలక్రమమున సత్యభివృద్ధికి వచ్చి;... వేదాదికర్మనిరతులు గాక... ...అశ్వలవారికంటె హెచ్చుగా గ్రామాధికారముల నాక్రమిం

చిరి..............గ్రామ కరణముల కిది బిరుద నామమని కాఁబోలు నందవైదికులు గూడ కొంత కాలంబున నమాత్య పద ముపయోగించికొనినట్లు కనఁబడుచున్నది. ఇంతలకు మనుచరిత్రములోఁ గానవచ్చు చొక్క నామాత్య శబ్దమే నిదర్శనము..............పెద్దన దాన శాసనములలో నెల్ల చొక్కరాజనియే యుండుటచే లేఖకులెవరో యాతని నామమున కమాత్య పదము తగిలించిరని యూహింపవలసి వచ్చుచున్నది. అటులఁగాక పెద్దనయే వ్రాసియుండునని యూహించుట సరియైనదే యైనను, తన తండ్రి గ్రామకరణమగుటచే నతఁడట్లు వ్రాసియుండును."

నందవరీకులు నియోగులను జూచి యమాత్యపదము దగిలించుకొన నేర్చికొన్నరో నియోగులెవరినిజూచి నేర్చుకొనియుందురను ప్రశ్న రాకమానదు. ఈ యూహా సాధనములు చరిత్రమున కుపకరింపఁజాలవు. పెద్దనార్యుని తండ్రి చొక్కరాజనియు నామాంతమున అమాత్య పదమిటీవలి వారు చేర్చిరనుట సాహసము. వ్రాత ప్రతులఁ గొన్నిఁటినేని పరీశీలించి యం దమాత్య పదము లేకున్నచో దెలిపి యీ వాదము నిలుపుట యుక్తము. అమాత్య పదమువలె రాజ పదము గూడ నియోగత్వమునకు రూఢ్యర్థమైయుండ "రాజు"తొలఁగించి అమాత్య బిరుదము చేర్పవలసిన యవసరమెవ్వరికి నా కాలమున నవసరమై యుండదు. పైగ నందవరీకులను వైదికులుగ నిర్ణయింపవలయునను తలంపుగూడ నా కాలపు వారిలోఁ గానరావపుడు అమాత్య పదము చొక్కరాజునకుఁ దగిలించిరనుటలో సత్యమింతయుకేని లేదు. ఇది యంతయు "అమాత్య పదము నియోగిత్వమునకు రూఢమని యుఁ దాము నియోగులమని యుఁ దెలిసికొనుటకుఁ బెద్దన యుపయోగింపలేదనియు నిశ్చయింప వచ్చునని" వ్రాసిన వ్రాతను సమర్థించుటకుఁ గావించిన చర్చయై యుండనోపు.

నియోగుల యొడ నమాత్య పదము రూఢముగాఁ గానవచ్చుచున్నది. దీనికి ఆధారములే యవసరము లేదు. ఇక నందవరీకులలోఁ బూర్వకవులు రచించిన గ్రంథముల నుండి వీరికి అమాత్యపదము రూఢముగ నున్నదో లేదో తెలిసికొనుట ప్రకృతమునకు సంబంధించిన యంశము కాకపోదు.

తరిగొండ వెంగమాంబ నందవరీకుల యింటి యాఁడుపడుచు. ఈమె వేంకటాచల మాహాత్మ్యమున నిటుల నంద వరీకుల దేవతయగు చౌడమ్మను బ్రశంసించియున్నది.

అల కాశినుండి వెలువడి
వలనుగ మా కొఱకు నందవరపురమందే
నెలకొని కులదైవతమై
యలరుచు నమ్మేలు చౌడమాంబనుదలతున్.

ఈమె నందవరీకురాలు అనుట స్పష్టము. గద్యములో కృష్ణమామాత్య తనూభవ యని తండ్రి కమాత్య పదము వాడియున్నది. మాచవరపు వేంకటమంత్రి తన వంశ చరిత్రమును నంద చరిత్రములో వివరించి గద్యలో "శ్రీమన్నందపురాగ్రహార పారావార తారాధినాథ..రంగ తిమ్మయ మంత్రి తనూభవ...రంగకవి ప్రణీతంబైన" యని తన తండ్రిని మంత్రియని పేర్కొనెను.

క్రీ.శ. ౧౫౦౦ ప్రాంతమునవున్న "చారు చంద్రోదయము" రచించిన చెన్నమరాజు తాను నందవరీకినని యీ క్రింది విధముగాఁ జెప్పుకొనినాఁడు.

తే.గీ. నందవరపావనాన్వయోన్నతివహించి
　　సంతతాగారనియమ నిష్ఠ నువహించి
　　అతిపవిత్ర చరిత్రుఁడవైన నీకు
　　నిట్టిభాగ్యంబు దొరకుట యేమి వింత?

"చేన్నమరాజు కులాబ్ధిరాజు చంద్రోదయ చెన్నమంత్రిమణి"

ఈ యుదాహృత భాగముల వలన నీ కవి నందవరీకుఁడనుటకు సంశయము లేదు. నామాంతమునఁగల రాజ పదము ఈతని వైదికత్వమునకు భంగము. ఈ కవి వంశీయులలో వంశ వర్ణనమును జూచిన, మంత్రి పద ధారులుగ చెన్నమరాజు, కృష్ణ మంత్రి, తిమ్మన మంత్రి, కృష్ణ రాజు, లింగయమంత్రి, వెంకట వరప్రధానుఁడు, లక్ష్మీపతి మంత్రి, శేషమంత్రి, చిన్నప్రధాన చంద్రుఁడును అను వారు గలరు. ఈ నామములన్నియు నియోగుల మంత్రి పదముఁ జూచి పెట్టుకొనఁబడినవని చెప్ప వీలుపడునా? వీరందఱు క్రీ.శ ౧౫౦౦ లకుఁ బూర్వులు.

కామసూరి కృష్ణావధాని నందవరీకుఁడు. ఈయన ఇందుమతీ పరిణయమను పద కావ్యము వ్రాసెను. తాను అవధాని నామము దాల్చినను గద్యలో నందవరీకిననియుఁ "నందపురాగ్ర

యానందకర గోవిందామాత్య నందనః యని చెప్పుకొనెను. తన పూర్వులకు కొండ్రాజు, బసవామాత్యుడు, తిప్పరాజు, హరియప్పమంత్రి అనియు తనను వంశావతారములోఁ గృష్ణ మంత్రియనియుఁ జెప్పుకొనినాడు.

"నాళ్చారేడ్ద్యజ" శ్లోక వ్యాఖ్యలో ముటుకూరి గోపాలకృష్ణ పండితుఁడు తాను నందవరీకుఁడనియుఁ దన తండ్రి తిమ్మామాత్యుఁడనియు నీక్రింది విధముగాఁ జెప్పుకొనినాఁడు.

శ్లో. శ్రీమన్నందపురాన్వయోత్తమమణిః
శ్రీవత్స గోత్రోద్భవః
తిమ్మామాత్య తనూభవస్తిరుపతేః
ప్రాగ్గోహరి శ్లోకకృత్
గోపాలాంఘ్రిసరోజలగ్నహృదయో
గోపాలవిజ్ఞానికో
ముట్కూర్యన్వయ దుగ్ధసాగర విధుః
రామాశ్రమ చ్ఛాత్రగః.

గుంటపల్లి యల్లప్ప మంత్రి నందవరీకుఁడు. ఈయన అద్వైతమకరందమను గ్రంథము వ్రాయుచు నందుఁ దాను దనతండ్రిగూడ నమాత్య పదధారులని ఈక్రింది విధముగఁ జెప్పినాఁడు.

శ్లో. శ్రీమద్గుంటుపల్లీకులాంబుధిసుధా
ధామాభి రామోదయం
నిష్ఠాశ్రేష్ఠ వశిష్టగోత్ర మహిత
ప్రాగ్గోత్ర మిత్రోదయం
శ్రీమృత్యుంజయమంత్రిణం స్వజనకం
నత్వాయశో భూషణం
చక్రేయం నిగమార్థ తత్త్వమననం
యల్లప్ప మంత్రీశ్వరం.

గుడిపాటి కోదండపతి యను నందవరీకకవి తన రసమంజరిలోఁ దన వంశజులకు మంత్రి పదము గలదనియుఁ దాను నందవరీకుఁడ నని చెప్పుకొనినాఁడు:

సీ. శ్రీకరనందవరీ కాగ్రగణ్యుండు
నహిమీరు గుడిపాటి వంశభవుఁడు
బిరుదుగా నవఖండ సురతాణిపేరొంది
మహితుఁడౌ వెంగళ మంత్రిపౌత్రుఁ
డతులితుఁడౌ రంగయామాత్య తనయుండు
......కోదండపతిఘనుండు".

కోటికలపూడి సోమనాథకవి విష్ణు మిత్రోపాఖ్యానములోఁ గృతిభర్తయగు గుంటపల్లి తిప్ప మంత్రి నిటుల వర్ణించెను:

ఉ. అగ్రజుఁడై కులాభరణ
మై నుతిగాంచిన ముత్తదండనా
థాగ్రణిచే ననుజ్ఞ విన
యంబున గాంచి బలారినిగ్రహా
నుగ్రహ శక్తియుక్తి నిపు
ణుండును నందపురీవరాన్వయ
ప్రాగ్రహరుండునై వెలయు
ప్రాజ్ఞుఁడు తిప్పనమంత్రి ప్రేమతోన్.

ఇందు సుప్రసిద్ధుఁగు గుంటపల్లి ముత్తనమంత్రి దండనాథుఁడని వ్యవహరింపఁబడెను. ఇటులే యానంశమున వల్లభమంత్రి వల్లభదండనాథుఁడని వ్యవహరింపబడెను.

నందవరీకుల గ్రంథములు సంస్కృతాంధ్రములలో క్రీ. శ. ౧౫౦౦ నుండి కనిపించు చున్నవి. అందన్నింటి యందును నందవరీకులు ధారాళముగ| మంత్రి, అమాత్య, దండనాథ పదము లుపయోగించు కొనిరి. మంత్రిగ నున్న వారు సామాన్య గృహస్థులుగూడ "అమాత్య" నామము ,రాజ'నామము ధరించు కొనుటచే నందవరీకుల ను వైదికు లనుటకంటె నేతద్విరుద్ధ వాచ్యులగు నియోగు లుగ గణించుటయే యుచితము. నందవరులను బూర్వ కవులలోఁ గొందఱు నియోగులని వ్యవహరించి రనుట కాధారములు గలవు. దమ్మడపు సేబాసుమంత్రియను నందవరీకదాత నొకకవి యీక్రింది విధముగ ప్రశంసించి నియోగియని చెప్పినాఁడు:

ఉ. కాసులు కొన్ని కూర్చుకొని
గర్వములో నపకీర్తి బొందువా
రే సభ సన్నుతింబడసి
రెన్నిక కెక్కిరి దమ్మిడంపునే
బా సనిపించుకొన్న సచి
వప్రభువీవె కదా! నియోగిలో
కానమకీర్తిచే రవికు
లాంబుధిసోముఁడు రాముఁడుగబలె.

—చాటుపద్య రత్నాకరము 102 పుట.

గుంటుపల్లి వంశుఁడును నందవరీకుఁడును వసిష్ఠగోత్రుఁడునగు రాయనిమంత్రిభాస్కరుని గూర్చిన చాటుపద్యములలో నీ క్రిందిదానియందు 'మంత్రికుల సంభవ' యను విశేషణము గలదు. మంత్రికులము సాధారణముగా నియోగి వంశమని చెప్పఁ జనును. తదన్యార్థము చెప్పుట కవకాశములు లేవు

ఉ. ఒక్కఁడు మాంసమిచ్చె మఱి
యొక్కఁడు చర్మముఁగోసి యిచ్చె
వేఱొక్కరుఁ డస్థినిచ్చె నిఁక
నొక్కఁడు ప్రాణము లిచ్చె వీరిలో
నొక్కొక పట్టునం బ్రదుక
నోపక యిచ్చిరొ కీర్తికిచ్చిరో
చక్కఁగఁ జూడు మంత్రికుల
సంభవరాయని మంత్రిభాస్కరా.

ఇటులె రాయని మంత్రి భాస్కరుఁడు వేఱొక పద్యమునందు గణిక సందోహాగ్రగణ్యుఁడని ప్రశంసింపఁబడెను. ఇట గణిక పదము సామాన్యకరణమని యుద్యోగార్థద్యోతకము కాఁజాలదు. రాయన భాస్కరుఁడు కొండవీడు, పెనుగొండ, గుత్తి, పానుగల్లు, విజయనగరాది రాజ్యములకు రాజప్రతినిధిగ మంత్రిగనున్న వాఁడుగాన గణక పదమిట జాతి వాచకము. రాయన భాస్కరుఁడట్టి నియోగియని వ్యవహరింపఁబడె ననుట సత్యము. ఆపద్యము నిట నుదాహరించుచున్నారము.

సీ. ఉత్తుంగభుజసూను దత్తనందాపురీ
పుణ్యాగ్రహారాంశభోక్తయితఁడె
ఆజన్మసంసిద్ధ భుజనప్రఖ్యాత
దానసింహాసనాధ్యాసియితఁడె
కొండపల్లీరాజ్య మండలాధిప మహా
గణికసందోహాగ్ర గణ్యుఁడితఁడె
వైకుంఠతీర్థ నిర్వాణ సంయమి కృపా
సంవర్ధితాఖిలైశ్వర్యుఁ డితఁడె

తే. గీ. కొండవీడుద్దగిరి పెనుగొండ గుత్తి
పానుగల్విజయనగరాది పట్టణముల
నర్థులకు నిచ్చు నితఁడె యిష్టార్థములను
జగము రాయనభాస్కర ప్రగడ పొగడ,

నందవరీకులు బ్రాహ్మణులలో నియోగి వైదిక భేదము లేర్పడని కాలములో వచ్చినవారు గావున తొలుత వారిని నియోగులని గాని వైదికులని గాని పేర్కొనఁ జనదు. క్రమముగ నియోగివైదిక భేదము లాంధ్ర దేశమునం దేర్పడి వైదికులు కేవల సంస్కృత భాషా పరిచయము వేద పఠనములతోఁ గాలయాపనము చేయుచు వేదాచారాభిరతులై ప్రత్యేకముగాఁ జీలిపోయి వాడి విభేదముఁ గల్పించికొని సంఘమునకుఁ గట్టుబాటులు గావించికొని అవధాని, దీక్షిత, భట్టాది నామములతో వ్యవహరించిరి. బ్రాహ్మణులలో నింక మిగిలినవారు వైదిక విద్యల యం దభిమానము గలవారై రాజకీయోద్యోగ పరతంత్రులై రాజకీయోద్యోగ చిహ్నముగ రాజపదము, అమాత్యపదము, దండనాథాది పదములు ధరించి గ్రామాధికారిత్వము మొదలు మంత్రిపదముఁ గల పదవుల నాక్రమించికొని నియోగులని సమష్టిమీఁద వ్యవహరింపఁబడిరి. ఈ నియోగులు విశిష్టాద్వైత అద్వైత మతములతోఁ బ్రవేశించిరి. నందవరీకులకు ఇటులె మతధార్మికమున వామధారణమున నియోగులతోఁ గలయికఁ దెలియుగాఁ గలదు, కాని వైదికులతోఁ గానరాదు. కాశినుండి బ్రాహ్మణులిగ ఆంధ్రదేశమునకు వచ్చినప్పుడు వైదికులని నియోగులని భేదములేక బ్రాహ్మణులందఱు సమముగా నుండిరి. అట్టి సందర్భమున నందబ్రాహ్మణు లనుటకు మాఱు నందవైదికులని చాముండ విలాస గ్రంథకర్త పేర్కొనుటచే నాతని కాలమున వైదిక నియోగి భేదములు లేవని తెలియుచున్నటులఁ దోఁచుచున్నది. క్రీ.శ. ౧౫౦౦ లకు పూర్వమునుండి నందవరీకులు మంత్రి పదవాచ్యులుగ మంత్రికులమువారుగ వ్యవహరింపబడుచువచ్చిరి. అటువేల

వారుగూడ నందవరీకులవలెఁ గాశినుండి వచ్చినవారే. ఈ యుభయుల శాఖ యొకటియె. పూర్వోక్త కారణములచే సంబంధములు తెగిపోయెను. బాగుగా ఆలోచించిన ఆఱువేలవారును నందవరీకులవలె తెలుగు బ్రాహ్మణులనియుఁ దరువాత నందవరీకులతోఁ గలసి రాజకీయోద్యోగములలోఁ బాల్గొని యమాత్య నామధారులై రానురాను నియోగులుగ గణింపఁబడిరనుటయె సమంజసము. దూరమునకుఁ బోయిన కొలఁది నందవరీకులకు ఆఱువేలవారికి సన్నిహిత సంబంధముండి క్రమశః చీలిపోయియు నియోగులతో వ్యవహారమున నొకటియైనటులను ఉదాహృత భాగములవలనఁ దేటబడుచున్నది. వైదికత్వము నందవరీకులకు స్థిరపఱుపఁ దలచినచో చాముండావిలాసాది గ్రంథములను నియోగిపద ప్రయోగ శూన్యులగు ఆఱువేలవారిని వైదికులని చెప్పఁజనును. ఆకారణమున "వైదికధ్యాయితకిచ్చ మెచ్చిన" తిక్కన సోమయాజియు వైదికుఁడె. ఆఱువేలవారందఱును వైదికులె. యాజ్ఞవల్క్యులలో వైదికి నియోగిభేదములు నిమిత్తమాత్రములె. ఇటులఁబోయిన కొలఁది అందఱును వైదికులు గాక తప్పదు. కవికి వాదతత్త్వము పోనుపోను దేలు సారాంశము శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు గుంటూరు సీమ పూర్వ రంగములోఁ జెప్పినటుల:

"మామయనల్లుఁడే వెనుక
మాటకు నత్తయుఁ గోడలే యటుల్
భూమిని యోగులెల్లరును
బొల్పుగ వైదికులు......

అను వాక్యము సత్యముగాఁ గాగలదు; కాశినుండి వలసవచ్చిన బ్రాహ్మణులు నందవరాగ్రహారము పడసినది యుధిష్ఠిర శకము ౨౨౪౮ లోనని పెద్దనార్యుని యుదంకమునఁ జెప్పఁబడెను. గర్గుఁడు చెప్పినదానిని బట్టి వరాహమిహిరాచార్యులు యుధిష్ఠిర శకము నిర్ణయించినాడు. దానిని బట్టిచూచినచో ఇపుడు యుధిష్ఠిర శకము ౪౦౭౨ అగును. కానఁగాశీ బ్రాహ్మణులాంధ్రదేశమునకు వచ్చి అగ్రహారమును నందవరమను పేరఁబడసి నందవరీకులైనది యిప్పటికి ౨౭౮౪ సంవత్సరముల క్రిందటనై యుండును. కావున ఆకాలమున నందవరీకులెగాను-యితరులెకాను బ్రాహ్మణులలో వైదికులని నియోగులని విభేదము పెట్టుకొనలేదు. కాశిలో నియోగి వైదిక భేదమే నాఁడును లేదు. ఆంధ్ర దేశములో చాల కాలమువఱకు బ్రాహ్మణులు లేకముగా నెట్టి విభేదము లేకున్నపుడు, ఆఱువేలవారు, నందవరీకులు యాజ్ఞవల్క్యులు ఏకశాఖీయులుగ గణింపఁబడి బ్రాహ్మణులలోఁ గలసి మెలసి యుండిరి.

వైదికి నియోగి భేదము లేర్పడిన కాలములో ఆఱువేలవారు నందవరీకులు నియోగితెగతో సంబంధములు కలుపుకొనిరి. నందవరీకులు తాము నియోగులమని తెలుపుకొన్న తావులు సూచించితిమి. కొందరు మంత్రికులము వారమని గణకకులము వారమని ప్రశంస గావింపఁ జేసికొనిరి. కె. వి. లక్ష్మణరావు పంతులుగారు నియోగి వైదిక భేదముల నిర్ణయములో నందవరీకులను నియోగులుగఁ జెప్పిరి. కనుపర్తి మార్కండేయ శర్మగారు స్వధర్మ ప్రకాశిని నియోగి పత్రికలలో నందవరీకుల నియోగులుగఁ జేర్కొన్న తావులు గలవు. ప్రబంధకల్పవల్లరి పత్రికాధిపతులగు గుంటుపల్లి సోమయ్యగారు నందవరీకుల నియోగులనిరి. వీరేశలింగము పంతులువారు నిటులె చెప్పిరి. స్వయముగా నందవరీకులైన దఱుగారున్న మాడు సాక్ష్యలై నియోగులమని చెప్పుకొనుచున్నారు. కృతులలో నియోగులు వహించు బిరుదముల నందవరీకులు ధరించిరి. నియోగులకుంబలె నందవరీకులకు వైష్ణవమత సంబంధములు గలవు. ఇన్నిటిని సమన్వయించితిమేని నందవరీకులు వైదికి నియోగి భేదము లాంధ్ర దేశమునందేర్పడిన కాలమునుండి నియోగులుగఁ బరిగణింపఁబడిరనియు నంతకుమున్ను బ్రాహ్మణ శాఖలోని వారెల్లరు నేక జాతీయులె గావున చాముండికావిలాసాదులను బట్టి ఆఱువేలవారితోఁబాటు నందవరీకులును అంతకు బ్రాహ్మణ శాఖీయులనియు విశ్వసింప వచ్చును నంద వైదికులను బట్టి చూడ నీ పద ప్రయోగముగల గ్రంథము నియోగి వైదికులలో చిన్న భావము లుదయించిన కాలమున వ్రాయఁబడినదిగాఁ దలచుట చొక్కనామాత్యుఁడను నామమున నిటీవలివారు అమాత్యపదము చేర్చిరనుట కంటె సంగతమని మాతలంపు.

ఆచారములను బట్టిచూచినను మతమునుబట్టి చూచినను ఉద్యోగాది గౌరవమర్యాదాదికములఁ బట్టిచూచినను అనుశ్రుతముగా వచ్చు కథలనుబట్టి చూచినను కృత్యాదులనుబట్టి చూచినను నందవరీకులు నియోగులనుటయె సర్వవిధములఁ బొసగి యున్నది. నందవరీకుల వైదికులన్నచో ఆఱువేలవారినిగూడ వైదికులని యాధారసహితముగ నిర్ణయింపవచ్చును. ఇందువలన బాధ లేదుగాని వివాద విషయమునకు ప్రధానాంశము మఱి యుపతి నియోగివైదిక లేక శాఖీయులనియు విభేదము లేర్పడిన నాటినుండి

నందవరీకులు ఆరువేలనాడు వైదికులనుండి తొలఁగిరని యు స్పష్ట పడఁగలదు ఈ వ్యాసమునందలి సత్యాసత్యముల నాధార సమన్వయముగాఁ జర్చించి ఈ వివాదమున ముఖ్యముగా నాంధ్ర సారస్వత నిర్వాహకులని పేరొందిన నందవరీక కవిద్వన్మణులు పాల్గొని సత్యనిర్ధారణమునకు పాల్గొనుట యుక్తమనియు నుభయ పక్షముల యాధారములు నందవరీక కవిద్వల్లోకము పరిశీలించుటకు బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు నిరీక్షించిన వివాద గ్రంథము వెలుగుకు సత్యాంశము సులభముగాఁ దేలునని మామనవి.

# విస్మయము

పురిపండా అప్పలస్వామి (కవితాసమితి)

నీ యనంత వినిర్మాణనియతిఁ గాంచి
విస్మయోన్మత్తమతి నాదు విహ్వలతను
నన్ను నేనె మఱచిపోదు: నా హృదంత
రాళ మందెద్దియో నూత్న రాగగరిమ
దివ్య విద్యుత్ప్రభాతీక్ష్ణదీప్తితోడ
ప్రాకిపోవుచు తనువెల్ల, బాపురే! యి
దెట్టి యింద్రజాలమొ కాని యెఱుఁగలేను.
దినమె జీవించు నొక సూనమునను గూడఁ
గాంచ పరికింపఁ దెల్ప శక్యమ్ముకాని
జీవకళ వెట్టి మాధుర్యభావము నిడి
సౌరభచ్ఛవిఁ గూర్చి భాస్వరతఁ జేర్చి
అనుపమానూనసౌందర్యమమరఁ జేసి
నీవుచూపిన ఘననైపుణీవిభవము
హృదయముహరించు; త్వన్మృదుపదతలమున
దాసినై పోవఁ గోర్కి యుద్భాసితమగు.

* * * *

ఎట్టివారికిఁ గూడ నూహింపరాని
ఈ విచిత్రవినిర్మాణ మేవిధాన
నేరికడ నేర్వఁగలిగితి? నీవునాథ!

౨

# ఔరంగజేబు బాల్యము*

కానూరి వేంకటసుబ్బారావు

(సారస్వతసమాజము)

## జననము

క్రీస్తు శకము ౧౬౧౬ వ సంవత్సరమున షాజహాను తన భార్య ముంతాజుతో అహమ్మదునగరమును జయించుటకై దక్షిణదేశమునకు వచ్చెను. దండయాత్ర వెడలునపుడును విరోధించిన తండ్రికి వెఱచి దేశము విడచి పారిపోవునపుడును సంసారముతోడనే పోవుట అతని కలవాటు. మలికంబరు నోడించి అహమ్మదు నగరమును మొగలు రాజ్యమునఁ జేర్చి షాజహాను తిరిగి ఆగ్రాకు ప్రయాణమాయెను. మార్గమధ్యమందు దోహదునగరమున[1] ౧౬౧౮ వ సంవత్సరము అక్టోబరు ౨౪వ నాటి[2] రాత్రి ముంతాజ్ మహలు, ఔరంగజేబును కనియెను. ఈతని జనన దినోత్సవము, ఉజ్జయిని యందు మహా వైభవముగ జరుపఁబడెను.

ఔరంగజేబు తన జన్మస్థానమును వృద్ధాప్యమున సైతము జ్ఞప్తియందుంచుకొని తన పుత్రుఁడగు అజమున కిట్లు లేఖయందు వ్రాసియున్నాఁడు:

"ప్రియ పుత్రకా, గుజరాతు దేశమునందు దోహదు గ్రామము నా జన్మస్థానము. ఆ పురవాసుల నెంతయు యాదర బుద్ధితోఁ జూచుచు వారి దాయును సమాధాన పఱచి యా యుద్యోగమున నే యుంచుము."

జన్మస్థానమున్న ఔరంగజేబున కెంత యభిమానమో దీనివలన తెలియుచున్నది.

## జామీను

ఔరంగజేబు జనన మొందుసరికి షాజహాను దక్కను వైస్రాయిగ నుండెను. ఈతఁ డేముహూర్తమున జనన మొందెనో కాని షాజహానున కించుక సుఖముగాని విశ్రాంతి కానరాదాయెను. కష్టము లెక్కువయ్యెను. నూర్జహాను కుతంత్రములును, స్వలాభాపేక్షయు మితిమీరి జహాంగీరు మానసమును తారుమారు చేసెను. నూర్జహాను దుర్బోధనల విని, జహాంగీరు షాజహాను నుద్యోగమునుండి తొలగించి యతని జాగీరులను లాగుకొనెను. అందుపై షాజహాను యుద్ధసన్నద్ధుఁడయ్యెను. అప్పటి కౌరంగజేబునకు రెండేడ్లైన నిండలేదు. షాజహాను ప్రయత్నములన్నియు ప్రతికూలములయ్యెను. ఇఁక నాలుబిడ్డలతో దేశమును

---

* ఈ వ్యాసరచనకు ఆధారములు:—

1 Sarkar: Life of Aurengzeb.
2 Anecdotes of Aurengzeb.
3 Encyclopeadia Britanica.
4 Lanepole: Aurengzb. [Rulers of India Series]

1 దోహదు నగరము ప్రస్తుతము బొంబాయి రాజధానిలో పంచమహాలు తాలూకాలోని గోద్రారుత్లాం రైల్వే లైనుకు దగ్గరగానున్నది.

2 ఇట్లని సర్కారువాదము. కాని Rules of India Series లో ఔరంగజేబు జన్మదినము ౪ వ డిసెంబరని చెప్పబడెను. Ency. Britanica కూడ నవంబరనియే తెలుపుచున్నది.

విడచి పారిపోవలసివచ్చెను. పెక్కు దేశములు దిరిగి గత్యంతరము గానక ౧౬౨౬ వ సంవత్సరములో, దారా ఔరంగజేబుల నిద్దర జామీనుగ నుంచి షాజహాను, జహాంగీరు మన్నన వేడుకొనెను. వారిరువురును నూర్జహాను అధీనమున నుంచబడిరి. కొలదికాలములోననే జహాంగీరు చనిపోవుటయు, షాజహాను చక్రవర్తి యగుటయు తటస్థించినది.

౧౬౨౮ వ సంవత్సరము ఫిబ్రవరి ౨౬ వ తేదిని మాతామహుడగు అసఫ్ ఖాను ఆగ్రాకు వారలు గొని వచ్చెను. ఆ క్షణముననే దారా ఔరంగజేబు లిరువురును మాతృదేవత ఒడిలో బడిరి. రెండు సంవత్సరములు పుత్రుల చూడకపోవుటచే కాయలు కాసిన యామె నేత్రములందు ముక్తాఫలములను వారి మూర్ధములపై రాల్చెను. అంతటినుండి ఔరంగజేబునకు దినమునకు అయిదు వందల రూపాయల భత్యమేర్పరుపబడెను.

## విద్యాభ్యాసము

జననమందిన దాదిగ దేశ సంచార మొనర్చుచుండుటచే విద్యాభ్యాసమునకు తగినఅనువు ఔరంగజేబునకు, కలుగలేదు. పదవ వత్సరము వచ్చుసరి కాతనికి స్థిరావాస మేర్పడినది. అంతటినుండి విద్యాభ్యాసమునకు తగిన ప్రయత్నములు జరిగినవి.

షాజహాను మంత్రియు ప్రఖ్యాత పురుషుడునగు సాదుల్లాఖా నతని గురువులలో నొకడు గిలదు వాస్తవ్యుడగు మీరుమహమ్మదు హాషము మక్కామదీనాలలో విద్యాభ్యాస మొనర్చి, హకీం ఆలీ గిలాని కడ వైద్యము నేర్చుకొని అహమ్మదాబాదులో పాఠశాల నేర్పరచెను! కొలది కాలమైన వెనుక అచ్చటనే న్యాయాదిపతిగ నేర్పరుపబడెను. షాజహాను రాజ్యమేలుచున్నంత కాలమీతడే ఔరంగజేబునకు గురువుగ నుండెను. బర్నియరను చరిత్రకారుడు, ముల్లాసాలిహా యాతని గురుగురువని వ్రాయుచున్నాడు. కాని ముల్లా సాలిహాబన్నను బాఫ్ పండితుడు ౧౬౪౩ వ సంవత్సరము జనవరి ౫ వ తేదిన మొగలు కోర్టునకు వచ్చెను. అప్పటి కౌరంగజేబునకు ౨౫ వ సంవత్సరము. అంత పెద్ద వయస్సులో నతడు విద్యాభ్యాస మొనర్చుట అసంభవము.

## భాషాజ్ఞానము

ఔరంగజేబు చదివిన దానిని సులభముగ గ్రాహ్యము చేసికొని జ్ఞప్తియందుంచుకొనగల శక్తివంతుడు, మాటలాడునపుడు గాని వ్రాయునపుడు గాని ఖురాను వాక్యములను మహమ్మదు చరిత్ర కథలను, ఉపమానముగ నుపయోగించుచుండెడివాడు. అతనికి ఖురాను కంఠస్థమే హిందూస్థాని అతని మాతృభాష. గృహ రాజకార్యములందాతడు హిందూస్థానియే యుపయోగించుచుండెను. అతనికి అరబీ. ఫారసీ భాషలయందు చక్కని ప్రవేశము కలదు, అరబీ వ్యాకరణమును బాగుగ నేర్చెను. అతని ఫారసీక భాషా లేఖల యందలి శైలి మిక్కిలి ప్రశంసనీయముగ నున్నది హిందీ భాషయు, చగటాయి తుర్కీయు నాతనికి పరిచితములే.

## దస్తూరి

అక్బరు కాలమునుండి యువరాజులకు దస్తూరి జాగ్రతగ నేర్పబడు చుండెడిది. ఔరంగజేబు దస్తూరి ముద్దులమూటగట్టు చుండెడిదని ముస్తైదఖాను మెచ్చుకొనియున్నాడు. అతడు వ్రాసిన లేఖలును, దరఖాస్తులపై యడ్డముగ నాతడు వ్రాసిన ఉత్తరువులును ఆ విషయమును బుజావు చేయుచున్నవి. అతడు తన విశ్రాంతి కాలమున స్వహస్తముచే ఖురాను కాపీలు వ్రాసి అమ్మించుచుండెడివాడు. అతడు ఖురాను కాపీలు జాగ్రతగ వ్రాసి రెండు మక్కామదీనాలకును, ఒకటి నిజాముద్దీను జాలియాగోరీ కడకును పంపెను. విశ్రాంతి కాలమున టోపీలు స్వయముగ దయారుచేసి అమ్మించుచుండెడివాడు. ఈ టోపీలు, వ్రాత ఖురానులు అమ్మగా వచ్చినడబ్బు వలన తన జీవితమును గడుపుకొనుచుండెడివాడు!

## కళలు

ఔరంగజేబునకు శిల్పముగాని గానముగాని గిట్టవు. చిత్రకారుల కాతని యాస్థానమున చోటులేదు. శిల్పము మొదలగు శాస్త్రముల నభివృద్ధిపరచుట దేవు నధిక్షేపించుటయని యతని భావము. అతడు కట్టించినమసీదులు తప్ప తక్కిన వేవియు నుతిగన్న కట్టడములులేవు. ఔరం

గజేబు కొలువునగాని గృహమునందుగాని ఠీవి యేమాత్ర
మును లేక సాధారణ సంసారివలె కాలక్షేపము చేయుచుం
డెడివాడు. పైనావారి దుస్తులయందు మాత్ర మతని కొ
కింత అభిమానగౌరవములు గలవు.

## అభిమానవిద్యలు

ఔరంగజేబు ఉత్తరములలోగాని మాట్లాడునపు
డుగాని పద్యముల నుదహరించుచుండెడివాడు. ఒక చరి
త్రకారు డిట్లు వ్రాయుచున్నాడు. "ఈ చక్రవర్తి అనుప
యోగకరములును, అవినీతికరములును నగు పద్యగద్యము
ల నసహ్యించుకొనుచుండెడివాడు. అతనికి పద్యకావ్య
ములపయి యభిరుచిలేదు. నీతికావ్యము లాతని యభిమాన
మును చూరఁగొనెను. కోటలో గురువు వద్ద సాదీహాఫిజా పం
డితుల నీతివాక్యముల నేర్చుకొని వృద్ధాప్యమునసయితము
పయోగించుచుండెడివాడు. చరిత్ర, శాస్త్రములు ఈత
డెన్నడు చదివియుండడు మతగ్రంథములయందును, వే
దాంతగ్రంథములయందును, ఇమామ్‌మహమ్మదుగజాలీచే
రచియింపఁబడిన గ్రంథములయందును, ఔరంగజేబు మన
సు అగ్నమైయుండెడిది. షేకు షరాపుయాహి, షేకు
జమాద్దీన్ లేఖలను పఠన మొనర్చుచుండెడివాడు. సన్న్యా
సులతోడను యోగులతోడను మెలగి వారితో వేదాంత
చర్చ చేయుటయందును, వారివలన తత్త్వముల నేర్చుకొను
టయందును, వారిననుకరించుటయందును ఎక్కువ అభి
మతమును జూపెను. అనేకసాధువులు వారల దర్శించుచుండె
డివాడు. అతడు ముల్లాజాక్కచే రచియింపఁబడిన గ్రంథ
మునకు బహుమతికూడ యిచ్చెను.

## మత్తగజముల పందెము

ఔరంగజేబు అతిసాహసి. అతఁడు బాల్యముననే
ధైర్యసాహసములు గలవాఁడని ప్రసిద్ధిగాంచెను. ౧౪వ
సంవత్సరమున ఆగ్రాకోటలో ౧౬౩౩వ సంవత్సరము మే
౨౮వ తేదిని షాజహాను ఏనుగులపందెము నేర్పఱచెను.
ఆనాఁడు షాజహాను తనపుత్రులు పెద్దవారిలో మువ్వురిని
వెంటఁ గొనిపోయెను. మువ్వురకు మారులును గుఱ్ఱముల
మీద నిలచియే చూచుచుండిరి. సుధాకరుఁడు, సూరత్సుం
దరుడు రెండు ఏనుగులు పందెమునకు తీసికొనివచ్చిరి. సు
ధాకరునకు మాత్రమే దంతములుగలవు. రెండును బహి

రంగస్థలమున విడిచిపెట్టబడెను. జనులు తండోపతండ
ములుగవచ్చి గుమిగూడియుండిరి. దూసికొని వచ్చుచున్న
సుధాకరునుచూచి సూరత్సుందరు భయపడి యాప్రదేశ
మునువీడిపారిపోయినది. శత్రువెనుకగలేమి సుధాకరు
దృష్టి ప్రక్క అశ్వముపయినున్న ఔరంగజేబుపయిఁబడిన
ది. ఔరంగజేబు చెక్కుచెదరక పారిపోవుచున్న గుఱ్ఱ
మునాపి యా మత్తగజము నెదుర్కొనఁజూచెను. ఎక్క
డజూచిన నల్లకల్లోలముగనున్నది. ప్రజలు పారిపోవుచు
న్నారు. భయపడుట కేనుగుపై బాణసంచా కాల్పబడె
ను. కానిఅందువలన నది భయపడలేదు. సరికదా మీదుమి
క్కిలి పౌరుషోద్దీపితమై ఘీంకరించుచు ఔరంగజేబునుదా
సి దంతముతో గుఱ్ఱమును క్రింద పారవైచెను. ఔరం
గజేబు చతురతతో క్రిందికిదూకి కత్తితో ఏనుగుపై తలప
డెను. ఆనతలో షుజా వచ్చి దానిని బల్లెముతో పొడవకున్న
ఔరంగజేబు లోకమును వీడియుండవలసినదే. రాజా జయ
సింగుకూడ అనేకప్రయత్నములు చేసెను. సూరత్సుందరు
తిరిగివచ్చుటచే సుధాకరుదృష్టి దానిపైఁబడినది. అట్లు
ఆపదనుండి తప్పిపోయినవెంటనే మంత్రియు దగ్గరబంధు
వునగు యతిమఁఖాన వచ్చి "చక్రవర్తి రుంతయోయాత్ర
ముతోనుండ నెమ్మదిగ వచ్చెదవేమి" యనిప్రశ్నింప నా
వీరుఁడునవ్వి "ఆ ఏనుగిచటనున్న నేనుత్వరితముగ నడువవలె
దనవచ్చును కాని ఇప్పుడంత త్వరితముగ నడువవలసిన యగ
త్యమేమున్న" యనెనఁట! ఇంతలో షాజహాను అతనిఁజేరి
కౌగలించుకొని "నాయనా! శుభాంతమైనది కాని
లేకున్న నెంత యవమానకరమగువిషయము" అని మందలింప
ఔరంగజేబుచిరునగవునవ్వి "తండ్రీ! ఇం దవమానకరమ
గువిషయ మేమున్నది? మృత్యువు చక్రవర్తులమీదనైన తన
శక్తిని జూపును. నేఁజేసినకార్యమున కేనును సిగ్గుపడవలసిన
విషయమేమియు లేదు. నా యన్నలు గావించిన దవమానక
రమే గాక లజ్జాకరమునై యున్న" దని నుడివెనఁట. షాజ
హాను నతని యాతనిధైర్యసాహసములకు మెచ్చి "బహ
ద్దురు లేక వీరుఁడు" అను బిరుదునొసంగెను. తరువాత మా

---

1 వారాదగ్గరే నిలువబడి యుండిరి ఔరంగజేబు
నకు సహాయమునకు రాకపోవుటయే కాక యెట్టి
ప్రయత్నమును చేయలేదట.

డు దినములు గడచిన వెనుక నాతని ౧౫వ జన్మదినోత్సవము మహావైభవముగ జరిపిరి. ఆ దినమున ఔరంగజేబునకు తుది ౫౦౦౦ బంగారు నాణెములను శుభార్హమగు గజమును, ౭౦ లక్షలరూపాయల విలువగల వస్తువులను అతనికి షాజహాను బహుమానముగనిచ్చెను. ౫౦౦౦ బంగారు నాణెములు బీదసాదలకు ధర్మమొసంగఁబడెను. ఈ గాధయంతయు ఉర్దూ పారసీక భాషలలో కీర్తింపబడెను. షుజా సహాయమునకు అతని మిక్కిలి ప్రశంసించిరి.

## సేనానాయకత్వము

షాజహాను కాశ్మీరమునకుబోవుచు ఔరంగజేబును తీసికొనివెళ్ళి "లక్ భివా" నను పరగణాను ఔరంగజేబున కిచ్చెను. అప్పటి కాతనికి ౧౬ సంవత్సరముల యీడు నిండలేదు. అటులయ్యు ౧౬౩౪వ సంవత్సరము డిసెంబరు ౧౪వ తేదిని షాజహాను ౧౦౦౦౦ అశ్వదళముపయి సేనానాయకపదవియు, ౪౦౦౦ కాల్బలముపై అధికారమును ఎఱ్ఱని డేరా నుపయోగించుకొనుట మొదలగు రాజమర్యాదలును ఔరంగజేబున కిచ్చెను. అంతియేకాక గొప్ప సేనానుల క్రింద శిక్షణ యేర్పఱచి దక్షిణ హిందూస్థానముపై గవర్నరుపదవి యాతనికొసఁగ నిలిపియుంచెను. యుద్ధకౌశల్యము నేర్చుకొనుటకు అతడిట్టి చిన్నతనముననే బుందేలు సంగరమునకు పంపబడెను. ఈ బుందేలు సంగ్రామమును గురించి వేరొకమారు ప్రస్తావింతము.

# విద్యార్థి ప్రబోధము

### శేషాద్రిరమణకవులు

మ. మహనీయంబగు నాంధ్రదేశమున జన్మంబొందినావీవు స
త్సహవాసంబును గ్రంథసంతతులతోఁ గావించుచున్నావు నీ
సహనోత్సేకము మాతృసేవకయి వెచ్చంబెట్టఁ గాంక్షించి య
వ్యయసంవర్ధితకీర్తి గైకొనుము! విద్యార్థీ శుభాభ్యర్థివై.

సీ. తండ్రి సత్యవ్రతార్థము బలియయ్యె లో
హితుఁడు సత్యైక సంగతుఁడు తొల్లి
తన పతి విజయ సాధనకయి తెగటారె
నభిమన్యునుతుఁడు బాల్యంబునందు
శివయోగికై తన భవనము జాలించి
ఖండింపఁ బడె శిరాలుండు తొల్లి
కలనిలో వైరుల గెలిచి దేహము వీడెఁ
బ్రజ లరుదందఁగా బాలచంద్రు

తే. గీ. డన్నివిధములఁ బాలురే యార్షధర్మ
నిర్వహణమందు మునుముందు నిలిచినారు
నాఁటి త్యాగమహాకథానకము లరయ
ననుమతింపఁ గదయ్య విద్యావతార!

ఉ. కేనెఁడు పొట్టకై పరులఁ జేరఁగడించెడి విద్య విద్యయా
నే! నిజమైన విద్యయన నీకును జాతికిఁ జేరు దెచ్చు వి
జ్ఞానము సుమ్ము; హైహికవిచారముఁ బాపి సమగ్రబోధన
శ్రీ నొలయించి మాతృపదసేవ యొనర్పుము సోదరాగ్రణీ!

సీ. తీరు తీయములుగాఁ దిక్కన యుద్యోగ
పర్వాన దిద్దిన భావములను
కర్మయోగార్థ సంగతముగా గీతలఁ
దెనిగించి నిలిపిన తిలకు నుడులు
ఐహికాసక్తి కాదని తేట తెనుఁగులో
వేమన పాడిన విశ్వగీతి
ఇంద్రియవ్యామోహ మెడపఁగా బుద్ధుండు
ప్రేమమై తెలుపు బోధామృతంబు

తే. గీ. చిర పరాధీన సేవావిశీర్ణమైన
యాత్మజాతికి బోధింప నదనుగాన
హృదయములఁ జిల్చి దృష్టిసాఁచి కార్య
లాలసుఁడ వగుమయ్య బాలకవతంస!

చ. కదనమునందుఁ బూర్వనరకాంతులఁ, జెండియు రక్తధారచేఁ
బదనొనరించిరీ తెలుఁగు భాగమునంతయుఁ బూర్వవీరు లిం
దుదయము నొంది తీవు, సమయోచితధర్మవివేచనక్రియా
స్పదమగు నార్షధర్మ పరిపాలన సేయఁగదోయి బాలకా!

చ. నడలని యస్వతంత్రమను సంకెళులూడ్చెదో! మాతృపాదముల్
తడిపెదో వేఁడినెత్తుటను? దైవముఖంబును జూచి నేరు పే
ర్పడ నిజదేశసేవ సలుపం దరుణం బిది లేచిరమ్మ నీ
నడవడి యాంధ్రమాతకు సనాతనకీర్తి ఘటించు తర్కసఖా!

ఉ. పల్లెల వీడఁజాలక ప్రపంచము జూడక యొందరెందరో
బల్లిదులున్నవా రకట! భావమనోహర నవ్యగీతముల్
మెల్లఁగఁ బాడి యందఱను మేల్కొలుపం దగు వేళ యిద్ది భో
గొల్లసనంబు మాని చనుమోయి కుమారక! మాతృసేవకున్.

# నాఖర్మమిట్లా గాలింది

**గుడిపాటి వేంకటాచలము**



నన్ను శిక్షిస్తారట. పూర్వజన్మంలో. నేనేం పాపం చేశానో యేమోగాని; దైవం నన్ను కనికరం లేని యినప మరలో పెట్టి నొక్కి రక్తం పీల్చేశాడు; వెముకలు కటకటమని ముక్కలకింద నలగకొట్టాడు. నాకు జీవితంమీద యేమీ కోర్కెలేదు. నా వెంకట్రావు మళ్లీ యెన్నటికన్నా వొస్తాడేమో, అతనికింక లోకంలో యెవరూ వుండరే, అని ప్రాణాలు బిగబట్టుకుని బతికి వున్నాను. కాని లేకపోతే నాకీలోకంలో పనేముంది? యీ యిరవై యేళ్లల్లోనే, నానూరేళ్ల బతుకూ గడిచిపోయింది, నేను చేసిన యీ అక్రమానికి, నాగర్భంలోనిశిశువుప్రాణాలీసినందుకు నన్నుకూడా వురితియ్యనండి. కనికరించి నన్ను వొదలనీకండి. మళ్లీ ఆయింటి మొహం నేను చూడలేను. నన్నెక్కడికన్నా ద్వీపాంతర వాసానికి పంపకండి. యింక నేను బతుకు బతకలేను. చంపిమరీ—

వెంకట్రావుకీ నాకూ వున్న ప్రేమానుబంధానికి ఆరంభంలేదు. పూర్వజన్మలనించి తెచ్చుకున్నాము. మా స్నేహానుబంధాన్ని యెన్నిజన్మలకిందటో జరిగిన చరిత్రనే మళ్లీ అనుభవించాము. మా చిన్నతనపు ఆటల్లో, పాటల్లో, పోట్లాటల్లో జ్ఞాపకమొస్తోంది. ఒకనాటి సాయంకాలం నేనూ అతనూ పొలానికి వెళ్లి వరికంకులూ, పిల్లిపెసరకాయలూ, కోసుకుంటూ, పొద్దు మరిచాము. మాకాలలోతు పంటకాలువలలో బట్టలు పైకెత్తుకుని సంధ్యకిరణాల్లో మెరిసే నీటిలో నడిచి వొస్తోవుంటే యెంతోగా తాటితోపులో సూర్యుడు కుంకాడు. తుమ్మల్లోకి మేము చేరుకునేటప్పటికి చీకటయింది. ఆ చెట్ల కొమ్మల్లో దెయ్యాలు వూగుతున్నట్లు కనపడేవి నాకు.

„వెంకట్రావ్. భయమేస్తోంది; నాకు, „నేనున్నానుగా, నీకేంభయ !”

నా చేతిమట్టూ అతనివేళ్ళు వొణుకుతున్నాయి. కాని „నేనున్నానుగా!” అని అంటోనే వున్నాడా ధీరుడు ఒకసారి అత్త నన్ను కొడుతూవుంటే, యెక్కణ్ణించో వొచ్చి, ఆమెని తోసివేశాడు.

„ఏకెట్లా తెలిసింది!” అంటే “ఏకంతం యెంత మెల్లిగా యేడ్చినా, నాకు కలలోకూడా వినపడుతుంది. చెల్లీ” అన్నాడు.

నేను పెద్దదాన్నైనతరువాత మా యిద్దరి మధ్యా పెద్దసిగ్గొకటి యేర్పడ్డది. వెంకట్రావు తలుపులకి యింటికి

వొచ్చినప్పుడల్లా, వికసిస్తున్న అతని కళ్ళ నీ మొహాన్న వొకసారి చూసూ, లాలిస్తున్న మెత్తని చేతుల్ని వొకసారి చూసూ, నవ్వుతున్న పెదిమల్ని వొకసారి చూసి, వొళ్ళుఝల్లుమనేది నావాడు, నా వెంకట్రావు. అని గర్వం కలిగేది.

నాకు పదిహేనేళ్ళప్పుడు గావును కిష్టయ్య మొదట మావూళ్ళోకనపడ్డది. అతన్ని చూడగానే అందరూ యింతఅందమైనవాడూ, గొప్పవాడూ, యెవరా అని ఆశ్చర్యపడ్డారు. అతనిఎల్లెవాటి వుక్తృత్వం, మెరిసేస్లిప్పర్లూ, కోరమీసం, పెద్దక్రాపుజుట్టూ, అన్నీ అందరికళ్లనీ, ఆకర్షించాయి. అతనుఅటువొస్తే, స్త్రీలు కిటికీల దగ్గరా, తలుపుల వెనకాచేరేవారు. చివరికి అమ్మకు కూడా అతను గొప్పడాక్టరని తరవాత తెలిసింది. నా చెల్లెలు సీత విషజ్వరంకుదిర్చినప్పట్నించి, అతను తరుచూ మాయింటికి వొస్తోవుండేవాడు. అతన్ని చూస్తే, నా కేదోభయంగా వుండేది. కాని అప్రయత్నంగా నా కాళ్లు అతని దగ్గిరకి తీసుకుపొయ్యేవి. కళ్లుతిప్పుకోలేను. మొదటి రోజున నన్ను అతను యెగాదిగా చూస్తోవుంటే నాశరీరాన్ని వస్త్రహీనంచేసి చూస్తున్నట్లనిపించింది.

ఒకరోజు సాయంత్రం కిష్టయ్య మాయింటికి వొచ్చాడు నాన్నవూళ్లోలేడు అమ్మవంట చేస్తోంది. యెవరో చూడాలని చీట్లో గుమ్మం దగ్గిరకి వెళ్లాను. అతను లోపలికివొచ్చి, నాబుజంమీద చెయ్యేసి, ,,యెవరూలేరా?'' అన్నాడు. దూరంగా జరిగి లేరన్నాను.

,,యిట్లారానువ్వు.'' అని నా వొంకనూటిగా చూశాడు. నా కళ్లనితిప్పుకోలేక, అతనివేపే జరిగాను. నా వంపమీద చెయ్యేశాడు. నా కాళ్లూ వొళ్లూ వొణుకుతున్న సంగతి అతనికి తగిలినట్టుంది. విలువుగా చెయ్యేసి, ,,రేపురాత్రి యెనిమిదింటికి చెరువు దక్షిణపు గట్టున గంగరావిచెట్టు కిందికిరా, వొస్తావా?''

నాకు మాట్లాడ్డానికి నాలిక రాలేదు. ,,నాకు తెలుసు వొస్తావు.'' అని వెళ్లిపోయినాడు. అతను వెళ్లింతరువాత, ,,యెవరనుకున్నాడు? నాకు తెలీదూ యెందుకు-రమ్మన్నాడో? పోకిరీ వెధవ, యెంధైర్యం?''

అని చాలా రోషపడ్డాను. అమ్మతో చెపుదామనుకున్నాను. కాని చెప్పినట్లు జ్ఞాపకంలేదు. ... ...

తరవాత మూడునాలుగు నెలలు అతన్ని తప్పించుకు తిరిగాను. శ్రీ వీణ పౌర్ణమి సాయంత్రం అందరం గుళ్ళోకి వెళ్లాము. వెంకట్రావుకూడా వొచ్చాడు. మా యిద్దరికీ పెళ్లిసంగతి తలపెడుతున్నారు. - ఆ రోజుల్లో, చీకటి పడ్డది. వెనకనించి వెన్నెలా, ముందునించి గుడి దీపాల వెలుతురూ మామీద పడతోవుంటే, ధ్వజస్తంభం చుట్టూకూచుని కులాసాగా మాట్లాడుకుంటూన్నాము. సీతవొచ్చి, నా చెవులో అక్కయ్యా, గుడివెనకాల యెవరో రమ్మన్నాడు, పోయిచూడు''అంది. వెంకట్రావుకూడావింటే కష్టంఅనిపించింది. వెంకట్రావుకాని పాడునిగ్గ కొంపముంచింది గుడివెనకాల పచ్చగన్నేరు మొక్కల చాటున కిష్టయ్యనుంచునివున్నాడు. వెనకాలకి పోవాలంటే కాళ్లుకదలవు. ,,నన్నుతప్పించుకొంటావా?'' అన్నాడు. వాదగ్గరికి నడిచివొచ్చి, దగ్గిరకి లాగుకొని, తిప్పివున్న నా మొహాన్ని, చేత్తోతన వేపుతిప్పుకుని, చంప మీద మృదువుగా ముద్దుపెట్టుకున్నాడు నాకు కస్తూరి వాసనేసింది, అతని పెదిమల మీదనించి

,,చిన్నతల్లివికదూ! చెప్పినట్లు, విని, రేపురా, యిక్కడేవుంటా. రేపెవ్వరూ వుండరు. సాయంత్రం వొస్తావుకదూ?

నేను మాట్లాడలేదు.

,,యెంతబావుంటుందనుకున్నావు? నీకే తెలుస్తుంది, తప్పకుండారా. వొస్తావుకదూ?''

మళ్లీకిల్లెరచేసి,

,,రాకపోతవా, నీగతిచూసుకో'' అని వెళ్లిపోయినాడు.

కిష్టయ్య దగ్గిరికి వెళ్లాలని నాకేమాత్రమూలేదు. గాని భయపెట్టినప్పటి అతని కళ్లచూపే జ్ఞాపకంవొచ్చింది. వెళ్లకపోతే, యేసాహసంచేస్తాడో! ఆలోచించి వెంకట్రావుకిఆసంగతి కబురు పంపాను. తరువాతయేం జరిగిందో నాకు అప్పుడు తెలీయలేదు. ఆరాత్రుంచు కొంచెం తరువాత నా ప్రారబ్ధంబద్దలయింది. తరవాత,

తెలిసింది. మర్నాడు సాయింత్రం గుడి వెనకాల కిష్టయ్యతో అన్నదానికి సిద్ధమైనాట్ట వెంకట్రావు. కిష్టయ్య నవ్వి "నేనా ఆ అమ్మాయిని రమ్మన్నది? ఆమెనన్ను బలవంతం చేస్తే! పైగామీతో చెప్పిందా యిట్లా? యెంత కన్నా సమర్థులు" అన్నాట్ట. అప్పుడే అసంగతి నాకు తెలిస్తే! చెప్పావుకానుకదూ. వెంకట్రావ్, నా మీద ఏకా కాస్త నమ్మకంలేకపోయింది కదూ, అవతంటే అంతలోకువ. యెంతవిపత్సముద్రంలో పడ్డాం దాని మధ్యపడి వొడ్డుచేరలేక, తన్నుకుని, నలిగి యిట్లా అయినాము. మొదట వెంకట్రావు అతని అబద్ధాలు నమ్మలేదు. కాని ఆజిత్తులమారి వాడు యేంచెప్పాడో యేమిటో, మర్నాడు నేను గదిలో వొంటరిగా కూచుని వుండగా కిష్టయ్య లోపలికి వొచ్చాడు. నేను తెల్లబోయి లేచినుంచున్నాను. నాతో బాగా చనువుగలవాడిమల్లే చుట్టూచేతులేసి, దగ్గిరికి అదుముకుని, కళ్ళల్లోకి, నిదానంగా చూస్తో, మెల్లిగా, ధైర్యంగా దృఢంగా, "నన్ను ముద్దుపెట్టుకో" అన్నాడు. మల్లీ కస్తూరి వాసనేసి నాతల తిరిగింది. ముద్దవలె, పాటవలె నాచెవిని తాకాయి ఆమాటలు రెండూ. నాస్వాధీనం తప్పి, తిరగబడి, అతని మొహంవొంచి, నోటిమీద ముద్దుపెట్టుకున్నాయి నా పెదిమలు. నన్ను వెనక్కి వొంచి మెడమీదా, కిందా ముద్దుపెట్టుకున్నాడు. అతను ఆశ్చర్యం నాతలని అతని భుజంమీద అనించి, కొట్టుకునే హృదయోద్రేకాన్ని ఆపడానికి అతన్ని అదుముకుని కప్పుకున్నాను. ......... నాన్నా, వెంకట్రావు గదిలోకి వొచ్చారు. యెన్నడూ ఏ మొహం అంతభయంకరంగా కనపడలేదు ఆ మధ్యాన్నంలాగు. చివర రాత్రి కూడా, వెంకట్రావ్ నావంక నిదానంగాచూసి, మూల్గి, నాన్నతన గదిలోకి వెళ్ళిపోయినారు. నేనూ వెంకట్రావుమిగిలాము గదిలో. అనిమిషాన అనిమిషాన. నా హృదయమంత అతనిదే, ఆ కిష్టయ్యవెళ్ళగానే; వాణ్ణిచంపెయ్యి అనిపించింది. వెంకట్రావ్, నామీద అంత ప్రేమ ఉన్నవాడివి వాడి గొంతుక పిసక్కయేందుకు వొదిలేశావు? చపల చిత్తనై, బలహీనురాలినై, కళ్ళుమూసుకు గోతులో పడితే, నన్నువొదిలేస్తావా? అడవాన్ని వొంటరిగా విస్సహాయంగా, విడిచిపెడతావా? యింతేనా నువ్వుచదువుకుని సంపాదించిన తెలివల్లా? ఆరోజున కూడా నాజీవనమంతా, హృదయమంతా, వెంకట్రావుదే. కాని యెట్లా అతని నమ్మించడం? అతని పాదాల మీదపడి "నువ్వుచూసిందంతా మాయ. వాడు మాంత్రికుడు నువ్వేమీ చూడలేదు. అంతాఅబద్ధం." అనినమ్మి, జాలిపడేట్టు, యేడవాలనిపించింది. కాని నాపాదలకి సిగ్గూ, అభిమానం, బంధాలు పడ్డాయి. నాగతి! నేను చేసుకున్న పాపము! వెంకట్రావు వెళ్ళగానే, వొళ్ళంతా రక్కుకున్నాను. కొరుక్కున్నాను. జుట్టుపీక్కున్నాను. వెంకట్రావుకి వుత్తరం రాయాలని పదిసార్లు కూచున్నాను, రాత్రంతా మేలుకుని, కాని వాణ్ణిమొదటను ముద్దుపెట్టుకున్నానో యెట్లాచెప్పడం యెవరికర్థమవుతుంది!

నన్ను కిష్టయ్యకిచ్చి పెళ్ళిచేస్తారని మర్నాడు తెలిసింది. పెళ్ళిదాకా ఆ రోజులన్నీ కొయ్యనై పడివున్నాను. వెంకట్రావుని కలుసుకుని మాట్లాడదామంటే, అతను వూరువిడిచి వెళ్ళిపోయినాడు.

... ... ... ... ...

కిష్టయ్యతో కాపరం చాల మధురంగావుంది. నన్ను మంత్రించినట్టు వలలో వేసుకుని, బానిసని చేసుకున్నాడు అడదాన్ని మోహింపచేసి, లాలించి, తృప్తిపరచడం అతనికే తెలుసు. పుట్టినప్పణ్ణించి ఆశాస్త్రంతప్ప యింకేమీ చదివి, అభ్యాసం చెయ్యనట్టుంది. మెరిసే అతని కళ్ళవేపు చూస్తో, అతని చేతుల్లో రొమ్ముకి అదుముకుని పడుకుంటే, యింకయేమీ జ్ఞాపకముండదు. పైన గది తలుపుగల పడకున్నా, కింద తేల్లుకుంటున్నా, కదిలేశక్తి పోతుంది. రోజురోజూ అతని మీద మోహం యెక్కువయింది అతన్ని వొక్క నిముష వొదల్లేను. అందైనం, అతనే లోకం. అవేవాళ్ళందరూ, నన్ను చూసి యీర్ష్యపడుతున్నారు.. కిష్టయ్య భార్యనని. కాని ఆరోజుల్లోకూడా అతను నాకళ్ళముందునించి వొక్క నిముషం అవతలికి వెళ్ళగానే మళ్ళీరావాలనే ఆత్రుత నాకుండేదికాదు. వెర్రి తీపినింటే చేమతోచినట్లు వెగటు పుట్టేది. అతన్నిమళ్ళీ చూడకుండా కొంతకాలము, యెవరన్నా వెళ్ళిపోయి

వొస్తే బావుంటుందనిపించేది. అతని బూట్సులచప్పుడు వినగానే భయంతో గుండెలు గబగబలాడేవి. కాని అతను దగ్గిరికి రాగానే మీద చెయ్యివెయ్యగానే, యింక వేరే లోకం, ధ్యాస; లేవు. అతను వొంకచూడడం, దగ్గిరి లాక్కోవడం, వొస్తున్నది అనుభవించడం, అంతేపని.

నెలరోజులకి నాకో చిన్న గడ్డలేచింది. కిష్టయ్యతో చెపితే, అదేపోతుందని, ఒక చిన్న పట్టీ యిచ్చాడు కాని అదివిన్నప్పుడు అతని మొహంలో మార్పుచూసి, నాకు అప్పుడప్పుడు ఆశ్చర్యంవేసేది.

నాలుగు నెలల్లో నావొంటిమీద తెల్లనిమచ్చలు బైలుదేరాయి. చూసుకుంటే అసహ్యమూ, భయమూ వేసింది. ఆయనతో చెపితే యేమీమాట్లాడలేదు. తరువాత ఆయనవొంటిమీదకూడా అంతకంటే భయంకరమైన మచ్చలుండడం చూశాను నాకుయేదో నిశ్చయంగాని అనుమానం కలిగింది. రోగాలుంటాయని వినడమేగాని, వాటి స్వరూపం నాకేం తెలుసు? మర్యాదస్తులు అనుభవించేవిగాని, తెలుసుకుని జాగ్రత్తపడే విషయాలు కావు. నేనేంపాపంచేశాను? ధర్మశాస్త్రాలు చెప్పినట్లు భర్తకిదేహంఅప్పచెప్పి సంపాయించుకున్న రోగం. నాకు తలంటిపోస్తూ, మాదాసీది నావొళ్లుచూసి రోగంగుర్తుపట్టింది. దాని దగ్గిర్నించి తెలుసుకున్నా ఆరోగంసంగతి వొకరినించి, వొకరికి వొస్తుందని. దానీదాన్ని యెవరికీ చెప్పవొద్దని కట్టుదిట్టంచేశాను. నాన్న కిష్టయ్యతో చెప్పనట్లున్నారు. అతను యెవవోమందు యిచ్చాడు. కొంచెం నయమయిందింప్పటికి. రోగంసంగతి తెలిసినప్పట్నించి కిష్టయ్యమీద నాకు రోతకలిగింది. దగ్గిరికిరానిచ్చేదాన్నికాను, అతని సామీప్యమేభరించ శక్యం కాకుండా వుండేది. నా సంగతిచూసి, అతనూ నన్నూ ప్రేమతో చూడ్డం మానుకున్నాడు. రాత్రులు ఆతనెక్కడెక్కడో వుండి పొయ్యేవాడు. ఒకరోజు సీతా అతనూ వొకగదిలో వుండగా అమ్మచూసింది. సీత తనకేం తెలీదని యేడ్చింది. కాని నాకు అనుమానంగానేవుంది. నాన్న కిష్టయ్యతో కఠినంగా మాట్లాడి, యింట్లోంచి పొమ్మన్నట్టుగా తిట్టాను. నన్నుకూడా వెంటపెట్టుకుపోయి తిప్పలుపెడతాడనికాని, లేకపోతే యెప్పుడో అతన్ని తరిమేశేవాను. అదిగాక కిష్టయ్య అసలు డాక్టరు కాదనిన్నీ, అన్నిదొంగవేషాలనిన్నీ, తెలిసి, వూళ్లో అతన్ని 'ప్రాసిక్యూషన్' చెయ్యాలని చూస్తోవుంటే నాన్నవాళ్లందర్నీ బతిమాలుకుని మాన్పించాను.

యింతలో నాకు గర్భిణి తటస్థమయింది. నావేవిళ్లలోనే వెంకట్రావు వొచ్చి శీతనిమ్మని అడిగి పెళ్లి చేసుకున్నాడు.

ఒకరోజు తెల్లారకట్ట నేను దొడ్లోంచి వొస్తోవుంటే, వెంకట్రావు గుమ్మంలో నుంచుని వున్నాడు. అప్పటివరకు మేము మళ్లీ మాట్లాడుకోలేదు. నావంక అతను నిదానంగా చూసి

"మోసం చేశావు కున్నావు, నేను సీతను పెళ్లిచేసుకొంది? చపలూ, కళ్లూ, నీకుమల్లే వుంటుంది. అందుకే" అన్నాడు

"యింకా నామీద యీ దయయెందుకు?" "నువ్వు చేసిన మోసం మరిచిపోకలిగాను. నిన్ను మరచిపోలేకపోయాను."

ఆ లేతకాంతిలో జుట్టులేకి, కళ్లు నిలిగి, మనుష్యుల్లో విశ్వాసం పోయినందుకు, రాత్రంతా దుఃఖించినవాడి మల్లి కనపడుతున్న అతనిమీద చాలా జాలికలిగింది. యెట్లాగో అతన్ని వోదార్చాలనిపించింది.

"వెంకట్రావ్, నువ్వు నమ్మవుగాని, అయినా చెప్తున్నా ఆయన అబద్ధాలు చెప్పి నిన్నూ నాన్ననీ, మోసం చేశాడు,"

"మేము చూసిందో?"

"అతనియెదట నాదేహం నా స్వాధీనంలో వుండేది కాదు. అభయంకర స్వప్నంలోంచి బైటపడాలనే నీసహాయం అడిగాను. అది యిట్లా పరిణమించింది"

అతనూ సీతా అవధ్యాన్నమే వూరికి ప్రయాణమైనారు.

తొమ్మిది నెలలూ సరిగానే గడిచాయి; ఆయాసంలేకండా కన్నాను. కళ్లు తెరిచేప్పటికి, నాపక్కన, నాచిన్నబిడ్డ, నాకొత్త ప్రాణం, యేడుపు వినపడతోంది. హృదయాలోంచి ప్రేమ వెల్లివిరిసింది. ఒక్కసారి రొమ్ముకి అద్దుకోవాలని పక్కకి తిరిగిచూసి, కెవ్వున కేకేసి పరుపుమీద పడ్డాను. ముక్కూ, చెవీ, నోరూ కలుసుకుని పెద్దగుంట. ఆపిల్లకి రాక్షసి లాగుంది రూపం.

ఆపిల్లని యెట్లా పెంచను? దానికి పాలియ్యడమెట్లా? ముద్దులొలుకుతో వుండవలసిన ఆ చిన్న పెదిమలు లేనేలేవు. నా స్తనాన్ని అంటి ఝల్లుమనిపించవలసిన ఆగులాబి రేకనోటు బదులు రంధ్రమేమిటి? దిక్కుమాలినదాన్ని నాకెందుకు పుట్టావు. యిది పెద్దదైతే దాన్నేం చేసుకోను? యేమని దాన్ని నలుగురికీ చూపించుకోను నా బిడ్డఅని? నాతొలిచూలా? నా ముద్దులబిడ్డా నాగుండెల్లో బలువెక్కింది. యింక నాకీ లోకంలో సంతోషమేమిటి? పందొమ్మిదేళ్లు లేవు. లోపల గంపెడు పాడురోగం. అట్లాంటి భర్త. యిట్లాందిటి పిల్ల. మనసు చెల్లెలి మొగుడిమీద. నూరేళ్లు బతకాలట. దేనికోసం? చావుకోవుకోవమంటే యేమిటో! లోకం మాయా, సంసారం దుఃఖసాగరమని యెందుకన్నారో అప్పు డర్థమయింది. యెవరో చచ్చిపోయినట్లు అందరూ నన్ను వోదార్చారు. నాబిడ్డని, అది నేను పూర్వజన్మంలో చేసుకున్న పాపాన్నితిట్టి అది రాక్షసో, దయ్యమో, అయినట్లు మాట్లాడారు. ఆ చూడవొచ్చిన వాళ్లందరినీ, కొట్టి, రక్కాలనిపించేదినాకు.

ఒకరోజురాత్రి నాబిడ్డ మరణవేదనపడి, తెల్లారకట్ట, నావొళ్లోనే ప్రాణం విడిచింది. నాకు నవ్వాలో యేడవాలో తెలియలేదు. ఆనాటినించి ఆపిల్లనాకల్లోరావడం మొదలుపెట్టింది. నాయెదటకుంచుని, యెర్రని నెత్తురుకారే అరంధ్రంకేసి వేలుపెట్టి. చూపించి "హా" అని అరిచేది. నేను కెవ్వనకాకేసి లేచేదాన్ని.

యింకో అర్నెల్లు గడిచాయి. కిష్టయ్య చర్మం తినేస్తోంది. డాక్టర్ని పిలవనివ్వడు. తనే యేవోమందులు తాగేవాడు. నేను అమ్మదగ్గిరే పడుకునేదాన్ని. అతను తాకడంకూడా రోతఅనిపిస్తోంది. చివరికి బలవంతంమీద పక్కబస్తీనుంచి డాక్టర్ని తీసుకొచ్చి మందిప్పించారు. కాని నన్నుమాత్రం డాక్టరికి చూపే ప్రశంసేరాలేదు.

సీతా వెంకట్రావూ వొచ్చారు. చెల్లికి గర్భిణి. వెంకట్రావుని చూసింది మొదటిరోజే యిన్నినెల్లనించి. అతన్నే ప్రేమిస్తున్నానని, అతనికోసమే అన్నాళ్ళూకాచుకుని వున్నానని దుఃఖభాజనమైన నాజీవనానిసౌందర్యరేఖ, పరమౌషధి, అతనేనని, నాకురూఢి కలిగింది. అతని ప్రేమ నా పాదాలవద్ద పావురంవలె వాలేట్టు చెయ్యాలి. నన్నుచూసి నిలవలేక, అతనేకోరి, దుర్భరమై తపనపొందాలి. నాసౌందర్యమే నా ఆయుధం. నాజుట్టులో అతని మనసు చిక్కుకునేట్టు, మొహంమీద వొంపుగా ఉలువుగా పడేట్టు ముడివేశాను. అందమైన నావక్షపు వుబ్బుకు, ఆచ్ఛాదితమైన నాసౌందర్యాన్ని సూచించేట్టు, నాజాకెట్టు మెడలు బాగా కిందికి కత్తిరించాను. చిరునవ్వులూ, తళతళ చూపులూ నా మొహాన తాండవమాడాయి. అందరూవున్నా, నాకళ్ళూ మాటలూ అతనికోసమే వెతికేది. యథావిధిగా యేర్పడ్డ భర్తని అడ్డంపెట్టుకుని యెట్లాంటినాటకమన్నా ఆడడం చాలాసులభం. వెంకట్రావు వొక్కడూ వున్నప్పుడు యేమి విషయం లేకుండానే యేమిటో మాట్లాడేదాన్ని. అవన్నీ సహజంగానే ప్రేమ నాకునేర్పింది. మాచిన్నతనపు ఆటలూ బుజాలమీద చేతులు వేసుకుని ఒకళ్లమాటల్లో ఒకళ్లం అనందించుకున్న నిమిషాలూ, యిద్దరం భార్యాభర్తలమవుతామని సిగ్గుపడడం, యివన్నీ అతనితో మాట్లాడేదాన్ని. నామాటలకంటె, కళ్లుయెక్కువ భావాలు వెలిబుచ్చేవి. "మనకే పెళ్లైతే యిప్పుడేంచేస్తోవుండేవాళ్లం" అన్నాను ఒక రోజు. "నువ్వుయింకోడికోసం, నేను యింకోతెకోసం" అన్నాడు చిరునవ్వుతో. తలవొంచుకున్నాను.

యెందుకో వెంకట్రావు ఆలస్యంచేస్తున్నాడు. అతను 'రెస్పాన్స్' యివ్వని కొద్దీ, నాకు జయాభిలాష యెక్కువయింది. ఒక రోజురాత్రి అతన్ని తోసుకువెళ్లేట్టు యెసురుగాపోయి, నాబ్రోచికి గుచ్చుకున్న బొడ్డుమల్లె అతనికి చిరునవ్వుతో యిచ్చాను. దానివంక నిదానంగా

చూస్తో, "తరువాత నిన్నేమనీ ప్రయోజనం లేదు" అన్నాడు. యేంచేస్తే మాత్రం నాకేంభయం అన్నట్టుగా నుంచున్నాను; అతని కెదురుగా. అతని చేతులు నావేపు జాపబోయినాడు. నా కాళ్లు ఝల్లుమని వొణికాయి. నాదేహమంతా అతనివేపు కదిలింది. కాని మళ్లీ యెవరో వాటిని వెనకనించి లాగినట్టు తనే కిందికి అణుచుకొని వెళ్లిపోతున్నాడు. నాకు అమితమైన నింద కలిగింది. యెన్నాళ్లింకా? హేళనంగా నవ్వాను. వెనక్కి తిరిగివొచ్చి. నాచేతులు గట్టిగా పట్టుకుని "నాసంతోషాన్ని చూసేనా నవ్వుతున్నావు? నాబలంసంగతి నీకేం తెలుసు" అని వొదిలి వెళ్లిపోయాడు.

మర్నాడు సుజలో మాయిళ్లకి మధ్య సందులో అప్రయత్నంగా కలుసుకున్నాము "రేపు మధ్యాహ్నం నాగదిలోకిరా" అన్నాడు బొంగురు పోయిన గొంతుకతో.

"వొద్దు"

"వొద్దా! వొద్దేమిటి, నీ మొహం."

"నిజంగా వొద్దు."

నవ్వు కావిలించుకుని "నాతో తమాషా నీకు?" అన్నాడు.

"తమాషాకాదు. నిజమే. నిన్ను నావాణ్ణి చేసుకున్నాను. చాలు. చూడు." అని అతన్ని ముద్దుపెట్టుకుని,

"యింతేనాకు కావలిసింది, యిట్లా రోజుకోసారిరా. చాలు. యిందుకే నేను చేసిన ప్రయత్నాలన్నీ. యీ మొహాన్ని, చూసుకుని, యిట్లా పట్టుకుని, నాదనుకుని, యిట్లా.........యింతే."

"యెంత సులభంగా అన్నావు ఆమాట! అముద్దు మాధుర్యం ఆపెదిమలదగ్గిర ఆడుగుతుందా? ఆపాద మస్తకం వుడికించి చీల్చివెయ్యదూ?........ఇంతా నీయిష్టమేనా! వొస్తానన్నది. నిన్నెక్కణ్ణించి కదలనీను. ఆమాటలు కట్టిపెట్టు."

"నామాట వినవూ!.......వొద్దు"

"యెందుకో చెప్పు."

"కారణముంది. నీకోసమే. నన్నడక్కు."

"అయితే నేను నీకు కనపడను. యిట్లా తృప్తిపడడం నాచాతకాదు."

అతను కనపడక పోతే ఆశూన్యంలో బతకడమేలాగు?

"సరే వొస్తాను. కాని. నాయిష్టం లేనిది......సరే. లే. రా."

మర్నాడు మధ్యాహ్నం మెల్లిగా వెంకట్రావు గది దగ్గిరకి వెళ్లి, వొణుకుతున్న వేళ్లతో తలుపు తోశాను. లోపలికి వెళ్లి, తలుపు గడియవేసి, కిటికీమూసి, చిరునవ్వుతో, "వొచ్చానుమరి." అన్నాను అతని కెదురుగా నుంచుని.

కిటికీ సందుల్లోంచి నాజుట్టుమీద, నడుంమీదా యెండ చుక్కలు పడుతున్నాయి. నా బుజాలమీద చేతులేసి, దూరంగాతోసి, నావొంకవూరకే కిందినించి పైకి చూస్తోంచున్నాడు అతను.

"యేమిటి చూస్తున్నావు?

"నీ అందం"

"బావున్నానా"

దగ్గిరికిలాక్కుని గట్టిగా అదుముకున్నాడు. నాకు వూపిరాడక "అమ్మా" అన్నాను. జుట్టువూడిపోయింది. అతని చేతుల్లో వూగిపోయినాను అతికావేశంతో నావొళ్లంతా తాకుతూ. చీరవూడి నాకాళ్లచుట్టూపడ్డది. తంటే అయిపోతుందేమోనని, అట్లానే చేతుల్లో పొదునిపట్టుకుని, దానికింక చూస్తో ఆనందించే కుర్రవాడివలె, యెడంగానుంచుని, నా దేహపురంగూ, నడుమువొంపులూ నాతొడల నునుపూ, చూస్తో. "యెంతబావున్నావు, చెల్లీ, యిన్నాళ్లూ, నిన్న ఒకరోజు మరిచిపోలేను. యిట్లా నీచేతుల్లో పడుకున్నట్లు, యెన్నిరాత్రులు ధ్యానిస్తున్నాను యీ అందమంతా. యిక్కడ, యీ వొంపు చూడు, ఇక్కడ, యిదంతా ఇదివరకే చూశా, కలల్లో యెంత జీవితం వృథా అయింది? యిట్లారా, దగ్గిరికి

ప్రతి రక్తబిందువూ, నన్ను అతని దగ్గిరికి లాగే సింది. వెయ్యికోళ్లతో నాశరీరం అతను కావాలంది. తలతిరిగింది. చెవుల్లో హోరుమని శబ్దం వినపడ్డది. నన్ను, నాశరీరాన్ని, ఆత్మని, లాగేశాడు. అంతా చీకటి. అతని చేతులు నాచుట్టూ బిగిసిపోయినాయి. కడ్డీవలె అతనినరాలు బిగుసుకున్నాయి. అతని కళ్లల్లో భయంకరమైన ఆవేశంవెలుగుతోంది. అతని వేడినిశ్వాసం నా చంపమీద కాలుతోంది. నేను, అన్నీమరిచి, తీవ్రమైన ఆనందంలో శరీరాన్ని అతని కందిచ్చాను.......... నాకెళ్లముందు చీకట్లో యెవరు అట్లా నుంచున్నారు? బిగుసుకొని పసుకొనియెుద్రనిరంధ్రం మీద వేలుపెట్టి చూపుతో!...కెవ్వునఅరిచి, తెలబోయినాను. భయంతో వెంకట్రావు నన్ను వొదిలివేశాడు... ... ... ...

అద్దంముందు చీరెచుట్టుకుని నుంచుని జుట్టుసద్దుకొంటూ, అతని వేపుచూశాను. కదలకుండా, తలదిండులో దూర్చుకుని వున్నాడు. విచారమా, బాధా కోపమా?

తరువాత మళ్లీ వెంకట్రావు దగ్గిరికి వెళ్లడమంటే భయమేసింది. యెప్పుడు శక్తిలేక లొంగుతానో! అతన్ని నేను తప్పించు తిరగవలసిన గతిపట్టింది. అతనూ యెప్పుడూనావెంట తిరిగేది. అతన్ని నావేపులాగి, మోహాన్ని రేపి వుద్రేకాన్ని పండించి, యిప్పుడు కారణం చెప్పకుండా, అతను నన్ను వాంఛించిన కొద్దీ, దూరమవుతో వుంటే అతని కెట్లావుందో! నాసంగ తేమనుకున్నాడో! మళ్లీతనని కలుసుకోమని ప్రాణం తీశాడు. అందరూ అనుమాన పడుతున్నారని చెప్పి, కొన్నాళ్లు తప్పించుకున్నాను. కాని యెంతమనసు బిగపట్టుకున్నా, ఒక్కొక్క రాత్రి వెంకట్రావు కావాలనిపించి పిచ్చెక్కేది. అతని తలని అదుముకోవాలని, అతని చేతుల్లో కళ్లుమూసుకోవాలని, నాశరీరమంతా, నరనరమూలాక్కుపోయి, బాధపడేదాన్ని. తెల్లార్లూ, నిద్రపట్టేది కాదు. రాత్రులు గదిలో తిత కూడావుండేది గాని, లేకపోతె యెన్నిసార్లో వొళ్లుతెలీక సాహసించి వెళ్లేదాన్నే.

ట్రావెలర్స్ బంగళలో యేర్పాటుచేశాను రమ్మని చాలా సార్లు అడిగాడు. కొన్నిరోజులు మళ్లీ తప్పించుకుని, తోసేసుకుని తిరిగాను. కాని చివరికి ఒకరోజు నా ముందు కన్నీళ్లుపెట్టుకున్నాడు. ఆ మొహంలో బాధ వర్ణించలేను. నేను యెంతకష్టపడ్డా వోర్చుకోగలిగానుకాని, అతని కళ్లల్లో బాధనిచూసి తాళలేకపోయినాను. సాయంత్రమే వొస్తానన్నాను. ఒకసారివెళ్లి రావాలని నిశ్చయించుకోడంతోటే, అంత నిగ్రహశక్తి పట్టూడిపోయింది. వెంకట్రావుకోసం, నిముషాలుకూడా ఆగలేని, తీవ్రతృష్ణపట్టుకుంది. యెప్పుడు అతన్నొత్తా నాచేతుల్లో పట్టుకుంటానా అని ఆత్రుతగావుంది ప్రతి అడుక్కీ కాళ్ళు వొణికాయి. ప్రతి అడుగూ ఆటంకం లాగ తోచింది. యెంతో దూరంలాగు కనపడ్డది. పూరివెలపల కాలవ వొడ్డున, బంగళాలో మంచంమీద పడుకుని వున్నాడు. అతని పక్కన కూచుని, మంచంమీదనించి చేయ్యేసి, అతని రొమ్ముమీదనించి మొహం దగ్గిరికి వొంగాను. కిటికీలోంచి బృహస్పతి అర్ధచంద్రుడు మమ్మల్ని చూస్తున్నారు. చల్లనిగాలి అతని జుట్టును, పల్చని చొక్కాని కదిలిస్తోంది

„మాట్లాడవేం!” అన్నాను.

„యేంలేదు.”

„కోపంకదూ?”

„కోపమెందుకు? యిన్నాళ్లకన్నా దయదలిచి వొచ్చావని సంతోషించక?”

„అదుగో కోపం! యిన్నాళ్లు రాలేదనేనా? నాకు రాకుండా వుండాలని వుందంనేకదూ నీవుద్దేశ్యం?”

„కాక”

„నీ నామాటనమ్ము. అంతమాత్రం విశ్వాసముంచాలి.”

„కారణం చెప్పరాదూ?”

„చెప్పడగొద్దు. కాని కారణంలేకపోలేదు.”

„పోదూ! యీమాటలకేం? నాకు చెప్పకూడనికారణముందా? నీకేరావాలని యిష్టముంటే, నేనే కావలిస్తే, యిన్నాళ్ళు దూరంగా వుండగలవా?”

యెంతైనా మొగాళ్లు వాళ్లపూహల ప్రకారమే, అనుభవం ప్రకారమే ఆలోచించుకుంటారు, స్త్రీల సంగతికూడా. మాసంగతి, మా „ఇన్ స్టింక్ట్సు” తెలని వాళ్లకి యేమాత్రమూ తెలియదు. కోపమాపుకోలేక మళ్లీఅన్నాడు.

'నన్నెట్లా యేడిపిస్తున్నావని? మళ్లీ నాకెందుకు కన పడ్డావు? నన్నెందుకిట్లా స్వాధీనం చేసుకున్నావు? మళ్లీ నా కెందుకు లోపడవు?......ఛీ,ఛీ,ఫో, వెళ్లిపో''

నాహృదయంలో శూలంనాటినట్లయింది. చెప్ప నా? అమ్మో, యెట్లావొస్తాయి ఆమాటలు: ఘోరం. మళ్లీ నామొహంచూస్తాడా! అతని కళ్లల్లో అసహ్యాన్ని చూడగలనా? యెట్లానమ్మించడం?

''వెంకట్రావ్! నువ్వనన్నట్లా తృణీకరించడం నేను వొప్పుకోను. నాకు యెట్లాగో మళ్లీదొరికావు. నిన్ను వదలను. నువ్వులేనిది నేను బతుకలేను. నీమీద ప్రేమ లేకపోతే యిట్లా నీదగ్గిరికి వొస్తానా? అంతప్రయత్నం చేసి నిన్ను నా వాణ్ణి చేసుకుంటానా? నాకళ్ళల్లో చూడు, ప్రేమకనపట్టంలేదూ? యిట్లారా? చెయ్యియిట్లాతే. నీ కే తెలుస్తుంది.''

కూచున్న వెంకట్రావుని, కావిలించుకుని మంచం మీద పడుకో పెట్టాను. అతనిపైన ఆనుకుని, అకన్నంతా నాతో, నాజుట్టుతో, నామొహంతో, నా వూపిరితో అవ రించుకుని నలిపేశాను. నాశరీరమంతా నలిగిపోయింది. నా వూపిరి ఆగిపొయింది. నారక్తం అతని రక్తంలో కలిసి దూకుతో ప్రవహిస్తోంది. మండుతున్న నా పెద వులు, చలించే నా మెత్తని చేతులు, అతన్ని వెతికినా మన్ననివక్షము, అతని అనుమానాన్ని కరిగించేశాయి. అలిసి సగంమూతపడ్డ అతని కళ్ళల్లోకి, బృహస్పతికాంతి లో చూస్తో.

''యింకా నమ్మకంలేదూ?'' అని అడిగాను.

''యెంతమాధుర్యం యివ్వగలవు నువ్వు? యిప్పుడేయింత స్వర్గాన్ని అనుభవిస్తున్నానే........''

తక్కింది నానోటిలో మూసేశాను.

''నీ వొక్కడికోసమే ప్రేమచూపే కొత్తవిధం తుదన్నా తెలిస్తే బావుండును. నాకు నమ్మకం పు ట్టించడానికి'' అన్నాను ఆయాసంతో.

నాచేతుల్ని వొదిలించుకుని, మోచేతిమీద ఆను కుని నావంక చూశాడు. నల్లని నా జుట్టంతా దిండు మీద పరుచుకుని, మధ్యనాచిన్నమోరూ, వెన్నెల చంప లూ, పెద్దకళ్ళూ అతనికి కనపడి వుంటాయి, కళ్లుమూసు కుని చిరునవ్వునవ్వాను. ప్రళయ మారుతమల్లె నేనురేగ కొట్టిన అతనిమోహం నామీద విరుచుకునిపడ్డది. రెక్క లపురుగువలె కొట్టుకు పోయినాను. అలలమీద నురుగు వలె వూగిపోయినాను.

''వొద్దు, వొద్దు, వెంకట్రావ్ నా మాటవిను''

''మాట్లాడకు. కదలకు.''

'నమస్కారం చేస్తా. ... ...నాకు అసహ్యం''

అని అబద్ధం చెప్పాను. కదలకండా నాచేతులుపట్టు కుని ''యెన్నాళ్లు యీ అబద్ధాలు? నీ పెదిమలుదొంగ వైతే, నీకళ్లు నిజంమాట్లాట్టం లేదనుకున్నావా?''

... ... ... ... ...

అలిసి అతని రొమ్ముమీద నిద్రపోయి నాడు.

యింటికి వెళ్లేటప్పటికి రాత్రి పదకొండయింది. కిష్టయ్య మేలుకునివున్నాడు. నా యెర్రని పెదిమా, మెరిసే కళ్లూ రేగిన జుట్టూ, వొణికే వొళ్లూ, చూశాడు.

''యెక్కణ్ణించి?''

నాకు నెర్రిసాహసం పుట్టింది.

''నీకెందుకు?''

''నాకు తెలుసులే. వాడూ నువ్వూ యెక్కడో''

నావొళ్లు మండి పోతోంది, వాడి మూలానే నిర్భయం గా నానాథుణ్ణి కలుసుకోడానికి వీల్లేను. నాదేమమ్మ న్నిద్దర్నీ అజన్మాంతమూ వేరు చేసింది, కష్టపెట్టింది, అబద్ధాలు చెప్పి నన్ను తన మచ్చులవొంటికి కట్టుకుంది.

''నీకేం?''

'నాకేం? నేనిట్లా జబ్బుతో చస్తోవుంటే నువ్వు. ......ముండా......ముండా ...లేచివొచ్చి జుట్టుపట్టు కుని వీపుమీద గుద్దాను. విదిలించుకుని దూరంగా వెళ్లాను.

''నా దేహం పాడుచేశావు నా బిడ్డని చూడ్డా నికి వీలులేకండా చేసి కనిపించావు. నా వెంకట్రావుకీ నాకూ అబద్ధాలు చెప్పి...''

కోపమాపుకో లేకపోయినాను. కాలునున్నచెప్ప ఛ చేత్తో తీసి, వాణ్ణి యీ దవడమీదా, ఆ దవడమీదా కొట్టాను చెయ్యి రక్తమయింది.

తరవాత ప్రతిరోజూ వెంకట్రావుని కలుసుకున్నాను. యింట్లో అందరికీ తెలుసుననుకుంటా. కాని నేనేమీ ఆలోచించ తలుచుకోలేను. ఆ స్వర్గానుభవం నాల్గునాళ్లమాత్రమేనని తెలుసు—వెంకట్రావుకి తెలిసిందాకా. ఆ సంగతి తలుచుకున్నప్పుడల్లా, నిరాశతో, భరించలేని కోపంతో, కొట్టుకునే దాన్ని. యెట్లానన్నా విధిని జయించాలని, నా వెంకట్రావుని నావాణ్ణిగానే వుంచుకోవాలని, నాలో నేను పెనుగులాడేదాన్ని. వెంకటేశ్వర్లకు, నాజుట్టూ, నగలు యిచ్చేస్తానని మొక్కుకున్నా. ఒక రోజు పొద్దున్న నేను లేచేటప్పటికి ఆ మచ్చలన్నీ పోయి ఆరోగ్యంగా వుంటే? పోనీ వెంకట్రావుకు ఆ ఆపద తప్పితే......'క్రిష్ణా పత్రిక'లో మందు ప్రకటన వుంటే, దానికోసం రహస్యంగా రాశాను. యెందుకు నా కిట్లాంటి ఖర్మం పట్టాలి: ధర్మ సందేహాలతో నా జీవితానికి మిగిలిన యీ వొక్క పండగా పాడుచేసుకుంటానా? యేమనుకుంటారో అనే భయంతో! అవన్నీ అదృష్టవంతుల ఆలోచనలు. మర్యాదస్తుల చరిత్రలు. నిర్భాగ్యురాలిని, నన్ను గురించి యెవరే మనుకుంటే, నాకేంలేఖ!

... ... ...

ఆ పదిరోజులు నేనూ వెంకట్రావూ యెంత ఆనందం అనుభవించామని? రోజల్లా సాయంత్రం కోసమే బతికేదాన్ని. తినడం, వూపిరిపీల్చడం, నిద్రా: అన్నీ అందుకోసమే. సూర్యుడు కిందికి వాలుతో వుంటే చేతులుజాచి ముద్దు పెట్టుకోవాలనిపించేది. ఈ విధంగా వున్న ఆయనకి నా కృతజ్ఞత తెలియ చెయ్యా లనిపించేది.

... ... ...

ఒకరోజు రాత్రి బంగళాలో అద్దాముందు నుంచుని వున్నాను. పెద్దచంద్రుడు యెదురుగా వెలుగుతున్నాడు. వెంకట్రావు పక్కమీద పండుకొని చూస్తున్నాడు. నా చీరా, బెల్టూ, జాకట్టూ పక్క కింద కుప్పగాపడి వున్నాయి.

"నువ్వు నన్నిట్లా చూసినప్పణ్ణించి నా వొంటిమీద నాకు ప్రేమ యెక్కువవుతోంది. యిప్పుడు యెంత భద్రంగా, శుభ్రంగా వుంచుతా ననుకున్నావు. యిది నిజమా? ఆ సంగతి తలుచుకున్నప్పుడల్లా..."

వెంకట్రావు మంచంమీదనించి చప్పుని లేచి వొచ్చి రొమ్ముకింద ముద్దుపెట్టుకున్నాడు.

"యీ పదిరోజులూ అక్కడ యెన్నివేల సార్లు ముద్దుపెట్టుకున్నావు? చాలుననిపించడం, తృప్తీ యేమీలేవా యేమిటి?"

"అబ్బా, నా బాధ నీకు తెలుస్తుందా?"

"బాధే!"

"నిజంగా ఆలోచిస్తే, బాధే, వుత్కృష్టమైన, దివ్యమైన, వాఙ్మనసాతీతమైన, మధురమైన, తీవ్రమైన, నరక బాధ. ప్రతినరాన్ని సన్నసన్న చీలికలుగా చీల్చే బాధ. అక్కడ ఆయెత్తైన వొంపుని చూసినప్పుడల్లా, యేమిటో చెయ్యాలని, ఆ అందమంతా నాలోకి రావాలని, దాన్నంత అక్కడినుంచి తీసివేయాలని యేమిటేమిటో తెలీని, చెప్పలేని భరించలేని బాధ కలుగుతుంది. కళ్లు మైకం కమ్ముతాయి. నాలిక యెండిపోతుంది. చేతినరాలు బిగుసుకు పోతాయి. యేం చెయ్యను! నా అశక్యత నా కర్థమవుతుంది. సృష్టి ఔన్నత్యం అర్థమవుతుంది!"

... ... ...

తరవాత మూడురోజులకి సీత కన్నది. గుడ్డిపిల్ల పుట్టినది. ఆనాటినించి వెంకట్రావుకి కొత్తసుఖం మొదలు.

దేనికై భయపడుతున్నానో, యేరోజు ప్రళయమని యెదురు చూస్తున్నానో, ఆ రోజు వొచ్చింది. ఒకరాత్రి వెళ్లేటప్పటికి, వెంకట్రావు చీకట్లో నుంచుని బైట తిరుగుతున్నాడు. నాగుండెలు భేరీలమల్లే కొట్టుకుంటున్నాయి. అతనికి యెదురుగా నుంచున్నా.

"యేం చేశావునన్ను? యేంచేశావునువ్వు" అయ్యో చెల్లే. చెల్లే యేమిగతి పెట్టింది నీకు? యెన్నాళ్లు మట్టి దాచావు యీ కాలకూటవిషాన్ని నీవొంట్లో? అయ్యో, దౌర్భాగ్యురాలా, యెంత ఆ శనిపాతాన్ని భరించావు, యీ సుందరరూపంలో? యింక యెట్లా బతకను. దేనికోస? యీ మలినమైన వొంటితో యీ ఘోరవిషం రక్తంలో యెట్లా బతకను. యెవరికోసం? నా

హృదయాన్ని యిట్లా చీల్చివేశావే! కాలుకింద రాచేశావే! యింక యేం చెయ్యను? యేమి గాను? యెక్కడ దిక్కు? యెంవకు చెప్పలేను. నాతో మాటాడే"

"నాకేం తెలుసు వెంకట్రావ్, చెపితే నన్ను సహ్యంచుకుంటావనుకున్నాను"

"అయ్యో, యింత తెలివి దానివా? ముందుఒక్క మాట, ఒకపొంకా ఒక్కచీటి వేసినాను అందరికీ యీ ఆపద తప్పేది"

"వెంకట్రావ్, నీ మాటలు నాకింకా అర్థం కావటంలేదు. ఖలు దానికి యేం లేదంటావేం? నన్ను వొదిలేస్తే వెళ్ళలేకావు. సీతనేం చేస్తావు. గుడ్డిపిల్ల ఆ......"

"వుంది. వుండు, అది గుడ్డిపిల్లగా యెందుకు పుట్టింది. ...... అవును......అవును......యిదే కారణం, ముందే తోచలేదు నాకు. పుత్ర అనుమాన మనకున్నా తెలిసిం."

బిగ్గరిగా అరుస్తున్నాను, పిచ్చెక్కినట్టు "యిదే కారణం, ఛీ, ఛీ, అబ్బా! వోర్చుకోలేను. వోర్చుకోలేను." దగ్గరికి వెళ్లి చెయ్యేశాను.

"నువ్వెవరు? నేనెవ్వరు? ఆ బిడ్డెవరు? వెళ్లు"

"యేం చేస్తావు"

"యేదో వొకటి. తేలీదు"

వెళ్లిపోతున్నాడు.

"వెంకట్రావ్, నేనూ ఐతకము, తెలీక చేశాను, నాదే తప్పు యిట్లోరా. ఒక్కమాట. అన్నీ మరిచిపోయినావా?"

వెళ్లిపోయినాడు. వెనక పరిగెత్తాను. కాలవ అడ్డంగా వొచ్చింది విరోధిలాగు ఆగాను. నల్లని నీరు చచ్చిన బాధువుని చూడ్డానికి వెడుతున్నట్లు యేడుస్తూ పరుగెత్తుతున్నాయి.

ఆశలన్నీ మండిపోయినాయి. కష్టపైనెరిలిచాను పేడుపై మూల పడ్డాను. యిల్లు పట్టలేను. లోకంపట్టలేను. తలిదండ్రులు పట్టలేను. మంచంమీద చచ్చినట్లు పడుకున్నాను; వెంకట్రావువొచ్చి, నన్ను మళ్లీ పిలిచినట్లు కలలు వొచ్చేవి. అతను పిలిచినట్లే, తాకినట్లే అయ్యేది నాదేహం.

మూడోరోజున సీత పిల్లకి జబ్బుగా వుందని యేడుస్తున్నారు. మెల్లిగాలేచి శిశ గదిలోనికి వెళ్లాను. ఆపిల్ల మొహం చూసేపటికే నాకర్థమయింది. వొచ్చి పక్కమీద పడ్డాను. యింకో నెలలో నాకు గర్భం కలిగినట్టు తెలిసింది. నా వెంకట్రావు శిశువు. దైవమా, నన్ను వెక్కిరించి. కోసి, చీల్చి, పురుగులకి పెట్ట తలుచుకున్నానా? యేంపాపం చేశాను. మళ్లీ అనోను, అమ్మక్క, వొద్దు వొద్దు, నా వెంకట్రావు ముద్దుల బిడ్డని, మోహపు బిడ్డని, అట్లా చూడగలనా? చస్తాగాని యీబిడ్డని లోకంలోకి రానిస్తానా? అంకుకొని యీపని చేశా. ఒకమ్మ సహాయం చేసింది, కిష్టయ్య కనిపెట్టి పోలీసు వాళ్లకి రిపోర్టు చేశాడు.

నన్ను శిక్షిస్తారట. యేం పాపం చెయ్యకుండానే నేనుభరించని నిష్కారణమైన శిక్షల్లో యిదెన్నోవొంతు. నేను చేసిన పాపమేమిటి. కనికరించి ఆబిడ్డ పుట్టకుండా ఆపినందుకు శిక్షిస్తారా? గుడ్డిదానిగానో పిచ్చిదాని గానో కని, లోకంమీద పారేస్తే, లోకం దాన్ని వెక్కిరించి యేడిపించి, నేలకొట్టేస్తే, అది శుద్ధధర్మమా, యీ రోగాలన్నీ వాళ్ల స్వంత సొమ్మైనట్టు, యెవరికీ, పీసరం గతి తెలీకుండా దాచి వుంచుకునే ధర్మాత్ములకి లేదు శిక్ష?



# పద్మిని

వేంకటకాళిదాస కవులు

(ఆంధ్రగీర్వాణ సాహిత్యసమ్మేళనము)

హైందవరాజపుత్ర నిచయ ప్రకటీకృత ధైర్యసాహస
స్పంద యశస్సమావృత విశాలధరావలయంబునన్ సదా
నందని యుక్తిసజ్జనుల నారతమున్ భవదీయనామమున్
డెందమునం దలంచెదరు నీవు పతివ్రతవమ్మ పద్మినీ!

దోషాకరత్వమెందు కళంకిఁగనుఁగొన్నఁ గన్నుమూసెద వీవు సన్నుతాంగి!
సన్మార్గసంచారి సందర్శనముచేత వికసింతువీవు సాధ్వీమతల్లి!
భువనంబులన్ గీర్తి బొందియుండుటలన్న నీయందె వెలయుఁ దన్వీలలామ!
చక్రంబునకుఁజాల సంతసంబిడుబుద్ధి పొల్చునీకడఁగాదె పుణ్యమూర్తి!

నిఖిలజనవంద్యమగు పద్మినీసమాఖ్య
సార్థకత్వంబుఁబొందె నీయందెఁగాదె
అహహా! నీకుఁ దదీయ సమాఖ్యనిడిన
యట్టి విధికౌశలంబెన్న నలవియగునె?

పతిచెఱనుండు నన్నతరి భారమునెల్ల సహించి నెమ్మదిన్
ధృతివహియించి కార్యములనెల్ల ఘటించితివీవు; సైపమిన్
జతురత మ్లేచ్ఛుతోడఁ బతి సన్నిధికిన్ జనిపత్తునంచుఁ బ
ల్కితి; హృదయేశుఁ బ్రోచితి; భళీ! కడుఁ బ్రోడవు నీవు పద్మినీ!

కన్నులకుమూసి గాఢాంధకారపటలి
నిదరవోయెడు దేశమున్మేలుకొల్పి
భారతీయవీరసతీప్రభావమెల్ల
వెల్లడించితివీవు సాధ్వీమతల్లి!

దేశము జంకుఁబూనక భళీయని లోకము మెచ్చునట్టులన్
దేశమునందుఁ గల్గిన సతీమణులెల్లరు నిన్నుఁ జూచి, యా
వేశముతోడ, మాతృపదవిం గల గౌరవమెంచి, తుచ్ఛరా
ట్పాశములం దగుల్పడిన భారతదేశము నుద్ధరింతురన్.

# వైవస్వత మనువు

## లోకోద్ధరణకు ఆయన చేయుచున్న సేవ

వి. యస్. శర్మ

(గత సంచిక తరువాయి)

## II

అన్ని కార్యశాఖలలో ప్రధానమైనది పరిపాలనాశాఖ. దాని అధికారులు మనువులనియు, ఇట్టి మనువు లింతకుముందు నలుగురుండిరనియు, నేను ఈ శాఖాధికారమును వహించుచున్నవారు ఆయిదవ వారనియు, మనహిందూ గ్రంథములు, అందు ముఖ్యముగా పురాణములు వచించుచున్నవి. ఇతర మతములలోను ఈ అధికార వర్గమును ప్రకటించు విషయము లెన్నియో గలవు. అంతవరకు పోనేల! ప్రపంచమున నాగరికతగల ప్రతిజాతియు ఈ మహానీయులను భక్తిశ్రద్ధలతో పూజించుచు, గౌరవించుచున్నట్ల అనేక గ్రంథములలో మనము గాంచగలము. సంస్కృతమున 'మన్' (To think) అనగా తలంచుటయని యర్థము. ఈ శబ్దమునుండియు, ఆంగ్లమున "మన్" అను పదముత్పన్నమగుచున్నది. డచ్చి, జర్మను, ఫ్రెంచి భాషలలో సైతము ఈ అర్థమునే మనుపదము దెలుపుచున్నది.

ప్రతి మానవజాతికిని ఒక మనువుండును. ఆయనయే ఆ జాతి యొక్క పురోభివృద్ధిని గాంచుచు ఆ జాతియొక్క శక్తిసంపదలను పెంపొందజేయుటకు అన్ని రీతుల తోడ్పడుచుండును. చీనా వానిని ఇంగ్లీషువానిని పరిశీలించుడు. వారిద్దరిలో నెంతెంత తారతమ్యమున్నదో చూడుడు. వారి కండ్లను పరీక్షించుడు. ముఖలక్షణములను గాంచుడు. దేహాకారమును జూడుడు. వెంటనే చీనా జాతికిని, ఇంగ్లీషు జాతికిని గల ఆ భేదము స్పష్టముగా తెలిసికొనగలము. జాతి లక్షణములను ఆ భేదములు వెంటనే మనకు తెలియగలవు. ఒక జర్మను దేశీయుని, ఇటాలియనును చూడుడు. ఇరువురును ఆర్యజాతి సంజాతులే. కాని జర్మను సోదరుడు, ఆర్య సంఘమునందలి అయిదవ ఉపశాఖనందలి 'టూటానికు' సంతతికి జెందినవాడు. ఇటాలియను నాలుగవ శాఖయగు 'కెల్టికు' సంతతికి జెందినవాడు. జపానీయులు, అమెరికను రెడ్ఇండియనులలో ప్రధాన వర్గము, కాబిలీ జాతి వారు నాలుగవజాతికి చెందినవారు. కాని వారిలో సైతము అనేక మార్పులను మనము గాంచవచ్చును. జపానీయులు నాలుగవ జాతియందలి ఏడవ ఉపశాఖయగు 'మంగోలియను' సంతతి లోనివారు. రెడ్ ఇండియనులు, మూడవ ఉపశాఖయగు 'టొలుటెకు' తెగకు జేరినవారు. కాబిలి జాతి వారు ఆరవ ఉపశాఖయగు 'అకాడియను' తెగకు చెందినవారు, వీరిలో నెవరును ప్రత్యేకముగా నొక తెగకే చెందినవారనియు, తక్కినవారితో వీరికెట్టి సంబంధము లేదనియు చెప్పుటకు వీలులేదు మానవాభివృద్ధికి అనేక శాఖల సమ్మేళనము గలుగుచుండును.

వానిలో నుండి ఆయా శాఖల ప్రత్యేక వ్యక్తిత్వములను సమ్మేళన పరచి, నూతన నాగరీకతకు ప్రధాన సోపానములుగ నుండి నూతన జాతీయు లుద్భవించు చుందురు.

మానవ జాతులను వాని యుపజాతులను సృష్టించుట, వాని శక్తివైభవములను సతతము పెంపొందింప జేయుట, ప్రతి జాతియు, తెగయు మానవ పరిణామమున జేయవలసిన సేవను చక్కగా కొనసాగించుటకు తోడ్పడుటయు, మనువు యొక్క విధ్యుక్త ధర్మము. మన భారతీయ గ్రంథ సముదాయమును చదివిన అంద అనేక మంది మనువుల యొక్క పేర్లను మనము తెలిసికొనవచ్చును. మనువు అనునది అధికార పురుషుని పదవి యొక్క పేరు. ఎవరీ అధికార స్థానమును వహింతురో వారిని 'మనువు' అని పేర్కొందురు. నూతన యుగప్రారంభమున రాజు (సనత్కుమారుడు*) లోకమున జనించబోవు జాతి ఫలాని రీతిని నుండవలయునని మనువునకు సూచించును. ఆ సూచన ప్రకారము చక్కని జాతిని సృష్టించుటకు మనువు నిరంతరము పరిశ్రమ చేయుచు, అట్టి జాతిలోనే స్వయముగా జన్మించును. తన బిడ్డలు జాతి యొక్క లక్షణములను సాధ్యమైనంత వరకు పెంపొందింప జేయునటుల చూచును. వంశ పరంపరగా, జాతి యాశుభ లక్షణములను చక్కగా ప్రకాశింప జేయుటకు ఆయన జేయు ప్రయత్నములు వర్ణింప తరము గాదు.

నేడు మనలపాలించుచున్న మనువు వైవస్వత మనువుల వారు. ఆర్య జాతిని వీరే సృష్టించి కీర్తిగాంచి యున్నారు. మన మందరమును వారి బిడ్డలము. అనేక కోట్ల సంవత్సరముల క్రిందట వీరు శాఖాధికారమును వహించి తమ కార్యక్రమమును ప్రారంభించి యున్నారు. నేటి జాతి సౌష్టవమునకు గావలసిన పరికరములను సమకూర్చుటలో వారు పడిన శ్రమ వర్ణింప తరముగాదు. క్రీ.పూ. ౧,౦౦,౦౦౦ లకు వీరి పరిశ్రమ నెరవేరినది. ఆర్య జాతి బీజములు చక్కగా వెలువడినవి. జాతి పరిణామము జయప్రదముగా కొనసాగ నారంభమయ్యెను. నేటి అట్లాంటిక మహాసముద్రమున పూర్వకాలమున నొక ద్వీపముండెను. అందు జాతివృద్ధిపొంద నారంభము కాజొచ్చెను. క్రీ.పూ. ౮౯,౮౯౮ సం॥న నూతన జాతిని, నేటి ఆఫ్రికా మార్గమున — అరేబియా ప్రాంతమునకు దీసికొనివచ్చి, అచ్చట వారలకు వసతుల నేర్పరచిరి. తదనంతరము కొంత కాలమునకు అచ్చటినుండి వారలను, ఉత్తర మార్గములకు ప్రయాణము చేయించి, పూర్వకాలమున భూమండలముగనున్న, నేటి ఆర్కిటిక సముద్రప్రాంతమునకు దీసికొని వచ్చిరి. కొంతకాలమచ్చట జాతి నివసించుచు, క్రొత్తక్రొత్త అనుభవములను సంపాదించి తుదకు నేడు ఎడారిలో, మాఘ్యానియా నిబిడీకృతమై యున్న, పూర్వకాలపు గోబీ సముద్ర తీరమునకు ఆర్య సంతతి తీసికొని రాబడెను. సముద్ర తీరప్రాంతములలో ఆర్యజాతి చాల కాలము నివసించియుండెను. అచ్చట వారెన్నియో కష్టముల ననుభవింపవలసి వచ్చెను. కిరాతులు వారికి పెట్టిన హింసలు వర్ణింప తరము గాదు. అంతే యేల, జీవయాత్రలో మానవ జాతి అనుభవించ వలసిన అనుభవములన్నిటిని వీరచ్చట పొంది కృతార్థత నొందిరి. క్రీ.పూ. ౭౦,౦౦౦ ల నుండి, అనగా, వీరీ ప్రాంతములకు వచ్చిన దాది, వీరి సంతతి క్రమ వృద్ధిగాంచుచు, చక్కని ప్రభుత్వమును స్థాపించుకొని, సంపూర్ణ సౌష్టవములతో సుప్రసిద్ధిగాంచ గలిగెను.

ఇక ఆర్యజాతి, తమ సభ్యతను లోకము నందలి యితర జాతులకు వ్యాపింప జేయవలయును. తమ అనుభవములను లోకులెల్లరికిని తెలిపి, వారి నందరిని పావనవంతులుగ జేయవలయును. కార్యమా అతి భారమైనది. క్రొత్త దేశములకు తమ బంధుమిత్రాదులను వదలి వెళ్లవలయును. అష్టకష్టముల ననుభవించవలయును. స్వలాభముకన్నను ఈశ్వరాజ్ఞ అత్యుత్తమమైనది. దానిని నెరవేర్చువారే ధీరులు. అందులకే తాము జన్మించినది. తమ జన్మను సార్థకపరచుకొను సుదినములు సమీపించెను. సోదరులు కార్య రంగమున ముందంజవేసిరి. మనువాజ్ఞను శిరసావహించి, అనేక దేశములకు వలసపోయిరి. అచ్చట గొప్ప రాజ్యములను సంస్థాపించి ఆర్య నాగరీకతను అనార్య జాతులలో పెంపొందింపసాగించిరి. బిడ్డల ఈ కార్యోత్సాహమునకు మనువుల వారు అన్ని రీతుల తోడ్పడుచుండిరి. ఒక్కొక్కసారి వారి సంతతిలో జన్మించి, రాజాధిరాజై,

* సనత్కుమారుని అధికార వర్గమునకు రాజని వాడుదురు.

అరేబియా, దక్షిణాఫ్రికా ఖండములలో చారిత్రిక సుప్రసిద్ధములగు సామ్రాజ్యములను స్థాపించిరి. ఈ రీతినే పాతకాలమున నొక రాజ్యమును నెలకొల్పిరి. గ్రీకురోము రాజ్యములను స్థాపించిరి. జర్మను, ఇంగ్లీషు రాజ్య సంస్థలను విలసిల్ల జేసిరి. గోబీ ప్రాంతము నుండి కొంతమంది జనాంగమును, భారత భూమికి తెచ్చి, యిచ్చట ఇతిహాస సుప్రసిద్ధమగు సభ్యతను పెంపొందించిరి. హిందువులకు మనువుల వారి పట్ల గల భక్తిశ్రద్ధలు వర్ణనాతీతము. సతతము వారి పట్ల పితృ భక్తిని చూపెట్టుచు వారి ధర్మశాస్త్రములను అతి పూజ్య భావముతో గౌరవించుచున్నారు.

మనువుల వారు మరల ఆరవ జాతిలోని ఆరవ యుపసర్గమును నిర్మించుటకు ప్రారంభము చేసి యున్నారు. ఈ నూతన జాతి లక్షణములను నేడు మనము అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు ప్రాంతములలో గాంచవచ్చును. నేటి మన జాతికిని, ఆ జాతికిని గల వ్యత్యాసమును అతి సులభముగా గ్రహించ వచ్చును. ఈ జాతి పరికరముల ననుసరించియే, రాబోవు యుగమున, ఆరవ మానవ జాతి సృష్టింపబడగలదు. ఆ జాతి పురోభివృద్ధి గాంచుటకు అధికార పదవిని బడయబోవు పురుషుడు నేడు తన అధికార పదవికి గావలసిన శిక్షణము వైవస్వత మనువుల వారి యొద్ద బడయుచున్నారు. ఆతడే గాదు వారి పరిపాలనా విధానమున అన్ని రీతుల తోడ్పడుచున్నారు. వారు సుప్రసిద్ధ క్షత్రియవంశ సంజాతులు. మౌర్య రాజవంశ సంతతిలోని వారు. వారు అనేక జన్మలలో ఈ కైంకర్యమునకు గాను ఎన్నియో అనుభవములను పొంది కృతార్థులైన మహాపురుషులు. నేటి మనువుల వారి ఆజ్ఞననుసరించి జాతియొక్క యుపశాఖలోని పరికరముల సహాయమున, నూతన జాతిని, నూతన నాగరికతను సృష్టించుటకు ప్రారంభింతురు. నేటి కాలమున వైవస్వత మనువుల వారి కార్యక్రమమును కొనసాగించుటకు, మత శాఖాధికారులగు మైత్రేయ ప్రభువుల వారు ఏ రీతిని తోడ్పడుచున్నారో, ఆ రీతినే, రాబోవు జాత్యుద్ధరణ కాలమున ఈ మహనీయులకు, పైథాగరసు మహర్షుల వారు బోధ సత్త్వులై, లోక కల్యాణమునకు సహాయభూతులు కాగలరు.

నేడు మనల పాలించుచున్న వైవస్వత మనువుల వారు హిమాలయ ప్రాంతములలో, మైత్రేయ ప్రభువుల వారి ఆశ్రమమునకు సమీపమున నివసించుచు, ప్రపంచ చక్రమును నడపుచున్నారు. జిజ్ఞాసుల నేకులు వారిని దర్శించి కృతార్థులై యున్నారు. వారిని దర్శించిన వారిదే భాగ్యము. ఆ ఆజానుబాహుత్వము, ఆ చక్కదనము వర్ణింప తరముకాదని వారిని గాంచిన మహనీయులు వచించుచున్నారు. ఆ రాజచిహ్నములు భూమండలమందలి ఎట్టి సార్వభౌముని యొద్దను గాంచుట దుర్లభము. వారి ముఖ లక్షణములు వారి అధికార లాంఛనమును చెప్పకనే చెప్పగలవు ఆ నేత్రముల యొక్క తేజము అత్యద్భుతము.

ఎచ్చట నైనను యుద్ధములు బొసగినను, ప్రభుత్వములు ఇక్కట్టులలో నున్నను, గొప్పగొప్ప మార్పు లేవైనను కలుగబోవుచున్నను, నాగరికతలు కష్ట పరంపరలలో నున్నను, ఒక్కసారి ఆ మను వంక మన దృష్టులను పరపి, ఆ మను యాజ్ఞలను తెలిసి యుండము. నేడు ప్రపంచ వాసులు నిరంతరము మను కష్టములనుండి రక్షించుటకు ప్రపంచ సామ్రాజ్యము నొకదాని నెలకొల్ప బోవుచున్నారు. ఈ నూతన సామ్రాజ్య వాతావరణమున యుద్ధములు నశించును. కలహము లంతరించును. నాగరికతా లక్షణములలో వాసికెక్కిన ప్రాక్పశ్చిమ రాజ్యములన్నియు ఈ మహాకార్యమునకు తోడ్పడగలవు ఈ నూతన రాజ్య పతాకము క్రింద, అన్ని జాతులు అన్యోన్య సోదర భావమును పెంపొందించగలవు. మత సహన మెక్కువగా నుండగలదు. ప్రపంచము నేడు వాంఛించుచున్న ఆనంద సామ్రాజ్య మిదియే. దీనినే మనువుల వారు సృష్టించుచున్నారు. మన మాయనకీ ధర్మ చక్రమున తోడ్పడి కృతార్థుల మయ్యెదము గాక! తండ్రి వాంఛించు కోరిక యిదియే! జనకాజ్ఞను నిర్విఘ్నముగా నెరవేర్చుటకు పుత్రులాదరు ముందంజ వేయవలయును. దీక్షా బద్ధులు కావలయును! మన యీ దీక్షా సమయమున సమస్త దేవతలు తోడ్పడుదురు గాక!

(డాక్టరు అనిబిసెంటు గారు ప్రచురించిన "In the world's series" అను గ్రంథము ననుసరించి దీనిని వ్రాసితిని. అందులకు వారికెంతయు కృతజ్ఞుడను.)

# ఉపలాలనము

### శ్రీకర్ల పాలెం కుటుంబశాస్త్రి

కవులు, చంపకమాలల కంఠభూష
ణములుగ నొసంగి కావ్యకన్యక నలంక
రించి, తద్విధి, నినుసత్కరించుచుండ,
పంకజాది సుమంబుల పైన వ్రాలి,
తత్ప్రసూనాళి గలమరందమును గ్రోలి,
డెందముల ముద మొందు నిందిందిరాళి,
యుష్మదీయసువాసన నొల్లదన్న
చింతచే ఘోరకాంతార సీమలందు
జేరి తీవ్రంబుగ తపంబు జేయనేల?
సకలసుపరీమళాలంబ! చంపకంబ!

---

ఇండియా గవర్న మెంటువారిచే |ని యోజితులు:



# ఏల?

### నౌడూరు బుచ్చిబంగారయ (కవిమండలి)

సాంద్రచంద్రిక లెల్లెడలఁ జల్లుచున్న
రాకనడిమింట వెల్గెడి రాజునవ్వ
పుష్పధన్వుఁడు పుంఖానుపుంఖములుగ
కోలవేయుచు నిన్నేచు లీలమునుగ
తలిరుజొంపమ్ము మ్రోలందు దవిలిమెక్కి
"కుహూకుహూ" యంచు కోయిలగూయుచుండ
భ్రమరతండంబు హాయిగా ప్రణయగీత
లింపుదళుకొత్తఁ బాడుచు సొంపునింప
వలచివలపించుకొనునట్టి వన్నెకాడు
"అతిపదా సోహ" మంచు నీ యొండనుండ
పడతిపూదోట వెన్నెల బయటనున్న
చిన్నినెలరాల తిన్నియఁ జెన్నుదనరి
వామహస్తంబు చెక్కిలి సీమజేర్చి
యోరజూచుచు వేడి నిట్టూర్పు విడచి
శూన్యగగనంబు దెసవింత చూడ్కినిలపి
ఆణిముత్యాలకోవల నవఘుళించు
ధారలై గారు నశ్రులవ్యాజగాఁగ
యెడదదళుకొత్తు జిగురుపయ్యెదనుదడుప
నార్తి మూర్తీభవించిన యటుల నీవు
బాలభూపాలమున నేడ్వనేల జెపుమ?



# తెనాలి రామకృష్ణకవి

వి. వి. రమణయ్య

ఆంధ్రవాఙ్మయమునఁ బ్రబంధయుగము నాఁటి కవులలో మేటు లనఁదగువారు శ్రీ కృష్ణదేవరాయల యాస్థాన కవులగు నష్టదిగ్గజము లనుటకు సందేహము లేదు. విమర్శించిచూడ వీరిలో నగ్రస్థానమున కర్హుఁడు రామకృష్ణకవియే యనఁదగునేమో! ఆంధ్రలోకమున కంతకును గన్నులఁ గట్టినట్లుండు. హాస్యరసమును బోషించిన రామకృష్ణుఁడే కానిండు, రామలింగఁడే కానిండు. ఈతఁడే యనుననేడి, కాదనెడి వితర్కములతో మనకిపు డవసరము లేదు. అష్టదిగ్గజములలోనివాఁడు కాదని యు కొంద ఱభిప్రాయ పడుచున్నారు. దీని నిర్ధారణజేయు భారము చరిత్రకారులకును, విభూతిఁబూయుదమా? నామముల దిద్దదమా? యను సంశయమును మతావేశ పూరితులకును వదలి మనమీతని కవితారసగ్రహణము సేయ దగ్గఱుగ నిందు గైకొందము.

ఈ మహాకవి రచించిన కావ్యములలో నెల్ల నుత్తమ కావ్యము „పాండురంగ మహాత్మ్యము". (ఘటికాచల మహాత్మ్యము, ఉద్భటారాధ్య చరిత్రము భిన్నకర్తృకము లనియెడి వాదము కలదు. ఇదియు ప్రత్యేక విమర్శావిషయము) ఇత్యాది మహాప్రౌఢము. పాదపూరణకై తెచ్చిపెట్టుకొనియెడి వ్యర్థపదము లితరాంధ్రకవుల రచనలలో వలె నిందుఁ గానరావు. పదసందర్భమున నేమి, సందర్భ శుద్ధియందేమి, వర్ణనావైలక్షణ్యంబున నేమి, యిత్యాది నిరుపమానమై శ్లాఘ్యతర కవిత్వశైలి గలదై యొప్పారుచున్నది. ఈతని కవి[illegible]

పదగుంఫనంబు" అనియు „పాండురంగ సుకవి పద్యంబు హరువును" అనియును సమకాలికులచేతనే కొనియాడ బడినటుల నిదర్శనములు కనిపించుచుండ నిప్పుడు మనము వేఱే చెప్పనేల?

కృతిపతి యీతని నెట్లుగొనియాడెనో చూడుఁడు!

„సీ. తగ సంస్కృతము తెనుంగుగఁ జేయఁ దెనుఁగు
సంస్కృతముగ జేయఁగఁ జతురమతివి
వలుదెలుంగుల నెన్నఁగల కావ్యధారల
ఘనుఁడ వాశువునందుఁ గరము మేటి
వఖిలభూమీపాల కాస్థానకమలాక
రోదయతరుణ సూర్యోదయుఁడవు
................................"

దీనినిఁ బట్టి చూడ నీతనికి సంస్కృతమునఁ గూడఁ దెలుఁగునందువలె రసవత్కవనంబు లల్లి చెప్పఁగలదని విస్పష్టము. అశుకవనమునం దీతనికి (మనమందఱ మెఱింగియున్నటులే) అసమాన ప్రతిభగలదని తెల్లము. మఱియుం గృతిభర్త యీతనిగూర్చి

„ఉ. ఉదయం బస్తనగంబు సేతువు
[illegible]ప్రాహంబునుంజుట్టి రా

విదితంబైన మహీమహాంధ్ర కవితా
విద్యాబలప్రౌఢి నీ
కెదు రేరీ సరసార్థబోధఘటనా
హేలా పరిష్కార శా
రద నీరూపము రామకృష్ణకవి
చంద్రా! సాంద్రకీర్తీశ్వరా!

అనియుఁ బ్రశంసించినటులఁ జెప్పుకొని యుండుటచే స్వోత్కర్ష ప్రకటన మని యో "కవి జన సహకారావళి వసంతోత్సవ సూక్తినిధి" నిజ ప్రభావం బెఱుఁగని పెద్దలు పలుకుదురు గాక! 'ముంజేతి కంకణమున కద్దమేల' యన్నటుల నీకవి యింతటి ప్రతిభాశాలియని వైపద్యమే నిరూపించుచున్నది. కృతికర్త యెంతయు సత్యమును బలికినవాఁడు.

ఇతని పద్యము లన్నిటియందును నేదో క్రొత్తవిధపు పోకడ లేకపోలేదు. ఈతని రచనాకౌశల్యము, కథాకల్పనము సమయోచితశుద్ధి, సూక్తివైచిత్ర్యము మొదలగు కావ్యలక్షణములు స్థాలీపులాక న్యాయముగఁ బరిశీలింప "నిగమశర్మోపాఖ్యాన" మొక్కటి చాలును. ఇందలి కథావిషయ మింతియ.

కథానాయకుఁడగు నిగమశర్మ కళింగ దేశాభరణంబగు పీఠికాపురము నందొక విశుద్ధతరమగు వంశంబునఁ జెందినవాఁడు. ఈతఁడు సకలమహీసురశ్రేష్ఠుండును, వేదశాస్త్ర ఖనియు, నాహితాగ్నియునైన సభాపతియను బ్రాహ్మణుని పుత్రుఁడు. చాల నందగాఁడు. వనితామానస నూనసాయకుఁడు సకల నిగమ శిఖారహస్యముల నేర్చినవాఁడు. ఇంత నేర్చియు యౌవనము ప్రాప్తించునప్పుడు దైవఘటనావశంబున మనసుఁ ధార్త్రియ పురుషార్థమునకే త్రిప్పి, జారి మాత్రోపజీవియయి, గురుజనంబు శిక్షింప గడుసువాఁడై, చాటుమాటలుగూడ దక్కారాయి వెలఁదుల పాలైనవాఁడు. ఇటుగల నగసాన్యముల బచ్చింట గుమ్మఁ బెట్టుచు మడిమాన్యముల నమ్మజూపుమఁ గడు లాఘవ వృత్తికిఁ బొచ్చి, తాత ముత్తాత తండ్రులు తరతరంబు చీమలవలెఁ గూడబెట్టిన ధనము నంతయును దుర్వినియోగము చేయుచు నింటికిఁ గూడ రాక తన చెల్లెలింట్లయందే నిలకడలేని త్రాగుడు త్రాగుచు నిలిచిపోయెను. ఈవార్త తెలిసిగిన యామహాలక్ష్ముని యక్క యెంత శిక్షించినను, చెల్లెమ్మని బిడ్డ అను మాట వినుకొని పుట్టింటికి నంటి, కొడుకు చేసిన దనదికి గుండెపడి మునుపటి తలవంపుకు తనవచనరచనా చమత్కారంబుల వంతకు దొలంగించుచు నష్టవశిష్టంబగు మూలవిత్తంబు గుప్తంబుసేయుచు, వనచంద్రికా వైభవంబయిన మఱందలి యౌవనారంభంబునకు వగచి యోదార్చుచుఁ గొన్ని దివసంబులు గడిపె. అంతం జాక్కా తెగిపడిన వసువున నెక్కడనుండియో యాకస్మికంబుగ నిలు సేర వచ్చిన తమ్ము నాదరించి ప్రియవచనంబుల హితంబుగఁ బలుక, బుద్ధి వచ్చినయట్లు కొన్నాళ్ళింటనే యుండి గుట్టు తెలిసి దాచుకొనియున్న సొమ్ములన్నింటి నొకనాఁటి రేయి హరించి, పెరదవినిబడి పాఱిపోవుచుండెను. మార్గమధ్యంబునఁ బోయలచేఁ బట్టుపడి ధనమంతయును దోపిడి బడుటయే గాక, కాయంబంతయును గాయములు వడగొట్టుటచేఁ బ్రాణావశిష్టుఁడయి పడియుండెను. ఆమార్గమున నే పోవుచుండిన కాపువాఁడొక డీతని దుస్థితిజూచి జాలిగొని యింటికిఁ గొంపోయి తగు చికిత్సఁ జేయించి యింటనే యుంచుకొని నిజపుత్రునివలెఁ బ్రేమించుచుండెను. కొంతకాల మిట్లుండి యా మిత్రద్రోహి యా పటవాని కోడలితోఁ బలాయమానుఁడై మరియొక పట్టణముఁ జేరి బోయపల్లెంబునఁ గలిసి జీవించుచుండె. కొంతకాలమునకా కాఁపుగొంటెగురాకుబోఁడి పరలోకంబు ప్రాప్తించుటయు, మరియొక ప్లవకన్యం జేపట్టి పుత్రసంతాన ప్రాప్తుండయి జీవించుచుండ, అగ్నిప్రమాదముచే నామూలపడుచు, పసిబిడ్డలతోఁ గూడ దగ్ధంబగుడు, నిగమశర్మ మిక్కిలి దుఃఖితుఁడై ప్రాణముల రోసి, అన్నపానంబుల త్యజించి చనిచని పాండరీక క్షేత్రంబునఁ బ్రాణముల విడుచుటచే ముక్తిపథముఁ గాంచెనఁట.

ఈ గాథనే మన రామకృష్ణకవి యతిరసవంతముగఁ బెంచి తన రచనాకౌశల్యమును వెల్లడించి యున్నాఁడు చూడుఁడు! వైదికాచార దూరప్రవర్తనుఁడై కామవికారత నిగమశర్మ యెట్టి మార్పు జెందెనని కవి యెంత చమత్కారముగ వర్ణించినాఁడో!

సీ. ఉష్ణస్నానహోమాగ్ని యూఁద నోల్లఁడుగాని
విరహజ్వరార్తుఁడై వెచ్చనూర్చు
సంధ్యకుఁ బ్రార్థనాంజలి ఘటింపఁడుగాని
మొరగు సీగ్లాన్య కషాయిత్రలకర్థి
నాగమవాదంబులొరఁగఁ దనఁడుగాని
విటవాదములు తీర్చు వేగిలేచి
కంబుభృత్పాదోదకంబు గ్రోలఁడుగాని
యాపతాసర సీధు వానిచొక్కుఁ
బుణ్యచిహ్నంబు నొసఁట ఘనంబు నఘటింప
సిగ్గుపడఁగాని కరనఖ శిఖర లిఖిత
జాతనూత్నక్షతాంకముల్ సమ్మతించు
నారజము మీరి యాదుర్విహారవారి.

ఇంత నిగమశర్మ కిట్టి దుర్విధి తగదని చెప్పుచు అక్క పలికెనని గనుక ప్రఁ బలుకులపరణి యెంతటి విలువ గలదని చెప్పుటకుఁగూడ సాధ్యముకాదు. ఇట్టి యాం ధ్రులయింటి దానిగఁ బనుమను మరేకవియుఁ జిత్రించి యుండలేదు. ఆద్యాది యెంత సహజమో యంతటి య పురూపము. కవియే ""అక్క" పలికిన పలుకులచందం బు నీరీతిగ వర్ణించినాఁడు ""అతఁడు తమకంబుగమకంబు నంబోవ నుంకించిన వానిసోఁదర్యమి యెఱింగి,

తరంగిత విన యసౌహార్ద మార్దన మధురంబులగు మాటల తేటలంబందిరివెట్టి" సత్యము. కవిపలుకు లిట్టివియ గమనింపుఁడు! ఇట్టి యాఁడుఁబడుచు నెంత స్వభావసిద్ధముగఁజిత్రించినాఁడో!

క. ఇంతలు నంతలు నగుతన
సంతానము చంటివెంట నందడినేయన్
బ్రాంతమున నిలిచి తమ్ముని
కుంతల బంధంబు విడిచి కుశలాశయయై.

తే. ఎలయు సీత్కారములతోడ సీళ్ళు గుక్క
యంటుగంటులు వరికించి యంట్లఁబోడిచె
గోరుముక్కల దిగదువ్వి తూరుపెత్తి
నెఱులఁ గలిగిన పేల నన్నింటిఁ దిగిచె.

క. మెడమన్ను నలఁచి యలకలు
ముడిగొని నిజపాదపద్మములు గరగరగాఁ
గడిగికొని తనకు మఱఁదలు
విడెమొసఁగుఁచుఁ బసిమి పసిఁడిపీఁవనవీఁవన్.

పై పద్య మెంతయును మనోహరము. తమ్మునిచం దనకుఁ గల ప్రేమ యుతు. మఱఁదలిపైఁ దనకుఁగల పై నుపును వ్యక్తీకరించినాఁడు,

తే. చేటికానీతపీఠికా సీనయగుచుఁ
బద్మకర్ణికఁ గొలువున్న పద్మవోలెఁ
గుడివలన నింతయోరగాఁ గొమరు మెఱసి
బిడ్డ చన్నుదావ నిట్లను బిసరుహాక్షి.

శా. ప్రారంభించిన వేదపాఠమునకున్
బ్రత్యూహమౌనంచు నో
యేరా తమ్ముఁడ! నన్ను జూడఁ జను దే
వెన్నాళ్ళనోయుండి చ
క్షూరాజీవయుగంబు వాచెనినుఁ
గన్గోకున్కి మీఁచావయున్
నీ రాకల్ మదిఁగోరు చంద్రుపొమపున్
నీ రాకరంబుంబలెన్

............................

క. ఏనమ్మనుఁ గడవఁగఁద
త్సూనులు కనుగందు లగ్రజుఁడవు నీ వి
ట్లైన తఱి నెంత దుఃఖమొ
యానీ ప్రోపానపడెడి నిసుగుసువుగన్.

సీ. పరమేష్ఠిచుండి నీ తరముదాఁక విశుద్ధ
తరమైన వంశంబు దలఁచవైతి
దఱిఁ ద్రొక్కి యున్న యీ తల్లిదండ్రులకాలి
పఱచనై సంతోష పఱచవైతి
వహ్నిసాక్షిగఁ బెండ్లి యాడిన యిల్లాలి
నిల్లాలితాకార నొల్లవైతి

ధర్మశాస్త్రార్థ విత్తములవిత్తములచే
నలరించి విఖ్యాతి నందవైతి
శీలముఖలంబు నిది పిల్లిశీలమనుచుఁ
జనువులివి యెల్లఁ జిల్కలచదువులనుచుఁ
దోఁపివారలు నవ్వ నాతోడ యేల,
బేలవైతివి యీగుణం బేలనీకు.

అత్తింటివారితో నాఁడుఁబడుచులు తను పుట్టి నింటినిగూర్చి గర్వముగఁబలుకుటలు సహజము. అటు లనే నిగమ శర్మతో దన సోదరియు నత్తింట నెట్లు తాఁజెప్పుకొని యుండెనని చెప్పుచున్నాఁడో చూడుఁడు!

ఉ॥ నాదు సహోదరుండు సుజనస్తవ
నీయన యప్రసక్తి బ్ర
హ్మాదులమెచ్చఁడే నతని యజ్ఞ
మునంగడుఁబూజ్యరాలనై
వేది యలంకరింతునని
వేవురిలోపల నాడుకొంమనీ
వేదియులేక సర్వగుణ
హీనుఁడవౌట యెఱుంగ దమ్ముఁడా!

శా॥ వీరావేశముదాల్చి సర్వధనము
న్వెచ్చింతు గాకేమి ము
క్కారుఁబండు నఖండనేతు వృతముల్
కాశ్మీర ఖండంపుఁగే
దారంబుల్ తెగనమ్మగాఁజనునె?
సిద్ధారండవే వెన్క నె
వ్వారుఁ లేరె? సహోదరాషలు కుల
ధ్వసంబు నీకర్హమే?

ఇట్టి పద్యములు చదివి యానందింపవలసినవియే కాని రసవిమర్శనమున కాదవు. అయినను నావంటి వాఁడు ప్రయత్నించుట హాస్యాస్పదము, కొంచెము సా
౫

చ్చు తప్పక గ్రంథమంతయు నిట్టి మనోహర పద్య పూరితమే. ప్రతిపద్యమునందును నేదో క్రొత్తవిధపుఁ బోకడలు లేక పోలేదు.

నిగమశర్మయొక్క తండ్రి, తల్లి, అక్క, బావ మఱఁది, వీరలు భూషణముల కొఱకు పొందు పరితాపము సహజోక్తిని నతిక్రమించి యున్నది.

సీ॥ శోకించు వృద్ధభూసురుడాత్మ పితృదత్త
దర్భముద్రికకుఁ జిత్తంబుగలఁగ
నత్తగారిచ్చిన హరి సుదర్శనపుఁ బేరునకు
ముత్తయిదువ వనటఁబొందుఁ
గొత్తగాఁ జేయించుకొన్న ముక్కరకునై
యడలు దుర్వారమై యాఁడుబిడ్డ
జామాత వెతఁబొందు వ్యామోహమైనవ
గ్రహకర్ణవేష్ట నభ్రంశమునకు,
నెంతదుర్బుద్ధి యెంత దుర్భ్రాంతియహహ!
సర్వధనములు నద్దురాచారశీలుఁ
డూచముట్టుగ నిలుఁదోచి యఱికిచనుట
యెఱుఁగరోగాక యెవ్వేళ యెఱుకగలదె?

కాఁపువాడింటికిఁగాంపోయి నిగమశర్మకుఁ గావిం చిన చికిత్స విషయమై కవివర్ణించిన విధము నఱయు నికనికి శస్త్రచికిత్సయందుఁగూడ పరిజ్ఞాన మున్నటుల గోచరిం పగలదు. ఈక్రింది పద్యము నఱయుఁడు!

సీ. పితృపరిత్యాగ వర్ధిత కిల్బిషమువోవ,
నెత్తునెత్తవశి వ్రేళ్ల నెత్తురొత్తి,
కూరుకు ప్రాణముల మేల్కొలుపు చామ్పునగంట్ల
శాకినీ శాండంబు సణిపిచూచి
సముయుంబు గాదని శమనుదూతలఁద్రోయు,
జాడమైనాటు శస్త్రిములు పెఱికి,
పతనాగాభవగుబొంది వడకుంకుటకు గంధ్ర,
పురులిచ్చుగతిఁజాలఁ మెత్తులునిచ్చి,

వట్టికూడును వేనీళ్లు పెట్టిరొట్టె
గలుగువీడ్యంబు లిప్పించి వలతియైన
వెజ్జునెచరించి యరయించె విప్రసుతుని,
కంటవత్తిడుకొని సైరికప్రభుండు.

ఇట్టి యుత్ప్రేక్షాలంకార పద్యము ఆంధ్రభాషలో నపురూపము. ఇందలి యుత్ప్రేక్షలన్నియును ఫలముగాని వానిని ఫలముగా సంభావించిన ఫలోత్ప్రేక్షలు.

కాంపుగోడలు సహజముగ వికారపు గోడలే. సహజ వక్రభావమును కాంబోలు కవియు శిశికలయని పేరుబెట్టెను. నిగమశర్మ యని తనయందే సమధిరూఢమగుటచే బంగారు కుండ తెరతెరగు దక్కనని చాకలు దాటించెను, ఇది మోహాంధతాఫలము. కాని యుచితజ్ఞుడగు నీ కవి నిగమశర్మ నీ ఘట్టమున మిత్రద్రోహియనుట యొంతయుందగియున్నది. మిత్ర ద్రోహిత నిరూపించుటలో నుదాహరించిన యీక్రింది పద్యమెంత సముచితముగ నున్నదో చూడుడు!

సీ. తలపుండ్లుగడిగించి తనుబ్రతికించెగా
యడవిదొంగోరావాతుండై నదెచ్చి
కన్నబిడ్డల కన్న గారవంబున జన,
విచ్చెగాసిచ్చలు నింటిలోన,
గ్రాసవాసక్లేశ కళ్మలత్వముడంచి,
యనురక్తి బెనిచెగాయనుదినంబు
గురువుగా వేల్పుగాగూర్చుచుట్టంబుగా,
భావించి కొలిచెగా భక్తియుక్తి

నెవ్వడారెడ్డియింటికి నెగ్గచాల
జేయుగుడినుండి గుడిరాళ్లుదీయుకరణి
గవలనటనారటుడు త్రాటగట్టుబోయ
కాయదామేయ సాయకా ఘాతభీతి.

శశికలజగనీలి పిసాళిజంత. కావనే మనోగతికిందోచు చెల్వారి కనుమూని చూచును. వలపు కానిని భావనాదృష్టిలో జూచి యానందించు చెలువల. రామకృష్ణ

నివకెంబార్యకవు లెవరును సూచించి యుండలేరు, మచ్చునకీక్రింది పద్యమును చూడుడు!

ఉ॥ అద్దమరేయిదాక పొల
మారసిమారశిలీముఖాహతిన్
నిద్దురరాచియున్న మగ
నిన్ జగనీలి పిసాళిజంత య
మ్ముద్దియ సేవసేయుదాక
ముచ్చటమూడను మాగబోలె నే
నుద్దియలేక కన్మొగిచి
చూచుమనోగతిందోచు చెల్వునిన్.

నిగమశర్మ పొండరీకక్షేత్రముజేరియు చిత్తనిశ్చలతలేని వాడై పొందు భావ వికారములంగవి దశావతారములుగ నుత్ప్రేక్షించినాడు. అతడు పడిలేచుట వమరపథము జూడ నూంకించుటగ జెప్పెను. ఇవి నాటకకళయందలి కథా సూచనముల వలె నలరి, యాతనికి సిద్ధింపనున్న మోక్షపదవిని తముదాము వెల్లడించుచున్నవి. ఇట్టి మాచ్యార్థ సూచనలు కావ్యములలో జాలనరుదు.

సీ॥ ఒకయుంత రెప్పవేయక చూచు బెఱవారి,
దలగొట్టుకొని దుఃఖ జలధిమునుగు,
బిలము తెలియుమనుబుద్ధిలో జొరబాఱు
నమదికన్నంభోద్భవముగమింతు
తిరియువాడునుబోలె దేనకు జేయుచాచు
దొరగునప్రాంబుధి దొప్పదోగు
హా! పోయితే! యనియఱచు భార్యగఱించి
బహువిధానక్తి విభ్రాంతిబొందు

జేరగారాని దర్శన స్థితివహించు,
బాడబస్ఫూర్తిలోగొన్న పగిదినుండు
దానవారాతి కాంబాని తదవతార
దశకమునుమున్నె తాల్చెనా ధరణిసురుడు.

ఈ మహాకవియొక్క రచనలయందు, పదకల్పనలు; సామెతలఁ జిక్కఁగఁ జొప్పించుట; దేశీయముల వాడుట; అపూర్వోపమానములఁ జూపుట, సహజములై యున్నటులఁ గనిపించును. ఉదాహరణముగఁ గొన్నింటి నీ క్రిందఁ జూపెదను.

పదకల్పనములు:— జీవత్తాత పాదుండు; తేజూహూన; జాతిమాత్రోపజీవి; బ్రాహ్మణ బ్రువుండు; పూర్వద్విజన్ముఁడు; యిత్యాదులు.

సామెతలు:— పులుఁగడిగిన ముత్తెము; కర్ణునిలో భారతము; తలలో నాలుక; పూసలలో దారము; తేనెపూసిన కత్తి; పూలుమడిచిన యూరనే కట్టెలమ్ముట; గుడినుండి గుడితాళ్లు దీయుట; ఆకుమడుగు పిందె; యిత్యాదులు.

దేశీయములు:— చుక్క తెగిపడిన యడుగున; కంటనత్తిడుకొని; అమ్ముడు వడుట; తేరకు తేరదక్క; కంచంత కాపురము; పాలవంటి కులము; ఊచిముట్టు; యిత్యాదులు.

అపూర్వోపమానము:— ఉరగ దష్టుని మేని నెత్తురువు పోలె.

ఇట్టివన్నియు నితని కావ్య లక్షణముల విమర్శించి యీతని యసమాన ప్రతిభను నిరూపింప వచ్చును. గ్రంథ విస్తర భీతిచేఁ దక్కుంగల యంశములఁ బాఠక మహాశయులకే వదలి యింతటితో విరమించువాఁడ.

# ప్రణయలేఖ

నండూరి కృష్ణమాచార్యులు

చూపులోనన హృదయంబుఁ జూరఁగొనిన
మగువ! నీ సోగకనులకు మంగళంబు.
పలుకుపలుకుకె ప్రేమంబుఁ గలుగఁగొనిన
బాల! నీ ప్రజ్ఞ కనిశంబు భద్రమగుత.
దేవనిర్ణీతమైన ఆ దినమునందు
తలవని తలంపుగానంతఁ గలయుమనము
నీయపాంగవీక్షణములో నీరజాక్షి!
ప్రేమవిత్తుల నాటదిఁ బ్రీతిజల్లె.

సర్వజీవుల ముగ్ధుల సలుపునీదు
మృదులహాసంబులోని యమృతము గ్రోలి
మొలకలెత్తిన విత్తులో కలికివన్న
కాలవశతను దీగెలఁ గలుగసాగె.
బాపురే! రేపు, మాపు, నీ చూపుఁబవపి
ప్రేమవల్లికనింకను బెరుగఁ జేతొ!
లేక, దాని వ్రేళ్లనె పెకలించి వైచి
యిఁ త్రిశక్త్యాత్మనంచును దెలియఁ జేతొ!

# పరమాణువులో మేజువాణి

సిరుగూరి జయరావు

తే.గీ. ఒత్తు కరతాళ మొనరింప, నొర్తు సమద
గీతి పచరింప, నగి తాళగింప నొర్తు,
మధురమదిరారసోల్ల సమత్తయగుచు,
నాడెనొక్కతె లలితాంగి హారగతుల.

—ఎఱ్ఱాప్రెగ్గడ.

సంఘసంస్కారకులు విజృంభించి, దేశమునంతయు బాగుపఱచి, భోగమువాండ్రకు వృత్తిమాన్పించి, మేజువాణిలను మారుమూలలకు త్రోసివైచి యప్పుడే పాతికవత్సరములు దాటినవి. అక్కడక్కడ నలుసులు మిగిలెనా, మహాత్ముని మొన్న మొన్నటి చీవాట్లముందవి నదృశ్యములాయెనని చెప్పవచ్చును. అనగా శ్రీరామనవమి పండుగలలోఁ గాని, కొందఱు సామంతుల యిండ్లలో శుభకార్యములకు గాని, కృష్ణానది కవతలయట్టును గోదావరీ నదికివతల యట్టునకైనను సరే మేళములు వచ్చుటలేదని కాదు; కాని సశాస్త్రీయమైన నాట్యకళను రసికశిఖావతంసుల సాహాయ్యము చేతను, ప్రజాబాహుళ్యము యొక్క యంగీకారము చేతను, అభ్యసించి ప్రకటింపఁగల మేజువాణిలకు నేఁటి యాంధ్ర దేశము చోటు కాదు.

కాని, రసికులపుణ్యము బాగుండుటచే సంఘసంస్కారకుల కలభ్యమైన చోటొక్కటి యున్నది; ఈ చోటిన్నాళ్లవఱకు రహస్యముగా నుండెను. వీరేశలింగము గారికి చోటు తెలియకుండెను గాని, లేనిచో రాజమండ్రి విద్యార్థుల సాహాయ్యముతో నచ్చటి నుండికూడ నాట్యకళను నశింపఁ జేసియుందురు. జనమేజయుని సర్పయాగము తరువాతఁ దక్షకుఁడొక్కడు దేవేంద్ర లోకములో మిగిలినట్లు వీరేశలింగముగారి తీవ్రసంస్కారముల తరువాత నీయొక్క దివ్యమైన మేజువాణి మాత్రము మిగిలినది

ప్రవరుఁడు పట్టి యమాయకుఁడు; కొండలు, కోనలు చూతమని, చెఱువులు, దొఱువులు చూతమని; పాదలేపము పూసికొని, 'ఎసవల్చ బాలకుని' లేత డెందముతో బయలు దేఱినాడు. పర్వతములను జూచి పట్టలేని సంతోషమును పొందినాడు. "తలమే బ్రహ్మకునైన నీ నగమహత్వం బెన్న?"— అని భావుకవిశ్వములోనికి దిగినాడు. ఒంటరిగా నుండెను కనుక, ఐదుపు, మదుపు, లేక, మోతాదుగా రసికవర్ణనల లోనికిఁ గూడ దిగెను:

"పసుపునిగ్గులు దేఱు పాంచజన్నిద మొప్పఁ
బ్రమదాధిపతియింటి పట్టిరింగ."—

ఇంకొక మెట్టునకుఁగూడ నెక్కెను:—

"కచికీంతఁగ అవుచుఁ జదలేట సురరాజు
జలకేళి సవరించి చెలువెఱింగ."

మఱొక్క మెట్టుకూడ నెక్కును.

"పుచ్చడీకతనంబు బోఁబెట్టిగిరి కన్య
పతిఁగొల్వనాయాన పడినచోటు"

అబ్బో! ప్రౌఢకాంత పైఁబడనున్న నో మఱింత ధైర్యముకూడఁ జూపఁ గలడు:—

"తపసిముల్లాంద్ర చెలువంబు తలఁచితలఁచి,
మున్న ముచ్చిచ్చునువిగాలి గొన్నచోటు"

ఈ ఐయసుమీఱిన బాలసునకు పాపలేపము కలిగి నోవుఁటలోనే గుండెలో జాయిపడెను, దీనికి తోడు, ఘుమఘుమ పరీమళములతో, మృదుమధుర గానవిలాసములతో, శృంగార రసాధిదేవత ప్రత్యక్షమాయెను. ఆ ప్రత్యక్షమైన దెట్లు? భయము, నయములేక, సిగ్గువిడచి చిఱుఁ ద్రొక్కుచు—

"అబ్బురపాటుతోడ నయ
నాంబుజముల్ వికసిల్లఁ"

అప్పుడే ప్రవరుని కాళ్లలో సత్తువ మాయమై పోయినది!

"కాంతి పెల్లుబ్బ, కనీనికల్ వికసితోత్పల
పంక్తులఁ గ్రుమ్మరింపగా."—

అయ్యో పాపము! గ్రుక్కిళ్లు మ్రింగుచున్నాడు. ఆపైమాట చెప్ప నక్కఱనే లేదు.

తరువాత జరిగిన యుదంతమందఱకును దెలిసినదే. ఆ ఛాందసపు బ్రాహ్మణుని బట్టుకొని యామె నానా కేటాలు పెట్టుట, అతఁడు వెఱ్ఱివానివలె 'నిశ్చేష్టుఁడై నిలచొనుట—'ప్రాంచద్భూషణ బాహుమూలరుచు'లతో నామెయనుట.

ప్రవరుఁడు 'సత్యకాలపు మనిషి' కనుక, వేళకు సరిగా నగ్నిదేవుఁడు వచ్చి రక్షించినాఁడు. కాని, యుపోద్ఘాతమును త్వరగా ముగించుటకై యడుగుచున్నాను;— మనలో మాట—; ఈ సందర్భముగాని కలికాలములో మనకెవ్వరికైనఁ దటస్థించినచో—అగ్ని దేవుడు రక్షించుటకు రాఁడని తెలుసును గదా. అప్పుడీ వరూధిని నెట్లు తప్పించుకొనఁ గలము? ఎన్నియత్నములను జేసినను, అర్జునుని నూర్వశి బంధించినట్లు, మనల నెత్తుకపోయిన చో నేమి చేయగలము. అగ్నిహోత్రుఁడు రక్షించుటకు రాని కలికాలములో వరూధిని వంటి యప్సరసలు మాత్రము ప్రత్యక్షమయ్యెదరా? యని ప్రశ్నింతురేమో?— అయ్యా; ఒక్క వరూధిని కాదుకదా, నాకలోకములోని నాగవాసమంతా గూడ మాకుఁ బ్రత్యక్షమాటచేతనే యింత ప్రస్తావన చేసితిని.

వీరేశలింగము గారికిఁ దెలియకుండ నిన్నాళ్లు రహస్యముగా రక్షింపఁ బడిన చోటున్నదని చెప్పితినే—అచ్చటనే యిటువంటి నాగవాసమున్నది. వరూధిని, రంభ, మేనక, ఘృతాచి, తిలోత్తమ......అందఱు నచ్చట నున్నారు. వారే వీరో, లేక కారో, నిజముగాఁ జెప్పలేను కాని, యూహించినాను. ఇంత దివ్యమైన నాగవాసము నాకలోకము నుండి తప్ప మఱెచ్చట నుండి వచ్చును? విశ్వామిత్రుని మాతంగ కన్యలు కారు సుమా! అసలైన యప్సరోమణులు. ఇందులకు నిదర్శన మేమనఁగా వారి పాదములు భూమి నంటుటలేదు, ఆకాశములోనే యున్నవి.

కలా స్వప్నములోఁ గలవరించుచు నవకతవకగా లేనిపోని సంగతులను సృష్టించి పలుకుచున్నానని తలఁతురేమో? సావధాన మనస్కులై నా కథయంతయు విన్నచో నిజమో యబద్ధమో మీకే తేఁటతెల్లమగును.

ప్రవరుని వలెనే నేనుకూడ మా గ్రామములోఁ గూర్చొని యుంటిని; హోమము, జపము, తపము, నిష్ఠ, నియమము, సచ్ఛాత్రులు, నదీస్నానము, అన్నదానము, అతిథి పూజ.—ఇటువంటి సమయములో నొక వైరాగి వచ్చెను. తెల్లని మైచాయ, పుష్టియైన కాయము, వికసించుచున్న ముఖము—ఇతని నాదరించి, యే యే దేశములను జూచితివని యడుగగా నిట్లు బదులు చెప్పెను:—

"అయ్యా! భూలోకము, భువర్లోకము, సువర్లోకము మొదలైన లోకములను జూచితిని. జంతులోకము, పక్షిలోకము, క్రిమిలోకము చూచితిని. బ్రహ్మాండ లోకము, పరమాణులోకము చూచితిని. అక్కడ నున్న యానందములన్నింటి ననుభవించితిని—" ఇతఁడీ ధోరణిలోనికి దిగుటతోడనే నా శరీరము వణక సాఁగెను. మనుష్యుఁడా, దేవుఁడా, దయ్యమా, యని యనుమానించి, "మీరె

దేశములయ్యా! మీ ప్రాయపుం జిలుకతనంబు మీ మొకము చెప్పకయే చెప్పుచున్నది. అది యటుండగాక మానవ లోకములో నున్న మీరిన్ని విచిత్రలోకముల నెట్లు చూచితిరి'' అంటిని. అతఁడిట్లు చెప్పెను:—,,నిజముగ నేను మానవుఁడను కాను. నేనొక మహాశక్తి స్వరూపము. నా యొక్క యంశలు భూలోకములో వేలువేలు రూపములగ నవతరించుచున్నవి. కలికాలములో విజ్ఞాన రూపమును ముఖ్యముగా ధరించినవి, పక్షపాత బుద్ధిలేక, ప్రతిదేశములోను నా యంశలను బాపినాను. హిందూ దేశములో జగదీశ చంద్రుఁడు, జపానులో నాగాకా, జర్మనిలో యైన్‌స్టైన్, ఇంగ్లాండులో రూథర్ ఫోర్డు, డెన్మార్కులో నీల్స బోరు—(మచ్చునకుఁ జెప్పుచున్నాను) ఇట్లు ప్రతిదేశములోను నా యంశ లవతరించి, విచిత్ర విజ్ఞానమును గ్రహించి లోకమున కభ్యుదయము కలిగించుచున్నారు. నేనిన్ని లోకములను దిరుగుటకు నా కొక పాదలేపమున్నది. ఈ పాద లేపమును బూసికొన్నంతనే తలఁచిన చోటునకెల్ల నాల్గవ పరిమాణము ద్వారా క్షణాలలోఁ బోవచ్చును. ఈ నాల్గవ పరిమాణమును గురించి యైన్‌స్టైను మొదలైన వారి కింకను బాగుగాఁ దోపలేదు. దానిని గురించి, కాలమని మింకాస్కీ, మనస్సని మతెరుండు,—ఇట్లు వివిధములైన యూహలను బొందుచున్నారు. కాని నిజము తెలియుటకుఁ బ్రత్యక్షానుభవము కావలెను. ఇదిగో, నీవు పూసికొనుము'' అని పాదలేపము పూసి యదృశ్యమాయెను.

నా యొడలంతయు గడ గడ వణక సాగెను. ఈ మహామాయ యేమిటో గ్రహింపలేక పోతిని. పాదలేపము పూసినాఁడుకదా, ఇవు డెచ్చటకునైనఁ బోవుటకు యత్నించితినా, ప్రవరునికి గలిగిన దురదృష్టమే కలిగిన చో? కాని మనస్సు గట్టిపఱచుకొని, యేమిజరిగినను సరే, ఈ తమాషా చూడక తప్పదని నిశ్చయించితిని. ఎచ్చటకు బోవుదమాయని యాలోచించితిని. పాపము ప్రవరుఁడు హిమాలయములకుఁ బోయెనుగాని, నేటి దినముల లో రైలుబండ్ల నెక్కినచో నట్టె పోవచ్చును; గాలి విమానముల నెక్కినచోఁ జెప్పనే యక్కఱలేదు. కనుక భూలోక యాత్రను మనసులో నెంచుట మాని వేచితిని.

బ్రహ్మండలోకమునకుఁ బోవుదమా? యనుకొంటిని, కాని యక్కడనుండి వచ్చి యక్కడి సంగతులను జెప్పినచో భూలోకములో నెవ్వరును నమ్మరు. ఇది కలికాలపద్ధతి. ఆలివర్ లాడ్జిగారు చచ్చిపోయినవారి భూతముల తో మాట్లాడుచున్నారఁట, గాని యీసంగతిని జనబాహుళ్యము నమ్ముటలేదు. అందుచేత నేను శ్రమపడి బ్రహ్మండలోక సంగతులను వర్ణించినచో భూమిలో నాకుఁ గీర్తి రాదని యెంచితిని. వినచో నెచటకుఁ బోవుట? ఆ! జ్ఞాపకమునకు వచ్చెను; ఈకాలములోఁ బరమాణువును శ్రద్ధతో విశర్కించుచు, దానిని గురించి నేర్చుకొనుచు, శాస్త్రపరిశోధనముఁ జేయుచుఁ జాలమంది పాశ్చాత్యులేమి, ప్రాచ్యులేమి, శ్రమపడుచున్నారు. కనుక నే నీ పరమాణువులోనికిఁ బోయితినా, యిచ్చటి సంగతు లన్నిటిని చెలిసికొన వచ్చుననియు, ఈసంగతుల నందరు నమ్మెదరనియు, అందుచే నాకు శాశ్వతమైన కీర్తి వచ్చుననియు నిశ్చయించితిని. కన్నులు మూసికొని ,,పరమాణువులోనికిఁ బోయెదగాక'' యని ధ్యానించితిని.

పాదలేపము పనిచేసినది; దేహము మిక్కిలి వేగముతోఁ బోవుచున్నట్లు తోఁచినది. ఇంతలో భూమి లోని వస్తువులన్నియుఁ గ్రొత్తమోస్తరుగాఁ గనబడఁ జొచ్చెను. ఆ మనోవేగము వలనఁ గలిగిన మొదటిమార్పేమనఁగా, నేనంత వేగముతోఁ బోవుచున్నను, భూలోకమంతయు వేగముగాఁ దొలగిపోవుచున్నట్లు నాకుఁ దోఁచెను. (రైలుబండిలోఁ బోవుచున్నప్పుడు, ప్రక్కనున్న చెట్టుచేమలు వేగముగా బోవుచున్నట్లు కనుబడును కదా) కాని, యిప్పుడొక పెద్ద గమ్మత్తు జరిగెను. అదేమనగా:——భూలోకము తొలగిపోవుచున్నప్పుడు, దూరముగా బోవుచున్న కొలది చిన్నదియై కనుబడవలెను కదా. మంచువాని యాకాశములోనికి నెగిరి వసురావద్దకుఁ బోవుచున్నప్పుడు భూలోకములోని వస్తువులన్నియుఁ జిన్నవిగాఁ గనపడెను.

తే॥ కొండలచ్చనగండ్లయి, నింకుచేలుపు
లెల్ల నద్దంపు బిల్లలై, యేర్లు ముత్తి

యంపు సరులై, యరణ్యంపు గుంపులెల్ల
నారులై, తోఁచెఁ బొడుపున, నారులార!

కాని, ఈ ప్రకృతి సిద్ధాంతమునకు విరుద్ధముగా, భూలోకము చిన్నది యగుటకు మాఱు పెద్దదిగాఁ బెఱుగుచున్నట్లు తోఁచెను (తరువాత నా శిష్యులు చెప్పిరి; వారికి నేను పెద్దగాఁ బెఱుగుచున్నట్లు కన్పించితినఁట. కొంత కాలమునకు మాయమై పోయితినఁట!)

ఇప్పుడాశ్చర్యము లోనికెల్ల ఘనమైన ఆశ్చర్యము కలిగెను. మహా మాయ గారడీ జఱిగెను. ఉన్నట్టులే యుండి— కొండపైన నున్న వాఁడు జాఱి పోయినచోఁ జఱియ మీఁదనుండి యెట్లు జాఱునో, అట్లే యాకసములో నున్న నేను ఎట్లో జాఱిపోవుచున్నట్లు తోఁచెను. అప్పుడు భూలోకములోని వస్తువులన్నియు బహుచిత్రముగా గన్పించెను. కొండలు, మనుష్యులు, ఇండ్లు యివన్నియు విపరీతముగ గనుపించెను; వారియాకారము మునుపటి వలె నేలేదు! పొడవుగాను సన్నముగాను ఉండవలసిన చెట్లన్నియు వెడల్పు గలిగి, తెఱలవలెఁ గనుపించెను. తెఱలు, గోడలు మొదలైన వన్నియు మునుపటి వలె నుండుటకు మాఱు, విస్తారము దళసరిగాఁ బెఱిగి, దిమ్మలవలెఁ గనుపించెను. కొండలు, ఇండ్లు మొదలైన దిమ్మలవంటి వస్తువులో— నాల్గవ పరిమాణములోనికిఁ బెఱిగి, వింతగా, గనుపించెను. కాని వానియాకారమును నేను వర్ణింపలేను; చూచి తీఱవలెను. ఇదే కాఁబోలు నాల్గవ పరిణామము ద్వారా పోవుటయని యప్పుడు తలచితిని.

అంతలో నొక సుంద్రని సభామందిరము కన్పించెను. అక్కడకు వచ్చునప్పటికి నా వేగము తగ్గిపోయెను; కనుక నదే పరమాణువని తెలిసికొంటిని.

నా శరీరమంతయుఁ బులకరింపఁ దొడగెను. మధుర పరిమళములు ఘుమఘుమలాడుచు నమితానందముఁ గలుగజేయుచుండెను. అతిమంజులమై, పారవశ్యము ను గొల్పుచు, నవీన మనోహర భాషలో నత్యద్భుతగానము వినవచ్చుచుండెను. ఆ గానముతోఁబాటు, దివ్యాభినయముతో, దేదీప్యమానప్రభలలో నిర్వర్ణనీయావేషముతోఁ, గొంద అప్సరోమణులు నాట్యమాడుచుండిరి. ఆ గానమునకు, ఆ నాట్యమునకు, నా శరీరమంతయు గగుర్పొడిచెను. ఇంతలో నొక వింత జరిగెను. నా చేతులు, కాళ్ళు మొదలుగా శరీరమంతయు మెల్లగాఁ గరగి పోవఁదొడగెను. "రహిపుట్ట జంత్రగాత్రముల 'క్రాల్గరిగించు విమల గాంధర్వమునకు" నా శరీరము కరగుట వింత కాదు. ఇంతలో నా శరీరమంతయు కరగి, మాయమై పోయెను. కేవలము సచ్చిదానంద రూపముతోఁ జూచుచుంటిని.

ఆ పరమాణుగోళము యొక్క పరిమితి చెప్పుట కష్టము. కొంతసే పూర్వమున కెగసి, యనంతాకాశమును వ్యాపించియుండెను. అందులోని యప్సరసలు కూడ ననంతముగా బెఱుగుచుండిరి. ఇంతలో నా పరమాణువు సూక్ష్మమై, సూక్ష్మతమమై నలుసుగాఁ దోఁచెను. దానితో పాటు అప్సరసలుకూడ నలుసుగాఁ బరిణమించుచుండిరి. (నేను కరగిపోతిని, కనుక, సచ్చిదానంద రూపినై యామార్పులను గనుగొంటిని. లేనిచో, నేనుగూడ నామార్పులనే వానితోఁగూడఁ జెంది, యామార్పులు కలుగుచున్నట్లు గ్రహించుకొనలేక పోయి యుందును. దీనినే భూలోకములో యైన్‌స్టైను తన రెలటివిటీ (తారతమ్య) సిద్ధాంతములో సూచించి యున్నాడు.)

ఆ సభామందిరమునందు నొక మణిమయఖచితమైన మండప ముండెను, ఆ మండపము మధ్య నిద్దరిద్దరు కూర్చుండుటకుఁ దగిన యాసనము లుండెను. ఆయాసనములలో నొక్కొక్క యప్సరసయు నొక్కొక్క దేవతా పురుషుఁడును దోఃప్రసంగ లీలావిలాసులై యైక్యత వహించి, తక్కినవారి నాట్యమును వీక్షించుచు, "యానందో బ్రహ్మేతి" లో మగ్నులై యుండిరి. వీరు కూర్చొనిన యాసనములును, సభామండపమును, ఘనమై బరువుగా నుండనోపును. కాని దేవతా పురుషులును, అప్సరసలును, చాల తేలికగా నుండుటచేఁ గాబోలు, చకచకలాడుచు దిరుగుచుండిరి.

సభామండపమును జుట్టుకొని సుంద్రని యావరణముండెను: ఈ యావరణపైఁ గొందఱు దేవతా పురుషు లేకాకులై కూర్చొనిరి; ఆతుర హృదయములతో నప్సరసలను జూచుచుండిరి. ఎంతమంది యప్సరసలు

నాట్యమాడుచుండిరో, అంతమంది దేవతా పురుషులే ప్రేక్షకులై కూర్చొనిరి.

శ్రావ్యమైన మృదంగాల గానముతో, కన్నుల మిరుమిట్లుగొలుపు నర్తనపు చాకచక్యములతో, లలిత తనూ విలాసములతో, అప్సరసలు నాట్యమాడుచుండిరి. వలయాకారముగ సభామంటపము చుట్టును దిరుగుచు నాడుచుండిరి. ఒక్కొక్క యప్సరసయు వేరువేరు వలయములో నాట్యమాడుచుండెను.

సాధారణముగాఁ దమ తమ వలయములోనే యొక్కొక్క యప్సరసయుఁ దిరుగుచుండెను. కాని యున్నట్టుండి, తన నైసర్గిక వలయమును విడచి, యింకొక వలయములోనికిఁ దటాలున గంతులిడి, యచ్చట మరల వలయముచుట్టును దిరుగుచుండెను. ఎట్లు గంతులిడినో, మాత్రము తెలియకుండెను; ఎందుచేత ననఁగా, ఒక వలయమునుండి యింకొక వలయమునకు గంతులిడునపుడు, ఒక విధమైన కాంతి తటాలున నుత్పన్నమగుచుండెను. ఆ కాంతి నా కన్నులకు మిరుమిట్లు గొలుపుటంతలో నొక వలయమునుండి యింకొక వలయమునకు నా యప్సరస గంతులిడుట తటస్థించుచుండెను. ఈ కాంతిలోఁగూడ నొక వింత గనుపడెను. ఒక్కొక్క యప్సరసకు ఇట్లు గంతులిడునపుడు ప్రత్యేకించి యొక్క రంగుతోఁగాంతి వచ్చుచుండెను. ఇంతేకాక నొక వలయమునుండి యింకొక వలయమునకు గంతులిడునపు డుత్పన్నమైన కాంతికిని, యా రెండవ వలయమునుండి మూడవ వలయమునకు గంతులిడునపుడు కలుగు కాంతికిని, రంగులో భేదముండెను.

ఆనందలహరీనిమగ్నులై యప్సరసలు పాడుచు నాడుచుండిరి. దేవతా పురుషులు వినుచు నానందించుచుండిరి; ఇంతలోఁ దటాలున నొక యప్సరస కేక వైచెను. మాయమై పోయెను. 'Ionised' అని కేక వినవచ్చెను. ఈ కేక మనుష్యశబ్దమువలె వినిపించెను. తక్కిన యప్సరసలు మునుపటి వలెనే యాడుచుండిరి. దేవతా పురుషులలో నొక్కనికి మాత్రము పట్టరాని రోషము వచ్చెను. తీక్ష్ణదృష్టులతో నిప్పులు గ్రక్కుచు, కరవాలముదూసి నిలచొనెను. ఆకోపముతో, ఆయుద్రేకముతో, ఆ విజృంభిత వ్యక్తితో, ఏమిచేయ నెంచినాడో తెలియకుండెను. కానియతని భావోద్రేకము చేతఁ బరమాణువున కంతకు నొక విధమైన యావేగము జనించెను.

కొంతసేపటిలో, మాయమై పోయిన యప్సరస ప్రత్యక్షమాయెను. 'Neutralised' అని తిరిగి మనుష్యశబ్ద మెచ్చటనుండియో వచ్చెను. ఉద్రేకము వహించిన దేవతాపురుషుఁడు శాంతుఁడయ్యెను. పరమాణువులోని మేజువాణి యెప్పటియట్లు మంగళకరముగా జరుగుచుండెను.

ఇంతలో నున్నట్టుండి సభామందిరములోనికి నెచ్చటనుండియో యింకొక్క యప్సరస వచ్చెను. 'Ionised' అని మానవ శబ్దము వినవచ్చెను. ఈ యప్సరస క్రుద్ధానయై యేతెంచెను. విరహకాతరయై, భయార్తయై, రోషభూషితయై, ఆ యప్సరస నాట్యమాడుచుండెను.

ఆలకించుచుంటిని, ఆలోకించుచుంటిని. ఆనందానందసంభరితుఁడనై యుంటిని. తటాలున నొక గొప్పకాంతి తళుక్కుమని కానుపించెను. అదలి యులికిపడి లేచితిని. కన్నులు నలుపుకొనుచుంటిని.

"ఏం దొరా! సీకటయింది. అందరుపోయి శాన సేపయింది. ఇక్కడనే సీకట్లో కూకింటివి? బిజిలీ వెలిగించకుండా ఉంటివి? ఏం సేత్తున్నావు దొరా!"

వాఁడు కళాశాలలోని పహారా జవాను. నేను చీఁకటిలోఁ గూర్చొని, యాలోచనా నిమగ్నుఁడనై యెంత సేఁపటినుండి యుంటినో, వాఁడువచ్చి విద్యుద్దీపమును వెలిగించెను. నా ముందఱ బల్లపైన రంజనకిరణ గోళము (X-ray bulb) ఉండెను. (పగలంతా ప్రయోగించి యుంటిని. చేతిలోఁ గల మున్నది; కొన్ని కాకితములపైన వ్రాయుచుండఁగా, ఆలోచనా నిమగ్నుఁడనై, భావనాలహరీడోలికాందోళితుఁడనై యుంటిని కాఁబోలు. పహారాజవాను దీపము వెలిగింపగనే మెలకువాయెను.

లేచి, వానిని బంపివేసి, కాకితములను బూర్తిగా వ్రాసి, గది తాళము వేసికొని, యింటికిఁబోతిని.



# "శశిరేఖ విమర్శనముపై"

తె. వేం. రామమూర్తి

శ్రీ వేంకటాచలంగారి శశిరేఖగూర్చి 'విమర్శకుడు' విమర్శనాసాంప్రదాయాల ననుసరించి అవతారిక; కథాసంగ్రహము, పాత్రపోషణ, భాష, భావముల విచారణ, మొదలైనవాటితో క్రిందటి సంచికలో విమర్శ యత్నించారు. కొంతవరకు కొత్తగా నేవుంది. విమర్శన గ్రంథకర్త భావాలు, అనుభవాలు; ఆదర్శాలు, యితర వుద్దేశాలు గ్రహించడానికి తగిన సానుభూతి చూపుతున్నట్లు కనపడలేదు. వేంకటాచలంగారి యితర గ్రంథాల్లోంచి కూడా విమర్శకుడు కావలసిన విషయాలు ఎత్తుకుంటే ఎల్లావుండేదో! ఈయన చేసే „సాహసాల గూర్చి యింకా విపులంగా వర్ణించడానికి వీలయ్యేదేమో!

కథాసంగ్రహములో కథకుని వ్రాసిన ప్రకారము శశిరేఖ చేష్టలన్ని ప్రేమక్రిందే వర్ణించి, శశిరేఖ పాత్రమును విమర్శించుతూవున్నప్పుడు అవకాశము ఎల్లాగ చిక్కుతుంది గనక ఆ 'ప్రేమ' కామాస్పదమే అని విపులపరిస్తే విమర్శకుడు కొంతవరకు గ్రంథమును ఖండించపోవు ఉద్దేశము కాదని; క్రొత్త గ్రంథాలు వచ్చేప్పుడు వాటిని విమర్శించడము బాధ్యతగా గ్రహించినట్లు చూపట్టినందున. గ్రంథములో ఎక్కడైనా, ఏమైనా సుగుణములుంటే వెలిపెట్టడముకూడా బాధ్యతే. యీ పుస్తకములో ఏమీ లేకపోవచ్చు.

శశిరేఖ పాత్ర చిత్రించడములో గ్రంథకర్త అభిప్రాయ మేదిటో కనిపెట్టడానికి యత్నింపక పోవడము పొరపాటు లాగుంది విమర్శనలో. 'శశిరేఖ' చదువుతూవున్నంతసేపూ వ్యక్తికి, సంఘానికి వున్న సంబంధాలు ఒకరిపై ఒకరి కుండవలసిన బాధ్యతలు, నీతికోసరము సంఘము వ్యక్తులనణగ ద్రొక్కవలసినదా? అనేసమస్యలు (Individual vs Society) వివాహము సంఘాన్ని ఉద్ధరించుతూవున్న ఒక ఉద్యమముగా ఎంతవరకు అవశ్యప్రాయమై వుంటుందో. అన్న విషయాలు ఎన్నో ప్రశ్నలు నవస్తాయి, మన్ని కలవరపడుస్తూ, మనలో ఎన్ని తరాలనుండో జీర్ణించుతూవున్న నీతి భావాల మీదేక పడుస్తూ. యీయిన ఒక్కరినేకా దసలు యీ సమస్యలు దేశదేశాలని క్షోభపెట్టుతూవున్న మహాసమస్యలు. అవేవీకూడా ఎత్తుకోడానికైనా సాహసము లేకపోతే శశిరేఖ విమర్శన చాలా లోటుగా కనపడుతుంది.

కథంతా క్లుప్తంగా చెప్పడములో అక్కడ కథ అవుసరము విమర్శకుడు గ్రహించినట్లే కనపడదు. విమర్శనలో కథ అవుసరమేంటి? స్వేచ్ఛగా కృష్ణుని ప్రేమించిన శశిరేఖ సౌందర్యదేవతాలింగనమునకు తలిని, మర్యాదని, సంఘాన్ని, తలిదండ్రులని, గృహాన్ని, భర్తని, బలిఅర్పించి, ఆత్మానుసౌందర్యమున ఆమెగన్న శాంతి ఎంతవరకు Psychological గా గాని, logical గా గాని, క్రమముగా, వ్యక్తి ధర్మము ప్రకారము సంభవాసంభవాల కోవిదీకరిస్తూ, విచారణలోకి తీసుకురావలసింది. అసలా ధోరణేలేదు. ఆఖరికి యిదంతా కామమని, ఋషులు, మాతృభాష కాసించు ప్రేమ కాదని చెప్పి విరమించడము రసవంతము గాలేదు.

'ప్రేమ భావరహస్యముల జవిచూచునది' అనగా! ఎవరి భావరహస్యములను? భర్త అనే వ్యక్తి భావరహస్యాలనా, లేక మరికొక యితర వ్యక్తుల భావరహస్యాలనేనా? దేహసుఖ మపేక్షింపకుండా భావరహస్యాల చవి చూస్తూ ఆనందిస్తూంటే ఎంతమందిని ప్రేమించినా ఒప్పుకో వచ్చునేమో! ద్రౌపది ప్రేమస్వరూపిణి. అయిదుగురు భర్తలున్నప్పుడు వారందరి భావరహస్యాలు చవి

చూసింది. ఆ తృష్ణలో అందరిని ఒక్కమారే. ఋషులు రసవత్కావ్యములు, మాతృభాష శాసించిన ప్రేమ.అది. మీదు మిక్కిలి వివాహబంధము కలది, వివాహముందిగా సంఘాని కాదర్శ ప్రాయంగా, ఎన్నిలోటు పాటులున్న సమర్థించడానికి. వివాహితులు ఒకప్పుడు భర్తకాని వేరొకని కోరినా అది ప్రేమగా గుర్తించవలసి వుంటుందేమో? అయినా అట్లా భర్తని తప్ప యితరుల ననుభవించే ఆడవాళ్లుగాని, అసలు మనసులోనైనా కోరేవాళ్లు గాని, సంఘం వున్నంతవరకూ వుంటారా? కామము అసహజము, అస్వభావము, అవినీతి, అసహ్యకరము—? శశిరేఖ ఒకరి తరువాత ఒకరి చేరదీసింది. ద్రౌపది ప్రేమలో నే ఆరవవాడిని కోరుతుంది. శశిరేఖ కామములో విచక్షణతో, సుందరరావు దూరాన్నుంచి స్వేచ్ఛకి భంగంవచ్చినప్పుడు సహాయమయ్యాని యీ లోకములో తనకు నిర్జీవమై, తన్ను దూరాన్నుంచే లోకాన్ని చొచ్చింది, ఒంటరిగా, అసహాయిరాలై.

యిల్లాంటి శశిరేఖకి కలలో స్వర్గమిచ్చ్యడము గ్రంధకర్త సాహసము. నిజంగానే స్వర్గమొస్తే విమర్శకుని సాహసమెట్లావుండేదో, తన సంఘాన్నంతా నెత్తికెట్టుకొని దేవుణ్ణెదిరించేవారేమో?

“ప్రేమకూ లక్షణములేవియో తెలిసిన కామోన్మాదమును ప్రేమయనరు” ఆ లక్షణములేవో? ప్రేమానికి, కామానికి ద్దూరమెంతో? కామము కాని యౌవనోద్రేకము, యింద్రియ సుఖము, పిల్లలకనే ప్రేమ ఎట్లావుంటుందో? అసలీ కామము సంఘములోవుందా? కామబీజములో నంకురించేప్పడికప్పుడే ,సంతలో గుడిసె వేసుకొని అంకుటాంగ్రు’ అవ్వునరేకాని, సంఘములోవుండి, సంఘమర్యాద ఆదరిస్తూ సంఘునిబంధనల పాటిస్తూ సహజమైన ప్రేమకలవారే స్త్రీలందరు. కామమెరుగుదురా, కామాన్నెడించేరా, అసలు కామమును గుర్తించారా? సంతలో గుడిసెవేసిన అంకుటాంగ్రు డబ్బుకోసము, పొట్టకోసం ఎవ్వరినైనా చేరనిస్తూ నిజమైన కామమా? కనబరిచేది. సంఘములోని స్త్రీలు యౌవనోద్రేకములో, చిత్తచాంచల్యములో కృత్రిమప్రేమా? చూపుతారు.

యిట్టి ప్రేమకు బలియై జీవితమును సంస్కరించుకొని తా మాచరించినది యుచితమెయని యౌవనోన్మాదమున దలంచు మహాయువతుల జీవితముల దీసుకొంటిమేని యిట్టి గ్రంథములు తనవిత్ లోకమున కల్పింపనవ్వును ?

ఎవరి తనవితీర? లోకము తనవి, అంతే తృష్ణవుందా? లోకానికి వున్నట్లు గ్రహించేరా? అయితే ఎందుకు యివ్వరాదో. కాక గ్రంధకర్త తనవితీరానా? ఇంతమంది మహాయువతులు సంఘము పరిపాలించే యీ లోకములోవుంటే వారి చరిత్రలేనా బయటికి రాకూడనివి. జరుగుతుండగా లేనిది తెలుస్తే నేమో పుస్తకాలు ప్రమాణములై పోతాయనే భయమా? విమర్శకులు Woman psychology లోకి యింకా వెళ్లి విమర్శించవలసు చింతగావుంది. అట్లా ‘ప్రేమకు’ బలియయ్యే కుల స్త్రీలు కూడా వున్నట్లు తెలియదో. తెలిసి కూడా ఒప్పుకోడానికి సిగ్గో. ఒకవేళ యీ వాక్యములో తనవితీర వ్రాయగల మిట్లాంటివారి మహాయువతుల జీవితములనడములో! ఒప్పుకుంటుంది సాధారణంగా ఆ ప్రేమకు బలియైన వాళ్లు యౌవనోన్మాదములోకాక జీవితమును సంస్కరించుకొని, సంసారాలగడుపుతూన్నప్పుడు ముఖ్యంగా తాము యౌవనోన్మాదములో అనుభవించిన ‘ప్రేమ’ చాలామట్టుకు మరచి పోడానికైనా ప్రయత్నిస్తారు. లేక పోతే కామము కాదని సమర్థించుకొని తా మొకరించినది యుచితమేయని తలంచుతారు అనే విషయము గుర్తించారేమో, విమర్శకుడు.

“ఆఖరివాక్య మర్థమవడములేదు. పీఠికాకారులచే నాగరసుల పతివ్రతలని పించినారు గ్రంధకర్త” అని అనడములో కుర్రవాడిని కూర్చొపెట్టి, ‘మద్దాయిల్లా వ్రాయి’ అని వ్రాయించినట్టు కాగకదవ్రాయించింది. పీఠికాకారుల అభిప్రాయములకు వ్యతిరేకంగా, తనకనుకూలంగా?

మళ్లి విపులంగా, వివిధవిషయాలు చర్చిస్తూ గ్రంధకర్తగారి యితర పుస్తకాలే విమర్శిస్తూ పాఠక హృదయాల పుష్పింప చేస్తారు విమర్శకులనే ఆశ.

# గ్రంథ విమర్శనము

## ధమ్మపదము

అనువాదకులు: కళాంబి రంగాచార్యులుగారు
ప్రకాశకులు: ఆంధ్రగ్రంథమాల, మద్రాసు.

వెల ౧—౧౨—౦

ఈ గ్రంథమును తెనుగువచనములో భాషాంతరీకరించి యున్నారు. శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు విపులమైన పీఠికను వ్రాసియున్నారు. కాని గ్రంథకర్తగారుగాని, పీఠికాకారులుగాని తమతమ పీఠికలలో పాలీభాషా విషయముగాని, ధమ్మపదమందలి బోధలను గురించిగాని, ధమ్మపదమునను సంబంధించిన బౌద్ధమతవిషయముగాని విశేషముగా చర్చించినవారుగారు.

హిందువులకు ప్రస్థానత్రయమెటులో బౌద్ధులకు త్రిపిటకములట్లు హిందువులకు భగవద్గీత యెటులో బౌద్ధులకు ధమ్మపదమట్టులే. బౌద్ధమతమునకు హిందూమతమునకు ఇటీవల మహాత్మాగాంధీగారు సెలవిచ్చినటుల విశేషభేదము లేదు. వివేకానందస్వామి బహుకాలము క్రిందటనే హిందూమతముపై తిరుగబడినబిడ్డ బౌద్ధమతమని నుడివియుండిరి. (A rebel child) అట్టియో బౌద్ధమత గ్రంథముల మనము చదివి వాని విశేషముల స్వీకరించుట మంచిది. బౌద్ధమతప్రారంభమునుండియు మన వేదాంతములపై వీని భావములు చాల మార్పులు కలిగించుచు వచ్చెను. భారతపురాణము ఇతిహాస సంబంధమైనదైనను దానికి సంబంధములేని శాంతిపర్వమును పూర్తిగా పెంచి వేదాంతోపదేశము చేసినది. అందు బౌద్ధసిద్ధాంతములు కొన్ని చొరబడినవి. అనగా మన పూర్వులితరమతములందలి యుత్తమ విషయముల తమ గ్రంథములలో చొనిపి యిదివిని సాధించుచుండిరి.

ధమ్మపదములోని యనేక శ్లోకములు శాంతి పర్వములోని శ్లోకముల బోలియున్నవి. ఒక యుదాహరణము గనుడు:—

> పుప్ఫాని హేవ పచినంతం వ్యాసత్తమనసంగరం।
> సుత్తం గామం మహోఘోవ మచ్చు ఆదాయ గచ్ఛతి.
>
> ధమ్మ. ౪౭ శ్లో.

> సుప్తం వ్యాఘ్రం మహౌఘోవా మృత్యురాదాయగచ్ఛతి,
> సంచిన్వానక మేవైనం కామానమవితృప్తికం.
>
> శాంతిపర్వము.

ధమ్మపద ౪౭ వ శ్లోకమును సంస్కృతము చేసినట్లున్నది.

„సుప్తం గ్రామం మహౌఘోవా మృత్యురాదాయగచ్ఛతి” ఇప్పుడు శాంతి పర్వములోని శ్లోకపు మొదటి పంక్తికిని దీనికిని నొక్క పదమందే భేదము. ఇందు „నిద్రించుచున్న గ్రామము” అను నుపమానము వాడియుండగా శాంతి పర్వములో „నిద్రించుచున్న వ్యాఘ్రము” అని ప్రయోగించినారు. ఇంతియ!

బౌద్ధమతము నవలంబించువారు మూడు విషయముల నమ్మవలయును. (౧) „బుద్ధం” శరణంగచ్ఛామి, (౨) „ధమ్మం” శరణం గచ్ఛామి (౩) „సంఘం” శరణం గచ్ఛామి. అని బౌద్ధమతస్వీకారమొనర్చువారు చెప్పవలయును. మఱియు (౧) ప్రపంచమంతయు బాధయున్నది (౨). ఈ కష్టములకు మూలము తృష్ణ (తన్హా) (౩) ఈ కామమును (మార) జయింపవలెను (౪) బుద్ధుడు చూపించిన ఎనిమిది మార్గములద్వారా దీనిని సాధించి నిర్వాణ (నిబ్బాన) మొందవలయును. అను నీ నాలుగంశముల నమ్మవలెను.

బౌద్ధమతమందు విశేషముగా శోకపద్ధతి (Pessimism) యున్నదందురు. ఈ విషయము ధమ్మపదమందలి ౧౧వ యధ్యాయమందున్నది. ఇందు "జర"ను గుఱించియున్నది. "భూలోకంబిట్లు నవతర ముదహింపబడుచుండ నెక్కడిదనో హాసము! ఎక్కడి దయో ఆనందము! తిమిరపరివృతుండవైన నీవెంతవలకు ప్రదీపంబు నన్వేషింపవు." అని ప్రారంభించియున్నదీ ప్రకరణము. ఈ భావములు మన వేదాంతమందు కూడ నిండిపోయినవి. పాశ్చాత్యులెట్లన్నను ఈ భావములందు సత్యము లేకపోలేదు.

ధమ్మపద మొక్కటే యననేల బౌద్ధ గ్రంథము లన్నియు మొదట పాలీభాషలోనే వ్రాయబడెను. ఈ భాష బుద్ధునికి బూర్వముండినటుల కానుపించదు. ఇది మొదట మాగధీభాషనుండి వచ్చెననియు, మగధ దేశమందు ప్రచారములో నుండెననియు పండితుల యభిప్రాయము. మఱియు నితర ప్రాకృతములలో నొకటి యనుటకు వీల్లేదు. మఱియు నితర ప్రాకృతముల కన్ననిది సులభముగా గ్రాహ్యమగుచున్నది. ఇందు సగము పదములు పూర్తిగా సంస్కృత పదములే. తక్కిన విశేష భాగము కించిద్రూప భంగములైన సంస్కృత పదములు గలది. శబ్దశాస్త్రజ్ఞులు "గ్రిమ్సులా" "వెర్నర్సులా" వంటికొన్ని సూత్రములు నిర్మించిన పాలీభాషను సంస్కృతజ్ఞులకు సులభసాధ్యముగా జేయగలుగుచున్నవి.

ఈ భాషలో నుండిన యీ ధమ్మపదమును యూరోపు ఖండవాసులెన్నడో తమతమ భాషలలో తర్జుమా చేసికొనిరి. జిజ్ఞాసువుల చర్యలిట్టివి! క్రీ॥ శ॥ ౧౮౫౫ లో నిది లాటిన్ భాషలోనికి రెండు మారులు తర్జుమా చేయబడెను. మఱియు జర్మను భాషలోనికి నలుగురు నాలుగుమారులు తర్జుమా చేసిరి. ఇంగ్లీషులో రెండు తర్జుమాలైనవి. మఱియు ఫ్రెంచి భాషలోను, ఇటలీ భాషలోను తర్జుమాలైనవి. సంస్కృతమున వెయ్యేండ్ల పూర్వమే తర్జుమా యయ్యెనట. దానినుండి చీనావారు తర్జుమా చేసికొనిరి. ఆంధ్రమందీ గ్రంథము లేదని పీఠిక వలన తెలిసెను. ఈ తర్జుమా సులభశైలిలో మూలమున కనుకూలముగా

డింది వ్రాయబడియున్నది. వచనముగుటచే స్త్రీ బాలుర సహితము దీని జదివి లాభము పొందవచ్చును.

> "యస్సింద్రియాని సమథంగతాని
> అస్సా యథా సారథినా సుదంతా।
> పహీన మానస్స అనాసవస్స
> దేవాపి తస్స పిహయంతి తాదినో॥"

ధమ్మపద ౯౪ శ్లో.

"సారథిచేత నశ్వంబులభాతి నిజేంద్రియంబుల నిగ్రహించి యెవ్వాడు నిర్గర్వియును, నిష్పాపుడును నగునో అట్టి వానింగూర్చి దేవతలు కూడ నీర్ష్య జూపింతురు" (తర్జుమా)

పై శ్లోకము భగవద్గీతలోని "ఆత్మానం రథినంవిద్ధి..............మనః ప్రగ్రహమేవచ" అను శ్లోకార్థమును ధ్వనించుచున్నది.

> "యంకించి యిట్ఠం వ హుతం వ లోకే,
> సంవచ్ఛరం యజేథ పుఞ్ఞపేక్ఖో;
> సబ్బంపితం నచతుభాగమేతి,
> అభివాదనా ఉజ్జుగతేసు సేయ్యో."

ధమ్మపద శ్లో. ౧౦౮

"పుణ్యాపేక్షతో నొకసంవత్సరము నుమ జుండకుండ కావించిన యజ్ఞగర్వమును లోకానైనను చేయుము. ధర్మపథములందలి భక్తి యాహ్లాదములలో శ్రేష్ఠతమము" (తర్జుమా)

ఇచ్చట మూలమందు పదములు భేదించినను భావమొక్కటే. మూలములో "పుఞ్ఞపేక్ఖో" అన "పుణ్యాపేక్ష" యని యగును. మఱియు "నచతు భాగమేతి" యన "చతుర్భాగమైన చేయదు" అని యగును. ఇదే ప్రకారము ౧౪౨వ శ్లోకమందు "సబ్బేసు భూతేసు నిధాయదండం" అనగా సర్వ భూతములందు దయగలవాడై యని యగును. "పరదోషాన్వేషణము కావింపకుండుట" యని తర్జుమాలో నున్నది.

ధమ్మపద విషయమై చెప్పవలసిన విషయములు అనేకములు గలవు. కాని యిప్పుడవసరము లేదు. భాషాంతరీకరణ ... ఆంధ్ర భాషలో బౌద్ధవాఙ్మయము యొక్క

విలువ హెచ్చునమట నిస్సందేహము. ఆంధ్రులు దీని వలన లాభము పొందుదురు గాక.

సు. ప్ర.

## శతక మంజరి. భక్తిసంపుటము

సంపాదకులు: శ్రీకాళీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు　వెల ౧-౮-౦

ప్రకాశకులు: ఆంధ్రగ్రంథమాల, మద్రాసు.

ఈ గ్రంథమందు ౧౦ శతకములు కలవు. అందు వృషాధిప, సర్వేశ్వర, శ్రీకాళహస్తీశ్వరశతకములు శైవ సంబంధములును సుప్రసిద్ధకవి ప్రణీతములునై యున్నవి. తక్కినవన్నియు రామకృష్ణస్తోత్రములునై యున్నవి. ఆంధ్రదేశభక్తాగ్రేసరులై యాబాలగోపాలమునగా బరిచితుడైన భద్రాచల రామదాసు (ఇతనినే కంచెర్ల గోపన్నయని మొదలు పిలుచుచుండిరి) చే రచితమగు దాశరథీశతక మితర పండితుల రీతులగాక కేవల తన సాహితీప్రకర్షను జూపించునదిగాక గాఢభక్తిరససంపూరితమై యున్నది.

ఇతరత్ర ప్రచురితములగు శతకముల మేము చదివి యున్నాము. కాని యింత విశేషమైన ప్రతి శతకమునకు విపులమగు పీఠిక, కవిత్వ విషయము, కవి కాలము, భావార్థము, మున్నగు విషయములు చర్చించి శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు వ్రాసియున్నారు. మరియు నితఃపూర్వ ముద్రిత శతకముల నన్నింటిని సంప్రతించి పాఠభేదములను వ్రాసియున్నారు.

శతకకవులను బూర్వమందంతగా పాటించినట్లు గానరాదు. కావున సుప్రసిద్ధుల శతకములే విశేషముగా నిలచినవి. కాని అనేక ప్రబంధములకన్న ననేక శతకములే భక్తిజ్ఞానానంద పాండిత్య దాయకములుగానున్నవి. కుక్కుటేశ్వర, వేణుగోపాల, చంద్రశేఖర, రామలింగేశ, చౌడప్పాది శతకములనుండి కొంతనీతి, కొంత హాస్యము, కొంత సాంఘిక చరిత్ర, కొంతభక్తి లభ్యమగుచున్నవి. శ్రీ క. నాగేశ్వరరావు పంతులుగారు బూనిన నూతనపద్ధతి చాల బాగుగానున్నది. ఈ భక్తి సంపుటమువలెనే వారు నీతిసంపుటము, శృంగారసంపుటము మున్నగునవిగా తక్కిన శతకముల విభజించి యిదే పద్ధతిపై పీఠికాదులతో బ్రచురించి ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులగుదురుగాక.

## ఆంధ్రహృదయము

గ్రంథకర్త:—న. వేంకటరత్నముగారు.　వెల: ౦-౮-౦

ప్రకాశకులు:—ఆనందనికేతనము, ఏలూరు.

ఇది యొక 'చిట్టినవల' (Novelette) దీనియందు గ్రంథకర్త మానవజీవితమునందలి ఒక దృశ్యమును నిపుణతతో చిత్రించినాడు. శైలి హృద్యముగను మృదువుగనున్నది. తాను సృష్టించిన గ్రేసుకన్య ఆంధ్రజాతీయ జీవనమును స్వీకరించినది. కాని యామె నాకర్షించిన ఆంధ్రజీవనములోని లోతుపాటును గ్రంథకర్త నిరూపింపలేదు. 'ఆంధ్రహృదయము' నందు ఆంధ్ర, హృదయ విశేషమును చిత్రింపకుండుట లోపమే.

# పానుగల్లు శాసనములు

(ఆంధ్ర పరిశోధకసంఘము, హైద్రాబాదు)

## ౨౦

పానుగల్లు నల్లగొండకు నాలుగు మైళ్ళ మీదనున్నది. శాసన శిలను విరుగఁగొట్టి గోరీలపై పెట్టుటచేఁ బైకి నాలుగువైపుల యొత్తువచ్చునటులఁ జెక్కిరి. క్రిందిభాగము గోరిపై నానించు భాగము గానటులె యుంచిరి. గోరీల మీఁదినుండి క్రిందికి దొర్లిఁపడియుంటచే నీ శాసనమును దీసుకొన నవకాశము గలిగినది. పానుగల్లులో నిట్టి లిపితోనున్న శిలాఖండము లింకఁ గొన్ని కలవు ఇది దేనితో సంబంధించునో విచారింపవలసి యున్నది.

౧. విశాసేకమ శకవర్ష సంవత్సరి పోదేశ వస్య
మైలాంభికా
౨. + పెట్టమపల్లీతి నామానం మహితోర్వ
దం । ద్విశేభోర్య
౩. ద్యమదాదర్ధ భీమరాజాయచ ।
కల్యాణాభ్య
౪. దరైక కారణమయం సర్వస్య సాధారణో
ధర్మస్త్వ ద్గత
౫. మత్పరాక్షితి భృతోయ . పాలయంత్యాదరాత్
ధర్మం
౬. మత్కృతమిత్యుదార చరితా తా న్యాచినేభూపతి+
౭. శ్రీ ఖరితస్వహస్త కమలా మైలాంబికా యాచతే
౮. శ్రీమద్భీమరాజనందనస్తాండ క్షితీశోపి కద్య
౯. రువిషయేగ్రామం నామకానుమత్య ప్రతి గ్రామం
౧౦. శాలిక్షేత్ర నివర్త్త నద్వయం ఖారిపంచ
కచయావ
౧౧. + + + +

### సూచన

పదునొకండవ పంక్తిలోని వర్ణములు సగమునకుఁ గలవు. మిగిలినఖండ మేమైనదో? ఇందలి వర్ణములు రమణీయముగా నున్నవి. పదునొకండవ శతాబ్దమునాటి వ్రాత. ఇందు మైలాంబిక, భీమరాజు, తాండక్షితీశుఁడు పేర్కొనఁబడిరి. వీరలు కాకతీయులకు లోఁబడిన వారు. స్వతంత్రులో ఏశాఖవారో గుర్తింప నవకాశములు లభింపవు.

## ౨౧

పానుగల్లు గ్రామమున కానకొని యున్న వేంకటేశ్వరాలయములో ముఖభాగమందున్న గోడలో నిశాసనము బిగింపఁబడియున్నది. కొంతభాగము గోడలో కలసిపోయెను. అందుచే ప్రతిపంక్తి యొక్క చివరభాగము లోపించు చున్నది. చాళుక్యలిపి. ఉన్నంతవరకు స్పష్టముగ నున్నది.

౧. స్యేతదంష్ట్రాగ్ర విక్రాంత భువనోవపుః
స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీ పృథ్వీవల్లభ
౨ శ్రీయకులతిలక చాళుక్యాభరణ శ్రీమ త్రి
భువనమల్ల దేవః కులశశిసార్వతో
౩.+ లితాఖండితారివర్గః శ్రీమత్కల్యాణ
పురస్థిర నిజవిజయ స్కంధావార సుఖాంతర
౪. ద్రం + + + దేవేఖిలాన్ సాత్యశ్రీ చళుక్య
విక్రమ కమాసమ్మిత్రశత సాయత్స్యగో
అధ్యక్షాం ప్రదితో
౫. శుక్లదశమీ యుక్తాది వారే నిజాః॥ లబ్ధ్వా
తైలపదే వాఖ్యాత్తనయాశ్చక్ర
వర్తినః లబ్ధాఖిలోర్వరంధ్యా
౬. పరః సమస్త గుణ సంఘాఘః శ్రీమ ద్భూ
మండలేశ్వరః॥ ధర్మాయ ధామికాక
నిజాగ్ర ధర్మభీమ
౭. గదిక భర్తుః స్కంధాదిజారి పరిఖా
యుగ మర్గక్షిప్తః॥
౮. యస్తస్మై వైద్యనాథాహ్వయః సిద్ధాగ్ర సరశ్చ
౯. తృణయుగ గోకర్ణ బ్రహ్మపుర్యార్ద్ధిలిం మక
ర మగీద్ధారివేరిపోతి సంపద్యవర్గోర్యానిష్ఠా
౧౦ మల్పతోవ.

### సూచన

త్రిభువనమల్లదేవుఁడు కల్యాణపుర రాజ్యమునేఁ బాలించుతరి గావింపఁబడిన ధర్మ మిందుఁ బ్రకటింపబడెను. భీమరాజు, వైద్యనాథుఁడు, గోకర్ణుఁడు ననగువారుల పేరులు తైలపదేవుఁడను చక్రవర్తి నామము నిందు గనిపించుచున్నవి. కాకతీయుల విరోధియగు తైలపదేవుఁడే యీతఁడు కానోపు.

## ౨౨

పానుగల్లులో ఊరిబైటనున్న గోరీల కెదురుగాఁ బాతఁబడియున్న మండపస్తంభముపైన ఒకవైపున వ్రాయఁబడియున్న శాసనము.

౧. శ్రీ సరస్వత్యైనమః॥ తనహితము +(నా)
౨. నందనవారువం బలంబగతుర మానంబు భం
౩ గపడంగ। టనఘఖురఘట్టనందనరారి సెలు
వొందరి
౪ వువరుల విభవములు రిత్తవోవ తనప్రతా
పమునూ
౫ చి తనవారు హరుషింప నరివరుల హరుషంబుల
౬ గిపోవ। సింగనభూధర పిగము వారువఖురతాం
౭ + + నేశ్వరతనొప్ప + + ం డనిరువదినాల్గు
దనరినమూరలు
౮ + + + + + కడమతిపానుంగ
౯ ంటిలో సకలజనులుం దన్నుఁ సంస్తుతింప॥ ఇరు
ఇదినాలుగు
౧౦ మూరలు। అరుదుగ నందుదొరబోరవారి
పశుబోలం। బ
౧౧ బరగిఇ (వీ) రతనానికి గలవెరయోంసుంజడిగాం।
సరిహాయములు
౧౨ పంగాక

సూచన

ఇందు మొదటిపంక్తి నుండి తొమ్మిదవ పంక్తి వర
కు వీసబద్యముగా నున్నది. మొదటిమూడు పాదములు గీ
తమునందలి రెండు పాదములు బాగుగనున్నవి. తొమ్మి
దవ పంక్తి నుండి పండ్రెండవపంక్తివఱకు కొక కందపద్య
ముగలదు. అది సరిగనే యున్నది. పదునొకండవ శతా
బ్దమువ్రాతను బోలియున్నది. ఇందు పానుగంటిలో నిరు
ఇదినాలుగు మూరలు దూరము సింగయగుఱ్ఱమును దుమికిం
చెననిమాత్రముగలదు.

౨౩

పానుగల్లు ఊరిబైట గోరీలకుదురుగా నున్న గ్రా
మదేవత బంగారు మైసమ్మ గుడిచాతంగల రక్కసకంబంలో
నీశాసనము వేయఁబడి యున్నది. చివరభాగము పగిలిపో
యినది. ముక్క కనిపించదు. అందుచే ప్రతిపంక్తి యొ
క్క చివరభాగమునుండి కొంతవిషయము లోపించుట
చే నీశాసన మసంపూర్ణముగనున్నది.

౧ స్వస్తి శ్రీచాలుక్య విక్రమవర్షములు +
౨ శుక్రవారమునాండు సూర్యగ్రహణ +
౩ మహారాజులుగా మలిపగ్గడయల్లం
డుగవలిం +
౪ తి మస్తభోగతే జస్వామ్య సహితము
గాంగొడ +
౫ య చట్టకు నాదునికవి ౭౦ డెబ్బదియుంను +
౬ సంక్రాన్తి గా గాఝ్వ (ఝ్య) గడిగి ధారా
పూర్వకంసేసియా +
౭ షష్ఠిం వర్షసహస్రాణి స్వర్గే తిష్ఠతి భూమిదః॥
బహుసే +
౮ స్వస్య స్తస్య తదాఫలం +

సూచన

గామన ప్రగడనామము మాత్రమిందుఁగలదు. ఇ
తఁడు పశ్చిమచాళుక్యులకు రాజకీయ సంబంధము గల
వాఁడు. ఆ సంబంధము తెలుపు భాగము విరిగిపోయిన
ది. లిపి స్పష్టముగా నున్నది. త్రిభువనమల్లుని శాసనలి
పివలె నున్నది.

౨౪

ఈ శాసనము ఛాయాసోమేశ్వరాలయమున
మండప స్తంభమునకు క్రిందిభాగమున లిఖింపబడి యు
న్నది. వ్రాత బాగుగానున్నను లోపములకు మేరలేదు.
ఒకవైపుమాత్రమె వ్రాయబడియున్నది.

౧ శ్రీమతు కాకతపు
౨ రవరాధీశ్వరరు
౩ ద్రదేవ మహారాజునకు
౪ పుణ్యముగాను తంగ్రతపాలు
౫ మల్లినాయకుడు శ్రీ అభిన
౬ వసోమనాథ దేవరకు విధ
౭ యాదిత్య సముద్రము వెనగ
౮. నలుగు మఱుతురు ఇర (ు)
౯ గు (గా) ను పండుమనేల వెలిబు (భూ) మి
౧౦ ఇరువై ౧౧ ఆచంద్రార్కముగ
౧౧ ల్యంతదిగి చెఱిచినవ (వా) రికి గంగ
౧౨ కురుక్షేత్రాలలో చెఱిచినవ (పా) ప
౧౩ ముందలి. శ్రీపతి + + నది.

## సంపాదకీయములు

### ఆఫ్ఘను అమీరు

గత ౫౦ సంవత్సరలనుండి ప్రాచ్య దేశము లందొక అపురూపప్రబోధము, పరివర్తనము జరుగుచున్నది. ఈజిప్టుస్వింక్సు తననిర్లక్ష భావము వీడి చైతన్యముతో ప్రవర్తించుచున్నది. వ్యాధిగ్రస్త యగు యూరోపియనటర్కి స్వస్థమై, తేజవంతమై మెరుగుచున్నది. పొట్టివారగుట్టయగు జపాను ఉన్నత మేధావియై, జగద్విఖ్యాతమై వన్నెగాంచినది. చీనాదేశపు మబ్బుతమ్ముడు జలదరించుకొని లేచి బంధముల త్రెంపివేయుచున్నాడు. జడత్వము వహించిన పర్షియా నూతనజీవము తో అభివృద్ధిమార్గమున పరుగులిడుచున్నది. దొంగలదొమ్మి యగు ఆఫ్ఘనుస్థానము శాంతినిలయమై విశ్వాసవంతమై, విలసిల్లుచున్నది. ఈప్రాచ్యప్రబోధసూతునిగను మూర్తిగను- ఆఫ్ఘను అమీరగు అమానుల్లాఖానుకు భారతదేశము స్వాగత మొసగినది!

అమానుల్లా గారిని మన మొక ప్రభునిగ గౌరవించుటలేదు. ఒక మిత్రునిగ సమ్మానించినాము. సోదరజాతి నొకదానిని సుద్ధరించిన మహనీయునిగ అభినందించినాము. ఆతడు కేవలము రత్నమకుటధారియగు రాజుగాక ప్రభువులలో పౌరునిగను, పౌరులలో ప్రభునిగను వెలయుటచే యాతనిని మనము కొనియాడుచున్నాము.

ఈ మహనీయుడు మన దేశమునకున్న కొలదిదినములలోనే తన స్వానుభవజనితములగు ప్రబోధసూత్రముల వెదజల్లినాడు. "మీరందఱు మీసాంఘిక విభేదములను మఱువవలయునని కోరుచున్నాను". ఈసూత్రము నే తనదేశమున శాసించెను. తత్ఫలితముగ అచ్చట హిందువులు మహమ్మదీయులు ఆఫ్ఘనులు, భారతీయులు అన్యోన్యమైత్రితో మెలగుచున్నారు. ఈమైత్రియే, ఈ ఐకమత్యమే, క్షీణదశలో నున్న ఆఫ్ఘనిస్థానమునకు నూతన తేజమాపాదించినది. ఈ ఐకమత్యమే అమీరుగారు మనకు బోధించియున్నారు. భారతీయులీ హితోప దేశమును పాలింతురా?

"దేశ మభివృద్ధిజెందుటకు విద్యయే సాధనము". ఈసూత్రము నేకదిక్షతో తాను, తన ప్రజలు, అనుసరించుటచే ఆఫ్ఘనుస్థానము నేటి ఉత్తమస్థానము బడయగలిగినది. భారతప్రభుత్వమువారు మనకు స్వపరిపాలనా విధానమున శిక్షణ నొసగుటకు గాను మన శాసనసభల పాలించుటకంటె, ఈ సూత్రమును పాలించిన కృతజ్ఞతా పాత్రులగుదురు.

పి. యల్. శర్మ, [illegible] ముద్రాలయమున (సుల్తాను బజారు, హైద్రాబాదు) నందు [illegible] బాలకృష్ణా రెడ్డిచే ముద్రితము.

Reg. No. M. 2277.